శ్రీవ్యాసమహర్షి ప్రణీతం

# కూర్మ మహాపురాణం

(తెలుగు అనువాదంతో)


అనువాదకులు

**డా॥ కె.వి.సుందరాచార్యులు**

సంపాదకులు

'మహామహోపాధ్యాయ'

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

ప్రత్యేకాధికారి

**పురాణేతిహాస ప్రాజెక్టు**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**






ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2019**

**KURMA MAHAPURANAM**
(with Telugu Translation)

Translated by
**Dr. K.V. SUNDARACHARYULU**

Chief Editor
**Sri Samudrala Lakshmanaiah**

T.T.D. Religious Publications Series No. 1359



First Print : 2019

Copies: 1000

*Published by*
**Sri Anilkumar Singhal, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*Cover Design and*
*D.T.P. Type Setting*
Office of the Special Officer, Purana Itihasa Project,
TTD,Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507.



వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥

# తిరుమల తిరుపతి దేవస్థానములు
## పురాణ ఇతిహాస ప్రాజెక్టు
## పండితపరిషత్తు
(సలహామండలి)

### అధ్యక్షులు
**శ్రీ అనిల్‌కుమార్ సింఘాల్ ఐ.ఏ.యస్.గారు**

కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు.

### సభ్యులు
**శ్రీ పోల భాస్కర్ ఐ.ఏ.యస్.గారు**

సంయుక్తకార్యనిర్వహణాధికారి,తి.తి.దే.,తిరుపతి.

**డా॥ కందాడై రామానుజాచార్యులుగారు**
విశ్రాంత ప్రాచ్యకళాశాలాధ్యక్షులు
శ్రీవేంకటేశ్వర వేదాంతవర్ధినీ సంస్కృతకళాశాల
హైదరాబాద్

**డా॥ శ్రీపాద సుబ్రహ్మణ్యంగారు**
విశ్రాంత సంచాలకులు,
ఓరియంటల్ మాన్‌స్క్రిప్ట్స్ లైబ్రరీ - హైదరాబాద్

**డా॥ ధూళిపాళ మహదేవమణిగారు**
విశ్రాంత కళాశాలాధ్యక్షులు
ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల
రాజమండ్రి

**డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణగారు**
విశ్రాంత ఆచార్యులు
రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం - తిరుపతి

**డా॥ ఈ.ఏ.శింగరాచార్యులుగారు**
విశ్రాంత కళాశాలాధ్యాపకులు
శ్రీవేంకటేశ్వర ప్రాచ్యకళాశాల - తిరుపతి

**డా॥ కె.ప్రతాప్‌గారు**
విశ్రాంత ఆచార్యులు
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

### కన్వీనర్
**డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారు**

ప్రత్యేకాధికారి, పురాణేతిహాస ప్రాజెక్టు,
తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుమల తిరుపతి దేవస్థానములు

**పురాణేతిహాస ప్రాజెక్టు**

# పరిష్కరణ పరిషత్తు

# తొలిపలుకు

మానవుడు ధర్మబద్ధమైన జీవితాన్ని గడపినప్పుడే అతని మానవత్వం సఫలమవుతుంది. ధర్మస్వరూపాన్ని ప్రతివ్యక్తీ తనకు తాను గ్రహించలేడు. తల్లి దండ్రులు, ఆచార్యులు, లోకమాన్యులైన పెద్దలనుండి దానిని గ్రహించాలి.

పైన పేర్కొన్న పెద్దలు గూడా ధర్మ స్వరూపాన్ని గ్రహించడానికి వేదాలను ఆశ్రయింపక తప్పదు. 'వేదోఽఖిలో ధర్మమూలమ్' అన్నట్లు ధర్మానికి మూలం వేదమే.

వేదాలలోని ధర్మతత్త్వాన్ని నిరూపించడానికే ఇతిహాసాలూ, పురాణాలూ అవతరించాయి. అందుకే "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" – ఇతిహాసాలతోనూ, పురాణాలతోనూ వేదాన్ని విస్తరింపజేయాలి అని చెప్పారు.

పురాణకర్త అయిన వేదవ్యాసుడు అష్టాదశపురాణాలు రచించి తద్ద్వారా ధర్మస్వరూపం నిరూపించాడు. భగవంతుని అవతారాలలో వ్యాసుడు గూడా ఒక అవతారమే. ధర్మరక్షకుడైన భగవంతుడు వ్యాసరూపంలో అవతరించి పురాణాలు రచించాడు. వాటి ద్వారా ధర్మం ప్రచారంలోకి వచ్చింది.

తిరుమల తిరుపతి దేవస్థానం ఒక మహోన్నతమైన ధార్మికసంస్థ. ధర్మ పరిరక్షణకై పాటుపడవలసిన బాధ్యత ఈ సంస్థకు ఉన్నది. వేదాలు, ఇతిహాసాలు, పురాణాలు మొదలగు ప్రాచీన గ్రంథాల ప్రచారం ద్వారా ధర్మప్రచారం కావించడానికి వీలవుతుంది. ఈ ఉద్దేశంతోనే దేవస్థానం పురాణఇతిహాసప్రాజెక్టును స్థాపించి తద్ద్వారా వ్యాసభాగవతాన్నీ, వాల్మీకిరామాయణాన్నీ వ్యాఖ్యానాలతో సహా ప్రచురించింది. అనంతరం అష్టాదశపురాణాలనూ తెలుగులో అనువదింపజేసి ముద్రించాలని నిర్ణయించింది. ఈ నిర్ణయానికి అనుగుణంగా పలువురు పండితులు పలుపురాణాలను అనువదించారు. వాటిని పరిష్కరించి ప్రచురింపజేసే ప్రయత్నం కొనసాగుతున్నది.

మొదట విష్ణుపురాణం ముద్రణకు సిద్ధం చేయడమైనది. అది ముద్రణలో ఉన్నది. ఇప్పుడు కూర్మపురాణం ముద్రణానుకూలంగా రూపొందించబడింది. సృష్టిస్వరూపం, రాజవంశాలు, శ్రీకృష్ణుని మహిమ, యుగధర్మాలు ఇత్యాది విషయాలను విపులంగా నిరూపించే ఈ పురాణం ఎంతో ఆసక్తిదాయకమైనది. దీనిని పాఠకులకు అందింపజేయడానికి చేసిన ప్రయత్నం సఫలమైనందుకు సంతోషిస్తున్నాము.

ఈ పురాణాన్ని అనువదించిన శ్రీకె.వి.సుందరాచార్యులవారిని, ఈ రచనకు సంపాదకత్వం వహించిన ప్రాజెక్టు ప్రత్యేకాధికారి మహామహోపాధ్యాయ డా॥ సముద్రాల లక్ష్మణయ్యను అభినందిస్తున్నాము. ఈ గ్రంథ పరిష్కరణలో తోడ్పడ్డ పండితులకూ, పండిత పరిషత్ సభ్యులకూ మా అభినందనలు. విద్వాంసులు మరియు పాఠకుల సహకారంతో త్వరలో అన్ని పురాణాలనూ ప్రకటించాలన్న దేవస్థానం ప్రయత్నం సఫలమగుగాక!

ఈ జ్ఞానయజ్ఞంలో సహకరించిన వారినందరినీ శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహించుగాక!

తిరుపతి
తేది. 31-12-2018

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# నివేదన

ధర్మం, అర్థం, కామం, మోక్షం–అనేవి చతుర్విధ పురుషార్థాలు. అర్థం మున్నగు మూడు పురుషార్థాలు ధర్మం నుండే సిద్ధిస్తాయి. అందువల్ల ధర్మానుష్ఠానం ఎంతో ప్రధానమైనది.

శ్రుతులూ, స్మృతులూ ధర్మనిరూపణ చేశాయి. కాని వాటినుండి ధర్మతత్త్వాన్ని గ్రహించడం అంత సులభం కాదు. ఇతిహాసాలూ, పురాణాలూ ఆ ధర్మతత్త్వాన్నే కథలతోనూ, ఉపకథలతోనూ సోదాహరణంగా వివరిస్తున్నాయి. అందువల్ల ప్రాచీన సంస్కృతవాఙ్మయంలోని ఇతిహాస పురాణాల ప్రాముఖ్యం విస్మరింపరానిదై యున్నది.

**విస్తారాయ చ వేదానాం స్వయం నారాయణః ప్రభుః ।**
**వ్యాసరూపేణ కృతవాన్ పురాణాని మహీతలే ॥**

వేదార్థాలను విస్తృతంగా జనానీకానికి అందించడానికై సర్వలోకప్రభువైన శ్రీమన్నారాయణుడు వ్యాసుడుగా అవతరించి పురాణాలను రచించాడు.

ప్రాచ్యపండితులే కాక పాశ్చాత్యపండితులు గూడా అనేకులు సంస్కృతం అభ్యసించి పురాణాల విలువ గ్రహించారు. ఆధునికమైన వైజ్ఞానికయుగంలో గూడా పురాణాలనుండి గ్రహించవలసిన విజ్ఞానాంశాలున్నాయని వారు ముక్తకంఠంతో అంగీకరించినారు.

తి.తి.దేవస్థానంవారు భాగవతప్రాజెక్టు నెలకొల్పి తద్వారా మూడు వ్యాఖ్యానాలతో వ్యాసభాగవతాన్ని పరిష్కరించి 14 బృహత్సంపుటాలుగా ప్రచురించినారు. తరువాత వాల్మీకి రామాయణాన్ని రెండు వ్యాఖ్యానాలతో పరిష్కరించి 8 సంపుటాలుగా ప్రకటించడం జరిగింది.

ఆపై ప్రాజెక్టుకు పురాణ ఇతిహాసప్రాజెక్టుగా నామకరణం చేసి తద్వారా అష్టాదశపురాణాలను ఆంధ్రానువాదంతో ప్రచురించాలని నిర్ణయించారు. పాఠకులకు అష్టాదశ పురాణాలకు సంబంధించిన అవగాహన కల్గడానికి 'పురాణప్రశస్తి' అన్న పేరుతో నేను ఒక విపులమైన పీఠిక రచించాను. ఈ పీఠికను ప్రతిపురాణానికీ ముందు సమకూర్చడం జరుగుతున్నది. దీనిని విడి గ్రంథంగా గూడా ప్రచురించడమయింది.

పురాణాల అనువాదానికి సుప్రసిద్ధపండితులనేకులు సహకరించారు. ఇప్పటికి మూడు లక్షలకు పైగా శ్లోకాలను అనువదించడం పూర్తి అయింది. వాటిని పరిష్కరించడం, డి.టి.పి చేయడం మున్నగు పనులు నిర్విరామంగా కొనసాగుతున్నాయి.

మొదట విష్ణుపురాణాన్ని ముద్రణార్హంగా తీర్చిదిద్దడమైనది. అది ప్రస్తుతం ముద్రణలో ఉన్నది. కూర్మపురాణాన్ని గూడా అదే పద్ధతిలో ప్రస్తుతం రూపొందించడం జరిగింది.

భగవంతుని దశావతారాలలో కూర్మావతారం రెండవది. అమృతం కొరకై దేవాసురులు క్షీరసాగరాన్ని మథించినప్పుడు భగవానుడు కూర్మరూపం దాల్చి మందరపర్వతాన్ని మునిగిపోకుండా ధరించాడు. ఈ కథా కథనం ద్వారా –

శివతత్త్వం కూడా ఈ పురాణంలో పొందుపరచబడింది. అంతేకాక వర్ణాశ్రమాలు, సామాన్యవిశేషధర్మాలు, సృష్టిక్రమం, పరమేశ్వరుని వివిధనామాలు, యుగాలు, మన్వంతరాలు – ఇత్యాదిగా పెక్కు విషయాలు ఇందులో నిరూపించడమయింది. కూర్మపురాణంలో 17000 శ్లోకాలున్నట్లు ప్రాచీన గ్రంథాలు నిర్దేశిస్తున్నవి. కాని మాకు లభించిన ప్రతులలో 5896 శ్లోకాలు మాత్రమే ఉండటం గమనార్హం.

ఈ పురాణాన్ని సుప్రసిద్ధ విద్వాంసులు, బహుగ్రంథకర్తలు శ్రీ కె.వి.సుందరాచార్యులవారు అనువదించారు. అనువాదాన్ని రమణీయంగా రూపొందించిన ఈ విద్వదగ్రేసరులకు కృతజ్ఞతాభివందనాలు.

ఈ గ్రంథాన్ని ఓపికతో సరిచూచి అవసరమైన పరిష్కరణలు గావించి ముద్రణార్హంగా రూపొందించిన పరిష్కరణపరిషత్తు సభ్యులకు కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

ప్రాజెక్టులో సహాయపరిశోధకులైన శ్రీ యస్. బి. యస్ భట్టాచార్యులనూ, డా॥ యస్. దశరథనూ, గతంలో పనిచేసిన శ్రీమతి డా॥ యస్. పూర్ణవల్లిని అభినందిస్తున్నాను. ఈ సంపుటాన్ని ముద్రణయోగ్యంగా రూపొందించిన డి.టి.పి ఆపరేటర్ శ్రీ బి.వెంకట్రాయులకు అభినందనలు.

ప్రాజెక్టు కార్యనిర్వహణకు తగినంత ప్రోత్సాహమిస్తూ పురాణ వాఙ్మయం ఈ రీతిగా వెలుగులోకి రావడానికి ముఖ్యకారణభూతులైన తి.తి.దే ధర్మకర్తలమండలివారికీ, విశేషించి ధర్మకార్యనిరతులైన కార్యనిర్వహణాధికారి శ్రీ అనిల్ కుమార్ సింఘాల్, ఐ. ఎ. యస్. గారికీ, సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ పోల భాస్కర్, ఐ. ఎ. యస్. గారికీ, ప్రాజెక్టు పండితపరిషత్తు (సలహామండలి) సభ్యులకు కృతజ్ఞతా పూర్వక ప్రణామాలు.

ఈ ప్రాజెక్టు ద్వారా చేపట్టిన 18 పురాణాల అనువాదం, వాటి ప్రచురణ కార్యక్రమం త్వరలో నిర్విఘ్నంగా నెరవేరునట్లు సప్తగిరీశ్వరుడు అనుగ్రహించుగాక!

**సముద్రాల లక్ష్మణయ్య**

ప్రత్యేకాధికారి

పురాణేతిహాస ప్రాజెక్టు, తి.తి.దే.,

# కూర్మమహాపురాణ సారాంశం

డా॥ కె.వి.సుందరాచార్యులు

అష్టాదశ పురాణాల్లో పదిహేనవది కూర్మపురాణం. పరబ్రహ్మగా శివతత్త్వాన్ని నిరూపించే దీనిని మొదట కూర్మరూపంలో భగవానుడు చెప్పడం వల్ల కూర్మపురాణంగా పేరుపొందింది.

మొదట దీనిని ఇంద్రద్యుమ్నుడనే రాజుకు, రెండవసారి సముద్రమథన సందర్భంగా దేవతలకు, మునులకు భగవానుడు వినిపించాడు. అట్లా ఒకరినుండి మరొకరికి చేరుతూ మూడవసారి నైమిషారణ్యంలో రోమహర్షుడనే సూతముని ద్వారా ఎనబైవేలమంది ఋషులకు వినిపించడం జరిగింది.

దీర్ఘయాగం తరువాత నైమిషంలోని మునులు రోమహర్షునితో పుణ్యదాయకమైన సంహితను తెలుపుమన్నారు. వ్యాసమహర్షి ముందుగా నీకే ఉపదేశించాడు. కాబట్టి నారాయణాంశతో జన్మించిన నీ నోట పాపాలను నశింపజేసే పురాణగాథను వినిపించు అన్నారు. దానికి అతడు ఈ పురాణకథను నాస్తికులకు చెప్పకూడదు. శ్రద్ధ, శాంతం, ధర్మం పాటించే మీ వంటి ఉత్తములకు వినిపించదగినది కాబట్టి వినిపిస్తాను అన్నాడు.

రాక్షసులతో కలిసి అమృతం కోసం దేవతలు సముద్రాన్ని మథించే సమయంలో అందుండి లక్ష్మి ఉద్భవించింది. ఈమె ఎవరని నారదాది మునులు, దేవతలు ప్రశ్నించగా విష్ణుభగవానుడు ఈమె నాతో అభిన్నమైనది. మాయారూపం గలది, సమస్త ప్రపంచాన్ని ఈమె సహాయంతోనే మోహింపజేస్తున్నాను. ఈమె అంశాలు గ్రహించి బ్రహ్మ, శివుడు, దేవతలు శక్తిమంతులైనారు. ఈ లక్ష్మి సకలలోకాలకు కారణభూతురాలు, నా కంటె ముందు కల్పాలలోనే పుట్టింది అన్నాడు. ఈమెను నేను స్వీకరిస్తున్నాను అని జవాబిచ్చాడు. ఈమె మాయను ఎవరూ అతిక్రమించలేరు అన్నాడు. దానికి దేవతలు మునులు ముందు కాలాంతరంలో జరిగిన ఘటనలు చెప్పుమన్నారు.

పూర్వం ఇంద్రద్యుమ్నుడనే బ్రాహ్మణుడు తన గత జన్మలో రాజుగా ఉండి శంకరాదులకు కూడా నిగ్రహింపరాని కూర్మరూపంలో ఉన్న విష్ణువు ద్వారా ఇతర మునులతో కలిసి పురాణగాథను విన్నాడు. బ్రహ్మరుద్రాదులు కూడా కూర్మరూపి విష్ణువుకు అధీనులుగా గుర్తించి, విష్ణువును శరణు పొందాడు. అప్పుడు విష్ణువు ఆ రాజును తరువాతి జన్మలో ఇంద్రద్యుమ్నుడనే బ్రాహ్మణుడుగా జన్మిస్తావని, వైవస్వత మన్వంతరం గడువగానే నన్ను చేరుకొంటావని అభయమిచ్చాడు.

విష్ణువు చెప్పినట్టే ఇంద్రద్యుమ్నుడు విష్ణువును చేరుకుని శ్వేతద్వీపంలో కొన్నాళ్ళు గడిపి విష్ణుసంబంధమైన దివ్యకళను దర్శించాడు. ఈ కళారూపాన్ని ఇంద్రద్యుమ్నుడు స్తుతించి ఓ దేవీ! నీవెవరవు? యథార్థాన్ని తెలుపుమన్నాడు. ఆమె తనను తాను నారాయణ స్వరూపిణినని, తనను మునులు, ఇంద్రాది దేవతలు చూడలేరని చెప్పుకుని కర్మమార్గాలను అనుసరించి నారాయణుని పూజించమని సూచించింది. ఆ విధంగా ఆచరించి ఇంద్రద్యుమ్నుడు పరబ్రహ్మజ్ఞానాన్ని, విష్ణు సాక్షాత్కారాన్ని పొంది తన సంశయాలను నివృత్తి చేసుకుని, మోక్షమనే స్థానాన్ని పొందాడు.

ఈ ఇంద్రద్యుమ్నుడికి చెప్పిన పురాణకథను మళ్ళీ ఇంద్రాది దేవతలకు, మునులకు సముద్రమథన సందర్భంగా వినిపించాడు కూర్మరూపి భగవానుడు. అపుడు వారు తిరిగి ఓ దేవా! ఆ బ్రాహ్మణునికి తెలిపిన ధర్మాదుల జ్ఞానాన్ని తమకు కూడా తెలుపుమన్నారు.

ఈ విషయాన్నే సూతుడు నైమిషంలోని మునులకు తెలుపుతున్నాడు.

శ్రీమన్నారాయణునికి ముందుగాని, తర్వాతగాని ఏమీ లేదు. దీర్ఘకాలంగా శేషశయ్యపై నిదురించి మేల్కొనగా సృష్టిగురించి ఆలోచన వచ్చింది. ఆ అనుగ్రహ బుద్ధితో ఉండగా చతుర్ముఖ బ్రహ్మ జన్మించాడు. ఆ సమయంలో ఒకానొక కారణంగా క్రోధం కలుగగా ఆ క్రోధంనుండి రుద్రుడు పుట్టాడు. అదే సమయంలో లక్ష్మి పుట్టింది. ఆమెను చూచి బ్రహ్మ విష్ణువుతో ప్రాణులను మోహింపజేసే ఈ సౌందర్యరాశిని నియమిస్తే నేను చేసే సృష్టికి ఉపకరిస్తుందని అన్నాడు. దానికి నారాయణుడు ఆమెతో జితేంద్రియులు, ధర్మప్రవృత్తి గలవారిని విడిచిపెట్టి, దేవదానవ మనుష్యాదులను సంసారంలో పడేట్టు చేయమన్నాడు. ఆ ఆజ్ఞను లక్ష్మి నిర్వహించింది.

అపుడు బ్రహ్మ – భృగువు, అంగీరసుడు మొదలైన తొమ్మండుగురిని తన ముఖంనుండి సృష్టించాడు. తన భుజాలనుండి క్షత్రియులను, ఊరువులనుండి వైశ్యులను, పాదాలనుండి శూద్రులను సృష్టించి, వారికి వివిధ కర్మలను కేటాయించాడు. ఈ ధర్మాలనే స్వాయంభువ మనువు బోధించాడు. ఈ మనువు బ్రహ్మ రూపాంతరంగా సృష్టించబడ్డాడు. వివిధ వర్గాలకు వివిధ కర్తవ్యాలను నియమించాడు. అదే విధంగా బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాలనే ఆశ్రమధర్మాలు ఏర్పరచాడు.

పిదప ఋషులు కూర్మరూపి భగవానునితో ప్రపంచ ఉత్పత్తి విధానాన్ని చెప్పుమని కోరగా – మొదట ఆద్యంతాలు లేని సూక్ష్మరూపమైన బ్రహ్మరూపం ఆవిర్భవించిందని, అతనిలో సత్త్వాది త్రిగుణాలు సామ్యం చెంది మళ్ళీ విశ్వసృష్టి పర్యంతం ప్రాకృత ప్రళయం ఏర్పడుతుందని, దీన్నే బ్రాహ్మీరాత్రి అంటారని చెపుతాడు. ఈ క్రమంలో మహత్తు నుండి తేజస్సు, భూతాదికమనే అహంకారాలు పుట్టడం, అహంకారంనుండి పంచభూతాలు, ఇట్లా క్రమంగా శబ్దం మొదలైన తన్మాత్రలు వాటినుండి గుణాలు ఏర్పడిన విధం వివరిస్తాడు.

తరువాత ఋషులు అడుగగా కాలసంఖ్యా వివరణం చేస్తాడు సూతుడు. అందులో బ్రహ్మవిష్ణురుద్రులకు కూడా కాలనియమంతో ప్రాకృతిక లయం కూడా జరుగుతుందని చెపుతాడు, ఈ లయం–సృష్టి మధ్య కాలాంతరాలను వివరిస్తాడు.

సృష్టి క్రమంలో పృథివి ఎట్లా ఉద్ధరించబడింది అనే వివరణ ఇస్తాడు భగవానుడు. ఇంద్రాది దేవతలు, మునులకు, బ్రహ్మ తనతో సమానులైన సనక, సనాతన, సనంద, క్రతు, సనత్కుమారులను సృష్టించగా, వారు వైరాగ్యాన్ని ఆశ్రయించారు. దానితో బ్రహ్మ కూడా మాయామోహానికి లోనయ్యాడు. ఆ మోహంలో నిద్రకుబోవగా, నారాయణుడు మేల్కొలిపాడు. అపుడు బ్రహ్మ తీవ్రతపం చేశాడు. ఆ క్లేశంలో ఆయన కండ్ల నుండి బాష్పబిందువులు రాలాయి. బ్రహ్మ నుదుటినుండి శివుడు పుట్టాడు. శివుడిని వివిధ ప్రజలను సృష్టించమని వేడుకున్నాడు. శివుడు తనవంటి రుద్రులను సృష్టించాడు. అయినా సృష్టి సాగలేదు. బ్రహ్మ శివుడిని జననమరణాలున్న వారిని సృష్టించమనగా, అటువంటి అశుభప్రజలను నేను కాదు, నీవే చేయాలి అన్నాడు శివుడు. దానితో స్థానాభిమానులైన అన్నిటిని సృజించడం మొదలు పెట్టాడు బ్రహ్మ. దానిలో భాగంగా జలం, అగ్ని, వాయువు, భూమి, స్వర్గం, నదీనదాలు, సముద్రాలు, పర్వతాలు, వృక్షాలతో ప్రకృతిని దానివెంట కాలాలను, తన అవయవాలనుండి మరీచి, భృగువువంటి సాధకులైన గృహస్థులను సృజించగా వారు మానవశరీరాలను అధిష్ఠించి లోకంలో ధర్మం ప్రవర్తించే విధంగా చేశారు.

తమోగుణవృద్ధితో అసురులు వారివెంట రాత్రి, సత్త్వగుణ వృద్ధితో దేవతలు వారి వెంట పగలు, పిదప పితృదేవతలు – వారి వెంట సంధ్యలు ఏర్పడ్డాయి. ఇదేవిధంగా పశుపక్ష్యాదులు వచ్చాయి. వేదశబ్దాల నుండి వాటికి నామరూపాదులు గ్రహించడంతో పునఃసృష్టిలో కూడా ఆయా పేర్లే స్థిరపడ్డాయి.

అయితే ఇవన్నీ సృష్టించినా ప్రజలు వృద్ధిపొందలేదు. దానితో తనలోని తమోగుణాన్ని పారదోలగా ఆ తమోగుణం నుండి స్త్రీ, పురుష జంటలు ఏర్పడ్డాయి. వాటి హింసాత్మక ధర్మాచరణం చూసి ఆ శరీరాన్ని విడిచాడు. మళ్ళీ తన దేహంలోని ఒక భాగంనుండి విరాట్పురుషుని, ఇంకో భాగంనుండి శతరూప అనే యోగినిని పెంపొందించాడు. ఆమె ఐశ్వర్యం, జ్ఞానవిజ్ఞానాలు కలది. స్వాయంభువును పతిగా పొంది ఇద్దరు కుమారులను, ఇద్దరు కన్యలను కన్నది. వారిలో ప్రసూతి అనే కన్యకు దక్షునికి వివాహం జరిపించగా మనుష్య సంతతి పెంపొందడం జరిగింది. ఇలా క్రమంగా మనుష్యాదులు వృద్ధి పొందారు. వీరితో తమోగుణ సృష్టిలో భాగంగా నరకం, వ్యాధి, జర, శోకం, తృష్ణ, క్రోధం మొదలైనవి వృద్ధి పొందాయి.

ఇవన్నీ విన్న నారదాది ఋషులు పినాకపాణి పూర్వమే ఉన్నాడు కదా! అతడు బ్రహ్మకు ఎట్లా కుమారుడైనాడు అని ప్రశ్నించారు. దానికి కూర్మస్వామి ఇట్లా బదులు ఇచ్చాడు. పూర్వకల్పంలో నారాయణుడు సముద్రంలో శేషశాయిగా ఉండగా అతని నాభినుండి ఆశ్చర్యకరమైన కమలం ఉద్భవించింది. నారాయణుడు ఉన్న ఆ స్థలానికి బ్రహ్మ చేరుకున్నాడు. నారాయణుడిని నీవెవరవు అని ప్రశ్నించాడు. మరి నీవెవరవు అని బ్రహ్మను అడుగగా... నేను సర్వవ్యాపిని అన్నాడు. ఆశ్చర్యానికి లోనైన విష్ణువు బ్రహ్మలో చూడగా ముల్లోకాలు కనిపించాయి. అపుడు నారాయణుడు తనలో ప్రపంచాన్ని చూడమనగా బ్రహ్మ నారాయణునిలో ప్రవేశించాడు. ఆ సమయంలో నారాయణుడు బ్రహ్మను బయటికి రాకుండా ద్వారాలన్నీ మూయగా బ్రహ్మ యోగబలంతో కమలంనుండి చతుర్ముఖునిగా బయటికి వచ్చాడు. బ్రహ్మ తనను ఉన్నతునిగా భావించి నీవు చేసిన పనేమిటి అనడిగాడు. దానికి విష్ణువు అసూయతో కాదు వినోదం కోసం నిన్ను బంధింపజేశాను. నీవు కమలం నుండి వచ్చిన కారణంగా నాకు కుమారుడివి అవుతావు అన్నాడు. దానికి బ్రహ్మ అట్లే అని నీవు పరబ్రహ్మ స్వరూపుడవు, నేను ఆత్మస్వరూపుడను మనను మించి లోకంలో మరో పరమేశ్వరుడు లేడన్నాడు. నారాయణుడు– పితామహుడు అనే పేర్లతో మనం ఒకే స్వరూపం కలిగి ఉన్నాము అన్నాడు. దానికి నారాయణుడు అది తప్పు, అది వినాశకరమైన ఆలోచన, మనను మించిన పరమేశ్వరశక్తిని నీవు గమనించలేకున్నావు అన్నాడు.

అటువంటి బ్రహ్మను అనుగ్రహించడానికి త్రిశూలధారియైన ఈశ్వరుడు అక్కడ సాక్షాత్కరించాడు. అతడిని విష్ణువు బ్రహ్మకు పరిచయం చేసి దివ్యదృష్టిని ప్రసాదించాడు. ఆ దివ్యచక్షువుతో బ్రహ్మ సర్వం గ్రహించాడు. శివుడు విష్ణువుతో నీవు భక్తుడివి, ఏదైనా వరం కోరుకోమన్నాడు. దానికి అతడు నీ దర్శనమే వరం అన్నాడు. అపుడు శివుడు నీకు నాకు అభేదం. దీనిని గ్రహించకుండా, నిన్ను ఆశ్రయించకుండా ఏ యోగీ నన్ను నేరుగా చేరుకోలేడు అని అక్కడినుండి అంతర్ధానమయ్యాడు.

మహేశ్వరుడు వెళ్ళిపోగా బ్రహ్మ నాభికమలాన్ని చేరుకున్నాడు. చాలాకాలానికి మధుకైటభులనే రాక్షసులు విష్ణువు చెవుల మధ్యభాగంనుండి వచ్చారు. వారిని జయించడం విష్ణువుకే సాధ్యమన్నాడు బ్రహ్మ. విష్ణువు కైటభుని

చంపి మధువును జయించాడు. పిదప విష్ణువు బ్రహ్మను కమలంనుండి క్రిందికి దిగమన్నాడు. అపుడు బ్రహ్మ విష్ణు శరీరాన్ని ఆవేశించి అభిన్నుడై నిద్రను పొందాడు. ప్రాతఃకాలంలో నిద్రలేచి వైష్ణవభావంతో తదనుగుణమైన సృష్టి కొనసాగించాడు. తను సృష్టించిన సనకసనందనాదులు వైరాగ్యాన్ని పొందగా వారిని చూసిన బ్రహ్మ సృష్టిసాగించలేకపోయాడు. మోహానికి గురయ్యాడు. ఆ మోహాన్ని తొలగించేందుకు పూర్వం శంభువును పుత్రభావం పొందమన్నావు మరిచావా అని గుర్తుకు తెచ్చాడు.

బ్రహ్మ పూర్వం ప్రజాసృష్టికి కష్టసాధ్యమైన తపస్సు చేశాడు. అంతా స్తబ్ధుగా ఉండింది. కొంతకాలానికి క్రోధం జనించగా అతని కండ్ల నుండి బాష్పబిందువులు రాలాయి. వాటి నుండి భూతప్రేతాదులు పుట్టాయి. వాటిని చూచి బ్రహ్మ తన స్వరూపాన్ని వదిలాడు. ఆ శరీరంనుండి రుద్రుడు ఆవిర్భవించాడు. అతడు భయంకరంగా రోదించగా ఈ రోదనవల్ల నీవు రుద్రునిగా ప్రసిద్ధి పొందుతావన్నాడు బ్రహ్మ. ఆ రుద్రునికి తోడుగా ఇంకో ఏడుగురు రుద్రులను ఇచ్చి, వారికి భార్యలను కూడా ఇచ్చాడు. ఆ సంతతే మరణం లేని రుద్రులుగా ఏర్పడ్డారు. కాని బ్రహ్మ జనన మరణాలు కల ప్రజను కోరాడు. ఇది ఇంతకు ముందే తెలుసుకున్నాం.

ఇట్లా రుద్రుడు బ్రహ్మకు ఎట్లా కుమారుడయింది వివరించాడు కూర్మరూప భగవానుడు. దానికి కొనసాగింపుగా..

రుద్రుడు సగం పురుషుడు, సగం స్త్రీ రూపంలో భయంకరంగా ఉండగా అది భరించలేని బ్రహ్మ అంతర్ధానమయ్యాడు. అపుడు రుద్రుడు తన రూపాన్ని విభజించి మరో పదకొండు భేదాలు ఉండేటట్టు చేశాడు. తన స్త్రీ భాగాన్ని కూడా సాధు – అసాధు లక్షణాలతో అనేక విధాలుగా విభజించాడు. ఆ విధంగా లక్ష్మి, శక్తి మొదలైన రూపాలు శంకరుని స్త్రీత్వంలో వ్యాపించి ఉన్నవే. ఆ విభూతి రూపంతో శక్తి బ్రహ్మవద్దకు వెళ్ళగా ఆమెను దక్షునికి కుమార్తెగా జన్మించమని కోరాడు.  ఆమె దక్షుని కుమార్తె సతీదేవిగా అయింది. శివుని పెండ్లాడింది. కొంతకాలానికి శంకరుని నుండి విడివడి హిమవంతుని భార్య మేనకయందు పార్వతిగా జన్మను పొందింది. తిరిగి ఈమెను హిమవంతుడు శివుని భార్యగా చేశాడు. ఈమె గొప్పదనం మునులు ప్రశంసించారు. ఆమె ప్రభావాన్ని శంకరుడు, విష్ణువు కూడా తెలుసుకున్నారు.

కూర్మరూపుని మునులు ఈ పార్వతి శంకరుని శరీరంలో సగభాగం పొందడంలోని ఆంతర్యాన్ని వివరించమని కోరగా....

ఈ పార్వతి శివస్వరూపిణి. త్రిగుణాలకు అతీత. శాంతి, విద్య, ప్రతిష్ఠ, నివృత్తి అనే నాలుగు శక్తులు కలది. అందువల్లనే శివుడు చతుర్వ్యూహుడు అయ్యాడు. ఈమె ఈశ్వర సంబంధంతో సంసారబంధతాపాలను నశింపజేస్తుంది. తండ్రి హిమవంతునితో భక్తిభావంతో ఈ రూపాన్నే ఆరాధించమన్నది. బ్రహ్మశాసనంవల్ల నీయందు పుత్రికగా జన్మించాను అన్నది. దేవీ మాహాత్మ్యంగల అధ్యాయాన్ని పఠించినవాడు బ్రహ్మలోకాన్ని దాటి దేవిస్థానాన్ని పొందుతాడు అని అభయమిచ్చింది.

మునులు అడిగిన ప్రశ్నకు సూతుడు...దక్షకన్య ఖ్యాతి వంశాన్ని వివరిస్తూ, దక్షుడు తన పుత్రిక సతీదేవి ఇంటికి వెళ్ళగా తనకు తగినట్టుగా మర్యాద జరుగలేదని భావించాడు. ఒకసారి సతీదేవి తన ఇంటికి రాగా ఆమెను, శివుని నిందించి తిరిగి వెళ్ళమన్నాడు. దానికి ప్రతిగా తండ్రిని నిందించి అగ్నిలో తనను తాను ఆహుతి చేసుకున్నది. ఆమెయే మళ్ళీ హిమవంతునికి పుత్రికగా జన్మించింది అని తెలిపాడు. అపుడు మునులు ఆ దక్షుని గురించి తెలుసుకోవాలని ఉందనగా....

పూర్వం శివశాపాన్ని పొందిన దక్షుడు...ప్రాచేతసరాజుగా జన్మించాడు. గంగాద్వారంలో యజ్ఞం చేయ సంకల్పించి అందరిని పిలిచాడు. ఆ సందర్భంగా దధీచి శంకరుని ఎందుకు పిలువలేదని అడిగాడు. దానికి శివునికి పెండ్లి కానందువల్ల అర్హత లేదని, కాబట్టి యజ్ఞభాగార్హత లేదని పిలువలేదన్నాడు. దధీచి శివుడు ప్రపంచ స్వరూపుడు అయినందువల్ల పిలువవలసిందని అన్నాడు. అంతే కాకుండా నీవు చేసిన ఈ పని నీవు పూజించే విష్ణువు కూడా నచ్చదు. అతడు కూడా నీకు దూరమవుతాడు అని హితవు చెప్తాడు. అయితే దానికి దక్షుడు ఒప్పలేదు. ఇదే విషయాన్ని దధీచి శివునితో అంటూ పూర్వజన్మలో దక్షుడు తనకు తండ్రి అయినపుడు కూడా శివుడంటే విలువనిచ్చేవాడు కాదని, కేవలం విష్ణువును మాత్రమే గౌరవించేవాడని అన్నాడు. కాబట్టి ప్రస్తుతం జరుగుతున్న యజ్ఞాన్ని ఆపాలని ప్రార్థించాడు. దానికి శివుడు వీరభద్రుడనే రుద్రుణ్ణి సృష్టించి ఆ పని అప్పగించాడు. ఆ వీరభద్రుని వెంట వెళ్ళమని శివపత్ని ఉమ కూడా భద్రకాళిని పంపుతుంది. వీరభద్రుడు, భద్రకాళి వెంట వేలాది మంది అనేకులు రుద్రులు వెళ్ళి యజ్ఞవాటికను ధ్వంసం చేస్తారు. గరుడుడు, దేవతలు ఎవరూ వారిని ఎదుర్కోలేకపోతారు. ఆ సమయంలో విష్ణువు అక్కడికి వచ్చి, రుద్రులను ఆపి, దక్షునికి హితబోధ చేస్తాడు. ఆ పరమేశ్వరుడే పరమదైవమని, తాము కూడా అతని భక్తులమేనని, తమ మధ్య భేదం లేదని, వేదపురుషుడైన అతనిలో, వేదంలో విశ్వాసం లేనివారు నరకానికి పోతారంటాడు. దానితో దక్షప్రజాపతి తన తప్పును గ్రహించి, శివుని శరణు వేడుతాడు.

పిదప బ్రహ్మ ఆదేశానుసారం దక్షుడు దేవగంధర్వులను, సర్పాలను సృష్టించాడు. ముందు సృజించిన ప్రజలు వృద్ధి పొందనందువల్ల స్త్రీపురుష సంయోగం వల్ల ప్రజల సృష్టిక్రమాన్ని మార్చాడు. దక్షునియందు కలిగిన కన్యలను ధర్మునికి, కశ్యపునికి, చంద్రునికి అరిష్టనేమికి భార్యలను చేయగా వారిద్వారా క్రమంగా విశ్వదేవులు మొదలైనవారు, వారి క్రమంలో వసువులు పుట్టారు.

కశ్యపుని భార్యలైన అదితి, దితి, దనువు, అరిష్ట, సురస మొదలైనవారు వారి సంతానాన్ని వృద్ధి చేశారు. అదితికి ఆదిత్యులుగా పేరుపొందిన దేవతలు, దితికి దైత్యులుగా పేరుపొందిన రాక్షసులు ఉద్భవించారు. దైత్యులలో హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు మొదలగు ప్రఖ్యాత కుమారులు కలిగారు.

హిరణ్యకశిపుడు ముల్లోకాలను జయించి రాజ్యం చేస్తుండగా, దేవతల ప్రార్థనకు సహకరిస్తూ విష్ణువు దానవులపై దండెత్తాడు. విష్ణువుకు వ్యతిరేకంగా హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదుడు తండ్రికి సహాయంగా యుద్ధం చేసి ఓడిపోతాడు. తరువాత నరసింహ రూపంలో విష్ణువు హిరణ్యకశిపుని సంహరిస్తాడు. దీన్ని చూచిన హిరణ్యాక్షుడు తన పరివారంతో పారిపోయాడు. విష్ణువు ఆ విధంగా పారిపోయిన హిరణ్యాక్షుడిని అతడు వేదాలను,

భూమిని పాతాళంలో దాచిన కారణంగా వరాహావతారం రూపంతో సంహరించాడు. హిరణ్యాక్షుడి మరణం తర్వాత ప్రహ్లాదుడు రాక్షసభావాన్ని వదిలి తన రాజ్యాన్ని పాలించాడు. అయితే దేవతల మాయవల్ల ఒక బ్రాహ్మణ శాపంతో వైష్ణవభావాన్ని మరచి ఆ విష్ణువుతోనే యుద్ధం చేస్తాడు. అంతిమంగా తిరిగి తన పూర్వసంస్కారంతో సత్యాన్ని తెలుసుకుని తిరిగి యోగసిద్ధిని పొందాడు.

అతడు తన కుమారుడైన అంధకుడికి రాజ్యాన్ని అప్పగించి మోక్షస్థానాన్ని పొందుతాడు. అంధకుడు శివపత్ని పార్వతిని కామిస్తాడు. దారువనంలో గృహస్థులైన మునులు ఈశ్వరుని గురించి తపస్సు చేసే సమయంలో తీవ్ర అనావృష్టి కలిగింది. ఆకలితో బాధపడుతున్న మునులను తపోనిధి అయిన గౌతముడు ఆదుకుంటాడు. పన్నెండేండ్ల తరువాత సుభిక్షమేర్పడగా మునులు తాము తిరిగి వెళతామంటారు. మరికొంతకాలం వారిని ఉండమంటాడు గౌతముడు. అట్లా ఆజ్ఞ ఇవ్వడని ఆ మునులు మాయాగోవును కల్పించి, గౌతముని ఆశ్రమంలోకి తోలారు. గౌతముడు దయతో దానిని తాకిన సమయంలో అది అకస్మాత్తుగా మరణించింది. అది కారణంగా గోహత్యా పాతకానికి పాల్పడిన గౌతముని ఆశ్రమంలో ఉండలేమని మునులు అక్కడినుండి వెళ్ళిపోతారు. వారి కుతంత్రాన్ని తెలుసుకున్న గౌతముడు వారిని వేదదూరులై మహాపాతకులు కండని శపిస్తాడు.

శాపనివృత్తికై మునులు శివకేశవులను ప్రార్థిస్తారు. అపుడు విష్ణువు శివునితో వీరు పాపాత్ములే అయినా మన భక్తులు, కాపాడదగినవారని అంటాడు. అటువంటివారికోసం అంటే వేదబహిష్కృతులైన వారికోసం మోహకారకాలైన కాపాలం, నాకులం, నామం, భైరవం, పాంచరాత్రం, పాశుపతం వంటి మార్గాలను సృష్టించాడు శివుడు.

శంకరుడు శుభంకోరి భిక్షనాచరిస్తూ కపాలమాల ధరించి, శ్మశానభస్మం పూసుకొని లోకాన్ని మోహింపజేస్తాడు. పార్వతిని విష్ణు ఆధీనంలో ఉంచి కాపలాగా భైరవుడిని నియమిస్తాడు. స్త్రీరూపంలో ఉన్న విష్ణువుకు కుమారుడు కలుగుతాడు. బ్రహ్మ అగ్ని మొదలైనవారు కూడా స్త్రీరూపధారులై శివుని సేవించారు.

పార్వతిని అపహరించదలచిన అంధకాసురుడు అక్కడికి రాగా శివుడు యమధర్మరాజ రూపుడై యుద్ధం చేస్తాడు. శూలంతో పొడవగా, అంధకాసురుని రక్తం నుండి వేలాదిగా అంధకులు పుట్టి యుద్ధం చేయసాగారు. యుద్ధంలో ఓడిన శివుడు విష్ణువును ఆశ్రయించగా, అతడు వందమంది దేవీగణాన్ని సృష్టించాడు. ఆ దేవీగణం అంధకగణాన్ని యమలోకానికి చేర్చింది. అంధకుడు పారిపోతాడు. శివుడు పన్నెండేండ్ల క్రీడావినోదం అనంతరం మందరాన్ని చేరుకుంటాడు. విష్ణువును చూచి ఆనందించి, ఆదరంతో తనతో పాటు ఆసనంపై కూర్చుండబెట్టుకుంటాడు. తన పరివారానికి పరిచయం చేస్తాడు. ఇతను నారాయణుడు నాతో అభేదం కలవాడు. లక్ష్మీ పార్వతులు కూడా నా రూపాలే. ఈశ్వరుడిని విష్ణువును ఒకరుగానే గ్రహించి శాంతిని పొందండి. భేదదృష్టితో చూసేవారు రౌరవం చేరుతారు అంటాడు. గణేశ్వరులు, మాతృగణాలు అంతా భక్తిని గలిగించమని కోరుతారు.

అంతలో మళ్ళీ అంధకుడు పార్వతిని అపహరించాలని వస్తాడు. హరి శివునితో నీవే ఇతనిని సంహరించ తగినవాడివి అంటే, అంధకుడిని శివుడు శూలం కొనలో నిలిపి నృత్యం సాగిస్తాడు. దానితో అంధకుని పాపాలు

తొలగి విజ్ఞానం కలిగి పరమేశ్వరుని స్తుతిస్తాడు. అతడిని తన గణాలలో చేర్చుకుంటాడు శివుడు. పార్వతి కూడా అతనిని అనుగ్రహిస్తుంది.

అంధకాసురుని తర్వాత ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు రాజైనాడు. ధర్మమార్గంలో రాజ్యం నడుపుతుండగా ఒకసారి సనత్కుమారుడు అక్కడికి వస్తాడు. సనత్కుమారుడి నుండి ఆత్మజ్ఞానరూపధర్మాన్ని ఉపదేశంగా పొంది, తన కుమారుడైన బలిని రాజుగా చేస్తాడు. బలి ధర్మబద్ధంగా రాజ్యపాలన చేస్తూ స్వర్గం సాధిస్తాడు. ఇంద్రుని తల్లి అయిన అదితికి ఇది దుఃఖకారణం అవుతుంది. మంచి సమర్థుడైన పుత్రునిగా తనకు జన్మించమని విష్ణుని తపస్సు చేసి వేడుతుంది. దానికి విష్ణువు సరేనంటాడు.

బలి తన రాజ్యంలో ఉత్పాతాలు కలుగగా తాత ప్రహ్లాదుని మార్గం చూపమంటాడు. అతడు విష్ణువునే శరణువేడమంటాడు. అదే విధంగా బలి విష్ణువును శరణువేడుతాడు.

కొన్నాళ్ళకు అదితికి విష్ణువు జన్మిస్తాడు. చిన్నబ్రాహ్మణకుమార వేషంతో బలి నిర్వహిస్తున్న యజ్ఞవాటికకు వెళ్ళి మూడు అడుగుల నేల అడుగుతాడు. బలి దానికి సరేనంటాడు. మొదటి అడుగుతో నేలను, రెండవ అడుగుతో బ్రహ్మాండాన్ని ఆక్రమిస్తాడు బాలుడు. బ్రహ్మాండాన్ని పాదంతో తాకగా ఆకాశగంగ ఉద్భవించి స్వర్గాన్ని, హిమవత్పర్వతాన్ని చివరకు భూమిని చేరుతుంది. ఇక మూడవ అడుగు మేర చోటు చూపమని బలిని కోరుతాడు త్రివిక్రమరూపంలోని వటువు. బలి తన శిరసును చూపుతాడు. దానికి నీ సంకల్పదానంతో ఈ మూడులోకాలు నా అధీనాలే. నీవు పాతాళంలోని మూల ప్రవేశించు. అక్కడ దేవతలు పొందలేని భోగాలను అనుభవిస్తావు. కల్పాంతంలో నన్ను చేరుతావు అని ఆశీర్వదిస్తాడు విష్ణువు. బలి తనకు ఇచ్చిన ముల్లోకాల ప్రభుత్వాన్ని ఇంద్రుని పరం చేస్తాడు.

బలి చక్రవర్తి కుమారులు నూర్గురు. వారిలో బాణుడు అత్యంత బలశాలి. శంకరుని భక్తుడై ముల్లోకాలను వశం చేసుకున్నాడు. ఇంద్రుడిని బాధించాడు. దేవతలు శంకరుని వేడుకున్నారు. అపుడు శివుడు బాణుడి పట్టణాన్ని ఒక్క బాణంతో కాల్చివేశాడు. బాణుడు కోరికలు వదిలి శివలింగాన్ని తలపై పెట్టుకొని శివుని శరణు పొందుతాడు.

మునులు కోరగా సూతుడు ఇట్లా చెప్పసాగాడు. మరీచికి కశ్యపుడు కుమారుడై ప్రజాపతి పదవిని పొందాడు. కశ్యపప్రజాపతి ద్వారా వినత కుమారులైన గరుడుడు, అరుణుడు ప్రసిద్ధులు. గరుడుడు శివుని కరుణపొంది విష్ణువుకు వాహనంగా, అరుణుడు సూర్యుని సారథిగా నియమితులయ్యారు. చంద్రుని ఇరువదేడుమంది భార్యలు కూడా కశ్యపుని కూతుళ్ళే. కశ్యపుని సంతాన క్రమంలో తృణబిందువు పుత్రులు ఐలబిలులు ప్రసిద్ధులు. పులస్త్యునికి ఒకరాజర్షి తన కన్యనిచ్చి పెండ్లి చేయగా, వారి నుండి విశ్రవసువు, అతనికి దేవవర్ణిని యందు పెద్దకుమారునిగా కుబేరుడు జన్మిస్తాడు. విశ్రవసువు ఇంకొక భార్య కైకసికి రావణుడు, ఇంకొక భార్య పుష్పోత్కటకు కుంభకర్ణ, విభీషణులతో పాటు శూర్పణఖ అనే సంతానం కలుగుతారు. మహోదరుడు, ప్రహస్తుడు మొదలైనవారు వాక అనే భార్యకు జన్మిస్తారు. ఈ క్రమంలో సందర్భవశంగా సప్తర్షుల పుట్టుక, వారి భార్యలు, వారి సంతానం గురించి వివరిస్తాడు సూతుడు.

ఇంకా ఇట్లా చెప్పసాగాడు-కశ్యపుని వల్ల అదితి ఆదిత్యుని పుత్రునిగా పొందింది. అతని వారసుడుగా ఇక్ష్వాకుడు, అతని వారసత్వ పరంపరలో కకుత్థుడు-యవనాశ్వుడు-కువలయాశ్వుడు మొదలైనవారు ప్రముఖులు.

ఈ పరంపరలో ఇక్ష్వాకు వంశంలోని సుధన్వుడు రాజ్యపాలన చేశాడు. ఇతని మనుమడు సత్యవ్రతుడు భార్య సత్యధనకు హరిశ్చంద్రుని పుత్రునిగా పొందాడు. హరిశ్చంద్రుని కుమారుడు రోహితుడు. అతని ప్రపౌత్రుడు సగరుడు. సగరునికి భానుమతి అనే భార్యలో అసమంజసుడు, ప్రభ అనే భార్యలో అరవైవేలమంది కుమారులు కలిగారు. అసమంజసునికి అంశుమంతుడు, అతనికి దిలీపుడు, అతనికి గంగను భూమికి తెచ్చిన భగీరథుడు పుట్టారు. ఈ పరంపరలో ఏడు ఎనిమిది తరాల తర్వాత రఘువు, అతనికి అజుడు, అతనికి రాముని తండ్రి అయిన దశరథుడు జన్మించారు. దశరథునికి రాముడు, భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు పుట్టారు. రాముడు రావణ సంహారార్థం జన్మించినవాడు. రామునికి జనకుని కుమార్తె సీతతో వివాహం జరుగుతుంది. పిదప కైకేయి భర్త దశరథుడు తనకు పూర్వం ఇచ్చిన వరం కారణంగా భరతుని రాజుగా చేయమనడంతో రాముడు సీత, లక్ష్మణులతో అరణ్యవాసానికి వెళ్ళాడు. అక్కడ సీతాపహరణం జరుగడం, సీతను వెతుకుతూ, సుగ్రీవ హనుమంతుల సహాయంతో రాముడు లంకకు చేరుకొని యుద్ధంలో రావణుని వధించడం జరుగుతుంది. తిరుగు ప్రయాణంలో సముద్రంపై కట్టిన వారధి ప్రాంతంలో శివుడు ప్రత్యక్షమై నీవు నిర్మించిన ఈ మందిరంలో భూమి, ఈ వారధి ఉండేవరకు ఇక్కడే అదృశ్యరూపంలో ఉంటానని అభయమిస్తాడు. పట్టాభిషేకం అనంతరం తన పుత్రులైన కుశ, లవులకు రాజ్యభారం అప్పగిస్తాడు రాముడు. లవకుశుల వారసులుగా అతిథి, అతనికి నిషధుడు, అతనికి నలుడు, అతనికి దేవానీకుడు మొదలగువారు పుడుతారు. ఆ పరంపరలో చంద్రగిరి, భానువిత్తు, శ్రుతాయువు వరుసగా జన్మించారు. వీరంతా ఇక్ష్వాకు వంశంవారు.

ఆపై సూతుడు మునులతో చంద్రవంశ వర్ణన చేస్తాడు.

ఇల కుమారుడు పురూరవుడు రాజయ్యాడు. ఇతని వారసులలో ప్రముఖులు ఆయువు, నహుషుడు, యయాతి. యయాతి శుక్రాచార్యుని పుత్రిక దేవయానిని భార్యగా పొందాడు. అట్లే రాక్షసరాజైన వృషపర్వుని కూతురు శర్మిష్ఠను కూడ పత్నిగా స్వీకరించాడు. దేవయానికి యదు, తుర్వసులు పుత్రులు. శర్మిష్ఠకు ద్రుహ్యుడు,అనువు, పూరువు పుత్రులు. తన (తండ్రి) మాట పాటించినందువల్ల పూరువును రాజుగా చేశాడు యయాతి. దేవయాని పుత్రుడైన యదువుకు సహస్రజిత్తు, క్రోష్టువు, నీలుడు, జనుడు, రఘువు మొదలైనవారు కొడుకులు. సహస్రజిత్తుకు శతజిత్తు కుమారుడు. ఇతనికి దాయాది అయిన దుర్దమునికి అంధకుడు అనేవాడు పుత్రుడు. ఈ అంధకుని పుత్రుడే కార్తవీర్యార్జుననిగా పేరు పొందిన కృతౌజుడు. ఇతడు విష్ణ్వవతారం. ఇతని మృతికి కారణమైనవాడు జమదగ్ని కుమారుడైన పరశురాముడు. కార్తవీర్యార్జునుని వంద కుమారులలో జయధ్వజుడనే వాడు మాత్రమే నారాయణభక్తుడు. మిగిలినవారు శివభక్తులు. వీరి మధ్య శివకేశవుల ఆరాధనకు సంబంధించి భేదాలు తీవ్రమైనపుడు సప్తర్షులను అడిగి సందేహం తీర్చమన్నారు. వసిష్ఠుడు రాజులకు విష్ణువు ఆరాధనీయుడు అని చెప్పాడు. కొంతకాలానికి విదేహుడనే రాక్షసుడు వారిపై దండెత్తగా అందరూ పారిపోయారు. జయధ్వజుడు విష్ణువును స్మరించగా సుదర్శన చక్రం అతనిని కాపాడింది. విశ్వామిత్రమహర్షి సూచన మేరకు జయధ్వజుడు శివుని శరీరభూతుడైన విష్ణువును

ఆరాధించాడు. ఈ జయధ్వజుని సంతతిలోనివారు వృషుడు మొదలైన యాదవసంతతివారు. ఈ వృషుని మునిమనుమడు దుర్జయుడు. ఇతడు యమునానదీతీరంలో ఊర్వశిని చూసి మన్మథవికారం పొంది ఆమె ఒడంబడగా చాలాకాలం ఆమెతో గడిపాడు. తిరిగి రాజ్యానికి వచ్చేందుకు తనభార్యను చూసేందుకు భయపడి, ఆమె పాపపరిహారం చేసుకోమనగా కణ్వముని సలహా మేరకు హిమవత్పర్వతానికి వెళ్ళాడు. అక్కడ ఒక గంధర్వుని మెడలోని మాల ఊర్వశికి తగినదని నిర్ణయించుకుని, అతనితో యుద్ధంచేసి ఆ మాలను సంపాదించాడు. దానిని హేమకూటపర్వతంలోని ఊర్వశికి ఇచ్చి చాలాకాలం అక్కడే గడిపాడు. ఆమె తిరిగి పొమ్మనగా అతను ఒప్పుకోకపోవడంతో ఆమె వికార రూపం పొందింది. దానితో అతడు విరక్తి చెంది పన్నెండేండ్ల పాటు కందమూలాలు, మరోపన్నెండేండ్ల వర్షపునీరు, మరోపన్నెండేండ్లు వాయువునే ఆహారంగా తీసుకుని కణ్వమునిని కలిసి ప్రాయశ్చిత్తం కోసం వారణాసి వెళ్ళి గంగా స్నానం చేసి పునీతుడయ్యాడు.

ఇక యదు రెండో పుత్రుడైన క్రోష్టుని పరంపరలో విదర్భుడు, అతని కొడుకు క్రథునికి కుంతి, అతని కొడుకు నవరథుడు కలిగారు. ఈ నవరథుడు ఒక సమయంలో అడవిలో వెళుతుండగా రాక్షసుడు ఒకడు వెంటపడ్డాడు. నవరథుడు సరస్వతి రహస్యస్థావరం చేరుకొని ఆమె శరణుపొందాడు. ఆమె ప్రభావంతో ఆ రాక్షసుడిని ఒక మహాభూతం వచ్చి సంహరించింది.

ఈ విధంగా వంశంలోని తరువాతి చాలా తరాలకు ఉగ్రసేనుడు, అతని తమ్ముడు దేవకుడు జన్మించారు. దేవకుని పుత్రికులు ఏడుగురిని వసుదేవునికి భార్యలుగా ఇచ్చాడు. వీరిలో దేవకి శ్రేష్ఠురాలు. ఈమెయే కంసుని చెల్లెలు. దేవకీవసుదేవులకు నారాయణుడు పుత్రునిగా జననం పొంది కంసుని, శిశుపాలుని అంతం చేశాడు. కృష్ణునిగా ప్రసిద్ధి పొందాడు. శివుని గూర్చి తపమాచరించి, జాంబవతి యందు సాంబుని శివుని అంశగల కుమారునిగా పొందాడు.

తనను గూర్చి తపమాచరించిన కృష్ణుని కైలాసానికి తీసుకువెళ్ళాడు శివుడు. కైలాసంలో కృష్ణుడుండగా ద్వారకను రాక్షసులు చుట్టుముట్టారు. గరుత్మంతుడు వారిని చంపి ద్వారకను కాపాడాడు. ద్వారకకు తిరిగి వచ్చిన కృష్ణుడు మార్కండేయునితో పుణ్యకథా ప్రసంగం చేశాడు. ఆ సమయంలో ఈశ్వరుడు పరదైవతమని, లింగార్చనకంటె శ్రేష్ఠమైనది ఇంకొకటి లేదని, లోకం తెలుసుకోవడానికి లింగరూపంలోని శివుని పూజిస్తున్నానని అంటాడు. అపుడు మార్కండేయుడు ఆ లింగం గురించి తెలుపమంటాడు.

దానికి కృష్ణుడు లింగోద్భవ ఘట్టం చెపుతాడు. తాను విష్ణువుగా సముద్రంలో శయనించగా బ్రహ్మకు తనకు మధ్య చర్చలో మనకు మించిన ఇంకో దైవం లేదనుకుంటారు. ఆసమయంలో వారి ముందు లింగం ఉద్భవిస్తుంది. దాని ఆది అంతాన్ని వీరిద్దరూ కనుక్కోలేకపోతారు. అది మొదలు లింగార్చన మొదలయిందని కృష్ణుడు మార్కండేయునికి చెపుతాడు.

అంతట భృగువు మొదలైన ఋషులు కృష్ణదర్శనానికి వస్తారు. వారితో నేను పరమపదానికి వెళుతాను. ఇపుడు ఘోరమైన కలియుగం వచ్చింది. ప్రజలు పాపమార్గం పడుతారు. అజ్ఞానులకు హితాన్ని కూర్చే విజ్ఞానాన్ని

వ్యాపింపజేయండి, ఈ కలియుగంలో నన్నొక్కసారి స్మరించినా పాపం నశిస్తుంది. భక్తితో నన్ను పూజించేవారు పరమపదాన్ని పొందుతారు. అదే సమయంలో శివుని నిందిస్తే నరకాన్ని పొందుతారు అంటాడు కృష్ణుడు.

ఇది విన్న మునులు సూతునితో కృత త్రేతా ద్వాపర కలియుగాల గురించి వాటి మహిమ గురించి తెలుపమంటారు.

కృష్ణుని నిర్యాణం జరిగి పరలోకక్రియల తరువాత అర్జునుడు తిరిగి వస్తూ దారిలో తొందరగా వెళుతున్న వ్యాసమునిని దర్శిస్తాడు. ఇంత త్వరగా ఎక్కడికి వెళుతున్నారని ప్రశ్నిస్తాడు అర్జునుడు. దానికి వ్యాసుడు ఇట్లా చెపుతాడు.

అర్జునా కలియుగం ప్రారంభం అయింది. అందుకే కాశికి వెళుతున్నాను. కలియుగంలో జనులు అన్ని ధర్మాలు విడిచి పాపమార్గం అనుసరిస్తారు. లోకంలోని పాపాలను తొలగించేది వారాణసి నగరం. కృతత్రేతా ద్వాపర యుగాల్లో జనులు ధర్మాలను పాటిస్తారు. ఈ కలియుగంలో విడుస్తారు అన్నాడు.

అర్జునుడు యుగధర్మాలను తెలుపమంటే వ్యాసుడు యుగధర్మాలను వివరంగా చెప్పి కాశీనగరం వెళుతాడు.

కాశీనగరం వెళ్ళి వ్యాసుడు ఏం చేశాడో తెలుసుకోవాలనుందని అంటారు మునులు సూతునితో,

వ్యాసుడు కాశిలో గంగాస్నానం చేసి గణేశ్వరుని కొలిచాడు. అక్కడి వివిధ తీర్థాలను శిష్యబృందంతో సహా దర్శించి తీర్థమాడాడు. ఏఏ తీర్థంలో ఏఏ క్రియలు చేస్తే ఏ పుణ్యం లభిస్తుందో వివరించాడు. శిష్యులను వారివారి ప్రాంతాలకు వెళ్ళమని చెప్పి తను వారాణసిలోనే నివాసం ఏర్పరచుకున్నాడు. భిక్షవల్ల లభించిన ఆహారాన్నే తీసుకుంటూ గడిపేవాడు. ఒకనాడు భిక్ష దొరకలేదు. కోపంతో కాశిలో నివసించేవారికి పుణ్యలోకప్రాప్తి కలగకుండా ఉండాలని శపించబోయాడు. ఇంతలో ఒక ముదుసలి స్త్రీ వచ్చి భిక్ష వేసింది. పిదప నీవు కృతఘ్నుడవై కాశీవాసులనే శపించబోయావు. కోపాన్ని అదుపులో పెట్టుకోలేనివాడివి ఈ కాశిలో ఉండతగవు వెళ్ళిపొమ్మంది. ఆమెను అన్నపూర్ణగా గుర్తించి క్షమాభిక్ష కోరాడు వ్యాసుడు. అందుకామె అష్టమి, చతుర్దశి రోజులలో మాత్రమే కాశిప్రవేశాన్ని అతనికి కలిగించింది. అప్పటి నుండి వ్యాసుడు కాశీకి సమీపంలోని ప్రాంతంలో ఉండసాగాడు.

ఇది తెలుసుకున్న తరువాత ప్రయాగ క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలుసుకోగోరారు మునులు. వారికి సూతుడు దానికి సంబంధించిన వివరాలు తెలిపాడు. గంగ యమునా సంగమస్థలి ఎంత పవిత్రమైందో వివరించాడు.

నైమిషారణ్య మునులు మూడులోకాల మండలవివరాలు, సముద్రాలు, ద్వీపాలు, వర్షాలు, పర్వతాలు, గ్రహాలస్థితులు తెలుసుకోగోరగా వారికి వివరంగా తెలిపాడు సూతుడు. ఏది ఏవిధంగా ఏర్పడింది, ఏ ప్రాంతంలో ఏమున్నది, ఎటువంటివారు ఉంటారు మొదలైనవి వివరంగా తెలిపాడు.

పిదప మునులకు గడిచిన, గడుస్తున్న, రాబోయే మన్వంతరాల గురించి వివరించాడు.

భూతభవిష్యద్వర్తమానాలు తెలుసుకున్న తరువాత సూతమహామునిని బ్రహ్మవిషయకమై అడుగబోయారు నైమిషారణ్య ఋషులు. ఇంతలో అక్కడకు కృష్ణద్వైపాయన వ్యాసుడు ఏతెంచాడు. వ్యాసుడినే ఆ విషయం చెప్పమని కోరారు. అపుడు వ్యాసుడు ఇది పూర్వం సనత్కుమారాదులు మహాదేవుని ప్రశ్నించగా ఆయనే స్వయంగా చెప్పిన విషయమని ఇట్లా చెప్పడం ప్రారంభించాడు.

ఒకప్పుడు సనత్కుమారాదులు బదరికాశ్రమంలో తపస్సు చేశారు. అక్కడ వారు నరునితో కలిసి ఉన్న నారాయణుని చూశారు. స్తుతించారు. వారి కోరికను తెలుసుకున్న నారాయణుడు పరమరహస్యమైన బ్రహ్మతత్త్వాన్ని వివరించడానికి తాను శంఖచక్రగదాది చిహ్నాలతో లక్ష్మీదేవితో కూడి కనిపించగా నరుడు ఆ వెలుగులో కనిపించకుండా పోయాడు. ఆ సమయంలోనే చంద్రశేఖరుడైన మహేశ్వరుడు సాక్షాత్కరించాడు. ఇద్దరూ కలిసి తమ అభేదత్వాన్ని, ఆత్మస్వరూపాన్ని తెలియజేశారు. దీనినే ఈశ్వరగీతగా పేర్కొంటారు. ఈ సందర్భంగా తన విశ్వరూపాన్ని చూపుతాడు శివుడు. తన సృష్టి స్థితి లయ కారకత్వాన్ని నిరూపిస్తాడు. ఇట్లా చెప్పిన ఈశ్వరుడు పక్కనే కూర్చున్న నారాయణునితో బ్రహ్మాదుల హితంకోసం ఆత్మయోగాన్ని బోధించాడు. తరువాత ఈ గీతను వ్యాప్తి చేయమని చెప్పి అంతర్ధానమయ్యాడు. నారాయణుడు కూడా దివ్యదేహం వదిలి తాపసవేషం తిరిగి పొందుతాడు. యోగులు తమ తమ స్థానాలకు వెళ్ళిపోయారు.

ఈశ్వరగీతను ప్రసాదించిన అనంతరం వ్యాసుడు కర్మయోగాన్ని గూర్చి చెప్పాడు. ఎవరెవరు ఎటువంటి కర్మలు చేయాలి. మానవులకు సరియైన కర్మలు ఎట్లా విహితం చేయబడ్డాయి, ప్రతిదినం చేయాల్సిన కర్మలు ఏవి? శ్రాద్ధకర్మలు ఎట్లా ఎవరు చేయాలి? అశౌచ నియమాలు, ఆశ్రమధర్మాలు, విధులు అనే విషయాలు తెలియజెపుతాడు.

ప్రాయశ్చిత్తవిధి గురించి చెప్పగా మునులు పూర్వం రుద్రుడు బ్రహ్మశరీరానికి సంబంధించిన కపాలాన్ని భూమిపై ఎట్లా స్థాపించాడని ప్రశ్నించారు. దానికి సూతుడు ఇట్లా సమాధానమిచ్చాడు.

ఒకసారి ఋషులు మేరుశృంగానికి వెళ్ళి బ్రహ్మకు నమస్కరించి జగత్కారణమైన తత్త్వమేది అని అడిగారు. దానికి మాయామోహితుడైన బ్రహ్మ జగత్తును ధరించేవాడిని, ఈశ్వరుడిని నేనే, ముక్తి పొందడానికి నన్ను పూజించాలి అన్నాడు. అప్పుడు నారాయణాంశతో ఉత్పన్నుడైన భగవానుడు కోపంతో నవ్వుతూ బ్రహ్మ! అజ్ఞానంతో మాట్లాడుతున్నావు. నా ప్రేరణతో నీవు లోకాన్ని సృజిస్తున్నావు అన్నాడు. దానికి విభేదించిన బ్రహ్మ వివాదం చేస్తుండగా నాల్గువేదాలు వచ్చి తత్త్వయథార్థాన్ని తెలుసుకొమ్మని బ్రహ్మకు చెప్పాయి. ఈశ్వరుడే పరమాకాశరూపుడు అన్నాయి. వాటి మాటలు విన్న బ్రహ్మ–అతడు సర్వసంగవర్జితుడే అయితే ప్రమథులతో, పార్వతితో ఎట్లా కలిసి ఉంటున్నాడు అన్నాడు. ఆ సమయంలో ప్రణవమూర్తి బ్రహ్మతో ఇట్లన్నాడు. శంకరుడు పత్నితో రమించటం లేదు. అతడు ఆత్మారాముడు. పార్వతి అతని ఆత్మయే. అతని ఆనందమే ఆమె రూపాన్ని పొందింది, కొత్తది కాదు అన్నాడు.

అయినా అజ్ఞానం తొలగలేదు. ఇంతలో ఆకాశంలో ఉన్న జ్యోతిని విశ్వస్రష్ట చూశాడు. అజ్ఞానంతో కోపించిన బ్రహ్మ ఐదవ శిరస్సు వేడెక్కింది. క్షణంలో నీలలోహితుడు శూలంతో ఆవిర్భవించగా అతడిని గమనించిన బ్రహ్మ పూర్వం నీవు నా నుదుటి నుండి పుట్టావు. నన్ను శరణు వేడుమన్నాడు. అపుడు కాలభైరవుడు ఈశ్వరుని

పనుపుతో బ్రహ్మఐదవశిరస్సును ఖండించాడు. అపుడు సత్యాన్ని గ్రహించిన బ్రహ్మ ఉమాసహితుడైన ఈశ్వరుడిని స్తుతించాడు. ఈశ్వరుడు నీలలోహితునితో ఈ బ్రహ్మ నీ తండ్రి, ఇతని తలను ఖండించిన నీకు బ్రహ్మహత్యాదోషం అంటుకుంది. దానిని తొలగించుకో అన్నాడు. అందుకు భిక్షాటన చేయమన్నాడు. నారాయణుని చూచినపుడు దోషపరిహార మార్గం ఉపదేశిస్తాడు అన్నాడు. అతని వెంట బ్రహ్మహత్య అనే కన్యను పంపి వారాణసి చేరేవరకు అనుసరించమన్నాడు. ఆ కాలభైరవుడు అంతటా తిరుగుతూ మధుసూదనుడున్న మందిరంలోకి ప్రవేశించబోయాడు. అతడిని వారించిన ద్వారపాలకుడు విష్వక్సేనుడితో యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో విష్వక్సేనుడిని అంతం చేసి ఆ మృతదేహంతో అభ్యంతరమందిరంలోకి వెళ్ళాడు. అతడిని చూచి విష్ణువు తన శిరస్సు ఛేదించుకొని రక్తధారను కురిపిస్తూ, హే భగవన్! ఈ భిక్షను స్వీకరించు అన్నాడు. అయినా ఆ బ్రహ్మకపాలం నిండలేదు. ఈ బ్రహ్మకపాలం ఎందుకు మోస్తున్నావని అడిగితే కాలభైరవుడు నారాయణునితో జరిగిన విషయం చెప్పాడు. నారాయణుడు బ్రహ్మహత్యను పిలిచి కాలభైరవుడిని విడువుమన్నాడు. అది వదలలేదు. అపుడు అతడిని వారాణసి వెళ్ళమన్నాడు. అతని ఆజ్ఞమేరకు కాలభైరవుడు వారాణసి వెళ్ళగా బ్రహ్మహత్య అతడిని విడిచిపెట్టి పాతాళానికి వెళ్ళింది. అక్కడ ఉత్తమస్థానంలో కాలభైరవుడు బ్రహ్మకపాలాన్ని ప్రతిష్ఠించాడు. తర్వాత విష్వక్సేనుని శరీరాన్ని బతుకుగాక అంటూ మహావిష్ణువుకిచ్చాడు. ఈ తీర్థానికి వచ్చి స్నానం చేసి దేవపితృదేవతలను తృప్తిపరిస్తే బ్రహ్మహత్యాపాతకం తొలగి పరమపదాన్ని పొందుతారని అన్నాడు. వ్యాసుడు తరువాత ప్రయాగ, గయ, కురు, త్రయంబక, సోమేశ్వర మొదలైన తీర్థాల విశేషాలు మునులకు తెలియజేస్తాడు.

కాలంజర తీర్థ మాహాత్మ్యాన్ని చెపుతూ సూతుడు ....పూర్వం శ్వేతకేతుడనే రాజు ఇక్కడ లింగాన్ని స్థాపించి రుద్రుని జపించాడు. కాలుడు శ్వేతరాజును తీసుకుపోవడానికి రాగా భయంతో లింగాన్ని పట్టుకొని శతరుద్రీయం చదువుతూ రుద్రునికి నమస్కరించాడు. శంకరుని పూజించే తనవంటివారిని వదలి ఇతరులను వధించమని కాలునితో కోరుతాడు. కాని కాలుడు అందరూ నా వశంలోనివారేనని బంధిస్తాడు. అపుడు శంకరుడు పార్వతితో సహా వచ్చి ఈ ఒక్కడిని విడువమంటాడు. కాలుడు వినకుండా శివునివైపే రాబోతాడు. మహేశ్వరుడు కాలుడిని ఎడమకాలితో తన్ని చంపాడు. బ్రహ్మ వచ్చి చెప్పినతర్వాత కాలుడిని బతికిస్తాడు..అని చెప్పాడు.

## శ్రీకూర్మపురాణ ప్రాధాన్యం-ఫలశ్రుతి

నియమంతో సావధానంగా ఈ పురాణాన్ని పఠించినా, విన్నా సర్వపాప విముక్తుడై బ్రహ్మలోకాన్ని చేరుతారు. దీన్ని వ్రాసి వేదవిదుడైన బ్రాహ్మణునికి దానం చేస్తే సర్వైశ్వర్యాలు కలిగి స్వర్గంలో దివ్యభోగాలననుభవిస్తారు. స్వర్గం నుండి భ్రష్టులై విప్రకులంలో పుట్టి పూర్వసంస్కార ప్రభావంతో బ్రహ్మవిద్యను పొందుతారు. పురాణార్థాన్ని పరిశీలించినవారు పరమపదాన్ని పొందుతారు. ధర్మాల్లో ఉత్తమత్వం, నిష్ఠాతత్వం కోరేవారికి ఈ పురాణంతో సాటి మరొకటి లేదు. ఇది పౌరాణికీ బ్రాహ్మీసంహిత, సకల పాపనాశిని. ఈ పురాణం తీర్థాల్లో ఉత్తమం. తపాలలో ఉత్తమతపం, జ్ఞానాలలో పరమజ్ఞానం, వ్రతాలలో ఉత్తమవ్రతం, మోక్షార్థులు విశేషించి ఈ పురాణాన్ని చదవాలి.

**కె.వి. సుందరాచార్యులు**
హైదరాబాద్

# పురాణప్రశస్తి
## (అష్టాదశపురాణాలు)

మహామహోపాధ్యాయ డా॥ సముద్రాల లక్ష్మణయ్య

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥**
**నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।**
**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥**

అతి ప్రాచీనకాలంలో గురుకులాలలో విద్యనభ్యసించే విద్యార్థులు పదునాలుగు విధాలైన విద్యల నభ్యసించేవారు. ఆ విద్యల నిలా పేర్కొనడం జరిగింది.

**అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః ।**
**పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతాశ్చతుర్దశ ॥**

శిక్ష,వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం–అనే ఆరు వేదాంగాలు, ఋగ్యజుస్సామా థర్వణము లనే నాలుగు వేదాలు, మీమాంస, న్యాయం, పురాణం, ధర్మశాస్త్రం–అనేవే పదునాల్గు విద్యలు.

**'వేదోఽఖిలో ధర్మమూలం'** అన్నట్లు వేదమంతా ధర్మమూల మైనది. వేదోక్తమైన ధర్మాలను గ్రహించడం అందరికీ సాధ్యం కాని పని. అందుచేత వేదాలను విభజించిన వేదవ్యాసుడే వేదార్థాలను సామాన్యులు గూడా గ్రహించదాని కనువుగా పురాణాలను రచించాడు. **అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీ సుతః** –అను ప్రమాణవచనం కూడా పదునెన్మిది పురాణాల రచయిత సత్యవతీ సుతుడైన వ్యాసుడే అని నిరూపిస్తున్నది.

**ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ ।**
**బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రహరిష్యతి ॥**

అల్పజ్ఞుడు తనకు హాని కల్గిస్తాడేమో అని వేదం భయపడుతుంది. అందువల్ల ఇతిహాసాలతోనూ, పురాణాలతోనూ వేదార్థాలను విస్తరింపజేయాలి. ఈ దృష్టితోనే, అనగా అల్పజ్ఞులను దృష్టిలో పెట్టుకొనే వ్యాసుడు వేదార్థాలను పురాణాలద్వారా విస్తరింపజేశాడు. అట్లని పురాణాలు అల్పజ్ఞులకు మాత్రమే పరిమితమైనవి కావు. అధికజ్ఞులు కూడా గ్రహించవలసిన విషయాలు పురాణాలలో ఎన్నో ఉన్నాయి.

వేదం ప్రభువుతో సమానమైనది. శబ్దప్రధానమైన వేదవాణి కర్తవ్యవిషయంలో రాజాజ్ఞను పోలివుంటుంది. పురాణవచనం మిత్రతుల్యంగా వుంటుంది. అది అర్థప్రధానమై శ్రోతను కర్తవ్యానికి పురికొల్పుతుంది. కావ్యం కాంతాసమ్మితమై సరసంగా బోధించి పాఠకుణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తుంది అని ఆలంకారికులు వేదార్థాలను వివరించే పురాణాలకు మిత్రసాదృశ్యాన్ని ప్రతిపాదించారు.

**యద్వేదాత్ప్రభుసమ్మితాదధిగతం శబ్దప్రధానా చ్చిరం**
**యచ్చార్థ ప్రవణాత్పురాణవచనాదిష్టం సుహృత్సమ్మితాత్ ।**

**కాన్తాసమ్మితయా యయా సరసతామాపాద్య కావ్యశ్రియా**
**కర్తవ్యే కుతుకీ బుధో విరచితస్తస్మై స్పృహాం కుర్మహే ॥** (ప్రతాపరుద్రీయం)

పురాణాలలో గూడా కావ్యశైలిని పాటించి రసవత్తరంగా కర్తవ్యబోధ కావించిన ఘట్టాలెన్నో ఎడనెడా కానవస్తాయి.

పురాణాలలో పూర్వకాలానికి చెందిన అనేక కథలున్నాయి. కథా కథనం ద్వారా ధర్మ స్వరూపం అందులో నిరూపింపబడింది. పురాణ కథలు వాగ్వైభవాన్ని ప్రదర్శించడానికి చెప్పినవి కావనీ, విజ్ఞానవైరాగ్యాలను విస్తరించి చెప్పడానికే ఆ కథలను వివరించడమయిందనీ భాగవతపురాణంలో వ్యాసభగవానుడే చెప్పాడు.

**కథా ఇమాస్తే కథితా మహీయసాం**
**వితాయ లోకేషు యశః పరేయుషామ్ ।**
**విజ్ఞానవైరాగ్య వివక్షయా విభో!**
**వచోవిభూతిర్న చ పారమార్థ్యమ్ ॥** (భాగవతం-12-3-14)

ఇక్కడ 'విజ్ఞాన' మంటే వేదవిజ్ఞానమనే గ్రహించాలి.
**'వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాత్ర సంశయః'**

పురాణాలలో వేదాలు ప్రతిష్ఠితాలై ఉన్నాయి. ఇందులో సందేహం లేదు. కథల ద్వారా అవి ఆవిష్కృతాలవుతాయి.

## పురాణ ప్రాముఖ్యం

**యన్నదృష్టం హి వేదేషు తత్సర్వం లక్ష్యతే స్మృతౌ ।**
**ఉభయోర్యన్న దృష్టం హి తత్పురాణే ప్రతీయతే ॥**

వేదాలలో గోచరం కానిదంతా స్మృతులలో కనిపిస్తుంది. శ్రుతి స్మృతులు రెండింటిలో కనిపించనిది పురాణం ద్వారా అవగతం అవుతుంది అన్న ప్రమాణాన్ని బట్టి శ్రుతులలోనూ, స్మృతులలోనూ లేని విషయాలను సైతం విస్తృతరచనావిధానం కల పురాణాలద్వారా గ్రహించవచ్చునని తెలుస్తున్నది. **'పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్'** అన్నట్లు శాస్త్రాలన్నింటిలోను మొదటిదిగా పురాణాన్ని విధాత స్మరించాడని విదితమవుతున్నది. యాగానుష్ఠానసమయంలో పురాణాలు పఠించే సంప్రదాయం కద్దు. ఇంకా పురాణాలలో భగవన్మహిమ, భగవదవతారాలు, భక్తిప్రబోధం, నానా విధాలైన ఆచారాలు, ధర్మాధర్మాలు, సాంఘిక -చారిత్రకాంశాలు, కళలు, వేదాంతతత్త్వాలు, నీతి ఇత్యాదిగా ఎన్నో విషయాలు నిరూపితాలయ్యాయి.

పురాణం ఐహికాముష్మిక సుఖసాధనం. మన సంస్కృతి సంప్రదాయాలను గ్రహించడానికి పురాణజ్ఞానం అవసరం.

## పురాణ శబ్దనిర్వచనం

**పురాణం అంటే –** పురా భవం ప్రాచీన కాలంలో రచించబడినది అని అర్థం.

**పురాఽపి నవం –** ప్రాచీనమైనా విషయ విశిష్టతను బట్టి క్రొత్తది అని మరొక అర్థం.

**పురా–అణతి–ఆగతానాగతే కథయతీతి పురాణం–**అంటే జరిగిన, జరుగనున్న కాలానికి చెందిన విషయాలను వివరించునది అని వేరొక అర్థం.

**పురా–పూర్వస్మిన్ జాతమితి పురాణమ్**–పూర్వం ఎప్పుడో జరిగిన వృత్తాంతం పురాణం అని భావం.

**పురా**–అంటే పరంపరను వ్యక్తం చేసేది పురాణం అని మరొక వివరణ.

**పురా–ప్రాచీన కాలోదంతం అనక్తీతి పురాణం –** పురాతన కాలానికి చెందిన చరిత్రను చెప్పునది పురాణం.

ఇలా పురాణ శబ్దానికి పలు విధాల నిర్వచనం పెద్దలు చెప్పారు.

## పురాణోత్పత్తి

అథర్వవేదంలో పురాణ శబ్దం ప్రయుక్తమైంది. యజ్ఞోచ్ఛిష్టంనుండి పురాణం పుట్టినదని అందులో చెప్పబడింది.

**ఋచఃసామాని ఛందాంసి పురాణం యజుషా సహ ।**
**ఉచ్ఛిష్టాజ్జజ్ఞిరే సర్వే దివి దేవా దివి శ్రితాః ॥** అథర్వ సంహిత (11–7–24)

నాల్గువేదాల తరువాత ఇక్కడ పురాణోత్పత్తి నిర్దేశించబడింది. పురాణాల ఉనికి వేద సమకాలికమని తెలుస్తున్నది.

అందుచేత వేదసంహితల కాలంలోనే పురాణాలకు చెందిన మూలస్వరూపం రూపొందిందని భావించవచ్చు. బృహదారణ్యకోపనిషత్తులోని ఈ క్రింది వాక్యం గమనార్హం

**"అస్య మహతో భూతస్య నిఃశ్వసితమేతత్ యదృగ్వేదో, యజుర్వేద స్సామవేదోఽథర్వాఙ్గిరసః పురాణం విద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రాణి".**(2–4–10)

ఈ ఉపనిషద్ వాక్యం వేదాదులతోపాటు పురాణం కూడా పరమాత్మయొక్క నిఃశ్వాసరూపమైనదని వ్యక్తం చేస్తున్నది. దీనివల్ల వేదం ఎంత ప్రాచీనమో పురాణం కూడా అంతే ప్రాచీనమని గ్రహించవచ్చు. ఇక్కడ పురాణ శబ్దం ఏకవచనంలో ప్రయుక్తమైనది. అందుచేత పూర్వం సంక్షిప్తంగా ఉండిన పురాణం కాలక్రమంలో విస్తృతరూపం సంతరించుకొని వివిధ పురాణాలుగా విస్తరించిందని భావించవచ్చు.

భారతీయసంస్కృతిని ప్రతిబింబించే దర్పణాలు పురాణాలు. సామాన్య జనానీకంలో సనాతన ధర్మతత్త్వాన్ని ప్రచారం చేయడంలో అవి ప్రముఖపాత్ర వహించాయి. ఆధునికకాలంలో ప్రాచ్య పండితులేకాక పాశ్చాత్య పండితులు కూడా పురాణాల విశిష్టతను గుర్తించారు. పురాణం అన్న వ్యవహారమే ఇది అతిప్రాచీన సాహిత్యమని తెలియజేస్తుంది.

పురాణాలకంటే భిన్నంగా ఇతిహాసాలను గూడా మన పెద్దలు పేర్కొన్నారు. గతకాలంలో జరిగిన సంఘటనలను తెలిపేవి ఇతిహాసాలు. ఇతి హ+ఆస = ఇతిహాసం అనగా ఇలా పూర్వం జరిగినది–అని అర్థం. పురాణంలోని విషయాలు ఇతిహాసంలోని అంశాలకంటె వ్యాపకంగానూ, విస్తృతంగానూ వుంటాయి.

సాధారణ పురాణాల నుద్దేశించి నిర్దేశించిన సర్గం, ప్రతిసర్గం మొదలైన లక్షణాల కంటె భిన్నమైన వివిధ విషయాలు పురాణాలలో గోచరిస్తాయి. ఉదా: అగ్నిపురాణాన్ని పరిశీలిస్తే వివిధ విద్యలు, పదార్థలక్షణాలు, స్వప్నాలు, శకున ఫలితాలు, కావ్యనాటక లక్షణాలు, ప్రళయస్వరూపం, నరకం తీరుతెన్నులు, అద్వైత బ్రహ్మతత్త్వం మున్నగు అంశాలు అందులో ఉండడం గమనార్హం. అందుకే అగ్నిపురాణాన్ని 'జ్ఞానకోశం' అన్నారు.

సృష్ట్యారంభంనుండి నేటివరకు సమాజంలోని స్థితిగతులను చెప్పే పురాణాలను శ్రద్ధతో పఠించి పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అంతేకాని అవేవో కల్పనాత్మకమైన కథలని ఉపేక్షించడం తగదు. పురాణాలను ఏ దృష్టితో వ్యాసభగవానుడు రచించాడు? అన్న ప్రశ్నకు ఈ క్రింది శ్లోకం సమాధానమిస్తున్నది.

**విష్ణోరంశో మునిర్జాతః సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణసంహితాం దధ్యౌ తేషాం ధర్మవిధిత్సయా ॥**

విష్ణ్వంశంతో జనించిన సత్యవతీ పరాశరుల పుత్రుడగు వ్యాసుడు ధర్మస్వరూప నిరూపణకై పురాణసంహితను రూపొందించాడని భావం.

అంతేకాక శ్రీమన్నారాయణుడు స్వయంగా వ్యాసరూపుడై వేదార్థాల విస్తృతి నపేక్షించి భూతలములో పురాణాలు రచించాడని ఈ క్రింది శ్లోకం నిరూపిస్తున్నది.

**విస్తారాయ చ వేదానాం స్వయం నారాయణః ప్రభుః ।**
**వ్యాసరూపేణ కృతవాన్ పురాణాని మహీతలే ॥**

సూతుని ద్వారా ఈ పురాణవాఙ్మయం ప్రచారంలోకి వచ్చింది. నైమిశారణ్యనివాసులైన శౌనకాది మునులు సూతునినుండి ఈ పురాణాలను విన్నారు.

## విష్ణువుయొక్క అవయవాలే పురాణాలు

త్రిమూర్తులలో ఒక్కడుగా, స్థితికారకుడుగా, దుష్టశిక్షకుడుగా, శిష్టరక్షకుడుగా, ధర్మసంస్థాపకుడుగా ప్రసిద్ధుడైన శ్రీమహావిష్ణుదేవుని యొక్క అవయవాలుగా పదునెన్మిది పురాణాలను పేర్కొనడం కద్దు. దీన్నిబట్టి ధర్మప్రభువైన అచ్యుతునికీ, ధర్మస్వరూపనిరూపకాలైన పురాణాలకూ కల సామ్యాన్ని గ్రహించవచ్చు. పురాణాలు ఈ క్రిందివిధంగా విష్ణుదేవుని అవయవాలుగా పేర్కొనబడ్డాయి.

**బ్రాహ్మం మూర్ధా హరేరేవ హృదయం పద్మసంజ్ఞకమ్ ।**
**వైష్ణవం దక్షిణో బాహుః వాయుర్వామో మహేశితుః ॥**

**ఊరూ భాగవతం ప్రోక్తం నాభిః స్యాన్నారదీయకమ్ ।**
**మార్కండేయం చ దక్షాంఘ్రిః వామో హ్యాగ్నేయముచ్యతే ॥**

**భవిష్యం దక్షిణో జానుర్విష్ణోరేవ మహాత్మనః ।**
**బ్రహ్మవైవర్తసంజ్ఞం తు వామో జానురుదాహృతః ॥**

**లైంగం తు గుల్ఫకం దక్షం వారాహం వామగుల్ఫకమ్ ।**
**స్కాందం పురాణం లోమాని త్వగస్య వామనం స్మృతమ్ ॥**

**కౌర్మం పృష్ఠం సమాఖ్యాతం మాత్స్యం మేదః ప్రకీర్త్యతే ।**
**మజ్జా తు గారుడం ప్రోక్తం బ్రహ్మాండం చాస్థి గీయతే ॥**

**ఏవమేవాభవద్విష్ణుః పురాణావయవో హరిః ।**

దీని తాత్పర్యం ఇది-శ్రీమహావిష్ణువునకు బ్రహ్మపురాణం-శిరస్సు, పద్మపురాణం-హృదయం, విష్ణుపురాణం-దక్షిణహస్తం, వాయుపురాణం-వామహస్తం, భాగవతపురాణం-తొడలు, నారదపురాణం-నాభి, మార్కేండయ పురాణం-దక్షిణపాదం, అగ్నిపురాణం-వామపాదం, భవిష్యపురాణం-కుడిమోకాలు, బ్రహ్మవైవర్త పురాణం-ఎడమ మోకాలు, లింగపురాణం-కుడి చీలమండ, వరాహపురాణం-ఎడమ చీలమండ, స్కాంద పురాణం-కేశాలు, వామనపురాణం-చర్మం, కూర్మపురాణం-వీపు, మత్స్యపురాణం-మెదడు, గరుడపురాణం-మజ్జ, బ్రహ్మాండపురాణం-ఎముకలు. ఇలా శ్రీహరి పురాణాలే అవయవాలుగా కల్గి వున్నాడు.

## పురాణ సంఖ్య

పురాణాలు మొత్తం పదునెనిమిది. వీటిని ఆయా పురాణాల పేర్లలో మొదటి అక్షరాన్ని మాత్రం పేర్కొనే ఒక శ్లోకంలో ఇలా చెప్పడమయింది.

**మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్ ।**
**అనాపలింగ కూస్కాని పురాణాని విదుర్బుధాః ॥**

'మ' అనే అక్షరంతో ప్రారంభమయ్యే పురాణాలు రెండు-(1) మత్స్య పురాణం (2) మార్కండేయ పురాణం. 'భ' అను అక్షరంతో ప్రారంభమయ్యేవి, రెండు -(1) భాగవతం (2) భవిష్యపురాణం -'బ్ర'తో ప్రారంభమయ్యేవి -మూడు (1) బ్రహ్మ పురాణం (2) బ్రహ్మాండ పురాణం (3) బ్రహ్మవైవర్త పురాణం -'వ' కారంతో ప్రారంభమయ్యేవి నాల్గు (1) విష్ణు పురాణం (2) వాయు పురాణం (3) వామన పురాణం (4) వరాహ పురాణం -అ=అగ్నిపురాణం నా=నారదపురాణం-ప=పద్మపురాణం, లిం=లింగపురాణం, గ=గరుడ పురాణం, కూ=కూర్మపురాణం, స్కా=స్కాందపురాణం ఇలా మొత్తం పురాణాల సంఖ్య పదునెన్మిది.

## పురాణ విభాగం

పురాణాలను మహాపురాణాలనీ, ఉప పురాణాలనీ రెండు విధాలుగా విభజించడం కద్దు. పైన ప్రథమాక్షర నిర్దేశంతో పేర్కొన్నవన్నీ మహాపురాణాలే. ఈ క్రింది విధంగా కూడా ఈ పురాణాలను పెద్దలు నిర్దేశించారు.

**బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవ చ ।**
**భాగవతం నారదీయం మార్కండేయం చ కీర్తితమ్ ॥**
**ఆగ్నేయం చ భవిష్యం చ బ్రహ్మవైవర్త లింగకే ।**

**వారాహం చ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

ఈ పదునెన్మిది పురాణాలనూ పద్మపురాణం సాత్త్వికాలు, రాజసాలు, తామసాలు అని మూడు వర్గాలుగా విభజించింది.

**సాత్త్వికాలు–**

**వైష్ణవం నారదీయం చ తథా భాగవతం శుభమ్ ।**
**గారుడం చ తథా పాద్మం వారాహం శుభదర్శనే ॥**

**రాజసాలు–**

**బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం మార్కండేయం తథైవ చ ।**
**భవిష్యం వామనం బ్రాహ్మం రాజసాని నిబోధత ॥**

**తామసాలు–**

**మాత్స్యం కౌర్మం తథా లైంగం శైవం స్కాందం తథైవ చ ।**
**ఆగ్నేయం చ షడేతాని తామసాని నిబోధత ॥**

ఇందులో (1) వైష్ణవం (2) నారదీయం (3) భాగవతం (4) గారుడం (5) వారాహం (6) పాద్మం –అనునవి సాత్త్వికపురాణాలు. (1) బ్రహ్మాండం (2) బ్రహ్మవైవర్తం (3) మార్కండేయం, (4) భవిష్యం (5) వామనం (6) బ్రాహ్మం–అనేవి రాజసాలు. (1) మాత్స్యం (2) కౌర్మం (3) లైంగం (4) వాయవీయం (శైవం) (5) స్కాందం (6) అగ్నేయం అనేవి తామసాలు.

ఇలా ఒక్కొక్క వర్గంలో ఆరేసి పురాణాలు లెక్కకు వస్తాయి.

సాత్త్వికపురాణాలు శ్రీమహావిష్ణువు యొక్క ప్రాధాన్యాన్నీ, రాజస పురాణాలు చతుర్ముఖ బ్రహ్మ ప్రాముఖ్యాన్నీ, తామస పురాణాలు శివునియొక్క ఆధిక్యాన్నీ వర్ణిస్తున్నాయి. ఈ ముగ్గురు దేవతలు త్రిమూర్తులుగా ప్రసిద్ధులు.

అన్ని పురాణాలూ ఈ దేవత లందరికీ సమప్రాధాన్యాన్ని ప్రతిపాదించక కొన్ని పురాణాలు ఒక దేవతను ఇతరదేవతల కంటే అధికుడని చెప్పడం యుక్తమా? అనే సంశయం కలుగవచ్చు.

వేదం **'ఏకం సత్ విప్రా బహుధా వదంతి'** అని చెప్పింది. అంటే సద్రూపుడైన పరమాత్మ ఒక్కడే, తత్త్వజ్ఞులు ఆయనను నానానామరూపాలతో వర్ణిస్తారని భావం. పరబ్రహ్మానికి మూర్తమని, అమూర్తమని రెండు రూపాలు కలవనీ; అందులో మూర్తం క్షరం–అంటే నశించే స్వభావం కలిగినదనీ, అమూర్తం నాశం లేనిదనీ గ్రహించాలి. క్షరాక్షరాలు సకలభూతాలలోనూ సమంగా ఉన్నాయి. అక్షరం పరబ్రహ్మం కాగా, ఈ చరాచరజగత్తు క్షరం అవుతున్నది. ఈ విషయాన్ని విష్ణుపురాణం ఇలా వివరించింది.–

**ద్వే రూపే బ్రహ్మణస్తస్య మూర్తం చామూర్తమేవ చ ।**
**క్షరాక్షరస్వరూపే తే సర్వభూతేష్వవస్థితే ।**
**అక్షరం తత్ పరం బ్రహ్మ క్షరం సర్వమిదం జగత్ ॥**

దీనినిబట్టి పురాణాలలో వర్ణింపబడిన త్రిమూర్తులలో ఒకరు పెద్ద, మరొకరు చిన్న అనే తేడాలు లేవు. ఒకే తత్త్వం మూడు రూపాలతో విరాజిల్లుతున్నది. ఆ దేవతలు నిర్వహించే క్రియలలోని భేదమే వారిని మూడురూపాలతో నిర్దేశించడానికి హేతువైనది. ఈ సంగతినే విష్ణుపురాణం ఈ విధంగా వివరించింది.

**సృష్టిస్థిత్యంతకరణాత్ బ్రహ్మవిష్ణుశివాత్మికామ్ ।**
**స సంజ్ఞాం యాతి భగవాన్ ఏక ఏవ జనార్దనః ॥**

ఒక జనార్దనుడే సృష్టి, స్థితి, లయం - అనే మూడు కార్యాలు నిర్వహించడంవల్ల బ్రహ్మ, విష్ణువు, శివుడు అన్న మూడు సంజ్ఞలు పొందాడని భావం.

ఈ సత్యాన్ని గ్రహిస్తే ఆయా దేవతల పట్ల వైషమ్యం తొలగి సమత్వం నెలకొంటుంది. అందువల్ల త్రిమూర్తుల ప్రభావాలను సమయానుగుణంగా వర్ణించే పురాణాల పట్ల సమన్వయదృష్టినే కలిగివుండాలి.

మహాపురాణాల లాగానే ఉపపురాణాలు గూడా పదునెన్మిది ఉన్నాయని కూర్మ పురాణం పేర్కొంటున్నది.

**ఆద్యం సనత్కుమారోక్తం నారసింహం తథాఽపరమ్ ।**
**తృతీయం స్కంద ముద్దిష్టం కుమారేణ తు భాషితమ్ ॥**
**చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశ భాషితమ్ ।**
**దుర్వాససోక్తమాశ్చర్యం నారదోక్తమతఃపరమ్ ॥**
**కపిలం వామనం చైవ తథోశనససేవితమ్ ।**
**బ్రహ్మాండం వారుణం చాథ కాలికాహ్వయమేవ చ ॥**
**మాహేశ్వరం తథా సాంబం సౌరం సర్వార్థ సంచయమ్ ।**
**పరాశరోక్త మపరే మారీచం భాస్కరాహ్వయమ్ ॥**

ఉపపురాణాలు-(1) సనత్కుమారోక్తం (2) నారసింహం (3) స్కాందం (4) శివధర్మం (5) దౌర్వాసం (6) నారదోక్తం (7) కాపిలం (8) వామనం (మానవం) (9) ఉశనసఃప్రోక్తం (10) బ్రహ్మాండం (11) వారుణం (12) కాలికా పురాణం (13) మాహేశ్వరం (14) సాంబం (15) సౌరం (16) పరాశరోక్తం (17) మారీచం (18) భాస్కరం (భార్గవం).

కొందరి మతంప్రకారం ఉపపురాణాల సంఖ్య ముప్పదినాల్గుగా నిర్దిష్టమయింది. వీటికి తోడుగా ఔపపురాణాలు అన్న పేరుతో మరొక పదునెన్మిది పురాణాలను గూడ నిర్దేశించడం కద్దు.

నీవు బ్రహ్మదేవుని యజ్ఞముతో అవబృథస్నానమునాడు పురాణసంహితను ప్రబోధించుటకు పురుషోత్తముడైన నారాయణాంశతో జన్మించావు.

**తస్మాద్భవన్తం పృచ్ఛామః పురాణం కూర్మముత్తమమ్ ।**
**వక్తుమర్హసి చాస్మాకం పురాణార్థవిశారద ॥ 7 ॥**

అందువలన మేము నిన్ను ఉత్తమమైన కూర్మపురాణమును వినిపింపుమని కోరుచున్నాము. పురాణార్థాలను బాగా తెలిసినవాడా! నీవు మాకు వివరింపుము.

**మునీనాం వచనం శ్రుత్వా సూతః పౌరాణికోత్తమః ।**
**ప్రణమ్య మనసా ప్రాహ గురుం సత్యవతీసుతమ్ ॥ 8 ॥**

ఆ మునుల మాటలు విని పౌరాణికులలో శ్రేష్ఠుడైన రోమహర్షణుడు తన గురువైన వేదవ్యాసునికి మనసా నమస్కరించి ఇట్లు పలికినాడు.

**రోమహర్షణ ఉవాచ :–** రోమహర్షణుడు పలికాడు.

**నమస్కృత్య జగద్యోనిం కూర్మరూపధరం హరిమ్ ।**
**వక్ష్యే పౌరాణికీం దివ్యాం కథాం పాపప్రణాశినీమ్ ॥ 9 ॥**

జగత్తుకు కారణభూతుడు, కూర్మరూపధారి అయిన శ్రీ విష్ణువునకు నమస్కరించి, పాపాలను నశింపచేసే దివ్యమైన పురాణకథను చెబుతాను.

**యాం శ్రుత్వా పాపకర్మాపి గచ్ఛేత పరమాం గతిమ్ ।**
**న నాస్తికే కథాం పుణ్యామిమాం బ్రూయాత్కదాచన ॥ 10 ॥**

ఈ కథను విన్న పాపకర్ముడు కూడ ఉత్తమ లోకాలకు వెడతాడు. ఈ పుణ్యకథను నాస్తికునికి ఎన్నడూ చెప్పరాదు.

**శ్రద్దధానాయ శాన్తాయ ధార్మికాయ ద్విజాతయే ।**
**ఇమాం కథామనుబ్రూయాత్సాక్షాన్నారయణేరితామ్ ॥ 11 ॥**

శ్రద్ధ, శాంతము, ధర్మము గల ద్విజునికే సాక్షాన్నారాయణ ప్రోక్తమైన ఈ కథను చెప్పాలి.

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ ।**
**వంశానుచరితం చైవ పురాణం పఞ్చలక్షణమ్ ॥ 12 ॥**

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరాలు, వంశముల చరిత్ర అనే అయిదు లక్షణాలు పురాణమునకుంటాయి.

**బ్రాహ్మం పురాణం ప్రథమం పాద్మం వైష్ణవమేవ చ ।**
**శైవం భాగవతం చైవ భవిష్యం నారదీయకమ్ ॥ 13 ॥**

**మార్కండేయ మథాగ్నేయం బ్రహ్మవైవర్తమేవ చ ।**
**లైఙ్గం తథా చ వారాహం స్కాన్దం వామనమేవ చ ॥ 14 ॥**
**కౌర్మం మాత్స్యం గారుడం చ వాయవీయమనన్తరమ్ ।**
**అష్టాదశం సముద్దిష్టం బ్రహ్మాణ్డమితి సంజ్ఞితమ్ ॥ 15 ॥**

బ్రాహ్మము, పాద్మము, విష్ణుపురాణము, (శైవము,) భాగవతము, భవిష్యము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, బ్రహ్మవైవర్తము, లింగపురాణము, వారాహము, స్కాన్దము, వామనము, కూర్మము, మాత్స్యము, గారుడము, వాయవ్యము, బ్రహ్మాండపురాణమని పురాణములు పదునెనిమిదిగా చెప్పబడ్డాయి.

**అన్యాన్యుపపురాణాని మునిభిః కథితాని తు ।**
**అష్టాదశపురాణాని శ్రుత్వా సంక్షేపతో ద్విజాః! ॥ 16 ॥**

ఓ ద్విజోత్తములారా! అష్టాదశపురాణాలు కాకుండా, వానిని విని మునులు సంగ్రహంగా చెప్పిన ఉపపురాణములు కొన్ని కలవు.

**ఆద్యం సనత్కుమారోక్తం నారసింహమతః పరమ్ ।**
**తృతీయం స్కాన్దముద్దిష్టం కుమారేణ తు భాషితమ్ ॥ 17 ॥**
**చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నన్దీశభాషితమ్ ।**
**దుర్వాససోక్తమాశ్చర్యం నారదీయమతః పరమ్ ॥ 18 ॥**
**కాపిలం వామనం చైవ తథైవోశనసేరితమ్ ।**
**బ్రహ్మాణ్డం వారుణం చైవ కాలికాహ్వయమేవ చ ॥ 19 ॥**
**మాహేశ్వరం తథా సామ్బం సౌరం సర్వార్థసఞ్చయమ్ ।**
**పరాశరోక్తం మారీచం తథైవ భార్గవాహ్వయమ్ ॥ 20 ॥**

ఆ ఉపపురాణాలు క్రమంగా సనత్కుమారీయము, నారసింహము, కుమారస్వామి చెప్పిన స్కాందము, నన్దీశ్వరుడు చెప్పినది శివధర్మము, దుర్వాసముని చెప్పిన ఆశ్చర్యము, నారదీయము,కాపిలము, వామనము, శుక్రాచార్యుడు చెప్పిన బ్రహ్మాణ్డపురాణము, వారుణము, కాలికము, మాహేశ్వరము, సామ్బము, సర్వవిషయ సముచ్చయ రూపమైన సౌరము, పరాశరముని చెప్పిన మారీచము, భార్గవ పురాణము.

**ఇదన్తు పఞ్చదశకం పురాణం కౌర్మముత్తమమ్ ।**
**చతుర్ధా సంస్థితం పుణ్యం సంహితానాం ప్రభేదతః ॥ 21 ॥**

ఈ కూర్మపురాణము పదునైదవది. ఉత్తమము, పుణ్యప్రదము. సంహితల భేదాలను బట్టి ఇది నాలుగు భాగాలుగా ఉన్నది.

**బ్రాహ్మీ భాగవతీ సౌరీ వైష్ణవీ చ ప్రకీర్తితాః ।**
**చతస్రః సంహితాః పుణ్యాః ధర్మకామార్థమోక్షగాః ॥ 22 ॥**

**ఇయం తు సంహితా బ్రాహ్మీ చతుర్వేదైస్తు సమ్మితా ।
భవన్తి షట్సహస్రాణి శ్లోకానామత్ర సంఖ్యయా ॥ 23 ॥**

**యత్ర ధర్మార్థకామానాం మోక్షస్య చ మునీశ్వరాః ।
మాహాత్మ్యమఖిలం బ్రహ్మ జ్ఞాయతే పరమేశ్వరః ॥ 24 ॥**

బ్రాహ్మి, భాగవతి, సౌరి, వైష్ణవి అని కూర్మపురాణములోని నాల్గు సంహితలు పుణ్యములు, ధర్మార్థకామ మోక్షాలను ప్రసాదించేవి. ఈ బ్రాహ్మీసంహిత నాలుగు వేదాలకు సదృశమైనది. ఆరు వేల శ్లోక సంఖ్య కలది. దీనిలో ధర్మ–అర్థ–కామ–మోక్షాలనే పురుషార్థాల గొప్పతనము, బ్రహ్మతత్త్వము, పరమేశ్వరస్వరూపము తెలియబడును.

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణి చ ।
వంశానుచరితం దివ్యా పుణ్యా ప్రాసంగికీ కథా ॥ 25 ॥**

**బ్రాహ్మణాద్యైరియం ధార్యా ధార్మికైర్వేదపారగైః ।
తామహం వర్ణయిష్యామి వ్యాసేన కథితాం పురా ॥ 26 ॥**

ఇందులో సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వన్తరములు, వంశానుచరితమనే వానితో కూడ పుణ్యకరమైనది, దివ్యమైన ప్రాసంగిక కథ కూడ కలదు. ఈ సంహిత వేదాధ్యయనం చేసిన బ్రాహ్మణాదులు ధరించదగినది. పూర్వము వ్యాసభగవానుడు చెప్పిన ఆ కథను మీకు వివరంచగలను.

**పురాఽమృతార్థం దైతేయదానవైఃస్సహ దేవతాః ।
మన్థానం మన్దరం కృత్వా మమన్థుః క్షీరసాగరమ్ ॥ 27 ॥**

పూర్వము అమృతము కొరకు దితికుమారులు, దనుపుత్రులతో కూడ కలిసి దేవతలు మందర పర్వతమును కవ్వముగా చేసి క్షీరసముద్రమును చిలికినారు.

**మథ్యమానే తదా తస్మిన్కూర్మరూపీ జనార్దనః ।
బభార మన్దరం దేవో దేవానాం హితకామ్యయా ॥ 28 ॥**

సముద్ర మథనం జరుగునపుడు విష్ణుమూర్తి దేవతల మేలుకోరి కూర్మరూపమును తాల్చి మందర పర్వతమును ధరించినాడు.

**దేవాశ్చ తుష్టువుర్దేవం నారదాద్యా మహర్షయః ।
కూర్మరూపధరం దృష్ట్వా సాక్షిణం విష్ణుమవ్యయమ్ ॥ 29 ॥**

దేవతలు, నారదాది ఋషులు కూర్మరూపాన్ని ధరించిన లోకసాక్షి, నాశరహితుడు అయిన శ్రీ మహావిష్ణువును ప్రస్తుతించినారు.

**తదన్తరేఽభవద్దేవీ శ్రీర్నారాయణవల్లభా ।
జగ్రాహ భగవాన్విష్ణుస్తామేవ పురుషోత్తమః ॥ 30 ॥**

ఆ సాగరమథనసమయములో సముద్రమునుండి నారాయణునికి వల్లభ అయిన లక్ష్మీదేవి ప్రాదుర్భవించినది. ఆమెను పురుషోత్తముడైన విష్ణువు స్వీకరించినాడు.

**తేజసా విష్ణుమవ్యక్తం నారదాద్యా మహర్షయః ।**
**మోహితాః సహ శక్రేణ శ్రేయోవచనమబ్రువన్ ॥ 31 ॥**

తేజస్సుతో స్పష్టంగా తెలియరాని విష్ణువును చూచి నారదాది మహర్షులు, ఇంద్రుడు మొదలైన వారు కూడ మోహాన్ని చెంది కొన్ని మంచి మాటలు పలికినారు.

**భగవన్ దేవదేవేశ నారాయణ జగన్మయ ।**
**కైషా దేవీ విశాలాక్షీ యథావద్బ్రూహి పృచ్ఛతామ్ ॥ 32 ॥**

దేవతలకధినాయకుడా! భగవన్నారాయణా! సర్వలోక స్వరూపా! విశాలనేత్ర ఈమె ఎవరు? తెలుసుకోవాలనుకొనే మాకు యథార్థమును తెలుపుము.

**శ్రుత్వా తేషాం తదా వాక్యం విష్ణుర్దానవమర్దనః ।**
**ప్రోవాచ దేవీం సంప్రేక్ష్య నారదాదీనకల్మషాన్ ॥ 33 ॥**

వారి మాటలు విని, దానవమర్దనుడైన విష్ణువు ఒకసారి లక్ష్మీదేవిని చూచి, అకల్మషులైన నారదాదులను గూర్చి ఈ విధముగా చెప్పాడు.

**ఇయం సా పరమా శక్తిర్మన్మయీ బ్రహ్మరూపిణీ ।**
**మాయా మమ ప్రియాఽనన్తా యయేదం ధార్యతే జగత్ ॥34॥**

ఈమె గొప్ప శక్తి స్వరూపిణి. నాకభిన్నమైనది. పరబ్రహ్మస్వరూపిణి. మాయారూప. అంతము లేనిది. నాకు ప్రీతిపాత్రురాలు. ఈ లోకము నీమెయే ధరించుచున్నది.

**అనయైవ జగత్సర్వం సదేవాసురమానుషమ్ ।**
**మోహయామి ద్విజశ్రేష్ఠా గ్రసామి విసృజామి చ ॥35॥**

ఓ బ్రాహ్మణోత్తములారా! ఈమె సహాయముతోనే దేవ- దానవ-మానవులు గల సమస్త ప్రపంచమును మోహింప చేయుచున్నాను. నాలో లీనము చేసుకొని మళ్ళీ సృజిస్తున్నాను.

**ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానామాగతిం గతిమ్ ।**
**విద్యయా వీక్ష్య చాత్మానం తరన్తి విపులామిమామ్ ॥ 36 ॥**

లోకముల సృష్టి-వినాశము-ప్రాణుల జనన మరణాలను ఆత్మ స్వరూపాన్ని కూడ జ్ఞానముతో తెలుసుకొని పెద్దదయిన ఈ మాయను దాటగలరు.

**అస్యాస్త్వంశానధిష్ఠాయ శక్తిమన్తోఽభవన్ సురాః ।**
**బ్రహ్మేశానాదయస్సర్వే సర్వశక్తిరియం మమ ॥ 37 ॥**

ఈమె అంశాలను స్వీకరించినందువల్లనే బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలు శక్తిమంతులయినారు. ఈమె నా సకలశక్తిస్వరూపిణి.

**సైషా సర్వజగత్సూతిః ప్రకృతిస్త్రిగుణాత్మికా ।**
**ప్రాగేవ మత్తః సంజాతా శ్రీః కల్పే పద్మవాసినీ ॥ 38 ॥**

ఈమె సమస్తలోకాలకు కారణభూతురాలు. సత్త్వ-రజ, స్తమోరూప గుణత్రయస్వరూపిణి. ప్రకృతిరూప, కమలవాసిని అయిన ఈమె నాకంటె ముందు కల్పములోనే ప్రభవించినది.

**చతుర్భుజా శంఖచక్రపద్మహస్తా స్రగన్వితా ।**
**కోటిసూర్యప్రతీకాశా మోహినీ సర్వదేహినామ్ ॥ 39 ॥**

ఈమె నాల్గుభుజాలు కల్గి శంఖము- చక్రము-పద్మములను చేతులలో ధరించినది. పుష్పహారము కలది. కోటిసూర్యుల తేజస్సుతో సమానమైన కాంతి కలది. ప్రాణులందరిని మోహింప చేసే శక్తి కలది.

**నాలం దేవా న పితరో మానవా వాసవోఽపి చ ।**
**మాయామేతాం సముత్తర్తుం యే చాన్యే భువి దేహినః ॥ 40 ॥**

ఈమె మాయనతిక్రమించుటకు దేవతలు కాని, మనుష్యులు కాని, చివరకింద్రుడుకాని సమర్థులు కారు. భూలోకములోని శరీరధారులు మరెవరు కాని లక్ష్మి మాయను దాటి పోజాలరు.

**ఇత్యుక్తా వాసుదేవేన మునయో విష్ణుమబ్రువన్ ।**
**బ్రూహి త్వం పుండరీకాక్ష! యద్ధి కాలక్షయేఽపి చ ॥ 41 ॥**

ఈ విధముగా విష్ణువు చెప్పగా మునులాయనతో ఇట్లన్నారు. "పద్మనేత్రుడవైన నారాయణా! మాకు కాలాంతరములో జరిగిన సంఘటనలను గూర్చి తెలుపుము".

**అథోవాచ హృషీకేశో మునీన్మునిగణార్చితః ।**
**అస్తి ద్విజాతిప్రవర ఇంద్రద్యుమ్న ఇతి శ్రుతః ॥ 42 ॥**

అపుడు మునిసేవితుడగు విష్ణువు మునులతో ఇట్లన్నాడు. ఇంద్రద్యుమ్నుడనే ప్రసిద్ధుడైన బ్రాహ్మణశ్రేష్ఠుడొకడుండేవాడు.

**పూర్వజన్మని రాజాఽసావధృష్యః శంకరాదిభిః ।**
**దృష్ట్వా మాం కూర్మసంస్థానం శ్రుత్వా పౌరాణికీం స్వయమ్ ॥ 43 ॥**

**సంహితాం మన్ముఖాద్దివ్యాం పురస్కృత్య మునీశ్వరాన్ ।**
**బ్రహ్మాణం చ మహాదేవం దేవాంశ్చాన్యాన్ స్వశక్తిభిః ॥ 44 ॥**

**మచ్ఛక్తౌ సంస్థితాన్ బుద్ధ్వా మామేవ శరణం గతః ।**
**సంభాషితో మయా చార్థం విప్రయోనిం గమిష్యసి ॥ 45 ॥**

గత జన్మలో అతడు రాజుగా ఉండి శంకరాదులకు కూడ నిగ్రహింపరానివాడై కూర్మరూపములోనున్న నన్ను చూచి, నా వల్ల పురాణాలకు సంబంధించిన గాథను, దివ్యమైన సంహితను మునిశ్రేష్ఠులతో కలిసి విని, సృష్టి కర్త బ్రహ్మను, రుద్రుణ్ణి, ఇతర దేవతలను కూడ తమతమ అధికారాలతో కూడ నా శక్తికి అధీనులై ఉండుటను గుర్తించి నన్నే శరణుపొందెను. అప్పుడే నేనతనితో మాట్లాడి విప్రకులములో జన్మింపగలవని చెప్పితిని.

**ఇంద్రద్యుమ్న ఇతి ఖ్యాతో జాతిం స్మరసి పౌర్వికీమ్ ।**
**సర్వేషామేవ భూతానాం దేవానామప్యగోచరమ్ ॥ 46 ॥**

**వక్తవ్యం యద్గుహ్యతమం దాస్యే జ్ఞానం తవానఘ ।**
**లబ్ధ్వా తన్మామకం జ్ఞానం మామేవాన్తే ప్రవేక్ష్యసి ॥ 47 ॥**

ఇంద్రద్యుమ్నుడనే పేర ప్రసిద్ధుడవై, పూర్వజన్మస్మృతి కలిగి ఉంటావు. సర్వప్రాణులకు, దేవతలకు కూడ తెలియరానిది, చెప్పదగిన మిగుల రహస్యమైన జ్ఞానాన్ని నీకివ్వగలను. ఓ పుణ్యాత్ముడా! నా వల్ల ఆ జ్ఞానాన్ని పొంది చివరకు నాలో అంతర్లీనమవుతావు.

**అంశాంతరేణ భూమ్యాం త్వం తత్ర తిష్ఠ సునిర్వృతః ।**
**వైవస్వతేఽన్తరేఽతీతే కార్యార్థం మాం ప్రవేక్ష్యసి ॥ 48 ॥**

ఇతరాంశతో నీవు భూమిపై నిశ్చింతగా నివసించు. వైవస్వతమన్వన్తరం గడువగానే నీవు మళ్ళీ ప్రయోజనార్థం నన్ను చేరుకోగలవు.

**మాం ప్రణమ్య పురీం గత్వా పాలయామాస మేదినీమ్ ।**
**కాలధర్మం గతః కాలాచ్ఛ్వేతద్వీపే మయా సహ ॥ 49 ॥**

**భుక్త్వా తాన్వైష్ణవాన్భోగాన్  యోగినామప్యగోచరాన్ ।**
**మదాజ్ఞయా మునిశ్రేష్ఠాః జజ్ఞే విప్రకులే పునః ॥ 50 ॥**

ఇలా చెప్పగా నాకు నమస్కరించి నగరానికి వెళ్లి రాజ్యాన్ని పాలించాడు, కొంత కాలానికి శరీరాన్ని విడిచి శ్వేతద్వీపంలో ఉన్న నా దగ్గరకు వచ్చి నాతో కూడి నివసించి యోగులు కూడ పొందలేని విష్ణులోక భోగాలనుభవించి, ఓ మునివరులారా! నా ఆజ్ఞతో మళ్ళీ బ్రాహ్మణకులంలో జన్మించాడు.

**జ్ఞాత్వా మాం వాసుదేవాఖ్యం యత్ర ద్వే నిహితేఽక్షరే ।**
**విద్యావిద్యే గూఢరూపం యద్బ్రహ్మ పరమం విదుః ॥ 51 ॥**

**సోఽర్చయామాస భూతానామాశ్రయం పరమేశ్వరమ్ ।**
**వ్రతోపవాసనియమైర్హోమబ్రాహ్మణతర్పణైః ॥ 52 ॥**

వాసుదేవనామంకల నన్నుతెలుసుకొని, గూఢంగాఉన్నవి, నాశరహితాలైన విద్య, అవిద్య అనే రెండిటిని పరబ్రహ్మస్వరుపంగా తెలిసికోదగిన నాతత్త్వాన్ని తెలుసుకొని ఆ ఇంద్రద్యుమ్నుడు ప్రాణులకాధారభూతుడైన పరమేశ్వరుణ్ణి వ్రతాలు, ఉపవాసాది నియమాలతో, హెూమాలు బ్రాహ్మణసమారాధనలతో పూజించాడు.

**తదాశీస్తన్నమస్కారస్తన్నిష్ఠస్తత్పరాయణః ।**
**ఆరాధయన్ మహాదేవం యోగినాం హృది సంస్థితమ్ ॥ 53 ॥**

**తస్యైవం వర్తమానస్య కదాచిత్పరమా కలా ।**
**స్వరూపం దర్శయామాస దివ్యం విష్ణుసముద్భవమ్ ॥ 54 ॥**

ఆ పరమేశ్వరుని ఆశీస్సులతో, అతనికి నమస్కరిస్తూ, అతనియందే నిష్ఠమరియు తత్పరతగలవాడై, యోగుల హృదయమందే నివసించుచున్న ఆ పరమేశ్వరుని ఆరాధిస్తూ ఇంద్రద్యుమ్నుడు ఉన్నాడు. ఈ విధంగా ఉండగా ఒకనాడు శ్రేష్ఠమైన దివ్యకళ విష్ణుసంబంధమైన తన స్వరూపాన్ని ఆ ఇంద్రద్యుమ్నునికి దర్శింపచేసినది.

**దృష్ట్వా ప్రణమ్య శిరసా విష్ణోర్భగవతః ప్రియామ్ ।**
**సంస్తూయ వివిధైః స్తోత్రైః కృతాంజలిరభాషత ॥ 55 ॥**

భగవంతుడైన విష్ణువుకు ప్రియమైన ఆ కళారూపాన్ని చూచి, శిరసువంచి నమస్కరించి, వివిధాలైన స్తోత్రాలతో స్తుతించి, చేతులు జోడించి అతడు ఈ విధంగా పలికాడు.

**ఇంద్రద్యుమ్న ఉవాచ :** ఇంద్రద్యుమ్నుడు పలికాడు.

**కా త్వం దేవి విశాలాక్షి విష్ణుచిహ్నాంకితే శుభే ।**
**యాథాతథ్యేన వై భావం తవేదానీం బ్రవీహి మే ॥ 56 ॥**

వైష్ణవచిహ్నాలు కల్గి, శుభకరాలైన విశాలనేత్రాలు గల ఓ దేవి! నీ వెవరవు? నీ యథార్థ స్వరూపాన్ని ఉన్నదున్నట్టు ఇపుడు నాకు తెలుపు.

**తస్య తద్వాక్యమాకర్ణ్య సుప్రసన్నా సుమంగలా ।**
**హసన్తీ సంస్మరన్విష్ణుం ప్రియం బ్రాహ్మణమబ్రవీత్ ॥ 57 ॥**

ఇంద్రద్యుమ్నుని మాట విని మిక్కిలి ప్రసన్నురాలు, శుభకరురాలైన ఆ దేవి విష్ణువును స్మరించి ప్రియమైన ఆ బ్రాహ్మణుని గూర్చి నవ్వుచు పలికినది.

**శ్రీః ఉవాచ :** లక్ష్మీదేవి పలికింది.

**న మాం పశ్యన్తి మునయో దేవాః శక్రపురోగమాః ।**
**నారాయణాత్మికామేకాం మాయాఽహం తన్మయీ పరా ॥ 58 ॥**

నన్ను మునులు, ఇంద్రుడు మొదలైన దేవతలు చూడలేరు. నేను నారాయణ స్వరూపంగల నారాయణిని. ఆ నారాయణరూపమైన శ్రేష్ఠమైన మాయను నేను.

**న మే నారాయణాద్భేదో విద్యతే హి విచారతః ।**
**తన్మయ్యహం పరం బ్రహ్మ స విష్ణుః పరమేశ్వరః ॥ 59 ॥**

విచారించగా నాకు నారాయణునకు భేదం లేదు. నేనాతని ప్రతిరూపాన్ని. ఆ విష్ణువు పరబ్రహ్మ, పరమేశ్వరుడు.

**యేఽర్చయన్తీహ భూతానామాశ్రయం పురుషోత్తమమ్ ।**
**జ్ఞానేన కర్మయోగేన న తేషాం ప్రభవామ్యహమ్ ॥ 60 ॥**

సమస్త భూతగణానికి ఆశ్రయభూతుడైన పరమేశ్వరుని జ్ఞానకర్మయోగాల ద్వారా ఆరాధించే వారి విషయంలో నా ప్రభావం పనిచేయదు.

**తస్మాదనాదినిధనం కర్మయోగపరాయణః ।**
**జ్ఞానేనారాధయానన్తం తతో మోక్షమవాప్స్యసి ॥ 61 ॥**

అందువల్ల ఆద్యంతాలు లేని విష్ణువును కర్మయోగపరాయణుడవై జ్ఞానయోగంతో ఆరాధించుము. దానితో మోక్షాన్ని పొందగలవు.

**ఇత్యుక్తః స మునిశ్రేష్ఠ ఇంద్రద్యుమ్నో మహామతిః ।**
**ప్రణమ్య శిరసా దేవీం ప్రాంజలిః పునరబ్రవీత్ ॥ 62 ॥**

ఈ విధంగా ఆ మునిశ్రేష్ఠునికి చెప్పగా మహాబుద్ధిమంతుడైన ఇంద్రద్యుమ్నుడు తలవంచి దేవికి నమస్కరించి మరల ఇట్లన్నాడు.

**కథం స భగవానీశః శాశ్వతో నిష్కలోఽచ్యుతః ।**
**జ్ఞాతుం హి శక్యతే దేవి! బ్రూహి మే పరమేశ్వరి! ॥ 63 ॥**

దేవి! పరమేశ్వరి! భగవానుడు, ప్రభువు, శాశ్వతుడు, కళంకరహితుడు అయిన అచ్యుతుడు ఏ విధంగా తెలియదగినవాడో. నాకు చెప్పుము.

**ఏవముక్తాఽథ విప్రేణ దేవీ కమలవాసినీ ।**
**సాక్షాన్నారాయణో జ్ఞానం దాస్యతీత్యాహ తం మునిమ్ ॥ 64 ॥**

ఈ విధంగా బ్రాహ్మణుడు చెప్పగా కమలవాసిని అయిన లక్ష్మి ఆ మునిని గూర్చి సాక్షాన్నారాయణుడే జ్ఞానాన్నివ్వగలడు అని పలికినది.

**ఉభాభ్యామథ హస్తాభ్యాం సంస్పృశ్య ప్రణతం మునిమ్ ।**
**స్మృత్వా పరాత్పరం విష్ణుం తత్రైవాన్తరధీయత ॥ 65 ॥**

పిదప రెండు హస్తాలతో ఆ నమస్కరించిన మునిని స్పృశించి, పరాత్పరుడైన విష్ణువును తలచి అక్కడే అంతర్ధానమైనది.

**సోఽపి నారాయణం ద్రష్టుం పరమేణ సమాధినా ।**
**ఆరాధయద్ధృషీకేశం ప్రణతార్తిప్రభఞ్జనమ్ ॥ 66 ॥**

ఆ ఇంద్రద్యుమ్నుడు నారాయణుని చూచుటకు గొప్పసమాధితో నమస్కరించిన వారి ఆర్తిని తొలగించుటలో ప్రభంజనునివంటి వాడైన హృషీకేశుని ఆరాధించాడు.

**తతో బహుతిథే కాలే గతే నారాయణః స్వయమ్ ।**
**ప్రాదురాసీన్మహాయోగీ పీతవాసా జగన్మయః ॥ 67 ॥**

ఆ తర్వాత చాలాకాలం గడువగా పీతాంబరుడు, జగన్మూర్తి, మహాయోగి అయిన భగవాన్ నారాయణుడు అతని ఎదుట స్వయంగా ప్రత్యక్షమైనాడు.

**దృష్ట్వా దేవం సమాయాన్తం విష్ణుమాత్మానమవ్యయమ్ ।**
**జానుభ్యామవనిం గత్వా తుష్టావ గరుడధ్వజమ్ ॥ 68 ॥**

అవినాశి, పరమాత్ముడైన విష్ణువు ప్రత్యక్షం కాగా చూచి మోకాళ్ళపై ఉండి నమస్కరించి గరుడధ్వజుని స్తోత్రం చేసినాడు.

**ఇంద్రద్యుమ్న ఉవాచ :** ఇంద్రద్యుమ్నుడు పలికాడు.

**యజ్ఞేశాచ్యుత గోవింద మాధవానన్త కేశవ ।**
**కృష్ణ విష్ణో హృషీకేశ తుభ్యం విశ్వాత్మనే నమః ॥ 69 ॥**

ఓ యజ్ఞాలకు ప్రభువైన వాడా! అచ్యుతా, గోవిందా, మాధవా, అనంతా, కేశవా, కృష్ణా, విష్ణూ, హృషీకేశా విశ్వాత్మవైన నీకు నమస్కారం.

**నమోఽస్తు తే పురాణాయ హరయే విశ్వమూర్తయే ।**
**సర్గస్థితివినాశానాం హేతవేఽనన్తశక్తయే ॥ 70 ॥**

పురాణపురుషా, విశ్వమూర్తీ, ఓ హరీ! నీవు సృష్టి స్థితి వినాశాలకు కారణమైన వాడవు. అనంతమైన శక్తి సంపన్నుడవు. అట్టి నీకు నమస్కారం.

**నిర్గుణాయ నమస్తుభ్యం నిష్కలాయ నమో నమః ।**
**పురుషాయ నమస్తేఽస్తు విశ్వరూపాయ తే నమః ॥ 71 ॥**

నీవు నిర్గుణ స్వరూపుడవు. నిష్కలుడవైన నీకు నమస్కారం. విశ్వరూపుడవైన ఓ పురుషుడా! నీకు నమస్కారము.

**నమస్తే వాసుదేవాయ విష్ణవే విశ్వయోనయే ।**
**ఆదిమధ్యాన్తహీనాయ జ్ఞానగమ్యాయ తే నమః ॥ 72 ॥**

ప్రపంచానికి కారణభూతుడవైన విష్ణూ! వాసుదేవా! నీకు నమస్కారము. ఆది-మధ్య-అంతాలు లేనివాడవు, జ్ఞానంతో మాత్రమే తెలియదగినవాడవైన నీకు నమస్కారము.

**నమస్తే నిర్వికారాయ నిష్ప్రపఞ్చాయ తే నమః ।**
**భేదాభేదవిహీనాయ నమోఽస్త్వానన్దరూపిణే ॥ 73 ॥**

నిర్వికారుడవు, ప్రపంచరహితుడవైన నీకు నమస్కారము. భేద-అభేదాలు లేనివాడవు. ఆనందస్వరూపుడవైన నీకు నమస్కారము.

**నమస్తారాయ శాన్తాయ నమోఽప్రతిహతాత్మనే ।**
**అనన్తమూర్తయే తుభ్యమమూర్తాయ నమో నమః ॥ 74 ॥**

సంసారసముద్రాన్ని తరింపచేసేవాడవు. శాంత స్వరూపుడవు. ఎదిరించుటకు శక్యముకాని నీకు నమస్కారము. అనంతమూర్తివయికూడ అమూర్తుడవే. అట్టి నీకు నమస్కారము.

**నమస్తే పరమార్థాయ మాయాతీతాయ తే నమః ।**
**నమస్తే పరమేశాయ బ్రహ్మణే పరమాత్మనే ॥ 75 ॥**

నీవు పరమార్థ స్వరూపానివి. మాయకు అతీతుడవైన నీకు నమస్కారము. నీవు ఈశ్వరులకే ఈశ్వరుడవు. పరమాత్మ పరబ్రహ్మరూపివైన నీకు నమస్కారము.

**నమోఽస్తు తే సుసూక్ష్మాయ మహాదేవాయ తే నమః ।**
**నమః శివాయ శుద్ధాయ నమస్తే పరమేష్ఠినే ॥ 76 ॥**

అత్యంతసూక్ష్మ రూపుడవు. దేవతలకే దేవుడవైన మహాదేవుడవు నీకు నమస్కారము. శుద్ధ స్వరూపం గల శివుడవు. పరమేష్ఠి స్వరూపుడవైన నీకు నమస్కారము.

**త్వయైతత్సృష్టమఖిలం త్వమేవ పరమా గతిః ।**
**త్వం పితా సర్వభూతానాం త్వం మాతా పురుషోత్తమ ॥ 77 ॥**

నీవే ఈ సమస్తాన్ని సృష్టించావు. పరమగతివి నీవే. సమస్తప్రాణి కోటికి తండ్రివి. పురుషోత్తమా! నీవే తల్లివి.

**త్వమక్షరం పరంధామ చిన్మాత్రం వ్యోమ నిష్కలమ్ ।**
**సర్వస్యాధారమవ్యక్తమనన్తం తమసః పరమ్ ॥ 78 ॥**

నాశంలేని శ్రేష్ఠమైన పరమస్థానానివి నీవే. చిత్ స్వరూపుడవు. ఆకాశము, ఏ భేదమూ లేనివాడవు నీవే. అందరికీ ఆధారానివి. అవ్యక్తుడవు, అనంతుడవు. తమస్సుకతీతుడవై నిత్యప్రకాశస్వరూపము గలవాడవు.

**ప్రపశ్యన్తి పరాత్మానం జ్ఞానదీపేన కేవలమ్ ।**
**ప్రపద్యే భవతో రూపం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 79 ॥**

కేవలం జ్ఞానమనే దీపంతో పరమాత్ముడవైన నిన్ను చేరుకొని నీ ఆ రూపాన్ని శరణుపొందుతారు. అదే విష్ణువు యొక్క పరమపదము. దానిని నేను శరణు పొందుతున్నాను.

**ఏవం స్తువన్తం భగవాన్ భూతాత్మా భూతభావనః ।**
**ఉభాభ్యా మథ హస్తాభ్యాం పస్పర్శ ప్రహసన్నివ ॥ 80 ॥**

ఈ విధంగా స్తోత్రం చేస్తున్న ఇంద్రద్యుమ్నుణ్ణి సమస్త ప్రాణులకు ఆత్మరూపుడైన, భూతభావనుడైన విష్ణువు రెండు చేతులతో చిరునవ్వు నవ్వుతూ స్పృశించాడు.

**స్పృష్టమాత్రో భగవతా విష్ణునా మునిపుంగవః ।**
**యథావత్పరమం తత్త్వం జ్ఞాతవాంస్తత్ప్రసాదతః ॥ 81 ॥**

విష్ణుభగవానుడు స్పృశించుట తోడనే మునిశ్రేష్ఠుడైన ఇంద్రద్యుమ్నునికి భగవంతుని దయతో యథార్థమైన పరమ తత్త్వజ్ఞానం తెలియవచ్చినది.

**తతః ప్రహృష్టమనసా ప్రణిపత్య జనార్దనమ్ ।**
**ప్రోవాచోన్నిద్రపద్మాక్షం పీతవాససమచ్యుతమ్ ॥ 82 ॥**

ఆ తర్వాత సంతోషించిన మనసుతో జనార్దనునకు నమస్కరించి వికసించిన పద్మం వంటి నేత్రాలు గల పీతాంబరధారియగు అచ్యుతునితో ఇంద్రద్యుమ్నుడిట్లన్నాడు.

**త్వత్ప్రసాదాదసన్దిగ్ధముత్పన్నం పురుషోత్తమ ।**
**జ్ఞానం బ్రహ్మైకవిషయం పరమానన్దసిద్ధిదమ్ ॥ 83 ॥**

ఓ పురుషోత్తమా! నీ దయతో నాకు పరమానందసిద్ధినొసగే ప్రత్యేకమైన బ్రహ్మసంబంధమైన విషయంలో సందేహం లేకుండా జ్ఞానప్రాప్తి కలిగినది.

**నమో భగవతే తుభ్యం వాసుదేవాయ వేధసే ।**
**కిం కరిష్యామి యోగేశ! తన్మే వద జగన్మయ! ॥ 84 ॥**

భగవంతుడవు వాసుదేవుడవు వేధసుడవు అయిన నీకు నమస్కరించుచున్నాను. ఓ యోగేశుడా! జగన్మయా! నేనేమి చేయవలెనో తెలుపవలసినది.

**శ్రుత్వా నారాయణో వాక్యమిన్ద్రద్యుమ్నస్య మాధవః ।**
**ఉవాచ సస్మితం వాక్యమశేషం జగతో హితమ్ ॥ 85 ॥**

ఇంద్రద్యుమ్నుని వాక్యాన్ని మాధవుడైన నారాయణుడు విని చిరునవ్వుతో సమస్తమైన జగత్తునకు హితాన్ని కలిగించే వాక్యాన్ని పలికాడు.

**శ్రీభగవానువాచ :–** శ్రీభగవానుడిట్లు పలికాడు.

**వర్ణాశ్రమాచారవతాం పుంసాం దేవో మహేశ్వరః ।**
**జ్ఞానేన భక్తియోగేన పూజనీయో న చాన్యథా ॥ 86 ॥**

వర్ణాశ్రమాచారాలు గల వ్యక్తులు జ్ఞానంతోను, భక్తియోగంతోను దేవుడైన మహేశ్వరుని పూజించవలెను. వేరు సాధనాలతో కాదు.

**విజ్ఞాయ తత్పరం తత్త్వం విభూతిం కార్యకారణమ్ ।**
**ప్రవృత్తిఞ్చాపి మే జ్ఞాత్వా మోక్షార్థీశ్వరమర్చయేత్ ॥ 87 ॥**

మోక్షం కోరేవాడు చేయాల్సిన పని ఆ పరమతత్త్వము, విభూతి అట్లే కార్యకారణరూపాన్ని బాగా తెలుసుకొని, అట్లే నా ప్రవృత్తిని గుర్తించి ఈశ్వరుని ఉపాసించవలెను.

**సర్వసంగాన్పరిత్యజ్య జ్ఞాత్వా మాయామయం జగత్ ।**
**అద్వైతం భావయాత్మానం ద్రక్ష్యసే పరమేశ్వరమ్ ॥ 88 ॥**

అన్ని విధాలైన ఆసక్తులను పరిత్యజించి ఈ సంసారం మాయారూపమని తెలుసుకొని నీలోనే అద్వైత భావన పొందాలి. అట్లా చేసినపుడు ఓ ఇంద్రద్యుమ్నుడా! పరమేశ్వరుణ్ణి దర్శించగలవు.

**త్రివిధాం భావనాం బ్రహ్మన్ప్రోచ్యమానం విబోధ మే ।**
**ఏకా మద్విషయా తత్ర ద్వితీయా వ్యక్తసంశ్రయా ॥ 89 ॥**

ఓ ఇంద్రద్యుమ్నుడా! మూడు విధాలైన భావనలున్నవి. వానిని నీకు వివరిస్తాను విను. వానిలో మొదటిది నా సంబంధమైన సుగుణస్వరూపాలను భావించటం. రెండవది వ్యక్తసంశ్రయం. అనగా భగవంతుని విరాట్ స్వరూపాన్ని ఆశ్రయించి ఉపాసించటం.

**అన్యా చ భావనా బ్రాహ్మీ విజ్ఞేయా సా గుణాతిగా ।**
**ఆసామన్యతమాజ్ఞాథ భావనాం భావయేద్బుధః ॥ 90 ॥**

మూడవది బ్రహ్మజ్ఞాన విషయమైనది. గుణాతీతమైన బ్రహ్మను ఉపాసించటమే బ్రాహ్మీభావన. వీనిలో ఒకదాన్ని ఆశ్రయించి ఉపాసన చేయాలి. ఇది బుద్ధిమంతుడుపాసించే విధానం.

**అశక్తః సంశ్రయేదాద్యామిత్యేషా వైదికీ శ్రుతిః ।**
**తస్మాత్సర్వప్రయత్నేన తన్నిష్ఠస్తత్పరాయణః ॥**

**సమారాధయ విశ్వేశం తతో మోక్షమవాప్స్యసి ॥ 91 ॥**

అశక్తుడు మొదటి దానినాశ్రయించాలని వేదమతం. అందువల్ల ఓ ఇంద్రద్యుమ్నా! అన్ని ప్రయత్నాల ద్వారా జగత్స్వామి అయిన విష్ణువునారాధిస్తూ ఆతనియందే నిష్ఠ కలిగి, ఆయన ఆశ్రయాన్ని పొందాలి. అప్పుడే మోక్షాన్ని పొందగలవు.

**ఇంద్రద్యుమ్న ఉవాచ :** ఇంద్రద్యుమ్నుడు పలికాడు.

**కిన్తత్పరతరం తత్త్వం కా విభూతిర్జనార్దన ।**
**కిఙ్కార్యం కారణం కస్త్వం ప్రవృత్తిశ్చాపి కా తవ ॥ 92 ॥**

ఓ జనార్దనా! ఆ పరాత్పరుని తత్త్వమేమిటి? విభూతి ఏమిటి? కార్యము–కారణము ఏమిటి? నీవెవరవు, నీ ప్రవృత్తి ఏమిటి?

**శ్రీభగవానువాచ :** శ్రీభగవంతుడిలా పలికాడు.

**పరాత్పరతరం తత్త్వం పరంబ్రహ్మైకమవ్యయమ్ ॥ 93 ॥**

పరం కంటే పరతరమైన తత్త్వం అఖండమైన పరబ్రహ్మమొక్కటే.

**నిత్యానన్దమయం జ్యోతిరక్షరం తమసః పరమ్ ।**
**ఐశ్వర్యం తస్య యన్నిత్యం విభూతిరితి గీయతే ॥ 94 ॥**

అది నిత్యానందస్వరూపము, స్వయంప్రకాశం కలది. అవినాశి, అంధకారంకంటె ఎప్పుడు పరమైనదే. ఆ పరమాత్మ ఐశ్వర్యమే విభూతి అనే పేరు కలది.

**కార్యం జగదథావ్యక్తం కారణం శుద్ధమక్షరమ్ ।**
**అహం హి సర్వభూతానామన్తర్యామీశ్వరః పరః ॥ 95 ॥**

ఈ సంసారమే పరమాత్మ కార్యరూపం. అవినాశి విశుద్ధమైన అవ్యక్తతత్త్వమే కారణరూపం. నేనే ఈ సమస్త ప్రాణుల్లో ఉండే అంతర్యామి పరమేశ్వరుణ్ణి.

**సర్గస్థిత్యన్తకర్తృత్వం ప్రవృత్తిర్మమ గీయతే ।**
**ఏతద్విజ్ఞాయ భావేన యథావదఖిలం ద్విజ ॥**
**తతస్త్వం కర్మయోగేన శాశ్వతం సమ్యగర్చయ ॥ 96 ॥**

సృష్టి-స్థితి-సంహారాలే నా ప్రవృత్తిగా చెప్పబడినది. ఓ బ్రాహ్మణుడా! ఈ విషయాలన్నింటి యథార్థ రూపాన్ని తెలుసుకొని కర్మయోగం ద్వారా శ్రద్ధ కలవాడవై ఆ సనాతనుడైన ఈశ్వరుని బాగా అర్చించు.

**ఇంద్రద్యుమ్న ఉవాచ :** ఇంద్రద్యుమ్నుడు చెప్పాడు.

**కే తే వర్ణాశ్రమాచారా యైః సమారాధ్యతే పరః । 97 ॥**
పరమాత్మను ఆరాధించటానికి వర్ణాశ్రమాచారాలు ఏవి?

**జ్ఞానఞ్చ కీదృశం దివ్యం భావనాత్రయసంస్థితమ్ ।**
**కథం సృష్టమిదం పూర్వం కథం సంహ్రియతే పునః ॥ 98 ॥**

భావనాత్రయంతో కలిసి ఉన్న దివ్యజ్ఞానమెటువంటిది? ఈ సృష్టి ఏ విధంగా జరిగింది? మళ్ళీ ఎట్లా దీని సంహారం జరుగుతుంది?

**కియత్యః సృష్టయో లోకే వంశా మన్వన్తరాణి చ ।**
**కాని తేషాం ప్రమాణాని పావనాని వ్రతాని చ ॥ 99 ॥**

లోకంలో ఎన్ని సృష్టులు ఉన్నాయి? వంశాలెన్ని? మన్వంతరాలెన్ని? వాని ప్రమాణాలేవి? పవిత్రమైన వ్రతాలేవి?

**తీర్థాన్యర్కాదిసంస్థానం పృథివ్యాయామవిస్తరమ్ ।**
**కతి ద్వీపాః సముద్రాశ్చ పర్వతాశ్చ నదీనదాః ॥**
**బ్రూహి మే పుండరీకాక్ష యథావదధునా పునః । 100 ॥**

తీర్థాలెన్ని? సూర్యాది గ్రహాల స్థితి ఎటువంటిది? పృథివి పొడవు- వెడల్పు ఎంత? ద్వీపాలు, పర్వతాలు, నదీనదాలు ఎన్ని? ఓ పుండరీకాక్షా! ఉన్నదున్నట్టుగా సమస్తం నాకు తెలుపుము.

**శ్రీకూర్మ ఉవాచ :** శ్రీకూర్మస్వామి ఇట్లన్నాడు.

**ఏవముక్తో ఽథ తేనాహం భక్తానుగ్రహకామ్యయా । 101 ॥**

**యథావదఖిలం సమ్యగవోచం మునిపుంగవాః ।**
**వ్యాఖ్యాయాశేషమేవేదం యత్పృష్టోఽహం ద్విజేన తు ॥ 102 ॥**

ఈ విధంగా అతడు నాతో పలుకగా భక్తుని అనుగ్రహించాలనే కోరికతో ఓ ముని పుంగవులారా! ఆ బ్రాహ్మణుడు అడుగగా ఉన్నదున్నట్లు నేను విస్తరంగా అతనికి వివరించాను.

**అనుగృహ్యా చ తం విప్రం తత్రైవాన్తర్హితోఽభవమ్ ।**
**సోఽపి తేన విధానేన మదుక్తేన ద్విజోత్తమాః ॥ 103 ॥**

**ఆరాధయామాస పరం భావపూతః సమాహితః ।**
**త్యక్త్వా పుత్రాదిషు స్నేహం నిర్ద్వన్ద్వో నిష్పరిగ్రహః ॥ 104 ॥**

**సన్న్యస్య సర్వకర్మాణి పరం వైరాగ్యమాశ్రితః ।**
**ఆత్మన్యాత్మానమన్వీక్ష్య స్వాత్మన్యేవాఖిలం జగత్ ॥ 105 ॥**

**సంప్రాప్య భావనామన్త్యాం బ్రాహ్మీమక్షరపూర్వికామ్ ।**
**అవాప పరమం యోగం యేనైకం పరిపశ్యతి ॥ 106 ॥**

ఆ విప్రుణ్ణి అనుగ్రహించి అక్కడే అంతర్ధానమైనాను. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఆ విప్రుడుకూడా నేను చెప్పిన విధానంతో భావనాసహితచిత్తుడై పరమతత్త్వాన్ని ఆరాధించాడు. పుత్రాదులయందు స్నేహాన్ని వీడి, సుఖ-దుఃఖాది ద్వంద్వాన్ని వదలి, ఏ దానాన్ని తీసుకోకుండా అన్ని కర్మలు పరిత్యజించి పరమవైరాగ్యాన్ని ఆశ్రయించాడు. తన ఆత్మలో పరమాత్మదర్శనం చేసుకొని, తన ఆత్మలోనే సంపూర్ణవిశ్వాన్ని గుర్తించాడు. అక్షరతత్త్వ సంబంధమైన చివరి బ్రాహ్మీభావనను పొందాడు. దానితో అద్వితీయమైన తత్త్వసాక్షాత్కారం పరమమైన యోగాన్ని పొందాడు.

**యం వినిద్రా జితశ్వాసాః కాంక్షన్తే మోక్షకాంక్షిణః ।**
**తతః కదాచిద్యోగీంద్రో బ్రహ్మాణం ద్రష్టుమవ్యయమ్ ॥ 107 ॥**

**జగామాదిత్యనిర్దేశాన్మానసోత్తరపర్వతమ్ ।**
**ఆకాశేనైవ విప్రేంద్రో యోగైశ్వర్యప్రభావతః ॥ 108 ॥**

ఆ తత్త్వాన్ని నిద్రను వదలినవారు, శ్వాసను జయించినవారు మోక్షార్థులు సాక్షాత్కరించుకుంటారు. ఒకప్పుడాతడు అవ్యయుడైన బ్రహ్మను చూడటానికి వెళ్ళాడు. సూర్యుడు నిర్దేశించిన మానసోత్తర పర్వతాన్ని గూర్చి ఆ బ్రాహ్మణుడు యోగసంపత్ప్రభావంతో ఆకాశమార్గంద్వారా బయలుదేరినాడు.

**విమానం సూర్యసఙ్కాశం ప్రాదుర్భూతమనుత్తమమ్ ।**
**అన్వగచ్ఛన్దేవగణా గన్ధర్వాప్సరసాం గణాః ॥ 109 ॥**

సూర్యుని వలె ప్రకాశించే ఉత్తమ విమానం ప్రత్యక్షమైనది. దేవగణాలు, గన్ధర్వాప్సరసల గణాలు అతనిని అనుసరించినవి.

**దృష్ట్వాఽన్యే పథి యోగీంద్రం సిద్ధా బ్రహ్మర్షయో యయుః ।**
**తతః స గత్వాఽనుగిరిం వివేశ సురవన్దితమ్ ॥ 110 ॥**

మార్గంలో ఆ యోగీంద్రుని చూచి మిగిలిన సిద్ధులు, బ్రహ్మర్షులు వెంట వెళ్ళారు. తర్వాత అతడు దేవతలు నమస్కరించే పర్వతాన్ని చేరుకున్నాడు.

**స్థానం తద్యోగిభిర్జుష్టం యత్రాస్తే పరమః పుమాన్ ।**
**సంప్రాప్య పరమం స్థానం సూర్యాయుతసమప్రభమ్ ॥ 111 ॥**

**వివేశ చాన్తర్భవనం దేవానాఞ్చ దురాసదమ్ ।**
**విచిన్తయామాస పరం శరణ్యం సర్వదేహినామ్ ॥ 112 ॥**

ఆ స్థానం యోగులు అనుభవించేది. అక్కడే పరమపురుషుడు నివసించేది. ఆ స్థానం పదివేల సూర్యుల కాంతులతో సమానంగా ప్రకాశిస్తున్నది. అక్కడికి చేరుకొని ఇంద్రద్యుమ్నుడు దేవతలకు కూడ చేరరాని అంతర్గృహంలోనికి ప్రవేశించాడు. సమస్త ప్రాణులకు శరణ్యుడైన పరబ్రహ్మను గూర్చి ధ్యానించాడు.

**అనాదినిధనం చైవ దేవదేవం పితామహమ్ ।**
**తతః ప్రాదురభూత్తస్మిన్ ప్రకాశః పరమాద్భుతః ॥ 113 ॥**

ఆది–అంతాలు లేనివాడు దేవాదిదేవుడైన పితామహుని ధ్యానించాడు. అతడు ధ్యానించగానే పరమాత్మకు సంబంధించిన ప్రకాశం ప్రాదుర్భవించింది.

**తన్మధ్యే పురుషం పూర్వమపశ్యత్ పరమంపదమ్ ।**
**మహాన్తం తేజసో రాశిమగమ్యం బ్రహ్మవిద్విషామ్ ॥ 114 ॥**

ఆ ప్రకాశం మధ్య తేజోరాశి రూపంలో బ్రహ్మను ద్వేషించే వారికి చేరరానిదైన గొప్ప పరమపద స్వరూపమైన పూర్వపురుషుని దర్శించుకున్నాడు.

**చతుర్ముఖముదారాఙ్గమర్చిర్భిరుపశోభితమ్ ।**
**సోఽపి యోగినమన్వీక్ష్య ప్రణమంతముపస్థితమ్ ॥ 115 ॥**
**ప్రత్యుద్గమ్య స్వయం దేవో విశ్వాత్మా పరిషస్వజే ।**
**పరిష్వక్తస్య దేవేన ద్విజేంద్రస్యాథ దేహతః ॥ 116 ॥**

**నిర్గత్య మహతీ జ్యోత్స్నా వివేశాऽऽదిత్యమణ్డలమ్ ।**

**ఋగ్యజుస్సామసంజ్ఞం తత్పవిత్రమమలం పదమ్ ॥ 117 ॥**

అతడు నాలుగు ముఖాలతో శుభలక్షణాలు గల శరీరావయవాల కాంతులతో అలంకృతుడు. ఆ పరమపురుషుడు కూడ యోగి అయిన ఇంద్రద్యుమ్నుని చూచినాడు. అతడు నమస్కరిస్తూ దగ్గరకు చేరినాడు. అతణ్ణి స్వయంగా విశ్వాత్ముడైన పితామహుడు ఎదురేగి కౌగిలించుకున్నాడు. అట్లా కౌగిలించుకోగానే ఆ ద్విజేంద్రుని దేహం నుండి గొప్ప జ్యోతి బయలువెడలి ఆదిత్యమండలాన్ని ప్రవేశించింది. ఆ స్థానం పవిత్రము, నిర్మలమై ఋక్-యజు-స్సామములనే పేర్లు కల్గినది.

**హిరణ్యగర్భో భగవాన్ యత్రాస్తే హవ్యకవ్యభుక్ ।**

**ద్వారం తద్యోగినామాద్యం వేదాంతేషు ప్రతిష్ఠితమ్ ॥ 118 ॥**

దేవతలకిచ్చే హవ్యాన్ని, పితరుల కిచ్చే కవ్యాన్ని అనుభవించే హిరణ్యగర్భుడు నివసించే స్థానమది. అతడు వేదాంతంలో ప్రతిపాదితులైన యోగులకు మొదటి ప్రవేశ ద్వారము.

**బ్రహ్మతేజోమయం శ్రీమద్దష్టా చైవ మనీషిణామ్ ।**

**దృష్టమాత్రో భగవతా బ్రహ్మణాऽర్చిర్మయో మునిః ॥ 119 ॥**

**అపశ్యదైశ్వరం తేజః శాన్తం సర్వత్రగం శివమ్ ।**

**స్వాత్మానమక్షరం వ్యోమ యత్ర విష్ణోః పరం పదమ్ ॥ 120 ॥**

బ్రహ్మతేజోయుక్తుడైన సంపదకలవాడు, మనీషుల నిష్ఠ కూడ అతడే. భగవంతుడైన బ్రహ్మదేవుడు చూడగానే ఇంద్రద్యుమ్నముని తేజోరూపుడై అంతటా వ్యాపించినది, పరమ కల్యాణకారమైనది, అయిన పరమేశ్వర సంబంధ తేజస్సును తనస్వరూపమే కల్గిన దానిని అవినాశి, వ్యోమరూపాన్ని చూచినాడు. అదే విష్ణువు పరమపదము.

**ఆనన్దమచలం బ్రహ్మ స్థానం తత్పరమేశ్వరమ్ ।**

**సర్వభూతాత్మభూతస్థః పరమైశ్వర్యమాస్థితః ॥ 121 ॥**

ఆనందరూపము, అచలము అయిన ఆ బ్రహ్మస్థానం పరమేశ్వర రూపమైనది. అన్ని ప్రాణులలో తన ఆత్మనే చూచే ఆ యోగి ఇంద్రద్యుమ్నుడు పరమైశ్వర్యంలో నిలిచినాడు.

**ప్రాప్తవానాత్మనో ధామ యత్తన్మోక్షాఖ్యమవ్యయమ్ ।**

**తస్మాత్సర్వప్రయత్నేన వర్ణాశ్రమవిధౌ స్థితః ॥**

**సమాశ్రిత్యాన్తిమం భావం మాయాం లక్ష్మీం తరేద్బుధః । 122 ॥**

మోక్షమనే పేరు కల అవ్యయము అయిన పరమాత్మ స్థానాన్ని ఆ ఇంద్రద్యుమ్నుడు పొందాడు. అందువల్ల అన్ని ప్రయత్నాలతో వర్ణాశ్రమవిధిలో ఉండి బుద్ధిమంతుడైనవాడు అంతిమభావాన్ని ఆశ్రయించి లక్ష్మీరూపమైన మాయనుండి బయట పడాలి.

**సూత ఉవాచ :** సూతుడు అన్నాడు.

**వ్యాహృతా హరిణా త్వేవం నారదాద్యా మహర్షయః ॥ 123 ॥**

**శక్రేణ సహితాః సర్వే పప్రచ్ఛుర్గరుడధ్వజమ్ ।**

హరి ఈ విధంగా చెప్పగా ఇంద్రునితో కూడ నారదాది మహర్షులు గరుడధ్వజుడైన విష్ణువును ఇట్లడిగారు.

**ఋషయః ఊచుః :** ఋషులు పలికారు.

**దేవదేవ! హృషీకేశ! నాథ! నారాయణావ్యయ! ॥ 124 ॥**
**తద్వదాశేషమస్మాకం యదుక్తం భవతా పురా ।**
**ఇంద్రద్యుమ్నాయ విప్రాయ జ్ఞానం ధర్మాదిగోచరమ్ ॥ 125 ॥**
**శుశ్రూషుశ్చాప్యయం శక్రః సఖా తవ జగన్మయ ।**
**తతః స భగవాన్ విష్ణుః కూర్మరూపీ జనార్దనః ॥ 126 ॥**
**రసాతలగతో దేవో నారదాద్యైర్మహర్షిభిః ।**
**పృష్టః ప్రోవాచ సకలం పురాణం కౌర్మముత్తమమ్ ॥ 127 ॥**
**సన్నిధౌ దేవరాజస్య తద్వక్ష్యే భవతామహమ్ ।**

ఓ దేవదేవుడా! హృషీకేశా! ప్రభువా! నాశరహితుడవైన నారాయణా! పూర్వం నీవు ఇంద్రద్యుమ్మునికి చెప్పిన ధర్మాది రూపమైన జ్ఞానాన్ని గూర్చి సమస్తము మాకు చెప్పుము. ఓ జగన్మూర్తీ! ఈ నీ సఖుడు ఇంద్రుడు వినాలనే ఉత్సాహంతో ఉన్నాడు. తర్వాత భగవంతుడైన విష్ణువు కూర్మరూపం దాల్చిన జనార్దనుడు రసాతలంలో ఉన్న దేవుడు నారదాది మహర్షులడుగగా ఉత్తమమైన కూర్మపురాణం మొత్తం ఇంద్రుని సన్నిధానంలోనే చెప్పాడు. దాన్ని మీకు నేను వివరిస్తాను.

**ధన్యం యశస్యమాయుష్యం పుణ్యం మోక్షప్రదం నృణామ్ ॥ 128 ॥**
**పురాణశ్రవణం విప్రాః! కథనఞ్చ విశేషతః ।**
**శ్రుత్వా చాధ్యాయమేకైకం సర్వపాపైః ప్రముచ్యతే ॥ 129 ॥**
**ఉపాఖ్యానమథైకం వా బ్రహ్మలోకే మహీయతే ।**
**ఇదం పురాణం పరమం కౌర్మం కూర్మస్వరూపిణా ॥ 130 ॥**
**ఉక్తం వై దేవదేవేన శ్రద్ధాతవ్యం ద్విజాతిభిః ॥ 131 ॥**

మానవులకు ధన్యతను చేకూర్చేది, కీర్తిని కలుగ చేసేది, ఆయుష్యాన్ని వృద్ధి పొందించేది, పుణ్యాన్ని మోక్షాన్ని ఇచ్చేది ఈ పురాణము. ఓ విప్రులారా! ఎవరైనా ఈ పురాణాన్ని విశేషంగా ఏదోవిధంగా విన్నా. ఒక్కొక అధ్యాయాన్ని విన్నా సమస్త పాపాలనుండి ముక్తుడవుతాడు. ఒక్క ఉపాఖ్యానాన్ని విన్నా బ్రహ్మలోకంలో గౌరవం పొందగలడు. ఈ కూర్మపురాణం శ్రేష్ఠమైనది. కూర్మరూపంలో ఉన్న విష్ణువు వివరించినది. అందువల్ల ద్విజులందరు విశ్వసింపతగినది.

**ఇతి శ్రీకూర్మపురాణే ఇన్ద్రద్యుమ్నస్య మోక్షప్రాప్తివర్ణనం నామ ప్రథమోధ్యాయః ॥1 ॥**

కూర్మపురాణంలో ఇంద్రద్యుమ్నుని మోక్షసిద్ధి వర్ణనమనే ప్రథమాధ్యాయం ॥1॥

## ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయం

## వర్ణాశ్రమవర్ణనమ్ - వర్ణాశ్రమవర్ణనం

**శ్రీకూర్మ ఉవాచ :** శ్రీకూర్మస్వామి పలికాడు.

**శృణుధ్వమృషయః సర్వే యత్పృష్టోఽహం జగద్ధితమ్ ।**
**వక్ష్యమాణం మయా సర్వమిన్ద్రద్యుమ్నాయ భాషితమ్ ॥ 1 ॥**

ఓ ఋషులారా! లోకహితం కొరకు మీరు నన్నడిగిన విషయం, ఇంద్రద్యుమ్నునికి నేను చెప్పిన విషయమంతా నేను చెప్పుచున్నాను. మీరు వినండి.

**భూతైర్భవ్యైర్భవద్భిశ్చ చరితైరుపబృంహితమ్ ।**
**పురాణం పుణ్యదం నృణాం మోక్షధర్మానుకీర్తనమ్ ॥ 2 ॥**

ఈ కూర్మపురాణంలో భూత-వర్తమాన-భవిష్యత్ కాలాల్లో జరిగిన వృత్తాంతాలు విస్తరంగా చెప్పబడినవి. ఇది మనుష్యులకు పుణ్యప్రదము, మోక్షధర్మాలను వివరించేది.

**అహం నారాయణో దేవః పూర్వమాసీన్న మే పరమ్ ।**
**ఉపాస్య విపులాం నిద్రాం భోగిశయ్యాం సమాశ్రితః ॥ 3 ॥**

నేనే నారాయణదేవునిగా పూర్వకాలంలో ఉంటిని. నేను తప్ప మరెవరూ లేరు. నేను గాఢమైన యోగనిద్రనాశ్రయించి శేషశయ్యపై పడుకున్నాను.

**చిన్తయామి పునః సృష్టిం నిశాన్తే ప్రతిబుధ్య తు ।**
**తతో మే సహసోత్పన్నః ప్రసాదో మునిపుంగవాః! ॥ 4 ॥**

మునిశ్రేష్ఠులారా! తెల్లవారి లేచి పునస్సృష్టి కొరకు ఆలోచిస్తున్నాను. అపుడు నాకెంతో ప్రసన్నత ఏర్పడినది.

**చతుర్ముఖస్తతో జాతో బ్రహ్మా లోకపితామహః ।**
**తదన్తరేఽభవత్క్రోధః కస్మాచ్చిత్కారణాత్తదా ॥ 5 ॥**

తర్వాత లోకానికి పితామహుడైన బ్రహ్మ నాలుగు ముఖాలు కలవాడై ఆవిర్భవించాడు. అంతలో ఏ కారణంగానో క్రోధం కలిగింది.

**ఆత్మనో మునిశార్దూలాస్తత్ర దేవో మహేశ్వరః ।**
**రుద్రః క్రోధాత్మకో జజ్ఞే శూలపాణిస్త్రిలోచనః ॥ 6 ॥**

ఆ సమయంలో క్రోధాత్మకుడైన మహేశ్వరదేవుడు రుద్రుడు శూలాన్ని ధరించి మూడు నేత్రాలతో జన్మించాడు.

**తేజసా సూర్యసఙ్కాశ స్త్రైలోక్యం సందహన్నివ।**
**తదా శ్రీరభవద్దేవీ కమలాయతలోచనా ॥ 7 ॥**

అతడు తన తేజస్సుతో సూర్యప్రకాశం వంటి ప్రకాశం కలవాడై ముల్లోకాలను సంహరించే వానివలె ఉన్నాడు. అపుడు కమలం వలె విశాల నేత్రాలుగల లక్ష్మీదేవి ప్రాదుర్భవించింది.

**సురూపా సౌమ్యవదనా మోహినీ సర్వదేహినామ్ ।**
**శుచిస్మితా సుప్రసన్నా మంగళా మహిమాస్పదా ॥ 8 ॥**

ఆమె సుందరరూపం, ప్రసన్నమైన ముఖం సమస్త ప్రాణులను మోహితులను చేయగలది. పవిత్రమైన చిరునవ్వు గలది, మిక్కిలి ప్రసన్నురాలు, శుభకారిణి, మహిమలు కలది.

**దివ్యకాంతిసమాయుక్తా దివ్యమాల్యోపశోభితా ।**
**నారాయణీ మహామాయా మూలప్రకృతిరవ్యయా ॥ 9 ॥**

దివ్యమైన కాంతి కలిగి, దివ్యమైన మాలికలు ధరించినది. నాశరహిత అయిన మహామాయ, మూలప్రకృతిరూపిణి సాక్షాన్నారాయణి.

**స్వధామ్నా పూరయన్తీదం మత్పార్శ్వం సముపావిశత్ ।**
**తాం దృష్ట్వా భగవాన్ బ్రహ్మా మాముమువాచ జగత్పతిమ్ ॥ 10 ॥**

తన కాంతితో ఈ సంసారాన్ని పూరిస్తూ నా ప్రక్కగా కూర్చున్నది. ఆమెను చూచి ప్రపంచానికి ప్రభువైన నన్ను పూజ్యుడైన బ్రహ్మ అడిగాడు.

**మోహాయాశేషభూతానాం నియోజయ సురూపిణీమ్ ।**
**యేనేయం విపులా సృష్టిర్వర్ధతే మమ మాధవ! ॥ 11 ॥**

ఓ ప్రభూ! సమస్త ప్రాణులను మోహితులను చేయటానికి ఈ సురూపిణి అయిన దేవిని నియమించు. అందువలన నా యీ విపులమైన సృష్టి మరింత వృద్ధి చెందుతుంది.

**తథోక్తోఽహం శ్రియం దేవీమబ్రవం ప్రహసన్నివ ।**
**దేవీదమఖిలం విశ్వం సదేవాసురమానుషమ్ ॥ 12 ॥**

**మోహయిత్వా మమాదేశాత్సంసారే వినిపాతయ ।**
**జ్ఞానయోగరతాన్దాన్తాన్ బ్రహ్మిష్ఠాన్ బ్రహ్మవాదినః ॥ 13 ॥**

**అక్రోధనాన్ సత్యపరాన్దూరతః పరివర్జయ ।**
**ధ్యాయినో నిర్మమాన్ శాన్తా న్ధార్మికాన్వేదపారగాన్ ॥ 14 ॥**

**యాజినస్తాపసాన్విప్రాన్దూరతః పరివర్జయ ।**
**వేదవేదాన్తవిజ్ఞానసంఛిన్నాశేషసంశయాన్ ॥ 15 ॥**

**మహాయజ్ఞపరాన్విప్రాన్దూరతః పరివర్జయ ।**
**యే యజంతి జపైర్హోమైర్దేవదేవం మహేశ్వరమ్ ॥ 16 ॥**

**స్వాధ్యాయేనేజ్యయా దూరాత్తాన్ ప్రయత్నేన వర్జయ ।**
**భక్తియోగసమాయుక్తానీశ్వరార్పితమానసాన్ ॥ 17 ॥**

**ప్రాణాయామాదిషు రతాన్దూరాత్పరిహరామలాన్ ।**
**ప్రణవాసక్తమనసో రుద్రజప్యపరాయణాన్ ॥ 18 ॥**

**అథర్వశిరసో ఽధ్యేతౄన్ ధర్మజ్ఞాన్ పరివర్జయ ।**
**బహునాఽత్ర కిముక్తేన స్వధర్మపరిపాలకాన్ ॥ 19 ॥**

**ఈశ్వరారాధనరతాన్మన్నియోగాన్న మోహయ ।**
**ఏవం మయా మహామాయా ప్రేరితా హరివల్లభా ॥ 20 ॥**

బ్రహ్మ అట్లా చెప్పగా నేను నవ్వుతూ లక్ష్మీదేవితో ఇట్లన్నాను. "ఓ దేవీ! దేవ-అసుర-మనుష్యాది సమస్త విశ్వాన్ని నా ఆదేశంతో మోహింప చేసి సంసారంలో పడవేయి. జ్ఞానయోగరతులను, జితేంద్రియులను, బ్రహ్మనిష్ఠకలవారిని, బ్రహ్మవాదులను, క్రోధంలేని సత్యపరాయణులను దూరంగా వదులు. ధ్యానించేవారిని, మమకారం లేనివారిని, శాంతస్వభావంకల ధార్మికులను, వేదాధ్యయనం చేసిన వారిని, యజ్ఞం చేసేవారిని, తాపసులైన విప్రులను దూరంగా వదులు. వేదవేదాంత విజ్ఞానంతో అశేషసంశయాలను పోగొట్టేవారిని మహాయజ్ఞపరులైన విప్రులను దూరంగా వదిలిపెట్టు. జపాలతో హోమాలతో మహేశ్వరుడైన దేవుని పూజించేవారిని స్వాధ్యాయంతో పూజించేవారిని ప్రయత్నపూర్వకంగా వదిలిపెట్టు. భక్తి యోగంలో ఉన్న వారిని, ఈశ్వరుని యందు మనసు నిల్పిన వారిని ప్రాణాయామాదుల్లో నిశ్చలమైన వారిని దూరంగా వదులు. ప్రణవంలో ఆసక్తమైన మనసుకలవారిని, రుద్రమంత్రాలు జపించేవారిని, అథర్వవేదాధ్యయనపరులైన ధర్మజ్ఞులను వదలుము.

ఇంకా అధికంగా చెప్పేదేమున్నది తమధర్మాన్ని పాలించేవారిని నా ఆజ్ఞతో ఈశ్వరారాధనలో నిష్ఠ కలవారిని మోహింపచేయకు. ఈ విధంగా హరివల్లభ అయిన లక్ష్మీదేవిని ప్రేరేపించినాను.

**యథాదేశం చకారాసౌ తస్మాల్లక్ష్మీం సమర్చయేత్ ।**
**శ్రియం దదాతి విపులాం పుష్టిం మేధాం యశో బలమ్ ॥ 21 ॥**

**అర్చితా భగవత్పత్నీ తస్మాల్లక్ష్మీం సమర్చయేత్ ।**
**తతోఽసృజత్స భగవాన్ బ్రహ్మా లోకపితామహః ॥ 22 ॥**

నారాయణుని ఆదేశం ప్రకారం ఈ లక్ష్మీదేవి చేసింది. అందువల్ల ఈమెను అర్చించాలి. సంపదను, అధికమైన పుష్టిని, బుద్ధిని, కీర్తిని, బలాన్ని, ఆ భగవత్పత్ని పూజితురాలై ఇస్తుంది. అందువల్ల ఆ లక్ష్మీదేవిని అర్చించాలి. ఆ తర్వాత లోకపితామహుడైన బ్రహ్మ సృష్టి చేసినాడు.

**చరాచరాణి భూతాని యథాపూర్వం మమాజ్ఞయా ।**
**మరీచిభృగ్వఙ్గిరసం పులస్త్యం పులహం క్రతుమ్ ॥ 23 ॥**

**దక్షమత్రిం వసిష్ఠఞ్చ సోఽసృజద్యోగవిద్యయా ।**
**నవైతే బ్రహ్మణః పుత్రా బ్రాహ్మణా బ్రాహ్మణోత్తమాః ॥ 24 ॥**

**బ్రహ్మవాదిన ఏవైతే మరీచ్యాద్యాస్తు సాధకాః ।**
**ససర్జ బ్రాహ్మణాన్వక్త్రాత్ క్షత్రియాంశ్చ భుజాద్విభుః ॥ 25 ॥**

చరాచరాలైన ప్రాణులను పూర్వం ఉన్నట్లే నా ఆజ్ఞతో సృష్టించాడు. మరీచి-అంగిరసుడు-పులస్త్యుడు-పులహుడు-క్రతువు-దక్షుడు-అత్రి-వసిష్ఠుణ్ణి కూడా ఆ బ్రహ్మ యోగవిద్యతో సృష్టి చేసినాడు. ఈ తొమ్మండుగురు బ్రహ్మపుత్రులు. మరీచి మొదలైన ఈ తొమ్మండుగురు బ్రాహ్మణశ్రేష్ఠులు, బ్రహ్మవాదులు, సాధకులు కూడ. బ్రహ్మ ఈ బ్రాహ్మణులను తన ముఖం నుండి, క్షత్రియులను భుజం నుండి సృష్టించాడు.

**వైశ్యానూరుద్వయాద్దేవః పద్భ్యాం శూద్రాన్ పితామహః ।**
**యజ్ఞనిష్పత్తయే బ్రహ్మ శూద్రవర్జం ససర్జ హ ॥ 26 ॥**

వైశ్యులను రెండు తొడల నుండి, శూద్రులను రెండు పాదాల నుండి పితామహుడు సృష్టించాడు. బ్రహ్మ యజ్ఞనిర్వహణ కొరకు శూద్రులను కాకుండా మిగిలిన ముగ్గురిని ఉద్దేశించాడు.

**గుప్తయే సర్వదైవానాం తేభ్యో యజ్ఞో హి నిర్బభౌ ।**
**ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని చ ॥ 27 ॥**

**బ్రహ్మణః సహజం రూపం నిత్యైషా శక్తిరవ్యయా ।**
**అనాది నిధనా దివ్యా వాగుత్సృష్టా స్వయమ్భువా ॥ 28 ॥**

**ఆదౌ వేదమయీ భూతా యతః సర్వాః ప్రవృత్తయః ।**
**అతోఽన్యాని హి శాస్త్రాణి పృథివ్యాం యాని కానిచిత్ ॥ 29 ॥**

**న తేషు రమతే ధీరః పాషణ్డీ తేన జాయతే ।**
**వేదార్థవిత్తమైః కార్యం యత్స్మృతం మునిభిః పురా ॥ 30 ॥**

యజ్ఞము సర్వవేదాల రక్షణకొరకు త్రైవర్ణికులకు విధింపనైనది. ఋక్కులు, యజుర్మంత్రాలు, సామమంత్రాలు, అథర్వమంత్రాలు బ్రహ్మ సహజ రూపం. అది అవ్యయమూ, నిత్యశక్తికలది. బ్రహ్మ ప్రారంభంలో ఆద్యంతరహితమైన వేదస్వరూపంకల వాగ్రూపశక్తిని ఉత్పత్తి చేశాడు. దానితో అన్ని వ్యవహారాలు జరుగుతాయి. వేదాలకు భిన్నమైన కొన్ని శాస్త్రాలు కూడా ఈ భూలోకంలో ఉన్నాయి. వాటిలో ధీరునకు ఆసక్తి ఉండదు. అట్టిశాస్త్రాల అభ్యాసంతో పాషండులు (పాపరూపులు) అవుతారు. పూర్వము వేదార్థవేత్తలలో శ్రేష్ఠులైన మునులు యోగ్యమని నిర్ణయించినదానినే ఆచరించాలి.

**స జ్ఞేయః పరమో ధర్మో నాన్యశాస్త్రేషు సంస్థితః ।**
**యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః ॥ 31 ॥**

**సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః ।**
**పూర్వకల్పే ప్రజా జాతాః సర్వబాధావివర్జితాః ॥ 32 ॥**

**శుద్ధాంతఃకరణాః సర్వాః స్వధర్మపరిపాలకాః ।**
**తతః కాలవశాత్తాసాం రాగద్వేషాదికోఽభవత్ ॥ 33 ॥**

ఇతర శాస్త్రాల్లో లేని పరమధర్మం తెలుసుకోతగినది. వేదబాహ్యాలైన స్మృతులు, నాస్తిక దర్శనాలు అవన్నీ జన్మాంతరమందు నిష్ఫలాలు. తమోగుణం కలవి. పూర్వకల్పంలో జన్మించిన ప్రజలు ఏ బాధలు లేకుండా ఉన్నారు. అందరు నిష్కల్మషమైన మనసు కల్గి స్వధర్మాన్ని పాటించినవారు. ఆ తర్వాత కాలగతి ప్రభావంతో రాగ ద్వేషాదులు కలిగినవి.

**అధర్మో మునిశార్దూలాః! స్వధర్మప్రతిబంధకః ।**
**తతః సా సహజా సిద్ధిస్తాసాం నాతీవ జాయతే ॥ 34 ॥**

ఓ మునిశ్రేష్ఠులారా! అధర్మం స్వధర్మానికి ప్రతిబంధకం. అందువల్ల సహజమైన సాత్త్వికగుణం క్రమంగా తగ్గింది.

**రజోమాత్రాత్మికాస్తాసాం సిద్ధయోఽన్యాస్తదాఽభవన్ ।**
**తాసు క్షీణాస్వశేషాసు కాలయోగేన తాః పునః ॥ 35 ॥**

**వార్తోపాయం పునశ్చక్రుర్హస్తసిద్ధిఞ్చ కర్మజామ్ ।**
**తతస్తాసాం విభుర్బ్రహ్మా కర్మా జీవమకల్పయత్ ॥ 36 ॥**

**స్వాయమ్భువో మనుః పూర్వధర్మాన్ప్రోవాచ సర్వదృక్ ।**
**సాక్షాత్ప్రజాపతేర్మూర్తిర్నిసృష్టా బ్రహ్మణా ద్విజాః ॥ 37 ॥**

రజోగుణమూలకాలైన ఇతరసిద్ధులు వారి కేర్పడినవి. కాలయోగంలో ఆ రజోగుణమూలక సిద్ధులు కూడా క్షీణించగా వాణిజ్యరూప జీవిక అట్లే పరిశ్రమసాధ్యాలైన శిల్పశాస్త్రాది హస్తసిద్ధి ఉపాయాలు బ్రహ్మ వారికి జీవికవ్యవస్థగా నేర్పరచినాడు. ఓ బ్రాహ్మణులారా! బ్రహ్మవల్ల జన్మించి సాక్షాత్ప్రజాపతి రూపాన్నందిన స్వాయంభువ మనువు పూర్వధర్మాలను ధర్మదర్శియై ఉపదేశించాడు.

**భృగ్వాదయస్తద్వదనాచ్ఛ్రుత్వా ధర్మానథోచిరే ।**
**యజనం యాజనం దానం బ్రాహ్మణస్య ప్రతిగ్రహః ॥ 38 ॥**

**అధ్యాపనం చాధ్యయనం షట్ కర్మాణి ద్విజోత్తమాః ।**
**దానమధ్యయనం యజ్ఞో ధర్మః క్షత్రియవైశ్యయోః ॥ 39 ॥**

**దండో యుద్ధం క్షత్రియస్య కృషిర్వైశ్యస్య శస్యతే ।**
**శుశ్రూషైవ ద్విజాతీనాం శూద్రాణాం ధర్మసాధనమ్ ॥ 40 ॥**

భృగువు మొదలైన మహర్షులు మనువువల్ల విని, ఆ ధర్మాలను వర్ణించారు. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! యజ్ఞం చేయటం, చేయించటం, దానం చేయటం, తీసుకోవటం, అధ్యయన-అధ్యాపనాలు అనే ఆరు కార్యాలు బ్రాహ్మణులకు విహితాలు. దానం, అధ్యయనం, యజ్ఞం చేయటం అనే మూడు క్షత్రియ- వైశ్యులకు ధర్మాలు. దండన విధించటం, యుద్ధం చేయటం క్షత్రియుల ధర్మాలు. కాగా వ్యవసాయం వైశ్యులకు ప్రశస్తమైంది. శూద్రులకు ద్విజులను సేవించటమే ఒకే ధర్మసాధనంగా చెప్పనైనది.

**కారుకర్మ తథా జీవః పాకయజ్ఞాది ధర్మతః ।**
**తతః స్థితేషు వర్ణేషు స్థాపయామాస చాశ్రమాన్ ॥ 41 ॥**

శిల్పకర్మ, పాకయజ్ఞం మొదలైనవి శూద్రులకు జీవికలైనవి. ఈ విధంగా వర్ణాలుండగా వారికి ఆశ్రమాలు కూడ ఏర్పాటు చేయబడినవి.

**గృహస్థఇ్చ వనస్థం చ భిక్షుకం బ్రహచారిణమ్ ।**
**అగ్నయోఽతిథిశుశ్రూషా యజ్ఞో దానం సురార్చనమ్ ॥ 42 ॥**

**గృహస్థస్య సమాసేన ధర్మోఽయం మునిపుంగవాః ।**
**హోమో మూలఫలాశిత్వం స్వాధ్యాయస్తప ఏవ చ ॥ 43 ॥**

**సంవిభాగో యథాన్యాయం ధర్మోఽయం వనవాసినామ్ ।**
**భైక్షాశనఇ్చ మౌనిత్వం తపో ధ్యానం విశేషతః ॥ 44 ॥**

**సమ్యక్ జ్ఞానఇ్చ వైరాగ్యం ధర్మోఽయం భిక్షుకే మతః ।**
**భిక్షాచర్యా చ శుశ్రూషా గురోః స్వాధ్యాయ ఏవ చ ॥ 45 ॥**

**సంధ్యాకర్మాగ్నికార్యఇ్చ ధర్మోఽయం బ్రహ్మచారిణామ్ ।**
**బ్రహ్మచారివనస్థానాం భిక్షుకాణాం ద్విజోత్తమాః ॥ 46 ॥**

బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసమనే నాలుగు ఆశ్రమాలు ఏర్పరచబడినవి. ఓ మునిశ్రేష్ఠులారా! గృహస్థుడు గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్నులను ఉపాసించాలి. అతిథిసేవ- యజ్ఞం-దానం అట్లే దేవతాపూజనం అనేవి గృహస్థుని ధర్మాలు. హోమం, కంద-మూల-ఫలాహారం, స్వాధ్యాయం, తపస్సు, సంపదను న్యాయంగా విభజించటం అనేవి వానప్రస్థుని ధర్మాలు. భిక్షావృత్తితో వచ్చిన దాన్ని సేవించటం, మౌనం పాటించటం, విశేషంగా తపస్సు, ధ్యానం, సమ్యక్జ్ఞానం, వైరాగ్యం అనేవి సన్యాసి ధర్మాలు. భిక్షనాచరించటం, గురుసేవ, స్వాధ్యాయం, సంధ్యను ఉపాసించటం, అగ్నికార్యం ఇవి బ్రహ్మచారి విధులు. ఇవి చతురాశ్రమాల వారికి సాధారణధర్మాలు.

**సాధారణం బ్రహ్మచర్యం ప్రోవాచ కమలోద్భవః ।**
**ఋతుకాలాభిగామిత్వం స్వదారేషు న చాన్యతః ॥ 47 ॥**

**పర్వవర్జం గృహస్థస్య బ్రహ్మచర్యముదాహృతమ్ ।**
**ఆగర్భధారణాదాజ్ఞా కార్యా తేనాప్రమాదతః ॥ 48 ॥**

**అకుర్వాణస్తు విప్రేంద్రా భ్రూణహా తూపజాయతే।**
**వేదాభ్యాసోఽన్వహం శక్త్యా శ్రాద్ధఞ్చాతిథిపూజనమ్ ॥ 49 ॥**

**గృహస్థస్య పరో ధర్మో దేవతాఽభ్యర్చనం తథా ।**
**వైవాహ్యమగ్నిమిన్ధీత సాయం ప్రాతర్యథావిధి ॥ 50 ॥**

**దేశాన్తరగతో వాఽథ మృతపత్నీక ఏవ చ ।**
**త్రయాణామాశ్రమాణాన్తు గృహస్థో యోనిరుచ్యతే ॥ 51 ॥**

బ్రహ్మ బ్రహ్మచర్యమును బ్రహ్మచారి–వానప్రస్థ–సంన్యాసులకు సాధారణధర్మంగా నిర్దేశించాడు. ఋతుకాలాన్ని విశేష పర్వదినాలు వదిలి గృహస్థుడు భార్యను చేరటం బ్రహ్మచర్యంగానే చెప్పనైనది. గర్భధారణ వరకు ఈ ఆజ్ఞ పాటించాలి. ప్రమాదవశాత్తు దీనికి భిన్నంగా ప్రవర్తించటం భ్రూణహత్యాపాపం మూటకట్టుకోవటమే. ప్రతి రోజు వేదాభ్యాసం, శక్తి కొలది శ్రాద్ధము, అతిథిపూజ దేవతార్చన, గృహస్థునకు పరమధర్మం. సాయంకాలం ప్రాతఃకాలం యథావిధిగా గార్హపత్యాగ్నికార్యం ఆచరించాలి. దేశాంతరం వెళ్ళినా, భార్య మరణించినా గృహస్థుడు బ్రహచర్య–వానప్రస్థ– సంన్యాసాశ్రమం లోని వారికిబీజప్రాయుడు.

**అన్యే తముపజీవంతి తస్మాచ్ఛ్రేయాన్ గృహాశ్రమీ ।**
**ఐకాశ్రమ్యం గృహస్థస్య చతుర్ణాం శ్రుతిదర్శనాత్ ॥ 52 ॥**

మిగిలిన మూడు ఆశ్రమాలవారు అతని వల్లనే పోషింప బడుచున్నారు. అందువల్ల గృహస్థాశ్రమంలో ఉన్నవాడు గొప్పవాడు. అతనిలో అన్ని ఆశ్రమధర్మాలు కలిసి ఉన్నాయి అని శ్రుతుల్లో ఉన్నది.

**తస్మాద్గార్హస్థ్యమేవైకం విజ్ఞేయం ధర్మసాధనమ్ ।**
**పరిత్యజేదర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ ॥ 53 ॥**

అందువల్ల గార్హస్థ్యమొక్కటే ధర్మసాధనమని గుర్తించాలి. ధర్మవర్జితాలైన అర్థకామాలు వదలాలి.

**సర్వలోకవిరుద్ధఞ్చ ధర్మమప్యాచరేన్న తు ।**
**ధర్మాత్సంజాయతే హ్యర్థో ధర్మాత్కామోఽభిజాయతే ॥ 54 ॥**

లోకవిరుద్ధమైనది ధర్మమైనా ఆచరించరాదు. ధర్మంవల్ల అర్థం, ధర్మం వల్లనే కామం కూడ సిద్ధిస్తుంది.

**ధర్మ ఏవాపవర్గాయ తస్మాద్ధర్మం సమాశ్రయేత్ ।**
**ధర్మశ్చార్థశ్చ కామశ్చ త్రివర్గస్త్రిగుణో మతః ॥ 55 ॥**

ధర్మం వల్లనే మోక్షం ప్రాప్తిస్తుంది. అందువల్ల ధర్మమే ఆశ్రయించతగినది. ధర్మార్థకామాలు మూడు త్రిగుణాలుగా గుర్తింపబడినవి.

**సత్త్వం రజస్తమశ్చేతి తస్మాద్ధర్మం సమాశ్రయేత్ ।**
**ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ॥ 56 ॥**

అవి సత్త్వరజస్తమోగుణాలు. అందువల్ల ధర్మాన్నాశ్రయించాలి. సత్త్వగుణం కలవారు ఊర్ధ్వలోకానికి వెళతారు. రజోగుణం కలవారు మధ్యమలోకంలో ఉంటారు.

**జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ।**
**యస్మిన్ధర్మసమాయుక్తౌ హ్యర్థకామౌ వ్యవస్థితౌ ॥ 57 ॥**

**ఇహ లోకే సుఖీ భూత్వా ప్రేత్యానన్త్యాయ కల్పతే ।**
**ధర్మాత్సంజాయతే మోక్షో హ్యర్థాత్కామోఽభిజాయతే ॥ 58 ॥**

తమోగుణం కలవారు అధోగతిని పొందుతారు. ధర్మయుక్తమైన అర్థ-కామాలనాశ్రయించేవాడు ఈ లోకంలో సుఖంగా ఉండి మృత్యువుతర్వాత మోక్షాన్ని పొందటంలో సమర్థుడవుతాడు. ధర్మంవల్ల మోక్షం, అర్థంవల్ల కామం సిద్ధిస్తుంది.

**ఏవం సాధనసాధ్యత్వం చాతుర్విధ్యే ప్రదర్శితమ్ ।**
**య ఏవం వేద ధర్మార్థకామమోక్షస్య మానవః ॥ 59 ॥**

**మాహాత్మ్యం చానుతిష్ఠేత స చానన్త్యాయ కల్పతే ।**
**తస్మాదర్థఞ్చ కామఞ్చ త్యక్త్వా ధర్మం సమాశ్రయేత్ ॥ 60 ॥**

ఈ విధంగా నాలుగు విధాలైన పురుషార్థ సాధన-సాధ్యాల విధానం చూపనైనది. ఈ ధర్మార్థకామ మోక్షాలను గూర్చి తెలుసుకున్న మానవుడు అనుష్ఠించి మోక్షాని కర్హుడవుతాడు. అందువల్ల అర్థ-ధర్మ పురుషార్థాలు పరిత్యజించి ధర్మాన్నే ఆశ్రయించాలి.

**ధర్మాత్సంజాయతే సర్వమిత్యాహుర్బ్రహ్మవాదినః ।**
**ధర్మేణ ధార్యతే సర్వం జగత్స్థావరజంగమమ్ ॥ 61 ॥**

ధర్మంవల్ల అన్నీ సిద్ధిస్తాయి. అని బ్రహ్మవాదులు చెప్పినారు. స్థావర-జంగమ రూపమైన ఈ జగత్తు ధర్మంతోనే ధరింపబడుతున్నది.

**అనాదినిధనా శక్తిః సైషా బ్రాహ్మీ ద్విజోత్తమాః! ।**
**కర్మణా ప్రాప్యతే ధర్మో జ్ఞానేన చ న సంశయః ॥ 62 ॥**

ఓ ద్విజోత్తములారా! ఆ ఈ బ్రాహ్మీశక్తి ఆద్యంతరహితమైనది. కర్మ-జ్ఞానాల రెంటి ద్వారా ధర్మం ప్రాప్తిస్తుంది. సంశయం లేదు.

**తస్మాత్ జ్ఞానేన సహితం కర్మ యోగం సమాశ్రయేత్ ।**
**ప్రవృత్తఞ్చ నివృత్తఞ్చ ద్వివిధం కర్మ వైదికమ్ ॥ 63 ॥**

అందువల్ల జ్ఞానంతో పాటు కర్మయోగాన్ని ఆశ్రయించాలి. వైదికకర్మ ప్రవృత్తమని, నివృత్తమని రెండు రకాలుంటుంది.

**జ్ఞానపూర్వం నివృత్తం స్యాత్ప్రవృత్తం యదతో౽న్యథా ।**
**నివృత్తం సేవమానస్తు యాతి తత్పరమం పదమ్ ॥ 64 ॥**

నివృత్తకర్మ జ్ఞానపూర్వకమైనది. ప్రవృత్తకర్మ దీనికి భిన్నమైనది. నివృత్తకర్మ నాచరించేవాడు ఆ పరమపదాన్ని(మోక్షాన్ని) పొందుతాడు.

**తస్మాన్నివృత్తం సంసేవ్యమన్యథా సంసరేత్పునః ।**
**క్షమా దమా దయా దానమలోభస్త్యాగ ఏవ చ ॥ 65 ॥**

**ఆర్జవం చానసూయా చ తీర్థానుసరణం తథా ।**
**సత్యం సన్తోషమాస్తిక్యం శ్రద్ధా చేంద్రియనిగ్రహః ॥ 66 ॥**

**దేవతా౽భ్యర్చనం పూజా బ్రాహ్మణానాం విశేషతః ।**
**అహింసా ప్రియవాదిత్వమపైశున్యమకల్పతా ॥ 67 ॥**

**సామాసికమిదం ధర్మం చాతుర్వర్ణ్యే౽బ్రవీన్మనుః ।**
**ప్రాజాపత్యం బ్రాహ్మణానాం స్మృతం స్థానం క్రియావతామ్ ॥ 68 ॥**

**స్థానమైంద్రం క్షత్రియాణాం సంగ్రామేష్వపలాయినామ్ ।**
**వైశ్యానాం మారుతం స్థానం స్వధర్మమనువర్తతామ్ ॥ 69 ॥**

**గాంధర్వం శూద్రజాతీనాం పరిచారేణ వర్తతామ్ ।**
**అష్టాశీతిసహస్రాణామృషీణామూర్ధ్వరేతసామ్ ॥**

**స్మృతం తేషాం తు యత్స్థానం తదేవ గురువాసినామ్ । 70 ॥**

అందువల్ల నివృత్తమార్గాన్నే సేవించాలి, లేనట్లైతే మళ్ళీ సంసారంలో పడవలసి వస్తుంది. క్షమ, ఇంద్రియ నిగ్రహ రూపమైన దమము, దయ, దానం, లోభం లేకపోవటం, త్యాగం, ఆర్జవం, అసూయలేకుండటం, తీర్థాల(గురు-శాస్త్ర) అనుసరణం, సత్యం పలకటం, సంతోషంగా ఉండటం, ఆస్తికత(వేదాదిశాస్త్రాల్లో శ్రద్ధ), శ్రద్ధ, జితేంద్రియత్వం, దేవతార్చన, విశేషంగా బ్రాహ్మణపూజ, అహింస, మధురభాషణం, లుబ్ధత్వం లేకుండటం, పాపరాహిత్యం ఇవన్నీ ధర్మస్వరూపమే. ఇవి నాలుగు వర్ణాలకు సమానమే అని మనువు చెప్పాడు. బ్రాహ్మణధర్మాలను యథావిధిగా ఆచరించే బ్రాహ్మణులకు ప్రాజాపత్యలోకం ప్రాప్తిస్తుంది. యుద్ధాల్లో పలాయనం చేయని క్షత్రియులకు ఇంద్రలోకం, స్వధర్మాన్ని ఆచరించే వైశ్యులకు వాయులోకం, సేవారూపమైన స్వధర్మాన్ని పాలించే శూద్రజాతికి గంధర్వలోకం నిశ్చితము. ఊర్ధ్వరేతస్కులైన ఎనభైఎనిమిదివేల శౌనకాది ఋషుల స్థానమే గురుకులవాసులకు కూడా స్థానం.

**సప్తర్షీణాన్తు యత్థ్సానం స్మృతం తద్వై వనౌకసామ్ ॥ 71 ॥**

వానప్రస్థులకు సప్తర్షుల స్థానం చెప్పబడినది.

**ప్రాజాపత్యం గృహస్థానాం స్థానముక్తం స్వయంభువా ।**
**యతీనాం జితచిత్తానాం న్యాసినామూర్ధ్వ రేతసామ్ ॥ 72 ॥**

**హైరణ్యగర్భం తత్థ్సానం యస్మాన్నా వర్తతే పునః ।**
**యోగినా మమృతం స్థానం వ్యోమాఖ్యం పరమక్షరమ్ ॥ 73 ॥**

**ఆనంద మైశ్వరం ధామ సా కాష్ఠా సా పరాగతిః ।**

గృహస్థులకు స్వయంభూబ్రహ్మ ప్రాజాపత్యలోకాన్ని తెలిపాడు. సమాహిత చిత్తులు, యతాత్ములు, ఊర్ధ్వరేతస్కులైన సంన్యాసులకు హిరణ్యగర్భమనే పేరుగల స్థానం లభిస్తుంది. అక్కడి నుండి తిరిగిరావటం ఉండదు. యోగులకు 'వ్యోమ' అనే పేరుగల శ్రేష్ఠము నాశరహితము అమరస్థానం ఆనందస్వరూపమైనది ప్రాప్తిస్తుంది. అదే పరమగతి, పరాకాష్ఠస్థానం.

**ఋషయః ఊచుః :** ఋషులు చెప్పారు.

**భగవన్దేవతారిఘ్న! హిరణ్యాక్షనిషూదన! ॥ 74 ॥**
**చత్వారో హ్యాశ్రమాః ప్రోక్తా యోగినామేక ఉచ్యతే ।**

దేవతల శత్రువులను సంహరించేవాడా! హిరణ్యాక్షుని వధించిన ఓ భగవంతుడా! నీవు నాలుగు ఆశ్రమాలను వివరించావు, కాని యోగులకు ఒకే ఆశ్రమాన్ని తెలిపావు.

**శ్రీ కూర్మ ఉవాచ :** శ్రీకూర్మస్వామి చెప్పాడు.

**సర్వకర్మాణి సంన్యస్య సమాధిమచలం శ్రితః ॥ 75 ॥**

**య ఆస్తే నిశ్చలో యోగీ స సంన్యాసీ న పంచమః ।**
**సర్వేషామాశ్రమాణాన్తు ద్వైవిధ్యం శ్రుతిదర్శితమ్ ॥ 76 ॥**

సర్వకర్మలను పరిత్యజించి కేవలం అచలమైన సమాధిలో స్థిరంగా ఉండేవాడు నిశ్చలయోగి. అతడే సంన్యాసి. అయిదవ ఆశ్రమం లేదు. అన్ని ఆశ్రమాలు రెండేసి భేదాలున్నట్టు వేదం చూపింది.

**బ్రహ్మచార్యుపకుర్వాణో నైష్ఠికో బ్రహ్మతత్పరః ।**
**యోఽధీత్య విధివద్వేదాన్ గృహస్థాశ్రమమావ్రజేత్ ॥ 77 ॥**

**ఉపకుర్వాణకో జ్ఞేయో నైష్ఠికో మరణాంతికః ।**
**ఉదాసీనః సాధకశ్చ గృహస్థో ద్వివిధో భవేత్ ॥ 78 ॥**

**కుటుంబభరణాయత్తః సాధకోఽసౌ గృహీ భవేత్ ।**
**ఋణాని త్రీణ్యపాకృత్య త్యక్త్వా భార్యాధనాదికమ్ ॥ 79 ॥**

**ఏకాకీ యస్తు విచరేదుదాసీనః స మౌక్షికః । 80 ॥**

బ్రహ్మచారి ఉపకారం చేసేవాడని, కేవలం బ్రహ్మతత్పరుడైన నైష్ఠికుడని రెండు రకాలు. విధివిధానంగా వేదాధ్యయనం చేసి గృహస్థాశ్రమాన్ని స్వీకరించే బ్రహ్మచారి ఉపకరించేవాడు. యావజ్జీవం గురువు దగ్గరే ఉండి బ్రహ్మవిద్యాభ్యాసం చేసే బ్రహ్మచారి నైష్ఠికుడు. గృహస్థుడు కూడ ఉదాసీనుడని, సాధకుడు అని రెండు రకాలుంటాడు. కుటుంబభారాన్ని మోసేవాడు సాధకుడనే గృహస్థుడు. దేవఋణం ఋషిఋణం పితృఋణం అనే మూడు ఋణాలు తీర్చి, భార్యధనం మొదలైన వాటిని వదలి ఒంటిగా సంచరించే గృహస్థుడు ఉదాసీనుడు. అతడు మోక్షార్థి.

**తపస్తప్యతి యోఽరణ్యే యజేద్దేవాన్ జుహోతి చ ॥**
**స్వాధ్యాయే చైవ నిరతో వనస్థస్తాపసో మతః ।**
**తపసా కర్శితోఽత్యర్థం యస్తు ధ్యానపరో భవేత్ ॥ 81 ॥**

**సాంన్యాసికః స విజ్ఞేయో వానప్రస్థాశ్రమే స్థితః ।**
**యోగాభ్యాసరతో నిత్యమారురుక్షుర్జితేంద్రియః ॥ 82 ॥**

**జ్ఞానాయ వర్తతే భిక్షుః ప్రోచ్యతే పారమేష్ఠికః ।**
**యస్త్వాత్మరతిరేవ స్యాన్నిత్యతృప్తో మహామునిః ॥ 83 ॥**

అరణ్యంలో తపస్సు చేస్తూ, దేవతలను పూజిస్తూ, హోమం చేస్తూ స్వాధ్యాయంలో నిరతుడైన వానప్రస్థుడు తాపసిగా గుర్తింపబడ్డాడు. తపస్సుతో మిక్కిలి కృశించి, నిరంతరం ధ్యానంలో ఉంటూ వానప్రస్థాశ్రమంలో ఉండేవాడు 'సాంన్యాసిక' వానప్రస్థుడు. యోగమార్గంలో రతుడై మోక్షమార్గాన్ని ఆరోహించే కోరిక గలవాడు, జితేంద్రియుడై, జ్ఞానప్రాప్తికోసం ప్రయత్నించే సంన్యాసి పారమేష్ఠిక సంన్యాసి. తనలోని ఆత్మలోనే రమిస్తూ నిత్యతృప్తినందే సంన్యాసి 'మహాముని'.

**సమగ్దర్శన సమ్పన్నః స యోగీ భిక్షు రుచ్యతే ।**
**జ్ఞానసంన్యాసినః కేచిద్వేదసంన్యాసినోఽ పరే ॥ 84 ॥**

**కర్మ సంన్యాసినః కేచిత్త్రివిధాః పారమేష్ఠికాః ।**
**యోగీ చ త్రివిధో జ్ఞేయో భౌతికః సాంఖ్య ఏవ చ ॥ 85 ॥**

**తృతీయో హ్యాశ్రమీ ప్రోక్తో యోగముత్తమమాశ్రితః ।**
**ప్రథమా భావనా పూర్వే సాంఖ్యే త్వక్షరభావనా ॥ 86 ॥**

**తృతీయే చాన్తిమా ప్రోక్తా భావనా పారమేశ్వరీ ।**
**తస్మాదేత ద్విజానీధ్వమాశ్రమాణాం చతుష్టయమ్ ॥ 87 ॥**

సమ్యక్ దర్శనసంపన్నుడైన అట్టియోగి భిక్షువుగా చెప్పబడుచున్నాడు. యోగి భిక్షువు. పారమేష్ఠిక సంన్యాసి మూడు భేదాలు గలవాడు. కొందరు జ్ఞాన సంన్యాసులు. వేద సంన్యాసులు కొందరు. కొందరు కర్మ సంన్యాసులు. యోగి కూడ భౌతికుడు, సాంఖ్యుడు, ఆశ్రమి అని మూడు విధాలుగా ఉంటారు. ఆశ్రమి ఎప్పుడూ యోగంలోనే నిరతుడవుతాడు. మొదటి భౌతికయోగిలో మొదటి భావన, సాంఖ్యయోగిలో అక్షర భావన, మూడవ ఆశ్రమి అనే యోగిలో అంతిమ భావన ఉంటుంది. అదే పారమేశ్వరీ భావన అని చెప్పబడినది. అందువల్ల ఓ ఋషులారా! అన్ని వేదశాస్త్రాల్లోను నాలుగే ఆశ్రమాలు నిశ్చయింపబడినవి.

**సర్వేషు వేదశాస్త్రేషు పంచమో నోపపద్యతే ।**
**ఏవం వర్ణాశ్రమాన్ బుధ్వా దేవదేవో నిరఞ్జనః ॥ 88 ॥**

**దక్షాదీన్ప్రాహ విశ్వాత్మా సృజధ్వం వివిధాః ప్రజాః ।**
**బ్రహ్మణో వచనాత్పుత్రా దక్షాద్యా మునిసత్తమాః ॥ 89 ॥**

**అసృజంత ప్రజాః సర్వే దేవమానుషపూర్వకాః ।**
**ఇత్యేవం భగవాన్ బ్రహ్మా స్రష్టృత్వే సంవ్యవస్థితః ॥ 90 ॥**

అందువల్ల అన్ని వేదశాస్త్రాల్లోను అయిదవ ఆశ్రమం కనిపించదు. ఈ విధంగా నాలుగు వర్ణాలు, నాలుగు ఆశ్రమాలను భావించి దేవదేవుడు, నిరంజనుడు, విశ్వాత్మ అయిన బ్రహ్మ దక్షాది ప్రజాపతులతో "అనేక విధాలైన ప్రజలను సృష్టించండి" అని చెప్పాడు. బ్రహ్మ చెప్పినందువల్ల దక్షాదిమానసపుత్రులు దేవతలు, మానవులు మొదలైన ప్రాణులన్నింటిని సృష్టించారు. ఈ విధంగా బ్రహ్మ సృష్టికార్యంలోనే నిమగ్నుడైనాడు.

**అహం వై పాలయామీదం సంహరిష్యతి శూలభృత్ ।**
**తిస్రస్తు మూర్తయః ప్రోక్తా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ॥ 91 ॥**

**రజఃసత్త్వ తమోయోగా త్పరస్య పరమాత్మనః ।**
**అన్యోన్యమనురక్తాస్తే హ్యన్యోన్యముపజీవినః ॥ 92 ॥**

నేనీ సృష్టిని రక్షిస్తాను. శూలధారి శంకరుడు సంహరిస్తాడు. పరాత్పరుని రజస్సత్త్వతమోగుణ సంబంధంవల్ల బ్రహ్మ-విష్ణువు-మహేశ్వరుడనే పేరుతో త్రిమూర్తులుగా ప్రసిద్ధులు. ఈ ముగ్గురు పరస్పరం అనురక్తులు. ఒకరొకరిని ఆశ్రయించి ఉంటారు.

**అన్యోన్యం ప్రణతాశ్చైవ లీలయా పరమేశ్వరాః ।**
**బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ తథైవాక్షరభావనా ॥ 93 ॥**

**తిస్రస్తు భావనా రుద్రే వర్తన్తే సతతం ద్విజాః ।**
**ప్రవర్తతే మయ్యజస్రమాద్యా త్వక్షరభావనా ॥ 94 ॥**

**ద్వితీయా బ్రహ్మణః ప్రోక్తా దేవస్యాక్షరభావనా ।**
**అహం చైవ మహాదేవో న భిన్నః పరమార్థతః ॥ 95 ॥**

ఈ ముగ్గురు పరమేశ్వరుడే లీలావశంగా ఒకరు మరొకరికి నమస్కరిస్తుంటారు. ఓ బ్రాహ్మణులారా! బ్రాహ్మి–మాహేశ్వరి అట్లే అక్షరము(వైష్ణవి) అనుపేర్లతో మూడు రకాలైన భావనలు ఎల్లప్పుడు రుద్రునిలో ఉంటాయి. నాలో మొదటిదైన అక్షరభావన వైష్ణవి ఎల్లప్పుడు ఉంటుంది. రెండవ భావన బ్రహ్మకు సహజమైనది నిజానికి నేను మహాదేవుడు భిన్నులం కాము.

**విభజ్య స్వేచ్ఛయాత్మానం సోఽన్తర్యామీశ్వరః స్థితః ।**
**త్రైలోక్యమఖిలం స్రష్టుం సదేవాసురమానుషమ్ ॥ 96 ॥**

**పురుషః పరతోఽవ్యక్తో బ్రహ్మత్వం సముపాగమత్ ।**
**తస్మాద్బ్రహ్మా మహాదేవో విష్ణుర్విశ్వేశ్వరః పరః ॥ 97 ॥**

**ఏకస్యైవ స్మృతాస్తిస్రస్తద్వత్కార్యవశాత్ప్రభోః ।**
**తస్మాత్సర్వప్రయత్నేన వన్ద్యాః పూజ్యా విశేషతః ॥ 98 ॥**

ఆ అంతర్యామి తన కోరికతో తనను తాను విభజించుకొని ఈశ్వరుడు అనే రూపంలో ఉన్నాడు. దేవ–అసుర–మానుష రూపమై సృష్టినంతటిని ముల్లోకంలోని దాన్ని సృష్టించటానికి ఈ పరమపురుషుడే అవ్యక్తుడు ప్రత్యేకంగా బ్రహ్మ రూపాన్ని పొందాడు. అందువల్ల బ్రహ్మ–మహాదేవుడు–విశ్వేశ్వరుడు పరుడు అయిన విష్ణువు సృష్టిస్థితిలయవశముగా మూడు మూర్తులుగా స్మరింప బడినాడు. అందువల్ల అన్ని విధాల ఈ ముగ్గురు నమస్కరింప దగినవారు. విశేషించి పూజింప తగినవారు.

**యదిచ్ఛేదచిరాత్స్థానం యత్తన్మోక్షాఖ్యమవ్యయమ్ ।**
**వర్ణాశ్రమప్రయుక్తేన ధర్మేణ ప్రీతిసంయుతః ॥ 99 ॥**

**పూజయేద్భావయుక్తేన యావజ్జీవం ప్రతిజ్ఞయా ।**
**చతుర్ణామాశ్రమాణాన్తు ప్రోక్తోఽయం విధివద్ద్విజాః ॥ 100 ॥**

అవినాశి అయిన మోక్షాన్ని శీఘ్రంగా పొందగోరినవాడు వర్ణాశ్రమాలతో కూడిన ధర్మాన్ని ప్రీతితో జీవితాంతం ప్రతిజ్ఞతో శ్రద్ధాభావనతో పూజించాలి. ఓ ద్విజులారా! నాలుగాశ్రమాలకు ఈ విధానం చెప్పబడినది.

**ఆశ్రమో వైష్ణవో బ్రాహ్మో హరాశ్రమ ఇతి త్రయః ।**
**తల్లింగధారీ నియతం తద్భక్తజనవత్సలః ॥ 101 ॥**

వైష్ణవ–బ్రాహ్మ–హర అనే ఈ మూడు సంప్రదాయాలు. వీరు ఆయా చిహ్నాలను ధరించి ఆ సంప్రదాయ భక్తులయందు వాత్సల్యం కలిగి ఉండాలి.

**ధ్యాయేదథార్చయేదేతాన్ బ్రహ్మవిద్యాపరాయణః ।**
**సర్వేషామేవ భక్తానాం శంభోర్లింగమనుత్తమమ్ ॥ 102 ॥**

బ్రహ్మవిద్యా పరాయణుడు దేవతలను నిరంతరం ధ్యానించాలి. పూజించాలి. శివభక్తులందరు శైవచిహ్నాన్ని ధరించటం ఉత్తమం.

**సితేన భస్మనా కార్యం లలాటే తు త్రిపుండ్రకమ్ ।**
**యస్తు నారాయణం దేవం ప్రసన్నః పరమం పదమ్ ॥ 103 ॥**

**తేషాం లలాటే తిలకం ధారణీయస్తు సర్వదా ।**
**యోఽసావనాదిర్భూతాదిః కాలాత్మాఽసౌ ధృతో భవేత్ ॥ 104 ॥**

తెల్లని భస్మంతో నుదుటిపై మూడు రేఖలు ధరించాలి. నారాయణుని పరమపదాన్ని శరణు పొందిన భక్తుడు కస్తూరి మొదలైన వానిని నీటితో కలిపి త్రిపుండ్రాకారంగా ఎల్లప్పుడు నుదుటిపై ధరించాలి. జగత్తుకు కారణ భూతుడైన బ్రహ్మను శరణుపొందినవాడు తమ నుదుటిపై ఎల్లప్పుడు తిలకాన్ని ధరించాలి. అట్లా ధరించటం వల్ల అనాది ప్రాణులకు మొదటి వాడైన కాలాత్మకుని ధరించినట్టవుతుంది.

**ఉపర్యధో భావయోగాత్ త్రిపుండ్రస్య తు ధారణాత్ ।**
**యత్తత్ప్రధానం త్రిగుణం బ్రహ్మవిష్ణుశివాత్మకమ్ ॥ 106 ॥**

**ధృతన్తు శూలధరణాద్భవత్యేవ న సంశయః ।**
**బ్రహ్మతోజోమయం శుక్లం యదేతన్మండలం రవేః ॥ 107 ॥**

**భవత్యేవ ధృతం స్థానమైశ్వరం తిలకే కృతే ।**
**తస్మాత్కార్యం త్రిశూలాంకం తథా చ తిలకం శుభమ్ ॥ 108 ॥**

పైకికాని, అడ్డంగాకాని త్రిపుండ్రాన్ని భావయుక్తుడై ధరించినందువల్ల ప్రధానమైన బ్రహ్మవిష్ణుశివాత్మకమైన త్రిగుణాత్మ పరమాత్మను ధరించినట్టవుతుంది. ఇందులో సందేహమే లేదు. శూలధారణవల్ల ఆ యా దేవులను ధరించినట్టే. సూర్యమండలం ప్రకాశంవలె బ్రహ్మతేజోమయమైన ఐశ్వరస్థానం తిలకధారణవల్ల చేకూరుతుంది. అందువల్ల త్రిశూలం గుర్తుకాని, శుభకరమైన తిలకంకాని తప్పక ధరించాలి.

**ఆయుష్యఞ్చాపి భక్తానాం త్రయాణాం విధిపూర్వకమ్ ।**
**యజేత జుహుయాదగ్నౌ జపేద్దద్యాజ్జితేంద్రియః ॥ 109 ॥**

**శాంతో దాంతో జితక్రోధో వర్ణాశ్రమవిధానవిత్ ।**
**ఏవం పరిచరేద్దేవాన్ యావజ్జీవం సమాహితః ॥ 110 ॥**

**తేషాం స్వస్థానమచలం సోఽచిరాదధిగచ్ఛతి ॥ 111 ॥**

మూడు విధాలైన (శైవ–వైష్ణవ–బ్రహ్మ) భక్తులకు ఆయుష్యం వృద్ధి చెందుతుంది. విధిపూర్వకంగా అగ్నిలో హోమం చేయాలి. జపించాలి. దానం చేయాలి. వర్ణాశ్రమ విధానం తెలిసినవాడు జితేంద్రియుడు శాంతుడు దాంతుడు కోపాన్ని జయించిన వాడై జీవితాంతం శ్రద్ధగా ఆయా దేవతలను ఈ విధంగా సేవించాలి. అట్లాచరించిన వారికి చలనం లేని స్థానం తొందరలోనే ప్రాప్తిస్తుంది.

**ఇతి శ్రీకూర్మపురాణే వర్ణాశ్రమవర్ణనం నామ ద్వితీయోఽధ్యాయః ॥ 2 ॥**

శ్రీకూర్మపురాణంలో వర్ణాశ్రమవర్ణనం అనే రెండవ అధ్యాయం ॥ 2 ॥

## తృతీయోఽధ్యాయః - మూడవ అధ్యాయం
## వర్ణాశ్రమక్రమవర్ణనమ్ - వర్ణాశ్రమక్రమవర్ణనం

**ఋషయః ఊచుః :-** ఋషులు చెప్పారు.

**వర్ణా భగవతోద్దిష్టాశ్చత్వారోఽప్యాశ్రమాస్తథా ।**
**ఇదానీం క్రమమస్మాకమాశ్రమాణాం వద ప్రభో ॥ 1 ॥**

ప్రభూ! మీరు నాలుగు వర్ణాలు, నాలుగాశ్రమాలను గూర్చి చెప్పారు. ఇప్పుడు మాకు ఆశ్రమాల క్రమాన్ని గూర్చి చెప్పండి.

**శ్రీకూర్మ ఉవాచ :-** శ్రీకూర్మమూర్తి చెప్పాడు.

**బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతిస్తథా ।**
**క్రమేణైవాశ్రమాః ప్రోక్తాః కారణాదన్యథా భవేత్ ॥ 2 ॥**

బ్రహ్మచర్యం, గృహస్థత్వం, వానప్రస్థం అట్లే సంన్యాసం క్రమంగా ఈ ఆశ్రమాలు చెప్పనైనవి. ఏకారణంతోనైనా ఈ క్రమంలో పరివర్తనం జరుగవచ్చు.

**ఉత్పన్నజ్ఞానవిజ్ఞానో వైరాగ్యం పరమం గతః ।**
**ప్రవ్రజేద్బ్రహ్మచర్యాత్తు యదీచ్ఛేత్పరమాం గతిమ్ ॥ 3 ॥**

జ్ఞాన విజ్ఞాన సంపన్నుడైన బ్రహ్మచారి పరమవైరాగ్యాన్ని పొంది ఒకవేళ పరమగతిని (మోక్షాన్ని) పొందకోరినట్లైతే బ్రహ్మచర్యంనుండి నేరుగా సంన్యాసం గ్రహించవచ్చు.

**దారానాహృత్య విధివదన్యథా వివిధైర్మఖైః ।**
**యజేదుత్పాదయేత్పుత్రాన్ విరక్తో యది సంన్యసేత్ ॥ 4 ॥**

అట్లాకాక విధిపూర్వకముగా వివాహం చేసుకొని వివిధయజ్ఞాలు అనుష్ఠిస్తూ పుత్రులను పొంది విరక్తుడైతే సంన్యాసం గ్రహించవచ్చును.

**అనిష్ట్వా విధివద్యజ్ఞై రనుత్పాద్య తథాఽఽత్మజాన్ ।**
**న గార్హస్థ్యం గృహీ త్యక్త్వా సంన్యసేద్బుద్ధిమాన్ ద్విజః ॥ 5 ॥**

బుద్ధిమంతుడైన ద్విజుడగు గృహస్థుడు విధిపూర్వకమైన యజ్ఞానుష్ఠానం, అట్లే పుత్రోత్పత్తి చేయక గృహస్థాశ్రమాన్ని వదలి సంన్యాసం గ్రహించరాదు.

**అథ వైరాగ్యవేగేన స్థాతుం నోత్సహతే గృహే ।**
**తత్రైవ సంన్యసేద్విద్వానసిష్ట్వాఽపి ద్విజోత్తమః ॥ 6 ॥**

వైరాగ్యవేగంతో గృహంలో ఉండటానికి ఇష్టపడని ద్విజోత్తముడు అక్కడనే యజ్ఞం చేయకుండానే సంన్యసించవచ్చు.

**తథాఽపి వివిధైర్యజ్ఞైరిష్ట్వా వనమథాశ్రయేత్ ।**
**తపస్తప్త్వా తపోయోగా ద్విరక్తః సంన్యసేద్యది ॥ 7 ॥**

అయినప్పటికీ వివిధ యజ్ఞాలాచరించి, వనాన్నాశ్రయించి, తపస్సు చేసి తపోయోగంవల్ల విరక్తుడై సంన్యసించవచ్చు.

**వానప్రస్థాశ్రమం గత్వా న గృహం ప్రవిశేత్పునః ।**
**న సంన్యాసీ వనఞ్చాథ బ్రహ్మచర్యఞ్చ సాధకః ॥ 8 ॥**

అయితే వానప్రస్థాశ్రమాన్ని పొంది మళ్ళీ ఇంటికి ప్రవేశించరాదు. సంన్యాసి వానప్రస్థాశ్రమంలోకి రాకూడదు. సాధకుడు ఐన గృహస్థు బ్రహ్మచర్యాశ్రమంలోకి రాకూడదు.

**ప్రాజాపత్యాన్నిరూప్యేష్టిమాగ్నేయీమథవా ద్విజః ।**
**ప్రవ్రజేత్తు గృహీ విద్వాన్ వనాద్వా శ్రుతిచోదనాత్ ॥ 9 ॥**

ద్విజుడు ప్రాజాపత్యాన్ని కాని ఆగ్నేయి ఇష్టిని కాని ఆచరించి సంన్యాసాన్ని గ్రహించవచ్చు. వైదిక విధానంతో వానప్రస్థంనుండి సంన్యాసంలోనికి ప్రవేశించవచ్చును.

**ప్రకర్తుమసమర్థోఽపి జుహోతి యజతి క్రియాః ।**
**అంధః పఙ్గుర్దరిద్రో వా విరక్తః సంన్యసేద్బుధః ॥ 10 ॥**

హవనం అట్లే యజ్ఞసంబంధిక్రియలాచరించటంలో అసమర్థుడైనపుడు కూడ గుడ్డివాడు, కుంటివాడు, దరిద్రుడైన బ్రాహ్మణుడు వైరాగ్యం పొందినపుడు సంన్యాసం స్వీకరించవచ్చు.

**సర్వేషామేవ వైరాగ్యం సంన్యాసే తు విధీయతే ।**
**పతత్యేవావిరక్తో యః సంన్యాసం కర్తుమిచ్ఛతి ॥ 11 ॥**

అందరికి సంన్యాసానికి వైరాగ్యమే ప్రధానంగా చెప్పనైనది. అవిరక్తుడు సంన్యాసం గ్రహించటానికి కోరితే అతడు అవశ్యంగా పతితుడవుతాడు.

**ఏకస్మిన్నథవా సమ్యగ్వర్తేతామరణాన్తికమ్ ।**
**శ్రద్ధావానాశ్రమే యుక్తః సోఽమృతత్వాయ కల్పతే ॥ 12 ॥**

అట్లాకాక శ్రద్ధావంతుడు యావజ్జీవం ఒకే ఆశ్రమంలో సరైన వ్యవహారం కలిగి ఉంటే అతడు మోక్షాన్ని పొందటానికి సమర్థుడవుతాడు.

**న్యాయాగతధనః శాంతో బ్రహ్మవిద్యాపరాయణః ।**
**స్వధర్మపాలకో నిత్యం బ్రహ్మభూయాయ కల్పతే ॥ 13 ॥**

న్యాయమార్గంలో ధనసంపాదన కావించేవాడు, శాంతుడు, బ్రహ్మవిద్యాపరాయణుడు అట్లే నిత్యం స్వధర్మ పాలన చేసేవాడు మోక్షప్రాప్తికి యోగ్యుడు.

**బ్రహ్మణ్యాధాయ కర్మాణి నిస్సంగః కామవర్జితః ।**
**ప్రసన్నేనైవ మనసా కుర్వాణో యాతి తత్పదమ్ ॥ 14 ॥**

తన కర్మలన్నింటిని బ్రహ్మార్పణం కావించి, ఆసక్తిరహితుడై నిష్కాముడైన వ్యక్తి ప్రసన్నమైన మనసుతో కర్మలనాచరించేవాడు మోక్షాన్ని పొందుతాడు.

**బ్రహ్మణా దీయతే దేయం బ్రహ్మణే సంప్రదీయతే ।**
**బ్రహ్మైవ దీయతే చేతి బ్రహ్మార్పణమిదం పరమ్ ॥ 15 ॥**

ఇవ్వటానికి యోగ్యమైన పదార్థం బ్రహ్మద్వారానే ప్రాప్తిస్తుంది. బ్రహ్మకే ఇవ్వడమవుతుంది. బ్రహ్మయే ఇవ్వ బడతాడు. ఈ భావనయే బ్రహ్మార్పణం. అదియే శ్రేష్ఠమైనది.

**నాహం కర్తా సర్వమేతద్బ్రహ్మైవ కురుతే తథా ।**
**ఏతద్బ్రహ్మార్పణం ప్రోక్తమృషిభిస్తత్త్వదర్శిభిః ॥ 16 ॥**

నేను కర్తను కాను. ఇదంతా బ్రహ్మయే చేస్తునాడు అనే భావనను తత్త్వదర్శులైన ఋషులు బ్రహ్మార్పణంగా చెప్పారు.

**ప్రీణాతు భగవానీశః కర్మణాఽనేన శాశ్వతః ।**
**కరోతి సతతం బుద్ధ్యా బ్రహ్మార్పణమిదం పరమ్ ॥ 17 ॥**

నా ఈ కర్మచేత సనాతనుడైన భగవంతుడు ఈశ్వరుడు సంతోషపడుగాక! అని ఎల్లప్పుడు బుద్ధితో చేసేది శ్రేష్ఠమైన బ్రహ్మార్పణము.

**యద్వా ఫలానాం సంన్యాసం ప్రకుర్యాత్పరమేశ్వరే ।**
**కర్మణామేతదప్యాహుర్బ్రహ్మార్పణమనుత్తమమ్ ॥ 18 ॥**

అట్లాకాక పరమేశ్వరుని యందే సర్వకర్మల ఫలాలను ఉంచటం కూడా శ్రేష్ఠమైన బ్రహ్మార్పణమే అవుతుంది.

**కార్యమిత్యేవ యత్కర్మ నియతం సఙ్గవర్జితమ్ ।**
**క్రియతే విదుషా కర్మ తద్భవేదపి మోక్షదమ్ ॥ 19 ॥**

సంగరహితంగా తప్పక చేయవలెనను భావనతో విద్వాంసుడు కర్మలను ఆచరించినచో అదికూడా మోక్ష దాయకమే.

**అథవా యది కర్మాణి కుర్యాన్నిత్యాన్యపి ద్విజః ।**
**అకృత్వా ఫలసంన్యాసం బధ్యతే తత్ఫలేన తు ॥ 20 ॥**

దీనికి వ్యతిరేకంగా చేసే నిత్యకర్మలు కూడా ఫలసంన్యాసం చేయనిచో ఆ ద్విజుడు ఆ కర్మఫలబంధనంతో బంధింపబడతాడు.

**తస్మాత్సర్వప్రయత్నేన త్యక్త్వా కర్మాశ్రితం ఫలమ్ ।**
**అవిద్వానపి కుర్వీత కర్మాప్నోతి చిరాత్పదమ్ ॥ 21 ॥**

అందువల్ల అవిద్వాంసుడైనా అన్ని ప్రయత్నాలతో కర్మాశ్రితఫలాన్ని త్యాగం చేయాలి. దీనితో అతనికి తొందరలోనే పరమపదప్రాప్తి సిద్ధిస్తుంది.

**కర్మణా క్షీయతే పాపమైహికం పౌర్వికం తథా ।**
**మనః ప్రసాదమన్వేతి బ్రహ్మవిజ్ఞాయతే నరః ॥ 22 ॥**

ఈ నిష్కామ కర్మతో ఈ జన్మలోని పూర్వజన్మలోని పాపాలన్నీ నశించి, చిత్తానికి ప్రసన్నత చేకూరుతుంది. దాంతో నరుడు బ్రహ్మజ్ఞుడవుతాడు.

**కర్మణా సహితాత్ జ్ఞానాత్ సమ్యగ్యోగోఽభిజాయతే ।**
**జ్ఞానం చ కర్మసహితం జాయతే దోషవర్జితమ్ ॥ 23 ॥**

కర్మయుక్తమైన జ్ఞానంతో మంచి యోగం ప్రాప్తిస్తుంది. కర్మసహితమైన జ్ఞానం దోషరహితమవుతుంది.

**తస్మాత్సర్వప్రయత్నేన యత్ర తత్రాశ్రమే రతః ।**
**కర్మాణీశ్వరతుష్ట్యర్థం కుర్యాన్నైష్కర్మ్యమాప్నుయాత్ ॥ 24 ॥**

అందువల్ల ఏ ఆశ్రమంలో ఉన్నా సరే ప్రయత్నంతో భగవత్ప్రీతికొరకు కర్మల నాచరించాలి. దానితో నైష్కర్మ్యం ప్రాప్తిస్తుంది.

**సంప్రాప్య పరమం జ్ఞానం నైష్కర్మ్యం తత్ప్రసాదతః ।**
**ఏకాకీ నిర్మమః శాంతో జీవన్నేవ విముచ్యతే ॥ 25 ॥**

పరమజ్ఞానాన్ని పొందిన తర్వాత దాని ప్రభావంతో నైష్కర్మ్యసిద్ధి పొంది ఏకాకి అయి మమతాశూన్యుడై శాంతిని పొందినవాడు జీవితకాలంలోనే ముక్తిని పొందుతాడు. అనగా జీవన్ముక్తుడవుతాడు.

**వీక్షతే పరమాత్మానం పరం బ్రహ్మ మహేశ్వరమ్ ।**
**నిత్యానందీ నిరాభాసస్తస్మిన్నేవ లయం వ్రజేత్ ॥ 26 ॥**

అటువంటి వ్యక్తి నిత్యానంద స్వరూపుడు, స్వతః ప్రకాశవంతుడు, పరమేశ్వరుడు, పరబ్రహ్మ, పరమాత్మ సాక్షాత్కారాన్ని పొంది అతనిలోనే లీనమవుతాడు.

**తస్మాత్సేవేత సతతం కర్మయోగం ప్రసన్నధీః ।**
**తృప్తయే పరమేశస్య తత్పదం యాతి శాశ్వతమ్ ॥ 27 ॥**

అందువల్ల ప్రసన్నచిత్తం కల్గి పరమేశ్వర ప్రీత్యర్థం నిరంతరం కర్మయోగాన్ని ఆశ్రయించాలి. దీనితో పరమేశ్వరుని శాశ్వతస్థానాన్ని పొందుతాడు.

**ఏతద్వః కథితం సర్వం చాతురాశ్రమ్యముత్తమమ్ ।**
**న హ్యేతత్సమతిక్రమ్య సిద్ధిం విన్దతి మానవః ॥ 28 ॥**

ఈ విధంగా మీకు ఈ నాలుగు ఆశ్రమాల సంపూర్ణమైన శ్రేష్ఠక్రమాన్ని వివరించాను. ఈ క్రమాన్ని అతి క్రమించిన ఏ వ్యక్తి సిద్ధిని పొందలేదు.

**ఇతి శ్రీకూర్మపురాణే వర్ణాశ్రమక్రమవర్ణనం నామ తృతీయోఽధ్యాయః ॥ 3 ॥**

శ్రీకూర్మపురాణంలో వర్ణాశ్రమక్రమవర్ణనమనే తృతీయాధ్యాయం ॥ 3 ॥

## చతుర్థోஉధ్యాయః - నాల్గవ అధ్యాయం
## ప్రాకృతసర్గవర్ణనమ్ - ప్రాకృతసర్గవర్ణనం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**శ్రుత్వాஉஉశ్రమవిధిం కృత్స్నమృషయో హృష్టచేతసః ।**
**నమస్కృత్య హృషీకేశం పునర్వచనమబ్రువన్ ॥ 1 ॥**

సంపూర్ణమైన ఆశ్రమవిధిని విని ఋషులు సంతుష్టచిత్తులై హృషీకేశునకు నమస్కరించి మళ్ళీ ఇట్లన్నారు.

**మునయః ఊచుః :-** మునులు పలికారు.

**భాషితం భవతా సర్వం చాతురాశ్రమ్యముత్తమమ్ ।**
**ఇదానీం శ్రోతుమిచ్ఛామో యథా సమ్భవతే జగత్ ॥ 2 ॥**

ఓ పూజ్యుడా! మీరు శ్రేష్ఠమైన నాలుగు ఆశ్రమాల విషయం అంతా వివరించారు. ఇప్పుడు మేము జగత్తు సృష్టి ఎట్లా జరుగుతుందో వినాలని ఉత్సాహంతో ఉన్నాము.

**కుతః సర్వమిదం జాతం కస్మింశ్చ లయమేష్యతి ।**
**నియన్తా కశ్చ సర్వేషాం వదస్వ పురుషోత్తమ ॥ 3 ॥**

ఓ పురుషోత్తమా! ఈ ప్రపంచమంతా ఎక్కడ నుండి ఉత్పన్నమైనది? ఎందులో లీనమవుతుంది? దీనంతటికి నియామకుడెవరు? ఇదంతా మాకు వివరించండి.

**శ్రుత్వా నారాయణో వాక్యమృషీణాం కూర్మరూపధృక్ ।**
**ప్రాహ గమ్భీరయా వాచా భూతానాం ప్రభవోஉవ్యయః ॥ 4 ॥**

ఋషుల మాట విని కూర్మరూపధారి, సమస్తప్రాణుల ఉత్పత్తి-వినాశాలకు కారణభూతుడైన నారాయణుడు గంభీరమైన మాటతో పలికాడు.

**శ్రీకూర్మ ఉవాచ :-** శ్రీకూర్మమూర్తి పలికాడు.

**మహేశ్వరః పరోஉవ్యక్తః చతుర్వ్యూహః సనాతనః ।**
**అనంతశ్చాప్రమేయశ్చ నియన్తా సర్వతోముఖః ॥ 5 ॥**

నాల్గువైపుల ముఖాలు గల మహేశ్వరుడు ప్రకృతి కంటె పరుడు, అవ్యక్తుడు నాల్గువ్యూహాలు గలవాడు, సనాతనుడు, అనంతుడు, అప్రమేయుడు, జగన్నియంత కూడ.

**అవ్యక్తం కారణం యత్తన్నిత్యం సదసదాత్మకమ్ ।**
**ప్రధానం ప్రకృతిశ్చేతి యమాహుస్తత్త్వచిన్తకాః ॥ 6 ॥**

**గంధవర్ణరసైర్హీనం శబ్దస్పర్శవివర్జితమ్ ।**
**అజరం ధ్రువమక్షయ్యం నిత్యం స్వాత్మన్యవస్థితమ్ ॥ 7 ॥**

తత్త్వచింతకులు చెప్పే ప్రధానము-ప్రకృతి, సత్-అసత్ స్వరూపుడు, అవ్యక్తుడు, నిత్యుడు, కారణ భూతుడు, గంధము-వర్ణము-రసము లేనివాడు, శబ్ద-స్పర్శ రహితుడు, అజరుడు, ధ్రువుడు, నాశం లేనివాడు, నిత్యం తన ఆత్మలోనే ఉండేవాడు, ఈ పరమేశ్వరుడు.

**జగద్యోనిర్మహాభూతం పరబ్రహ్మ సనాతనమ్ ।**
**విగ్రహః సర్వభూతానామాత్మనాఽధిష్ఠితం మహత్ ॥ 8 ॥**

**అనాద్యంతమజం సూక్ష్మం త్రిగుణం ప్రభవాప్యయమ్ ।**
**అసాంప్రతమవిజ్ఞేయం బ్రహ్మాగ్రే సమవర్తత ॥ 9 ॥**

తన ఆత్మలోనే ఉన్నవాడు, ప్రపంచానికి బీజరూపమైనవాడు, మహాభూతము, సర్వప్రాణిస్వరూపుడు, తనచే ఆశ్రయింపబడిన మహత్తత్త్వస్వరూపుడు ఆది-అంత-జన్మరహితుడు, సూక్ష్మరూపుడు, త్రిగుణుడు, ఉత్పత్తి ప్రలయకారకుడు, శాశ్వతుడు, తెలియ వీలులేనివాడు అయిన బ్రహ్మ మొదట ఉండెను.

**గుణసామ్యే తదా తస్మిన్ పురుషే చాత్మని స్థితే ।**
**ప్రాకృతః ప్రలయో జ్ఞేయో యావద్విశ్వసముద్భవః ॥ 10 ॥**

ఆ సమయంలో సత్త్వరజస్తమోగుణములు పరిణామము చెందక సామ్యావస్థలో ఉండగా, పరమపురుషుడు స్వస్వరూపమందు నెలకొని ఉండగా, ప్రపంచసృష్టి ప్రారంభము కానంతవరకు ఉన్న స్థితిని ప్రాకృతప్రళయముగా తెలుసుకొనవలెను.

**బ్రాహ్మీ రాత్రిరియం ప్రోక్తా అహః సృష్టిరుదాహృతా ।**
**అహర్న విద్యతే తస్య న రాత్రి ర్హ్యుపచారతః ॥ 11 ॥**

ప్రళయం బ్రహ్మకు రాత్రి అని, సృష్టి పగలు అని చెప్పబడినది. నిజానికి అతనికి పగలు రాత్రి ఉండవు.

**నిశాన్తే ప్రతిబుద్ధోఽసౌ జగదాదిరనాదిమాన్ ।**
**సర్వభూతమయోఽవ్యక్తో హ్యన్తర్యామీశ్వరః పరః ॥ 12 ॥**

**ప్రకృతిం పురుషం చైవ ప్రవిశ్యాశు మహేశ్వరః ।**
**క్షోభయామాస యోగేన పరేణ పరమేశ్వరః ॥ 13 ॥**

అనాది అయిన అతడు జగత్తుకు మొదటి కారణం. రాత్రి గడచిపోగానే అతడు మేల్కొన్నాడు. సర్వప్రాణి మయుడు, అవ్యక్తుడు, అంతర్యామి, పరుడు అయిన ఆ పరమేశ్వరుడు ప్రకృతి-పురుషుల్లో ప్రవేశించి పరమయోగంతో వారికి క్షోభను కలిగించినాడు.

**యథా మదో నవస్త్రీణాం యథా వా మాధవోఽనిలః ।**
**అనుప్రవిష్టః క్షోభాయ తథాఽసౌ యోగమూర్తిమాన్ ॥ 14 ॥**

నవయువతుల మదము, వసంతఋతుసంబంధమైన వాయువు పురుషుల్లో క్షోభ కలిగిస్తున్నట్లుగా యోగస్వరూపుడైన పరమేశ్వరుడు క్షోభను కలిగించుటకు ప్రకృతిలో ప్రవేశించాడు.

**స ఏవ క్షోభకో విప్రాః క్షోభ్యశ్చ పరమేశ్వరః ।**
**స సంకోచవికాసాభ్యాం ప్రధానత్వేఽపి చ స్థితః ॥ 15 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఆ పరమేశ్వరుడే క్షోభను కలిగించేవాడు. స్వయంగా క్షోభనందేవాడు. అతడు సృష్టి ప్రలయాలకు కారణమై ప్రధానమని చెప్పబడినాడు.

**ప్రధానాత్ క్షోభ్యమాణాచ్చ తథా పుంసః పురాతనాత్ ।**
**ప్రాదురాసీన్మహత్ బీజం ప్రధానపురుషాత్మకమ్ ॥ 16 ॥**

ప్రధానుడైన పురాతనపురుషుడు క్షుబ్ధుడైనందువల్ల ప్రకృతిపురుషాత్మకమైన మహద్బీజం ఆవిర్భవించింది.

**మహానాత్మా మతిర్బ్రహ్మా ప్రబుద్ధిః ఖ్యాతిరీశ్వరః ।**
**ప్రజ్ఞా ధృతిః స్మృతిః సంవిదేతస్మాదితి తత్ స్మృతమ్ ॥ 17 ॥**

ఈ కారణంగా ఆ మహద్బీజం మహత్తు ఆత్మ, మతి, బ్రహ్మ, ప్రబుద్ధి, ఖ్యాతి, ఈశ్వరుడు, ప్రజ్ఞ, ధృతి, స్మృతి, సంవిత్ పేర్లను పొందింది.

**వైకారికస్తైజసశ్చ భూతాదిశ్చైవ తామసః ।**
**త్రివిధోఽయమహంకారో మహతః సమ్బభూవ హ ॥ 18 ॥**

మహత్తత్త్వం నుండి సమస్త ప్రాణుల సృష్టికి కారణమైన వైకారిక-తైజస-తామసములనే మూడు విధాల అహంకారం ఉత్పన్నమైంది.

**అహంకారోఽభిమానశ్చ కర్తా మన్తా చ స స్మృతః ।**
**ఆత్మా చ పుద్గలో జీవో యతః సర్వాః ప్రవృత్తయః ॥ 19 ॥**

ఆ అహంకారానికే కర్త-మంత-ఆత్మ-పుద్గల-జీవ అని పేర్లు. ఆ అహంకారం నుండే సమస్త ప్రవృత్తులు కలుగుతాయి.

**పఞ్చభూతాన్యహంకారాత్ తన్మాత్రాణి చ జజ్ఞిరే ।**
**ఇంద్రియాణి తథా దేవాః సర్వం తస్యాత్మజం జగత్ ॥ 20 ॥**

అహంకారం నుండే మహాభూతాలైన పృథ్వీ-జలం-తేజస్సు-వాయువు-ఆకాశం అనేవి ఐదు, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలనే తన్మాత్రలు ఐదు, ఇంద్రియాలు వాని అధిష్ఠాన దేవతలు ఉద్భవించినవి. ఈ సమస్త జగత్తు దాని వల్లనే ఉత్పన్నమైనది.

**మనస్త్వవ్య క్తజం ప్రోక్తం వికారః ప్రథమః స్మృతః ।**
**యేనాసౌ జాయతే కర్తా భూతాదీంశ్చానుపశ్యతి ॥ 21 ॥**

అవ్యక్తం నుండి ఉత్పన్నమైన మనస్సు ప్రథమవికారంగా గుర్తింపు పొందింది. ఆ కారణంగా ఇది కర్త. భూతాదులను చూచేది.

**వైకారికాదహంకారాత్ సర్గో వైకారికోఽభవత్ ।**
**తైజసానీన్ద్రియాణి స్యుర్దేవా వైకారికా దశ ॥ 22 ॥**

వైకారికాహంకారంతో వైకారికసృష్టి ఏర్పడింది. ఇంద్రియాలు తైజసములు, పది మంది దేవతలు వైకారికులు.

**ఏకాదశం మనస్తత్ర స్వగుణేనోభయాత్మకమ్ ।**
**భూతతన్మాత్రసర్గోఽయం భూతాదేరభవన్ ప్రజాః ॥ 23 ॥**

పదకొండో ఇంద్రియము మనస్సు. తన గుణాల కారణంగా ఇది ఉభయాత్మకము అనగా సాత్త్వికరాజసాత్మకము. ఇది భూతతన్మాత్రల సృష్టి. ఈ భూతాది వల్లనే అనగా తామసాహంకారంవల్లనే ప్రజోత్పత్తి జరిగింది.

**భూతాదిస్తు వికుర్వాణః శబ్దమాత్రం ససర్జ హ ।**
**ఆకాశం సుషిరం తస్మాదుత్పన్నం శబ్దలక్షణమ్ ॥ 24 ॥**

వికారాన్ని పొందిన భూతాది శబ్దతన్మాత్రమును ఉత్పత్తిచేసింది. శబ్దతన్మాత్రవల్ల శబ్దలక్షణంకల అవకాశస్వరూపమున్న ఆకాశం ఉత్పన్నమైంది.

**ఆకాశస్తు వికుర్వాణః స్పర్శమాత్రం ససర్జ హ ।**
**వాయురుత్పద్యతే తస్మాత్ తస్య స్పర్శో గుణో మతః ॥ 25 ॥**

వికారమును పొందిన ఆకాశం స్పర్శతన్మాత్రను ఉత్పన్నం చేసినది. దానితో వాయువు ఉత్పన్నమైంది. వాయుగుణం స్పర్శ.

**వాయుశ్చాపి వికుర్వాణో రూపమాత్రం ససర్జ హ ।**
**జ్యోతిరుత్పద్యతే వాయోస్తద్రూపగుణముచ్యతే ॥ 26 ॥**

వాయువు కూడా వికారాన్ని పొంది రూపతన్మాత్రను ఉత్పత్తి చేసింది. వాయువు వల్ల తేజస్సు ఉత్పన్నమైనది. దీనికి రూపం గుణము.

**జ్యోతిశ్చాపి వికుర్వాణం రసమాత్రం ససర్జ హ ।**
**సమ్భవన్తి తతోఽంభాంసి రసాధారాణి తాని తు ॥ 27 ॥**

వికారాన్ని పొందిన తేజస్సు కూడ రసతన్మాత్రను సృష్టించింది. దానితో జలం ఉత్పన్నమైనది. ఈ జలం రసగుణానికి ఆధారం.

**ఆపశ్చాపి వికుర్వన్త్యో గన్ధమాత్రం ససర్జిరే ।**
**సంఘాతో జాయతే తస్మాత్ తస్య గంధో గుణో మతః ॥ 28 ॥**

వికారాన్ని పొందిన జలం గంధతన్మాత్రలను ఉత్పన్నం చేసినది. దీనివల్ల సంఘాతం (పృథ్వీతత్త్వం) ఉత్పన్నమైనది. దీని గుణం గంధము.

**ఆకాశం శబ్దమాత్రం యత్ స్పర్శమాత్రం సమావృణోత్ ।**
**ద్విగుణస్తు తతో వాయుః శబ్దస్పర్శాత్మకోఽభవత్ ॥ 29 ॥**

ఆకాశానికి సంబంధించిన శబ్దతన్మాత్ర స్పర్శతన్మాత్రనావరించింది. అందువల్ల వాయువు శబ్దము మరియు స్పర్శ గుణాలు రెంటిని పొందింది.

**రూపం తథైవావిశతః శబ్దస్పర్శౌ గుణావుభౌ ।**
**త్రిగుణః స్యాత్ తతో వహ్నిః స శబ్దస్పర్శరూపవాన్ ॥ 30 ॥**

అదే విధంగా రూపగుణం శబ్ద-స్పర్శ గుణాలు రెంటిని కలుపుకొని అగ్ని త్రిగుణాత్మకమైనది.

**శబ్దః స్పర్శశ్చ రూపం చ రసమాత్రం సమావిశన్ ।**
**తస్మాచ్చతుర్గుణా ఆపో విజ్ఞేయాస్తు రసాత్మికాః ॥ 31 ॥**

శబ్దస్పర్శ రూపాలతో రసతన్మాత్ర ప్రవేశించటంతో జలములు నాలుగు గుణాలు కల రసాత్మకాలుగా గుర్తింపబడినవి.

**శబ్దః స్పర్శశ్చ రూపం చ రసో గన్ధం సమావిశత్ ।**
**తస్మాత్ పఞ్చగుణా భూమిః స్థూలా భూతేషు శబ్ద్యతే ॥ 32 ॥**

శబ్ద స్పర్శ రూప గుణాలతో గంధం కలిసినందువల్ల భూమి అయిదు గుణాలు కలదై పంచభుతాల్లో స్థూల యని పిలువబడినది.

**శాంతా ఘోరాశ్చ మూఢాశ్చ విశేషాస్తేన తే స్మృతాః ।**
**పరస్పరానుప్రవేశాత్ ధారయన్తి పరస్పరమ్ ॥ 33 ॥**

ఈ కారణం వల్లనే ఇవి శాంత, ఘోర, మూఢ విశేషాలుగా చెప్పబడినవి. ఇవి పరస్పరం ఒకదానిలో నొకటి ప్రవేశించిన కారణం వల్ల ఒకటి మరొక దాన్ని ధరిస్తున్నాయి.

**ఏతే సప్త మహాత్మానో హ్యన్యోన్యస్య సమాశ్రయాత్ ।**
**నాశక్నువన్ ప్రజాః స్రష్టుమసమాగమ్య కృత్స్నశః ॥ 34 ॥**

మహత్తు, అహంకారము, పంచమహాభూతాలు అను ఈ ఏడు తత్త్వాలు ఒకటి మరొకదాన్ని ఆశ్రయించి ఉన్నకారణంగా సమగ్రంగా ప్రజలను సృష్టిచేయటంలో సమర్థములు కాలేదు.

**పురుషాధిష్ఠితత్వాచ్చ అవ్యక్తానుగ్రహేణ చ ।**
**మహదాదయో విశేషాన్తా హ్యణ్డముత్పాదయన్తి తే ॥ 35 ॥**

చేతనుడైన పురుషుడు అధిష్ఠించి నందువల్లనూ, అవ్యక్తము అనుగ్రహించిన కారణంగానూ, మహత్తు మొదలుకొని విశేషములవరకు ఉన్న తత్త్వాలన్నీ అండాన్ని పుట్టిస్తున్నాయి.

**ఏకకాలసముత్పన్నం జలబుద్బుదవచ్చ తత్ ।**
**విశేషేభ్యోఽణ్డమభవత్ బృహత్ తదుదకేశయమ్ ॥ 36 ॥**

విశేషాలనుండి జలంలోని బుడగలవలే, నీటిలోనే ఉండి పెద్ద అండము (బ్రహ్మాండము) ఒకేసారి పుట్టింది.

**తస్మిన్ కార్యస్య కరణం సంసిద్ధిః పరమేష్ఠినః ।**
**ప్రాకృతేఽణ్డే వివృత్తః స క్షేత్రజ్ఞో బ్రహ్మసంజ్ఞితః ॥ 37 ॥**

ఆ బృహదండంలో సృష్టిస్వరూపమైన కార్యకరణసిద్ధి పరమేష్ఠికి ఏర్పడినది. ప్రాకృత అండంలో బ్రహ్మసంజ్ఞగల క్షేత్రజ్ఞుడు ప్రపంచరూపంగా వివర్తము చెందినాడు. అనగా వృద్ధి పొందినాడు.

**స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే ।**
**ఆదికర్తా స భూతానాం బ్రహ్మాఽగ్రే సమవర్తత ॥ 38 ॥**

ఆయన మొట్టమొదటి శరీరధారి. ఆయనే పురుషుడు. సమస్త ప్రాణులకు ఆదికర్త అయిన బ్రహ్మ అన్నిటికంటే ముందు ఉన్నాడు.

**యమాహుః పురుషం హంసం ప్రధానాత్ పరతః స్థితమ్ ।**
**హిరణ్యగర్భం కపిలం ఛన్దోమూర్తిం సనాతనమ్ ॥ 39 ॥**

ప్రధానము కంటే పరునిగా ఉన్న ఆ పురుషుని హంస, హిరణ్యగర్భుడు, కపిలుడు, ఛందోమూర్తి, సనాతనుడు అంటారు.

**మేరురుల్బమభూత్తస్య జరాయుశ్చాపి పర్వతాః ।**
**గర్భోదకం సముద్రాశ్చ తస్యాసన్ పరమాత్మనః ॥ 40 ॥**

ఆ పరమాత్మకు గర్భవేష్టనం మేరువు. పర్వతాలు గర్భానికి ఆవరణ రూపమైన చర్మము జరాయువు. అన్ని సముద్రాలు గర్భోదకమైనవి.

**తస్మిన్నణ్డేఽభవద్విశ్వం సదేవాసురమానుషమ్ ।**
**చంద్రాదిత్యౌ సనక్షత్రౌ సగ్రహౌ సహ వాయునా ॥ 41 ॥**

ఆ అండంలో దేవతలు, అసురులు, మనుష్యులతో కూడ సంపూర్ణవిశ్వం ఉత్పన్నమైనది. అట్లే గ్రహాలు, నక్షత్రాలు, వాయువు సూర్యచంద్రులు ఉత్పన్నమైనారు.

**అద్భిర్దశగుణాభిశ్చ బాహ్యతోఽణ్డం సమావృతమ్ ।**
**ఆపో దశగుణేనైవ తేజసా బాహ్యతో వృతాః ॥ 42 ॥**

బ్రహ్మాండానికి వెలుపల తనకంటే పదిరెట్లు అధికంగా జలం ఆవరించి ఉంది. జలం బయట పదిరెట్లు తేజస్సు ఆవరించింది.

**తేజో దశగుణేనైవ బాహ్యతో వాయునా వృతమ్ ।**
**ఆకాశేనావృతో వాయుః ఖం తు భూతాదినా వృతమ్ ॥ 43 ॥**

తేజస్సు బయట పదింతలు వాయువావరించింది. ఈ విధంగా వాయువు ఆకాశంతో ఆవృతమైంది. ఆకాశం భూతాది అహంకారంతో ఆవరింపనైనది.

**భూతాదిర్మహతా తద్వదవ్యక్తేనావృతో మహాన్ ।**
**ఏతే లోకా మహాత్మానః సర్వతత్త్వాభిమానినః ॥ 44 ॥**

మహత్తత్త్వముచేత అహంకారము ఆవరింపబడినది. అట్లే మహాత్తత్త్వము అవ్యక్తముచేత ఆవరింపబడినది. ఈ లోకాలు సమస్తతత్త్వముల అభిమానముగల మహాస్వరూపం గలవి.

**వసన్తి తత్ర పురుషాస్తదాత్మానో వ్యవస్థితాః ।**
**ఈశ్వరా యోగధర్మాణో యే చాన్యే తత్త్వచిన్తకాః ॥ 45 ॥**

ఆ లోకాల్లో తమ ఆత్మరూపం కల ఐశ్వర్యసంపన్నులు, యోగధర్మయుక్తులు అయిన పురుషులు నివసిస్తున్నారు. వీరే కాక తత్త్వచింతకు లెందరో ఉన్నారు.

**సర్వజ్ఞాః శాన్తరజసో నిత్యం ముదితమానసాః ।**
**ఏతైరావరణైరణ్డం సప్తభిః ప్రాకృతైర్వృతమ్ ॥ 46 ॥**

వారందరు సర్వజ్ఞులు, శాంతించిన రజోగుణము కలవారు. సత్త్వసంపన్నులై నిత్యం ప్రసన్నచిత్తం కల్గినవారు. ఈ బ్రహ్మాండం ఈ ప్రాకృతాలైన సప్త ఆవరణాలతో ఆవృతమై ఉన్నది.

**ఏతావచ్ఛక్యతే వక్తుం మాయైషా గహనా ద్విజాః ! ।**
**ఏతత్ప్రాధానికం కార్యం యన్మయా బీజమీరితమ్ ॥ 47 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఈ విషయంలో ఇంత మాత్రమే చెప్పవచ్చు. ఈ మాయ మిక్కిలి గహనమైనది. బీజరూపంతో నేను వర్ణించినదంతా ప్రధానము. అనగా ప్రకృతికార్యం.

**ప్రజాపతేః పరామూర్తిరితీయం వైదికీ శ్రుతిః ।**
**బ్రహ్మాణ్డమేతత్సకలం సప్తలోకతలాన్వితమ్ ॥ 48 ॥**

**ద్వితీయం తస్య దేవస్య శరీరం పరమేష్ఠినః ।**
**హిరణ్యగర్భో భగవాన్ బ్రహ్మా వై కనకాణ్డజః ॥ 49 ॥**

ఈ మాయ మరేదో కాదు ప్రజాపతి పరామూర్తియే. ఇది వేదాల అభిమతం. ఏడులోకాలతో కూడిన ఈ బ్రహ్మాండమంతా పరమేష్ఠి రెండవశరీరం. హిరణ్యగర్భుడైన భగవంతుడగు హిరణ్యగర్భుడనే బ్రహ్మ బంగారపు అండం నుండి జన్మించాడు.

**తృతీయం భగవద్రూపం ప్రాహుర్వేదార్థవేదినః ।**
**రజోగుణమయం చాన్యత్ రూపం తస్యైవ ధీమతః ॥ 50 ॥**

వేదార్థవేదులు ఇతణ్ణి భగవంతుని మూడవ రూపంగా చెప్పారు. ఆ ధీమంతుని మరోరూపం రజోగుణమయం.

**చతుర్ముఖః స భగవాన్ జగత్సృష్టౌ ప్రవర్తతే ।**
**సృష్టం చ పాతి సకలం విశ్వాత్మా విశ్వతోముఖః ॥ 51 ॥**

**సత్త్వం గుణముపాశ్రిత్య విష్ణుర్విశ్వేశ్వరః స్వయమ్ ।**
**అన్తకాలే స్వయం దేవః సర్వాత్మా పరమేశ్వరః ॥ 52 ॥**

**తమోగుణం సమాశ్రిత్య రుద్రః సంహరతే జగత్ ।**
**ఏకోఽపి సన్మహాదేవస్త్రిధాఽసౌ సమవస్థితః ॥ 53 ॥**

చతుర్ముఖుడైన భగవంతుడైన బ్రహ్మ జగత్తును సృష్టించటంలో ప్రవర్తిస్తాడు. సృష్టించిన సకాలాన్ని విశ్వతోముఖుడైన విశ్వాత్మ సత్త్వగుణాన్నాశ్రయించి విశ్వేశ్వరుడైన విష్ణువు స్వయంగా పాలిస్తాడు. అంత్యకాలంలో దేవుడు, సర్వులకు ఆత్మ అయిన పరమేశ్వరుడు తమోగుణాన్ని ఆశ్రయించి రుద్రుడై జగత్తును సంహరిస్తాడు. మహాదేవుడు ఒక్కడే అయినా మూడు రూపాల్లో ఉన్నాడు.

**సర్గరక్షాలయగుణైర్నిర్గుణోఽపి నిరఞ్జనః ।**
**ఏకధా సద్ద్విధా చైవ త్రిధా చ బహుధా పునః ॥ 54 ॥**

సృష్టి స్థితి లయ గుణాలతో నిర్గుణుడై నిరంజనుడైకూడా ఒక్కోసారి ఒకడుగా, మరోసారి ఇద్దరిగా, ఇంకోసారి ముగ్గురిగా, మరోసారి అనంతరూపాలను ధరిస్తాడు.

**యోగేశ్వరః శరీరాణి కరోతి వికరోతి చ ।**
**నానాకృతిక్రియారూపనామవంతి స్వలీలయా ॥ 55 ॥**

యోగేశ్వరుడు తన లీలతో అనేక ఆకారాలు, క్రియలు, రూపాలు, పేర్లతో శరీరాలను నిర్మిస్తాడు.

**హితాయ చైవ భక్తానాం స ఏవ గ్రసతే పునః ।**
**త్రిధా విభజ్య చాఽఽత్మానం త్రైలోక్యే సంప్రవర్తతే ॥ 56 ॥**

భక్తుల మేలు కొరకు తానే మళ్ళీ సంహరిస్తాడు. తనను మూడు విధాలుగా విభజించుకొని ముల్లోకాల్లో ప్రవర్తిస్తాడు.

**సృజతే గ్రసతే చైవ వీక్షతే చ విశేషతః ।**
**యస్మాత్సృష్ట్వానుగృహ్ణాతి గ్రసతే చ పునః ప్రజాః ॥ 57 ॥**

ఈ విధంగా ఆయన సృష్టిస్తాడు, సంహరిస్తాడు, విశేషంగా సంరక్షిస్తాడు. ప్రజలను సృష్టించి అనుగ్రహిస్తాడు. మళ్ళీ సంహరిస్తాడు.

**గుణాత్మకత్వాత్త్రైకాల్యే తస్మాదేకః స ఉచ్యతే ।**
**అగ్రే హిరణ్యగర్భః స ప్రాదుర్భూతః సనాతనః ॥ 58 ॥**

ఈ కారణంతోనే మూడు కాలాల్లోను సత్త్వరజస్తమోరూప త్రిగుణాత్మకుడు. అందువల్లనే ఆ పరమాత్మ ఒక్కడే. మొదట సనాతనుడైన హిరణ్యగర్భుడు అవతరించాడు.

**ఆదిత్వాదాదిదేవోఽసౌ అజాతత్వాదజః స్మృతః ।**
**పాతి యస్మాత్ప్రజాః సర్వాః ప్రజాపతిరితి స్మృతః ॥ 59 ॥**

ఆదిపురుషుడైనందువల్ల ఇతడు ఆదిదేవుడు. పుట్టుక లేనివాడైనందువల్ల అజుడు అని తలచబడినాడు. ప్రజలందరిని పాలించే కారణంగా ప్రజాపతి అయినాడు.

**దేవేషు చ మహాదేవో మహాదేవ ఇతి స్మృతః ।**
**బృహత్త్వాచ్చ స్మృతో బ్రహ్మ పరత్వాత్పరమేశ్వరః ॥ 60 ॥**

దేవతల్లో మహాదేవుడు. అందువల్ల మహాదేవునిగా ప్రసిద్ధుడు. బృహత్(పెద్ద) అయిన కారణంతో బ్రహ్మ, ఈ సృష్టికంతటికి పరుడైనందువల్ల పరమేశ్వరుడయినాడు.

**వశిత్వాదప్యవశ్యత్వాదీశ్వరః పరిభాషితః ।**
**ఋషిః సర్వత్రగత్వేన హరిః సర్వహరో యతః ॥ 61 ॥**

**అనుత్పాదాచ్చ పూర్వత్వాత్ స్వయమ్భూరితి స స్మృతః ।**
**నారాణామయనో యస్మాత్తేన నారాయణః స్మృతః ॥ 62 ॥**

అందరిని తన వశంలో పెట్టుకొని తాను ఇతరులకు వశుడు కానందువల్ల ఈశ్వరుడని, అన్ని ప్రదేశాలు వెళ్ళగల్గినందువల్ల ఋషి అని, అన్నింటిని హరించేవాడైనందువల్ల హరి అని, పుట్టుక లేక పూర్వం నుండి ఉన్నందువల్ల స్వయంభువు అని,నారములకు అనగా జలములకు అయనం (ఆశ్రయం-స్థానం) అయినందువల్ల నారాయణుడని గుర్తింపు పొందినాడు.

**హరః సంసారహరణాత్ విభుత్వాద్విష్ణురుచ్యతే ।**
**భగవాన్ సర్వవిజ్ఞానాదవనాదోమితి స్మృతః ॥ 63 ॥**

సంసారాన్ని హరించే కారణంగా హరుడని, వ్యాపించి ఉన్నందువల్ల విష్ణువని, అన్నీ తెలిసిన వాడైనందు వల్ల భగవాన్ అని, రక్షించే కార్యం కలవాడు కాబట్టి 'ఓం' అని గుర్తింపు పొందినాడు.

**సర్వజ్ఞః సర్వవిజ్ఞానాత్ సర్వః సర్వమయో యతః ।**
**శివః స నిర్మలో యస్మాత్ విభుః సర్వగతో యతః ॥ 64 ॥**

అన్నింటి విశేషజ్ఞానమున్నవాడు కాబట్టి సర్వజ్ఞుడు అని, అందరి ఆత్మస్వరూపుడైనందువల్ల 'సర్వః' అని, నిర్మలుడైన కారణంగా శివః అని, సర్వగతుడు కాబట్టి విభుః అని చెప్పబడినాడు.

**తారణాత్ సర్వదుఃఖానాం తారకః పరిగీయతే ।**
**బహునాఽత్ర కిముక్తేన సర్వం బ్రహ్మమయం జగత్ ॥ 65 ॥**

అన్ని దుఃఖాలనుండి తరింపచేసేవాడు కాబట్టి తారకః అని కీర్తింపబడినాడు. అనేకంగా చెప్పటమెందుకు? ఈ జగత్తంతా బ్రహ్మమయమే.

**అనేకభేదభిన్నస్తు క్రీడతే పరమేశ్వరః ।**
**ఇత్యేష ప్రాకృతః సర్గః సంక్షేపాత్ కథితో మయా ।**
**అబుద్ధిపూర్వికాం విప్రా బ్రాహ్మీం సృష్టిం నిబోధత ॥ 66 ॥**

పరమేశ్వరుడు అనేక రూపాల్లో విభక్తుడై అనేక విధాలైన క్రీడలు చేస్తుంటాడు. ఓ బ్రాహ్మణులారా! నేను సంక్షేపంగా ప్రాకృతసృష్టిని వివరించాను. ఇక అబుద్ధిపూర్వకమైన బ్రహ్మసృష్టిని గూర్చి వినండి.

**ఇతి శ్రీకూర్మపురాణే ప్రాకృతసర్గవర్ణనం నామ చతుర్థోఽధ్యాయః ॥ 4 ॥**

శ్రీకూర్మపురాణంలో ప్రాకృతసర్గవర్ణనం అనే నాల్గవ అధ్యాయం ॥ 4 ॥



## పంచమోఽధ్యాయః - ఐదవ అధ్యాయం

## కాలసంఖ్యావివరణమ్ - కాలసంఖ్యావివరణం

**శ్రీకూర్మ ఉవాచ :-** శ్రీకూర్మమూర్తి పలికాడు.

**స్వయమ్భువో వివృత్తస్య కాలసంఖ్యా ద్విజోత్తమాః ।**
**న శక్యతే సమాఖ్యాతుం బహువర్షైరపి స్వయమ్ ॥ 1 ॥**

**కాలసంఖ్యా సమాసేన పరార్ధద్వయకల్పితా ।**
**స ఏవ స్యాత్పరః కాలః తదన్తే ప్రతిసృజ్యతే ॥ 2 ॥**

శ్రేష్ఠబ్రాహ్మణులారా! స్వయంభూబ్రహ్మకు గడచిన కాలాన్ని లెక్కించటం ఎన్ని ఏళ్ళయినా సాధ్యం కాదు. సంక్షేపంగా కాలగణన రెండు పరార్ధాలుగా చేయనైనది. అవే పరమకాలము, అది గడచిన తర్వాత ప్రలయకాలము అవుతాయి.

**నిజేన తస్య మానేన ఆయుర్వర్షశతం స్మృతమ్ ।**
**తత్పరాఖ్యం తదర్ధం చ పరార్ధమభిధీయతే ॥ 3 ॥**

తన లెక్క ప్రకారమే బ్రహ్మ ఆయుష్యం ఒక వంద సంవత్సరాలుగా చెప్పనైనది. ఈ బ్రహ్మాయుష్కాలాన్నే 'పర' మనే పేరుతో చెపుతారు. ఈ పరంలోని సగభాగమే 'పరార్ధ' మంటారు.

**కాష్ఠా పఞ్చదశ ఖ్యాతా నిమేషా ద్విజసత్తమాః ।**
**కాష్ఠాస్త్రింశత్ కలా త్రింశత్ కలా మౌహూర్తికీ గతిః ॥ 4 ॥**

ఓ ద్విజోత్తములారా! పదునైదు నిమేషాలకి ఒక కాష్ఠ. ముప్పది కాష్ఠలకు ఒక కల. ముప్పది కలలసమయాన్ని ముహూర్తకాలమంటారు.

**తావత్సంఖ్యైరహోరాత్రం ముహూర్తైర్మానుషం స్మృతమ్ ।**
**అహోరాత్రాణి తావన్తి మాసః పక్షద్వయాత్మకః ॥ 5 ॥**

అదే ముప్పది ముహూర్తాల కాలం మానవుని రాత్రింబవళ్ళు అవుతుంది. అదే సంఖ్యలో ముప్పది అహోరాత్రములకు ఒక ఒక మాసము రెండు పక్షాలు కలది.

**తైః షడ్భిరయనం వర్షం ద్వేఽయనే దక్షిణోత్తరే ।**
**అయనం దక్షిణం రాత్రిర్దేవానాముత్తరం దినమ్ ॥ 6 ॥**

ఆ మాసాలారు ఒక అయనం, దక్షిణ-ఉత్తరాలనే రెండు అయనాలు ఒక సంవత్సరం. దక్షిణాయనం దేవతలకు రాత్రి, ఉత్తరాయణం పగలు అవుతుంది.

**దివ్యైర్వర్షసహస్రైస్తు కృతత్రేతాది సంజ్ఞితమ్ ।**
**చతుర్యుగం ద్వాదశభిః తద్విభాగం నిబోధత ॥ 7 ॥**

దేవతల పన్నెండు వేల సంవత్సరాలకు కృత-త్రేత ఇత్యాది నామాలతో నాలుగు యుగాల విభాగం కలదు. దాన్ని వివరిస్తాను వినండి.

**చత్వార్యాహుః సహస్రాణి వర్షాణాం తత్కృతం యుగమ్ ।**
**తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ కృతస్య తు ॥ 8 ॥**

నాలుగువేల దేవతల సంవత్సరాల కాలం కృతయుగమని చెప్పారు. కృతయుగ ప్రమాణంగానే అనగా నాలుగు వందల సంవత్సరాల కాలం సంధ్య, అట్లే సంధ్యాంశం కృతయుగపు సంధికాలం అవుతుంది.

**త్రిశతీ ద్విశతీ సంధ్యా తథా చైకశతీ క్రమాత్ ।**
**అంశకం షట్ శతం తస్మాత్ కృతసంధ్యాంశకం వినా ॥ 9 ॥**

కృతయుగ సంధ్యాంశాన్ని వదలి క్రమంగా మూడు వందలు, రెండు వందలు, ఒక వంద లెక్కతో ఆరువందల సంవత్సరాలు త్రేతా, ద్వాపర-కలియుగాల సంధ్య అట్లే సంధ్యాంశాలవుతాయి.

**త్రిద్వ్యేక సాహస్రమతో వినా సంధ్యాంశకేన తు ।**
**త్రేతాద్వాపరతిష్యాణాం కాలజ్ఞానే ప్రకీర్తితమ్ ॥ 10 ॥**

కాలజ్ఞానానికి సంధ్యాంశాలు లేకుండా త్రేతా, ద్వాపరయుగాలు అట్లే కలియుగం వరుసగా మూడు-రెండు-వేయి దివ్య వర్షాలుగా చెప్పబడినది.

**ఏతత్ ద్వాదశసాహస్రం సాధికం పరికల్పితమ్ ।**
**తదేకసప్తతి గుణం మనోరన్తరముచ్యతే ॥ 11 ॥**

ఈ దేవతల పన్నెండు వేల సంవత్సరాల కాలపరిమాణం కొంత అధికంగా చెప్పబడినది. దీనికి డెబ్బై యొక్క రెట్ల కాలాన్ని ఒక మన్వంతరకాలమని చెప్పబడినది.

**బ్రహ్మణో దివసే విప్రా మనవః స్యుశ్చతుర్దశ ।**
**స్వాయమ్భువాదయః సర్వే తతః సావర్ణికాదయః ॥ 12 ॥**

**తైరియం పృథివీ సర్వా సప్తద్వీపా సపర్వతా ।**
**పూర్ణం యుగసహస్రం వై పరిపాల్యా నరేశ్వరైః ॥ 13 ॥**

ఓ బ్రాహ్మణులారా! బ్రహ్మ ఒక దినంలో పద్నాలుగు మన్వంతరాలవుతాయి. వారందరు స్వాయంభువు మొదలైనవారు. అట్లే సావర్ణికాదులు ఉంటారు. ఆ మన్వంతరాధిపులైన నరేశ్వరులు ఈ ఏడుద్వీపాలు, పర్వతాలు గల పృథ్విని ఒక వేయియుగాల వరకు సంపూర్ణంగా పాలిస్తారు.

**మన్వన్తరేణ చైకేన సర్వాణ్యేవాన్తరాణి వై ।**
**వ్యాఖ్యాతాని న సందేహః కల్పం కల్పేన చైవ హి ॥ 14 ॥**

ఒక మన్వంతరాన్ని వివరించటంతో ఇతర మన్వంతరాలన్నీ వివరించినట్టే భావించాలి. ఇందులో సందేహించాల్సిన పని లేదు. ప్రతికల్పం పూర్వకల్పంతో సమానంగా ఉంటుంది.

**బ్రాహ్మమేకమహః కల్పస్తావతీ రాత్రిరిష్యతే ।**
**చతుర్యుగసహస్రం తు కల్పమాహుర్మనీషిణః ॥ 15 ॥**

ఒక కల్పం బ్రహ్మకు ఒక పగలవుతుంది. రాత్రి కూడ ఒక కల్పమే. విద్వాంసులు ఒక వేయి చతుర్యుగాలు ఒక కల్పమని చెప్పారు.

**త్రీణి కల్పశతాని స్యుస్తథా షష్టిర్ద్విజోత్తమాః ।**
**బ్రహ్మణః కథితం వర్షం పరాఖ్యం తచ్ఛతం విదుః ॥ 16 ॥**

శ్రేష్ఠులైన బ్రాహ్మణులారా! మూడువందల అరవై కల్పాలు బ్రహ్మకు ఒక సంవత్సర కాలం. దానికి మూడింతల కాలానికి 'పర' అని పేరు. (అనగా 360×100=36,000 కల్పాలు లేదా100 వర్షాలు).

**తస్యాన్తే సర్వతత్త్వానాం స్వహేతౌ ప్రకృతౌ లయః ।**
**తేనాయం ప్రోచ్యతే సద్భిః ప్రాకృతః ప్రతిసంచరః ॥ 17 ॥**

ఈ పరకాలం గడచిపోగా అన్ని తత్త్వాలు తమ మూలకారణమైన ప్రకృతిలో లయమవుతాయి. అందువల్ల విద్వాంసులు దీనిని ప్రాకృత ప్రతి సంచరం(ప్రాకృత ప్రలయం) అన్నారు.

**బ్రహ్మనారాయణేశానాం త్రయాణాం ప్రకృతౌ లయః ।**
**ప్రోచ్యతే కాలయోగేన పునరేవ చ సంభవః ॥ 18 ॥**

బ్రహ్మ-విష్ణువు- మహేశ్వరులు ముగ్గురు ప్రకృతిలో లయమవుతారు. మళ్ళీ కాలయోగంలో వారి ఆవిర్భావ మవుతుందని చెప్పబడినది.

**ఏవం బ్రహ్మా చ భూతాని వాసుదేవోఽపి శంకరః ।**
**కాలేనైవ తు సృజ్యన్తే స ఏవ గ్రసతే పునః ॥ 19 ॥**

ఈ విధంగా బ్రహ్మ, ప్రాణులు, వాసుదేవుడు, అట్లే శంకరుల సృష్టి కాలంద్వారానే జరుగుతుంది. మళ్ళీ ఆ కాలమే వీరిని సంహరిస్తుంది.

**అనాదిరేష భగవాన్ కాలోఽనన్తోఽజరోఽమరః ।**
**సర్వగత్వాత్ స్వతంత్రత్వాత్ సర్వాత్మాఽసౌ మహేశ్వరః ॥ 20 ॥**

ఈ కాలం సాక్షాత్ భగవంతుడు, అనంతుడు, అజరుడు, అమరుడు అట్లే అనాది కూడా. సర్వవ్యాపి, స్వతంత్రుడు అయినందువల్ల అందరి ఆత్మ స్వరూపుడైనందు వల్ల అతడు మహేశ్వరుడు అనబడినాడు.

**బ్రహ్మణో బహవో రుద్రా హ్యన్యే నారాయణాదయః ।**
**ఏకో హి భగవానీశః కాలః కవిరితి శ్రుతిః ॥ 21 ॥**

బ్రహ్మ–రుద్ర–నారాయణాదులు చాలా మంది ఉన్నారు. కాని ప్రభువైన భగవంతుడొక్కడే. అతనినే 'కాల'మని, 'కవి' అని వేదము అభిప్రాయము.

**ఏకమత్ర వ్యతీతం తు పరార్ధం బ్రహ్మణో ద్విజాః ।**
**సాంప్రతం వర్తతే తద్వత్ తస్య కల్పోఽయమష్టమః ॥ 22 ॥**

**యోఽతీతః సప్తమః కల్పః పాద్మ ఇత్యుచ్యతే బుధైః ।**
**వరాహో వర్తతే కల్పః తస్య వక్ష్యామి విస్తరమ్ ॥ 23 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఇపుడు బ్రహ్మదేవునకు ఒక పరార్ధం గడచిపోయినది. రెండవ పరార్ధం నడుస్తున్నది. ఈ పరార్ధంలో ఇపుడు ఎనిమిదవ కల్పం. బ్రహ్మదేవునికి గడచిన ఏడవ కల్పాన్ని విద్వాంసులు 'పాద్మ' మన్నారు. ప్రస్తుతం "వరాహ" కల్పం నడుస్తున్నది. దీని విస్తరాన్ని నేను వివరిస్తాను.

**ఇతి శ్రీకూర్మపురాణే కాలసంఖ్యావివరణం నామ పఞ్చమోఽధ్యాయః ॥ 5 ॥**

శ్రీకూర్మపురాణంలో కాలసంఖ్యావివరణం అనే అయిదవ అధ్యాయం ॥ 5 ॥



## షష్ఠోऽధ్యాయః - ఆరవ అధ్యాయం
## పృథివ్యుద్ధారః - భూమిని ఉద్ధరించుట

**శ్రీకూర్మ ఉవాచ :-** శ్రీకూర్మమూర్తి పలికాడు.

**ఆసీదేకార్ణవం ఘోరమవిభాగం తమోమయమ్ ।**
**శాంతవాతాదికం సర్వం న ప్రాజ్ఞాయత కిఞ్చన ॥ 1 ॥**

సృష్టికి పూర్వం కేవలం సముద్రం మాత్రము ఉండినది. అంతటా నీరే. ఏ విభాగము లేదు. ఘోరఅంధకారమయం. ఆ సమయంలో వాయువు మొదలైనవి అన్నీ ఉపశమించినవి. ఏదీ గుర్తించ వీలు లేదు.

**ఏకార్ణవే తదా తస్మిన్ నష్టే స్థావరజంగమే ।**
**తదా సమభవత్ బ్రహ్మా సహస్రాక్షః సహస్రపాత్ ॥ 2 ॥**

స్థావర జంగమ రూపమైన సృష్టి ఆ ఏకార్ణవంలో నష్టమైన సమయంలో వేయినేత్రాలు, వేయిపాదాలు కల బ్రహ్మ ప్రాదుర్భవించినాడు.

**సహస్రశీర్షా పురుషో రుక్మవర్ణస్త్వతీన్ద్రియః ।**
**బ్రహ్మా నారాయణాఖ్యస్తు సుష్వాప సలిలే తదా ॥ 3 ॥**

వేయి శిరస్సులు, బంగారంవంటి వర్ణంకల అతీంద్రియుడైన పురుషుడు నారాయణుడనే పేరు గల బ్రహ్మ ఆ ఏకార్ణవములో నిద్రించాడు.

**ఇమం చోదాహరన్త్యత్ర శ్లోకం నారాయణమ్ప్రతి ।**
**బ్రహ్మస్వరూపిణం దేవం జగతః ప్రభవాప్యయమ్ ॥ 4 ॥**

సమస్తసంసారసృష్టికి, వినాశనానికి కారణుడు, బ్రహ్మస్వరూపుడు అయిన నారాయణుని విషయంలో ఈ శ్లోకం చెప్పబడినది.

**ఆపో నారా ఇతి ప్రోక్తా నామ్నా పూర్వమితి శ్రుతిః ।**
**అయనం తస్య తా యస్మాత్తేన నారాయణః స్మృతః ॥ 5 ॥**

వేదంలో 'అప్'=(జలం) అనే శబ్దానికి 'నార' అనే పేరు మొదట చెప్పబడినది. ఆ నారములకు అయనం స్థానమై ఆశ్రయమైనవాడు నారాయణుడు అని స్మరింపబడినాడు.

**తుల్యం యుగసహస్రస్య నైశం కాలముపాస్య సః ।**
**శర్వర్యన్తే ప్రకురుతే బ్రహ్మత్వం సర్గకారణాత్ ॥ 6 ॥**

వేయి యుగాల రాత్రిని అనుభవించి ఆ నారాయణుడు రాత్రి గడువగా సృష్టిచేయటానికి బ్రహ్మత్వాన్ని గ్రహించినాడు.

**తతస్తు సలిలే తస్మిన్విజ్ఞాయాన్తర్గతాం మహీమ్ ।**
**అనుమానాత్ తదుద్ధారం కర్తుకామః ప్రజాపతిః ॥ 7 ॥**

తర్వాత ఆ ఏకార్ణవంలో లీనమైన భూమిని అనుమానం ద్వారా గుర్తించి ప్రజాపతి దాన్ని ఉద్ధరించతలచాడు.

**జలక్రీడాసు రుచిరం వారాహం రూపమాస్థితః ।**
**అధృష్యం మనసాఽప్యన్యైర్వాఙ్మయం బ్రహ్మసంజ్ఞితమ్ ॥ 8 ॥**

జలక్రీడలందు అనుకూలమైన అందమైన వరాహరూపాన్ని భగవంతుడు ధరించినాడు. ఆ రూపాన్ని ప్రజలు మనసులో కూడా తెలుసుకోలేరు. అది వాక్యస్వరూపం, బ్రహ్మసంజ్ఞ కలది.

**పృథివ్యుద్ధరణార్థాయ ప్రవిశ్య చ రసాతలమ్ ।**
**దంష్ట్రయాఽభ్యుజ్జహారైనామాత్మాధారో ధరాధరః ॥ 9 ॥**

భూమిని ధరించే ఆ ధరాధరుడు ఆత్మాధారంతో పృథ్విని ఉద్ధరించటానికి రసాతలం ప్రవేశించి దంష్ట్ర (కోరలు) తో పైకి తెచ్చాడు.

**దృష్ట్వా దంష్ట్రాగ్రవిన్యస్తాం పృథ్వీం ప్రథితపౌరుషమ్ ।**
**అస్తువఞ్జనలోకస్థాః సిద్ధా బ్రహ్మర్షయో హరిమ్ ॥ 10 ॥**

నారాయణుని దంష్ట్రాగ్రంలో ఉన్న భూమిని చూచి జనలోకంలోని సిద్ధులు, బ్రహ్మర్షులు హరిని స్తుతించినారు. ఆ హరి తన పౌరుషాన్ని వ్యక్తపరచినవాడు.

**ఋషయః ఊచుః :–** ఋషులు పలికారు.

**నమస్తే దేవదేవాయ బ్రహ్మణే పరమేష్ఠినే ।**
**పురుషాయ పురాణాయ శాశ్వతాయ జయాయ చ ॥ 11 ॥**

దేవాధిదేవా! పురాణపురుషా! సనాతనా! జయస్వరూపా! పరమేష్ఠీ! బ్రహ్మా! మీకు నమస్కారము.

**నమః స్వయమ్భువే తుభ్యం స్రష్ట్రే సర్వార్థవేదినే ।**
**నమో హిరణ్యగర్భాయ వేధసే పరమాత్మనే ॥ 12 ॥**

సృష్టి చేసేవాడా! సమస్తార్థాలు తెలిసిన స్వయంభూ! నీకు నమస్కారము. హిరణ్యగర్భా! బ్రహ్మా! పరమాత్మా! నమస్కారము.

**నమస్తే వాసుదేవాయ విష్ణవే విశ్వయోనయే ।**
**నారాయణాయ దేవాయ దేవానాం హితకారిణే ॥ 13 ॥**

విశ్వోత్పత్తికి స్థానమైన వాడా! దేవతలకు హితమును చేయువాడా! వాసుదేవా! నారాయణుడవైన విష్ణూ! నమస్కారము.

**నమోఽస్తు తే చతుర్వక్త్ర శార్ఙ్గచక్రాసిధారిణే।**
**సర్వభూతాత్మభూతాయ కూటస్థాయ నమో నమః ॥ 14 ॥**

శార్ఙ్గమనే ధనువు–సుదర్శన చక్రము–నందక ఖడ్గమూ మొదలైన వానిని ధరించిన చతుర్ముఖా! నమస్కారము. ప్రాణులన్నింటికి ఆత్మస్వరూపుడా! కూటస్థుడవైన నీకు నమస్కారము.

**నమో వేదరహస్యాయ నమస్తే వేదయోనయే ।**
**నమో బుద్ధాయ శుద్ధాయ నమస్తే జ్ఞానరూపిణే ॥ 15 ॥**

**నమోఽస్త్వానందరూపాయ సాక్షిణే జగతాం నమః ।**
**అనన్తాయాప్రమేయాయ కార్యాయ కరణాయ చ ॥ 16 ॥**

**నమస్తే పఞ్చభూతాయ పఞ్చభూతాత్మనే నమః ।**
**నమో మూలప్రకృతయే మాయారూపాయ తే నమః ॥ 17 ॥**

వేదరహస్య స్వరూపుడవు, వేదయోనివైన నీకు నమస్కారము. శుద్ధుడవు, బుద్ధుడవు, జ్ఞానరూపుడవు, ఆనందరూపుడవు, జగత్తులకు సాక్షివి, అనంతుడవు, అప్రమేయము, కార్యము, కరణము, వీటి రూపుడవు, పంచభూతాలరూపుడవు, పంచభూతాలకు ఆత్మవైన నీకు నమస్కారము. మాయారూపుడవైన నీకు నమస్కారము. మూలప్రకృతి రూపుడవైన నీకు నమస్కారము.

**నమోఽస్తు తే వరాహాయ నమస్తే మత్స్యరూపిణే ।**
**నమో యోగాధిగమ్యాయ నమః సంకర్షణాయ తే ॥ 18 ॥**

ఓ వరాహరూపుడా! నమస్కారము. మత్స్యరూపాన్ని ధరించినవాడా! నమస్కారము. యోగం ద్వారా తెలియబడే నీకు నమస్కారము. ఓ సంకర్షణా! నీకు నమస్కారము.

**నమస్త్రిమూర్తయే తుభ్యం త్రిధామ్నే దివ్యతేజసే ।**
**నమః సిద్ధాయ పూజ్యాయ గుణత్రయవిభావినే ॥ 19 ॥**

త్రిమూర్తి స్వరూపుడవు, మూడు స్థానాలు గల్గిన దివ్య తేజఃస్వరూపుడా! నీకు నమస్కారము. మూడు గుణాల ప్రవర్తకుడవు, సిద్ధుడవు పూజ్యుడవైన నీకు నమస్కారము.

**నమోఽస్త్వాదిత్యవర్ణాయ నమస్తే పద్మయోనయే ।**
**నమోఽమూర్తాయ మూర్తాయ మాధవాయ నమో నమః ॥ 20 ॥**

సూర్యుని వర్ణంవంటి వర్ణం కలవాడా!(ప్రకాశస్వరూపుడా!) నీకు నమస్కారము. పద్మయోనివైన నీకు నమస్కారము. మూర్త–అమూర్త రూపుడవైన మాధవునకు అనేక నమస్కారములు.

**త్వయైవ సృష్టమఖిలం త్వయ్యేవ లయమేష్యతి ।**
**పాలయైతజ్జగత్సర్వం త్రాతా త్వం శరణం గతిః ॥ 21 ॥**

నీ ద్వారానే సంపూర్ణమైన సృష్టి జరిగింది. నీలోనే విలీనమవుతుంది. ఈ సంపూర్ణమైన జగత్తును పాలించు నీవే రక్షకుడవు. నీవే శరణమివ్వగల ఆశ్రయస్థానానివి.

**ఇత్థం స భగవాన్ విష్ణుః సనకాద్వైరభిష్టుతః ।**
**ప్రసాదమకరోత్తేషాం వరాహవపురీశ్వరః ॥ 22 ॥**

సనకాది మహర్షులు ఈ విధంగా స్తుతించగా వరాహరూపధారి, ఈశ్వరుడైన భగవంతుడగు విష్ణువు దయతలచాడు.

**తతః సంస్థానమానీయ పృథివీం పృథివీపతిః ।**
**ముమోచ రూపం మనసా ధారయిత్వా ప్రజాపతిః ॥ 23 ॥**

తర్వాత పృథివీపతి అయిన ప్రజాపతి భూమిని యథాస్థానంలో ప్రతిష్ఠించాడు. మనసుతో దానిని ధరించి తన వరాహరూపాన్ని ఉపసంహరించాడు.

**తస్యోపరిజలౌఘస్య మహతీ నౌరివ స్థితా ।**
**వితతత్వాచ్చ దేహస్య న మహీ యాతి సంప్లవమ్॥ 24 ॥**

ఆ గొప్ప జలరాశిపైన విశాలమైన నౌక వలె ఉన్న పృథ్వి తన దేహం విశాలంగా ఉన్న కారణం వల్ల నీటిలో మునగదు.

**పృథివీం తు సమీకృత్య పృథివ్యాం సోఽచినోద్గిరీన్ ।**
**ప్రాక్సర్గదగ్ధానఖిలాంస్తతః సర్గేఽదధన్మనః ॥ 25 ॥**

తర్వాత భూమిని సమతలంగాచేసి మొదటి సృష్టిలో కాలిన సమస్తపర్వతాలను భూమిపై స్థాపించాడు. ఆ తర్వాత సృష్టికార్యంలో మనసు నిల్పినాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే పృథివ్యుద్ధారే షష్ఠోఽధ్యాయః ॥** 6 ॥

శ్రీకూర్మపురాణంలో భూమిని ఉద్ధరించుట అనే ఆరవ అధ్యాయం ॥ 6 ॥



## సప్తమోఽధ్యాయః - ఏడవ అధ్యాయం

## సృష్టివర్ణనమ్ - సృష్టివర్ణనం

**శ్రీకూర్మ ఉవాచ :-** శ్రీకూర్మమూర్తి పలికాడు.

**సృష్టిం చిన్తయతస్తస్య కల్పాదిషు యథా పురా ।**
**అబుద్ధిపూర్వకః సర్గః ప్రాదుర్భూతస్తమోమయః ॥ 1 ॥**

బ్రహ్మదేవుడు సృష్టివిషయంలో ఆలోచిస్తున్నపుడు అబుద్ధిపూర్వకంగానే అనగా అనుకోకుండానే అంధకారరూపమైన పూర్వకల్పంలోని తమోమయమైన సృష్టి జరిగింది.

**తమో మోహో మహామోహస్తామిస్రశ్చాంధసంజ్ఞితః ।**
**అవిద్యా పఞ్చపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః ॥ 2 ॥**

ఆ మహాత్ముని వల్ల తమస్సు, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము అను అయిదు విధములైన అవిద్య అవతరించింది.

**పఞ్చధాఽవస్థితః సర్గో ధ్యాయతః సోఽభిమానినః ।**
**సంవృతస్తమసా చైవ బీజకుంభవదావృతః ॥ 3 ॥**

ధ్యానించుచున్న అవిద్యాభిమాని అయిన ఆ దేవుని అయిదు విధములైన సృష్టి బీజకుంభమువలె (కుంభమందలి బీజమువలె) తమస్సుతో (అజ్ఞానంతో) ఆవరింపబడినది.

**బహిరన్తశ్చాప్రకాశః స్తబ్ధో నిఃసంజ్ఞ ఏవ చ ।**
**ముఖ్యా నగా ఇతి ప్రోక్తా ముఖ్యసర్గస్తు స స్మృతః ॥ 4 ॥**

బయట, లోపల ప్రకాశం (జ్ఞానం) లేక శూన్యమై స్తబ్ధము (జడం) అట్లే సంజ్ఞ (చైతన్యము) లేని నగములు (పర్వతవృక్షాదులు) ముఖ్యసర్గము అనే పేరుతో చెప్పబడినది. అదే ముఖ్యసృష్టి.

**తం దృష్ట్వాఽసాధకం సర్గమమన్యదపరం ప్రభుః ।**
**తస్యాభిధ్యాయతః సర్గస్తిర్యక్స్రోతోఽభ్యవర్తత ॥ 5 ॥**

ప్రభువు ముఖ్యసృష్టిని విస్తరింపచేయటంలో సాధకము కాకపోవటం చూచి రెండవ సృష్టికోసం విచారించాదు. ఇట్లా ఆలోచించటంతోటే 'తిర్యక్స్రోతం' అనే పేరుకల పశుపక్ష్యాదుల సృష్టి జరిగింది.

**యస్మాత్ తిర్యక్ ప్రవృత్తః స తిర్యక్స్రోతస్తతః స్మృతః ।**
**పశ్వాదయస్తే విఖ్యాతా ఉత్పథగ్రాహిణో ద్విజాః! ॥ 6 ॥**

ఓ బ్రాహ్మణులారా! అడ్డంగా (సక్రమమార్గంలో కాకుండా) ప్రవర్తించుచున్న కారణంగా ఈ సృష్టి తిర్యక్ స్రోతమని చెప్పబడినది. పశ్వాదులు ఉత్పథగ్రాహులుగా (దారిదప్పి అడ్డంగా నడిచేవిగా) ప్రసిద్ధములుకదా!

**తమప్యసాధకం జ్ఞాత్వా సర్గమన్యం ససర్జ హ ।**
**ఊర్ధ్వస్రోత ఇతి ప్రోక్తో దేవసర్గస్తు సాత్త్వికః ॥ 7 ॥**

అది కూడ సృష్టివిస్తారం కోసం నిష్ప్రయోజనమని మరో సృష్టి చేసినాడు. అది ఊర్ధ్వస్రోతస్సు, సాత్త్వికమైన 'దేవసర్గ' మనే పేరు గలది.

**తే సుఖప్రీతిబహులా బహిరన్తస్త్వనావృతాః ।**
**ప్రకాశా బహిరన్తశ్చ స్వభావాత్ దేవసంజ్ఞితాః ॥ 8 ॥**

ఇందులో ప్రజలకు సుఖప్రీతి అధికంగా ఉంటుంది. వీరికి బహిరంతరావరణాలు ఉండవు. సహజం గానే బహిరంతఃప్రకాశం కలవారై దేవతలైనారు.

**తతోఽభిధ్యాయతస్తస్య సత్యాభిధ్యాయినస్తదా ।**
**ప్రాదురాసీత్ తదాఽవ్యక్తాదర్వాక్స్రోతస్తు సాధకః ॥ 9 ॥**

దేవసర్గము తరువాత సృష్టిని గూర్చి ఆలోచించుచున్న, సత్యధ్యానపరాయణుడైన ఆ దేవునికి అవ్యక్తము నుండి సాధకమగు అర్వాక్ స్రోతస్సు ప్రాదుర్భవించింది.

**తే చ ప్రకాశబహులాస్తమోద్రిక్తా రజోఽధికాః ।**
**దుఃఖోత్కటాః సత్త్వయుతా మనుష్యాః పరికీర్తితాః ॥ 10 ॥**

ఆ ప్రాణులు ప్రకాశ(జ్ఞాన) బాహుళ్యం కలవారు. తమో–రజోగుణాలు అధికంగా కలవారు. అధిక దుఃఖము కల్గినవారు. సత్త్వగుణసంపన్నులు మనుష్యులుగా చెప్పబడ్డారు.

**తం దృష్ట్వా చాపరం సర్గమమన్యద్భగవానజః ।**
**తస్యాభిధ్యాయతః సర్గం సర్గో భూతాదికోఽభవత్ ॥ 11 ॥**

మనుష్యసృష్టిని చూచి జన్మలేని భగవంతుడు మరో సృష్టి చేయాలని ఆలోచించాడు. ఈ ఆలోచన రాగానే భూతాదిసృష్టి ఉత్పన్నమైనది.

**తే పరిగ్రాహిణః సర్వే సంవిభాగరతాః పునః ।**
**ఖాదినశ్చాప్యశీలాశ్చ భూతాద్యాః పరికీర్తితాః ॥ 12 ॥**

వారు పరిగ్రహశీలము కలవారు. సంవిభాగమందు ప్రీతికలవారు. ఇంకను భోజనశీలురు, శీలరహితులు. వీరు భూతాదులుగా కీర్తింపబడుచున్నారు.

**ఇత్యేతే పఞ్చ కథితాః సర్గా వై ద్విజపుంగవాః ।**
**ప్రథమో మహతః సర్గో విజ్ఞేయో బ్రహ్మణస్తు సః ॥ 13 ॥**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఈ విధంగా ఐదు సృష్టులు చెప్పబడినవి. బ్రహ్మదేవుని మొదటి సృష్టి 'మహత్'అనేది.

**తన్మాత్రాణాం ద్వితీయస్తు భూతసర్గో హి స స్మృతః ।**
**వైకారికస్తృతీయస్తు సర్గ ఐన్ద్రియకః స్మృతః ॥ 14 ॥**

తన్మాత్రలసృష్టి రెండవది అయిన భూతసర్గ మనబడినది. మూడవదైన వైకారికసృష్టి ఐంద్రియ సృష్టి అయినది.

**ఇత్యేవ ప్రాకృతః సర్గః సమ్భూతో బుద్ధిపూర్వకః ।**
**ముఖ్యసర్గశ్చతుర్థస్తు ముఖ్యా వై స్థావరాః స్మృతాః ॥ 15 ॥**

ఈ ప్రకారంగా ఈ ప్రాకృతసృష్టి బుద్ధిపూర్వకంగా జరిగినదే. నాలుగవది ముఖ్యసర్గము. ఇది జడ పదార్థమైన స్థావరము.

**తిర్యక్స్రోతస్తు యః ప్రోక్తస్తిర్యగ్యోన్యః స పంచమః ।**
**తథోర్ధ్వస్రోతసాం షష్ఠో దేవసర్గస్తు స స్మృతః ॥ 16 ॥**

తిర్యక్స్రోతస్సు పేరుతో చెప్పినది తిర్యగ్యోని అయిదవ సృష్టి. ఆ తర్వాత ఆరవది ఊర్ధ్వస్రోతస్సృష్టి. దీనికి దేవసర్గ మనిపేరు.

**తతోఽర్వాక్స్రోతసాం సర్గః సప్తమః స తు మానుషః ।**
**అష్టమో భౌతికః సర్గో భూతాదీనాం ప్రకీర్తితః ॥ 17 ॥**

**నవమశ్చైవ కౌమారః ప్రాకృతా వైకృతాస్త్విమే ।**

తర్వాత ఏడవసృష్టి అర్వాక్స్రోతస్సు. దీనిని మానుష సర్గమన్నారు. ఎనిమిదవదైన భూతాది సర్గం భౌతిక సర్గము. తొమ్మిదవ సృష్టి కౌమారసర్గ. ఈ ప్రకారంగా ఉన్న తొమ్మిది సృష్టులు కూడ ప్రాకృతమని, వైకృతమని రెండు విధాలు కలవి.

**ప్రాకృతాస్తు త్రయః పూర్వే సర్గాస్తే బుద్ధిపూర్వకాః ॥ 18 ॥**

ఓ మునిపుంగవులారా! మొదటివయిన మహత్సర్గం, భూతసర్గం, ఐంద్రియసర్గం అనేవి మూడు ప్రాకృత సృష్టి. ఇవి బుద్ధిపూర్వకములు.

**బుద్ధిపూర్వం ప్రవర్తంతే ముఖ్యాద్యా మునిపుఙ్గవాః ।**
**అగ్రే ససర్జ వై బ్రహ్మా మానసానాత్మనః సమాన్ ॥ 19 ॥**

**సనకం సనాతనం చైవ తథైవ చ సనన్దనమ్ ।**
**ఋభుం సనత్కుమారం చ పూర్వమేవ ప్రజాపతిః ॥ 20 ॥**

మునిపుంగవులారా! ముఖ్యాదిసృష్టులు బుద్ధిపూర్వకాలు. ప్రజాపతి బ్రహ్మ మొదట తనతో సమానులైన సనక–సనాతన–సనందన–ఋభు–సనత్కుమారులనే మానసపుత్రులను ఉత్పన్నం చేశాడు.

**పఞ్చైతే యోగినో విప్రాః పరం వైరాగ్యమాస్థితాః ।
ఈశ్వరాసక్తమనసో న సృష్టౌ దధిరే మతిమ్ ॥ 21 ॥**

ఈ ఐదుగురు యోగులు, పరమ వైరాగ్యసంపన్నులు. ఓ విప్రులారా! వీరి మనసు ఈశ్వరుని యందే ఆసక్తమైనది. అందువల్ల వీరు సృష్టి విస్తరణలో తమ బుద్ధిని చొరనీయలేదు.

**తేష్వేవం నిరపేక్షేషు లోకసృష్టౌ ప్రజాపతిః ।
ముమోహ మాయయా సద్యో మాయినః పరమేష్ఠినః ॥ 22 ॥**

లోకసృష్టిలో సనకాదులు నిరపేక్షులు కాగా ప్రజాపతి బ్రహ్మ పరమేష్ఠినారాయణుని మాయద్వారా తత్కాలంలో మోహితుడైనాడు.

**తం బోధయామాస సుతం జగన్మాయో మహామునిః ।
నారాయణో మహాయోగీ యోగిచిత్తానురఞ్జనః ॥ 23 ॥**

యోగిచిత్తరంజకుడు, జగత్కర్త, మహాయోగి, మహాముని అయిన నారాయణుడు ఆ పుత్రుని మేల్కొల్పినాడు.

**బోధితస్తేన విశ్వాత్మా తతాప పరమం తపః ।
స తప్యమానో భగవాన్ న కిఞ్చిత్ ప్రత్యపద్యత ॥ 24 ॥**

అట్లా ప్రబోధితుడైన విశ్వాత్మ బ్రహ్మ పరమమైన తపమాచరించినాడు. అయినా ఆ బ్రహ్మ దేన్నీ పొందలేక పోయినాడు.

**తతో దీర్ఘేణ కాలేన దుఃఖాత్ క్రోధో వ్యజాయత ।
క్రోధావిష్టస్య నేత్రాభ్యాం ప్రాపతన్నశ్రుబిందవః ॥ 25 ॥**

ఎంతో కాలం గడచిపోగా తన ప్రయోజనం సిద్ధించనందువల్ల దుఃఖంతో ప్రజాపతి క్రోధావిష్టుడైనాడు. దాంతో అతని నేత్రాల నుండి కన్నీటి బిందువులు నేలపై బడినవి.

**భ్రుకుటీ కుటిలాత్తస్య లలాటాత్ పరమేశ్వరః ।
సముత్పన్నో మహాదేవః శరణ్యో నీలలోహితః ॥ 26 ॥**

ఆ బ్రహ్మ క్రోధంతో కనుబొమ్మలు ముడివడగా అతని లలాటం నుండి నీలలోహితుడు లోకానికి శరణ్యుడు మహాదేవుడు ఆవిర్భవించాడు.

**స ఏవ భగవానీశస్తేజోరాశిః సనాతనః ।
యం ప్రపశ్యన్తి విద్వాంసః స్వాత్మస్థం పరమేశ్వరమ్ ॥ 27 ॥**

ఆయనే తేజోరాశి అయిన సనాతనుడు భగవానుడైన శివుడు. విద్వాంసులాతని తమ ఆత్మలో ఉన్న పరమేశ్వరునిగా దర్శిస్తారు.

**ఓంకారం సమనుస్మృత్య ప్రణమ్య చ కృతాఞ్జలిః ।**
**తమాహ భగవాన్ బ్రహ్మా సృజేమా వివిధాః ప్రజాః ॥ 28 ॥**

ఓంకారాన్ని బాగా స్మరించి, ప్రణామం చేస్తూ చేతులు జోడించి బ్రహ్మదేవుడు మహాదేవునితో చెప్పాడు. ఈ యీ రకాల ప్రజలను సృష్టించవలసింది అని.

**నిశమ్య భగవాన్ వాక్యం శంకరో ధర్మవాహనః ।**
**స్వాత్మనా సదృశాన్ రుద్రాన్ ససర్జ మనసా శివః ॥ 29 ॥**

**కపర్దినో నిరాతఙ్కాంస్త్రినేత్రాన్ నీలలోహితాన్।**
**తం ప్రాహ భగవాన్ బ్రహ్మా జన్మమృత్యుయుతాః ప్రజాః ॥ 30 ॥**

**సృజేతి సోఽబ్రవీదీశో నాహం మృత్యుజరాన్వితాః ।**
**ప్రజాః స్రక్ష్యే జగన్నాథ! సృజ త్వమశుభాః ప్రజాః ॥ 31 ॥**

వృషభవాహనుడు శంకరుడు బ్రహ్మమాట విని తనతో సమానులైన రుద్రులను మనసుతో ఉత్పన్నులను చేశాడు. ఆ రుద్రులు జడదారులు, ఆతంకరహితులు, మూడు నేత్రాలున్నవారు, నీలలోహితులు. పిదప బ్రహ్మ శివునితో జనన మరణాలు కల ప్రజలను సృష్టించమన్నాడు. శివుడు "మృత్యువు వృద్ధావస్థాదులున్న వారిని నేను సృష్టించలేను. ఓ జగన్నాథా! ఆ అశుభప్రజలను నీవే సృష్టించుము" అని పలికాడు.

**నివార్య చ తదా రుద్రం ససర్జ కమలోద్భవః ।**
**స్థానాభిమానినః సర్వాన్ గదతస్తాన్ నిబోధత ॥ 32 ॥**

కమలోద్భవుడైన బ్రహ్మ సృష్టి విస్తర కార్యంనుండి శివుని నివారించి, తానే స్థానాభిమానులైన వారిని సృజించాడు. వారిని గురించి వివరిస్తాను. మీరు వినండి.

**ఆపోఽగ్నిరన్తరిక్షం చ ద్యౌర్వాయుః పృథివీ తథా ।**
**నద్యః సముద్రాః శైలాశ్చ వృక్షా వీరుధ ఏవ చ ॥ 33 ॥**

**లవాః కాష్ఠాః కలాశ్చైవ ముహూర్తా దివసాః క్షపాః ।**
**అర్ధమాసాశ్చ మాసాశ్చ అయనాబ్దయుగాదయః ॥ 34 ॥**

జలము, అగ్ని, అంతరిక్షం, ఆకాశం, వాయువు, పృథ్వి, అట్లే నదులు, సముద్రాలు, పర్వతాలు, వృక్షాలు, వనస్పతులు, లవములు, కాష్ఠములు, కలలు, ముహూర్తాలు, పగళ్ళు, రాత్రులు, పక్షాలు, మాసాలు, అయనాలు, సంవత్సరాలు, యుగాలు మొదలైనవానిని సృజించాడు.

**స్థానాభిమానినః సృష్ట్వా సాధకానసృజత్ పునః ।**
**మరీచి భృగ్వఙ్గిరసం పులస్త్యం పులహం క్రతుమ్ ॥ 35 ॥**

**దక్షమత్రిం వశిష్ఠం చ ధర్మం సంకల్పమేవ చ ।**
**ప్రాణాద్బ్రహ్మాఽసృజ ద్దక్షం చక్షుషశ్చ మరీచినమ్ ॥ 36 ॥**

**శిరసోఽఙ్గిరసం దేవో హృదయాత్ భృగుమేవ చ ।**
**శ్రోత్రాభ్యామత్రినామానం ధర్మం చ వ్యవసాయతః ॥ 37 ॥**

**సంకల్పం చైవ సంకల్పాత్ సర్వలోకపితామహః ।**
**పులస్త్యం చ తథోదానాత్ వ్యానాచ్చ పులహం మునిమ్ ॥ 38 ॥**

**అపానాత్ క్రతుమవ్యగ్రం సమానాచ్చ వసిష్ఠకమ్ ।**
**ఇత్యేతే బ్రహ్మణా సృష్టాః సాధకా గృహమేధినః ॥ 39 ॥**

స్థానాభిమానులను సృష్టించి, మళ్ళీ సాధకులను సృష్టించాడు. మరీచి-భృగు-అంగిరస- పులస్త్య- పులహ-క్రతువు, దక్షుడు-అత్రి-వసిష్ఠుడు-ధర్ముడు-సంకల్పుడు వీరిని సృష్టించాడు. బ్రహ్మ ప్రాణం నుండి(వాయువు) దక్షుణ్ణి, నేత్రాల నుండి మరీచిని, శిరసు నుండి అంగిరసుని, హృదయం నుండి (పని) ధర్మిణ్ని, సంకల్పం నుండి సంకల్పుని, సృష్టించాడు. అదే విధంగా ఉదానం నుండి పులస్త్యుని, వ్యానం నుండి ముని పులహుణ్ణి, అపానం నుండి(వాయువు) శాంతస్వభావం కల క్రతువును, సమానం(వాయువు) నుండి వసిష్ఠుణ్ణి, ఈ విధంగా సాధకులు-గృహస్థులైన బ్రాహ్మణులను బ్రహ్మ సృష్టించాడు.

**ఆస్థాయ మానవం రూపం ధర్మస్తైః సంప్రవర్తితః ।**
**తతో దేవాసురపితౄన్ మనుష్యాంశ్చ చతుష్టయమ్ ॥ 40 ॥**

**సిసృక్షురమ్భాంస్యేతాని స్వమాత్మాన మయూయుజత్ ।**
**యుక్తాత్మనస్తమోమాత్రా ఉద్రిక్తాఽభూత్ ప్రజాపతేః ॥ 41 ॥**

**తతోఽస్య జఘనాత్ పూర్వమసురా జజ్ఞిరే సుతాః ।**
**ఉత్ససర్జాసురాన్ సృష్ట్వా తాం తనుం పురుషోత్తమః ॥ 42 ॥**

**సా చోత్సృష్టా తనుస్తేన సద్యో రాత్రిరజాయత ।**
**సా తమోబహులా యస్మాత్ ప్రజాస్తస్యాం స్వపన్త్యతః ॥ 43 ॥**

వారంతా మానవ రూపాన్ని గ్రహించి ధర్మాన్ని పాలించారు. ఆ తర్వాత దేవతలను, అసురులను, పితృదేవతలను, మనుష్యులను నాలుగురకాలైన వారిని సృష్టించాడు. జలాన్ని సృష్టి చేయతలచి బ్రహ్మ తననే నియోగించాడు. అపుడతని నుండి తమోగుణం ఉద్రేకించింది. తర్వాత అతని జంఘల నుండి మొదట అసురులు జన్మించినారు. అసురులు జన్మించిన తర్వాత పురుషోత్తముడు ఆ శరీరాన్ని వదలిపెట్టాడు. అట్లా వదలిన శరీరం వెంటనే రాత్రిగా పుట్టింది. ఆ రాత్రి అంధకారం అధికంగా ఉండేది. అందువల్ల ప్రజలు రాత్రిలో నిద్రిస్తారు.

**సత్త్వమాత్రాత్మికాం దేవస్తనుమన్యామగృహ్ణత।**
**తతోఽస్య ముఖతో దేవా దీవ్యతః సమ్ప్రజజ్ఞిరే ॥ 44 ॥**

మళ్ళీ ఆ దేవుడు సత్త్వగుణాత్మకమైన మరో శరీరాన్ని ధరించాడు. అపుడాయనయొక్క ప్రకాశించు ముఖం నుండి దేవతలు ఉద్భవించినారు.

**త్యక్త్వా సాऽపి తనుస్తేన సత్త్వప్రాయమభూద్దినమ్।**
**తస్మాదహో ధర్మయుక్తా దేవతాః సముపాసతే ॥ 45 ॥**

ఆ ప్రజాపతి ఆ శరీరాన్ని కూడ వదిలాడు. ఆ సత్త్వగుణాధిక్యం కల శరీరం దినం(పగలు) అయింది. అందువల్ల ధర్మాత్ములు దేవతలను పగటి పూట సేవిస్తారు.

**సత్త్వమాత్రాత్మికామేవ తతోऽన్యాం జగృహే తనుమ్।**
**పితృవన్మన్యమానస్య పితరః సమ్ప్రజజ్ఞిరే ॥ 46 ॥**

మళ్ళీ సత్వగుణాత్మకమైన మరో శరీరాన్ని స్వామి ధరించాడు. తండ్రిగా భావింపబడే ఆతనినుండి పితరులు ఉత్పన్నమైనారు.

**ఉత్ససర్జ పితౄన్ సృష్ట్వా తతస్తామపి విశ్వసృక్।**
**సాऽపవిద్ధా తనుస్తేన సద్యః సంధ్యా వ్యజాయత ॥ 47 ॥**

విశ్వసృష్టికర్త అయిన బ్రహ్మ ఆ శరీరాన్ని కూడ వదిలాడు. అట్లా వదలిన శరీరం వెంటనే సంధ్యగా మారింది.

**తస్మాదహర్దేవతానాం రాత్రిః స్యాత్ దేవవిద్విషామ్।**
**తయోర్మధ్యే పితౄణాం తు మూర్తిః సంధ్యా గరీయసీ ॥ 48 ॥**

అందువల్లనే దేవతలకు పగలు, రాత్రి అసురులకు, ఈ రెంటి మధ్య ఉన్న సంధ్య పితృదేవతల మూర్తులుగా ప్రశస్తమైనవి.

**తస్మాద్దేవాసురాః సర్వే మనవో మానవాస్తథా।**
**ఉపాసతే సదా యుక్తా రాత్ర్యహ్నోర్మధ్యమాం తనుమ్ ॥ 49 ॥**

ఆ కారణంగానే దేవతలు అసురులు మనువులు అట్లే మనుష్యులు పగలు-రాత్రుల మధ్య ఉన్న సంధ్యా రూపమైన ఆ భగవానుని శరీరాన్ని ఎల్లప్పుడు సమాహితమనస్కులై ఉపాసిస్తుంటారు.

**రజోమాత్రాత్మికాం బ్రహ్మా తనుమన్యామగృహ్ణత ।**
**తతోऽస్య జజ్ఞిరే పుత్రా మనుష్యా రజసావృతాః ॥ 50 ॥**

అపుడు బ్రహ్మ రజోగుణాధిక్యం గల ఇంకో శరీరాన్ని ధరించాడు. అందు రజోగుణం అధికంగా ఉన్నందు వల్ల ఆ గుణంతో ఆవరించబడిన అనేకులు పుత్రులుత్పన్నమైనారు. వారే మనుష్యులు.

**తామప్యాశు స తత్యాజ తనుం సద్యః ప్రజాపతిః।**
**జ్యోత్స్నా సా చాభవద్విప్రాః ప్రాక్సంధ్యా యాऽభిధీయతే ॥ 51 ॥**

ఓ విప్రులారా! ఆ ప్రజాపతి వెంటనే ఆ శరీరాన్ని కూడ వదలినాడు. ఆ శరీరం జ్యోత్స్న(వెన్నెల) రూపంగా మారింది. దీనిని 'ప్రాక్సంధ్యా' అంటారు.

**తతః స భగవాన్ బ్రహ్మా సమ్ప్రాప్య ద్విజపుంగవాః! ।**
**మూర్తిం తమోరజఃప్రాయాం పునరేవాభ్యయూయుజత్ ॥ 52 ॥**

ఓ బ్రాహ్మణులారా! భగవంతుడైన బ్రహ్మ మళ్ళీ తమస్సు రజస్సులతో కూడిన శరీరాన్ని ధరించి యోగయుక్తుడైనాడు.

**అంధకారే క్షుధావిష్టా రాక్షసాస్తస్య జజ్ఞిరే ।**
**పుత్రాస్తమోరజః ప్రాయా బలినస్తే నిశాచరాః ॥ 53 ॥**

ఈ శరీరం నుండి అంధకారంలో ఆకలితో వ్యాకులులైన రాక్షసులు జన్మించినారు. రజస్తమోగుణాలెక్కువ ఉన్న వారు బలవంతులైన వారు నిశాచరులు.

**సర్పా యక్షాస్తథా భూతా గన్ధర్వాః సమ్ప్రజజ్ఞిరే ।**
**రజస్తమోభ్యామావిష్టాంస్తతోఽన్యానసృజత్ ప్రభుః ॥ 54 ॥**

ఈ విధంగా సర్పాలు, యక్షులు, భూతాలు, గంధర్వులు ఉత్పన్నమైనారు. ఆ తర్వాత రజోగుణం, తమోగుణం గల ప్రాణులను కూడా ఆ ప్రభువు సృష్టించినాడు.

**వయాంసి వయసః సృష్ట్వా అవయో వక్షసోఽసృజత్।**
**ముఖతోఽజాన్ ససర్జాన్యాన్ ఉదరాత్ గాశ్చ నిర్మమే ॥ 55 ॥**

వయోదశనుండి పక్షులను సృష్టించిన తర్వాత బ్రహ్మ వక్షఃస్థలం నుండి సర్పాలను సృష్టించాడు. ముఖం నుండి మేకలను, ఉదరం నుండి గోజాతిని సృష్టించాడు.

**పద్భ్యాం చాశ్వాన్ సమాతఙ్గాన్ రాసభాన్ గవయాన్ మృగాన్।**
**ఉష్ట్రానశ్వతరాంశ్చైవ న్యఙ్కూనన్యాంశ్చ జాతయః ॥ 56 ॥**

**ఓషధ్యః ఫలమూలిన్యో రోమభ్యస్తస్య జజ్ఞిరే।**

రెండు పాదాల నుండి గుర్రాలను, ఏనుగులను, గాడిదలను, దున్నలను, మృగాలను, ఒంటెలను, కంచరగాడిదలను, మృగవిశేషములను, తన మోచేతి నుండి ఇతర మృగాలను సృష్టించాడు. అతని రోమాల నుండి ఓషధులు, ఫల-మూలాలు పుట్టినవి.

**గాయత్రీం చ ఋచం చైవ త్రివృత్సామరథన్తరమ్ ॥ 57 ॥**
**అగ్నిష్టోమం చ యజ్ఞానాం నిర్మమే ప్రథమాన్ముఖాత్ ।**
**యజూంషి త్రైష్టుభం ఛందః స్తోమం పఞ్చదశం తథా ॥ 58 ॥**

**బృహత్సామ తథోక్థం చ దక్షిణాదసృజన్ముఖాత్ ॥ 59 ॥**

బ్రహ్మ తన ప్రథమ(తూర్పు) ముఖం నుండి గాయత్రీ ఛందస్సును, ఋగ్వేదం, త్రివృత్‌సామం, రథంతరమనే సామవేదాన్ని, అగ్నిష్టోమం అనే యజ్ఞాన్ని నిర్మించాడు. దక్షిణ ముఖం నుండి యజుర్వేదాన్ని, త్రిష్టుభ్ ఛందస్సును, పంచదశ స్తోమాన్ని(మంత్రసమూహం). బృహత్సామ, ఉక్థ(వేదమంత్రాలు) సృష్టించాడు.

**సామాని జాగతం ఛందః స్తోమం సప్తదశం తథా ।**
**వైరూపమతిరాత్రం చ పశ్చిమాదసృజన్ముఖాత్।**
**ఏకవింశమథర్వాణమాప్తోర్యామాణమేవ చ ॥ 60 ॥**

**అనుష్టుభం స వైరాజముత్తరాదసృజన్ముఖాత్ ।**
**ఉచ్చావచాని భూతాని గాత్రేభ్యస్తస్య జజ్ఞిరే ॥ 61 ॥**

పశ్చిమ ముఖం నుండి సామవేదం, జగతీ ఛందస్సు, సప్తదశ స్తోమం, వైరూపము- అతిరాత్రమనే యజ్ఞాలు ఉత్పత్తి చేశాడు. ఉత్తరముఖం నుండి ఇరవదొక్కశాఖలు గల అథర్వణ వేదాన్ని, అనుష్టుప్ ఛందస్సును ఆప్తోర్యామ-వైరాజమనే యజ్ఞాలను ఉత్పత్తి చేశాడు. బ్రహ్మ ప్రజలను సృష్టించే సమయంలో ఉచ్చ-నీచ కోటికి సంబంధించిన ఇతర ప్రాణులు కూడా అతని శరీరం నుండి ఉద్భవించాయి.

**బ్రహ్మణో హి ప్రజాసర్గం సృజతస్తు ప్రజాపతేః ।**
**సృష్ట్వా చతుష్టయం సర్గం దేవర్షిపితృమానుషమ్ ॥ 62 ॥**

**తతోఽసృజచ్చ భూతాని స్థావరాణి చరాణి చ ।**
**యక్షాన్ పిశాచాన్ గన్ధర్వాంస్తథైవాప్సరసః శుభాః ॥ 63 ॥**

**నరకిన్నరరక్షాంసి వయః పశుమృగోరగాన్ ।**
**అవ్యయం చ వ్యయం చైవ ద్వయం స్థావరజఙ్గమమ్ ॥ 64 ॥**

**తేషాం యే యాని కర్మాణి ప్రాక్సృష్టౌ ప్రతిపేదిరే ।**
**తాన్యేవ తే ప్రపద్యన్తే సృజ్యమానాః పునః పునః ॥ 65 ॥**

దేవ-ఋషి-పితృ-మానుష రూపమైన నాలుగు రకాల సృష్టిని జరిపి యక్షులను, పిశాచాలను, గంధర్వులను అట్లే శుభకరులైన అప్సరసలను, స్థావరములను, చరములైన ప్రాణులను సృష్టించాడు. నరులను, కిన్నరులను, రాక్షసులను, పక్షులను, పశువులను, మృగాలను, సర్పాలను ఉత్పత్తి చేసినాడు. నిత్య-అనిత్య రూపాలైన రెండింటిని సృష్టించాడు. పూర్వసృష్టిలో సృజించబడిన ప్రాణులు ఆచరించిన పనులనే మళ్ళీ మళ్ళీ అనుసరిస్తూ ఉన్నారు.

**హింస్రా హింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే ।**
**తద్భావితాః ప్రపద్యన్తే తస్మాత్తత్తస్య రోచతే ॥ 66 ॥**

ఏ రకమైన భావనతో (సంస్కారం) ప్రేరితులౌతాయో ఆ ప్రాణులు హింసించేవి-హింసించనివి, కోమలము-క్రూరము, ధర్మ-అధర్మాలు, సత్య-అసత్యాలు ప్రవృత్తులను పొందుతాయి. ఆ పనులే వానికి రుచిస్తాయి.

**మహాభూతేషు నానాత్వమిన్ద్రియార్థేషు మూర్తిషు ।**
**వినియోగం చ భూతానాం ధాతైవ వ్యదధాత్ స్వయమ్ ॥ 67 ॥**

మహేశ్వరుడైన బ్రహ్మ స్వయంగా ప్రాణుల ఇంద్రియాలవిషయాలు, మహాభూతాలు అట్లే ఆకారాల్లో భిన్నత్వం, వాని వినియోగాల వ్యవస్థను ఏర్పాటు చేశాడు.

**నామరూపం చ భూతానాం కృత్యానాం చ ప్రపఞ్చనమ్ ।**
**వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః ॥ 68 ॥**

ప్రారంభంలో వేదశబ్దాలనుండే ప్రాణుల పేర్లు, రూపాలు, వాని కర్మలు వేరువేరుగా నిర్మాణం చేశాడు.

**ఆర్షాణి చైవ నామాని యాశ్చ వేదేషు దృష్టయః ।**
**శర్వర్యన్తే ప్రసూతానాం తాన్యేవైభ్యో దదాత్యజః ॥ 69 ॥**

వేదాల్లోని సిద్ధాంతాలు, ఆర్షనామాలు అవే పేర్లతో ప్రలయకాలీన రాత్రి అంతంకాగానే ఉత్పన్నమైన పదార్థాలకు బ్రహ్మప్రదానం చేస్తాడు.

**యథర్తావృతులిఙ్గాని నానారూపాణి పర్యయే ।**
**దృశ్యన్తే తాని తాన్యేవ తథా భావా యుగాదిషు ॥ 70 ॥**

ఆయా ఋతువులలో ఆయా ఋతుచిహ్నాలు పొడసూపినట్లుగా, వాని చిహ్నాలు, అనేక ప్రకార రూపాలు మొదలైన వానినే తర్వాతి యుగంలోను అవే నామ-రూప-భావాల్లో ప్రకటితాలై కనిపిస్తాయి.

**ఇతి శ్రీకూర్మపురాణే సృష్టివర్ణనం నామ సప్తమోఽధ్యాయః ॥ 7 ॥**

శ్రీకూర్మపురాణంలో సృష్టివర్ణనమనే ఏడవ అధ్యాయం ॥ 7 ॥



## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## ముఖ్యాది సర్గకథనమ్ - ముఖ్యాది సర్గకథనం

**శ్రీకూర్మ ఉవాచ :-** శ్రీకూర్మస్వామి పలికాడు.

**ఏవం భూతాని సృష్టాని స్థావరాణి చరాణి చ ।**

**యదా చాస్య ప్రజాః సృష్టా న వ్యవర్ధన్త ధీమతః ॥ 1 ॥**

ఈవిధంగా స్థావర-జంగమ ప్రాణుల సృష్టి జరిగింది. కాని బుద్ధిమంతుడైన బ్రహ్మ ఉత్పన్నం చేసిన ప్రజల్లో వృద్ధి జరుగలేదు.

**తమోమాత్రావృతో బ్రహ్మా తదాఽశోచత దుఃఖితః ।**

**తతః స విదధే బుద్ధిమర్థనిశ్చయగామినీమ్ ॥ 2 ॥**

అపుడు అధిక తమోగుణం ఆవరించిన బ్రహ్మ దుఃఖితుడై ఆలోచించినాడు. అర్థనిర్ణయం చేయగల బుద్ధిని గ్రహించాడు.

**అథాఽఽత్మని సమద్రాక్షీత్ తమోమాత్రాం నియామికామ్ ।**

**రజః సత్త్వం చ సంవృత్య వర్తమానాం స్వధర్మతః ॥ 3 ॥**

తర్వాత బ్రహ్మ స్వధర్మానుసారంగా రజస్సత్త్వగుణాల నావరించేది, కర్మను నియమించే తమస్సు ఆవరించటాన్ని తనలో చూచాడు.

**తమస్తద్ వ్యనుదత్ పశ్చాత్ రజః సత్త్వేన సంవృతః ।**

**తత్తమః ప్రతినున్నం వై మిథునం సమజాయత ॥ 4 ॥**

సత్త్వగుణంతో కూడిన రజోగుణం ఆ తమోగుణాన్ని తొలగించగా ఆ తమోగుణం రెండు భాగాలుగా(మిథునం) విభక్తమైనది.

**అధర్మాచరణం విప్రా హింసా చాశుభలక్షణా ।**

**స్వాం తనుం స తతో బ్రహ్మా తామపోహత భాస్వరామ్ ॥ 5 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఈ విధంగా రెండు భాగాలుగా విభక్తమైన తమస్సుతో అధర్మాచరణము,అశుభ లక్షణాలు గల హింస ఉత్పన్నమైనది. అపుడు బ్రహ్మదేవుడు ప్రకాశమానమైన ఆ తన శరీరాన్ని వదిలేశాడు.

**ద్విధాఽకరోత్ పునర్దేహమర్ధేన పురుషోఽభవత్ ।**

**అర్ధేన నారీ పురుషో విరాజమసృజత్ ప్రభుః ॥ 6 ॥**

పురాణపురుషుడైన ఆ ప్రభువు తన శరీరాన్ని రెండు భాగాలుగా విభజించాడు. ఒక సగభాగం పురుషుడు కాగా, మిగిలిన భాగం స్త్రీ అయినది. తర్వాత అతడు విరాట్ పురుషుణ్ణి ఉత్పన్నం చేశాడు.

**నారీం చ శతరూపాఖ్యాం యోగినీం ససృజే శుభామ్ ।**
**సా దివం పృథివీం చైవ మహిమ్నా వ్యాప్య సంస్థితా ॥ 7 ॥**

అతడు స్త్రీని 'శతరూపా' అనే పేరు గల కల్యాణమయి అయిన యోగినిని సృష్టించాడు. ఆమె భూలోకాన్ని ద్యులోకాన్ని తన మహిమతో ఆవరించి ఉండినది.

**యోగైశ్వర్యబలోపేతా జ్ఞానవిజ్ఞానసంయుతా ।**
**యోఽభవత్పురుషాత్పుత్రో విరాడవ్యక్తజన్మనః ॥ 8 ॥**

**స్వాయమ్భువో మనుర్దేవః సోఽభవత్పురుషో మునిః ।**
**సా దేవీ శతరూపాఖ్యా తపః కృత్వా సుదుశ్చరమ్ ॥ 9 ॥**

**భర్తారం బ్రహ్మణః పుత్రం మనుమేవాన్వపద్యత ।**
**తస్మాచ్చ శతరూపా సా పుత్రద్వయమసూయత ॥ 10 ॥**

ఆ శతరూప యోగైశ్వర్య బలోపేత, జ్ఞానవిజ్ఞాన యుక్తురాలు. బ్రహ్మపుత్రుడు విరాట్ అనే పేరుగలవాడు దేవపురుషుడు స్వాయమ్భువమనురూపంలో ప్రసిద్ధుడైనాడు. శతరూప అనే ఆ దేవి కఠోరతపమాచరించి బ్రహ్మపుత్రుడైన స్వాయమ్భువమనువునే పతిగా పొందింది. అతనివల్ల ఇద్దరు పుత్రులకు జన్మనిచ్చింది.

**ప్రియవ్రతోత్తానపాదౌ కన్యాద్వయమనుత్తమమ్।**
**తయోః ప్రసూతిం దక్షాయ మనుః కన్యాం దదౌ పునః ॥ 11 ॥**

ప్రియవ్రత–ఉత్తానపాదులు అను పుత్రులు, మరో ఇద్దరు శ్రేష్ఠలైన కన్యలు జన్మించారు. వారిలో ప్రసూతి అనే పేరు గల కూతురును స్వాయంభువమనువు దక్షప్రజాపతికి ప్రదానం చేశాడు.

**ప్రజాపతిరథాకూతిం మానసో జగృహే రుచిః ।**
**ఆకూత్యాం మిథునం జజ్ఞే మానసస్య రుచేః శుభమ్ ॥ 12 ॥**

ఆకూతి అనే రెండవ కూతురును బ్రహ్మమానసపుత్రుడైన రుచి ప్రజాపతి గ్రహించినాడు. రుచి ఆకూతి యందు ఇద్దరిని సంతానంగా సంతానాన్ని పొందినాడు.

**యజ్ఞశ్చ దక్షిణా చైవ యాభ్యాం సంవర్ధితం జగత్ ।**
**యజ్ఞస్య దక్షిణాయాం తు పుత్రా ద్వాదశ జజ్ఞిరే ॥ 13 ॥**

యజ్ఞుడు దక్షిణ జంటతో సంసారం వృద్ధి పొందింది. యజ్ఞునికి దక్షిణద్వారా పండ్రెండుగురు పుత్రులు కలిగారు.

**యామా ఇతి సమాఖ్యాతా దేవాః స్వాయమ్భువేఽన్తరే ।**
**ప్రసూత్యాం చ తథా దక్షశ్చతస్రో వింశతిం తథా ॥ 14 ॥**

**ససర్జ కన్యా నామాని తాసాం సమ్యక్ నిబోధత ।**

ఆ పండ్రెండుగురు స్వాయంభువు మన్వంతరంలో యాములు అనే పేరుతో ప్రసిద్ధులైన దేవతలు. దక్షప్రజాపతి ప్రసూతియందు ఇరువదినల్గురు కన్యలను పొందాడు. ఆ కన్యల పేర్లను బాగా వినండి.

**శ్రద్ధా లక్ష్మీర్ధృతిస్తుష్టిః పుష్టిర్మేధా క్రియా తథా ॥ 15 ॥**

**బుద్ధిర్లజ్జా వపుః శాంతిః సిద్ధిః కీర్తిస్త్రయోదశీ ।**
**పత్న్యర్థం ప్రతిజగ్రాహ ధర్మో దాక్షాయణీః శుభాః ॥ 16 ॥**

శ్రద్ధా–లక్ష్మీ–ధృతి–తుష్టి–పుష్టి–మేధా–క్రియా బుద్ధి–లజ్జా–వపువు–శాంతి–సిద్ధి అట్లే పదమూడవ కూతురు కీర్తి అని వీరికి పేర్లు. ధర్ముడు ఈ దక్షప్రజాపతికూతుళ్ళను పదముగ్గురిని భార్యలుగా స్వీకరించినాడు.

**తాభ్యః శిష్టా యవీయస్య ఏకాదశ సులోచనాః ।**
**ఖ్యాతిః సత్యథ సమ్భూతిః స్మృతిః ప్రీతిః క్షమా తథా ॥ 17 ॥**

**సంతతిశ్చానసూయా చ ఊర్జా స్వాహా స్వధా తథా ।**
**భృగుర్భవో మరీచిశ్చ తథా చైవాంగిరా మునిః ॥ 18 ॥**

**పులస్త్యః పులహశ్చైవ క్రతుః పరమధర్మవిత్ ।**
**అత్రిర్వసిష్ఠో వహ్నిశ్చ పితరశ్చ యథాక్రమమ్ ॥ 19 ॥**

**ఖ్యాత్యాద్యా జగృహుః కన్యా మునయో మునిసత్తమాః ।**

ఈ పదముగ్గురు కాక వీరికంటె అందమైన నేత్రాలుగలవారు, వయసులో చిన్నవారు మరో పదకొండు మంది కన్యలున్నారు. వారి పేర్లు ఖ్యాతి, సతీ, సంభూతి, స్మృతి, ప్రీతి, క్షమా, సంతతి, అనసూయ–ఊర్జా–స్వాహా–మరియు స్వధా అనేవారు. ఓ మునిసత్తములారా! ఈ పదకొండు మంది కన్యలను యథాక్రమంగా భృగువు–మరీచి–ఆంగీరసుడు–పులస్త్యుడు–పులహుడు–క్రతువు పరమధర్మము నెరిగినవాడు, అత్రి–వసిష్ఠుడు–వహ్ని మరియు పితృదేవతలు భార్యలుగా స్వీకరించినారు.

**శ్రద్ధాయా ఆత్మజః కామో దర్పో లక్ష్మీసుతః స్మృతః ॥ 20 ॥**

**ధృత్యాస్తు నియమః పుత్రస్తుష్ట్యాః సంతోష ఉచ్యతే ।**
**పుష్ట్యా లాభః సుతశ్చాపి మేధాపుత్రః శ్రుతస్తథా ॥ 21 ॥**
**క్రియాయాశ్చాభవత్పుత్రో దండః సమయ ఏవ చ ।**
**బుద్ధ్యా బోధః సుతస్తద్వదప్రమాదో వ్యజాయత ॥ 22 ॥**

**లజ్జాయా వినయః పుత్రో వపుషో వ్యవసాయకః ।**
**క్షేమః శాంతి సుతశ్చాపి సుఖం సిద్ధిరజాయత ॥ 23 ॥**

శ్రద్ధకు పుత్రుడు కాముడు, లక్ష్మీపుత్రుడు 'దర్ప' మని చెప్పనైనది. ధృతిపుత్రుడు నియమమనేవాడు, తుష్టిపుత్రుడు సంతోషం, పుష్టికి లాభమనేవాడు, మేధాపుత్రుడు శ్రుతుడు. క్రియాపుత్రుడు దండుడు. ఇతణ్ణే

సమయమని కూడ అంటారు. బుద్ధి పుత్రుడు బోధ అనేవాడు-అప్రమాదుడు అనేవాడు కూడ జన్మించారు. లజ్జా పుత్రుడు వినయం, వపువుపుత్రుడు వ్యవసాయకుడు, శాంతికి క్షేముడు, సిద్ధికి సుఖ మనేవారు జన్మించారు.

**యశః కీర్తిసుతస్తద్వదిత్యేతే ధర్మసూనవః ।**
**కామస్య హర్షః పుత్రోऽభూత్ దేవానందో వ్యజాయత ॥ 24 ॥**

**ఇత్యేష వై సుఖోదర్కః సర్గో ధర్మస్య కీర్తితః ।**
**జజ్ఞే హింసా త్వధర్మాద్వై నికృతిం చానృతం సుతమ్ ॥ 25 ॥**

**నికృత్యనృతయోర్జజ్ఞే భయం నరక ఏవ చ ।**
**మాయా చ వేదనా చైవ మిథునం త్విదమేతయోః ॥ 26 ॥**

**భయాజ్జజ్ఞేऽథ వై మాయా మృత్యుం భూతాపహారిణమ్ ।**
**వేదనా చ సుఖం చాపి దుఃఖం జజ్ఞేऽథ రౌరవమ్ ॥ 27 ॥**

**మృత్యోర్వ్యాధి జరా శోక తృష్ణాక్రోధాశ్చ జజ్ఞిరే ।**
**దుఃఖోత్తరాః స్మృతా హ్యేతే సర్వే చాధర్మలక్షణాః ॥ 28 ॥**

ఇదే విధంగా కీర్తిపుత్రుడు యశుడు అనేవాడు. వీరంతా ధర్ముని పుత్రులు. కాముని పుత్రుడు హర్షుడు, ఇతడు దేవతల కానందాన్ని కలిగించేవాడు. ధర్ముని సృష్టి సుఖాన్ని కలిగించేదిగా చెప్పబడినది. అధర్ముని వల్ల హింస నికృతి-అనృత మనే సంతతిని పొందింది. నికృతి-అనృతాలవల్ల భయం-నరకం ఉత్పన్నమైనవి. మాయా వేదనా అనే ఇద్దరు నరకానికి భార్యలు. మాయ భయంద్వారా సమస్త ప్రాణులను చంపే మృత్యువును పొందింది. వేదన కూడ రౌరవ మనే పతివల్ల దుఃఖమనే పుత్రుణ్ణి పొందింది. మృత్యువు వల్ల వ్యాధి-జరా-శోకం-తృష్ణా-క్రోధం ఉత్పన్నమైనవి. వీరందరూ ఉత్తరోత్తర అధిక దుఃఖాన్ని కల్గించేవారు, అధర్మాచరణ లక్షణంగా కలవారు.

**నైషాం భార్యాऽస్తి పుత్రో వా సర్వే తే హ్యూర్ధ్వరేతసః ।**

వీరికి భార్యాపుత్రులు లేరు. వీరంతా ఊర్ధ్వరేతస్కులు.

**ఇత్యేష తామసః సర్గో జజ్ఞే ధర్మనియామకః । 29 ॥**
**సంక్షేపేణ మయా ప్రోక్తా విసృష్టిర్మునిపుంగవాః ॥ 30 ॥**

ఓ మునిశ్రేష్ఠులారా! ఈ ప్రకారం ధర్మనియామకుడు అయిన బ్రహ్మ తామససృష్టిని చేశాడు. నేను సంక్షేపంగా ఈ విశిష్టసృష్టిని వివరించాను.

**ఇతి శ్రీ కూర్మపురాణే ముఖ్యాది సర్గకథనం నామ అష్టమోऽధ్యాయః ॥ 8 ॥**

శ్రీ కూర్మపురాణంలో ముఖ్యాది సర్గకథనమనే ఎనిమిదవ అధ్యాయం ॥ 8 ॥



## నవమోఽధ్యాయః – తొమ్మిదవ అధ్యాయం

## పద్మోద్భవప్రాదుర్భావ వర్ణనమ్ – పద్మోద్భవప్రాదుర్భావ వర్ణనం

**సూత ఉవాచ :** సూతుడు పలికాడు.

**ఏతచ్ఛ్రుత్వా తు వచనం నారదాద్యా మహర్షయః ।**
**ప్రణమ్య వరదం విష్ణుం పప్రచ్ఛుః సంశయాన్వితాః ॥ 1 ॥**

ఆ మాటను విని నారదాది మహర్షులు వరదుడైన విష్ణువును నమస్కరించి సంశయం కలవారై అడిగారు.

**ఋషయః ఊచుః :** ఋషులు పలికారు.

**కథితో భవతా సర్గో ముఖ్యాదీనాం జనార్దన! ।**
**ఇదానీం సంశయం చేమమస్మాకం ఛేత్తుమర్హసి ॥ 2 ॥**

**కథం స భగవానీశః పూర్వజోఽపి పినాకధృక్ ।**
**పుత్రత్వమగమచ్ఛమ్భుర్బ్రహ్మణోఽవ్యక్తజన్మనః ॥ 3 ॥**

**కథం చ భగవాఞ్జజ్ఞే బ్రహ్మా కమలసంభవః ।**
**అణ్డజో జగతామీశస్తన్నో వక్తుమిహార్హసి ॥ 4 ॥**

ఓ జనార్దనా! నీవు ముఖ్యాది సృష్టిని వివరించావు. ఇపుడు మాకు కలిగిన సంశయాన్ని నీవు తొలగించు. మొదటే ఉత్పన్నుడైన పినాకధారి అయిన భగవానుడీశ్వరుడు ఎట్లా అవ్యక్త జన్మగల బ్రహ్మకు పుత్రత్వాన్ని పొందాడు? కమలసంభవుడు అయిన భగవానుడు బ్రహ్మ అండమునుండి ఎట్లు జన్మించారు? ఆ విషయం మాకు వివరించండి.

**శ్రీకూర్మ ఉవాచ :** శ్రీకూర్మస్వామి పలికాడు.

**శృణుధ్వమృషయః సర్వే శంకరస్యామితౌజసః ।**
**పుత్రత్వం బ్రహ్మణస్తస్య పద్మయోనిత్వమేవ చ ॥ 5 ॥**

ఓ ఋషులారా! మీరు వినండి. మిక్కిలి తేజస్వంతుడైన శంకరుడు బ్రహ్మకు పుత్రత్వాన్ని ఎట్లా పొందాడు. బ్రహ్మ కమలంనుండి ఎట్లా ఉద్భవించాడో చెబుతాను.

**అతీతకల్పావసానే తమోభూతం జగత్త్రయమ్ ।**
**ఆసీదేకార్ణవం సర్వం న దేవాద్యా న చర్షయః ॥ 6 ॥**

గత కల్పం చివరలో ముల్లోకాలు అంధకారంతో నిండినవి. అంతటా నీరే. దేవతలు మొదలైన వారు లేరు. ఋషులు లేరు.

**తత్ర నారాయణో దేవో నిర్జనే నిరుపప్లవే ।**
**ఆశ్రిత్య శేషశయనం సుష్వాప పురుషోత్తమః ॥ 7 ॥**

ఆ జన శూన్యము మిక్కిలి శాంతము అయిన సముద్రంలో పురుషోత్తముడు నారాయణుడు శేషశయ్యా నాశ్రయించి పడుకొని ఉన్నాడు.

**సహస్రశీర్షా భూత్వా స సహస్రాక్షః సహస్రపాత్ ।**
**సహస్రబాహుః సర్వజ్ఞశ్చిన్త్యమానో మనీషిభిః ॥ 8 ॥**

**పీతవాసా విశాలాక్షో నీలజీమూతసన్నిభః ।**
**మహావిభూతిర్యోగాత్మా యోగినాం హృదయాలయః ॥ 9 ॥**

**కదాచిత్తస్య సుప్తస్య లీలార్థం దివ్యమద్భుతమ్ ।**
**త్రైలోక్యసారం విమలం నాభ్యాం పఙ్కజముద్బభౌ ॥ 10 ॥**

**శతయోజనవిస్తీర్ణం తరుణాదిత్య సంనిభమ్ ।**
**దివ్యగంధమయం పుణ్యం కర్ణికాకేసరాన్వితమ్ ॥ 11 ॥**

వేల శిరసులు, నేత్రాలు, పాదాలు, బాహువులు కల ఆ స్వామి విద్వాంసుల చింతనకు విషయమైనవాడు. సర్వజ్ఞుడు, పీతాంబరధారి, విశాలనేత్రాలు గలవాడు, నల్లమేఘంతో సమానమైన వర్ణం కలవాడు, మహావిభూతి స్వరూపుడు యోగులహృదయాల్లో నివసించే యోగాత్మ నారాయణుడు. నిద్రిస్తుండే సమయంలో అతని నాభి నుండి లీల చూపటానికి దివ్యము, అద్భుతము ముల్లోకాల సారరూపమైన ఒక స్వచ్ఛమైన, వందయోజనాల విస్తీర్ణం కల్గి, తేజస్వి అయిన కమలం ఆవిర్భవించినది. సూర్యునితో సమానమైన ప్రకాశం కలది, అది పవిత్రమూ దివ్యగంధం కలది. కర్ణిక కేసరాలతో కూడి ఉన్న –

**తస్యైవ సుచిరం కాలం వర్తమానస్య శార్ఙ్గిణః ।**
**హిరణ్యగర్భో భగవాంస్తం దేశముపచక్రమే ॥ 12 ॥**

శార్ఙ్గమనే ధనువు ధరించిన నారాయణుడు ఈ రూపంలోనే చాలకాలం నివసిస్తున్నాడు. అప్పుడొకసారి భగవంతుడైన హిరణ్యగర్భుడు ఆ ప్రదేశానికి వెళ్ళాడు.

**స తం కరేణ విశ్వాత్మా సముత్థాప్య సనాతనమ్ ।**
**ప్రోవాచ మధురం వాక్యం మాయయా తస్య మోహితః ॥ 13 ॥**

ఆ స్వామిమాయతో ముగ్ధుడైన బ్రహ్మ నిద్రిస్తున్న సనాతనపురుషుణ్ణి తట్టి లేపాడు. ఈ విధంగా మధురమైన మాట పలికాడు.

**అస్మిన్నేకార్ణవే ఘోరే నిర్జనే తమసావృతే ।**
**ఏకాకీ కో భవాఞ్ఛేతే బ్రూహి మే పురుషర్షభ! ॥ 14 ॥**

ఓ పురుషశ్రేష్ఠా! అంధకారంతో నిండి, నిర్జనమైన ఏకార్ణవంలో ఒంటిగా పడుకొన్న నీవెవరవో తెల్పుము.

**తస్య తద్వచనం శ్రుత్వా విహస్య గరుడధ్వజః ।**
**ఉవాచ దేవం బ్రహ్మాణం మేఘగమ్భీరనిఃస్వనః ॥ 15 ॥**

ఆ మాట విని మేఘగర్జనవలె గంభీరమైన స్వరంతో గరుడధ్వజుడు నవ్వి బ్రహ్మతో ఇట్లన్నాడు.

**భో భో నారాయణం దేవం లోకానాం ప్రభవాప్యయమ్ ।**
**మహాయోగేశ్వరం మాం త్వం జానీహి పురుషోత్తమమ్ ॥ 16 ॥**

ఓ బ్రహ్మ! సమస్తలోకాల సృష్టిసంహారాలు కావించే వాణ్ణి, మహాయోగేశ్వరుణ్ణి, పురుషోత్తముడైన నారాయణునిగా నన్ను తెలుసుకో.

**మయి పశ్య జగత్కృత్స్నం త్వాం చ లోకపితామహమ్ ।**
**సపర్వతమహాద్వీపం సముద్రైః సప్తభిర్వృతమ్ ॥ 17 ॥**

నాలో పర్వతాలు, మహాద్వీపాలతో కూడ సప్తసముద్రాలు చుట్టూ కల ఈ సంపూర్ణ జగత్తును, పితామహుడవైన నిన్ను కూడా చూడు.

**ఏవమాభాష్య విశ్వాత్మా ప్రోవాచ పురుషం హరిః ।**
**జానన్నపి మహాయోగీ కో భవానితి వేధసమ్ ॥ 18 ॥**

ఈ విధంగా చెప్పి విశ్వాత్మ యోగేశ్వరుడైన హరి అన్నీ తెలిసి ఉండి బ్రహ్మరూపుడైన పురుషుణ్ణి నీవెవరు? అని ప్రశ్నించాడు.

**తతః ప్రహస్య భగవాన్ బ్రహ్మా వేదనిధిః ప్రభుః ।**
**ప్రత్యువాచామ్బుజాభాక్షం సస్మితం శ్లక్ష్ణయా గిరా ॥ 19 ॥**

తర్వాత వేదనిధి, ప్రభువు, భగవంతుడైన బ్రహ్మ నవ్వి కమలముల కాంతివంటి కాంతిగల నేత్రాలు గల్గి, కొద్దిగా చిరునవ్వు నవ్వుతున్న విష్ణువును గూర్చి మధురమైన వాక్కుతో ప్రత్యుత్తర మిచ్చాడు.

**అహం ధాతా విధాతా చ స్వయమ్భూః ప్రపితామహః ।**
**మయ్యేవ సంస్థితం విశ్వం బ్రహ్మాఽహం విశ్వతోముఖః ॥ 20 ॥**

నేనే ధరించేవాణ్ణి, విధానాన్ని నిర్దేశించేవాణ్ణి, స్వయంభువును, ప్రపితామహుణ్ణి. నాలోనే ఈ సంపూర్ణ విశ్వం ఉన్నది. నేనన్ని వైపుల ముఖాలున్నవాణ్ణి.

**శ్రుత్వా వాచం స భగవాన్ విష్ణుః సత్యపరాక్రమః ।**
**అనుజ్ఞాప్యాథ యోగేన ప్రవిష్టో బ్రహ్మణస్తనుమ్ ॥ 21 ॥**

సత్యపరాక్రమముడైన భగవానుడైన విష్ణువు బ్రహ్మ మాటను విని అతని ఆజ్ఞపొంది యోగబలంతో బ్రహ్మ శరీరంలో ప్రవేశించాడు.

**త్రైలోక్యమేతత్సకలం సదేవాసురమానుషమ్ ।**
**ఉదరే తస్య దేవస్య దృష్ట్వా విస్మయమాగతః ॥ 22 ॥**

ఆ బ్రహ్మదేవుని ఉదరంలో దేవతలు, అసురులు, మనుష్యులతో కూడ సంపూర్ణమైన ముల్లోకాలను చూచి శ్రీవిష్ణువునకు ఆశ్చర్యమైనది.

**తదాఽస్య వక్త్రాన్నిష్క్రమ్య పన్నగేంద్రనికేతనః ।**
**అజాతశత్రుర్భగవాన్ పితామహమథాబ్రవీత్ ॥ 23 ॥**

తరువాత నాగరాజుపై పవళించే ఆ అజాతశత్రువైన విష్ణుభగవానుడు బ్రహ్మముఖం నుండి బయటికి వచ్చి అతనితో ఇట్లన్నాడు.

**భవానప్యేవమేవాద్య శాశ్వతం హి మమోదరమ్ ।**
**ప్రవిశ్య లోకాన్పశ్యైతాన్ విచిత్రాన్ పురుషర్షభ! ॥ 24 ॥**

ఓ పురుషశ్రేష్ఠుడా! ఇదే విధంగా నీవు కూడ నా ఉదరంలో ప్రవేశించి ఈ విచిత్రలోకాలను చూడు.

**తతః ప్రహ్లాదినీం వాణీం శ్రుత్వా తస్యాభినన్ద్య చ ।**
**శ్రీపతేరుదరం భూయః ప్రవివేశ కుశధ్వజః ॥ 25 ॥**

ఆ తర్వాత ఆహ్లాదాన్ని కల్గించే విష్ణువుమాట విని, అతణ్ణి అభినందించి కుశధ్వజుడైన బ్రహ్మ లక్ష్మీపతి ఉదరంలో ప్రవేశించాడు.

**తానేవ లోకాన్ గర్భస్థానపశ్యత్సత్యవిక్రమః ।**
**పర్యటిత్వా తు దేవస్య దదృశేఽన్తం న వై హరేః ॥ 26 ॥**

సత్యవిక్రముడైన బ్రహ్మ అవే లోకాలను భగవానుడైన విష్ణువు ఉదరంలో చూశాడు. ఆయన ఉదరంలో భ్రమణం చేస్తూ విష్ణువుఉదరంలో చివరభాగం ఎక్కడో చూడలేకపోయినాడు.

**తతో ద్వారాణి సర్వాణి పిహితాని మహాత్మనా ।**
**జనార్దనేన బ్రహ్మాఽసౌ నాభ్యాం ద్వారమవిందత ॥ 27 ॥**

తర్వాత మహాత్ముడైన జనార్దనుడు తన ఇంద్రియాల ద్వారాలన్నింటిని మూసివేశాడు. అపుడు బ్రహ్మ అతని నాభిలో ద్వారాన్ని(పొందాడు) కనుగొన్నాడు.

**తత్ర యోగబలేనాసౌ ప్రవిశ్య కనకాణ్డజః ।**
**ఉజ్జహారాత్మనో రూపం పుష్కరాచ్చతురాననః ॥ 28 ॥**

సువర్ణమయమైన అండంనుండి ఉద్భవించిన బ్రహ్మ యోగబలంతో నాభిలో ప్రవేశించి నాభికమలం నుండి తన రూపాన్ని బయటకు తీసుకున్నాడు.

**విరరాజారవిందస్థః పద్మగర్భసమద్యుతిః ।**
**బ్రహ్మా స్వయమ్భూర్భగవాన్ జగద్యోనిః పితామహః ॥ 29 ॥**

పద్మగర్భంలోని శోభతో వెలుగొందే స్వయంభువు, జగత్తుకు కారణభూతుడు, పితామహుడైన భగవానుడైన బ్రహ్మ అరవిందంపై (ఎఱ్ఱనికమలం) కూర్చొని ప్రకాశించినాడు.

**స మన్యమానో విశ్వేశమాత్మానం పరమం పదమ్ ।**
**ప్రోవాచ పురుషం విష్ణుం మేఘగంభీరయా గిరా ॥ 30 ॥**

తనను సమస్త విశ్వానికి స్వామిగా తలచే బ్రహ్మ మేఘగర్జనవంటి గంభీరమైన వాక్కుతో పురుషోత్తముడైన విష్ణువుతో ఇట్లా చెప్పాడు.

**కిం కృతం భవతేదానీమాత్మనో జయకాంక్షయా ।**
**ఏకోఽహం ప్రబలో నాన్యో మాం వై కోఽభిభవిష్యతి ॥ 31 ॥**

నీవు నీ విజయంకోసం ఇప్పుడు ఏమి చేశావు? నేనొక్కడినే అందరికంటె గొప్పబలశాలిని. మరొకడు లేడు. నన్నెవడు పరాజితుణ్ణి చేయగలడు?

**శ్రుత్వా నారాయణో వాక్యం బ్రహ్మణో లోకతన్త్రిణః ।**
**సాన్త్వపూర్వమిదం వాక్యం బభాషే మధురం హరిః ॥ 32 ॥**

లోకనియామకుడైన బ్రహ్మవాక్యాన్ని విని నారాయణుడైన హరి ఓదార్పు పూర్వకంగా ఈ మధురమైన మాట చెప్పాడు.

**భవాన్ ధాతా విధాతా చ స్వయమ్భూః ప్రపితామహః ।**
**న మాత్సర్యాభియోగేన ద్వారాణి పిహితాని మే ॥ 33 ॥**

**కిన్తు లీలార్థమేవైతన్న త్వాం బాధితుమిచ్ఛయా ।**
**కో హి బాధితుమన్విచ్ఛేద్దేవదేవం పితామహమ్ ॥ 34 ॥**

నీవే ధాతవు. విధాతవు. స్వయంభువువు. ప్రపితామహుడవు. నేను ఈర్ష్యాది కారణంగా అట్లా ద్వారములను మూయలేదు. లీలాప్రదర్శన చేయాలనే కోరికతో ద్వారాలు మూశాను. నిన్ను బాధించాలని కాదు. దేవదేవుడైన పితామహుణ్ణి ఎవడు బాధపెట్టాలనుకుంటాడు?

**న తేఽన్యథాఽవగన్తవ్యం మాన్యో మే సర్వథా భవాన్ ।**
**సర్వమన్వయకల్యాణం యన్మయాఽపకృతం తవ ॥ 35 ॥**

నీవు అన్యథా భావించవద్దు. నీవు నాకు అన్నివిధాల మాన్యుడవు. నా వల్ల నీకు జరిగిన ఈ అపకారం నీకు అన్నివిధాల కల్యాణకారి అవుతుంది.

**అస్మాచ్చ కారణాత్ బ్రహ్మన్ పుత్రో భవతు మే భవాన్ ।**
**పద్మయోనిరితి ఖ్యాతో మత్ప్రియార్థం జగన్మయ ॥ 36 ॥**

ఈ కారణం వల్లనే ఓ బ్రహ్మ! నా సంతోషం కోసం నా పుత్రుడవు కమ్ము. జగన్మూర్తీ! నీవు 'పద్మయోని' అనే పేరుతో ఖ్యాతిని పొందు.

**తతః స భగవాన్ దేవః వరం దత్వా కిరీటినే ।**
**ప్రహర్షమతులం గత్వా పునర్విష్ణుమభాషత ॥ 37 ॥**

తర్వాత భగవానుడైన బ్రహ్మ కిరీటియైన విష్ణువుకు వరమిచ్చి మిక్కిలి ప్రసన్నచిత్తుడై మళ్ళీ విష్ణువును గూర్చి ఇట్లన్నాడు.

**భవాన్ సర్వాత్మకోఽనన్తః సర్వేషాం పరమేశ్వరః ।**
**సర్వభూతాన్తరాత్మా వై పరంబ్రహ్మ సనాతనమ్ ॥ 38 ॥**

నీవు అందరి ఆత్మరూపుడవు, అనంతుడవు, అందరికి ఈశ్వరుడవు. నీవు ప్రాణులన్నింటి అంతరాత్మవు. నీవే సనాతన పరబ్రహ్మవు.

**అహం వై సర్వలోకానామాత్మా లోకమహేశ్వరః ।**
**మన్మయం సర్వమేవేదం బ్రహ్మాఽహం పురుషః పరః ॥ 39 ॥**

నేను అదే విధంగా లోకాలకు ఆత్మను, అట్లే లోకమహేశ్వరుడను. ఇదంతా నా స్వరూపమే. నేను పరమపురుషుడను బ్రహ్మను.

**నావాభ్యాం విద్యతే హ్యన్యో లోకానాం పరమేశ్వరః ।**
**ఏకా మూర్తిర్ద్విధా భిన్నా నారాయణపితామహౌ ॥ 40 ॥**

మనిద్దరికంటే అతిరిక్తంగా లోకాలకు పరమేశ్వరుడు మరొకరు లేడు. నారాయణుడు పితామహుడు రూపంలో ఒకడే, రెండు మూర్తులుగా విభక్తమై ఉన్నాము.

**తేనైవముక్తో బ్రహ్మాణం వాసుదేవోఽబ్రవీదిదమ్ ।**
**ఇయం ప్రతిజ్ఞా భవతో వినాశాయ భవిష్యతి ॥ 41 ॥**

బ్రహ్మ ఆ విధంగా చెప్పిన తర్వాత వాసుదేవుడు బ్రహ్మతో ఈ విధంగా చెప్పాడు. ఈ నీ ప్రతిజ్ఞ నీకు వినాశాన్ని కలిగిస్తుంది.

**కిం న పశ్యసి యోగేశం బ్రహ్మాధిపతిమవ్యయమ్ ।**
**ప్రధానపురుషేశానం వేదాహం పరమేశ్వరమ్ ॥ 42 ॥**

నీవు బ్రహ్మాధిపతి యోగేశ్వరుడు అవ్యయుడు ప్రధానపురుషుడైన శంకరుని చూడటం లేదు. నేనాపరమేశ్వరు నెరుగుదును.

**యం న పశ్యన్తి యోగీంద్రాః సాంఖ్యా అపి మహేశ్వరమ్ ।**
**అనాదినిధనం బ్రహ్మ తమేవ శరణం వ్రజ ॥ 43 ॥**

యోగీంద్రులు సాంఖ్యశాస్త్రజ్ఞులు కూడా మహేశ్వరుని దర్శించలేరు. నీవా అనాదినిధనుడైన బ్రహ్మనే శరణు పొందు.

**తతః క్రుద్ధోఽమ్బుజాభాక్షం బ్రహ్మా ప్రోవాచ కేశవమ్ ।**
**భవాన్ న నూనమాత్మానం వేత్తి తత్పరమక్షరమ్ ॥ 44 ॥**

**బ్రహ్మాణం జగతామేక మాత్మానం పరమం పదమ్ ।**
**నావాభ్యాం విద్యతే హ్యన్యో లోకానాం పరమేశ్వరః ॥ 45 ॥**

తర్వాత క్రుద్ధుడైన బ్రహ్మ కమలాక్షుడైన కేశవునితో ఇట్లన్నాడు. నిశ్చయంగా నీవు నిన్ను పరమాక్షరుడవని జగద్రూపుడవని, బ్రహ్మస్వరూపుడవని, పరమపదానివని గుర్తించటం లేదు. మనిద్దరికంటె అతిరక్తంగా లోకాలకు పరమేశ్వరుడు మరొకడు లేడు.

**సంత్యజ్య నిద్రాం విపులాం స్వమాత్మానం విలోకయ ।**
**తస్య తత్ క్రోధజం వాక్యం శ్రుత్వా విష్ణురభాషత ॥ 46 ॥**

నీవు ఈ దీర్ఘనిద్రను వదలి నిన్ను నీవు గుర్తించు, బ్రహ్మ క్రోధంతో చెప్పిన వాక్యాలు విని విష్ణువు ఇట్లా చెప్పాడు.

**మా మైవం వద కల్యాణ! పరివాదం మహాత్మనః ।**
**న మేఽస్త్యవిదితం బ్రహ్మన్! నాన్యథాఽహం వదామి తే ॥ 47 ॥**

ఓ కల్యాణుడా! నీవు ఈ ప్రకారం చెప్పకూడదు. మహాత్ముల నింద కూడదు. నాకు తెలియనిది లేదు. నీతో అసత్యం పలుకటం లేదు.

**కిన్తు మోహయతి బ్రహ్మన్ భవన్తం పారమేశ్వరీ ।**
**మాయాఽశేషవిశేషాణాం హేతురాత్మసముద్భవా ॥ 48 ॥**

కాని ఓ బ్రహ్మ! ఆత్మనుండి పుట్టి సమస్తవిశేషాలకు కారణమైన పరమేశ్వరుని మాయ నిన్ను మోహితుని చేస్తున్నది.

**ఏతావదుక్త్వా భగవాన్ విష్ణుస్తూష్ణీం బభూవ హ ।**
**జ్ఞాత్వా తత్ పరమం తత్త్వం స్వమాత్మానం మహేశ్వరమ్ ॥ 49 ॥**

ఇంత మాత్రమే చెప్పి భగవాన్ విష్ణువు తన ఆత్మరూపాన్ని మహేశ్వరుని ఆ ఉత్కృష్ట పరమ తత్త్వరూపంలో తెలుసుకొని ఊరకుండినాడు.

**కుతోఽప్యపరిమేయాత్మా భూతానాం పరమేశ్వరః ।**
**ప్రసాదం బ్రహ్మణే కర్తుం ప్రాదురాసీత్తతో హరః ॥ 50 ॥**

తర్వాత బ్రహ్మననుగ్రహించటానికి ప్రాణులకు పరమేశ్వరుడు హద్దులేని సామర్థ్యం కల హరుడు అక్కడ ప్రత్యక్షమైనాడు.

**లలాటనయనోఽనంతో జటామండలమండితః ।**
**త్రిశూలపాణిర్భగవాంస్తేజసాం పరమో నిధిః ॥ 51 ॥**

ఆ అనంతుని నుదుట నేత్రమున్నది. జటామండలం ధరించినాడు. తేజస్సుకు పరమనిధియైన ఆ భగవంతుని చేతిలో త్రిశూలమున్నది.

**దివ్యాం విశాలాం గ్రథితాం గ్రహైః సార్కేన్దుతారకైః ।**
**మాలామత్యద్భుతాకారాం ధారయన్ పాదలంబినీమ్ ॥ 52 ॥**

అతడు పాదాలవరకు వ్రేలాడుతున్న పొడవైన దివ్యము విశాలము అయిన మాలను ధరించినాడు. ఆ మాలలో సూర్య-చంద్ర-గ్రహాలు-నక్షత్రాలు కూర్చబడినవి.

**తం దృష్ట్వా దేవ మీశానం బ్రహ్మా లోకపితామహః ।**
**మోహితో మాయయాఽత్యర్థం పీతవాససమబ్రవీత్ ॥ 53 ॥**

ఆ ఈశాన దేవుని చూచి మాయతో మోహితుడైన లోకపితామహుడైన బ్రహ్మ తన రక్షణకొరకు పీతాంబరధారి అయిన విష్ణువుతో ఇట్లా అన్నాడు.

**క ఏష పురుషోఽనన్తః శూలపాణిస్త్రిలోచనః ।**
**తేజోరాశిరమేయాత్మా సమాయాతి జనార్దన! ॥ 54 ॥**

ఓ జనార్దన! చేతిలో త్రిశూలాన్ని ధరించి, నేత్రాలు మూడింటితో ఇట్లు తేజోరాశిరూపంలో ఉన్న ఈ అమేయాత్ముడు అనంతుడైన పురుషుడెవరు? ఇటే వస్తున్నాడు.

**తస్య తద్వచనం శ్రుత్వా విష్ణుర్దానవమర్దనః ।**
**అపశ్యదీశ్వరం దేవం జ్వలంతం విమలేంఽభసి ॥ 55 ॥**

బ్రహ్మ మాటను విని దానవమర్దనుడు అయిన విష్ణువు నిర్మలమైన నీటిలో దేదీప్యమానుడైన ఈశ్వరుని చూశాడు.

**జ్ఞాత్వా తత్పరమం భావమైశ్వరం బ్రహ్మభావనమ్ ।**
**ప్రోవాచోత్థాయ భగవాన్ దేవదేవం పితామహమ్ ॥ 56 ॥**

ఈశ్వరసంబంధమైన, పరమభావరూపమైన ఈశ్వరునిలోని పరమతత్త్వాన్ని దర్శించి విష్ణువు లేచాడు. ఆ దేవదేవుడైన పితామహునితో ఇట్లా చెప్పాడు.

**అయం దేవో మహాదేవః స్వయంజ్యోతిః సనాతనః ।**
**అనాదినిధనోఽచిన్త్యో లోకానామీశ్వరో మహాన్ ॥ 57 ॥**

ఈ దేవుడు స్వయం ప్రకాశం కలవాడు. సనాతనుడు, ఆద్యంతాలు లేనివాడు, ఆలోచనకందని మహాత్ముడు, లోకాలకు ఈశ్వరుడైన మహాదేవుడు.

**శంకరః శమ్భురీశానః సర్వాత్మా పరమేశ్వరః ।**
**భూతానామధిపో యోగీ మహేశో విమలః శివః॥ 58 ॥**

మంగలమును చేయువాడు, హితమును కలిగించువాడు, సకలలోక శాసకుడు సకలము స్వరూపముగా కలవాడు, శాసకులకు శాసకుడు. ఇతడే ధరించేవాడు. పోషించేవాడు. ప్రాణులకు ఒకే స్వామి, యోగి, మహేశుడు, విమలుడు, శివరూపం(శుభాన్ని కల్గించే) కలవాడు.

**ఏష ధాతా విధాతా చ ప్రధానపురుషేశ్వరః ।**
**యం ప్రపశ్యన్తి యతయో బ్రహ్మభావేన భావితాః ॥ 59 ॥**

ఇతడే ధాత, విధాత, ప్రధానపురుషులకు ఈశ్వరుడు, యతులు బ్రహ్మభావనకల్గి ఇతణ్ణి దర్శనం చేసుకుంటారు.

**సృజత్యేష జగత్ కృత్స్నం పాతి సంహరతే తథా ।**
**కాలో భూత్వా మహాదేవః కేవలో నిష్కలః శివః ॥ 60 ॥**

ఈయనే కేవలుడు, నిష్కలుడు, మహాదేవుడు, శివుడు. కాలరూపంతో సంపూర్ణజగత్తును సృష్టిస్తాడు. రక్షిస్తాడు. సంహారం చేస్తాడు.

**బ్రహ్మాణం విదధే పూర్వం భవన్తం యః సనాతనః ।**
**వేదాంశ్చ ప్రదదౌ తుభ్యం సోఽయమాయాతి శంకరః ॥ 61 ॥**

ఆ శంకరుడే వస్తున్నాడు. సనాతనుడైన ఇతడే పూర్వకాలంలో నిన్ను బ్రహ్మను చేశాడు. నీకు వేదాల ననుగ్రహించాడు.

**అస్యైవ చాపరాం మూర్తిం విశ్వయోనిం సనాతనీమ్ ।**
**వాసుదేవాభిధానాం మామవేహి ప్రపితామహ ॥ 62 ॥**

ప్రపితామహా! నన్ను ఇతనికి సంబంధించిన విశ్వయోని, సనాతనుడు వాసుదేవుడనే పేరుగల రెండవ మూర్తిగా తెలుసుకో.

**కిం న పశ్యసి యోగేశం బ్రహ్మాధిపతిమవ్యయమ్ ।**
**దివ్యం భవతు తే చక్షుర్యేన ద్రక్ష్యసి తత్పరమ్ ॥ 63 ॥**

బ్రహ్మకు కూడ అధిపతి, అవ్యయుడు అయిన యోగేశ్వరుని నీవు చూడటం లేదా! నీ దృష్టి దివ్యమగుగాక! దానితో నీవు ఆ పరమతత్త్వాన్ని చూడగలవు.

**లబ్ధ్వా శైవం తదా చక్షుర్విష్ణోర్లోకపితామహః ।**
**బుబుధే పరమేశానం పురతః సమవస్థితమ్ ॥ 64 ॥**

విష్ణువువల్ల ఈ విధంగా శైవనేత్రం(శివ సంబంధ జ్ఞానం) పొంది లోకపితామహుడైన బ్రహ్మ ఎదుట ఉన్న పరముడైన ఈశానుణ్ణి తెలుసుకున్నాడు.

**స లబ్ధ్వా పరమం జ్ఞానమైశ్వరం ప్రపితామహః ।**
**ప్రపేదే శరణం దేవం తమేవ పితరం శివమ్ ॥ 65 ॥**

ఆ బ్రహ్మ ఈశ్వరసంబంధమైన పరమజ్ఞానాన్ని పొంది పితృరూపుడైన ఆ శివుని శరణు పొందినాడు.

**ఓంకారం సమనుస్మృత్య సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**అథర్వశిరసా దేవం తుష్టావ చ కృతాఞ్జలిః ॥ 66 ॥**

ఓంకారాన్ని స్మరిస్తూ, ఆత్మద్వారా మనసును నిరోధించి, ఆ దేవదేవుని అథర్వణవేదమంత్రాలతో చేతులు జోడించి సంతోష పరిచాడు.

**సంతుష్టస్తేన భగవాన్ బ్రహ్మణా పరమేశ్వరః ।**
**అవాప పరమాం ప్రీతిం వ్యాజహార స్మయన్నివ ॥ 67 ॥**

అట్లా బ్రహ్మ స్తుతించగా భగవానుడు పరమేశ్వరుడైన శివుడు పరమ ప్రీతినొంది చిరునవ్వు నవ్వుతూ ఇట్లన్నాడు.

**మత్సమస్త్వం న సందేహో మద్భక్తశ్చ యతో భవాన్ ।**
**మయైవోత్పాదితః పూర్వం లోకసృష్ట్యర్థమవ్యయః ॥ 68 ॥**

నీవు నా భక్తుడవు. అందువల్ల నిస్సందేహంగా నీవు నాతో సమానుడవే. ప్రపంచసృష్టికోసం పూర్వం నేనే అవ్యయుడవైన నిన్ను ఉత్పత్తి చేశాను.

**త్వమాత్మా హ్యాదిపురుషో మమ దేహసముద్భవః ।**
**వరం వరయ విశ్వాత్మన్ వరదోఽహం తవానఘ! ॥ 69 ॥**

నీవు నా దేహం నుండి ఉత్పన్నమైనావు. నా ఆత్మవు. ఆది పురుషుడవు. ఓ అనఘా! విశ్వాత్మా! వరం కోరుకో, నేను నీకు వరాన్నిస్తాను.

**స దేవదేవవచనం నిశమ్య కమలోద్భవః ।**
**నిరీక్ష్య విష్ణుం పురుషం ప్రణమ్యాఽఽహ వృషధ్వజమ్ ॥ 70 ॥**

కమలోద్భవుడైన బ్రహ్మ దేవదేవుడైన శంకరుని మాట విని విష్ణువును చూచాడు. ఆ పరమ పురుషుడైన వృషధ్వజుడైన శంకరునికి ప్రణామ మాచరించి ఇట్లన్నాడు.

**భగవన్ భూతభవ్యేశ! మహాదేవామ్బికాపతే ।**
**త్వామేవ పుత్రమిచ్ఛామి త్వయా వా సదృశం సుతమ్ ॥ 71 ॥**

ఓ భగవన్! భూతభవిష్యత్కాలాలకు స్వామీ! మహాదేవా! అంబికాపతీ! నేను నిన్నే పుత్రునిగా కోరుతున్నాను. లేదా నీ సదృశుడైన పుత్రుణ్ణైనా కోరుకుంటున్నాను.

**మోహితోఽస్మి మహాదేవ మాయయా సూక్ష్మయా త్వయా ।**
**న జానే పరమం భావం యాథాతథ్యేన తే శివ ॥ 72 ॥**

ఓ మహాదేవా! నీ సూక్ష్మ మాయద్వారా మోహితుడనైనాను. శివా! నీ పరమభావాన్ని యథార్థరూపంలో తెలియలేను.

**త్వమేవ దేవ భక్తానాం భ్రాతా మాతా పితా సుహృత్ ।**
**ప్రసీద తవ పాదాబ్జం నమామి శరణం గతః ॥ 73 ॥**

ఓ దేవ! నీవే భక్తులకు తల్లి తండ్రి సోదరుడవు మిత్రుడవు కూడా. ప్రసన్నుడ వగుము. నీ పాదాబ్జాన్ని నమస్కరిస్తున్నాను. శరణు పొందినాను.

**స తస్య వచనం శ్రుత్వా జగన్నాథో వృషధ్వజః ।**
**వ్యాజహార తదా పుత్రం సమాలోక్య జనార్దనమ్ ॥ 74 ॥**

తర్వాత జగత్త్రాత వృషధ్వజుడైన శంకరుడు బ్రహ్మ మాటను విని పుత్రరూపుడైన జనార్దనుని(విష్ణువు) చూచి బ్రహ్మదేవునితో ఇట్లన్నాడు.

**యదర్థితం భగవతా తత్ కరిష్యామి పుత్రక! ।**
**విజ్ఞానమైశ్వరం దివ్యముత్పత్స్యతి తవానఘ! ॥ 75 ॥**

ఓ పుత్ర! నీ కోరిక ప్రకారమే నేను చేస్తాను. అనఘా! నీకు ఈశ్వర సంబంధమైన దివ్యజ్ఞానం ప్రాప్తిస్తుంది.

**త్వమేవ సర్వభూతానామాదికర్తా నియోజితః ।**
**తథా కురుష్వ దేవేశ మయా లోకపితామహ! ॥ 76 ॥**

నేను నిన్ను ప్రాణులన్నింటి ప్రథమ స్రష్టరూపంలో నియుక్తుణ్ణి చేశాను. అందువల్ల దేవేశా! పితామహా! నీ వట్లే ఆచరించు.

**ఏష నారాయణోఽనన్తో మమైవ పరమా తనుః ।**
**భవిష్యతి తవేశానో యోగక్షేమవహో హరిః ॥ 77 ॥**

ఈ నారాయణుడు, అనంతుడు అయిన విష్ణువు నా శ్రేష్ఠమైన శరీరమే. ఈ ఈశ్వరుడు హరి నీ యోగక్షేమాలు వహిస్తాడు.

**ఏవం వ్యాహృత్య హస్తాభ్యాం ప్రీతాత్మా పరమేశ్వరః ।**
**సంస్పృశ్య దేవం బ్రహ్మాణం హరిం వచనమబ్రవీత్ ॥ 78 ॥**

ఈ విధంగా చెప్పి ప్రసన్నచిత్తుడైన పరమేశ్వరుడు శివుడు తన చేతులతో బ్రహ్మను స్పృశించి విష్ణువు గూర్చి ఇట్లా చెప్పాడు.

**తుష్టోఽస్మి సర్వదాఽహం తే భక్త్యా తవ జగన్మయ ।**
**వరం వృణీష్వ న హ్యావాం విభిన్నౌ పరమార్థతః ॥ 79 ॥**

ఓ జగన్మూర్తీ! నీ భక్తికి నేను సంతోషించాను. వరమడుగు. నిజానికి మనమిద్దరము భిన్నులము కాము.

**శ్రుత్వాఽథ దేవవచనం విష్ణుర్విశ్వజగన్మయః ।**
**ప్రాహ ప్రసన్నయా వాచా సమాలోక్య చతుర్ముఖమ్ ॥ 80 ॥**

మహాదేవుని మాట విన్న తర్వాత విశ్వమయుడైన విష్ణువు చతుర్ముఖబ్రహ్మను చూచి ప్రీతిపూర్వక వచనాన్ని శంకరునితో చెప్పాడు.

**ఏష ఏవ వరః శ్లాఘ్యో యదహం పరమేశ్వరమ్ ।**
**పశ్యామి పరమాత్మానం భక్తిర్భవతు మే త్వయి ॥ 81 ॥**

నా కొరకు ఇదే శ్లాఘనీయమైన వరం. నేను పరమేశ్వరుడవు పరమాత్మవు అయిన నిన్ను దర్శిస్తున్నాను. ఈ నా భక్తి నీ యందెల్లపుడు ఉండుగాక.

**తథేత్యుక్త్వా మహాదేవః పునర్విష్ణుమభాషత ।**
**భవాన్ సర్వస్య కార్యస్య కర్తాఽహమధిదైవతమ్ ॥ 82 ॥**

అట్లే అగుగాక అని మహాదేవుడు మళ్ళీ విష్ణువుతో చెప్పాడు. నీవు అన్ని కార్యాలకు కర్తవు. నేను అధి దేవతను.

**మన్మయం త్వన్మయం చైవ సర్వమేతన్న సంశయః ।**
**భవాన్ సోమస్త్వహం సూర్యో భవాన్ రాత్రిరహం దివమ్ ॥ 83 ॥**

ఇదంతా నా, నీ రూపమే. ఇందులో సందేహం లేదు. నీవు చంద్రుడవు, నేను సూర్యుణ్ణి. నీవు రాత్రివి, నేను పగలును(దినం).

**భవాన్ ప్రకృతిరవ్యక్తమహం పురుష ఏవ చ ।**
**భవాన్ జ్ఞానమహం జ్ఞాతా భవాన్ మాయాఽహమీశ్వరః ॥ 84 ॥**

నీవు ప్రకృతివి, నేను అవ్యక్తరూపమైన పురుషుణ్ణి, నీవు జ్ఞానానివి, నేను జ్ఞాతను. నీవు మాయవు, నేను ఈశ్వరుణ్ణి.

**భవాన్ విద్యాత్మికా శక్తిః శక్తిమానహమీశ్వరః ।**
**యోఽహం సునిష్కలో దేవః సోఽపి నారాయణః పరః ॥ 85 ॥**

అంతే కాక నిష్కలుడు దేవుడు పరస్వరూపుడు అయిన నారాయణుణ్ణి కూడ నేనే.

**ఏకీభావేన పశ్యన్తి యోగినో బ్రహ్మవాదినః।**
**త్వామనాశ్రిత్య విశ్వాత్మన్ న యోగీ మాముపైష్యతి ।**
**పాలయైతజ్జగత్ కృత్స్నం సదేవాసురమానుషమ్ ॥ 86 ॥**

బ్రహ్మవాదులైన యోగులు మనిద్దరిని ఒకే భావంతో చూస్తారు. విశ్వాత్మా! నీ ఆశ్రయం పొందక ఏ యోగీ నన్ను పొందలేడు. నీవు దేవాసుర మనుష్య యుక్తమైన ఈ సంపూర్ణ జగత్తును పాలించు.

**ఇతీదముక్త్వా భగవాననాదిః స్వమాయయా మోహితభూతభేదః ।**
**జగామ జన్మర్ధివినాశహీనం ధామైకమవ్యక్తమనన్తశక్తిః ॥ 87 ॥**

ఈ విధంగా చెప్పి తన మాయతో సమస్త ప్రాణులను మోహింప చేసేవాడు, అనాది అట్లే అనంత శక్తి సంపన్నుడైన భగవంతుడు సృష్టి స్థితి లయ రహితమైన తన అవ్యక్తస్థానానికి వెళ్ళాడు.

**ఇతి శ్రీ కూర్మపురాణే పద్మోద్భవ ప్రాదుర్భావవర్ణనం నామ నవమోఽధ్యాయః ॥ 9 ॥**

శ్రీ కూర్మపురాణంలో పద్మోద్భవ ప్రాదుర్భావవర్ణన మనే తొమ్మిదవ అధ్యాయం ॥ 9 ॥



## దశమోऽధ్యాయః - పదవ అధ్యాయం

## రుద్రసృష్టిః - రుద్రసృష్టి

**శ్రీకూర్మఉవాచ:-** శ్రీకూర్మమూర్తి పలికాడు

**గతే మహేశ్వరే దేవే భూయ ఏవ పితామహః ।**
**తదేవ సుమహత్పద్మం భేజే నాభిసముత్థితమ్ ॥ 1 ॥**

దేవుడైన మహేశ్వరుడు తనస్థానానికి వెళ్ళిపోగా పితామహుడు బ్రహ్మ విష్ణునాభినుండి ఉత్పన్నమైన ఆ పెద్ద పద్మంలో మళ్లీ చేరినాడు.

**అథ దీర్ఘేణ కాలేన తత్రాప్రతిమపౌరుషౌ ।**
**మహాసురౌ సమాయాతౌ భ్రాతరౌ మధుకైటభౌ ॥ 2 ॥**

చాలకాలం గడచిన తర్వాత అక్కడికి సాటిలేని శక్తి కలిగిన మహాసురులు మధుకైటభులనే సోదరులు వచ్చారు

**క్రోధేన మహతావిష్టౌ మహాపర్వతవిగ్రహౌ ।**
**కర్ణాంతరసముద్భూతౌ దేవదేవస్య శార్ఙ్గిణః ॥ 3 ॥**

వారు దేవదేవుడైన శార్ఙ్గధన్వి అయిన విష్ణువు చెవినుండి పుట్టినవారు. మహాపర్వతంవంటి శరీరాలుకల్గి క్రోధం నిండినవారు.

**తావాగతౌ సమీక్ష్యాऽऽహ నారాయణమజో విభుః ।**
**త్రైలోక్యకణ్టకావేతావసురౌ హన్తుమర్హసి ॥ 4 ॥**

అట్లా వచ్చిన అసురులను చూచి బ్రహ్మ నారాయణుని గూర్చి ఇట్లన్నాడు - ఈ ఇద్దరు అసురులు ముల్లోకాలకు కంటక ప్రాయులు. వీరిని నీవు చంపాలి.

**తస్య తద్వచనం శ్రుత్వా హరిర్నారాయణః ప్రభుః ।**
**ఆజ్ఞాపయామాస తయోర్వధార్థం పురుషావుభౌ ॥ 5 ॥**

ఆ బ్రహ్మదేవుని మాట విని ప్రభువైన నారాయణుడు హరి వారిద్దరిని చంపటానికి విష్ణు-జిష్ణు అనే ఇరువురు పురుషులను ఆజ్ఞాపించినాడు.

**తదాజ్ఞయా మహద్యుద్ధం తయోస్తాభ్యామభూద్ద్విజాః ।**
**వ్యనయత్కైటభం విష్ణుర్జిష్ణుశ్చ వ్యనయన్మధుమ్ ॥ 6 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఆయన ఆజ్ఞతో విష్ణుజిష్ణులతో మధు-కైటభులకు మహాయుద్ధం జరిగింది. అందులో విష్ణువు కైటభుణ్ణి, జిష్ణువు మధువును సంహరించారు.

**తతః పద్మాసనాసీనం జగన్నాథం పితామహమ్ ।**
**బభాషే మధురం వాక్యం స్నేహావిష్టమనా హరిః ॥ 7 ॥**

తర్వాత స్నేహం నిండిన మనసుగల హరి పద్మాసీనుడైన జగన్నాథుడు పితామహునితో మధురముగా పలికాడు.

**అస్మాన్మయోహ్యమానస్త్వం పద్మాదవతర ప్రభో! ।**
**నాహం భవన్తం శక్నోమి వోఢుం తేజోమయం గురుమ్ ॥ 8 ॥**

ఓ ప్రభూ! నాచేత మోయబడుచున్న నీవు ఈకమలం నుండి క్రిందికి దిగు. తేజోమయుడవు బరువుగానున్న నిన్ను నేను వహించటానికి సమర్థుడను కాను.

**తతోఽవతీర్య విశ్వాత్మా దేవమావిశ్య చక్రిణః ।**
**అవాప వైష్ణవీం నిద్రామేకీభూయాథ విష్ణునా ॥ 9 ॥**

అపుడు విశ్వాత్మ అయిన బ్రహ్మ క్రిందకు దిగి చక్రధారి అయిన విష్ణువు దేహంలో ప్రవేశించి విష్ణువునకు సంబంధించిన నిద్రను పొందినాడు. ఈవిధంగా విష్ణువుతో బ్రహ్మకు ఏకాత్మత సిద్ధించింది.

**సహతేన తథాఽఽవిశ్య శఙ్ఖచక్రగదాధరః ।**
**బ్రహ్మే నారాయణాఖ్యోఽసౌ సుష్వాప సలిలే తదా ॥ 10 ॥**

అతనితో ఆవిధంగా కలిసిపోయి శంఖ-చక్ర-గదలు ధరించి నారాయణుడనే పేరుగల బ్రహ్మ నీటిలో నిద్రించినాడు

**సోఽనుభూయ చిరం కాలమానన్దం పరమాత్మనః ।**
**అనాద్యనన్తమద్వైతం స్వాత్మానం బ్రహ్మసంజ్ఞితమ్ ॥ 11 ॥**

ఆయన చాలకాలం వరకు పరమాత్మకు సంబంధించిన అనాది-అనంత- ఆత్మస్వరూప-బ్రహ్మ సంజ్ఞలు కల్గిన అద్వైతానంద అనుభవాన్ని పొందాడు.

**తతః ప్రభాతే యోగాత్మా భూత్వా దేవశ్చతుర్ముఖః ।**
**ససర్జ సృష్టిం తద్రూపాం వైష్ణవం భావమాశ్రితః ॥ 12 ॥**

తర్వాత ఉదయంకాగానే యోగాత్మ దేవుడైన బ్రహ్మ చతుర్ముఖుడై వైష్ణవభావాన్ని గ్రహించి అదే ప్రకారం వైష్ణవసృష్టిని చేసినాడు.

**పురస్తాదసృజద్దేవః సనన్దం సనకం తథా ।**
**ఋభుం సనత్కుమారం చ పూర్వజం తం సనాతనమ్ ॥ 13 ॥**

ఆతడు మొట్టమొదటి వారికంటే కూడ మొదటివాడైన సనంద-సనక-ఋభు-సనత్కుమారులను అట్లే పూర్వజుడైన సనాతనుణ్ణి సృష్టించినాడు.

**తే ద్వంద్వమోహనిర్ముక్తాః పరం వైరాగ్యమాస్థితాః ।**
**విదిత్వా పరమం భావం న సృష్టౌ దధిరే మతిమ్ ॥ 14 ॥**

వారు సుఖ-దుఃఖాది ద్వంద్వాల మోహం లేనివారై పరమ వైరాగ్యభావాన్నిపొంది పరమతత్త్వాన్ని తెలుసుకొని సృష్టికార్యంలో మనస్సును లగ్నం చేయలేదు.

**తేష్వేవం నిరపేక్షేషు లోకసృష్టౌ పితామహః ।**
**బభూవ నష్టచేతా వై మాయయా పరమేష్ఠినః ॥ 15 ॥**

వారు లోకసృష్టికార్యంలో నిరపేక్షాభావాన్ని పొందటం చూచి పితామహుడు బ్రహ్మ పరమేష్ఠి అయిన జనార్దనునిమాయతో నష్టబుద్ధియైనాడు.

**తతః పురాణపురుషో జగన్మూర్తిర్జనార్దనః ।**
**వ్యాజహారాత్మనః పుత్రం మోహనాశాయ పద్మజమ్ ॥ 16 ॥**

తర్వాత పురాణపురుషుడైన జగన్మూర్తి జనార్దనుడు తనపుత్రుడైన బ్రహ్మతో మోహాన్ని తొలగించటానికి ఈవింధగా చెప్పాడు.

**విష్ణురువాచ -** విష్ణువు చెప్పాడు.

**కచ్చిన్న విస్మృతో దేవః శూలపాణిః సనాతనః ।**
**యదుక్తో వై పురా శమ్భుః పుత్రత్వే భవ శంకర! ॥ 17 ॥**

నీవు శూలపాణి సనాతనుడైన శివుని మరచిపోలేదు కదా ! పూర్వం శంకరుని పుత్రుని కమ్మని నీవు కోరావు.

**ప్రయుక్తవాన్ మనో యోఽసౌ పుత్రత్వే తవ శంకరః ।**
**అవాప సంజ్ఞాం గోవిన్దాత్పద్మయోనిః పితామహః ॥ 18 ॥**

ఇపుడు శంకరుడు నీకు పుత్రుడగుటకు మనసును పెట్టెను. ఈ విధంగా గోవిందునివల్ల బ్రహ్మ చైతన్యాన్ని పొందాడు.

**ప్రజాః స్రష్టుమనాస్తేపే తపః పరమదుశ్చరమ్ ।**
**తస్యైవం తప్యమానస్య న కిఞ్చిత్సమవర్తత ॥ 19 ॥**

పద్మసంభువుడైన పితామహుడు ప్రజలను సృష్టించాలనే కోరికతో పరమకఠినమైన తపమాచరించాడు. ఈవిధంగా తపస్సాచరించినప్పటికి సృష్టి ఏమాత్రం జరగలేదు.

**తతో దీర్ఘేణ కాలేన దుఃఖాత్క్రోధోఽభ్యజాయత ।**
**క్రోధావిష్టస్య నేత్రాభ్యాం ప్రాపతన్నశ్రుబిందవః ॥ 20 ॥**

తర్వాత చాలకాలానికి దుఃఖంవల్ల క్రోధం కల్గింది. క్రోధావిష్టుడైన పితామహుని నేత్రాల నుండి కన్నీటి బిందువులు నేల పడినవి.

**తతస్తేభ్యోఽశ్రుబిందుభ్యో భూతాః ప్రేతాస్తథాఽభవన్ ।**
**సర్వాంస్తానశ్రుజాన్ దృష్ట్వా బ్రహ్మాఽఽత్మానమనిన్దత ॥ 21 ॥**

ఆ తర్వాత అశ్రుబిందువులనుండి జన్మించినవి భూతాలు, ప్రేతాలైనవి. కన్నీరువలన కలిగినవారిని చూచిన బ్రహ్మ తనను నిందించుకున్నాడు.

**జహౌ ప్రాణాంశ్చ భగవాన్ క్రోధావిష్టః ప్రజాపతిః ।**
**తదా ప్రాణమయో రుద్రః ప్రాదురాసీత్ప్రభోర్ముఖాత్ ॥ 22 ॥**

క్రోధావిష్టుడైన భగవానుడైన ప్రజాపతి ప్రాణాలు వదిలినాడు. అపుడు ప్రాణమయుడైన రుద్రుడు ప్రభువు ముఖంనుండి ప్రాదుర్భవించినాడు.

**సహస్రాదిత్యసంకాశో యుగాన్తదహనోపమః ।**
**రురోద సుస్వరం ఘోరం దేవదేవః స్వయం శివః ॥ 23 ॥**

వేయిసూర్యుల కాంతి గలవాడు, ప్రలయకాలాగ్నిసదృశుడైన శివుడు స్వయంగా ఉచ్చస్వరంలో ఏడ్వటం మొదలెట్టినాడు.

**రోదమానం తతో బ్రహ్మా మా రోదీరిత్యభాషత ।**
**రోదనాద్రుద్ర ఇత్యేవం లోకే ఖ్యాతిం గమిష్యసి ॥ 24 ॥**

అపుడు రోదిస్తున్న శివునితో బ్రహ్మ ఏడవకు అని చెప్పాడు. నీవు రోదించిన కారణంగా రుద్రుడనే పేరుతో లోకంలో ప్రసిద్ధుడవవుతావు.

**అన్యాని సప్త నామాని పత్నీః పుత్రాంశ్చ శాశ్వతాన్ ।**
**స్థానాని చైషామష్టానాం దదౌ లోకపితామహః ॥ 25 ॥**

లోకపితామహుడైన బ్రహ్మ రుద్రనామంతో పాటు మరో ఏడు పేర్లను, పత్నులను, దీర్ఘాయువులైన పుత్రులను, ఎనిమిది స్థానాలను ప్రదానం చేశాడు.

**భవః శర్వస్తథేశానః పశూనాం పతిరేవ చ ।**
**భీమశ్చోగ్రో మహాదేవస్తాని నామాని సప్త వై ॥ 26 ॥**

రుద్రుని మరో ఏడు పేర్లు భవుడు–శర్వుడు–ఈశానుడు–పశుపతి–భీముడు–ఉగ్రుడు–మహాదేవుడు అనేవి అవి.

**సూర్యో జలం మహీ వహ్నిర్వాయురాకాశమేవ చ ।**
**దీక్షితో బ్రాహ్మణశ్చంద్ర ఇత్యేతా అష్టమూర్తయః ॥ 27 ॥**

సూర్యుడు-జలము-భూమి-అగ్ని-వాయువు-ఆకాశము - దీక్షితుడైన బ్రాహ్మణుడు-చంద్రుడు ఈ ఎనిమిది రుద్రునిమూర్తులు.

**స్థానేష్వేతేషు యే రుద్రం ధ్యాయంతి ప్రణమన్తి చ ।**
**తేషామష్టతనుర్దేవో దదాతి పరమం పదమ్ ॥ 28 ॥**

పైన పేర్కొన్న ఎనిమిది స్థానాల్లో ఎవరైతే రుద్రుణ్ణి ధ్యానిస్తారో, నమస్కరిస్తారో వారికి ఎనిమిదిమూర్తులుగల దేవుడు పరమపదాన్ని ప్రసాదిస్తాడు.

**సువర్చలా తథైవోమా వికేశీ చ శివా తథా ।**
**స్వాహా దిశశ్చ దీక్షా చ రోహిణీ చేతి పత్నయః ॥ 29 ॥**

సువర్చల-ఉమా-వికేశీ-శివా-స్వాహా-దిశ-దీక్షా-రోహిణీ అనే వారెనమండుగురు రుద్రునిపత్నులు.

**శనైశ్చరస్తథా శుక్రో లోహితాఙ్గో మనోజవః ।**
**స్కన్దః సర్గోఽథ సన్తానో బుధశ్చైషాం సుతాః స్మృతాః ॥ 30 ॥**

శనైశ్చరుడు, శుక్రుడు-లోహితాంగుడు-మనోజవుడు-స్కందుడు, సర్గుడు-సంతానుడు-బుధుడు అనేవారు వీరి సుతులు.

**ఏవం ప్రకారో భగవాన్ దేవదేవో మహేశ్వరః ।**
**ప్రజా ధర్మఞ్చ కామం చ త్యక్త్వా వైరాగ్యమాశ్రితః ॥ 31 ॥**

ఈవిధంగా దేవాధిదేవుడైన భగవానుడైన మహేశ్వరుడు సృష్టికార్యాన్ని, కామాన్ని వదలి వైరాగ్యాన్ని ఆశ్రయించాడు.

**ఆత్మన్యాధాయ చాఽఽత్మానమైశ్వరం భావమాస్థితః ।**
**పీత్వా తదక్షరం బ్రహ్మ శాశ్వతం పరమామృతమ్ ॥ 32 ॥**

శాశ్వతమైన పరమ అమృతరూపమైన అక్షరబ్రహ్మను ఆస్వాదిస్తూ, ఆత్మలో ఆత్మత్వాన్ని ప్రవేశపెట్టి, ఈశ్వరభావాన్ని పొందినాడు.

**ప్రజాః సృజేతి చాఽఽదిష్టో బ్రహ్మణా నీలలోహితః ।**
**స్వాత్మనా సదృశాన్ రుద్రాన్ ససర్జ మనసా శివః ॥ 33 ॥**

ప్రజలను సృష్టించుమని బ్రహ్మచెప్పటంతో నీలలోహితుడనే శివుడు మనస్సుతో తనతో సమానులైన రుద్రులను సృష్టించాడు.

**కపర్దినో నిరాతఙ్కాన్నీలకణ్ఠాన్ పినాకినః ।**
**త్రిశూలహస్తానుద్రిక్తాన్ సదానందాంస్త్రిలోచనాన్ ॥ 34 ॥**

**జరామరణనిర్ముక్తాన్ మహావృషభవాహనాన్ ।**
**వీతరాగాంశ్చ సర్వజ్ఞాన్ కోటి కోటి శతాన్ప్రభుః ॥ 35 ॥**

ప్రభువు జడలు ధరించిన వారిని, భయరహితులను, నీలకంఠులను, పినాకపాణులను, త్రిశూలం ధరించిన వారిని, ఋష్టిఘ్నులను, ఉద్రిక్తులను మహా ఆనందస్వరూపులను-మూడు నేత్రాలున్న వారిని, జరా-మరణాలు లేని వారిని, గొప్ప వృషభాలు వాహనాలుగా కలవారిని, సర్వజ్ఞులను, వీతరాగులైన వందలకోట్ల రుద్రులను సృష్టించాడు.

**తాన్ దృష్ట్వా వివిధాన్ రుద్రాన్నిర్మలాన్నీలలోహితాన్ ।**
**జరామరణనిర్ముక్తాన్ వ్యాజహార హరం గురుః ॥ 36 ॥**

బ్రహ్మ జరామరణరహితులు, నీలలోహితులు, నిర్మలులైన ఆ అనేకులైన రుద్రులను చూచి శివునితో ఇట్లన్నాడు.

**మా స్రాక్షీరీదృశీర్దేవ ప్రజా మృత్యువివర్జితాః ।**
**అన్యాః సృజస్వ భూతేశ జన్మమృత్యుసమన్వితాః ॥ 37 ॥**

ఓదేవ! మృత్యురహితమైన ఇటువంటివారిని స్పష్టి చేయవద్దు. ఓ భూతేశా! ఇదే విధంగా జన్మ, మృత్యువులు కల మరోవిధమైన సృష్టిని చేయవలసింది.

**తతస్తమాహ భగవాన్ కపర్దీ కామశాసనః ।**
**నాస్తి మే తాదృశః సర్గః సృజ త్వం వివిధాః ప్రజాః ॥ 38 ॥**

ఆ తర్వాత కాముని శాసించినవాడు జటాధారి అయిన శివుడు బ్రహ్మతో అటువంటి సృష్టి నాకు లేదు. వివిధప్రజలను నీవే సృష్టించు.

**తతః ప్రభృతి దేవోఽసౌ న ప్రసూతేఽశుభాః ప్రజాః ।**
**స్వాత్మజై రేవ తైః రుద్రై ర్నివృత్తాత్మా హ్యతిష్ఠత ॥ 39 ॥**

అప్పటి నుండి శివుడు అశుభమైన ప్రజాసృష్టి చేయలేదు. తన పుత్రులైన ఆ రుద్రులతోనే క్రియారహితమైన రూపంలో ఉండి పోయినాడు.

**స్థాణుత్వం తేన తస్యాసీద్దేవదేవస్య శూలినః ।**
**జ్ఞానం వైరాగ్యమైశ్వర్యం తపః సత్యం క్షమా ధృతిః ॥ 40 ॥**

**ద్రష్టృత్వమాత్మసంబోధో హ్యధిష్ఠాతృత్వమేవ చ।**
**అవ్యయాని దశైతాని నిత్యం తిష్ఠన్తి శంకరే ॥ 41 ॥**

భగవానుడైన శంకరునిలో జ్ఞానం-వైరాగ్యం-ఐశ్వర్యం-తపస్సు, సత్యం-క్షమ-ధృతి-ద్రష్టృత్వం-ఆత్మజ్ఞానం అట్లే అధిష్ఠాతృత్వం అనే పది శాశ్వతాలైన గుణాలు ఎల్లపుడు ఉంటున్నవి. అతడు సృష్టి చేయటం మానుకున్నప్పటి నుండి అతనికి స్థాణుత్వం ఏర్పడింది.

**ఏవం స శంకరః సాక్షాత్పినాకీ పరమేశ్వరః ।**
**తతః స భవాన్ బ్రహ్మా వీక్ష్య దేవం త్రిలోచనమ్ ॥ 42 ॥**

**సహైవ మానసైః పుత్రైః ప్రీతివిస్ఫారిలోచనః ।**
**జ్ఞాత్వా పరతరం భావమైశ్వరం జ్ఞానచక్షుషా ॥ 43 ॥**

**తుష్టావ జగతామీశం కృత్వా శిరసి చాఞ్జలిమ్,**

ఆ పినాకధారి అయిన శంకరుడే సాక్షాత్పరమేశ్వరుడు. తర్వాత ఆ బ్రహ్మ ముక్కంటి అయిన దేవుని మానసపుత్రులతో కూడ చూచి ప్రీతితో విప్పారిన నేత్రాలుకలవాడై ఈశ్వరసంబంధమైన పరాత్పరభావాన్ని తెలుసుకొని తలపై అంజలిబద్ధుడై జగత్ప్రభువైన శంకరుని స్తుతించాడు.

బ్రహ్మోవాచ :-బ్రహ్మ పలికాడు

**నమస్తేఽస్తు మహాదేవ! నమస్తే పరమేశ్వర! । 44 ॥**
**నమః శివాయ దేవాయ నమస్తే బ్రహ్మరూపిణే ॥**
**నమోఽస్తు తే మహేశాయ నమశ్శాన్తాయ హేతవే ॥ 45 ॥**

**ప్రధానపురుషేశాయ యోగాధిపతయే నమః ।**
**నమః కాలాయ రుద్రాయ మహాగ్రాసాయ శూలినే ॥ 46 ॥**

ఓ మహాదేవా! నమస్కారం. పరమేశ్వర! నీకు నమస్కారం. శివునికి నమస్కారం. బ్రహ్మస్వరూపుడైన దేవునకు నమస్కారము. ఓ మహేశా! నీకు నమస్కారం. శాంతికి మూలమైన నీకు నమస్కారము. ప్రధానపురుషా! ఈశా! నీకు నమస్కారం. యోగాధిపతీ! నమస్కారం. కాలుడు-రుద్రుడు- మహాగ్రాసశక్తికలవాడా! శూలధారీ! నీకు నమస్కారం.

**నమః పినాకహస్తాయ త్రినేత్రాయ నమో నమః ।**
**నమస్త్రిమూర్తయే తుభ్యం బ్రహ్మణో జనకాయ తే ॥ 47 ॥**

పినాకము హస్తంలో కలవానికి నమస్కారం. త్రినేత్రునకు నమస్కారం. త్రిమూర్తిరూపుడవైన నీకు సమస్కారం. బ్రహ్మకు జనకుడవైన నీకు నమస్కారం

**బ్రహ్మవిద్యాధిపతయే బ్రహ్మవిద్యాప్రదాయినే ।**
**నమో వేదరహస్యాయ కాలకాలాయ తే నమః ॥ 48 ॥**

బ్రహ్మవిద్యకు అధిపతివి. బ్రహ్మవిద్య ప్రదానం చేసేవాడవు, వేదాలకు రహస్యరూపుడవైన నీకు నమస్కారం. యమునికే యముడవైన నీకు నమస్కారం.

**వేదాన్తసారసారాయ నమో వేదాత్మమూర్తయే ।**
**నమో బుద్ధాయ శుద్ధాయ యోగినాం గురవే నమః ॥ 49 ॥**

వేదాంతసారానికే సారమైనవాడవు, వేదమూర్తివైన నీకు నమస్కారం. శుద్ధబుద్ధస్వరూపుడవైన నీకు నమస్కారం. యోగులకు గురువైనవానికి నమస్కారం.

**ప్రహీణశోకైర్వివిధైర్భూతైః పరివృతాయ తే ।**
**నమో బ్రహ్మణ్యదేవాయ బ్రహ్మాధిపతయే నమః ॥ 50 ॥**

శోకరహితులైన అనేక భూతాలతో పరివేష్టితుడవైన నీకు, బ్రహ్మణ్యదేవునకు నమస్కారం. బ్రహ్మకధిపతివైన నీకు నమస్కారము.

**త్రియమ్బకాయ దేవాయ నమస్తే పరమేష్ఠినే ।**
**నమో దిగ్వాససే తుభ్యం నమో ముణ్డాయ దణ్డినే ॥ 51 ॥**

త్రిలోచనుడు, పరమేష్ఠి అయిన దేవునికి నమస్కారం, దిగంబరుడవైన నీకు నమస్కారం. ముండమాల ధరించినవానికి, దండాన్ని దాల్చిన వానికి నమస్కారం.

**అనాదిమలహీనాయ జ్ఞానగమ్యాయ తే నమః ।**
**నమస్తారాయ తీర్థాయ నమో యోగర్ధిహేతవే ॥ 52 ॥**

**నమో ధర్మాధిగమ్యాయ యోగగమ్యాయ తే నమః ।**
**నమస్తే నిష్ప్రపఞ్చాయ నిరాభాసాయ తే నమః ॥ 53 ॥**

అనాదిమలరహితుడవు, జ్ఞానంతో మాత్రమే తెలియగల నీకు నమస్కారం. తరింపచేసే తీర్థస్వరూపుడవు, యోగవిభూతులకు మూలకారణమైన నీకు నమస్కారం. ధర్మాచరణతో మాత్రమే పొందదగినవాడు, యోగంతో తెలియదగిన నీకు నమస్కారం. నిష్ప్రపంచుడవు, నిరాభాసుడవు అయిన నీకు నమస్కారం.

**బ్రహ్మణే విశ్వరూపాయ నమస్తే పరమాత్మనే ।**
**త్వయైవ సృష్టమఖిలం త్వయ్యేవ సకలం స్థితమ్ ॥54॥**

బ్రహ్మ, విశ్వరూపుడు-పరమాత్మవైన నీ కొరకు నమస్కారము. నీవే సమస్తాన్ని సృష్టించావు. నీలోనే ఈ ప్రపంచమంతా ఉన్నది.

**త్వయా సంహ్రియతే విశ్వం ప్రధానాద్యం జగన్మయ! ।**
**త్వమీశ్వరో మహాదేవః పరంబ్రహ్మ మహేశ్వరః ॥ 55 ॥**

నీవే ప్రధానము ఆదిగాగల ఈ విశ్వాన్ని సంహరిస్తున్నావు. జగత్ స్వరూపుడవు. నీవే ఈశ్వరుడవు-మహాదేవుడవు-పరబ్రహ్మవు-మహేశ్వరుడవు.

**పరమేష్ఠీ శివః శాన్తః పురుషో నిష్కలో హరః ।**
**త్వమక్షరం పరంజ్యోతిస్త్వం కాలః పరమేశ్వరః ॥ 56 ॥**

పరమేష్ఠి-శివుడు- శాంతి-పురుషుడు- నిష్కలుడు-హరుడు నీవే. నీవు నాశంలేని వాడవు-పరంజ్యోతివి-కాలుడవు- పరమేశ్వరుడవు నీవే.

**త్వమేవ పురుషోఽనన్తః ప్రధానప్రకృతిస్తథా ।**
**భూమిరాపోఽనలో వాయు ర్వ్యోమాహంకార ఏవ చ ॥ 57 ॥**

ప్రధాన పురుషుడవు-అనంతుడవు-ప్రకృతివి. అట్లే భూమి-నీరు-అగ్ని-వాయువు- ఆకాశం-అహంకారం కూడ నీవే.

**యస్య రూపం నమస్యామి భవన్తం బ్రహ్మసంజ్ఞితమ్ ।**
**యస్య ద్యౌరభవన్మూర్ధా పాదౌ పృథ్వీ దిశో భుజాః ॥ 58 ॥**

**ఆకాశముదరం తస్మై విరాజే ప్రణమామ్యహమ్ ।**
**సంతాపయతి యో విశ్వం స్వాభాభిర్భాసయన్ దిశః ॥ 59 ॥**

**బ్రహ్మతేజోమయం నిత్యం తస్మై సూర్యాత్మనే నమః ।**
**హవ్యం వహతి యో నిత్యం రౌద్రీ తేజోమయీ తనుః ॥ 60 ॥**

**కవ్యం పితృగణానాం చ తస్మై వహ్న్యాత్మనే నమః ।**
**ఆప్యాయయతి యో నిత్యం స్వధామ్నా సకలం జగత్ ॥ 61 ॥**

**పీయతే దేవతాసంఘైస్తస్మై సోమాత్మనే నమః ।**
**బిభర్త్యశేషభూతాని యోఽన్తశ్చరతి సర్వదా ॥ 62 ॥**

**శక్తిర్మాహేశ్వరీ తుభ్యం తస్మై వాయ్వాత్మనే నమః ।**
**సృజత్యశేషమేవేదం యః స్వకర్మానురూపతః ।**
**స్వాత్మన్యవస్థితస్తస్మై చతుర్వక్త్రాయ తే నమః ॥ 63 ॥**

బ్రహ్మసంజ్ఞకల నీ రూపాన్ని నమస్కరిస్తున్నాను. ఎవనికి ద్యులోకం శిరస్సు, పృథివి పాదాలు, భుజాలు దిక్కులు, ఆకాశం ఉదరము కలదో ఆ విరాట్ పురుషుని నేను నమస్కరిస్తున్నాను. తన కిరణాల కాంతితో దిక్కులను ప్రకాశింప చేస్తూ (సం)తాపాన్ని కలుగ చేస్తున్న శాశ్వతమైన బ్రహ్మతేజో మయుడైన సూర్యుని స్వరూపంగల నీకు నమస్కారము. దేవతలకు నిత్యం హవ్యాన్ని అందించే తేజోమయ శరీరం కలవాడు, కవ్యాన్ని పితృదేవతలకు అందించే వహ్నిస్వరూపుడైన వానికి నమస్కారం. తనకాంతితో ఎల్లపుడు సమస్తజగత్తును తృప్తిపరచే వాడు, దేవతాసంఘంతో పానం చేయబడే సోమరూపుడ (చంద్ర)వైన నీకు నమస్కారము. సమస్త ప్రాణులను భరణ-పోషణచేస్తూ ఎల్లపుడు వానిలో సంచరిస్తూ ఉండే వాయు రూపాత్మకమైన మాహేశ్వరీశక్తివైన నీకు నమస్కారం. తమ తమ కర్మానుగుణంగా ప్రాణులను సృష్టించేవాడు. వానిని తన ఆత్మలో నిలుపుకున్న నాలుగు ముఖాలున్న. బ్రహ్మస్వరూపుడవైన నీకు నమస్కారం.

**యః శేష శయనే శేతే విశ్వమావృత్య మాయయా ॥ 64 ॥**

**స్వాత్మాను భూతియోగేన తస్మై విశ్వాత్మనే నమః ।**
**బిభర్తి శిరసా నిత్యం ద్విసప్త భువనాత్మకమ్ ॥ 65 ॥**

**బ్రహ్మాండం యోఽఖిలాధారస్తస్మై శేషాత్మనే నమః ।**
**యః పరాన్తే పరానన్దం పీత్వా దివ్యైకసాక్షికమ్ ॥ 66 ॥**

**నృత్యత్యనన్తమహిమా తస్మై రుద్రాత్మనే నమః ।**
**యోఽన్తరా సర్వభూతానాం నియన్తా తిష్ఠతీశ్వరః ॥ 67 ॥**

**యస్య కేశేషు జీమూతాః నద్యః సర్వాంగసంధిషు ।**
**కుక్షౌ సముద్రాశ్చత్వారస్తస్మై తోయాత్మనే నమః ॥ 68 ॥**

ఎవడు తన ఆత్మలో అనుభూతిరూపయోగంతో ప్రేరితుడై మాయద్వారా సంపూర్ణమైన విశ్వాన్ని ఆవరించి శేషశయనంలో పడుకొని ఉన్నాడో ఆ విశ్వాత్మరూపునికి నమస్కారం. తనశిరసుతో చతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాండాన్ని ధరిస్తున్నాడో అందరికి ఆధారభూతుడైన ఆదిశేషాత్మునికి నమస్కారం. మహాప్రలయకాలంలో దివ్యము ఏకమాత్ర సాక్షిరూపమైన పరమానందాన్ని ఆస్వాదిస్తూ నాట్యం చేసేవాడు, అనంతమైన మహిమకల రుద్రాత్మకునికి నమస్కారము. ఎవడు సమస్త ప్రాణుల లోపల ఉండి నియంత రూపంలో ఉన్నాడో సర్వసాక్షిగా ఉన్న దేవుడైన నీ శరీరాన్ని నమస్కరిస్తున్నాను. మేఘాలు కేశాలుగా, నదులు సర్వాంగసంధులుగా, నాలుగు సముద్రాలు కడుపులో ఉన్న జలం రూపంలో ఉన్న నీకు నమస్కారం,

**యం వినిద్రా జితశ్వాసాః సంతుష్టాః సమదర్శినః ।**
**జ్యోతిః పశ్యన్తి యుఞ్జానాస్తస్మై యోగాత్మనే నమః ॥ 69 ॥**

నిద్రా రహితులై శ్వాసను జయించి సంతుష్టులై సమదర్శులైన యోగులు సమాధిలో ఏ జ్యోతిని దర్శిస్తున్నారో ఆ యోగాత్మరూపుడవైన నీకు నమస్కారం.

**యయా సంతరతే మాయాం యోగీ సంక్షీణకల్మషః ।**
**అపారతరపర్యన్తాం తస్మై విద్యాత్మనే నమః ॥ 70 ॥**

ఏ విద్యద్వారా యోగులు కల్మషం క్షీణించినవారై దాటరాని మాయను తొలగించుకుంటారో ఆ విద్యారూపునకు నమస్కారము.

**యస్య భాసా విభాతీదమద్వయం తమసః పరమ్ ।**
**ప్రపద్యే తత్పరం తత్త్వం తద్రూపం పారమేశ్వరమ్ ॥ 71 ॥**

ఎవని కాంతితో ఈవిశ్వం ప్రకాశిస్తుందో, ఎప్పుడు అంధకారం ఉండదో అద్వితీయమైన పరమతత్త్వస్వరూపం కల ఆ పరమేశ్వరుని శరణు పొందుతున్నాను.

**నిత్యానన్దం నిరాధారం నిష్కలం పరమం శివమ్ ।**
**ప్రపద్యే పరమాత్మానం భవన్తం పరమేశ్వరమ్ ॥ 72 ॥**

నిత్యానందస్వరూపుడు, మరో ఆధారంలేనివాడు, నిష్కలుడు, పరమాత్మ, పరమేశ్వరుడవైన పరమశివుడవు నీవు. అట్టి నిన్ను శరణుపొందుతున్నాను.

**ఏవం స్తుత్వా మహాదేవం బ్రహ్మా తద్భావభావితః ।**
**ప్రాంజలిః ప్రణతస్తస్థౌ గృణన్ బ్రహ్మ సనాతమ్ ॥ 73 ॥**

ఈవిధంగా మహాదేవుని స్తుతించి బ్రహ్మ అతని భావనతో ప్రభావితుడై సనాతనుడైన పరబ్రహ్మను కీర్తిస్తూ అంజలిబద్ధుడై నిలిచాడు.

**తతస్తస్మై మహాదేవో దివ్యం యోగమనుత్తమమ్ ।**
**ఐశ్వరం బ్రహ్మసద్భావం వైరాగ్యం చ దదౌ హరః ॥ 74 ॥**

ఆ తర్వాత మహాదేవుడు దివ్యమైన, శ్రేష్ఠమైన యోగాన్ని, ఈశ్వరసంబంధమైనదాన్ని, బ్రహ్మవిషయంలో సద్భావాన్ని, వైరాగ్యాన్ని హరుడు ప్రసాదించినాడు.

**కరాభ్యాం కోమలాభ్యాం చ సంస్పృశ్య ప్రణతార్తిహా ।**
**వ్యాజహార స్వయం దేవః సోఽనుగృహ్య పితామహమ్ ॥ 75 ॥**

కోమలమైన రెండు చేతులతో ఆతణ్ణి లేవనెత్తి ప్రణతులైనవారి ఆర్తిని పోగొట్టే దేవుడైన శివుడు అనుగ్రహించి బ్రహ్మను గూర్చి ఇట్లన్నాడు.

**యత్త్వయాఽ భ్యర్థితం బ్రహ్మన్ పుత్రత్వే భవతో మమ ।**
**కృతం మయా తత్సకలం సృజస్వ వివిధం జగత్ ॥ 76 ॥**

ఓ బ్రహ్మ! నీవు నీ పుత్రునిగా కమ్మని నన్ను కోరావు. నేను నిర్వర్తించాను. ఇక సమస్తమైన జగత్తును సృష్టించు.

**త్రిధా భిన్నోఽస్మ్యహం బ్రహ్మన్ బ్రహ్మవిష్ణుహరాఖ్యయా ॥ 77 ॥**

**సర్గరక్షాలయగుణైర్నిష్కలః పరమేశ్వరః ।**
**స త్వం మమాగ్రజః పుత్రః సృష్టిహేతోర్వినిర్మితః ॥ 78 ॥**

**మమైవ దక్షిణాదఙ్గాద్వామాఙ్గాత్ పురుషోత్తమః ।**
**తస్య దేవాదిదేవస్య శంభోః హృదయదేశతః ॥ 79 ॥**

**సంబభూవాథ రుద్రోఽసావహం తస్యాపరా తనుః ।**
**బ్రహ్మవిష్ణుశివా బ్రహ్మన్ సర్గస్థిత్యంతహేతవః ॥ 80 ॥**

ఓ! బ్రహ్మా! బ్రహ్మ – విష్ణు – హర అనే పేర్లతో నేను మూడు భిన్న రూపాలు పొందాను. సృష్టి, స్థితి, లయ గుణాలలో నిష్కలుడైన నేను పరమేశ్వరుడను. నీవు నా పెద్ద కుమారుడవు. సృష్టికొరకు నా కుడి శరీరాంగం నుండి నిర్మింపబడినావు. ఎడమభాగం నుండి పురుషోత్తముడు నిర్మితుడైనాడు. ఆ దేవదేవుడైన శంభువు హృదయం నుండి రుద్రునిగా జన్మించినాను. నేను ఆ శంభునకు మరో శరీరాన్ని. ఓబ్రహ్మా! బ్రహ్మ – విష్ణు – శివులు సృష్టి, స్థితి, లయాలకు కారణాలవుతున్నారు.

**విభజ్యాత్మానమేకోఽపి స్వేచ్ఛయా శంకరః స్థితః ।**
**తథాఽన్యాని చ రూపాణి మమ మాయా కృతాని చ ॥ 81 ॥**

ఒకడే అయ్యుండి కూడా శంకరుడు తన స్వేచ్ఛతో మూడు రూపాల్లోను వేరై ఉంటున్నాడు. ఈవిధంగా ఇతర రూపాలు కూడా నా మాయచే నిర్మింపబడ్డాయి.

**నీరూపః కేవలం స్వచ్ఛో మహాదేవః స్వభావతః ।**
**ఏభ్యః పరతరో దేవస్త్రిమూర్తిః పరమా తనుః ॥ 82 ॥**

స్వరూపతః మహాదేవుడు స్వచ్ఛమైనవాడు., రూపరహితుడు, అద్వితీయుడు కూడా. ఆయన త్రిమూర్తులకంటె శ్రేష్ఠతనువు గలవాడు.

**మాహేశ్వరీ త్రినయనా యోగినాం శాంతిదా సదా ।**
**తస్యా ఏవ పరాం మూర్తిం మామవేహి పితామహ ॥ 83 ॥**

మూడు నేత్రాలుకల మాహేశ్వరీ మూర్తి యోగులకెపుడు శాంతినిస్తుంది. ఓ పితామహా! ఆమె పరా మూర్తిగానే నన్ను తెలుసుకో.

**శాశ్వతైశ్వర్యవిజ్ఞానతేజోయోగసమన్వితామ్ ।**
**సోఽహం గ్రసామి సకలమధిష్ఠాయ తమోగుణమ్ ॥ 84 ॥**

సనాతనమైన ఐశ్వర్యం–విజ్ఞానం–తేజస్సు–యోగాలతో కూడిన ఆమెను పరామూర్తిగా గుర్తించు. ఆ నేనే కాలరూపినై తమోగుణాన్నాశ్రయించి సమస్తవిశ్వాన్ని మ్రింగుతున్నాను.

**కాలో భూత్వా న తమసా మామన్యోఽభిభవిష్యతి ।**
**యదా యదా హి మాం నిత్యం విచింతయసి పద్మజ ॥ 85 ॥**
**తదా తదా మే సాన్నిధ్యం భవిష్యతి తవానఘ! ।**
**ఏతావదుక్త్వా బ్రహ్మాణం సోఽభివంద్య గురుం హరః ।**

**సహైవ మానసైః పుత్రైః క్షణాదన్త రధీయత ॥ 86 ॥**

మరొకడు కాలరూపియై తమోగుణాన్ని ఆశ్రయించి నన్నెదుర్కోలేడు. ఏ ఏ సమయంలో నీవు నన్ను ధ్యానిస్తావో ఓ బ్రహ్మ! ఆ యా సమయాల్లో నీ సాన్నిధ్యాన్ని చేరుకుంటాను. ఈవిధంగా ఆ హరుడు చెప్పి బ్రహ్మకు సమస్కరించి తన మానసపుత్రులతో కూడ క్షణంలో అంతర్ధానమైనాడు.

**సోఽపి యోగం సమాస్థాయ ససర్జ వివిధం జగత్ ॥ 87 ॥**

**నారాయణాఖ్యో భగవాన్ యథా పూర్వం ప్రజాపతిః ।**
**మరీచి భృగ్వఙ్గిరసం పులస్త్యం పులహం క్రతుమ్ ॥ 88 ॥**

**దక్షమత్రిం వసిష్ఠం చ సోఽసృజత్ యోగవిద్యయా ।**
**నవ బ్రహ్మణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః ॥ 89 ॥**

ఆ ప్రజాపతికూడ యోగాన్ని ఆశ్రయించి వివిధమైన జగత్తును సృష్టించినాడు. నారాయణుడనే పేరనున్న భగవంతుని ఆశ్రయంతో ప్రజాపతి అంతకు పూర్వసృష్టిని పోలిన దానినే సృష్టించినాడు. మరీచి-భృగు-అంగిరస-పులస్త్య-పులహ-క్రతు-దక్ష-అత్రి-వశిష్ఠులను అతడు యోగ విద్యతో సృష్టించాడు. పురాణాల్లో వీరు నవబ్రహ్మలుగా నిశ్చయింపబడినారు.

**సర్వే తే బ్రహ్మణా తుల్యాః సాధకా బ్రహ్మవాదినః ।**
**సంకల్పం చైవ ధర్మం చ యుగధర్మాంశ్చ శాశ్వతాన్ ॥**

**స్థానాభిమానినః సర్వాన్ యథా తే కథితం పురా । 90 ॥**

వారందరూ బ్రహ్మతో సమానులు, సాధకులు, బ్రహ్మవాదులు కూడ. సంకల్పం, ధర్మము- యుగధర్మాలు శాశ్వతమైన వానిని, దేవతల స్థానాభిమానాలన్నింటిని ఇంతకు ముందే నీకు చెప్పాను.

**ఇతి శ్రీకూర్మపురాణే రుద్రసృష్టిర్నామ దశమోఽధ్యాయః ॥ 10 ॥**

శ్రీకూర్మపురాణంలో రుద్రసృష్టి అనే పదవ అధ్యాయం ॥ 10 ॥



## ఏకాదశోఽధ్యాయః - పదకొండవ అధ్యాయం

## దేవ్యవతారః - దేవ్యవతారం

**శ్రీకూర్మఉవాచ :-** శ్రీకూర్మమూర్తి పలికాడు

**ఏవం సృష్ట్వా మరీచ్యాదీన్దేవదేవః పితామహః ।**
**సహైవ మానసైః పుత్రైస్తతాప పరమం తపః ॥ 1 ॥**

ఈ విధంగా మరీచి మొదలైన వారిని సృష్టించి దేవదేవుడైన బ్రహ్మ తన మానసపుత్రులతో కూడ పరమతపస్సు నాచరించినాడు.

**తస్యైవ తపతో వక్త్రాత్ రుద్రః కాలాగ్ని సంన్నిభః ।**
**త్రిశూలపాణిరీశానః ప్రాదురాసీత్ త్రిలోచనః ॥ 2 ॥**

అట్లా తపస్సు చేస్తున్న బ్రహ్మముఖం నుండి ప్రలయకాలాగ్నితో సమానంగా భయంకరమైనవాడు త్రిశూలాన్ని ధరించిన త్రిలోచనుడైన రుద్రుడు ప్రత్యక్షమైనాడు.

**అర్ధనారీ నరవపుః దుష్ప్రేక్ష్యోఽతిభయంకరః ।**
**విభజాత్మానమిత్యుక్త్వా బ్రహ్మో చాన్తర్దధే భయాత్ ॥ 3 ॥**

సగం శరీరం స్త్రీరూపంతోను, సగం శరీరం పురుషరూపంతోను ఉన్న అతనిని చూడవీలుకాని రుద్రుని చూచి బ్రహ్మ నిన్ను విభజించుకో అని చెప్పి భయంవల్ల అంతర్ధానమయ్యాడు.

**తథోక్తోఽసౌ ద్విధా స్త్రీత్వం పురుషత్వమథాకరోత్ ।**
**బిభేద పురుషత్వఞ్చ దశధా చైకధా పునః ॥ 4 ॥**

ఈవిధంగా బ్రహ్మ చెప్పగా అతను స్త్రీపురుషరూపాలను రెండు భాగాలు చేశాడు. మళ్లీ పురుషభాగాన్ని పదునొకండు భాగాలుగా విభజించాడు.

**ఏకాదశైతే కథితా రుద్రాస్త్రిభువనేశ్వరాః ।**
**కపాలీశాదయో విప్రా దేవకార్యే నియోజితాః ॥ 5 ॥**

కపాలిఈశ మొదలగు ఈ పదునొకండుగురు రుద్రులు త్రిభువనేశ్వరులుగా చెప్ప బడినారు. ఓ విప్రులారా! వీరు దేవతాకార్యంలో నియోజితులయినారు.

**సౌమ్యాసౌమ్యైస్తథా శాంతా శాన్తైః స్త్రీత్వం చ స ప్రభుః ।**
**బిభేద బహుధా దేవః స్వరూపైరసితైః సితైః ॥ 6 ॥**

ఆ ప్రభువు సౌమ్యము మరియు రౌద్రము శాంతము, అశాంత గుణాలుగల తెలుపు నలుపు రూపాలతో స్త్రీత్వాన్ని అనేక విభాగాలు చేశాడు.

**తా వై విభూతయో విప్రా విశ్రుతాః శక్తయో భువి ।**
**లక్ష్మ్యాదయో యాభిరీశా విశ్వం వ్యాప్నోతి శాంకరీ ॥ 7 ॥**

ఓ విప్రులారా! ఆ విభూతులే శక్తులరూపంలో లక్ష్మి మొదలైన పేర్లతో లోకంలో ప్రసిద్ధమైనవి. శంకరుని శక్తి వీని ద్వారానే విశ్వంలో వ్యాపించింది.

**విభజ్య పునరీశానీ స్వాత్మానం శంకరాద్విభోః ।**
**మహాదేవనియోగేన పితామహముపస్థితా ॥ 8 ॥**

ఈ ఈశానీశక్తి ప్రభువు శంకరునితో విభాగంపొంది మహాదేవుని ఆజ్ఞతో పితామహుని దగ్గరకు వెళ్ళింది.

**తామాహ భగవాన్ బ్రహ్మా దక్షస్య దుహితా భవ ।**
**సాఽపి తస్య నియోగేన ప్రాదురాసీత్ప్రజాపతేః ॥ 9 ॥**

భగవానుడైన బ్రహ్మ ఆమెను దక్షునికి కూతురు కమ్మని చెప్పాడు. అతని ఆదేశంతో ఆమె దక్షప్రజాపతికి ఉదయించింది.

**నియోగాద్బ్రహ్మణో దేవీం దదౌ రుద్రాయ తాం సతీమ్ ।**
**దక్షాద్రుద్రోఽపి జగ్రాహ స్వకీయామేవ శూలభృత్ ॥ 10 ॥**

ఈమెకే సతి అని పేరు. బ్రహ్మదేవుని ఆజ్ఞతో దక్షప్రజాపతి సతీదేవిని రుద్రునికి ప్రదానం చేశాడు. శూలధరుడైన రుద్రుడు దక్షుని నుండి తన శక్తినే గ్రహించాడు.

**ప్రజాపతివినిర్దేశాత్కాలేన పరమేశ్వరీ ।**
**విభజ్య పునరీశానీ ఆత్మానం శంకరాద్విభోః ॥ 11 ॥**

ప్రజాపతి ఆదేశంతోనే కొంతకాలానికి పరమేశ్వరి అయిన ఈశాని శంకరుని నుండి తనను మళ్లీ విభజించుకొన్నది.

**మేనాయామభవత్పుత్రీ తదా హిమవతః సతీ ।**
**స చాపి పర్వతవరో దదౌ రుద్రాయ పార్వతీమ్ ॥ 12 ॥**

అపుడా సతీదేవి హిమవంతునివల్ల మేనాదేవికి పుత్రిక అయినది. ఆ పర్వతశ్రేష్ఠుడైన హిమవంతుడు పార్వతిని రుద్రునకే ఇచ్చినాడు.

**హితాయ సర్వదేవానాం త్రిలోకస్యాత్మనోఽపి చ ।**
**సైషా మాహేశ్వరీ దేవీ శంకరార్ధశరీరిణీ ॥ 13 ॥**

సమస్తదేవతలకొరకు, ముల్లోకానికి తనకు కూడ హితమునకై శంకరుని అర్ధశరీరిణి అయిన ఆ మాహేశ్వరీదేవి రుద్రుని భార్య అయినది.

**శివా సతీ హైమవతీ సురాసురనమస్కృతా ।**
**తస్యాః ప్రభావమతులం సర్వే దేవాః సవాసవాః ॥ 14 ॥**

**విదన్తి మునయో వేత్తి శంకరో వా స్వయం హరిః ।**
**ఏతద్వః కథితం విప్రాః పుత్రత్వం పరమేష్ఠినః ॥ 15 ॥**
**బ్రహ్మణః పద్మయోనిత్వం శంకరస్యామితౌజసః ॥ 16 ॥**

శివ, సతి, హైమవతి అయిన ఈమె సురాసురుల నమస్కారాన్నందినది. ఆమె ప్రభావం సాటిలేనిది. ఇంద్రునితో కూడ సమస్తదేవతలు, మునులు ఆ ప్రభావాన్ని ఎరుగుదురు. శంకరుడు స్వయంగా హరికూడ తెలుసుకున్నాడు. ఓ బ్రాహ్మణులారా! ఈ విధంగా అమితతేజస్వి అయిన శంకరుని పుత్రత్వాన్ని పరమేష్ఠి అయిన బ్రహ్మ పద్మయోనిత్వాన్ని మీకు వివరించాను.

**ఇతి శ్రీకూర్మపురాణే దేవ్యవతారే ఏకాదశోఽధ్యాయః ॥ 11 ॥**

శ్రీకూర్మపురాణంలో దేవ్యవతార మనే పదకొండవ అధ్యాయం ॥ 11 ॥



## ద్వాదశోఽధ్యాయః - పన్నెండవ అధ్యాయం

## దేవీ మాహాత్మ్యమ్ - దేవీ మాహాత్మ్యం

**సూత ఉవాచ :** సూతుడు పలికాడు.

**ఇత్యాకర్ణ్యాథ మునయః కూర్మరూపేణ భాషితమ్ ।**
**విష్ణునా పునరేవేమం పప్రచ్ఛుః ప్రణతా హరిమ్ ॥ 1 ॥**

ఈ విధంగా కూర్మరూపి భగవంతుడు చెప్పిన దానిని విని మునులు నమస్కరించి మళ్ళీ ఆయన నిట్లా అడిగారు.

**ఋషయ ఊచుః :** ఋషులిట్లా పలికారు.

**కైషా భగవతీ దేవీ శంకరార్ధశరీరిణీ ।**
**శివా సతీ హైమవతీ యథావద్బ్రూహి పృచ్ఛతామ్ ॥ 2 ॥**

శంకరుని శరీరాన్ని సగం పొందినదీ, హిమవంతుని కూతురూ, సతీదేవీ, శివరూపిణీ అయిన ఈ దేవి ఎవరు? ఉన్నదున్నట్టు చెప్పుము.

**తేషాం తద్వచనం శ్రుత్వా మునీనాం పురుషోత్తమః ।**
**ప్రత్యువాచ మహాయోగీ ధ్యాత్వా స్వం పరమం పదమ్ ॥ 3 ॥**

ఆ మునుల మాట విని పురుషోత్తముడైన విష్ణువు గొప్ప యోగీశ్వరుడైనందువల్ల తన పరమపదాన్ని ధ్యానించి వారికిట్లా బదులు పలికాడు.

**శ్రీకూర్మ ఉవాచ :** శ్రీకూర్ముడు పలికాడు.

**పురా పితామహేనోక్తం మేరుపృష్ఠే సుశోభనే ।**
**రహస్యమేతద్విజ్ఞానం గోపనీయం విశేషతః ॥ 4 ॥**

పూర్వకాలంలో బ్రహ్మదేవుడు అందమైన మేరుశిఖర భాగంలో చెప్పిన ఈ విజ్ఞానం రహస్యమైనది. ప్రత్యేకంగా దాచతగినది.

**సాంఖ్యానాం పరమం సాంఖ్యం బ్రహ్మవిజ్ఞానముత్తమమ్ ।**
**సంసారార్ణవమగ్నానాం జన్తూనామేకమోచనమ్ ॥ 5 ॥**

సాంఖ్యయోగులకు ముఖ్యమైన సాంఖ్యతత్త్వమిది. ఉత్తమమైన బ్రహ్మవిజ్ఞానము, సంసారసముద్రంలో మునిగిన ప్రాణులను కాపాడే ఒకే ఒక మోక్షసాధనము.

**యా సా మహేశ్వరీ శక్తిర్జ్ఞానరూపాఽతిలాలసా ।**
**వ్యోమసంజ్ఞా పరాకాష్ఠా సేయం హైమవతీ మతా ॥ 6 ॥**

మహేశ్వరశక్తి జ్ఞానరూపమైనది. మిక్కిలి అనురాగం కలది. ఆకాశ సంజ్ఞ కలది. అత్యున్నత గమ్యస్థానమైన ఈమె హైమవతి అనబడినది.

**శివా సర్వగతాఽనన్తా గుణాతీతాఽతినిష్కలా ।**
**ఏకానేకవిభాగస్థా జ్ఞానరూపాఽతిలాలసా ॥ 7 ॥**

శివస్వరూపం అంతటా వ్యాపించినది. నాశం లేనిది. గుణత్రయాతీత. విభాగరహిత. ఏకరూప. అనేక విభాగాల్లో ఉండేది. జ్ఞానస్వరూప. అనేకమైన కోరికలు కలది

**అనన్యా నిష్కలే తత్త్వే సంస్థితా తస్య తేజసా ।**
**స్వాభావికీ చ తన్మూలా ప్రభా భానోరివామలా ॥ 8 ॥**

భేదంలేని తత్త్వంలో ఉన్నది. మరొకటి సాటి లేనిది. స్వభావసిద్ధపరతత్త్వమైన తేజస్సుతో తన్మూలమైన సూర్యకాంతివలె స్వచ్ఛమైన ప్రభారూప.

**ఏకా మాహేశ్వరీ శక్తిరనేకోపాధియోగతః ।**
**పరావరేణ రూపేణ క్రీడతే తస్య సన్నిధౌ ॥ 9 ॥**

మహేశ్వరసంబంధమైన ఒక శక్తి అనేకాలైన ఉపాధి భేదాలవల్ల పరమేశ్వరసాన్నిధ్యంలో పర అవర రూపాలతో క్రీడించుచుండును.

**సేయం కరోతి సకలం తస్యాః కార్యమిదం జగత్ ।**
**న కార్యం నాపి కరణమీశ్వరస్యేతి సూరయః ॥ 10 ॥**

ఆ ఈ మహేశ్వరశక్తే సమస్తం చేస్తున్నది. ఈ ప్రపంచం ఆమె నిర్మించినదే. ఈశ్వరునికి కార్యకారణభావాలు లేవని పండితులు చెప్పుచున్నారు.

**చతస్రః శక్తయో దేవ్యాః స్వరూపత్వేన సంస్థితాః ।**
**అధిష్ఠానవశాత్తస్యాః శృణుధ్వం మునిపుఙ్గవాః ॥ 11 ॥**

ఆశ్రయభేదాల కారణంగా ఆ దేవి నాలుగు శక్తులు ఆ యా స్వరూపాల్లో ఉన్నవి. మునిశ్రేష్ఠులారా! వానిని గూర్చి వినండి.

**శాన్తిర్విద్యా ప్రతిష్ఠా చ నివృత్తిశ్చేతి తాః స్మృతాః ।**
**చతుర్వ్యూహస్తతో దేవః ప్రోచ్యతే పరమేశ్వరః ॥ 12 ॥**

అవి శాంతి, విద్య, ప్రతిష్ఠ, నివృత్తి అనే పేర్లు కలని. ఈ నాలుగు శక్తులున్నందువల్లనే పరమేశ్వరుడు చతుర్వ్యూహుడనబడినాడు.

**అనయా పరయా దేవః స్వాత్మానం హి సమశ్నుతే ।**
**చతుర్ష్వపి చ వేదేషు చతుర్మూర్తిర్మహేశ్వరః ॥ 13 ॥**

ఈ పరాశక్తిచేతనే భగవంతుడు తనను తాను నిలుపుకొంటున్నాడు. నాలుగుమూర్తులను ధరించి పరమేశ్వరుడు నాలుగు వేదాల్లోను నిలిచి ఉన్నాడు.

**అస్యాస్త్వనాదిసంసిద్ధమైశ్వర్యమతులం మహత్ ।**
**తత్సమ్బన్ధాదనన్తైషా రుద్రేణ పరమాత్మనా ॥ 14 ॥**

ఈ దేవి ఐశ్వర్యం అనాదికాలంనుండే సిద్ధమైనది. అది సాటిలేని గొప్పతనం కల్గినది. పరమాత్ముడైన రుద్రసంబంధంవల్ల ఈ దేవి అనంత అయినది.

**సైషా సర్వేశ్వరీ దేవీ సర్వభూతప్రవర్తికా ।**
**ప్రోచ్యతే భగవాన్కాలో హరిః ప్రాణో మహేశ్వరః ॥ 15 ॥**

ఈ దేవియే సమస్తప్రాణులను ప్రవర్తింపచేస్తున్నది. సర్వేశ్వరి అయినది. పూజ్యుడైన మహేశ్వరుడు కాలునిగా, హరిగా, ప్రాణునిగా చెప్పబడుచున్నాడు.

**తత్ర సర్వమిదం ప్రోతమోతం చైవాఖిలం జగత్ ।**
**స కాలాగ్నిర్హరో దేవో గీయతే వేదవాదిభిః ॥ 16 ॥**

ఆతనిలోనే సమస్తప్రపంచం అడ్డము నిలువుగా విస్తరించినది. అతడు కాలాగ్ని, హరుడు, దేవుడు అని వేదవాదులు కొనియాడుచున్నారు.

**కాలః సృజతి భూతాని కాలః సంహరతి ప్రజాః ।**
**సర్వే కాలస్య వశగా న కాలః కస్యచిద్వశః ॥ 17 ॥**

కాలము ప్రాణులను సృజిస్తుంది. ప్రజలను సంహరిస్తుంది కూడ. లోకంలో అన్నీ కాలానికి అధీనములే. కాలం దేనికీ అధీనం కాదు.

**ప్రధానం పురుషస్తత్త్వం మహానాత్మా త్వహంకృతిః ।**
**కాలేనాన్యాని తత్త్వాని సమావిష్టాని యోగినా ॥ 18 ॥**

ప్రధానతత్త్వము, పురుషుడు, మహత్తత్త్వము, అహంకారము, కాలముచేత ఇతరతత్త్వాలు యోగి అయిన పరమాత్మద్వారా ఏర్పడినవి.

**తస్య సర్వజగన్మూర్తిః శక్తిర్మాయేతి విశ్రుతా ।**
**తయేదం భ్రామయేదీశో మాయావీ పురుషోత్తమః ॥ 19 ॥**

ఆ పరమపురుషుని జగత్స్వరూపము మాయాశక్తియని ప్రసిద్ధమైనది. ఆ మాయతో ఈశుడు మాయావియగు పురుషోత్తముడు విశ్వమును పాలించుచున్నాడు.

**సైషా మాయాత్మికా శక్తిః సర్వాకారా సనాతనీ ।**
**విశ్వరూపం మహేశస్య సర్వదా సంప్రకాశయేత్ ॥ 20 ॥**

ఆ మాయాశక్తి సర్వాకారములు కలది. అతిపురాతనమైన ఈ శక్తి పరమేశ్వరుని విశ్వరూపాన్ని ఎల్లపుడు ప్రకాశింప చేయగలదు.

**అన్యాశ్చ శక్తయో ముఖ్యాస్తస్య దేవస్య నిర్మితాః ।**
**జ్ఞానశక్తిః క్రియాశక్తిః ప్రాణశక్తిరితి త్రయమ్ ॥ 21 ॥**

జ్ఞానశక్తి, క్రియాశక్తి, ప్రాణశక్తి అని ఆ దేవుని ఇతరశక్తులు మూడు ముఖ్యమైనవి.

**సర్వాసామేవ శక్తీనాం శక్తిమన్తో వినిర్మితాః ।**
**మాయయైవాథ విప్రేన్ద్రాః సా చానాదిరనశ్వరా ॥ 22 ॥**

ఓ విప్రశేష్ఠులారా! ఆ శక్తులన్నింటికి వానిని ధరించేవారు కూడా సృజింపబడినారు. అవన్నీ మాయా కల్పితాలు. ఆ మాయకు ఆద్యంతాలు లేవు.

**సర్వశక్త్యాత్మికా మాయా దుర్నివారా దురత్యయా ।**
**మాయావీ సర్వశక్తీశః కాలః కాలకరః ప్రభుః ॥ 23 ॥**

సమస్తశక్తుల స్వరూపం కలది ఆ మాయ. వారింప వీలుకానిది. అవినాశి. కాలం మాయ కలది. సర్వశక్తులకు ప్రభువు. ఆ కాలాన్ని సృష్టించే పరమాత్మ కాలస్వరూపుడు.

**కరోతి కాలః సకలం సంహరేత్కాల ఏవ హి ।**
**కాలః స్థాపయతే విశ్వం కాలాధీనమిదం జగత్ ॥ 24 ॥**

**లబ్ధ్వా దేవాధిదేవస్య సన్నిధిం పరమేష్ఠినః ।**
**అనన్తస్యాఖిలేశస్య శంభోః కాలాత్మనః ప్రభోః ॥ 25 ॥**

ప్రభువు, కాలస్వరూపుడు, శంభువు, అఖిలేశుడు, అనంతుడు, దేవతలకు అధిదేవుడు అయిన పరమాత్మయొక్క సన్నిధిని పొంది కాలము సమస్తాన్ని సృష్టిస్తోంది, సంహరిస్తోంది. అంతేకాక సమస్తవిశ్వాన్ని నిలబెడుతోంది. అందువల్ల ఈ జగత్తంతా కాలాధీనము.

**ప్రధానం పురుషో మాయా మాయా సైవ ప్రపద్యతే ।**
**ఏకా సర్వగతాఽనన్తా కేవలా నిష్కలా శివా ॥ 26 ॥**

ఆ మాయాశక్తి ప్రధానము, పురుషుడు, మాయ యని పిలువబడుచున్నది. ఆ మాయ ఏకము, సర్వగతము, అంతము లేనిది, అద్వితీయము, అవయవములు లేనిది, మంగళ ప్రదమైనది.

**ఏకా శక్తిః శివైకోఽపి శక్తిమానుచ్యతే శివః ।**
**శక్తయః శక్తిమన్తోఽన్యే సర్వశక్తిసముద్భవాః ॥ 27 ॥**

శివశక్తి ఒకటే. శక్తిమంతుడు శివుడు ఒక్కడే అని చెప్పనైనది. ఇతర శక్తులు, శక్తిమంతులు సర్వ శక్తినుండి పుట్టినవే.

**శక్తిశక్తిమతోర్భేదం వదన్తి పరమార్థతః ।**
**అభేదం చానుపశ్యన్తి యోగినస్తత్త్వచిన్తకాః ॥ 28 ॥**

శక్తికి శక్తిమంతునకు వ్యవహారంలో భేదాన్ని చెప్తారు. తత్త్వాన్ని విచారించే యోగులుమాత్రం ఆ రెంటికి అభేదాన్నే చూస్తున్నారు.

**శక్తయో గిరిజా దేవీ శక్తిమానథ శఙ్కరః ।**
**విశేషః కథ్యతే చాయం పురాణే బ్రహ్మవాదిభిః ॥ 29 ॥**

శక్తులు హిమవత్పుత్రిక పార్వతి రూపాలు. శక్తిమంతుడు శంకరుడు. ఈ విశేషం బ్రహ్మవేత్తలచే పురాణాలలో పేర్కొనబడినది.

**భోగ్యా విశ్వేశ్వరీ దేవీ మహేశ్వరపతివ్రతా ।**
**ప్రోచ్యతే భగవాన్భోక్తా కపర్దీ నీలలోహితః ॥ 30 ॥**

మహేశ్వరుని పతివ్రత, విశ్వానికి నాయకురాలు అయిన పార్వతి భోగ్యురాలు. కపర్దమనే జటాజూటం కలవాడు, నీలలోహితుడు. భగవంతుడైన శంకరుడు భోక్త అనగా అనుభవించే వాడని చెప్పబడుచున్నది.

**మన్తా విశ్వేశ్వరో దేవః శఙ్కరో మన్మథాన్తకః ।**
**ప్రోచ్యతే మతిరీశానీ మన్తవ్యా చ విచారతః ॥ 31 ॥**

మన్మథుని చంపినవాడు, విశ్వానికి ప్రభువు అయిన శంకరుడు మననం చేసేవాడు. అతని భార్య పార్వతి బుద్ధిరూప ఆలోచనవల్ల తెలుసుకోదగినదని చెప్పబడుచున్నది.

**ఇత్యేతదఖిలం విప్రాః! శక్తిశక్తిమదుద్భవమ్ ।**
**ప్రోచ్యతే సర్వవేదేషు మునిభిస్తత్త్వదర్శిభిః ॥ 32 ॥**

ఓ బ్రాహ్మణులారా! శక్తి శక్తిమంతం అనేవాని పుట్టుకకు సంబంధించిన విషయమంతా అన్నివేదాల్లో ప్రతిపాదింపబడినది. తత్త్వదర్శులైన మునులు వివరించినారు.

**ఏతత్ప్రదర్శితం దివ్యం దేవ్యా మాహాత్మ్యముత్తమమ్ ।**
**సర్వవేదాన్తవాదేషు నిశ్చితం బ్రహ్మవాదిభిః ॥ 33 ॥**

దివ్యము, ఉత్తమం అయిన ఈ దేవీమాహాత్మ్యం బ్రహ్మవాదులైన ఋషులు వేదాంతచర్చల్లో నిశ్చయించి చక్కగా నిరూపించారు.

**ఏకం సర్వగతం సూక్ష్మం కూటస్థమచలం ధ్రువమ్ ।**
**యోగినస్తత్ప్రపశ్యన్తి మహాదేవ్యాః పరం పదమ్ ॥ 34 ॥**

**ఆనందమక్షరం బ్రహ్మ కేవలం నిష్కలం పరమ్ ।**
**యోగినస్తత్ప్రపశ్యన్తి మహాదేవ్యాః పరం పదమ్ ॥ 35 ॥**

అద్వితీయమూ, అంతటా ఉన్నదీ, సూక్ష్మరూపమూ, నిత్యమూ, చలనం లేనిదీ, స్థిరమైనదీ అయిన పరమేశ్వరి యొక్క సర్వోన్నతస్థానాన్ని యోగులు చూస్తున్నారు. ఆనందరూపం, నాశరహితము, కేవలము, భేదరహితము, పరబ్రహ్మ రూపమైన మహాదేవి ఉన్నతస్థానాన్ని యోగులు చూస్తున్నారు.

**పరాత్పరతరం తత్త్వం శాశ్వతం శివమచ్యుతమ్ ।**
**అనంతప్రకృతౌ లీనం దేవ్యాస్తత్పరమం పదమ్ ॥ 36 ॥**

ఆ దేవియొక్క శ్రేష్ఠస్థానము పరముకంటె పరమైన తత్త్వము, శాశ్వతమైనది, మంగళరూపం, నాశరహితం, అంతంలేని ప్రకృతిలో లీనమైనది.

**శుభం నిరఞ్జనం శుద్ధం నిర్గుణం ద్వైతవర్జితమ్ ।**
**ఆత్మోపలబ్ధివిషయం దేవ్యాస్తత్పరమం పదమ్ ॥ 37 ॥**

ఆ దేవి ఆ పరమపదం శుభకరం, అమలం, నిర్మలం, గుణరహితం, భేదం లేనిది, ఆత్మసాక్షాత్కారానికి విషయమైనది.

**సైషా ధాత్రీ విధాత్రీ చ పరమానన్దమిచ్ఛతామ్ ।**
**సంసారతాపానఖిలాన్ నిహన్తీశ్వరసంశ్రయాత్ ॥ 38 ॥**

ఈ దేవి పరమానందాన్ని పొందేవారికి ధాత్రి, విధాత్రి కూడ. ఈశ్వరసంబంధంవల్ల సమస్తమైన సంసారబంధతాపాలను నశింప చేస్తున్నది.

**తస్మాద్విముక్తిమన్విచ్ఛన్ పార్వతీం పరమేశ్వరీమ్ ।**
**ఆశ్రయేత్సర్వభూతానామాత్మభూతాం శివాత్మికామ్ ॥ 39 ॥**

అందువల్ల మోక్షాన్ని పొందగోరేవాడు పరమేశ్వరియగు పార్వతిని ఆశ్రయించాలి. ఆమె సర్వప్రాణులకు ఆత్మస్వరూపురాలు. శివస్వరూపిణి.

**లబ్ధ్వా చ పుత్రీం శర్వాణీం తపస్తప్త్వా సుదుశ్చరమ్ ।**
**సభార్యః శరణం యాతః పార్వతీం పరమేశ్వరీమ్ ॥ 40 ॥**

హిమవంతుడు కష్టసాధ్యమైన తపమాచరించి పార్వతిని పుత్రికగాపొంది భార్యతోకూడ పరమేశ్వరిని శరణు పొందినాడు.

**తాం దృష్ట్వా జాయమానాఞ్చ స్వేచ్ఛయైవ వరాననామ్ ।**
**మైనా హిమవతః పత్నీ ప్రాహేదం పర్వతేశ్వరమ్ ॥ 41 ॥**

స్వేచ్ఛగా జన్మిస్తున్న వరాననయగు పుత్రికను చూచి హిమవంతుని భార్య మైనాదేవి పర్వతరాజుతో ఇట్లన్నది.

**మేనోవాచ :–**మేనాదేవి పలికినది.

> **పశ్య బాలామిమాం రాజన్రాజీవ సదృశాననామ్ ।**
> **హితాయ సర్వభూతానాం జాతా చ తపసావయోః ॥ 42 ॥**

> **సోఽపి దృష్ట్వా తతో దేవీం తరుణాదిత్యసన్నిభామ్ ।**
> **కపర్దినీం చతుర్వక్త్రాం త్రినేత్రామతిలాలసామ్ ॥ 43 ॥**
> **అష్టహస్తాం విశాలాక్షీం చన్ద్రావయవభూషణామ్ ॥**
> **నిర్గుణాం సగుణాం సాక్షాత్సదసద్వ్యక్తివర్జితామ్ । 44 ॥**

> **ప్రణమ్య శిరసా భూమౌ తేజసా చాతివిహ్వలః ।**
> **భీతః కృతాఞ్జలిస్తస్యాః ప్రోవాచ పరమేశ్వరీమ్ ॥ 45 ॥**

**హిమవానువాచ :–**హిమవంతుడు పలికాడు

> **కా త్వం దేవి విశాలాక్షి శశాఙ్కావయవాఙ్కితే ।**
> **న జానే త్వామహం వత్సే యథావద్బ్రూహి పృచ్ఛతే ॥ 46 ॥**

ఓ రాజా! కమలసమానముఖి అయిన యీ బాలికను చూడు, మన తపస్సుచేత సర్వప్రాణుల మేలుకోసం కూడ ఈమె జన్మించింది. ఆ హిమవంతుడు ఉదయసూర్యునితో సమానంగా ఉండి, జటాజూటం కల్గినదీ, నాల్గుముఖాలు, మూడునేత్రాలు కల్గినదీ, మిక్కిలి అనురాగం కలదీ, ఎనిమిది చేతులు విశాలమైన నేత్రాలు కల్గినదీ, చంద్రకళ శిరోభూషణంగా కలదీ, గుణం లేనిదీ, గుణము కలదీ, సత్తు, అసత్తు అనే విభాగం లేనిదీ అగు దేవిని చూచి భూమిపై శిరసు వంచి నమస్కరించి, ఆమె తేజస్సుతో విహ్వలుడై, భయపడి, అంజలిబద్ధుడై పరమేశ్వరిని గూర్చి ఇట్లన్నాడు – విశాలాక్షీ! ఓదేవి! నీవెవరవు? చంద్రకళావతంసురాలా! నీవెవరవో నేనెరుగను. నాకు యథార్థాన్ని తెలియచెప్పు.

> **గిరీన్ద్రవచనం శ్రుత్వా తతః సా పరమేశ్వరీ ।**
> **వ్యాజహార మహాశైలం యోగినామభయప్రదా ॥ 47 ॥**

పర్వతరాజైన హిమవంతుని మాట విని యోగులకు అభయప్రదాత్రి అయిన ఆ పరమేశ్వరి పర్వతరాజును గూర్చి ఇట్లు పలికింది.

**శ్రీదేవ్యువాచ :–**శ్రీదేవి పలికినది.

> **మాం విద్ధి పరమాం శక్తిం మహేశ్వరసమాశ్రయామ్ ।**
> **అనన్యామవ్యయామేకాం యాం పశ్యన్తి ముముక్షవః ॥ 48 ॥**

పరమేశ్వరునాశ్రయించి ఉండే పరమశక్తిగా నన్ను గుర్తించుము. మోక్షాన్ని కోరేవారు నన్ను ఇతరాపేక్షలేని దానిగా, నాశరహితురాలిగా, ముఖ్యురాలిగా దర్శింతురు.

**అహం హి సర్వభావానామాత్మా సర్వాత్మనా శివా ।**
**శాశ్వతైశ్వర్యవిజ్ఞానమూర్తిః సర్వప్రవర్తికా ॥ 49 ॥**

నేను లోకంలోని అన్నిభావాలకు ఆత్మను. అన్నివిధాల శివరూపను. శాశ్వతైశ్వర్యం, విజ్ఞానం, ఆకారంగా ఉన్న దానిని. సమస్తాన్ని ప్రవర్తింప చేసే దానను.

**అనన్తానన్తమహిమా సంసారార్ణవతారిణీ ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే రూపమైశ్వరమ్ ॥ 50 ॥**

అంతంలేని అనంతమహిమలు కల దానిని, సంసారమనే సముద్రాన్ని దాటించేదానను. నీకు దివ్యమైన నేత్రాన్నిస్తాను. నా యీశ్వరరూపాన్ని దానితో చూడుము.

**ఏతావదుక్త్వా విజ్ఞానం దత్వా హిమవతే స్వయమ్ ।**
**స్వం రూపం దర్శయామాస దివ్యం తత్పరమేశ్వరమ్ ॥ 51 ॥**

అని పలికి హిమవంతునికి స్వయంగా విజ్ఞానాన్ని ప్రసాదించి దివ్యమైన పరమేశ్వరసంబంధం కల తనరూపాన్ని ఆమె చూపించినది.

**కోటిసూర్యప్రతీకాశం తేజోబిమ్బం నిరాకులమ్ ।**
**జ్వాలమాలాసహస్రాఢ్యం కాలానలశతోపమమ్ ॥ 52 ॥**

**దంష్ట్రాకరాళం దుర్ధర్షం జటామణ్డలమణ్డితమ్ ।**
**కిరీటినం గదాహస్తం శంఖచక్రధరం తథా ॥ 53 ॥**

**త్రిశూలవరహస్తం చ ఘోరరూపం భయానకమ్ ।**
**ప్రశాన్తం సౌమ్యవదనమనన్తాశ్చర్యసంయుతమ్ ॥ 54 ॥**

**చన్ద్రావయవలక్ష్మాణం చన్ద్రకోటిసమప్రభమ్ ।**
**కిరీటినం గదాహస్తం నూపురైరుపశోభితమ్ ॥ 55 ॥**

**దివ్యమాల్యామ్బరధరం దివ్యగంధానులేపనమ్ ।**
**శంఖచక్రధరం కామ్యం త్రినేత్రం కృత్తివాససమ్ ॥ 56 ॥**

ఆ దివ్యరూపం కోటిసూర్యసమాన తేజం కలది. వికారం లేనిది. వేలకొలది జ్వాలల పరంపర గలది. వందలకొలది ప్రళయాగ్నిజ్వాలలతో పోల్చదగినది. భయంకరమైన దంష్ట్రలతో ఎదుర్కొన శక్యం కానిది. జటల సమూహాన్ని అలంకరించుకున్నది. కిరీటము కలది. చేతిలో గదను ధరించినది. శంఖ చక్రములు ధరించినది. చేతియందు త్రిశూలాన్ని ధరించి భయంకర రూపంతో భీతిగొల్పుచున్నది. ప్రశాంతంగా ఉండి ప్రసన్నమైన ముఖము కలిగినది. అంతులేని ఆశ్చరములు కల్గి ఉన్నది. చంద్రకళను చిహ్నముగా ధరించినది. కోటిచంద్రులకాంతి కలది. కిరీటము కల్గి గదను చేత ధరించినది. కాలి అందెలతో ప్రకాశించుచున్నది. దివ్యాలైన పుష్పహారాలను,

వస్త్రాలను ధరించినది. మంచి చందనాన్ని లేపనము చేసుకొన్నది. శంఖచక్రాలు ధరించినది. కోరదగినది. అట్లే మూడు నేత్రములు కల్గినది. చర్మాన్ని వస్త్రంగా ధరించినది.

**అణ్డస్థం చాణ్డబాహ్యస్థం బాహ్యమాభ్యన్తరం పరమ్ ।**
**సర్వశక్తిమయం శుభ్రం సర్వాకారం సనాతనమ్ ॥ 57 ॥**

**బ్రహ్మేన్ద్రోపేన్ద్ర యోగీన్ద్రైర్వంద్యమానపదామ్బుజమ్ ।**
**సర్వతః పాణిపాదాన్తం సర్వతోక్షిశిరోముఖమ్ ॥ 58 ॥**

**సర్వమావృత్య తిష్ఠన్తీం దదర్శ పరమేశ్వరీమ్ ।**
**దృష్ట్వా తదీదృశం రూపం దేవ్యా మాహేశ్వరం పరమ్ ॥ 59 ॥**

**భయేన చ సమావిష్టః స రాజా హృష్టమానసః ।**
**ఆత్మన్యాధాయ చాత్మానమోఙ్కారం సమనుస్మరన్ ॥**
**నామ్నామష్టసహస్రేణ తుష్టావ పరమేశ్వరీమ్ । 60 ॥**

అండము లోపల వెలుపల ఉన్నది. బయట లోపల కూడ ఉన్నది. ఉత్తమమైనది. అన్ని శక్తులతో కూడినది. నిర్మలమైనది. అన్ని ఆకారాలు కల్గి అతిపురాతనమైనది. బ్రహ్మ ఇంద్రుడు ఉపేంద్రుడు, యోగీంద్రులు మున్నగువారు పూజించే పాదాలు కలది. అన్నివైపుల చేతులు, కాళ్ళు వ్యాపించి ఉన్నవి. అంతట కన్నులు, శిరస్సులు, ముఖాలు కలది. సమస్తమునావరించి ఉన్న పరమేశ్వరిని హిమవంతుడు చూశాడు. మహేశ్వరసంబంధం కల ఆ దేవిరూపాన్ని చూచి భయం కలవాడై పిమ్మట ఆ రాజు సంతోషంతో కూడిన మనసుకల్గి ఆత్మనాత్మలో నిలుపుకొని ఓంకారమును స్మరిస్తూ వేయి ఎనిమిది నామాలతో పరమేశ్వరిని ఇట్లు స్తుతించాడు.

**హిమవానువాచ :–**హిమవంతుడు పలికాడు

**శివోమా పరమాశక్తిరనన్తా నిష్కలాఽమలా ॥ 61 ॥**

శివ, ఉమ, ఉత్తమ శక్తి, అంతం లేనిది, విభాగాలు లేనిది నిర్మలమైనది.

**శాన్తా మాహేశ్వరీ నిత్యా శాశ్వతీ పరమాక్షరా ।**
**అచిన్త్యా కేవలానన్త్యా శివాత్మా పరమాత్మికా ॥ 62 ॥**

**అనాదిరవ్యయా శుద్ధా దేవాత్మా సర్వగాఽచలా ।**
**ఏకానేకవిభాగస్థా మాయాతీతా సునిర్మలా ॥ 63 ॥**

**మహామాహేశ్వరీ సత్యా మహాదేవీ నిరఞ్జనా ।**
**కాష్ఠా సర్వాన్తరస్థా చ చిచ్ఛక్తిరతిలాలసా ॥ 64 ॥**

**నన్దా సర్వాత్మికా విద్యా జ్యోతీరూపాఽమృతాక్షరా ।**
**శాంతిః ప్రతిష్ఠా సర్వేషాం నివృత్తిరమృతప్రదా ॥ 65 ॥**

**వ్యోమమూర్తిర్వ్యోమలయా వ్యోమాధారాఽచ్యుతాఽమరా ।**
**అనాదినిధనాఽమోఘా కారణాత్మా కులాకులా ॥ 66 ॥**

ఈ దేవి శాంతురాలు, మహేశ్వర సంబంధిని, నిత్యురాలు, శాశ్వతమైనది, ఉత్తమ,నాశరహిత, చింతనకు వీలుకానిది, కేవలరూప, చివరిది కానిది, శివాత్మకురాలు, పరమాత్మరూపం కలది, మొదలు లేనిది, నాశరహిత, స్వచ్ఛమైనది, దేవతలకాత్మయైనది, అంతట వ్యాపించినది, చలనములేనిది, అద్వితీయ, అనేక విభాగాలు కలది, మాయాతీత, మిక్కిలి నిర్మలమైనది. మహామాహేశ్వరి, సత్యస్వరూప, మహాదేవి, మాలిన్యరహిత, దిగ్రూప, అన్నింటిలో నున్నది, జ్ఞానశక్తిరూప, అధిక ప్రీతిభావం కలది, సంతోషిణి, అన్నింటి కాత్మగా కలది, విద్యాస్వరూప, తేజోరూప, అమృతస్వరూప, అక్షర, శాంతిస్వరూప, సర్వుల ప్రతిష్ఠకు హేతువు, నివృత్తికారిణి, అమృతాన్నిచ్చేది, ఆకాశస్వరూపురాలు, ఆకాశంలో లయాన్ని పొందేది, ఆకాశాధార, నాశములేనిది అమరురాలు, ఆద్యంతాలు లేనిది, వ్యర్థముకానిది, కారణరూప, వంశయుత, వంశరహిత కూడ.

**స్వతః ప్రథమజా నాభిరమృతస్యాత్మసంశ్రయా ।**
**ప్రాణేశ్వరప్రియా మాతా మహామహిషవాసినీ ॥ 67 ॥**

**ప్రాణేశ్వరీ ప్రాణరూపా ప్రధానపురుషేశ్వరీ ।**
**మహామాయా సుదుష్పూరా మూలప్రకృతిరీశ్వరీ ॥ 68 ॥**

**సర్వశక్తికలాకారా జ్యోత్స్నా ద్యౌర్మహిమాస్పదా ।**
**సర్వకార్యనియన్త్రీ చ సర్వభూతేశ్వరేశ్వరీ ॥ 69 ॥**

**సంసారయోనిః సకలా సర్వశక్తిసముద్భవా ।**
**సంసారపోతా దుర్వారా దుర్నిరీక్ష్యా దురాసదా ॥ 70 ॥**

**ప్రాణశక్తిః ప్రాణవిద్యా యోగినీ పరమా కలా ।**
**మహావిభుతిర్దుర్ధర్షా మూలప్రకృతిసంభవా ॥ 71 ॥**

స్వయంగా మొదట జన్మించినది, అమృతానికి కేంద్రస్థానం, ఆత్మకు ఆశ్రయమైనది, ప్రాణేశ్వరునకు ప్రియమైనది, తల్లి, మహామహిషముపై వసించునది, ప్రాణములకు ఈశ్వరి, ప్రాణస్వరూప, ప్రధానపురుషునకు ఈశ్వరి, మహామాయారూప, పూరింప శక్యంకానిది, మూలప్రకృతి, ఈశ్వరి, సర్వశక్తి, కళలు ఆకారంగా కలది, వెన్నెల, ఆకాశరూప, మహిమలకు స్థానం, అన్నిపనులను నియమించేది, సర్వప్రాణి ప్రభువులకు నాయకురాలు, సంసారానికి కారణమైనది, సర్వరూపిణి, శక్తులన్నింటి కుత్పత్తిస్థానం, సంసారోత్తారిణి, వారింప వీలుకానిది, చూడ వీలుకానిది, కష్టంగా పొందదగినది. ప్రాణాలకు శక్తి, ప్రాణముల విద్య, యోగిని, గొప్ప కళారూప, మహాసంపన్నురాలు, ఎదిరింపశక్యము కానిది, మూలప్రకృతినుండి ఉద్భవించినది.

**అనాద్యనన్త విభవా పరమాద్యాపకర్షణీ ।**
**సర్గస్థిత్యన్తకరణీ సుదుర్వాచ్యా దురత్యయా ॥ 72 ॥**

**శబ్దయోనిః శబ్దమయీ నాదాఖ్యా నాదవిగ్రహా ।**
**అనాదిరవ్యక్తగుణా మహానన్దా సనాతనీ ॥ 73 ॥**

**ఆకాశయోనిర్యోగస్థా మహాయోగేశ్వరేశ్వరీ ।**
**మహామాయా సుదుష్పారా మూలప్రకృతిరీశ్వరీ ॥ 74 ॥**

**ప్రధానపురుషాతీతా ప్రధానపురుషాత్మికా ।**
**పురాణా చిన్మయీ పుంసామాదిపూరుషరూపిణీ ॥ 75 ॥**

**భూతాన్తరస్థా కూటస్థా మహాపురుషసంజ్ఞితా ।**
**జన్మమృత్యు జరాతీతా సర్వశక్తిసమన్వితా ॥ 76 ॥**

పుట్టువులేనిది, అనంతవైభవం కలది, అన్నిటికి మూలమైనది, వికారరూపముగలదీ, సృష్టిస్థితి లయాలను కల్గించేది, మాటలకందనిది, అతిక్రమింపరానిది, శబ్దానికి కారణము, శబ్దమయము, నాదమనే పేరు కలది, నాదశరీర, ప్రారంభం లేనిది, వ్యక్తంకానిది గుణాలు కలది, మహానందస్వరూపిణి, అతిపురాతన, ఆకాశం ప్రభవస్థానమైనది, యోగాన్ని అధిష్ఠించినది, మహాయోగవిద్యావేత్తలకు నాయకురాలు, మహామాయారూపిణి, అధిగమింప సాధ్యం కానిది, మూల ప్రకృతి, ఈశ్వరి, ప్రధానపురుషులకతీతురాలు, ప్రధాన పురుషస్వరూప, పురాతన, జ్ఞానమయి, పురుషులకాదిపురుషస్వరూపిణి, సర్వప్రాణులకంతర్యామి, మూలస్థానంలో ఉండేది, మహాపురుషసంజ్ఞ కలది, చావుపుట్టుకలకు, ముసలితనమునకు అతీతురాలు, శక్తులన్నింటిని కలిగి ఉన్నది.

**వ్యాపినీ చానవచ్ఛిన్నా ప్రధానానుప్రవేశినీ ।**
**క్షేత్రజ్ఞశక్తిరవ్యక్తలక్షణా మలవర్జితా ॥ 77 ॥**

**అనాదిమాయాసంభిన్నా త్రితత్త్వా ప్రకృతిగ్రహా ।**
**మహామాయాసముత్పన్నా తామసీ పౌరుషీ ధ్రువా ॥ 78 ॥**

**వ్యక్తావ్యక్తాత్మికా కృష్ణా రక్తా శుక్లా ప్రసూతికా ।**
**అకార్యా కార్యజననీ నిత్యం ప్రసవధర్మిణీ ॥ 79 ॥**

**సర్గప్రలయనిర్ముక్తా సృష్టిస్థిత్యన్తధర్మిణీ ।**
**బ్రహ్మగర్భా చతుర్వింశా పద్మనాభాఽచ్యుతాత్మికా ॥ 80 ॥**

**వైద్యుతీ శాశ్వతీ యోనిర్జగన్మాతేశ్వరప్రియా ।**
**సర్వాధారా మహారూపా సర్వైశ్వర్యసమన్వితా ॥ 81 ॥**

అంతటా వ్యాపించి యున్నది, హద్దులు లేనిది, ప్రధానతత్త్వంలో ప్రవేశించేది, క్షేత్రజ్ఞశక్తి గలది, లక్షణాలేవీ వ్యక్తము కానిది, మాలిన్యరహిత, అనాది, మాయకతీతురాలు, తత్త్వత్రయం కలది, ప్రకృతిని ఆధీనంలో ఉంచుకున్నది. మహామాయనుండి ఉత్పన్న. తమోగుణం కలది, పౌరుషం కలది, నిశ్చల, వ్యక్తావ్యక్త స్వరూప,

నల్లనిది, ఎరుపు, తెలుపు కల్గినది. జననకారణము, కార్యభూతము కానిది, కార్యములను పుట్టించునది, సర్వదా ప్రసవకార్యస్వభావం కలది, సృష్టిప్రలయాలనుండి ముక్తురాలు, సృష్టిస్థితిలయాలు చేసేది, బ్రహ్మము గర్భంలో కల్గినది, ఇరువదినాలుగు తత్త్వాలస్వరూపం కలది. నాభియందు కమలం గలది, విష్ణుస్వరూప, విద్యుత్ప్రభారూపం కలది, శాశ్వతమైనది, ఉత్పత్తిస్థానము, లోకమాత, ఈశ్వరుని ప్రియురాలు, సమస్తమునకు ఆధారభూతురాలు, మహారూపవతి, సర్వైశ్వర్యాలు కలది.

**విశ్వరూపా మహాగర్భా విశ్వేశేచ్ఛానువర్తినీ ।**
**మహీయసీ బ్రహ్మయోనిః మహాలక్ష్మీసముద్భవా ॥ 82 ॥**

**మహావిమానమధ్యస్థా మహానిద్రాత్మహేతుకా ।**
**సర్వసాధారణీ సూక్ష్మా హ్యవిద్యా పారమార్థికా ॥ 83 ॥**

**అనన్తరూపాఽనన్తస్థా దేవీ పురుషమోహినీ ।**
**అనేకాకారసంస్థానా కాలత్రయవివర్జితా ॥ 84 ॥**

**బ్రహ్మజన్మా హరేర్మూర్తిర్బ్రహ్మవిష్ణుశివాత్మికా ।**
**బ్రహ్మేశవిష్ణుజననీ బ్రహ్మాఖ్యా బ్రహ్మసంశ్రయా ॥ 85 ॥**

**వ్యక్తా ప్రథమజా బ్రాహ్మీ మహతీ బ్రహ్మరూపిణీ ।**
**వైరాగ్యైశ్వర్యధర్మాత్మా బ్రహ్మమూర్తిర్హృది స్థితా ॥ 86 ॥**

ఈ మహాదేవి ప్రపంచస్వరూప, గొప్ప గర్భం కలది, జగత్ప్రభువైన పరమేశ్వరేచ్ఛానుసారిణి, గొప్ప తనము కలది, బ్రహ్మజన్మకు కారణమైనది, మహాలక్ష్మి నుండి ఉద్భవించినది గొప్ప విమానమధ్యభాగంలో ఉన్నది, మహామోహమునకు హేతువు, సర్వసాధారణురాలు, సూక్ష్మరూప, అవిద్యారూపిణి, పారమార్థికురాలు, అనంతరూపాలు కల్గినది, అనంతునిపై వసించినది, పురుషులను మోహితులను చేసేది, అనేక ఆకారాలు సంస్థానాలు కలది, కాలత్రయభేదం లేనిది, బ్రహ్మమునుండి జన్మించినది, విష్ణువు ఆకారం కలది, బ్రహ్మ విష్ణుశివస్వరూప, బ్రహ్మవిష్ణుమహేశ్వరుల జన్మకారణము. బ్రహ్మ నామం కలది, బ్రహ్మను ఆశ్రయించినది. వ్యక్తమైన రూపం కలది, మొదట జననమందినది, విద్యాస్వరూపిణి, గొప్పది, బ్రహ్మస్వరూపిణి. వైరాగ్యఐశ్వర్యధర్మాల స్వరూపము, బ్రహ్మమూర్తి, హృదయమందు ఉండునదీ,

**అపాం యోనిః స్వయమ్భూతిర్మానసీ తత్త్వసమ్భవా ।**
**ఈశ్వరాణీ చ శర్వాణీ శంకరార్ధశరీరిణీ ॥ 87 ॥**

**భవానీ చైవ రుద్రాణీ మహాలక్ష్మీరథామ్బికా ।**
**మహేశ్వరసముత్పన్నా భుక్తిముక్తిఫలప్రదా ॥ 88 ॥**

**సర్వేశ్వరీ సర్వవన్ద్యా నిత్యం ముదితమానసా ।**
**బ్రహ్మేన్ద్రోపేన్ద్రనమితా శంకరేచ్ఛానువర్తినీ ॥ 89 ॥**

**ఈశ్వరార్ధాసనగతా మహేశ్వరపతివ్రతా ।**
**సకృద్విభాతా సర్వార్తిసముద్రపరిశోషిణీ ॥ 90 ॥**

**పార్వతీ హిమవత్పుత్రీ పరమానందదాయినీ ।**
**గుణాఢ్యా యోగజా యోగ్యా జ్ఞానమూర్తిర్వికాసినీ ॥ 91 ॥**

నీటికి ఉత్పత్తిస్థానం, స్వయంగా ఆవిర్భవించింది, మనసుకు గోచరమయ్యేది, మూలతత్త్వం నుండి సంభవించింది, ఈశ్వరుని భార్య, శర్వాణి, శంకరుని సగం శరీరాన్ని ధరించింది, భవాని, రుద్రాణి, మహాలక్ష్మి మరియు అంబిక మహేశ్వరునివల్ల జన్మించింది, భోగానుభవం, మోక్షం అనే ఫలాలనిచ్చేది. సమస్తానికి ప్రభురాలు, అందరు నమస్కరించతగినది, ఎప్పుడు సంతోషచిత్తం కలది, బ్రహ్మ ఇంద్రుడు ఉపేంద్రుడు వీరిచేత నమస్కరింపబడేది, శంకరుని కోరిక ప్రకారం నడచుకొనేది, ఈశ్వరుని ఆసనంలో సగంభాగాన్ని పొందింది, మహేశ్వరుని ధర్మపత్ని, ఒక్కసారిగా ప్రకాశించేది, సర్వజనుల బాధలనే సముద్రాన్ని శోషింప చేసేది, హిమవంతుని పుత్రి పార్వతి, గొప్ప ఆనందాన్ని కలిగించేది, సర్వగుణసంపన్న, యోగం వల్ల జన్మించింది, యోగ్యత కలది, జ్ఞానస్వరూప, వికసించే స్వభావం కలది.

**సావిత్రీ కమలా లక్ష్మీః శ్రీరనన్తోరసి స్థితా ।**
**సరోజనిలయా గఙ్గా యోగనిద్రాఽసురార్దినీ ॥ 92 ॥**

**సరస్వతీ సర్వవిద్యా జగజ్జ్యేష్ఠా సుమఙ్గళా ।**
**వాగ్దేవీ వరదా వాచ్యా కీర్తిః సర్వార్థసాధికా ॥ 93 ॥**

**యోగేశ్వరీ బ్రహ్మవిద్యా మహావిద్యా సుశోభనా ।**
**గుహ్యవిద్యాత్మవిద్యా చ ధర్మవిద్యాత్మభావితా ॥ 94 ॥**

**స్వాహా విశ్వమ్భరా సిద్ధిః స్వధా మేధా ధృతిః శ్రుతిః ।**
**నీతిః సునీతిః సుకృతిర్మాధవీ నరవాహినీ ॥ 95 ॥**

**పూజ్యా విభావతీ సౌమ్యా భోగినీ భోగశాయినీ ।**
**శోభా చ శంకరీ లోలా మాలినీ పరమేష్ఠినీ ॥ 96 ॥**

**త్రైలోక్యసున్దరీ నమ్యా సున్దరీ కామచారిణీ ।**
**మహానుభావా సత్త్వస్థా మహామహిషమర్దినీ ॥ 97 ॥**

సావిత్రి, కమల, లక్ష్మి, నారాయణుని వక్షఃస్థలంలో ఉన్న శ్రీదేవి, కమలవాసిని, గంగారూపిణి, యోగనిద్ర, రాక్షససంహారిణి, సరస్వతి, సర్వవిద్యలసారం, ప్రపంచానికే జ్యేష్ఠురాలు, మిక్కిలి మంగళరూప, వాక్కుల దేవత, వరాల నిచ్చేది. మాటలతో వర్ణింపదగింది, కీర్తి, అన్ని కార్యాలు సాధించేది, యోగులకు అధిపురాలు, వేదాంతవిద్యాస్వరూప, గొప్ప విద్య. గొప్ప మంగళకారిణి, రహస్యవిద్య. ఆత్మవిద్య, ధర్మవిద్య. ఆత్మలో భావింపబడేది, స్వాహారూపిణి, విశ్వాన్ని భరించేది, సిద్ధిరూప,స్వధ,మేధ, ధృతి,శ్రుతి, నీతి, సునీతి, సుకృతి, మాధవపత్ని. మానవుడు

వాహనముగా గలది, పూజ్యురాలు. తేజస్విని, సాధుస్వరూప, భోగిని, భోగశాయిని, సౌందర్యరూప, శంకరి, చంచల, మాలాధారిణి, పరమేష్ఠిని, ముల్లోకాల్లో అందమైనది, నమస్కరింపతగినది, సుందరి, స్వేచ్ఛాచారిణి, మహానుభావురాలు, సత్త్వగుణంలో నిలిచినది. మహిషాసురమర్దిని.

**పద్మనాభా పాపహరా విచిత్రముకుటాంగదా ।**
**కాన్తా చిత్రామ్బరధరా దివ్యాభరణభూషితా ॥ 98 ॥**

**హంసాఖ్యా వ్యోమనిలయా జగత్సృష్టివివర్ధినీ ।**
**నియన్త్రీ యన్త్రమధ్యస్థా నన్దినీ భద్రకాలికా ॥ 99 ॥**

**ఆదిత్యవర్ణా కౌబేరీ మయూరవరవాహనా ।**
**వృషాసనగతా గౌరీ మహాకాలీ సురార్చితా ॥ 100 ॥**

**అదితిర్నియతా రౌద్రా పద్మగర్భా వివాహనా ।**
**విరూపాక్షీ లేలిహానా మహాసురవినాశినీ ॥ 101 ॥**

**మహాఫలాఽనవద్యాఙ్గీ కామరూపా విభావరీ ।**
**విచిత్రరత్నముకుటా ప్రణతార్తిప్రభఞ్జనీ ॥ 102 ॥**

కమలం నాభియందు కలది, పాపాలను తొలగించేది. విచిత్రాలైన కిరీటము అంగములు కలది, మనోహర, విచిత్ర వస్త్రాలను ధరించేది. శ్రేష్ఠాభరణాలు అలంకరించుకొనేది, హంస అనే పేరు కలది, ఆకాశంలో నివసించేది, ప్రపంచసృష్టిని పెంచేది, నియమించేది, యంత్రం మధ్యలో ఉండేది, సంతోష పరిచేది, మంగళప్రదురాలు సూర్యకాంతివంటి కాంతికలది, కుబేరునికి సంబంధించింది, మంచి నెమలి వాహనం కల్గినది, వృషభాసనాన్ని పొందింది, గౌరి, మహాకాళి, దేవతల పూజలందేది, అదితి, నియమం కలది, రౌద్ర స్వరూపిణి, పద్మముగర్భంలో కలది, పక్షివాహన, త్రినేత్రురాలు, ఆస్వాదించేది, రాక్షసనాశం చేసేది, గొప్పఫలం కలది, దోషరహితశరీర, స్వేచ్ఛారూపధారిణి. రాత్రిస్వరూపిణి. అద్భుతరత్నకిరీటం కలది, ఆశ్రితుల బాధలను హరించేది.

**కౌశికీ కర్షణీ రాత్రిస్త్రిదశార్తివినాశినీ ।**
**బహురూపా స్వరూపా చ విరూపా రూపవర్జితా ॥ 103 ॥**

**భక్తార్తిశమనీ భవ్యా భవతాపవినాశినీ ।**
**నిర్గుణా నిత్యవిభవా నిస్సారా నిరపత్రపా ॥ 104 ॥**

**తపస్వినీ సామగీతిర్భవాంకనిలయాలయా ।**
**దీక్షా విద్యాధరీ దీప్తా మహేన్ద్రవినిపాతినీ ॥ 105 ॥**

**సర్వాతిశాయినీ విశ్వా సర్వసిద్ధిప్రదాయినీ ।**
**సర్వేశ్వరప్రియా భార్యా సముద్రాన్తరవాసినీ ॥ 106 ॥**

**అకలంకా నిరాధారా నిత్యసిద్ధా నిరామయా ।**
**కామధేనుర్బృహద్గర్భా ధీమతీ మోహనాశినీ ॥ 107 ॥**

కౌశికి, కర్షణం చేసేది, రాత్రిరూప, దేవతల ఆర్తిని నశింపచేసేది, అనేక రూపాలు కలది, నిజరూపాన్ని కల్గినది, రూపం లేనిది, రూపాన్ని విడిచినది, భక్తులబాధలు పోగొట్టేది, భవ్యురాలు, సంసార తాపాన్ని నశింపచేసేది, గుణరహిత, శాశ్వతవైభవం కలది, సారం లేనిది, లజ్జ లేనిది, తపస్విని, సామగాన రూప, శంకరుని ఒడిలో నివసించేది, దీక్షితురాలు, విద్యలను ధరించినది, ప్రకాశించేది, మహేంద్రుని పదవీ భ్రష్టుని చేసేది, అన్నింటి నతిశయించునది, ప్రపంచరూప, సిద్ధులన్నింటిని ఇచ్చేది, సర్వేశ్వరుని ప్రియమైన భార్య, సముద్రం మధ్యలో నివసించేది. కలంకం లేనిది, ఆధార రహిత, శాశ్వతసిద్ధి కల్గినది, రోగబాధ లేనిది, కోరికలను తీర్చే కామధేనువు, పెద్ద గర్భం కలది. బుద్ధిమంతురాలు, మోహాన్ని నశింపచేసేది.

**నిస్సంకల్పా నిరాతఙ్కా వినయా వినయప్రియా ।**
**జ్వాలామాలాసహస్రాఢ్యా దేవదేవీ మనోమయా ॥ 108 ॥**

**మహాభగవతీ భర్గా వాసుదేవసముద్భవా ।**
**మహేన్ద్రోపేన్ద్రభగినీ భక్తిగమ్యా పరావరా ॥ 109 ॥**

**జ్ఞానజ్ఞేయా జరాతీతా వేదాన్తవిషయా గతిః ।**
**దక్షిణా దహతీ దీర్ఘా సర్వభూతనమస్కృతా ॥ 110 ॥**

**యోగమాయా విభాగజ్ఞా మహామోహా గరీయసీ ।**
**సన్ధ్యా సర్వసముద్భూతిర్బ్రహ్మవృక్షాఽఽశ్రయాఽఽనతిః ॥ 111 ॥**

**బీజాఙ్కురసముద్భూతిర్మహాశక్తిర్మహామతిః ।**
**క్షాన్తిః ప్రజ్ఞా చితిః సచ్చిన్మహాభోగీన్ద్రశాయినీ ॥ 112 ॥**

సంకల్పరహిత, నిర్భయ, వినయస్వరూప, వినయం విషయంలో ప్రీతి కలది. వేల అగ్నిజ్వాలలు హారముగా కలది, దేవులకు దేవి, మనోమయరూప, గొప్పపూజ్యురాలు, భర్గరూపిణి, వాసుదేవుని వల్ల జన్మించినది, మహేంద్రునికి విష్ణువుకి, సోదరి, భక్తితో చేరదగినది, పరావరురాలు, జ్ఞానం ద్వారా తెలియ తగినది, ముసలితనాని కతీత, వేదాంతగమ్య, దక్షిణ, దహించేది, పొడవైనది, ప్రాణులందరిచే నమస్కరింపబడేది, యోగమాయ, విభాగాలు తెలిసినది, మహామోహరూపిణి, మిక్కిలి గొప్పది, సంధ్యారూప, అంతటికి ఉత్పత్తిస్థానం, బ్రహ్మము అనే వృక్షము, సర్వులకు ఆశ్రయురాలు అందరిచేత నమస్కరింపబడేది. బీజాలకు అంకురాలకు జన్మస్థా నం, గొప్ప శక్తి రూప. గొప్ప బుద్ధి గలది. క్షమారూపిణి, స్వయంప్రకాశ, ప్రజ్ఞ, చైతన్యము, సత్‌చిత్ రూపిణి, గొప్ప సర్పరాజుపై శయనించేది,

**వికృతిః శాఙ్కరీ (శాస్త్రిః) శాన్తిర్గణగన్ధర్వసేవితా ।**
**వైశ్వానరీ మహాశాలా మహాసేనా గుహప్రియా ॥ 113 ॥**

**మహారాత్రిః శివానన్దా శచీ దుఃస్వప్ననాశినీ ।
ఇజ్యా పూజ్యా జగద్ధాత్రీ దుర్విజ్ఞేయా సురూపిణీ ॥ 114 ॥**

**తపస్వినీ సమాధిస్థా త్రినేత్రా దివి సంస్థితా ।
గుహామ్బికా గుణోత్పత్తిర్మహాపీఠా మరుత్సుతా ॥ 115 ॥**

**హవ్యవాహాన్తరాగాదిః హవ్యవాహసముద్భవా ।
జగద్యోనిర్జగన్మాతా జన్మమృత్యుజరాతిగా ॥ 116 ॥**

**బుద్ధిర్మహాబుద్ధిమతీ పురుషాన్తరవాసినీ ।
తరస్వినీ సమాధిస్థా త్రినేత్రా దివిసంస్థితా ॥ 117 ॥**

వికారరూపం కలది, శంకరుని భార్య, శాంతిస్వరూపురాలు, గణాలు గంధర్వులు సేవించే దేవి, అగ్ని హోత్రస్వరూప, గొప్పశాల, మహాసేన కల్గినది, కుమారస్వామికి ఇష్టురాలు, దీర్ఘరాత్రి, శివునికానందం కల్గించేది, శచీదేవి, చెడు కలలను నశింపచేసేది, యజ్ఞస్వరూపురాలు, పూజింపదగినది, జగత్తును ధరించేది, కష్టంగా పొందదగినది, మంచి రూపవతి, తపస్సు చేసేది, సమాధియందున్నది, మూడు కన్నులు గలది, స్వర్గవాసిని, గుహుని తల్లి, గుణాల కుత్పత్తిస్థానం, మహాపీఠము కలది, వాయుపుత్రిక, అగ్నిశిఖల కాంతివంటి కాంతికలది, అగ్నిహోత్రుని నుండి జన్మించినది, ప్రపంచానికి కారణమైనది, లోకాలకు తల్లి, జననమరణములకు ముసలితనమునకు అతీత, బుద్ధిరూప, మహాబుద్ధి మంతురాలు, ప్రాణుల హృదయాల్లో ఉండేది. వేగం కల్గినది. సమాధిస్థితిలో ఉండేది. మూడు నేత్రాలు కలది. స్వర్గలోకంలో ఉండేది.

**సర్వేన్ద్రియమనోమాతా సర్వభూతహృది స్థితా ।
సంసారతారిణీ విద్యా బ్రహ్మావాదిమనోలయా ॥ 118 ॥**

**బ్రహ్మాణీ బృహతీ బ్రాహ్మీ బ్రహ్మభూతా భవారణీ ।
హిరణ్మయీ మహారాత్రిః సంసారపరివర్తికా ॥ 119 ॥**

**సుమాలినీ సురూపా చ భావినీ హారిణీ ప్రభా ।
ఉన్మీలినీ సర్వసహా సర్వప్రత్యయసాక్షిణీ ॥ 120 ॥**

**సుసౌమ్యా చన్ద్రవదనా తాణ్డవాసక్తమానసా ।
సత్త్వశుద్ధికరీ శుద్ధిర్మలత్రయవినాశినీ ॥ 121 ॥**

**జగత్ప్రియా జగన్మూర్తిస్త్రిమూర్తిరమృతాశ్రయా ।
నిరాశ్రయా నిరాహారా నిరంకుశపదోద్భవా ॥ 122 ॥**

సర్వేంద్రియాలకు, మనస్సుకు తల్లి, సర్వప్రాణి హృదయాల్లో ఉన్నది, సంసారంనుండి తరింపచేసే విద్య. బ్రహ్మావాదుల మనస్సులో లీనమై ఉండేది, బ్రహ్మకు భార్య, విస్తారమైనది, బ్రహ్మమయ, బ్రహ్మరూప, సంసారాన్ని

నశింపచేసేది, బంగారు రూపం కలది, మహారాత్రి, సంసారాన్ని పరివర్తింప చేసేది, మంచి మాలను ధరించినది, మంచి రూపవతి, భావించేది, సమస్తాన్ని హరించేది, కాంతి రూప, వికసించేది, అన్నిటిని సహించేది, సర్వ ప్రత్యయాలకు సాక్షిణి, మిక్కిలి సౌమ్యరూపం కలది, చంద్రానన. తాండవమందాసక్తికల మనసున్నది, సత్త్వ శుద్ధిని కల్గిస్తుంది, శుద్ధిస్వరూప, మలినత్రయాన్ని నశింపచేసేది, జగాలకు ప్రియమైనది, ప్రపంచఆకారం కలది, మూడు మూర్తులు కలది, అమృతానికాశ్రయ, ఆధారం లేనిది, ఆహారం లేనిది, నిరంకుశమైన స్థానం ఉత్పత్తిగా కలది.

**చన్ద్రహస్తా విచిత్రాఙ్గీ స్రగ్విణీ పద్మధారిణీ ।**
**పరావరవిధానజ్ఞా మహాపురుషపూర్వజా ॥ 123 ॥**

**విశ్వేశ్వరప్రియా విద్యుద్విద్యుజ్జిహ్వా జితశ్రమా ।**
**విద్యామయీ సహస్రాక్షీ సహస్రవదనాత్మజా ॥ 124 ॥**

**సహస్రరశ్మిః సత్త్వస్థా మహేశ్వరపదాశ్రయా ।**
**క్షాలినీ మృణ్మయీ వ్యాప్తా తైజసీ పద్మబోధికా ॥ 125 ॥**

**మహామాయాశ్రయా మాన్యా మహాదేవమనోరమా ।**
**వ్యోమలక్ష్మీః సింహరథా చేకితానాఽమితప్రభా ॥ 126 ॥**

**వీరేశ్వరీ విమానస్థా విశోకా శోకనాశినీ ।**
**అనాహతా కుణ్డలినీ నలినీ పద్మభాసినీ ॥ 127 ॥**

చంద్రుని హస్తంలో ధరించింది. విచిత్రశరీరం కలది, పుష్పహారాన్ని ధరించింది, కమలాన్ని ధరించింది, హెచ్చుతగ్గులను ఎరిగినది, మహాపురుషునికి పూర్వమే పుట్టింది, విశ్వేశ్వరుని ప్రియురాలు, మెరుపు తీగ, విద్యుత్తే నాలుకగా కలది, శ్రమను జయించింది, విద్యాస్వరూప, వేయి కన్నులు, వేయి ముఖాలు కలది. స్వయంగా జన్మనందినది, వేయి కిరణాలు కలది, సత్త్వంలో ఉన్నది, మహేశ్వరస్థానా న్నాశ్రయించినది, క్షాళన చేసేది, మృత్తికామయ, వ్యాపించినది, తేజోమయ, పద్మాలను వికసింప చేసేది, మహామాయ నాశ్రయించినది, పూజ్యురాలు, మహాదేవుని మనోరంజని, ఆకాశలక్ష్మి, సింహవాహన, అధికమైన జ్ఞానం కలది, గొప్ప కాంతి కలది, వీరేశ్వరి, విమానమందుండేది. శోకం లేనిది. శోకాన్ని నశింప చేసేది, కొట్టబడనిది, కుండలిని, కమలం కలది. పద్మంవలె ప్రకాశించేది.

**సదానన్దా సదా కీర్తిః సర్వభూతాశ్రయస్థితా ।**
**వాగ్దేవతా బ్రహ్మకలా కలాతీతా కలారణీ ॥ 128 ॥**

**బ్రహ్మశ్రీర్బ్రహ్మహృదయా బ్రహ్మవిష్ణుశివప్రియా ।**
**వ్యోమశక్తిః క్రియాశక్తిర్జ్ఞానశక్తిః పరాగతిః ॥ 129 ॥**

**క్షోభికా బన్ధికా భేద్యా భేదాభేదవివర్జితా ।**
**అభిన్నా భిన్నసంస్థానా వశినీ వంశహారిణీ ॥ 130 ॥**

**గుహ్యశక్తి ర్గుణాతీతా సర్వదా సర్వతో ముఖీ ।**
**భగినీ భగవత్పత్నీ సకలా కాలహారిణీ ॥ 131 ॥**

**సర్వవిత్ సర్వతో భద్రా గుహ్యాతీతా గుహావలిః ।**
**ప్రక్రియా యోగమాతా చ గఙ్గా విశ్వేశ్వరేశ్వరీ ॥ 132 ॥**

ఎల్లప్పుడు ఆనందంతో ఉండేది, శాశ్వతమైన కీర్తి గలది, సర్వప్రాణులకు ఆశ్రయస్థానము, వాగ్రూప దేవత, బ్రహ్మం యొక్క కళ, కళల కతీత, కళలకు మూలస్థానము, బ్రహ్మ యొక్క సంపద, బ్రహ్మహృదయంలో ఉన్నది. బ్రహ్మవిష్ణు శివుల కిష్టమైనది, ఆకాశశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తిరూప, సర్వోత్తమమైన ప్రాప్యస్థానం, క్షోభను కల్గించేది, బంధించేది, భిన్నరూపములు కలది. భేదాభేదాలు వదిలినది. భిన్నం కానిది, భిన్నసంస్థానము కలది. వశమందున్నది, వంశాన్ని హరించేది, రహస్యశక్తి, గుణత్రయాతీత, అన్నింటి నిచ్చేది. అన్నివైపుల ముఖం కలది, ఐశ్వర్యయుక్త, భగవంతుని భార్య, కళాయుక్త, కాలుని హరించేది. విషయాలన్నీ తెలిసినది. అంతటా భద్రత కలది. రహస్యాలకతీత, గుహల సమూహం, ప్రకృష్ట క్రియ, యోగమాత, గంగారూపిణి, విశ్వేశ్వరునిపత్ని,

**కలిలా కపిలా కాన్తా కమలాభా కలాన్తరా ।**
**పుణ్యా పుష్కరిణీ భోక్త్రీ పురన్దరపురస్సరా ॥ 133 ॥**

**పోషిణీ పరమైశ్వర్యభూతిదా భూతిభూషణా ।**
**పఞ్చబ్రహ్మసముత్పత్తిః పరమార్థార్థవిగ్రహా ॥ 134 ॥**

**ధర్మోదయా భానుమతీ యోగిజ్ఞేయా మనోజవా ।**
**మనోరమా మనోరక్షా తాపసీ వేదరూపిణీ ॥ 135 ॥**

**వేదశక్తి ర్వేదమాతా వేదవిద్యాప్రకాశినీ ।**
**యోగేశ్వరేశ్వరీ మాతా మహాశక్తిర్మనోమయీ ॥ 136 ॥**

**విశ్వావస్థా వియన్మూర్తిర్విద్యున్మాలా విహాయసీ ।**
**కిన్నరీ సురభీ విద్యా నన్దినీ నన్దివల్లభా ॥ 137 ॥**

**భారతీ పరమానన్దా పరాపరవిభేదికా ।**
**సర్వప్రహరణోపేతా కామ్యా కామేశ్వరేశ్వరీ ॥ 138 ॥**

సమూహరూప, కపిలవర్ణం కలది. అందమైనది, పద్మం వంటి కాంతి కలది, కళల విశేషం కల్గినది. పుణ్యాత్మురాలు, తామర పువ్వును దాల్చినది, భుజించేది, ఇంద్రునికి ముందుండేది, పోషించేది, గొప్ప ఐశ్వర్యాన్నిచ్చేది, భూతిని అలంకారం చేసుకున్నది, పంచబ్రహ్మలకు ఉత్పత్తిస్థానం, పరమార్థభూత, అర్ధశరీరం కలది, ధర్మోదయం కలది, కాంతిమంతమైనది. యోగులు గుర్తింప దగినది, మనస్సువంటి వేగం కలది, మనస్సును రంజింపచేసేది,

మనస్సును రక్షించేది తపస్సునాచరించేది, వేదస్వరూపిణి, వేదాల శక్తి, వేదాలకు మాత, వేదవిద్యను ప్రకాశింపచేసేది. యోగేశ్వరులకు ప్రభ్వి, జనని, గొప్పశక్తి, మనోమయి, విశ్వానికి అధిష్ఠానం, ఆకాశరూపిణి, మెరుపులమాల, వ్యాపించి ఉండేది. కిన్నరి, సురభి, విద్యాదేవత, నందిని, నందికి ప్రేమ పాత్రురాలు, భారతి, మహానందరూప, పర–అపరలను భేదించి చూపేది. అన్ని ఆయుధాలు కలది. కోరదగినది, కామేశ్వరునికి పత్ని,

**అచిన్త్యాஉనన్తవిభవా భూలేఖా కనకప్రభా ।**
**కూష్మాణ్డీ ధనరత్నాఢ్యా సుగన్ధా గన్ధదాయినీ ॥ 139 ॥**

**త్రివిక్రమపదోద్భూతా ధనుష్పాణిః శివోదయా ।**
**సుదుర్లభా ధనాధ్యక్షా ధన్యా పిఙ్గలలోచనా ॥ 140 ॥**

**శాన్తిః ప్రభావతీ దీప్తిః పఙ్కజాయతలోచనా ।**
**ఆద్యా భూః కమలోద్భూతా గవాం మాతా రణప్రియా ॥ 141 ॥**

**సత్క్రియా గిరిశా శుద్ధిః నిత్యపుష్టా నిరన్తరా ।**
**దుర్గా కాత్యాయనీ చణ్డీ చర్చితాఙ్గీ సువిగ్రహా ॥ 142 ॥**

**హిరణ్యవర్ణా జగతీ జగద్యన్త్రప్రవర్తికా ।**
**మందరాద్రినివాసా చ గరహా స్వర్ణమాలినీ ॥ 143 ॥**

ఆలోచన కందనిది, అనంతవైభవం కలది. భూరేఖవంటిది. బంగారం వంటి కాంతి కలది. కూష్మాండ రూపిణి, ధనరత్నాలతో సంపన్నురాలు, మంచి పరిమళం కలది. పరిమళాన్నిచ్చేది, త్రివిక్రముని పాదోద్భవ, చేత ధనువు కలది, మంగళకరమైన ఉదయం కలది, అతికష్టంగా పొంద దగినది, ధనానికధికారిణి, ధన్యురాలు, పింగలవర్ణం గల కన్నులు గలది. శాంతిరూప, కాంతిమతి, తేజోరూప, పద్మంవలె విశాలనేత్రాలు కలది, ప్రథమ స్థానం, కమలం నుండి జనించినది, గోవులకు తల్లి, యుద్ధప్రీతి కలది, మంచి అనుష్ఠానమున్నది. పర్వత మందు పడక గలది, శుద్ధిరూప, ఎల్లపుడు పుష్టి కల్గినది, భేదం లేనిది, దుర్గ, కాత్యాయని, చండి, అలంకృతశరీర, మంచి విగ్రహ మున్నది, బంగారంవంటి వర్ణం కలది, లోకస్వరూప, జగమనే యంత్రాన్ని నడిపేది, మందర పర్వత వాసిని, విషమును హరించేది, సువర్ణమాలాధారిణి.

**రత్నమాలా రత్నగర్భా పుష్టిర్విశ్వప్రమాథినీ ।**
**పద్మనాభా పద్మనిభా నిత్యరుష్టా உమృతోద్భవా ॥ 144 ॥**

**ధున్వతీ దుష్ప్రకమ్పా చ సూర్యమాతా దృషద్వతే ।**
**మహేన్ద్రభగినీ సౌమ్యా వరేణ్యా వరదాయికా ॥ 145 ॥**

**కల్యాణీ కమలావాసా పఞ్చచూడా వరప్రదా ।**
**వాచ్యాஉమరేశ్వరీ విద్యా దుర్జయా దురతిక్రమా ॥ 146 ॥**

**కాలరాత్రిర్మహావేగా వీరభద్రప్రియా హితా ।**
**భద్రకాలీ జగన్మాతా భక్తానాం భద్రదాయినీ ॥ 147 ॥**

**కరాలా పింగలాకారా కామభేదా మహాస్వనా ।**
**యశస్వినీ యశోదా చ షడధ్వపరివర్తికా ॥ 148 ॥**

రత్నాల మాల ధరించినది. రత్నాలు గర్భంలో కలది. బలాన్నిచ్చేది. విశ్వాన్ని నిగ్రహించేది. నాభి యందు కమలం కలది. పద్మంవంటి కాంతి కలది. నిత్యకోపి, అమృతం నుండి జన్మించినది, కంపింపచేసేది. ఇతరులచేత కంపింప చేయరానిది, సూర్యునితల్లి, దృషద్వతి, మహేంద్రుని సోదరి, సాధుస్వభావ, శ్రేష్ఠురాలు, వరాల నిచ్చేది, మంగళ రూప, కమలవాసిని, అయిదు శిఖలు గలది. వరాల నిచ్చేది, వర్ణ్యురాలు, దేవతల ప్రభ్వి, విద్యారూప, జయింప వీలుకానిది. అతిక్రమించరానిది, ప్రళయ రాత్రి, మహావేగవతి, వీరభద్రుని ఇష్టురాలు, హితురాలు, భద్రత కూర్చే కాళి, లోకమాత, భక్తులకు శుభాలను కూర్చేది, భయంకరరూపం కలది. పింగళవర్ణాకార, మన్మథభేదిని, గొప్పధ్వని కలది. కీర్తి కల్గినది. కీర్తినిచ్చేది, ఆరు యోగమార్గాలను అనుసరింప చేసేది.

**శంఖినీ పద్మినీ సాంఖ్యా సాంఖ్యయోగప్రవర్తికా ।**
**చైత్రా సంవత్సరారూఢా జగత్సమ్పూరణీ ధ్వజా ॥ 149 ॥**

**శుమ్భారిః ఖేచరీ స్వస్థా  కమ్బుగ్రీవా కలిప్రియా ।**
**ఖగధ్వజా ఖగారూఢా వారాహీ పూగమాలినీ ॥ 150 ॥**

**ఐశ్వర్యపద్మనిలయా విరక్తా గరుడాసనా ।**
**జయన్తీ హృద్గుహాగమ్యా గహ్వరేష్ఠా గణాగ్రణీః ॥  151 ॥**

**సంకల్పసిద్ధా సామ్యస్థా సర్వవిజ్ఞానదాయినీ ।**
**కలిః కల్కనిహన్త్రీ చ గుహ్యోపనిషదుత్తమా ॥ 152 ॥**

**నిష్ఠా దృష్టిః స్మృతిర్వ్యాప్తిః పుష్టిస్తుష్టిః క్రియావత్ ।**
**విశ్వామరేశ్వరేశానా భుక్తిర్ముక్తిః శివాఽమృతా ॥  153 ॥**

శంఖాన్ని ధరించినది, కమలం కలది, సాంఖ్యరూప, సాంఖ్యయోగాన్ని ప్రవర్తింప చేసేది, చైత్రరూప, సంవత్సరాన్నధిరోహించేది, లోకాలను పూర్ణం గావించేది, ధ్వజస్వరూపిణి, శుంభుడనే రాక్షసుని శత్రువు, ఆకాశచరి, స్వస్థురాలు, శంఖం వంటి కంఠం కలది, కలిపురుషునికిష్టురాలు, పక్షి ధ్వజంగా కలది, పక్షివాహన, వరాహరూప, పోకలమాల ధరించేది, ఐశ్వర్యరూపంలో ఉండే పద్మం నివాసంగా కల్గినది, విరక్తురాలు, గరుడవాహన, జయశీలిని, హృదయగుహాగమ్య, గుహయందు ఉండునది, గణానికి మొదట ఉండేది,  సిద్ధసంకల్ప, సమభావస్థిత, సర్వవిజ్ఞానదాత్రి, కలిస్వరూపిణి, పాపహారి, రహస్యాలైన ఉపనిషత్తుల్లో పేర్కొన్న ఉత్తమురాలు,  నిష్ఠగలది, జ్ఞానరూప, స్మృతి, వ్యాప్తి, పుష్టి, తుష్టి, అనుష్ఠాత్రి, ప్రపంచానికి, దేవేంద్రునికి అధికారిణి, భుక్తి ముక్తి కల్గించేది. మంగళ మూర్తి, అమృత స్వరూప.

**లోహితా సర్పమాలా చ భీషణీ వనమాలినీ ।**
**అనన్తశయనాఽనన్తా నరనారాయణోద్భవా ॥ 154 ॥**

**నృసింహీ దైత్యమథనీ శంఖచక్రగదాధరా ।**
**సంకర్షణీ సముత్పత్తిరమ్బికా పాదసంశ్రయా ॥ 155 ॥**

**మహాజ్వాలా మహామూర్తిః సుమూర్తిః సర్వకామధుక్ ।**
**శుభ్రా చ సుస్తనా గౌరీ ధర్మకామార్థమోక్షదా ॥ 156 ॥**

**భ్రూమధ్యనిలయా పూర్వా పురాణపురుషాఽరణిః ।**
**మహావిభూతిదా మధ్యా సరోజనయనా సమా ॥ 157 ॥**

**అష్టాదశభుజా నాద్యా నీలోత్పలదలప్రభా ।**
**సర్వశక్త్యాసనారూఢా ధర్మాధర్మవివర్జితా ॥ 158 ॥**

ఎరుపురంగు కలది. సర్పమాల ధరించింది. భయంగొల్పేది. వనమాలా ధారిణి, అనంతుడు శయ్యగా కలది, నాశం లేనిది, నరనారాయణుల వల్ల జన్మించింది, నరసింహాకారం కలది, రాక్షసులను సంహరించేది, శంఖం చక్రం గదలను ధరించినది. శత్రుంజయ, జగత్తుకు మూలకారణం, మాత, తనపాదాలే లోకాశ్రయాలుగా కలది. మహాజ్వాలారూప, గొప్ప ఆకారం కలది. చక్కని రూపం కలది. కోరికలన్నింటిని తీర్చేది, మలరహిత, సుందరస్తని, సూర్య సంబంధం కలది, ధర్మ, కామ, అర్థాలను, మోక్షాన్ని ఇచ్చేది, కనుబొమల మధ్య ఉండేది, ఆదిదేవత, పురాణపురుషునికి అరణి వంటిది, గొప్ప ఐశ్వర్యాన్నిచ్చేది, మధ్యస్థురాలు, కమలనేత్ర, సాటి లేనిది, పదునెన్మిది భుజాలు కల్గినది, పుట్టుకలేనిది, నల్లకలువ రేకువంటి కాంతిగలది, అన్నిశక్తులనే ఆసనాన్ని అధిరోహించేది, ధర్మాధర్మములను విడిచి పెట్టినది.

**వైరాగ్యజ్ఞాననిరతా నిరాలోకా నిరిన్ద్రియా ।**
**విచిత్రగహనాధారా శాశ్వతస్థానవాసినీ ॥ 159 ॥**

**స్థానేశ్వరీ నిరానన్దా త్రిశూలవరధారిణీ ।**
**అశేషదేవతామూర్తిర్దేవతా వరదేవతా ॥ 160 ॥**

**గణామ్బికా గిరేః పుత్రీ నిశుమ్భవినిపాతినీ ।**
**అపర్ణా వర్ణరహితా త్రివర్ణా జీవసంభవా ॥ 161 ॥**

**అనన్తవర్ణా నాన్యస్థా శంకరీ శాన్తమానసా ।**
**అగోత్రా గోమతీ గోప్త్రీ గుహ్యరూపా గుణోత్తరా ॥ 162 ॥**

**గౌర్గీర్గవ్యప్రియా గౌణీ గణేశ్వరనమస్కృతా ।**
**సత్యభామా సత్యసన్ధా త్రిసన్ధ్యా సన్ధివర్జితా ॥ 163 ॥**

వైరాగ్యరూపజ్ఞానమందాసక్త, కాంత్యతిశయ, ఇంద్రియాతీత, విచిత్రమైన గహనమాధారంగా కలది, శాశ్వతస్థానంలో ఉండేది, స్థానాలన్నింటికి ఈశ్వరి. ఆనందానికతీత. శ్రేష్ఠమైన త్రిశూలాన్ని ధరించింది, సమస్తదేవతా రూపిణి, దేవత, వరాలిచ్చే దేవత, దేవగణాలకు తల్లి, పర్వతపుత్రి, నిశుంభుని కూల్చినది, పత్రాన్నిసైతం ఆహారంగా గ్రహించనిది, ఏ రంగు లేనిది, మూడురంగులు కలది, ప్రాణులకు జన్మనిచ్చేది, ఎన్నో వర్ణాలు కల్గినది, ఇతరుల అధీనంలో లేనిది, శుభాలనిచ్చేది, ప్రశాంత మానస, వంశంలేనిది. గోవులు కలది, సంరక్షిణి, రహస్యమైన ఆకారం కలది, గుణాధిక, గోపురూపంలో ఉన్నది, వాక్కు, పంచగవ్యప్రీతి గలది, గుణత్రయసంబంధిని, గణపతిచే నమస్కరింపబడినది, సత్యభామారూపంలో ఉన్నది. సత్యప్రతిజ్ఞ కలది, మూడు సంధ్యల స్వరూప, విభాగం లేనిది

**సర్వవాదాశ్రయా సాంఖ్యా సాంఖ్యయోగసముద్భవా ।**
**అసంఖ్యేయాఽప్రమేయాఖ్యా శూన్యా శుద్ధకులోద్భవా ॥ 164 ॥**

**బిందునాదసముత్పత్తిః శమ్భువామా శశిప్రభా ।**
**పిశఙ్గా భేదరహితా మనోజ్ఞా మధుసూదనీ ॥ 165 ॥**

**మహాశ్రీః శ్రీసముత్పత్తిస్తమఃపారే ప్రతిష్ఠితా ।**
**త్రితత్త్వమాతా త్రివిధా సుసూక్ష్మపదసంశ్రయా ॥ 166 ॥**

**శాన్తాఽ భీతా మలాతీతా నిర్వికారా శివాశ్రయా ।**
**శివాఖ్యా చిత్తనిలయా శివజ్ఞానస్వరూపిణీ ॥ 167 ॥**

**దైత్యదానవనిర్మాథీ కాశ్యపీ కాలకర్ణికా ।**
**శాస్త్రయోనిః క్రియామూర్తిశ్చతుర్వర్గప్రదర్శికా ॥ 168 ॥**

అన్ని వాదాల కాశ్రయమైనది, జ్ఞానస్వరూపిణి, సాంఖ్యయోగం నుండి జన్మించింది, సంఖ్య కందనిది, తెలియరాని పరిమాణం కలది, శూన్యరూప, శుద్ధమైన కులంలో జన్మించింది, బిందునాదాని కుత్పత్తిస్థానం, శివుని ఎడమభాగం కల్గినది, చంద్రుని కాంతివంటి కాంతి గలది, పిశంగవర్ణ, భేద రహిత, మనసుకు నచ్చేది. మధువనే రాక్షసుని చంపినది, మహాలక్ష్మి, సంపదల కుత్పత్తి స్థానం, తమస్సు కవతల ప్రతిష్ఠింపబడినది, తత్త్వత్రయానికి తల్లి, మూడు విధాలైనది. అతిసూక్ష్మ పదాల నాశ్రయించింది. శాంతచిత్త, నిర్భయ, మాలిన్యరహిత, వికారాలు లేనిది, శివాశ్రయం కల్గినది, శివ అనే పేరు గలది, చిత్తమే నిలయంగా కలది, శివజ్ఞాన స్వరూపిణి, దైత్యదానవులను మర్దించినది, భూదేవి, కాలానికి కర్ణిక, శాస్త్రాలకు మూలకారణం, క్రియా రూపిణి, నాలుగు వర్గలను చూపేది.

**నారాయణీ నరోత్పత్తిః కౌముదీ లిఙ్గధారిణీ ।**
**కాముకీ కలితా భావా పరావరవిభూతిదా ॥ 169 ॥**

**పరాఙ్గజాతమహిమా బడబా వామలోచనా ।**
**సుభద్రా దేవకీ సీతా వేదవేదాంగపారగా ॥ 170 ॥**

**మనస్వినీ మన్యుమాతా మహామన్యుసముద్భవా ।**
**అమన్యురమృతాస్వాదా పురుహూతా పురుష్టుతా ॥ 171 ॥**

**అశోచ్యా భిన్నవిషయా హిరణ్యరజతప్రియా ।**
**హిరణ్యరజనీ హైమా హేమాభరణభూషితా ॥ 172 ॥**

**విభ్రాజమానా దుర్జ్ఞేయా జ్యోతిష్టోమఫలప్రదా ।**
**మహానిద్రాసముద్భూతిరనిద్రా సత్యదేవతా ॥ 173 ॥**

నారాయణసంబంధిని, మనుష్యుల కుత్పత్తిస్థానం, వెన్నెల, లింగాన్ని ధరించేది. కోర్కెలు కలది, భావాలు లేనిది, పర అవర అనే విభూతులొసగేది. పరాంగంవల్ల కలిగిన మహిమ కలది, అశ్వరూపం కలది, సుందరనేత్రాలున్నది, మంచి భద్రములున్నది. దేవకి, సీత, వేదవేదాంగాలలో నిష్ణాతురాలు, అభిమానవతి, మన్యువు తల్లి. మహామన్యువునుండి జన్మించినది దుఃఖం లేనిది, అమృతమాస్వాదించేది. యజ్ఞాల్లో ఆహ్వానింపబడేది. స్తోత్రం చేయబడేది, దుఃఖింపతగనిది, విభిన్న విషయాలు కలది, వెండిబంగారాలను ఇష్టపడేది, బంగారాన్ని రంజింప చేసేది, బంగారు రంగు కలది, సువర్ణాభరణాలంకృత, మిక్కిలి ప్రకాశించేది, తెలియుటకు కష్టసాధ్య. జ్యోతిష్టోమయజ్ఞఫలప్రదాత్రి, గొప్పనిద్రకు జన్మకారణమైనది, నిద్రలేనిది, సత్యమైన దేవత,

**దీర్ఘా కకుద్మినీ హృద్యా శాన్తిదా శాన్తివర్ధినీ ।**
**లక్ష్మ్యాదిశక్తిజననీ శక్తిచక్రప్రవర్తికా ॥ 174 ॥**

**త్రిశక్తిజననీ జన్యా కరణీ షడూర్మిపరివర్జితా ।**
**సుధౌతా కర్మకరణీ యుగాన్తదహనాత్మికా ॥ 175 ॥**

**సంకర్షణీ జగద్ధాత్రీ కామయోనిః కిరీటినీ ।**
**ఐన్ద్రీ త్రైలోక్యనమితా వైష్ణవీ పరమేశ్వరీ ॥ 176**

**ప్రద్యుమ్నదయితా దాత్రీ యుగ్మదృష్టిస్త్రిలోచనా ।**
**మదోత్కటా హంసగతిః ప్రచణ్డా చణ్డవిక్రమా ॥ 177 ॥**

**వృషావేశా వియన్మాతా విన్ధ్యపర్వతవాసినీ ।**
**హిమవన్మేరునిలయా కైలాసగిరివాసినీ ॥ 178 ॥**

పొడగరి, రాజచిహ్నాలున్నది. మనసుకు నచ్చేది. శాంతిదాత్రి, శాంతిని పెంపొందించేది, లక్ష్మి మొదలైన శక్తులకు తల్లి. శక్తిచక్రాన్ని ప్రవర్తింపచేసేది. మూడుశక్తులకు తల్లి. పుట్టుక కలది. ఆరు విధాలైన ఊర్ముల నుండి విడువబడినది, బాగా శుభ్రమైనది, కర్మలను చేసేది, ప్రలయాగ్ని స్వరూప, శత్రుంజయ, లోకాలను ధరించేది, కోరికలకు కారణభూత, కిరీటం కలది, ఇంద్రసంబంధం కలది, ముల్లోకాల నమస్కారాన్ని పొందేది, విష్ణుసంబంధం కలది, పరమేశ్వరి, ప్రద్యుమ్నునికి ప్రియురాలు, దానం చేసేది, జంట చూపులు కలది, మూడు కన్నులున్నది,

మదం అధికంగా కలది, హంసగమన, తీక్ష్ణస్వభావ, తీవ్రపరాక్రమవతి. వృషభాన్నావేశించినది, ఆకాశానికి జనని, వింధ్యపర్వతంలో నివసించేది, హిమాలయ మేరుపర్వతాల్లో నివాసం కలది, కైలాసపర్వతంలో నివసించేది.

**చాణూరహన్తృతనయా నీతిజ్ఞా కామరూపిణీ ।**
**వేదవిద్యా వ్రతస్నాతా బ్రహ్మశైలనివాసినీ ॥ 179 ॥**

**వీరభద్రప్రజా వీరా మహాకామసముద్భవా ।**
**విద్యాధరప్రియా సిద్ధా విద్యాధరనిరాకృతిః ॥ 180 ॥**

**ఆప్యాయనీ హరన్తీ చ పావనీ పోషణీ కలా ।**
**మాతృకా మన్మథోద్భూతా వారిజా వాహనప్రియా ॥ 181 ॥**

**కరీషిణీ సుధావాణీ వీణావాదనతత్పరా ।**
**సేవితా సేవికా సేవ్యా సినీవాలీ గరుత్మతీ ॥ 182 ॥**

**అరున్ధతీ హిరణ్యాక్షీ మృగాఙ్కా మానదాయినీ ।**
**వసుప్రదా వసుమతీ వసోర్ధారా వసున్ధరా ॥ 183 ॥**

చాణూరుని చంపినవాని కూతురు, నీతిశాస్త్రం తెలిసినది, స్వేచ్ఛా రూపాన్ని ధరించేది, వేదవిద్య అవబృథస్నానమాచరించినది. బ్రహ్మపర్వతవాసిని, వీరభద్రుడు పుత్రుడుగా కలది. వీరురాలు, గొప్ప కామాని కుత్పత్తిస్థానం, విద్యాధరులకు ప్రియమైనది, సిద్ధురాలు, విద్యాధరుల నిరాకరింప గలది, ప్రీతి కారిణి, హరించేది, పావని, పోషణ, కళారూప, మాతృక, మన్మథుని నుండి పుట్టినది, జలంనుండి జన్మించినది, వాహనమందు ప్రీతి కలది, కరీషాన్ని(ఆవుపేడను) ధరించేది, అమృతం వంటి మాటలు కలది, వీణా వాదనలో ఆసక్తి కలది, సేవింప బడేది, సేవించేది, సేవింపదగినది. చంద్రకళకల్గిన అమావాస్య, రెక్కలు కలది, అరుంధతి, బంగారు కన్నులు గలది, మృగం గుర్తుగా కలది, గౌరవ మిచ్చేది, ధనాన్ని కలిగించేది, ఐశ్వర్యం కలది, బంగారపు ధార, బంగారాన్ని ధరించేది (భూమి),

**ధారాధరా వరారోహా వరావాససహస్రదా ।**
**శ్రీఫలా శ్రీమతీ శ్రీశా శ్రీనివాసా శివప్రియా ॥ 184 ॥**

**శ్రీధరా శ్రీకరీ కల్యా శ్రీధరార్ధశరీరిణీ ।**
**అనన్తదృష్టిరక్షుద్రా ధాత్రీశా ధనదప్రియా ॥ 185 ॥**

**నిహన్త్రీ దైత్యసంఘానాం సింహికా సింహవాహనా ।**
**సువర్చలా చ సుశ్రోణీ సుకీర్తిశ్ఛిన్నసంశయా ॥ 186 ॥**

**రసజ్ఞా రసదా రామా లేలిహానాఽమృతస్రవా ।**
**నిత్యోదితా స్వయంజ్యోతిరుత్సుకాఽమృతజీవనా ॥ 187 ॥**

**వజ్రదణ్డా వజ్రచిహ్నా వైదేహీ వజ్రవిగ్రహా ।**
**మఙ్గల్యా మఙ్గలా మాలా నిర్మలా మలహారిణీ ॥ 188 ॥**

ధారలను ధరించే మేఘము, శ్రేష్ఠమైన ఊరువులు కలది, వేలకొద్ది ఉన్నతాశ్రయాల నిచ్చేది, సంపద ఫలంగా కలది, సంపన్న, సంపదకు ప్రభ్వి, శ్రీనివాసం, శివునికి కిష్టమైనది, శ్రీని ధరించేది, సంపదను కల్గించేది, శుభాన్నిచ్చేది, శ్రీధరుని అర్ధశరీర, అనంత దృష్టులు కలది, క్షుద్రత్వం లేనిది, భూమికి అధికారిణి, కుబేరునికి ప్రియమైనది, రక్కసి మూకల నణచేది, సింహవాహన, సింహరూపిణి, మంచితేజస్విని, అందమైన పిరుదులు కలది, మంచి కీర్తి కలది, సంశయాలు లేనిది, రసము నెరిగినది, రసము నిచ్చునది, అందమైనది, ఆస్వాదించేది, అమృతాన్ని స్రవించేది, ఎల్లపుడు ఉదయించేది, స్వయంగా జ్యోతిఃస్వరూప, ఉత్సాహవతి. మృతులను జీవింపచేసేది, వజ్రదండం కలది, వజ్రమే చిహ్నంగా కలది, వైదేహి, వజ్రశరీర, మంగళార్హ, మంగళరూప, మాలారూపిణి, నిర్మలమైనది, మాలిన్యాన్ని తొలగించేది.

**గాన్ధర్వీ గారుడీ చాన్ద్రీ కమ్బలాశ్వతరప్రియా ।**
**సౌదామినీ జనానన్దా భ్రుకుటీకుటిలాననా ॥ 189 ॥**

**కర్ణికారకరా కక్షా కంసప్రాణాపహారిణీ ।**
**యుగన్ధరా యుగావర్తా త్రిసన్ధ్యా హర్షవర్ధినీ ॥ 190 ॥**

**ప్రత్యక్షదేవతా దివ్యా దివ్యగన్ధా దివః పరా ।**
**శక్రాసనగతా శాక్రీ సాధ్యా చారుశరాసనా ॥ 191 ॥**

**ఇష్టా విశిష్టా శిష్టేష్టా శిష్టాశిష్ట ప్రపూజితా ।**
**శతరూపా శతావర్తా వినతా సురభిః సురా ॥ 192 ॥**

**సురేన్ద్రమాతా సుద్యుమ్నా సుషుమ్నా సూర్యసంస్థితా ।**
**సమీక్ష్యా సత్ప్రతిష్ఠా చ నివృత్తి ర్జ్ఞానపారగా ॥ 193 ॥**

గంధర్వసంబంధం కలది, గరుడసంబంధం కలది, చంద్రునికి చెందింది, కంబలుడు, అశ్వతరుడను సర్పాలకు ఇష్టురాలు మెరుపుతీగ రూపం కలది, జనులకానందం కూర్చేది, బొమముడిచేత కుటిలమైన ముఖం కలది, కొండగోగు పూవును దాల్చినది, కక్షురాలు, కంసుని ప్రాణాలపహరించినది, యుగాలను ధరించేది, యుగాలను పరివర్తనం చేయగలది, త్రిసంధ్య, సంతోషాన్ని పెంచేది, ప్రత్యక్షదేవత, దివ్య, దివ్యగంధమలదినది, స్వర్గాధిక, ఇంద్రాసనమధిష్ఠించినది, ఇంద్రునికి సంబంధించినది, సాధనయోగ్య, దివ్య ధనువు దాల్చినది, ఇష్టురాలు, విశిష్టురాలు, శిష్టులకభీష్టురాలు. శిష్టాశిష్టులచే పూజలందుకొనేది, అనేక రూప, అనంతావర్తము కలది, వినత, సురభి, దేవత, దేవేంద్రుని తల్లి, మంచిశక్తి కలది, మంచిప్రకాశం గలది, సూర్య మండలాధిష్ఠిత, బాగా పరిశీలించుటతో తెలియవచ్చునది, గొప్ప ప్రతిష్ఠ గలది, నివృత్తి రూప, జ్ఞానాంతము చూచినది.

**ధర్మశాస్త్రార్థకుశలా ధర్మజ్ఞా ధర్మవాహనా ।**
**ధర్మాధర్మవినిర్మాత్రీ ధార్మికాణాం శివప్రదా ॥ 194 ॥**

**ధర్మశక్తిర్ధర్మమయీ విధర్మా విశ్వధర్మిణీ ।**
**ధర్మాన్తరా ధర్మమయీ ధర్మపూర్వా ధనావహా ॥ 195 ॥**

**ధర్మోపదేష్ట్రీ ధర్మాత్మా ధర్మగమ్యా ధరాధరా ।**
**కాపాలీ శకలామూర్తిః కలాకలితవిగ్రహా ॥ 196 ॥**

**సర్వశక్తివినిర్ముక్తా సర్వశక్త్యాశ్రయాశ్రయా ।**
**సర్వా సర్వేశ్వరీ సూక్ష్మా సూక్ష్మజ్ఞానస్వరూపిణీ ॥ 197 ॥**

**ప్రధానపురుషేశేశా మహాదేవైకసాక్షిణీ ।**
**సదాశివా వియన్మూర్తిర్వేదమూర్తిరమూర్తికా ॥ 198 ॥**

**ఏవం నామ్నాం సహస్రేణ స్తుత్వాఽసౌ హిమవాన్గిరిః ।**
**భూయః ప్రణమ్య భీతాత్మా ప్రోవాచేదం కృతాఞ్జలిః ॥ 199 ॥**

ధర్మశాస్త్రార్థాల్లో నేర్పరి. ధర్మజ్ఞ, ధర్మవాహన, ధర్మాధర్మ నిర్ధారిణి, ధర్మస్వభావులకు శుభాలనిచ్చేది, ధర్మమే శక్తిగా కలది, ధర్మ స్వరూపిణి, ధర్మాతీత, విశ్వధర్మం గలది, ధర్మమందే వసించేది, ధర్మమయి, ధర్మపూర్వ ధనాన్నిచ్చేది, ధర్మాన్ని ఉపదేశించేది, ధర్మస్వభావ, ధర్మంవల్ల పొందదగినది, భూధర, కపాల ధారిణి, అంశావతార కళలు గల విగ్రహం కలది, సమస్తశక్తుల నుండి ముక్తురాలు, సర్వశక్తుల కాశ్రయమైనది, సమస్తస్వరూపురాలు, సమస్తానికి అధీశ్వరి, సూక్ష్మరూపిణి, సూక్ష్మ జ్ఞాన స్వరూప, ప్రధాన పురుషేశ్వరులకు ప్రభురాలు, మహాదేవునికి ముఖ్యసాక్షిణి, సదాశివరూప, ఆకాశం శరీరంగా కలది, వేదస్వరూప, మూర్తిరహిత.

ఈ విధంగా హిమవంతుడు వేయి నామాలతో స్తుతించి, మళ్లీ నమస్కరించి భయంతో చేతులు జోడించి ఇట్లన్నాడు.

**యదేతదైశ్వరం రూపం ఘోరం తే పరమేశ్వరి ।**
**భీతోఽస్మి సాంప్రతం దృష్ట్వా రూపమన్యత్ప్రదర్శయ ॥ 200 ॥**

**ఏవముక్తాఽథ సా దేవీ తేన శైలేన పార్వతీ ।**
**సంహృత్య దర్శయామాస స్వరూపమపరం పునః ॥ 201 ॥**

"ఓ పరమేశ్వరీ! భయంకరమైనది ఈశ్వరసంబంధి అయిన ఈ రూపాన్ని చూచి ఇప్పుడు భయపడినాను. అందువల్ల మరో రూపాన్ని చూపించు" అనగా ఆ హిమవంతుని అభిప్రాయం తెలిసి పార్వతీ దేవి ఆ రూపాన్ని ఉపసంహరించి తన మరొక రూపాన్ని మళ్ళీ ప్రదర్శించింది.

**నీలోత్పలదలప్రఖ్యం నీలోత్పలసుగన్ధి చ ।**
**ద్వినేత్రం ద్విభుజం సౌమ్యం నీలాలకవిభూషితమ్ ॥ 202 ॥**

**రక్తపాదామ్బుజతలం సురక్తకరపల్లవమ్ ।**
**శ్రీమద్విలాససద్వృత్తం లలాటతిలకోజ్జ్వలమ్ ॥ 203 ॥**

**భూషితం చారు సర్వాఙ్గభూషణైరతికోమలమ్ ।**
**దధానమురసా మాలాం విశాలాం హేమనిర్మితామ్ ॥ 204 ॥**

**ఈషత్స్మితం సుబిమ్బోష్ఠం నూపురారావసంయుతమ్ ।**
**ప్రసన్నవదనం దివ్యమనన్తమహిమాస్పదమ్ ॥ 205 ॥**

**తదీదృశం సమాలోక్య స్వరూపం శైలసత్తమః ।**
**భీతిం సన్త్యజ్య హృష్టాత్మా బభాషే పరమేశ్వరీమ్ ॥ 206 ॥**

నల్లకలువరేకుల సామ్యం గలది, నల్లకలువ గంధంవంటి గంధం కలది, రెండు కన్నులు రెండు చేతులు కల్గినది, నల్లని ముంగురులు కల్గి ప్రసన్నమైన ముఖం కల్గినది, ఎర్రని పద్మంవంటి పాదాలు కలది. ఎర్రని చివురుటాకులవంటి చేతులుకల్గి సంపద్యుక్తమైన విలాసం, సద్వర్తనం కల్గినది, నుదుట తిలకం ప్రకాశిస్తున్నది, దేహమంతా అందమైన సొమ్ములలంకరించు కున్నది, మిక్కిలి సుకుమారి, విశాలమైన వక్షఃస్థలంలో బంగారు హారాన్ని ధరించినది, చిరునవ్వు, దొండపండువంటి పెదవులుకలది, అందెలధ్వనితో కూడినది, నిర్మలమైన ముఖం కల్గినది, దేవతాసంబంధమై, అంతులేని మహిమల కాలవాలమైనది. ఈవిధమైన లక్షణాలున్న ఆ స్వరూపాన్ని చూచి పర్వతశ్రేష్ఠుడు సంతోషచిత్తుడై భయం వదలి ఆ పరమేశ్వరిని గూర్చి ఇట్లా పలికాడు.

**హిమవానువాచ** :–హిమవంతుడు పలికాడు.

**అద్య మే సఫలం జన్మ అద్య మే సఫలం తపః ।**
**యన్మే సాక్షాత్త్వమవ్యక్తా ప్రపన్నా దృష్టిగోచరమ్ ॥ 207 ॥**

**త్వయా సృష్టం జగత్సర్వం ప్రధానాద్యం త్వయి స్థితమ్ ।**
**త్వయ్యేవ లీయతే దేవి! త్వమేవ పరమా గతిః ॥ 208 ॥**

**వదన్తి కేచిత్త్వామేవ ప్రకృతిం ప్రకృతేః పరామ్ ।**
**అపరే పరమార్థజ్ఞాః శివేతి శివసంశ్రయాత్ ॥ 209 ॥**

ఈ రోజు నా జన్మ సఫలమైనది. నాతపస్సు ఈ రోజు సఫలమైనది. అవ్యక్త స్వరూపవైన నీవు స్వయంగా నా దృష్టిగోచరమైనావు. నీవే ఈ లోకాన్ని సృష్టించావు. నీలోనే ఈప్రధానం మొదలైన తత్త్వసమూహం నిలిచి ఉన్నది. ఓదేవీ! ఈ లోకం నీలోనే లీనమవుతుంది. నీవే మాకు పరమగతివి. కొందరు నిన్ను ప్రకృతి స్వరూపవని ప్రకృతి కతీతురాలవని అంటారు, మరి కొందరు సత్యం తెలిసినవారు నిన్ను శివునాశ్రయించిన శివ అంటారు.

**త్వయి ప్రధానం పురుషో మహాన్ బ్రహ్మా తథేశ్వరః ।**
**అవిద్యా నియతిర్మాయా కలాద్యాః శతశోఽ భవన్ ॥ 210 ॥**

**త్వం హి సా పరమా శక్తిరనన్తా పరమేష్ఠినీ ।**
**సర్వభేదవినిర్ముక్తా సర్వభేదాశ్రయాశ్రయా ॥ 211 ॥**

**త్వామధిష్ఠాయ యోగేశి మహాదేవో మహేశ్వరః ।**
**ప్రధానాద్యం జగత్సర్వం కరోతి వికరోతి చ ॥ 212 ॥**

**త్వయైవ సఙ్గతో దేవః స్వాత్మానన్దం సమశ్నుతే ।**
**త్వమేవ పరమానన్దస్త్వమేవానన్దదాయినీ ॥ 213 ॥**

**త్వమక్షరం పరం వ్యోమ మహజ్జ్యోతి ర్నిరఞ్జనమ్ ।**
**శివం సర్వగతం సూక్ష్మం పరం బ్రహ్మ సనాతనమ్ ॥ 214 ॥**

నీలోనే ప్రధానతత్త్వం, పురుషుడు, మహత్తు, బ్రహ్మ, ఈశ్వరుడు, అవిద్య, నియతి, మాయ, కళలు మొదలైనవి వందలకొలది ఏర్పడినవి. శ్రేష్ఠమైన శక్తివి నీవు. అంతం లేని పరమేష్ఠి రూపానివి. సర్వభేదాలు వదలిన దానవు. భేదానికాశ్రయాలైన వాని కన్నింటికి ఆశ్రయమైన దానవు. ఓయోగేశ్వరీ! నీ ఆధారంతోనే మహేశ్వరుడైన మహాదేవుడు ప్రధానతత్త్వం మొదలైన లోకాన్నంతటినీ సృష్టించును. వికారాలు కలిగించును. నీతో చేరిన ఆ దేవుడు తనలో ఆత్మానుభవానందాన్ని పొందుతున్నాడు. గొప్ప ఆనంద స్వరూపానివి నీవే. నీవే ఆనందాన్ని కలిగించే దానవు. నాశరహితమైన పరమాకాశ రూపానివి నీవు. వికారం లేని గొప్ప తేజోరూపము, మంగళకరమై అంతట వ్యాపించి ఉన్నదీ, సూక్ష్మరూపము అనాదిసిద్ధమైన పరబ్రహ్మ స్వరూపానివీ అయి ఉన్నావు.

**త్వం శక్రః సర్వదేవానాం బ్రహ్మా బ్రహ్మవిదామసి ।**
**వాయుర్బలవతాం దేవి! యోగినాం త్వం కుమారకః ॥ 215 ॥**

నీవు దేవతలలో ఇంద్రుడవు. బ్రహ్మవిదులలో బ్రహ్మవు. ఓ దేవి! బలవంతుల్లో వాయువవు. యోగులలో కుమారకుడవు.

**ఋషీణాఞ్చ వసిష్ఠస్త్వం వ్యాసో వేదవిదామసి ।**
**సాంఖ్యానాం కపిలో దేవో రుద్రాణాం చాపి శఙ్కరః ॥ 216 ॥**

ఋషుల్లో వశిష్ఠుడవు నీవే. వేదవిదుల్లో వ్యాసుడవు, సాంఖ్యుల్లో కపిలుడవు, రుద్రుల్లో శంకరుడవు నీవే.

**ఆదిత్యానాముపేన్ద్రస్త్వం వసూనాం చైవ పావకః ।**
**వేదానాం సామవేదస్త్వం గాయత్రీ ఛన్దసామసి ॥ 217 ॥**

అదితికుమారుల్లో ఉపేంద్రుడవు. వసువుల్లో అగ్నివి. వేదాల్లో సామవేదానివి. ఛందస్సుల్లో గాయత్రివి.

**అధ్యాత్మవిద్యా విద్యానాం గతీనాం పరమా గతిః ।**
**మాయా త్వం సర్వశక్తీనాం కాలః కలయతామసి ॥ 218 ॥**

నీవే విద్యల్లో ఆత్మవిద్యవు. పొందదగిన వారిలో సర్వోత్తమ ప్రాప్యానివి నీవు. శక్తులన్నింటిలో మాయవు. లెక్కించ దగిన వారిలో కాలానివి.

**ఓంకారః సర్వగుహ్యానాం వర్ణానాం చ ద్విజోత్తమః ।**
**ఆశ్రమాణాం గృహస్థస్త్వమీశ్వరాణాం మహేశ్వరః ॥ 219 ॥**

రహస్యాలన్నింటిలో ఓంకారానివి, వర్ణాల్లో బ్రాహ్మణుడవు. ఆశ్రమాల్లో గృహస్థాశ్రమానివి. ఈశ్వరుల్లో మహేశ్వరుడవు నీవే.

**పుంసాం త్వమేకః పురుషః సర్వభూతహృది స్థితః ।**
**సర్వోపనిషదాం దేవి గుహ్యోపనిషదుచ్యతే ॥ 220 ॥**

నీవు పురుషుల్లో ముఖ్యపురుషుడవు, సర్వప్రాణి చిత్తాల్లో ఉన్నావు. ఓ దేవీ! అన్ని ఉపనిషత్తుల్లో రహస్య ఉపనిషత్తుగా చెప్పబడుతున్నావు.

**ఈశానశ్చాపి కల్పానాం యుగానాం కృతమేవ చ ।**
**ఆదిత్యః సర్వమార్గాణాం వాచాం దేవీ సరస్వతీ ॥ 221 ॥**

కల్పాల్లో ఈశానకల్పం, యుగాల్లో కృతయుగం నీవే. సర్వమార్గాలకు సూర్యుడవు. వాక్కులలో సరస్వతీదేవివి నీవు.

**త్వం లక్ష్మీశ్చారురూపాణాం విష్ణుర్మాయావినామసి ।**
**అరున్ధతీ సతీనాం త్వం సుపర్ణః పతతామసి ॥ 222 ॥**

నీవు అందమైన వారిలో లక్ష్మివి. మాయావుల్లో విష్ణువవు. పతివ్రతల్లో అరుంధతివి. పక్షుల్లో గరుత్మంతుడవు.

**సూక్తానాం పౌరుషం సూక్తం సామ జ్యేష్ఠఞ్చ సామసు ।**
**సావిత్రీ చాపి జాప్యానాం యజుషాం శతరుద్రియమ్ ॥ 223 ॥**

వేదసూక్తాల్లో పురుషసూక్తానివి. సామవేదాల్లో జ్యేష్ఠ సామభాగానివి. జపించదగిన మంత్రాల్లో గాయత్రీమంత్రానివి. యజుర్వేదమంత్రాల్లో శతరుద్రియ భాగానివి.

**పర్వతానాం మహామేరురనన్తో భోగినామపి ।**
**సర్వేషాం త్వం పరం బ్రహ్మ త్వన్మయం సర్వమేవ హి ॥ 224 ॥**

పర్వతాల్లో గొప్పదైన మేరుపర్వతానివి నీవు. సర్పాలలో ఆదిశేషుడవు. అన్నింటికి నీవే పరబ్రహ్మవు. సర్వం నీతోనే నిండి ఉన్నది.

**రూపం తవాశేషవికారహీనమగోచరం నిర్మలమేకరూపమ్ ।**
**అనాదిమధ్యాన్తమనన్తమాద్యం నమామి సత్యం తమసః పరస్తాత్ ॥ 225 ॥**

నీ రూపం అన్నివిధాల వికారాలు లేనిది. మామూలుగా కనిపించనిది. నిర్మలము. అవయవరహితము. అఖండము. ఆదిమధ్యాంతాలు లేనిది. నాశరహితము. ఆదిభూత. సత్యస్వరూప. తమోగుణ దూరమైన ఆ రూపానికి నమస్కారము.

**యదేవ పశ్యన్తి జగత్ప్రసూతిం వేదాన్తవిజ్ఞానవినిశ్చితార్థాః ।**
**ఆనన్దమాత్రం ప్రణవాభిధానం తదేవ రూపం శరణం ప్రపద్యే ॥ 226 ॥**

వేదాంతవిజ్ఞానంలో నిశ్చయబుద్ధి కల పండితులు దేనిని లోకోత్పత్తికారణంగా దర్శిస్తున్నారో కేవలానంద రూప ఓంకార వాచ్యమైన ఆ రూపాన్ని శరణు పొందుతున్నాను.

**అశేషభూతాన్తరసన్నివిష్టం ప్రధానపుంయోగవియోగహేతుమ్ ।**
**తేజోమయం జన్మవినాశహీనం ప్రాణాభిధానం ప్రణతోఽస్మి రూపమ్ ॥ 227 ॥**

సర్వప్రాణులలో వ్యాపించినది. ప్రధాన తత్త్వము. పురుషుని సంయోగ వియోగాలకు కారణమైనది. ప్రకాశంతో నిండి ఉన్నది. జననమరణాలులేనిది. ప్రాణశబ్దవాచ్యమైన నీ రూపానికి నమస్కరిస్తున్నాను.

**ఆద్యన్తహీనం జగదాత్మరూపం విభిన్నసంస్థం ప్రకృతేః పరస్తాత్ ।**
**కూటస్థమవ్యక్తవపుస్తథైవ నమామి రూపం పురుషాభిధానమ్ ॥ 228 ॥**

ఆద్యంతాలు లేనిది, లోకాలకాత్మ రూపమైనది. విలక్షణమై ప్రకృతికతీతమైనది. మూల భూతం. శరీరం స్పష్టంగా తెలియరానిది. పురుషశబ్దవాచ్యమైన నీ రూపానికి నమస్కరిస్తున్నాను.

**సర్వాశ్రయం సర్వజగద్విధానం సర్వత్రగం జన్మవినాశహీనమ్ ।**
**సూక్ష్మం విచిత్రం త్రిగుణం ప్రధానం నతోఽస్మి తే రూపమరూపభేదమ్ ॥ 229 ॥**

సర్వమున కాశ్రయ భూతం. లోకాలన్నింటిని సృజించేది. అన్నిచోట్ల వ్యాపించేది. జనన మరణాలు లేనిది. సూక్ష్మరూపం. ఆశ్చర్యకరం. గుణత్రయం ప్రధానంగా కలది. రూప భేదాలు లేని నీరూపానికి నమస్కరిస్తున్నాను.

**ఆద్యం మహాన్తం పురుషాభిధానం ప్రకృత్యవస్థం త్రిగుణాత్మబీజమ్ ।**
**ఐశ్వర్యవిజ్ఞానవిరోధధర్మైః సమన్వితం దేవి నతోఽస్మి రూపమ్ ॥ 230 ॥**

మొదటిది, గొప్పది, పురుషనామం కలది, ప్రకృతిలో వ్యాపించి నిలిచి ఉన్నది, గుణత్రయ సమన్వితమైన ఆత్మ బీజంగా కలది, ఐశ్వర్యం విజ్ఞానం విరుద్ధ ధర్మాలనే వానితో కూడి ఉన్న నీ రూపానికి ఓదేవీ! నమస్కరిస్తున్నాను.

**ద్విసప్తలోకాత్మకమమ్బుసంస్థం విచిత్రభేదం పురుషైకనాథమ్ ।**
**అనేకభేదైరధివాసితం తే నతోఽస్మి రూపం జగదణ్డసంజ్ఞమ్ ॥ 231 ॥**

పదునాలుగు లోకాల స్వరూపం కలది, నీటిలో ఉన్నది. విచిత్ర భేదాలున్నది. పరమపురుషుడే నాథుడుగా కలది. అనేక భేదాలతో కూడినదియగు జగదండమనే సంజ్ఞ కల నీరూపానికి నమస్కరిస్తున్నాను.

**అశేషవేదాత్మకమేకమాద్యం త్వత్తేజసాఽఽ పూరితలోకభేదమ్ ।**
**త్రికాలహేతుం పరమేష్ఠిసంజ్ఞం నమామి రూపం రవిమణ్డలస్థమ్ ॥ 232 ॥**

సర్వవేదస్వరూపం, కేవలము మొదటిది. నీతేజస్సు నిండిన లోకాల భేదాలు కలది. మూడు కాలాలకు కారణభూతం. పరమేష్ఠిసంజ్ఞ కల సూర్యమండలంలో నివసించే నీరూపానికి నమస్కరిస్తున్నాను.

**సహస్రమూర్ధానమనన్తశక్తిం సహస్రబాహుం పురుషం పురాణమ్ ।**
**శయానమన్తఃసలిలే తవైవ నారాయణాఖ్యం ప్రణతోఽస్మి రూపమ్ ॥ 233 ॥**

వేయితలలతో అనంతమైన శక్తి, వేయిభుజాలు కలిగిన పురాణపురుషుడవు. సముద్ర జలంలో శయనించిన నారాయణనామకమైన నీ రూపానికి ప్రణమిల్లుతున్నాను.

**దంష్ట్రా కరాళం త్రిదశాభివన్ద్యం యుగాన్తకాలానలకర్తృరూపమ్ ।**
**అశేషభూతాణ్డవినాశహేతుం నమామి రూపం తవ కాలసంజ్ఞమ్ ॥ 234 ॥**

కోరలతో భయంకరమైనది. దేవతలు పూజించేది. ప్రళయకాలాగ్నిని పుట్టించేది. సమస్తప్రాణి సహిత బ్రహ్మాండలయానికి కారణమైనది. కాల మనే పేరు గల నీరూపానికి నమస్కరిస్తున్నాను.

**ఫణాసహస్రేణ విరాజమానం భోగీన్ద్రముఖ్యైరపి పూజ్యమానమ్ ।**
**జనార్దనారూఢతనుం ప్రసుప్తం నతోఽస్మి రూపం తవ శేషసంజ్ఞమ్ ॥ 235 ॥**

వేయిపడగలతో ప్రకాశిస్తూ ముఖ్యులైన సర్పరాజులతో పూజింపబడుతూ విష్ణువధిష్ఠించిన శరీరం కలదీ, అయిన నిద్రావస్థలో ఉన్న శేషుడనే పేరు గల నీరూపానికి నమస్కరిస్తున్నాను.

**అవ్యాహతైశ్వర్యమయుగ్మనేత్రం బ్రహ్మామృతానన్దరసజ్ఞమేకమ్ ।**
**యుగాన్తశేషం దివి నృత్యమానం నతోఽస్మి రూపం తవ రుద్రసంజ్ఞమ్ ॥ 236 ॥**

అంతులేని ఐశ్వర్యము. బేసికన్నులు కలది. పరబ్రహ్మామృతరసాస్వాదనంలోని రసాన్ని గుర్తించేది. అద్వితీయం, ప్రలయకాలంలో మిగిలి ఉండేది. ఆకాశంలో నర్తించే రుద్రనామక మైన నీరూపానికి నమస్కరిస్తున్నాను.

**ప్రహీణశోకం ప్రవిహీనరూపం సురాసురైరర్చితపాదపద్మమ్ ।**
**సుకోమలం దేవి విభాసి శుభ్రం నమామి తే రూపమిదం భవాని! ॥ 237 ॥**

శోకము నశించినది. అగోచరాకారం కలది. దేవదానవులు పూజించే పాదపద్మములు కలది. సుకుమారమై ప్రకాశించునది. ఓ భవానీ! స్వచ్ఛమైన నీరూపానికి నమస్కరిస్తున్నాను.

**ఓం నమస్తే ఽస్తు మహాదేవి! నమస్తే పరమేశ్వరి! ।**
**నమో భగవతీశాని! శివాయై తే నమో నమః ॥ 238 ॥**

ఓ మహాదేవీ! పరమేశ్వరీ! నీకు నమస్కారము. భగవతీ, ఈశానపత్నీ, శివస్వరూపవైన నీకు నమస్కారము.

**త్వన్మయోఽహం త్వదాధారస్త్వమేవ చ గతిర్మమ ।**
**త్వామేవ శరణం యాస్యే ప్రసీద పరమేశ్వరి ॥ 239 ॥**

నీకంటే నేనభిన్నుడను. నీవే నాకాధారము. నాకు నీవే దిక్కు. ఓ పరమేశ్వరి! నిన్నే శరణు పొందుతున్నాను.

**మయా నాస్తి సమో లోకే దేవో వా దానవోఽపి వా ।**
**జగన్మాతైవ మత్పుత్రీ సమ్భూతా తపసా యతః ॥ 240 ॥**

నాకు ప్రసన్నురాలవగుము. లోకంలో నాతో సమానుడు దేవతలలోకాని దానవుల్లో కాని లేడు. లోకమాతవైన నీవు తపస్సుచేత నాకు పుత్రికగా జన్మించినావు.

**ఏషా తవామ్బికే దేవి కిలాభూత్పితృకన్యకా ।**
**మేనాఽశేషజగన్మాతురహో మే పుణ్యగౌరవమ్ ॥ 241 ॥**

ఓ అంబికా! ఈ మేనక సర్వలోకాలకు తల్లివైన నీ తండ్రికి పత్ని అయినది ఇది నా పుణ్యాల గొప్పతనము.

**పాహి మామమరేశాని మేనయా సహ సర్వదా ।**
**నమామి తవ పాదాబ్జం వ్రజామి శరణం శివమ్ ॥ 242 ॥**

దేవతలకు ప్రభ్వివైన నీవు నాభార్య మేనకతో కూడ నన్ను కాపాడుము. నీపాదపద్మమునకు నమస్కరిస్తున్నాను. మంగళకరమైన ఆ పాదపద్మాన్ని శరణు పొందెదను.

**అహో మే సుమహద్భాగ్యం మహాదేవీసమాగమాత్ ।**
**ఆజ్ఞాపయ మహాదేవి! కిం కరిష్యామి శంకరి! ॥ 243 ॥**

**ఏతావదుక్త్వా వచనం తదా హిమగిరీశ్వరః ।**
**సంప్రేక్షమాణో గిరిజాం ప్రాఞ్జలిః పార్శ్వగోఽభవత్ ॥ 244 ॥**

మహాదేవివైన నిన్ను కలిసే అవకాశం కలగటం నా అదృష్టం. ఓదేవీ, శంకరపత్నీ! నీకు నేనేమి చేయాలో ఆజ్ఞాపించు. పర్వతరాజైన హిమవంతు డిట్లా పలికి పార్వతిని చూస్తూ అంజలిబద్ధుడై ప్రక్కన నిలిచినాడు.

**అథ సా తస్య వచనం నిశమ్య జగతోఽరణిః ।**
**సస్మితం ప్రాహ పితరం స్మృత్వా పశుపతిం పతిమ్ ॥ 245 ॥**

లోకానికి అరణి వంటి పార్వతి హిమవంతుని వాక్యం విని మనసులో తన భర్త శివుని స్మరించి చిరునవ్వుతో తండ్రితో ఇట్లన్నది.

**శ్రీదేవ్యువాచ :**–శ్రీదేవి పలికింది.

**శృణుష్వ చైతత్ప్రథమం గుహ్యమీశ్వరగోచరమ్ ।**
**ఉపదేశం గిరిశ్రేష్ఠ సేవితం బ్రహ్మవాదిభిః ॥ 246 ॥**

పర్వతశ్రేష్ఠమా! రహస్యమైనది, ఈశ్వర విషయకమైనది. బ్రహ్మావాదులైన వేదాంతులు సేవించే ఈ ఉపదేశాన్ని ముందుగా వినుము.

**యన్మే సాక్షాత్పరం రూపమైశ్వరం దృష్టమద్భుతమ్ ।**
**సర్వశక్తిసమాయుక్తమనన్తం ప్రేరకం పరమ్ ॥ 247 ॥**

**శాన్తః సమాహితమనాః మానాహఙ్కార వర్జితః ।**
**తన్నిష్ఠస్తత్పరో భూత్వా తదేవ శరణం వ్రజ ॥ 248 ॥**

**భ్యక్త్యా త్వనన్యయా తాత మద్భావం పరమాశ్రితః ।**
**సర్వయజ్ఞతపోదానైస్తదేవార్చయ సర్వదా ॥ 249 ॥**

**తదేవ మనసా పశ్య తద్ధ్యాయస్వ యజస్వ తత్ ।**
**మమోపదేశాత్సంసారం నాశయామి తవానఘ ॥ 250 ॥**

**అహం త్వాం పరయా భక్త్యా ఐశ్వరం యోగమాస్థితమ్ ।**
**సంసారసాగరాదస్మాదుద్ధరామ్యచిరేణ తు ॥ 251 ॥**

ఐశ్వరము, ఆశ్చర్యకరము, సర్వవిధ శక్తియుక్తము అంతం లేనిది ప్రేరణ కలిగించే లోకాతీతమైన నా మహత్తర రూపాన్ని చూచావు. సావధాన మనస్కుడవై శాంతుడవై మానాహంకారాలు వదలి ఆ రూపమందే శ్రద్ధకలవాడవై అందులోనే నిమగ్నమై దాన్నే శరణు పొందుము. ఓ తండ్రీ ! అసాధారణభక్తితో శ్రేష్ఠమైన నా భావాన్ని పొంది, ఎల్లప్పుడు యజ్ఞాలు, తపస్సు, దానాలు మొదలైన వానితో ఆ రూపాన్నే పూజించు. దాన్నే మనస్సులో చూడు, ధ్యానించు. పూజించు. ఓ పుణ్యాత్ముడా! నా ఉపదేశంవల్ల నీ సంసారబంధాన్ని నశింప చేస్తాను. దృఢభక్తితో ఈశ్వరయోగాన్నవలంబించిన నిన్ను త్వరలోనే సంసారసముద్రంనుండి ఉద్ధరిస్తాను.

**ధ్యానేన కర్మయోగేన భక్త్యా జ్ఞానేన చైవ హి ।**
**ప్రాప్యాహం తే గిరిశ్రేష్ఠ! నాన్యథా కర్మకోటిభిః ॥ 252 ॥**

పర్వతరాజా! ధ్యాన కర్మ భక్తి జ్ఞాన యోగాలతో నేను నీకు పొంద శక్యురాలను. ఇతరవిధాల్లో కోట్లకొలది కర్మలతో కూడ అది అసాధ్యము.

**శ్రుతిస్మృత్యుదితం సమ్యక్కర్మ వర్ణాశ్రమాత్మకమ్ ।**
**అధ్యాత్మజ్ఞానసహితం ముక్తయే సతతం కురు ॥ 253 ॥**

వేదాల్లో ధర్మశాస్త్రాల్లో చెప్పిన వర్ణాశ్రమసంబంధి కర్మను ఆత్మ జ్ఞానంతో చేర్చి మోక్షం కొరకు ఎల్లపుడు ఆచరింపుము.

**ధర్మాత్సంజాయతే భక్తిర్భక్త్యా సంప్రాప్యతే పరమ్ ।**
**శ్రుతిస్మృతిభ్యాముదితో ధర్మో యజ్ఞాదికో మతః ॥ 254 ॥**

ధర్మంవల్ల భక్తిఏర్పడుతుంది. భక్తితో పరమాత్మ జ్ఞాన కలుగుతుంది. వేదాలు, ధర్మశాస్త్రాలు చెప్పిన యజ్ఞాదికమే ధర్మము

**నాన్యతో జాయతే ధర్మో వేదాద్ధర్మో హి నిర్బభౌ ।**
**తస్మాన్మముక్షుర్ధర్మార్థీ మద్రూపం వేదమాశ్రయేత్ ॥ 255 ॥**

వేదంవల్ల ధర్మం ప్రకాశించింది. ఇతరాలవల్ల అది జరుగదు. అందువల్ల మోక్షార్థి ధర్మాన్ని కోరేవాడు నా రూపమైన వేదాన్ని ఆశ్రయించాలి.

**మమైవైషా పరా శక్తిర్వేదసంజ్ఞా పురాతనీ ।**
**ఋగ్యజుఃసామరూపేణ సర్గాదౌ సంప్రవర్తతే ॥ 256 ॥**

వేదసంజ్ఞకల ప్రాచీనమైన ఈ ఉత్కృష్టశక్తి నాకు చెందిందే. ఋక్ యజుః సామ అనే పేర్లతో సృష్టి ప్రారంభంలో ఈ శక్తి ప్రవర్తించినది.

**తేషామేవ చ గుప్త్యర్థం వేదానాం భగవానజః ।**
**బ్రాహ్మణాదీన్ససర్జాథ స్వే స్వే కర్మణ్యయోజయత్ ॥ 257 ॥**

ఆ వేదాల రక్షణకే భగవంతుడైన బ్రహ్మ బ్రాహ్మణాదివర్ణాలను సృజించి వారిని తమతమ కర్మలలో నియమించినాడు.

**యే న కుర్వన్తి మద్ధర్మం తదర్థం బ్రహ్మనిర్మితాన్ ।**
**తేషామధస్థాన్నరకాంస్తామిస్రాదీనకల్పయత్ ॥ 258 ॥**

నాధర్మాన్ని అనుష్ఠించనివారు బ్రహ్మచేత నిర్మింపబడిన అధోభాగంలో ఉన్న తామిస్రం మొదలైన నరకలోకాలను పొందుతారు.

**న చ వేదాదృతే కిఞ్చి చ్ఛాస్త్రం ధర్మాభిదాయకమ్ ।**
**యోఽన్యత్ర రమతే సోఽసౌ న సమ్భాష్యో ద్విజాతిభిః ॥ 259 ॥**

వేదంకంటే భిన్నమైన ధర్మాన్మి బోధించే మరో శాస్త్రమేదీ లేదు. వేదాలకంటే ఇతర విషయాలలో ఆసక్తితో ప్రవర్తించే వానితో ద్విజులు మాట్లాడ తగదు.

**యాని శాస్త్రాణి దృశ్యన్తే లోకేఽస్మిన్వివిధాని తు ।**
**శ్రుతిస్మృతివిరుద్ధాని నిష్ఠా తేషాం హి తామసీ ॥ 260 ॥**

లోకంలో వేదాలకు శాస్త్రాలకు విరుద్ధాలైన శాస్త్రాల ప్రధానలక్ష్యం తమోగుణానికి సంబంధించినది.

**కాపాలం భైరవం చైవ యామలం వామమార్హతమ్ ।**
**ఏవం విధాని చాన్యాని మోహనార్థాని తాని తు ॥ 261 ॥**

కాపాలం, భైరవం, యామలం, వామం, ఆర్హతము. ఇట్టివే మరికొన్ని ఇతర శాస్త్రసంప్రదాయాలు లోకాన్ని మోహింపచేయ ఉపయుక్తాలు.

**యే కుశాస్త్రాభియోగేన మోహయన్తీహ మానవాన్ ।**
**మయా సృష్టాని శాస్త్రాణి మోహాయైషాం భవాన్తరే ॥ 262 ॥**

దుష్టశాస్త్రాల ప్రచారంతో ఈలోకంలో మనుష్యులను మోహింప చేసేవారిని జన్మాంతరంలో మోహింప చేయటానికి ఈ తామసశాస్త్రాలను సృష్టించాను.

**వేదార్థవిత్తమైః కార్యం యత్స్మృతం కర్మ వైదికమ్ ।**
**తత్ప్రయత్నేన కుర్వన్తి మత్ప్రియాస్తే హి యే నరాః ॥ 263 ॥**

వేదార్థం తెలిసిన శ్రేష్ఠులు చేయదగిన వైదిక కర్మ చెప్పినారు. నాకిష్టులైన మనుజులు ప్రయత్నంతో దాన్ని అనుష్ఠిస్తున్నారు.

**వర్ణానామనుకమ్పార్థం మన్నియోగాద్విరాట్ స్వయమ్ ।**
**స్వాయమ్భువో మనుర్ధర్మాన్మునీనాం పూర్వముక్తవాన్ ॥ 264 ॥**

చతుర్వర్ణాల వారిని దయతో చూడటానికే విరాట్పురుషుడైన స్వాయంభువ మనువు నా ఆజ్ఞవల్ల పూర్వం మునులకు ధర్మాలను బోధించాడు.

**శ్రుత్వా చాన్యేఽపి మునయ స్తన్ముఖాద్ధర్మముత్తమమ్ ।**
**చక్రుర్ధర్మప్రతిష్ఠార్థం ధర్మశాస్త్రాణి చైవ హి ॥ 265 ॥**

ఆయనవల్ల శ్రేష్ఠమైన ధర్మాన్ని విని ఇతరమునులు ధర్మ ప్రతిష్ఠాపనకు ధర్మశాస్త్రాలు రచించారు.

**తేషు చాన్తర్హితేష్వేవం యుగాన్తేషు మహర్షయః ।**
**బ్రహ్మణో వచనాత్తాని కరిష్యన్తి యుగే యుగే ॥ 266 ॥**

అవి ప్రలయకాలంలో లుప్తంకాగా బ్రహ్మ వచనాన్ననుసరించి మహర్షులు ప్రతియుగంలో మళ్ళీ మళ్ళీ రచిస్తారు.

**అష్టాదశపురాణాని వ్యాసాద్యైః కథితాని తు ।**
**నియోగాద్బ్రహ్మణో రాజంస్తేషు ధర్మః ప్రతిష్ఠితః ॥ 267 ॥**

బ్రహ్మ ఆజ్ఞ ననుసరించి వ్యాసుడు మొదలైన మహర్షులు అష్టాదశపురాణాలు చెప్పారు. వాటిలో ధర్మమే ప్రతిష్ఠితమైనది.

**అన్యాన్యుపపురాణాని తచ్ఛిష్యైః కథితాని తు ।**
**యుగే యుగేఽత్ర సర్వేషాం కర్తా వై ధర్మశాస్త్రవిత్ ॥ 268 ॥**

ఆ మహర్షుల శిష్యులు ఇతర ఉపపురాణాలు చెప్పినారు. ప్రతియుగంలో ధర్మ శాస్త్రాలు తెలిసినవాడే ఈ లోకంలో కర్తగా ఉంటాడు.

**శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్ద ఏవ చ ।**
**జ్యోతిశ్శాస్త్రం న్యాయవిద్యా సర్వేషాముపబృంహణమ్ ॥ 269 ॥**

శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిశ్శాస్త్రం, న్యాయవిద్య అనేవి అన్ని విద్యలకు సహకరిస్తాయి.

**ఏవం చతుర్దశైతాని తథా హి ద్విజసత్తమాః ।**
**చతుర్వేదైః సహోక్తాని ధర్మో నాన్యత్ర విద్యతే ॥ 270 ॥**

ఈవిధంగా నాలుగువేదాలతో కలిపి పదునాలుగు విద్యలు కలవు. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! వీనిలో తప్ప ధర్మం ఇతరాలలో ఉండదు.

**ఏవం పైతామహం ధర్మం మనువ్యాసాదయః పరమ్ ।**
**స్థాపయన్తి మమాదేశాద్యావదాభూతసంప్లవమ్ ॥ 271 ॥**

ఇట్లా పితామహునినుండి వస్తున్న శ్రేష్ఠమైన ధర్మాన్ని మనువు, వ్యాసుడు మొదలైన వారు నా ఆజ్ఞ ననుసరించి అన్నిప్రాణులు నశించే ప్రలయకాలం వరకు స్థాపిస్తున్నారు.

**బ్రహ్మణా సహ తే సర్వే సమ్ప్రాప్తే ప్రతిసఞ్చరే ।**
**పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమ్ ॥ 272 ॥**

బ్రహ్మతోపాటు వారందరు తమ నియతకాలపర్యంతం ప్రతిసారి తమవిధులను నిర్వర్తించి అవధి అయిన పరం సమాప్తం కాగా కృతార్థులై పరమపదాన్ని చేరుతారు.

**తస్మాత్సర్వప్రయత్నేన ధర్మార్థం వేదమాశ్రయేత్ ।**
**ధర్మేణ సహితం జ్ఞానం పరం బ్రహ్మ ప్రకాశయేత్ ॥ 273 ॥**

అందువల్ల అన్ని ప్రయత్నాలతో ధర్మంకోసం వేదాన్ని ఆశ్రయించాలి. ధర్మంతోడి జ్ఞానం పరబ్రహ్మ స్వరూపాన్ని వెల్లడిస్తుంది.

**యే తు సఙ్గాన్పరిత్యజ్య మామేవ శరణం గతాః ।**
**ఉపాసతే సదా భక్త్యా యోగమైశ్వరమాస్థితాః ॥ 274 ॥**

**సర్వభూతదయావన్తః శాన్తా దాన్తా విమత్సరాః ।**
**అమానినో బుద్ధిమన్తస్తాపసాః శంసితవ్రతాః ॥ 275 ॥**

**మచ్చిత్తా మద్గతప్రాణా మజ్జ్ఞానకథనే రతాః ।**
**సన్న్యాసినో గృహస్థాశ్చ వనస్థా బ్రహ్మచారిణః ॥ 276 ॥**

**తేషాం నిత్యాభియుక్తానాం మాయాతత్త్వం సముత్థితమ్ ।**
**నాశయామి తమః కృత్స్నం జ్ఞానదీపేన నో చిరాత్ ॥ 277 ॥**

సంసారబంధాలను వదలి నన్నే శరణు పొందేవారు, ఎల్లపుడూ భక్తితో ఐశ్వరయోగాన్ని అవలంబించి సేవించేవారు, సర్వభూతదయ కలవారై, శాంత స్వభావం ఇంద్రియ నిగ్రహం కలవారై, అసూయ అహంకారం లేక మంచి వివేకం కలవారు, శ్రేష్ఠ మైన వ్రతాన్నవలంబించిన మునులు, నా యందే మనసు నిల్పిన వారు తమ ప్రాణాలను నాలోనే పొందించేవారు, నా సంబంధమైన జ్ఞానాన్ని బోధించటంలో ఆసక్తికల సన్న్యాసులు గృహస్థులు వానప్రస్థులు బ్రహ్మచారులు మొదలైనవారి మాయాప్రభావం వల్ల కల్గిన అజ్ఞానాంధకారాన్ని జ్ఞానదీపంతో త్వరలోనే సమూలంగా నశింపచేస్తాను.

**తే సునిర్ధూత తమసో జ్ఞానేనైకేన మన్మయాః ।**
**సదానన్దాస్తు సంసారే న జాయన్తే పునః పునః ॥ 278 ॥**

అట్టివారు జ్ఞానంతో తొలగిన చీకటి కలవారై నాలో నిమగ్నులై సదా ఆనందానుభవం పొందుతూ మరల జన్మించకుండా ముక్తిని పొందుతారు.

**తస్మాత్సర్వప్రకారేణ మద్భక్తో మత్పరాయణః ।**
**మామేవార్చయ సర్వత్ర మనసా శరణం గతః ॥ 279 ॥**

అందువల్ల నీవు అన్నివిధాల నాయందే భక్తి కల్గి నన్నే ఆశ్రయించి మనసుతో నన్ను శరణుపొంది అన్ని ప్రదేశాల్లో నన్నే పూజిస్తూ ఉండుము.

**అశక్తో యది మే ధ్యాతుమైశ్వరం రూపమవ్యయమ్ ।**
**తతో మే పరమం రూపం కాలాద్యం శరణం వ్రజ ॥ 280 ॥**

ఒకవేళ ఐశ్వరము, నాశరహితము అయిన రూపాన్ని ధ్యానించటానికి శక్తి లేనప్పుడు నా కాలాదిరూపమైన రూపాన్ని శరణుపొందు.

**తద్యత్స్వరూపం మే తాత! మనసో గోచరం తవ ।**
**తన్నిష్ఠస్తత్పరో భూత్వా తదర్చనపరో భవ ॥ 281 ॥**

ఓ తండ్రీ! నీ చిత్తానికి గోచరించే నాస్వరూప మందే నిష్ఠ కలవాడవై శ్రద్ధ నుంచి దానినే పూజించే ఆసక్తి కలవాడవగుము.

**యత్తు మే నిష్కలం రూపం చిన్మాత్రం కేవలం శివమ్ ।**
**సర్వోపాధివినిర్ముక్తమనన్తమమృతం పరమ్ ॥ 282 ॥**

భేదం లేని జ్ఞానమాత్ర రూపం అద్వితీయం మంగళకరమైన నారూపం అన్ని విధాల ఉపాధులనుండి దూరమైనది, అంతంలేనిది, అమృత స్వరూపం, సర్వోన్నతం.

**జ్ఞానేనైకేన తల్లభ్యం క్లేశేన పరమం పదమ్ ।**
**జ్ఞానమేవ ప్రపశ్యన్తో మామేవ ప్రవిశన్తి తే ॥ 283 ॥**

ఆ పరమపదం ఒక్క జ్ఞానసాధనతోనే అతి కష్టంగా పొందటానికి శక్యమైనది, జ్ఞానాన్నే దర్శించేవారు నన్నే చేరుకుంటారు.

**తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।**
**గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 284 ॥**

ఆ పరమపదమందే బుద్ధి నిలిపి, నిష్ఠ కలిగి, శ్రద్ధ గలవారై అదే స్వరూపంగా కలిగినవారు, జ్ఞానంతో పాపాలు తొలగినవారై పునర్జన్మరాహిత్యాన్ని పొందుతారు.

**మామనాశ్రిత్య పరమం నిర్వాణమమలం పదమ్ ।**
**ప్రాప్యతే న హి రాజేన్ద్ర తతో మాం శరణం వ్రజ ॥ 285 ॥**

ఓ రాజోత్తమా! నన్నాశ్రయించక శ్రేష్ఠము నిర్మలమైన మోక్షపదం పొంద వీలు కాదు. అందువల్ల నన్నే శరణు పొందుము.

**ఏకత్వేన పృథక్త్వేన తథా చోభయథాఽపి వా ।**
**మాముపాస్య మహీపాల! తతో యాస్యసి తత్పదమ్ ॥ 286 ॥**

రాజా! అద్వైతభావనతో కాని భేదభావంతో కాని రెండు విధాలుగా కాని నన్ను సేవిస్తే తర్వాత నీవాపరమ పదాన్ని పొందగలవు.

**మామనాశ్రిత్య తత్తత్త్వం స్వభావవిమలం శివమ్ ।**
**జ్ఞాయతే న హి రాజేన్ద్ర! తతో మాం శరణం వ్రజ ॥ 287 ॥**

ఓరాజశ్రేష్ఠుడా! నన్నాశ్రయించక స్వచ్ఛము, మంగళకరము అయిన ఆ పరతత్త్వం తెలియదు. కావున నన్ను శరణుపొందు.

**తస్మాత్త్వమక్షరం రూపం నిత్యం వా రూపమైశ్వరమ్ ।**
**ఆరాధయ ప్రయత్నేన తతోఽన్ధత్వం ప్రహాస్యసి ॥ 288 ॥**

నీవు నాశరహితం నిత్యం అయిన ఐశ్వరరూపాన్ని ప్రయత్నపూర్వకంగా పూజించు. దానివల్ల నీ అంధత్వం పోతుంది.

**కర్మణా మనసా వాచా శివం సర్వత్ర సర్వదా ।**
**సమారాధయ భావేన తతో యాస్యసి తత్పదమ్ ॥ 289 ॥**

కర్మాచరణలో మనసుతో వాక్కుచేత ఎల్లపుడు మంగళరూపమైన ఆ తత్త్వాన్ని శ్రద్ధతో ఆరాధించు. అప్పుడా పరమ పదాన్ని చేరతావు.

**న వై యాస్యన్తి తం దేవం మోహితా మమ మాయయా ।**
**అనాద్యనన్తం పరమం మహేశ్వరమజం శివమ్ ॥ 290 ॥**

**సర్వభూతాత్మభూతస్థం సర్వాధారం నిరఞ్జనమ్ ।**
**నిత్యానన్దం నిరాభాసం నిర్గుణం తమసః పరమ్ ॥ 291 ॥**

**అద్వైతమచలం బ్రహ్మ నిష్కలం నిష్ప్రపఞ్చకమ్ ।**
**స్వసంవేద్యమవేద్యం తత్పరే వ్యోమ్ని వ్యవస్థితమ్ ॥ 292 ॥**

నామాయచే మోహాన్ని పొందినవారు ఆద్యంతాలు లేని, శ్రేష్ఠమైన, జన్మరహితుడైన దేవదేవుడు మహేశ్వరుని, సర్వభూతాత్మలందున్నది, అన్నింటికాధారమైనది, మాలిన్యం లేనిది, సదానందరూపం, ఆభాసలేనిది, గుణాలు లేనిది, తమోగుణాని కతీతమైనది, భేదరహితం, నిశ్చలం, బ్రహ్మరూపం, కలారహితం, ప్రపంచబంధంలేనిది, స్వయంగా తెలియదగినది, తెలియరానిది, పరమాకాశంలో నిలిచి ఉన్నది అయిన పరతత్త్వాన్ని పొందలేరు.

**సూక్ష్మేణ తమసా నిత్యం వేష్టితా మమ మాయయా ।**
**సంసారసాగరే ఘోరే జాయన్తే చ పునః పునః ॥ 293 ॥**

నామాయచే ఎల్లపుడు సూక్ష్మమైన అజ్ఞానమనే చీకటితో కప్పబడి భయంకరమైన సముద్రంలో మాటిమాటికి జన్మిస్తుంటారు.

**భక్త్యా త్వనన్యయా రాజన్ సమ్యక్ జ్ఞానేన చైవ హి ।**
**అన్వేష్టవ్యం హి తద్బ్రహ్మ జన్మబంధనివృత్తయే ॥ 294 ॥**

ఓరాజా! అసాధారణమైన భక్తితో శ్రేష్ఠమైన జ్ఞానంతో జన్మబంధాలనుండి విడిపించుకొనుటకు ఆ పరబ్రహ్మరూపాన్ని వెదకాలి.

**అహఙ్కారఞ్చ మాత్సర్యం కామం క్రోధపరిగ్రహమ్ ।**
**అధర్మాభినివేశఞ్చ త్యక్త్వా వైరాగ్యమాస్థితః ॥ 295 ॥**

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**అవేక్ష్య చాత్మనాత్మానం బ్రహ్మభూయాయ కల్పతే ॥ 296 ॥**

**బ్రహ్మభూతః ప్రసన్నాత్మా సర్వభూతాభయప్రదః ।**
**ఐశ్వర్యం పరమాం భక్తిం విన్దేతానన్యభావినీమ్ ॥ 297 ॥**

అహంకారం, అసూయ, కోరిక, కోపం అధర్మాభిరతి వదలి వైరాగ్య భావాన్నవలంబించి సర్వప్రాణుల్లో తన ఆత్మను, తనలో సర్వభూతాలను చూచి తనలో ఆత్మరూపాన్ని దర్శించి పరబ్రహ్మసాయుజ్యానికర్హత పొందాలి. పరబ్రహ్మస్వరూపుడై నిర్మలమైన ఆత్మకల్గి సమస్తభూతాల కభయ ప్రదాతయై ఈశ్వరభావాన్ని అనితరసాధారణమైన భక్తిని పొందగలడు.

**వీక్ష్యతే తత్పరం తత్త్వమైశ్వరం బ్రహ్మ నిష్కలమ్ ।**
**సర్వసంసారనిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే ॥ 298 ॥**

కలారహితమైన ఈశ్వరసంబంధమైన ఆ పరతత్త్వం దర్శింపనగును, అట్లా చూచినవాడు అన్ని సంసారబంధాల్ని వదలి బ్రహ్మంలోనే నివసించగలడు.

**బ్రహ్మణోఽయం ప్రతిష్ఠానం పరస్య పరమః శివః ।**
**అనన్యశ్చావ్యయశ్చైకశ్చాత్మాధారో మహేశ్వరః ॥ 299 ॥**

ఈ పరమ శివుడు పరబ్రహ్మకు ఆశ్రయస్థానం. ఈ మహేశ్వరుడద్వితీయుడు, నాశరహితుడు, ఒంటరివాడు. ఆత్మలకాధారభూతుడు.

**జ్ఞానేన కర్మయోగేన భక్త్యా యోగేన వా నృప ।**
**సర్వసంసారముక్త్యర్థమీశ్వరం శరణం వ్రజ ॥ 300 ॥**

ఓరాజా! జ్ఞాన కర్మయోగాలతోకాని, భక్తియోగంతోకాని అన్ని సంసారబంధాలనుండి విడుదలకోసం ఈశ్వరుని శరణు పొందు.

**ఏష గుహ్యోపదేశస్తే మయా దత్తో గిరీశ్వర! ।**
**అన్వీక్ష్య చైతదఖిలం యథేష్టం కర్తుమర్హసి ॥ 301 ॥**

ఓ పర్వతరాజా! నే నీ రహస్యమైన ఉపదేశాన్ని నీకిస్తున్నాను. దీన్ని బాగా ఆలోచించి నీ ఇష్ట ప్రకారం కర్తవ్యాన్నాచరించు.

**అహం వై యాచితా దేవైః సంజాతా పరమేశ్వరాత్ ।**
**వినిన్ద్య దక్షం పితరం మహేశ్వరవినిన్దకమ్ ॥ 302 ॥**
**ధర్మసంస్థాపనార్థాయ తవారాధనకారణాత్ ।**
**మేనాదేహసముత్పన్నా త్వామేవ పితరం శ్రితా ॥ 303 ॥**

దేవతలప్రార్థనచే పరమేశ్వరునివల్ల పుట్టిన నేను మహేశ్వరుని నిందించిన నా తండ్రి దక్షుని నిందించి ధర్మాన్ని స్థాపించటానికి నీ ఆరాధనవల్ల నీ భార్య మేనాదేవి శరీరంనుండి పుట్టి నిన్ను తండ్రిగా ఆశ్రయించినాను.

**స త్వం నియోగాద్దేవస్య బ్రహ్మణః పరమాత్మనః ।**
**ప్రదాస్యసే మాం రుద్రాయ స్వయంవరసమాగమే ॥ 304 ॥**

పరమాత్మ బ్రహ్మశాసనంవల్ల నీవు స్వయంవరంలో నన్ను రుద్రునికి భార్యగా అర్పించగలవు.

**తత్సమ్బన్ధాత్తరే రాజన్ సర్వే దేవాః సవాసవాః ।**
**త్వాం నమస్యన్తి వై తాత ప్రసీదతి చ శంకరః ॥ 305 ॥**

ఓరాజా! ఆ సంబంధంకారణంగా ఇంద్రాదిదేవతలందరు నీకు నమస్కరిస్తారు. దానివల్ల శంకరుడు ప్రసన్నుడవుతాడు.

**తస్మాత్సర్వప్రయత్నేన మాం విద్ధీశ్వరగోచరామ్ ।**
**సంపూజ్య దేవమీశానం శరణ్యం శరణం వ్రజ ॥ 306 ॥**

అందువల్ల సర్వప్రయత్నాలతో నన్ను ఈశ్వరుని లక్ష్యమైన దాన్నిగా గుర్తించు, భగవంతుడు, శరణుపొందదగినవాడు అయిన ఈశ్వరుని పూజించి అతనిని శరణు పొందుము.

**స ఏవముక్తో హిమవాన్ దేవదేవ్యా గిరీశ్వరః ।**
**ప్రణమ్య శిరసా దేవీం ప్రాఞ్జలిః పునరబ్రవీత్ ॥ 307 ॥**

దేవదేవి పార్వతి ఈ విధంగా చెప్పగా పర్వతరాజైన హిమవంతుడు దేవికి శిరసా నమస్కరించి చేతులు జోడించి మళ్ళీ ఇట్లన్నాడు.

**విస్తరేణ మహేశాని యోగం మాహేశ్వరం పరమ్ ।**
**జ్ఞానం వై చాత్మనో యోగం సాధనాని ప్రచక్ష్వ మే ॥ 308 ॥**

ఓ మహేశ్వరీ! మాహేశ్వరయోగాన్ని, జ్ఞానాన్ని,ఆత్మయోగాన్ని, సాధనాలను విస్తరంగా నాకు తెలుపుము.

**తస్యైతత్పరమం జ్ఞానమాత్మనా యోగముత్తమమ్ ।**
**యథావద్వ్యాజహారేశా సాధనాని చ విస్తరాత్ ॥ 309 ॥**

ఆ ఈశ్వరుని గొప్ప జ్ఞానాన్ని, ఉత్తమయోగాన్ని, సాధనాలను గురించి ఆ మహేశ్వరి ఉన్నది ఉన్నట్లుగా ఆ హిమవంతునికి వివరంగా చెప్పింది.

**నిశమ్య వదనామ్భోజాద్గిరీన్ద్రో లోకపూజితః ।**
**లోకమాతుః పరం జ్ఞానం యోగాసక్తో ఽభవత్పునః ॥ 310 ॥**

లోకమాత పార్వతిముఖపద్మాన్నుండి ఉత్తమ జ్ఞానమార్గాన్ని విని లోకపూజ్యుడైన హిమవంతుడు మళ్ళీ యోగంలో ఆసక్తుడైనాడు.

**ప్రదదౌ చ మహేశాయ పార్వతీం భాగ్యగౌరవాత్ ।**
**నియోగాద్బ్రహ్మణః సాధ్వీం దేవానాఞ్చైవ సన్నిధౌ ॥ 311 ॥**

ఆ హిమవంతుడు అదృష్టంవల్ల బ్రహ్మ ఆజ్ఞవల్ల పార్వతిని దేవతలసన్నిధిలో మహేశ్వరునికి కన్యాదానం చేసినాడు.

**ఇమం యః పఠతేఽధ్యాయం దేవ్యా మాహాత్మ్య కీర్తనమ్ ।**
**శివస్య సన్నిధౌ భక్త్యా శుచిస్తద్భావభావితః ॥ 312 ॥**

**సర్వపాపవినిర్ముక్తో దివ్యయోగసమన్వితః ।**
**ఉల్లంఘ్య బ్రహ్మణో లోకం దేవ్యాః స్థానమవాప్నుయాత్ ॥ 313 ॥**

దేవీ మాహాత్మ్యాన్ని వర్ణించే ఈ అధ్యాయాన్ని శుచియై శివసన్నిధానంలో ఆతనియందే భావాన్ని నిలిపి పఠించినవాడు, దివ్యమైన యోగవిద్యతో పాపాలన్నీ తొలగి బ్రహ్మలోకం దాటి దేవీస్థానాన్ని పొందుతాడు.

**యశ్చైతత్పఠతి స్తోత్రం బ్రాహ్మణానాం సమీపతః ।**
**సమాహితమనాః సోఽపి సర్వపాపైః ప్రముచ్యతే ॥ 314 ॥**

ఏకాగ్రతగల మనసుతో ఈస్తోత్రాన్ని బ్రాహ్మణుల సమీపంలో చదివినవాడు కూడ అన్ని పాపాలను తొలగించుకుంటాడు.

**నామ్నామష్టసహస్రం తు దేవ్యా యత్సముదీరితమ్ ।**
**జ్ఞాత్వాఽర్కమణ్డలగతామావాహ్య పరమేశ్వరీమ్ ॥ 315 ॥**

**అభ్యర్చ్య గన్ధపుష్పాద్యైర్భక్తియోగసమన్వితః ।**
**సంస్మరన్పరమం భావం దేవ్యా మాహేశ్వరం పరమ్ ॥ 316 ॥**

**అనన్యమానసో నిత్యం జపేదామరణాద్ద్విజః ।**
**సోఽన్తకాలే స్మృతిం లబ్ధ్వా పరంబ్రహ్మాధిగచ్ఛతి ॥ 317 ॥**

ఇంతకుముందు చెప్పిన దేవి అష్టోత్తరసహస్రనామాలు తెలుసుకొని సూర్యమండలంలోని పరమేశ్వరిని ఆవాహనచేసి భక్తియోగంతో చందనము పువ్వులు మొదలైన వాటితో పూజించి మహేశ్వర సంబంధమైన దేవి దివ్యభావాన్ని ఆమె ఉన్నతస్థానాన్ని స్మరిస్తూ ఇతర విషయాల్లో మనసు పోనీయక బ్రాహ్మణుడు మరణపర్యంతం జపించాలి. అవసానకాలంలో అతడు స్మృతికల్గి పరబ్రహ్మను చేరుకుంటాడు.

**అథవా జాయతే విప్రో బ్రాహ్మణస్య శుచౌ కులే ।**
**పూర్వసంస్కారమాహాత్మ్యాత్ బ్రహ్మవిద్యామవాప్నుయాత్ ॥ 318 ॥**

లేదా నిర్మలమైన బ్రాహ్మణవంశంలో జన్మించి పూర్వజన్మసంస్కారంవల్ల బ్రహ్మవిద్యను పొందగలడు.

**సంప్రాప్య యోగం పరమం దివ్యం తత్పారమేశ్వరమ్ ।**
**శాంతః సుసంయతో భూత్వా శివసాయుజ్యమాప్నుయాత్ ॥ 319 ॥**

ఉత్తమం, దివ్యం, పరమేశ్వరసంబంధి అగు యోగవిద్యను పొంది శాంతుడై ఆత్మనిగ్రహం కల్గి చివరకు శివసాయుజ్యాన్ని పొందగలడు.

**ప్రత్యేకం చాథ నామాని జుహుయాత్సవనత్రయమ్ ।**
**మహామారికృతైర్దోషైః గ్రహదోషైశ్చ ముచ్యతే ॥ 320 ॥**

మూడు సంధ్యల్లో ప్రత్యేకనామాలతో హెూమం చేయాలి. దానివల్ల మహామారి వ్యాధి వల్ల కలిగే దోషాలనుండి గ్రహసంబంధ దోషాలనుండి కూడ విముక్తుడవుతాడు.

**జపేద్వాఽహరహర్నిత్యం సంవత్సరమతన్ద్రితః ।**
**శ్రీకామః పార్వతీం దేవీం పూజయిత్వా విధానతః ॥ 321 ॥**

ఒక సంవత్సరకాలం ప్రతిదినం ఏమరుపాటు లేకుండా ఈనామాలను జపించటమైనా చేయాలి. సంపదను కోరేవారు పార్వతిని పద్ధతిప్రకారం పూజించి జపించాలి.

**సంపూజ్య పార్శ్వతః శమ్భుం త్రినేత్రం భక్తిసంయుతః ।**
**లభతే మహతీం లక్ష్మీం మహాదేవప్రసాదతః ॥ 322 ॥**

ఆ దేవి ప్రక్కన త్రినేత్రుడైన శివుని భక్తితో పూజించి ఆ మహాదేవుని అనుగ్రహంవల్ల గొప్ప సంపదను పొందగలడు.

**తస్మాత్సర్వప్రయత్నేన జప్తవ్యం హి ద్విజాతిభిః ।**
**సర్వపాపాపనోదార్థం దేవ్యా నామసహస్రకమ్ ॥ 323 ॥**

అందువల్ల అన్ని విధాలైన ప్రయత్నాలతో పాపాలను తొలగించుకోవటానికి బ్రాహ్మణులు దేవి వేయి నామాలు జపించాలి.

**సూత ఉవాచ :**–సూతుడిట్లా పలికాడు

**ప్రసఙ్గాత్కథితం విప్రా దేవ్యా మాహాత్మ్యముత్తమమ్ ।**
**అతః పరం ప్రజాసర్గం భృగ్వాదీనాం నిబోధత ॥ 324 ॥**

బ్రాహ్మణులారా! గొప్పదైన దేవీ మాహాత్మ్యం ప్రసంగవశంగా చెప్పాను. ఆ తర్వాత భృగువు మొదలైన వారి ప్రజాసృష్టి క్రమాన్ని చెబుతాను. తెలుసుకొనండి

**ఇతి శ్రీకూర్మపురాణే దేవీ మాహాత్మ్యే ద్వాదశోఽధ్యాయః ॥ 12 ॥**

శ్రీకూర్మపురాణంలో దేవీమాహాత్మ్యం అనే పన్నెండవ అధ్యాయం ॥12॥



## త్రయోదశోఽధ్యాయః - పదమూడవ అధ్యాయం

## దక్షకన్యా ఖ్యాతి వంశవర్ణనమ్ - దక్షకన్యయగు ఖ్యాతి వంశవర్ణనం

**సూత ఉవాచ :**-సూతుడు పలికాడు

**భృగోః ఖ్యాత్యాం సముత్పన్నా లక్ష్మీర్నారాయణప్రియా ।**
**దేవౌ ధాతృ విధాతారౌ మేరోర్జామాతరౌ శుభౌ ॥ 1 ॥**

భృగువుకు ఖ్యాతి అనే భార్యయందు నారాయణుని పత్ని లక్ష్మీదేవి జన్మించింది. ధాత, విధాత అనే దేవపురుషులిద్దరు మేరువుకు అల్లుండ్రైన కుమారులు కలిగినారు.

**ఆయతిర్నియతిశ్చైవ మేరోః కన్యే మహాత్మనః ।**
**తయోర్ధాతృవిధాతృభ్యాం యౌ చ జాతౌ సుతావుభౌ ॥ 2 ॥**

మేరువు కుమార్తెలు ఆయతి, నియతి అనే వారికి ధాతవిధాతలవల్ల ఇద్దరు కుమారులు కలిగినారు.

**ప్రాణశ్చైవ మృకణ్డుశ్చ మార్కణ్డేయో మృకణ్డుతః ।**
**తథా వేదశిరా నామ ప్రాణస్య ద్యుతిమాన్సుతః ॥ 3 ॥**

ప్రాణుడు, మృకండువని ఆ కుమారుల పేర్లు. వారిలో మృకండువువల్ల మార్కండేయుడు, ప్రాణునికి వేదశిరసుడు అనే తేజస్వియైన పుత్రుడు జన్మించినాడు.

**మరీచేరపి సమ్భూతిః పౌర్ణమాసమసూయత ।**
**కన్యా చతుష్టయం చైవ సర్వలక్షణసంయుతమ్ ॥ 4 ॥**

సంభూతి మరీచివల్ల పౌర్ణమాసుని పుత్రునిగా పొందినది. మరో నల్గురు మంచి లక్షణాలున్న కూతుళ్ళను కూడ పొందినది.

**తుష్టిర్జ్యేష్ఠా తథా వృష్టిః కృష్టిశ్చాపచితిస్తథా ।**
**విరజాః పర్వతశ్చైవ పౌర్ణమాసస్య తౌ సుతౌ ॥ 5 ॥**

వారిలో జ్యేష్ఠురాలు తుష్టి. తర్వాత వరుసగా వృష్టి, కృష్టి, అపచితి అనే వారు. పౌర్ణమాసునికి విరజుడు, పర్వతుడు అనే ఇద్దరు కుమారు లుదయించినారు.

**క్షమా తు సుషువే పుత్రాన్పులహస్య ప్రజాపతేః ।**
**కర్దమం చ వరీయాంసం సహిష్ణుం మునిసత్తమమ్ ॥ 6 ॥**

ప్రజాపతి అయిన పులహునికి క్షమ అనే భార్యవల్ల కర్దముడు అనే పెద్దకుమారుడు జన్మించినాడు. ఇతడు సహనశీలుడు మునిశ్రేష్ఠుడు.

**తథైవ చ కనీయాంసం తపోనిర్ధూతకల్మషమ్ ।**
**అనసూయా తథైవాత్రేర్జజ్ఞే పుత్రానకల్మషాన్ ॥ 7 ॥**

అట్లే తపసుచే పాపాలన్నీ తొలగించుకున్న చిన్న కుమారుని పొందినాడు. అత్రి మునివల్ల అనసూయాదేవి పుణ్యాత్ములైన పుత్రులను కన్నది.

**సోమం దుర్వాససఞ్చైవ దత్తాత్రేయం చ యోగినమ్ ।**
**స్మృతిశ్చాఙ్గిరసః పుత్రీ జజ్ఞే లక్షణసంయుతా ॥ 8 ॥**

వారు చంద్రుడు, దుర్వాసుడు, దత్తాత్రేయయోగి అనేవారు. అంగిరసుని కూతురు స్మృతి మంచి లక్షణవతి.

**సినీవాలిం కుహూం చైవ రాకామనుమతీమపి ।**
**ప్రీత్యాం పులస్త్యో భగవాన్ దమ్భోజిమసృజత్ప్రభుః ॥ 9 ॥**

సినీవాలి, కుహువు, రాక, అనుమతి అనే కుమార్తెలను పొందింది. పులస్త్యుడు ప్రీతియందు దంభోజి అనే కుమారుని పొందినాడు.

**పూర్వజన్మని సోఽగస్త్యః స్మృతః స్వాయమ్భువేఽన్తరే ।**
**దేవబాహుస్తథా కన్యా ద్వితీయా నామ నామతః ॥ 10 ॥**

అతడు పూర్వజన్మలో స్వాయంభువు మన్వంతరమందు అగస్త్యుడుగా పేర్కొనబడినాడు. తర్వాత దేవబాహువనే కన్య రెండవసంతానంగా జన్మించింది.

**పుత్రాణాం షష్టిసాహస్రం సన్తతిః సుషువే క్రతోః ।**
**తే చోర్ధ్వరేతసః సర్వే వాలఖిల్యా ఇతి స్మృతాః ॥ 11 ॥**

క్రతువువల్ల సంతతి అనే వనిత అరవైవేల పుత్రులను పొందినది, వారందరు ఊర్ధ్వరేతస్కులుగా వాలఖిల్యులు అనే పేర ప్రసిద్ధులు.

**వసిష్ఠశ్చ తథోర్జాయాం సప్త పుత్రానజీజనత్ ।**
**కన్యాఞ్చ పుణ్డరీకాక్షాం సర్వశోభాసమన్వితామ్ ॥ 12 ॥**

వసిష్ఠుడు ఊర్జయందు ఏడుగురు కుమారులను పొందాడు. అట్లే పద్మనేత్ర, సర్వప్రకాశయుతఅయిన కూతురును పొందాడు.

**రజోమాత్రోర్ధ్వబాహుశ్చ సవనశ్చానగస్తథా ।**
**సుతపాః శుక్ర ఇత్యేతే సప్త పుత్రా మహౌజసః ॥ 13 ॥**

రజస్సు, మాత్రుడు, ఊర్ధ్వబాహువు, సవనుడు, అనగుడు, సుతపుడు, శుక్రుడు అనేవారు గొప్పబలవంతులైన కుమారులు ఏడుగురు.

**యోఽసౌ రుద్రాత్మకో వహ్నిర్బ్రహ్మణస్తనయో ద్విజాః! ।**
**స్వాహా తస్మాత్సుతాన్లేభే త్రీనుదారాన్మహౌజసః ॥ 14 ॥**

ద్విజులారా! బ్రహ్మకుమారుడు రుద్రరూపుడు అయిన అగ్నివలన స్వాహాదేవి బలశాలురు ఉదారులైన ముగ్గురు పుత్రులను పొందినది.

**పావకః పవమానశ్చ శుచిరగ్నిశ్చ రూపతః ।**
**నిర్మథ్యః పవమానః స్యాద్వైద్యుతః పావకః స్మృతః ॥ 15 ॥**

పావకుడు పవమానుడు శుచి అని రూపభేదాల్ని బట్టి అగ్ని మూడు విధాలుగా ఉంటుంది. అరణి ద్వారా మథింపదగినది పవమానం. విద్యుత్సంబంధం కలది పావకము.

**యశ్చాసౌ తపతే సూర్యే శుచిరగ్నిస్త్వసౌ స్మృతః ।**
**తేషాన్తు సన్తతావన్యే చత్వారింశచ్చ పఞ్చ చ ॥ 16 ॥**

సూర్యమండలంలో ఉండి మండుతున్న అగ్ని శుచి అనబడినది. వారిసంతతిలో మరో నలుబది ఐదుగురున్నారు.

**పవమానః పావకశ్చ శుచిస్తేషాం పితా చ యః ।**
**ఏతే చైకోనపఞ్చాశద్వహ్నయః పరికీర్తితాః ॥ 17 ॥**

పవమానుడు పావకుడు శుచి అనే మూడగ్నులు వారితండ్రితో కూడ నలబైఐదుగురు చేరగా మొత్తం నలబై తొమ్మిదగ్నులుగా పేర్కొనబడినవి.

**సర్వే తపస్వినః ప్రోక్తాః సర్వే యజ్ఞేషు భాగినః ।**
**రుద్రాత్మకాః స్మృతాస్సర్వే త్రిపుణ్డ్రాఙ్కితమస్తకాః ॥ 18 ॥**

వీరందరు తాపసులు, యజ్ఞాల్లో భాగస్థులు, రుద్రస్వరూపులుగా నుదుట మూడు పుండ్రరేఖలు కలవారు.

**అయజ్వానశ్చ యజ్వానః పితరో బ్రహ్మణః సుతాః ।**
**అగ్నిష్వాత్తా బర్హిషదో ద్విధా తేషాం వ్యవస్థితిః ॥ 19 ॥**

యజ్ఞం చేయనివారు యజ్ఞకర్తలు అయిన బ్రహ్మకుమారులు పితృదేవతలున్నారు. వారు అగ్నిష్వాత్తులు, బర్హిషదులని రెండు విధాలు.

**తేభ్యః స్వధా సుతాం జజ్ఞే మేనాం వై ధారిణీం తథా ।**
**తే ఉభే బ్రహ్మవాదిన్యౌ యోగిన్యౌ మునిసత్తమాః! ॥ 20 ॥**

వారివల్ల స్వధ అనే పత్ని మేన, ధారిణి అనే పుత్రికలను పొందింది. ఓమునిశ్రేష్ఠులారా! ఆ ఇరువురు యోగాన్ని అవలంబించినవారు, బ్రహ్మవాదినులు.

**అసూత మేనా మైనాకం క్రౌఞ్చం తస్యానుజం తథా ।**
**గఙ్గా హిమవతో జజ్ఞే సర్వలోకైకపావనీ ॥ 21 ॥**

వారిలో మేన మైనాకుని, అతని తమ్ముడు క్రౌంచపర్వతాన్ని పుత్రులుగా పొందినది. హిమవంతుని నుండి సర్వలోకాలను పవిత్రం చేసే ఒకే ఒక కూతురు గంగానది జన్మించినది.

**స్వయోగాగ్నిబలాద్దేవీం పుత్రీం లేభే మహేశ్వరీమ్ ।**
**యథావత్కథితం పూర్వం దేవ్యా మాహాత్మ్యముత్తమమ్ ॥ 22 ॥**

ఆ మేనాదేవి తన యోగాగ్ని బలంవల్ల మహేశ్వరీ దేవిని పుత్రికగా పొందినది. ఆ దేవి మాహాత్మ్యం ఉన్నది ఉన్నట్లు మొదటనే వివరించినాను.

**ధారిణీ మేరురాజస్య పత్నీ పద్మసమాననా ।**
**దేవౌ ధాతృవిధాతారౌ మేరోర్జామాతరావుభౌ ॥ 23 ॥**

పద్మానన అయిన ధారిణి మేరుపర్వతరాజు భార్య. ధాత, విధాత అనేవారు మేరుపర్వతం అల్లుండ్రు

**ఏషా దక్షస్య కన్యానాం మయాఽపత్యానుసన్తతిః ।**
**వ్యాఖ్యాతా భవతాం సద్యో మనోః సృష్టిం నిబోధత ॥ 24 ॥**

దక్షుని పుత్రికల సంతానక్రమం ఈవిధంగా మీకు వివరించినాను. ఇక మనువు సృష్టిక్రమాన్ని వివరిస్తాను. తెలుసుకొనండి.

**ఇతి శ్రీకూర్మపురాణే దక్షకన్యాఖ్యాతివంశవర్ణనే త్రయోదశోఽధ్యాయః ॥ 13 ॥**

శ్రీకూర్మపురాణంలో దక్షకన్యాఖ్యాతివంశవర్ణన మనే పదమూడవ అధ్యాయం ॥ 13 ॥



## **చతుర్దశోఽధ్యాయః** – పద్నాల్గవ అధ్యాయం

## **స్వాయంభువమనురాజవంశానుకీర్తనం**– స్వాయంభువమనురాజవంశానుకీర్తనం

**సూత ఉవాచ:**– సూతుడు పలికాడు

**ప్రియవ్రతోత్తానపాదౌ మనోః స్వాయమ్భువస్య తు ।**
**ధర్మజ్ఞౌ తౌ మహావీర్యౌ శతరూపా వ్యజీజనత్ ॥ 1 ॥**

స్వాయంభువ మనువునకు శతరూపయందు ధర్మము నెరిగినవారు, మహావీరులైన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడనే ఇద్దరు పుత్రులు కలిగినారు.

**తతస్తూత్తానపాదస్య ధ్రువో నామ సుతోఽభవత్ ।**
**భక్త్యా నారాయణే దేవే ప్రాప్తవాన్ స్థానముత్తమమ్ ॥ 2 ॥**

ఉత్తానపాదునకు ధ్రువుడనే పుత్రుడుదయించినాడు. అతడు భగవంతుడైన నారాయణునియందు భక్తిగలవాడై ఉన్నతమైన స్థానాన్ని పొందాడు.

**ధ్రువాచ్ఛిష్టిశ్చ భావ్యశ్చ భావ్యాచ్ఛమ్భుర్వ్యజాయత ।**
**శిష్టేరాధత్త సుచ్ఛాయా పఞ్చ పుత్రానకల్మషాన్ ॥ 3 ॥**

ఆ ధ్రువునివల్ల శిష్టి, భావ్యుడు అనేవారు జన్మించగా, భావ్యునికి శంభువు జన్మించినాడు. శిష్టివల్ల అతని భార్య సుచ్ఛాయ కల్మషరహితులైన అయిదుగురు పుత్రులను పొందినది.

**వసిష్ఠవచనాద్దేవీ తపస్తప్త్వా సుదుశ్చరమ్ ।**
**ఆరాధ్య పురుషం విష్ణుం సాలగ్రామే జనార్దనమ్ ॥ 4 ॥**

**రిపుం రిపుఞ్జయం విప్రం కపిలం వృషతేజసమ్ ।**
**నారాయణపరాన్శుద్ధాన్ స్వధర్మపరిపాలకాన్ ॥ 5 ॥**

వసిష్ఠుని ఆదేశంతో కష్టసాధ్యమైన తపసుచేసి చేసి సాలగ్రామక్షేత్రంలో జనార్దనుడైన విష్ణువును పూజించి రిపువు, రిపుంజయుడు, విప్రుడు, కపిలుడు, వృషతేజసుడు అనే పుత్రులను పొందినది. వారు విష్ణుభక్తులు, నిర్మలురు, స్వధర్మాన్ని పాలించేవారు.

**రిపోరాధత్త మహిషీ చాక్షుషం సర్వతేజసమ్ ।**
**సాఽజీజనత్పుష్కరిణ్యాం సురూపం చాక్షుషం మనుమ్ ॥ 6 ॥**

రిపువు వల్ల అతనిభార్య సంపూర్ణమైన తేజస్సు రూపము కల చాక్షుష మనువును పుష్కరిణి క్షేత్రంలో పుత్రునిగా పొందినది.

**ప్రజాపతేరాత్మజాయాం వీరణస్య మహాత్మనః ।**
**మనోరజాయన్త దశ సుతాస్తే సుమహౌజసః ॥ 7 ॥**

మహాత్ముడైన వీరణ మనువునకు ప్రజాపతి కూతురి యందు గొప్ప బలవంతులైన పదిమంది కుమారులు కలిగినారు.

**కన్యాయాం సుమహావీర్యో వైరాజస్య ప్రజాపతేః ।**
**ఊరుః పురః శతద్యుమ్న స్తపస్వీ సత్యవాక్ఛుచిః ॥ 8 ॥**

**అగ్నిష్టురతిరాత్రశ్చ సుద్యుమ్నశ్చాభిమన్యుకః ।**
**ఊరోరజనయత్పుత్రాన్ షడాగ్నేయీ మహాబలాన్ ॥ 9 ॥**

వారు ఊరువు, పురువు, శతద్యుమ్నుడు, తపస్వి, సత్యవాక్కు, శుచి, అగ్నిష్టుత్తు, అతిరాత్రుడు, సుద్యుమ్నుడు, అభిమన్యుడు అనేవారు. ఆగ్నేయి అను ఊరువు భార్య గొప్ప బలవంతులైన ఆరుగురు కుమారులను కన్నది.

**అఙ్గం సుమనసం ఖ్యాతిం క్రతుమాఙ్గిరసం శివమ్ ।**
**అఙ్గాద్వేనోఽభవత్పశ్చాద్వైన్యో వేనాదజాయత ॥ 10 ॥**

వారు అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, శివుడు అనేవారు. అంగునివల్ల వేనుడు, అతనికి వైన్యుడనేవాడు జన్మించినాడు.

**యోఽసౌ పృథురితి ఖ్యాతః ప్రజాపాలో మహాబలః ।**
**యేన దుగ్ధా మహీ పూర్వం ప్రజానాం హితకామ్యయా ॥ 11 ॥**

ఈ వేనపుత్రునకే పృథువు అనే పేరు ప్రసిద్ధమైనది. ఇతడు గొప్ప బలం కల్గి ప్రజాపాలకుడయి ప్రజల మేలు కోరి పూర్వం భూమిని పితికినాడు.

**నియోగాద్బ్రహ్మణః సార్ధం దేవేన్ద్రేణ మహౌజసా ।**
**వేనపుత్రస్య వితతే పురా పైతామహే మఖే ॥ 12 ॥**

**సూతః పౌరాణికో జజ్ఞే మాయారూపః స్వయం హరిః ।**
**ప్రవక్తా సర్వశాస్త్రాణాం ధర్మజ్ఞో గురువత్సలః ॥ 13 ॥**

బ్రహ్మశాసనంవల్ల గొప్ప బలవంతుడైన ఇంద్రునితోపాటుగా వేనపుత్రుడు పృథువు యజ్ఞమును నిర్వహించినారు. అందులో సూతుడనే పౌరాణికుడుగా మాయారూపి అయిన విష్ణువే స్వయంగా అవతరించినాడు. అతడన్ని శాస్త్రాలను బోధించగలవాడు. ధర్మం తెలిసినవాడు, పెద్దలయెడ ఆదరం కలవాడు.

**తం మాం విత్త మునిశ్రేష్ఠాః పూర్వోద్భూతం సనాతనమ్ ।**
**అస్మిన్మన్వన్తరే వ్యాసః కృష్ణద్వైపాయనః స్వయమ్ ॥ 14 ॥**

ఓ మునిశ్రేష్ఠులారా! పూర్వం అవతరించిన అతిపురాతనుడనైన నేనే ఆ సూతపౌరాణికుడను. ఈమన్వంతరంలో కృష్ణద్వైపాయనుడైన వ్యాసుడు పురాణపురుషుడైన హరియే.

**శ్రావయామాస మాం ప్రీత్యా పురాణం పురుషో హరిః ।**
**మదన్వయే తు యే సూతాః సంభూతా వేదవర్జితాః ॥ 15 ॥**

**తేషాం పురాణవక్తృత్వం వృత్తిరాసీదజాజ్ఞయా ।**
**స చ వైన్యః పృథుర్ధీమాన్సత్యసన్ధో జితేంద్రియః ॥ 16 ॥**

స్వయంగా ప్రేమతో నాకు ఆ హరియే పురాణకథలు వినిపించినాడు. నావంశంలో వేదాధికారంలేని సూతవంశజులకు బ్రహ్మదేవుని ఆజ్ఞవల్ల పురాణాలు ప్రవచించటమే వృత్తి అయినది. ముందు చెప్పిన వేనపుత్రుడు పృథువు బుద్ధిమంతుడు, సత్యవ్రతుడు, జితేంద్రియుడు.

**సార్వభౌమో మహాతేజాః స్వధర్మపరిపాలకః ।**
**తస్య బాల్యాత్ ప్రభృత్యేవ భక్తిర్నారాయణేఽభవత్ ॥ 17 ॥**

ఆ పృథువు సార్వభౌముడు గొప్పతేజస్వి. స్వధర్మాన్ని చక్కగా పాలించేవాడు. అతనికి చిన్నతనంనుండే నారాయణునియందు భక్తి కలిగినది.

**గోవర్ధనగిరిం ప్రాప్తస్తపస్తేపే జితేన్ద్రియః ।**
**తపసా భగవాన్ప్రీతః శఙ్ఖచక్రగదాధరః ॥ 18 ॥**

అతడు గోవర్ధనపర్వతాన్ని చేరి జితేంద్రియుడై తపమాచరించాడు. ఆ తపసుకు శంఖచక్రధారి భగవంతుడైన విష్ణువు సంతోషించినాడు.

**ఆగత్య దేవో రాజానం ప్రాహ దామోదరః స్వయమ్ ।**
**ధార్మికౌ రూపసమ్పన్నౌ సర్వశస్త్రభృతాం వరౌ ॥ 19 ॥**

**మత్ప్రసాదాదసన్దిగ్ధౌ పుత్రౌ తవ భవిష్యతః ।**
**ఏవముక్త్వా హృషీకేశః స్వకీయాం ప్రకృతిం గతః ॥ 20 ॥**

స్వయంగా దామోదరుడు ఆ రాజువద్దకు వచ్చి ఇట్లన్నాడు. ధర్మాన్ని పాలించేవారు, సౌందర్యవంతులు, ఆయుధధారుల్లో శ్రేష్ఠులు నా అనుగ్రహంవల్ల నీకు ఇద్దరు కుమారులు కలుగుతారు. ఈవిధంగా చెప్పి ఆ దామోదరుడు తన నివాసానికి వెళ్ళాడు.

**వైన్యోఽపి వేదవిధినా నిశ్చలాం భక్తిముద్వహన్ ।**
**సోఽపాలయత్స్వకం రాజ్యం చిన్తయన్మధుసూదనమ్ ॥ 21 ॥**

వేనపుత్రుడు పృథువు కూడా వేదవిహితపద్ధతిలో నిశ్చలభక్తికల్గి మధుసూదనుడైన విష్ణువును ధ్యానిస్తూ రాజ్యపాలన కావించాడు.

**అచిరాదేవ తన్వఙ్గీ భార్యా తస్య శుచిస్మితా ।**
**శిఖణ్డినం హవిర్ధానమన్తర్ధానాద్వ్యజాయత ॥ 22 ॥**

కొద్దికాలానికి తన్వంగి స్వచ్ఛమైన చిరునవ్వుగల అన్తర్ధానుని భార్య అగ్నిహోత్రరూపుడైన శిఖండిని, హవిర్ధానుని పుత్రునిగా పొందినది.

**శిఖణ్డినోఽభవత్పుత్రః సుశీల ఇతి విశ్రుతః ।**
**ధార్మికో రూపసమ్పన్నో వేదవేదాఙ్గపారగః ॥ 23 ॥**

ఆ శిఖండికి సుశీలుడనే పుత్రుడు కలిగాడు. అతడు ధార్మికుడు, సుందరుడు, వేదవేదాంగాల పారము నెరిగినవాడు.

**సోఽధీత్య విధివద్వేదాన్ ధర్మేణ తపసి స్థితః ।**
**మతిం చక్రే భాగ్యయోగాత్సంన్యాసం ప్రతి ధర్మవిత్ ॥ 24 ॥**

అతడు శాస్త్రప్రకారం వేదాలనభ్యసించి ధర్మమార్గంలో తపసుచేయ సంకల్పించాడు. అదృష్టవశంగా ధర్మవిదుడై సన్న్యాసంలో బుద్ధిని నిలిపాడు.

**స కృత్వా తీర్థ సంసేవాం స్వాధ్యాయే తపసి స్థితః ।**
**జగామ హిమవత్పృష్ఠం కదాచిత్సిద్ధసేవితమ్ ॥ 25 ॥**

ఆ సుశీలుడు తీర్థయాత్రలు చేసి వేదాధ్యయనంలో, తపస్సులో నిష్ఠ కలవాడై ఒకసారి సిద్ధులు సేవిస్తున్న హిమాలయశిఖరాన్ని చేరాడు.

**తత్ర ధర్మవనం నామ ధర్మసిద్ధిప్రదం వనమ్ ।**
**అపశ్యద్యోగినాం గమ్యమగమ్యం బ్రహ్మవిద్విషామ్ ॥ 26 ॥**

అక్కడ ధర్మసిద్ధిని పొందించే ధర్మవనాన్ని చూశాడు. అది యోగులు పొందదగినది. వేదనిందకులకు కనిపించనిది.

**తత్ర మన్దాకినీ నామ సుపుణ్యా విమలా నదీ ।**
**పద్మోత్పలవనోపేతా సిద్ధాశ్రమవిభూషితా ॥ 27 ॥**

అక్కడ పుణ్యవతి నిర్మలమైన కమలములు, కలువలతో కూడినది, సిద్ధాశ్రమాలచే అలంకృత అయిన మందాకిని అనే నదిని చూశాడు.

**స తస్యా దక్షిణే తీరే మునీన్ద్రైర్యోగిభిర్యుతమ్ ।**
**సుపుణ్యమాశ్రమం రమ్యమపశ్యత్ప్రీతిసంయుతః ॥ 28 ॥**

అతడు మందాకిని దక్షిణతీరంలో మునులు యోగులతో పుణ్యప్రదమైన అందమైన ఆశ్రమాన్ని ప్రీతితో చూచాడు.

**మన్దాకినీ జలే స్నాత్వా సన్తర్ప్య పితృదేవతాః ।**
**అర్చయిత్వా మహాదేవం పుష్పైః పద్మోత్పలాదిభిః ॥ 29 ॥**

**ధ్యాత్వాऽర్కసంస్థమీశానం శిరస్యాధాయ చాఞ్జలిమ్ ।**
**సంప్రేక్షమాణో భాస్వన్తం తుష్టావ పరమేశ్వరమ్ ॥ 30 ॥**

మందాకినీ నదిలో స్నానం చేసి పితృదేవతలకు తర్పణాలు వదిలి తామర కలువ మొదలైన పుష్పాలతో మహాదేవుని పూజించి సూర్యమండలంలోని దేవుని ధ్యానించి దోసిలొగ్గి సూర్యుని వైపు చూస్తూ పరమేశ్వరుని స్తోత్రం చేశాడు.

**రుద్రాధ్యాయేన గిరిశం రుద్రస్య చరితేన చ ।**
**అన్యైశ్చ వివిధైః స్తోత్రైః శామ్భవైర్వేదసమ్భవైః ॥ 31 ॥**

**అథాస్మిన్నన్తరేऽపశ్యత్సమాయాన్తం మహామునిమ్ ।**
**శ్వేతాశ్వతరనామానం మహాపాశుపతోత్తమమ్ ॥ 32 ॥**

వేదంలోని రుద్రాధ్యాయంతో రుద్రుని చరిత్ర పఠనంతో అనేక విధాలైన ఇతరస్తోత్రాలతో వేదంలోని శివసంబంధ మంత్రాలతో స్తుతించాడు. ఇంతలో తన వద్దకు వస్తున్న శ్వేతాశ్వతరుడనే పాశుపత శ్రేష్ఠుడైన మహామునిని ఆ సుశీలుడు చూశాడు.

**భస్మసన్దిగ్ధసర్వాఙ్గం కౌపీనాచ్ఛాదనాన్వితమ్ ।**
**తపసా కర్శితాత్మానం శుక్లయజ్ఞోపవీతినమ్ ॥ 33 ॥**

**సమాప్య సంస్తవం శంభోరానన్దాస్రావిలేక్షణః ।**
**వవన్దే శిరసా పాదౌ ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్ ॥ 34 ॥**

ఆ శ్వేతాశ్వతరుడు సర్వాంగాలు భస్మంతో అలంకరించుకున్నాడు. కౌపీనం, ఉత్తరీయం ధరించాడు. తపసుతో శరీరం కృశించింది. తెల్లని యజ్ఞోపవీతాన్ని ధరించినాడు. సుశీలుడు శివస్తోత్రం ముగించి ఆనందాశ్రువులు కలవాడై అతని పాదాలకు శిరసువంచి ప్రణమిల్లినాడు.

**ధన్యోऽస్మ్యనుగృహీతోऽస్మి యన్మే సాక్షాన్మునీశ్వర! ।**
**యోగీశ్వరోऽద్య భగవాన్ దృష్టో యోగవిదాం వరః ॥ 35 ॥**

**అహో మే సుమహద్భాగ్యం తపాంసి సఫలాని మే ।**
**కిం కరిష్యామి శిష్యోऽహం తవ మాం పాలయానఘ ॥ 36 ॥**

చేతులు జోడించి ఇట్లా పలికాడు. "ఓమునీశ్వరా! యోగీశ్వరుడవు.యోగవిదుల్లో శ్రేష్ఠుడవు. భగవంతుడవగు నీవు సాక్షాత్కరించటంతో నేను ధన్యుడనైనాను. అనుగ్రహింపబడినాను. నా అదృష్టమెంత గొప్పది. నా తపస్సు ఫలించినది. నీ శిష్యుడను. ఏమి చేయవలెనో చెప్పి ఓపుణ్యాత్ముడా! నన్ను రక్షించు".

**సోऽనుగృహ్యాథ రాజానం సుశీలం శీలసంయుతమ్ ।**
**శిష్యత్వే ప్రతిజగ్రాహ తపసా క్షీణకల్మషమ్ ॥ 37 ॥**

ఆ శ్వేతాశ్వతర మహాముని శీలవంతుడైన సుశీలు నను(గహించి తపసుతో పాపాలు నశించిన అతనిని తనశిష్యునిగా స్వీకరించాడు.

**సాన్న్యాసికం విధిం కృత్స్నం కారయిత్వా విచక్షణః ।**
**దదౌ తదైశ్వరం జ్ఞానం స్వశాఖావిహిత(వతమ్ ॥ 38 ॥**

సంన్యాసానికి సంబంధించిన శా(స్త్రవిధిని సంపూర్ణంగా జరిపించి వివేకవంతుడైన మహాముని తమ శాఖలో విధింపబడిన (వతనియమాలుకల ఈశ్వరవిషయక జ్ఞానాన్ని అతనికుపదేశించాడు.

**అశేషం వేదసారం తత్పశుపాశవిమోచనమ్ ।**
**అన్త్యా(శమమితి ఖ్యాతం (బహ్మాదిభిరనుష్ఠితమ్ ॥ 39 ॥**

ఆ జ్ఞానమంతా వేదాల్లోని సారభూతం, (పాణులబంధరూపాలైన పాశాలను విడిపించేది. (బహ్మాదులు ఆచరించిన చివరి ఆ(శమంగా (పసిద్ధమైనది.

**ఉవాచ శిష్యాన్సం(పేక్ష్య యే తదా(శమవాసినః ।**
**(బాహ్మణాః క్ష(త్రియా వైశ్యా (బహ్మచర్యపరాయణాః॥ 40 ॥**

ఆ ముని ఆ(శమంలో నివసించే (బాహ్మణ క్ష(త్రియ వైశ్యులు (బహ్మచర్య(వతాన్ని పాటించే శిష్యులను చూచి ఇట్లన్నాడు.

**మయా (పవర్తితాం శాఖామధీత్యైవేహ యోగినః ।**
**సమాసతే మహాదేవం ధ్యాయన్తో విశ్వమైశ్వరమ్ ॥ 41 ॥**

ఇక్కడ యోగులు నేను (పవర్తింపచేసిన శాఖనధ్యయనంచేసి ఈశ్వరనిర్మితమైన విశ్వాన్ని ధ్యానిస్తూ మహాదేవుడైన శివుని సేవిస్తున్నారు.

**ఇహ దేవో మహాదేవో రమమాణః సహోమయా ।**
**అధ్యాస్తే భగవానీశో భక్తానామనుకమ్పయా ॥ 42 ॥**

ఇక్కడ మహాదేవుడైన శివుడు పార్వతీదేవితో కూడ విహరిస్తూ భక్తులయందుండే దయాగుణంతో నివసించినాడు.

**ఇహాశేషజగద్ధాతా పురా నారాయణః స్వయమ్ ।**
**ఆరాధయన్మహాదేవం లోకానాం హితకామ్యయా ॥ 43 ॥**

**ఇహైనం దేవమీశానం దేవానామపి దైవతమ్ ।**
**ఆరాధ్య మహతీం సిద్ధిం లేభిరే దేవదానవాః ॥ 44 ॥**

ఈ (పదేశంలోనే పూర్వం సర్వలోకాల సృష్టికర్త నారాయణుడు స్వయంగా లోకక్షేమంకోరి మహాదేవుని పూజించినాడు. ఇక్కడ దేవతలు కూడ దేవదేవుడైన ఈశానుని ఆరాధించి, దేవతలు రాక్షసులు కూడ గొప్ప సిద్ధిని పొందినారు.

**ఇహైవ మునయః సర్వే మరీచ్యాద్యా మహేశ్వరమ్ ।**
**దృష్ట్వా తపోబలాత్ జ్ఞానం లేభిరే సార్వకాలికమ్ ॥ 45 ॥**

ఇక్కడే మరీచి మొదలైన మునులందరు మహేశ్వరుని దర్శించి తమ తపోబలంవల్ల సర్వకాలీనమైన జ్ఞానాన్ని పొందినారు.

**తస్మాత్త్వమపి రాజేన్ద్ర తపోయోగసమన్వితః ।**
**తిష్ఠ నిత్యం మయా సార్ధం తతః సిద్ధిమవాప్స్యసి ॥ 46 ॥**

ఓరాజా! అందువల్ల నీవు కూడ తపోయోగాలు కలవాడవై నాతో కూడ ఎల్లపుడు ఉండు, దానివల్ల నీవు సిద్ధిని పొందగలవు.

**ఏవమాభాష్య విప్రేన్ద్రో దేవం ధ్యాత్వా పినాకినమ్ ।**
**ఆచచక్షే మహామన్త్రం యథావత్సర్వసిద్ధయే ॥ 47 ॥**

ఆ బ్రాహ్మణోత్తము డిట్లా పల్కి భగవంతుడగు శివుని ధ్యానించి, అతనికి సర్వసిద్ధులు కలగటానికి మహామంత్రాన్ని విధివిధానంగా ఉపదేశించాడు.

**సర్వపాపోపశమనం వేదసారం విముక్తిదమ్ ।**
**అగ్నిరిత్యాదికం పుణ్యమృషిభిః సంప్రవర్తితమ్ ॥ 48 ॥**

ఆ మంత్రం సర్వపాపాలను తొలగించేది. వేదాలసారభూతము. మోక్షాన్నిచ్చేది. అగ్నిః అనేది ఆదియందు కలది. ఋషులవల్ల ప్రవర్తింప చేయబడినది. పుణ్యప్రదము.

**సోఽపి తద్వచనాద్రాజా సుశీలః శ్రద్ధయాఽన్వితః ।**
**సాక్షాత్పాశుపతో భూత్వా వేదాభ్యాసరతోఽభవత్ ॥ 49 ॥**

ఆ రాజు సుశీలుడు అతని మాటల్లో శ్రద్ధకలవాడై, సాక్షాత్తు పాశుపతుడై, వేదాభ్యాసరతుడైనాడు.

**భస్మోద్ధూలితసర్వాఙ్గః కన్దమూలఫలాశనః ।**
**శాన్తో దాన్తో జితక్రోధః సన్న్యాసవిధిమాశ్రితః ॥ 50 ॥**

శరీరమంతా భస్మమలదుకొని కందమూలాలే ఆహారంగా తీసుకొంటూ శాంతుడై, ఇంద్రియాలనణచి, క్రోధాన్ని జయించి, సంన్యాసవిధి నాశ్రయించినాడు.

**హవిర్ధానస్తథాగ్నేయ్యాం జనయామాస వై సుతమ్ ।**
**ప్రాచీనబర్హిషం నామ్నా ధనుర్వేదస్య పారగమ్ ॥ 51 ॥**

హవిర్ధానుడు ఆగ్నేయి అనే భార్యయందు విలువిద్యలో పారగుడైన ప్రాచీనబర్హి అనే పేరుగల కుమారుని పొందినాడు.

**ప్రాచీనబర్హిర్భగవాన్ సర్వశస్త్రభృతాం వరః ।**
**సముద్రతనయాయాం వై దశపుత్రానజీజనత్ ॥ 52 ॥**

ఆయుధధారుల్లో శ్రేష్ఠుడు పూజ్యుడైన ప్రాచీనబర్హిషుడు సముద్ర తనయ అయిన భార్యయందు పదిమంది కుమారులను పొందినాడు.

**ప్రచేతసస్తే విఖ్యాతా రాజానః ప్రథితౌజసః ।**
**అధీతవన్తః స్వం వేదం నారాయణపరాయణాః ॥ 53 ॥**

ఆ కుమారులు బలంకల ప్రసిద్ధులైన రాజులుగా ప్రచేతసులు అని ప్రసిద్ధులైనారు. తమశాఖా వేదాధ్యయనంచేసి, నారాయణునియందు భక్తికలవారైనారు.

**దశభ్యస్తు ప్రచేతోభ్యో మారిషాయాం ప్రజాపతిః ।**
**దక్షో జజ్ఞే మహాభాగో యః పూర్వం బ్రహ్మణః సుతః ॥ 54 ॥**

ఆ పదిమంది ప్రచేతసులవల్ల మారిష అనే స్త్రీయందు పూర్వం బ్రహ్మకుమారునిగ నుండిన మహానుభావుడు దక్షప్రజాపతి జన్మించినాడు.

**స తు దక్షో మహేశేన రుద్రేణ సహ ధీమతా ।**
**కృత్వా వివాదం రుద్రేణ శప్తః ప్రాచేతసోఽభవత్ ॥ 55 ॥**

ఆ ప్రాచేతసుడైన దక్షుడు ధీమంతుడైన మహేశ్వరునితో వివాదం పెట్టుకొని శపింపబడి ప్రచేతసుల పుత్రుడైనాడు.

**సమాయాన్తం మహాదేవో దక్షం దేవ్యా గృహం హరః ।**
**దృష్ట్వా యథోచితాం పూజాం దక్షాయ ప్రదదౌ స్వయమ్ ॥ 56 ॥**

మహాదేవుడైన శివుడు తన దేవి యింటికి వస్తున్న దక్షప్రజాపతిని చూచి అతనికి తగిన సత్కారాన్ని స్వయంగా జరిపినాడు.

**తదా వై తమసావిష్టః సోఽధికాం బ్రహ్మణః సుతః ।**
**పూజామనర్హామన్విచ్ఛన్ జగామ కుపితో గృహమ్ ॥ 57 ॥**

అపుడు బ్రహ్మకుమారుడైన దక్షుడు క్రోధ మాక్రమించగా తనకు జరిగిన సత్కారం తగినట్టుగాలేదని భావించి తనయింటికి వెళ్ళిపోయినాడు.

**కదాచిత్స్వగృహం ప్రాప్తాం సతీం దక్షః సుదుర్మనాః ।**
**భర్త్రా సహ వినిన్ద్యైనాం భర్త్సయామాస వై రుషా ॥ 58 ॥**

**అన్యే జామాతరః శ్రేష్ఠా భర్తుస్తవ పినాకినః ।**
**త్వమప్యసత్సుతాఽస్మాకం గృహాద్గచ్ఛ యథాగతమ్ ॥ 59 ॥**

తరువాత ఒకపుడు తనయింటికి వచ్చిన పుత్రిక సతీదేవిని దక్షుడు కోపంతో భర్తతోకూడ ఆమెను నిందించి తూలనాడాడు. నీ భర్త శివునికంటే తక్కిన అల్లుళ్ళే శ్రేష్ఠులు. ఇంటినుండి వచ్చిన దారినే వెళ్ళు.

**తస్య తద్వాక్యమాకర్ణ్య సా దేవీ శంకరప్రియా ।**
**వినిన్ద్య పితరం దక్షం దదాహాఽఽత్మానమాత్మనా ॥ 60 ॥**

ఆ దక్షుని వాక్యాన్ని విన్న సతీదేవి తండ్రి దక్షుని దూషించి తన శరీరాన్ని అగ్నిలో దహించుకొన్నది.

**ప్రణమ్య పశుభర్తారం భర్తారం కృత్తివాససమ్ ।**
**హిమవద్దుహితా సాఽభూత్తపసా తస్య తోషితా ॥ 61 ॥**

పశుపతి, కృత్తివాసుడు, భర్త అయిన శివునికి నమస్కరించి ఆత్మత్యాగం కావించుకొన్నది. ఆ సతి హిమవంతుని తపస్సునకు సంతోషించి అతని పుత్రిగా జన్మించినది.

**జ్ఞాత్వా తాం భగవాన్రుద్రః ప్రపన్నార్తిహరో హరః ।**
**శశాప దక్షం కుపితః సమాగత్యాథ తద్గృహమ్ ॥ 62 ॥**

ఆశ్రితుల బాధలు తొలగించే భగవంతుడు రుద్రుడు ఆమెను తన భార్యగా గుర్తించి ఆమె మరణానికి కారకుడైన దక్షుని యింటికి వచ్చి అతనిని శపించాడు.

**త్యక్త్వా దేహమిమం బ్రాహ్మం క్షత్రియాణాం కులే భవ ।**
**స్వస్యాం సుతాయాం మూఢాత్మా పుత్రముత్పాదయిష్యసి ॥ 63 ॥**

ఈబ్రహ్మసంబంధమైన శరీరాన్ని వదలి క్షత్రియవంశంలో జన్మించు. నీవు మూఢుడవై పుత్రికయందే కుమారుని పొందెదవు.

**ఏవముక్త్వా మహాదేవో యయౌ కైలాసపర్వతమ్ ।**
**స్వాయమ్భువోఽపి కాలేన దక్షః ప్రాచేతసోఽభవత్ ॥ 64 ॥**

ఇట్లా పలికి మహాదేవుడు శివుడు కైలాసపర్వతానికి వెళ్ళిపోయాడు. ఆ స్వాయంభువుడైన దక్షుడు కూడా ప్రాచేతసునిగా జన్మించినాడు.

**ఏతద్వః కథితం సర్వం మనోః స్వాయమ్భువస్య తు ।**
**నిసర్గం దక్షపర్యన్తం శృణ్వతాం పాపనాశనమ్ ॥ 65 ॥**

ఇదంతా స్వాయంభువమనువు చరిత్ర దక్షుని వరకు వివరించినాను. దీనిని విన్నవారి పాపాలు తొలగిపోతాయి.

**ఇతి శ్రీకూర్మపురాణే స్వాయంభువమనురాజవంశానుకీర్తనం నామ చతుర్దశోఽధ్యాయః ॥ 14 ॥**

శ్రీకూర్మ పురాణంలో స్వాయంభువమనురాజవంశానుకీర్తనమనే పద్నాల్గవ అధ్యాయం ॥ 14 ॥

## పంచదశోఽధ్యాయః - పదునైదవ అధ్యాయం

## దక్షయజ్ఞవిధ్వంసనమ్ - దక్షయజ్ఞ విధ్వంసనం

**నైమిషేయా ఊచుః:**-నైమిశంలోని ఋషులు పలికారు

**దేవానాం దానవానాఞ్చ గన్ధర్వోరగరక్షసామ్ ।**
**ఉత్పత్తిం విస్తరాద్బ్రూహి సూత వైవస్వతేఽన్తరే ॥ 1 ॥**

ఓ సూతుడా! వైవస్వతమన్వంతరంలోని దేవదానవ, గంధర్వ, నాగుల, రాక్షసుల ఉత్పత్తినిగూర్చి విపులంగా చెప్పండి.

**స శప్తః శమ్భునా పూర్వం దక్షః ప్రాచేతసో నృపః ।**
**కిమకార్షీన్మహాబుద్ధే! శ్రోతుమిచ్ఛామ సాంప్రతమ్ ॥ 2 ॥**

శివుడు శపించగా దక్షుడు ప్రాచేతసుడను రాజుగా పుట్టి ఏమి చేసినాడు, గొప్పజ్ఞానివైన సూతుడా! మేము దాని నిపుడు వినగోరుతున్నాము.

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు.

**వక్ష్యే నారాయణేనోక్తం పూర్వకల్పానుషఙ్గికమ్ ।**
**త్రికాలబద్ధం పాపఘ్నం ప్రజాసర్గస్య విస్తరమ్ ॥ 3 ॥**

నారాయణుడు పూర్వకల్పానికి సంబంధించి మూడుకాలాల సంబంధం కలది, పాపాలను నశింప చేసే ప్రజాసృష్టిని గూర్చి చెప్పాడు. దానిని విస్తరంగా వివరిస్తాను.

**స శప్తః శమ్భునా పూర్వం దక్షః ప్రాచేతసో నృపః ।**
**వినిన్ద్య పూర్వవైరేణ గఙ్గాద్వారేఽయజద్ధరిమ్ ॥ 4 ॥**

శివుడు శపించగా దక్షుడు ప్రాచేతసునిగా జన్మించి పూర్వవిరోధంతో శంకరుని నిందించి గంగాద్వార ప్రదేశంలో హరి యజ్ఞాన్ని నిర్వహించినాడు.

**దేవాశ్చ సర్వే భాగార్థమాహూతా విష్ణునా సహ ।**
**సహైవ మునిభిస్సర్వైరాగతా మునిపుఙ్గవాః ॥ 5 ॥**

అందులో యజ్ఞభాగాన్ని స్వీకరించటానికి విష్ణువుతో కూడ దేవతలందరూ ఆహ్వానింపబడినారు. మునులందరితోపాటు మునిశ్రేష్ఠులును అక్కడ చేరినారు.

**దృష్ట్వా దేవకులం కృత్స్నం శంకరేణ వినాఽఽగతమ్ ।**
**దధీచో నామ విప్రర్షిః ప్రాచేతసమథాబ్రవీత్ ॥ 6 ॥**

శివుడు లేక అక్కడికి వచ్చిన దేవతా సమూహాన్ని చూచి దధీచుడు అనే పేరుగల బ్రాహ్మణముని ప్రాచేతసునితో ఇట్లన్నాడు.

**దధీచ ఉవాచ:**–దధీచుడు పలికాడు.

> **బ్రహ్మాద్యాస్తు పిశాచాన్తా యస్యాఽఽజ్ఞానువిధాయినః ।**
> **స దేవః సాంప్రతం రుద్రో విధినా కిం న పూజ్యతే ॥ 7 ॥**

బ్రహ్మ మొదలు పిశాచాల వరకు ఆ భగవంతుడైన రుద్రుని ఆజ్ఞను అనుసరిస్తారు. అతనిని ఇప్పుడు శాస్త్రవిధితో ఎందుకు పూజించటం లేదు ?

**దక్ష ఉవాచ:**– దక్షుడు పలికాడు.

> **సర్వేష్వేవ హి యజ్ఞేషు న భాగః పరికల్పితః ।**
> **న మన్త్రా భార్యయా సార్ధం శంకరస్యేతి నేజ్యతే ॥ 8 ॥**

> **విహస్య దక్షం కుపితో వచః ప్రాహ మహామునిః ।**
> **శృణ్వతాం సర్వదేవానాం సర్వజ్ఞానమయః స్వయమ్ ॥ 9 ॥**

అన్నియజ్ఞాల్లో శివునికి భాగం కల్పించలేదు, భార్యగలవాని కివ్వదగిన యజ్ఞభాగం భార్యలేని శంకరున కీయరాదని అతనిని పూజించలేదు. ఆ మాటలకు దధీచి కోపించి, నవ్వుతూ దేవతలందరు వింటుండగా సర్వజ్ఞాన మయుడైన ముని ఈ మాటలన్నాడు.

**దధీచ ఉవాచ :**– దధీచుడు పలికాడు.

> **యతః ప్రవృత్తి ర్విశ్వాత్మా యశ్చాసౌ పరమేశ్వరః ।**
> **సమ్పూజ్యతే సర్వయజ్ఞైర్విదిత్వా కిం న శంకరః ॥ 10 ॥**

> **న హ్యయం శంకరో రుద్రః సంహర్తా తామసో హరః ।**
> **నగ్నః కపాలీ విదితో విశ్వాత్మా నోపపద్యతే ॥ 11 ॥**

ప్రపంచమే తనస్వరూపంగా కలవాడు. పరమేశ్వరుడు. అతనివల్లనే ఈ విశ్వం ప్రవర్తిస్తున్నది. అది తెలిసి సర్వయజ్ఞాల్లో శంకరుడు పూజింప బడుతున్నాడుకదా! అట్టి శంకరుడు ఎందుకు పూజింపబడుటలేదు. ఆ మాటలకు దక్షుడన్నాడు– ఈ రుద్రుడు శంకరుడు కాదు. ప్రపంచాన్ని సంహరించే తామసుడైన హరుడు. దానికితోడు దిగంబరుడు. కపాలాన్ని ధరించేవాడు. ఇతడు విశ్వాత్ముడెట్లా అవుతాడు ?

> **ఈశ్వరో హి జగత్స్రష్టా ప్రభుర్నారాయణో హరిః ।**
> **సత్త్వాత్మకోఽసౌ భగవానిజ్యతే సర్వకర్మసు ॥ 12 ॥**

లోకాలను సృజించినవాడు ప్రభువైన నారాయణుడే ఈశ్వరుడు. అతడు సత్త్వగుణప్రధానుడు. అన్నికార్యాల్లోను ఆ భగవంతుడే పూజింపదగినవాడు.

**దధీచ ఉవాచ :-** దధీచుడు పలికాడు.

**కిం త్వయా భగవానేష సహస్రాంశుర్న దృశ్యతే ।**
**స్వర్వలోకైకసంహర్తా కాలాత్మా పరమేశ్వరః ॥ 13 ॥**

వేయి కిరణాల ఈ భగవంతుడైన దేవుడు నీకు కనబడలేదా! సర్వలోకాలను సంహరించే కాలస్వరూపుడైన పరమేశ్వరుడితడు.

**యం గృహ్ణన్తీహ విద్వాంసో ధార్మికా బ్రహ్మవాదినః ।**
**సోఽయం సాక్షీ తీవ్రరుచిః కాలాత్మా పరమేశ్వరః ॥ 14 ॥**

ఈ విశ్వంలో పండితులు ధార్మికులు బ్రహ్మమును కీర్తించేవారు ఈ దేవుణ్ణి పరిగ్రహిస్తారు. ఈసర్వసాక్షి. తీవ్రప్రకాశంకల కాలస్వరూపుడు ఈ పరమేశ్వరుడు.

**ఏష రుద్రో మహాదేవః కాపాలీ చ ఘృణీ హరః ।**
**ఆదిత్యో భగవాన్సూర్యో నీలగ్రీవో విలోహితః ॥ 15 ॥**

శంకరుని శరీర భేదం మాత్రమే ఈ రుద్రుడు మహాదేవుడు, దయాశీలుడు, కపాలధారి, హరుడు. ఇతడే ఆదిత్యుడు, భగవంతుడైన సూర్యుడు, నల్లని కంఠంకలవాడు విలోహితుడు.

**సంస్తూయతే సహస్రాంశుః సామగాధ్వర్యుహోతృభిః ।**
**పశ్యైనం విశ్వకర్మాణం రుద్రమూర్తిం త్రయీమయమ్ ॥ 16 ॥**

సహస్రాంశుడైన సూర్యస్వరూపుడు, యజుస్సు, ఋక్సూత్రాలతో స్తుతింప బడుచున్నాడు. విశ్వకర్మ. వేదత్రయరూపుడు, రుద్రరూపంలో ఉన్నాడు. ఇతనిని చూడు.

**దక్ష ఉవాచ:-**దక్షుడు పలికాడు

**య ఏతే ద్వాదశాదిత్యా ఆగతా యజ్ఞభాగినః ।**
**సర్వే సూర్యా ఇతి జ్ఞేయా న హ్యన్యో విద్యతే రవిః ॥ 17 ॥**

యజ్ఞభాగాన్ని పొందటానికి వచ్చిన ఈ పండ్రెండు మంది ఆదిత్యులే సూర్యులు. వీరికంటే మరొక రవిలేడు.

**ఏవముక్తే తు మునయః సమాయాతా దిదృక్షవః ।**
**బాఢమిత్యబ్రువన్దక్షం తస్య సాహాయ్యకారిణః ॥ 18 ॥**

దక్షుడిట్లనగానే యజ్ఞం చూడవచ్చిన మునులందరు దక్షునికి సహాయం చేసేవాళ్ళయి ఔను అట్లే అని తమ అంగీకారాన్ని తెలిపారు.

**తమసావిష్టమనసో న పశ్యన్తో వృషధ్వజమ్ ।**
**సహస్రశోఽథ శతశో బహుశో భూయ ఏవ హి ॥ 19 ॥**

**నిన్దన్తో వైదికాన్మన్త్రాన్ సర్వభూతపతిం హరమ్ ।**
**అపూజయన్దక్షవాక్యం మోహితా విష్ణుమాయయా ॥ 20 ॥**

వారు విష్ణుమాయామోహితులై తమోగుణమావరింపగా వృషభధ్వజుడైన శివుని గమనించక వందల వేలమార్లు సర్వభూతపతి శివుని వైదికమంత్రాలను నిందిస్తూ దక్షుని వాక్యాన్నే గౌరవించారు.

**దేవాశ్చ సర్వే భాగార్థమాగతా వాసవాదయః ।**
**నాపశ్యన్దేవమీశానమృతే నారాయణం హరిమ్ ॥ 21 ॥**

యజ్ఞభాగం కోసం వచ్చిన ఇంద్రాది దేవతలు నారాయణుడు హరిని తప్ప మహేశ్వరుని చూడలేదు.

**హిరణ్యగర్భో భగవాన్ బ్రహ్మా బ్రహ్మవిదాం వరః ।**
**పశ్యతామేవ సర్వేషాం క్షణాదన్తరధీయత ॥ 22 ॥**

హిరణ్యగర్భుడు, భగవంతుడు, బ్రహ్మవేత్తల్లో శ్రేష్ఠుడైన బ్రహ్మ అందరు చూస్తుండగానే క్షణంలో అంతర్ధానమైనాడు.

**అన్తర్హితే భగవతి దక్షో నారాయణం హరిమ్ ।**
**రక్షకం జగతాం దేవం జగామ శరణం స్వయమ్ ॥ 23 ॥**

భగవంతుడు బ్రహ్మ అదృశ్యుడు కాగానే దక్షుడు, లోకరక్షకుడు, దేవదేవుడు, నారాయణరూపుడైన హరిని స్వయంగా శరణు పొందాడు.

**ప్రవర్తయామాస తం యజ్ఞం దక్షోఽథ నిర్భయః ।**
**రక్షకో భగవాన్విష్ణుః శరణాగతరక్షకః ॥ 24 ॥**

తర్వాత దక్షుడు భయరహితుడై ఆ యజ్ఞాన్ని కొనసాగించాడు. శరణాగతరక్షకుడు భగవానుడైన విష్ణువు యజ్ఞరక్షకుడుగా ఉండినాడు.

**పునః ప్రాహ చ తం దక్షం దధీచో భగవానృషిః ।**
**సంప్రేక్ష్యర్షిగణాన్దేవాన్ సర్వాన్వై రుద్రవిద్విషః ॥ 25 ॥**

పూజ్యుడైన దధీచుడు మళ్ళీ ఆ దక్షునితో అక్కడ ఉన్న ఋషిగణాలను, దేవతలను, శివద్వేషులను, చూస్తూ ఇట్లా పలికాడు.

**అపూజ్యపూజనే చైవ పూజ్యానాం చాప్యపూజనే ।**
**నరః పాపమవాప్నోతి మహద్వై నాత్ర సంశయః ॥ 26 ॥**

పూజింపతగనివారిని పూజించటం, పూజ్యులను పూజింపక పోవటంవల్ల మనుష్యుడు గొప్పపాపాన్ని పొందుతాడు. ఇందులో సందేహం లేదు.

**అసతాం ప్రగ్రహో యత్ర సతాఞ్చైవ విమాననా ।**
**దణ్డో దైవకృతస్తత్ర సద్యః పతతి దారుణః ॥ 27 ॥**

దుర్జనుల స్వీకారం, సాధువుల అవమానం జరిగే చోట వెంటనే దైవకృతశిక్ష భయంకరంగా ప్రవర్తిస్తుంది.

**ఏవముక్త్వాఽథ విప్రర్షిః శశాపేశ్వరవిద్విషః ।**
**సమాగతాన్ బ్రాహ్మణాంస్తాన్దక్షసాహాయ్యకారిణః ॥ 28 ॥**

అని పలికి ఆ బ్రాహ్మణ ఋషి శివద్వేషులను, ఆ యజ్ఞానికి వచ్చిన బ్రాహ్మణులను, దక్షునికి సహాయంగా ఉన్నవారిని శపించాడు.

**యస్మాద్బహిః కృతో వేదాద్భవద్భిః పరమేశ్వరః ।**
**వినిన్దితో మహాదేవః శఙ్కరో లోకవన్దితః ॥ 29 ॥**

**భవిష్యన్తి త్రయీబాహ్యాః సర్వేఽపీశ్వరవిద్విషః ।**
**నిన్దన్తీహైశ్వరం మార్గం కుశాస్త్రాసక్తచేతసః ॥ 30 ॥**

**మిథ్యాధీతసమాచారా మిథ్యాజ్ఞానప్రలాపినః ।**
**ప్రాప్య ఘోరం కలియుగం కలిజైః పరిపీడితాః ॥ 31 ॥**

పరమేశ్వరుడైన శివుణ్ణి వేదసమ్మతమైన యజ్ఞం నుండి దూరం గావించారు. లోకపూజ్యుడు మహాదేవుడు శంకరుని మీరు దూషించారు. అందువల్ల మీరందరు వేదత్రయానికి దూరులై, దుష్టశాస్త్రములందాసక్తిగలవారై ఈశ్వరమార్గాన్ని నిందించే శివద్వేషులుగా జన్మిస్తారు. అసత్యసమాచారాన్ని అధ్యయనం చేసేవారుగా, అయథార్థ జ్ఞానాన్ని గూర్చి మాట్లాడేవారుగా భయంకరమైన కలియుగంలో కలిజన్యదోషాలతో పీడింపబడేవారౌతారు.

**త్యక్త్వా తపోబలం కృత్స్నం గచ్ఛధ్వం నరకాన్పునః ।**
**భవిష్యతి హృషీకేశః స్వాశ్రితోఽపి పరాఙ్ముఖః ॥ 32 ॥**

మీరు తపస్సుతో సంపాదించిన బలం పూర్తిగా వదలుకొని నరకలోకాలకు వెళతారు. మీరాశ్రయించిన విష్ణువు కూడ మీకు విముఖుడౌతాడు.

**ఏవముక్త్వాఽథ విప్రర్షిః విరరామ తపోధనః ।**
**జగామ మనసా రుద్రమశేషాఘవినాశనమ్ ॥ 33 ॥**

అని పలికి బ్రహ్మర్షి తపోనిధి అయిన దధీచుడు చాలించినాడు. తర్వాత సర్వపాపహరుడైన రుద్రుని మనసులో ధ్యానిస్తూ తన్మయుడైనాడు.

**ఏతస్మిన్నన్తరే దేవీ మహాదేవం మహేశ్వరమ్ ।**
**పతిం పశుపతిం దేవం జ్ఞాత్వైతత్ప్రాహ సర్వదృక్ ॥ 34 ॥**

ఈలోపల మహాదేవి ఇది గ్రహించి సమగ్రదృష్టిగలదై మహేశ్వరుడు, మహాదేవుడు, పశుపతి, ప్రభువైన దేవునితో ఇట్లా పలికింది.

**శ్రీదేవ్యువాచ :**-శ్రీదేవి చెప్పింది.

**దక్షో యజ్ఞేన యజతే పితా మే పూర్వజన్మని ।**
**వినిన్ద్య భవతో భావమాత్మానం చాపి శంకర! ॥ 35 ॥**

ఓ శంకరా! పూర్వజన్మలో నాకు తండ్రైన దక్షుడు మీ గొప్పతనాన్ని నిందించి నన్ను కూడ దూషించి యజ్ఞంతో దేవతలను పూజించాడు.

**దేవా మహర్షయశ్చాసంస్తత్ర సాహాయ్యకారిణః ।**
**వినాశయాఽఽశు తం యజ్ఞం వరమేతం వృణోమ్యహమ్ ॥ 36 ॥**

ఆ యజ్ఞంలో దేవతలు, మహర్షులు కూడ అతనికి సహాయకారులైనారు. ఆ యజ్ఞాన్ని శీఘ్రంగా నశింపచేయండి, నేనీ వరాన్ని కోరుతున్నాను.

**ఏవం విజ్ఞాపితో దేవ్యా దేవదేవః పరః ప్రభుః ।**
**ససర్జ సహసా రుద్రం దక్షయజ్ఞజిఘాంసయా ॥ 37 ॥**

ఈ విధంగా దేవి విన్నవించగానే దేవదేవుడు పరమేశ్వరుడు దక్షయజ్ఞాన్ని నశింపచేయాలని వెంటనే రుద్రుని సృష్టించినాడు.

**సహస్రశిరసం క్రుద్ధం సహస్రాక్షం మహాభుజమ్ ।**
**సహస్రపాణిం దుర్ధర్షం యుగాన్తానలసన్నిభమ్ ॥ 38 ॥**

ఆ రుద్రుడు వేయితలలు, వేయికన్నులు, గొప్పభుజాలు, వేయి చేతులు కల్గి ఇతరులెవరూ ఎదిరింపజాలని వాడై కోపంతో ప్రళయకాలంలోని అగ్నితో సమానుడుగా ఉండెను.

**దంష్ట్రాకరాలం దుష్ప్రేక్ష్యం శంఖచక్రధరం ప్రభుమ్ ।**
**దణ్డహస్తం మహానాదం శార్ఙ్గిణం భూతిభూషణమ్ ॥ 39 ॥**

**వీరభద్ర ఇతి ఖ్యాతం దేవదేవసమన్వితమ్ ।**
**స జాతమాత్రో దేవేశముపతస్థే కృతాఞ్జలిః ॥ 40 ॥**

ఆ వీరభద్రుడు కోరలతో చూడ శక్యం కానట్లు భయంకరుడై శంఖచక్రాలు ధరించి ఉండెను. దేవదేవునితో కూడి వీరభద్రుడని ప్రఖ్యాతిని పొందిన ఆ రుద్రుడు పుట్టిన వెంటనే చేతులు జోడించి దేవేశుడైన పరమేశ్వరుని వద్దకు చేరాడు.

**తమాహ దక్షస్య మఖం వినాశయ శివోఽస్తు తే ।**
**వినిన్ద్య మాం స యజతే గఙ్గాద్వారే గణేశ్వర ॥ 41 ॥**

పరమశివుడా వీరభద్రునితో ఇట్లన్నాడు - నీవు దక్షుడు చేస్తున్న యజ్ఞాన్ని భంగం చేయవలెను. నీకు శుభమగు గాక ! గణేశ్వరా! ఆ దక్షుడు నన్ను దూషించి గంగానదీముఖద్వారంలో యజ్ఞం చేస్తున్నాడు.

**తతో బన్ధప్రముక్తేన సింహేనైకేన లీలయా ।**
**వీరభద్రేణ దక్షస్య వినాశమగమత్క్రతుః ॥ 42 ॥**

బంధనం నుండి విడువబడిన సింహంవలె వీరభద్రుడు సులభంగా దక్షయజ్ఞాన్ని నాశనం చేశాడు.

**మన్యునా చోమయా సృష్టా భద్రకాలీ మహేశ్వరీ ।**
**తయా చ సార్ధం వృషభం సమారుహ్య యయౌ గణః ॥ 43 ॥**

శివపత్ని ఉమ కూడ క్రోధంతో మహేశ్వరి అనే భద్రకాళిని సృష్టించింది. ఆమెతో కూడ వీరభద్రుని గణం వృషభారూఢమై వెళ్ళింది.

**అన్యే సహస్రశో రుద్రా నిసృష్టాస్తేన ధీమతా ।**
**రోమజా ఇతి విఖ్యాతాస్తస్య సాహాయ్యకారిణః ॥ 44 ॥**

బుద్ధిశాలి అయిన వీరభద్రుడు తనకు సహాయకులుగా రోమజులు అనే పేర ప్రసిద్ధులైన వేలకొది రుద్రులను సృష్టించాడు.

**శూలశక్తిగదాహస్తా దణ్డోపలకరాస్తథా ।**
**కాలాగ్నిరుద్రసంకాశా నాదయంతో దిశో దశ ॥ 45 ॥**

ఆ రుద్రులు శూలం, శక్తి, గద అనే ఆయుధాలు ధరించినవారు, కర్రలు, శిలలను దాల్చినవారు, ప్రళయకాలంలోని అగ్నిసములు, పది దిక్కులు పిక్కటిల్ల చేయు ధ్వనులు చేస్తున్నారు.

**సర్వే వృషభమారూఢా సభార్యాశ్చాతిభీషణాః ।**
**సమావృత్య గణశ్రేష్ఠం యయుర్దక్షమఖం ప్రతి ॥ 46 ॥**

వారందరు తమ భార్యలతో కూడ వృషభాల నధిష్ఠించి ఉన్నారు, మిక్కిలి భయంకరులై గణాధిపతి వీరభద్రుని చుట్టుచేరి దక్షయజ్ఞప్రదేశంవైపు కదిలారు.

**సర్వే సంప్రాప్య తం దేశం గఙ్గాద్వారమితి శ్రుతమ్ ।**
**దదృశుర్యజ్ఞదేశం వై దక్షస్యామితతేజసః ॥ 47 ॥**

వారంతా గంగాద్వారమని ప్రసిద్ధమైన ప్రదేశం చేరి తేజస్వి అయిన దక్షుని యజ్ఞం జరిగే స్థలాన్ని చూశారు.

**దేవాఙ్గనా సహస్రాఢ్యమప్సరోగీతనాదితమ్ ।**
**వేణువీణానినాదాఢ్యం వేదవాదాభినాదితమ్ ॥ 48 ॥**

ఆ ప్రదేశం వేలకొలది దేవతాస్త్రీలు కలది. అప్సరసల పాటలతో ధ్వనిస్తున్నది. వేణువు వీణ వంటి వాద్యాల ధ్వనులు కలది. వేదమంత్రోచ్చారణలతో ప్రతిధ్వనిస్తున్నది.

**దృష్ట్వా సహర్షిభిర్దేవైః సమాసీనం ప్రజాపతిమ్ ।**
**ఉవాచ స ప్రియో రుద్రైర్వీరభద్రః స్మయన్నివ ॥ 49 ॥**

ఋషులు దేవతలతో కూడ కూర్చున్న దక్షప్రజాపతిని చూచి వీరభద్రుడు రుద్రులతో కూడి నవ్వుతున్న వానివలె ఇట్లా పలికాడు.

**వయం హ్యనుచరాస్సర్వే శర్వస్యామితతేజసః ।**
**భాగార్థం లిప్సయా భాగాన్ ప్రాప్తా యచ్ఛత్వభీప్సితాన్ ॥ 50 ॥**

మేమంతా గొప్ప తేజస్వి అయిన శివుని అనుచరులం. యజ్ఞభాగాన్ని కోరి వచ్చినాము. ఈ దక్షుడు మేము కోరిన యజ్ఞభాగాలను ఇవ్వాలి.

**అథ చేత్కస్యచిదియం మాయా మునివరోత్తమాః! ।**
**భాగో భవద్భ్యో దేయస్తు నాస్మభ్యమితి కథ్యతామ్ ॥ 51 ॥**

ఓమునిశ్రేష్ఠులారా! ఈ యజ్ఞంలో భాగం మీకు మాత్రమే ఈయదగినది. మాకు ఈయతగదని ఎవరైనా మాయ ప్రయోగించినారా తెల్పండి.

**తం బ్రూతాజ్ఞాపయతి యో వేత్స్యామో హి వయం తతః ।**
**ఏవముక్తా గణేశేన ప్రజాపతిపురస్సరాః ॥ 52 ॥**

ఎవడావిధంగా ఆజ్ఞాపించినాడో తెల్పండి, మేమా విషయం తెలుసుకొంటాము. అందుకు బ్రహ్మమొదలైన దేవత లిట్లన్నారు.

**దేవా ఊచుః :–** దేవతలు పలికారు.

**ప్రమాణం వో న జానీమో భాగే మన్త్రా ఇతి ప్రభుమ్ ।**
**మన్త్రా ఊచుః సురా యూయం తమోపహతచేతసః ॥ 53 ॥**

**యేనాధ్వరస్య రాజానం పూజయేయుర్మహేశ్వరమ్ ।**
**ఈశ్వరః సర్వభూతానాం సర్వదేవతనుర్హరః ॥ 54 ॥**

**పూజ్యతే సర్వయజ్ఞేషు సర్వాభ్యుదయసిద్ధిదః ।**
**ఏవముక్త్వా మహేశానమాయయా నష్టచేతనాః ॥ 55 ॥**

**న మేనిరే యయుర్మన్త్రా దేవాన్ముక్త్వా స్వమాలయమ్ । 56 ॥**

యజ్ఞంలో మీకు భాగం ఇచ్చే విషయంలో ప్రమాణాలైన మంత్రాలు మేమెరుగము. అని దేవతలనగా వేదమంత్రాలు దేవతలైన మీరు తమోగుణంతో నిండిన మనసు కలవారు. యజ్ఞాధీశ్వరుడైన మహేశ్వరుని మీరు పూజింపరు. సర్వప్రాణులకు ఈశ్వరుడే అధిపతి. దేవతలందరు తన శరీరంగా కలవాడు. అన్నివిధాల అభ్యుదయాన్ని, కార్యసిద్ధిని కలిగించే ఆ శివుడు అన్నియజ్ఞాల్లో పూజింపబడుచున్నాడు. అని పలికి ఆ మంత్రాలు మహేశ్వరుని మాయచే చైతన్యాన్ని కోల్పోయినవి. ఆ మంత్రాలు దేవతలను వదలి తమస్థానాలకు వెళ్ళిపోయినవి.

**తతః సభద్రో భగవాన్ సభార్యః సగణేశ్వరః ॥**

**స్పృశన్కరాభ్యాం విప్రర్షిం దధీచం ప్రాహ దేవహా ।**
**మంత్రాః ప్రమాణం న కృతా యుస్మాభిర్బలదర్పితైః ॥ 57 ॥**

**యస్మాత్ప్రసహ్య తస్మాద్వో నాశయామ్యద్య గర్వితాన్ ।**
**ఇత్యుక్త్వా యజ్ఞశాలాం తాం దదాహ గణపుఙ్గవః ॥ 58 ॥**

తర్వాత పూజ్యుడైన భద్రుడు భార్యతో గణేశ్వరులతో కూడి బ్రాహ్మణముని దధీచుని చేతితో పట్టుకొని ఇట్లు పలికాడు. బలగర్వంతో మీరు మంత్రాలను ప్రమాణంగా గ్రహించలేదు. ఏ కారణంతో మీరట్లా చేసినారో ఆ కారణంగానే గర్వించిన మిమ్మల్ని బలాత్కారంగా నశింపచేస్తాను అని చెప్పి గణశ్రేష్ఠుడు ఆ యజ్ఞశాలను కాల్చివేశాడు.

**గణేశ్వరాశ్చ సంక్రుద్ధా యూపానుత్పాట్య చిక్షిపుః ।**
**ప్రస్తోత్రా సహ హోత్రా చ అశ్వం చైవ గణేశ్వరాః ॥ 59 ॥**

**గృహీత్వా భీషణాస్సర్వే గఙ్గాస్రోతసి చిక్షిపుః ।**
**వీరభద్రోఽపి దీప్తాత్మా శక్రస్యైవోద్యతం కరమ్ ॥ 60 ॥**

**వ్యష్టమ్భయదదీనాత్మా తథాఽన్యేషాం దివౌకసామ్ ।**
**భగనేత్రే తథోత్పాట్య కరాగ్రేణైవ లీలయా ॥ 61 ॥**

మిగిలిన గణపతులు కూడ కోపించి యూపస్తంభాలను పెరికి విసరివేసినారు. ప్రస్తోత హోతలతో కూడ యజ్ఞాశ్వాన్ని తమ వశం చేసుకొని భయంకరరూపంకలవారై గంగాప్రవాహంలో పడవేసినారు. వీరభద్రుడు హృదయం దహించగా ఇంద్రుడెత్తిన చేతిని స్తంభింపచేశాడు. యుద్ధానికి ఇతరదేవతలు చేతులెత్తగా వానిని కూడ కదలకుండ చేశాడు. ఆ వీరభద్రుడు తన చేతికొనతో భగుని కన్నులు సులభంగా పెరికి వేసినాడు.

**నిహత్య ముష్టినా దన్తాన్ పూష్ణశ్చైవమపాతయత్ ।**
**తథా చన్ద్రమసం దేవం పాదాఙ్గుష్ఠేన లీలయా ॥ 62 ॥**

**ధర్షయామాస బలవాన్ స్మయమానో గణేశ్వరః ।**
**వహ్నేర్హస్తద్వయం ఛిత్వా జిహ్వాముత్పాట్య లీలయా ॥ 63 ॥**

**జఘాన మూర్ధ్ని పాదేన మునీనపి మునీశ్వరాః ।**
**తథా విష్ణుం సగరుడం సమాయాన్తం మహాబలః ॥ 64 ॥**

**వివ్యాధ నిశితైర్బాణైః స్తమ్భయిత్వా సుదర్శనమ్ ।**
**సమాలోక్య మహాబాహురాగత్య గరుడో గణమ్ ॥ 65 ॥**
**జఘాన పక్షైః సహసా ననాదామ్బునిధిర్యథా ।**
**తతః సహస్రశో రుద్రః ససర్జ గరుడాన్ స్వయమ్ ॥ 66 ॥**

పూష దంతాలను పిడికిలితో పడగొట్టి, చంద్రుని తనకాలిబొటనవేలితో విలాసంగా పడగొట్టాడు. బలవంతుడైన ఆ గణాధిపతి నవ్వుతూ బెదిరించాడు. అగ్నిహోత్రుని రెండు చేతులు నరికి నాలుకను విలాసంగా పెకలించి ఓ మునీశ్వరులారా! అతడు మునులను కూడ తనకాలితో శిరసులపై తన్నాడు. అదేవిధంగా గరుత్మంతునితో కూడ వస్తున్న విష్ణువును బలవంతుడైన అతడు విష్ణుచక్రమైన సుదర్శనాన్ని స్తంభింపచేశాడు. వాడి బాణాలతో బాధించాడు. గొప్ప బలవంతుడైన గరుడుడు ఆ వీరభద్రుని గణాన్ని చూచి తన రెక్కలతో అకస్మాత్తుగా కొట్టాడు. సముద్రఘోషవలె ధ్వని చేశాడు. తర్వాత రుద్రుడు స్వయంగా వేలకొలది గరుడులను సృష్టించినాడు.

**వైనతేయాదభ్యధికాన్ గరుడం తే ప్రదుద్రువుః ।**
**తాన్ దృష్ట్వా గరుడో ధీమాన్ పలాయత మహాజవః ॥ 67 ॥**

గరుత్మంతునికన్న అధికబలవంతులైనవారు గరుత్మంతుని తరిమినారు. వారిని చూచి గరుడుడు బుద్ధిమంతుడై మహావేగంతో పారిపోయినాడు.

**విసృజ్య మాధవం వేగాత్తదద్భుతమివాభవత్ ।**
**అన్తర్హితే వైనతేయే భగవాన్పద్మసమ్భవః ॥ 68 ॥**

**ఆగత్య వారయామాస వీరభద్రం చ కేశవమ్ ।**
**ప్రసాదయామాస చ తం గౌరవాత్పరమేష్ఠినః ॥ 69 ॥**

నారాయణుని వదలి గరుడుడు వెళ్ళటం అద్భుతంగా తోచింది. వినతాసుతుడు గరుడుడదృశ్యంకాగా భగవంతుడైన బ్రహ్మవచ్చి వీరభద్రుని, విష్ణువును కూడ పోరాటంనుండి విరమింప చేశాడు.

**సంస్తూయ భగవానీశం శమ్భుస్తత్రాగమత్స్వయమ్ ।**
**వీక్ష్య దేవాధిదేవం తముమాం సర్వగుణైర్వృతామ్ ॥ 70 ॥**

**తుష్టావ భగవాన్ బ్రహ్మా దక్షః సర్వే దివౌకసః ।**
**విశేషాత్పార్వతీం దేవీమీశ్వరార్ధశరీరిణీమ్ ॥ 71 ॥**

పరమేష్ఠి బ్రహ్మయందుండే గౌరవంతో అతణ్ణి ప్రసన్నుని గావించెను. భగవంతుడైన శంభుడు స్వయంగా అక్కడికి రాగా దేవాధిదేవుడైన ఈశ్వరుని సమస్తగుణవతి అయిన పార్వతిని చూచి భగవంతుడైన బ్రహ్మదేవుడు, దక్షుడు, దేవతలందరు ఈశ్వరుని అర్ధశరీరాన్ని ధరించిన పార్వతిని విశేషంగా స్తుతించినారు.

**స్తోత్రైర్నానావిధైర్దక్షః ప్రణమ్య చ కృతాఞ్జలిః ।**
**తతో భగవతీ దేవీ ప్రహసన్తీ మహేశ్వరమ్ ॥ 72 ॥**

**ప్రసన్నమనసా రుద్రం వచః ప్రాహ ఘృణానిధిః ।**
**త్వమేవ జగతః స్రష్టా శాసితా చైవ రక్షితా ॥ 73 ॥**

**అనుగ్రాహ్యో భగవతా దక్షశ్చాపి దివౌకసః ।**
**తతః ప్రహస్య భగవాన్ కపర్దీ నీలలోహితః ॥ 74 ॥**

**ఉవాచ ప్రణతాన్దేవాన్ ప్రాచేతసమథో హరః ।**
**గచ్ఛధ్వం దేవతాస్సర్వాః ప్రసన్నో భవతామహమ్ ॥ 75 ॥**

దక్షుడు అనేక విధాలైన స్తోత్రాలతో దోసిలొగ్గి నమస్కరించాడు. తర్వాత పూజ్యురాలైన దేవి నవ్వుతూ మహేశ్వరుడైన రుద్రుని ప్రసన్నమనస్కయై దయానిధి అయినందువల్ల నీవే ఈలోకానికి సృష్టి, స్థితి, లయకారుడవు. పూజ్యుడవైన నీవు దక్షుని, ఇతర దేవతలను కూడ దయ దలచాలి అని పలుకగా భగవంతుడు జటాధారి నీలలోహితుడైన శివుడు నవ్వి తనకు నమస్కరిస్తున్న దేవతలను ప్రాచేతసుని గూర్చి ఇట్లా పలికాడు. దేవతలు మీరందరూ వెళ్ళండి. మీ విషయంలో నేను ప్రసన్నుడను.

**సంపూజ్యః సర్వయజ్ఞేషు న నిన్ద్యోఽహం విశేషతః ।**
**త్వం చాపి శృణు మే దక్ష వచనం సర్వరక్షణమ్ ॥ 76 ॥**

అన్ని యజ్ఞాల్లో పూజింపదగిన నేను విశేషంగా దూషించతగను. దక్షుడా! నీవు కూడ సర్వరక్షకమైన నామాట విను.

**త్యక్త్వా లోకైషణామేతాం మద్భక్తో భవ యత్నతః ।**
**భవిష్యసి గణేశానః కల్పాన్తే ఽనుగ్రహాన్మమ ॥ 77 ॥**

లౌకికవాంఛలను వదలి ప్రయత్నపూర్వకంగా నా భక్తుడవగుము. ఈ కల్పం సమాప్తి కాగా నీవు నాదయవల్ల గణాధిపతివవుతావు.

**తావత్తిష్ఠ మమాదేశాత్స్వాధికారేషు నిర్వృతః ।**
**ఏవముక్త్వా తు భగవాన్ సపత్నీకః సహానుగః ॥ 78 ॥**

**అదర్శనమనుప్రాప్తో దక్షస్యామితతేజసః ।**
**అన్తర్హితే మహాదేవే శంకరే పద్మసంభవః ॥ 79 ॥**

**వ్యాజహార స్వయం దక్షమశేషజగతో హితమ్ ।**

అంతవరకు నా ఆజ్ఞవల్ల నీ అధికారబాధ్యతల్లో సుఖంగా ఉండు, ఇట్లా పలికి భగవానుడైన రుద్రుడు భార్య అనుచరులతో కూడ అధికతేజోవంతుడైన దక్షునకదృశ్యుడైనాడు. మహాదేవుడు శివుడు అంతర్ధానం కాగా పద్మసంభవుడైన బ్రహ్మ దక్షునుద్దేశించి సర్వలోకాలకు హితకరమైన మాటను ఇట్లు పలికాడు.

**బ్రహ్మోవాచ :–**బ్రహ్మదేవుడు పలికాడు.

**కిం చాయం భవతో మోహః ప్రసన్నే వృషభధ్వజే ॥ 80 ॥**

వృషభధ్వజుడైన శంకరుడే నీకు ప్రసన్నుడవగా ఇంకా నీకీ మోహమేల?

**యదా చ స స్వయం దేవః పాలయేత్త్వామతన్ద్రితః ।**
**సర్వేషామేవ భూతానాం హృద్యేష పరమేశ్వరః ॥ 81 ॥**

ఆ దేవుడే స్వయంగా జాగ్రత్తగా నిన్ను రక్షిస్తాడు. లోకంలోని సర్వప్రాణిహృదయాల్లో ఈపరమేశ్వరుడున్నాడు.

**పశ్యన్తి యం బ్రహ్మభూతా విద్వాంసో వేదవాదినః ।**
**స చాఽఽత్మా సర్వభూతానాం స బీజం పరమా గతిః ॥ 82 ॥**

పండితులు, వేదవాదులు, బ్రహ్మస్వరూపులు దర్శించే అతడు సర్వభూతాలకు ఆత్మస్వరూపుడు. బీజమైనవాడు ఉత్తమ గతి కూడ దేవదేవుడైన ఆ మహేశ్వరుడు.

**స్తూయతే వైదికైర్మన్త్రైః దేవదేవో మహేశ్వరః ।**
**తమర్చయన్తి యే రుద్రం స్వాత్మనా చ సనాతనమ్ ॥ 83 ॥**

ఆయన వేదమంత్రాలతో కొనియాడ బడుతున్నాడు. సనాతనుడైన రుద్రుని హృదయపూర్వకంగా పూజించేవారు.

**చేతసా భావయుక్తేన యాన్తి తే పరమం పదమ్ ।**
**తస్మాదనాదిమధ్యాన్తం విజ్ఞాయ పరమేశ్వరమ్ ॥ 84 ॥**

**కర్మణా మనసా వాచా సమారాధయ యత్నతః ।**
**యత్నాత్పరిహరేశస్య నిన్దాం స్వాత్మవినాశనీమ్ ॥ 85 ॥**

శ్రద్ధకల మనసుతో అర్చించేవారు శ్రేష్ఠమైన పరమాత్మస్థానాన్ని పొందుతారు. అందువల్ల ఆదిమధ్యాన్తాలు లేని ఆ పరమేశ్వరుని తెలుసుకొని మనసా కర్మణా వాచా ప్రయత్నపూర్వకంగా పూజించు. ఆత్మవినాశహేతువైన శివనింద వదలిపెట్టు.

**భవన్తి సర్వదోషాయ నిన్దకస్య క్రియా హి తాః ।**
**యస్తు చైష మహాయోగీ రక్షకో విష్ణురవ్యయః ॥ 86 ॥**

ఈశ్వర నిందకుని పనులన్నీ సమస్తదోషాలకు కారణాలు. గొప్ప యోగీశ్వరుడు, రక్షకుడు నాశరహితుడైన ఈ విష్ణువు.

**స దేవో భగవాన్రుద్రో మహాదేవో న సంశయః ।**
**మన్యన్తే యే జగద్యోనిం విభిన్నం విష్ణుమీశ్వరాత్ ॥ 87 ॥**

**మోహాదవేదనిష్ఠత్వాత్తే యాన్తి నరకం నరాః ।**
**వేదానువర్తినో రుద్రం దేవం నారాయణం తథా ॥ 88 ॥**

**ఏకీభావేన పశ్యన్తి ముక్తిభాజో భవన్తి తే ।**
**యో విష్ణుః స స్వయం రుద్రో యో రుద్రస్స జనార్దనః ॥ 89 ॥**

**ఇతి మత్వా భజేద్దేవం స యాతి పరమాం గతిమ్ ।**
**సృజత్యేష జగత్సర్వం విష్ణుస్తత్పశ్యతీశ్వరః ॥ 90 ॥**

**ఇత్థం జగత్సర్వమిదం రుద్రనారాయణోద్భవమ్ ।**
**తస్మాత్త్యక్త్వా హరేర్నిన్దాం హరే చాపి సమాహితః ॥ 91 ॥**

భగవంతుడైన రుద్రుడు మహాదేవుడే సందేహం లేదు. జగత్తుకు కారణభూతుడైన విష్ణువును శివునికంటే భిన్నునిగా తలచేవారు మోహంవల్ల వేదంలో విశ్వాసంలేనందువల్ల నరకానికి వెళతారు. వేదమార్గాన్ననుసరించేవారు శివుని నారాయణుని కూడ అభేదంగా చూస్తారు. వారు మోక్షాన్ని పొందుతారు. విష్ణువే స్వయం రుద్రుడు, శివుడే జనార్దనుడైన విష్ణువు అట్లా తలచి ఆ దేవుని సేవించాలి. అట్టివాడు ఉన్నతగతినందుతాడు. లోకాన్నంతటిని విష్ణువు సృష్టిస్తున్నాడు. దాన్ని ఈశ్వరుడు కాపాడుతున్నాడు. ఈవిధంగా ఈ ప్రపంచమంతా శివనారాయణులవల్ల పుట్టినది. అందువల్ల విష్ణువునింద విడచి శివునియందు కూడ శ్రద్ధ కలిగి ఉండుము.

**సమాశ్రయ మహాదేవం శరణ్యం బ్రహ్మవాదినామ్ ।**
**ఉపశ్రుత్యాథ వచనం విరిఞ్చస్య ప్రజాపతిః ॥ 92 ॥**

**జగామ శరణం దేవం గోపతిం కృత్తివాససమ్ ।**
**యేఽన్యే శాపాగ్నినిర్దగ్ధాః దధీచస్య మహర్షయః ॥ 93 ॥**

**ద్విషన్తో మోహితా దేవం సంబభూవుః కలిష్వథ ।**
**త్యక్త్వా తపోబలం కృత్స్నం విప్రాణాం కులసంభవాః ॥ 94 ॥**

బ్రహ్మవాదులు శరణుపొందే మహాదేవు నాశ్రయింపుము. బ్రహ్మమాట విన్న దక్ష ప్రజాపతి గోవులకు ప్రభువు కృత్తివాసుడైన ఈశ్వరుని శరణు పొందాడు. దధీచుని శాపాగ్నితో కాలిన ఇతర మహర్షులు మోహవశులై శివుని ద్వేషిస్తూ కలియుగంలో బ్రాహ్మణకులంలో జన్మించినవారై సమస్త తపోబలాన్ని పోగొట్టుకున్నారు.

**పూర్వసంస్కారమాహాత్మ్యాద్బ్రహ్మణో వచనాదిహ ।**
**ముక్తశాపాస్తతః సర్వే కల్పాన్తే రౌరవాదిషు ॥ 95 ॥**

**నిపాత్యమానాః కాలేన సంప్రాప్యాదిత్యవర్చసమ్ ।**
**బ్రహ్మాణం జగతామీశమనుజ్ఞాతాః స్వయమ్భువా ॥ 96 ॥**

పూర్వజన్మసంస్కారంవల్ల బ్రహ్మదేవుని మాటవల్ల శాపవిముక్తులై కల్పాంతకాలంలో రౌరవం మొదలైన నరకాల్లో త్రోయబడుతూ కొంతకాలం గడువగా సూర్యునివంటి తేజస్సును పొంది లోకప్రభువైన బ్రహ్మను చేరి అతని అనుజ్ఞ పొందినారు.

**సమారాధ్య తపోయోగాదీశానం త్రిదశాధిపమ్ ।**
**భవిష్యంతి యథాపూర్వం శంకరస్య ప్రసాదతః ॥ 97 ॥**

దేవతల ప్రభువైన ఈశానుని పూజించి తపశ్శక్తివల్ల శంకరానుగ్రహం పొంది వారు మళ్ళీ పూర్వం వలెనే అవుతారు.

**ఏతద్వః కథితం సర్వం దక్షయజ్ఞనిషూదనమ్ ।**
**శృణుధ్వం దక్షపుత్రీణాం సర్వాసాం చైవ సన్తతిమ్ ॥ 98 ॥**

మీకీ దక్షయజ్ఞవిధ్వంసం సంపూర్ణంగా వివరించాను. ఇక దక్షపుత్రిక లందరి సంతాన వివరాలను వినండి.

**ఇతి శ్రీకూర్మపురాణే దక్షయజ్ఞవిధ్వంసో నామ పఞ్చదశోఽధ్యాయ ॥ 15 ॥**

శ్రీకూర్మపురాణంలో దక్షయజ్ఞవిధ్వంసనమనే పదునైదవ అధ్యాయం ॥ 15 ॥



## షోడశోఽధ్యాయః - పదునారవ అధ్యాయం

## అన్ధకనిబర్హణమ్ - అంధకనిబర్హణం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు

**ప్రజాః సృజేతి సన్దిష్టః పూర్వం దక్షః స్వయమ్భువా ।**
**ససర్జ దేవాన్గన్ధర్వాన్ ఋషీంశ్చైవాసురోరగాన్ ॥ 1 ॥**

పూర్వం బ్రహ్మ ఆదేశించగా దక్షుడు ప్రజలను సృజిస్తూ దేవతలను, గంధర్వులను, ఋషులను, అసురులను, సర్పాలను కూడ సృజించాడు.

**యదాఽస్య సృజతః పూర్వం న వ్యవర్ధన్త తాః ప్రజాః ।**
**తదా ససర్జ భూతాని మైథునేనైవ సర్వతః ॥ 2 ॥**

ఇంతకుముందు సృష్టించిన ప్రజలు వృద్ధి పొందకపోవటంతో తర్వాత దక్షుడు స్త్రీపురుషసంయోగంద్వారానే ప్రజలను అంతటా సృష్టించాడు.

**అశిక్న్యాం జనయామాస వీరణస్య ప్రజాపతేః ।**
**సుతాయాం ధర్మయుక్తాయాం పుత్రాణాన్తు సహస్రకమ్ ॥ 3 ॥**

ప్రజాపతి అయిన వీరణుని పుత్రిక అశిక్నియందు వేయిమంది పుత్రుల నాతడు సృజించాడు.

**తేషు పుత్రేషు నష్టేషు మాయయా నారదస్య తు ।**
**షష్టిం దక్షోఽసృజత్కన్యా వైరిణ్యాం వై ప్రజాపతిః ॥ 4 ॥**

ఆ పుత్రులు నారదమాయతో నశించిపోగా దక్షప్రజాపతి వైరిణి అనే స్త్రీ యందు అరవై మంది కన్యలను సృజించాడు.

**దదౌ స దశ ధర్మాయ కశ్యపాయ త్రయోదశ ।**
**వింశత్సప్త చ సోమాయ చతస్రోఽరిష్టనేమయే ॥ 5 ॥**

వారిలో పదిమందిని ధర్మునికి, పదముగ్గురిని కశ్యపునికి, ఇరువ దేడుగురిని చంద్రునికి, అరిష్టనేమికి నలుగురి నిచ్చాడు.

**ద్వే చైవ బహుపుత్రాయ ద్వే కృశాశ్వాయ ధీమతే ।**
**ద్వే చైవాఙ్గిరసే తద్వత్తాసాం వక్ష్యేఽథ విస్తరమ్ ॥ 6 ॥**

ఇద్దరు కన్యలను బహుపుత్రునికి, ఇద్దరిని ధీమంతుడైన కృశాశ్వునికి, మరో ఇద్దరిని అంగిరసునకు ఇచ్చాడు. ఆ కన్యల వంశాభివృద్ధిని చెప్తాను వినండి.

**మరుత్వతీ వసుర్యామీ లమ్బా భానురరున్ధతీ ।**
**సంకల్పా చ ముహూర్తా చ సాధ్యా విశ్వా చ భామినీ ॥ 7 ॥**

**ధర్మపత్న్యో దశ త్వేతాస్తాసాం పుత్రాన్నిబోధయ ।**
**విశ్వేదేవాస్తు విశ్వాయాం సాధ్యా సాధ్యానజీజనత్ ॥ 8 ॥**

మరుత్వతి, వసువు యామి, లంబ, భానువు, అరుంధతి, సంకల్ప, ముహూర్త, సాధ్య, విశ్వ అనే పదుగురు దక్షకన్యలు ధర్ముని భార్యలు. వారి కుమారులను గూర్చి తెలుపుతాను వినండి. విశ్వ అనే భార్యకు విశ్వేదేవులు, సాధ్యకు సాధ్యులు అనే దేవజాతివారు జన్మించారు.

**మరుత్వత్యాం మరుత్వన్తో వస్వాస్తు వసవస్తథా ।**
**భానోస్తు భానవాశ్చైవ ముహూర్తాస్తు ముహూర్తజాః ॥ 9 ॥**

మరుత్వతికి మరుత్వంతులు, వసువుకు వసువులు, భానువుకు భానువులు, ముహూర్తకు ముహూర్తులు అనేవారు జన్మించారు.

**లమ్బాయాశ్చాథ ఘోషో వై నాగవీథీ తు యామిజా ।**
**పృథివీవిషయం సర్వమరున్ధత్యామజాయత ॥ 10 ॥**

లంబ అనే భార్యకు ఘోషుడు, యామికి నాగవీథి, భూసంబంధమైన సమస్త వస్తుజాతం అరుంధతికి జన్మించినది.

**సంకల్పాయాస్తు సంకల్పో ధర్మపుత్రా దశ స్మృతాః ।**
**యే త్వనేక వసుప్రాణా దేవా జ్యోతిః పురోగమాః ॥ 11 ॥**

**వసవోఽష్టౌ సమాఖ్యాతాస్తేషాం వక్ష్యామి విస్తరమ్ ।**
**ఆపో ధ్రువశ్చ సోమశ్చ ధర్మశ్చైవానలోఽనిలః ॥ 12 ॥**

**ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవోఽష్టౌ ప్రకీర్తితాః ।**
**ఆపస్య పుత్రో వైతణ్డ్యః శ్రమః శాన్తో ధ్వనిస్తథా ॥ 13 ॥**

సంకల్ప అనే భార్యకు సంకల్పుడు జన్మించాడు. ఈవిధంగా ధర్మునికి కలిగిన పదిమందిభార్యల సంతానం వసువులు ప్రాణాలుగాకల దేవతలు జ్యోతిస్సు ముందుగా కలవారు ధర్మపుత్రులున్నారు. వారు వసువులుగా ప్రసిద్ధులైన ఎనిమిది మంది వ్యాప్తిని వివరిస్తాను. ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనలుడు, అనిలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అనే వారెనిమిదిమంది వసువులు. ఆపుని కుమారులు వైతండ్యుడు, శ్రముడు, శాంతుడు, ధ్వని అనేవారు.

**ధ్రువస్య పుత్రో భగవాన్ కాలో లోకప్రకాశనః ।**
**సోమస్య భగవాన్వర్చా ధర్మస్య ద్రవిణః సుతః ॥ 14 ॥**

లోకాలను ప్రకాశింపచేసే పూజ్యకాలుడు ధ్రువుని కుమారుడు. సోమునికి భగవాన్ వర్చసుడు. ధర్మునికి ద్రవిణుడు పుత్రులు.

**మనోజవోఽ నిలస్యాసీదవిజ్ఞాతగతిస్తథా ।**
**కుమారో హ్యనలస్యాసీత్సేనాపతిరితి స్మృతః ॥ 15 ॥**

అనిలునికి మనోజవుడనే గమనవేగం గుర్తింపరాని పుత్రుడు కలిగాడు. అనలునికి సేనాపతి అనే పేరుగల పుత్రుడు జన్మించాడు.

**దేవలో భగవాన్యోగీ ప్రత్యూషస్యాభవత్సుతః ।**
**విశ్వకర్మా ప్రభాసస్య శిల్పకర్తా ప్రజాపతిః ॥ 16 ॥**

ప్రత్యూషునికి యోగి మహనీయుడైన దేవలుడు కుమారుడు. ప్రభాసునికి శిల్పకారుడు ప్రజాపతి అని చెప్పదగిన విశ్వకర్మ పుత్రునిగా జన్మించాడు.

**అదితిర్దితిర్దనుస్తద్వదరిష్టా సురసా తథా ।**
**సురభిర్వినతా చైవ తామ్రా క్రోధవశా త్విరా ॥ 17 ॥**

**కద్రుర్మునిశ్చ ధర్మజ్ఞా తత్పుత్రాన్వై నిబోధత ।**
**అంశో ధాతా భగస్త్వష్టా మిత్రోఽథ వరుణోఽర్యమా ॥ 18 ॥**

అదితి, దితి, దనువు, అరిష్ట, సురస, సురభి, వినత, తామ్ర, క్రోధవశ, ఇర, కద్రువు, ముని, ధర్మజ్ఞ అనే పదముగ్గురు కశ్యపుని భార్యలు. వారికుమారులను గూర్చి తెలుసుకోండి. అంశుడు, ధాత, భగుడు, త్వష్ట, మిత్రుడు, వరుణుడు, అర్యముడు.

**వివస్వాన్సవితా పూషా హ్యంశుమాన్విష్ణురేవ చ ।**
**తుషితా నామ తే పూర్వం చాక్షుషస్యాన్తరే మనోః ॥ 19 ॥**

పూర్వం చాక్షుషమన్వంతరంలో వివస్వంతుడు, సవిత, పూష, అంశుమంతుడు, విష్ణువు అనేవారు తుషితులు అనే పేరుతో ప్రసిద్ధులు ఉండేవారు.

**వైవస్వతేఽన్తరే ప్రోక్తా ఆదిత్యాశ్చాదితేః సుతాః ।**
**దితిః పుత్రద్వయం లేభే కశ్యపాద్బలగర్వితమ్ ॥ 20 ॥**

వైవస్వతమన్వంతరంలో అదితి కుమారులు ఆదిత్యులనే పేర పిలువబడినారు. కశ్యపునివల్ల దితి బలగర్వితులైన ఇద్దరు పుత్రులను పొందినది.

**హిరణ్యకశిపుం జ్యేష్ఠం హిరణ్యాక్షం తథాఽనుజమ్ ।**
**హిరణ్యకశిపుర్దైత్యో మహాబలపరాక్రమః ॥ 21 ॥**

పెద్దవాడు హిరణ్యకశిపుడు, అతని తమ్ముడు హిరణ్యాక్షుడు. దైత్యుడైన హిరణ్యకశిపుడు గొప్ప బలపరాక్రమాలు కలవాడు.

**ఆరాధ్య తపసా దేవం బ్రహ్మాణం పరమేశ్వరమ్ ।**
**దృష్ట్వా లేభే వరాన్దివ్యాంస్తుత్వాఽసౌ వివిధైస్స్తవైః ॥ 22 ॥**

అతడు పరమేశ్వరుడైన బ్రహ్మనుగూర్చి తపసుతో ఆరాధించి, సాక్షాత్కారాన్ని పొంది, అనేక స్తోత్రాలతో పొగడి అతనివల్ల గొప్పవరాలు పొందినాడు.

**అథ తస్య బలాద్దేవాః సర్వ ఏవ మహర్షయః ।**
**బాధితాస్తాడితా జగ్ముర్దేవదేవం పితామహమ్ ॥ 23 ॥**

తర్వాత అతడు తనబలంతో దేవతలను, మహర్షులను బాధించి హింసింపగా వారు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళినారు.

**శరణ్యం శరణం దేవం శమ్భుం సర్వజగన్మయమ్ ।**
**బ్రహ్మాణం లోకకర్తారం త్రాతారం పురుషం పరమ్ ॥ 24 ॥**

శరణు పొందతగినవాడు, శరణము శుభాలను కలిగించేవాడు, సర్వలోకస్వరూపుడు, లోకకర్త, సంరక్షకుడు, పరమపురుషుడైన బ్రహ్మను వారు చేరినారు.

**కూటస్థం జగతామేకం పురాణం పురుషోత్తమమ్ ।**
**స యాచితో దేవవరైర్మునిభిశ్చ మునీశ్వరాః॥ 25 ॥**

ఓ మునీంద్రులారా! లోకాలకు మూలమైనవాడు, అద్వితీయుడు, సనాతనుడు, పురుషోత్తముడైన బ్రహ్మ వద్దకు వెళ్ళి దేవతలు, మునులు కూడ ప్రార్థించినారు.

**సర్వదేవహితార్థాయ జగామ కమలాసనః ।**
**సంస్తూయమానః ప్రణతైర్మునీన్ద్రైః అమరైరపి ॥ 26 ॥**

**క్షీరోదస్యోత్తరం కూలం యత్రాఽఽస్తే హరిరీశ్వరః ।**
**దృష్ట్వా దేవం జగద్యోనిం విష్ణుం విశ్వగురుం శివమ్ ॥ 27 ॥**

**వవన్దే చరణౌ మూర్ధ్నా కృతాఞ్జలిరభాషత ।**

దేవతలహితం కోసం కమలాసనుడు బ్రహ్మ మునీంద్రులు, సురలు తన్ను కొనియాడుతుండగా వారందరితో కూడ హరినివసించే క్షీరసముద్రం ఉత్తరతీరాన్ని చేరి ప్రపంచానికి కారణము, విశ్వగురువు,మంగళప్రదుడు అయిన నారాయణుని చూశాడు. ఆయన పాదాలకు తలవంచి వినయంతో చేతులు జోడించి నమస్కరించి ఇలా పలికాడు.

**బ్రహ్మోవాచ:**-బ్రహ్మ చెప్పాడు

**త్వం గతిస్సర్వభూతానా మనన్తో ఽ స్యఖిలాత్మకః ॥ 28 ॥**
**వ్యాపీ సర్వామరవపుర్మహాయోగీ సనాతనః ।**
**త్వమాత్మా సర్వభూతానాం ప్రధానప్రకృతిః పరా ॥ 29 ॥**

నీవు ప్రాణులందరకు రక్షకుడవు. అంతం లేనివాడవు. సమస్తం ఆత్మగా కలవాడవు, ప్రపంచమంతటా వ్యాపించినవాడవు. సర్వదేవతలు నీశరీరమే. గొప్ప యోగీశ్వరుడవు. అనాదిపురుషుడవు, నీవు సర్వభూతసంఘానికి ఆత్మవు. ప్రధానప్రకృతివి.

**వైరాగ్యైశ్వర్యనిరతో వాగతీతో నిరఞ్జనః ।**
**త్వం కర్తా చైవ భర్తా చ నిహన్తా చ సురద్విషామ్ ॥ 30 ॥**

వైరాగ్యైశ్వర్యంలో నిమగ్నుడవు, వాగతీతుడవు. మలినం లేని వాడవు. విశ్వానికి కర్తవు, రక్షకుడవు, రాక్షస సంహారకుడవు నీవు.

**త్రాతుమర్హస్యనన్తేశ త్రాతాసి పరమేశ్వర ।**
**ఇత్థం స విష్ణుర్భగవాన్ బ్రహ్మణా సంప్రబోధితః ॥ 31 ॥**

**ప్రోవాచోన్నిద్రపద్మాక్షః పీతావాసాః సురాన్ద్విజాః ।**
**కిమర్థం సుమహావీర్యాః సప్రజాపతికాస్సురాః ॥ 32 ॥**
**ఇమం దేశమనుప్రాప్తాః కిం వా కార్యం కరోమి వః ।**

ఓ అనంతుడా! నీవు మమ్ము రక్షింపదగినవాడవు. ఓ పరమేశ్వరా! నీవే రక్షకుడవు అని బ్రహ్మ ప్రార్థించగా వికసించినకమలములవంటి నేత్రాలు కలవాడు, పీతాంబరధారి ఆ నారాయణుడు దేవతలను గూర్చి ఇట్లన్నాడు– మీరు గొప్ప పరాక్రమవంతులు. బ్రహ్మదేవునితో కూడ ఎందుకీ ప్రదేశానికి వచ్చారు? నేను మీ కేమి పని చేసి పెట్టాలని ప్రశ్నించాడు.

**దేవా ఊచుః–** దేవతలు పలికారు.

**హిరణ్యకశిపుర్నామ బ్రహ్మణో వరదర్పితః ॥ 33 ॥**

**బాధతే భగవన్దైత్యో దేవాన్సర్వాన్సహర్షిభిః ।**
**అవధ్యః సర్వభూతానాం త్వామృతే పురుషోత్తమమ్ ॥ 34 ॥**

ఓ మహాత్మా! హిరణ్యకశిపుడనే దైత్యుడు బ్రహ్మనుండి వరాలు పొంది, గర్వియై దేవతలను, ఋషులను కూడ బాధిస్తున్నాడు. నీవు తప్ప ఇతరులెవరు అతనిని వధించలేరు.

**హన్తుమర్హసి సర్వేషాం త్రాతాఽసి త్వం జగన్మయ! ।**
**శ్రుత్వా తద్దైవతైరుక్తం స విష్ణుర్లోకభావనః ॥ 35 ॥**

**వధాయ దైత్యముఖ్యస్య సోఽసృజత్పురుషం స్వయమ్ ।**

నీవు జగత్ స్వరూపుడవు. అందరికి రక్షకుడవు. అతణ్ణి చంపటానికి అర్హుడవు. ఆ దేవతలు చెప్పిన మాట విని లోకభావనుడైన ఆ విష్ణువు రాక్షసముఖ్యుడైన హిరణ్యకశిపుని చంపటానికి ఒక పురుషుని సృష్టించినాడు.

**మేరుపర్వతవర్ష్మాణం ఘోరరూపం భయానకమ్ ॥ 36 ॥**

అతడు మేరు పర్వతాకారుడై భయంకలిగించే ఘోరరూపం కలవాడు.

**శంఖచక్రగదాపాణిం తం ప్రాహ గరుడధ్వజః ।**
**హత్వా తం దైత్యరాజానం హిరణ్యకశిపుం పునః ॥ 37 ॥**

**ఇమం దేశం సమాగన్తుం క్షిప్ర మర్హసి పౌరుషాత్ ।**
**నిశమ్య వైష్ణవం వాక్యం ప్రణమ్య పురుషోత్తమమ్॥ 38 ॥**

**మహాపురుషమవ్యక్తం యయౌ దైత్యమహాపురమ్ ।**
**విముఞ్చన్భైరవం నాదం శంఖచక్రగదాధరః ॥ 39 ॥**

**ఆరుహ్య గరుడం దేవో మహామేరురివాపరః ।**
**ఆకర్ణ్య దైత్యప్రవరా మహామేఘరవోపమమ్ ॥ 40 ॥**

**సమఞ్చ చక్రిరే నాదం తథా దైత్యపతేర్భయాత్ ।**

శంఖచక్రాలు ధరించిన ఆ పురుషునితో నారాయణు డిట్లన్నాడు. రాక్షసరాజు హిరణ్యకశిపును చంపి మళ్ళీ ఈ ప్రదేశానికి శీఘ్రంగా రమ్ము. ఆ మాటలు విని పురుషోత్తముడు అవ్యక్తుడు మహాపురుషుడైన విష్ణువుకు నమస్కరించి ఆ పురుషుడు శంఖచక్రగదలను ధరించి భయంకరంగా గర్జిస్తూ రాక్షసుని పట్టణానికి వెళ్ళాడు. గరుత్మంతునధిష్ఠించి మరో మేరుపర్వతం వలె వెళ్ళగా పెద్ద మేఘధ్వని వంటి ధ్వనిని విని రాక్షసశ్రేష్ఠులు రాక్షసరాజుభయంవల్ల తాము కూడ ఆ పురుషునిధ్వనితో సమానంగా ధ్వనించినారు.

**అసురా ఊచుః**-రాక్షసులు పలికారు.

**కశ్చిదాగచ్ఛతి మహాన్ పురుషో దేవ నోదితః ॥ 41 ॥**

ప్రభూ! ఒకానొక మహాపురుషుడు దేవతల ప్రేరణతో వస్తున్నాడు.

**విముఞ్చన్ భైరవం నాదం తం జానీమో జనార్దనమ్ ।**
**తతః సహాసురవరైర్హిరణ్యకశిపుః స్వయమ్ ॥ 42 ॥**

**సన్నద్ధైస్సాయుధైః పుత్రైః సప్రహ్లాదైస్తదా యయౌ ।**
**దృష్ట్వా తం గరుడారూఢం సూర్యకోటిసమప్రభమ్ ॥ 43 ॥**

**పురుషం పర్వతాకారం నారాయణమివాపరమ్ ।**
**దుద్రువుః కేచిదన్యోన్యమూచుః సంభ్రాన్తలోచనాః ॥ 44 ॥**

భయంకరంగా గర్జిస్తున్న ఆ పురుషుని జనార్దనుడైన విష్ణువుగ గుర్తించాము అన్నారు. తర్వాత హిరణ్యకశిపుడు రాక్షసశ్రేష్ఠులతో స్వయంగా ఆయుధాలతో యుద్ధానికి. సిద్ధమైన ప్రహ్లాదుడు మొదలైన కుమారులతో

కలిసి యుద్ధానికి వెళ్ళాడు. కోటిసూర్యసమకాంతికల్గి గరుడు నధిష్ఠించిన పర్వతాకారంకల రెండవనారాయణునివలె ఉన్న ఆ పురుషుని చూచి కొందరు పలాయనం చిత్తగించినారు. ఇతరులు సంభ్రమంగల చూపులుకల్గి తమలో తామిట్లు చెప్పుకొన్నారు.

**అయం స దేవో దేవానాం గోప్తా నారాయణో రిపుః ।**
**అస్మాకమవ్యయో నూనం తత్సుతో వా సమాగతః ॥ 45 ॥**

ఈ దేవుడైన నారాయణుడు దేవతలకు రక్షకుడు. మనకు శత్రువు. నాశరహితుడైన ఆ విష్ణువే. నిశ్చయము. లేదా అతని కుమారుడైనా కావచ్చును.

**ఇత్యుక్త్వా శస్త్రవర్షాణి ససృజుః పురుషాయ తే ।**
**స తాని చాక్షతో దేవో నాశయామాస లీలయా ॥ 46 ॥**

అని అనుకొని వారు ఆ పురుషునిపై ఆయుధవర్షము కురిపించారు. ఆ పురుషుడు కూడ వారి శస్త్రాలను సులభంగా భగ్నం కావించి అక్షత గాత్రుడుగా నుండెను.

**హిరణ్యకశిపోః పుత్రాశ్చత్వారః ప్రథితౌజసః ।**
**పుత్రం నారాయణోద్భూతం యుయుధుర్మేఘనిఃస్వనాః ॥ 47 ॥**

ప్రసిద్ధబలం కల హిరణ్యకశిపుని కుమారులు నలుగురు మేఘధ్వనివంటి గంభీరమైన ధ్వని కలవారై విష్ణువు వల్ల కల్గిన ఆ పురుషునితో యుద్ధము చేశారు.

**ప్రహ్లాదశ్చానుహ్లాదశ్చ సంహ్లాదో హ్లాద ఏవ చ ।**
**ప్రహ్లాదః ప్రాహిణోద్బ్రాహ్మమనుహ్లాదోఽథ వైష్ణవమ్ ॥ 48 ॥**

ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు అను వారిలో ప్రహ్లాదుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించగా అనుహ్లాదుడు నారాయణాస్త్రాన్ని ప్రయోగించాడు.

**సంహ్లాదశ్చాపి కౌమారమాగ్నేయం హ్లాద ఏవ చ ।**
**తాని తం పురుషం ప్రాప్య చత్వార్యస్త్రాణి వైష్ణవమ్ ॥ 49 ॥**

**న శేకుశ్చలితుం విష్ణుం వాసుదేవం యథాతథమ్ ।**
**అథాసౌ చతురః పుత్రాన్మహాబాహుర్మహాబలః ॥ 50 ॥**

సంహ్లాదుడు కౌమారాస్త్రాన్ని, హ్లాదుడు ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. ఈ అస్త్రాలు నారాయణ సంభవుడైన ఆ పురుషుని ఏ మాత్రం చలింప చేయలేక పోయినవి. అతడు వాసుదేవుడైన విష్ణువు వలెనే హిరణ్యకశిపుని నలుగురు పుత్రులను

**ప్రగృహ్యా పాదేషు కరైః చిక్షేప చ ననాద చ ।**
**విముక్తేష్వథ పుత్రేషు హిరణ్యకశిపుః స్వయమ్ ॥ 51 ॥**

**పాదేన తాడయామాస వేగేనోరసి తం బలీ ।**
**స తేన పీడితోఽత్యర్థం గరుడేన సహానుగః ॥ 52 ॥**

**అదృశ్యః ప్రయయౌ తూర్ణం యత్ర నారాయణః ప్రభుః ।**
**గత్వా విజ్ఞాపయామాస ప్రవృత్తమఖిలం తథా ॥ 53 ॥**

**సంచింత్య మనసా దేవః సర్వజ్ఞానమయోఽమలః ।**
**నరస్యార్ధతనుం కృత్వా సింహస్యార్ధతనుం తథా ॥ 54 ॥**

**నృసింహవపురవ్యక్తో హిరణ్యకశిపోః పురే ।**
**ఆవిర్బభూవ సహసా మోహయన్దైత్యదానవాన్ ॥ 55 ॥**

తనచేతులతో వారిపాదాలు పట్టుకొని విసరివైచి గర్జించినాడు. తర్వాత తనకుమారులు యుద్ధం నుండి దూరంపోగా హిరణ్యకశిపుడు స్వయంగా తన పాదంతో అతని రొమ్ముపై బలంగా తన్నాడు. హిరణ్యకశిపువల్ల అత్యంత బాధనొందిన ఆ వైష్ణవపురుషుడు, గరుత్మంతుడు అనుచరులతో కూడ అంతర్ధానమై నారాయణుని సన్నిధికి శ్రీఘ్రంగా వెళ్ళినాడు. హరికి హిరణ్యకశిపువద్ద జరిగిన విషయమంతా విన్నవించినాడు. అదివిని సర్వజ్ఞానమయుడు నిర్మలుడైన నారాయణుడు మనసులో ఆలోచించుకొని సగంశరీరం మనుష్యునిదిగ, సగంశరీరం సింహానిదిగ కావించి నరసింహరూపుడై కనపడకుండా వెళ్ళి హిరణ్యకశిపుని పట్టణంలో అకస్మాత్తుగా సాక్షాత్కరించినాడు, ఆ రూపంతో దైత్యదానవులను మోహింప చేశాడు.

**దంష్ట్రాకరాళో యోగాత్మా యుగాన్తదహనోపమః ।**
**సమారుహ్యాత్మనః శక్తిం సర్వసంహారకారికామ్ ॥ 56 ॥**

**భాతి నారాయణోఽనన్తో యథా మధ్యందినే రవిః ।**
**దృష్ట్వా నృసింహం పురుషం ప్రహ్లాదం జ్యేష్ఠపుత్రకమ్ ॥ 57 ॥**

**వధాయ ప్రేరయామాస నరసింహస్య సోఽసురః ।**
**ఇమం నృసింహం పురుషం పూర్వస్మాదూనశక్తికమ్ ॥ 58 ॥**

**సహైవ తేఽనుజైస్సర్వై ర్నాశయాశు మయేరితః ।**
**స తన్నియోగాదసురః ప్రహ్లాదో విష్ణుమవ్యయమ్ ॥ 59 ॥**

**యుయుధే సర్వయత్నేన నరసింహేన నిర్జితః ।**
**తతః సంమోహితో దైత్యో హిరణ్యాక్ష స్తదాఽనుజః ॥ 60 ॥**

**ధ్యాత్వా పశుపతే రస్త్రం ససర్జ చ ననాద చ ।**

కోరలతో భయంకరమైనరూపం కలవాడు యోగస్వరూపుడు ప్రళయకాలాగ్ని సమానుడు అయిన నారాయణుడు సర్వసంహార కారకమైన తనశక్తిని పూనుకొని మధ్యాహ్నం సూర్యునివలె ప్రకాశిస్తున్న నరసింహ

రూపంలో ఉన్న ఆ పురుషుని చూచి పెద్దకుమారుడైన ప్రహ్లాదుని రాక్షసరాజు హిరణ్యకశిపుడు నరసింహుని వధకొరకు ప్రేరేపించినాడు. ఈ నరసింహరూపం కల పురుషుడు ముందు వచ్చిన వాని కంటే బలహీనుడు. నామాట ప్రకారం నీ తమ్ములతో కూడి శీఘ్రంగా సంహరించు అని పలికిన తండ్రి ఆజ్ఞతో అసురుడైన ప్రహ్లాదుడు అవ్యయుడైన విష్ణువును అన్ని ప్రయత్నాలతో ఎదుర్కొని పోరాడినాడు. చివరకా నరసింహునిచేత ఓడి పోయినాడు. అపుడు హిరణ్యకశిపుని తమ్ముడైన హిరణ్యాక్షుడు మోహవశుడై పాశుపతాస్త్రాన్ని ధ్యానించి నృసింహునిపై ప్రయోగించి బిగ్గరగా అరచినాడు.

**తస్య దేవాధిదేవస్య విష్ణోరమితతేజసః ॥ 61 ॥**

**న హానిమకరోదస్త్రం తథా దేవస్య శూలినః ।**
**దృష్ట్వా పరాహతం త్వస్త్రం ప్రహ్లాదో భాగ్యగౌరవాత్ ॥ 62 ॥**

**మేనే సర్వాత్మకం దేవం వాసుదేవం సనాతనమ్ ।**
**సన్త్యజ్య సర్వశస్త్రాణి సత్త్వయుక్తేన చేతసా ॥ 63 ॥**

**ననామ శిరసా దేవం యోగినాం హృదయేశయమ్ ।**
**స్తుత్వా నారాయణం స్తోత్రైః ఋగ్యజుస్సామసంభవైః ॥ 64 ॥**

**నివార్య పితరం భ్రాతౄన్ హిరణ్యాక్షం తదాఽబ్రవీత్ ।**
**అయం నారాయణోఽనన్తః శాశ్వతో భగవానజః ॥ 65 ॥**

అపరిమిత తేజస్వి, దేవదేవుడైన నారాయణునికి శివుని అస్త్రం ఎటువంటి హానిని కలిగించలేదు. ఆ అస్త్రం విష్ణువు విషయంలో విఫలం కావటం చూచి ప్రహ్లాదుడు తన అదృష్టవిశేషంవల్ల సనాతనుడు సర్వజగత్స్వరూపుడైన విష్ణువుగా గుర్తించినాడు. అప్పుడతడు తన ఆయుధాలన్నింటిని విడిచి సత్త్వగుణప్రధానమైన మనసుతో యోగీశ్వరులహృదయంలో శయనించే ఆ దేవునికి శిరసా ప్రణమిల్లి ఋగ్యజస్సామవేదాల మంత్రరూపమైన స్తోత్రాలతో నారాయణుని స్తుతించినాడు. తన తండ్రిని, సోదరులను, హిరణ్యాక్షుని కూడ యుద్ధంనుండి వారిస్తూ ఇట్లన్నాడు. ఈ నారాయణుడు అంతంలేనివాడు, శాశ్వతుడు, పుట్టుక లేని భగవంతుడు.

**పురాణః పురుషో దేవో మహాయోగీ జగన్మయః ।**
**అయం ధాతా విధాతా చ స్వయంజ్యోతిర్నిరఞ్జనః ॥ 66 ॥**

**ప్రధానం పురుషం తత్త్వమూలప్రకృతిరవ్యయా ।**
**ఈశ్వరః సర్వభూతానామన్తర్యామీ గుణాతిగః ॥ 67 ॥**

**గచ్ఛధ్వమేనం శరణం విష్ణుమవ్యక్తమవ్యయమ్ ।**
**ఏవముక్తః సుదుర్బుద్ధిర్హిరణ్యకశిపుః స్వయమ్ ॥ 68 ॥**

**ప్రోవాచ పుత్రమత్యర్థం మోహితో విష్ణుమాయయా ।**
**అయం సర్వాత్మనా వధ్యో నృసింహోఽల్పపరాక్రమః ॥ 69 ॥**

**సమాగతోఽస్మద్భవనమిదానీం కాలచోదితః ।**
**విహస్య పితరం పుత్రో వచః ప్రాహ మహామతిః ॥ 70 ॥**

పురాణపురుషుడు గొప్ప యోగీశ్వరుడు, లోకానికాత్మ. ఇతడే ధాత, విధాత కూడ. స్వయంప్రకాశం కలవాడు. మాలిన్యంలేని దేవుడు. ఈ విష్ణువే ప్రధానపురుషతత్త్వం, నాశంలేని మూలప్రకృతి ఇతడే. సర్వప్రాణులకు ఈశ్వరుడు. అంతట వ్యాపించి ఉన్నవాడు. గుణత్రయాతీతుడు. అట్టి అవ్యక్తరూపుడు, అవ్యయుడు అయిన ఆతనిని శరణు వేడండి. ఇట్లా ప్రహ్లాదుడు చెప్పగా దుష్టబుద్ధికల హిరణ్యకశిపుడు స్వయంగా విష్ణుమాయామోహితుడై కుమారునితో ఇట్లన్నాడు. అల్పపరాక్రమం నరసింహరూపంలో ఉన్న ఈ పురుషుడు అన్నివిధాల చంపదగినవాడే. ఇతడిపుడు మృత్యుప్రేరితుడై మన భవనం ప్రవేశించినాడు. తండ్రి మాటలువిన్న ప్రహ్లాదుడు నవ్వి గొప్ప బుద్ధి కలవాడై ఇట్లన్నాడు.

**మా నిన్దస్వైనమీశానం భూతానామేకమవ్యయమ్ ।**
**కథం దేవో మహాదేవః శాశ్వతః కాలవర్జితః ॥ 71 ॥**

**కాలేన హన్యతే విష్ణుః కాలాత్మా కాలరూపధృక్ ।**
**తతః సువర్ణకశిపుర్దురాత్మా కాలచోదితః ॥ 72 ॥**

**నివారితోఽపి పుత్రేణ యుయుధే హరిమవ్యయమ్ ।**
**సంరక్తనయనోఽనన్తో హిరణ్యనయనాగ్రజమ్ ॥ 73 ॥**

**నఖైర్విదారయామాస ప్రహ్లాదస్యైవ పశ్యతః ।**
**హతే హిరణ్యకశిపౌ హిరణ్యాక్షో మహాబలః ॥ 74 ॥**

**విసృజ్య పుత్రం ప్రహ్లాదం దుద్రువే భయవిహ్వలః ।**
**అనుహ్లాదాదయః పుత్రా అన్యే చ శతశోఽసురాః ॥ 75 ॥**

**నృసింహదేవసంభూతైః సింహైర్నీతా యమక్షయమ్ ।**
**తతః సంహృత్య తద్రూపం హరిర్నారాయణః ప్రభుః ॥ 76 ॥**

సర్వప్రాణులకు ప్రభువు, అద్వితీయుడు, అవ్యయుడు అయిన ఇతనిని దూషించకు. ఈ దేవుడు శాశ్వతుడు, కాలాతీతుడు భగవంతుడైన మహాదేవుడు. విష్ణువును కాలుడెట్లా చంపగలడు. ఇతడే కాలస్వరూపుడు. కాలరూపాన్ని ధరించినవాడు. ఈమాటలువిన్న దుస్స్వభావుడైన హిరణ్యకశిపుడు కాలప్రేరితుడై కుమారుడు వారించినా శాశ్వతుడైన విష్ణువుతో యుద్ధం చేశాడు. కోపంతో ఎర్రనైన నేత్రాలుగల ఆ విష్ణువు హిరణ్యాక్షుని అన్న హిరణ్యకశిపుని అతని కొడుకు ప్రహ్లాదుడు చూస్తుండగానే గోళ్ళతో చీల్చి చంపినాడు. హిరణ్యకశిపుడు చావగానే బలవంతుడైన హిరణ్యాక్షుడు భయంతో కుమారుడైన ప్రహ్లాదు నక్కడే వదలి పారిపోయాడు. అనుహ్లాదుడు మొదలైన ఇతర కుమారులు వందలకొలది రాక్షసులుకూడ నరసింహుని శరీరంలోంచి పుట్టిన సింహాలవల్ల యమలోకాన్ని చేరుకొన్నారు. తర్వాత విష్ణువు భయంకరమైన ఆ రూపాన్ని ఉపసంహరించినాడు.

**స్వమేవ పరమం రూపం యయౌ నారాయణాహ్వయమ్ ।**
**గతే నారాయణే దైత్యః ప్రహ్లాదోఽసురసత్తమః ॥ 77 ॥**

**అభిషేకేణ యుక్తేన హిరణ్యాక్షమయోజయత్।**
**స బాధయామాస సురాన్రణే జిత్వా మునీనపి ॥ 78 ॥**

**లబ్ధ్వాఽన్ధకం మహాపుత్రం తపసాఽఽరాధ్య శంకరమ్ ।**
**దేవాఞ్జిత్వా సదేవేన్ద్రాన్ క్షుబ్ధ్వా చ ధరణీమిమామ్ ॥ 79 ॥**

**నీత్వా రసాతలం చక్రే వేదాన్వై నిష్ప్రభాంస్తథా ।**
**తతః సబ్రహ్మణా దేవాః పరిమ్లానముఖశ్రియః ॥ 80 ॥**

**గత్వా విజ్ఞాపయామాసుర్విష్ణవే హరిమన్దిరమ్ ।**
**స చిన్తయిత్వా విశ్వాత్మా తద్వధోపాయమవ్యయః ॥ 81 ॥**

నారాయణుడనే పేరుగల తన పరమరూపాన్ని పొందినాడు. భగవంతుడు నారాయణుడు వెళ్ళిపోగా రాక్షసోత్తముడైన ప్రహ్లాదుడు హిరణ్యాక్షుని అనురూపమైన పట్టాభిషేకంతో ప్రభువును చేశాడు. తర్వాత హిరణ్యాక్షుడు యుద్ధంలో దేవతలను జయించి మునులను కూడ బాధించాడు. శంకరుని గూర్చి తపమాచరించి అంధకుడనే కుమారునిపొంది దేవేంద్రునితో కూడ దేవతలను జయించి ఈ భూమిని కలత చెందించాడు. వేదాలను పాతాళానికి కొనిపోయి కాంతిహీనాలను కావించాడు. తరువాత దేవతలందరు బ్రహ్మతో కూడ వాడినముఖాలతో విష్ణువు నివాసం వైకుంఠానికి చేరి విష్ణువున కీవిషయాన్ని విన్నవించుకున్నారు. విశ్వరూపుడు, అవ్యయుడు అయిన నారాయణుడు వానిని చంపటానికి తగిన ఉపాయము నాలోచించాడు.

**సర్వదేవమయం శుభ్రం వారాహం వపురాదధే ।**
**గత్వా హిరణ్యనయనం హత్వా తం పురుషోత్తమః ॥ 82 ॥**

**దంష్ట్రయోర్ధారయామాస కల్పాదౌ ధరణీమిమామ్ ।**
**త్యక్త్వా వారాహసంస్థానం సంస్థాప్యైవం సురద్విషః ॥ 83 ॥**

**స్వామేవ ప్రకృతిం దివ్యాం యయౌ విష్ణుః పరం పదమ్ ।**
**తస్మిన్ హతేఽమరరిపౌ ప్రహ్లాదో విష్ణుతత్పరః ॥ 84 ॥**

**అపాలయత్స్వకం రాజ్యం భావం త్యక్త్వా తదాఽఽసురమ్ ।**
**యజతే విధివద్దేవాన్ విష్ణోరారాధనే రతః ॥ 85 ॥**

**నిస్సపత్నం సదా రాజ్యం తస్యాఽఽసీద్విష్ణువైభవాత్ ।**
**తతః కదాచిదసురో బ్రాహ్మణం గృహమాగతమ్ ॥ 86 ॥**

**న చ సంభాషయామాస దేవానాం చైవ మాయయా ।**
**స తేన తాపసోఽత్యర్థం మోహితేనావమానితః ॥ 87 ॥**

సర్వదేవతామయము, నిర్మలము అయిన వరాహరూపాన్ని ధరించి పురుషోత్తముడైన విష్ణువు వెళ్ళి హిరణ్యాక్షుని చంపి తన కోరతో కల్పాదిలో ఈ భూమిని పైకి తెచ్చాడు. తర్వాత వరాహరూపాన్ని వదలి రాక్షసుల నక్కడ అధికారంలో నిలిపాడు. ఆ విష్ణువు దివ్యమైన తన రూపాన్ని పొంది పరమపదానికి వెళ్ళాడు. ఆ హిరణ్యాక్షుడు మరణించగా విష్ణుభక్తుడైన ప్రహ్లాదుడు రాక్షసభావాన్ని వదలి తన రాజ్యాన్ని పరిపాలించాడు. భగవంతుడైన నారాయణునియందు ఆసక్తితో పూజిస్తూ శాస్త్రవిధితో దేవతలకై యజ్ఞములు కావించినాడు. విష్ణువు మహిమవల్ల అతని రాజ్యం శత్రురహితమైనది. తర్వాత ఒకసారి ప్రహ్లాదుడు తనయింటికి వచ్చిన బ్రాహ్మణునితో దేవతలమాయ కారణంగా మాట్లాడలేదు. ఆ తాపసి మోహితుడైన ప్రహ్లాదునిచే అవమానింపబడ్డాడు.

**శశాపాసురరాజానం క్రోధసంరక్తలోచనః ।**
**యత్తద్బలం సమాశ్రిత్య బ్రాహ్మణానవమన్యసే ॥ 88 ॥**

**సా శక్తిర్వైష్ణవీ దివ్యా వినాశం తే గమిష్యతి ।**
**ఇత్యుక్త్వా ప్రయయౌ తూర్ణం ప్రహ్లాదస్య గృహాద్ద్విజః ॥ 89 ॥**

**ముమోహ రాజ్యసంసక్తః సోఽపి శాపబలాత్తతః ।**
**బాధయామాస విప్రేన్ద్రాన్న వివేద జనార్దనమ్ ॥ 90 ॥**

**పితుర్వధమనుస్మృత్య క్రోధం చక్రే హరిం ప్రతి ।**
**తయోః సమభవద్యుద్ధం సుఘోరం రోమహర్షణమ్ ॥ 91 ॥**
**నారాయణస్య దేవస్య ప్రహ్లాదస్యామరద్విషః ।**
**కృత్వా స సుమహద్యుద్ధం విష్ణునా తేన నిర్జితః ॥ 92 ॥**

ఆ బ్రాహ్మణుడు కోపంతో కన్నులు ఎరుపెక్కగా రాక్షసరాజైన ప్రహ్లాదునిట్లా శపించాడు. నీ బలం కారణంగా బ్రాహ్మణుల నవమానిస్తున్నావు. వైష్ణవమైన నీశక్తి నశించిపోవుగాక అని పలికి బ్రాహ్మణుడా ప్రహ్లాదుని ఇంటి నుండి శీఘ్రంగా వెళ్ళిపోయాడు. తర్వాత శాపకారణంగా రాక్షసరాజు రాజ్యకార్యాల్లో నిమగ్నుడై మోహాన్ని పొంది బ్రాహ్మణులను బాధిస్తూ విష్ణువును లెక్కపెట్టలేదు. కాగా తండ్రి హత్యను గుర్తుచేసుకొని హరిపై కోపాన్ని పెంచుకున్నాడు. అపుడు ప్రహ్లాదుడు, హరి యుద్ధానికి తలపడినారు. ఆ యుద్ధం భయంకరమై రోమాంచాన్ని కల్గించింది. భగవంతుడగు నారాయణునకు, దేవవిరోధి అయిన ప్రహ్లాదునకు జరిగినయుద్ధంలో ప్రహ్లాదుడు పరాజితుడైనాడు.

**పూర్వసంస్కారమాహాత్మ్యాత్పరస్మిన్పురుషే హరౌ ।**
**సఞ్జాతం తస్య విజ్ఞానం శరణ్యం శరణం యయౌ ॥ 93 ॥**

ప్రహ్లాదుడు పూర్వసంస్కారవిశేషంవల్ల పరమపురుషుడైన విష్ణువునియందు భక్తిపూర్వకజ్ఞానాన్ని పొంది శరణ్యుడైన నారాయణుని శరణు పొందాడు.

**తతః ప్రభృతి దైత్యేన్ద్రో హ్యనన్యాం భక్తిముద్వహన్ ।**
**నారాయణే మహాయోగమవాప పురుషోత్తమే ॥ 94 ॥**

**హిరణ్యకశిపోః పుత్రే యోగసంసక్తచేతసి ।**
**అవాప తన్మహద్రాజ్యమన్ధకోఽసురపుఙ్గవః ॥ 95 ॥**

**హిరణ్యనేత్రతనయః శంభోర్దేహసముద్భవః ।**
**మందరస్థాముమాం దేవీం చకమే పర్వతాత్మజామ్ ॥ 96 ॥**

**పురా దారువనే పుణ్యే మునయో గృహమేధినః ।**
**ఈశ్వరారాధనార్థాయ తపశ్చేరుః సహస్రశః ॥ 97 ॥**

అది మొదలుకొని రాక్షసరాజు ప్రహ్లాదుడు పురుషోత్తముడైన నారాయణునియందు భక్తికల్గి గొప్పయోగ సిద్ధిని పొందాడు. హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు యోగాసక్తుడుకాగా అతని మహారాజ్యాన్ని అసురశ్రేష్ఠుడైన అంధకాసురుడు స్వీకరించినాడు. ఆ అంధకుడు హిరణ్యాక్షుని కుమారుడు, శివుని శరీరోద్భవుడు. ఒకసారి అతడు మందరపర్వతమందున్న హిమవత్పుత్రిక ఉమాదేవిని కామించాడు. పూర్వం పవిత్రమైన దారుకావనంలో గృహస్థులైన వేలమంది మునులు ఈశ్వరారాధనకై తపమాచరించారు.

**తతః కదాచిన్మహతీ కాలయోగేన దుస్తరా ।**
**అనావృష్టిరతీవోగ్రా హ్యాసీద్భూతవినాశినీ ॥ 98 ॥**

**సమేత్య సర్వే మునయో గౌతమం తపసాం నిధిమ్ ।**
**అయాచన్త క్షుధావిష్టా ఆహారం ప్రాణధారణమ్ ॥ 99 ॥**

**స తేభ్యః ప్రదదావన్నం మృష్టం బహుతరం బుధః ।**
**సర్వే బుభుజిరే విప్రా నిర్విశంకేన చేతసా ॥ 100 ॥**

**గతే చ ద్వాదశే వర్షే కల్పాన్త ఇవ శాఙ్కరీ ।**
**బభూవ వృష్టిర్మహతీ యథాపూర్వమభూజ్జగత్ ॥ 101 ॥**

తర్వాత కొంతకాలానికి కాలప్రభావంతో దాట శక్యంకానిది, ప్రాణులను నశింపచేసే భయంకరమైన కరువు ఏర్పడినది. అప్పుడక్కడి మునులందరుచేరి తపస్సులకు నిధి అయిన గౌతముని ఆశ్రయించి ప్రాణాలను నిలిపే ఆహార మిమ్మని యాచించారు. విద్వాంసుడైన ఆ గౌతముడు వారికి రుచికరమైన అన్నాన్ని కావలసినంత పెట్టించాడు. ఆ బ్రాహ్మణులు ఏవిధమైన అనుమానంలేక భోజనం చేశారు. పన్నెండేళ్ళు గడువగా ప్రళయ కాలంలో శంకరుడు కల్పించే విధంగా గొప్పవర్షం కురిసి ప్రపంచమంతా ఎప్పటిలా అయినది.

**తతః సర్వే మునివరాః సమామన్త్ర్య పరస్పరమ్ ।**
**మహర్షిం గౌతమం ప్రోచుః గచ్ఛామ ఇతి వేగతః ॥ 102 ॥**

**నివారయామాస చ తాన్ కంచిత్కాలం యథాసుఖమ్ ।**
**ఉషిత్వా మద్గృహేఽవశ్యం గచ్ఛధ్వమితి పణ్డితాః ॥ 103 ॥**

**తతో మాయామయీం సృష్ట్వా కృష్ణాం గాం సర్వ ఏవ తే ।**
**సమీపం ప్రాపయామాసుర్గౌతమస్య మహాత్మనః ॥ 104 ॥**

**సోఽనువీక్ష్య కృపావిష్టస్తస్యాః సంరక్షణోత్సుకః ।**
**గోష్ఠే తాం బన్ధయామాస స్పృష్టమాత్రా మమార సా ॥ 105 ॥**

**స శోకేనాభిసన్తప్తః కార్యాకార్యే మహామునిః ।**
**న పశ్యతి స్మ సహసా తమృషిం మునయోఽబ్రువన్ ॥ 106 ॥**

**గోవధ్యేయం ద్విజశ్రేష్ఠ యావత్తవ శరీరగా ।**
**తావత్తేఽన్నం న భోక్తవ్యం గచ్ఛామో వయమేవ హి ॥ 107 ॥**

**తేనాతోఽనుమతాస్సన్తో దేవదారువనం శుభమ్ ।**
**జగ్ముః పాపవశాన్నీతా తపశ్చర్తుం యథా పురా ॥ 108 ॥**

తర్వాత మునులందరు పరస్పర మాలోచించుకొని గౌతమమహర్షి వద్దకు వచ్చి వెళ్ళివస్తామని పలికినారు. ఆ గౌతమముని కొంతకాలం మాయింట సుఖంగా నివసించి వెళ్ళమని వారి ప్రయాణాన్ని నిలిపి వేశాడు. తర్వాత ఆ మునులు త్వరగా వెళ్ళవలెనని మాయతో నల్లని గోవును సృజించి మహాత్ముడైన గౌతమ మునివద్దకు చేర్చారు. గౌతముడు దాన్నిచూచి దయగల్గి కాపాడాలనే ఆసక్తితో దానిని పశువుల పాకలో కట్టి వేశాడు. ఆ ముని తాకగానే ఆ గోవు మరణించినది. దాని మరణంతో గౌతముడు దుఃఖపడి ఏమిచేయాలో తెలిసికోలేని స్థితిలో ఉన్నాడు. అపుడామునులు ఆ ఋషితో ఇట్లన్నారు. ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! గోవధవల్ల కల్గిన పాపం నీ శరీరాన్ని అంటి ఉన్నంత వరకు నీ అన్నం మేము తినరాదు. అందువల్ల మేము వెళుతున్నాము అని ఆ ముని అనుమతిపొంది పాపవశంచే గొనిపోబడినవారై పూర్వమువలె తపమును చేయుటకు శుభమైన దేవదారు వనమునకు వెళ్ళారు.

**స తేషాం మాయయా జాతాం గోవధ్యాం గౌతమో మునిః ।**
**కేనాపి హేతునా జ్ఞాత్వా శశాపాతీవ కోపతః ॥ 109 ॥**

**భవిష్యన్తి త్రయీ బాహ్యా మహాపాతకిభిస్సమాః ।**
**బహుశస్తే తథా శాపాజ్జాయమానాః పునః పునః ॥ 110 ॥**

**సర్వే సంప్రాప్య దేవేశం శంకరం విష్ణుమవ్యయమ్ ।**
**అస్తువన్ లౌకికైః స్తోత్రైరుచ్ఛిష్టా ఇవ సర్వగౌ ॥ 111 ॥**

**దేవదేవౌ మహాదేవౌ భక్తానామార్తినాశనౌ ।**
**కామవృత్త్యా మహాయోగౌ పాపాన్నస్త్రాతుమర్హతః ॥ 112 ॥**

**తదా పార్శ్వస్థితం విష్ణుం సంప్రేక్ష్య వృషభధ్వజః ।**
**కిమేతేషాం భవేత్కార్యం ప్రాహ పుణ్యైషిణామితి ॥ 113 ॥**

ఆ గౌతమముని తనకు కలిగిన గోవధ పాతకమా మునుల వల్ల కలిగినదే అని ఒకానొక కారణంతో తెలుసుకొని కోపించి వారిని శపించాడు. ఈ మునులు వేదత్రయానికి దూరులై మహాపాపాలు చేసిన వారితో సమానులు కాగలరు అని. ఆ శాపం కారణంగా మునులు అనేక మార్లు పుడుతూనే ఉన్నారు. వారందరు దేవదేవుడైన శంకరుని విష్ణువును కూడ చేరి అంతట వ్యాపించి ఉన్నవారిని ఎంగిలిపడ్డవారి వలె లౌకికస్తోత్రాలతో కొనియాడినారు. ఆ విష్ణువు శంకరుడు కూడ దేవతలకు దేవులు, భక్తుల ఆర్తిని పోగొట్టె గొప్పదేవులు. స్వేచ్ఛాప్రవృత్తితో గొప్ప యోగాన్ని ధరించిన వారు కాబట్టి మమ్ము కాపాడ తగినవారు. ఆ సమయంలో వృషభధ్వజుడైన శంకరుడు తనప్రక్కనే నిలిచిన విష్ణువును చూచి పుణ్యాన్ని కోరుతున్న వీరి విషయంలో చేయదగిన కార్యమేమని ప్రశ్నించాడు.

**తతః స భగవాన్విష్ణుః శరణ్యో భక్తవత్సలః ।**
**గోపతిం ప్రాహ విప్రేన్ద్రానాలోక్య ప్రణతాన్హరిః ॥ 114 ॥**

**న వేదబాహ్యే పురుషే పుణ్యలేశోఽపి శఙ్కర ।**
**సఙ్గచ్ఛతే మహాదేవ ధర్మో వేదాద్వినిర్బభౌ । 115 ॥**

**తథాఽపి భక్తవాత్సల్యాద్రక్షితవ్యా మహేశ్వర! ।**
**అస్మాభిః సర్వ ఏవైతే గన్తారో నరకానపి ॥ 116 ॥**

**తస్మాద్ధి వేదబాహ్యానాం రక్షణార్థాయ పాపినామ్ ।**
**విమోహనాయ శాస్త్రాణి కరిష్యామో వృషధ్వజ ॥ 117 ॥**

**ఏవం సంబోధితో రుద్రో మాధవేనాసురారిణా ।**
**చకార మోహశాస్త్రాణి కేశవోఽపి శివేరితః ॥ 118 ॥**

ఆ విష్ణువు భక్తులయందు ప్రేమకలవాడు శరణుపొందిన వారిని రక్షించేవాడు అయినందువల్ల నమస్కరిస్తున్న బ్రాహ్మణులను చూచి శివునితో ఇట్లన్నాడు-ఓ శంకరా! లోకంలో వేదబాహ్యుడైన మనుష్యునిలో కొంతైనా పుణ్యముండదు. ధర్మం వేదంనుండే ఆవిర్భవించి ప్రకాశమందినది. ఓ మహేశ్వరా! అట్లైనా మనం భక్తులయందుండే వాత్సల్యంతో వీరిని కాపాడవలసినదే. వీరందరు పాపంవల్ల నరకానికి పోదగినవారే అయినా మనం రక్షించవలసినదే. అందువల్ల వేదదూరులైన పాపులను కాపాడటానికి జనులను మోహింపచేయటానికి కొన్ని శాస్త్రాలను సృష్టించాలి. ఓ వృషభధ్వజా! మన కర్తవ్యమిది. ఈ విధంగా అసురారి విష్ణువు చెప్పగా శివుడు మోహకారకాలైన శాస్త్రాలను రచించినాడు. అట్లే శివునిచే ప్రేరేపించబడిన విష్ణువు కూడా రచించాడు.

**కాపాలం నాకులం వామం భైరవం పూర్వపశ్చిమమ్ ।**
**పంచరాత్రం పాశుపతం తథాఽన్యాని సహస్రశః ॥ 119 ॥**

**సృష్ట్వా తానాహ నిర్వేదాః కుర్వాణాః శాస్త్రచోదితమ్ ।**
**పతన్తో నరకే ఘోరే బహూన్ కల్పాన్ పునః పునః ॥ 120 ॥**

**జాయన్తో మానుషే లోకే క్షీణపాపచయాస్తతః ।**
**ఈశ్వరారాధనబలాద్గచ్ఛధ్వం సుకృతాం గతిమ్ ॥ 121 ॥**

**వర్తధ్వం మత్ప్రసాదేన నాన్యథా నిష్కృతిర్హి నః ।**
**ఏవమీశ్వరవిష్ణుభ్యాం చోదితాస్తే మహర్షయః ॥ 122 ॥**

**ఆదేశం ప్రత్యపద్యన్త శివస్యాసురవిద్విషః ।**
**చక్రుస్తేఽన్యాని శాస్త్రాణి తత్ర తత్రరతాః పునః ॥ 123 ॥**

కాపాలము, నాకులము, వామము, భైరవము, పూర్వపశ్చిమము, పంచరాత్రము, పాశుపతము, మొదలైనవి వేలకొలది ఆ మోహశాస్త్రాలు వానిని సృజించి బ్రాహ్మణులతో మీరు వేదబాహ్యులై శాస్త్రవిహిత కార్యాలు చేస్తూ భయంకరమైన నరకంలో చాల కల్పాలవరకు పడుతూ మళ్ళీ మళ్ళీ మనుష్యలోకంలో పుడుతూ, పాపం నశించిన తర్వాత ఈశ్వరుని పూజించిన కారణం వల్ల పుణ్యలోకగతిని పొందగలరు అని చెప్పెను. నాదయతో ప్రవర్తించండి. ఈ పాపానికి మరో ప్రాయశ్చిత్తం లేదు. అని శివుడు, విష్ణువు కూడ ప్రోత్సహించగా ఆ మహర్షులు రాక్షసారి అయిన శివుని ఆజ్ఞను పాటించారు. వారు కూడ మళ్లీ ఆ యా విషయాల్లో ఆసక్తులై ఇతరశాస్త్రాలను కొన్నిటిని రచించారు.

**శిష్యానధ్యాపయామాసుర్దర్శయిత్వా ఫలాని చ ।**
**మోహాపసదనం లోకమవతీర్య మహీతలే ॥ 124 ॥**

**చకార శంకరో భిక్షాం హితాయైషాం ద్విజైః సహ ।**
**కపాలమాలాభరణః ప్రేతభస్మావగుణ్ఠితః ॥ 125 ॥**

**విమోహయంల్లోకమిమం జటామణ్డలమణ్డితః ।**
**నిక్షిప్య పార్వతీం దేవీం విష్ణావమితతేజసి ॥ 126 ॥**

**నియోజ్య భగవాన్రుద్రో భైరవం దుష్టనిగ్రహే ।**
**దత్వా నారాయణే దేవ్యా నన్దనం కులనన్దనమ్ ॥ 127 ॥**

**సంస్థాప్య తత్ర చ గణాన్ దేవానిన్ద్రపురోగమాన్ ।**
**ప్రస్థితే చ మహాదేవే విష్ణుర్విశ్వతనుః స్వయమ్ ॥ 128 ॥**

**స్త్రీరూపధారీ నియతం సేవతేస్మ మహేశ్వరీమ్ ।**
**బ్రహ్మా హుతాశనః శక్రో యమోఽన్యే సురపుఙ్గవాః ॥ 129 ॥**

**సిషేవిరే మహాదేవీం స్త్రీరూపం శోభనం గతాః ।**
**నన్దీశ్వరశ్చ భగవాన్ శంభోరత్యన్తవల్లభః ॥ 130 ॥**

**ద్వారదేశే గణాధ్యక్షో యథాపూర్వమతిష్ఠత ।**
**ఏతస్మిన్నన్తరే దైత్యో హ్యన్ధకో నామ దుర్మతిః ॥ 131 ॥**

**ఆహర్తుకామో గిరిజామాజగామాథ మన్దరమ్ ।**
**సంప్రాప్తమన్ధకం దృష్ట్వా శంకరః కాలభైరవః ॥ 132 ॥**

**న్యషేదయదమేయాత్మా కాలరూపధరో హరః ।**
**తయోః సమభవద్యుద్ధం సుఘోరం రోమహర్షణమ్ ॥ 133 ॥**

ఆ మునులు తమ శిష్యులకు సకలవిద్యలను అభ్యసింపచేస్తూ ఫలాలను చూపినారు. మోహభూయిష్ఠమైన లోకంలో భూమండలంలో అవతరించినారు. శంకరుడు వారి శుభం కోరి బ్రాహ్మణులతో కలిసి భిక్షాటనం చేసినాడు. కపాలమాలాభరణుడై శ్మశానభస్మాన్నలదుకొని జడలసమూహాన్ని ధరించి లోకాన్ని మోహింపచేస్తూ పార్వతీదేవిని తేజశ్శాలి విష్ణువధీనంలో నిలిపినాడు. దుష్ట నిగ్రహకార్యంలో భైరవుని నియమించినాడు. పార్వతీదేవితో కలిపి కులనందనుడైన నందనుని నారాయణునికి అప్పగించి ఇంద్రుడు మొదలైన దేవతలను గణాలను నిల్పి మహాదేవుడైన శివుడు బయలుదేరి వెళ్ళినాడు. విశ్వతనుడైన విష్ణువు స్వయంగా స్త్రీరూపాన్ని ధరించి మహేశ్వరినెల్లపుడు సేవించాడు. బ్రహ్మ, అగ్ని, ఇంద్రుడు, యముడు ఇతర దేవతాశ్రేష్ఠులు మంగళకరమైన స్త్రీరూపాన్ని ధరించి మహాదేవిని సేవించినారు. పూజ్యుడు శివునకత్యంత ప్రేమపాత్రుడైన నందీశ్వరుడు కూడ గణాలకధిపతిగా యథాపూర్వం ద్వారప్రదేశంలో నిలిచినాడు. అంతలో అంధకుడనే దుర్బుద్ధిగల రాక్షసుడు పార్వతి నపహరించాలనే కోరికతో మందరపర్వతం దగ్గరకు వచ్చినాడు. ఆ అంధకాసురుని చూచి ప్రళయకాలంలోని భయంకరుడైన శివుడు యముని ఆకారాన్ని ధరించినవాడై అతని నడ్డుకున్నాడు. అప్పుడు శివునికి, అంధకాసురునికి మధ్య భయంకరమైన గగుర్పాటు కలిగించే గొప్ప యుద్ధం జరిగినది.

**శూలేనోరసి తం దైత్యమాజఘాన వృషధ్వజః ।**
**తతః సహస్రశో దైత్యాః సహస్రాన్ధకసంజ్ఞితాః ॥ 134 ॥**

**నన్దీశ్వరాదయో దైత్యైరన్ధకైరభినిర్జితాః ।**
**ఘణ్టాకర్ణో మేఘనాదశ్చణ్డేశశ్చణ్డతాపనః ॥ 135 ॥**

**వినాయకో మేఘవాహః సోమనన్దీ చ వైద్యుతః ।**
**సర్వేఽన్ధకం దైత్యవరం సంప్రాప్యాతిబలాన్వితాః ॥ 136 ॥**

**యుయుధుః శూలశక్త్యృష్టిగిరికూటపరశ్వధైః ।**
**భ్రామయిత్వా తు హస్తాభ్యాం గృహీత్వా చరణద్వయమ్ ॥ 137 ॥**

**దైత్యేన్ద్రేణాతిబలినా క్షిప్తాస్తే శతయోజనమ్ ।**
**తతోఽన్ధకనిసృష్టా యే శతశోఽథ సహస్రశః ॥ 138 ॥**

**కాలసూర్యప్రతీకాశా భైరవం చాభిదుద్రువుః ।**

వృషధ్వజుడైన శివుడు శూలంతో ఆ రాక్షసుని రొమ్మున పొడిచినాడు. అపుడా అంధుకుని శరీరం నుండి అంధక సంజ్ఞ కలవారు వేలకొలది రాక్షసులు ఉద్భవించినారు. నందీశ్వరుడు మొదలైనవారు ఆ యుద్ధంలో అంధక రాక్షసులతో పోరాడి ఓడినారు. ఘంటాకర్ణుడు, మేఘనాదుడు, చండేశుడు, చండతాపనుడు అనేవారు వినాయకుడు, మేఘవాహుడు, సోమనంది, వైద్యుతుడు అనే బలవంతులందరు దైత్యవరుడైన అంధకుని సమీపించి శూలములు, శక్తి, ఋష్టి, అనేక ఖడ్గాలు, కొండచరియలు, గొడ్డళ్ళు అనే ఆయుధాలతోను, తమ చేతులతోను వారి రెండుపాదాలు పట్టుకొని గిరగిర త్రిప్పుతూ,యుద్ధము చేసినారు. బలవంతుడైన అంధకుడు వారిని నూరుయోజనముల దూరం విసరి వేసినాడు.ఆ తర్వాత అంధకుడు సృష్టించిన వేలకొలదిరాక్షసులు కాలసూర్యుని వంటివారై భైరవునిపైకి ఉరికారు.

**హా హేతి శబ్దః సుమహాన్ బభూవాతిభయఙ్కరః ॥ 139 ॥**

**యుయుధే భైరవో దేవః శూలమాదాయ భైరవమ్ ।**
**దృష్ట్వాఽంధకానాం సుబలం దుర్జయం నిర్జితో హరః ॥ 140 ॥**

**జగామ శరణం వేగం వాసుదేవమజం విభుమ్ ।**
**సోఽసృజద్భగవాన్విష్ణుర్దేవీనాం శతముత్తమమ్ ॥ 141 ॥**

**దేవీ పార్శ్వస్థితో దేవో వినాశాయ సురద్విషామ్ ।**
**తదాన్ధకసహస్రం తు దేవీభిర్యమసాదనమ్ ॥ 142 ॥**

**నీతం కేశవమాహాత్మ్యాల్లీలయైవ రణాజిరే ।**
**దృష్ట్వా పరాహతం సైన్యమన్ధకోఽపి మహాసురః ॥ 143 ॥**

**పరాఙ్ముఖో రణాత్తస్మాత్పలాయత మహాజవః ।**

అప్పుడచట మిక్కిలి భయంకరంగా మహాశబ్దం వ్యాపించింది. భైరవుడు భయంకరమైన శూలాన్ని గొని పోరాడినాడు. జయింప శక్యం కాని అంధకుల గొప్ప బలాన్ని చూచి వారితో ఓడిన శివుడు జన్మరహితుడు విభువు అయిన వాసుదేవుని శరణు పొందినాడు. భగవంతుడైన విష్ణువు ఉత్తములైన వందమంది దేవీగణాన్ని సృష్టించినాడు. దేవిప్రక్కగానిలిచిన భగవంతుడు రాక్షసనాశం కొరకు ఆ దేవీగణంతో అంధకాసురగణాన్ని చంపించి యమలోకానికి చేర్చినాడు. కేశవమాహాత్మ్యంతో సునాయాసంగా యుద్ధంలో హతమైన సైన్యాన్నిచూచి గొప్ప వేగంకల అంధకాసురుడు యుద్ధరంగంనుండి తప్పుకుని పరిగెత్తిపోయినాడు.

**తతః క్రీడాం మహాదేవః కృత్వా ద్వాదశవార్షికీమ్ ॥ 144 ॥**

**హితాయ భక్తలోకానామాజగామాథ మన్దరమ్ ।**
**సంప్రాప్తమీశ్వరం జ్ఞాత్వా సర్వ ఏవ గణేశ్వరాః ॥ 145 ॥**

**సమాగమ్యోపతిష్ఠన్త భానుమన్తమివ ద్విజాః ।**
**ప్రవిశ్య భవనం పుణ్యమయుక్తానాం దురాసదమ్ ॥ 146 ॥**

**దదర్శ నన్దినం దేవం భైరవం కేశవం శివః ।**
**ప్రణామప్రవణం దేవం సోఽనుగృహ్యాథ నన్దినమ్ ॥ 147 ॥**

**ప్రీత్యైనం పూర్వమీశానః కేశవం పరిషస్వజే ।**
**దృష్ట్వా దేవో మహాదేవీం ప్రీతివిస్ఫారితేక్షణామ్ ॥ 148 ॥**
**ప్రణతః శిరసా తస్యాః పాదయోరీశ్వరస్య చ ।**
**న్యవేదయజ్జయం తస్మై శంకరాయాథ శంకరః ॥ 149 ॥**

తర్వాత మహాదేవుడైన శివుడు పన్నెండేండ్లపాటు క్రీడావినోదాన్ని జరిపి భక్తుల మేలుకొరకు మళ్ళీ మందరపర్వతం వద్దకు చేరుకున్నాడు. ఈశ్వరుడు వచ్చిన విషయం తెలుసుకొని గణాధిపతులందరు సమూహంగా చేరి బ్రాహ్మణులు సూర్యుని సమీపించినట్టు నిలిచినారు. యోగ్యతలేని వారు ప్రవేశింపరాని పుణ్యభవవాన్ని ప్రవేశించినారు. అక్కడ శివుడు నందీశ్వరుని భైరవుని విష్ణువును చూచినాడు. భక్తితో నమస్కరింపదలచిన నందీశ్వరుని అనుగ్రహించి పరమేశ్వరుడు ముందుగా ప్రేమతో విష్ణువు నాలింగనం చేసుకొన్నాడు. తర్వాత ఆ దేవుడు అనురాగంతో వికసించిన కన్నులుగల దేవిని చూచి ఆ దేవి పాదాలకు తలవంచి నమస్కరించి, ఈశ్వరునికి ప్రణమిల్లి శుభాలను కలుగచేసే భైరవుడు శంకరునికి జయం పలికినాడు.

**భైరవో విష్ణుమాహాత్మ్యం ప్రతీతః పార్శ్వగోఽభవత్ ।**
**శ్రుత్వా తం విజయం శమ్భుర్విక్రమం కేశవస్య చ ॥ 150 ॥**

**సమాస్తే భగవానీశో దేవ్యా సహ వరాసనే ।**
**తతో దేవగణాః సర్వే మరీచిప్రముఖా ద్విజాః ॥ 151 ॥**

**ఆజగ్ముర్మన్దరం ద్రష్టుం దేవదేవం త్రిలోచనమ్ ।**
**యేన తద్విజితం పూర్వం దేవీనాం శతముత్తమమ్ ॥ 152 ॥**
**సమాగతం దైత్యసైన్యమీశదర్శనకాంక్షయా ।**
**దృష్ట్వా వరాసనాసీనం దేవ్యా చన్ద్రవిభూషణమ్ ॥ 153 ॥**
**ప్రణేమురాదరాద్దేవ్యో గాయన్తిస్మాతిలాలసాః ।**
**ప్రణేముర్గిరిజాం దేవీం వామపార్శ్వే పినాకినః ॥ 154 ॥**

భైరవుడు విష్ణుమాహాత్మ్యాన్ని తెలిసి ప్రక్కన నిలువబడినాడు. కేశవుని పరాక్రమాన్ని యుద్ధవిజయాన్ని విని శివుడు దేవితో కూడ శ్రేష్ఠమైన ఆసనంలో కూర్చున్నాడు. తర్వాత దేవతలందరు మరీచిమొదలైన బ్రాహ్మణులు, దేవదేవుడు, త్రిలోచనుడైన శివుని దర్శించటానికి అక్కడికి వచ్చినారు. ఆయన పూర్వం సృజించిన ఉత్తమమైన వందమంది దేవీసమూహాన్ని కూడ చూడ దలచినారు. దేవదర్శనంకోరి రాక్షససైన్యం కూడ దేవితోపాటు శ్రేష్ఠమైన ఆసనంపై కూర్చున్న శివునికి నమస్కరించినది. ఆయన వామభాగంలో ఉన్న దేవి పార్వతికి కూడ ప్రణమిల్లినారు.

**దేవాసనగతాం దేవీం నారాయణమనోమయీమ్ ।**
**దృష్ట్వా సింహాసనాసీనం దేవ్యో నారాయణం తథా ॥ 155 ॥**
**ప్రణమ్య దేవీమీశానం పృష్టవత్యో వరాఙ్గనాః ।**

దివ్యమైన ఆసనాన్నధిష్ఠించి నారాయణ మనోరూపంగా ఉన్నదేవిని సింహాసనాసీనుడైన నారాయణుని కూడ దేవతాస్త్రీలు చూచి భగవంతుడైన ఈశానునికి నమస్కరించి ఆ శ్రేష్ఠ కన్యలిట్లు ప్రశ్నించినారు.

**కన్యా ఊచుః**–కన్యలు పలికారు.

**కస్త్వం విభ్రాజసే కాన్త్యా కేయం బాలా రవిప్రభా ॥ 156 ॥**

**కో న్వయం భాతి వపుషా పఙ్కజాయతలోచనః ।**
**నిశమ్య తాసాం వచనం వృషేన్ద్రవరవాహనః ॥ 157 ॥**

**వ్యాజహార మహాయోగీ భూతాధిపతిరవ్యయః ।**

కాంతితో ప్రకాశిస్తున్న నీవెవరవు? సూర్యకాంతిగల ఈ బాల ఎవరు? పద్మాక్షుడై శరీరకాంతితో ప్రకాశించే ఇతడెవరు? ఆ యోగీశ్వరుడు దేవాంగనల మాటలు విన్న అవ్యయుడు, భూతాధిపతి, వృషభవాహనుడైన శివుడు ఇట్లా చెప్పినాడు.

**అయం నారాయణో గౌరీ జగన్మాతా సనాతనః ॥ 158 ॥**

**విభజ్య సంస్థితో దేవః స్వాత్మానం బహుధేశ్వరః ।**
**న మే విదుః పరం తత్త్వం దేవ్యాశ్చ న మహర్షయః ॥ 159 ॥**

ఇతడు సనాతనుడు నారాయణుడు. ఈమె లోకమాత పార్వతి. భగవంతుడైన ఈశ్వరుడు తననుతాను అనేకవిధాల విభజించుకొని ఉన్నాడు. నామూలతత్త్వాన్ని, దేవిస్వరూపాన్ని మహర్షులుకూడ తెలుసుకోలేరు.

**ఏకోఽయం వేద విశ్వాత్మా భవానీ విష్ణురేవ చ ।**
**అహం హి నిస్పృహః శాన్తః కేవలో నిష్పరిగ్రహః ॥ 160 ॥**

**మామేవ కేశవం ప్రాహుః లక్ష్మీం దేవీమథామ్బికామ్ ।**
**ఏష ధాతా విధాతా చ కారణం కార్యమేవ చ ॥ 161 ॥**

**కర్తా కారయితా విష్ణుర్భుక్తిముక్తిఫలప్రదః ।**
**భోక్తా పుమానప్రమేయః సంహర్తా కాలరూపధృక్ ॥ 162 ॥**

**స్రష్టా పాతా వాసుదేవో విశ్వాత్మా విశ్వతోముఖః ।**
**కూటస్థో హ్యక్షరో వ్యాపీ యోగీ నారాయణోఽవ్యయః ॥ 163 ॥**

**తారకః పురుషో హ్యాత్మా కేవలం పరమం పదమ్ ।**
**సైషా మాహేశ్వరీ గౌరీ మమ శక్తిర్నిరఞ్జనా ॥ 164 ॥**

విశ్వాత్ముడైన విష్ణువు, భవాని-వీరు మాత్రమే పరతత్త్వం తెలుసుకొంటారు. నేను కోరికలు లేనివాడను, శాంతుడను, అద్వితీయుడను, నన్నే కేశవుడంటారు. లక్ష్మీదేవిని పార్వతి అంటారు. ఇతడే ధాత విధాత కారణకార్యాలు కూడ చేసేవాడు చేయించేవాడు భుక్తి ముక్తులను ఫలాల నిచ్చేవాడు విష్ణువు. తెలియవీలుకాని పురుషుడు కాలునిరూపుదాల్చి సంహరించే వాడుకూడ ఇతడే. సృష్టి, దాని రక్షణ, విశ్వాత్మకుడైన వాసుదేవుని పనే, కూటస్థుడు, అక్షరుడు, వ్యాపీ, యోగీ, అవ్యయుడైన నారాయణుడే, తారకుడైన పురుషుడు, ఆత్మరూపుడు, కేవల పరమపదస్థానము ఇతడే. ఈ మహేశ్వరి గౌరి నాశక్తి. మాలిన్యం లేనిది.

**శాన్తా సత్యా సదానన్దా పరంపదమితి శ్రుతిః ।**
**అస్యాం సర్వమిదం జాతమత్రైవ లయమేష్యతి ॥ 165 ॥**

**ఏషైవ సర్వభూతానాం గతీనాముత్తమా గతిః ।**
**తయాఽహం సఙ్గతో దేవ్యా కేవలో నిష్కలః పరః ॥ 166 ॥**

**పశ్యామ్యశేషమేవాహం పరమాత్మాన మవ్యయమ్ ।**
**తస్మాదనాది మద్వైతం విష్ణుమాత్మాన మీశ్వరమ్ ॥ 167 ॥**

**ఏకమేవ విజానీథ తతో యాస్యథ నిర్వృతిమ్ ।**
**మన్యన్తే విష్ణుమవ్యక్త మాత్మానం శ్రద్ధయాఽన్వితాః ॥ 168 ॥**

**యే భిన్నదృష్ట్యా చేశానం పూజయన్తో న మే ప్రియాః ।**
**ద్విషన్తి యే జగత్సూతిం మోహితా రౌరవాదిషు ॥ 169 ॥**

**పత్యమానా న ముచ్యన్తే కల్పకోటి శతైరపి ।**

ఈ గౌరి శాంతురాలు, సత్యస్వరూప, సదా ఆనందం కలది. పరమమైన స్థానమని వేదం చెపుతున్నది. ఈ సర్వం ఆమెలోనే పుట్టి ఇక్కడే నశిస్తున్నది. ఈమెయే సర్వభూతాలకు గతి. అన్ని గతుల్లో శ్రేష్ఠమైన గతి ఈమె. ఈదేవితో కలిసి ఉన్న నేను కేవలుడను. భేదంలేని వాణ్ణి. శ్రేష్ఠుడను కూడ. నాశం లేనివాడు, పరమాత్మ అయినవాడు, పుట్టుక భేదం లేని వాడు, ఆత్మస్వరూపుడు, ఈశ్వరుడైన విష్ణువును నేను సంపూర్ణంగ దర్శిస్తున్నాను. ఈశ్వరుని విష్ణువును ఒకనిగనే తెలిసికొనండి, అందువల్ల మీరు శాంతిని పొందుతారు. శ్రద్ధగలవారు విష్ణువును అవ్యక్త

ఆత్మగా భావిస్తారు. భేదదృష్టితో శివుని పూజించేవారు నాకు ప్రియులు కారు. ప్రపంచానికి కారణభూతుడైన దేవుని మోహితులై ద్వేషించేవారు రౌరవాదులలో పడవేయబడి కల్పకోటి శతములలో కూడా విడుదల పొందలేరు.

**తస్మాదశేషభూతానాం రక్షకో విష్ణురవ్యయః ॥ 170 ॥**

**యథావదిహ విజ్ఞాయ ధ్యేయః సర్వాపది ప్రభుః ।**
**శ్రుత్వా భగవతో వాక్యం దేవాః సర్వే గణేశ్వరాః ॥ 171 ॥**

**నేముర్నారాయణం దేవం దేవీం చ హిమశైలజామ్ ।**
**ప్రార్థయామాసురీశానే భక్తిం భక్తజనప్రియే ॥ 172 ॥**

**భవానీ పాదయుగళే నారాయణపదామ్బుజే ।**
**తతో నారాయణం దేవం గణేశా మాతరోఽపి చ ॥ 173 ॥**

**న పశ్యన్తి జగత్సూతిం తదద్భుతమివాభవత్ ।**
**తదన్తరే మహాదైత్యో హ్యన్ధకో మన్మథాన్ధకః ॥ 174 ॥**

**మోహితో గిరిజాం దేవీమాహర్తుం గిరిమాయయౌ ।**

అందువల్ల సర్వప్రాణులకు అవ్యయుడైన విష్ణువే రక్షకుడు. ఈలోకంలో యథార్థాన్ని తెలుసుకొని అన్ని ఆపదల్లోను ప్రభువైన విష్ణువు మాత్రమే ధ్యానింపదగినవాడు. భగవంతుని వాక్యాన్ని విని దేవతలు గణేశ్వరులందరు నారాయణుడైన భగవంతునకు హిమవత్పుత్రిక పార్వతికి నమస్కరించినారు. భక్తులకిష్టుడైన ఈశ్వరునియందు తమకు భక్తి కల్గించమని ప్రార్థించినారు. పార్వతీదేవి పాదాలకు నారాయణుని పాదకమలాలకు నమస్కరించి గణేశ్వరులు మాతృగణం కూడ జగత్సూతి అయిన నారాయణుని చూడలేక పోయినారు. అది అద్భుతంగా జరిగింది. ఈలోపల అంధకుడనే రాక్షసుడు మన్మథవికారంతో గుడ్డివాడై పార్వతీదేవి నపహరించటానికి కైలాసానికి వచ్చినాడు.

**అథానన్తవపుః శ్రీమాన్యోగీ నారాయణోఽమలః ॥ 175 ॥**
**తత్రైవావిరభూద్దైత్యైర్యుద్ధాయ పురుషోత్తమః ।**

అనంత శరీరాలుకల శ్రీమంతుడు యోగీశ్వరుడు నిర్మలుడైన నారాయణుడు రాక్షసులతో పోరుకక్కడే ప్రత్యక్షమైనాడు.

**కృత్వాఽథ పార్శ్వే భగవన్తమీశో యుద్ధాయ విష్ణుం గణదేవముఖ్యైః ।**
**శిలాదపుత్రేణ చ మాతృకాభిః స కాలరుద్రోఽపి జగామ దేవః ॥ 176 ॥**

**త్రిశూలమాదాయ కృశానుకల్పం స దేవదేవః ప్రయయౌ పురస్తాత్ ।**
**తమన్వయుస్తే గణరాజవర్యాః జగామ దేవోఽపి సహస్రబాహుః ॥ 177 ॥**

అపుడు భగవంతుడైన విష్ణువును తన ప్రక్కభాగంలో నుంచుకొని గణదేవముఖ్యులతో శిలాదుని కుమారుడైన నందితో మాతృకాసమూహంతో కూడి దేవదేవుడైన శివుడు కాలరుద్రుడై యుద్ధానికి వెళ్ళాడు. అగ్నిసదృశమైన

త్రిశూలాన్ని ధరించి ఆ దేవదేవుడు ముందు నడచినాడు. అతనిని గణాధిపతులు అనుసరించినారు. సహస్ర బాహువులుగల విష్ణువు కూడ వెడలినాడు.

**రరాజ మధ్యే భగవాన్ సురాణాం వివాహనో వారిజపర్ణవర్ణః ।**
**తదా సుమేరోః శిఖరాధిరూఢ స్త్రిలోకదృష్టి ర్భగవానివార్కః ॥ 178 ॥**

**జయన్ననాదిర్భగవానమేయో హరః సహస్రాకృతిరావిరాసీత్ ।**
**త్రిశూలపాణిర్గగనే సుఘోషః పపాత దేవోపరి పుష్పవృష్టిః ॥ 179 ॥**

**సమాగతం వీక్ష్య గణేశరాజం సమావృతం దైత్యరిపుం గణేశైః ।**
**యుయోధ శక్రేణ సమాతృకాభిర్గణై రశేషై రమరప్రధానైః ॥ 180 ॥**

పక్షివాహనుడు, వారిజపత్రవర్ణం కలవాడు, భగవంతుడైన విష్ణువు దేవతల మధ్య సుమేరుపర్వత శిఖరాన్నధిష్ఠించి ముల్లోకాలకు నేత్రరూపుడైన సూర్యభగవానునివలె ప్రకాశించినాడు. జననం లేనివాడు, కొలుచుటకు వీలుకానివాడు, జయశీలుడైన హరుడు, వేయి ఆకృతులు కలవానిగా సాక్షాత్కరించినాడు. త్రిశూలపాణి అయిన దేవుడవతరించగా ఆకాశంనుండి గొప్పధ్వనితో పుష్పవర్షము ఆ దేవునిపై కురిసినది. అప్పుడక్కడకు వచ్చిన గణేశ్వరుని చూచి గణేశులతో ఆవరింపబడియున్న అసురారి విష్ణువును చూచి మాతృకలతో దేవతా ప్రధానులైన గణాలతో ఇంద్రునితో కూడా అంధకాసురుడు యుద్ధము చేసినాడు.

**విజిత్య సర్వానపి బాహువీర్యాత్  స సంయుగే శమ్భుమనన్తధామా ।**
**సమాయయౌ యత్ర స కాలరుద్రో విమానమారుహ్యా విహీనసత్త్వః ॥ 181 ॥**

**దృష్ట్వాఽన్ధకం సమాయాన్తం భగవాన్గరుడధ్వజః ।**
**వ్యాజహార మహాదేవం భైరవం భూతిభూషణమ్ ॥ 182 ॥**

**హన్తుమర్హసి దైత్యేశమన్ధకం లోకకణ్టకమ్ ।**
**త్వామృతే భగవాన్శక్తో హన్తా నాన్యోఽస్య విద్యతే ॥ 183 ॥**

**త్వం హర్తా సర్వలోకానాం కాలాత్మా హ్యైశ్వరీ తనుః ।**
**స్తూయతే వివిధైర్మన్త్రైర్వేదవిద్భిర్విచక్షణైః ॥ 184 ॥**

తన భుజపరాక్రమం వల్ల యుద్ధంలో అందరిని జయించి అనంతమైన తేజశ్శాలి అయిన అంధకుడు బలహీనుడై విమానమెక్కి ఉన్న కాలరుద్రుని వద్దకు వచ్చినాడు. తనవైపే వస్తున్న అంధకాసురుని చూచి భగవానుడైన గరుడధ్వజుడు భస్మాలంకారియై భయంకరంగా ఉన్న మహాదేవుని గూర్చి ఇట్లన్నాడు- లోకాలకు కంటకప్రాయుడైన అంధకాసురుని నీవు మాత్రమే చంపగలవు. నీవు తప్ప మరొకడు ఇతనిని చంపగలవాడు లోకంలో లేడు. సమస్తలోకాలను సంహరింపగలవాడవు నీవు. ఈశ్వరశరీరం కాల స్వరూపమే కదా! ఆ రూపం విచక్షణులైన వేదవిదులచేత వివిధ మంత్రములతో పొగడబడుతున్నది.

**స వాసుదేవస్య వచో నిశమ్య భగవాన్ హరః ।**
**నిరీక్ష్య విష్ణుం హననే దైత్యేన్ద్రస్య మతిం దధౌ ॥ 185 ॥**

**జగామ దేవతానీకం గణానాం హర్షవర్ధనమ్ ।**
**స్తువన్తి భైరవం దేవమన్తరిక్షచరా జనాః ॥ 186 ॥**

**జయానన్త మహాదేవ కాలమూర్తే సనాతన ।**
**త్వమగ్నిః సర్వభావానామన్తస్తిష్ఠసి సర్వగః ॥ 187 ॥**

**త్వమన్తరో లోకకర్తా త్వన్ధాతా హరిరవ్యయః ।**
**త్వం బ్రహ్మా త్వం మహాదేవ స్త్వం ధామ పరమం పదమ్ ॥ 188 ॥**

**ఓఙ్కారమూర్తి ర్యోగాత్మా త్రయీ నేత్రస్త్రిలోచనః ।**
**మహావిభూతిర్విశ్వేశో జయానన్త జగత్పతే ॥ 189 ॥**

వాసుదేవుని మాట విని విష్ణువు వైపుచూచి భగవంతుడైన ఆ శివుడు రాక్షసరాజును చంపటానికి సంకల్పించాడు. గణాలకు సంతోషాన్ని పెంపొందించే దేవతాసమూహం వద్దకు శంకరుడు వెళ్ళాడు. ఆకాశచరులు భైరవుని ప్రశంసింపసాగినారు. అనంతా! మహాదేవా! కాలరూపా! సనాతనా! నీకు జయం. నీవు అగ్నివి. సర్వభావాల అంతరంగంలో సర్వగుడవు. నీవు అంతకుడవు. లోకాలను సృష్టించేవాడవు. బ్రహ్మావు నీవు. అవ్యయుడవైన హరివి. పరబ్రహ్మము నీవే. నీవు శివుడవు. పరమపదస్థానానివి నీవే. నీవు ఓంకార స్వరూపుడవు. యోగాత్మకుడవు. మూడు వేదాలు నీ కన్నులు. గొప్ప విభూతివి. విశ్వానికి ప్రభుడవు. అనంతుడవైన లోకపతీ! నీకు జయము.

**తతః కాలాగ్నిరుద్రోఽసౌ గృహీత్వాఽన్ధకమీశ్వరః ।**
**త్రిశూలాగ్రేషు విన్యస్య ప్రననర్త సతాఙ్గతిః ॥ 190 ॥**

**దృష్ట్వాఽన్ధకం దేవగణాః శూలప్రోతం పితామహః ।**
**ప్రణేమురీశ్వరం దేవం భైరవం భవమోచనమ్ ॥ 191 ॥**

**అస్తువన్మునయః సిద్ధా జగుర్గన్ధర్వకిన్నరాః ।**
**అన్తరిక్షేఽప్సరస్సంఘా నృత్యన్తి స్మ మనోహరాః ॥ 192 ॥**

**సంస్థాపితోఽథ శూలాగ్రే సోఽన్ధకో దగ్ధకిల్బిషః ।**
**ఉత్పన్నాఖిలవిజ్ఞానస్తుష్టావ పరమేశ్వరమ్ ॥ 193 ॥**

తర్వాత ప్రళయాగ్నివంటి రుద్రుడు సత్పురుషప్రాప్యుడైన ఈశ్వరుడు ఆ అంధకాసురుని పట్టుకొని తన త్రిశూలం కొనలలో నిలిపి బాగా నృత్యం చేసినాడు. శూలానికి తగిల్చిన అంధకుని చూచి దేవగణం, బ్రహ్మ సంసారబంధాన్ని విడిపించే భయంకరుడైన ఈశ్వరునకు నమస్కరించినారు. ఆయనను మునులు, సిద్ధులు నుతించినారు. గంధర్వులు, కిన్నరులు పాడినారు. ఆకాశంలో అందగత్తెలైన అప్సరసలు నృత్యం చేసినారు.

శూలంకొసలో నిల్పిన అంధకుడు పాపాలన్నీ దగ్ధంకాగా సర్వవిషయవిజ్ఞానం కలిగినవాడై ఆ పరమేశ్వరుని స్తుతించాడు.

**అన్ధక ఉవాచ:–** అంధకుడు పలికాడు.

**నమామి మూర్ధ్నా భగవన్తమేకం సమాహితోఽ యం విదురీశతత్త్వమ్ ।**
**పురాతనం పుణ్యమనన్తరూపం కాలం కవిం యోగవియోగహేతుమ్ ॥ 194 ॥**

నేను సావధానుడనై అద్వితీయుడు, భగవంతుడు, పురాతనుడు, పుణ్యరూపుడు, అనంతరూపుడు, కాలుడు, కవి, సంయోగవియోగాలకు కారణభూతుడు, భగవత్తత్త్వంగా పండితులు గుర్తించే ఆ ఈశ్వరునికి తలవంచి నమస్కరిస్తున్నాను.

**దంష్ట్రాకరాళం దివి నృత్యమానం హుతాశవక్త్రం జ్వలనార్కరూపమ్ ।**
**సహస్రపాదాక్షిశిరోభియుక్తం భవన్తమేకం ప్రణమామి రుద్రమ్ ॥ 195 ॥**

దంతాలతో భయంకరరూపుడు, ఆకాశంలో నర్తించేవాడు, అగ్ని ముఖంగా కలవాడు, జ్వలనార్క రూపుడు, వేయి పాదాలు, కన్నులు, తలలు కలవాడు అయిన రుద్రునకు నమస్కరిస్తున్నాను.

**జయాదిదేవామరపూజితాంఘ్రే విభాగహీనామలతత్త్వరూప ।**
**త్వమగ్నిరేకో బహుధాఽభిపూజ్యో బాహ్యాదిభేదైరఖిలాత్మరూపః ॥ 196 ॥**

**త్వామేకమాహుః పురుషం పురాణమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।**
**త్వం పశ్యసీదం పరిపాస్యజస్రం త్వమన్తకో యోగిగణానుజుష్టః ॥ 197 ॥**

**ఏకోఽన్తరాత్మా బహుధా నివిష్టో దేహేషు దేహాదివిశేషహీనః ।**
**త్వమాత్మతత్త్వం పరమాత్మశబ్దం భవన్తమాహుః శివమేవ కేచిత్ ॥ 198 ॥**

ఓ ఆదిదేవా! దేవతల పూజలందే పాదాలు కలవాడా! అవయవవిభాగం లేనివాడవు. నిర్మలతత్త్వరూపుడవు. నీకు జయం, కేవలాగ్ని రూపుడవు, బాహ్యాది అనన్తభేదాలతో పూజలందేవాడవు, సర్వాత్మరూపుడవు, అద్వితీయుడవు, పురాణపురుషుడవని, సూర్యునివంటి తేజస్సు కలవాడవని, అంధకారానికతీతుడవని, నిన్ను గూర్చి చెబుతారు. నీవీ విశ్వాన్ని ఎల్లవేళలా చూస్తూ కాపాడుతున్నావు. యోగిబృందంచే సేవించబడే నీవు ప్రళయకారకుడవు. నీవు అంతరాత్మరూపుడవై అనేక శరీరాల్లో అనేక విధాల నిలచి ఉన్నావు. నీకు దేహాది భేదాలు లేవు. ఆత్మతత్త్వానివి. పరమాత్మశబ్దవాచ్యుడవు. కొందరు శివునిగా నిన్ను పేర్కొంటారు.

**త్వమక్షరం బ్రహ్మ పరం పవిత్రమానన్దరూపం ప్రణవాభిధానమ్ ।**
**త్వమీశ్వరో వేదవిదాం ప్రసిద్ధః స్వాయమ్భువోఽశేషవిశేషహీనః ॥ 199 ॥**

నీవు నాశంలేని పరబ్రహ్మ స్వరూపుడవు, పవిత్రుడవు, ఓంకారశబ్దవాచ్యుడవు, ఆనందస్వరూపుడవు. వేదవేత్తలకు నీవు ఈశ్వరునిగా ప్రసిద్ధుడవు, సర్వభేద శూన్యుడవైన నీవు స్వాయంభువుడవు.

**త్వమిన్ద్రరూపో వరుణోఽగ్నిరూపో హంసః ప్రాణో మృత్యురన్తోఽసి యజ్ఞః ।**
**ప్రజాపతిర్భగవానేకరూపో నీలగ్రీవః స్తూయసే వేదవిద్భిః ॥ 200 ॥**

నీవు ఇంద్ర వరుణ అగ్ని స్వరూపుడవు. హంసవు. ప్రజాపతివి. ప్రాణ మృత్యు యజ్ఞ రూపానివి. ఒకే ఆకారంకల భగవంతుడవు. నీలకంఠుడవని వేదవిదులు కొనియాడుతున్నారు.

**నారాయణస్త్వం జగతామనాదిః పితామహస్త్వం ప్రపితామహశ్చ ।**
**వేదాన్తగుహ్యోపనిషత్సు గీతః సదాశివస్త్వం పరమేశ్వరోఽసి ॥ 201 ॥**

లోకాలకు ఆది లేని నారాయణుడవు నీవు. పితామహుడు ప్రపితామహుడు కూడ నీవే. వేదాంతరహస్యాలున్న ఉపనిషత్తులు నిన్ను గానం చేస్తున్నాయి. సదాశివుడవు పరమేశ్వరుడవు నీవే.

**నమః పరస్మై తమసః పరస్తాత్పరాత్మనే పఞ్చనవాన్తరాయ ।**
**త్రిశక్త్యతీతాయ నిరఞ్జనాయ సహస్రశక్త్యాసనసంస్థితాయ ॥ 202 ॥**

తమస్సుకతీతుడవు, పరమపురుషుడవైన పరమాత్మకు నమస్కారం, పంచభూతాల నవశక్తుల అంతరంగానివి. త్రివిధశక్తులకతీతుడవు. మాలిన్యం లేనివాడవు. వేయివిధాల శక్తిస్థానాల్లో నిలిచి ఉన్న నీకు నమస్కారం.

**త్రిమూర్తయేఽనన్తపదాత్మమూర్తయే జగన్నివాసాయ జగన్మయాయ ।**
**నమో జనానాం హృది సంస్థితాయ ఫణీన్ద్రహారాయ నమోఽస్తు తుభ్యమ్ ॥ 203 ॥**

త్రిమూర్త్యాత్మకుడు అనంతములైన ఆత్మలస్థానములు కలవాడవు. ఆత్మమూర్తి. లోకాలకావాసమైనవాడు లోకమయుడు, జనుల హృదయాల్లో ఉండేవాడు, నాగాభరణం కల శివునకు నమస్కారం.

**మునీన్ద్రసిద్ధార్చితపాదపద్మ ఐశ్వర్యధర్మాసనసంస్థితాయ ।**
**నమః పరాన్తాయ భవోద్భవాయ సహస్రచన్ద్రార్కసహస్రమూర్తే ॥ 204 ॥**

మునీంద్రులచేత సిద్ధులచేత పూజింపబడే పాదపద్మాలు కలవాడా! ఐశ్వర్యమనే ధర్మాసనంలో కూర్చొని ప్రళయకారకుడు భవుని జన్మకారకుడవై వేయిమంది సూర్యచంద్రుల కాంతి స్వరూపాన్ని ధరించినవాడా! నీకు నమస్కారము.

**నమోఽస్తు సోమాయ సుమధ్యమాయ నమోఽస్తు దేవాయ హిరణ్యబాహో ।**
**నమోఽగ్ని చన్ద్రార్కవిలోచనాయ నమోఽమ్బికాయాః పతయే మృడాయ ॥ 205 ॥**

మంచి నడుము కల సోమునకు నమస్కారం. హిరణ్యబాహువైన దేవునకు నమస్కారం. అగ్ని, చంద్రసూర్యులు నేత్రాలుగా ఉన్న నీకు నమస్కారము. పార్వతిపతియైన సుఖస్వరూపునకు నా ప్రణామం.

**నమోఽస్తు గుహ్యాయ గుహాన్తరాయ వేదాన్తవిజ్ఞానవినిశ్చితాయ ।**
**త్రికాలహీనామలధామధామ్నే నమో మహేశాయ నమః శివాయ ॥ 206 ॥**

రహస్యస్వరూపుడు. హృదయ గుహయందుండే వాడు. వేదాంతశాస్త్రవిజ్ఞానంతో నిశ్చయింపబడినవాడు అయిన కాలత్రయభేదంలేని నిర్మలతేజస్సుకల మహేశునకు, శివునకు నమస్కారము.

**ఏవం స్తుతస్స భగవాన్ శూలాగ్రాదవతార్య తమ్ ।**
**తుష్టః ప్రోవాచ హస్తాభ్యాం స్పృష్ట్వా చ పరమేశ్వరః ॥ 207 ॥**

**ప్రీతోఽహం సర్వథా దైత్య స్తవేనానేన సాంప్రతమ్ ।**
**సంప్రాప్య గాణపత్యం మే సన్నిధానే సదా వస ॥ 208 ॥**

ఈ విధంగా స్తుతింపబడిన భగవంతుడైన శంకరుడు త్రిశూలంనుండి అంధకుని దింపి సంతోషించి అతనిని చేతులతో పట్టుకొని ఇట్లా పలికినాడు - ఓ దైత్యుడా! నీ ఈ స్తోత్రంతో నేనన్నివిధాల తృప్తిపొందినాను. గాణపత్యాధికారాన్ని పొంది నాసన్నిధిలోనే ఎల్లపుడు ఉండు.

**అరోగశ్ఛిన్నసన్దేహో దేవైరపి సుపూజితః ।**
**నన్దీశ్వరస్యానుచరః సర్వదుఃఖవివర్జితః ॥ 209 ॥**

రోగాలులేక సంశయాలు తొలగి, దేవతలచే బాగా పూజింపబడుతూ, నందీశ్వరునికనుచరునిగా, అన్ని దుఃఖాలనుండి విడివడినవాడవై నివసించు.

**ఏవం వ్యాహృతిమాత్రే తు దేవదేవేన దేవతాః ।**
**గణేశ్వరం మహాదైత్యమన్ధకం దేవసన్నిధౌ ॥ 210 ॥**

**సహస్రసూర్యసఙ్కాశం త్రినేత్రం చన్ద్రచిహ్నితమ్ ।**
**నీలకణ్ఠం జటామౌలిం శూలాసక్తం మహాకరమ్ ॥ 211 ॥**

దేవదేవుడైన శంకరుడిట్లా చెప్పగానే దేవతలందరు గణాధిపతి గొప్పరాక్షసుడైన అంధకాసురుని శివుని సన్నిధానంలోనే వేయిమంది సూర్యుల తేజస్సుతో సమానునిగా త్రినేత్రునిగా చంద్రకళగుర్తున్న వానిగా నీలకంఠునిగా జటాజూటమున్న శిరసుకల్గి శూలమందాసక్తికల హస్తమున్నవానిగా చూచినారు.

**దృష్ట్వా తం తుష్టువుర్దైత్యమాశ్చర్యం పరమం గతాః ।**
**ఉవాచ భగవాన్విష్ణుః దేవదేవం స్మయన్నివ ॥ 212 ॥**

శివుని ఆకారం పొందిన అంధకుని చూచి గొప్ప ఆశ్చర్యం పొంది దేవతలు అతనిని కొనియాడినారు. అప్పుడు భగవానుడైన విష్ణువు చిరునవ్వు నవ్వుతున్నట్టుగా దేవదేవుని గూర్చి ఇట్లన్నాడు.

**స్థానే తవ మహాదేవ ప్రభావః పురుషో మహాన్ ।**
**నేక్షతే జ్ఞాతిజాన్దోషాన్ గృహ్ణాతి చ గుణానపి ॥ 213 ॥**

ఓ మహాదేవా! నీ ప్రభావం చాల గొప్పది. ఉచితమైనది కూడ. గొప్పవాడు తమ బంధువుల దోషాలను చూడడు. వారిలోని గుణాలనే గ్రహిస్తాడు.

**ఇతీరితోఽథ భైరవో గణేశదేవపుంగవః**
**స కేశవః సహాన్ధకో జగామ శఙ్కరాన్తికమ్ ।**
**నిరీక్ష్య దేవమాగతం స శంకరః సహాన్ధకం**
**సమాధవం సమాతృకం జగామ నిర్వృతిం హరః ॥ 214 ॥**

ఇట్లా పలుకగా గణేశదేవతాశ్రేష్ఠుడైన భైరవుడు విష్ణువుతో, అంధకునితో కూడ శంకరుని దగ్గరకు వెళ్ళాడు. అంధకునితో కూడ తన వద్దకు వచ్చిన విష్ణువును చూచి మాతృగణాలతో కూడ శివుడు సంతోషించినాడు.

**ప్రగృహ్య పాణినేశ్వరో హిరణ్యలోచనాత్మజం**
**జగామ యత్ర శైలజా విమానమీశవల్లభా ।**
**విలోక్య సా సమాగతం పతిం భవార్తిహారిణం**
**ఉవాచ సాన్ధకం సుఖం ప్రసాదమన్ధకం ప్రతి ॥ 215 ॥**

హిరణ్యాక్షుని కుమారుడైన అంధకాసురుని ఈశ్వరుడు తనచేత పట్టుకొని పార్వతి నివసించిన విమానం దగ్గరకు వెళ్ళినాడు. ఆ పార్వతి తన వద్దకు వచ్చిన భర్తను సంసారతాపాన్ని నివారించే వానిని చూచి అంధకునితో కూడ ఉన్న శివుని కుశలప్రశ్న వేసినది. అంధకునిపై అనుగ్రహదృష్టిని ప్రసరింపచేసినది.

**అథాన్ధకో మహేశ్వరీం దదర్శ దేవపార్శ్వగామ్ ।**
**పపాత దణ్డవత్క్షితౌ ననామ పదపాద్మయోః ॥**
**నమామి దేవవల్లభామనాది మద్రిజా మిమామ్ ।**
**యతః ప్రధానపూరుషౌ నిహన్తి యాఽఖిలం జగత్ ॥ 216 ॥**

తర్వాత అంధకుడు భగవంతుని ప్రక్కన మహేశ్వరిని చూచినాడు. నేలపై సాష్టాంగపడినాడు. ఆమె పాదపద్మాలకు నమస్కరించినాడు. ఈశ్వరునికిల్లాలైనది, జన్మరాహిత్యంగల శైలజకు నమస్కరిస్తున్నాను. ప్రధానతత్త్వము, పురుషుడు ఈ దేవివల్లనే కలుగుదురు. సమస్త జగత్తు నీమెయే లయింప చేస్తుంది.

**విభాతి యా శివాసనే శివేన సాకమవ్యయా**
**హిరణ్మయేఽతినిర్మలే నమామి తాం హిమాద్రిజామ్ ॥**
**యదన్తరాఽఖిలంజగజ్జగన్తి యాన్తి సంక్షయం ।**
**నమామి యత్ర తాముమామశేషదోషవర్జితామ్ ॥ 217 ॥**

ఈదేవి శివుని ఆసనమున బంగారంతో చేసినది అతినిర్మలమైన దానిపై శివునితో కూడ ప్రకాశిస్తున్న హిమవత్పుత్రికకు నమస్కరిస్తున్నాను. ఈ దేవి మూలంగానే లోకాలన్ని సృష్టినొంది నశించుచున్నవి. అట్టి సమస్తదోషరహిత అయిన ఉమాదేవికి నమస్కారం.

**న జాయతే న హీయతే న వర్ధతే చ తాముమాం**
**నమామి తాం గుణాతిగాం గిరీశపుత్రికామిమామ్ ।**

**క్షమస్వ దేవి శైలజే కృతం మయా విమోహితం**
**సురాసురైర్నమస్కృతం నమామి తే పదామ్బుజమ్ ॥ 218 ॥**

ఆమె లేనట్టయితే పుట్టుట క్షీణించుట వృద్ధి పొందుట అనేవి జరుగవు. అటువంటి గుణాతీతురాలైన పర్వతరాజపుత్రి ఈదేవికి నమస్కరిస్తున్నాను. ఓ పార్వతీ! నేను భ్రాంతినొంది చేసిన అపరాధాన్ని క్షమించుము, దేవదానవులు నమస్కరించే నీపాద పద్మాలకు నమస్కారము చేస్తున్నాను.

**ఇత్థం భగవతీ దేవీ భక్తినమ్రేణ పార్వతీ ।**
**సంస్తుతా దైత్యపతినా పుత్రత్వే జగృహేఽన్ధకమ్ ॥ 219 ॥**

ఈ విధంగా భగవతి పార్వతీదేవిని భక్తితో వినీతుడైన రాక్షసపతి అంధకుడు స్తోత్రం చేయగా అతనిని దేవి పుత్రునిగా స్వీకరించింది.

**తతః సమాతృభిః సార్ధం భైరవో రుద్రసంభవః ।**
**జగామ త్వాజ్ఞయా శమ్భోః పాతాలం  పరమేశ్వరః ॥ 220 ॥**

**యత్ర సా తామసీ విష్ణోర్మూర్తిః సంహారకారికా ।**
**సమాస్తే హరిరవ్యక్తో నృసింహాకృతిరీశ్వరః ॥ 221 ॥**

తరువాత శంకరునివల్ల జనించిన భైరవుడు మాతలతో కూడ శివుని ఆజ్ఞ పొంది పాతాళానికి వెళ్ళినాడు. విష్ణువుయొక్క సంహారశక్తిగల తమోగుణరూపం ఉన్నచోట ప్రభువైన హరి నరసింహరూపం గలవాడై అవ్యక్తరూపుడుగా ఉన్నచోటు చేరాడు.

**తతోఽనన్తాకృతిః శమ్భుః శేషేణాపి సుపూజితః ।**
**కాలాగ్నిరుద్రో భగవాన్ యుయోజాత్మానమాత్మని ॥ 222 ॥**

అనంతునిరూపం ధరించిన శంకరుడు శేషునిచే బాగా పూజింపబడి ప్రళయకాలంలోని అగ్నివంటి రుద్రరూపుడై స్వస్వరూపాన్ని ఆత్మలో సంయోజనం చేసుకున్నాడు.

**యుఞ్జతస్తస్య దేవస్య సర్వా ఏవాథ మాతరః ।**
**బుభుక్షితా మహాదేవం ప్రణమ్యాహుస్త్రిలోచనమ్ ॥ 223 ॥**

ఆత్మసంయోజనంచేస్తున్న ఆ పరమేశ్వరునిగూర్చి మాతృగణ దేవతలందరు ఆకలిగొన్నవారై త్రినేత్రుడైన మహాదేవునికి నమస్కరించి ఇట్లన్నారు.

**మాతర ఊచుః :**-మాతృదేవతలు పలికారు.

**బుభుక్షితా మహాదేవ త్వమనుజ్ఞాతుమర్హసి ।**
**త్రైలోక్యం భక్షయిష్యామో నాన్యథా తృప్తిరస్తి నః ॥ 224 ॥**

ఓ మహాదేవా! మేము గొప్ప ఆకలితో ఉన్నాము. నీవు మాకాజ్ఞ ఇమ్ము. మేము మూడు లోకాలను భక్షిస్తాము. లేకుంటే మాకు తృప్తి కలుగదు.

**ఏతావదుక్త్వా వచనం మాతరో విష్ణుసంభవాః ।**
**భక్షయాంచక్రిరే సర్వం త్రైలోక్యం సచరాచరమ్ ॥ 225 ॥**

విష్ణువువల్ల కలిగిన ఆ మాతృదేవతలు ఇట్లా పలికి చరాచరరూపమైన లోకత్రయాన్ని సంపూర్ణంగా భక్షించినారు.

**తతః స భైరవో దేవో నృసింహవపుషం హరిమ్ ।**
**దధ్యౌ నారాయణం దేవం ప్రణమ్య చ కృతాఞ్జలిః ॥ 226 ॥**

తర్వాత ఆ భైరవుడు నరసింహరూపంలో ఉన్న దేవుడు నారాయణునికి నమస్కరించి చేతులు జోడించి ధ్యానించినాడు.

**ఉమేశచిన్తితం జ్ఞాత్వా క్షణాత్ప్రాదురభూద్ధరిః ।**
**విజ్ఞాపయామాస చ తం భక్షయన్తీహ మాతరః ॥ 227 ॥**

పార్వతీపతి అయిన శివుని ఆలోచనను గమనించి విష్ణువు వెంటనే అక్కడ సాక్షాత్కరించినాడు. అతనితో భైరవుడు ఈ మాతృదేవతలు లోకాలను భక్షిస్తున్నారని విన్నవించినాడు.

**నివారయాఽఽశు త్రైలోక్యం త్వదీయం భగవన్నితి ।**
**సంస్మృతా విష్ణునా దేవ్యో నృసింహవపుషా పునః ॥ 228 ॥**

**ఉపతస్థుర్మహాదేవం నరసింహాకృతిం తతః ।**

ఓ భగవంతుడా! శీఘ్రంగా ఈ భక్షణను నివారించు. ఈ లోకత్రయం నీ అధీనంలోనిది అని చెప్పగానే నరసింహశరీరాన్ని దాల్చిన హరి స్మరించగానే ఆ మాతృదేవతలు మహాదేవుని నరసింహాకృతిని చేరినారు.

**సంప్రాప్య సన్నిధిం విష్ణోః సర్వసంహారకారికాః ॥ 229 ॥**

**ప్రదదుః శమ్భవే శక్తిం భైరవాయాతితేజసే ।**
**అపశ్యంస్తా జగత్సూతిం నృసింహమతిభైరవమ్ ॥ 230 ॥**

మిక్కిలి తేజోవంతుడైన భైరవునకు శివునికి శక్తి నందచేసినారు. లోకాలకు జన్మకారకుడు మిక్కిలి భయంకరుడైన నరసింహుని ఆ మాతృదేవతలు దర్శించుకున్నారు.

**క్షణాదేకత్వమాపన్నం శేషాహిం చాపి మాతరః ।**
**వ్యాజహార హృషీకేశో యే భక్తాః శూలపాణయే ॥ 231॥**

**యే చ మాం సంస్మరన్తీహ పాలనీయాః ప్రయత్నతః ।**
**మమైవ మూర్తిరతులా సర్వసంహారకారికా ॥ 232 ॥**

ఆ మాతృదేవతలు క్షణకాలంలో ఏకత్వాన్ని పొంది శేషునికూడ చూచినారు. అపుడు హృషీకేశుడు ఇట్లన్నాడు–శివభక్తులు ఇక్కడ నన్ను తలచేవారు ప్రయత్నపూర్వకంగా రక్షింపదగినవారే. సర్వసంహారకార్యాన్ని జరిపించేది నాశరీరమే.

**మహేశ్వరాఙ్గసంభూతా భుక్తిముక్తిప్రదాయినీ ।**
**అనన్తో భగవాన్కాలో ద్విధాఽవస్థో మమైవ తు ॥ 233 ॥**
**తామసీ రాజసీ మూర్తిర్దేవదేవశ్చతుర్ముఖః ।**

ఇది మహేశ్వరశరీరంతో సంబంధం కల్గి భుక్తిని ముక్తిని ప్రసాదిస్తుంది. అనవరతము మహనీయమైన కాలం రెండు విధాలుగా విభాగాన్నిపొంది నా తామస, రాజసమూర్తులుగా ఉంటుంది.

**సోఽహం దేవో దురాధర్షః కాలో లోకప్రకాలనః ॥ 234 ॥**

చతుర్ముఖుడైన దేవదేవుడు బ్రహ్మను నేనే. ఇతరులెదిరింపలేని లోకాలను లయింపచేసే యముడను నేనే.

**భక్షయిష్యామి కల్పాన్తే రౌద్రేణ నిఖిలం జగత్ ।**
**యా సా విమోహినీమూర్తి ర్మమ నారాయణాహ్వయా ॥ 235 ॥**

కల్పాంతంలో రౌద్రరూపంతో జగత్తును భక్షిస్తాను. నారాయణుడనే పేరు గల నా మూర్తి సర్వజగత్తుని మోహింపచేస్తుంది.

**సత్త్వోద్రిక్తా జగత్సర్వం సంస్థాపయతి నిత్యదా ।**
**స విష్ణుః పరమం బ్రహ్మ పరమాత్మా పరా గతిః ॥ 236 ॥**

ఆ మూర్తి సత్త్వగుణాతిశయం కల్గి ఎల్లవేళలా జగత్తును స్థాపిస్తుంది. ఆ విష్ణువు పరబ్రహ్మ పరమాత్మ ఉత్తమమైన గతి కూడ

**మూలప్రకృతిరవ్యక్తా సదానన్దేతి కథ్యతే ।**
**ఇత్యేవం బోధితా దేవ్యో నా విష్ణుః విష్ణుమాతరః । 237 ॥**
**ప్రపేదిరే మహాదేవం తమేవ శరణం పరమ్ ॥**

అవ్యక్తరూపమైన మూలప్రకృతి సదానందరూపమని అది చెప్పబడినది. ఈవిధంగా విష్ణువుచే విష్ణుమాతృదేవతలు బోధించబడి పరుడైన ఆ మహాదేవునే శరణు పొందారు.

**ఏతద్వః కథితం సర్వం మయాఽన్ధకనిషూదనమ్ ।**
**మాహాత్మ్యం దేవదేవస్య భైరవస్యామితౌజసః ॥ 238 ॥**

అంధకసంహార వృత్తాంతం అమితమైన తేజస్సుగల భైరవస్వామి మాహాత్మ్యం అంతా మీకు వివరించాను.

**ఇతి శ్రీకూర్మపురాణే అన్ధకనిబర్హణం నామ షోడశోఽధ్యాయః ॥ 16 ॥**

శ్రీకూర్మపురాణంలో అంధకనిబర్హణమనే పదునారవ అధ్యాయం ॥ 16 ॥

## **సప్తదశోఽధ్యాయః** - పదిహేడవ అధ్యాయం

## **త్రివిక్రమచరిత వర్ణనమ్**- త్రివిక్రమచరితవర్ణనం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు.

**అన్ధకే నిగృహీతే వై ప్రహ్లాదస్య మహాత్మనః ।**
**విరోచనో నామ బలీ బభూవ నృపతిస్సుతః ॥ 1 ॥**

అంధకాసురుని నిగ్రహింపగా మహాత్ముడైన ప్రహ్లాదుని కుమారుడు బలవంతుడు విరోచనుడు రాజైనాడు.

**దేవాఞ్జిత్వా సదేవేన్ద్రాన్ బహూన్వర్షాన్మహాసురః ।**
**పాలయామాస ధర్మేణ త్రైలోక్యం సచరాచరమ్ ॥ 2 ॥**

ఆ విరోచనుడు ఇంద్రునితో సహా దేవతలను జయించి అనేక వత్సరాలు చరాచరయుక్త త్రిలోకాలను ధర్మమార్గంతో పాలించినాడు.

**తస్యైవం వర్తమానస్య కదాచిద్విష్ణుచోదితః ।**
**సనత్కుమారో భగవాన్పురం ప్రాప మహామునిః ॥ 3 ॥**

అత డావిధంగా పాలించేప్పుడు ఒక సమయంలో పూజ్యుడైన మునిశ్రేష్ఠుడు సనత్కుమారుడు విష్ణువుపంపగా విరోచనుని పట్టణానికి వచ్చినాడు.

**గత్వా సింహాసనగతో బ్రహ్మపుత్రం మహాసురః ।**
**ననామోత్థాయ శిరసా ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్ ॥ 4 ॥**

అప్పుడు సింహాసనగతుడైన విరోచనుడు బ్రహ్మకుమారుడైన సనత్కుమారునికి ఎదురేగి శిరసా నమస్కరించి భక్తితో దోసిలొగ్గి ఇట్లు పలికినాడు.

**ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి సంప్రాప్తో మే పురోత్తమమ్ ।**
**యోగీశ్వరోఽద్య భగవాన్యతోఽసౌ బ్రహ్మవిత్స్వయమ్ ॥ 5 ॥**

యోగీశ్వరుడవు భగవంతుడవు స్వయంగా బ్రహ్మవేత్తవైన నీవు ఈనాడు నాపట్టణమునకు వచ్చినందుకు నేను ధన్యుడనైనాను. అనుగ్రహింప బడినాను.

**కిమర్థమాగతో బ్రహ్మన్ స్వయన్దేవః పితామహః ।**
**బ్రూహి మే బ్రహ్మణః పుత్ర! కిం కార్యం కరవాణ్యహమ్ ॥ 6 ॥**

బ్రహ్మస్వరూపుడా! స్వయంగా బ్రహ్మవని చెప్పదగిన నీవు ఏకారణంగా వచ్చినావు? ఓ బ్రహ్మమానస పుత్రుడా! నేను మీకేమి చేయాలో సెలవివ్వండి.

**సోఽబ్రవీద్భగవాన్దేవో ధర్మయుక్తం మహాసురమ్ ।**
**ద్రష్టుమభ్యాగతోఽహం వై భవన్తం భాగ్యవానసి ॥ 7 ॥**

అపుడు ధర్మాచరణంకల ఆ రాక్షసశ్రేష్ఠునిగూర్చి పూజ్యుడు సనత్కుమారు డిట్లన్నాడు. నీవు భాగ్యవంతుడవు. నేను నిన్ను చూచుటకే వచ్చినాను.

**సుదుర్లభా నీతిరేషా దైత్యానాం దైత్యసత్తమ ।**
**త్రిలోకే ధార్మికో నూనం త్వాదృశోఽన్యో న విద్యతే ॥ 8 ॥**

అసురశ్రేష్ఠా! నీ వవలంబించిన ఈ చక్కనినీతి రాక్షసులలో మిక్కిలి దుర్లభము. మూడులోకాల్లోను నీవంటి ధర్మమార్గవర్తనుడు ఇంకొకడు లేడనుట నిశ్చయం.

**ఇత్యుక్తోఽసురరాజోఽసౌ పునః ప్రాహ మహామునిమ్ ।**
**ధర్మాణాం పరమం ధర్మం బ్రూహి మే బ్రహ్మవిత్తమ! ॥ 9 ॥**

ఇట్లా పలుకగా అసురరాజు మునిశ్రేష్ఠుని గూర్చి మళ్ళీ ఇట్లన్నాడు. బ్రహ్మవేత్తల్లో గొప్పవాడవు. అన్నిధర్మాల్లో గొప్ప ధర్మమేదో నాకు వివరించుము.

**సోఽబ్రవీద్భగవాన్యోగీ దైత్యేన్ద్రాయ మహాత్మనే ।**
**సర్వగుహ్యతమం ధర్మమాత్మజ్ఞానమనుత్తమమ్ ॥ 10 ॥**

మహాత్ముడు యోగి అయిన ఆ సనత్కుమారుడు రాక్షసరాజశ్రేష్ఠునకు రహస్యాల్లో మిక్కిలిశ్రేష్ఠమైన ఆత్మజ్ఞానరూపధర్మాన్ని ఉపదేశించినాడు.

**స లబ్ధ్వా పరమం జ్ఞానం దత్వా చ గురుదక్షిణామ్ ।**
**నిధాయ పుత్రే తద్రాజ్యం యోగాభ్యాసరతోఽభవత్ ॥ 11 ॥**

ఆ విరోచనుడు గొప్ప జ్ఞానాన్ని పొంది మునికి గురుదక్షిణ నిచ్చి తన కుమారునికి రాజ్యభారా న్నప్పగించి యోగసాధనలో ఆసక్తుడైనాడు.

**స తస్య పుత్రో మతిమాన్ బలిర్నామ మహాసురః ।**
**బ్రహ్మణ్యో ధార్మికోఽత్యర్థం విజిగ్యేఽథ పురన్దరమ్ ॥ 12 ॥**

విరోచనుని కుమారుడు బలి అనేవాడు బుద్ధిమంతుడు, బ్రహ్మజ్ఞానం కలవాడు, మిక్కిలి ధర్మస్వభావుడు. తర్వాత అతడు ఇంద్రుని జయించినాడు.

**కృత్వా తేన మహద్యుద్ధం శక్రః సర్వామరైర్వృతః ।**
**జగామ నిర్జితో విష్ణుం దేవం శరణమచ్యుతమ్ ॥ 13 ॥**

ఇంద్రుడు విరోచనునితో యుద్ధం చేసి ఓడి పోయినాడు. దేవతలందరితో కలిసి ఇంద్రుడు అచ్యుతుడైన విష్ణువును శరణు పొందాడు.

**తదన్తరేఽదితిర్దేవీ దేవమాతా సుదుఃఖితా ।**
**దైత్యేన్ద్రాణాం వధార్థాయ పుత్రో మే స్యాదితి స్వయమ్ ॥ 14 ॥**

ఈలోపు దేవతల మాతృమూర్తి అదితి మిక్కిలి దుఃఖించి రాక్షససంహారంకొరకు సమర్థుడైన పుత్రుడు నాకు కలగాలని తలచినది.

**తతాప సుమహాఘోరం తపోరాశిం తతః పరమ్ ।**
**ప్రపన్నా విష్ణుమవ్యక్తం శరణ్యం శరణం హరిమ్ ॥ 15 ॥**

మిక్కిలి తీవ్రమైన తపసు కావించినది. తర్వాత అవ్యక్తుడు, శరణ్యుడు అయిన విష్ణువును శరణు పొందినది.

**కృత్వా హృత్పద్మకిఙ్జల్కే నిష్కలం పరమం పదమ్ ।**
**వాసుదేవమనాద్యన్తమానన్దం వ్యోమ కేవలమ్ ॥ 16 ॥**

తన హృదయకమల కేసరంలో భేదం లేనివాడు, పరమస్థానమైనాడు, వాసుదేవుడు, ఆద్యన్తరహితుడు, ఆనందస్వరూపుడు, ఆకాశరూపి అయిన విష్ణువును నిల్పి తపమాచరించినది.

**ప్రసన్నో భగవాన్విష్ణుః శంఖచక్రగదాధరః ।**
**ఆవిర్బభూవ యోగాత్మా దేవమాతుః పురో హరిః ॥ 17 ॥**

అపుడు శంఖచక్రగదలను ధరించిన విష్ణువు యోగాత్మకుడు ప్రసన్నుడై దేవమాత అదితికి సాక్షాత్కరించినాడు.

**దృష్ట్వా సమాగతం విష్ణుమదితిర్భక్తిసంయుతా ।**
**మేనే కృతార్థమాత్మానం తోషయామాస కేశవమ్ ॥ 18 ॥**

తనకు ప్రత్యక్షమైన విష్ణువును చూచి తనను కృతార్థురాలిగా తలచి అదితి భక్తితో స్తుతించినది.

**అదితిరువాచ :**–అదితి పలికింది

**జయాశేషదుఃఖౌఘనాశైకహేతో!**
**జయానన్తమాహాత్మ్యయోగాభియుక్త ।**
**జయానాదిమధ్యాన్తవిజ్ఞానమూర్తే!**
**జయాకాశకల్పామలానన్దరూప! ॥ 19 ॥**

సర్వదుఃఖసమూహాన్ని నశింప చేయటానికి ముఖ్యకారణమైన వాడా! అంతంలేని గొప్పయోగము కలవాడా! ఆదిమధ్యాంతాలులేని విజ్ఞానస్వరూపుడా! ఆకాశం వలె నిర్మలానందరూపుడా! దేవా! నీకు జయము, జయము.

**నమో విష్ణవే కాలరూపాయ తుభ్యం**
**నమో నారసింహాయ శేషాయ తుభ్యమ్ ।**
**నమః కాలరుద్రాయ సంహారకర్త్రే**
**నమో వాసుదేవాయ తుభ్యం నమస్తే ॥ 20 ॥**

కాలస్వరూపుడవైన ఓ విష్ణూ! నీకు నమస్కారం. శేషాత్మకుడవు, నరసింహరూపివైన నీకు నమస్కారం. కాలరుద్రుడవు, సంహారకర్తవైన నీకు నమస్కారం. వాసుదేవుడవైన నీకు నమస్కారము.

**నమో విశ్వమాయావిధానాయ తుభ్యం**
**నమో యోగగమ్యాయ సత్యాయ తుభ్యమ్ ।**
**నమో ధర్మవిజ్ఞాననిష్ఠాయ తుభ్యం**
**నమస్తే వరాహాయ భూయో నమస్తే ॥ 21 ॥**

ప్రపంచ మందలి మాయను కల్పించువాడవు, సత్యస్వరూపుడవు, యోగసాధనచే పొందదగినవాడవైన నీకు నమస్కారం, ధర్మవిజ్ఞానాలలో ప్రతిష్ఠితుడవైన వరాహస్వరూపివి నీకు నమస్కారం.

**నమస్తే సహస్రార్కచన్ద్రాభమూర్తే!**
**నమో వేదవిజ్ఞాన ధర్మాభిగమ్య! ।**
**నమో భూధరాయాప్రమేయాయ తుభ్యం**
**ప్రభో! విశ్వయోనేఽథ భూయో నమస్తే ॥ 22 ॥**

వేయిమంది సూర్యచంద్రుల కాంతితో సమాన కాంతిగలవాడా, వేదవిజ్ఞానంవల్ల ధర్మంవల్ల తెలియదగిన వాడా! నీకు నమస్కారం. భూమిని ధరించే అప్రమేయుడవు, విశ్వయోనివి అయిన ప్రభూ! నీకు నమో నమః.

**నమః శమ్భవే సత్యనిష్ఠాయ తుభ్యం నమో హేతవే విశ్వరూపాయ తుభ్యమ్ ।**
**నమో యోగపీఠాన్తరస్థాయ తుభ్యం శివాయైకరూపాయ భూయో నమస్తే ॥ 23 ॥**

సత్యనిష్ఠగల శంభుడవైన నీకు నమస్కారం. జగద్రూపుడవు, కారణాత్మకుడవునై, యోగవిద్యా పీఠమధ్య మందుండే నీకు నమస్కారం. కేవల స్వరూపుడవైన శివునకు నీకు అనేక నమస్కారాలు.

**ఏవం స భగవాన్విష్ణుర్దేవమాత్రా జగన్మయః ।**
**తోషితశ్ఛందయామాస వరేణ ప్రహసన్నివ ॥ 24 ॥**

దేవమాత అదితి ఈవిధంగా స్తుతించగా జగన్మయుడైన భగవానుడు విష్ణువు నవ్వుమొగంతో ఆమెను వరము కోరుకొమ్మనెను.

**ప్రణమ్య శిరసా భూమౌ సా వవ్రే వరముత్తమమ్ ।**
**త్వామేవ పుత్రం దేవానాం హితాయ వరయే వరమ్ ॥ 25 ॥**

ఆ ఆదితి శిరసువంచి నమస్కరించి దేవతల మేలుకొరకు నిన్నే పుత్రునిగా జన్మించుమని శ్రేష్ఠమైన వరమును కోరుచున్నాను.

**తథాఽస్త్విత్యాహ భగవాన్ ప్రపన్నజనవత్సలః ।**
**దత్వా వరానప్రమేయస్తత్రైవాన్తరధీయత ॥ 26 ॥**

తన నాశ్రయించిన వారియందు వాత్సల్యం గల ఆ భగవంతుడట్లే అని పలికి వర్ణనాతీతుడైన విష్ణువు అక్కడనే అదృశ్యుడైనాడు.

**తతో బహుతిథే కాలే భగవన్తం జనార్దనమ్ ।**
**దధార గర్భం దేవానాం మాతా నారాయణం స్వయమ్ ॥ 27 ॥**

తర్వాత చాలకాలానికి దేవమాత అదితి భగవంతుడు, జనార్దనుడు అయిన నారాయణుని గర్భమందు ధరించినది.

**సమావిష్టే హృషీకేశే దేవమాతురథోదరమ్ ।**
**ఉత్పాతా జజ్ఞిరే ఘోరా బలేర్వైరోచనేః పురే ॥ 28 ॥**

హృషీకేశుడైన విష్ణువు అదితి గర్భంలో ప్రవేశించగానే విరోచన కుమారుడైన బలి పట్టణంలో భయంకరమైన ఉత్పాతములు సంభవించాయి.

**నిరీక్ష్య సర్వానుత్పాతాన్దైత్యేన్ద్రో భయవిహ్వలః ।**
**ప్రహ్లాదమసురం వృద్ధం ప్రణమ్యాహ పితామహమ్ ॥ 29 ॥**

ఆ ఉత్పాతాలను చూచి రాక్షసరాజు బలి భయంతో కలతచెంది తన తాత రాక్షసవృద్ధుడైన ప్రహ్లాదునిచేరి నమస్కరించి ఇట్లన్నాడు.

**బలిరువాచ**:–బలి పలికాడు.

**పితామహ! మహాప్రాజ్ఞ! జాయతేఽస్మిన్పురాన్తరే ।**
**కిముత్పాతో భవేత్కార్యమస్మాకం కింనిమిత్తకః ॥ 30 ॥**

మిక్కిలి వివేకవంతుడవైన ఓ పితామహా! ఈ పట్టణంలో ఉత్పాతాలెందు కేర్పడుతున్నాయి? దీనివల్ల మనకెటువంటి ఫలం కలుగుతుంది?

**నిశమ్య తస్య వచనం చిరం ధ్యాత్వా మహాసురః ।**
**నమస్కృత్వా హృషీకేశమిదం వచనమబ్రవీత్ ॥ 31 ॥**

ఆ బలి మాట విని రాక్షసశ్రేష్ఠుడు ప్రహ్లాదుడు చాలసేపు ఆలోచించి మనసులోనే హృషీకేశునకు నమస్కరించి అతనితో ఇట్లన్నాడు.

**ప్రహ్లాద ఉవాచ:–** ప్రహ్లాదుడు పలికాడు.

**యో యజ్ఞైరిజ్యతే విష్ణుర్యస్య సర్వమిదం జగత్ ।**
**దధారాసురనాశార్థం మాతా తం త్రిదివౌకసామ్ ॥ 32 ॥**

యజ్ఞాలతో పూజింపబడుతూ ఈ సర్వప్రపంచానికి ప్రభువైన భగవంతుడు విష్ణువును రాక్షససంహారం కోసం దేవమాత అదితి తన గర్భంలో ధరించినది.

**యస్మాదభిన్నం సకలం భిద్యతే యోఽఖిలాదపి ।**
**స వాసుదేవో దేవానాం మాతుర్దేహం సమావిశత్ ॥ 33 ॥**

ఈ సర్వప్రపంచం అతనికంటె భిన్నం కాదు. అయినా తానుమాత్రం భిన్నంగా ఉన్నాడు. అటువంటి వాసుదేవుడైన విష్ణువు దేవమాత శరీరాన్నాశ్రయించినాడు.

**న యస్య దేవా జానన్తి స్వరూపం పరమార్థతః ।**
**స విష్ణురదితేర్దేహం స్వేచ్ఛయాఽద్య సమావిశత్ ॥ 34 ॥**

అతని స్వరూపతత్త్వాన్ని దేవతలు కూడ యథార్థంగా తెలియజాలరు. ఆ విష్ణువు స్వయంగా తన ఇచ్ఛతోనే అదితి శరీరాన్ని ప్రవేశించినాడు.

**యస్మాద్భవన్తి భూతాని యత్ర సంయాన్తి సంక్షయమ్ ।**
**సోఽవతీర్ణో మహాయోగీ పురాణపురుషో హరిః ॥ 35 ॥**

సమస్తప్రాణులు అతని నుండే పుట్టి మళ్ళీ అతనిలోనే లయమగుచున్నవి. అట్టి మహాయోగి పురాణ పురుషుడు హరి అదితిగర్భాన్ని చేరినాడు.

**న యత్ర విద్యతే నామజాత్యాదిపరికల్పనా ।**
**సత్తామాత్రాత్మరూపోఽసౌ విష్ణురంశేన జాయతే ॥ 36 ॥**

అతని విషయంలో నామ, జాతి మొదలైన భేదభావముండదు. సత్తామాత్రాత్మస్వరూపుడైన ఈ విష్ణువు అంశావతారంగా జన్మించనున్నాడు.

**యస్య సా జగతాం మాతా శక్తిస్తద్ధర్మధారిణీ ।**
**మాయా భగవతీ లక్ష్మీః సోఽవతీర్ణో జనార్దనః ॥ 37 ॥**

అతని శక్తి లోకాలకు మాతృస్వరూపం, ఆ శక్తి అతని ధర్మాన్ని ధరిస్తుంది. మాయారూప అయిన భగవతి లక్ష్మీదేవియై ఉన్నది. ఆ విష్ణువు అవతరింపనున్నాడు.

**యస్య సా తామసీ మూర్తిః శంకరో రాజసీ తనుః ।**
**బ్రహ్మా సఞ్జాయతే విష్ణురంశేనైకేన సత్త్వధృక్ ॥ 38 ॥**

ఈ పరమాత్మ తమోగుణరూపమే శంకరుడు, రజోగుణాత్మకశరీరం బ్రహ్మదేవుడు. అతడే సత్త్వగుణాన్ని ధరించి ఒక అంశతో విష్ణువవుతున్నాడు.

**ఇతి సఞ్చిన్త్య గోవిన్దం భక్తినమ్రేణ చేతసా ।**
**తమేవ గచ్ఛ శరణం తతో యాస్యసి నిర్వృతిమ్ ॥ 39 ॥**

ఈ విధంగా ఆలోచించి భక్తివినీతుడవై మనసుతో గోవిందుడైన నారాయణుని శరణుపొందు. దానివల్ల శాశ్వతానందరూపముక్తిని పొందుతావు.

**తతః ప్రహ్లాదవచనాద్బలిర్వైరోచనిర్హరిమ్ ।**
**జగామ శరణం విశ్వం పాలయామాస ధర్మవిత్ ॥ 40 ॥**

తర్వాత ప్రహ్లాదుని వచనాన్ననుసరించి విరోచనపుత్రుడు బలి విష్ణువును శరణు పొందినాడు. ఆ తర్వాత ధర్మాన్ని గుర్తించి ప్రపంచాన్ని పరిపాలించినాడు.

**కాలే ప్రాప్తే మహావిష్ణుం దేవానాం హర్షవర్ధనమ్ ।**
**అసూత కశ్యపాచ్చైనం దేవమాతా దితిః స్వయమ్ ॥ 41 ॥**

కాలం సమీపించగా మహావిష్ణువు దేవతలకు సంతోషాన్ని వృద్ధి పొందించేవాడై స్వయంగా కశ్యపునివల్ల అదితి యందు పుత్రునిగా జన్మించినాడు.

**చతుర్భుజం విశాలాక్షం శ్రీవత్సాఙ్కితవక్షసమ్ ।**
**నీలమేఘప్రతీకాశం భ్రాజమానం శ్రియా వృతమ్ ॥ 42 ॥**

అతడు నాలుగుభుజాలు కల్గి విశాలనేత్రాలతో శ్రీవత్సమనే చిహ్నం వక్షఃస్థలంలో ధరించి నల్లనిమేఘంవంటి శరీరంతో తేజోవంతుడై ప్రకాశించినాడు.

**ఉపతస్థుః సురాస్సర్వే సిద్ధాః సాధ్యాశ్చ చారణాః ।**
**ఉపేన్ద్రమిన్ద్రప్రముఖా బ్రహ్మా చర్షిగణైర్వృతః ॥ 43 ॥**

ఆ విష్ణువు వద్దకు దేవతలు, సిద్ధులు, సాధ్యులు, చారణులు, ఇతను ఉపేన్ద్రుడు, ఇంద్రునికి తమ్ముడు అని తెలుసుకొని ఇంద్రుడు మొదలైనవారు ఋషిసమూహాలతో కూడ బ్రహ్మ వచ్చి సేవించుకున్నారు.

**కృతోపనయనో వేదా నద్యైష్ట భగవాన్హరిః ।**
**సదాచారం భరద్వాజాత్త్రిలోకాయ ప్రదర్శయన్ ॥ 44 ॥**

ఆ విష్ణువు సదాచారాన్ని ముల్లోకాలకు చూపటానికి ఉపనయన సంస్కారాన్ని పొంది వేదాధ్యయనం కావించినారు. భారద్వాజమునివల్ల వేదాలతో పాటు సదాచారాన్ని అభ్యసించినారు.

**ఏవం చ లౌకికం మార్గం ప్రదర్శయతి స ప్రభుః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ 45 ॥**

ఈ విధంగా ప్రభువు నారాయణుడు లౌకికమార్గాన్ని లోకానికి ప్రదర్శించినాడు. అతడే పద్ధతి ప్రమాణంగా గ్రహిస్తాడో దాన్నే లోకం అనుసరిస్తుంది.

**తతః కాలేన మతిమాన్ బలిర్వైరోచనిః స్వయమ్ ।**
**యజ్ఞైర్యజ్ఞేశ్వరం విష్ణుమర్చయామాస సర్వగమ్ ॥ 46 ॥**

కొంతకాలం తర్వాత బుద్ధిమంతుడైన వైరోచనబలి స్వయంగా యజ్ఞాధిపతి, సర్వవ్యాపి అయిన విష్ణువును యజ్ఞాలతో ఆరాధించినాడు.

**బ్రాహ్మణాన్పూజయామాస దత్వా బహుతరం ధనమ్ ।**
**బ్రహ్మర్షయః సమాజగ్ముర్యజ్ఞవాటం మహాత్మనః ॥ 47 ॥**

గొప్పధనాన్ని దక్షిణగా ఇచ్చి బ్రాహ్మణులను సత్కరించినాడు. ఆ మహాత్ముడు బలి యజ్ఞమంటపానికి బ్రహ్మర్షులు విచ్చేసినారు.

**విజ్ఞాయ విష్ణుర్భగవాన్ భరద్వాజప్రచోదితః ।**
**ఆస్థాయ వామనం రూపం యజ్ఞదేశమథాగమత్ ॥ 48 ॥**

భగవంతుడు విష్ణువు బలియజ్ఞవిషయాన్ని తెలుసుకొని భరద్వాజముని ప్రేరణవల్ల వామనరూపాన్ని ధరించి యజ్ఞప్రదేశానికి వెళ్ళినాడు.

**కృష్ణాజినోపవీతాఙ్గ ఆషాఢేన విరాజితః ।**
**బ్రాహ్మణో జటిలో వేదానుద్గిరన్సుమహాద్యుతిః ॥ 49 ॥**

ఆ వామనుడు కృష్ణాజినం, యజ్ఞోపవీతం ధరించి పాలాశదండంతో ప్రకాశిస్తున్నాడు. జడలుదాల్చి గొప్ప కాంతితో ప్రకాశిస్తూ, వేదమంత్రాలుచ్చరిస్తూ, బ్రాహ్మణవటువై వచ్చినాడు.

**సంప్రాప్యాసురరాజస్య సమీపం భిక్షుకో హరిః ।**
**స్వపద్భ్యాం క్రమితం దేశమయాచత బలిం త్రిభిః ॥ 50 ॥**

రాక్షసరాజైన బలిని చేరి వామనరూపుడైన విష్ణువు భిక్షాన్నికోరే వానిగా తన అడుగులతో కొలిచిన మూడడుగుల భూమిని యాచించినాడు.

**ప్రక్షాల్య చరణౌ విష్ణోర్బలిర్భావసమన్వితః ।**
**ఆచామయిత్వా భృంగారమాదాయ స్వర్ణనిర్మితమ్ ॥ 51 ॥**

వామనుడుగా నున్న విష్ణువు పాదాలను కడిగి శ్రద్ధతో బలి ఆచమనం చేయించి బంగారు కలశాన్ని చేతిలోనికి తీసుకున్నాడు.

**దాస్యే తథేదం భవతే పదత్రయం ప్రీణాతు దేవో హరిరవ్యయాకృతిః ।**
**విచింత్య దేవస్య కరాగ్రపల్లవే నిపాతయామాస సుశీతలం జలమ్ ॥ 52 ॥**

నీవు కోరినట్టు మూడడుగుల ప్రదేశం నీకిస్తాను. అవ్యయాకృతిగల విష్ణువు ప్రీతి చెందుగాక! అని మనసులో అనుకొని ఆ భగవంతుని చివురువంటి చేతిలో దానజలాన్ని వదలినాడు.

**విచక్రమే పృథివీమేష చైతామథాంతరిక్షం దివమాదిదేవః ।**
**వ్యపేతరాగం దితిజేశ్వరస్తం ప్రకర్తుకామః శరణం ప్రపన్నమ్ ॥ 53 ॥**

దితిజేశ్వరుడు, శరణాగతుడైన బలిని విరాగుని చేయదలచి ఆదిదేవుడు శ్రీహరి పృథివిని, అంతరిక్షమును స్వర్గాన్ని కొలిచాడు.

**ఆక్రమ్య లోకత్రయమీశపాదః ప్రాజాపత్యాద్బ్రహ్మలోకం జగామ ।**
**ప్రణేమురాదిత్యముఖాః సురేన్ద్రాః యే తత్ర లోకే నివసన్తి సిద్ధాః ॥ 54 ॥**

అతని పాదము ముల్లోకాలాక్రమించి ప్రాజాపత్యం నుండి బ్రహ్మలోకం చేరినది. అప్పుడా యా లోకాల్లోని ఆదిత్యుడు మొదలైన దేవతలు ఆ లోకమున నివసించే సిద్ధులు ఆ పాదానికి నమస్కరించినారు.

**అథోపతస్థే భగవాననాదిః పితామహస్తోషయమాస విష్ణుమ్ ।**
**భిత్త్వా తదణ్డస్య కపాలమూర్ధ్వం జగామ దివ్యాభరణోఽథ భూయః ॥ 55 ॥**

ఆ సమయంలో భగవంతుడు అనాది అయిన బ్రహ్మ అక్కడకు వచ్చి నారాయణుని స్తుతించినాడు. తర్వాత దివ్యాభరణములను ధరించిన విష్ణుపాదం బ్రహ్మాండాన్ని భేదించి ఇంకా పైకి మళ్ళీ వ్యాపించినది.

**అథాణ్డభేదాన్నిపపాత శీతలం మహాజలం పుణ్యకృద్భిశ్చ జుష్టమ్ ।**
**ప్రవర్తితా చాపి సరిద్వరా సా గంగేత్యుక్త్వా బ్రహ్మణా వ్యోమసంస్థా ॥ 56 ॥**

**గత్వా మహాన్తం ప్రకృతిం బ్రహ్మయోనిం బ్రహ్మాణమేకం పురుషం విశ్వయోనిమ్ ।**
**అతిష్ఠదీశస్య పదం తదవ్యయం దృష్ట్వా దేవాస్తత్ర తత్ర స్తువన్తి ॥ 57 ॥**

తర్వాత బ్రహ్మాండం భేదించటంవల్ల పుణ్యాత్ములు సేవించే చల్లని ఉదకమక్కడ స్రవించినది. ఆ జలమే నదులలో శ్రేష్ఠమైనది. బ్రహ్మ గంగ అని పేరు పెట్టగా దానిని ఆకాశంలో నిలిచి ప్రవర్తింపచేసినాడు. ఆ విష్ణుపాదం విశాలప్రకృతిని వ్యాపించి బ్రహ్మస్థానాన్ని ప్రపంచానికి బీజభూతుడైన ఏకపురుషుని బ్రహ్మరూపునిచేరి నిలిచినది. అవ్యయమైన ఆ విష్ణుపాదాన్ని చూచి అక్కడక్కడ ఉన్న దేవతలు కొనియాడినారు.

**ఆలోక్య తం పురుషం విశ్వకాయం మహాన్బలిర్భక్తియోగేన విష్ణుమ్ ।**
**ననామ నారాయణమేకమవ్యయం స్వచేతసా యం ప్రణమన్తి వేదాః ॥ 58 ॥**

ప్రపంచమే శరీరంగా ఉన్న మహాపురుషుడైన విష్ణువును చూచి ఉత్తముడైన బలి భక్తియోగంతో ప్రణమిల్లినాడు. అద్వితీయుడు అవ్యయుడు అయిన నారాయణుని వేదాలు సైతం తన మనస్సుతో నమస్కరించి పూజిస్తాయి. అట్టి విష్ణువునకు బలి నమస్కరించినాడు.

**తమబ్రవీద్భగవానాదికర్తా భూత్వా పునర్వామనో వాసుదేవః ।**
**మమైవ దైత్యాధిపతేఽధునేదం లోకత్రయం భవతా భావదత్తమ్ ॥ 59 ॥**

మొదటి సృష్టికర్త భగవానుడైన విష్ణువు మళ్ళీ! వామనుడుగా మారి అతనితో ఇట్లన్నాడు. ఓ రాక్షసరాజా ఇప్పుడీ మూడులోకాలను నీవు సంకల్పపూర్వకంగా దానం చేసినందున నా అధీనమైనవి.

**ప్రణమ్య మూర్ధ్నా పునరేవ దైత్యో నిపాతయామాస జలం కరాగ్రే ।**
**దాస్యే తవాత్మానమనన్తధామ్నే త్రివిక్రమాయామితవిక్రమాయ ॥ 60 ॥**

ఆ బలి నారాయణునకు శిరసా నమస్కరించి మళ్ళీ తన చేతిలోని నీళ్ళు వామనుని చేతిలోనికి వదిలి అనంతతేజశ్శాలి గొప్పపరాక్రమవంతుడు అగు త్రివిక్రముడవైన నీకు నేను నన్ను సమర్పించుకొంటున్నాను.

**ప్రగృహ్య సూనోరపి సంప్రదత్తం ప్రహ్లాదసూనోరథ శంఖపాణిః ।**
**జగాద దైత్యం జగదన్తరాత్మా పాతాలమూలం ప్రవిశేతి భూయః ॥ 61 ॥**

తర్వాత శంఖాన్ని ధరించిన విష్ణువు ప్రహ్లాదుని మనుమడైన బలియిచ్చిన దానాన్ని స్వీకరించి పాతాళమూలాన్ని ప్రవేశించుమని బలినిగూర్చి పలికినాడు.

**సమాస్యతాం భవతా తత్ర నిత్యం భుక్త్వా భోగాన్దేవతానామలభ్యాన్ ।**
**ధ్యాయస్వ మాం సతతం భక్తియోగాత్ప్రవేక్ష్యసే కల్పదాహే పునర్మామ్ ॥ 62 ॥**

అక్కడ దేవతలకు సాధ్యంకాని భోగాలనుభవించినను సుఖంగా నివసించు. భక్తియోగంద్వారా సర్వదా నన్ను ధ్యానం చేసి కల్పాంతకాలంలో నీవు మళ్ళీ నన్ను చేరుకొంటావు.

**ఉక్త్వైవం దైత్యసింహం తం విష్ణుః సత్యపరాక్రమః ।**
**పురన్దరాయ త్రైలోక్యం దదౌ జిష్ణురురుక్రమః ॥ 63 ॥**

రాక్షసశ్రేష్ఠుడైన బలిని గూర్చి ఇట్లా పలికి సత్యపరాక్రముడైన విష్ణువు జయశీలుడైన ఇంద్రునకు ముల్లోకాల ఆధిపత్యాన్ని ప్రదానం చేసినాడు.

**సంస్తువన్తి మహాయోగం సిద్ధా దేవర్షికిన్నరాః ।**
**బ్రహ్మా శక్రోఽథ భగవాన్ రుద్రాఽఽదిత్యమరుద్గణాః ॥ 64 ॥**

గొప్ప యోగమహిమగల విష్ణువును సిద్ధులు, దేవ ఋషులు, కిన్నరులు, బ్రహ్మ, ఇంద్ర, రుద్రాదిత్యులు, మరుద్గణాలు స్తోత్రం చేయసాగారు.

**కృత్త్వైతదద్భుతం కర్మ విష్ణుర్వామనరూపధృక్ ।**
**పశ్యతామేవ సర్వేషాం తత్రైవాన్తరధీయత ॥ 65 ॥**

వామనరూపాన్ని ధరించిన విష్ణువు ఆశ్చర్యకరమైన పనిచేసి అందరు చూస్తుండగానే అక్కడే అంతర్ధానమైనాడు.

**సోఽపి దైత్యవరః శ్రీమాన్పాతాలం ప్రాప నోదితః ।**
**ప్రహ్లాదేనాసురవరైర్విష్ణుభక్తస్తు తత్పరః ॥ 66 ॥**

ఆ దైత్యశ్రేష్ఠుడు, శ్రీమంతుడైన బలిచక్రవర్తి ప్రహ్లాదునిచే ప్రేరేపింపబడి అసురవరులతో కలిసి పాతాళానికి చేరినాడు అచట శ్రీమహావిష్ణువుని ధ్యానిస్తూ, విష్ణుభక్తునిగా నిలిచినాడు.

**అపృచ్ఛద్విష్ణుమాహాత్మ్యం భక్తియోగమనుత్తమమ్ ।**
**పూజావిధానం ప్రహ్లాదం తదాహాసౌ చకార సః ॥ 67 ॥**

విష్ణువు మాహాత్మ్యాన్ని, శ్రేష్ఠమైన భక్తియోగాన్ని, ప్రహ్లాద పూజా విధానాన్ని బలి ప్రహ్లాదుని ప్రశ్నించి అతడు చెప్పిన ప్రకారం నడచుకొన్నాడు.

**అథ రథచరణం సశంఖపాణిం సరసిజలోచనమీశమప్రమేయమ్ ।**
**శరణముపయయౌ స భావయోగాత్ప్రణయగతిం ప్రణిధాయ కర్మయోగమ్ ॥ 68 ॥**

**ఏష వః కథితో విప్రా వామనస్య పరాక్రమః ।**
**స దేవకార్యాణి సదా కరోతి పురుషోత్తమః ॥ 69 ॥**

తర్వాత బలి శంఖచక్రాలు చేతధరించిన వానిని, పద్మనేత్రుని, వర్ణింపనలవికాని ప్రభువైన నారాయణుని మనసులో శ్రద్ధాపూర్వకంగా నిలుపుకొని కర్మయోగాన్ని నారాయణునిలో అర్పించి భక్తితో శరణు పొందినాడు. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఈ వామనావతారపరాక్రమాన్ని మీకు వివరించినాను. పురుషోత్తముడైన ఆ నారాయణుడెల్లపుడు దేవకార్యములు నెరవేర్చుచునే ఉండును.

**ఇతి శ్రీకూర్మపురాణే త్రివిక్రమచరితవర్ణనం నామ సప్తదశోఽధ్యాయః ॥ 17 ॥**

శ్రీకూర్మపురాణంలో త్రివిక్రమచరితవర్ణనమనే పదిహేడవ అధ్యాయము ॥ 17 ॥



## అష్టాదశోఽధ్యాయః - పదునెనిమిదవ అధ్యాయం

## వంశానుకీర్తనమ్ - వంశానుకీర్తనం

**సూత ఉవాచ:-** సూతుడు పలికాడు.

**బలేః పుత్రశతం త్వాసీన్మహాబలపరాక్రమమ్ ।**
**తేషాం ప్రధానో ద్యుతిమాన్బాణో నామ మహాబలః ॥ 1 ॥**

ఆ బలికి మహాబలపరాక్రమాలుగల వందమంది కుమారులున్నారు, వారిలో ముఖ్యుడు, తేజశ్శాలి, గొప్ప బలవంతుడు బాణుడనే వాడు.

**సోఽతీవ శఙ్కరే భక్తో రాజా రాజ్యమపాలయత్ ।**
**త్రైలోక్యం వశమానీయ బాధయామాస వాసవమ్ ॥ 2 ॥**

అతడు శంకరుని భక్తుడు. తన రాజాన్ని పాలిస్తూ ముల్లోకాలను వశంచేసుకొని దేవరాజైన ఇంద్రుని బాధించినాడు.

**తతః శక్రాదయో దేవా గత్వోచుః కృత్తివాససమ్ ।**
**త్వదీయో బాధతే త్వస్మాన్బాణో నామ మహాసురః ॥ 3 ॥**

తర్వాత ఇంద్రుడు మొదలైన దేవతలందరూ శంకరుని వద్దకు వెళ్ళి ఇట్లా పలికారు. "ప్రభూ! మీభక్తుడైన బాణాసురుడు మమ్ము బాధిస్తున్నాడు".

**వ్యాహృతో దైవతైః సర్వైర్దేవదేవో మహేశ్వరః ।**
**దదాహ బాణస్య పురం శరేణైకేన లీలయా ॥ 4 ॥**

దేవదేవుడు పరమేశ్వరుడు దేవతలావిధంగా ప్రార్థించటంతో ఒక బాణంతో అవలీలగా బాణుని పట్టణాన్ని కాల్చివేసినాడు.

**దహ్యమానే పురే తస్మిన్బాణో రుద్రం త్రిశూలినమ్ ।**
**యయౌ శరణమీశానం గోపతిం నీలలోహితమ్ ॥ 5 ॥**

తనపట్టణం కాలుతుండగా చూచిన ఆ బాణుడు త్రిశూలి, నీలలోహితుడు, వృషాధిపతి, ఈశ్వరుడైన రుద్రుని శరణు పొందినాడు.

**మూర్ధన్యాధాయ తల్లిఙ్గం శామ్భవం రాగవర్జితః ।**
**నిర్గత్య తు పురాత్తస్మాత్తుష్టావ పరమేశ్వరమ్ ॥ 6 ॥**

కోరికలను వదలిన బాణుడు శివలింగాన్ని తలపై దాల్చి ఆ పట్టణంనుండి వెలికివచ్చి పరమేశ్వరుని స్తుతించినాడు.

**సంస్తుతో భగవానీశః శంకరో నీలలోహితః ।**
**గాణపత్యేన బాణం తు యోజయామాస భావతః ॥ 7 ॥**

ఆ బాణుడు స్తోత్రంచేయగా భగవంతుడు నీలలోహితుడు ప్రభువు అయిన శంకరుడు బాణాసురుని ప్రమథగణాలకు అధిపతిగా నియోగించాడు.

**అథైవం చ దనోః పుత్రాస్తారాద్యాశ్చాతిభీషణాః ।**
**తారస్తథా శమ్బరశ్చ కపిలః శంకరస్తథా ॥ 8 ॥**

**స్వర్భానుర్వృషపర్వా చ ప్రాధాన్యేన ప్రకీర్తితాః ।**
**సురసాయాః సహస్రం తు సర్పాణామభవద్ద్విజాః! ॥ 9 ॥**

తర్వాత మిక్కిలి భయంకరులైన తారుడు, శంబరుడు, కపిలుడు, శంకరుడు, స్వర్భానువు, వృషపర్వుడు అను దనువు కుమారులు ప్రధానులుగా పేర్కొనదగినవారు. ఓ విప్రులారా! సురస అను నాగమాతకు వేయిమంది సర్పాలు సంతానంగా కలిగినారు.

**అనేక శిరసాం తద్వత్ఖేచరాణాం మహాత్మనామ్ ।**
**అరిష్టా జనయామాస గంధర్వాణాం సహస్రకమ్ ॥ 10 ॥**

అరిష్ట అను నామె అనేక శిరసులు కల్గి ఆకాశసంచారులైన మహాత్ములు వేయిమంది గంధర్వులను సంతానంగా పొందినది.

**అనన్తాద్యా మహానాగాః కాద్రవేయాః ప్రకీర్తితాః ।**
**తామ్రా చ జనయామాస షట్కన్యా ద్విజపుఙ్గవాః ॥ 11 ॥**

అనంతుడు మొదలైన గొప్పనాగులు కద్రువసంతానంగా ప్రసిద్ధులైనారు. బ్రాహ్మణ శ్రేష్ఠులారా! తామ్ర అనే స్త్రీ ఆరుగురు కన్యలను పొందినది.

**శుకీం శ్యేనీం చ భాసీం చ సుగ్రీవాం గ్రన్థికాం శుచిమ్ ।**
**గాస్తథా జనయామాస సురభిర్మహీషీస్తథా ॥ 12 ॥**

వారు శుకి, శ్యేని, భాసి, సుగ్రీవ, గ్రంథిక, శుచి అనువారు. సురభి గోవులను, గేదెలను సంతతిగా పొందినది.

**ఇరా వృక్షలతావల్లీ తృణజాతీశ్చ సర్వశః ।**
**తథా వై యక్షరక్షాంసి మునిరప్సరసస్తథా ॥ 13 ॥**

**రక్షోగణం క్రోధవశాజ్జనయామాస సత్తమాః! ।**
**వినతాయాశ్చ పుత్రౌ ద్వౌ ప్రఖ్యాతౌ గరుడారుణౌ ॥ 14 ॥**

ఇర వృక్షాలను, తీగలను, తృణజాతిమొక్కలను అంతట ప్రసవించినది. ముని అనే స్త్రీ యక్షులను, రాక్షసులను, అప్సరసలను సంతానంగా బడసినది. సజ్జనులారా! కోపంవల్ల రాక్షససమూహాన్ని జన్మింప చేసినది. వినతకుమారులు గరుడుడు, అరుణుడు అనే ఇరువురు పుత్రులు ప్రసిద్ధులు.

**తయోశ్చ గరుడో ధీమాంస్తపస్తప్త్వా సుదుశ్చరమ్ ।**
**ప్రసాదాచ్ఛూలినః ప్రాప్తో వాహనత్వం హరేః స్వయమ్ ॥ 15 ॥**

వారిలో బుద్ధిమంతుడైన గరుడుడు కష్టసాధ్యమైన తపసుతో శివుని అనుగ్రహాన్ని పొంది విష్ణువువాహనంగా పదవినందినాడు.

**ఆరాధ్య తపసా దేవం మహాదేవం తథాఽరుణః ।**
**సారథ్యే కల్పితః పూర్వం ప్రీతేనార్కస్య శమ్భునా ॥ 16 ॥**

అరుణుడు కూడ తపసుతో మహాదేవుని పూజించి అతని అనుగ్రహంతోనే సూర్యునికి సారథి పదవిలో నియమితుడైనాడు.

**ఏతే కశ్యపదాయాదాః కీర్తితాః స్థాణుజఙ్గమాః ।**
**వైవస్వతేఽన్తరే హ్యస్మింఛృణ్వతాం పాపనాశనమ్ ॥ 17 ॥**

కశ్యప ప్రజాపతివంశంలో జన్మించిన స్థావరజంగమరూపులను వివరించినాను. ఈ వైవస్వత మన్వంతరం వినేవారి పాపాలను నశింపచేస్తుంది.

**సప్తవింశసుతాః ప్రోక్తాః సోమపత్న్యశ్చ సువ్రతాః ।**
**అరిష్టనేమిపత్నీనామపత్యానాం హ్యనేకశః ॥ 18 ॥**

నియమవతులైన ఇరువదేడు మంది కూతుళ్ళు చంద్రుని భార్యలు. అరిష్టనేమి భార్యసంతానం చాలమంది.

**బహు పుత్రస్య విదుషశ్చతస్రో విద్యుతః స్మృతాః ।**
**తద్వదంగిరసః శ్రేష్ఠా ఋషయో వృషసత్కృతాః ॥ 19 ॥**

విద్వాంసుడైన అరిష్టనేమికి చాలామంది పుత్రులు కలవానికి నలుగురు విద్యుత్తులు సంతానముగా కలిగినారు. అట్లే అంగీరసునికి ధర్మముచే సత్కరింపబడిన శ్రేష్ఠులైన ఋషులు కలిగిరి.

**కృశాశ్వస్య తు దేవర్షేర్దేవః ప్రహరణః సుతః ।**
**ఏతే యుగసహస్రాన్తే జాయన్తే పునరేవ హి ।**

**మన్వన్తరేషు నియతం తుల్యకార్యైః స్వనామభిః ॥ 20 ॥**

దేవఋషి కృశాశ్వునికి ప్రహరణుడనే దేవ కుమారుడు జన్మించినాడు. వీరు వేయి యుగాల తర్వాత మళ్ళీ జన్మిస్తారు. ఆయా మన్వంతరాల్లో తమపేర్లతో సమానమైన కార్యాలతో నియతంగా జన్మిస్తుంటారు.

**ఇతి శ్రీకూర్మపురాణే వంశానుకీర్తనం నామ అష్టాదశోఽధ్యాయః ॥ 18 ॥**

శ్రీకూర్మపురాణంలో వంశానుకీర్తనమనే పదునెనిమిదవ అధ్యాయం ॥ 18 ॥



## ఏకోనవింశోఽధ్యాయః – పందొమ్మిదవ అధ్యాయం

## ఋషివంశవర్ణనమ్ – ఋషివంశవర్ణనం

**సూత ఉవాచ:–** సూతుడు పలికాడు

**ఏతానుత్పాద్య పుత్రాంస్తు ప్రజాసన్తానకారణాత్ ।**
**కశ్యపః పుత్రకామస్తు చచార సుమహత్తపః ॥ 1 ॥**

కశ్యపప్రజాపతి ఈ పుత్రులను ఉత్పత్తి చేసి ప్రజాసంతానముకొరకు పుత్రులను కోరి గొప్ప తపస్సును ఆచరించినాడు.

**తస్యైవం తపతోఽత్యర్థం ప్రాదుర్భూతౌ సుతావిమౌ ।**
**వత్సరశ్చాసితశ్చైవ తావుభౌ బ్రహ్మవాదినౌ ॥ 2 ॥**

అతడిట్లా తీవ్రతపస్సు చేస్తుండగా వత్సరుడు, అసితుడు అనే ఇద్దరు పుత్రులుగా ప్రాదుర్భవించినారు, వారిద్దరు వేదాంతవిద్యనెరిగినవారు.

**వత్సరాన్నైధ్రువో జజ్ఞే రైభ్యశ్చ సుమహాయశాః ।**
**రైభ్యస్య జజ్ఞిరే శూద్రాః పుత్రాః శ్రుతిమతాం వరాః ॥ 3 ॥**

వత్సరుడనే కుమారుని వల్ల నైధ్రువుడు, గొప్పకీర్తిమంతుడైన రైభ్యుడు అనే కుమారులు కలిగినారు. రైభ్యునికి వేదవిదుల్లో శ్రేష్ఠులైన శూద్రు లనుగణం పుత్రులుగా జన్మించినారు.

**చ్యవనస్య సుతా భార్యా నైధ్రువస్య మహాత్మనః ।**
**సుమేధా జనయామాస పుత్రాన్వై కుణ్డపాయినః ॥ 4 ॥**

చ్యవనముని కూతురు సుమేధ మహాత్ముడైన నైధ్రువుని భార్యయై హోమకుండమున హవిస్సుగా ఇచ్చిన సోమరసమును మిగిలిన దానిని పానము చేయువారగు కుమారులను కన్నది.

**అసితస్యైకపర్ణాయాం బ్రహ్మిష్ఠః సమపద్యత ।**
**నామ్నా వై దేవలః పుత్రో యోగాచార్యో మహాతపాః ॥ 5 ॥**

కశ్యపపుత్రుల్లో రెండవవాడైన అసితునికి ఏకపర్ణ అనే భార్యయందు బ్రహ్మజ్ఞానుల్లో శ్రేష్ఠుడు, గొప్పతపశ్శక్తి కల యోగవిద్యాపండితుడు, దేవలుడు అను పుత్రుడు కలిగినాడు.

**శాణ్డిల్యః పరమః శ్రీమాన్ సర్వతత్త్వార్థవిచ్ఛుచిః ।**
**ప్రసాదాత్పార్వతీశస్య యోగముక్తిమవాప్తవాన్ ॥ 6 ॥**

శాండిల్యుడనేవాడు ఉత్తముడు, శ్రీమంతుడు, సర్వతత్త్వరహస్యాలెరిగినవాడు, పవిత్రుడు. అతడు పార్వతీపతి శివుని అనుగ్రహంవల్ల యోగంద్వారా మోక్షాన్ని పొందినాడు.

**శాణ్డిల్యో నైధ్రువో రైభ్యః త్రయః పుత్రాస్తు కాశ్యపాః ।**
**నరప్రకృతయో విప్రాః పులస్త్యస్య వదామి వః ॥ 7 ॥**

శాండిల్యుడు, నైధ్రువుడు, రైభ్యుడు అను ముగ్గురు మానవప్రకృతికల్గిన కశ్యపప్రజాపతి పుత్రులు. ఓ బ్రాహ్మణులారా! ఇక పులస్త్యుని సంతానాన్ని గూర్చి వివరిస్తాను.

**తృణబిన్దోః సుతా విప్రా నామ్నా ఐలబిలా స్మృతా ।**
**పులస్త్యాయ తు రాజర్షిస్తాం కన్యాం ప్రత్యపాదయత్ ॥ 8 ॥**

విప్రులారా! తృణబిందువు పుత్రిక ఐలబిల అనే పేర ప్రసిద్ధురాలు. తృణబిన్దువు తనకన్యయైన ఐలబిలను పులస్త్యునకు ఇచ్చి వివాహము చేసినాడు.

**ఋషిస్త్యైలబిలస్తస్యాం విశ్రవాః సమపద్యత ।**
**తస్య పత్న్యశ్చతస్రస్తు పౌలస్త్య కులవర్ధికాః ॥ 9 ॥**

పులస్త్యునివలన ఐలబిలయందు ఐలబిలుడను విశ్రవఋషి పుత్రునిగా కలిగెను. అతనికి పౌలస్త్యవంశ వర్ధికులు నలుగురు భార్యలుండిరి.

**పుష్పోత్కటా చ వాకా చ కైకసీ దేవవర్ణినీ ।**
**రూపలావణ్యసమ్పన్నాస్తాసాం చ శృణుత ప్రజాః ॥ 10 ॥**

పుష్పోత్కట, వాక, కైకసి, దేవవర్ణిని అని వారిపేర్లు. ఆ నలుగురు సౌందర్యలావణ్యాలు గలవారే. వారిసంతానాన్ని గూర్చి వినండి.

**జ్యేష్ఠం వైశ్రవణం తస్య సుషువే దేవవర్ణినీ ।**
**కైకస్యజనయత్పుత్రం రావణం రాక్షసాధిపమ్ ॥ 11 ॥**

దేవవర్ణిని అను భార్య పులస్త్యునికి కుబేరుని పెద్ద కుమారునిగా జన్మ నిచ్చినది. కైకసి రాక్షసరాజైన రావణుని ప్రసవించినది.

**కుమ్భకర్ణం శూర్పణఖాం తథైవ చ విభీషణమ్ ।**
**పుష్పోత్కటాఽ ప్యజనయత్పుత్రాన్విశ్రవసః శుభాన్ ॥ 12 ॥**

పుష్పోత్కట కుంభకర్ణుని, విభీషణుని పుత్రులుగా, శూర్పణఖను కూతురుగా పొందినది.

**మహోదరం ప్రహస్తఞ్చ మహాపార్శ్వం ఖరం తథా ।**
**కుమ్భీనసీం తథా కన్యాం వాకాయాః సృజతే ప్రజాః ॥ 13 ॥**

వాక అనే భార్యయందు మహోదరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, ఖరుడు అనే కుమారులు కుంభీనసి అను కన్యకు జన్మించిరి.

**త్రిశిరా దూషణశ్చైవ విద్యుజ్జిహ్వో మహాబలః ।**
**ఇత్యేతే క్రూరకర్మాణః పౌలస్త్యా రాక్షసా దశ ॥ 14 ॥**

**సర్వే తపోబలోత్కృష్టా రుద్రభక్తాః సుభీషణాః ।**

త్రిశిరుడు, దూషణుడు, విద్యుజ్జిహ్వుడు అను గొప్ప బలశాలి వీరందరు పులస్త్యసంతతి పదుగురు క్రూరకర్ములు అయిన రాక్షసులు. వీరందరు తపోబలంతో గొప్పవారు. శివుని యందు భక్తికల్గి మిక్కిలిభయం గొల్చేవారు.

**పులహస్య మృగాః పుత్రాః సర్వే వ్యాలాశ్చ దంష్ట్రిణః ॥ 15 ॥**

**భూతాః పిశాచా ఋక్షాశ్చ సూకరా హస్తినస్తథా ।**
**అనపత్యః క్రతుస్తస్మిన్ స్మృతో వైవస్వతేఽన్తరే ॥ 16 ॥**

**మరీచేః కశ్యపః పుత్రః స్వయమేవ ప్రజాపతిః ।**

పులహుడనే వానికి పుత్రులుగా మృగాలు కోరలున్న సమస్తక్రూరజంతువులు భూతాలు, పిశాచాలు, ఎలుగుబంట్లు, వరాహాలు, ఏనుగులు జన్మించినవి. ఆ వైవస్వతమన్వంతరంలో క్రతువు అనేవాడు సంతానహీనునిగా ఉన్నాడు. మరీచికి కశ్యపుడు కుమారుడై స్వయంగా ప్రజాపతి పదవినందినాడు.

**భృగోరథాభవచ్ఛుక్రో దైత్యాచార్యో మహాతపాః ॥ 17 ॥**

**స్వాధ్యాయయోగనిరతో హరభక్తో మహాద్యుతిః ।**
**అత్రేః పత్న్యోఽభవన్బహ్వ్యః సోదర్యస్తా పతివ్రతాః ॥ 18 ॥**

భృగువునకు రాక్షస గురువు, గొప్ప తపశ్శక్తిగల శుక్రుడు పుత్రుడైనాడు. వేదాధ్యయనం యోగవిద్యయందాసక్తి కల్గి శివభక్తుడు గొప్ప తేజస్వి అయిన అత్రిమహామునికి చాలమంది అక్క చెల్లెళ్ళు భార్యలుగా ఉండిరి. వారంతా పతివ్రతలు.

**కృశాశ్వస్య తు విప్రర్షేః ఘృతాచ్యామితి నః శ్రుతమ్ ।**
**స తస్యాం జనయామాస స్వస్త్యాత్రేయాన్మహౌజసః ॥ 19 ॥**

నైధ్రువుడు కృశాశ్వునకు ఘృతాచియం దుద్భవించినాడని మేము విన్నాము. అతడు ఆమెయందు బలశాలురైన స్వస్త్యాత్రేయులనే వారిని కుమారులుగ పొందినాడు.

**వేదవేదాఙ్గనిరతాం తపసా హతకిల్బిషాన్ ।**
**నారదస్తు వసిష్ఠాయ దదౌ దేవీమరున్ధతీమ్ ॥ 20 ॥**

**ఊర్ధ్వరేతాస్తు తత్రైవ శాపాద్దక్షస్య నారదః ।**

వారు వేదవేదాంగాల్లో శ్రద్ధ కలవారు. తపసుతో పాపాలు నశింపచేసుకున్నారు. నారదుడు అరుంధతిని వసిష్ఠునకు భార్యగా అర్పించినాడు. నారదుడు దక్షశాపం వల్ల అక్కడనే ఊర్ధ్వరేతస్కుడుగా మారినాడు.

**హర్యశ్వేషు తు నష్టేషు మాయయా నారదస్య తు ॥ 21 ॥**
**శశాప నారదం దక్షః క్రోధసంరక్తలోచనః । 22 ॥**

నారదుని మాయతో దక్షపుత్రులు హర్యశ్వులు నశించగా కోపంతో నేత్రము లెర్రబడగా దక్షుడు నారదుని శపించినాడు.

**యస్మాన్మమ సుతాస్సర్వే భవతా మాయయా ద్విజ ।**

**క్షయం నీతాస్త్వశేషేణ నిరపత్యో భవిష్యసి ।**
**అరున్ధత్యాం వశిష్ఠస్తు శక్తిముత్పాదయత్సుతమ్ ॥ 23 ॥**

ఓ విప్రుడా! నీమాయచేత నా పుత్రులు సంపూర్ణంగా నశించినారు. అందువల్ల నీవు సంతానహీనుడ వగుము అని శపించినాడు. వశిష్ఠుడు అరుంధతి యందు శక్తి అనే కుమారుని పొందినాడు.

**శక్తేః పరాశరః శ్రీమాన్ సర్వజ్ఞస్తపసాం వరః ।**
**ఆరాధ్య దేవదేవేశమీశానం త్రిపురాన్తకమ్ ॥ 24 ॥**

**లేభే త్వప్రతిమం పుత్రం కృష్ణద్వైపాయనం ప్రభుమ్ ।**
**ద్వైపాయనాచ్ఛుకో జజ్ఞే భగవానేవ శఙ్కరః ॥ 25 ॥**

ఆ శక్తికి అన్ని తెలిసినవాడు తపశ్శ్రేష్ఠుడు శ్రీమంతుడైన పరాశరుడు జన్మించినాడు. అతడు దేవదేవుడైన త్రిపురాసుర సంహారం కావించిన ఈశ్వరుని పూజించి సాటిలేని కుమారునిగా ప్రభువైన వ్యాసుని పొందినాడు. కృష్ణద్వైపాయనుడనే వ్యాసుని వల్ల సాక్షాద్భగవంతుడైన శంకరుడే శుకుడుగా జన్మించినాడు.

**అంశాంశేనావతీర్యోర్వ్యాం స్వం ప్రాప పరమం పదమ్ ।**
**శుకస్యాప్యభవన్పుత్రాః పఞ్చాత్యన్తతపస్వినః ॥ 26 ॥**

ఆ శంకరుడు అంశరూపంలో భూమియందు జన్మించి తర్వాత తన శ్రేష్ఠమైన స్థానానికి చేరుకున్నాడు. ఆ శుకునికి అయిదురు తపోబలసంపన్నులైన కుమారులు కలిగినారు.

**భూరిశ్రవాః ప్రభుః శమ్భుః కృష్ణో గౌరశ్చ పఞ్చమః ।**
**కన్యా కీర్తిమతీ చైవ యోగమాతా ధృతవ్రతా ॥ 27 ॥**

భూరిశ్రవుడు, ప్రభువు, శంభువు, కృష్ణుడు, గౌరుడు ఆ కుమారులు. కీర్తిగలది, యోగసాధకురాలు, వ్రతాలనాచరించే ఒక పుత్రిక కీర్తి అనునది కలిగినది.

**ఏతేఽత్రివంశాః కథితా బ్రహ్మణా బ్రహ్మవాదినామ్ ।**
**అత ఊర్ధ్వం నిబోధధ్వం కశ్యపాద్రాజసన్తతిమ్ ॥ 28 ॥**

అత్రిమునివంశావళి బ్రహ్మ బ్రహ్మవాదులకు చెప్పినది. తర్వాత కశ్యపునివల్ల కలిగిన రాజసంతతిని వినండి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఋషివంశవర్ణనం నామ ఏకోనవింశోఽధ్యాయః ॥ 19 ॥**

శ్రీకూర్మపురాణంలో ఋషివంశవర్ణనమనే పందొమ్మిదవ అధ్యాయం ॥ 19 ॥

## వింశోఽధ్యాయః - ఇరవైయవ అధ్యాయం

## రాజవంశకీర్తనమ్ - రాజవంశకీర్తనం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**అదితిః సుషువే పుత్రమాదిత్యం కశ్యపాత్ప్రభుమ్ ।**
**తస్యాదిత్యస్య చైవాసీద్భార్యాణాం తు చతుష్టయమ్ ॥ 1 ॥**

కశ్యపునివలన అదితి ఆదిత్యుని పుత్రునిగా పొందినది. ఆ ఆదిత్యునికి నలుగురు భార్యలు.

**సంజ్ఞా రాజ్ఞీ ప్రభా ఛాయా పుత్రాంస్తాంస్తాం నిబోధత ।**
**సంజ్ఞా త్వాష్ట్రీ తు సుషువే సూర్యాన్మనుమనుత్తమమ్ ॥ 2 ॥**

వారు సంజ్ఞ, రాజ్ఞి, ప్రభ, ఛాయ అనువారు. వారి కుమారులను గురించి వినండి. వారిలో సంజ్ఞ త్వష్టకుమార్తె. ఆమె సూర్యునివలన శ్రేష్ఠుడైన మనువును పొందెను.

**యమఇ్చ యమునాఇ్చైవ రాజ్ఞీ రేవన్తమేవ చ ।**
**ప్రభా ప్రభాతమాదిత్యాచ్ఛాయా సావర్ణిమాత్మజమ్ ॥ 3 ॥**

రాజ్ఞి అనుభార్య యముని, రేవంతుని పుత్రులుగా, యమునను పుత్రికగా పొందెను. ప్రభ అను భార్య ప్రభాతుని, ఛాయ సావర్ణుని కుమారులుగా పొందిరి.

**శనిం చ తపతీం చైవ విష్టిం చైవ యథాక్రమమ్ ।**
**మనోస్తు ప్రథమస్యాసన్నవ పుత్రాస్తు తత్సమాః ॥ 4 ॥**

ఆ ఛాయ శనిని, తపతిని, విష్టిని కూడా క్రమంగా సంతానాన్ని పొందినది. ఆదిత్యుని మొదటి కుమారుడు మనువునకు అతనితో సమానులైన తొమ్మండుగురు పుత్రులు కలిగినారు.

**ఇక్ష్వాకుశ్చైవ నభగో ధృష్టః శర్యాతిరేవ చ ।**
**నరిష్యన్తశ్చ నాభాగో హ్యరిష్టః కరుషస్తథా ॥ 5 ॥**

**పృషధ్రశ్చ మహాతేజా నవైతే శక్రసన్నిభాః ।**

ఇక్ష్వాకువు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, అరిష్టుడు, కరుషుడు అనువారు. మరియు తేజోవంతుడైన పృషధ్రుడనేవాడు ఇంద్రునితో సమానులైన తొమ్మిదిమంది మనువు కుమారులు.

**ఇలా జ్యేష్ఠా వరిష్ఠా చ సోమవంశం వ్యవర్ధయత్ ॥ 6 ॥**

పెద్దది శ్రేష్ఠురాలైన ఇల చంద్రవంశాన్ని వృద్ధి పొందించినది.

**బుధస్య గత్వా భవనం సోమపుత్రేణ సఙ్గతా ।**
**అసూత సోమజాద్దేవీ పురూరవసముత్తమమ్ ॥ 7 ॥**

**పితౄణాం తృప్తి కర్తారం బుధాదితి హి నః శ్రుతమ్ ।**

ఇల చంద్రుని కుమారుడు బుధుని గృహిణిగా వెళ్ళి అతని సాంగత్యంతో ఉత్తముడైన పురూరవసుని కుమారునిగా పొందినది. ఆ పురూరవసుడు పితృదేవతలను తృప్తిపరచినాడని మేము విన్నాము.

**ప్రాప పుత్రం సువిమలం సుద్యుమ్న ఇతి విశ్రుతమ్ ॥ 8 ॥**

**ఇలా పుత్రత్రయం లేభే పునః స్త్రీత్వమవిన్దత ।**
**ఉత్కలఇ్చ గయశ్చైవ వినతం చ తథైవ చ ॥ 9 ॥**

మనువు సుద్యుమ్నుడను పుత్రుని పొందెను. ఇలయే పురుషునిగా మారిన సుద్యుమ్నుడు అనువాడు. అసుద్యుమ్ననికి ఉత్కలుడు, గయుడు, వినతుడను ముప్వురు పుత్రులు కలిగి ఆ తరువాత స్త్రీత్వమును పొందింది.

**సర్వే తేఽప్రతిమప్రఖ్యాః ప్రపన్నాః కమలోద్భవమ్ ।**
**ఇక్ష్వాకోశ్చాభవద్వీరో వికుక్షిర్నామ పార్థివః ॥ 10 ॥**

వారందరు సాటిలేని ప్రసిద్ధిని పొందినవారు. బ్రహ్మ నాశ్రయించినారు. ఇక్ష్వాకువల్ల వీరుడు వికుక్షి అనే పేరు గల రాజు జన్మించాడు.

**జ్యేష్ఠపుత్రః స తస్యాసీద్దశ పఇ్చ చ తత్సుతాః ।**
**తేషాం జ్యేష్ఠః కకుత్థోఽభూత్కాకుత్థస్తు సుయోధనః ॥ 11 ॥**

ఇక్ష్వాకునకు వికుక్షి పెద్ద కుమారుడు. అతనికి పదునైదుగురు కుమారులు కలిగినారు. వారిలో జ్యేష్ఠుడు కకుత్థుడనువాడు. అతని కుమారుడు సుయోధనుడు.

**సుయోధనాత్పృథుః శ్రీమాన్విశ్వకశ్చ పృథోస్సుతః ।**
**విశ్వకాదార్ద్రకో ధీమాన్యువనాశ్వశ్చ తత్సుతః ॥ 12 ॥**

సుయోధనునివల్ల శ్రీమంతుడైన పృథువు జన్మించాడు. ఆ పృథువు పుత్రుడు విశ్వకుడు. అతనివల్ల బుద్ధిమంతుడు ఆర్ద్రకుడు కలిగినాడు. అతనికి యువనాశ్వుడు జన్మించినాడు.

**స గోకర్ణమనుప్రాప్య యువనాశ్వః ప్రతాపవాన్ ।**
**దృష్ట్వాఽసౌ గౌతమం విప్రం తపన్తమనలప్రభమ్ ॥ 13 ॥**

**ప్రణమ్య దణ్డవద్భూమౌ పుత్రకామో మహీపతిః ।**
**అపృచ్ఛత్కర్మణా కేన ధార్మికం ప్రాప్నుయాం సుతమ్ ॥ 14 ॥**

ప్రతాపవంతుడైన ఆ యువనాశ్వుడు గోకర్ణక్షేత్రాన్ని చేరి అక్కడ తపోనిష్ఠుడైన గౌతముడనే బ్రాహ్మణుని చూచినాడు. నేలపై దండవత్ సాష్టాంగనమస్కారం చేసి పుత్రుని కోరుతున్న ఆ రాజు ఏకర్మతో నేను ధర్మానుయాయి అయ్యే కుమారుని పొందగలనని ప్రశ్నించెను.

**గౌతమ ఉవాచః-** గౌతముడు పలికాడు.

**ఆరాధ్య పురుషం పూర్వం నారాయణమనామయమ్ ।**
**అనాదినిధనం దేవం ధార్మికం ప్రాప్నుయాత్సుతమ్ ॥ 15 ॥**

సనాతనపురుషుడు, దోషం లేనివాడు, ఆద్యంతాలులేని ఆ నారాయణుని ఆరాధించి ధార్మికుడైన పుత్రుని పొందగలవు అని చెప్పెను.

**తస్య పుత్రః స్వయం బ్రహ్మా పౌత్రః స్యాన్నీలలోహితః ।**
**తమాదికృష్ణమీశానమారాధ్యాఽఽప్నోతి సత్సుతమ్ ॥ 16 ॥**

ఆ నారాయణుని పుత్రుడు స్వయంగా బ్రహ్మ. నీలలోహితుడనే శంకరుడు ఆయన మనుమడు. ఆదిపురుషుడైన కృష్ణుని ఆరాధించి మంచి పుత్రుని పొందవచ్చును.

**న యస్య భగవాన్ బ్రహ్మా ప్రభావం వేత్తి తత్త్వతః ।**
**తమారాధ్య హృషీకేశం ప్రాప్నుయాద్ధార్మికం సుతమ్ ॥ 17 ॥**

బ్రహ్మదేవుడు కూడా తెలియజాలని ప్రభావంగల హృషీకేశుని ఆరాధించి ధార్మికుడైన కుమారుని పొందగలవు.

**స గౌతమవచః శ్రుత్వా యువనాశ్వో మహీపతిః ।**
**ఆరాధయన్ హృషీకేశం వాసుదేవం సనాతనమ్ ॥ 18 ॥**

ఆ యువనాశ్వుడు గౌతముని మాట ప్రకారం సనాతనుడు, హృషీకేశుడు, వాసుదేవుడైన నారాయణుని ఆరాధించినాడు.

**తస్య పుత్రోఽభవద్వీరః సావస్తిరితి విశ్రుతః ।**
**నిర్మితా యేన సావస్తిః గౌడదేశే మహాపురీ ॥ 19 ॥**

అతనికి సావస్తి అనే వీరుడు ప్రసిద్ధుడైన కుమారు డుదయించినాడు. అతడే గౌడదేశంలో సావస్తి అనే పట్టణాన్ని నిర్మింపజేశాడు.

**తస్మాచ్చ బృహదశ్వోఽభూత్తస్మాత్కువలయాశ్వకః ।**
**ధున్ధుమారః సమభవద్ధున్ధుం హత్వా మహాసురమ్ ॥ 20 ॥**

అతనికి బృహదశ్వుడు, బృహదశ్వునికి కువలాయశ్వుడు జన్మించినాడు. అతడు ధుంధుడు అనే గొప్ప రాక్షసుని చంపి ధుంధుమారుడనే పేర ప్రసిద్ధుడైనాడు.

**ధున్ధుమారస్య తనయాస్త్రయః ప్రోక్తా ద్విజోత్తమాః ।**
**దృఢాశ్వశ్చైవ దణ్డాశ్వః కపిలాశ్వస్తథైవ చ ॥ 21 ॥**

ఓవిప్రులారా! ధుంధుమారునికి దృఢాశ్వుడు, దండాశుడు, కపిలాశ్వుడనే పేరుగల ముగ్గురు పుత్రులు కలిగినారు.

**దృఢాశ్వస్య ప్రమోదస్తు హర్యశ్వస్తస్య చాఽఽత్మజః ।**
**హర్యశ్వస్య నికుమ్భస్తు నికుమ్భాత్సంహతాశ్వకః ॥ 22 ॥**

వారిలో దృఢాశ్వునికి ప్రమోదుడు, అతనికి హర్యశ్వుడు అను వారిద్దరు పుత్రులు. హర్యశ్వునికి నికుంభుడు, అతనికి సంహితాశ్వకుడు జన్మించినాడు.

**కృత్వాశ్వోఽథ రణాశ్వశ్చ సంహితాశ్వస్య వై సుతౌ ।**
**యువనాశ్వో రణాశ్వస్య శక్రతుల్యబలో యుధి ॥ 23 ॥**

సంహితాశ్వకునికి కృతాశ్వుడు, రణాశ్వుడనే ఇద్దరు కుమారులు. వారిలో రణాశ్వునికి యువనాశ్వడనే యుద్ధంలో ఇంద్ర సమానబలం గల పుత్రుడు కలిగెను.

**కృత్వా తు వారుణీమిష్టిమృషీణాం వై ప్రసాదతః ।**
**లేభే త్వప్రతిమం పుత్రం విష్ణుభక్తమనుత్తమమ్ ॥ 24 ॥**

అతడు ఋషుల అనుగ్రహంతో వరుణదేవతాకమైన ఇష్టిని చేసి సాటిలేని విష్ణుభక్తుడు శ్రేష్ఠుడైన పుత్రుని పొందినాడు.

**మాన్ధాతారం మహాప్రాజ్ఞం సర్వశస్త్రభృతాం వరమ్ ।**
**మాన్ధాతుః పురుకుత్సోఽభూదమ్బరీషశ్చ వీర్యవాన్ ॥ 25 ॥**

**ముచుకున్దశ్చ పుణ్యాత్మా సర్వే శక్రసమా యుధి ।**
**అమ్బరీషస్య దాయాదో యువనాశ్వోఽపరః స్మృతః ॥ 26 ॥**

ఆతడే బుద్ధిశాలి. ఆయుధధారులలో శ్రేష్ఠుడైన మాంధాత, అతనికి పురుకుత్సుడు, పరాక్రమవంతుడైన అంబరీషుడు ఇద్దరు కుమారులు. పుణ్యాత్ముడైన ముచుకుందుడు కూడా మాంధాత కుమారుడే. వారందరూ యుద్ధరంగమందు ఇంద్రసమానులే. అంబరీషునికి యువనాశ్వుడనే మరో దాయాది ఉన్నాడు.

**హరితో యువనాశ్వస్య హారీతస్తత్సుతోఽభవత్ ।**
**పురుకుత్సస్య దాయాదస్త్రసదస్యుర్మహాయశాః ॥ 27 ॥**

ఆ యువనాశ్వునికి హరితుడు, అతనికి హారీతుడనువాడు జన్మించెను. పురుకుత్సుని దాయాది త్రసదస్యుడు గొప్ప కీర్తి కలవాడు.

**నర్మదాయాం సముత్పన్నః సమ్భూతిస్తత్సుతః స్మృతః ।**
**విష్ణువృద్ధః సుతస్తస్య త్వనరణ్యోఽభవత్తతః ॥ 28 ॥**

నర్మద అను స్త్రీయందు జన్మించాడు. అతని కుమారుడు సంభూతి, అతనికి విష్ణువృద్ధుడు పుత్రుడు. అతని కుమారుడు అనరణ్యుడు.

**బృహదశ్వో ఽనరణ్యస్య హర్యశ్వస్తత్సుతోఽభవత్ ।**
**సోఽతీవధార్మికో రాజా కర్దమస్య ప్రజాపతేః ॥ 29 ॥**

అనరణ్యునికి బృహదశ్వుడు అతనికి హర్యశ్వుడు అను కుమారుడు. ధర్మాత్ముడైన హర్యశ్వుడు కర్దమప్రజాపతి అనుగ్రహంవలన సూర్యునియందు భక్తిగల ధార్మికుడైన కుమారుని పొందినాడు.

**ప్రసాదాద్ధార్మికం పుత్రం లేభే సూర్యపరాయణమ్ ।**
**స తు సూర్యం సమభ్యర్చ్య రాజా వసుమనాః శుభమ్ ॥ 30 ॥**

**లేభే త్వప్రతిమం పుత్రం త్రిధన్వానమరిన్దనమ్ ।**
**అయజచ్చాశ్వమేధేన శత్రూఞ్జిత్వా ద్విజోత్తమాః ॥ 31 ॥**

వసుమనసుడు అనబడే ఆ రాజు శుభాన్ని కలిగించే సూర్యుని ఆరాధించి సాటిలేని శత్రుంజయుడైన త్రిధన్వుడనే కుమారుని పొందినాడు. ఓ బ్రాహ్మణులారా! అతడు శత్రువులను గెలిచి అశ్వమేధయాగాన్ని నిర్వహించాడు.

**స్వాధ్యాయవాన్దానశీలస్తితీర్షుర్ధర్మతత్పరః ।**
**ఋషయస్తు సమాజగ్ముర్యజ్ఞవాటం మహాత్మనః ॥ 32 ॥**

వేదాధ్యయనం చేసినవాడు, దానస్వభావంకలవాడు, సంసారసముద్రాన్ని దాట గోరినవాడు, ధర్మమందాసక్తి కలవా డా రాజు. అతని యజ్ఞమంటపానికి ఋషులు వచ్చినారు.

**వశిష్ఠకశ్యపముఖా దేవాశ్చేన్ద్రపురోగమాః ।**
**తాన్ప్రణమ్య మహారాజః పప్రచ్ఛ వినయాన్వితః ॥ 33 ॥**

వశిష్ఠుడు, కశ్యపుడు మొదలైన ఋషులు, ఇంద్రాది దేవతలు తన యజ్ఞశాలకు రాగా ఆ రాజు వారికి నమస్కరించి వినయంతో కుశల ప్రశ్నలు వేసినాడు

**సమాప్య విధివద్యజ్ఞం వసిష్ఠాదీన్ ద్విజోత్తమాన్ ।**

విధిప్రకారం యజ్ఞాన్ని ముగించి వసిష్ఠాది ఋషులను గురించి ఇలా అడిగాడు.

**వసుమనా ఉవాచ :-** వసుమనసుడు పలికాడు.

**కిం హి శ్రేయస్కరం బ్రూత లోకేఽస్మిన్ బ్రాహ్మణర్షభాః! ॥ 34 ॥**
**యజ్ఞస్తపో వా సంన్యాసో బ్రూత మే సర్వవేదినః ॥ 35 ॥**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఈ లోకంలో ఏది ఎక్కువ శ్రేయస్సును చేకూర్చేది? యజ్ఞము, తపస్సు, సంన్యాసము, వీనిలో ఏది శ్రేష్ఠమో అన్నీ తెలిసిన మీరు చెప్పండి.

**వసిష్ఠ ఉవాచ :-**వసిష్ఠుడు పలికాడు

**అధీత్య వేదాన్విధివత్సుతాంశ్చోత్పాద్య యత్నతః ।**
**ఇష్ట్వా యజ్ఞేశ్వరం యజ్ఞైర్గచ్ఛేద్వనమథాత్మవాన్ ॥ 36 ॥**

వేదాలను నియమపూర్వకంగా అధ్యయనం చేసి, తర్వాత గృహస్థుడై పుత్రులను కని, యజ్ఞాలలో యజ్ఞేశ్వరుని ఆరాధించి, ఆత్మబలం కలిగి వనానికి వెళ్ళాలి.

**పులస్త్య ఉవాచ :–** పులస్త్యుడు పలికాడు

**ఆరాధ్య తపసా దేవం యోగినం పరమేశ్వరమ్ ।**
**ప్రవ్రజేద్విధివద్యజ్ఞైరిష్ట్వా పూర్వం సురోత్తమాన్ ॥ 37 ॥**

తపస్సుతో యోగీశ్వరుడైన పరమేశ్వరుని పూజించి శాస్త్రప్రకారం యజ్ఞాలుచేసి ముందుగా దేవతలను పూజించి సంన్యసించాలి.

**పులహ ఉవాచ :–** పులహుడు పలికాడు

**యమాహురేకం పురుషం పురాణం పరమేశ్వరమ్ ।**
**తమారాధ్య సహస్రాంశుం తపసా మోక్షమాప్నుయాత్ ॥ 38 ॥**

అద్వితీయుడు, పురాణపురుషుడు, పరమేశ్వరుడు అని చెప్పనైన సహస్రకిరణుడైన భగవంతుని తపస్సుద్వారా పూజించి మోక్షాన్ని పొందాలి.

**జమదగ్నిరువాచ :–**జమదగ్ని పలికాడు

**అజో విశ్వస్య కర్తా యో జగద్బీజం సనాతనః ।**
**అన్తర్యామీ చ భూతానాం స దేవస్తపసేజ్యతే ॥ 39 ॥**

పుట్టుకలేనివాడు, ప్రపంచాన్ని సృష్టించేవాడు, జగత్తుకు బీజం, సనాతనుడు, సర్వప్రాణుల్లో వ్యాపించి ఉన్న ఆ దేవుడు తపస్సుచేత పూజింపదగినవాడు.

**విశ్వామిత్ర ఉవాచ :–**విశ్వామిత్రుడు పలికాడు.

**యోఽగ్నిః సర్వాత్మకోఽనన్తః స్వయమ్భూర్విశ్వతోముఖః ।**
**స రుద్రస్తపసోగ్రేణ పూజ్యతే నేతరైర్మఖైః ॥ 40 ॥**

రుద్రుడు అగ్ని. సర్వం తన రూపంగా కలవాడు, అంతం లేనివాడు, తానై ఆవిర్భవించినవాడు, ప్రపంచమంతా నిండియున్నవాడు, అతణ్ణి తీవ్రతపస్సుతో పూజించాలి. ఇతర యజ్ఞాలతో పూజలందదు.

**భరద్వాజ ఉవాచ :–** భరద్వాజుడన్నాడు

**యో యజ్ఞైరిజ్యతే దేవో వాసుదేవః సనాతనః ।**
**స సర్వదైవతతనుః పూజ్యతే పరమేశ్వరః ॥ 41 ॥**

సనాతనుడై యజ్ఞాలలో పూజలందుకొనే భగవంతుడు వాసుదేవుడు. సర్వదేవతలు శరీరంగా కలవాడు. అతడే పరమేశ్వరుడు, పూజ్యుడు.

**అత్రిః రువాచ :–** అత్రి పలికాడు.

**యతస్సర్వమిదం జాతం యస్యాపత్యం ప్రజాపతిః ।**
**తపః సుమహదాస్థాయ పూజ్యతే స మహేశ్వరః ॥ 42 ॥**

ఈ సమస్తానికి, బ్రహ్మదేవునికి జనకుడు ఆ మహేశ్వరుడు. అతడు గొప్ప తపస్సును అవలంబించి పూజింపతగినవాడు.

**గౌతమ ఉవాచ :–** గౌతముడు పలికాడు

**యతః ప్రధానపురుషౌ యస్య శక్తిరిదం జగత్ ।**
**స దేవదేవ స్తపసా పూజనీయః సనాతనః ॥ 43 ॥**

దేవదేవునివల్లనే ప్రధానతత్త్వము, పురుషుడు కలిగారు. ఈ విశ్వమంతా అతని శక్తిరూపం. ఆ సనాతనుడే తపస్సుతో పూజనీయుడు.

**కశ్యప ఉవాచ :–** కశ్యపుడు పలికాడు

**సహస్రనయనో దేవః సాక్షీ శంభుః ప్రజాపతిః ।**
**ప్రసీదతి మహాయోగీ పూజితస్తపసా పరః ॥ 44 ॥**

వేయి నేత్రాలు కలవాడు, సమస్తానికి సాక్షిభూతుడు, ప్రజాపతి, శంభుడు గొప్పయోగీశ్వరుడు ఆ దేవుడు. అతడు తపస్సుతో ప్రసన్నుడవుతాడు.

**క్రతురువాచ :–**క్రతువు పలికాడు

**ప్రాప్తాధ్యయనయజ్ఞస్య లబ్ధపుత్రస్య చైవ హి ।**
**నాన్తరేణ తపః కశ్చిద్ధర్మశాస్త్రేషు దృశ్యతే ॥ 45 ॥**

వేదాధ్యయనం చేసినవానికి, యజ్ఞం నిర్వహించినవానికి, పుత్రసంతతి గలవానికి కూడ తపము నాచరించటంకంటె మరో విధి ధర్మశాస్త్రాల్లో కన్పించదు.

**ఇత్యాకర్ణ్య స రాజర్షిస్తాన్ ప్రణమ్యాతిహృష్టధీః ।**
**విసర్జయిత్వా సంపూజ్య త్రిధన్వానమథాబ్రవీత్ ॥ 46 ॥**

ఈవిధంగా ఆ మునుల మాటలు విని రాజర్షి వారికి నమస్కరించి సంతోషంతో వారిని పూజించి వీడ్కొన్నాడు. తర్వాత త్రిధన్వునితో ఇట్లా పలికినాడు.

**ఆరాధయిష్యే తపసా దేవమేకాక్షరాహ్వయమ్ ।**

**ప్రాణం బృహన్తం పురుషమాదిత్యాన్తరసంస్థితమ్ ।**
**త్వన్తు ధర్మరతో నిత్యం పాలయైతదతన్ద్రితః ॥ 47 ॥**

**చాతుర్వర్ణ్యసమాయుక్తమశేషం క్షితిమణ్డలమ్ ।**
**ఏవముక్త్వా స తద్రాజ్యం నిధాయాఽఽత్మభవే నృపః ॥ 48 ॥**

**జగామారణ్యమనఘస్తపస్తప్తుమనుత్తమమ్ ।**
**హిమవచ్ఛిఖరే రమ్యే దేవదారువనాశ్రయే ॥ 49 ॥**

ఏకాక్షరప్రణవస్వరూపుడైన భగవుంతుని నేను తపస్సుతో ఆరాధిస్తాను. సూర్యమండలాంతర్వర్తి బృహత్ప్రాణ స్వరూపుడు అయిన ఆ పరమపురుషు నారాధిస్తాను. నీవు ధర్మాసక్తుడవై, సావధానుడవై ఈరాజ్యాన్ని పాలించుచుండుము. చాతుర్వర్ణ్యం కల ఈ సకల భూమండలాన్ని పాలింపుమని చెప్పి ఆ రాజు తనరాజ్యాన్ని కుమారునకు అప్పగించినాడు. పుణ్యాత్ముడైన ఆ రాజు శ్రేష్ఠమైన తపమాచరించడానికి దేవదారువృక్షాలతో మనోహరమైన హిమాలయశిఖరప్రదేశంలోని అరణ్యానికి వెళ్ళినాడు.

**కన్దమూలఫలాహారైరుత్పన్నైరయజత్సురాన్ ।**
**సంవత్సరశతం సాగ్రం తపోనిర్ధూతకిల్బిషః ॥ 50 ॥**

కందమూలఫలాల ఆహారాలతో దేవతలను నూరు సంవత్సరాలకాలం సేవిస్తూ తపమాచరించి తన పాపాలను తొలగించుకున్నాడు.

**జజాప మనసా దేవీం సావిత్రీం వేదమాతరమ్ ।**
**తస్యైవం తపతో దేవః స్వయమ్భూః పరమేశ్వరః ॥ 51 ॥**

**హిరణ్యగర్భో విశ్వాత్మా తం దేశమగమత్స్వయమ్ ।**

వేదాలకు మాత ఐన సావిత్రిని మనసుతో జపించాడు. ఇలా అతడు తపస్సు చేస్తూండగా స్వయంభువు, పరమేశ్వరుడు, హిరణ్యగర్భుడు, విశ్వరూపుడైన భగవంతుడు ఆ ప్రదేశానికి వచ్చినాడు.

**దృష్ట్వా దేవం సమాయాన్తం బ్రహ్మాణం విశ్వతో ముఖమ్ ॥52॥**

**ననామ శిరసా తస్య పాదయోర్నామ కీర్తయన్ ।**

అన్నివైపుల ప్రసరిస్తున్న ముఖాలు గల బ్రహ్మదేవుడు స్వయంగా తన వద్దకు రావటాన్ని చూచి తన పేరును ఉచ్చరిస్తూ శిరసు వంచి పాదాభివందనం చేసినాడు.

**నమో దేవాధిదేవాయ బ్రహ్మణే పరమాత్మనే ॥ 53 ॥**

**హిరణ్యమూర్తయే తుభ్యం సహస్రాక్షాయ వేధసే ।**
**నమో ధాత్రే విధాత్రే చ నమో దేవాత్మమూర్తయే ॥ 54 ॥**

దేవతలకు అధిపతి పరమాత్మ స్వరూపుడగు భగవంతుడవైన నీకు నమస్కారం. హిరణ్యమూర్తివి అనంతమైన నేత్రాలు గల బ్రహ్మవైన నీకు నమస్కారం. సృష్టించువాడవు, పోషించువాడవు, దేవతలకాత్మరూపుడవైన నీకు నమస్కారం.

**సాంఖ్యయోగాధిగమ్యాయ నమస్తే జ్ఞానమూర్తయే ।**
**నమస్త్రిమూర్తయే తుభ్యం స్రష్టే సర్వార్థవేదినే ॥ 55 ॥**

సాంఖ్యతత్త్వజ్ఞానంతో తెలియదగినవాడవు, జ్ఞానాకారుడవు, ముమ్మూర్తుల ప్రకాశించేవాడవు, సృష్టించే వాడవు, సర్వవిషయములనెరిగిన నీకు నమస్కారం.

**పురుషాయ పురాణాయ యోగినాం గురవే నమః ।**
**తతః ప్రసన్నో భగవాన్ విరిఞ్చిర్విశ్వభావనః ॥ 56 ॥**

**వరం వరయ భద్రం తే వరదోఽస్మీత్యభాషత ।**

పురాణపురుషుడవు. యోగీశ్వరులకు గురువైన నీకు నమస్కారం. అని స్తుతించగా విశ్వభావనుడు భగవంతుడైన బ్రహ్మ అతనికి ప్రసన్నుడై నీకు శుభమగుగాక, వరం కోరుకొనుము. నీకు వరమిచ్చెదను అని అన్నాడు.

**రాజోఉవాచ :–** రాజు పలికాడు.

**జపేయం దేవదేవేశ గాయత్రీం వేదమాతరమ్ ॥ 57 ॥**

దేవదేవుడైన ఓ ప్రభూ! వేదమాత గాయత్రిని జపిస్తాను.

**భూయో వర్షశతం సాగ్రం తావదాయుర్భవేన్మమ ।**
**బాఢమిత్యాహ విశ్వాత్మా సమాలోక్య నరాధిపమ్ ॥ 58 ॥**

మరో వంద సంవత్సరాలు జపించటానికి నాకు ఆయువును ప్రసాదించు అని పలుకగా విశ్వాత్ముడైన బ్రహ్మ రాజును చూచి అట్లే అగుననెను.

**స్పృష్ట్వా కరాభ్యాం సుప్రీతస్తత్రైవాన్తరధీయత ।**
**సోఽపి లబ్ధవరః శ్రీమాన్ జజాపాతిప్రసన్నధీః ॥ 59 ॥**

ప్రీతుడైన బ్రహ్మ ఆ రాజును చేతులతో తాకి ఆశీర్వదించి అక్కడనే అంతర్హితుడైనాడు. రాజుకూడా వరాన్ని పొంది నిర్మలమైన బుద్ధిగలవాడై గాయత్రీమంత్రాన్ని జపించాడు.

**శాన్తః త్రిషవణస్నాయీ కన్దమూలఫలాశనః ।**
**తస్య పూర్ణే వర్షశతే భగవానుగ్రదీధితిః ॥ 60 ॥**

**ప్రాదురాసీన్మహాయోగీ భానోర్మణ్డలమధ్యతః ।**

అపుడాతడు శాంతచిత్తుడై మూడుకాలాల్లో స్నానంచేస్తూ కందమూలఫలాలనే భుజిస్తూ జపం చేస్తూ వందేండ్లు పూర్తి చేసినాడు. అపుడు భగవంతుడు తీక్ష్ణ ప్రకాశంకలిగి మహాయోగి సూర్యమండల మధ్యనుండి సాక్షాత్కరించినాడు.

**తం దృష్ట్వా వేదవపుషం మణ్డలస్థం సనాతనమ్ ॥ 61 ॥**

**స్వయమ్భువమనాద్యన్తం బ్రహ్మాణం విస్మయం గతః ।**
**తుష్టావ వైదికైర్మన్త్రైః సావిత్ర్యా చ విశేషతః ॥ 62 ॥**

వేదశరీరుడు, మండలమధ్యగుడు, సనాతనుడైన ఆ దేవుని స్వయంభువు, ఆద్యంతాలు లేనివాడు ఐన బ్రహ్మను చూచి అతడాశ్చర్యమొంది విశేషంగా వైదికమంత్రములతో సావిత్రితో స్తుతించాడు.

**క్షణాదపశ్యత్ పురుషం తమేవ పరమేశ్వరమ్ ।**
**చతుర్ముఖం జటామౌళిమష్టహస్తం త్రిలోచనమ్ ॥ 63 ॥**

క్షణంలో ఆ రాజు పరమేశ్వరరూపాన్ని నాలుగు ముఖాలున్న పురుషునిగా, జడలు ధరించినవానిగా, ఎనిమిది చేతులు మూడు కన్నులున్నవానిగా దర్శించినాడు.

**చన్ద్రావయవలక్ష్మాణం నరనారీతనుం హరమ్ ।**
**భాసయన్తం జగత్కృత్స్నం నీలకంఠం స్వరశ్మిభిః ॥ 64 ॥**

చంద్రకళ గుర్తుగా గలవాడు. స్త్రీ, పురుషులరూపాలు గల శరీరము కలవాడు. తన కాంతులతో సమస్తలోకాలను ప్రకాశింపజేస్తున్నవాడు. నీలకంఠుడైన దేవుని చూచినాడు.

**రక్తామ్బరధరం రక్తం రక్తమాల్యానులేపనమ్ ।**
**తద్భావభావితో దృష్ట్వా సద్భావేన పరేణ హి ॥ 65 ॥**

**ననామ శిరసా రుద్రం సావిత్ర్యా తేన చైవ హి ।**
**నమస్తే నీలకంఠాయ భాస్వతే పరమేష్ఠినే ॥ 66 ॥**

ఎరుపు వస్త్రాన్ని, హారాన్ని ధరించిన రక్తవర్ణుడైన భగవంతుని చూచి అతనియందే శ్రద్ధకలవాడై సహృదయంతో నమస్కరించాడు. ఆ రుద్రునికి నమస్కరించినాడు. గాయత్రీమంత్రంతో స్తుతించినాడు. నీలకంఠుడగు పరమేష్ఠివి ఐన నీకు నమస్కారం.

**త్రయీమయాయ రుద్రాయ కాలరూపాయ హేతవే ।**
**తదా ప్రాహ మహాదేవో రాజానం ప్రీతమానసః ॥ 67 ॥**

వేదత్రయరూపుడవు, కాలానివి, కారణభూతుడవు, రుద్రుడవైన నీకు నమస్కారం. అపుడా స్తుతికి సంతోషచిత్తుడైన శివుడు రాజును గూర్చి ఇట్లన్నాడు.

**ఇమాని మే రహస్యాని నామాని శృణు చానఘ ।**
**సర్వవేదేషు గీతాని సంసారశమనాని తు ॥ 68 ॥**

పుణ్యాత్ముడా! ఇవి నా నామాలు రహస్యమైనవి, వేదాలన్నింటిలో కీర్తితాలు, సంసారబంధాన్ని తొలగించేవి. వీనిని విను.

**నమస్కురుష్వ నృపతే ఏభిర్మాం సతతం శుచిః ।**
**అధీష్వ శతరుద్రీయం యజుషాం సారముద్ధృతమ్ ॥ 69 ॥**

ఓ రాజా! ఈ నామాలతో శుచివై ఎల్లవేళలా నాకు నమస్కరించు. యజుర్వేద మంత్రాలనుండి ఉద్భవించి సారభూతమైన శతరుద్రీయాన్ని అధ్యయనం చేయి.

**జపస్వానన్యచేతస్కో మయ్యాసక్తమనా నృప ।**
**బ్రహ్మచారీ నిరాహారో భస్మనిష్ఠః సమాహితః ॥ 70 ॥**

రాజా నాయందు ఆసక్తమైన మనసుతో ఏకాగ్రత కల్గి బ్రహ్మచర్యాన్నవలంబించి నిరాహారుడవై భస్మాన్ని ధరించి సావధానంగా జపించు.

**జపేదామరణాద్రుద్రం స యాతి పరమం పదమ్ ।**
**ఇత్యుక్త్వా భగవాన్రుద్రో భక్తానుగ్రహకామ్యయా ॥ 71 ॥**

మరణపర్యంతం జపించినవారు పరమపదాన్ని పొందుతారని చెప్పి భక్తుననుగ్రహించే కోరికతో భగవాన్ రుద్రుడు

**పునః సంవత్సరశతం రాజ్ఞే హ్యాయురకల్పయత్ ।**
**దత్వాఽస్మై తత్పరం జ్ఞానం వైరాగ్యం పరమేశ్వరః ॥ 72 ॥**

**క్షణాదన్తర్దధే రుద్రస్తదద్భుతమివాభవత్ ।**
**రాజాఽపి తపసా రుద్రం జజాపానన్యమానసః ॥ 73 ॥**

మరల నూరుసంవత్సరాలను రాజు ఆయుష్యాన్ని కల్పించాడు. పరమేశ్వరుడాతనికి ఉత్తమజ్ఞానాన్నిచ్చి వైరాగ్యాన్ని కల్గించి క్షణంలో అంతర్ధానమైనాడు. అది అద్భుతంగా జరిగినది. రాజుకూడ అనన్యమానసుడై రుద్రుని గూర్చి జపించినాడు.

**భస్మచ్ఛన్నస్త్రిషవణం స్నాత్వా శాన్తస్సమాహితః ।**
**జపతస్తస్య నృపతేః పూర్ణే వర్షశతే పునః ॥ 74 ॥**

ఆ రాజు భస్మలేపనం కావించుకొని మూడుకాలాల్లో స్నానంచేస్తూ శాంతుడై అవధానంతో జపం చేస్తుండగా నూరుసంవత్సరాలు గడచినవి.

**యోగప్రవృత్తిరభవత్కాలాత్కాలపరం పదమ్ ।**
**వివేశైతద్వేదసారం స్థానం వై పరమేష్ఠినః ॥ 75 ॥**

కాలవశంగా యోగప్రవృత్తి కలుగగా కాలమునకంటే అతీతమైన పరమేష్ఠియొక్క గొప్పస్థానాన్ని పొందాడు.

**భానోః సుమణ్డలం శుభ్రం తతో యాతో మహేశ్వరమ్ ।**
**యః పఠేచ్ఛృణుయాద్వాఽపి రాజ్ఞశ్చరితముత్తమమ్ ॥**

**సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మలోకే మహీయతే । 76 ॥**

తర్వాత సూర్యమండలాన్ని పొంది మహేశ్వరుని సాయుజ్యాన్ని పొందినాడు. ఉత్తమమైన ఈరాజు చరిత్రను విన్నా చదివినా అన్ని పాపాలు తొలగి బ్రహ్మలోకంలో గౌరవాన్ని పొందుతారు.

**ఇతి శ్రీకూర్మపురాణే రాజవంశకీర్తనే వింశోఽధ్యాయః ॥ 20 ॥**

శ్రీకూర్మపురాణంలో రాజవంశకీర్తనంలో ఇరవైయవ అధ్యాయం ॥ 20 ॥

## ఏకవింశోఽధ్యాయః - ఇరవై ఒకటవ అధ్యాయం

## ఇక్ష్వాకువంశవర్ణనమ్ - ఇక్ష్వాకువంశవర్ణనం

**సూత ఉవాచ :-**సూతుడు పలికాడు.

**త్రిధన్వా రాజపుత్రస్తు ధర్మేణాపాలయన్మహీమ్ ।**
**తస్య పుత్రోఽభవద్విద్వాంస్త్రయ్యారుణ ఇతి శ్రుతః ॥ 1 ॥**

రాజపుత్రుడు సుధన్వుడు ధర్మమార్గంలో భూమిని పాలించాడు. అతనికి పండితుడు త్రయ్యారుణుడనే ప్రసిద్ధుడైన పుత్రుడు కలిగాడు.

**తస్య సత్యవ్రతో నామ కుమారోఽభూన్మహాబలః ।**
**భార్యా సత్యధనా నామ హరిశ్చన్ద్రమజీజనత్ ॥ 2 ॥**

అతనికి గొప్ప బలవంతుడు సత్యవ్రతుడనే పుత్రుడు, అతని భార్య సత్యధన హరిశ్చంద్రుని పుత్రునిగా పొందినది.

**హరిశ్చన్ద్రస్య పుత్రోఽభూద్రోహితో నామ వీర్యవాన్ ।**
**రోహితస్య వృకః పుత్రస్తస్మాద్బాహురజాయత ॥ 3 ॥**

ఆ హరిశ్చంద్రునికి పరాక్రమవంతుడు రోహితుడనే కుమారుడు కలిగాడు. రోహితునికి వృకుడనే పుత్రుడు. అతనికి బాహువు అనే కుమారుడు జన్మించాడు.

**హరితో రోహితస్యాథ ధున్ధుస్తస్య సుతోఽభవత్ ।**
**విజయశ్చ సుదేవశ్చ ధున్ధుపుత్రౌ బభూవతుః ॥ 4 ॥**

రోహితునికి మరొక పుత్రుడు హరితుడు. అతనికి ధుంధువు కుమారుడు. ధుంధువునకు సుదేవుడు, విజయుడు అనే వారు పుత్రులు.

**విజయస్యాభవత్పుత్రః కారుకో నామ వీర్యవాన్ ।**
**సగరస్తస్య పుత్రోఽభూద్రాజా పరమధార్మికః ॥ 5 ॥**

విజయునకు కారుకుడనే వీర్యవంతుడు కుమారుడు. అతనికి ధర్మస్వభావంగల సగరుడనే రాజు కుమారుడుగా జన్మించాడు.

**ద్వే భార్యే సగరస్యాపి ప్రభా భానుమతీ తథా ।**
**తాభ్యామారాధితో వహ్నిః ప్రదదౌ వరముత్తమమ్ ॥ 6 ॥**

సగరునికి ప్రభ, భానుమతి అను ఇరువురు భార్యలు. వారు అగ్నిని పూజించి మంచివరాన్ని పొందినారు.

**ఏకం భానుమతీ పుత్రమగృహ్ణాదసమఞ్జసమ్ ।**
**ప్రభా షష్టిసహస్రన్తు పుత్రాణాం జగృహే శుభా ॥ 7 ॥**

ఆ వరం ద్వారా భానుమతి అసమంజసుడనే పుత్రుని పొందినది. మంగళరూప అయిన ప్రభ అనే సగరుని రెండవభార్య అరువదివేలమంది కుమారులను గ్రహించినది.

**అసమఞ్జసపుత్రోఽభూదంశుమాన్నామ పార్థివః ।**
**తస్య పుత్రో దిలీపస్తు దిలీపాత్తు భగీరథః ॥ 8 ॥**

అసమంజునికి అంశుమంతుడనే కుమారుడు, అతని కుమారుడు దిలీపుడు, అతనికి భగీరథుడనే సుతుడు జన్మించాడు.

**యేన భాగీరథీ గఙ్గా తపః కృత్వాఽవతారితా ।**
**ప్రసాదాద్దేవదేవస్య మహాదేవస్య ధీమతః ॥ 9 ॥**

ఈ భగీరథుడు తపస్సుతో దేవదేవుడగు శివుని అనుగ్రహంతో గంగానదిని భూమికి తెచ్చినాడు.

**భగీరథస్య తపసా దేవః ప్రీతమనా హరః ।**
**బభార శిరసా గఙ్గాం సోమాన్తే సోమభూషణః ॥ 10 ॥**

భగీరథుని తపస్సుకు సంతోషించిన శశిభూషణుడైన శివుడు గంగను శిరస్సుపై చంద్రుని ప్రక్కగా ధరించినాడు.

**భగీరథసుతశ్చాపి శ్రుతో నామ బభూవ హ ।**
**నాభాగస్తస్య దాయాదః సిన్ధుద్వీపస్తతోఽభవత్ ॥ 11 ॥**

ఆ భగీరథుని పుత్రుడు శ్రుతుడు, అతనికి నాభాగుడు, నాభాగునికి సింధుద్వీపుడనే వాడు జన్మించాడు.

**అయుతాయుః స్తుతస్తస్య ఋతుపర్ణో మహాబలః ।**
**ఋతుపర్ణస్య పుత్రోఽభూత్సుదాసో నామ ధార్మికః ॥ 12 ॥**

సింధుద్వీపునికి గొప్ప బలవంతుడు అయిన అయుతాయువు అనుపుత్రుడు కలిగాడు. అతని పుత్రుడు ఋతుపర్ణుడనే కుమారుడు, ఇతనికి ధర్మశీలి సుదాసుడు పుత్రుడు.

**సౌదాసస్తస్య తనయః ఖ్యాతః కల్మాషపాదకః ।**
**వసిష్ఠస్తు మహాతేజాః క్షేత్రే కాల్మాషపాదకే ॥ 13 ॥**

**అశ్మకం జనయామాస తమిక్ష్వాకుకులధ్వజమ్ ।**
**అశ్మకస్యోత్కలాయాన్తు నకులో నామ పార్థివః ॥ 14 ॥**

సుదాసుని పుత్రుడు కల్మాషపాదకుడు. గొప్ప తేజస్వంతుడైన వశిష్ఠుడు కల్మాషపాదుని క్షేత్రమందు ఇక్ష్వాకు వంశానికి పతాకప్రాయుడు అశ్మకుడనే కుమారునికి జన్మనిచ్చాడు. అశ్మకునికి ఉత్కలయందు నకులుడనే రాజు జన్మించాడు.

**స హి రామభయాద్రాజా వనం ప్రాప సుదుఃఖితః ।**
**దధత్స నారీకవచం తస్మాచ్ఛతరథోఽభవత్ ॥ 15 ॥**

ఆ నకులుడు పరశురాముని భయంవలన అడవికేగి స్త్రీకవచం ధరించి తప్పించుకున్నాడు. అతనికి శతరథుడు పుట్టాడు.

**తస్మాద్బిలబిలః శ్రీమాన్ వృద్ధశర్మా చ తత్సుతః ।**
**తస్మాద్విశ్వసహస్తస్మాత్ఖట్వాఙ్గ ఇతి విశ్రుతః ॥ 16 ॥**

శతరథునికి శ్రీమంతుడగు బిలబిలుడు కుమారుడు, అతని పుత్రుడు వృద్ధశర్మ. అతనికి విశ్వసహుడు, విశ్వసహునికి ఖట్వాంగుడనే తనయుడు జన్మించినాడు.

**దీర్ఘబాహుః సుతస్తస్మాద్రఘుస్తస్మాదజాయత ।**
**రఘోరజః సముత్పన్నో రాజా దశరథస్తతః ॥ 17 ॥**

ఖట్వాంగునికి దీర్ఘబాహువు, అతని వల్ల రఘువు కలిగినాడు. రఘువునకు అజుడు, అజునకు దశరథుడు పుత్రుడు.

**రామో దాశరథిశ్శూరో ధర్మజ్ఞో లోకవిశ్రుతః ।**
**భరతో లక్ష్మణశ్చైవ శత్రుఘ్నశ్చ మహాబలః ॥ 18 ॥**

ఆ దశరథునికి వీరుడు, ధర్మజ్ఞుడు, లోకవిఖ్యాతుడైన శ్రీరాముడు, అట్లే భరతుడు, లక్ష్మణ,శత్రుఘ్నులు అనే బలవంతులైన కుమారులు కలిగినారు.

**సర్వే శక్రసమా యుద్ధే విష్ణుశక్తిసమన్వితాః ।**
**జజ్ఞే రావణనాశార్థం విష్ణురంశేన విశ్వభుక్ ॥ 19 ॥**

వారందరు యుద్ధంచేయడంలో ఇంద్రసమానులు. విష్ణుఅంశ ధరించినవారు. రావణుని సంహారం కొరకు నారాయణుడు అంశరూపంలో అవతరించినాడు.

**రామస్య భార్యా సుభగా జనకస్యాత్మజా శుభా ।**
**సీతా త్రిలోకవిఖ్యాతా శీలౌదార్యగుణాన్వితా ॥ 20 ॥**

జనకుని కూతురు సీత. మంగళమూర్తి, ఉత్తమురాలు, ముల్లోకాల్లో ప్రసిద్ధి పొందినది. శీలౌదార్యగుణరాశి రాముని భార్య అయినది.

**తపసా తోషితా దేవీ జనకేన గిరీన్ద్రజా ।**
**ప్రాయచ్ఛజ్జానకీం సీతాం రామమేవాశ్రితాం పతిమ్ ॥ 21 ॥**

పర్వతరాజపుత్రిక పార్వతి జనకుని తపస్సుకు మెచ్చి రాముని భర్తగా ఆశ్రయించే సీతను జనకుని కూతురగునట్లనుగ్రహించినది.

**ప్రీతశ్చ భగవానీశస్త్రిశూలీ నీలలోహితః ।**
**ప్రదదౌ శత్రునాశార్థం జనకాయాద్భుతం ధనుః ॥ 22 ॥**

భగవంతుడు, నీలలోహితుడు, త్రిశూలధారి, శంకరుడు కూడ సంతోషించి శత్రుసంహారం కోసం జనకునికి ఆశ్చర్యకరమైన ధనస్సునిచ్చినాడు.

**స రాజా జనకో ధీమాన్ దాతుకామః సుతామిమామ్ ।**
**అఘోషయదమిత్రఘ్నో లోకేఽస్మిన్ద్విజపుఙ్గవాః ॥ 23 ॥**

బుద్ధిశాలి ఐన జనకుడు తన పుత్రిక సీతను యోగ్యుడైన వరునకివ్వదలచి ఓ విప్రశ్రేష్ఠులారా! ఈవిధంగా ప్రకటించినాడు.

**ఇదం ధనుః సమాదాతుం యః శక్నోతి జగత్త్రయే ।**
**దేవో వా దానవో వాఽపి స సీతాం లబ్ధుమర్హతి ॥ 24 ॥**

ఈ ముల్లోకాల్లో దేవజాతివాడు కానీ దానవుడు కానీ ఎవడైనా శివధనువును ఎక్కుపెట్ట సమర్థుడైనవాడు నా కూతురు సీతను పొందనర్హుడు.

**విజ్ఞాయ రామో బలవాన్ జనకస్య గృహం ప్రభుః ।**
**భఞ్జయామాస చాదాయ గత్వాఽసౌ లీలయైవ హి ॥ 25 ॥**

ఆ విషయం తెలుసుకొని బలవంతుడైన రాముడు జనకుని గృహానికి వెళ్ళి శివధనువును గైకొని అవలీలగా దానిని విరిచాడు.

**ఉద్వవాహోథ తాం కన్యాం పార్వతీమివ శంకరః ।**
**రామః పరమధర్మాత్మా సేనామివ చ షణ్ముఖః ॥ 26 ॥**

తర్వాత ధర్మాత్ముడైన రాముడు శంకరుడు పార్వతిని గ్రహించినట్లు, కుమారస్వామి దేవసేనాభారాన్ని వహించినట్లు సీతను వివాహమాడి భార్యగా స్వీకరించాడు.

**తతో బహుతిథే కాలే రాజా దశరథః స్వయమ్ ।**
**రామం జ్యేష్ఠసుతం వీరం రాజానం కర్తుమారభత్ ॥ 27 ॥**

తర్వాత చాలాకాలానికి దశరథుడు తన జ్యేష్ఠపుత్రుడు వీరుడైన రాముని రాజుగా చేయ స్వయంగా పూనుకున్నాడు.

**తస్యాథ పత్నీ సుభగా కైకేయీ చారుహాసినీ ।**
**నివారయామాస పతిం ప్రాహ సంభ్రాన్తమానసా ॥ 28 ॥**

అప్పుడు దశరథుని భార్య అందగత్తె, అందమైన నవ్వుగల కైకేయి అతనిని నివారించినది. సంభ్రాంతచిత్తయై భర్తతో ఇట్లన్నది.

**మత్సుతం భరతం వీరం రాజానం కర్తుమర్హసి ।**
**పూర్వమేవ వరౌ యస్మాద్దత్తౌ మే భవతా యతః ॥ 29 ॥**

**స తస్యా వచనం శ్రుత్వా రాజా దుఃఖితమానసః ।**
**బాఢమిత్యబ్రవీద్వాక్యం తథా రామోఽపి ధర్మవిత్ ॥ 30 ॥**

నా కుమారుడు వీరుడు భరతుని రాజుగా చేయవలసినది. నీవు నాకు పూర్వకాలంలో రెండు వరములిచ్చినావు. ఆ దశరథుడు కైకేయిమాట విని మనస్సులో మిక్కిలి దుఃఖించి అట్లే అని అంగీకరించెను. ధర్మమెరిగిన రాముడు కూడా అట్లే సమ్మతించినాడు.

**ప్రణమ్యాథ పితుః పాదౌ లక్ష్మణేన సహాచ్యుతః ।**
**యయౌ వనం సపత్నీకః కృత్వా సమయమాత్మవాన్ ॥ 31 ॥**

తర్వాత ఆ రాముడు తండ్రిపాదాలకు నమస్కరించి తమ్ముడు లక్ష్మణునితో భార్య సీతతోకూడి నియమప్రతిజ్ఞను చేసి అడవికి వెళ్ళినాడు.

**సంవత్సరాణాం చత్వారి దశ చైవ మహాబలః ।**
**ఉవాస తత్ర భగవాన్ లక్ష్మణేన సహ ప్రభుః ॥ 32 ॥**

గొప్ప బలవంతుడైన రాముడు పదునాలుగేండ్లు లక్ష్మణునితోగూడ అరణ్యములో నివసించినాడు.

**కదాచిద్వసతోఽరణ్యే రావణో నామ రాక్షసః ।**
**పరివ్రాజకవేషేణ సీతాం హృత్వా యయౌ పురీమ్ ॥ 33 ॥**

ఆ వనవాససమయంలో రావణుడనే రాక్షసరాజు సన్న్యాసివేషంతో సీతను అపహరించి తన పట్టణానికి వెళ్ళినాడు.

**అదృష్ట్వా లక్ష్మణో రామః సీతా మాకులితేన్ద్రియౌ ।**
**దుఃఖశోకాభిసన్తప్తౌ బభూవతురరిన్దమౌ ॥ 34 ॥**

తర్వాత సీత కనుపించక రామలక్ష్మణులు కలతచెంది దుఃఖంతో శోకంతో బాధపడినారు.

**తతః కదాచిత్కపినా సుగ్రీవేణ ద్విజోత్తమాః! ।**
**వానరాణామభూత్సఖ్యం రామస్యాక్లిష్టకర్మణః ॥ 35 ॥**

బ్రాహ్మణులారా! తర్వాత ఒకసారి వానరరాజు సుగ్రీవునితో వానరులతో నిర్మలచరిత్రగల రామునికి స్నేహమేర్పడినది.

**సుగ్రీవస్యానుగో వీరో హనుమాన్నామ వానరః ।**
**వాయుపుత్రో మహాతేజా రామస్యాఽఽసీత్ప్రియః సదా ॥ 36 ॥**

సుగ్రీవుని అనుచరుడైన వానరుడు వాయుపుత్రుడు గొప్పతేజస్వి హనుమంతుడు రామునకిష్టుడైనాడు.

**స కృత్వా పరమం ధైర్యం రామాయ కృతనిశ్చయః ।**
**ఆనయిష్యామి తాం సీతామిత్యుక్త్వా విచచార హ ॥ 37 ॥**

ఆ హనుమ ధైర్యం చేసి నిశ్చయించుకొని సీతను గొనితెత్తునని పలికి ఆమెను వెదుక ప్రయాణమైనాడు.

**మహీం సాగరపర్యన్తాం సీతాదర్శనతత్పరః ।**
**జగామ రావణపురీం లంకాం సాగరసంస్థితామ్ ॥ 38 ॥**

సీతజాడ తెలియ ఆసక్తిగల హనుమంతుడు సముద్రపర్యంతం భూమి సంచరించి సముద్రం మధ్యలో నున్న రావణుని లంకను చేరుకొనెను.

**తత్రాథ నిర్జనే దేశే వృక్షమూలే శుచిస్మితామ్ ।**
**అపశ్యదమలాం సీతాం రాక్షసీభిః సమావృతామ్ ॥ 39 ॥**

తర్వాత లంకలో నిర్జనప్రదేశంలో ఒక చెట్టు మొదట రాక్షసస్త్రీలు చుట్టి ఉన్న స్వచ్ఛమైన నవ్వుకలిగి నిర్మలరూపంలో ఉన్న సీతను చూచినాడు.

**అశ్రుపూర్ణేక్షణాం హృద్యాం సంస్మరన్తీమనిన్దితామ్ ।**
**రామమిన్దీవరశ్యామం లక్ష్మణం చాఽఽత్మసంస్థితమ్ ॥ 40 ॥**

కనులనిండ కన్నీరుకలిగి మనోహరంగా ఉన్నది. ఇందీవరశ్యాముడైన రాముని లక్ష్మణునితోసహా తన హృదయంలో ఉంచుకొని స్మరిస్తున్న అనిందిత అయిన ఆ సీతను చూచినాడు.

**నివేదయిత్వా చాత్మానం సీతాయై రహసి ప్రభుః ।**
**అసంశయాయ ప్రదదావస్యై రామాఙ్గులీయకమ్ ॥ 41 ॥**

సమర్థుడైన హనుమ ఏకాంతంలో తనను పరిచయం చేసుకొని ఆమెకనుమానం రాకుండా రాముని అంగులీయకాన్ని సీతకిచ్చాడు.

**దృష్ట్వాంఽగులీయకం సీతా పత్యుః పరమశోభనమ్ ।**
**మేనే సమాగతం రామం ప్రీతివిస్ఫురితేక్షణా ॥ 42 ॥**

**సమాశ్వాస్య తదా సీతాం దృష్ట్వా రామస్య చాన్తికమ్ ।**
**నయిష్యే త్వాం మహాబాహుముక్త్వా రామం యయౌ పునః ॥ 43 ॥**

ఆ సీత తనభర్త మంగళకరమైన ఉంగరాన్ని చూచి సంతోషంతో కనులు వికసింప రాముడే తన దగ్గరకు వచ్చినట్లు తలచినది. అప్పుడా హనుమంతుడు సీతనోదార్చి దీర్ఘబాహువైన రాముని సన్నిధికి తీసుకొని పోయెదనని ఆమెతో చెప్పి మళ్ళీ రాముని వద్దకు బయలుదేరినాడు.

**నివేదయిత్వా రామాయ సీతాదర్శనమాత్మవాన్ ।**
**తస్థౌ రామేణ పురతో లక్ష్మణేన చ పూజితః ॥ 44 ॥**

రాముని చేరి ఆత్మవిశ్వాసం గల హనుమంతుడు సీతను తాను దర్శించిన విషయం ఆయనకు తెలిపి, లక్ష్మణునిచే గౌరవింపబడి రాముని ఎదుట నిల్చొనెను.

**తతః స రామో బలవాన్ సార్ధం హనుమతా స్వయమ్ ।**
**లక్ష్మణేన చ హి యుద్ధాయ బుద్ధిం చక్రే హి రక్షసా ॥ 45 ॥**

తర్వాత బలవంతుడైన రాముడు హనుమంతునితో లక్ష్మణునితో కూడ ఆలోచించి రాక్షసుడైన రావణునితో యుద్ధానికి స్వయంగా నిశ్చయించినాడు.

**కృత్వాఽథ వానరశతైర్లఙ్కామార్గం మహోదధేః ।**
**సేతుం పరమధర్మాత్మా రావణం హతవాన్ ప్రభుః ॥ 46 ॥**

పిమ్మట వందలకొలది వానరులతో సముద్రంపై లంకకు వెళ్ళటానికి వంతెనమార్గం నిర్మించి ధర్మాత్ముడైన రాముడు రావణుని సంహరించాడు.

**సపత్నీకం హి ససుతం సభ్రాతృకమరిన్దమః ।**
**ఆనయామాస తాం సీతాం వాయుపుత్రసహాయవాన్ ॥ 47 ॥**

భార్యాసహితుడైన రావణుని అతని కుమారుని సోదరునిగూడ హతమార్చి శత్రువిజయి అయిన రాముడు హనుమంతుని సహాయంతో తిరిగి సీతను తెచ్చినాడు.

**సేతుమధ్యే మహాదేవమీశానం కృత్తివాససమ్ ।**
**స్థాపయామాస లిఙ్గస్థం పూజయామాస రాఘవః ॥ 48 ॥**

ఆ వారధి మధ్యభాగంలో రాముడు కృత్తివాసుడైన ఈశ్వరుని ప్రతిష్ఠించాడు. లింగరూపంలో ఉన్న ఈశ్వరుని పూజించినాడు.

**తస్య దేవో మహాదేవః పార్వత్యా సహ శంకరః ।**
**ప్రత్యక్షమేవ భగవాన్దత్తవాన్వరముత్తమమ్ ॥ 49 ॥**

ఆ రామునికి పార్వతీ సహితుడైన మహాదేవుడు శంకరుడు సాక్షాత్కరించి శ్రేష్ఠమైన వరమొకటి ఇచ్చినాడు.

**యత్త్వయా స్థాపితం లిఙ్గం ద్రక్ష్యన్తీదం ద్విజాతయః ।**
**మహాపాతకసంయుక్తాస్తేషాం పాపం వినంక్ష్యతి ॥ 50 ॥**

నీవు ప్రతిష్ఠించిన ఈ లింగాన్ని ద్విజాతివారు చూచినట్లైతే మహాపాపులైనా వారిపాపాలు తొలగిపోతాయి.

**అన్యాని చైవ పాపాని స్నాతస్యాత్ర మహోదధౌ।**
**దర్శనాదేవ లిఙ్గస్య నాశం యాన్తి న సంశయః ॥ 51 ॥**

ఇక్కడి సముద్రంలో స్నానంచేసిన వాని ఇతరపాపాలుకూడా లింగదర్శనంతోనే నశించిపోతాయి. సందేహం లేదు.

**యావత్ స్థాస్యన్తి గిరయో యావదేషా చ మేదినీ ।**
**యావత్సేతుశ్చ తావచ్చ స్థాస్యామ్యత్ర తిరోహితః ॥ 52 ॥**

ఈ పర్వతాలు, భూమి,సేతువు ఎంతవరకుంటాయో అంతవరకు నేనిక్కడ తిరోహితుడనై ఉంటాను.

**స్నానం దానం తపః శ్రాద్ధం సర్వం భవతు చాక్షయమ్ ।**
**స్మరణాదేవ లిఙ్గస్య దినపాపం ప్రణశ్యతి ॥ 53 ॥**

ఈ సేతువు వద్ద స్నానం, దానం, తపస్సు, శ్రాద్ధం చేసినదంతా అక్షయంగా ఉంటుంది. ఇక్కడి లింగాన్ని తలచుకొన్నంతలోనే ఏనాటి పాపం ఆనాడే నశించిపోతుంది.

**ఇత్యుక్త్వా భగవాఞ్ఛమ్భుః పరిష్వజ్య తు రాఘవమ్ ।**
**సనన్దీ సగణో రుద్రస్తత్రైవాన్తరధీయత ॥ 54 ॥**

ఇట్లు పలికి భగవంతుడైన శివుడు శ్రీరాముని కౌగిలించుకొని ప్రమథగణములతోకూడ అక్కడనే అదృశ్యమైనాడు

**రామోఽపి పాలయామాస రాజ్యం ధర్మపరాయణః ।**
**అభిషిక్తో మహాతేజా భరతేన మహాబలః ॥ 55 ॥**

ఈ రాముడుకూడా ధర్మపరాయణుడై పట్టాభిషిక్తుడై భరతునితో కూడి మహాబలవంతుడై రాజ్యాన్ని పరిపాలించసాగాడు.

**విశేషాద్బ్రాహ్మణాన్సర్వాన్ పూజయామాస చేశ్వరమ్ ।**
**యజ్ఞేన యజ్ఞహన్తారమశ్వమేధేన శఙ్కరమ్ ॥ 56 ॥**

విశేషంగా బ్రాహ్మణులందరిని, ఈశ్వరుని పూజించినాడు. యజ్ఞముతో దక్షయజ్ఞమును ధ్వంసము చేసిన శంకరుని అశ్వమేధముతో పూజించాడు.

**రామస్య తనయో జజ్ఞే కుశ ఇత్యభివిశ్రుతః ।**
**లవశ్చ సుమహాభాగః సర్వతత్త్వార్థవిత్సుధీః ॥ 57 ॥**

రామునికి కుశుడను ప్రసిద్ధుడైన కుమారుడు జన్మించాడు. మహానుభావుడు తత్త్వాలన్నింటి సారాన్ని ఎరిగిన లవుడు కూడా పుత్రుడుగా జన్మించాడు.

**అతిథిస్తు కుశాజ్జజ్ఞే నిషధస్తత్సుతోఽభవత్ ।**
**నలశ్చ నిషధస్యాసీత్ నభస్తస్మాదజాయత ॥ 58 ॥**

కుశునివల్ల అతిథి అనే కుమారుడు కలుగగా అతనికి నిషధుడను పుత్రుడు జన్మించినాడు. నిషధునికి నలుడు, అతనికి నభసుడు పుత్రులుగా జన్మించారు.

**నభసః పుణ్డరీకాక్షో క్షేమధన్వా తు తత్సుతః ।**
**తస్య పుత్రోఽభవద్వీరో దేవానీకః ప్రతాపవాన్ ॥ 59 ॥**

నభస్సు అనువానికి పుండరీకాక్షుడు, అతనికి క్షేమధన్వుడనువాడు, ఆ క్షేమధన్వునికి ప్రతాపవంతుడగు దేవానీకుడను వీరుడు జన్మించాడు.

**అహీనగుస్తస్య సుతో మహస్వాంస్తత్సుతోఽభవత్ ।**
**తస్మాచ్చన్ద్రావలోకస్తు తారాధీశశ్చ తత్సుతః ॥ 60 ॥**

అతని పుత్రుడు అహీనగుడు అనువాడు. అతనికి మహస్వంతుడు కుమారుడు. అతనివల్ల చంద్రావలోకుడు కలిగెను. అతని పుత్రుడు తారాధీశుడు.

**తారాధీశాచ్చన్ద్రగిరిర్భానువిత్తస్తతోఽభవత్ ।**
**శ్రుతాయురభవత్తస్మాదేతే చేక్ష్వాకువంశజాః ॥ 61 ॥**

తారాధీశునివల్ల చంద్రగిరి అను కుమారుడు అతని వలన భానువిత్తుడను సుతుడు కలిగెను. అతనికి శ్రుతాయువు పుత్రుడు. వీరందరూ ఇక్ష్వాకువంశంలో జన్మించినవారు.

**సర్వే ప్రాధాన్యతః ప్రోక్తాః సమాసేన ద్విజోత్తమాః! ।**
**య ఇమం శ్రుణుయాన్నిత్యమిక్ష్వాకోర్వంశముత్తమమ్ ॥ 62 ॥**

**సర్వపాపవినిర్ముక్తో దేవలోకే మహీయతే ।**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! అందరూ వారి ప్రాధాన్యాన్నిబట్టి సంగ్రహంగానే చెప్పబడినారు. శ్రేష్ఠమైన ఇక్ష్వాకువంశాన్ని గూర్చి విన్నవాడు పాపాలన్నింటినుండి విముక్తుడై దేవలోకంలో ప్రకాశిస్తాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఇక్ష్వాకువంశవర్ణనం నామ ఏకవింశోఽధ్యాయః ॥ 21 ॥**

శ్రీకూర్మపురాణంలోని ఇక్ష్వాకువంశవర్ణనం అనే ఇరవై ఒకటవ అధ్యాయం ॥ 21 ॥



## ద్వావింశోఽధ్యాయః - ఇరవై రెండవ అధ్యాయం
## సోమవంశాను కీర్తనమ్ - సోమవంశానుకీర్తనం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**ఐలః పురూరవాశ్చాథ రాజా రాజ్యమపాలయత్ ।**
**తస్య పుత్రా బభూవుర్హి షడిన్ద్రసమతేజసః ॥ 1 ॥**

ఇల కుమారుడు పురూరవుడు రాజై రాజ్యాన్ని పాలించాడు. అతనికి ఆరుగురు కుమారులు. ఇంద్రసమాన తేజస్వంతులు.

**ఆయుర్మాయురమాయుశ్చ విశ్వాయుశ్చైవ వీర్యవాన్ ।**
**శతాయుశ్చ శ్రుతాయుశ్చ దివ్యాశ్చైవోర్వశీసుతాః ॥ 2 ॥**

ఆయువు, మాయువు, అమాయువు, వీర్యవంతుడైన విశ్వాయువు, శతాయువు, శ్రుతాయువు అను వీరు ఊర్వశి పుత్రులు దివ్యులు.

**ఆయుషస్తనయా వీరాః పఞ్చైవాఽఽసన్మహౌజసః ।**
**స్వర్భానుతనయాయాం వై ప్రభాయామితి నః శ్రుతమ్ ॥ 3 ॥**

వారిలో ఆయువునకు ఐదుగురు బలవంతులైన కుమారులు కలిగినారు. స్వర్భానువు కుమార్తె ప్రభకు ఆ పుత్రులు కలిగినారని మేము విన్నాము.

**నహుషః ప్రథమస్తేషాం ధర్మజ్ఞో లోకవిశ్రుతః ।**
**నహుషస్య తు దాయాదాః పఞ్చేన్ద్రోపమతేజసః ॥ 4 ॥**

వారిలో నహుషుడు మొదటివాడు. అతడు ధర్మజ్ఞుడు, లోకప్రసిద్ధుడు. నహుషునికి ఇంద్రసమాన తేజస్వంతులు ఐదుగురు కుమారులు.

**ఉత్పన్నాః పితృకన్యాయాం విరజాయాం మహాబలాః ।**
**యాతిర్యయాతిస్సంయాతిరాయాతిః పఞ్చమోఽశ్వకః ॥ 5 ॥**

వారు పితృదేవతలకన్య విరజయందు యాతి, యయాతి, సంయాతి, ఆయాతి, ఐదవవాడు అశ్వకుడు అనే వారు గొప్పబలవంతులు.

**తేషాం యయాతిః పఞ్చానాం మహాబలపరాక్రమః ।**
**దేవయానీముశనసః సుతాం భార్యామవాప సః ॥ 6 ॥**

ఐదుగురిలో యయాతి గొప్ప పరాక్రమవంతుడు. అతనికి శుక్రాచార్యుని పుత్రి దేవయాని భార్య.

**శర్మిష్ఠామాసురీం చైవ తనయాం వృషపర్వణః ।**
**యదుం చ తుర్వసుం చైవ దేవయానీ వ్యజాయత ॥ 7 ॥**

రాక్షసరాజు వృషపర్వుని కూతురు శర్మిష్ఠను కూడా వివాహమాడినాడు. వారిలో దేవయాని యదు తుర్వసులను కుమారులను పొందినది.

**ద్రుహ్యుఞ్చానుం చ పూరుం చ శర్మిష్ఠా చాప్యజీజనత్ ।**
**సోఽభ్యషిఞ్చదతిక్రమ్య జ్యేష్ఠం యదుమనిన్దితమ్ ॥ 8 ॥**

**పురుమేవ కనీయాంసం పితుర్వచనపాలకమ్ ।**

శర్మిష్ఠ కుమారులు ద్రుహ్యుడు, అనుడు, పూరువు అనేవారు. ఆ యయాతి జ్యేష్ఠుడు అయిన యదువును కాదని చిన్నవాడైన అనిందుతుడగు పురువును పితృవాక్యపాలకుడని పట్టాభిషిక్తుని కావించినాడు.

**దిశి దక్షిణపూర్వస్యాం తుర్వసుం పుత్రమాదిశత్ ॥ 9 ॥**

**దక్షిణే పరమో రాజా యదుం శ్రేష్ఠం న్యయోజయత్ ।**
**ప్రతీచ్యాముత్తరాయాఞ్చ ద్రుహ్యుఞ్చానుమకల్పయత్ ॥ 10 ॥**

ఆగ్నేయదిక్కుకధిపతిగా తుర్వసుడనే వానిని పాలకుని గావించినాడు. దక్షిణం పడమర దిక్కులకధిపతిగా శ్రేష్ఠుడు యదువును రాజుగా నియమించాడు. ఉత్తర పశ్చిమ విభాగాల్లో ద్రుహ్యుని అనుని రాజుని చేసినాడు.

**తైరియం పృథివీ సర్వా ధర్మతః పరిపాలితా ।**
**రాజాఽపి దారసహితో వనం ప్రాప మహాయశాః ॥ 11 ॥**

వారు భూమిని ధర్మయుక్తంగా పాలించినారు. కీర్తిమంతుడైన యయాతి భార్యతో కూడ వానప్రస్థుడై అడవికి వెళ్ళినాడు.

**యదోరప్యభవన్పుత్రాః పఞ్చ దేవసుతోపమాః ।**
**సహస్రజిత్తథా శ్రేష్ఠః క్రోష్టుర్నీలో జినో రఘుః ॥ 12 ॥**

యదువుకు సహస్రజిత్తు, శ్రేష్ఠుడగు క్రోష్టువు, నీలుడు, జినుడు, రఘువు అనేవారు ఐదుగురు పుత్రులు కలిగినారు.

**సహస్రజిత్సుతస్తద్వచ్ఛతజిన్నామ పార్థివః ।**
**సుతాః శతజితోఽప్యాసం స్త్రయః పరమధార్మికాః ॥ 13 ॥**

శతజిత్తు అను రాజు సహస్రజిత్తు కుమారుడు. అతనికి ధర్మస్వభావులైన ముగ్గురు కుమారులు కలిగినారు.

**హైహయశ్చ హయశ్చైవ రాజా వేణుహయశ్చయః ।**
**హైహయస్యాభవత్పుత్రో ధర్మ ఇత్యభిశ్రుతః ॥ 14 ॥**

హైహయుడు, హయుడు, వేణుహయుడు అనేవారు. వారిలో హైహయునికి ధర్ముడనే ప్రసిద్ధిచెందిన కుమారుడు కలిగినాడు.

**తస్య పుత్రోఽభవద్విప్రా ధర్మనేత్రః ప్రతాపవాన్ ।**
**ధర్మనేత్రస్య కీర్తిస్తు సఞ్చితస్తత్సుతోఽభవత్ ॥ 15 ॥**

ఓ విప్రులారా! ధర్మునికి ప్రతాపవంతుడైన ధర్మనేత్రుడనే కుమారుడు జన్మించాడు. అతనికి కీర్తి అనేవాడు పుత్రుడు. కీర్తికి సంచితుడనే వాడు కుమారుడు.

**మహిష్మః సఞ్చితస్యాభూద్భద్రశ్రేణ్యస్తదన్వయః ।**
**భద్రశ్రేణ్యస్య దాయాదో దుర్దమో నామ పార్థివః ॥ 16 ॥**

సంచితునికి మహిష్ముడనే పుత్రుడు కలిగినాడు. అతనికి భద్రశ్రేణ్యుడనే పుత్రుడు జన్మించినాడు. అతని కుమారుడు దుర్దముడు దాయాదుడై జన్మించినాడు.

**దుర్దమస్య సుతో ధీమానన్ధకో నామ వీర్యవాన్ ।**
**అన్ధకస్య తు దాయాదాశ్చత్వారో లోకసమ్మతాః ॥ 17 ॥**

దుర్దమునికి పరాక్రమవంతుడు బుద్ధిమంతుడైన అంధకుడనే పుత్రుడు కలిగినాడు. అతనికి లోకాభిమానాన్ని పొందిన నలువురు పుత్రులు పుట్టినారు.

**కృతవీర్యః కృతాగ్నిశ్చ కృతవర్మా చ తత్సుతః ।**
**కృతౌజాశ్చ చతుర్థోఽభూత్కార్తవీర్యస్తథాఽర్జునః ॥ 18 ॥**

కృతవీర్యుడు, కృతాగ్ని, కృతవర్మ, కృతౌజుడు ఆ నలుగురు. కృతౌజుడనే నాల్గవవాడు కృతవీర్యుని కుమారుడు అర్జునుడు ప్రఖ్యాతుడు.

**సహస్రభానుర్ద్యుతిమాన్ధనుర్వేదవిదాం వరః ।**
**తస్య రామోఽభవన్మృత్యుః జామదగ్న్యో జనార్దనః ॥ 19 ॥**

అతడు వేయిభుజాలుగల తేజోవంతుడు, విలువిద్య తెలిసిన వారిలో శ్రేష్ఠుడు. అతనికి విష్ణ్వవతారపురుషుడు జమదగ్ని కుమారుడు పరశురాముడు మరణకారకుడైనాడు.

**తస్య పుత్రశతాన్యాసన్పఞ్చ తత్ర మహారథాః ।**
**కృతాస్త్రా బలినః శూరా ధర్మాత్మానో మనస్వినః ॥ 20 ॥**

కార్తవీర్యునకు వందలసంఖ్యలో కుమారులుండిరి. వారిలో మహారథులు అస్త్రవిద్యావేత్తలు, బలవంతులు, శూరులు, ధర్మస్వభావులు, బుద్ధిమంతులైనవారు ఐదుగురున్నారు.

**శూరశ్చ శూరసేనశ్చ కృష్ణో ధృష్ణస్తథైవ చ ।**
**జయధ్వజశ్చ బలవాన్నారాయణపరో నృపః ॥ 21 ॥**

శూరుడు, శూరసేనుడు, కృష్ణుడు, ధృష్ణుడనే వారు ముఖ్యులు. ఐదవవాడు జయధ్వజుడు నారాయణుని యందు భక్తి గలవాడు.

**శూరసేనాదయః పూర్వే చత్వారః ప్రథితౌజసః ।**
**రుద్రభక్తా మహాత్మానః పూజయన్తి స్మ శఙ్కరమ్ ॥ 22 ॥**

మొదటి నలుగురు ప్రఖ్యాతబలవంతులు. శివునియందు భక్తిగలిగి శంకరుని పూజించెడివారు.

**జయధ్వజస్తు మతిమాన్దేవం నారాయణం హరిమ్ ।**
**జగామ శరణం విష్ణుం దైవతం ధర్మతత్పరః ॥ 23 ॥**

**తమూచురితరే పుత్రా నాయం ధర్మస్తవానఘ ।**
**ఈశ్వరారాధనరతః పితాఽస్మాకమితి శ్రుతిః ॥ 24 ॥**

జయధ్వజుడు బుద్ధిమంతుడు. ధర్మమందాసక్తిగలవాడు. నారాయణుని శరణుపొందినాడు. మిగిలిన నలుగురు జయధ్వజునితో పుణ్యాత్ముడా! నీకిది ధర్మము గాదు. మనతండ్రి శివునారాధించటంలో శ్రద్ధగలవాడని ప్రసిద్ధి పొందినవాడు.

**తానబ్రవీన్మహాతేజా హ్యేష ధర్మః పరో మమ ।**
**విష్ణోరంశేన సమ్భూతా రాజానో యే మహీతలే ॥ 25 ॥**

మహాతేజోవంతుడైన ధర్మధ్వజుడు వారితో ఇట్లన్నాడు-ఇది నా పరమధర్మం. భూమండలంలోని రాజులందరూ విష్ణ్వంశతో జన్మించినవారే.

**రాజ్యం పాలయితాఽవశ్యం భగవాన్పురుషోత్తమః ।**
**పూజనీయోఽజితో విష్ణుః పాలకో జగతాం హరిః ॥ 26 ॥**

రాజ్యాన్ని పాలించేవాడు పురుషోత్తముడైన విష్ణువే. లోకాలను పాలించేవాడు ఎవరికిని జయింప వీలుకానివాడు. ఆ విష్ణువు పూజనీయుడు.

**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చ స్వయం ప్రభుః ।**
**తిస్రస్తు మూర్తయః ప్రోక్తాః సృష్టిస్థిత్యన్తహేతవః ॥ 27 ॥**

అతడు స్వయంగా సాత్త్వికి, రాజసి, తామసి అనే ముమ్మూర్తులు గలవాడై సృష్టి స్థితి లయాలకు కారణమైన వాడు.

**సత్త్వాత్మా భగవాన్విష్ణుః సంస్థాపయతి సర్వదా ।**
**సృజేద్బ్రహ్మా రజోమూర్తిః సంహరేత్తామసో హరః ॥ 28 ॥**

భగవంతుడైన విష్ణువు సత్త్వస్వరూపుడై లోకాలను కాపాడును. రజోగుణమూర్తి బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టించును. తామసరూపి ఐన శంకరుడు లోకాలను లయము పొందించేవాడు.

**తస్మాన్మహీపతీనాన్తు రాజ్యం పాలయతామిదమ్ ।**
**ఆరాధ్యో భగవాన్విష్ణుః కేశవః కేశిమర్దనః ॥ 29 ॥**

కావున రాజ్యాన్ని పాలించే రాజుకు కేశిని చంపిన భగవంతుడు కేశవుడైన విష్ణువు పూజింపదగినవాడు.

**నిశమ్య తస్య వచనం భ్రాతరోఽన్యే మనస్వినః ।**
**ప్రోచుః సంహారకో రుద్రః పూజనీయో ముముక్షుభిః ॥ 30 ॥**

అతని మాటలు విన్న బుద్ధిమంతులైన సోదరులు మోక్షం కోరేవారికి సంహారకారకుడైన రుద్రుడు పూజింపదగినవాడు అన్నారు.

**అయం హి భగవాన్రుద్రః సర్వం జగదిదం శివః ।**
**తమోగుణం సమాశ్రిత్య కాలాన్తే సంహరేత్ప్రభుః ॥ 31 ॥**

భగవంతుడైన రుద్రుడు సర్వవిశ్వమయరూపి. ప్రలయకాలంలో తమోగుణాన్నాశ్రయించి లోకాలను సంహరిస్తాడు.

**యా సా ఘోరతమా మూర్తిరస్య తేజోమయీ పరా ।**
**సంహరేద్విద్యయా పూర్వం సంసారం శూలభృత్తయా ॥ 32 ॥**

ఈ రుద్రునికి భయంకరమైన తామసరూపం గొప్ప తేజోమయమైనది. ఇతడు శూలాన్ని ధరించి ఉండటంవలన జ్ఞానంతో సంసారబంధాన్ని నశింపజేస్తాడు.

**తతస్తానబ్రవీద్రాజా విచిన్త్యాసౌ జయధ్వజః ।**
**సత్త్వేన ముచ్యతే జన్తుః సత్త్వాత్మా భగవాన్హరిః ॥ 33 ॥**

అని పలుకగా జయధ్వజరాజు బాగా ఆలోచించి వారికిట్లు సమాధానం చెప్పినాడు. సత్త్వగుణంతో ప్రాణికి మోక్షం లభిస్తుంది. సత్త్వగుణస్వరూపుడు భగవాన్ విష్ణువే.

**తమూచుర్భ్రాతరో రుద్రః సేవితః సాత్త్వికైర్జనైః ।**
**మోచయేత్సత్త్వసంయుక్తః పూజయేత్సతతం హరమ్ ॥ 34 ॥**

అపుడు సోదరులు జయధ్వజునితో సత్త్వగుణంగల జనులు సేవించినచో శివుడు మోక్షాన్ని ప్రసాదిస్తాడు. అందువల్ల సాత్త్వికుడు ఎల్లపుడూ శివుని పూజించాలి అన్నారు.

**అథాబ్రవీత్ రాజపుత్రః ప్రహసన్వై జయధ్వజః ।**
**స్వధర్మో ముక్తయే యుక్తో నాన్యో మునిభిరిష్యతే ॥ 35 ॥**

అందుకు జయధ్వజుడు నవ్వి మోక్షంకోసం ఎవరిధర్మం వారికే తగినది. ఇతరుల ధర్మం స్వీకరించడం మునిసమ్మతం కాదు అన్నాడు.

**తథా చ వైష్ణవీం శక్తిం నృపాణాం దధతాం సదా ।**
**ఆరాధనం పరో ధర్మో మురారేరమితౌజసః ॥ 36 ॥**

వైష్ణవశక్తి కలిగి రాజ్యాన్ని పాలించేవారికి అంతులేని మహిమగల విష్ణ్వారాధనే గొప్పధర్మం.

**తమబ్రవీద్రాజపుత్రః కృష్ణో మతిమతాం వరః ।**
**యదర్జునోఽస్మజ్జనకః స్వధర్మం కృతవానితి ॥ 37 ॥**

అది విని బుద్ధిమంతులలోవరుడైన కృష్ణుడనే సోదరుడు అతనితో ఇట్లన్నాడు. మనతండ్రి అర్జునుడు శివారాధన ధర్మాన్నాచరించినందువలన మనం దానినే అనుసరించడం జరిగింది.

**ఏవం వివాదే వితతే శూరసేనోఽబ్రవీద్వచః ।**
**ప్రమాణమృషయో హ్యత్ర బ్రూయుస్తే తత్తథైవ తత్ ॥ 38 ॥**

ఈవిధంగా వారి వివాదం కొనసాగగా శూరసేనుడనే సోదరుడు ఈవిషయంలో మనకు ఋషులే ప్రమాణం. వారే ధర్మాన్ని ఆచరించారో వారి వద్దకు వెళ్ళి కర్తవ్యోపదేశాన్ని పొందడం మంచిదన్నాడు.

**తతస్తే రాజశార్దూలాః పప్రచ్ఛుర్బ్రహ్మవాదినః ।**
**గత్వా సర్వేషు సంరబ్ధాః సప్తర్షీణాం తదాశ్రమమ్ ॥ 39 ॥**

రాజశ్రేష్ఠులు బ్రహ్మవాదులైన రాకుమారులైదుగురు ఉత్సాహంతో సప్తర్షుల ఆశ్రమానికివెళ్ళి తమ సందేహాన్ని గూర్చి ప్రశ్నించారు.

**తానబ్రువంస్తే మునయో వసిష్ఠాద్యా యథార్థతః ।**
**యా యస్యాభిమతా పుంసః సా హి తస్యైవ దేవతా ॥ 40 ॥**

వశిష్ఠాదిఋషులు రాకుమారులకు యథార్థతత్త్వాన్నిట్లా తెలియజేశారు. ఎవరికి ఏ దేవతయందు ప్రీతి అధికమో వారాదేవతనే పూజించదగినవారు.

**కిన్తు కార్యవిశేషేణ పూజితా చేష్టదా నృణామ్ ।**
**విశేషాత్సర్వదా నాయం నియమో హ్యన్యథా నృపాః ॥ 41 ॥**

కాని ప్రత్యేకకార్య సందర్భాల్లో పూజలందుకొనే దేవతలు మనుషుల ఇష్టసిద్ధిని కలిగిస్తారు. ఇది విశేషవిధి. ఓ రాజపుత్రులారా! ఈనియమం అన్నికాలాలకు వర్తించేది కాదు.

**నృపాణాం దైవతం విష్ణుస్తథేశశ్చ పురన్దరః ।**
**విప్రాణామగ్నిరాదిత్యో బ్రహ్మా చైవ పినాకధృక్ ॥ 42 ॥**

రాజులకు విష్ణువు దైవతం. అట్లే శివుడు, ఇంద్రుడు కూడ. అగ్ని బ్రాహ్మణులకు దైవతం. సూర్యుడు బ్రహ్మ పినాకపాణి ఐన శివుడు కూడా దేవతలే.

**దేవానాం దైవతం విష్ణుర్దానవానాం త్రిశూలధృక్ ।**
**గన్ధర్వాణాం తథా సోమో యక్షాణామపి కథ్యతే ॥ 43 ॥**

దేవతలకు విష్ణువు, రాక్షసులకు శూలధరుడు. శివుడు, గంధర్వులకు యక్షులకు కూడా సోముడు దేవత అని చెప్పనైనది.

**విద్యాధరాణాం వాగ్దేవీ సిద్ధానాం భగవాన్హరిః ।**
**రక్షసాం శఙ్కరో రుద్రః కిన్నరాణాఞ్చ పార్వతీ ॥ 44 ॥**

విద్యాధరులకు సరస్వతి, సిద్ధులకు భగవంతుడు విష్ణువు, రాక్షసులకు శంకరుడైన రుద్రుడు, కిన్నరులకు పార్వతి.

**ఋషీణాం భగవాన్ బ్రహ్మా మహాదేవస్త్రిశూలభృత్ ।**
**మాన్యా స్త్రీణాముమాదేవీ తథా విష్ణీశభాస్కరాః ॥ 45 ॥**

దేవతలు ఋషులకు భగవంతుడైన బ్రహ్మ, శూలంధరించి మహాదేవుడు కూడ దేవతయే. స్త్రీల దేవత పార్వతీదేవి. విష్ణు రుద్ర సూర్యులు కూడా పూజనీయులు.

**గృహస్థానాం చ సర్వే స్యుర్బ్రహ్మా వై బ్రహ్మచారిణామ్ ।**
**వైఖానసానామర్కః స్యాద్యతీనాం చ మహేశ్వరః ॥ 46 ॥**

గృహస్థులకందరూ పూజ్యులే. బ్రహ్మచారులకు బ్రహ్మము దేవత. వైఖానసులకు సూర్యుడు, సంన్యాసులకు మహేశ్వరుడు పూజ్యులు.

**భూతానాం భగవాన్రుద్రః కూష్మాణ్డానాం వినాయకః ।**
**సర్వేషాం భగవాన్ బ్రహ్మా దేవదేవః ప్రజాపతిః ॥ 47 ॥**

సమస్తప్రాణులకు రుద్రుడు దేవత. కూష్మాండులకు వినాయకుడు అధిదేవత. దేవదేవుడు ప్రజాపతి భగవంతుడైన బ్రహ్మ అందరికి పూజనీయుడైన దేవత.

**ఇత్యేవం భగవాన్ బ్రహ్మా స్వయం దేవో హ్యభాషత ।**
**తస్మాజ్జయధ్వజో నూనం విష్ణ్వారాధనమర్హతి ॥ 48 ॥**

ఈవిధంగా భగవంతుడైన బ్రహ్మ స్వయంగా చెప్పినాడు. అందువల్ల జయధ్వజుడు నిశ్చయంగా నారాయణుని పూజకర్హుడే.

**కిన్తు రుద్రేణ తాదాత్మ్యం బుద్ధ్వా పూజ్యో హరిర్నరైః ।**
**అన్యథా నృపతేః శత్రుం న హరిః సంహరేద్యతః ॥ 49 ॥**

కాని శివునితో అభేదభావాన్ని గుర్తించి మానవులు విష్ణువును పూజించాలి. అట్లా కాకపోతే హరి రాజశత్రువును సంహరించదు.

**సంప్రణమ్యాథ తే జగ్ముః పురీం పరమశోభనామ్ ।**
**పాలయాంచక్రిరే పృథ్వీం జిత్వా సర్వాన్రిపూన్రణే ॥ 50 ॥**

తర్వాత రాజపుత్రులు అతనికి నమస్కరించి శోభనమైన తమ నగరానికి చేరుకొన్నారు. తమ శత్రువులనందరినీ జయించి భూమిని పాలించినారు.

**తతః కదాచిద్విప్రేన్ద్రా విదేహో నామ దానవః ।**
**భీషణః సర్వసత్త్వానాం పురీం తేషాం సమాయయౌ ॥ 51 ॥**

ఓ బ్రాహ్మణోత్తములారా! తర్వాత ఒకపుడు విదేహుడనే రాక్షసుడు సర్వప్రాణులకు భయాన్ని కొల్పేవాడు వారి పట్టణానికి వచ్చినాడు.

**దంష్ట్రాకరాలో దీప్తాత్మా యుగాన్తదహనోపమః ।**
**శూలమాదాయ సూర్యాభం నాదయన్వై దిశో దశ ॥ 52 ॥**

ఆ రాక్షసుడు భయంగొల్పే దంతాలుండి ప్రళయకాలాగ్ని సమానుడై  సూర్యతేజస్సుగల శూలాన్ని గొని దశదిశలు ప్రతిధ్వనింపజేస్తూ వచ్చినాడు.

**తన్నాదశ్రవణాన్మర్త్యాస్తత్ర యే నివసన్తి తే ।**
**తత్యజుః జీవితం త్వన్యే దుద్రువుర్భయవిహ్వలాః ॥ 53 ॥**

ఆ ధ్వని విన్నందువలన అక్కడ నివసించే మనుషులు భయంతో ప్రాణాలు వదిలినారు. మిగిలినవారు భయంతో పారిపోయినారు.

**తతస్సర్వే సుసంయత్తాః కార్తవీర్యాత్మజాస్తదా ।**
**శూరసేనాదయః పఞ్చ రాజానస్తు మహాబలాః ॥  54 ॥**

తర్వాత కార్తవీర్యకుమారులు శూరసేనుడు మొదలైనవారు గొప్పబలవంతులైన రాజులైదుగురు యుద్ధానికి సిద్ధమైనారు.

**యుయుధుర్దానవం శక్తిగిరికూటాసిముద్గరైః ।**
**తాన్సర్వాన్ స హి విప్రేన్ద్రాః శూలేన ప్రహసన్నివ ॥ 55 ॥**

వారు శక్తి పర్వతశిఖరాలు ఖడ్గం మొదలైన ఆయుధాలతో ఆ రాక్షసునెదుర్కొని యుద్ధం చేసినారు. ఓ ద్విజులారా! ఆ దానవుడు వారందరిని శూలంతో నవ్వుతూ ఎదుర్కొన్నాడు.

**యుద్ధాయ కృతసంరంభా విదేహం త్వభిదుద్రువుః ।**
**శూరోఽస్త్రం ప్రాహిణోద్రౌద్రం శూరసేనస్తు వారుణమ్ ॥  56 ॥**

రాకుమారులు యుద్ధానికి సిద్ధమై విదేహుని ఎదుర్కొన్నారు. శూరుడు రౌద్రాస్త్రాన్ని, శూరసేనుడు వారుణాస్త్రాన్ని అతనిపై ప్రయోగించారు.

**ప్రాజాపత్యం తథా కృష్ణో వాయవ్యం ధృష్ట ఏవ చ ।**
**జయధ్వజశ్చ కౌబేరమైన్ద్రమాగ్నేయమేవ చ ॥ 57 ॥**

అదేవిధంగా కృష్ణుడు ప్రాజాపత్యాస్త్రాన్ని, ధృష్టుడు వాయవ్యాస్త్రాన్ని, జయధ్వజుడు కౌబేర ఇంద్ర ఆగ్నేయాస్త్రాలను ప్రయోగించినారు.

**భఞ్జయామాస శూలేన తాన్యస్త్రాణి స దానవః ।**
**తతః కృష్ణో మహావీర్యో గదామాదాయ భీషణామ్ ॥ 58 ॥**

**స్పృష్టమాత్రేణ తరసా చిక్షేప చ ననాద చ ।**

ఆ రాక్షసుడా అస్త్రాలన్నింటిని తనశూలంతో విఫలం గావించినాడు. ఆ తర్వాత పరాక్రమవంతుడైన కృష్ణుడు భయంకరమైన గదను తీసుకొని దానిని స్పృశించినంతలోనే వేగంతో విసరివేసి పెద్దగా ధ్వని చేసినాడు.

**సంప్రాప్య సా గదాఽస్యోరో విదేహస్య శిలోపమమ్ ॥ 59 ॥**

**న దానవం చాలయితుం శశాకాన్తకసన్నిభమ్ ।**
**దుద్రువుస్తే భయగ్రస్తా దృష్ట్వా తస్యాతిపౌరుషమ్ ॥ 60 ॥**

ఆ గద రాతివలె కఠినమైన ఆ రాక్షసుని ఎదను తాకి యమునితో సదృశుడైన ఆ రాక్షసుని కదలించలేక పోయినది. అతని అమితమైన పరాక్రమాన్ని చూచి వారు భయంతో పారిపోయినారు.

**జయధ్వజస్తు మతిమాన్ సస్మార జగతః పతిమ్ ।**
**విష్ణుం జయిష్ణుం లోకాదిమప్రమేయమనామయమ్ ॥ 61 ॥**

బుద్ధిమంతుడైన ఆ జయధ్వజుడు మాత్రం లోకాలకు ప్రభువు జయశీలుడు లోకాలన్నింటికి ఆదిపురుషుడు, జ్ఞానంతో కొలువ శక్యం కానివాడు, దోషరహితుడైన విష్ణువును స్మరించినాడు.

**త్రాతారం పురుషం పూర్వం శ్రీపతిం పీతవాససమ్ ।**
**తతః ప్రాదురభూచ్చక్రం సూర్యాయుతసమప్రభమ్ ॥ 62 ॥**

రక్షకుడు, పురాణపురుషుడు, లక్ష్మీపతి, పీతాంబరధారి ఐన విష్ణువును స్మరించగానే పదివేల సూర్యుల సన్నిభమైన సుదర్శనచక్రం సాక్షాత్కరించినది.

**ఆదేశాద్వాసుదేవస్య భక్తానుగ్రహణాత్తదా ।**
**జగ్రాహ జగతాం యోనిం స్మృత్వా నారాయణం నృపః ॥ 63 ॥**

భక్తరక్షణయే స్వభావంగా కల విష్ణువు ఆజ్ఞతో ప్రత్యక్షమైన ఆ చక్రాన్ని రాకుమారుడు ప్రపంచకారణభూతుడైన నారాయణుని తలుచుకొని స్వీకరించినాడు.

**ప్రాహిణోద్వై విదేహాయ దానవేభ్యో యథా హరిః ।**
**సంప్రాప్య తస్య ఘోరస్య స్కన్ధదేశం సుదర్శనమ్ ॥ 64 ॥**

**పృథివ్యాం పాతయామాస శిరోఽద్రిశిఖరాకృతిమ్ ।**
**తస్మిన్ హతే దేవరిపౌ శూరాద్యా భ్రాతరో నృపాః ॥ 65 ॥**

**తద్ధి చక్రం పురా విష్ణుస్తపసాఽఽరాధ్య శంకరమ్ ।**
**యస్మాదవాప తత్తస్మాదసురాణాం వినాశకమ్ ॥ 66 ॥**

జయధ్వజుడా చక్రాన్ని గ్రహించి రాక్షసులపైకి విష్ణువు ప్రయోగించినట్లు విదేహునిపైకి వదలాడు. ఆ సుదర్శనచక్రం భయంకరుడైన ఆ రాక్షసుని భుజముపైకి చేరుకొని పర్వత శిఖరాకారం గల అతని శిరమును నేలపై పడవేసినది. దేవారియైన విదేహుడు చావగా శూరుడు మొదలైన రాకుమారులు ఆ చక్రమును పూర్వం విష్ణువు శంకరునారాధించి పొందినందువల్ల రాక్షససంహారానికి కారణమైన దానినిగా గుర్తించినారు.

**సమాయయుః పురీం రమ్యాం భ్రాతరం చాప్యపూజయన్ ।**
**శ్రుత్వా జగామ భగవాఞ్జయధ్వజ పరాక్రమమ్ ॥ 67 ॥**

**కార్తవీర్యసుతం ద్రష్టుం విశ్వామిత్రో మహామునిః ।**
**తమాగతమథో దృష్ట్వా రాజా సంభ్రాన్తలోచనః ॥ 68 ॥**

**సమావేశ్యాఽఽసనే రమ్యే పూజయామాస భావతః ।**

శూరుడాది రాకుమారులు అందమైన తమ నగరానికి వచ్చి సోదరుడు జయధ్వజుని గౌరవించినారు. జయధ్వజుని పరాక్రమాన్ని విని మహాత్ముడు విశ్వామిత్రమహర్షి అతనిని చూడటానికి వచ్చినాడు. తన వద్దకు వచ్చిన ఆ విశ్వామిత్రుని చూచి జయధ్వజుడు సంభ్రమసూచకాలైన నేత్రాలతో రమ్యమైన ఆసనమందు కూర్చోబెట్టి శ్రద్ధతో పూజించినాడు.

**ఉవాచ భగవన్ ఘోరః ప్రసాదాద్భవతోఽసురః ॥ 69 ॥**

**నిపాతితో మయా సోఽథ విదేహో దానవేశ్వరః ।**
**తద్వాక్యాచ్ఛిన్నసన్దేహో విష్ణుం సత్యపరాక్రమమ్ ॥ 70 ॥**

**ప్రపన్నః శరణం తేన ప్రసాదో మే కృతః శుభః ।**
**యక్ష్యామి పరమేశానం విష్ణుం పద్మదలేక్షణమ్ ॥ 71 ॥**

తర్వాత ఇట్లన్నాడు. మహాత్మా! మీ అనుగ్రహం వల్ల భయంకరుడైన ఆ రాక్షసుడు విదేహుణ్ణి చంపగలిగినాను. అతని మాటల వల్ల సంశయాలన్నీ తొలగినవాడై సత్యపరాక్రమవంతుడైన విష్ణువును శరణు పొందినాను. ఆవిష్ణువు నాకు శుభకరమైన అనుగ్రహాన్ని ప్రసాదించినాడు. పరమేశ్వరుడు పద్మనేత్రుడైన ఆ విష్ణువును యాగంతో ఆరాధిస్తాను.

**కథం కేన విధానేన సంపూజ్యో హరిరీశ్వరః ।**
**కోఽయం నారాయణో దేవః కింప్రభావశ్చ సువ్రత! ॥ 72 ॥**

భగవంతుడైన ఆ విష్ణువును ఏ విధంగా ఏ పద్ధతిలో పూజించవలెను. నిష్ఠాపరుడవైన ఓ మునీ! ఈ నారాయణుడెవరు? అతని ప్రభావమెటు వంటిది?

**సర్వమేతన్మమాచక్ష్వ పరం కౌతూహలం హి మే ।**
**జయధ్వజస్య వచనం శ్రుత్వా శాన్తో మునిస్తదా ॥ 73 ॥**

**దృష్ట్వా హరౌ పరాం భక్తిం విశ్వామిత్ర ఉవాచ హ ।**

ఈ విషయమంతా నాకు తెలుపవలసినది. మిక్కిలి కుతూహలంతో ఉన్నాను అనే జయధ్వజుని మాట విని శాంతచిత్తుడై ఆ విశ్వామిత్రముని నారాయణుని యందాతనికున్న భక్తిని గుర్తించి ఇట్లా పలికాడు.

**విశ్వామిత్ర ఉవాచ :–** విశ్వామిత్రుడు పలికాడు.

**యతః ప్రవృత్తిర్భూతానాం యస్మిన్సర్వం యతో జగత్ ॥ 74 ॥**

**స విష్ణుః సర్వభూతాత్మా తమాశ్రిత్య విముచ్యతే ।**
**యమక్షరాత్పరతరాత్పరం ప్రాహుర్గుహాశ్రయమ్ ॥ 75 ॥**

విష్ణువు వల్లనే సర్వప్రాణులు ప్రవర్తిస్తున్నాయి. అతని యందే సర్వం చేరి ఉన్నది. ప్రపంచం అతని నుండే పుట్టినది. అతడు సర్వభూతాలు ఆత్మగా కలవాడు. అతని నాశ్రయించి మోక్షాన్ని పొందవచ్చును. గుహాశ్రయుడైన విష్ణువును శ్రేష్ఠమైన అక్షరం కంటె ఉన్నతమైనవానిగా చెప్పుదురు.

**ఆనందం పరమం వ్యోమ స వై నారాయణః స్మృతః ।**
**నిత్యోదితో నిర్వికల్పో నిత్యానన్దో నిరఞ్జనః ॥ 76 ॥**

ఆనంద స్వరూపుడు పరమాకాశరూపుడు అతడే నారాయణుడని పేర్కొనబడినాడు. ఎప్పుడు ఉదయించేవాడు. వికారం లేనివాడు. సదా ఆనందాన్ననుభవించేవాడు. మాలిన్యం లేనివాడు.

**చతర్వ్యూహధరో విష్ణురవ్యూహః ప్రోచ్యతే స్వయమ్ ।**
**పరమాత్మా పరం ధామ పరం వ్యోమ పరం పదమ్ ॥ 77 ॥**

ఆ విష్ణువు స్వయంగా నాలుగు వ్యూహాలు కలవాడైనా అవ్యూహుడనే చెప్పబడినాడు. అతడు పరమాత్మ స్వరూపుడు. సర్వోన్నతస్థానము పరమాకాశము పరమపదమాతడే

**త్రిపాదమక్షరం బ్రహ్మ తమాహుర్బ్రహ్మవాదినః ।**
**స వాసుదేవో విశ్వాత్మా యోగాత్మా పురుషోత్తమః ॥ 78 ॥**

బ్రహ్మజ్ఞానులు అతనిని త్రిపాదుడు నాశరహితుడైన బ్రహ్మ అని చెప్పుచున్నారు. ఆ వాసుదేవుడు విశ్వాత్మ యోగస్వరూపుడైన పురుషోత్తముడు.

**యస్యాంశసమ్భవో బ్రహ్మా రుద్రోఽపి పరమేశ్వరః ।**
**స్వవర్ణాశ్రమధర్మేణ పుంసాం యః పురుషోత్తమః ॥ 79 ॥**

**అకామాద్వ్రతభావేన సమారాధ్యో న చాన్యథా ।**
**ఏతావదుక్త్వా భగవాన్విశ్వామిత్రో మహాతపాః ॥ 80 ॥**

**శూరాద్యైః పూజితో విప్రో జగామాథ స్వమాశ్రమమ్ ।**
**అథ శూరాదయో దేవమయజన్త మహేశ్వరమ్ ॥ 81 ॥**

బ్రహ్మ పరమేశ్వరుడైన శివుడు కూడ విష్ణ్వంశవల్ల జన్మించినవారే. పురుషోత్తముడైన ఆ విష్ణువు పురుషులకు తమ తమ వర్ణాశ్రమ ధర్మాలననుసరించి కోరికలు లేకుండా వ్రతనియమమనే భావంతో పూజింపతగినవాడు. మరో విధంగా పూజించుట తగదు. అని ఇంత మాత్రం వివరించి గొప్ప తపస్వి భగవాన్ విశ్వామిత్రముని శూరుడు మొదలైన రాజకుమారుల సత్కారాన్ని పొంది తన ఆశ్రమానికి వెళ్ళినాడు. తర్వాత శూరాది సోదరులు మహేశ్వరుడైన దేవుని యజ్ఞం ద్వారా పూజించినారు.

**యజ్ఞేన యజ్ఞగమ్యం తం నిష్కామా రుద్రమవ్యయమ్ ।**
**తాన్వసిష్ఠస్తు భగవాన్యాజయామాస ధర్మవిత్ ॥ 82 ॥**

యజ్ఞం ద్వారానే తెలియదగినవాడు నాశరహితుడైన రుద్రుని కోరికలు వదలి అర్చించినారు. ధర్మజ్ఞుడు వశిష్ఠుడు వారితో యజ్ఞాన్ని నిర్వర్తింపచేసినాడు.

**గౌతమోఽగస్తిరత్రిశ్చ సర్వే రుద్రపరాక్రమాః ।**
**విశ్వామిత్రస్తు భగవాఞ్జయధ్వజమరిన్దమమ్ ॥ 83 ॥**

**యాజయామాస భూతాదిమాదిదేవం జనార్దనమ్ ।**

గౌతముడు, అగస్త్యుడు, అత్రి అనేవారు రుద్రునివంటి మహిమ గల వారందరూ పాల్గొన్నారు. భగవంతుడైన విశ్వామిత్రుడు శత్రువిజయి ఐన జయధ్వజుని ద్వారా సమస్త భూతాది భూతుడు ప్రప్రథమ భగవంతుడైన నారాయణుని గూర్చి యజ్ఞం చేయించినాడు.

**తస్య యజ్ఞే మహాయోగీ సాక్షాద్దేవః స్వయం హరిః ॥ 84 ॥**

**ఆవిరాసీత్స భగవాన్తదద్భుతమివాభవత్ ।**
**జయధ్వజోఽపి తం విష్ణుం రుద్రస్య పరమాం తనుమ్ ॥ 85 ॥**

**ఇత్యేవం సర్వదా బుద్ధ్వా యత్నేనాయజదచ్యుతమ్ ।**

ఆ జయధ్వజుని యజ్ఞంలో యోగీశ్వరుడైన సాక్షాత్ భగవంతుడు విష్ణువు ప్రత్యక్షమైనాడు. ఆ సంఘటన మిక్కిలి ఆశ్చర్యకరమైనది.

**య ఇమం శృణుయాన్నిత్యం జయధ్వజపరాక్రమమ్ ॥ 86 ॥**

**సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకం స గచ్ఛతి ।**

జయధ్వజుడు కూడా శివుని శ్రేష్ఠ శరీరభూతుడైన ఆ విష్ణువును ఎల్లపుడూ పూర్వోక్తవిధంగా తెలుసుకొని ప్రయత్నంతో పూజించినాడు. ఈ జయధ్వజ పరాక్రమవృత్తాంతాన్ని ఎప్పుడు వింటూ పాపాలనుండి ముక్తినొందిన మానవుడు విష్ణులోకాన్ని పొందగలడు.

**ఇతి శ్రీకూర్మపురాణే సోమవంశానుకీర్తనం నామ ద్వావింశోఽధ్యాయః ॥ 22 ॥**

శ్రీకూర్మపురాణంలో సోమవంశానుకీర్తనం అనే ఇరవై రెండవ అధ్యాయం ॥ 22 ॥

## త్రయోవింశోఽధ్యాయః - ఇరవై మూడవ అధ్యాయం

## రాజవంశానుకీర్తనమ్ -రాజవంశానుకీర్తనం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**జయధ్వజస్య పుత్రోఽభూత్తాలజఙ్ఘ ఇతి స్మృతః ।**
**శతం పుత్రాస్తు తస్యాసంస్తాలజఙ్ఘా ఇతి స్మృతాః ॥ 1 ॥**

జయధ్వజునికి తాలజంఘుడనే కుమారుడు కలిగినాడు. అతనికి నూరుగురు పుత్రులు. వారందరూ తాలజంఘులుగానే పిలువబడ్డారు.

**తేషాం జ్యేష్ఠో మహావీర్యో వీతిహోత్రోఽభవన్నృపః ।**
**వృషప్రభృతయశ్చాన్యే యాదవాః పుణ్యకర్మిణః ॥ 2 ॥**

వారిలో పెద్దవాడు గొప్ప పరాక్రమవంతుడు వీతిహోత్రుడు రాజైనాడు. వృషుడు మొదలైన పుణ్యవర్తనులు, యాదవులు అతని సంతతిలోని వారే.

**వృషో వంశకరస్తేషాం తస్య పుత్రోఽభవన్మధుః ।**
**మధోః పుత్రశతం త్వాసీ ద్వృషణస్తస్య వంశభాక్ ॥ 3 ॥**

వారికి వృషుడు వంశకర్త. అతనికి మధువనేవాడు పుత్రుడు. ఆ మధువుకు వందమంది కుమారులు. వారిలో వృషణుడు వంశకర్త అయినాడు.

**వీతిహోత్రసుతశ్చాపి విశ్రుతోఽనన్త ఇత్యతః ।**
**దుర్జయస్తస్య పుత్రోఽభూత్సర్వశాస్త్రవిశారదః ॥ 4 ॥**

వీతిహోత్రుని కుమారుడు అనంతుడనేపేర ప్రసిద్ధుడు. అతనికి అన్నిశాస్త్రాల్లో పాండిత్యం కలిగిన దుర్జయుడనే పుత్రుడున్నాడు.

**తస్య భార్యా రూపవతీ గుణైః సర్వైరలంకృతా ।**
**పతివ్రతాఽఽసీత్పతినా స్వధర్మపరిపాలికా ॥ 5 ॥**

దుర్జయుని భార్య రూపవతి. అన్నిగుణాలు కలది. పతిని దైవంగా భావించే వ్రతం కలిగి భర్తతోగూడ తమ ధర్మాన్నాచరించేది.

**న కదాచిన్మహారాజః కాలిన్దీతీరసంస్థితామ్ ।**
**అపశ్యదుర్వశీం దేవీం గాయన్తీం మధురశ్రుతిమ్ ॥ 6 ॥**

ఆ దుర్జయుడొకప్పుడు యమునానదీతీరంలో ఉండి మధురమైన కంఠస్వరంతో పాడుతున్న ఊర్వశిని చూచినాడు.

**తతః కామాహతమనాస్తత్సమీపముపేత్య వై ।**
**ప్రోవాచ సుచిరం కాలం దేవి రన్తుం మయాఽర్హసి ॥ 7 ॥**

మనసులో మన్మథవికారం కలిగి ఆమె దగ్గరకు వెళ్ళి ఓదేవీ! నీవు చాలాకాలం నాతో కలిసి రమించటానికి తగినదానవు అన్నాడు.

**సా దేవీ నృపతిం దృష్ట్వా రూపలావణ్యసంయుతమ్ ।**
**రేమే తేన చిరం కాలం కామదేవమివాపరమ్ ॥ 8 ॥**

ఆ ఊర్వశీదేవి అందం లావణ్యంకల ఆ రాజును చూసి రెండవ మన్మథునివలె ఉన్న అతనితో కలిసి చాలాకాలం శృంగారక్రీడలతో రమించినది.

**కాలాత్ప్రబుద్ధో రాజా తాముర్వశీం ప్రాహ శోభనామ్ ।**
**గమిష్యామి పురీం రమ్యాం హసన్తీత్యబ్రవీద్వచః ॥ 9 ॥**

కొంతకాలం గడువగా రాజు వివేకాన్ని పొంది శుభకరురాలు ఊర్వశితో నా రమ్యమైన నగరానికి తిరిగి వెళ్ళెదనని చెప్పగా ఆమె నవ్వుతూ ఇట్లన్నది.

**న హ్యేతేనోపభోగేన భవతో రాజసున్దర ।**
**ప్రీతిః సఞ్జాయతే మహ్యం స్థాతవ్యం వత్సరం పునః ॥ 10 ॥**

ఓ సుందరాంగా! రాకుమారా! నీతో అనుభవించిన సుఖభోగాలు నాకు తృప్తినీయలేదు. అందువల్ల నీవు మరొక సంవత్సరం వరకు ఉండవలెను.

**తామబ్రవీత్స మతిమాన్ గత్వా శీఘ్రతరం పురీమ్ ।**
**ఆగమిష్యామి భూయోఽత్ర తన్మేఽనుజ్ఞాతుమర్హసి ॥ 11 ॥**

బుద్ధిమంతుడైన ఆ రాజు ఊర్వశితో నేను పట్టణానికి వెళ్ళి మళ్ళీ శీఘ్రంగానే నీవద్దకు రాగలను. అందువల్ల వెళ్ళటానికి అనుమతివ్వమని పలికాడు.

**తమబ్రవీత్సా సుభగా తథా కురు విశామ్పతే ।**
**నాన్యయాఽప్సరసా తావద్రన్తవ్యం భవతా పునః ॥ 12 ॥**

ఊర్వశి ఆ మాట విని ఓ రాజా! అట్లే చేయుము. కాని అంతవరకు నీవు మరొక అప్సరసతో కలిసి రమించరాదు అని పలికినది.

**ఓమిత్యుక్త్వా యయౌ తూర్ణం పురీం పరమశోభనామ్ ।**
**గత్వా పతివ్రతాం పత్నీం దృష్ట్వా భీతోఽభవన్నృపః ॥ 13 ॥**

రాజట్లే అని పలికి అందమైన తన నగరానికి వెళ్ళినాడు. అక్కడ పతివ్రత ఐన తన భార్యను చూచి భయపడినాడు.

**సంప్రేక్ష్య సా గుణవతీ భార్యా తస్య పతివ్రతా ।**
**భీతం ప్రసన్నయా ప్రాహ వాచా పీనపయోధరా ॥ 14 ॥**

అతనిభార్య పతివ్రత, గుణవతి, పీనపయోధర. తన భర్తను భయపడినవానిగా గమనించి ప్రసన్నమైన మాటతో ఇట్లన్నది.

**స్వామిన్! కిమత్ర భవతో భీతిరద్య ప్రవర్తతే ।**
**తద్బ్రూహి మే యథా తత్త్వం న రాజ్ఞాం కీర్తయే త్విదమ్ ॥ 15 ॥**

స్వామీ! మీరెందుకు ఇపుడు భయపడుతున్నారు. కారణం ఉన్నదున్నట్లుగా చెప్పండి. భయపడేస్థితి రాజులకు కీర్తిదాయకం కాదు.

**స తస్యా వాక్యమాకర్ణ్య లజ్జావనతమానసః ।**
**నోవాచ కించిన్నృపతిర్జ్ఞానదృష్ట్యా వివేద సా ॥ 16 ॥**

ఆ రాజు భార్యమాట విని సిగ్గుతో క్రుంగిన మనసు కలవాడై ఏమియు బదులు పలుకలేదు. ఆమె తన జ్ఞానదృష్టితో విషయాన్ని తెలుసుకొన్నది.

**న భేతవ్యం త్వయా రాజన్ కార్యం పాపవిశోధనమ్ ।**
**భీతే త్వయి మహారాజ! రాష్ట్రం తే నాశమేష్యతి ॥ 17 ॥**

మహారాజా! నీవు భయపడకు, పాపపరిహారం చేసుకొన్న చాలును. నీవే భయపడిన నీ రాజ్యమంతా వినాశం పొందుతుంది.

**తతః స రాజా ద్యుతిమాన్నిర్గత్య తు పురాత్తతః ।**
**గత్వా కణ్వాశ్రమం పుణ్యం దృష్ట్వా తత్ర మహామునిమ్ ॥ 18 ॥**

తర్వాత ఆ రాజు పట్టణంనుండి బయలుదేరి కణ్వాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ పుణ్యాత్ముడైన కణ్వమునిని చూచినాడు.

**నిశమ్య కణ్వవదనాత్ ప్రాయశ్చిత్తవిధిం శుభమ్ ।**
**జగామ హిమవత్పృష్ఠం సముద్దిష్టం మహాబలః ॥ 19 ॥**

కణ్వుని ముఖతః పాపప్రాయశ్చిత్తవిధానం తెలుసుకొని బలవంతుడైన ఆ రాజు ముని సూచించిన హిమాలయపర్వత పృష్ఠభాగాన్ని చేరుకొన్నాడు.

**సోఽపశ్యత్పథి రాజేన్ద్రో గన్ధర్వవరముత్తమమ్ ।**
**భ్రాజమానం శ్రియా వ్యోమ్ని భూషితం దివ్యమాలయా ॥ 20 ॥**

ఆ రాజు వెళ్ళేపుడు మార్గంలో ఒక గంధర్వ శ్రేష్ఠుని చూచినాడు. అతడాకాశంలో దివ్యమాలాలంకృతుడై గొప్పగా ప్రకాశించుచుండెను.

**వీక్ష్య మాలామమిత్రఘ్నః సస్మారాప్సరసం వరామ్ ।**
**ఉర్వశీం తాం మనశ్చక్రే తస్యా ఏవేయమర్హతి ॥ 21 ॥**

శత్రుసంహారకుడు ఆ రాజు మాలను చూచి శ్రేష్ఠురాలైన ఊర్వశిని తలచుకొన్నాడు. ఈ మాల ఆమెకే తగినదని భావించాడు.

**సోఽతీవ కాముకో రాజా గన్ధర్వేణాథ తేన హి ।**
**చకార సుమహద్యుద్ధం మాలామాదాతుముద్యతః ॥ 22 ॥**

కామాతురుడైన ఆ రాజు మాలను గ్రహింపదలచి ఆ గంధర్వునితో గొప్పయుద్ధం ఆచరించినాడు.

**విజిత్య సమరే మాలాం గృహీత్వా దుర్జయో ద్విజాః! ।**
**జగామ తామప్సరసం కాలిన్దీం ద్రష్టుమాదరాత్ ॥ 23 ॥**

ఓ ద్విజులారా! ఆ దుర్జయుడు యుద్ధంలో గెలిచి గంధర్వుని నుండి మాలను గ్రహించి ఆ అప్సరసను చూడటానికి యమునానదిని గూర్చి వెళ్ళినాడు.

**అదృష్ట్వాఽప్సరసం తత్ర కామబాణాభిపీడితః ।**
**బభ్రామ సకలాం పృథ్వీం సప్తద్వీపసమన్వితామ్ ॥ 24 ॥**

అక్కడ అప్సరస కనబడకపోవటంతో రాజు మన్మథబాణాభిపీడితుడై ఆమెను చూడటానికి సప్తద్వీపములలోనున్న పృథివినంతా సంచరించినాడు.

**ఆక్రమ్య హిమవత్పార్శ్వమూర్వశీ దర్శనోత్సుకః ।**
**జగామ శైలప్రవరం హేమకూటమితి శ్రుతమ్ ॥ 25 ॥**

హిమాలయపర్వతపార్శ్వాన్ని ప్రవేశించి ఊర్వశిని చూడాలనే కుతూహలంతో హేమకూటమని ప్రసిద్ధిచెందిన పర్వతశ్రేష్ఠాన్ని చేరుకొన్నాడు.

**తత్ర తత్రాప్సరో వర్యా దృష్ట్వా తం సింహవిక్రమమ్ ।**
**కామం సన్దధిరే ఘోరం భూషితం చిత్రమాలయా ॥ 26 ॥**

ఆ యా ప్రదేశాల్లోని అప్సరసలు సింహపరాక్రమవంతుడై చిత్రమాలనలంకరించుకొన్న రాజును చూసి అతనియందు కామాన్ని పొందినారు.

**సంస్మరన్నుర్వశీవాక్యం తస్యాం సంసక్తమానసః ।**
**న పశ్యతి స్మ తాః సర్వా గిరేః శృఙ్గాణి జగ్మివాన్ ॥ 27 ॥**

ఆరాజు ఊర్వశి మాటను తలుచుకొని ఆమెయందు మనసునిల్పి వారిని చూడలేదు. తర్వాత పర్వతశిఖరాలకు వెళ్ళినాడు.

**తత్రాప్యప్సరసం దివ్యామదృష్ట్వా కామపీడితః ।**
**దేవలోకం మహామేరుం యయౌ దేవపరాక్రమః ॥ 28 ॥**

అక్కడకూడా దివ్యాప్సరస ఊర్వశిని కానక కామపీడితుడై దేవపరాక్రమం గల రాజు దేవతలస్థావరమైన మహామేరుపర్వతశిఖరానికి వెళ్ళాడు.

**స తత్ర మానసం నామ సరస్త్రైలోక్యవిశ్రుతమ్ ।**
**భేజే శృఙ్గమతిక్రమ్య స్వబాహుబలభావితః ॥ 29 ॥**

**తస్య తీరేషు సుభగాం చరన్తీమతిలాలసామ్ ।**
**దృష్టవాననవద్యాఙ్గీం తస్యై మాలాం దదౌ పునః ॥ 30 ॥**

అతడక్కడ ముల్లోకాలలో ప్రసిద్ధమైన మానససరస్సు తనభుజబల విశ్వాసంతో చేరి మేరుశిఖరాన్ని దాటి మానససరస్తీరప్రదేశంలో తిరుగాడే నిర్దుష్ట శరీర ఐన ఊర్వశిని చూచి మరల నామెకు మాలనిచ్చాడు.

**స మాలయా తదా దేవీం భూషితాం ప్రేక్ష్య మోహితః ।**
**రేమే కృతార్థమాత్మానం జానానః సుచిరంతయా ॥ 31 ॥**

ఆ దుర్జయుడు మాలాలంకృత అయిన ఊర్వశిని చూసి మోహితుడై ధన్యునిగా భావించుకొని ఆమెతో చాలాకాలం రమించినాడు.

**అథోర్వశీ రాజవర్యం రతాన్తే వాక్యమబ్రవీత్ ।**
**కింకృతం భవతా వీర పురీం గత్వా తదా నృప ॥ 32 ॥**

తర్వాత ఊర్వశి రాజశ్రేష్ఠుని గూర్చి ఓ వీరా! అపుడు పట్టణానికి వెళ్ళి నీవేమి చేసితివి? అని ప్రశ్నించినది.

**స తస్యై సర్వమాచష్ట పత్న్యా యత్సముదీరితమ్ ।**
**కణ్వస్య దర్శనం చైవ మాలాపహరణం తథా ॥ 33 ॥**

రాజు ఊర్వశితో తన భార్య పలికినది, కణ్వుని దర్శనం, మాలను అపహరించటం కూడా తెలిపినాడు.

**శ్రుత్వైతద్వ్యాహృతం తేన గచ్ఛేత్యాహ హితైషిణీ ।**
**శాపం దాస్యతి తే కణ్వో మమాపి భవతః ప్రియా ॥ 34 ॥**

దుర్జయుని మాటలు విన్న ఊర్వశి రాజు హితాన్ని కోరి కణ్వుడు నిన్ను శపించగలడు. నీభార్య కూడా నన్ను శపిస్తుంది. అందువల్ల నీవు వెళ్ళుమని చెప్పింది.

**తయాఽసకృన్మహారాజః ప్రోక్తోఽపి మదమోహితః ।**
**న చ తత్కృతవాన్వాక్యం తత్ర సంన్యస్తమానసః ॥ 35 ॥**

కాని ఆ రాజు కామమదమోహితుడై ఆమె ఎన్నిమార్లు చెప్పినా ఆమెయందే మనసు లగ్నంచేసుకొని ఆమెమాట పాటించలేదు.

**తదోర్వశీ కామరూపా రాజ్ఞే స్వం రూపముత్కటమ్ ।**
**సురోమశం పిఙ్గలాక్షం దర్శయామాస సర్వదా ॥ 36 ॥**

అపుడు స్వేచ్ఛారూపశక్తిసంపన్న ఊర్వశి రోమాలెక్కువగా ఉండి పింగళవర్ణం గల కన్నులతో భయంకరమైన తనరూపాన్ని ఆ రాజుకు చూపించింది.

**తస్యాం విరక్తచేతస్కః స్మృత్వా కణ్వాభిభాషితమ్ ।**
**ధిక్మామితి వినిశ్చిత్య తపః కర్తుం సమారభత్ ॥ 37 ॥**

అది చూచి దుర్జయుడామెయందు విరక్తినొంది కణ్వుని మాట తలచుకొని తనను నిందించుకొని తపము చేయుటకారంభించినాడు.

**సంవత్సర ద్వాదశకం కన్దమూలఫలాశనః ।**
**భూయ ఏవ ద్వాదశకం వాయుభక్షోఽభవన్నృపః ॥ 38 ॥**

పన్నెండేండ్లు కందమూల ఫలములనాహారముగా కొని మరో పన్నెండేండ్లు వాయువును ఆహారంగాగొని ఆ రాజు తపమును ఆచరించినాడు.

**గత్వా కణ్వాశ్రమం భీత్యా తస్మై సర్వం న్యవేదయత్ ।**
**వాసమప్సరసా భూయ స్తపోయోగమనుత్తమమ్ ॥ 39 ॥**

తర్వాత కణ్వాశ్రమానికి వెళ్ళి భయంతో జరిగినదంతయు తెలిపినాడు. తాను అప్సరసతో కొంతకాలం కలిసియుండుట, తర్వాత తపమాచరించుట వివరించినాడు.

**వీక్ష్య తం రాజశార్దూలం ప్రసన్నో భగవానృషిః ।**
**కర్తుకామో హి నిర్బీజం తస్యాఘమిదమబ్రవీత్ ॥ 40 ॥**

రాజశ్రేష్ఠుడైన దుర్జయుని చూచి పూజ్యుడైన కణ్వర్షి అతని పాపనిర్మూలన గావించదలచి ఇట్లన్నాడు

**కణ్వ ఉవాచ :–** కణ్వుడు పలికాడు.

**గచ్ఛ వారాణసీం దివ్యామీశ్వరాధ్యుషితాం పురీమ్ ।**
**ఆస్తే మోచయితుం లోకం తత్ర దేవో మహేశ్వరః ॥ 41 ॥**

**స్నాత్వా సన్తర్ప్య విధివద్గఙ్గాయాం దేవతాః పితౄన్ ।**
**దృష్ట్వా విశ్వేశ్వరం లిఙ్గం కిల్బిషాన్మోక్ష్యసే క్షణాత్ ॥ 42 ॥**

ఈశ్వరుడు నివాసమున్న వారాణసి పట్టణమునకు వెళ్ళుము. అక్కడ లోకాన్ని సంసారబంధంనుండి విడిపించటానికి భగవంతుడు మహేశ్వరుడు నిలిచిఉన్నాడు. గంగానదిలో స్నానమాచరించి శాస్త్రవిధిప్రకారం దేవతలకు పితృదేవతలకు తర్పణాలిచ్చి లింగరూపంలోనున్న విశ్వేశ్వరుని దర్శించుకొనుము, క్షణకాలంలో పాపంనుండి విముక్తుడవుతావు.

**ప్రణమ్య శిరసా కణ్వమనుజ్ఞాప్య చ దుర్జయః ।**
**వారాణస్యాం హరం దృష్ట్వా పాపాన్ముక్తోऽభవత్తతః ॥ 43 ॥**

అని చెప్పగా దుర్జయుడు కణ్వమునికి శిరసా ప్రణామంచేసి సెలవుపొంది వారాణసికి వెళ్ళి శివదర్శనంతో పాపవిముక్తుడైనాడు.

**జగామ స్వపురీం శుభ్రాం పాలయమాస మేదినీమ్ ।**
**యాజయామాస తం కణ్వో యాచితో ఘృణయా మునిః ॥ 44 ॥**

తర్వాత నిర్మలమైన పట్టణానికి వెళ్ళి రాజ్యపాలన సాగించాడు. పిమ్మట కణ్వుని ప్రార్థించగా దయతో ఆ రాజుచే యజ్ఞాన్ని కణ్వుడు చేయించాడు.

**తస్య పుత్రోऽథ మతిమాన్సుప్రతీక ఇతి స్మృతః ।**
**బభూవ జాతమాత్రం తం రాజానముపతస్థిరే ॥ 45 ॥**

**ఉర్వశ్యాఇ్చ మహావీర్యాః సప్త దేవసుతోపమాః ।**
**కన్యా జగృహిరే సర్వా గన్ధర్వ్యో దయితా ద్విజాః । 46 ॥**

ఆ దుర్జయుని కుమారుడు సుప్రతీకుడు బుద్ధిమంతుడు జన్మించినాడు. అతడు పుట్టగానే ఊర్వశియందుద్భవించిన దేవసమానులు పరాక్రమవంతులైన ఏడుగురు కుమారులు రాజును చేరుకొన్నారు. వారందరు గంధర్వకన్యలనే తమ భార్యలుగా స్వీకరించారు.

**ఏష వః కథితః సమ్యక్ సహస్రజిత ఉత్తమః ॥**
**వంశః పాపహరో నృణాం క్రోష్టోరపి నిబోధత । 47 ॥**

ఇదంతా సహస్రజిత్తు శ్రేష్ఠవంశవర్ణనము. మనుషుల పాపాలను నశింపజేసే వృత్తాంతం మీకు వివరించాను. ఇక క్రోష్టువు వృత్తాంతం వివరిస్తాను.

**ఇతి శ్రీకూర్మపురాణే రాజవంశానుకీర్తనం నామ త్రయోవింశోऽధ్యాయః ॥ 23 ॥**

శ్రీకూర్మపురాణంలో రాజవంశానుకీర్తనమనే ఇరవై మూడవ అధ్యాయం ॥ 23 ॥



## చతుర్వింశోఽధ్యాయః - ఇరవై నాల్గవ అధ్యాయం

## యదువంశానుకీర్తనమ్ - యదువంశానుకీర్తనం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు

**క్రోష్టోరేకోఽభవత్పుత్రో వజ్రవానితి విశ్రుతః ।**
**తస్య పుత్రోఽభవచ్ఛాన్తిః కుశికస్తత్సుతోఽభవత్ ॥ 1 ॥**

క్రోష్టువుకు వజ్రవంతుడనే ప్రసిద్ధుడైన ఒక కుమారుడు కలిగాడు. అతనికి శాంతి అనువాడు పుత్రుడు. శాంతికి కుశికుడనే కుమారుడు కలిగాడు.

**కుశికాదభవత్పుత్రో నామ్నా చిత్రరథో బలీ ।**
**అథ చైత్రరథిర్లోకే శశిబిన్దురితి స్మృతః ॥ 2 ॥**

ఆ కుశికునికి చిత్రరథుడనే బలవంతుడైన కుమారుడు జన్మించాడు. ఆ చిత్రరథుని కుమారుడు శశిబిందువు.

**తస్య పుత్రః పృథుయశా రాజాఽభూద్ధర్మతత్పరః ।**
**పృథుకర్మా చ తత్పుత్రస్తస్మాత్పృథుజయోఽభవత్ ॥ 3 ॥**

అతనికి ధర్మాసక్తిగల పృథుయశుడనే రాజు జన్మించినాడు. అతనికి పృథుకర్మయనే పుత్రుడు. అతనివల్ల పృథుజయుడు.

**పృథుకీర్తిరభూత్తస్మాత్పృథుదాసస్తతోఽభవత్ ।**
**పృథుశ్రవాస్తస్య పుత్రస్తస్యాసీత్పృథుసత్తమః ॥ 4 ॥**

పృథుజయునికి పృథుకీర్తి, అతనికి పృథుదాసుడనే పుత్రుడు, అతనికి పృథుశ్రవుడు, అతనికి పృథుసత్తముడనేవాడు వరుసగా పుత్రులు జన్మించినారు.

**ఉశనాస్తస్య పుత్రోఽభూచ్ఛతేషుస్తత్సుతోఽభవత్ ।**
**తస్మాద్వై రుక్మకవచః పరావృత్తశ్చ తత్సుతః ॥ 5 ॥**

పృథుసత్తమునికి ఉశనసుడు, అతనికి శతేషువు, అతనికి రుక్మకవచుడు, అతనివల్ల పరావృత్తుడు పుత్రునిగా జన్మించినాడు.

**పరావృత్తసుతో జజ్ఞే యామఘో లోకవిశ్రుతః ।**
**తస్మాద్విదర్భస్సంజజ్ఞే విదర్భాత్క్రథకౌశికౌ ॥ 6 ॥**

పరావృత్తునికి యామఘుడనే ప్రఖ్యాతిగల కుమారుడు జన్మించినాడు. అతనికి విదర్భుడు కుమారుడు. విదర్భునికి క్రథ, కౌశికులనే కుమారులు కలిగినారు.

**లోమపాదస్తృతీయస్తు బభ్రుస్తస్యాత్మజో నృపః ।**
**ధృతిస్తస్యాభవత్పుత్రః శ్వేతస్తస్యాప్యభూత్సుతః ॥ 7 ॥**

**శ్వేతస్య పుత్రో బలవాన్నామ్నా విశ్వసహః స్మృతః ।**
**తస్య పుత్రో మహావీర్యః ప్రభావాత్కౌశికః స్మృతః ॥ 8 ॥**

లోమపాదుడనేవాడు మూడవ కుమారుడు, అతనికి బభ్రువనువాడు కుమారుడు, బభ్రువునకు ధృతి అతనికి శ్వేతుడు అనే కుమారుడు కలిగినారు. శ్వేతునకు బలవంతుడైన విశ్వసహుడనేపేర ప్రసిద్ధుడైన కుమారుడు కలిగినాడు. అతని పుత్రుడు కౌశికుడనువాడు గొప్ప పరాక్రమం కలిగినవాడు జన్మించినాడు.

**అభూత్తస్య సుతో ధీమాన్ సుమన్తశ్చ తతోఽనలః ।**
**అనలస్య సుతః శ్వేనిః శ్వేనేరన్యేఽభవన్సుతాః ॥ 9 ॥**

కౌశికునికి బుద్ధిమంతుడైన సుమంతుడు కుమారుడు. అతనివల్ల అనలుడు, అనలునికి శ్వేని, ఈ శ్వేనికి కొందరు పుత్రులు కలిగినారు.

**తేషాం ప్రధానో ద్యుతిమాన్వపుష్మాన్తత్సుతోఽభవత్ ।**
**వపుష్మతో బృహన్మేధాః శ్రీదేవస్తత్సుతోఽభవత్ ॥ 10 ॥**

వారిలో ద్యుతిమంతుడు ముఖ్యుడు. అతనికి వపుష్మంతుడు, వపుష్మంతునికి బృహన్మేధ, అతనికి శ్రీదేవుడు అను కుమారుడు జన్మించినాడు.

**తస్య వీతరథో విప్రా రుద్రభక్తో మహాబలః ।**
**క్రథస్యాప్యభవత్కున్తిర్వృష్ణిస్తస్యాభవత్సుతః ॥ 11 ॥**

ఓ బ్రాహ్మణులారా! శ్రీదేవునకు గొప్పబలం కలగిన వీతరథుడు అనే కుమారుడు జన్మించినాడు. అతడు శివభక్తుడు. క్రథుడనే వానికి కుంతి అనేవాడు, అతనికి వృష్ణి అనే కుమారుడు కలిగినాడు.

**తస్మాన్నవరథో నామ బభూవ సుమహాబలః ।**
**కదాచిన్మృగయాం యాతో దృష్ట్వా రాక్షసమూర్జితమ్ ॥ 12 ॥**

**దుద్రావ మహతావిష్టో భయేన మునిపుఙ్గవాః ।**
**అన్వధావత సంక్రుద్ధో రాక్షసస్తం మహాబలః ॥ 13 ॥**

ఆ వృష్ణికి బలవంతుడు నవరథుడు కుమారుడు. అతడొకసారి వేటకు బయలుదేరిపోగా అక్కడ మహాబలవంతుడు, క్రూరుడైన ఒక రాక్షసుని చూచినాడు. చూచి మిక్కిలిభయంతో పరుగెత్తినాడు. ఓ మునిశ్రేష్ఠులారా! అదిచూచి గొప్పబలవంతుడైన రాక్షసుడు కోపించి వెంటబడి తరిమినాడు.

**దుర్యోధనోఽగ్నిసఙ్కాశః శూలాసక్తమహాకరః ।**
**రాజా నవరథో భీతో నాతిదూరాదవస్థితమ్ ॥ 14 ॥**

**అపశ్యత్పరమం స్థానం సరస్వత్యాః సుగోపితమ్ ।**
**స తద్వేగేన మహతా సంప్రాప్య మతిమాన్నృపః ॥ 15**

**వవన్దే శిరసా దృష్ట్వా సాక్షాద్దేవీం సరస్వతీమ్ ।**
**తుష్టావ వాగ్భిరిష్టాభిర్బద్ధాఞ్జలిరమిత్రజిత్ ॥ 16 ॥**

ఆ రాక్షసుడు ఎదుర్కొనశక్యంకానివాడై అగ్నిసమానతేజస్సుతో తన దీర్ఘబాహువునందు శూలాన్ని ధరించి ఉన్నాడు. భయపడిన నవరథుడు అక్కడికి కొంతదూరంలోనే నున్న సరస్వతి రహస్యంగా కాపాడుతున్న శ్రేష్ఠమైన ప్రదేశాన్ని చూచిన వెంటనే తెలివి కలవాడైనందువల్ల వేగంగా నడిచి ఆ ప్రదేశాన్ని చేరుకొన్నాడు. అక్కడ వెలసి ఉన్న సాక్షాత్ సరస్వతీదేవిని చూచి శిరసా నమస్కరించాడు. శత్రుంజయుడైన ఆ రాజు దోసిలొగ్గి ప్రియమైన వాక్కులతో ఆ దేవిని స్తుతించాడు.

**పపాత దణ్డవద్భూమౌ త్వామహం శరణం గతః ।**
**నమస్యామి మహాదేవీం సాక్షాద్దేవీం సరస్వతీమ్ ॥ 17 ॥**

నేలపై సాగిలపడి నిన్ను శరణుపొందుతున్నానని పలికి సాక్షాత్సరస్వతీదేవివైన నీవు గొప్పదేవతవు. నీకు నమస్కరిస్తున్నాను.

**వాగ్దేవతామనాద్యన్తామీశ్వరీం బ్రహ్మచారిణీమ్ ।**
**నమస్యే జగతాం యోనిం యోగినీం పరమాం కలామ్ ॥ 18 ॥**

ఆద్యంతాలులేని ఈశ్వరివి. బ్రహ్మచారిణివగు వాగ్దేవతవు. లోకాలకాధారానివి, యోగినివి, పరమ కళారూపివైన నిన్ను నమస్కరిస్తున్నాను.

**హిరణ్యగర్భసంభూతాం త్రినేత్రాం చంద్రశేఖరామ్ ।**
**నమస్యే పరమానన్దాం చిత్కలాం బ్రహ్మరూపిణీమ్ ॥ 19 ॥**

హిరణ్యగర్భసంజాత, త్రినేత్ర, చంద్రావతంస, పరమానందస్వరూప, జ్ఞానకళారూపిణి, బ్రహ్మస్వరూప ఐన దేవికి నమస్కరిస్తున్నాను.

**పాహి మాం పరమేశాని భీతం శరణమాగతమ్ ।**
**ఏతస్మిన్నన్తరే క్రుద్ధో రాజానం రాక్షసేశ్వరః ॥ 20 ॥**

**హన్తుం సమాగతః స్థానం యత్ర దేవీ సరస్వతీ ॥**
**సముద్యమ్య తథా శూలం ప్రవిష్టో బలగర్వితః ॥ 21 ॥**

ఓ పరమేశ్వరీ! భయంతో నీ శరణుపొందిన నన్ను కాపాడమని ప్రార్థించాడు. అంతలోనే కోపంతో ఆ రాజును చంపటానికి సరస్వతీదేవి స్థానానికి శూలాన్ని పైకెత్తి బలగర్వంతో ఆ రాక్షసప్రముఖుడు వచ్చినాడు.

**త్రిలోకమాతుర్స్థానం శశాఙ్కాదిత్యసన్నిభమ్ ॥**
**తదన్తరే మహద్భూతం యుగాన్తాదిత్యసన్నిభమ్ । 22 ॥**

**శూలేనోరసి నిర్భిద్య పాతయామాస తం భువి ।**
**గచ్ఛేత్యాహ మహారాజ న స్థాతవ్యం త్వయా పునః ॥ 23 ॥**

సూర్యచంద్రకాంతులతో సమానమైన ప్రకాశంకలది, ముల్లోకాలకు తల్లి ఐన దేవిస్థానానికి రాక్షసుడు చేరగా ప్రళయకాలంలోని సూర్యునివంటి ఒక మహాభూతం శూలంతో ఆ రాక్షసుని ఎదలో పొడిచి వానిని నేలపై పడవైచెను. తర్వాత రాజుతో నీవిక్కడ ఉండతగదు అని వెళ్ళిపొమ్ము అని పలికినది.

**ఇదానీం నిర్భయస్తూర్ణం స్థానేఽస్మిన్రాక్షసో హతః ।**
**తతః ప్రణమ్య హృష్టాత్మా రాజా నవరథః పరమ్ ॥ 24 ॥**

**పురీం జగామ విప్రేన్ద్రాః! పురన్దరపురోపమామ్ ।**
**స్థాపయామాస దేవేశీం తత్ర భక్తిసమన్వితః ॥ 25 ॥**

ఈ ప్రదేశంలో రాక్షసుడు మరణించాడు. నిర్భయంగా ఇక నీవు తొందరగా వెళ్ళమని పలుకగా సంతోషించిన ఆ నవరథుడు నమస్కరించి ఇంద్రనగర సదృశమైన తన నగరానికి వెళ్ళాడు. ఓ విప్రులారా! ఆ పట్టణంలో భక్తితో ఈశ్వరీదేవి ప్రతిష్ఠ గావించినాడు.

**ఈజే చ వివిధైర్యజ్ఞైర్హోమైర్దేవీం సరస్వతీమ్ ।**
**తస్య చాసీద్దశరథః పుత్రః పరమధార్మికః ॥ 26 ॥**

అనేక యజ్ఞహోమాలతో సరస్వతిని ఆరాధించినాడు. ఆ నవరథునికి ధర్మస్వభావుడైన దశరథుడు కుమారుడుగా జన్మించాడు.

**దేవ్యా భక్తో మహాతేజాః శకునిస్తస్యచాత్మనః ।**
**తస్మాత్కరమ్భః సమ్భూతో దేవరాతోఽభవత్తతః ॥ 27 ॥**

అతనికి దేవి భక్తుడు గొప్పతేజస్వి ఐన శకుని పుత్రుడు. అతనివల్ల కరంభుడు, కరంభునివల్ల దేవరాతుడనువాడు కలిగినాడు.

**ఈజే స చాశ్వమేధేన దేవక్షత్రశ్చ తత్సుతః ।**
**మధుస్తస్య తు దాయాదస్తస్మాత్కురురజాయత ॥ 28 ॥**

ఆ రాజు అశ్వమేధయాగం చేసినవాడు. అతని పుత్రుడు దేవక్షత్రుడనువాడు. అతనికి మధువు పుత్రుడు. మధువునకు కురువు జన్మించాడు.

**పుత్రద్వయమభూత్తస్య సుత్రామా చానురేవ చ ।**
**అనోస్తు ప్రియగోత్రోఽభూదంశుస్తస్య చ రిక్తభాక్ ॥ 29 ॥**

**అథాంశోరన్ధకో నామ విష్ణుభక్తః ప్రతాపవాన్ ।**
**మహాత్మా దాననిరతో ధనుర్వేదవిదాంవరః ॥ 30 ॥**

కురువునకు సుత్రాముడు, అనువు అనే ఇద్దరు పుత్రులు. వారిలో అనువునకు ప్రియగోత్రుడు కుమారుడు. అతనికి అంశువు అనువాడు జన్మించాడు. అంశువునకు ప్రతాపంగల విష్ణుభక్తుడైన అంధకుడు, అంశారాజ్యభాగాన్ని పొందగల పుత్రుడు కలిగాడు. అతడు దానశీలి, గొప్పవిలుకాడు, మహాత్ముడు.

**స నారదస్య వచనాద్వాసుదేవార్చనే రతః ।**
**శాస్త్రం ప్రవర్తయామాస కుణ్డగోలాధికశ్రుతమ్ ॥ 31 ॥**

అతడు నారదుని ఉపదేశంవల్ల వాసుదేవుని పూజించటంలో ఆసక్తుడైనాడు. కుందుడు గోలుడు మొదలైన వారివల్ల ప్రసిద్ధమైన శాస్త్రాన్ని అతడు ప్రవర్తింపజేసినాడు.

**తస్య నామ్నా తు విఖ్యాతం సాత్వతానాం చ శోభనమ్ ।**
**ప్రవర్తతే మహచ్ఛాస్త్రం కుణ్డాదీనాం హితావహమ్ ॥ 32 ॥**

ఆ శాస్త్రం అతని పేరుతో ప్రసిద్ధమై సాత్వతులకు శుభకరమైనది. కుందులు మొదలైనవారికి శుభాన్ని కూర్చునదై వాడుకలో ఉన్నది.

**సాత్వతస్తస్య పుత్రోఽభూత్సర్వశాస్త్రవిశారదః ।**
**పుణ్యశ్లోకో మహారాజస్తేన చైతత్ప్రవర్తితమ్ ॥ 33 ॥**

అతనికి సాత్వతుడను కుమారుడు కలిగినాడు. అతడన్ని శాస్త్రాల్లో నైపుణ్యం గలవాడు. పుణ్యాత్ముడైన మహారాజు, అతడే ఆ శాస్త్రాన్ని ప్రవర్తింపజేసినాడు.

**సాత్వతాన్సత్త్వసమ్పన్నాన్కౌసల్యా సుషువే సుతాన్ ।**
**అన్ధకం వై మహాభోజం వృష్ణిం దేవావృధం నృపమ్ ॥ 34 ॥**

**జ్యేష్ఠం చ భజమానాఖ్యం ధనుర్వేదవిదాం వరమ్ ।**
**తేషాం దేవావృధో రాజా చచార పరమం తపః ॥ 35 ॥**

సత్త్వగుణసంపన్నులైన సాత్వతులనే కుమారులను కౌసల్య పొందినది. అంధకుడు, మహాభోజుడు, వృష్ణి, దేవావృధుడనే రాజులు వారు విలువిద్యనేర్చినవారిలో శ్రేష్ఠుడు భజమానుడనే వానిని కూడ పొందినది. వారిలో దేవావృధుడనే రాజు గొప్పతపమాచరించాడు.

**పుత్రః సర్వగుణోపేతో మమ భూయాదితి ప్రభుః ।**
**తస్య బభ్రురితి ఖ్యాతః పుణ్యశ్లోకోఽభవన్నృపః ॥ 36 ॥**

సర్వగుణసమన్వితుడైన పుత్రుడు కావాలన్న ఆ రాజుకు బభ్రువు అనే ప్రసిద్ధుడు, పుణ్యశ్లోకుడైన పుత్రుడు పుట్టినాడు.

**ధార్మికో రూపసమ్పన్నస్తత్త్వజ్ఞానరతస్తథా ।**
**భజమానాః శ్రియం దివ్యాం భజమానాద్విజజ్ఞిరే ॥ 37 ॥**

ఆ బభ్రువు ధర్మాత్ముడు, అందమైనవాడు, తత్త్వజ్ఞానాసక్తుడు. భజమానునివల్ల దివ్యసంపదనొందిన కుమారులు జన్మించారు.

**తేషాం ప్రధానౌ విఖ్యాతౌ నిమిః కృకణ ఏవ చ ।**
**మహాభోజకులే జాతా భోజా వై మాతృకాస్తథా ॥ 38 ॥**

వారిలో నిమి, కృకణుడు ముఖ్యులు, ప్రసిద్ధులు. మహాభోజుని వంశంలో వైమాతృకులైన భోజులు జన్మించినారు.

**వృష్ణేః సుమిత్రో బలవాననమిత్రస్తిమిస్తథా ।**
**అనమిత్రాదభూన్నిఘ్నో నిఘ్నస్య ద్వౌ బభూవతుః ॥ 39 ॥**

వృష్ణివల్ల బలవంతుడైన సుమిత్రుడు, అనమిత్రుడు, తిమి అనేవారు జన్మించారు. అనమిత్రునివలన నిఘ్నుడు, నిఘ్నునికి ఇద్దరు కుమారులు.

**ప్రసేనస్తు మహాభాగః సత్రాజిన్నామ చోత్తమః ।**
**అనమిత్రాత్సినిర్జజ్ఞే కనిష్ఠో వృష్ణినన్దనాత్ ॥ 40 ॥**

మహాభాగుడైన ప్రసేనుడు, ఉత్తముడైన సత్రాజిత్తు అనువారు ఆ ఇద్దరు కుమారులు. వృష్ణికుమారుడైన అనమిత్రునివలన సిని అనువాడు కనిష్ఠునిగా జన్మించినాడు.

**సత్యవాక్సత్యసమ్పన్నః సత్యకస్తత్సుతోఽభవత్ ।**
**సాత్యకిర్యుయుధానస్తు తస్యాసఙ్గోఽభవత్సుతః ॥ 41 ॥**

ఆ సినికి సత్యవాక్కు, సత్యవంతుడైన సత్యకుడు జన్మించాడు. సాత్యకి, యుయుధానుడు అనే వారు కూడా కలిగినారు.

**కుణిస్తస్య సుతో ధీమాంస్తస్య పుత్రో యుగన్ధరః ।**
**మాద్ర్యాం వృష్ణిః సుతో జజ్ఞే వృష్ణేర్వై యదునందనః ॥ 42 ॥**

యుయుధానునికి అసంగుడనే పుత్రుడు పుట్టినాడు. అతనికి బుద్ధిమంతుడు కుణి అనే పుత్రుడు. కుణికి యుగంధరుడనే కుమారుడు కలిగినాడు. అతనికి మాద్రి అనే భార్యయందు వృష్ణి జన్మించినాడు. వృష్ణికి యదు నందనుడు కలిగినాడు.

**జజ్ఞాతే తనయౌ వృష్ణేః శ్వఫల్కశ్చిత్రకస్తు హి ।**
**శ్వఫల్కః కాశిరాజస్య సుతాం భార్యామవిన్దత ॥ 43 ॥**

వృష్ణికి శ్వఫల్కుడు, చిత్రకుడు అనే ఇద్దరు కుమారులు. వారిలో శ్వఫల్కుడు కాశిరాజు పుత్రికను వివాహమాడినాడు.

**తస్యామజనయత్పుత్రమక్రూరం నామ ధార్మికమ్ ।**
**ఉపమంగుం తథా మంగుమన్యే చ బహవః సుతాః ॥ 44 ॥**

ఆమెయందు శ్వఫల్కుడు ధర్మస్వభావంగల అక్రూరుడనే కుమారుని పొందినాడు. ఉపమంగుడు, మంగుడు మొదలైన కుమారులు పెక్కురు కలిగినారు.

**అక్రూరస్య స్మృతః పుత్రో దేవవానితి విశ్రుతః ।**
**ఉపదేవశ్చ దేవాత్మా తయోర్విశ్వప్రమాథినౌ ॥ 45 ॥**

అక్రూరుని కుమారుడు ప్రసిద్ధుడైన దేవవంతుడు. ఉపదేవుడనే దేవస్వభావంగల మరో పుత్రుడుకూడా కలిగినాడు. వారిద్దరికి విశ్వుడు, ప్రమాథి అనే కుమారులు జన్మించినారు.

**చిత్రకస్యాభవత్పుత్రః పృథుర్విపృథురేవ చ ।**
**అశ్వగ్రీవః సుబాహుశ్చ సుధాశ్వకగవేక్షకౌ ॥ 46 ॥**

**అన్ధకస్య సుతాయాన్తు లేభే చ చతురః సుతాన్ ।**
**కుకురం భజమానఞ్చ శమీకం బలగర్వితమ్ ॥ 47 ॥**

**కుకురస్య సుతో వృష్ణిర్వృష్ణేస్తు తనయోऽభవత్ ।**
**కపోతరోమా విఖ్యాతస్తస్య పుత్రో విలోమకః ॥ 48 ॥**

చిత్రకునికి పృథువు, విపృథువు, అశ్వగ్రీవుడు, సుబాహుడు, సుధాశ్వక గవేక్షకులు అనువారు పుత్రులుగా జన్మించినారు. అంధకుని పుత్రికయందు కుకురుడు, శమీకుడు, భజమానుడు, బలగర్వితుడు అనే నలుగురు కుమారులను పొందినాడు. కుకురుని పుత్రుడు వృష్ణి అతనికి కపోతరోముడనే ప్రసిద్ధుడైన కుమారుడు కలిగినాడు. అతని కుమారుడు విలోమకుడు.

**తస్యాసీత్తుమ్బురుసఖా విద్వాన్పుత్రస్తమః కిల ।**
**తమస్యాప్యభవత్పుత్రస్తథైవానకదున్దుభిః ॥49॥**

విలోమకునికి తుంబురుని మిత్రుడు పండితుడు ఐన తముడు అనేవాడు పుత్రుడు. ఈ తమునికి ఆనక దుందుభి అనుపేరుగల పుత్రుడు జన్మించినాడు.

**స గోవర్ధనమాసాద్య తతాప విపులం తపః ।**
**వరం తస్మై దదౌ దేవో బ్రహ్మా లోకమహేశ్వరః ॥ 50 ॥**

ఆనక దుందుభి గోవర్ధనపర్వతాన్ని చేరి దీర్ఘతపమాచరించినాడు. అతనికి లోకప్రభువైన బ్రహ్మ వరమునిచ్చినాడు.

**వంశస్తే చాక్షయా కీర్తి ర్జ్ఞానయోగస్తథోత్తమః ।**
**గురోరప్యధికం విప్రాః కామరూపిత్వమేవ చ ॥ 51 ॥**

తనవంశానికి అక్షయమైన కీర్తి, గురువునుమించిన జ్ఞానయోగం, కామరూపం కూడా వరంగా పొందినాడు.

**స లబ్ధ్వా వరమవ్యగ్రో వరేణ్యో వృషవాహనమ్ ।**
**పూజయామాస గానేన స్థాణుం త్రిదశపూజితమ్ ॥ 52 ॥**

**తస్య గానరసస్యాథ భగవానమ్బికాపతిః ।**
**కన్యారత్నం దదౌ దేవో దుర్లభం త్రిదశైరపి ॥ 53 ॥**

శ్రేష్ఠుడైన అతడు వృషభవాహనుడు, దేవతల పూజలందే శివుని తనగానంతో ఆరాధించినాడు. గానంలో లీనమైన ఆనకదుందుభికి భగవానుడు పార్వతీపతి దేవతలకు కూడా పొందశక్యంకాని కన్యారత్నాన్ని ప్రసాదించినాడు.

**తయా స సఙ్గతో రాజా గానయోగమనుత్తమమ్ ।**
**అశిక్షయదమిత్రఘ్నః ప్రియాం తాం భ్రాన్తలోచనామ్ ॥ 54 ॥**

ఆ కన్యతో సంగతుడైన ఆనకదుందుభి బెదురుచూపులుకల కన్యకు శత్రుఘ్నుడైన ఆ రాజు శ్రేష్ఠతమమైన గానవిద్యాతత్త్వాన్ని ఉపదేశించినాడు.

**తస్యాముత్పాదయామాస సుభుజం నామ శోభనమ్ ।**
**రూపలావణ్యసంపన్నాం హ్రీమతీమితి కన్యకామ్ ॥ 55 ॥**

అతడామె యందు సుభుజుడనే మంచికుమారుని, సౌందర్య విలాసాదులుగల హ్రీమతి అనే కన్యను పొందినాడు.

**తతస్తం జననీపుత్రం బాల్యే వయసి శోభనమ్ ।**
**శిక్షయామాస విధివద్గానవిద్యాఞ్చ కన్యకామ్ ॥ 56 ॥**

తర్వాత వారి తల్లి కుమారునికి కూతురికి కూడా బాల్యంలోనే సంగీతవిద్యను శాస్త్రపద్ధతిలో బోధించినది.

**కృతోపనయనో వేదానధీత్య విధివద్గురోః ।**
**ఉద్వవాహాఽఽత్మజాం కన్యాం గన్ధర్వాణాం తు మానసీమ్ ॥ 57 ॥**

ఆ కుమారునికి తండ్రి ఉపనయనంచేసి వేదాలనభ్యసింపజేశాడు. అతడు గంధర్వుల మానసపుత్రి అయిన కన్యను వివాహమాడినాడు.

**తస్యాముత్పాదయామాస పఞ్చ పుత్రాననుత్తమాన్ ।**
**వీణావాదనతత్త్వజ్ఞాన్ గానశాస్త్రవిశారదాన్ ॥ 58 ॥**

ఆ సుభుజుడు ఆ భార్యయందు ఐదుగురు సత్పుత్రులను పొందినాడు. వారు వీణావాదనలో మర్మాన్ని తెలిసినవారు. సంగీతశాస్త్రంలో నైపుణ్యం గలవారు.

**పుత్రైః పౌత్రైః సపత్నీకో రాజా గానవిశారదః ।**
**పూజయామాస గానేన దేవం త్రిపురనాశనమ్ ॥ 59 ॥**

గాననిపుణుడైన ఆ రాజు తనభార్య కుమారులు మనుమలతోగూడ కలిసి గానవిద్యతో త్రిపురారి శివుని పూజించినాడు.

**హ్రీమతీం చారుసర్వాఙ్గీం శ్రీమివాయతలోచనామ్ ।**
**సుబాహూ నామ గన్ధర్వస్తామాదాయ యయౌ పురీమ్ ॥ 60 ॥**

అందమైన అవయవాలతో లక్ష్మీదేవివలె విశాలనేత్రాలుగల హ్రీమతి అనే కన్యను సుబాహుడు అనే పేరుగల గంధర్వుడు తన పట్టణానికి తీసుకువెళ్ళాడు.

**తస్యామపృభవన్పుత్రా గన్ధర్వస్య సుతేజసః ।**
**సుషేణధీరసుగ్రీవసుభోజనరవాహనాః ॥ 61 ॥**

తేజస్వంతుడైన ఆ గంధర్వునికి ఆమెయందు సుషేణుడు, ధీరుడు, సుగ్రీవుడు, సుభోజుడు, నరవాహనుడు అనేపేర్లుగల ఐదుగురు పుత్రులను పొందినాడు.

**అథాఽఽసీదభిజిత్పుత్రశ్చన్దనోదకదున్దుభేః ।**
**పునర్వసుశ్చాభిజితః సమ్బభూవాఽఽహుకస్తతః ॥ 62 ॥**

తర్వాత చందనోదక దుందుభికి అభిజిత్తు అనేకుమారుడు జన్మించాడు. అభిజిత్తుకు పునర్వసు అతనికి ఆహుకుడు అనువారు పుత్రులు.

**ఆహుకస్యోగ్రసేనశ్చ దేవకశ్చ ద్విజోత్తమాః ।**
**దేవకస్య సుతా వీరా జజ్ఞిరే త్రిదశోపమాః ॥ 63 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఆహుకునికి ఉగ్రసేనుడు,దేవకుడు అను ఇద్దరు కుమారులు. దేవకునికి దేవసమానులైన సుతులు జన్మించారు.

**దేవవానుపదేవశ్చ సుదేవో దేవరక్షితః ।**
**తేషాం స్వసారః సప్తాసన్వసుదేవాయ తా దదౌ ॥ 64 ॥**

దేవవంతుడు, ఉపదేవుడు, సుదేవుడు, దేవరక్షితుడు అని ఆ పుత్రులపేర్లు. వారి తోడబుట్టిన స్త్రీలు ఏడుగురు. వారందరిని వసుదేవునికిచ్చినాడు.

**ధృతదేవోపదేవా చ తథాఽన్యా దేవరక్షితా ।**
**శ్రీదేవా శాన్తిదేవా చ సహదేవా చ సువ్రతా ॥ 65 ॥**

**దేవకీ చాపి తాసాం తు వరిష్ఠాఽభూత్సుమధ్యమా ।**
**ఉగ్రసేనస్య పుత్రోఽభూన్న్యగ్రోధః కంస ఏవ చ ॥ 66 ॥**

ఆ కన్యలు ధృతదేవ, ఉపదేవ, దేవరక్షిత, శ్రీదేవ, శాంతిదేవ, సహదేవ, సువ్రత అయిన దేవకి. వారందరిలో మంచినడుముగల దేవకి శ్రేష్ఠురాలు. ఉగ్రసేనునికి న్యగ్రోధుడు కంసుడు అనువారు కుమారులు.

**సుభూమీరాష్ట్రపాలశ్చ తుష్టిమాఞ్ఛఙ్కురేవ చ ।**
**భజమానాదభూత్పుత్రః ప్రఖ్యాతోஉసౌ విదూరథః ॥ 67 ॥**

వీరితోపాటు సుభూమి, రాష్ట్రపాలుడు, తుష్టిమంతుడు, శంకువు అనే వారుకూడా ఉగ్రసేనుని కుమారులే. భజమానునికి ప్రసిద్ధుడైన విదూరథుడు అనే పుత్రుడు జన్మించాడు.

**తస్య శూరసమస్తస్మాత్ప్రతిక్షత్రశ్చ తత్సుతః ।**
**స్వయంభోజస్తతస్తస్మాద్ధాత్రీకః శత్రుతాపనః ॥ 68 ॥**

అతనికి శూరసముడనేవాడు అతనివలన ప్రతిక్షత్రుడనేవాడు జన్మించారు. ప్రతిక్షత్రునికి స్వయంభోజుడు, అతనికి శత్రుతాపకుడగు ధాత్రీకుడు జన్మించాడు.

**కృతవర్మాஉథ తత్పుత్రః శూరసేనః సుతోஉభవత్ ।**
**వసుదేవోஉథ తత్పుత్రో నిత్యం ధర్మపరాయణః ॥ 69 ॥**

ఆ ధాత్రీకునికి కృతవర్మ, కృతవర్మ కుమారుడు శూరసేనుడు, శూరసేనుని పుత్రుడు వసుదేవుడు. అతడెప్పుడు ధర్మమందు శ్రద్ధకలిగి ఉండేవాడు.

**వసుదేవాన్మహాబాహుః వాసుదేవో జగద్గురుః ।**
**బభూవ దేవకీపుత్రో దేవైరభ్యర్థితో హరిః ॥ 70 ॥**

**రోహిణీ చ మహాభాగా వసుదేవస్య శోభనా ।**
**అసూత పత్నీ సంకర్షం రామం జ్యేష్ఠం హలాయుధమ్ ॥ 71 ॥**

వసుదేవునివలన దేవకీదేవియందు దేవతల ప్రార్థనచే బలముకల భుజాలుకలవాడు లోకగురువైన నారాయణుడు జన్మించినాడు. వసుదేవుని మరో భార్య శ్రేష్ఠురాలైన రోహిణి హలాయుధుడు సంకర్షణుడనే రాముని పెద్దకుమారునిగా ప్రసవించినది.

**స ఏవ పరమాత్మాஉసౌ వాసుదేవో జగన్మయః ।**
**హలాయుధః స్వయం సాక్షాచ్ఛేషః సఙ్కర్షణః ప్రభుః ॥ 72 ॥**

ఆ వసుదేవకుమారుడు కృష్ణుడే విశ్వాత్మ ఐన పరమాత్మ, సంకర్షణుడు స్వయంగా శ్రీవిష్ణుశయ్యా రూపుడైన శేషావతారమే.

**భృగుశాపచ్ఛలేనైవ మానయన్మానుషీం తనుమ్ ।**
**బభూవ తస్యాం దేవక్యాం రోహిణ్యామపి మాధవః ॥ 73 ॥**

భృగుమహాముని శాపవ్యాజంతో లక్ష్మీపతి నారాయణుడు మానవశరీరాన్నిపొంది దేవకీ –రోహిణుల యందు భూలోకంలో అవతరించినాడు.

**ఉమాదేహసముద్భూతా యోగనిద్రా చ కౌశికీ ।**
**నియోగాద్వాసుదేవస్య యశోదాతనయా త్వభూత్॥ 74 ॥**

పార్వతిశరీరంనుండి పుట్టిన కౌశికి అనే యోగనిద్ర వాసుదేవాజ్ఞతో యశోదపుత్రికగా జన్మించినది.

**యే చాన్యే వసుదేవస్య వాసుదేవాగ్రజాః సుతాః ।**
**ప్రాగేవ కంసస్తాన్సర్వాఙ్ఘాన మునిసత్తమాః ॥ 75 ॥**

ఓ మునీంద్రులారా! కృష్ణునికంటె ముందు జన్మించిన వసుదేవ కుమారులను మొదటే కంసుడు చంపినాడు.

**సుషేణశ్చ తథోదాయీ భద్రసేనో మహాబలః ।**
**వజ్రదమ్భో భద్రసేనః కీర్తిమానపి పూజితః ॥ 76 ॥**

సుషేణుడు, ఉదాయి, భద్రసేనుడు, మహాబలుడు, వజ్రదంభుడు, కీర్తిమంతుడు పూజితుడు అనే ఆరుగురు కృష్ణునికి ముందు జన్మించినవారు.

**హతేష్వేతేషు సర్వేషు రోహిణీ వసుదేవతః ।**
**అసూత రామం లోకేశం బలభద్రం హలాయుధమ్ ॥ 77 ॥**
**జాతేఽథ రామే దేవానామాదిమాత్మానమచ్యుతమ్ ।**
**అసూత దేవకీ కృష్ణం శ్రీవత్సాఙ్కితవక్షసమ్ ॥ 78 ॥**

కుమారులనందరిని కంసుడు చంపిన తర్వాత రోహిణి వసుదేవునివలన హలాయుధుడు లోకస్వామి అయిన రాముని పుత్రునిగా పొందినది. రాముడు జన్మించిన తరువాత దేవతలకు ప్రథమాత్మ స్వరూపుడు అచ్యుతుడు అయిన శ్రీవత్సచిహ్నం వక్షఃస్థలంలోనున్న శ్రీకృష్ణుని దేవకీదేవి పుత్రునిగా పొందినది.

**రేవతీ నామ రామస్య భార్యాసీత్సుగుణాన్వితా ।**
**తస్యాముత్పాదయామాస పుత్రౌ ద్వౌ నిశితోల్ముకౌ ॥ 79 ॥**

**షోడశస్త్రీసహస్రాణి కృష్ణస్యాక్లిష్టకర్మణః ।**
**బభూవుశ్చాఽఽత్మజాస్తాసు శతశోఽథ సహస్రశః ॥ 80 ॥**

మంచి గుణవతి రేవతి బలరాముని భార్య. ఆమెయందు బలరాముడు నిశితుడు ఉల్ముకుడు అనే ఇద్దరు పుత్రులను పొందినాడు. ఎంతటి పనినైనా లీలగా చేయువాడు క్లేశములేకుండగా ఎంతటి ఘనకార్యమును చేసేవాడు అయినా కృష్ణునికి పదహారు వేలమంది భార్యలు. వారికి వందలు వేలకొలది కుమారులు జన్మించినారు.

**చారుదేష్ణః సుచారుశ్చ చారువేషో యశోధరః ।**
**చారుశ్రవాః చారుయశాః ప్రద్యుమ్నః సామ్బ ఏవ చ ॥ 81 ॥**

**రుక్మిణ్యాం వాసుదేవస్య మహాబలపరాక్రమాః ।**
**విశిష్టాః సర్వపుత్రాణాం సంబభూవురిమే సుతాః ॥ 82 ॥**

చారుదేష్ణుడు, సుబాహువు, చారువేశుడు, యశోధరుడు, చారుశ్రవుడు, చారుయశుడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు అను గొప్పబలపరాక్రమవంతులు రుక్మిణియందు కృష్ణునికి పుత్రులు కలిగారు.

**తాన్ దృష్ట్వా తనయాన్వీరాన్రౌక్మిణేయాఞ్జనార్దనః ।**
**జామ్బవత్యబ్రవీత్కృష్ణం భార్యా తస్య శుచిస్మితా ॥ 83 ॥**

వీరు అతని పుత్రులందరిలో విశిష్టులు. రుక్మిణికి కలిగిన వీరులైన ఆ కుమారులను చూచి స్వచ్ఛమైన నవ్వు గల జాంబవతి కృష్ణుని ఇట్లడిగినది.

**మమ త్వం పుణ్డరీకాక్ష విశిష్టగుణవత్తరమ్ ।**
**సురేశసమ్మితం పుత్రం దేహి దానవసూదన ॥ 84 ॥**

ఓ పద్మాక్షా! స్వామీ! రాక్షసాంతకా! నీవు నాకు గుణశ్రేష్ఠుడు, దేవేంద్రునితో పోల్చదగిన కుమారునొకని అనుగ్రహించవలెను.

**జామ్బవత్యా వచః శ్రుత్వా జగన్నాథః స్వయం హరిః ।**
**సమారేభే తపః కర్తుం తపోనిధిరరిన్దమః ॥ 85 ॥**

జగన్నాథుడైన శ్రీకృష్ణుడు జాంబవతిమాటవిని శత్రువులను నిగ్రహింపగలవాడు, తపస్సులకు స్థానమైనవాడైనా స్వయంగా తపమాచరింప మొదలిడినాడు.

**తచ్ఛృణుధ్వం మునిశ్రేష్ఠా యథాఽసౌ దేవకీసుతః ।**
**దృష్ట్వా లేభే సుతం రుద్రం తప్త్వా తీవ్రం మహత్తపః ॥ 86 ॥**

ఓ మునిసత్తములారా! దేవకిపుత్రుడైన ఆ కృష్ణుడు తీవ్రతపమాచరించి శివసాక్షాత్కారాన్ని పొంది కుమారుని పొందినవిధానాన్ని మీరు వినండి.

**ఇతి శ్రీకూర్మపురాణే యదువంశానుకీర్తనం నామ చతుర్వింశోఽధ్యాయః ॥ 24 ॥**

శ్రీకూర్మపురాణంలో యదువంశానుకీర్తనమనే ఇరవై నాల్గవ అధ్యాయం ॥ 24 ॥



## పఞ్చవింశోఽధ్యాయః - ఇరవై అయిదవ అధ్యాయం

## యదువంశానుకీర్తనే కృష్ణతపశ్చరణమ్ - యదువంశానుకీర్తనంలో కృష్ణతపశ్చరణం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు

**అథ దేవో హృషీకేశో భగవాన్పురుషోత్తమః ।**
**తతాప ఘోరం పుత్రార్థం నిధానం తపసస్తపః ॥ 1 ॥**

తర్వాత భగవానుడు, పురుషోత్తముడైన హృషీకేశుడు తపస్సుకు నిధివంటివాడై కూడా పుత్రలాభంకోసం ఘోరమైన తపమాచరించాడు.

**స్వేచ్ఛయాఽప్యవతీర్ణోఽసౌ కృతకృత్యోఽపి విశ్వసృక్ ।**
**చచార స్వాత్మనో మూలం బోధయన్పరమేశ్వరమ్ ॥ 2 ॥**

స్వేచ్ఛగా తాను భూమియందవతరించిన వాడైనా, కృతార్థుడు, విశ్వాన్ని సృజించేవాడుఐనా ఆ కృష్ణుడు పరమేశ్వరుని తన ఆత్మకు మూలమైనవానిగా తెలుపుచూ తపమాచరించాడు.

**జగామ యోగిభిర్జుష్టం నానాపక్షిసమాకులమ్ ।**
**ఆశ్రమం తూపమన్యోర్వై మునీన్ద్రస్య మహాత్మనః ॥ 3 ॥**

యోగులు నివసించినది, అనేకరకాలైన పక్షులు కలిగినట్టిదీ ఐన మునీంద్రుడైన ఉపమన్యు ఆశ్రమానికి వెళ్ళినాడు.

**పతత్త్రిరాజమారూఢః సుపర్ణమతితేజసమ్ ।**
**శఙ్ఖచక్రగదాపాణిః శ్రీవత్సాఙ్కితలక్షణః ॥ 4 ॥**

మిక్కిలి తేజోవంతుడైన పక్షిరాజు గరుత్మంతునారోహించి శంఖచక్రగదలను ధరించి శ్రీవత్సాంకము గలవాడై ఆ కృష్ణుడున్నాడు.

**నానాద్రుమలతాకీర్ణం నానాపుష్పోపశోభితమ్ ।**
**ఋషీణామాశ్రమైర్జుష్టం వేదఘోషనినాదితమ్ ॥ 5 ॥**

**సింహర్క్షశరభాకీర్ణం శార్దూలగజసంయుతమ్ ।**
**విమలస్వాదుపానీయైః సరోభిరుపశోభితమ్ ॥ 6 ॥**

ఆ ఆశ్రమం అనేక వృక్షాలు, తీగలు నిండి వివిధపుష్పాలతో ప్రకాశిస్తున్నది. ఋషుల ఆశ్రమాలు కల్గి వేదఘోషతో ప్రతిధ్వనిస్తున్నది. సింహాలు, ఎలుగుబంట్లు, శరభాలు, పెద్దపులులు, ఏనుగులతో కూడిఉంది. నిర్మలము రుచికరమైన జలమున్న కొలనులతో ఆ ఆశ్రమం శోభిస్తోంది.

**ఆరామైర్వివిధైర్జుష్టం దేవతాయతనైశ్శుభైః ।**
**ఋషిభిర్ఋషిపుత్రైశ్చ మహామునిగణైస్తథా ॥ 7 ॥**

అనేకవిధాలైన తోటలు, మంగళకరాలైన మందిరాలున్నవి. ఋషులు ఋషికుమారులు గొప్పముని సమూహాలు ఆ ఆశ్రమంలో ఉన్నారు.

**వేదాధ్యయనసమ్పన్నైః సేవితం చాగ్నిహోత్రిభిః ।**
**యోగిభిర్ధ్యాననిరతైః నాసాగ్రన్యస్తలోచనైః ॥ 8 ॥**

వేదాధ్యయనసంపన్నులు, నిత్యాగ్నిహోత్రులు, యోగులు, ధ్యానమగ్నులు నాసికాగ్రభాగంలో దృష్టి నిల్పినవారూ ఉన్నారు.

**ఉపేతం సర్వతః పుణ్యం జ్ఞానిభిస్తత్త్వదర్శిభిః ।**
**నదీభిరభితో జుష్టం జాపకైర్బ్రహ్మవాదిభిః ॥ 9 ॥**

పరతత్త్వదర్శులైన జ్ఞానులు అక్కడున్నారు.అంతటా పుణ్యమయమై చుట్టూ నదులతో బ్రహ్మవాదులైన జపకర్తలతో ఉన్నదాశ్రమప్రాంతం.

**సేవితం తాపసైః పుణ్యైః ఈశారాధనతత్పరైః ।**
**ప్రశాన్తైః సత్యసంకల్పైర్విశోకైర్నిరుపద్రవైః ॥ 10 ॥**

ఈశ్వరుని ఆరాధించే పుణ్యాత్ములైన మునులు, శాంతప్రవృత్తిగలవారు, సత్యసంకల్పులు, శోకంలేనివారు, నిరుపద్రవం గల మునులున్నదై ఉంది ఆశ్రమం.

**భస్మావదాతసర్వాఙ్గైః రుద్రజాప్యపరాయణైః ।**
**ముణ్డితైర్జటిలైః శుద్ధైస్తథాఽన్యైశ్చ శిఖాజటైః ॥ 11 ॥**

**సేవితం తాపసైర్నిత్యం జ్ఞానిభిర్బ్రహ్మవాదిభిః ।**
**తత్రాఽఽశ్రమవరే రమ్యే సిద్ధాశ్రమవిభూషితే ॥ 12 ॥**

భస్మధారణతో తెల్లనిశరీరాలు గలవారు, రుద్రమంత్రజపంలో ఆసక్తిగలవారు, జడలుదాల్చినవారు బోడితలలు కలవారూ, పరిశుద్ధులు, శిఖాజటలు ధరించిన మునులు గల ఆ ఆశ్రమానికి కృష్ణుడు వెళ్ళినాడు. జ్ఞానులు బ్రహ్మవాదులైన మునులు సిద్ధాశ్రమాలతో ఆ ఆశ్రమం మనోహరంగా ఉన్నది.

**గఙ్గా భగవతీ నిత్యం వహత్యేవాఘనాశినీ ।**
**స తత్ర వీక్ష్య విశ్వాత్మా తాపసాన్వీతకల్మషాన్ ॥ 13 ॥**

పాపాలను పోగొట్టే గంగానది అచట ఎల్లపుడు ప్రవహిస్తున్నది. అక్కడ విశ్వరూపుడైన శ్రీకృష్ణుడు పాపదూరులైన మునులను చూచినాడు.

**ప్రణామేనాథవచసా పూజయామాస మాధవః ।**
**తం తే దృష్ట్వా జగద్యోనిం శఙ్ఖచక్రగదాధరమ్ ॥ 14 ॥**

**ప్రణేముర్భక్తిసంయుక్తా యోగినాం పరమం గురుమ్ ।**
**స్తువన్తి వైదికైర్మన్త్రైః కృత్వా హృది సనాతనమ్ ॥ 15 ॥**

నమస్కారంతోను, మాటతోను వారిని గౌరవించాడు. ఆ మునులు శంఖచక్రగదాధరుడు, జగద్యోని అయిన కృష్ణుని చూచి యోగీశ్వరులకు గురువైన అతనికి భక్తితో నమస్కరించినారు. సనాతనుడైన అతనిని తమహృదయాల్లో నిల్పుకొని వేదమంత్రాలతో స్తోత్రం చేయుచున్నారు.

**ప్రోచురన్యోన్యమవ్యక్తమాదిదేవం మహామునిమ్ ।**
**అయం స భగవానేకః సాక్షీ నారాయణః పరః ॥ 16 ॥**

**ఆగచ్ఛత్యధునా దేవః ప్రధానపురుషః స్వయమ్ ।**
**అయమేవావ్యయః స్రష్టా సంహర్తా చైవ రక్షకః ॥ 17 ॥**

వారు తమలో తాము కృష్ణునిగూర్చి ఆదిదేవుడని, అవ్యక్తస్వరూపుడని, గొప్పమునీశ్వరుడని చెప్పుకొన్నారు. ఇతడు అద్వితీయుడు, భగవంతుడు, సాక్షీభూతుడు, పరమపురుషుడైన సాక్షాన్నారాయణుడని ప్రశంసించినారు. ప్రధానపురుషుడైన భగవంతుడిపుడు స్వయంగా ఇచటికి వచ్చినాడు. ఇతడే అవినాశి సృష్టి స్థితి లయకారకుడు.

**అమూర్తో మూర్తిమాన్భూత్వా మునీన్ద్రష్టుమిహాగతాః ।**
**ఏష ధాతా విధాతా చ సమాగచ్ఛతి సర్వగః ॥ 18 ॥**

**అనాదిరక్షయోఽనన్తో మహాభూతో మహేశ్వరః ।**
**శ్రుత్వా బుద్ధ్వా హరిస్తేషాం వచాంసి వచనాతిగః ॥ 19 ॥**

**యయౌ స తూర్ణం గోవిన్దః స్థానం తస్య మహాత్మనః ।**
**ఉపస్పృశ్యాథ భావేన తీర్థే తీర్థే స యాదవః ॥ 20 ॥**

**చచార దేవకీసూనుర్దేవర్షిపితృతర్పణమ్ ।**
**నదీనాం తీరసంస్థానే స్థాపితాని మునీశ్వరైః ॥ 21 ॥**

**లిఙ్గాని పూజయామాస శమ్భోరమితతేజసః ।**
**దృష్ట్వా దృష్ట్వా సమాయాన్తం యత్ర యత్ర జనార్దనమ్ ॥ 22 ॥**

**పూజయాఞ్చక్రిరే పుష్పైరక్షతైస్తన్నివాసినః ।**
**సమీక్ష్య వాసుదేవం తం శార్ఙ్గశంఖాసిధారిణమ్ ॥ 23 ॥**

రూపరహితుడైన భగవంతుడు మూర్తిమంతుడై మునులను చూడటానికి ఇక్కడికి వచ్చినాడు. ఇతడు ఆద్యంతాలు లేనివాడు. మహాభూతస్వరూపుడు మహేశ్వరుడుకూడా అనిచెప్పుకొంటున్న ఆ మునుల మాటలువిని మాటలకందని హరిరూపుడైన కృష్ణుడు త్వరగా మహాత్ముడైన ఆ ఉపమన్యునియొక్క ఆశ్రమానికి బయలుదేరినాడు. దారిలో ప్రతితీర్థస్థలంలోనూ ఆచమనపూర్వకంగా జలం స్వీకరించి ముందుకు సాగినాడు. దేవకీనందనుడైన

శ్రీకృష్ణుడు ఋషులకు పితృదేవతలకు తర్పణాలు గావించినాడు. ఆయా నదీతీరాల్లో మునులు పూర్వం ప్రతిష్ఠించిన అధికతేజోవంతములైన శివలింగాలను పూజించినాడు. తమ సమీపానికి వస్తున్న శార్ఙ్గము, శంఖము, ఖడ్గాన్ని ధరించిన ఆ వాసుదేవుడైన శ్రీకృష్ణునిచూచి అచటి జనులు పూలు అక్షతలతో పూజించారు.

**తస్థిరే నిశ్చలాః సర్వే శుభాఙ్గాయతమానసాః ।**
**యాని తత్రారురుక్షూణాం మానసాని జనార్దనమ్ ॥ 24 ॥**

**దృష్ట్వా సమహితాన్యాసన్నిష్క్రామన్తి పురా హరిమ్ ।**
**అథావగాహ్య గఙ్గాయాం కృత్వా దేవర్షితర్పణమ్ ॥ 25 ॥**

**ఆదాయ పుష్పవర్యాణి మునీన్ద్రస్యావిశద్గృహమ్ ।**
**దృష్ట్వా తం యోగినాం శ్రేష్ఠం భస్మోద్ధూలితవిగ్రహమ్ ॥ 26 ॥**

**జటాచీరధరం శాన్తం ననామ శిరసా మునిమ్ ।**
**ఆలోక్య కృష్ణమాయాన్తం పూజయామాస తత్త్వవిత్ ॥ 27 ॥**

అందరూ శుభాంగుడైన కృష్ణునియందు మనసునిల్పి చలనంలేనివారైనారు. ఉన్నతస్థానాన్ని పొందగోరేవారి మనసులు ఆ కృష్ణుని చూచి సమాధానాన్ని పొందినవి. పూర్వం శ్రీహరికి విముఖంగా ఉండే మనసులిపుడు ఆభిముఖ్యాన్ని పొందినవి. తర్వాత గంగానదిలో స్నానంచేసి దేవతలకు ఋషులకు తర్పణాలొదిలి మంచిపూవులు తీసుకొని మునిశ్రేష్ఠుని గృహాన్ని ప్రవేశించినాడు. యోగుల్లో శ్రేష్ఠుడు, భస్మమలదిన శరీరంగలవాడు, జడలు నారబట్టలు ధరించి శాంతుడైన ఆ మునికి నమస్కరించాడు. తత్త్వవేత్త అయిన ఆముని తన దగ్గరకువస్తున్న కృష్ణునిచూచి పూజించినాడు.

**ఆసనే వాసయామాస యోగినాం ప్రథమాతిథిమ్ ।**
**ఉవాచ వచసాం యోనిం జానీమః పరమం పదమ్ ॥ 28 ॥**

**విష్ణుమవ్యక్తసంస్థానం శిష్యభావేన సంస్థితమ్ ।**
**స్వాగతం తే హృషీకేశ! సఫలాని తపాంసి నః ॥ 29 ॥**

యోగులకు ప్రథమాతిథి అయిన కృష్ణుని ఆసనంలో కూర్చోబెట్టి ఇట్లు పలికెను. వాక్కులకు కారణభూతుడవగు నిన్ను సర్వోత్తమమైన స్థానంగా తెలుసుకొనుచున్నాము. ఇంద్రియాతీత స్వరూపంగల విష్ణుడవని శిష్యస్వభావంతో ఇపుడు నిలిచినావని గుర్తించాము. ఇంద్రియాలకధీశ్వరుడవైన నీకు స్వాగతం. మా తపస్సులు సఫలమైనవి.

**యత్సాక్షాదేవ విశ్వాత్మా మద్గేహం విష్ణురాగతః ।**
**త్వాం న పశ్యన్తి మునయో యతన్తోఽపీహ యోగినః ॥ 30 ॥**

**తాదృశస్యాత్ర భవతః కిమాగమనకారణమ్ ।**
**శ్రుత్వోపమన్యోస్తద్వాక్యం భగవాన్దేవకీసుతః ॥**
**వ్యాజహార మహాయోగీ ప్రసన్నం ప్రణిపత్య తమ్ ॥ 31 ॥**

**కృష్ణ ఉవాచ :-** కృష్ణుడు పలికాడు.

**భగవన్ ద్రష్టుమిచ్ఛామి గిరీశం కృత్తివాససమ్ ॥ 32 ॥**

జగద్రూపుడవైన విష్ణువే స్వయంగా మాఇంటికి వచ్చినాడు. ఎంతో యత్నం చేసినప్పటికీ యోగీశ్వరులు మునులు కూడా నిన్ను చూడలేకున్నారు. అట్టి మహాపురుషుడవైన నీవు ఇక్కడికి రావటంలో కారణమేమి? అని పలుకగా ఆ ఉపమన్యుముని వాక్యాన్ని విని భగవంతుడు దేవకీసుతుడు శ్రీకృష్ణుడు నిర్మలుడైన ఆ మునికి నమస్కరించి ఇట్లు పలికెను. ఓ పూజ్యుడా! చర్మధారియైన శివుని నేను చూడాలనుకొంటున్నాను.

**సంప్రాప్తో భవతఃస్థానం భగవద్దర్శనోత్సుకః ।**
**కథం స భగవానీశో దృశ్యో యోగవిదాం వరః ॥ 33 ॥**

భగవంతుని చూడాలనే కుతూహలంతో నీదగ్గరకి వచ్చాను. భగవంతుడు, యోగవిదుల్లో శ్రేష్ఠుడూ అయిన శివుని ఏవిధంగా చూడాలి?

**మయాఽచిరేణ కుత్రాహం ద్రక్ష్యామి తముమాపతిమ్ ।**
**ప్రత్యాహ భగవానుక్తో దృశ్యతే పరమేశ్వరః ॥ 34 ॥**

**భక్త్యైవోగ్రేణ తపసా తత్కురుష్వేహ సంయతః ।**
**ఇహేశ్వరం దేవదేవం మునీన్ద్రా బ్రహ్మవాదినః ॥ 35 ॥**

**ధ్యాయన్త్యారాధయన్త్యేనం యోగినస్తాపసాశ్చ యే ।**
**ఇహ దేవః సపత్నీకో భగవాన్ వృషభధ్వజః ॥ 36 ॥**

**క్రీడతే వివిధైర్భూతైర్యోగిభిః పరివారితః ।**
**ఇహాశ్రమే పురా రుద్రం తపస్తప్త్వా సుదారుణమ్ ॥ 37 ॥**

**లేభే మహేశ్వరాద్యోగం వశిష్ఠో భగవానృషిః ।**
**ఇహైవ భగవాన్వ్యాసః కృష్ణద్వైపాయనః స్వయమ్ ॥ 38 ॥**

త్వరగా ఉమాపతిని ఎక్కడ చూడగలను? ఆ ప్రశ్నకు పూజ్యుడైన ముని ఇట్లా బదులు పలికాడు. పరమేశ్వరుడు భక్తితోకాని, తీవ్రతపస్సుతోగాని చూడదగినవాడు. అందువల్ల నీవు నియమం కలిగి ఇక్కడ తపమాచరించుము. ఇక్కడ బ్రహ్మవాదులైన మునివరులు దేవదేవుడైన ఈశ్వరుని ధ్యానిస్తున్నారు, ఆరాధిస్తున్నారు. యోగులు మునులుకూడా ఆయన్ని అర్చిస్తున్నారు. వృషభధ్వజుడైన శివుడు భార్యతోకూడ ఇక్కడ యోగులు పరివేష్టింపగా భూతగణాలతో క్రీడిస్తుంటాడు. ఈ ఆశ్రమంలోనే పూర్వం వసిష్ఠుడు రుద్రునిగూర్చి తీవ్రతపమాచరించి మహేశ్వరునివల్ల యోగవిద్యను పొందాడు. ఇక్కడే వ్యాసుడు కూడా శివునివల్ల యోగవిద్యను పొందాడు.

**దృష్ట్వా తం పరమేశానం లబ్ధవాన్ జ్ఞానమైశ్వరమ్ ।**
**ఇహాశ్రమపదే రమ్యే తపస్తప్త్వా కపర్దినః ॥ 39 ॥**

**అవిన్దన్పుత్రకాన్రుద్రాత్సురయో భక్తిసంయుతాః ।**
**ఇహ దేవా మహాదేవీం భవానీఙ్చ మహేశ్వరీమ్ ॥ 40 ॥**

**సంస్తువన్తో మహాదేవం నిర్భయా నిర్వృతిం యయుః ।**
**ఇహారాధ్య మహాదేవం సావర్ణిస్తపతాం వరః ॥ 41 ॥**

**లబ్ధవాన్పరమం యోగం గ్రంథకారత్వముత్తమమ్ ।**
**ప్రవర్తయామాస స తాం కృత్వా వై సంహితాం శుభమ్ ॥ 42 ॥**

ఇక్కడే కృష్ణద్వైపాయనుడైన భగవాన్ వ్యాసుడు స్వయంగా ఆ పరమేశ్వరుని దర్శించి ఈశ్వరసంబంధమైన జ్ఞానాన్ని పొందాడు. శివుని ఈ మనోహరాశ్రమంలోనే తపస్సుచేసి భక్తిగల పండితులు రుద్రునివల్ల పుత్రులను పొందినారు. ఈ ప్రదేశంలోనే దేవతలు మహాదేవి మహేశ్వరి అయిన పార్వతీదేవిని స్తోత్రం చేస్తూ మహాదేవుని భజించి భయంలేనివారై నిత్యానందాన్ని పొందినారు. తపస్వుల్లో శ్రేష్ఠుడైన సావర్ణి ఇచటనే మహాదేవుణ్ణి పూజించి ఉత్తమయోగసిద్ధినందినాడు. శ్రేష్ఠమైన గ్రంథకర్తృత్వాన్ని కూడా పొందినాడు. ఆ సావర్ణి తాను రచించిన శుభప్రదమైన సంహితను లోకంలో ప్రవర్తింపజేసినాడు.

**ఇహైవ సంహితాం దృష్ట్వా కాపేయః శాంశపాయనః ।**
**మహాదేవం చకారేమాం పౌరాణీం తన్నియోగతః ॥ 43 ॥**

**ద్వాదశైవ సహస్రాణి శ్లోకానాం పురుషోత్తమ ।**
**ఇహ ప్రవర్తితా పుణ్యా ద్వ్యష్ట సాహస్రికోత్తరా ॥**
**వాయవీయోత్తరం నామ పురాణం వేదసమ్మతమ్ ॥**

**ద్విజైః పౌరాణికం పుణ్యం ప్రసాదేన ద్విజోత్తమైః ।**
**ఇహైవ ఖ్యాపితం శిష్యైః శాంశపాయనభాషితమ్ ॥ 44 ॥**
**యాజ్ఞవల్క్యో మహాయోగీ దృష్ట్వాఽత్ర తపసా హరమ్ ।**
**చకార తన్నియోగేన యోగశాస్త్రమనుత్తమమ్ ।**

**ఇహైవ భృగుణా పూర్వం తప్త్వా పూర్వం మహాతపః ।**
**శుక్రో మహేశ్వరాత్పుత్రో లబ్ధో యోగవిదాం వరః ॥ 45 ॥**

పురుషోత్తమా! ఈ ప్రదేశంలో కాపేయుడైన శాంశపాయనుడు మహాదేవుణ్ణి స్మరించి అతని ఆజ్ఞతో 12వేలశ్లోకాలుగల ఈ పురాణసంహితను రచించినాడు. వేదసమ్మితం పుణ్యప్రదమైన వాయవీయసంహిత పదహారువేలశ్లోకాలుగల ఉత్తరభాగం ఇక్కడే ప్రవర్తితమైనది. విప్రులు, విప్రోత్తములు శాంశపాయనుడు చెప్పిన పుణ్యాన్ని కలిగించే ఆ పురాణం అతని అనుగ్రహంతోనే విస్తరించినది. మహాయోగి యాజ్ఞవల్క్యుడు ఇక్కడే తపమాచరించి పరమశివుని ఆజ్ఞతో ఉత్తమమైన యోగశాస్త్రాన్ని రచించాడు. పూర్వం భృగుమహర్షి ఇక్కడే గొప్పతపస్సు చేసి శివుని అనుగ్రహంతో యోగవేత్తల్లో శ్రేష్ఠుడైన పుత్రుణ్ణి పొందినాడు.

**తస్మాదిహైవ దేవేశ తపస్తప్త్వా సుదుశ్చరమ్ ।**
**ద్రష్టుమర్హసి విశ్వేశముగ్రం భీమం కపర్దినమ్ ॥ 46 ॥**

అందువల్ల ఓ దేవదేవా! నీవిక్కడనే కష్టసాధ్యమైన తపమాచరించి ఉగ్రుడు, భయంకరుడు, కపర్ది అయిన ఈశ్వరుని దర్శించుము.

**ఏవముక్త్వా దదౌ జ్ఞానముపమన్యుర్మహామునిః ।**
**వ్రతం పాశుపతం యోగం కృష్ణాయాక్లిష్టకర్మణే ॥ 47 ॥**

అని పలికి మునిశ్రేష్ఠుడైన ఉపమన్యుడు ఆశ్చర్యకరకార్యాలుగల కృష్ణునికి జ్ఞానాన్ని, నియమాన్ని, పాశుపతయోగాన్నుపదేశించాడు.

**స తేన మునివర్యేణ వ్యాహృతో మధుసూదనః ।**
**తత్రైవ తపసా దేవం రుద్రమారాధయత్ప్రభుః ॥ 48 ॥**

మధుసూదనుడైన ఆ నారాయణుడు ముని ఉపదేశించగా సమర్థుడై అక్కడనే తపస్సుతో రుద్రునారాధించినాడు.

**భస్మోద్ధూలితసర్వాఙ్గో ముణ్డో వల్కలసంయుతః ।**
**జజాప రుద్రమనిశం శివైకాహితమానసః ॥ 49 ॥**

శరీరానికి భస్మమలదుకొని కేశఖండనం చేసుకొని నారవస్త్రాలు ధరించి శివునియందే మనసు లగ్నం గావించి నిరంతరంగా శివునిగూర్చి జపించినాడు.

**తతో బహుతిథే కాలే సోమః సోమార్ధభూషణః ।**
**అదృశ్యత మహాదేవో వ్యోమ్ని దేవ్యా మహేశ్వరః ॥ 50 ॥**

ఆ పై చాలాకాలానికి చంద్రభూషణుడైన శివుడు పార్వతితోకూడ ఆకాశంలో కృష్ణునికి సాక్షాత్కరించినాడు.

**కిరీటినం గదినం చిత్రమాలం పినాకినం శూలినం దేవదేవమ్ ।**
**శార్దూలచర్మామ్బరసంవృతాఙ్గం దేవ్యా మహాదేవమసౌ దదర్శ ॥ 51 ॥**

కిరీటం, గద, చిత్రమాల, శూలం, పినాకం ధరించిన దేవదేవుని, పులిచర్మం కప్పుకొన్న మహాదేవుని, దేవితోకూడిన శివుణ్ణి కృష్ణుడు దర్శించాడు.

**ప్రభుం పురాణం పురుషం పురస్తాత్సనాతనం యోగినమీశితారమ్ ।**
**అణోరణీయాంసమనన్తశక్తిం ప్రాణేశ్వరం శమ్భుమసౌ దదర్శ ॥ 52 ॥**

ప్రభువు, పురాణపురుషుడు, సనాతనుడు, యోగి, ఈశ్వరుడు, అణువుకంటె అణువైనవాడు, అనంతశక్తిగలవాడు, ప్రాణాలకు ప్రభువైన శంభుని అతడు చూచినాడు.

**పరశ్వధాసక్తకరం త్రినేత్రం నృసింహచర్మావృతభస్మగాత్రమ్ ।**
**సముద్గిరన్తం ప్రణవం బృహన్తం సహస్రసూర్యప్రతిమం దదర్శ ॥ 53 ॥**

గండ్రగొడ్డలి చేత ధరించి ఉన్నవాడు, త్రినేత్రుడు, నృసింహచర్మంతో భస్మం ధరించిన శరీరాన్ని కప్పుకొన్నవాడు, ఓంకారాన్ని ఉచ్చరిస్తున్నవాడు, వేయిమంది సూర్యుల తేజస్సుగల గొప్పదేహంగల శివుణ్ణి చూచినాడు.

**న యస్య దేవా న పితామహోఽపి నేన్ద్రో న చాగ్నిర్వరుణో న మృత్యుః ।**
**ప్రభావమద్యాపి వదన్తి రుద్రం తమాదిదేవం పురతో దదర్శ ॥ 54 ॥**

బ్రహ్మ, ఇంద్ర, అగ్ని, వరుణ, మృత్యువు మొదలగువారు ఆ దేవదేవుని ప్రభావాన్ని చెప్పలేరు. అటువంటి రుద్రుని తన ఎదురుగా కృష్ణుడు దర్శించుకొన్నాడు.

**తదాఽన్వపశ్యద్గిరిశస్య వామే స్వాత్మానమవ్యక్తమనన్తరూపమ్ ।**
**స్తువన్తమీశం బహుభిర్వచోభిః శఙ్ఖాసిచక్రాన్వితహస్తమాద్యమ్ ॥ 55 ॥**

అపుడు శివుని వామభాగంలో అవ్యక్తరూపుడు అనంతరూపాలు కలిగి ఈశ్వరుని స్తుతిస్తున్నవాడు, శంఖ చక్ర ఖడ్గ హస్తుడైన తన మొదటిరూపాన్ని చూచాడు.

**కృతాఞ్జలిం దక్షిణతః సురేశం హంసాధిరూఢం పురుషం దదర్శ ।**
**స్తువానమీశస్య పరం ప్రభావం పితామహం లోకగురుం దివిస్థమ్ ॥ 56 ॥**

శివుని దక్షిణభాగంలో చేతులు కట్టుకొని నిలిచిన దేవేంద్రుని, హంసనధిష్ఠించి ఈశ్వరప్రభావాన్ని స్తుతిస్తున్న లోకగురువు పితామహుని ఆకాశంలో చూచినాడు.

**గణేశ్వరానర్క సహస్రకల్పాన్నన్దీశ్వరాదీనమితప్రభావాన్ ।**
**త్రిలోకభర్తుః పురతోఽన్వపశ్యత్కుమారమగ్నిప్రతిమం గణేశమ్ ॥ 57 ॥**

వేలసూర్యుల సమానులైన గణేశ్వరులను, నందీశ్వరుడు మొదలైన అమిత ప్రభావవంతులను, కుమారస్వామిని, అగ్నిప్రతిముడైన గణేశుని, ముల్లోకాలకు ప్రభువైన శివుని ముందుభాగంలో చూచినాడు.

**మరీచిమత్రిం పులహం పులస్త్యం ప్రచేతసం దక్షమథాపి కణ్వమ్ ।**
**పరాశరం తత్పరతో వసిష్ఠం స్వాయంభువం చాపి మనుం దదర్శ ॥ 58 ॥**

మరీచి, అత్రి, పులహ, పులస్త్య, ప్రచేతస, దక్ష, కణ్వ, పరాశర, వసిష్ఠ, స్వాయంభువ మనువులను అక్కడ క్రమంగా కృష్ణుడు చూచినాడు.

**తుష్టావ మన్త్రైరమరః ప్రధానం బద్ధాఞ్జలిర్విష్ణురుదారబుద్ధిః ।**
**ప్రణమ్య దేవ్యా గిరిశం స్వభక్త్యా స్వాత్మన్యథాత్మానమసౌ విచిన్త్య ॥ 59 ॥**

ఉదారబుద్ధిగల విష్ణువు అంజలిబద్ధుడై దేవితోకూడ శివుని భక్తితో నమస్కరించినాడు. ఆత్మలో ఆత్మ తత్త్వాన్ని విచారించి అమరప్రధానుడైన ఈశ్వరుని వేదమంత్రాలతో స్తుతించినాడు.

**కృష్ణ ఉవాచ :–** కృష్ణుడు పలికాడు.

**నమోఽస్తు తే శాశ్వత సర్వయోగ బ్రహ్మాదయస్త్వామృషయో వదన్తి ।**
**తమశ్చ సత్త్వఞ్చ రజస్త్రయం చ త్వామేవ సర్వం ప్రవదన్తి సన్తః ॥ 60 ॥**

శాశ్వతుడవు, సమస్తయోగస్వరూపుడవు బ్రహ్మాదులు ఋషులు నీవు సత్త్వరజస్తమోగుణాత్ముడవని సమస్తవిశ్వం నీవే అని చెప్పుదురు. అట్టి నీకు నమస్కారం.

**త్వం బ్రహ్మా హరిరథ రుద్ర విశ్వకర్తా సంహర్తా దినకరమణ్డలాధివాసః ।**
**ప్రాణస్త్వం హుతవహవాసవాదిభేదస్త్వామేకం శరణముపైమి దేవమీశమ్ ॥ 61 ॥**

రుద్రుడా! నీవు బ్రహ్మవు, విష్ణుడవు, సృష్టిసంహారకారకుడవు. సూర్యమండలమందున్నవాడవు ప్రాణస్వరూపుడవు. అగ్ని, ఇంద్రాది భేదాలతో కన్పించే అద్వితీయుడవైన నిన్ను శరణుపొందినాను.

**సాంఖ్యాస్త్వామగుణమథాహురేకరూపం యోగస్థం సతతముపాసతే హృదిస్థమ్ ।**
**వేదాస్త్వామభిదధతీహ రుద్రమీఢ్యం త్వామేకం శరణముపైమి దేవమీశమ్ ॥ 62 ॥**

నిన్ను సాంఖ్యులు గుణరహితుడవు, ఏకాకారుడవు, యోగస్థుడవని ఎల్లపుడు మనసులో ధ్యానిస్తారు. వేదాలు నిన్ను రుద్రుడవని, స్తుతించదగినవాడవని చెపుతున్నవి. అట్టి దేవుడవు, ఈశుడవైన నిన్ను శరణు పొందుతున్నాను.

**త్వత్పాదే కుసుమమథాపి పత్రమేకం దత్త్వాఽసౌ భవతి విముక్తవిశ్వబన్ధః ।**
**సర్వాఘం ప్రణుదతి సిద్ధయోగిజుష్టం స్మృత్వా తే పదయుగళం భవత్ప్రసాదాత్ ॥ 63 ॥**

నీపాదమందు ఒకపుష్పంకాని, ఆకుకాని సమర్పించినవాడు సంసారబంధవిముక్తుడౌతాడు. సిద్ధులు, యోగులుసేవించే నీ పాదద్వయాన్ని స్మరించి నీ అనుగ్రహంవలన సర్వపాపాలు తొలగించుకొంటున్నాడు.

**యస్యాశేషవిభాగహీనమమలం హృద్యన్తరావస్థితం**
**తే త్వాం యోనిమనన్తమేక మచలం సత్యం పరం సర్వగమ్ ।**
**స్థానం ప్రాహురనాదిమధ్యనిధనం యస్మాదిదం జాయతే**
**నిత్యం త్వాహముపైమి సత్యవిభవం విశ్వేశ్వరం తం శివమ్ ॥ 64 ॥**

నీస్థానాన్ని గూర్చి విభాగాలులేనిది, నిర్మలము, హృదయములో ఉండేది, అంతం లేనిది, అద్వితీయమూ, నిశ్చలమూ, సత్యస్వరూపమూ, అన్నిచోట్ల వ్యాప్తమూ, శ్రేష్ఠమైనదీ, కారణమైనదీ, ఆదిమధ్యాంతరహితమూ అని చెప్పెదరు. ఇదంతా కలదే నీ పదము. సత్యవైభవంగల విశ్వేశ్వరుడవైన శివుని నిన్నెల్లపుడు నేను సేవిస్తాను.

**ఓం నమో నీలకణ్ఠాయ త్రినేత్రాయ చ రంహసే ।**
**మహాదేవాయ తే నిత్యమీశానాయ నమో నమః ॥ 65 ॥**

నీలకంఠుడవు, త్రినేత్రుడవు, వేగంకలవాడవు, మహాదేవుడవు, ఈశానుడవైన నీకు నమస్కారం.

**నమః పినాకినే తుభ్యం నమో ముణ్డాయ దణ్డినే ।**
**నమస్తే వజ్రహస్తాయ దిగ్వస్త్రాయ కపర్దినే ॥ 66 ॥**

పినాకధారివి, దండధారివగు సన్న్యాసివి, వజ్రహస్తుడవు, దిగంబరుడవు, కపర్దివైన నీకు నమస్కారం.

**నమో భైరవనాదాయ కాలరూపాయ దంష్ట్రినే ।**
**నాగయజ్ఞోపవీతాయ నమస్తే వహ్నిరేతసే ॥ 67 ॥**

భయంకరనాదం గలవాడవు, కాలరూపుడవు, కోరలుగలవాడవు, పాములే యజ్ఞోపవీతంగా ధరించినవాడవు, అగ్నిని వీర్యముగా గలవాడవు అగు నీకు నమస్కారం.

**నమోఽస్తు తే గిరీశాయ స్వాహాకారాయ తే నమః ।**
**నమో ముక్తాట్టహాసాయ భీమాయ చ నమో నమః ॥ 68 ॥**

గిరీశుడవు స్వాహాకారరూపంగలవాడవు, అట్టహాసంగల భీకరరూపుడవు అగు నీకు నమస్కారం.

**నమస్తే కామనాశాయ నమఃకాలప్రమాథినే ।**
**నమో భైరవవేషాయ హరాయ చ నిషఙ్గిణే ॥ 69 ॥**

మన్మథాంతకుడవు, యముని మథించినవాడవు, భీకరవేషుడవు, ధనుర్ధరుడవు, హరుడవైన నీకు నమస్కారం.

**నమోఽస్తు తే త్ర్యమ్బకాయ నమస్తే కృత్తివాససే ।**
**నమోఽమ్బికాధిపతయే పశూనాం పతయే నమః ॥ 70 ॥**

త్రినేత్రుడవు, చర్మాంబరధారివి, పార్వతీపతివి, పశుపతివైన నీకు నమస్కారం.

**నమస్తే వ్యోమరూపాయ వ్యోమాధిపతయే నమః ।**
**నరనారీ శరీరాయ సాంఖ్యయోగప్రవర్తినే ॥ 71 ॥**

ఆకాశస్వరూపుడవు, ఆకాశానికధిపతివి, స్త్రీపురుషరూప శరీరంగలవాడవు. సాంఖ్యయోగాన్ని ప్రవర్తింపజేసిన వాడవైన నీకు నమస్కారము.

**నమో భైరవనాథాయ దేవానుగతలిఙ్గినే ।**
**కుమార గురవే తుభ్యం దేవదేవాయ తే నమః ॥ 72 ॥**

భైరవునకధిపతివి, దేవతలు పూజించే లింగరూపానివి, కుమారస్వామి తండ్రివి, దేవాదిదేవుడైన నీకు నమస్కారాలు.

**నమో యజ్ఞాధిపతయే నమస్తే బ్రహ్మచారిణే ।**
**మృగవ్యాధాయ మహతే బ్రహ్మాధిపతయే నమః ॥ 73 ॥**

యజ్ఞాలకధిపతివి, బ్రహ్మచారివి, మృగాలను వేటాడే వ్యాధుడవు, బ్రహ్మాధిపతివైన నీకు నమస్కారము.

**నమో హంసాయ విశ్వాయ మోహనాయ నమో నమః ।**
**యోగినే యోగగమ్యాయ యోగమాయాయ తే నమః ॥ 74 ॥**

హంసరూపివి, విశ్వాత్మకుడవు, మోహింపచేసేవాడవు, యోగివి, యోగంతో తెలియదగినవాడవు, యోగమాయా స్వరూపివైన నీకు నమస్కారం.

**నమస్తే ప్రాణపాలాయ ఘణ్టానాదప్రియాయ చ ।**
**కపాలినే నమస్తుభ్యం జ్యోతిషాం పతయే నమః ॥ 75 ॥**

ప్రాణరక్షకుడవు, ఘంటానాద ప్రియుడవు, కపాలధారివి, జ్యోతిస్సులకు ప్రభుడవైన నీకు నమస్కారము.

**నమో నమోఽస్తు తే తుభ్యం భూయ ఏవ నమో నమః ।**
**మహ్యం సర్వాత్మనా కామాన్ ప్రయచ్ఛ పరమేశ్వర ॥ 76 ॥**

ఓ దేవా! నీకు మళ్ళీ మళ్ళీ నమస్కరిస్తున్నాను. పరమేశ్వరా! నాకన్నివిధాలైన కోరికలనూ తీర్చుము.

**సూత ఉవాచ :–** సూతుడు పలికాడు

**ఏవం హి భక్త్యా దేవేశ మభిష్టూయ స మాధవః ।**
**పపాత పాదయో ర్విప్రా దేవదేవ్యోః సదణ్డవత్ ॥ 77 ॥**

ఓ విప్రులారా! మాధవుడీ విధంగా భక్తితో దేవేశుని స్తుతించి పార్వతీ పరమేశ్వరుల పాదాలకు సాష్టాంగ! మాచరించాడు.

**ఉత్థాప్య భగవాన్ సోమః కృష్ణం కేశినిషూదనమ్ ।**
**బభాషే మధురం వాక్యం మేఘగంభీరనిఃస్వనః ॥ 78 ॥**

కేశిని చంపిన కృష్ణుని పైకి లేపి భగవంతుడైన శంకరుడు మేఘగంభీరస్వరంతో మధురమైన మాటలిట్లా పలికినాడు.

**కిమర్థం పుణ్డరీకాక్ష తప్యతే భవతా తపః ।**
**త్వమేవ దాతా సర్వేషాం కామానాం కర్మణామిహ ॥ 79 ॥**

**త్వం హి సా పరమామూర్తి ర్మమ నారాయణాహ్వయా ।**
**న వినా త్వాం జగత్సర్వం విద్యతే పురుషోత్తమ! ॥ 80 ॥**

**వేత్థ నారాయణానన్తమాత్మానం పరమేశ్వరమ్ ।**
**మహాదేవం మహాయోగం స్వేన యోగేన కేశవ ॥ 81 ॥**

ఓ కృష్ణా! నీవెందుకు తపమాచరిస్తున్నావు? నీవు స్వయంగా అందరి కోర్కెలు కర్మఫలాలు ఇచ్చేవాడవు కదా! నారాయణ నామంకల నా శ్రేష్ఠమైన మూర్తి భేదానివి నీవు. ఓ పురుషోత్తమా! ఈ ప్రపంచం నీవు లేకుండా నిలువలేదు. కేశవా! అనంతునిగా పరమేశ్వరునిగా నిన్ను నీవు తెలుసుకొమ్ము. నీ యోగంతో మహాదేవునిగా మహాయోగిగా తెలుసుకో!

**శ్రుత్వా తద్వచనం కృష్ణః ప్రహసన్వై వృషధ్వజమ్ ।**
**ఉవాచాన్వీక్ష్య విశ్వేశం దేవీం చ హిమశైలజామ్ ॥ 82 ॥**

ఈ వాక్యాన్ని విని కృష్ణుడు చిరునవ్వుతో పార్వతిని విశ్వేశ్వరుడైన రుద్రుని చూచి ఇట్లన్నాడు.

**జ్ఞాతం హి భవతా సర్వం స్వేన యోగేన శఙ్కర! ।**
**ఇచ్ఛామ్యాత్మసమం పుత్రం త్వద్భక్తం దేహి శఙ్కర ॥ 83 ॥**

ఓ శంకరా! నీయోగంతో సమస్తం తెలిసినవాడవయ్యావు. నాసమానుడు నీ భక్తుడు అయిన పుత్రుని కోరుతున్నాను. అనుగ్రహించు.

**తథాస్త్విత్యాహ విశ్వాత్మా ప్రహృష్టమనసా హరః ।**
**దేవీమాలోక్య గిరిజాం కేశవం పరిషస్వజే ॥ 84 ॥**

విశ్వాత్ముడైన శివుడు సంతుష్టమైన మనసుతో అట్లే అగునని పలికి పార్వతి వైపు చూచి విష్ణువు నాలింగనం చేసుకొన్నాడు.

**తతఃసా జగతాం మాతా శఙ్కరార్ధ శరీరిణీ ।**
**వ్యాజహార హృషీకేశం దేవీ హిమగిరీన్ద్రజా ॥ 85 ॥**

తర్వాత శంకరార్ధ శరీరాన్ని పొందిన లోకమాత హిమవత్పుత్రిక అయిన పార్వతి హృషీకేశుడైన కృష్ణునితో ఇట్లన్నది.

**అహంజానే తవానన్త నిశ్చలాం సర్వదాచ్యుత ।**
**అనన్యా మీశ్వరే భక్తి మాత్మన్యపి చ కేశవ ॥ 86 ॥**

అచ్యుతా! కేశవా! నీ నిశ్చలము, అనంతము, అనన్యము, అయిన భక్తి ఈశ్వరుని యందు, నా యందు కూడ ఉన్నదని నాకు తెలియును.

**త్వం హి నారాయణః సాక్షా త్సర్వాత్మా పురుషోత్తమః ।**
**ప్రార్థితో దైవతైః పూర్వం సంజాతో దేవకీసుతః ॥ 87 ॥**

నీవు సాక్షాన్నారాయణుడవు, పురుషోత్తముడవు, సర్వాత్మకుడవు. పూర్వం దేవతలు ప్రార్థించగా దేవకీ సుతుడవై జన్మించినావు.

**పశ్యత్వ మాత్మనాత్మానమాత్మానం మమ సమ్ప్రతి ।**
**నావయో ర్విద్యతే భేద ఏకం పశ్యన్తి సూరయః ॥ 88 ॥**

నీవిపుడు ఆత్మతో ఆత్మస్వరూపాన్ని చూడు. నన్ను కూడ దర్శించు. మన ఇద్దరిలో భేదం లేదు. పండితులు మనను ఒక్క రూపంగానే చూస్తారు.

**ఇమానిహ వరానిష్టాన్మత్తో గృహ్ణీష్వ కేశవ ।**
**సర్వజ్ఞత్వం తథైశ్వర్యం జ్ఞానం తత్పారమేశ్వరమ్ ॥ 89 ॥**

**ఈశ్వరే నిశ్చలాం భక్తిమాత్మన్యపి పరం బలమ్ ।**
**ఏవముక్తస్తయా కృష్ణో మహాదేవ్యా జనార్దనః ॥ 90 ॥**

**ఆదేశం శిరసా గృహ్య దేవోఽప్యాహ తథేశ్వరమ్ ।**
**ప్రగృహ్య కృష్ణం భగవాన థేశః కరేణ దేవ్యా సహ దేవదేవః ।**
**సమ్పూజ్యమానో మునిభిః సురేశై ర్జగామ కైలాసగిరిం గిరీశః ॥ 91 ॥**

"కేశవా! నీకు ఇష్టమైన వరాలు నేనిస్తున్నాను. సర్వజ్ఞత్వం, ఐశ్వర్యం, పారమేశ్వరజ్ఞానం, ఈశ్వరుని యందు నిశ్చలమైన భక్తి నీలో సర్వోత్తమశక్తి అనే వరాలను గ్రహించు". అని మహాదేవి చెప్పగా జనార్దనుడైన కృష్ణుడు ఆమె ఆదేశాన్ని శిరసా స్వీకరించి ఈశ్వరునితో అట్లే అన్నాడు. తర్వాత భగవంతుడైన శంకరుడు పార్వతితో కలిసి, తన చేతితో కృష్ణుని పట్టుకొని దేవతలు మునులు పూజింపగా కైలాసపర్వతానికి వెళ్ళినాడు.

**ఇతి శ్రీ కూర్మపురాణే యదువంశానుకీర్తనే కృష్ణతపశ్చరణం నామ పఞ్చవింశోఽధ్యాయః॥ 25॥**

శ్రీ కూర్మపురాణంలో యదువంశానుకీర్తనంలో కృష్ణ తపశ్చరణమనే ఇరవై అయిదవ అధ్యాయం.॥ 25॥



## షడ్వింశోఽధ్యాయః - ఇరవై ఆరవ అధ్యాయం

## లింగోత్పత్తిః - లింగోత్పత్తి

**సూత ఉవాచ :**-సూతుడు పలికాడు

**ప్రవిశ్య మేరుశిఖరం కైలాసం కనకప్రభమ్ ।**
**రరామ భగవాన్ సోమః కేశవేన మహేశ్వరః ॥ 1 ॥**

భగవంతుడైన మహేశ్వరుడు మేరుపర్వతశిఖరంలోని బంగారుకాంతులు గల కైలాసాన్ని ప్రవేశించి కేశవునితో కూడ విహరించినాడు.

**అపశ్యంస్తే మహాత్మానం కైలాసగిరివాసినః ।**
**పూజయాఞ్చక్రిరే కృష్ణం దేవదేవ మివాచ్యుతమ్ ॥ 2 ॥**

కైలాసవాసులు మహాత్ముడు, అచ్యుతుడైన కృష్ణుని చూచినారు. దేవదేవుడు శంకరుని వలెనే అతనిని కూడ పూజించినారు.

**చతుర్బాహు ముదారాఙ్గం కాలమేఘసమప్రభమ్ ।**
**కిరీటినం శార్ఙ్గపాణిం శ్రీవత్సాఙ్కితవక్షసమ్ ॥ 3 ॥**

**దీర్ఘబాహుం విశాలాక్షం పీతవాససమచ్యుతమ్ ।**
**దధాన మురసా మాలాం వైజయన్తీమనుత్తమామ్ ॥ 4 ॥**

**భ్రాజమానం శ్రియా దేవ్యా యువానమతికోమలమ్ ।**
**పద్మాంఘ్రిం పద్మనయనం సస్మితం సద్గతిప్రదమ్ ॥ 5 ॥**

నాలుగు భుజాలు కల్గి శ్రేష్ఠమైన శరీరం, నీలమేఘంవంటి కాంతిగలవాడై, కిరీటం శార్ఙ్గం ధరించి వక్షఃస్థలంలో శ్రీవత్సచిహ్నం ప్రకాశిస్తూ కేశవుడున్నాడు. పొడవు భుజాలు, విశాలమైన కన్నులు, పీతాంబరధారి, అవినాశి, వక్షఃస్థలంపై వైజయంతిమాల ధరించినవాడు, లక్ష్మీదేవితో ప్రకాశిస్తున్నవాడు, తరుణవయస్కుడు, సుకుమారుడు, పాదాలు కన్నులు పద్మాలవలె ఉన్నవాడు, చిరునవ్వు గల్గి పుణ్యగతి నిచ్చే కేశవుని వారు పూజించినారు.

**కదాచిత్తత్ర లీలార్థం దేవక్యానన్దవర్ధనః ।**
**భ్రాజమానఃశ్రియా కృష్ణ శ్చచార గిరికన్దరమ్ ॥ 6 ॥**

ఒకానొక సమయంలో దేవకి సంతోష వర్ధనుడు, శ్రీ కృష్ణుడు ప్రకాశమానుడై విలాసార్థం అక్కడి పర్వత గుహల్లో సంచరించినాడు.

**గన్ధర్వాప్సరసాం ముఖ్యా నాగకన్యాశ్చ కృత్స్నశః ।**
**సిద్ధాయక్షాశ్చ గన్ధర్వా దేవా స్తం చ జగన్మయమ్ ॥7॥**

**దృష్ట్వాశ్చర్యం పరం గత్వా హర్షాదుత్ఫుల్లలోచనాః ।**
**ముముచుః పుష్పవర్షాణి తస్య మూర్ధ్ని మహాత్మనః ॥ 8 ॥**

గంధర్వుల్లో అప్సరసల్లో ముఖ్యులు, నాగకన్యలు, సిద్ధయక్ష గంధర్వులు, సర్వదేవతలు, విశ్వాత్మకుడైన కృష్ణుని చూచి మిక్కిలి ఆశ్చర్యాన్ని పొంది సంతోషంతో కనులు విప్పార్చి ఆ మహాత్ముడైన కృష్ణుని శిరసుపై పుష్పవర్షాన్ని కురిపించినారు.

**గన్ధర్వకన్యకా దివ్యా స్తద్వదప్సరసో వరాః ।**
**దృష్ట్వా చకమిరే కృష్ణం సుస్తుతం శుచిభూషణాః ॥ 9 ॥**

శ్రేష్ఠలైన గంధర్వకన్యలు, ఉత్తమ అప్సరసలు, శుభ్రమైన ఆభరణాలు ధరించి స్తుతిపాత్రుడైన కృష్ణుని కామించారు.

**కాశ్చిద్గాయన్తి వివిధం గానం గీతవిశారదాః ।**
**సంప్రేక్ష్య దేవకీసూనుం సున్దరం కామమోహితాః ॥ 10 ॥**

పాడటంలో నైపుణ్యం కల్గిన కొందరు సుందరుడైన దేవకీనందనుడు కృష్ణుని చూచి మోహాన్ని పొంది అనేక రకాలైన పాటలు పాడినారు.

**కాశ్చిద్విలాసబహులా నృత్యన్తిస్మ తదగ్రతః ।**
**సంప్రేక్ష్య సస్మితం కాశ్చిత్పపుస్తద్వదనామృతమ్ ॥ 11 ॥**

**కాశ్చిద్భూషణవర్యాణి స్వాఙ్గా దాదాయసాదరమ్ ।**
**భూషయాఞ్చక్రిరే కృష్ణం కన్యాలోకవిభూషణమ్ ॥ 12 ॥**

విలాసవతులు కొందరుఆయన ఎదుట నాట్యం చేసినారు. మరికొందరా కృష్ణుని చూచి చిరునవ్వుతో అతనిని ముద్దుగొని అధరామృతపానం చేసినారు. మరి కొంతమంది కన్యలు తమ ఆభరణాలు తీసి లోకవిభూషణుడైన కృష్ణునికి సాదరంగా అలంకరించినారు.

**కాశ్చిద్భూషణ వర్యాణి సమాదాయ తదఙ్గతః ।**
**స్వాత్మానం భూషయామాసుః స్వాత్మకైరపి మాధవమ్ ॥ 13 ॥**

ఇంకా కొందరు స్త్రీలు కృష్ణుని శరీరం నుండి వెలగల నగలు తీసుకొని తామలంకరించుకొన్నారు. తమ నగలతో అతని నలంకరించినారు.

**కాచిదాగత్య కృష్ణస్య సమీపం కామమోహితా ।**
**చుచుమ్బ వదనామ్భోజం హరే ర్ముగ్ధమృగేక్షణా ॥ 14 ॥**

ముగ్ధ మృగేక్షణ ఒకతె కృష్ణుని చేరి కామమోహితయై అతని ముఖపద్మాన్ని చుంబించినది.

**ప్రగృహ్య కాచిద్గోవిన్దం కరేణ భవనం స్వకమ్ ।**
**ప్రాపయామాస లోకాదిం మాయయా తస్య మోహితా ॥ 15 ॥**

**తాసాం స భగవాన్ కృష్ణః కామా న్కమలలోచనః ।**
**బహూని కృత్వా రూపాణి పూరయామాస లీలయా ॥ 16 ॥**

మరొక తరుణి కృష్ణుడిమాయతో మోహాన్ని పొంది అతన్ని తన చేత పట్టుకొని తన భవనంలోకి తీసుకొని వెళ్లింది. పద్మనేత్రుడు భగవంతుడైన కృష్ణుడు అనేక రూపాలు దాల్చి ఆ స్త్రీల కోరికలు తీర్చినాడు.

**ఏవం వై సుచిరం కాలం దేవదేవపురే హరిః ।**
**రేమే నారాయణః శ్రీమాన్ మాయయా మోహయన్జగత్ ॥ 17 ॥**

అట్లా చాలా రోజులు దేవదేవుడు శ్రీమంతుడైన నారాయణుడు తన మాయతో ప్రపంచాన్ని మోహింప చేస్తూ శివుని పట్టణంలో విహరించినాడు.

**గతే బహుతిథే కాలే ద్వారవత్యా నివాసినః ।**
**బభూవు ర్వికలా భీతా గోవిన్దవిరహే జనాః ॥ 18 ॥**

చాలాకాలం గడచిపోగా ద్వారకానగరంలోని ప్రజలు కృష్ణవిరహంవల్ల భయంతో కలత చెందినారు.

**తతః సుపర్ణో బలవాన్పూర్వమేవ విసర్జితః ।**
**స కృష్ణం మార్గమాణస్తు హిమవన్తం యయౌ గిరిమ్ ॥ 19 ॥**

తర్వాత అంతకుముందే పనుపు(ఆజ్ఞ)నందిన బలవంతుడు, గరుత్మంతుడు శ్రీకృష్ణుని వెతుకుతూ హిమాలయ పర్వతానికి వెళ్ళినాడు.

**అదృష్ట్వా తత్ర గోవిన్దం ప్రణమ్య శిరసా మునిమ్ ।**
**ఆజగామోపమన్యుం తం పురీం ద్వారవతీం పునః ॥ 20 ॥**

అక్కడ శ్రీ కృష్ణుడు కన్పించనందువల్ల అక్కడున్న ఉపమన్యమునికి నమస్కరించి మళ్ళీ ద్వారకా నగరానికి తిరిగివచ్చినాడు.

**తదన్తరే మహాదైత్యా రాక్షసాశ్చాతిభీషణాః ।**
**ఆజగ్ము ర్ద్వారకాం శుభ్రాం భీషయన్తః సహస్రశః ॥ 21 ॥**

ఈ లోపల వేలకొలది భయంకరులైన మహాదైత్యులు, రాక్షసులు నిర్మలమైన ద్వారకా నగరానికి వచ్చినారు.

**స తాన్సుపర్ణో బలవాన్ కృష్ణ తుల్య పరాక్రమః ।**
**హత్వా యుద్ధేన మహతా రక్షతిస్మ పురీం శుభామ్ ॥ 22 ॥**

అపుడు బలవంతుడు, కృష్ణపరాక్రమం కల గరుడుడు ఘోరయుద్ధ మాచరించి ఆ రాక్షసులను చంపి ద్వారకను కాపాడినాడు.

**ఏతస్మిన్నేవ కాలే తు నారదో భగవానృషిః ।**
**దృష్ట్వా కైలాసశిఖరే కృష్ణం ద్వారవతీం గతః ॥ 23 ॥**

ఆ సమయంలో పూజ్యనారదమహర్షి కైలాసపర్వతశిఖరంపై శ్రీ కృష్ణుని చూచి ద్వారకానగరానికి వెళ్ళినాడు.

**తే దృష్ట్వా నారదమృషిం సర్వే తత్ర నివాసినః ।**
**ప్రోచు ర్నారాయణో నాథః కుత్రాస్తే భగవాన్హరిః ॥ 24 ॥**

అపుడు ద్వారకలోని జనులందరు ఆ నారదుని చూచి మాకు రక్షకుడు, భగవంతుడైన కృష్ణుడెక్కడ ఉన్నాడని ప్రశ్నించినారు.

**స తానువాచ భగవాన్కైలాస శిఖరే హరిః ।**
**రమతేఽద్య మహాయోగీ తం దృష్ట్వాహ మిహాగతః ॥ 25 ॥**

నారదుడు వారితో మహాయోగి, భగవంతుడైన కృష్ణుడు ఇపుడు కైలాసశిఖరంలో విహరిస్తున్నాడు. నేనాయనను చూచి ఇక్కడికి వచ్చినాను అని చెప్పినాడు.

**తస్యోపశ్రుత్య వచనం సుపర్ణః పతతాం వరః ।**
**జగామాకాశగో విప్రాః! కైలాసం గిరిముత్తమమ్ ॥ 26 ॥**

ద్విజులారా! ఆ నారదుని మాట విని పక్షిరాజైన గరుత్మంతుడు వెంటనే ఆకాశమార్గంగా శ్రేష్ఠమైన కైలాస పర్వతానికి వెళ్ళినాడు.

**దదర్శ దేవకీసూనుం భవనే రత్నమణ్డితే ।**
**తత్రాసనస్థం గోవిన్దం దేవదేవాన్తికే హరిమ్ ॥ 27 ॥**

అక్కడ రత్నాలంకృతమైన భవనంలో దేవదేవుడైన శివుని సమీపంలో కూర్చున్న కృష్ణుని గరుడుడు చూచినాడు.

**ఉపాస్యమాన మమరై ర్దివ్యస్త్రీభిః సమన్తతః ।**
**మహాదేవగణైః సిద్ధై ర్యోగిభిః పరివారితమ్ ॥ 28 ॥**

**ప్రణమ్య దణ్డవద్భూమౌ సుపర్ణః శఙ్కరం శివమ్ ।**
**నివేదయామాస హరిం ప్రవృత్తం ద్వారకా పురే ॥ 29 ॥**

అప్పుడక్కడ కృష్ణుడు దేవతలు, దేవతాస్త్రీలు సేవిస్తుండగా దేవతాగణాలు, సిద్ధులు, యోగులు అతనిని చుట్టి ఉన్నారు. గరుడుడు మంగళప్రదుడైన శివునకు సాగిలపడి ద్వారకలో జరిగిన వృత్తాంతాన్ని శ్రీకృష్ణునకు విన్నవించినాడు.

**తతః ప్రణమ్య శిరసా శఙ్కరం నీలలోహితమ్ ।**
**ఆజగామ పురీం కృష్ణః సోఽనుజ్ఞాతో హరేణ తు ॥ 30 ॥**

తర్వాత కృష్ణుడు నీలలోహితుడైన శంకరునకు శిరసా నమస్కరించి అతని ఆజ్ఞను పొంది తన ద్వారకకు తిరిగి వచ్చినాడు.

**ఆరుహ్య కశ్యపసుతం స్త్రీగణై రభిపూజితః ।**
**వచోభి రమృతాస్వాదై ర్మానితో మధుసూదనః ॥ 31 ॥**

**వీక్ష్య యాన్త మమిత్రఘ్నం గన్ధర్వాప్సరసాం వరాః ।**
**అన్వగచ్ఛ న్మహాయోగం శఙ్ఖచక్రగదాధరమ్ ॥ 32 ॥**

అమృతం వంటి మధురమైన మాటలతో అక్కడిస్త్రీలచే పూజింపబడి శ్రీహరి సత్కృతుడు, కశ్యప ప్రజాపతి పుత్రుడు అగు గరుత్మంతునెక్కి వెళ్లుచుండగా శత్రునాశకుడు మహాయోగి శంఖ చక్రగదాధరుడైన కృష్ణుని చూచి గంధర్వులు అప్సరసలు కూడా అనుగమించినారు.

**విసర్జయిత్వా విశ్వాత్మా సర్వా ఏవాఙ్గనా హరిః ।**
**యయౌ స తూర్ణం గోవిన్దో దివ్యాం ద్వారవతీం పురీమ్ ॥ 33 ॥**

విశ్వాత్ముడైన కృష్ణుడు ఆ స్త్రీలను వీడ్కొని త్వరగా తన ద్వారకా నగరానికి వెళ్ళినాడు.

**గతే దేవేఽసురరిపౌ న కామిన్యో మునీశ్వరాః ।**
**నిశేవ చన్ద్రరహితా వినా తేన చకాశిరే ॥ 34 ॥**

దానవారి శ్రీకృష్ణుడు అక్కడినుండి వెళ్ళిపోగా చంద్రుడులేని రాత్రివలె అక్కడి మునులు, స్త్రీలు కూడ ప్రకాశించలేదు.

**శ్రుత్వా పౌరజనాస్తూర్ణం కృష్ణాగమనముత్తమమ్ ।**
**మణ్డయాఞ్చక్రిరే దివ్యాం పురీం ద్వారవతీం శుభామ్ ॥ 35 ॥**

ద్వారకా పట్టణంలోని ప్రజలు తమ కృష్ణాగమన వృత్తాంతాన్ని విని వెంటనే దివ్యమైన ద్వారకానగరాన్ని పుష్పమాలికలతో అలంకరించినారు.

**పతాకాభి ర్విశాలాభి ర్ధ్వజై రన్తర్బహిః కృతైః ।**
**మాలాదిభిః పురీం రమ్యాం భూషయాఞ్చక్రిరే జనాః ॥ 36 ॥**

విశాలములైన పతాకాలతో లోపల బయట కూడ ధ్వజాలు నెలకొల్పి పుష్పహారాలు మొదలైన వాటితో రమ్యమైన నగరాన్ని ప్రజలలంకరించినారు.

**అవాదయన్త వివిధా న్వాదిత్రా న్మధురస్వనాన్ ।**
**శంఖాన్ సహస్రశో దధ్ము ర్వీణావాదాన్ వితేనిరే ॥ 37 ॥**

శ్రావ్యమైన ధ్వనిగల వివిధవాద్యాలను మ్రోగించినారు. వేల శంఖాల నూదినారు. వీణా వాదనలను గావించినారు.

**ప్రవిష్టమాత్రే గోవిన్దే పురీం ద్వారవతీం శుభామ్ ।**
**అగాయన్మధురం గానం స్త్రియో యౌవనశోభితాః ॥ 38 ॥**

గోవిందుడు శుభకరమైన ద్వారకా నగరాన్ని ప్రవేశించగానే యువతులైన స్త్రీలు మధురమైన పాటలు పాడినారు.

**దృష్ట్వా ననృతు రీశానం స్థితాః ప్రాసాదమూర్ధసు ।**
**ముముచుః పుష్పవర్షాణి వసుదేవసుతోపరి ॥ 39 ॥**

తమ ప్రభువైన కృష్ణుని చూచి స్త్రీలు మేడల పై భాగాల్లో నిలిచి నృత్యం చేసినారు. వసుదేవపుత్రుని పై పువ్వులవాన కురిపించినారు.

**ప్రవిశ్య భగవాన్కృష్ణ స్త్వాశీర్వాదాభివర్ధితః ।**
**వరాసనే మహాయోగీ భాతి దేవీభిరన్వితః ॥ 40 ॥**

భగవంతుడైన కృష్ణుడు నగరం ప్రవేశించి ఆశీర్వాదమంత్రాలతో అభినందింపబడినాడు. గొప్పయోగి అయిన అతడు తన భార్యలతో కూడ ఉత్తమాసనం పై కూర్చొని శోభించాడు.

**సురమ్యే మణ్డపే శుభ్రే శంఖాద్యైః పరివారితః ।**
**ఆత్మజై రభితోముఖ్యైః స్త్రీసహస్రైశ్చ సంవృతః ॥ 41 ॥**

మిక్కిలి రమ్యమైన మంటపంలో శంఖచక్రాదులతో కూడినవాడై ముఖ్యులైన వేలాది స్త్రీలతో, పుత్రులతో కృష్ణుడు ఉన్నాడు.

**తత్రాసనవరే రమ్యే జాంబవత్యా సహాచ్యుతః ।**
**భ్రాజతే చోమయా దేవో యథా దేవ్యా సమన్వితః ॥ 42 ॥**

అక్కడ మనోజ్ఞమైన ఆసనం పై జాంబవతితో కలిసి కూర్చున్న కృష్ణుడు పార్వతితో కూడిన మహాదేవుడు శివుని వలె ప్రకాశించినాడు.

**ఆజగ్ముర్దేవగన్ధర్వా ద్రష్టుం లోకాది మవ్యయమ్ ।**
**మహర్షయః పూర్వజాతా మార్కణ్డేయాదయో ద్విజాః ॥ 43 ॥**

లోకాది, పురుషుడు, అవ్యయుడు అయిన కృష్ణుని చూడటానికి దేవతలు, గంధర్వులు, ప్రాచీన మార్కండేయాది మహర్షులు అక్కడకు వచ్చినారు.

**తతః స భగవాన్ కృష్ణో మార్కండేయం సమాగతమ్ ।**
**ననామోత్థాయ శిరసా స్వాసనం చ దదౌ హరిః ॥ 44 ॥**

మహాత్ముడైన కృష్ణుడు తన వద్దకు వచ్చిన మార్కండేయుని చూచి తన ఆసనంనుండి లేచి శిరసా నమస్కరించి, అతనికి శ్రేష్ఠమైన ఆసనాన్నిచ్చినాడు.

**సంపూజ్య తానృషిగణాన్ ప్రణామేన సహానుగః ।**
**విసర్జయామాస హరిర్దత్వా తదభివాఞ్ఛితాన్ ॥ 45 ॥**

కృష్ణుడు తన అనుచరులతో కూడ ఋషిసమూహాన్ని నమస్కారంతో గౌరవించి వారి కోరికలు తీర్చి పంపించినాడు.

**తదా మధ్యాహ్నసమయే దేవదేవః స్వయం హరిః ।**
**స్నాతః శుక్లామ్బరో భాను ముపతిష్ఠ న్కృతాఞ్జలిః ॥ 46 ॥**

**జజాప జాప్యం విధివత్ ప్రేక్షమాణో దివాకరమ్ ।**
**తర్పయామాస దేవేశో దేవాన్పితృగణాన్మునీన్ ॥ 47 ॥**

అప్పటికి మధ్యాహ్న సమయమయినందున దేవదేవుడైన కృష్ణుడు స్నానమాచరించి నిర్మలమైన వస్త్రాలు ధరించి స్వయంగా సూర్యుని ఉపాసించి దోసిలి పట్టి సూర్యుని చూస్తూ జపించవలసిన మంత్రాన్ని విధిప్రకారం జపించినాడు. దేవాధిదేవుడైన కృష్ణుడు దేవతలకు, పితృదేవతలకు, ఋషులకు తర్పణాలు వదిలినాడు.

**ప్రవిశ్య దేవభవనం మార్కణ్డేయేన చైవ హి ।**
**పూజయామాస లిఙ్గస్థం భూతేశం భూతిభూషణమ్ ॥ 48 ॥**

తర్వాత మార్కండేయునితో కూడ దేవమందిరాన్ని ప్రవేశించి భూతపతి, భస్మాలంకారుడైన లింగరూపుడు శివుని పూజించినాడు.

**సమాప్య నియమం సర్వం నియన్తా స స్వయం నృణామ్ ।**
**భోజయిత్వా మునివరం బ్రాహ్మణానభిపూజ్య చ ॥ 49 ॥**

**కృత్వాత్మయోగం విప్రేన్ద్రా! మార్కణ్డేయేన చాచ్యుతః ।**
**కథాం పౌరాణికీం పుణ్యాం చక్రే పుత్రాదిభిర్వృతః ॥ 50 ॥**

తాను స్వయంగా నరులకు శాసకుడై కూడ సర్వనియమాలను పాటించి ఆ మునీశ్వరుని భుజింప చేసి బ్రాహ్మణులను గౌరవించి ఓ విప్రులారా! ఆత్మయోగాన్నవలంబించి కృష్ణుడు కుమారులతో కూడి ఉన్నవాడై మార్కండేయునితో పురాణ పుణ్యకథాప్రసంగమొనర్చినాడు.

**అథై తత్సర్వమఖిలం దష్ట్వా కర్మ మహామునిః ।**
**మార్కండేయో హస న్కృష్ణం బభాషే మధురం వచః ॥ 51 ॥**

ఈ సమస్తకర్మను గమనించి మహాముని మార్కండేయుడు నవ్వుతూ కృష్ణుని గూర్చి మధురమైన మాటలు పలికాడు.

**మార్కణ్డేయ ఉవాచ :–** మార్కండేయుడు పలికాడు

**కఃసమారాధ్యతే దేవో భవతా కర్మభిః శుభైః ।**
**బ్రూహి త్వం కర్మభిః పూజ్యో యోగినాం ధ్యేయ ఏవ చ ॥ 52 ॥**

కర్మలతో పూజింపతగినవాడవూ, యోగులకు ధ్యానింపదగినవాడవూ అయిన కృష్ణా! నీవే చెప్పుము. శుభకర్మలతో నీవెవరిని ఆరాధిస్తున్నావు?

**త్వం హి తత్పరమం బ్రహ్మ నిర్వాణ మమలం పదమ్ ।**
**భారావతరణార్థాయ జాతో వృష్ణికులే ప్రభుః ॥ 53 ॥**

**తమబ్రవీ న్మహాబాహుః కృష్ణో బ్రహ్మవిదాం వరః ।**
**శృణ్వతామేవ పుత్రాణాం సర్వేషాం ప్రహసన్నివ ॥ 54 ॥**

శ్రేష్ఠమైన బ్రహ్మస్వరూపానివి నీవే. నిర్మలమైన మోక్షరూప గమ్యానివి నీవే. ప్రపంచభారాన్ని తొలగించటానికి వృష్ణివంశంలో జన్మించిన భగవంతుడవు నీవే. బ్రహ్మవేత్తల్లో శ్రేష్ఠుడైన కృష్ణుడు ఆ మాటలు విని తన కుమారులు వింటుండగా నవ్వుతూ మార్కండేయునితో ఇట్లన్నాడు.

**శ్రీభగవానువాచ :-** భగవంతుడు పలికాడు.

**భవతా కథితం సర్వం తథ్యమేవ న సంశయః ।**
**తథాఽపి దేవమీశానం పూజయామి సనాతనమ్ ॥ 55 ॥**

మీరు చెప్పినదంతా యథార్థమే. సందేహం లేదు. అయినా నేను సనాతనుడు, భగవంతుడైన ఈశ్వరుని పూజిస్తున్నాను.

**న మే విప్రాస్తి కర్తవ్యం నానవాప్తం కథఞ్చన ।**
**పూజయామి తథాఽపీశం జానన్వై పరమం శివమ్ ॥ 56 ॥**

“ఓ ద్విజుడా! నేను చేయదగిన విధేదీ లేదు. నేను పొందనది కూడా ఏదీలేదు. అయినా ఈశ్వరుడు పరదైవతమని తెలిసి ఆయన పూజ చేస్తున్నాను”.

**న వై పశ్యన్తి తే దేవం మాయయా మోహితా జనాః ।**
**తతశ్చైవాత్మనో మూలం జ్ఞాపయన్ పూజయామి తమ్ ॥ 57 ॥**

మాయతో మోహాన్ని పొందిన ప్రజలు ఆ దేవుని తత్త్వాన్ని గుర్తించలేరు. అందువల్ల ఆత్మకు కారణభూతుడైన వాడని తెల్పటానికే నేను ఆ ఈశ్వరుని అర్చిస్తున్నాను.

**న చ లిఙ్గార్చనాత్పుణ్యం లోకే దుర్గతినాశనమ్ ।**
**తథా లిఙ్గే హితాయైషాం లోకానాం పూజయేచ్ఛివమ్ ॥ 58 ॥**

“ఈ లోకంలో దుర్గతిని నశింప చేసే వానిలో లింగార్చన కంటె శ్రేష్ఠమైనది మరొకటి లేదు. అందువల్ల లోకాల మేలుకోరి లింగరూపంలో ఉన్న శివుణ్ణి పూజించాలి”.

**యోఽహం తల్లిఙ్గ మిత్యాహు ర్వేదవాదవిదో జనాః ।**
**తతోఽహ మాత్మనీశానం పూజయామ్యాత్మనైవ తత్ ॥ 59 ॥**

వేదాల్లోని సిద్ధాంతాలు తెలిసిన పండితులు ఆ లింగస్వరూపుణ్ణి నేనని చెపుతారు. ఆ కారణం వల్ల నా ఆత్మస్వరూపుడైన ఈశ్వరుని నా ఆత్మలోనే పూజిస్తున్నాను.

**తస్యైవ పరమా మూర్తి స్తన్మయోఽహం న సంశయః ।**
**నావయో ర్విద్యతే భేదో వేదేష్వేత న్నసంశయః ॥ 60 ॥**

ఆ ఈశ్వరుని శ్రేష్ఠరూపాంతరమైన నేను అతని స్వరూపుమైనవాణ్ణే. ఇందులో సందేహం లేదు. మా ఇద్దరికి భేదమే లేదు. వేదాల్లో ఈ విషయం సందేహం లేకుండా చెప్పనైనది.

**ఏష దేవో మహాదేవః సదా సంసారభీరుభిః ।**
**యాజ్యః పూజ్యశ్చ వన్ద్యశ్చ జ్ఞేయో లిఙ్గే మహేశ్వరః ॥ 61 ॥**

మహాదేవుడైన ఈ శివుడు సంసారబంధంవల్ల భయపడే జనులచే ఎల్లపుడు పూజింపదగినవాడు. యజ్ఞంతో అర్చింపతగినవాడు. నమస్కరింపదగినవాడు. లింగంలో మహేశ్వరుడున్నాడని తెలియదగినవాడు.

**మార్కణ్డేయ ఉవాచ :**–మార్కండేయుడు పలికాడు.

**కిం తల్లిఙ్గం సురశ్రేష్ఠ! లిఙ్గే సంపూజ్యతే చ కః ।**
**బ్రూహి కృష్ణ! విశాలాక్ష! గహనం హ్యేత దుత్తమమ్ ॥ 62 ॥**

ఓ దేవతల్లో శ్రేష్ఠుడవైన కృష్ణా! ఆ లింగమేమిటి? లింగాకారంలో పూజించేదెవరిని? విశాలాక్షా ! కృష్ణా! శ్రేష్ఠమైనదీ, తెలియవీలుగాని ఈ విషయాన్ని మాకు తెలియజెప్పుము.

**శ్రీభగవానువాచ :**– శ్రీకృష్ణుడు పలికాడు

**అవ్యక్తం లిఙ్గమిత్యాహు రానన్దం జ్యోతిరక్షయమ్ ।**
**వేదా మహేశ్వరం దేవ మాహుర్లిఙ్గినమవ్యయమ్ ॥ 63 ॥**

పరమేశ్వరుని అవ్యక్తరూపాన్నే లింగమంటారు. ఆ లింగరూపం ఆనందస్వరూపం. అవ్యయమైన జ్యోతి. వేదాలు భగవంతుడైన మహేశ్వరుని అవ్యయుడైన లింగరూపునిగా వర్ణిస్తున్నాయి.

**పురా చైకార్ణవే ఘోరే నష్టే స్థావరజఙ్గమే ।**
**ప్రబోధార్థం బ్రహ్మణో మే ప్రాదు ర్భూతో మహాశివః ॥ 64 ॥**

**తస్మాత్కాలా త్సమారభ్య బ్రహ్మా చాహం సదైవ హి ।**
**పూజయావో మహాదేవం లోకానాం హితకామ్యయా ॥ 65 ॥**

పూర్వకాలంలో ప్రపంచంలోని స్థావరజంగమాలన్నీ భయంకరంగా ప్రపంచవ్యాప్తమైన సముద్రంలో నాశం చెందగా బ్రహ్మను మేల్కొలుపటానికి మహాశివుడు నాకు సాక్షాత్కరించినాడు. అది మొదలుకొని బ్రహ్మదేవుడు నేను లోకాలమేలు కోరి మహాదేవుడైన శివుణ్ణి ఎల్లపుడు పూజిస్తున్నాము.

**మార్కణ్డేయ ఉవాచ :–** మార్కండేయుడు పలికాడు

**కథం లిఙ్గమభూత్పూర్వ మైశ్వరం పరమం పదమ్ ।**
**ప్రబోధార్థం స్వయం కృష్ణ వక్తుమర్హసి సాంప్రతమ్ ॥ 66 ॥**

"ఓ కృష్ణా! ప్రాచీనకాలంలో ఈశ్వరసంబంధమైన ఉత్తమస్థానమైన లింగం మేల్కొల్పుటానికెట్లా ఆవిర్భవించిందో నీవు ఇపుడు చెప్పవలసినది".

**శ్రీభగవానువాచ :–**శ్రీ కృష్ణుడిట్లా పలికాడు.

**ఆసీదేకార్ణవం ఘోర మవిభాగం తమోమయమ్ ।**
**మధ్యే చైకార్ణవే తస్మింఛ్ఛంఖచక్రగదాధరః ॥ 67 ॥**

**సహస్రశీర్షా భూత్వాఽహం సహస్రాక్షః సహస్రపాత్ ।**
**సహస్రబాహుః పురుషః శయితోఽహం సనాతనః ॥ 68 ॥**

పూర్వకాలంలో ప్రపంచమంతా విభాగాలు లేనిది, చీకటి నిండిన ఒకే సముద్రంగా ఉంది. ఆ అఖండ సముద్రం మధ్యలో శంఖ చక్ర గదలను ధరించినవాడనై వేయితలలు, వేయి కనులు, వేయి పాదాలు, వేయి భుజాలు కల్గిన పురుషునిగా నేను ఆవిర్భవించి సనాతన రూపంతో సముద్రంలో శయనించాను.

**ఏతస్మిన్నన్తరే దూరే పశ్యామి హ్యమితప్రభమ్ ।**
**కోటిసూర్యప్రతీకాశం భ్రాజమానం శ్రియావృతమ్ ॥ 69 ॥**

అంతలో దూరప్రదేశమందు అపరిమిత కాంతి కలది, కోటి సూర్యకాంతితో సమానమైన సంపదతో ప్రకాశించే ఒక తేజస్సును చూచినాను.

**చతుర్వక్త్రం మహాయోగం పురుషం కారణం ప్రభుమ్ ।**
**కృష్ణాజినధరం దేవ మృగ్యజుస్సామభిః స్తుతమ్ ॥ 70 ॥**

**నిమేషమాత్రేణ స మాం ప్రాప్తో యోగవిదాం వరః ।**
**వ్యాజహార స్వయం బ్రహ్మా స్మయమానో మహాద్యుతిః ॥ 71 ॥**

నాల్గుముఖాలు కల్గి గొప్ప యోగశక్తిగల ప్రభువు, జింకచర్మాన్ని ధరించి నాల్గువేదాలతో కొనియాడబడే కారణభూతుడైన పరమేశ్వరుడే ఆ తేజోరాశి. యోగవిదుల్లో శ్రేష్ఠుడైన ఆ పరమేశ్వరుడు ఒక నిమేషకాలంలో నన్ను చేరుకున్నాడు. గొప్ప తేజస్వి ఆ బ్రహ్మ చిరునవ్వుతో స్వయంగా ఇట్లన్నాడు.

**కస్త్వం కుతో వా కిఞ్చేహ తిష్ఠసే వద మే ప్రభో ।**
**అహం కర్తా హి లోకానాం స్వయమ్భూః ప్రపితామహః ॥ 72 ॥**

**ఏవ ముక్త స్తదా తేన బ్రహ్మణాహమువాచ హ ।**
**అహం కర్తాస్మి లోకానాం సంహర్తా చ పునః పునః ॥ 73 ॥**

"ఓ ప్రభూ! నీవెవరవు? ఎక్కడ నుండి వచ్చినావు? ఏ కారణంగా ఇక్కడ నిలిచినావు నాకు తెలుపు. నేను స్వయంగా అవతరించినాను. ప్రపితామహుడను. లోకాలకు సృష్టికర్తను. ఈ విధంగా ఆ బ్రహ్మ చెప్పగా నేనాతనితో ఈ లోకాలన్నింటిని మళ్ళీ మళ్ళీ సృష్టించి నశింప చేసేవాడను నేను" అని చెప్పాను.

**ఏవం వివాదే వితతే మాయయా పరమేష్ఠినః ।**
**ప్రబోధార్థం పరం లిఙ్గం ప్రాదుర్భూతం శివాత్మకమ్ ॥ 74 ॥**

ఆ పరమేష్ఠి మాయవల్ల మాయిద్దరి మధ్య వివాద మేర్పడగా మమ్మల్ని జ్ఞానులను చేయుటకై శివస్వరూప లింగాకారం అక్కడ సాక్షాత్కరించినది.

**కాలానలసమప్రఖ్యం జ్వాలామాలాసమాకులమ్ ।**
**క్షయవృద్ధి వినిర్ముక్త మాదిమధ్యాన్తవర్జితమ్ ॥ 75 ॥**

ఆ లింగమూర్తి ప్రళయాగ్నిసమతేజస్సు కల్గి జ్వాలామాలలా ఆవరించినది. పెరుగుదల తరుగుదల లేనిది. మధ్యాంత విభాగం లేనిది.

**తతో మామాహ భగవానథో గచ్ఛ త్వమాశు వై ।**
**అన్తమస్య విజానీష్వ ఊర్ధ్వం గచ్ఛేహమిత్యజః ॥ 76 ॥**

అప్పుడా భగవంతుడు శ్రీహరి నీవు త్వరగా క్రింది భాగానికి వెళ్లి, దీని చివర ఎక్కడ ఉన్నదో తెలుసుకొమ్ము. నేను పై భాగాన్ని తెలుసుకొంటానన్నాడు.

**తదాశు సమయం కృత్వా గతావూర్ధ్వ మధశ్చ తౌ ।**
**పితామహోప్యహం నాన్తం జ్ఞాతవన్తౌ సమేత్య తౌ ॥ 77 ॥**

అపుడు శీఘ్రంగా బ్రహ్మయూ, నేనూ ఊర్ధ్వ అధోభాగాలకు వెళ్లి ఆ లింగం ఆదినీ, అంతాన్ని తెలుసుకోలేకపోయినాము.

**తతో విస్మయమాపన్నౌ భీతౌ దేవస్య శూలినః ।**
**మాయయా మోహితౌ తస్య ధ్యాయన్తౌ విశ్వమీశ్వరమ్ ॥ 78 ॥**

**ప్రోచ్చరన్తౌ మహానాదమోఙ్కారం పరమం పదమ్ ।**
**తం ప్రాఞ్జలి పుటౌ భూత్వా శమ్భుం తుష్టువతుః పరమ్ ॥ 79 ॥**

అంత ఆశ్చర్యాన్ని పొంది ఆ శివుని మాయవల్ల మేము మోహం పొంది విశ్వాత్మకుడైన ఈశ్వరుని ధ్యానిస్తూ ఓంకారాన్ని బిగ్గరగా పలుకుతూ దోసిలొగ్గి పరమపదరూపశివుని స్తోత్రం చేసినాము.

**బ్రహ్మవిష్ణూ ఊచతుః :-** బ్రహ్మవిష్ణువులు పలికారు.

**అనాదిమూలసంసారరోగవైద్యాయ శమ్భవే ।**
**నమఃశివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 80 ॥**

**ప్రలయార్ణవసంస్థాయ ప్రలయోద్భూతిహేతవే ।**
**నమఃశివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 81 ॥**

**జ్వాలమాలా ప్రతీకాయ జ్వలనస్తంభరూపిణే ।**
**నమఃశివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 82 ॥**

**ఆదిమధ్యాన్తహీనాయ స్వభావామలదీప్తయే ।**
**నమఃశివాయానన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 83 ॥**

**ప్రధానపురుషేశాయ వ్యోమరూపాయ వేధసే ।**
**నమఃశివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 84 ॥**

**నిర్వికారాయ సత్యాయ నిత్యాయాతులతేజసే ।**
**వేదాన్తసారరూపాయ కాలరూపాయ తే నమః ॥ 85 ॥**

**నమఃశివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ।**
**ఏవం సంస్తూయమానస్తు వ్యక్తో భూత్వా మహేశ్వరః ॥ 86 ॥**

ఆది మూలం లేని సంసారరోగానికి వైద్యుడవైన శంభునకు, శాంతుడైన శివునికి, లింగరూపుడవైన బ్రహ్మవగు ఈశ్వరా నీకు నమస్కారం. ప్రళయమనే సముద్రంలో నివసించేవాడవు. సృష్టి ప్రలయాలకు కారణమైనవాడవు. శాంతమగు లింగరూపు దాల్చిన బ్రహ్మనివి. అట్టి నీకు నమస్కారం. అగ్నిజ్వాలా పరంపరయే నీ చిహ్నం. అగ్నిస్తంభస్వరూపుడవు. ఆదిమధ్యాంతరహితుడవు. సహజము స్వచ్ఛమైన ప్రకాశం కలవాడవు. అనంతుడవు. లింగరూపంలో ఉండే బ్రహ్మమైన నీకు నమస్కారం. ప్రధానపురుషుడవైన ఈశ్వరుడవు. ఆకాశస్వరూపుడవు. వికారాలులేని సత్యరూపివి. శాశ్వతుడవు. సాటిలేని తేజస్సు కలవాడవు. వేదాంతాల సారస్వరూపానివైన నీకు నమస్కారం. శాంతుడవు, లింగరూపివి, బ్రహ్మనివైన శివుడవు. నీకు నమస్కారం అని కొనియాడుతుండగా మహేశ్వరుడు సాక్షాత్కరించినాడు.

**భాతి దేవో మహాయోగీ సూర్యకోటిసమప్రభః ।**
**వక్త్రకోటిసహస్రేణ గ్రసమాన ఇవామ్బరమ్ ॥ 87 ॥**

**సహస్ర హస్తచరణః సూర్యసోమాగ్నిలోచనః ।**
**పినాకపాణి ర్భగవాన్ కృత్తివాసా స్త్రిశూలధృక్ ॥ 88 ॥**

**వ్యాలయజ్ఞోపవీతశ్చ మేఘదున్దుభి నిఃస్వనః ।**
**అథోవాచ మహాదేవః ప్రీతోఽహం సురసత్తమౌ ॥ 89 ॥**

**పశ్యేతం మాం మహాదేవం భయం సర్వం ప్రముచ్యతామ్ ।**
**యువాం ప్రసూతౌ గాత్రేభ్యో మమ పూర్వం సనాతనౌ ॥ 90 ॥**

మహాయోగి, కోటి సూర్యసమకాంతి గలవాడు, వేల ముఖసమూహాలతో ఆకాశాన్ని మ్రింగుతున్న వానివలె ప్రకాశించువాడూ, వేల పాదాలు హస్తాలు కలవాడు, సూర్యచంద్రాగ్నులు నేత్రాలుగా ఉన్నవాడు, పినాకమనే ధనువును ధరించి చర్మవస్త్రధారియై త్రిశూలాన్ని ధరించి ఆ భగవంతుడు కన్పించినాడు. సర్పాలు యజ్ఞోపవీతంగా ఉన్నవాడు. మేఘము దుందుభివంటి నాదం కల మహాదేవుడు “ఓ దేవతా శ్రేష్ఠులారా! నేను సంతోషించినాను. మహాదేవుడను. నన్ను చూడండి. మీ భయాన్ని వదలండి. మీరిద్దరూ అనాదిగా నాకంటె ముందు వంశాల్లో జన్మించినారు”.

**అయం మే దక్షిణే పార్శ్వే బ్రహ్మా లోకపితామహః ।**
**వామపార్శ్వే చ మే విష్ణుః పాలకో హృదయే హరః ॥ 91 ॥**

**ప్రీతోఽహం యువయోః సమ్యగ్వరం దద్మి యథేప్సితమ్।**
**ఏవముక్త్వాఽథ మాం దేవో మహాదేవః స్వయం శివః ॥ 92 ॥**

**ఆలింగ్య దేవం బ్రహ్మాణం ప్రసాదాభిముఖోఽభవత్ ।**
**తతఃప్రహృష్ట మనసౌ ప్రణిపత్య మహేశ్వరమ్ ॥ 93 ॥**

**ఊచతుః ప్రేక్ష్య తద్వక్త్రం నారాయణ పితామహౌ ।**
**యది ప్రీతిః సముత్పన్నా యది దేయో వరో హి నః ॥ 94 ॥**

**భక్తిర్భవతు నౌ నిత్యం త్వయి దేవ మహేశ్వరే ।**
**తతః స భగవానీశః ప్రహస న్పరమేశ్వరః ॥ 95 ॥**

**ఉవాచ మాం మహాదేవః ప్రీతం ప్రీతేన చేతసా ।**

“లోకపితామహుడైన ఈ బ్రహ్మ నా కుడిభాగంలో ఉన్నాడు. నా ఎడమభాగంలో లోకరక్షకుడు విష్ణువు ఉన్నాడు. నా మనసులో శివుడున్నాడు. నేను మీ ఇద్దరి విషయంలో సంతోషించాను. మీ ఇష్టప్రకారం మీకు మంచి వరమిస్తాను”. అని నాతో పలికి మహాదేవుడు శివుడు స్వయంగా బ్రహ్మదేవుని ఆలింగనం చేసుకొని అనుగ్రహముఖం కలవాడైనాడు. తర్వాత బ్రహ్మవిష్ణువులు సంతోషచిత్తులై మహేశ్వరునికి నమస్కరించి ఆయన ముఖాన్ని చూచి “మాయందు మీకు ప్రీతి కలిగినట్లైతే మాకు వరాన్ని ఇవ్వదలచినట్లైతే ఓ మహేశ్వరా! మాకు నీయందెల్లపుడు భక్తి ఉండుగాక!” అని పలుకగా భగవంతుడు శివుడు నవ్వుతూ సంతోషచిత్తంతో నాతో ఇట్లన్నాడు.

**దేవదేవ ఉవాచ :**–దేవదేవుడు పలికాడు.

**ప్రలయస్థితిసర్గాణాం కర్తా త్వం ధరణీపతే ॥ 96 ॥**

**వత్సవత్స హరే విశ్వం పాలయైతచ్చరాచరమ్ ।**
**త్రిధా భిన్నోస్మ్యహం విష్ణో బ్రహ్మవిష్ణుహరాఖ్యయా ॥ 97 ॥**

**సర్గరక్షాలయగుణై ర్నిర్గుణోఽపి నిరఞ్జనః ।**
**సంమోహం త్యజ భో విష్ణో పాలయైనం పితామహమ్ ॥ 98 ॥**

**భవిష్యత్యేవ భగవాం స్తవ పుత్రః సనాతనః ।**
**అహం చ భవతో వక్త్రా త్కల్పాదౌ సురరూపధృక్ ॥ 99 ॥**

**శూలపాణి ర్భవిష్యామి క్రోధజ స్తవ పుత్రకః ।**
**ఏవముక్త్వా మహాదేవో బ్రహ్మాణం మునిస్తతమ ॥ 100 ॥**

**అనుగృహ్యా చ మాం దేవ స్తత్రైవాన్తరధీయత ।**
**తతఃప్రభృతి లోకేషు లిఙ్గార్చా సుప్రతిష్ఠితా ॥ 101 ॥**

ఓ ధరణీపతీ! సృష్టి స్థితి ప్రళయాలకు నీవు కర్తవు. వత్సా విష్ణూ! ఈ చరాచర విశ్వాన్ని నీవు పాలించు. ఓ హరీ! నేను బ్రహ్మ విష్ణు శివ రూపాలతో మూడు విధాల భిన్న రూపుడను. సృష్టి స్థితి లయ గుణాలతో ఆ మూడు రూపాలు ధరించాను. నిర్గుణుడను నిరంజనుడనైనా ఆయా రూపాలు స్వీకరించాను. మోహాన్ని వదలి ఈ పితామహుని కాపాడు. పూజ్యుడైన ఈ బ్రహ్మ సనాతనుడైనా నీ పుత్రునిగా జన్మిస్తాడు." అని హరితో పలికి, "ఓ బ్రహ్మా! నేను కల్పాదిలో దేవతా రూపాన్ని ధరించి నీ ముఖం నుండి శూలహస్తుడనై జన్మిస్తాను. క్రోధగుణం కల నీ పుత్రుణ్ణవుతాను". ఓ మునీశ్వరా! మహాదేవుడు శివుడు ఈ విధంగా పలికి బ్రహ్మను నన్ను అనుగ్రహించి అక్కడే అంతర్ధానమైనాడు. అది మొదలుకొని లోకంలో లింగార్చన అనేది బాగా స్థిరపడినది.

**లిఙ్గం తత్తు యతో బ్రహ్మన్ బ్రహ్మణః పరమం వపుః ।**
**ఏతల్లిఙ్గస్య మాహాత్మ్యం భాషితం తే మయాఽనఘ ॥ 102 ॥**

"ఓ బ్రాహ్మణుడా! ఆ లింగం పరబ్రహ్మయొక్క శ్రేష్ఠమైన శరీరం. ఓ పుణ్యాత్ముడా! ఇది ఆ లింగ మాహాత్మ్యం నీకు వివరించినాను".

**ఏతద్బుధ్యన్తి యోగజ్ఞా న దేవా న చ దానవాః ।**
**ఏతద్ధి పరమం జ్ఞానమవ్యక్తం శివసంజ్ఞితమ్ ॥ 103 ॥**

**యేన సూక్ష్మ మచిన్త్యం తత్పశ్యన్తి జ్ఞానచక్షుషః ।**
**తస్మై భగవతే నిత్యం నమస్కారం ప్రకుర్మహే ॥ 104 ॥**

దీని మహిమ యోగజ్ఞులు మాత్రమెరుగుదురు. దేవదానవులకు తెలియదు. ఇదే అవ్యక్త రూపశివనామక ఉత్తమజ్ఞానం. జ్ఞానదృష్టి కలవారు ఈ సూక్ష్మతత్త్వాన్ని దర్శింతురు. అట్టి భగవానునికెల్లపుడు నమస్కరిస్తాను.

**మహాదేవాయ దేవాయ దేవదేవాయ భృంగిణే ।**
**నమో వేదరహస్యాయ నీలకణ్ఠాయ తే నమః ॥ 105 ॥**

**విభీషణాయ శాన్తాయ స్థాణవే హేతవే నమః ।**
**బ్రహ్మణే వామదేవాయ త్రినేత్రాయ మహీయసే ॥ 106 ॥**

**శంకరాయ మహేశాయ గిరీశాయ శివాయ చ ।**
**నమః కురుష్వ సతతం ధ్యాయస్వ చ మహేశ్వరమ్ ॥ 107 ॥**

"మహాదేవుడవు. దేవదేవుడవు. వేదరహస్యానివి. నీలకంఠుడవు. భృంగీశ్వరుడవైన నీకు నమస్కారం. భయంకర రూపం కలవాడవు. శాంతుడవు. స్థాణురూపివి. కారణభూతుడవు. బ్రహ్మవు. వామదేవుడవు. త్రినేత్రుడవు. గొప్పవాడవైన నీకు నమస్కారం. శుభాలనిచ్చేవాడవు. మహేశుడవు, గిరీశుడవు, శివుడవైన నిన్నెల్లపుడు, నమస్కరింతునని" ఆ మహేశ్వరుని ధ్యానించు చుండుము.

**సంసారసాగరాదస్మా దచిరాదుద్ధరిష్యసి ।**
**ఏవం స వాసుదేవేన వ్యాహృతో మునిపుఙ్గవః ॥ 108 ॥**

**జగామ మనసా దేవ మీశానం విశ్వతోముఖమ్ ।**
**ప్రణమ్య శిరసా కృష్ణ మనుజ్ఞాతో మహామునిః ॥ 109 ॥**

**జగామ చేప్సితం శమ్భుం దేవదేవం త్రిశూలినమ్ ।**
**య ఇమం శ్రావయేన్నిత్యం లిఙ్గాధ్యాయ మనుత్తమమ్ ॥ 110 ॥**

**శృణుయాద్వా పఠేద్వాపి సర్వపాపైః ప్రముచ్యతే ।**
**శ్రుత్వా సకృదపి హ్యేతత్తపశ్చరణముత్తమమ్ ॥ 111 ॥**

ఈ సంసారసముద్రంనుండి శీఘ్రంగా ఉద్ధరించగలవు. ఈ విధంగా ఆ మునిశ్రేష్ఠుడు శ్రీ కృష్ణునివల్ల విన్నాడు. తర్వాత అంతటా వ్యాపించిన ఈశ్వరుణ్ణి మనసులో ధ్యానించినాడు. శిరసా శ్రీకృష్ణునికి నమస్కరించి ఆతని అనుజ్ఞపొంది ఆ మార్కండేయమహాముని తనకిష్టుడైన త్రిశూలధారి దేవదేవుడు శివుణ్ణి చేరాడు. ఈ ఉత్తమమైన లింగాధ్యాయాన్ని ఎల్లవేళలా వినిపించేవాడు, వినేవాడు, చదివేవాడు, ఈ తపశ్చరణ వృత్తాంతాన్ని ఒకసారి విన్నా, అన్ని పాపాలు తొలగించుకొంటాడు.

**వాసుదేవస్య విప్రేన్ద్రాః పాపం ముఞ్చతి మానవః ।**
**జపేద్వాహరహర్నిత్యం బ్రహ్మలోకే మహీయతే ॥ 112 ॥**

**ఏవమాహ మహాయోగీ కృష్ణద్వైపాయనప్రభుః ।**

ఓ బ్రాహ్మణముఖ్యులారా! ఈ వాసుదేవతపస్సు వృత్తాంతాన్ని మనుజుడు ప్రతిదినం జపిస్తే పాపం తొలగించుకుంటాడు. బ్రహ్మలోకంలో ప్రకాశిస్తాడు. అని ఈ విధంగా పూజ్యుడు మహాయోగి అయిన కృష్ణ ద్వైపాయనుడు చెప్పినాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే యదువంశానుకీర్తనే లిఙ్గోత్పత్తిర్నామ షడ్వింశోఽధ్యాయః ॥ 26 ॥**

శ్రీకూర్మపురాణంలోని యదువంశానుకీర్తనంలో లింగోత్పత్తి అనే ఇరవై ఆరవ అధ్యాయం ॥ 26 ॥



## సప్తవింశోఽధ్యాయః - ఇరవై ఏడవ అధ్యాయం
## రాజవంశానుకీర్తనమ్ - రాజవంశానుకీర్తనం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**తతో లబ్ధవరః కృష్ణో జామ్బవత్యాం మహేశ్వరాత్ ।**
**అజీజనన్మహాత్మానం సామ్బమాత్మజముత్తమమ్ ॥ 1 ॥**

తర్వాత మహేశ్వరుని వరంవల్ల కృష్ణుడు జాంబవతి యందు సాంబుడనే మంచి కుమారుని పొందినాడు.

**ప్రద్యుమ్నస్య హ్యభూత్పుత్రో హ్యనిరుద్ధో మహాబలః ।**
**తావుభౌ గుణసమ్పన్నౌ కృష్ణస్యైవాపరే తనూ ॥ 2 ॥**

ప్రద్యుమ్నునికి బలవంతుడైన అనిరుద్ధుడు జన్మించినాడు. వారిద్దరు గుణవంతులు కృష్ణుని మారు శరీరాల వలె ఉన్నారు.

**హత్వా చ కంసం నరక మన్యాంశ్చ శతశోఽసురాన్ ।**
**విజిత్య లీలయా శక్రం జిత్వా బాణం మహాసురమ్ ॥ 3 ॥**

**స్థాపయిత్వా జగత్కృత్స్నం లోకే ధర్మాంశ్చ శాశ్వతాన్ ।**
**చక్రే నారాయణో గన్తుం స్వస్థానం బుద్ధిముత్తమామ్ ॥ 4 ॥**

కంసుణ్ణి నరకాసురుణ్ణి అట్లే వందల మంది రాక్షసులను చంపి లీలగా ఇంద్రుణ్ణి గెలిచి బాణుడనే రాక్షసుని జయించి ప్రపంచాన్ని స్థిరంగా నిల్పి శాశ్వతధర్మాలను లోకంలో కాపాడి నారాయణుడు తన నివాసం వైకుంఠానికి వెళ్ళాలని తలచినాడు.

**ఏతస్మిన్నన్తరే విప్రా! భృగ్వాద్యాః కృష్ణమీశ్వరమ్ ।**
**ఆజగ్ముర్ద్వారకాం ద్రష్టుం కృతకార్యం సనాతనమ్ ॥ 5 ॥**

ఓ విప్రులారా! అంతలో భృగువు మొదలైన ఋషులు కార్యం నిర్వహించిన సనాతనుడు ఈశ్వరుడైన కృష్ణుని చూడటానికి ద్వారకకు వచ్చినారు.

**స తానువాచ విశ్వాత్మా ప్రణిపత్యాభిపూజ్య చ ।**
**ఆసనేషూపవిష్టాన్వై సహ రామేణ ధీమతా ॥ 6 ॥**

విశ్వాత్ముడైన కృష్ణుడు ధీమంతుడైన బలరామునితో కూడ వారికి నమస్కరించినాడు. ఆసనాల్లో కూర్చున్న వారితో ఇట్లన్నాడు.

**గమిష్యామి పరం స్థానం స్వకీయం విష్ణుసంజ్ఞితమ్ ।**
**కృతాని సర్వకార్యాణి ప్రసీదధ్వం మునీశ్వరాః! ॥ 7 ॥**

మునీశ్వరులారా! నా కర్తవ్యాలన్నిటినీ పూర్తి చేసినాను. ఇక విష్ణుసంజ్ఞితమైన నా పరమపదానికి వెళతాను. మీరు ప్రసన్నులు కండి.

**ఇదం కలియుగం ఘోరం సంప్రాప్త మధునాऽశుభమ్ ।**
**భవిష్యన్తి జనాః సర్వే హ్యస్మిన్పాపానువర్తినః ॥ 8 ॥**

ఇపుడు ఘోరము, అశుభకరమైన కలియుగం వచ్చినది. ఈ యుగంలో ప్రజలు పాపమార్గాన్ని అనుసరించేవారు అవుతారు.

**ప్రవర్తయధ్వం విజ్ఞానమజ్ఞానాం చ హితావహమ్ ।**
**యేనేమే కలిజైః పాపైః ముచ్యన్తే హి ద్విజోత్తమాః! ॥ 9 ॥**

ఓ ద్విజులారా! అజ్ఞానులకు హితాన్ని కూర్చే విజ్ఞానాన్ని వ్యాప్తి గావించండి దానితో వీరు కలియుగ పాపాల నుండి ముక్తులౌతారు.

**యే మాం జనాః సంస్మరన్తి కలౌ సకృదపి ప్రభుమ్ ।**
**తేషాం నశ్యతి తత్పాపం భక్తానాం పురుషోత్తమే ॥ 10 ॥**

కలియుగంలో ప్రభుడనైన నన్ను స్మరించినా ఆ పురుషోత్తమునియందు భక్తుల పాపం నశిస్తుంది.

**యేऽర్చయిష్యన్తి మాం భక్త్యా నిత్యం కలియుగే ద్విజాః ।**
**విధినా వేదదృష్టేన తే గమిష్యన్తి తత్పదమ్ ॥ 11 ॥**

కలియుగంలో వేదప్రతిపాదిత విధితో ఎల్లపుడు నన్ను భక్తితో పూజించేవాళ్ళు ఆ పరమపదాన్ని పొందుతారు.

**యే బ్రాహ్మణా వంశజాతా యుష్మాకం వై సహస్రశః ।**
**తేషాం నారాయణే భక్తిర్భవిష్యతి కలౌ యుగే ॥ 12 ॥**

మీ వంశమందు పుట్టిన వేలకొలది బ్రాహ్మణులు కలియుగంలో విష్ణువందు భక్తి కలిగినవారు అవుతారు.

**పరాత్పరతరం యాన్తి నారాయణపరా జనాః ।**
**న తే తత్ర గమిష్యన్తి యే ద్విషన్తి మహేశ్వరమ్ ॥ 13 ॥**

నారాయణునియందు భక్తిశ్రద్ధలున్న జనులు ఉత్తమోత్తమమైన సద్గతిని పొందుతారు. మహేశ్వరుని ద్వేషించే వారాస్థానాన్ని పొందలేరు.

**ధ్యానం యోగస్తపస్తప్తం జ్ఞానం యజ్ఞాదికో విధిః ।**
**తేషాం వినశ్యతి క్షిప్రం యే నిన్దన్తి మహేశ్వరమ్ ॥ 14 ॥**

మహేశ్వరుని దూషించేవారి ధ్యానయోగాలు చేసిన తపస్సు, జ్ఞానం, యజ్ఞాలు మొదలైన ధార్మికకార్యాలన్నీ శీఘ్రం నిష్ఫలాలవుతాయి.

**యో మాం సమర్చయేన్నిత్యమేకాన్తం భావమాశ్రితః ।**
**వినిన్దన్దేవమీశానం స యాతి నరకాయుతమ్ ॥ 15 ॥**

నన్ను ఏకాగ్రతకలవాడై సదా పూజించేవాడు భగవంతుడైన శివుని నిందించినట్లైతే వేలాది నరకాలను అనుభవిస్తాడు.

**తస్మాత్సంపరిహర్తవ్యా నిన్దా పశుపతేర్ద్విజాః! ।**
**కర్మణా మనసా వాచా మద్భక్తేష్వపి యత్నతః ॥ 16 ॥**

అందువల్ల ఓ విప్రులారా! పశుపతి శివుని నిందను మనసా వాచా కర్మణా పూర్తిగా విడువ వలసినదే. నా భక్తులను కూడా నిందించరాదు.

**యే చ దక్షాధ్వరే శప్తా దధీచేన ద్విజోత్తమాః ।**
**భవిష్యన్తి కలౌ భక్తైః పరిహార్యాః ప్రయత్నతః ॥ 17 ॥**

దక్షయజ్ఞంలో దధీచి శాపాన్ని పొందిన బ్రాహ్మణులు కలియుగంలో భక్తులకు దూరంగా ఉండవలసినవారే.

**ద్విషన్తో దేవమీశానం యుష్మాకం వంశసమ్భవాః ।**
**శప్తాశ్చ గౌతమేనోర్వ్యాం న సమ్భాష్యా ద్విజోత్తమైః ॥ 18 ॥**

మీ వంశంలో జన్మించి ప్రభువు శంకరుని ద్వేషించినవారు, గౌతముని శాపాన్ని పొందినవారు, పృథివిలో బ్రాహ్మణులతో మాట్లాడతగినవారు కారు.

**ఏవముక్తాశ్చ కృష్ణేన సర్వే తే వై మహర్షయః ।**
**ఓమిత్యుక్త్వా యయుస్తూర్ణం స్వాని స్థానాని సత్తమాః ॥ 19 ॥**

శ్రేష్ఠులారా! ఈ విధంగా కృష్ణుడు చెప్పగా ఆ మహర్షులు అంగీకారాన్ని తెలిపి త్వరగా తమ తమ స్థానాలకు వెళ్ళినారు.

**తతో నారాయణః కృష్ణో లీలయైవ జగన్మయః ।**
**సంహృత్య స్వకులం సర్వం యయౌ తత్పరమం పదమ్ ॥ 20 ॥**

తర్వాత విష్ణురూపాంతరమైన కృష్ణుడు లోకాత్ముడైనందువల్ల తన లీలావినోదంలో యాదవవంశాన్నంతా సంహరించి తన పరమపదానికి చేరినాడు.

**ఇత్యేష వః సమాసేన రాజ్ఞాం వంశః సుకీర్తితః ।**
**న శక్యో విస్తరాద్వక్తుం కిం భూయఃశ్రోతుమిచ్ఛథ ॥ 21 ॥**

ఈ విధంగా రాజవంశచరిత్ర సంగ్రహంగా మీకు వివరించినాను. ఇంతకంటె విస్తారంగా చెప్పటం సాధ్యం కాదు. మీరు ఇంకనూ ఏమైనా వినవలెనని కోరుచున్నారా?

**యః పఠేచ్ఛృణుయాద్వాపి వంశానాం కథనం శుభమ్ ।**
**సర్వపాపవినిర్ముక్తః స్వర్గలోకే మహీయతే ॥ 22 ॥**

శుభాల్ని కలుగ చేసే ఈ రాజవంశాల చరిత్రను చదివినా, విన్నా అన్ని పాపాలు తొలగి స్వర్గంలో గౌరవాన్నందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే రాజవంశానుకీర్తనం నామ సప్తవింశోఽధ్యాయః.॥ 27 ॥**

శ్రీకూర్మపురాణంలో రాజవంశానుకీర్తనం అనే ఇరవై ఏడవ అధ్యాయం ॥ 27 ॥

## **అష్టావింశోఽధ్యాయః** - ఇరవై ఎనిమిదవ అధ్యాయం

## **పార్థాయ వ్యాసదర్శనమ్** - అర్జునుడు వ్యాసుని దర్శించడం

**ఋషయ ఊచుః :-**ఋషులు పలికారు.

**కృతం త్రేతా ద్వాపరఞ్చ కలిశ్చేతి చతుర్యుగమ్ ।**
**ఏషాం ప్రభావం సూతాద్య కథయస్వ సమాసతః ॥ 1 ॥**

ఓ సూతుడా! కృతత్రేతాద్వాపరకలియుగాలు అను నాలుగు యుగాల మహిమను సంగ్రహంగా ఇప్పుడు చెప్పుము.

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**గతే నారాయణే కృష్ణే స్వమేవ పరమం పదమ్ ।**
**పార్థః పరమధర్మాత్మా పాండవః శత్రుతాపనః ॥ 2 ॥**
**కృత్వా చైవోత్తరవిధిం శోకేన మహతా వృతః ।**
**అపశ్యత్పథి గచ్ఛన్తం కృష్ణద్వైపాయనం మునిమ్ ॥ 3 ॥**

నారాయణ స్వరూపుడైన కృష్ణుడు తన పరమపదానికి వెళ్ళిపోగా శత్రుతాపకుడు, గొప్పధర్మాతుడు, పాండు పుత్రుడైన అర్జునుడు మిక్కిలి దుఃఖితుడై శ్రీ కృష్ణుని ఉత్తరక్రియలు నిర్వహించి వస్తూ దారిలో వెళుతున్న కృష్ణద్వైపాయనుని చూచినాడు.

**శిష్యైః ప్రశిష్యైరభితః సంవృతం బ్రహ్మవాదినమ్ ।**
**పపాత దణ్డవద్భూమౌ త్యక్త్వా శోకం తదాఽర్జునః ॥ 4 ॥**

బ్రహ్మవాది అయిన వేదవ్యాసుడు తన శిష్యప్రశిష్యులతో కలిసి వెళుతుండగా చూచి అర్జునుడు తన దుఃఖాన్ని వీడి నేలపై దండంవలె పడి నమస్కరించినాడు.

**ఉవాచ పరమప్రీత్యా కస్మాదేతన్మహామునే ।**
**ఇదానీం గచ్ఛసి క్షిప్రం కం వా దేశం ప్రతి ప్రభో! ॥ 5 ॥**

తర్వాత సంతోషంతో ఓ మహామునీ! ఇపుడు శీఘ్రంగా ఏ కారణంవల్ల ఏ ప్రదేశానికి వెళుతున్నారో ప్రభూ చెప్పవలసినదని ప్రార్థించినాడు.

**సన్దర్శనాద్వై భవతః శోకో మే విపులో గతః ।**
**ఇదానీం మమ యత్కార్యం బ్రూహి పద్మదలేక్షణ ॥ 6 ॥**

మీ దర్శనంవల్ల నా మిక్కుటమైన శోకం తొలగినది. పద్మదళాక్షా! ఇపుడు నేను చేయవలసిన కర్తవ్యాన్ని చెప్పవలసినది.

**తమువాచ మహాయోగీ కృష్ణద్వైపాయనః స్వయమ్ ।**
**ఉపవిశ్య నదీతీరే శిష్యైః పరివృతో మునిః ॥ 7 ॥**

తర్వాత యోగీశ్వరుడైన కృష్ణద్వైపాయనుడు స్వయంగా అర్జునునితోను, తన శిష్యులతోను నదీతీరంలో పరివేష్టింపబడినవాడై ఇట్లా చెప్పినాడు.

**ఇతి శ్రీ కూర్మపురాణే పార్థాయ వ్యాసదర్శనం నామ అష్టావింశోఽధ్యాయః ॥ 28 ॥**

శ్రీ కూర్మపురాణంలో అర్జునుడు వ్యాసుని దర్శించుట అనే ఇరవై ఎనిమిదవ అధ్యాయం ॥ 28 ॥



## ఏకోనత్రింశోఽధ్యాయః - ఇరవై తొమ్మిదవ అధ్యాయం

## యుగవంశానుకీర్తనమ్ - యుగవంశానుకీర్తనం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడిట్లా పలికాడు

**ఇదం కలియుగం ఘోరం సంప్రాప్తం పాణ్డునన్దన! ।**
**తతో గచ్ఛామి దేవస్య పురీం వారాణసీం శుభామ్ ॥ 1 ॥**

పాండుపుత్రా! ఘోరమైన ఈ కలియుగం ప్రవేశించినది. అందువల్ల నేను మంగళకరమైన ఈశ్వరుని పట్టణం కాశీ నగరానికి వెళుతున్నాను.

**అస్మిన్ కలియుగే ఘోరే లోకాః పాపానువర్తినః ।**
**భవిష్యన్తి మహాబాహో! వర్ణాశ్రమవివర్జితాః ॥ 2 ॥**

మహాబాహూ! క్రూరమైన ఈ యుగంలో జనులు పాపవర్తనులై వర్ణాశ్రమ ధర్మాలు వదలిపెడతారు.

**నాన్యత్పశ్యామి జన్తూనాం ముక్త్వా వారాణసీం పురీమ్ ।**
**సర్వపాపోపశమనం ప్రాయశ్చిత్తం కలౌ యుగే ॥ 3 ॥**

ఈ కలియుగంలో లోకుల పాపాలను నశింప చేసి ప్రాయశ్చిత్తాన్ని కలుగ చేసేది వారాణసి తప్ప మరొకటి లేదు.

**కృతం త్రేతా ద్వాపరఞ్చ సర్వేష్వేతేషు వై నరాః ।**
**భవిష్యన్తి మహాత్మానో ధార్మికాః సత్యవాదినః ॥ 4 ॥**

కృత త్రేతా ద్వాపరాలనే ఈ యుగాలన్నింటిలో ప్రజలు ధర్మాత్ములు, సత్యవాదులు, మహాత్ములుగా ఉంటారు.

**త్వం హి లోకేషు విఖ్యాతో ధృతిమాన్ జనవత్సలః ।**
**పాలయాద్య పరం ధర్మం స్వకీయం ముచ్యసే భయాత్ ॥ 5 ॥**

నీవు లోకంలో ప్రసిద్ధుడవు. ప్రజలకు ఇష్టమైనవాడవు. ధైర్యవంతుడవు. అందువల్ల నీవు ధర్మాన్ని స్వయంగా కాపాడు. భయం నుండి విముక్తుడవౌతావు.

**ఏవముక్తో భగవతా పార్థః పరపురఞ్జయః ।**
**పృష్టవాన్ ప్రణిపత్యాసౌ యుగధర్మాన్ద్విజోత్తమాః! ॥ 6 ॥**

విప్రులారా! భగవంతుడైన వ్యాసుడిట్లా పలుకగా శత్రుపురాలు జయించిన అర్జునుడు ఆయనకు నమస్కరించి యుగధర్మాలను గూర్చి ప్రశ్నించినాడు.

**తస్మై ప్రోవాచ సకలం మునిః సత్యవతీసుతః ।**
**ప్రణమ్య దేవమీశానం యుగధర్మాన్సనాతనాన్ ॥ 7 ॥**

సత్యవతీపుత్రుడైన వ్యాసుడు భగవంతుడైన ఈశ్వరునికి నమస్కరించి సనాతనములైన యుగధర్మాలను గూర్చి సంపూర్ణంగా అర్జునునికి వివరించినాడు.

**వ్యాస ఉవాచ :**–వ్యాసుడు పలికాడు

**వక్ష్యామి తే సమాసేన యుగధర్మాన్నరేశ్వర! ।**
**న శక్యతే మయా రాజన్ విస్తరేణాభిభాషితుమ్ ॥ 8 ॥**

ఓ రాజా! యుగధర్మాలను గూర్చి నీకు సంగ్రహంగా తెలుపుతాను. విస్తరంగా చెప్పటం నా వల్లకాదు.

**ఆద్యం కృతయుగం ప్రోక్తం తతస్త్రేతాయుగం బుధైః ।**
**తృతీయం ద్వాపరం పార్థ చతుర్థం కలిరుచ్యతే ॥ 9 ॥**

యుగాలలో మొదటిది కృతయుగం. తర్వాతిది త్రేతాయుగం. ఓ పార్థా! మూడవది ద్వాపరం, నాల్గవది కలియుగం అని చెప్పబడినవి.

**ధ్యానం తపః కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే ।**
**ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలౌ యుగే ॥ 10 ॥**

కృతయుగంలో ధ్యానం తపస్సు ముఖ్యమని, త్రేతాయుగంలో జ్ఞానం ప్రధానమని చెప్పనైనది, ద్వాపరయుగంలో యజ్ఞాన్ని, కలియుగంలో దానం మాత్రమే ప్రధానమని పండితులు చెపుతున్నారు.

**బ్రహ్మా కృతయుగే దేవస్త్రేతాయాం భగవాన్రవిః ।**
**ద్వాపరే దైవతం విష్ణుః కలౌ దేవో మహేశ్వరః ॥ 11 ॥**

కృతయుగంలో బ్రహ్మ, త్రేతాయుగంలో భగవంతుడైన సూర్యుడు, ద్వాపరయుగంలో విష్ణువు, కలియుగంలో మహేశ్వరుడు ప్రధానదేవతలుగా ఉంటారు.

**బ్రహ్మా విష్ణు స్తథా సూర్యః సర్వ ఏవ కలావపి ।**
**పూజ్యన్తే భగవాన్రుద్రశ్చతుర్ష్వపి పినాకధృక్ ॥ 12 ॥**

బ్రహ్మ, విష్ణువు, సూర్యుడు వీరంతా కలియుగంలోనూ పూజలందుతారు. పినాకపాణి భగవంతుడైన శివుడు నాల్గుయుగాల్లోను పూజింపబడుతాడు.

**ఆద్యే కృతయుగే ధర్మశ్చతుష్పాదః ప్రకీర్తితః ।**
**త్రేతాయుగే త్రిపాదః స్యాద్ద్విపాదో ద్వాపరే స్థితః ॥ 13 ॥**

ధర్మం కృతయుగంలో నాల్గుపాదాలు, త్రేతాయుగంలో మూడుపాదాలు, ద్వాపరయుగంలో రెండు పాదాలు కలదవుతుంది.

**త్రిపాదహీనస్తిష్యే(కలౌ) తు సత్తా మాత్రేణ తిష్ఠతి ।**
**కృతే తు మిథునోత్పత్తి ర్వృత్తిః సాక్షాదలోలుపా ॥ 14 ॥**

కలియుగంలో మూడుపాదాలు లేక కేవలం తన ఉనికిని మాత్రం కాపాడుకుంటుంది. కృతయుగంలో దంపతుల సంతానోత్పత్తి యందు విషయలోలుపత లేకుండును.

**ప్రజా స్తృప్తాః సదా సర్వాః సర్వానన్దాశ్చ భోగినః ।**
**అధమోత్తమత్వం నాస్త్యాసాం నిర్విశేషాః పురఞ్జయ! ॥ 15 ॥**

కృతయుగంలో ప్రజలు ఎల్లపుడు తృప్తి కల్గి సర్వానంద సుఖాలనుభవిస్తుంటారు. వారు ఉచ్చనీచ అనే భావాలు లేక నిర్విశేషులై ఉంటారు.

**తుల్యమాయుః సుఖం రూపం తాసు తస్మిన్ కృతే యుగే ।**
**విశోకాస్తత్త్వబహులా ఏకాన్తబహులా స్తథా ॥ 16 ॥**

కృతయుగంలో ప్రజలకు ఆయుష్యం, సుఖం, రూపం అందరికీ సమానంగానే ఉంటుంది. జనులు శోకరహితులై తత్త్వ విచారం కల్గి ఏకాంతవాసమే ప్రధానంగా కోరుకుంటారు.

**ధ్యాననిష్ఠాస్తపోనిష్ఠా మహాదేవపరాయణాః ।**
**తా వై నిష్కామచారిణ్యో నిత్యం ముదితమానసాః ॥ 17 ॥**

కృతయుగంలో ప్రజలు ధ్యానం తపస్సు చేయటంలో నిష్ఠ కల్గి మహాదేవుడైన శివునియందు శ్రద్ధ కలవారవుతారు. కోరికలు లేక ఎప్పుడూ సంతుష్ట మనస్కులౌతారు.

**పర్వతోదధివాసిన్యో హ్యనికేతాః పరన్తప! ।**
**రసోల్లాసః కాలయోగాత్త్రేతాఖ్యే నశ్యతి ద్విజాః ॥ 18 ॥**

**తస్యాం సిద్ధౌ ప్రణష్టాయామన్యా సిద్ధి రవర్తత ।**
**అపాం సౌఖ్యే ప్రతిహతే తదా మేఘాత్మనా తు వై ॥ 19 ॥**

శత్రుతాపకుడవైన అర్జునా! ఆ జనులు పర్వతాల్లో సముద్రప్రాంతాల్లో నివసిస్తుంటారు. బ్రాహ్మణులు గృహాలు లేకుండానే ప్రవర్తిస్తారు. తర్వాత త్రేతాయుగంలో కాలక్రమంగా రసానందం తగ్గిపోతుంది. అది నశించగా మరోవిధమైన సిద్ధి సంభవించింది. ఆ సమయంలో మేఘస్వరూపంతో నీటిసౌఖ్యానికి విఘాతం కలిగింది.

**మేఘేభ్యః స్తనయిత్నుభ్యః ప్రవృత్తం వృష్టిసర్జనమ్ ।**
**సకృదేవ తయా వృష్ట్యా సంయుక్తే పృథివీతలే ॥ 20 ॥**

**ప్రాదురాసంస్తథా తాసాం వృక్షా వై గృహసంజ్ఞితాః ।**
**సర్వః ప్రత్యుపయోగస్తు తాసాం తేభ్యః ప్రజాయతే ॥ 21 ॥**

గర్జించే మేఘాలవల్ల వర్షపాతం ఆరంభమైంది. ఆ వర్షంలో భూమి తడిసిపోగా ఒక్కసారిగా ప్రజలకు గృహాలుగా పేర్కొనదగిన వృక్షాలు మొలచినవి. వాటివల్ల ప్రజలకు అన్ని విధాలైన అవసరాలు వినియోగంలోకి వచ్చినవి.

**వర్తయన్తి స్మ తేభ్యస్తాస్త్రేతాయుగముఖే ప్రజాః ।**
**తతః కాలేన మహతా తాసామేవ విపర్యయాత్ ॥ 22 ॥**

**రాగలోభాత్మకో భావస్తదా హ్యాకస్మికోఽభవత్ ।**
**విపర్యయేణ తాసాం తు తేన తత్కాలభావితా ॥ 23 ॥**

**ప్రణశ్యన్తి తతః సర్వే వృక్షాస్తే గృహసంజ్ఞికాః ।**
**తతస్తేషు ప్రణష్టేషు విభ్రాన్తా మైథునోద్భవాః ॥ 24 ॥**

ఆ త్రేతాయుగం ఆరంభంలో ప్రజలు వృక్షాలతో ఏర్పరచుకొన్న గృహాల్లో నివాసం సాగించారు. చాలా కాలం పిమ్మట ప్రజల్లో మార్పు వచ్చినందువల్ల వారు అంతుకుముందు కన్న భిన్నంగా రాగలోభాలు ప్రధానంగా కల భావాన్ని పొంది ప్రవర్తించినారు. తర్వాత గృహాలుగానున్న వృక్షాలన్నీ నశించిపోగా దంపతుల వల్ల జన్మించిన ప్రజలు కలత చెందినారు.

**అభిధ్యాయన్తి తాం సిద్ధిం సత్యాభిధ్యాయినస్తదా ।**
**ప్రాదుర్బభూవుస్తాసాం తు వృక్షాస్తే గృహసంజ్ఞితాః ॥ 25 ॥**

సత్యాభిధ్యానం చేసేవారు అప్పుడా సిద్ధిని ధ్యానం చేస్తారు. తర్వాత వారికి గృహసంజ్ఞ కల వృక్షాలు మళ్ళీ మొలిచినవి.

**వస్త్రాణి తే ప్రసూయన్తే ఫలాన్యాభరణాని చ ।**
**తేష్వేవ జాయతే తాసాం గన్ధవర్ణరసాన్వితమ్ ॥ 26 ॥**

**అమాక్షికం మహావీర్యం పుటకే పుటకే మధు ।**
**తేన తా వర్తయన్తిస్మ త్రేతాయుగముఖే ప్రజాః ॥ 27 ॥**

ఆ వృక్షాలు వస్త్రాలను, పండ్లను, ఆభరణాలను కూడ వారికి కలుగ చేసినవి. వానిలోనే రంగువాసన రుచి కలిగినట్టిదీ, తేనెటీగలు ప్రమేయం లేనట్టిదీ, అంతటా వ్యాపించినదీ, గొప్పబలాన్నిచ్చేదీ అయిన తేనె చెట్ల నుండి స్రవించుచుండినది. త్రేతాయుగాదిలో జనులు ఆ తేనెతోనే తమ జీవితాన్ని గడిపినారు.

**హృష్టాస్తుష్టాస్తయా సిద్ధ్యా సర్వా వై విగతజ్వరాః ।**
**పునః కాలాన్తరేణైవ తతో లోభావృతాస్తదా ॥ 28 ॥**

ఆ సిద్ధితో ప్రజలు సంతోషం, తృప్తి పొంది వ్యాధి పీడలు లేకుండినారు. తర్వాత కొంతకాలం గడువగా మళ్ళీ లోభగుణానికి లోనైనారు.

**వృక్షాంస్తాన్ పర్యగృహ్ణన్త మధు వా మాక్షికం బలాత్ ।**
**తాసాం తేనాపచారేణ పునర్లోభకృతేన వై ॥ 29 ॥**

**ప్రణష్టా మధునా సార్ధం కల్పవృక్షాః క్వచిత్ క్వచిత్ ।**
**శీతవర్షాతపైస్తీవ్రైస్తాస్తతో దుఃఖితా భృశమ్ ॥ 30 ॥**

వారు తేనెను ఆ వృక్షాలనుండి తేనెటీగలనుండి బలాత్కారంగా స్వీకరించినారు. లోభగుణం చేసిన ఆ ప్రజల అపరాధంతో మళ్ళీ ఆ కల్పవృక్షాలు తేనెతోగూడ నశించినవి. ఆ జనులు చలి, వర్షం, ఎండలు తీవ్రంగా బాధింపగా దుఃఖితులైనారు.

**ద్వన్ద్వైః సంపీడ్యమానాస్తు చక్రురావరణాని చ ।**
**కృత్వా ద్వన్ద్వవినిర్ఘాతాన్ వార్తోపాయమచిన్తయన్ ॥ 31 ॥**

చలి ఎండ మొదలైన ద్వంద్వాలతో బాధితులైన ప్రజలు తమ నివాసానికై ఆచ్ఛాదన కల ఆవరణాలు కల్పించుకున్నారు. శీతోష్ణాది ద్వంద్వ నివారణోపాయములగు ఆచ్ఛాదనలను ఏర్పరచుకొని జీవనోపాధిని గూర్చి ఆలోచించినారు.

**నష్టేషు మధునా సార్ధం కల్పవృక్షేషు వై తదా ।**
**తతః ప్రాదురభూత్తాసాం సిద్ధిస్త్రేతాయుగే పునః ॥ 32 ॥**

ఆ సమయంలో కల్పవృక్షాలు తేనెతో కూడ నశించిపోగా త్రేతాయుగంలోని ప్రజలకు మరో మారు సిద్ధి సాక్షాత్కరించినది.

**వార్తాయాః సాధికా హ్యన్యా వృష్టిస్తాసాం నికామతః ।**
**తాసాం వృష్ట్యుదకానీహ యాని నిమ్నైర్గతాని తు ॥ 33 ॥**

**అభవన్ వృష్టిసన్తత్యా స్రోతఃస్థానాని నిమ్నగాః ।**
**యదా ఆపో బహుతరా ఆపన్నాః పృథివీతలే ॥ 34 ॥**

**అపాం భూమేశ్చ సంయోగాదౌషధ్యస్తాస్తదాఽభవన్ ।**
**అఫాలకృష్టాశ్చానుప్తా గ్రామారణ్యాశ్చతుర్దశ ॥ 35 ॥**

ఆ జనుల జీవనోపాధికి వర్షం సహాయకారి అయి తృప్తికరముగా ఉపకరించినది. పల్లపుప్రదేశాలవైపు ప్రవహించే వర్షోదకాలు ఆ జనులకు వర్షాల వల్ల ప్రవాహస్థానాలై నదులుగా ఏర్పడినవి. భూమిపై జలాలు అధికంగా నదీరూపంలో వ్యాపించగానే భూమికి జలాలకు సంయోగం ఏర్పడినందువల్ల నాగలిచే దున్నకుండానే, విత్తనాలు చల్లకుండానే గ్రామాలకు అడవులకు సంబంధించిన పదునాలుగు రకాలైన ఓషధులు మొలకెత్తినవి.

**ఋతుపుష్పఫలైశ్చైవ వృక్షగుల్మాశ్చ జజ్ఞిరే ।**
**తతః ప్రాదురభూత్తాసాం రాగో లోభశ్చ సర్వశః ॥ 36 ॥**

ఆయా ఋతువులకు చెందిన పువ్వులు పండ్లతో వృక్షాలు తీగలు మొలచినవి. ఆ సమయంలో మళ్ళీ ప్రజలకు కోరిక లోభం అనే గుణాలు పుట్టినవి.

**అవశ్యమ్భావితార్థేన త్రేతాయుగవశేన వై ।**
**తతస్తాః పర్యగృహ్ణన్త నదీక్షేత్రాణి పర్వతాః ॥ 37 ॥**

త్రేతాయుగప్రభావంతో అవశ్యం కావలసిన రాగలోభాలు వ్యాప్తి చెందటంవల్ల ప్రజలు నదులు, పొలాలు, పర్వతాలను ఉపకరణంగా స్వీకరించినారు.

**వృక్షగుల్మౌషధీశ్చైవ ప్రసహ్య తు యథా బలమ్ ।**
**విపర్యయేణ తాసాం తా ఓషధ్యో వివిశుర్మహీమ్ ॥ 38 ॥**

చెట్లు, పొదలు, ఓషధులు వాని ప్రాబల్యాన్ననుసరించి పరస్పరం మార్చుకుంటూ భూమిలోనికి ప్రవేశించినవి.

**పితామహనియోగేన దుదోహ పృథివీం పృథుః ।**
**తతస్తా జగృహుః సర్వా హ్యన్యోన్యం క్రోధమూర్ఛితాః ॥ 39 ॥**

పితామహ బ్రహ్మ ఆజ్ఞచే పృథుమహారాజు భూమిని పితికినాడు. అపుడు ప్రజలు తమలో తాము క్రోధావేశాలు పొంది ఆ ఓషధులను స్వీకరించినారు.

**సదాచారే వినష్టే తు బలాత్కాలబలేన చ ।**
**మర్యాదాయాః ప్రతిష్ఠార్థం జ్ఞాత్వైతద్భగవానజః ॥ 40 ॥**

**ససర్జ క్షత్రియాన్ బ్రహ్మా బ్రాహ్మణానాం హితాయ వై ।**
**వర్ణాశ్రమవ్యవస్థాఞ్చ త్రేతాయాం కృతవాన్ప్రభుః ॥ 41 ॥**

కాలప్రభావంతో జనుల బలప్రయోగంతో సదాచారం క్షీణించగా ఈ విషయం తెలిసిన భగవంతుడు బ్రహ్మలోకమర్యాద కాపాడటం కోసం బ్రాహ్మణులహితం కోసం క్షత్రియులను సృష్టించినాడు. ఆ త్రేతాయుగంలో బ్రహ్మ వర్ణాశ్రమాలవ్యవస్థ కూడ ఏర్పచినాడు.

**యజ్ఞప్రవర్తనం చైవ పశుహింసావివర్జితమ్ ।**
**ద్వాపరేఽపృథ విద్యన్తే మతిభేదాత్తథా నృణామ్ ॥ 42 ॥**

పశుహింసలేని యజ్ఞాల అనుష్ఠానం కూడ బ్రహ్మ ఏర్పరచినాడు. తర్వాత ద్వాపరంలో కూడ వర్ణాశ్రమధర్మాలు యజ్ఞాలు కొద్ది భేదాలతో ఆచరింపబడినవి.

**రాగో లోభస్తథా యుద్ధం మత్వా బుద్ధివినిశ్చయమ్ ।**
**ఏకో వేద శ్చతుష్పాదస్త్రిధా త్విహ విభావ్యతే ॥ 43 ॥**

అనురాగం లోభం యుద్ధం అనేవానిని బుద్ధినిశ్చయంగా తలచి నాలుగుపాదాలున్న వేదం ఇక్కడ మూడు విధాలుగా భావించబడినది.

**వేదవ్యాసై శ్చతుర్ధా చ న్యస్యతే ద్వాపరాదిషు ।**
**ఋషిపుత్రైః పునర్వేదా భిద్యన్తే దృష్టి విభ్రమైః ॥ 44 ॥**

వేదవ్యాసుడు ఆ వేదాన్ని ద్వాపరాది యుగాల్లో నాలుగు భాగాల్లో ఏర్పరచినాడు. మళ్ళీ ఋషికుమారులు తమ దృష్టిభేదంతో వేదాలను విభజించినారు.

**మన్త్రబ్రాహ్మణవిన్యాసైః స్వరవర్ణ విపర్యయైః ।**
**సంహితా ఋగ్యజుస్సామ్నాం ప్రోచ్యన్తే పరమర్షిభిః ॥ 45 ॥**

మన్త్ర బ్రాహ్మణ భాగాల విన్యాసాలు స్వర వర్ణాల మార్పులతో ఋక్కు యజుస్సు సామం అనే వేదాల సంహితలుగా పరమర్షులు చెప్పినారు.

**సామాన్యోద్భావనా చైవ దృష్టిభేదైః క్వచిత్ క్వచిత్ ।**
**బ్రాహ్మణం కల్పసూత్రాణి బ్రహ్మప్రవచనాని చ ॥ 46 ॥**

**ఇతిహాసపురాణాని ధర్మశాస్త్రాణి సువ్రత ।**
**అవృష్టిర్మరణం చైవ తథైవాన్యే హ్యుపద్రవాః ॥ 47 ॥**

**వాఙ్మనఃకాయజైర్దోషైర్నిర్వేదో జాయతే నృణామ్ ।**
**నిర్వేదాజ్జాయతే తేషాం దుఃఖమోక్షవిచారణా ॥ 48 ॥**

సాధారణభావన కూడ అక్కడక్కడ దృష్టిభేదాలతో వివరించనైనది. బ్రాహ్మణభాగం కల్పసూత్రాలు బ్రహ్మవచనాలు ఇతిహాస పురాణాలు ధర్మశాస్త్రాలు అనావృష్టి మరణం అదేవిధంగా ఇతర ఉపద్రవాలు వాక్కు మనసు శరీరం అనే త్రికరణాలవల్ల సంభవించిన దోషాలతో మనుజులకు నిర్వేదం కలుగుతుంది. అట్టి వారికి విషయసుఖాల్లో విరక్తి కలిగినపుడు దుఃఖంనుండి మోక్షాన్ని పొందాలనే ఆలోచన కలుగుతుంది.

**విచారణాచ్చ వైరాగ్యం వైరాగ్యాద్దోషదర్శనమ్ ।**
**దోషాణాం దర్శనాచ్చైవ ద్వాపరే జ్ఞానసమ్భవః ॥ 49 ॥**

ఆలోచనవల్ల వైరాగ్యం, వైరాగ్యంవల్ల దాని దోషాలను గ్రహించటం, దోషాల దర్శనంవల్ల ద్వాపరయుగంలో జ్ఞానం కలుగుతుంది.

**ఏషా రజస్తమోయుక్తా వృత్తిర్వై ద్వాపరే ద్విజాః ।**
**ఆద్యే కృతే తు ధర్మోఽస్తి స త్రేతాయాం ప్రవర్తతే ।**

**ద్వాపరే వ్యాకులీభూత్వా ప్రణశ్యతి కలౌ యుగే ॥ 50 ॥**

ద్విజులారా! ద్వాపరంలో రజస్తమో గుణాల కలయికవల్ల ఈ రకమైన వ్యవహారం ఉంటుంది. కృతయుగంలో ధర్మం ప్రధానమై అది త్రేతాయుగంలోను వర్తిస్తుంది. ద్వాపరంలో ఆ ధర్మం వ్యాకులతచెంది కలియుగంలో క్షీణదశకు చేరుకుంటుంది.

**ఇతి శ్రీకూర్మపురాణే యుగవంశానుకీర్తనం నామ ఏకోనత్రింశోఽధ్యాయః ॥ 29 ॥**
శ్రీకూర్మపురాణంలో యుగవంశానుకీర్తనమనే ఇరవై తొమ్మిదవ అధ్యాయం ॥ 29 ॥



## త్రింశోఽధ్యాయః - ముప్పైయవ అధ్యాయం

## వ్యాసార్జున సంవాదే యుగధర్మనిరూపణమ్ - వ్యాసార్జునసంవాదంలో యుగధర్మనిరూపణం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు

**తిష్యే మాయా మసూయాఞ్చ వధం చైవ తపస్వినామ్ ।**
**సాధయన్తి నరా నిత్యం తమసా వ్యాకులీకృతాః ॥ 1 ॥**

కలియుగంలో మానవులు తమోగుణంతో వ్యాకుల మనస్కులై మాయను, అసూయను, మునులవధను ఎల్లప్పుడు జరుపుతారు.

**కలౌ ప్రమారకో రోగః సన్తతం క్షుద్భయం తథా ।**
**అనావృష్టిభయం ఘోరం దేశానాఞ్చ విపర్యయః ॥ 2 ॥**

కలియుగంలో ప్రజలను చంపేరోగం, ఎప్పుడూ ఆకలిభయం, ఘోరమైన అనావృష్టిభయం దేశాలు మారిపోవటం జరుగుతుంది.

**అధార్మికా నిరాహారా మహాకోపాల్పతేజసః ।**
**అనృతం బ్రువతే లుబ్ధా స్తిష్యే జాతాః సుదుష్ప్రజాః ॥ 3 ॥**

కలియుగంలో పుట్టిన ప్రజలు అధర్మవర్తనులు, ఆహారం దొరకనివారు, అతికోపంతో తక్కువ తేజస్సు కలవారై అసత్యాలాడేవారు, లోభులూ అవుతారు.

**దురిష్టై ర్దురధీతైశ్చ దురాచారై ర్దురాగమైః ।**
**విప్రాణాం కర్మదోషైశ్చ ప్రజానాం జాయతే భయమ్ ॥ 4 ॥**

బ్రాహ్మణులతో లోప భూయిష్ఠమైన అధ్యయనంచేత, దుష్టవాంఛలచేత, దుష్ప్రవర్తనతో కుతంత్రాలతో ప్రజలకు భయంకలుగుతుంది.

**నాధీయతే తదా వేదాన్ న యజన్తి ద్విజాతయః ।**
**యజన్తి యజ్ఞాన్వేదాంశ్చ పఠన్తే చాల్ప బుద్ధయః ॥ 5 ॥**

ద్విజులు వేదాలు చదువరు. యజ్ఞాలు చేయరు. అల్పబుద్ధులు వేదాలు చదివి యాగాలు చేస్తారు.

**శూద్రాణాం మంత్రయోగైశ్చ సమ్బన్ధో బ్రాహ్మణైఃసహ ।**
**భవిష్యతి కలౌ తస్మిఞ్ఛయనాసన భోజనైః ॥ 6 ॥**

ఆ కలియుగంలో శూద్రులకు బ్రాహ్మణులతో మంత్రాలతో సంబంధం కూడ ఏర్పడుతుంది. ఆ సంబంధం పరస్పరం శయనం, ఆసనం, భోజనం మొదలైన కర్మలతో ఏర్పడుతుంది.

**రాజానః శూద్రభూయిష్ఠా బ్రాహ్మణాన్బాధయన్తి చ ।**
**భ్రూణహత్యా వీరహత్యా ప్రజాయేత నరేశ్వరే ॥ 7 ॥**

అధికంగా శూద్రజాతి ప్రభువులు బ్రాహ్మణులను బాధిస్తారు. రాజుల్లో భ్రూణహత్య, వీరహత్యవంటి దోషాలు కలుగుతాయి.

**స్నానం హోమం జపం దానం దేవతానాం తథార్చనమ్ ।**
**తథాఽన్యాని చ కర్మాణి న కుర్వన్తి ద్విజాతయః ॥ 8 ॥**

కలియుగంలో ద్విజులు స్నానం హోమం జపం దానం దేవపూజ వంటి ధార్మికకార్యాలాచరించరు.

**వినిన్దన్తి మహాదేవం బ్రాహ్మణాన్ పురుషోత్తమమ్ ।**
**ఆమ్నాయ ధర్మశాస్త్రాణి పురాణాని కలౌ యుగే ॥ 9 ॥**

మహాదేవుడైన శంకరుని, బ్రాహ్మణులను, పురుషోత్తముడైన విష్ణువును, వేదాలను, ధర్మశాస్త్రాలను పురాణాలను నిందిస్తారు.

**కుర్వన్త్యవేదదృష్టాని కర్మాణి వివిధాని తు ।**
**స్వధర్మే తు రుచిర్నైవ బ్రాహ్మణానాం ప్రజాయతే ॥ 10 ॥**

వేదాల్లో చెప్పని వివిధ కర్మలు ఆచరిస్తారు. బ్రాహ్మణులు తమ కులోచితధర్మంతో అనాసక్తులౌతారు.

**కుశీలచర్యాః పాషణ్డైః వృథారూపైః సమావృతాః ।**
**బహుయాచనకా లోకా భవిష్యన్తి పరస్పరమ్ ॥ 11 ॥**

దుఃస్వభావం కల ఆచరణ కల్గి నిరర్థకులై పాషండులతో కూడి జనులు అనేక విధాలైన యాచనలు కలిగి ఉంటారు.

**అట్టశూలా జనపదాః శివశూలాశ్చతుష్పథాః ।**
**ప్రమదా కేశశూలాశ్చ భవిష్యన్తి కలౌ యుగే ॥ 12 ॥**

కలియుగంలో పల్లెటూరివారు అన్నాన్ని అమ్ముకునేవారిగా, కూడళ్ళలో ఉండేవారు వేదాలను అమ్ముకొనేవారిగా, స్త్రీలు వ్యభిచారిణులుగా మారుతారు.

**శుక్లదన్తా జినాఖ్యాశ్చ ముణ్డాః కాషాయవాససః ।**
**శూద్రా ధర్మం చరిష్యన్తి యుగాన్తే సముపస్థితే ॥ 13 ॥**

తెల్లనిదంతాలు కల్గి శిరోముండనం చేయించుకొని కాషాయాలు ధరించిన జినులనే పేరుతో శూద్రులు కలియుగాంతం రాగా ధర్మాన్ని ఆచరిస్తారు.

**సస్యచౌరా భవిష్యన్తి తథా చేలాభిమర్షిణః ।**
**చౌరాశ్చౌరస్య హర్తారో హర్తుర్హన్తా తథాపరః ॥ 14 ॥**

జనులు పైర్లను అపహరిస్తారు. వస్త్రాలు దొంగిలిస్తారు. దొంగలసొమ్మును దోచుకొనేవారు, దొంగను చంపేవాడు మరొకడుగా జీవిస్తారు.

**దుఃఖప్రచురమల్పాయుర్దేహోత్సాదః సరోగతా ।**
**అధర్మాభినివేశత్వాత్తమోవృత్తం కలౌ స్మృతమ్ ॥ 15 ॥**

కలియుగంలో దుఃఖాలెక్కువ. తక్కువ ఆయుష్షు. వ్యాధిపీడ, శరీరక్షీణత సంభవిస్తాయి. అధర్మంలో అభినివేశమెక్కువై తమఃప్రవృత్తి కలుగుతుంది.

**కాషాయిణోఽథ నిర్గ్రన్థాస్తథా కాపాలికాశ్చ యే ।**
**వేదవిక్రయిణశ్చాన్యే తీర్థవిక్రయిణః పరే ॥ 16 ॥**

కాషాయం ధరించేవారు, కాపాలికులు, గ్రంథశూన్యులు కొందరు, వేదాలనమ్ముకొనేవారు తీర్థాలను విక్రయించేవారుగా ప్రజలు అనేకరకాలుగా ఉంటారు.

**ఆసనస్థాన్ద్విజా న్దృష్ట్వా చాలయన్త్యల్పబుద్ధయః ।**
**తాడయన్తి ద్విజేన్ద్రాంశ్చ శూద్రా రాజోపజీవినః ॥ 17 ॥**

అల్పబుద్ధులు బ్రాహ్మణులు ఆసనాలపై కూర్చోగా వారిని తొలగిస్తారు, రాజాశ్రయం కలశూద్రులు బ్రాహ్మణశ్రేష్ఠులను కొట్టి బాధిస్తారు.

**ఉచ్చాసనస్థాః శూద్రాశ్చ ద్విజమధ్యే పరన్తప ।**
**ద్విజామానకరో రాజా కలౌ కాలబలేన తు ॥ 18 ॥**

శత్రుతాపకుడవైన అర్జునా! బ్రాహ్మణుల మధ్య శూద్రులు ఉన్నతాసనస్థులౌతారు. కలియుగ ప్రభావంతో రాజు బ్రాహ్మణులను అగౌరవపరుస్తాడు.

**పుష్పైశ్చ భూషణైశ్చైవ తథాన్యైర్మఙ్గలైర్ద్విజాః ।**
**శుద్రాన్పరిచరన్త్యల్పశ్రుతభాగ్యబలాన్వితాః ॥ 19 ॥**

బ్రాహ్మణులు విద్యాశూన్యులై అదృష్టం బలం కల్గి పువ్వులు నగలు మొదలైన మంగళద్రవ్యాలతో శూద్రులను సేవిస్తారు.

**న ప్రేక్షన్తేఽర్చితాంశ్చాపి శూద్రాద్ద్విజవరాన్నృప ।**
**సేవావసరమాలోక్య ద్వారే తిష్ఠన్తి చ ద్విజాః ॥ 20 ॥**

రాజా! పూజ్యులైన బ్రాహ్మణశ్రేష్ఠులను శూద్రులు గమనించరు. విప్రులు శూద్రుల ద్వారాల్లో నిలిచి వారిని సేవించే సమయం కోసం ఎదురు చూస్తారు.

**వాహనస్థాన్సమావృత్య శూద్రాఞ్ఛూద్రోపజీవినః ।**
**సేవన్తే బ్రాహ్మణాస్తాంస్తు స్తువన్తి స్తుతిభిః కలౌ ॥ 21 ॥**

కలియుగంలో శూద్రులపై ఆధారపడి జీవించే బ్రాహ్మణులు వాహనాల్లో ఉన్న శూద్రులను చేరి సేవిస్తారు. వారిని స్తోత్ర వాక్యాలతో పొగడుతారు.

**అధ్యాపయన్తి వై వేదాన్ శూద్రాఞ్ఛూద్రోపజీవినః ।**
**ఏవం నిర్వేదకానర్థాన్నాస్తిక్యం ఘోరమాశ్రితాః ॥ 22 ॥**

శూద్రులవల్ల జీవనం సాగిస్తూ శూద్రులతో వేదాలు చదివిస్తారు. ఇట్లా వేదవిరుద్ధాలైన అనర్థాలను భయంకరమైన నాస్తిక్యాన్ని అవలంబిస్తారు.

**తపోయజ్ఞకలానాన్తు విక్రేతారో ద్విజోత్తమాః ।**
**యతయశ్చ భవిష్యన్తి శతశోఽథ సహస్రశః ॥ 23 ॥**

ద్విజోత్తములు తమ తపస్సు, యజ్ఞాలు, కళలు అమ్ముకొని జీవిస్తారు. కలియుగంలో వందలు వేల సన్న్యాసులు సిద్ధమౌతారు.

**నాశయన్తః స్వకాన్ధర్మానధిగచ్ఛన్తి తత్పదమ్ ।**
**గాయన్తిలౌకికై ర్గానైర్దైవతాని నరాధిప ॥ 24 ॥**

తమ ధర్మాలను నశింపచేస్తూ ఆ స్థానాన్ని పొందుతారు. ఓ రాజా! దేవతలను లౌకిక గీతాలతో గానం చేస్తారు.

**వామపాశుపతాచారాస్తథా వై పాఞ్చరాత్రికాః ।**
**భవిష్యన్తి కలౌ తస్మిన్ బ్రాహ్మణాః క్షత్రియాస్తథా ॥ 25 ॥**

అటువంటి కలియుగంలో బ్రాహ్మణులు మరియు క్షత్రియులు, వామాచారులు, పాశుపతాచారులు, పాంచరాత్రధర్మాచారులుగా ఉంటారు.

**జ్ఞానే కర్మణ్యపగతే లోకే నిష్క్రియతాం గతే ।**
**కీటమూషికసర్పాశ్చ ధర్షయిష్యన్తి మానుషాన్ ॥ 26 ॥**

జ్ఞానమార్గం కర్మయోగం తొలగి లోకమంతా క్రియాశూన్యం కాగా పురుగులు, ఎలుకలు, పాములు మానవులను భయపెట్టి బాధిస్తాయి.

**కుర్వన్తి చావతారాణి బ్రాహ్మణానాం కులేషు వై ।**
**దేవీశాపవినిర్దగ్ధాః పురా దక్షాధ్వరే ద్విజాః ॥ 27 ॥**

పూర్వం దక్షయజ్ఞంలో సతీదేవిశాపంతో కాలిన బ్రాహ్మణులు ఈ కాలంలో బ్రాహ్మణవంశాల్లో భూమిపై జన్మిస్తారు.

**నిన్దన్తి చ మహాదేవం తమసాఽవిష్టచేతసః ।**
**వృథా ధర్మం చరిష్యన్తి కలౌ తస్మిన్యుగాన్తికే ॥ 28 ॥**

తమోగుణాక్రాంత మనస్కులై మహాదేవుడైన శివుని నిందిస్తారు. ఈ కలియుగాంతంలో నిరర్థకమైన ధర్మాన్నాచరిస్తారు.

**సర్వే వీరా భవిష్యన్తి బ్రాహ్మణాద్యాః స్వజాతిషు ।**
**యే చాన్యే శాపనిర్దగ్ధా గౌతమస్య మహాత్మనః ॥ 29 ॥**

**సర్వే తేఽవతరిష్యన్తి బ్రాహ్మణాస్తాసు యోనిషు ।**
**వినిన్దన్తి హృషీకేశం బ్రాహ్మణా బ్రహ్మవాదినః ॥ 30 ॥**

బ్రాహ్మణాది జాతులవారందరు తమ జాతుల్లో వీరులౌతారు. మహాత్ముడు గౌతమముని శాపానికి గురైనవారు కూడ తమ జాతుల్లో భూమిపై జన్మిస్తారు. వేదాంతాన్ని గూర్చి చర్చించే బ్రాహ్మణులు విష్ణువును నిందిస్తారు.

**వేదబాహ్యవ్రతాచారా దురాచారా వృథాశ్రమాః ।**
**మోహయన్తి జనాన్సర్వాన్ దర్శయిత్వా ఫలాని చ ॥ 31 ॥**

వేదవ్యతిరేకనియమాలు ఆచారాలు కలవారు, చెడునడత కలవారు, అనవసరంగా శ్రమపడేవాళ్ళు ఆయా ఫలాలను చూపి జనులను మోసగిస్తారు.

**తమసావిష్టమనసో బైడాల వ్రతికాధమాః ।**
**కలౌ రుద్రో మహాదేవో లోకానామీశ్వరః పరః ॥ 32 ॥**

తమోగుణాక్రాంతమనస్కులై బిడాలవ్రతంవంటి ప్రవర్తన కల్గి అధములై ప్రవర్తిస్తారు. కలిలో లోకాలకు రుద్రుడే గొప్ప ప్రభువు, మహాదేవుడు.

**తదేవ సాధయేన్నౄణాం దేవతానాం చ దైవతమ్ ।**
**కరిష్యత్యవతారాణి శంకరో నీలలోహితః ॥ 33 ॥**

దేవతలకు పరదైవతమైన శివుడు మానవులకు ఫలసిద్ధిని కలిగిస్తాడు. నీలలోహితుడైన ఆ శంకరుడు అవతారాలను ధరించగలడు.

**శ్రౌతస్మార్తప్రతిష్ఠార్థం భక్తానాం హితకామ్యయా ।**
**ఉపదేక్ష్యన్తి తద్జ్ఞానం శిష్యాణాం బ్రహ్మసంజ్ఞితమ్ ॥ 34 ॥**

**సర్వవేదాన్తసారం హి ధర్మాన్వేద నిదర్శితాన్ ।**
**సర్వవర్ణాన్సముద్దిశ్య స్వధర్మా యే నిదర్శితాః ॥ 35 ॥**

శ్రౌతస్మార్తాలైన కర్మలను నెలకొల్పటానికి భక్తుల హితకాంక్షతో శిష్యులకు గురువులు బ్రహ్మసంజ్ఞకల జ్ఞానాన్నుపదేశిస్తారు. వేదాంతాల సారాన్ని వేదప్రతిపాదిత ధర్మాలను బ్రాహ్మణాది వర్ణాల స్వధర్మాలను వారు బోధిస్తారు.

**యే తం ప్రీతా నిషేవన్తే యేన కేనోపచారతః ।**
**విజిత్య కలిజాన్దోషాన్ యాన్తి తే పరమం పదమ్ ॥ 36 ॥**

శివుని ప్రీతితో పద్ధతిననుసరించి సేవించేవారు కలిదోషాలను అధిగమించి పరమపదాన్ని పొందుతారు.

**అనాయాసేన సుమహత్పుణ్యమాప్నోతి మానవః ।**
**అనేకదోషదుష్టస్య కలేరేకో మహాన్గుణః ॥ 37 ॥**

అధికశ్రమలేకుండా శివుని సేవించే మనుజుడు గొప్ప పుణ్యాన్ని పొందుతాడు. దోషాధిక్యం కల కలియుగాని కిదొకటే గొప్పగుణం.

**తస్మాత్సర్వప్రయత్నేన ప్రాప్య మాహేశ్వరం యుగమ్ ।**
**విశేషాద్బ్రాహ్మణో రుద్రమీశానం శరణం వ్రజేత్ ॥ 38 ॥**

అందువల్ల సంపూర్ణ ప్రయత్నంతో మాహేశ్వరయుగాన్ని పొంది ముఖ్యంగా బ్రాహ్మణుడు ఈశ్వరుడైన రుద్రుని శరణు పొందాలి.

**యే నమన్తి విరూపాక్షమీశానం కృత్తివాససమ్ ।**
**ప్రసన్నచేతసో రుద్రం తే యాన్తి పరమం పదమ్ ॥ 39 ॥**

విరూపాక్షుడు, కృత్తివాసుడు, ఈశ్వరుడైన శివుని నిర్మలమైన మనసుతో నమస్కరించేవారు పరమపదాన్ని పొందుతారు.

**యథా రుద్రనమస్కారః సర్వకామఫలో ధ్రువః ।**
**అన్యదేవనమస్కారాన్న తత్ఫలమవాప్నుయాత్ ॥ 40 ॥**

రుద్రునికి చేసే నమస్కారం అన్ని కోరికలను సఫలం చేసేట్టు ఇతరదేవతా నమస్కారం సఫలం చేయజాలదు.

**ఏవం విధే కలియుగే దోషాణామేవ శోధనమ్ ।**
**మహాదేవనమస్కారో ధ్యానం దాన మితి శ్రుతిః ॥ 41 ॥**

ఈ కలియుగంలో దోషాలను నివారించే మార్గం మహాదేవునికి చేసే నమస్కారం, శివుని ధ్యానం, దానం అని వేదం తెలుపుతున్నది.

**తస్మాదనీశ్వరా నన్యాన్ త్యక్త్వా దేవం మహేశ్వరమ్ ।**
**సమాశ్రయేద్విరూపాక్షం యదీచ్ఛేత్పరమం పదమ్ ॥ 42 ॥**

పరమపదాన్ని పొందాలనుకున్నవాడు ఇతరదేవతలను వదలి విరూపాక్షుడు మహేశ్వరుడైన ఆ దేవునే ఆశ్రయించాలి.

**నార్చయన్తీహ యే రుద్రం శివం త్రిదశవన్దితమ్ ।**
**తేషాం దానం తపో యజ్ఞో వృథా జీవితమేవ చ ॥ 43 ॥**

దేవపూజ్యుడైన శివుని పూజింపనివాడు చేసే దానం, తపస్సు, యజ్ఞం, వారి జీవితం కూడ నిష్ఫలమనే తెలుసుకోవాలి.

**నమో రుద్రాయ మహతే దేవదేవాయ శూలినే ।**
**త్ర్యమ్బకాయ త్రినేత్రాయ యోగినాం గురవే నమః ॥ 44 ॥**

దేవదేవుడు శూలి మహాత్ముడైన రుద్రునికి నమస్కారం. త్రినేత్రుడు యోగులకు గురువైన శివునికి నమస్కారం.

**నమోఽస్తు దేవదేవాయ మహాదేవాయ వేధసే ।**
**శమ్భవే స్థాణవే నిత్యం శివాయ పరమేష్ఠినే ॥ 45 ॥**

అమరాధిపతి, మహాదేవుడు, బ్రహ్మస్వరూపుడు, స్థాణువు, శంకరుడు, పరమేష్ఠి అయిన ఎల్లప్పుడు మంగళరూపుడైన శివునికి నమస్కారం.

**నమఃసోమాయ రుద్రాయ మహాగ్రాసాయ హేతవే ।**
**ప్రపద్యేఽహం విరూపాక్షం శరణ్యం బ్రహ్మచారిణమ్ ॥ 46 ॥**

సోముడు, రుద్రుడు, ప్రళయకారి, కారణభూతుడైన దేవునకు నమస్కారం. విరూపాక్షుడు, బ్రహ్మచారి, శరణ్యుడైన దేవుని నేనాశ్రయిస్తున్నాను.

**మహాదేవం మహాయోగ మీశానం చామ్బికాపతిమ్ ।**
**యోగినాం యోగదాతారం యోగమాయాసమావృతమ్ ॥ 47 ॥**

**యోగినాం గురుమాచార్యం యోగిగమ్యం పినాకినమ్ ।**
**సంసారతారణం రుద్రం బ్రహ్మాణం బ్రహ్మణోఽధిపమ్ ॥ 48 ॥**

మహాదేవుడు, గొప్పయోగి, పార్వతీపతి, ఈశ్వరుడు, యోగులకు యోగాన్ని ఉపదేశించేవాడు, యోగమాయ ఆవరించి ఉన్నవాడు, యోగులకు గురువు, ఆచార్యస్థానీయుడు, యోగిగమ్యుడు, పినాకపాణి, సంసారోత్తారకుడు, బ్రహ్మస్వరూపుడు బ్రహ్మాధిపతి అయిన రుద్రుని శరణు పొందుతున్నాను.

**శాశ్వతం సర్వగం శాన్తం బ్రహ్మణ్యం బ్రాహ్మణప్రియమ్ ।**
**కపర్దినం కాలమూర్తిమమూర్తిం పరమేశ్వరమ్ ॥ 49 ॥**

**ఏకమూర్తిం మహామూర్తిం వేదవేద్యం దివస్పతిమ్ ।**
**నీలకణ్ఠం విశ్వమూర్తిం వ్యాపినం విశ్వరేతసమ్ ॥ 50 ॥**

**కాలాగ్నిం కాలదహనం కామదం కామనాశనమ్ ।**
**నమస్యే గిరిశం దేవం చన్ద్రావయవ భూషణమ్ ॥ 51 ॥**

**విలోహితం లేలిహాన మాదిత్యం పరమేష్ఠినమ్ ।**
**ఉగ్రం పశుపతిం భీమం భాస్కరం పరమం తపః ॥ 52 ॥**

అన్నికాలాల్లో ఉండేవాడు, అన్నింటిలో నిండి ఉన్నవాడు, శాంతుడు, బ్రహ్మనిష్ఠుడు, బ్రాహ్మణులకు ప్రియమైనవాడు, కపర్ది, కాలరూపుడు, రూపంలేనివాడు, పరమేశ్వరుడు, అఖండరూపం కలవాడు, మహామూర్తిమంతుడు, వేదవేద్యుడు, స్వర్గాధిపతి, నీలకంఠుడు, విశ్వమూర్తి, వ్యాపనశీలం కలవాడు, సృష్టికి మూలం, ప్రళయాగ్నిరూపుడు, కాలుని దాహకుడు, కోరికలిచ్చేవాడు, కాముని కాల్చినవాడు, చంద్రకళాభూషణుడు, కైలాసపర్వతంలో శయనించే దేవుడు, ఎరుపురంగుకలవాడు, నాలుకతో ఆస్వాదించేవాడు, ఆదిత్యుడు, పరమేష్ఠి భయంకరుడు, పశుపతి, తీక్ష్ణరూపంగల సూర్యుడు, గొప్పతపోమూర్తి అయిన శివునికి నమస్కరిస్తున్నాను.

**ఇత్యేతల్లక్షణం ప్రోక్తం యుగానాం వై సమాసతః ।**
**అతీతానాగతానాం వై యావన్మన్వన్తరక్షయః ॥ 53 ॥**

మన్వంతరముయొక్క సమాప్తిపర్యంతము గడచినవి, రాబోయేవి అయిన యుగముల సంగ్రహ లక్షణము చెప్పబడినది.

**మన్వన్తరేణ చైకేన సర్వాణ్యేవాన్తరాణి వై ।**
**వ్యాఖ్యాతాని న సన్దేహః కల్పః కల్పేన చైవ హి ॥ 54 ॥**

ఒక మన్వంతరం వివరించటంతో మన్వంతరాలన్నీ వివరించినట్లే. దానిలో సందేహం లేదు. అట్లే ఒక కల్పం ఇతరకల్పాలకు కూడ వ్యాఖ్యానమే.

**మన్వన్తరేషు చైతేషు అతీతానాగతేషు వై ।**
**తుల్యాభిమానినః సర్వే నామరూపై ర్భవన్త్యుత ॥ 55 ॥**

ఈమన్వంతరంలో, గడచిన రానున్న మన్వంతరాల్లో అందరు నామరూపాలతో అభిమానం కలవారై ఉంటారు.

**ఏవముక్తో భగవతా కిరీటీ శ్వేతవాహనః ।**
**బభార పరమాం భక్తిమీశానేఽవ్యభిచారిణీమ్ ॥ 56 ॥**

ఈ విధంగా మహాత్ముడు వ్యాసుడు చెప్పగా శ్వేతవాహనుడైన అర్జునుడు ఈశ్వరుడైన శివునియందు నిశ్చలమైన గొప్ప భక్తి కలవాడైనాడు.

**నమశ్చకార తమృషిం కృష్ణద్వైపాయనం ప్రభుమ్ ।**
**సర్వజ్ఞం సర్వకర్తారం సాక్షాద్విష్ణుం వ్యవస్థితమ్ ॥ 57 ॥**

కృష్ణద్వైపాయనుడైన వ్యాసునికి నమస్కరించినాడు. ఆ వ్యాసుడు సర్వజ్ఞుడు, అన్నీ చేయగలవాడు, స్వయంగా శ్రీవిష్ణుస్వరూపుడై అవతరించినవాడు.

**తమువాచ పునర్వ్యాసః పార్థం పరపురఞ్జయమ్ ।**
**కరాభ్యాం సుశుభాభ్యాం చ సంస్పృశ్య ప్రణతం మునిః ॥ 58 ॥**

శత్రుసంహారకుడైన ఆ అర్జునుని తనకు నమస్కరిస్తున్నవాణ్ణి వ్యాసముని మంగళకారకాలైన చేతులతో పట్టుకొని మళ్ళీ ఇట్లుపదేశించినాడు.

**ధన్యోఽస్యనుగృహీతోఽసి త్వాదృశోఽన్యో న విద్యతే ।**
**త్రైలోక్యే శఙ్కరే నూనం భక్తః పరపురఞ్జయ! ॥ 59 ॥**

శత్రుపురాలను జయించిన అర్జునా! నీవు ధన్యుడవు. అనుగ్రహింపబడినావు. శంకరుని యందు భక్తికలవాడు నీతో సమానుడు ముల్లోకాల్లోను లేడు.

**దృష్టవానసి తం దేవం విశ్వాక్షం విశ్వతోముఖమ్ ।**
**ప్రత్యక్షమేవ సర్వేషాం రుద్రం సర్వజగన్మయమ్ ॥ 60 ॥**

విశ్వాక్షుడు, విశ్వతోముఖుడు, సర్వజగన్మయుడైన రుద్రుని నీవు ప్రత్యక్షంగా చూచినవాడవు.

**జ్ఞానం తదైశ్వరం దివ్యం యథావద్విదితం త్వయా ।**
**స్వయమేవ హృషీకేశః ప్రీత్యోవాచ సనాతనః ॥ 61 ॥**

ఈశ్వరసంబంధదివ్యజ్ఞానం నీవు నిజతత్త్వరూపంతో తెలుసుకొన్నావు. సనాతనుడైన నారాయణుడు స్వయంగా సంతోషంతో ఇట్లన్నాడు.

**గచ్ఛ గచ్ఛ స్వకం స్థానం న శోకం కర్తుమర్హసి ।**
**వ్రజస్వ పరయా భక్త్యా శరణ్యం శరణం శివమ్ ॥ 62 ॥**

నీ స్థానానికి వెంటనే బయలుదేరు. నీవు దుఃఖింపరాదు. గొప్పభక్తితో శరణ్యుడైన శివుని శరణుపొందు.

**ఏవముక్త్వా స భగవాననుగృహ్యార్జునం ప్రభుః ।**
**జగామ శాఙ్కరపురీం సమారాధయితుం భవమ్ ॥ 63 ॥**

భగవంతుడైన వ్యాసుడిట్లాపలికి అర్జుననునుగ్రహించి శివారాధనకుగాను శివుని కాశీనగరానికి వెళ్ళిపోయెను.

**పాణ్డవేయోఽపి తద్వాక్యాత్సంప్రాప్య శరణం శివమ్ ।**
**సన్త్యజ్య సర్వకర్మాణి జ్ఞాత్వా తత్పరమోఽభవత్ ॥ 64 ॥**

అర్జునుడు కూడ ఆ వ్యాసుని వాక్యం వల్ల శివుని శరణు పొంది అన్ని కర్మలను వదలి శివతత్త్వమెరిగి అందులో శ్రద్ధకలవాడైనాడు.

**నార్చునేన సమఃశమ్భోర్భక్త్యా భూతో భవిష్యతి ।**
**ముక్త్వా సత్యవతీసూనుం కృష్ణం వా దేవకీసుతమ్ ॥ 65 ॥**

సభక్తికంగా శివునిపూజించుటతో సమానమైనది ఇంతకు ముందు లేదు, ఇక ముందుండబోదు. సత్యవతీసుతుడు వ్యాసుని, దేవకిపుత్రుడు కృష్ణుని విడచినచో అతనితో సమానుడు మరొకడులేడు.

**తస్మై భగవతే నిత్యం నమః శాన్తాయ ధీమతే! ।**
**పారాశర్యాయ మునయే వ్యాసాయామితతేజసే ॥ 66 ॥**

శాంతుడు, బుద్ధిమంతుడు, పూజ్యుడు, పరాశరపుత్రుడు, అమితతేజోనిధి, వ్యాసునికి ఎల్లప్పుడు నమస్కారం.

**కృష్ణద్వైపాయనః సాక్షాద్విష్ణురేవ సనాతనః ।**
**కోహ్యన్యస్తత్త్వతో రుద్రం వేత్తి తం పరమేశ్వరమ్ ॥ 67 ॥**

కృష్ణద్వైపాయనుడైన వ్యాసుడు సాక్షాత్తు సనాతనుడైన విష్ణువే. పరమేశ్వరుడైన రుద్రుని తత్త్వాన్ని ఆయన తప్ప ఇతరుడెవడు తెలుసుకోగలడు?

**నమః కురుధ్వం తమృషిం కృష్ణం సత్యవతీసుతమ్ ।**
**పారాశర్యం మహాత్మానం యోగినం విష్ణుమవ్యయమ్ ॥ 68 ॥**

సత్యవతీకుమారుడు, కృష్ణవర్ణుడు, పారాశర్యుడు, యోగీశ్వరుడు, మహాత్ముడు, అవ్యయుడు, విష్ణుస్వరూపుడైన ఆ వ్యాసఋషికి నమస్కరించండి.

**ఏవముక్త్వా తు మునయః సర్వ ఏవ సమాహితాః ।**
**ప్రణేముస్తం మహాత్మానం వ్యాసం సత్యవతీసుతమ్ ॥ 69 ॥**

ఆ మునులందరు ఇట్లు పలికి సావధానులై మహాత్ముడు సత్యవతీసుతుడైన వ్యాసునికి నమస్కరించినారు.

**ఇతి శ్రీ కూర్మపురాణే వ్యాసార్జున సంవాదే యుగధర్మనిరూపణం నామ త్రింశోఽధ్యాయః ॥ 30 ॥**

శ్రీ కూర్మపురాణంలోని వ్యాసార్జునసంవాదంలో యుగధర్మ నిరూపణం అనే ముప్పైయవ అధ్యాయం ॥ 30 ॥



## ఏక త్రింశో౽ధ్యాయః - ముప్పది ఒకటవ అధ్యాయం

## వారాణసీమాహాత్మ్యమ్ - వారాణసీ మాహాత్మ్యం

**ఋషయః ఊచుః :-** ఋషులు పలికారు

**ప్రాప్య వారాణసీం దివ్యాం కృష్ణద్వైపాయనో మునిః ।**
**కిమకార్షీన్మహాబుద్ధిః శ్రోతుం కౌతూహలం హి నః ॥ 1 ॥**

మహాబుద్ధిమంతుడైన కృష్ణద్వైపాయనుడను వ్యాసుడు దివ్యమైన వారాణసిని చేరుకొని ఏమిచేసినాడు? వినాలని మాకు మిక్కిలి కుతూహలమున్నది.

**సూత ఉవాచ :-**సూతుడు పలికాడు

**ప్రాప్య వారాణసీం దివ్యాముపస్పృశ్య మహామునిః ।**
**పూజయామాస జాహ్నవ్యాం దేవం విశ్వేశ్వరం శివమ్ ॥ 2 ॥**

మహాముని వ్యాసుడు వారాణసిని చేరి గంగానదిలో స్నానమాచరించి విశ్వేశ్వరుడైన శివుని పూజించినాడు.

**త మాగతం మునిం దృష్ట్వా తత్ర యే నివసన్తి వై ।**
**పూజయాంచక్రిరే వ్యాసం మునయో మునిపుఙ్గవమ్ ॥ 3 ॥**

అక్కడ నివసించే మునులు అక్కడకు వచ్చిన వ్యాసుని చూచి మునిశ్రేష్ఠుడయిన అతనిని గౌరవంగా పూజించినారు.

**పప్రచ్ఛుః ప్రణతాస్సర్వే కథాం పాపప్రణాశినీమ్ ।**
**మహాదేవాశ్రయాం పుణ్యాం మోక్షధర్మాన్సనాతనాన్ ॥ 4 ॥**

వారందరు మునికి నమస్కరించి పాపాలను నశింపచేసే శివసంబంధమైన కథనుర సనాతనాలైన మోక్షధర్మాలను తెలుపవలసినదని అడిగారు.

**స చాపి కథయామాస సర్వజ్ఞో భగవానృషిః ।**
**మాహాత్మ్యం దేవదేవస్య ధర్మ్యం వేదనిదర్శనాత్ ॥ 5 ॥**

అన్ని విషయాలు తెలిసిన మహాత్ముడు వ్యాసఋషి కూడ దేవదేవుడైన శివుని మాహాత్మ్యాన్ని ధర్మంతో కూడిన దానిని వేదప్రమాణ పూర్వకంగా వారికి వివరించినాడు.

**తేషాం మధ్యే మునీన్ద్రాణాం వ్యాసశిష్యో మహామునిః ।**
**పృష్టవాఞ్జైమినిర్వ్యాసం గూఢమర్థం సనాతనమ్ ॥ 6 ॥**

ఆ మునుల్లో వ్యాసశిష్యుడైన జైమినిముని అనాదిసిద్ధమూ రహస్యమైన తత్త్వాన్ని గూర్చి ఇట్లా అడిగాడు.

**జైమినిరువాచ :–**జైమిని పలికాడు.

**భగవన్సంశయం చైకం ఛేత్తు మర్హసి సర్వవిత్ ।**
**న విద్యతే హ్యవిదితం భవతః పరమర్షిణః ॥ 7 ॥**

సర్వజ్ఞుడవైన ఓ మహాత్మా! మా సంశయాన్నొకదాన్ని నివారించగలవాడవు నీవు. మహర్షివైన నీకు తెలియని విషయమేదీ లేదు.

**కేచిద్ధ్యానం ప్రశంసన్తి ధర్మమేవాపరే జనాః ।**
**అన్యే సాంఖ్యం తథా యోగం తపశ్చాన్యే మహర్షయః ॥ 8 ॥**

కొందరు ధ్యానం గొప్పదని, మరికొందరు ధర్మం శ్రేష్ఠమని, ఇతరులు సాంఖ్యం, యోగం, తపస్సు గొప్పవని ఆయా ఋషులు వేరువేరుగా చెపుతున్నారు.

**బ్రహ్మచర్యమథో నూన మన్యే ప్రాహు ర్మహర్షయః ।**
**అహింసా సత్యమప్యన్యే సన్న్యాస మపరే విదుః ॥ 9 ॥**

మరికొందరు మహర్షులు బ్రహ్మచర్యమే గొప్పదని నిశ్చయంగా చెప్పుతున్నారు. కొందరు అహింసను, మరికొందరు సత్యాన్ని, ఇతరులు సన్న్యాసాన్ని శ్రేష్ఠంగా గుర్తిస్తున్నారు.

**కేచిద్దయాం ప్రశంసన్తి దానమధ్యయనం తథా ।**
**తీర్థయాత్రాం తథా కేచిదన్యే చేన్ద్రియనిగ్రహమ్ ॥ 10 ॥**

కొందరు దయను ప్రశంసిస్తారు. దానం, వేదాధ్యయనం, తీర్థయాత్ర, ఇంద్రియనిగ్రహం ఉత్తమధర్మాలుగా కొందరు పండితులు కీర్తిస్తున్నారు.

**కిమేషాం చ భవేచ్ఛ్రేయః ప్రబ్రూహి మునిపుఙ్గవ! ।**
**యది వా విద్యతేఽప్యన్యద్గుహ్యం తద్వక్తుమర్హసి ॥ 11 ॥**

**శ్రుత్వా స జైమినే ర్వాక్యం కృష్ణద్వైపాయనో మునిః ।**
**ప్రాహ గమ్భీరయా వాచా ప్రణమ్య వృషకేతనమ్ ॥ 12 ॥**

ఓ మునిశ్రేష్ఠుడా! పై వానిలో ఎక్కువ శ్రేయస్కరమైనదేదో తెలుపగలవు. ఇవికాక మరో రహస్య తత్త్వమున్నట్లైతే దాన్ని దయతో మాకు తెలుపగలవు. జైమిని మాటవిన్న కృష్ణద్వైపాయన వ్యాసర్షి వృషభధ్వజుడైన శివునికి మనసులో నమస్కరించి గంభీరమైన వాక్కుతో ఇట్లు చెప్పినాడు.

**శ్రీ భగవానువాచ :–** వ్యాసభగవానుడు పలికాడు

**సాధు సాధు మహాభాగ యత్పృష్టం భవతా మునే! ।**
**వక్ష్యే గుహ్యతమాద్గుహ్యం శృణ్వన్త్వన్యే మహర్షయః ॥ 13 ॥**

ఓ మహానుభావా! నీ వడిగిన విషయం చాల బాగున్నది. రహస్యాల్లో రహస్యమైన ఆ విషయాన్ని చెపుతాను. ఇతర మహర్షులు కూడ వినండి.

**ఈశ్వరేణ పురా ప్రోక్తం జ్ఞానమేతత్సనాతనమ్ ।**
**గూఢ మప్రాజ్ఞవిద్విష్టం సేవితం సూక్ష్మదర్శిభిః ॥ 14 ॥**

అతిపురాతనమైన ఈ జ్ఞానమార్గం పూర్వం ఈశ్వరుడు తెలిపినాడు. ఇది మిక్కిలి రహస్యమైనది. బుద్ధిహీనులు దీన్ని ద్వేషించినారు. సూక్ష్మదర్శులు దీన్ని ఆచరించినారు.

**నాశ్రద్దధానే దాతవ్యం నాభక్తే పరమేష్ఠినః ।**
**నావేదవిదుషే దేయం జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ॥ 15 ॥**

జ్ఞానాలన్నింటిలో ఉత్తమజ్ఞానమైన ఈ రహస్యాన్ని శ్రద్ధ లేనివారికి, ఈశ్వరునియందు భక్తి లేనివానికి ఉపదేశింపరాదు. వేదాలు తెలియనివారికి ఈయతగనిది.

**మేరుశృఙ్గే మహాదేవమీశానం త్రిపురద్విషమ్ ।**
**దేవాసనగతా దేవీ మహాదేవమపృచ్ఛత ॥ 16 ॥**

త్రిపురారి అయిన శివుడు మేరుపర్వతశిఖరమందుండగా దేవాసనమందు కూర్చున్న పార్వతి శివునిట్లు ప్రశ్నించినది.

**శ్రీదేవ్యువాచ :**-పార్వతి ఇలా పలికింది.

**దేవదేవ ! మహాదేవ ! భక్తానామార్తినాశన ! ।**
**కథం త్వాం పురుషో దేవమచిరాదేవ పశ్యతి ॥ 17 ॥**

దేవదేవుడైన ఓ మహాదేవా! భక్తుల బాధలు తీర్చేవాడా! లోకంలో మనుష్యుడు నిన్ను శీఘ్రంగా ఎట్లా దర్శించగల్గుతాడు?

**సాంఖ్యం యోగస్తపో ధ్యానం కర్మయోగశ్చ వైదికః ।**
**ఆయాసబహులాన్యాహుర్యాని చాన్యాని శఙ్కర! ॥ 18 ॥**

ఓ శంకరా! సాంఖ్యము, యోగం, తపస్సు, ధ్యానం, వేదప్రతిపాదితమైన కర్మయోగం కూడ అధికశ్రమ సాధ్యాలని చెపుతారు. ఇతర ఉపాయాలు కూడ అట్టివే.

**యేన విభ్రాన్తచిత్తానాం విజ్ఞానాం యోగినామపి ।**
**దృశ్యో హి భగవాన్సూక్ష్మః సర్వేషామపి దేహినామ్ ॥ 19 ॥**

**ఏతద్గుహ్యతమం జ్ఞానం గూఢం బ్రహ్మాదిసేవితమ్ ।**
**హితాయ సర్వభక్తానాం బ్రూహి కామాఙ్గనాశన! ॥ 20 ॥**

విభ్రాంతచిత్తులైన జ్ఞానవంతులు యోగులు ఇతర సర్వప్రాణులు కూడ ఏ ఉపాయంతో సూక్ష్మరూపుడైన భగవంతుని సాక్షాత్కరించుకొంటారో అటువంటి రహస్యమైనది, నిగూఢమైనది, బ్రహ్మాదులు సేవించే ఆ జ్ఞానాన్ని శంకరా! సమస్త భక్తజన హితంకోసం మాకు బోధించవలసినది.

**ఈశ్వర ఉవాచ :**–ఈశ్వరుడు పలికాడు

**అవాచ్యమేతద్గూఢార్థం జ్ఞానమజ్ఞైర్బహిష్కృతమ్ ।**
**వక్ష్యే తవ యథాతత్త్వం యదుక్తం పరమర్షిభిః ॥ 21 ॥**

ఈ జ్ఞానం గూఢార్థం కలది. అజ్ఞానులకందతగనిది. అందరికి చెప్పతగనిది. దాన్ని మహర్షులు వివరించిన విధంగా యథాతథంగా నీకు చెపుతాను.

**పరం గుహ్యతమం క్షేత్రం మమ వారాణసీ పురీ ।**
**సర్వేషామేవ భూతానాం సంసారార్ణవతారిణీ ॥ 22 ॥**

ఈ వారాణసీనగరం మిక్కిలి రహస్యమైన మహిమకల క్షేత్రం. ఇది నా నివాసస్థానం. సర్వప్రాణులను సంసారసముద్రం నుండి దాటించేది ఈ క్షేత్రం.

**తస్మిన్భక్తా మహాదేవి మదీయం వ్రతమాస్థితాః ।**
**నివసన్తి మహాత్మానః పరం నియమమాస్థితాః ॥ 23 ॥**

పార్వతీ! నా భక్తులు ఆ క్షేత్రంలో నా వ్రతాన్నవలంబించిన మహానుభావులై గొప్ప నియమాన్ని పాటిస్తూ ఉంటారు.

**ఉత్తమం సర్వతీర్థానాం స్థానానా ముత్తమం చ యత్ ।**
**జ్ఞానానాముత్తమం జ్ఞానమవిముక్తం పరం మమ ॥ 24 ॥**

సర్వతీర్థాల్లో శ్రేష్ఠమైనది. అన్ని ప్రదేశాల్లో ఉత్తమమైనది. జ్ఞానాల్లో ఉత్తమ జ్ఞానస్వరూపమైన అవిముక్తక్షేత్రం నాకు మిక్కిలి ప్రియమైనది.

**స్థానాన్తరే పవిత్రాణి తీర్థాన్యాయతనాని చ ।**
**శ్మశానే సంస్థితాన్యేవ దివి భూమిగతాని చ ॥ 25 ॥**

ఇతర స్థలాల్లో పవిత్రాలైన తీర్థాలు స్థలాలు ఆకాశంలో ఉన్నవి, భూమిపైనున్నవి అన్నీ శ్మశానరూపమైన అవిముక్తక్షేత్రంలోనివే.

**భూలోకే నైవ సంలగ్నమన్తరిక్షే మమాలయమ్ ।**
**అవిముక్తా న పశ్యన్తి ముక్తాః పశ్యన్తి చేతసా ॥ 26 ॥**

భూలోకంతో సంబంధం లేని నా నివాసస్థానాన్ని ముక్తులు కానివారు చూడలేరు. మోక్షాన్ని పొందినవారు మనోనేత్రంతో చూడగల్గుతారు.

**శ్మశానమేతద్విఖ్యాతమవిముక్తమితి స్మృతమ్ ।**
**కాలో భూత్వా జగదిదం సంహరామ్యత్ర సున్దరి! ॥ 27 ॥**

ఈ అవిముక్తక్షేత్రం శ్మశానమనే పేర ప్రసిద్ధమైనది. ఓ దేవీ! నేనిక్కడ కాలరూపినై ప్రలయకాలంలో ఈ లోకాన్ని నశింపచేస్తాను.

**దేవీదం సర్వగుహ్యానాం స్థానం ప్రియతమం మమ ।**
**మద్భక్తా యత్ర గచ్ఛంతి మామేవ ప్రవిశన్తి తే ॥ 28 ॥**

ఓ దేవీ! ఈ స్థలం అన్ని రహస్యాలకు ఆధారమైనది. నాకు ప్రియమైనది. నా భక్తులు ఎక్కడికి వెళ్ళినా వారు నన్నే చేరుకొంటారు.

**దత్తం జప్తం హుతఞ్చేష్టం తపస్తప్తం కృతం చ యత్ ।**
**ధ్యానమధ్యయనం జ్ఞానం సర్వం తత్రాక్షయం భవేత్ ॥ 29 ॥**

ఈ క్షేత్రంలో చేసిన దానం, జపం, హెూమం, తపస్సు, ఇతరమైన పుణ్యకర్మ, ధ్యానం, జ్ఞానం అన్నీ అక్షయమై ఉంటాయి.

**జన్మాన్తరసహస్రేషు యత్పాపం పూర్వసఞ్చితమ్ ।**
**అవిముక్తే ప్రవిష్టస్య తత్సర్వం వ్రజతి క్షయమ్ ॥ 30 ॥**

ముందటి వేలజన్మల్లో చేసిన పాపం అవిముక్త క్షేత్రంలో ప్రవేశించినవానికి సంపూర్ణంగా నశిస్తుంది.

**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రా యే వర్ణసఙ్కరాః ।**
**స్త్రియో మ్లేచ్ఛాశ్చ యేచాన్యే సఙ్కీర్ణాః పాపయోనయః ॥ 31 ॥**

**కీటాః పిపీలికాశ్చైవ యేచాన్యే మృగపక్షిణః ।**
**కాలేన నిధనం ప్రాప్తాః అవిముక్తే వరాననే! ॥ 32 ॥**

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతివారు, వర్ణసాంకర్యం కలవారు, స్త్రీలు, మ్లేచ్ఛులు, ఇతర సంకీర్ణజాతులు, పాపకర్ములు, కీటక, పిపీలికా, మృగ, పక్షులు, అవిముక్త క్షేత్రంలో అవసానకాలంలో ప్రాణాలు వదులుతాయి.

**చన్ద్రార్ధమౌలయస్త్ర్యక్షా మహావృషభవాహనాః ।**
**శివే మమ పురే దేవి జాయన్తే తత్ర మానవాః ॥ 33 ॥**

ఓ దేవీ! వారు శుభకరమైన నా నగరంలో చంద్రచూడులు, త్రినేత్రులు, వృషభవాహనులైన మనుష్యులుగా జన్మిస్తారు.

**నావిముక్తే మృతః కశ్చిన్నరకం యాతి కిల్బిషీ ।**
**ఈశ్వరానుగృహీతా హి సర్వే యాన్తి పరాం గతిమ్ ॥ 34 ॥**

అవిముక్తంలో మరణించిన వాడెవ్వడూ నరకానికి వెళ్ళడు. అక్కడ మరణించిన వారందరు ఈశ్వరానుగ్రహంతో మోక్షాన్ని పొందుతారు.

**మోక్షం సుదుర్లభం జ్ఞాత్వా సంసారం చాతిభీషణమ్ ।**
**అశ్మనా చరణౌ హత్వా వారాణస్యాం వసేన్నరః ॥ 35 ॥**

మోక్షం కష్టసాధ్యమనీ, సంసారం భీకరమనీ తెలుసుకొని రాళ్ళతో కాళ్ళు విరుచుకొనైనా కాశిలో నివసించాలి.

**దుర్లభా తపసోఽవాప్తి ర్భూతస్య పరమేశ్వరి ।**
**యత్ర తత్ర విపన్నస్య గతిః సంసారమోక్షణీ ॥ 36 ॥**

ఓ పరమేశ్వరీ! ప్రపంచంలో ప్రాణికి తపస్సు చేసే అవకాశం దుర్లభం. అట్టి లోకంలో ఆపద పొందిన వానికి సంసారబంధం విడిపించుకొనే ఉపాయం కాశీనివాసమే.

**ప్రసాదా ద్దహ్యతే హ్యేనో మమశైలేన్ద్రనన్దిని ।**
**అత్రాబుధా న పశ్యన్తి మమ మాయావిమోహితాః ॥ 37 ॥**

పార్వతీ! నా అనుగ్రహం వల్ల మానవుల పాపం నశిస్తుంది. అపండితులీవిషయాన్ని నా మాయవల్ల మోహితులై తెలుసుకొనలేరు.

**అవిముక్తం న పశ్యన్తి మూఢా యే తపసా వృతాః ।**
**విణ్మూత్ర రేతసాం మధ్యే సంవిశన్తి పునః పునః ॥ 38 ॥**

తమోగుణం గల అజ్ఞానులు అవిముక్తాన్ని చూడక మలమూత్రశుక్రాల మధ్య మాటిమాటికి ప్రవేశిస్తారు.

**హన్యమానోఽపి యో దేవి విశేద్విఘ్నశతైరపి ।**
**స యాతి పరమం స్థానం యత్ర గత్వా న శోచతి ॥ 39 ॥**

ఓ దేవి! అనేక ఆటంకాలున్నా అవిముక్తం ప్రవేశించినవాడు శోకంలేని పరమపదాన్ని పొందుతాడు.

**జన్మమృత్యుజరాముక్తః పరం యాతి శివాలయమ్ ।**
**అపునర్మరణానాం హి సా గతి ర్మోక్షకాంక్షిణామ్ ॥ 40 ॥**

జన్మమృత్యుజరాముక్తుడై శివసాయుజ్యాన్ని చేరుతాడు. మోక్షార్థికి గమ్యస్థానం అదే.

**యాం ప్రాప్య కృతకృత్యః స్యాదితి మన్యేత పణ్డితః ।**
**న దానైర్న తపోభిశ్చ న యజ్ఞై ర్నాపి విద్యయా ॥ 41 ॥**

పండితుడు ఆ గతినిపొంది కృతార్థునిగా భావిస్తాడు. దాన తపోయజ్ఞాలతో కాని పాండిత్యంతో కాని ఆ ఉత్తమగతి లభించదు.

**ప్రాప్యతే గతిరుత్కృష్టా యాఽవిముక్తే తు లభ్యతే ।**
**నానావర్ణా వివర్ణాశ్చ చణ్డాలాద్యా జుగుప్సితాః ॥ 42 ॥**

**కిల్బిషైః పూర్ణదేహా యే ప్రకృష్టైస్తాపకైస్తథా ।**
**భేషజం పరమం తేషామవిముక్తం విదుర్బుధాః ॥ 43 ॥**

ఆ ఉత్తమగతి అవిముక్తక్షేత్రంలో లభిస్తుంది. అనేకవర్ణాలవారు, అసహ్యించుకోదగిన చండాలురు మొదలగువారు, పాపాలు నిండిన శరీరులు, బాధించే రోగాలు గలవారు మొదలైనవారికి అవిముక్తం ఉత్తమౌషధంగా పండితులెరుగుదురు.

**అవిముక్తం పరంజ్ఞాన మవిముక్తం పరంపదమ్ ।**
**అవిముక్తం పరంతత్త్వ మవిముక్తం పరంశివమ్ ॥ 44 ॥**

అవిముక్త క్షేత్రం గొప్పజ్ఞాన రూపమైనది, పరమపదము, పరమతత్త్వరూపం, గొప్ప మంగళకరం.

**కృత్వావై నైష్ఠికీం దీక్షామవిముక్తే వసన్తి యే ।**
**తేషాం తత్పరమం జ్ఞానం దదామ్యన్తే పరం పదమ్ ॥ 45 ॥**

అవిముక్త క్షేత్రంలో నిష్ఠతో దీక్ష పొంది నివసించేవారికి పరమజ్ఞానాన్ని కల్గించి చివరకు మోక్షాన్ననుగ్రహిస్తాను.

**ప్రయాగం నైమిషం పుణ్యం శ్రీశైలోఽథ హిమాలయః ।**
**కేదారం భద్రకర్ణఞ్చ గయా పుష్కరమేవ చ ॥ 46 ॥**

**కురుక్షేత్రం రుద్రకోటి ర్నర్మదా హాటకేశ్వరమ్ ।**
**శాలిగ్రామఞ్చ పుష్పాగ్రం వంశం కోకాముఖం తథా ॥ 47 ॥**

**ప్రభాసం విజయేశానం గోకర్ణం శఙ్కు కర్ణకమ్ ।**
**ఏతాని పుణ్యస్థానాని త్రైలోక్యే విశ్రుతాని చ ॥ 48 ॥**

ప్రయాగ, నైమిషం, శ్రీశైలం, హిమాలయం, కేదారం, భద్రకర్ణం, గయ, అట్లే పుష్కరక్షేత్రం, కురుక్షేత్రం, రుద్రకోటి, నర్మదానది, హాటకేశ్వరం, శాలిగ్రామం, పుష్పాగ్రం, వంశం, కోకాముఖం, ప్రభాసతీర్థం, విజయేశానం, గోకర్ణం, శంకుకర్ణం అనే క్షేత్రాలు ముల్లోకాల్లో ప్రసిద్ధాలైన పుణ్యస్థలాలు.

**యాస్యన్తి పరమం మోక్షం వారాణస్యాం యథా మృతాః ।**
**వారాణస్యాం విశేషేణ గఙ్గా త్రిపథగామినీ ॥ 49 ॥**

కాశిలో మరణించినవారు మోక్షాన్ని పొందినట్టే ముందు చెప్పిన క్షేత్రాల్లోను ముక్తిని పొందుతారు. వారాణసిలో ముఖ్యంగా త్రిపథగ అయిన గంగ ప్రవహిస్తుంటుంది.

**ప్రవిష్టా నాశయేత్పాపం జన్మాన్తరశతైః కృతమ్ ।**
**అన్యత్ర సులభా గఙ్గా శ్రాద్ధం దానం తథా జపః ॥ 50 ॥**

వ్రతాని సర్వమేవైతద్వారాణస్యాం సుదుర్లభమ్ ।
యజేత్తు జుహుయాన్నిత్యం దదాత్యర్చయతేఽపరాన్ ॥ 51 ॥

వాయుభక్షశ్చ సతతం వారాణస్యాం స్థితో నరః ।
యది పాపో యది శఠో యది చాధార్మికో నరః ॥ 52 ॥

వారాణసీం సమాసాద్య పునాతి స కులత్రయమ్ ।
వారాణస్యాం మహాదేవం యే స్తువన్త్యర్చయన్తి చ ॥ 53 ॥

సర్వపాపవినిర్ముక్తాస్తే విజ్ఞేయా గణేశ్వరాః ।
అన్యత్ర యాగా ద్జ్ఞానాద్వా సన్యాసాదథవాన్యతః ॥ 54 ॥

ప్రాప్యతే తత్పరం స్థానం సహస్రేణైవ జన్మనా ।
యే భక్తా దేవదేవేశే వారాణస్యాం వసన్తి వై ॥ 55 ॥

తే విన్దన్తి పరం మోక్ష మేకేనైవ తు జన్మనా ।
యత్ర యోగస్తథా జ్ఞానం ముక్తిరేకేన జన్మనా ॥ 56 ॥

అవిముక్తం సమాసాద్య నాన్యద్గచ్ఛే త్తపోవనమ్ ।
యతో మయా న ముక్తం తదవిముక్త మితి స్మృతమ్ ॥ 57 ॥

గంగలో మునుగగానే వందలకొలది పూర్వజన్మల్లో చేసిన పాపాలు నశిస్తాయి. ఇతర స్థలాలో గంగానది సులభంగా అందగలదు. శ్రాద్ధం దానం జపం కూడ వ్రతాలు, ఇవన్నీ ఇతరత్రా పొందవచ్చు. వారాణసిలో పొందటం కష్టం. యాగం హోమం సర్వదా ఆచరించాలి. దానం చేయటం, ఇతరులను పూజించటం, వాయుభక్షణం చేస్తూ ఎల్లపుడు వారణాసిలో నివసించే మనిషి పాపాత్ముడైనా మొండివాడైనా అధార్మికుడైనా– అతడు వారాణసి చేరుకొని మూడు వంశాలను పవిత్రం చేస్తాడు. వారాణసిలో మహాదేవుడైన శివుని స్తోత్రం చేసేవాడు, పూజించేవాడు, అన్ని పాపాలు పోగొట్టుకొని గణేశ్వరులౌతారని తెలుసుకోవాలి. యాగం వల్లకాని, జ్ఞానయోగం వల్లకాని, సన్యాసం వల్లకాని మరే ఉపాయం వల్లనైనా పరమస్థానం పొంద వీలు కాదు. వేయి జన్మల్లోను అసాధ్యం. మహాదేవునందు భక్తికల్గి వారాణసిలో నివసించేవారు ఒక్క జన్మతోనే పరమమోక్షస్థానాన్ని పొందుతారు. ఒక జన్మలోనే యోగం జ్ఞానం మోక్షం లభించే స్థానం అవిముక్తం మాత్రమే. అవిముక్తానికి వెళ్ళి మళ్ళీ ఇంకో తపోవనానికి వెళ్ళరాదు. నేను విడువనందువల్లనే అది అవిముక్త మని ప్రసిద్ధి చెందినది.

తదేవ గుహ్యం గుహ్యానామేతద్విజ్ఞాయ ముచ్యతే ।
జ్ఞానధ్యాననివిష్టానాం పరమానన్దమిచ్ఛతామ్ ॥ 58 ॥

యా గతిర్విహితా సుభ్రు! సాఽవిముక్తే మృతస్య తు ।
యాని కాన్యవిముక్తాని దేవైరుక్తాని నిత్యశః ॥ 59 ॥

అదే రహస్యాల్లోకెల్ల రహస్యమైనది. దీనిని తెలుసుకొని ముక్తి పొందవచ్చును. సర్వోత్తమమైన ఆనందాన్ని కోరుతూ జ్ఞానధ్యానాల్లో నిమగ్నులైన వారికి ఓ దేవీ! ఏ పుణ్యగతి తెలుపబడినదో అది అవిముక్త క్షేత్రంలో మరణించిన వారికి లభిస్తుంది.

**పురీ వారాణసీ తేభ్యః స్థానేభ్యోఽ పృధికా శుభా ।**
**యత్ర సాక్షాన్మహాదేవో దేహాన్తేఽ క్షయ్యమీశ్వరః ॥ 60 ॥**

**వ్యాచష్టే తారకం బ్రహ్మ తథైవ హ్యావిముక్తకమ్ ।**
**యత్తత్పరతరం తత్త్వమవిముక్తమితి స్మృతమ్ ॥ 61 ॥**

అవిముక్త స్థలాలుగా దేవతలు నిత్యం తెలిపే స్థలాలన్నింటిలో వారాణసి ఎక్కువ శుభకరమైనది. అచట సాక్షాత్తు మహాదేవుడు నివసిస్తున్నాడు. దేహావసానంలో ఈశ్వరుడు శాశ్వతమైన స్థానంలో తారకబ్రహ్మ మంత్రాన్ని ఉపదేశిస్తాడు. అందువల్ల అది అవిముక్తక్షేత్రమని చెప్పబడినది.

**ఏకేన జన్మనా దేవి వారాణస్యాం తదాప్యతే ।**
**భ్రూమధ్యే నాభిమధ్యే చ హృదయేఽ పి చ మూర్ధని ॥ 62 ॥**

**యథాఽ విముక్తమాదిత్యే వారాణస్యాం వ్యవస్థితమ్ ।**
**వరణాయాస్తథా హ్యస్యా మధ్యే వారాణసీ పురీ ॥ 63 ॥**

దేవీ! ఒక జన్మలోనే వారాణసిలో దాన్ని పొందవచ్చును. కనుబొమలమధ్య నాభిమధ్య వక్షఃస్థలంలో శిరసునందుకూడ సూర్యమండలంలో ఉన్నట్లే వారాణసి అనే అవిముక్త క్షేత్రంలో ఆ పరతత్త్వం నిలిచి ఉన్నది. వరణ – అసి అనే నదులమధ్య వారాణసి నగరమున్నది.

**తత్రైవ సంస్థితం తత్త్వం నిత్యమేవావిముక్తకమ్ ।**
**వారాణస్యాః పరంస్థానం న భూతం న భవిష్యతి ॥ 64 ॥**

అక్కడనే పరతత్త్వమైన అవిముక్తం నెలకొన్నది. వారాణసికంటే శ్రేష్ఠమైన స్థానం ఇంతకుముందు లేదు. ఇకముందు ఉండబోదు.

**యథా నారాయణో దేవో మహాదేవాదివేశ్వరాత్ ।**
**తత్ర దేవాః సగన్ధర్వాః సయక్షోరగ రాక్షసాః ॥ 65 ॥**

**ఉపాసతే మాం సతతం దేవదేవః పితామహః ।**
**మహాపాతకినో యే చ యే తేభ్యః పాపకృత్తమాః ॥ 66 ॥**

**వారాణసీం సమాసాద్య తే యాన్తి పరమాం గతిమ్ ।**
**తస్మా న్ముముక్షుభి ర్నియతో వసేచ్చామరణాన్తికమ్ ॥ 67 ॥**

భగవంతుడు నారాయణుడు మహాదేవుడైన ఈశ్వరునివల్ల నిలిచి ఉన్నట్టే అక్కడ గంధర్వులు యక్షులు నాగులు రాక్షసులతో కూడ దేవతలు దేవదేవుడైనా బ్రహ్మ ఎల్లపుడు నన్ను సేవింతురు. పాపాత్ములు వారాణసిని చేరి ఉత్తమమైన ముక్తిని పొందుతారు. అందువల్ల మోక్షార్థి నియమబద్ధుడై మరణపర్యంతం కాశిలో నివసించాలి.

**వారాణస్యాం మహాదేవి జ్ఞానం లబ్ధ్వా విముచ్యతే ।**
**కిన్తు విఘ్నా భవిష్యన్తి పాపోపహతచేతసామ్ ॥ 68 ॥**

ఓ మహాదేవీ! వారణాసిలో మనుజుడు జ్ఞానాన్ని పొంది విముక్తుడవుతాడు. కాని పాపాక్రాంత మనస్కులకు ఆటంకాలు కలుగుతాయి.

**తతో నైవ చరేత్పాపం కాయేన మనసా గిరా ।**
**ఏతద్రహస్యం వేదానాం పురాణానాం ద్విజోత్తమాః ॥ 69 ॥**

అందువల్ల మనోవాక్కాయాలతో పాపం చేయకూడదు. బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఇది వేద పురాణాల సారమైన రహస్యం.

**అవిముక్తాశ్రయం జ్ఞానం న కిఞ్చిద్వేద్మి తత్పరమ్ ।**
**దేవతానామృషీణాఞ్చ శృణ్వతాం పరమేష్ఠినామ్ ॥ 70 ॥**

**దేవ్యై దేవేన కథితం సర్వపాప వినాశనమ్ ।**
**యథా నారాయణః శ్రేష్ఠో దేవానాం పురుషోత్తమః ॥ 71 ॥**

**యథేశ్వరాణాం గిరిశః స్థానానాం చైత దుత్తమమ్ ।**
**యైః సమారాధితో రుద్రః పూర్వస్మిన్నేవ జన్మని ॥ 72 ॥**

**తే విన్దన్తి పరం క్షేత్రమవిముక్తం శివాలయమ్ ।**
**కలికల్మష సమ్భూతా యేషాముపహతా మతిః ॥ 73 ॥**

**న తేషాం వీక్షితుం శక్యం స్థానం తత్పరమేష్ఠినః ।**
**యే స్మరన్తి సదాకాలం విన్దన్తి చ పురీమిమామ్ ॥ 74 ॥**

అవిముక్త స్థలాన్ని ఆశ్రయించి జ్ఞానమున్నది. దానికి భిన్నమైనదేదీ నాకు తెలియదు. శ్రేష్ఠులైన దేవతలు ఋషులు వినుచుండగా ఈశ్వరుడు దేవికి పాపాలను నశింపచేసే ఈ జ్ఞానాన్ని తెలిపినాడు. దేవతలలో పురుషోత్తముడు నారాయణుడు ఎట్లో ప్రభువుల్లో పరమేశ్వరుడు ఎట్లా శ్రేష్ఠుడో అన్ని స్థానాల్లో అవిముక్తం అట్లే ప్రశస్తమైనది. ఎవరు పూర్వజన్మంలో రుద్రుని బాగా పూజించినారో వారు శివుని వాసస్థానమైన అవిముక్తం గొప్ప క్షేత్రంగా తెలుసుకుంటారు. ఎవరి బుద్ధి కలిపాప ప్రభావంతో కలుషితమైనదో వారికి పరమేశ్వరుని అవిముక్త స్థానం చూడటానికి వీలుకాదు. కాలస్వరూపుడైన శివుని ఎల్లపుడు స్మరించేవారు ఈ నగరాన్ని చేరుతారు.

**తేషాం వినశ్యతి క్షిప్రమిహాముత్ర చ పాతకమ్ ।**
**యాని చేహ ప్రకుర్వన్తి పాపాని తు కృతాలయాః ॥ 75 ॥**

**నాశయేత్తాని సర్వాణి తేన కాలతనుః శివః ।**
**ఆగచ్ఛతా మిదంస్థానం సేవితుం మోక్షకాంక్షిణామ్ ॥ 76 ॥**

**మృతానాం వై పునర్జన్మ న భూయో భవసాగరే ।**
**తస్మా త్సర్వప్రయత్నేన వారాణస్యాం వసేన్నరః ॥ 77 ॥**

వారికి ఇహపరాల్లో సంభవించిన పాపమంతా నశిస్తుంది. ఇక్కడ నివసించినవారు ఆచరించిన పాపాలను కూడ కాలస్వరూపుడు శివుడు నశింప చేస్తాడు. మోక్షేచ్ఛతో ఈ క్షేత్రాన్ని సేవించటానికి వచ్చేవారికి ఇక్కడ మరణించినవారికి మళ్ళీ భవసాగరంలో పుట్టుక లేదు. అందువల్ల అన్ని ప్రయత్నాలతో మనుజుడు వారణాసిలో నివసించాలి.

**యోగీ వాప్యథవాఽయోగీ పాపీ వా పుణ్యకృత్తమః ।**
**న లోకవచనా త్పిత్రో ర్న చైవ గురువాదతః ॥ 78 ॥**
**మతి రుత్క్రమణీయా స్యాదవిముక్తాగతిం ప్రతి.**

యోగికాని, అయోగికాని, పాపికాని, పుణ్యాత్ముడైనా కాని జనుల మాట ననుసరించి తలిదండ్రులు లేదా గురువు మాట వల్లకాని అవిముక్త క్షేత్ర పుణ్యగతిని గూర్చి సంశయంవైపు బుద్ధిని మరల్చకూడదు.

**సూత ఉవాచ :** సూతుడు పలికాడు.

**ఏవముక్త్వాఽథ భగవాన్ వ్యాసో వేదవిదాం వరః ।**
**సహైవ శిష్యప్రవరైర్వారాణస్యాం చచార హ ॥ 79 ॥**

అని చెప్పి వేదవిదుల్లో శ్రేష్ఠుడైన భగవాన్ వ్యాసర్షి శిష్యసమూహంతో కూడ వారణాసి పట్టణంలో సంచరించినాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే వారాణసీమాహాత్మ్యం నామ ఏకత్రింశోఽధ్యాయః ॥ 31 ॥**

శ్రీకూర్మపురాణంలో వారాణసీ మాహాత్మ్యమనే ముప్పది ఒకటవ అధ్యాయం. ॥ 31 ॥



## ద్వాత్రింశోఽధ్యాయః - ముప్పై రెండవ అధ్యాయం

## వారాణసీ మాహాత్మ్యమ్ - వారాణసీమాహాత్మ్యం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**సశిష్యైః సంవృతో ధీమాన్ గురుర్ద్వైపాయనో మునిః ।**
**జగామ విపులం లిఙ్గ మోఙ్కారం ముక్తిదాయకమ్ ॥ 1 ॥**

**తత్రాభ్యర్చ్య మహాదేవం శిష్యైః సహ మహామునిః ।**
**ప్రోవాచ తస్య మాహాత్మ్యం మునీనాం భావితాత్మనామ్ ॥ 2 ॥**

ధీమంతుడైన ఆ వ్యాసమహాముని శిష్యులతోకూడి మోక్షదాయకమూ విశాలమైన ఓంకార లింగంకల స్థానానికి వెళ్ళినాడు. అక్కడ ఆ ముని శిష్యులతోకూడ మహాదేవుని పూజించి, ఆ దేవుని గొప్పతనాన్ని శ్రేష్ఠులైన మునులకిట్లా వివరించినాడు.

**ఇదం తద్విమలం లిఙ్గ మోఙ్కారం నామ శోభనమ్ ।**
**అస్య స్మరణ మాత్రేణ ముచ్యతే సర్వపాతకైః ॥ 3 ॥**

నిర్మలమైన ఈ లింగం ఓంకారమనే పేరు కలది. శుభకరమైనది. దీనిని స్మరించిన మనుజుడు సర్వపాప వినిర్ముక్తుడవుతాడు.

**అత్ర తత్పరమం జ్ఞానం పఞ్చాయతనముత్తమమ్ ।**
**అర్చితం మునిభిర్నిత్యం వారాణస్యాం విమోక్షదమ్ ॥ 4 ॥**

**అత్ర సాక్షాన్మహాదేవః పఞ్చాయతనవిగ్రహః ।**
**రమతే భగవాన్రుద్రో జన్తూనా మపవర్గదః ॥ 5 ॥**

వారాణసిలో ఇచ్చట పంచాయతన స్వరూపం కలది పరమజ్ఞానరూపమైనది, మోక్షదాయకమైనది. మును లెప్పుడూ పూజిస్తూ ఉంటారు. ఈ పంచాయతన స్వరూపుడైన రుద్రుడు ప్రాణులకు మోక్షప్రదాతయై ఇక్కడ విహరిస్తుంటాడు.

**యత్తత్పాశుపతం జ్ఞానం పఞ్చార్థమితి కథ్యతే ।**
**తదేవ విమలం లిఙ్గ మోఙ్కారం సమవస్థితమ్ ॥ 6 ॥**

పశుపతికి సంబంధించిన జ్ఞానం పంచార్థమని చెప్పబడినది. నిర్మలమైన ఆ లింగస్వరూపమే ఓంకార లింగంగా నెలకొన్నది.

**శాన్త్యతీతా పరాశాన్తి ర్విద్యా చైవ యథా క్రమమ్ ।**
**ప్రతిష్ఠా చ నివృత్తిశ్చ పఞ్చార్థం లిఙ్గ మైశ్వరమ్ ॥ 7 ॥**

శాంత్యతీతం, పరమశాంతి, విద్య, ప్రతిష్ఠ, నివృత్తి అనే పేర్లతో క్రమంగా ఈశ్వరలింగం పంచార్థమని వ్యవహరింపబడినది.

**పఞ్చానామపి దేవానాం బ్రహ్మాదీనాం యదాశ్రయమ్ ।**
**ఓఙ్కార బోధితం లిఙ్గం పఞ్చాయతనముచ్యతే ॥ 8 ॥**

బ్రహ్మ మొదలైన అయిదుగురు దేవతల కాశ్రయమైనదీ, ఓంకారంతో ప్రతిపాదింపబడే లింగాన్ని పంచాయతనం అంటారు.

**సంస్మరే దైశ్వరం లిఙ్గం పఞ్చాయతన ముత్తమమ్ ।**
**దేహాన్తే తత్పరం జ్యోతి రానన్దం విశతే పునః ॥ 9 ॥**

ఈశ్వర సంబంధి అవ్యయము అయిన పంచాయతన లింగాన్ని దేహావసాన సమయంలో స్మరించాలి. అప్పుడే తేజోవంతమైన ఆత్మ ఆనందరూపంలో లీనమవుతుంది.

**అత్ర దేవర్షయః పూర్వం సిద్ధా బ్రహ్మర్షయ స్తథా ।**
**ఉపాస్య దేవ మీశానం ప్రాప్తవన్తః పరం పదమ్ ॥ 10 ॥**

ఇక్కడే పూర్వం దేవర్షులు సిద్ధులు బ్రహ్మర్షులు రుద్రుని పూజించి పరమగతిని పొందినారు.

**మత్స్యోదర్యాస్తటే పుణ్యం స్థానం గుహ్యతమం శుభమ్ ।**
**గోచర్మమాత్రం విప్రేన్ద్రా ఓఙ్కారేశ్వర ముత్తమమ్ ॥ 11 ॥**

మత్స్యోదరి అనే నదీతీరంలో అతిరహస్యము శుభకరమైన స్థానమున్నది. ఓ బ్రాహ్మణులారా! అది గోచర్మమాత్ర పరిమాణం కలదై ఉత్తమమైన ఓంకారేశ్వరంగా ప్రసిద్ధం.

**కృత్తివాసేశ్వరం లిఙ్గం మధ్యమేశ్వరముత్తమమ్ ।**
**విశ్వేశ్వరం తథోఙ్కార కపర్దీశ్వరముత్తమమ్ ॥ 12 ॥**

**ఏతాని గుహ్యలిఙ్గాని వారాణస్యాం ద్విజోత్తమాః ।**
**నకశ్చిదిహ జానాతి వినా శమ్భోరనుగ్రహాత్ ॥ 13 ॥**

కృత్తివాసేశ్వరము, మధ్యమేశ్వరమనే క్షేత్రం, అట్లే విశ్వేశ్వరుని ఓంకార కపర్దీశ్వర స్థానం, ఇవన్నీ వారాణసిలో రహస్యాలైన శివలింగాలు. శివుని అనుగ్రహం లేకుండా వీనిని ఎవడూ తెలియజాలడు.

**ఏవముక్త్వా యయౌ కృష్ణః పారాశర్యో మహామునిః ।**
**కృత్తివాసేశ్వరం లిఙ్గం ద్రష్టుం దేవస్య శూలినః ॥ 14 ॥**

ఈ విధంగా చెప్పి పరాశరపుత్రుడు గొప్ప ముని అయిన వ్యాసుడు శంకరుని కృత్తివాసేశ్వర పేరుగల లింగాన్ని దర్శించటానికి బయలుదేరినాడు.

**సమభ్యర్చ్య తదా శిష్యైర్మాహాత్మ్యం కృతివాససః ।**
**కథయామాస విప్రేభ్యో భగవాన్ బ్రహ్మవిత్తమః ॥ 15 ॥**

శిష్యులతోకూడ శివుని పూజించి బ్రహ్మవేత్తల్లో శ్రేష్ఠుడైన పూజ్య వ్యాసముని శివుని మాహాత్మ్యాన్ని బ్రాహ్మణులకు తెలియచెప్పినాడు.

**అస్మిన్ స్థానే పురా దైత్యో హస్తీ భూత్వా భవాన్తికమ్ ।**
**బ్రాహ్మణాన్హన్తుమాయాతో యేఽత్ర నిత్యముపాసతే ॥ 16 ॥**

ఈ ప్రదేశంలో పూర్వం ఒక రాక్షసుడు ఏనుగురూపాన్ని ధరించి నిత్యం శివుని పూజించే బ్రాహ్మణులను చంపటానికి వచ్చినాడు.

**తేషాం లిఙ్గాన్మహాదేవః ప్రాదురాసీత్త్రిలోచనః ।**
**రక్షణార్థం ద్విజశ్రేష్ఠా భక్తానాం భక్తవత్సలః ॥ 17 ॥**

అపుడు వారిని రక్షించటానికి శివుడు లింగం నుండి ఆవిర్భవించినాడు. భక్తవత్సలుడైన త్రిలోచనుడు తన భక్తులను కాపాడుకొన్నాడు.

**హత్వా గజాకృతిం దైత్యం శూలేనావజ్ఞయా హరః ।**
**వాసస్తస్యాకరోత్కృత్తిం కృత్తివాసేశ్వరస్తతః ॥ 18 ॥**

గజరూపంలో ఉన్న రాక్షసుని శివుడు శూలంతో సులభంగా చంపి ఆ ఏనుగు చర్మాన్ని వస్త్రంగా చేసుకున్నాడు. అందువల్ల కృత్తివాసేశ్వరుడైనాడు.

**అత్ర సిద్ధిం పరాం ప్రాప్తా మునయో మునిపుఙ్గవాః ।**
**తేనైవ చ శరీరేణ ప్రాప్తాస్తత్పరమం పదమ్ ॥ 19 ॥**

ఇక్కడ పూర్వం మునులు మునిశ్రేష్ఠులు సిద్ధిని పొందినారు. తమ శరీరాలతోనే పరమపదాన్ని చేరుకొన్నారు.

**విద్యా విద్యేశ్వరా రుద్రాః శివా యే వః ప్రకీర్తితాః ।**
**కృత్తివాసేశ్వరం లిఙ్గం నిత్యమావృత్య సంస్థితాః ॥ 20 ॥**

విద్య,విద్యేశ్వరుడు, మంగళరూపులైన రుద్రులు కృత్తివాసేశ్వర లింగాన్ని ఎప్పుడూ పరివేష్టించి ఉంటారు.

**జ్ఞాత్వా కలియుగం ఘోరమధర్మబహులం జనాః ।**
**కృత్తివాసం న ముఞ్చన్తి కృతార్థా స్తే న సంశయః ॥ 21 ॥**

కలియుగం అధర్మబహులమని ఘోరమైనదని తెలుసుకొన్న జనులు కృత్తివాసతీర్థాన్ని వదలి వెళ్ళరు.వారు ధన్యులనుటలో సందేహం లేదు.

**జన్మాన్తర సహస్రేణ మోక్షోఽన్యత్రాప్యతే న వా ।**
**ఏకేన జన్మనా మోక్షః కృత్తివాసే తు లభ్యతే ॥ 22 ॥**

ఇతర స్థలాల్లో వేలజన్మలెత్తినా మోక్షం లభిస్తుందో లేదో కాని ఈ కృత్తివాసతీర్థంలో ఒక జన్మతోనే మోక్షం లభిస్తుంది.

**ఆలయః సర్వసిద్ధానామేతత్స్థానం వదన్తి హి ।**
**గోపితం దేవదేవేన మహాదేవేన శమ్భునా ॥ 23 ॥**

ఈ స్థానం సర్వసిద్ధులకు ఆలయంవంటిదని చెపుతారు. ఇది దేవదేవుడు మహాదేవుడైన శివుని రక్షణలో ఉన్న స్థలం.

**యుగే యుగే హ్యత్ర దాన్తా బ్రాహ్మణా వేదపారగాః ।**
**ఉపాసతే మహాదేవం జపన్తి శతరుద్రియమ్ ॥ 24 ॥**

ప్రతియుగంలో ఇక్కడ జితేంద్రియులు వేదవేత్తలైన బ్రాహ్మణులు మహాదేవుని పూజిస్తారు. శత రుద్రియాన్ని జపిస్తారు.

**స్తువన్తి సతతం దేవం మహాదేవం త్రియమ్బకమ్ ।**
**ధ్యాయన్తో హృదయే నిత్యం స్థాణుం సర్వాన్తరం శివమ్ ॥ 25 ॥**

త్రియంబకుడు మహాదేవుడైన దేవుణ్ణి సర్వవ్యాపకుడైన స్థాణువగు శివుని హృదయంలో సదా ధ్యానిస్తూ స్తోత్రం చేస్తుంటారు.

**గాయన్తి సిద్ధాః కిల గీతకాని యే వారాణస్యాం నివసన్తి విప్రాః ।**
**తేషామథైకేన భవేన ముక్తిర్యే కృత్తివాసం శరణం ప్రపన్నాః ॥ 26 ॥**

సిద్ధులు ఇక్కడ గీతాలు గానం చేస్తారు. వారణాసిలో నివసిస్తూ కృత్తివాసదేవుని శరణు పొందే బ్రాహ్మణులు ఒక జన్మలోనే మోక్షాన్ని పొందుతుంటారు.

**సంప్రాప్య లోకే జగతామభీష్టం సుదుర్లభం విప్రకులేషు జన్మ ।**
**ధ్యానం సమాదాయ జపన్తి రుద్రం ధ్యాయన్తి చిత్తే యతయో మహేశమ్ ॥ 27 ॥**

లోకుల కిష్టమైన కష్టసాధ్యమైన బ్రాహ్మణకులంలో జన్మనొంది ధ్యానంతో రుద్రుణ్ణి జపిస్తారు. సన్న్యాసులు మనసులో మహేశ్వరుని ధ్యానిస్తారు.

**ఆరాధయన్తి ప్రభుమీశితారం వారాణసీమధ్యగతా మునీన్ద్రాః ।**
**యజన్తి యజ్ఞైరభిసన్ధిహీనాః స్తువన్తి రుద్రం ప్రణమంతి శమ్భుమ్ ॥ 28 ॥**

వారాణసీవాసులైన మునులు ప్రభువైన ఈశ్వరునారాధిస్తారు. నిష్కపటులై యజ్ఞాలతో పూజిస్తారు. రుద్రుని స్తుతిస్తారు. శంభునికి నమస్కరిస్తారు.

**నమో భవాయామలభావధామ్నే స్థాణుం ప్రపద్యే గిరిశం పురాణమ్ ।**
**స్మరామి రుద్రం హృదయే నివిష్టం జానే మహాదేవమనేకరూపమ్ ॥ 29 ॥**

అమలభావాలకు స్థానమైన భవునికి నమస్కారం. సనాతనుడు గిరిశయనుడైన శివుని శరణుపొందుతున్నాను. హృదయస్థ రుద్రుని స్మరిస్తున్నాను. అనేక రూపాలుగల మహాదేవుని తెలుసుకుంటున్నాను.

**ఇతి శ్రీ కూర్మపురాణే వారాణసీ మాహాత్మ్యం నామ ద్వాత్రింశోఽధ్యాయః ॥ 32 ॥**

శ్రీ కూర్మపురాణంలో వారాణసీమాహాత్మ్యమనే ముప్పై రెండవ అధ్యాయం ॥ 32 ॥

## త్రయస్త్రింశోఽధ్యాయః - ముప్పై మూడవ అధ్యాయం

## వారాణసీమాహాత్మ్యమ్ - వారాణసీమాహాత్మ్యం

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు

**సమాభాష్య మునీన్ధీమాన్దేవదేవస్య శూలినః ।**
**జగామ లిఙ్గం తద్రష్టుం కపర్దీశ్వరమవ్యయమ్ ॥ 1 ॥**

ధీమంతుడైన వ్యాసుడు మునులు వీడ్కొలుపగా దేవదేవుడు, అవ్యయుడు అయిన కపర్దీశ్వరలింగాన్ని దర్శించటానికి వెళ్ళినాడు.

**స్నాత్వా తత్ర విధానేన తర్పయిత్వా పితౄన్ద్విజాః! ।**
**పిశాచమోచనే తీర్థే పూజయామాస శూలినమ్ ॥ 2 ॥**

విప్రులారా! అతడక్కడ విధివిధానంగా స్నానం పితృతర్పణం కావించి పిశాచమోచన మనే తీర్థంలో శివుని పూజించినాడు.

**తత్రాశ్చర్యమపశ్యంస్తే మునయో గురుణా సహ ।**
**మేనిరే క్షేత్రమాహాత్మ్యం ప్రణేముర్గిరిశం హరమ్ ॥ 3 ॥**

అక్కడ ఆ మునులు గురువుతోకూడ ఒక అద్భుతాన్ని చూచినారు. క్షేత్ర మాహాత్మ్యంగా భావించి గిరీశుడైన శివునికి నమస్కరించినారు.

**కశ్చిదభ్యాజగామేమం శార్దూలో ఘోరరూపధృక్ ।**
**మృగీమేకాం భక్షయితుం కపర్దీశ్వర ముత్తమమ్ ॥ 4 ॥**

అపుడు వారి దగ్గరకొక భయంకరమైన పులి కపర్దీశ్వర లింగం దగ్గరకు ఆడ జింకనొకదాన్ని తినటానికి వచ్చినది.

**తత్ర సా భీతహృదయా కృత్వా కృత్వా ప్రదక్షిణమ్ ।**
**ధావమానా సుసంభ్రాన్తా వ్యాఘ్రస్య వశమాగతా ॥ 5 ॥**

భయంతో ఆ జింక ప్రదక్షిణలు చేసిచేసి తత్తరపాటుతో పరుగెత్తుతూ పులికి చిక్కినది.

**తాం విదార్య నఖైస్తీక్ష్ణైః శార్దూలః సుమహాబలః ।**
**జగామచాన్యద్విజనం స దృష్ట్వా తాన్మునీశ్వరాన్ ॥ 6 ॥**

ఎక్కువ బలం కల్గిన శార్దూలం తన వాడి గోళ్ళతో ఆ జింకను చీల్చి మునులను చూచి మరో నిర్జన ప్రదేశానికి వెళ్ళినది.

**మృతమాత్రా చ సా బాలా కపర్దీశాగ్రతో మృగీ ।**
**అదృశ్యత మహాజ్వాలా వ్యోమ్ని సూర్యసమప్రభా ॥ 7 ॥**

ఆ లేడి కపర్దీశ్వర లింగం ముందు మరణించగానే ఆకాశంలో సూర్యసమాన కాంతిగల గొప్ప జ్వాల కన్పించినది.

**త్రినేత్రా నీలకణ్ఠా చ శశాఙ్కా ఙ్కిత శేఖరా ।**
**వృషాధిరూఢా పురుషైస్తాదృశైరేవ సంయుతా ॥ 8 ॥**

అది మూడు కన్నులు నల్లని మెడ చంద్రకళ తలపైదాల్చి వృషభాన్నధిరోహించి అదే ఆకారంగల పురుషులతో కలిసి ఉండినది.

**పుష్పవృష్టిం విముఞ్చన్తి ఖేచరా స్తస్య మూర్ధని ।**
**గణేశ్వరః స్వయం భూత్వా న దృష్ట స్తత్క్షణాత్తతః ॥ 9 ॥**

ఆకాశచారులైన దేవతలా జింక తలపై పుష్పవర్షాన్ని కురిపించినారు. తర్వాత ఆ జ్వాల గణపతి రూపాన్ని పొంది అదృశ్యమైనది.

**దృష్ట్వైతదాశ్చర్యవరం జైమిని ప్రముఖాస్తదా ।**
**కపర్దీశ్వరమాహాత్మ్యం పప్రచ్ఛుర్గురుమచ్యుతమ్ ॥ 10 ॥**

ఆ అద్భుతాన్ని చూచి జైమిని మొదలైనవారు తమ గురువు వేదవ్యాసుని కపర్దీశ్వరమాహాత్మ్యాన్ని తెల్పవలసినదని అడిగారు.

**తేషాం ప్రోవాచ భగవాన్దేవాగ్రే చోపవిశ్య సః ।**
**కపర్దీశస్య మాహాత్మ్యం ప్రణమ్య వృషభధ్వజమ్ ॥ 11 ॥**

భగవంతుడైన వ్యాసుడు కపర్దీశ్వరునికెదురుగా కూర్చొని వృషభధ్వజుడైన శివునికి నమస్కరించి ఆ మునులకు కపర్దీశ్వరుని మహిమ నిట్లా వివరించినాడు.

**(స్మృత్వైవాశేషపాపౌఘం క్షిప్రమస్య వినశ్యతి,**
**కామక్రోధాదయో దోషా వారాణస్యాం నివాసినః**
**విఘ్నాః సర్వే వినశ్యన్తి కపర్దీశ్వరపూజనాత్,**
**తస్మాత్సదైవ ద్రష్టవ్యం కపర్దీశ్వరముత్తమమ్.)**

**ఇదం దేవస్య తల్లిఙ్గం కపర్దీశ్వర ముత్తమమ్ ।**
**పూజితవ్యం ప్రయత్నేన స్తోతవ్యం వైదికైః స్తవైః ॥ 12 ॥**

(ఈ కపర్దీశ్వరుని స్మరణంతోనే సర్వపాపసమూహం వెంటనే నశిస్తుంది. కామం క్రోధం మొదలైన దోషాలు సర్వవిఘ్నాలు వారాణసిలో ఉండే ఈ దేవుని పూజించినందువల్ల నశిస్తాయి. కాబట్టి ఎల్లప్పుడు కపర్దీశ్వరుణ్ణి దర్శించాలి.)

ఇది కపర్దీశ్వరుని లింగం ఉత్తమమైనది. శ్రద్ధగా పూజించ తగినది. వేద స్తోత్రాలతో కొనియాడతగినది.

**ధ్యాయతామత్ర నియతం యోగినాం శాన్తచేతసామ్ ।**
**జాయతే యోగసిద్ధిశ్చ షణ్మాసేన న సంశయః ॥ 13 ॥**

శాంతమనసుతో నిత్యం ధ్యానించే యోగులకు ఇచ్చట ఆరుమాసాల్లో యోగసిద్ధి లభిస్తుంది. దీనిలో సందేహంలేదు.

**బ్రహ్మహత్యాదిపాపాని వినశ్యన్త్యస్య పూజనాత్ ।**
**పిశాచమోచనే కుణ్డే స్నాతస్యాత్ర సమీపతః ॥ 14 ॥**

బ్రహ్మహత్యవంటి పాపాలు ఈ దేవుని పూజించినందువల్ల నశిస్తాయి. ఈ దగ్గరలోని పిశాచమోచనమనే కుండంలో స్నానం చేసినవాని పాపాలుకూడ తొలగిపోతాయి.

**అస్మిన్ క్షేత్రే పురా విప్రాస్తపస్వీ శంసితవ్రతః ।**
**శఙ్కుకర్ణ ఇతి ఖ్యాతః పూజయామాస శూలినమ్ ॥ 15 ॥**

బ్రాహ్మణులారా! ఈ క్షేత్రంలో పూర్వం ప్రశంసనీయమైన నియమం కల శంకుకర్ణుడనే ప్రసిద్ధుడైన ముని నివసించి శంకరుని పూజించినాడు.

**జజాప రుద్రమనిశం ప్రణవం రుద్రరూపిణమ్ ।**
**పుష్పధూపాదిభిః స్తోత్రైః నమస్కారైః ప్రదక్షిణైః ॥ 16 ॥**

అతడు రుద్రుని రుద్రరూపమైన ఓంకారాన్ని ఎల్లవేళలా జపించినాడు. పుష్పధూపదీపాది ఉపచారాలతో స్తోత్రాలతో నమస్కార ప్రదక్షిణలతో పూజించినాడు.

**ఉవాస తత్ర యోగాత్మా కృత్వా దీక్షాన్తు నైష్ఠికీమ్ ।**
**కదాచిదాగతం ప్రేతం పశ్యతి స్మ క్షుధాన్వితమ్ ॥ 17 ॥**

ఆ శంకుకర్ణుడు యోగసాధనపరుడై నిష్ఠగల దీక్షను పూని ఉండినాడు. ఒకానొకపుడు ఆకలిగొన్న ప్రేతం తన దగ్గరకు రాగా చూచినాడు.

**అస్థి చర్మ పినద్ధాఙ్గం నిశ్వసన్తం ముహుర్ముహుః ।**
**తం దృష్ట్వా స మునిశ్రేష్ఠః కృపయా పరయా యుతః ॥ 18 ॥**

అది అవయవాలను చర్మంతో కప్పుకొని మాటిమాటికి నిట్టూరుస్తూ ఉండినది. దాన్ని ఆ మునిశ్రేష్ఠుడు చూచి మిక్కిలి దయదలచినాడు.

**ప్రోవాచ కో భవాన్కస్మాద్దేశాద్దేశమిమం గతః ।**
**తస్మై పిశాచః క్షుధయా పీడ్యమానోఽబ్రవీద్వచః ॥ 19 ॥**

నీవెవరవు. ఏ ప్రదేశం నుండి ఇక్కడికి వచ్చినావని ప్రశ్నించగా ఆ పిశాచం ఆకలి బాధచే పీడింపబడుతూ ఇట్లా పలికినది.

**పూర్వజన్మన్యహం విప్రో ధనధాన్యసమన్వితః ।**
**పుత్రపౌత్రాదిభిర్యుక్తః కుటుమ్బభరణోత్సుకః ॥ 20 ॥**

పూర్వజన్మలో ధనధాన్యములు సమృద్ధిగాగల ఒక బ్రాహ్మణుడను. కొడుకులు మనుమలతో ఉన్న కుటుంబాన్ని పోషించుటలోనే ఆసక్తి కలిగి ఉంటిని.

**న పూజితా మయా దేవా గావోఽప్యతిథయస్తదా ।**
**న కదాచిత్కృతం పుణ్యమల్పం వా స్వల్పమేవ వా ॥ 21 ॥**

దేవతలను పూజించలేదు. గోవులను అతిథులను సత్కరించలేదు. కొద్ది పుణ్యకార్యమైనా చేయలేదు.

**ఏకదా భగవాన్రుద్రో గోవృషేశ్వరవాహనః ।**
**విశ్వేశ్వరో వారాణస్యాం దృష్టః స్పృష్టో నమస్కృతః ॥ 22 ॥**

ఒకసారి వారాణసిలో వృషభవాహనుడు భగవంతుడైన విశ్వేశ్వరుని చూచి తాకి నమస్కరించినాను.

**తదాఽచిరేణ కాలేన పఞ్చత్వమహమాగతః ।**
**న దృష్టం తన్మహాఘోరం యమస్య వదనం మునే ॥ 23 ॥**

తర్వాత ఓ మునీ! కొంతకాలానికి నేను మరణించినాను. అయినా భయంకరమైన యమలోకాన్ని నేను చూడలేదు.

**ఈదృశీం యోని మాపన్నః పైశాచీం క్షుధయాఽర్దితః ।**
**పిపాసయా పరిక్రాన్తో న జానామి హితాహితమ్ ॥ 24 ॥**

ఇట్టి పిశాచజాతి జన్మను పొంది ఆకలి దాహాలతో బాధపడుతూ మంచిచెడులను గుర్తించలేకున్నాను.

**యది కిఞ్చిత్సముద్ధర్తుముపాయం పశ్యసి ప్రభో! ।**
**కురుష్వ తం నమస్తుభ్యం త్వామహం శరణం గతః ॥ 25 ॥**

ఓ మహాత్మా! నాకీ జన్మవిముక్తికి ఏదైనా ఉపాయమున్న నన్ననుగ్రహింపుము. నీకు నమస్కారం. నేను నిన్ను శరణు పొందుతున్నాను.

**ఇత్యుక్తః శఙ్కుకర్ణోఽథ పిశాచమిదమబ్రవీత్ ।**
**త్వాదృశో న హి లోకేఽస్మిన్విద్యతే పుణ్యకృత్తమః ॥ 26 ॥**

**యత్త్వయా భగవాన్పూర్వం దృష్టో విశ్వేశ్వరః శివః ।**
**సంస్పృష్టో వన్దితో భూయః కోఽన్యస్త్వత్సదృశో భువి ॥ 27 ॥**

ఈ విధంగా పలుకగా శంకుకర్ణుడు పిశాచంతో ఇట్లన్నాడు. ఈ లోకంలో పుణ్యాత్ముల్లో నీవంటివాడు మరొకడు లేదు. నీవు ఇంతకుముందు భగవంతుడు ప్రపంచానికధిపతి అయిన విశ్వేశ్వరుని స్వయంగా దర్శించినావు. స్పృశించి నమస్కరించినావు. అతడు స్వీకరించినాడు. ఈ భూమిలో నీతో సమానుడు మరొకడెవడున్నాడు?

**తేన కర్మవిపాకేన దేశమేతం సమాగతః ।**
**స్నానం కురుష్వ శీఘ్రం త్వమస్మిన్ కుణ్డే సమాహితః ॥ 28 ॥**

పూర్వకర్మ ఫలంగా నీవీ ప్రదేశానికి వచ్చినావు. సావధానుడవై శీఘ్రంగా ఈ కుండంలో స్నానం చేయుము.

**యేనేమాం కుత్సితాం యోనిం క్షిప్రమేవ ప్రహాస్యసి । 29 ॥**

**స ఏవముక్తో మునినా పిశాచో దయావతా దేవవరం త్రినేత్రమ్ ।**
**స్మృత్వా కపర్దీశ్వరమీశితారం చక్రే సమాధాయ మనోఽవగాహమ్ ॥ 30 ॥**

**తదావగాహోన్మునిసన్నిధానే మమార దివ్యాభరణోపపన్నః ।**
**అదృశ్యతార్కప్రతిమే విమానే శశాఙ్కచిహ్నాఙ్కితచారుమౌళిః ॥ 31 ॥**

దాంతో నీవు నింద్యమైన ఈ పిశాచరూపాన్ని తొందరలోనే విడుస్తావు. దయగల శంకుకర్ణుడు అలా చెప్పగా ఆ పిశాచరూపుడు దేవతాశ్రేష్ఠుడు త్రినేత్రుడు ప్రభువైన కపర్దీశ్వరుని స్మరించి మనసు కుదుట పరచుకొని ఆ కుండంలో స్నానం చేసినాడు. ఆ ముని సమీపంలో కుండమందు స్నానం చేయటంవల్ల పిశాచరూపం నశించినది. అప్పుడతడు ఉత్తమాభరణాలతో అలంకృతుడై సూర్యసమంగా ప్రకాశిస్తున్న విమానంలో చంద్రకళతో అందమైన శిరసుగల శివుడు సాక్షాత్కరించినాడు.

**విభాతి రుద్రైరుదితోదివఃస్థైః సమావృతో యోగిభిరప్రమేయైః ।**
**సవాలఖిల్యాదిభి రేష దేవో యథోదయే భానురశేషదేవైః ॥ 32 ॥**

స్వర్గమందలి రుద్రులతో వర్ణనకందని మహిమకల యోగులతోకూడ ప్రకాశించినాడు. ఉదయకాలంలో వాలఖిల్యాది మునులతో సమస్త దేవతలతో పరివృతుడైన సూర్యునివలె అతడుండెను.

**స్తువన్తి సిద్ధా దివి దేవసంఘా నృత్యన్తి దివ్యాప్సరసోఽభిరామాః ।**
**ముఞ్చన్తి వృష్టిం కుసుమాలిమిశ్రాం గన్ధర్వవిద్యాధర కిన్నరాద్యాః ॥ 33 ॥**

ఆకాశంలో సిద్ధులు స్తుతిస్తున్నారు. దేవతాసమూహం కొనియాడుతోంది. అప్సరసలు నాట్యం చేస్తున్నారు. గంధర్వ విద్యాధర కిన్నరాదులు పుష్పవర్షాన్ని కురిపిస్తున్నారు.

**సంస్తూయమానోఽథ మునీన్ద్రసంఘైరవాప్య బోధం భగవత్ప్రసాదాత్ ।**
**సమావిశన్మణ్డలమేవమగ్ర్యం త్రయీమయం యత్ర విభాతి రుద్రః ॥ 34 ॥**

మునిసమూహం కొనియాడగా భగవదనుగ్రహంవల్ల దివ్యజ్ఞానాన్ని పొంది శ్రేష్ఠము వేదత్రయాత్మకమూ అయిన రుద్రుడు ప్రకాశించే దివ్యపదాన్ని అతడు ప్రవేశించినాడు.

**శఙ్కుకర్ణ ఉవాచ:**-శంకుకర్ణుడు పలికాడు

**దృష్ట్వా విముక్తం స పిశాచభూతం మునిఃప్రహృష్టో మనసా మహేశమ్ ।**
**విచిన్త్య రుద్రం కవిమేవమగ్ర్యం ప్రణమ్య తుష్టావ కపర్దినం తమ్ ॥ 35 ॥**

పిశాచరూపాన్ని వదలిన అతనిని చూచి శంకుకర్ణుడు సంతోషించి మహేశ్వరుడైన శివుని మనసులో ధ్యానించి కవి అయిన కపర్దీశ్వరుని నమస్కరించి స్తుతించాడు.

**నమామి నిత్యం పరతఃపరస్తాద్గోప్తారమేకం పురుషం పురాణమ్ ।**
**వ్రజామి యోగీశ్వరమీశితారమాదిత్యమగ్నిం కలిలాధిరూఢమ్ ॥ 36 ॥**

పరాత్పరుడవైన రక్షకుడవు, పురాణపురుషుడవు, అయిన నిన్ను నమస్కరిస్తున్నాను, యోగీశ్వరుడవు, అగ్ని సూర్యస్వరూపుడవు, గహనస్థానాధిష్ఠుడవైన దేవునాశ్రయిస్తున్నాను.

**త్వాం బ్రహ్మపారం హృదిసన్నివిష్టం హిరణ్మయం యోగినమాదిహీనమ్ ।**
**వ్రజామి రుద్రం శరణం దివిష్ఠం మహామునిం బ్రహ్మపరం పవిత్రమ్ ॥ 37 ॥**

వేదాంతగమ్యుడవు, హృదయంలో ఉన్నవాడవు, హిరణ్మయరూపుడవు, యోగివి, జన్మలేనివాడవు, స్వర్గమందున్న గొప్ప మునివి, పవిత్రుడవు, బ్రహ్మాతీతుడవైన రుద్రుని నిన్ను శరణు పొందుతున్నాను.

**సహస్రపాదాక్షిశిరోఽభియుక్తం సహస్రబాహుం తమసః పరస్తాత్ ।**
**త్వాం బ్రహ్మపారం ప్రణమామి శమ్భుం హిరణ్యగర్భాధిపతిం త్రినేత్రమ్ ॥ 38 ॥**

అనంతాలైన పాదాలు కన్నులు శిరస్సులు భుజాలు కలవాడవు. తమోగుణాతీతుడవు. వేదలక్ష్యుడవు. హిరణ్యగర్భునకధిపతివి, త్రినేత్రుడవగు శంభుడవైన నీకు నమస్కరిస్తున్నాను.

**యతః ప్రసూతిర్జగతో వినాశో యేనాహృతం సర్వమిదం శివేన ।**
**తం బ్రహ్మపారం భగవన్తమీశం ప్రణమ్య నిత్యం శరణం ప్రపద్యే ॥ 39 ॥**

శివునివల్ల విశ్వం పుట్టుక నాశాన్ని పొందుతున్నది. ఈ సమస్తం అతని కల్పనమే. అట్టి వేదవేద్యుడైన ఈశ్వరుని నమస్కరించి శరణాగతుడ నగుచున్నాను.

**అలింగమాలోకవిహీనరూపం స్వయంప్రభుం చిత్పతిమైకరూపమ్ ।**
**తం బ్రహ్మపారం పరమేశ్వరం త్వాం నమస్కరిష్యే న యతోఽన్యదస్తి ॥ 40 ॥**

ఏ చిహ్నము లేనివాడు, వెలుగుకందనిరూపుడు, స్వయంగా ప్రభువు, జ్ఞానప్రతిమ ముఖరూపంగా ఉన్నవాడు, వేదవేద్యుడు, పరమేశ్వరుడవైన నీకు నమస్కరిస్తున్నాను. నీకంటే మరేదీ వేరు లేదు.

**యం యోగినస్త్యక్తసబీజయోగా**
**ల్లబ్ధ్వా సమాధిం పరమాత్మభూతాః ।**

**పశ్యన్తి దేవం ప్రణతోఽస్మి నిత్యం**
**తద్బ్రహ్మపారం భవతః స్వరూపమ్ ॥ 41 ॥**

యోగులు బీజసంబంధాన్ని వదలి ధ్యానసమాధినంది పరమాత్మరూపులై పరబ్రహ్మాన్ని దర్శిస్తారు. అట్టి బ్రహ్మపారమైన నీ స్వరూపానికి నమస్కరిస్తున్నాను.

**న యత్ర నామాని విశేషతృప్తి**
**ర్నసందృశే తిష్ఠతి యత్స్వరూపమ్ ।**
**తం బ్రహ్మపారం ప్రణతోఽస్మి నిత్యం**
**స్వయమ్భువం త్వాం శరణం ప్రపద్యే ॥ 42 ॥**

తత్త్వవిషయంలో నామములు తృప్తినీయవు. స్వరూపం ఇంద్రియజ్ఞానానికి గోచరం కాదు. అట్టి స్వయంభువు బ్రహ్మపారమైన నిన్ను శరణు పొంది నిత్యం నమస్కరిస్తున్నాను.

**యద్వేదవాదాభిరతా విదేహం**
**సబ్రహ్మవిజ్ఞానమభేదమేకమ్ ।**
**పశ్యన్త్యనేకం భవతః స్వరూపం**
**తద్బ్రహ్మపారం ప్రణమామి నిత్యమ్ ॥ 43 ॥**

వేదవాదములందు శ్రద్ధ గలవారు విదేహం భేదరహితం అఖండమైన నీ తత్త్వాన్ని దర్శిస్తారు. అట్టి బ్రహ్మపారమైన నీ స్వరూపాన్ని ఎల్లవేళల నమస్కరిస్తున్నాను.

**యతః ప్రధానం పురుషః పురాణో వివర్తతేఽయం ప్రణమంతి దేవాః ।**
**నమామి తం జ్యోతిషి సంనివిష్టం కాలం బృహన్తం భవతః స్వరూపమ్ ॥ 44 ॥**

నీవల్లే ప్రధానతత్త్వం పురాణపురుషుడు పరిణామం చెందుతున్నవి. దేవతలు నమస్కరింతురు. తేజోమయరూపంలో నిల్చిన మహాకాలరూపివైన నీ స్వరూపానికి నమస్కరిస్తున్నాను.

**వ్రజామి నిత్యం శరణం మహేశం స్థాణుం ప్రపద్యే గిరిశం పురాణమ్ ।**
**శివం ప్రపద్యే హరమిన్దుమౌళిం పినాకినం త్వాం శరణం వ్రజామి ॥ 45 ॥**

మహేశ్వరునెల్లపుడు శరణు పొందుతాను. పురాణ పురుషుడు గిరిశయనుడైన శివునాశ్రయిస్తాను. చంద్రమౌళి పినాకి అయిన నిన్ను శరణు పొందుతున్నాను.

**స్తుత్వైవం శఙ్కుకర్ణోఽసౌ భగవన్తం కపర్దినమ్ ।**
**పపాత దణ్డవద్భూమౌ ప్రోచ్చరన్ ప్రణవం శివమ్ ॥ 46 ॥**

ఈ విధంగా శంకుకర్ణుడు భగవంతుడైన శివుని స్తుతించి శివకరమైన ఓంకారాన్ని ఉచ్చరిస్తూ నేలపై దండవత్ప్రణామం చేసినాడు.

**తత్క్షణాత్పరమం లింగం ప్రాదుర్భూతం శివాత్మకమ్ ।**
**జ్ఞానమానన్దమద్వైతం కోటికాలాగ్నిసన్నిభమ్ ॥ 47 ॥**

ఆ క్షణంలో శివస్వరూపము, జ్ఞానా నందాత్మకము, కోటికాలాగ్ని సన్నిభమైన పరమలింగం ఆవిర్భవించినది.

**శఙ్కుకర్ణోఽథ స తదా మునిః సర్వాత్మకోఽమలః ।**
**నిలీనో విమలే లింగే తదద్భుతమివాభవత్ ॥ 48 ॥**

అపుడు శంకుకర్ణుడు నిర్మలమైన ఆ లింగంలో లీనమై సర్వాత్మకుడుగా దోషరహితునిగా రూపొందినాడు. అది అద్భుతంగా సంభవించినది.

**ఏతద్రహస్యమాఖ్యాతం మాహాత్మ్యం చ కపర్దినః ।**
**న కశ్చిద్వేత్తి తమసా విద్వానప్యత్ర ముహ్యతి ॥ 49 ॥**

కపర్దీశ్వరుని ఈ రహస్యం మాహాత్మ్యం కూడ వివరించినాను. తమోగుణ ప్రభావంతో దీన్ని ఎవ్వడును తెలియజాలడు. పండితుడు కూడ ఈ విషయంలో మోహితుడవుతాడు.

**య ఇమాం శృణుయాన్నిత్యం కథాం పాపప్రణాశినీమ్ ।**
**భక్తః పాపవిముక్తాత్మా రుద్రసామీప్యమాప్నుయాత్ ॥ 50 ॥**

పాపనాశిని అయిన ఈ కథను ఎల్లపుడు వినే భక్తుడు పాపవిముక్తుడై శివుని సాన్నిధ్యాన్ని పొందుతాడు.

**పఠేచ్చ సతతం శుద్ధో బ్రహ్మపారం మహాస్తవమ్ ।**
**ప్రాతర్మధ్యాహ్నసమయే స యోగం ప్రాప్నుయాన్నరః ॥ 51 ॥**

మనుజుడు శుద్ధుడై ఎల్లపుడు బ్రహ్మపారమనే స్తోత్రాన్ని ఉదయం మధ్యాహ్నకాలాల్లో చదవాలి. అట్టివాడు యోగసిద్ధిని పొందుతాడు.

**ఇహైవ నిత్యం వత్స్యామో దేవదేవం కపర్దినమ్ ।**
**ద్రక్ష్యామః సతతం దేవం పూజయామస్త్రిలోచనమ్ ॥ 52 ॥**

ఇక్కడనే శాశ్వతంగా నివసిద్దాం. దేవదేవుడైన కపర్దీశ్వరుని దర్శించుకుందాం. త్రినేత్రుడైన ఆ దేవుని ఎల్లపుడు పూజిస్తాము.

**ఇత్యుక్త్వా భగవాన్వ్యాసః శిష్యైః సహ మహాద్యుతిః ।**
**ఉవాస తత్ర యుక్తాత్మా పూజయన్వై కపర్దినమ్ ॥ 53 ॥**

మహాత్ముడు వ్యాసమహాముని ఈ విధంగా చెప్పి గొప్ప తేజస్వియై శిష్యులతోకూడ యుక్తాత్ముడై కపర్దీశ్వరుని పూజిస్తూ అక్కడనే నివసించినాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే వారాణసీ మాహాత్మ్యం నామ త్రయస్త్రింశోఽధ్యాయః ॥ 33 ॥**
శ్రీ కూర్మపురాణంలో వారాణసీమాహాత్మ్యమనే ముప్పై మూడవ అధ్యాయం ॥ 33 ॥

## చతుస్త్రింశోఽధ్యాయః – ముప్పై నాల్గవ అధ్యాయం

## వారాణసీమాహాత్మ్యమ్ – వారాణసీమాహాత్మ్యం

**సూత ఉవాచ :–** సూతుడు చెప్పాడు

**ఉషిత్వా తత్ర భగవాన్ కపర్దీశాన్తికే పునః ।**
**యయౌ ద్రష్టుం మధ్యమేశం బహువర్షగణాన్ప్రభుః ॥ 1 ॥**

పూజ్యుడైన వ్యాసుడు కపర్దీశ్వరసన్నిధిలో నివసించి చాల సంవత్సరాల తర్వాత మధ్యమేశ్వరుని దర్శించటానికి వెళ్ళినాడు.

**తత్ర మన్దాకినీం పుణ్యామృషిసఙ్ఘనిషేవితామ్ ।**
**నదీం విమలపానీయాం దృష్ట్వా హృష్టోఽభవన్మునిః ॥ 2 ॥**

అక్కడ మునులు సేవించే నిర్మలజలం కల పుణ్యప్రదగంగానదిని చూచి వ్యాసుడు సంతోషించినాడు.

**స తామన్వీక్ష్య మునిభిః సహ ద్వైపాయనప్రభుః ।**
**చకార భావపూతాత్మా స్నానం స్నానవిధానవిత్ ॥ 3 ॥**

ఆయన మునిసమూహంతోకూడ గంగానదిని చూచి భక్తిభావంతో పవిత్రమైన హృదయం కలవాడై స్నానవిధి తెలిసినవాడైనందున విధిప్రకారం స్నానమాచరించినాడు.

**(పూజయామాస లోకాదిం పుష్పైర్నానావిధైర్భవమ్ ।**
**ప్రవిశ్య శిష్యప్రవరైః సార్ధం సత్యవతీసుతః)**

**సన్తర్ప్య విధివద్దేవానృషీన్పితృగణాంస్తథా ।**
**మధ్యమేశ్వరమీశానమర్చయామాస శూలినమ్ ॥ 4 ॥**

(ఆ వ్యాసుడు శిష్యులతో కూడ మందిరంలో ప్రవేశించి లోకాలకు మూలకారకుడైన శివుని పలురకాలైన పువ్వులతో పూజించినాడు). దేవతలను, ఋషులను, పితృదేవతలను శాస్త్రప్రకారం తర్పణాలతో పూజించి శూలధారి ఈశానుడైన మధ్యమేశ్వరుని అర్చించినాడు.

**తతః పాశుపతాః శాన్తా భస్మోద్ధూలిత విగ్రహాః ।**
**ద్రష్టుం సమాగతా రుద్రం మధ్యమేశ్వరమీశ్వరమ్ ॥ 5 ॥**

తర్వాత అక్కడి మధ్యమేశ్వరుని దర్శించటానికి శాంతస్వభావులు భస్మమలదుకొన్న పాశుపతులు వచ్చినారు.

**ఓఙ్కారాసక్తమనసో వేదాధ్యయనతత్పరాః ।**
**జటిలా ముణ్డితాశ్చాపి శుద్ధయజ్ఞోపవీతినః ॥ 6 ॥**

**కౌపీనవసనాః కేచిదపరే చాప్యవాససః ।**
**బ్రహ్మచర్యరతాః శాన్తా దాన్తా వై జ్ఞానతత్పరాః ॥ 7 ॥**

వారిలో ఓంకారమందాసక్తి కల మనసున్నవారు, వేదాధ్యయనం చేయటంలో శ్రద్ధ కలవారు, జడలు దాల్చినవారు, శిరోముండితులు, స్వచ్ఛమైన యజ్ఞోపవీతం ధరించిన వారున్నారు. కొందరు కౌపీనం మాత్రం ధరించినవారు, మరికొందరు దిగంబరులున్నారు. వారందరు బ్రహ్మచర్య వ్రతమగ్నులై శమ దమాదులు కలవారు. జ్ఞానమందాసక్తి ఉన్నవారు.

**దృష్ట్వా ద్వైపాయనం విప్రాః శిష్యైః పరివృతం మునిమ్ ।**
**పూజయిత్వా యథాన్యాయమిదంవచనమబ్రువన్ ॥ 8 ॥**

ఆ బ్రాహ్మణులు శిష్యులతో కూడ ఉన్న వ్యాసునిచూచి ఆచారప్రకారం పూజించి ఇట్లన్నారు.

**కో భవాన్ కుత ఆయాతః సహశిష్యైర్మహామునే ।**
**ప్రోచుః పైలాదయః శిష్యాస్తానృషీన్ధర్మ భావితాన్ ॥ 9 ॥**

ఓ మహామునీ! మీరెవరు? శిష్యులతో కూడ ఎక్కడినుండి వచ్చినారు? అని ప్రశ్నింపగా వ్యాసశిష్యుడు పైలుడు మొదలైనవారు ధర్మస్వభావులైన ఆ ఋషులతో ఇట్లన్నారు.

**అయం సత్యవతీసూనుః కృష్ణద్వైపాయనప్రభుః ।**
**వ్యాసః స్వయం హృషీకేశో యేన వేదాః పృథక్కృతాః ॥ 10 ॥**

ఈయన సత్యవతీపుత్రుడు, వేదవ్యాస మహాముని, స్వయం నారాయణస్వరూపుడు, వేదవిభాగం కావించిన దితడే.

**యస్య దేవో మహాదేవః సాక్షాద్దేవః పినాకధృక్ ।**
**అంశాంశే నాభవత్పుత్రో నామ్నా శుక ఇతి ప్రభుః ॥ 11 ॥**

పినాకం దాల్చిన మహాదేవుడు స్వయంగా శుకుడు అనే పేరుతో అంశావతారంగా ఇతనికి కుమారుడై జన్మించినాడు.

**యో వై సాక్షా న్మహాదేవం సర్వభావేన శఙ్కరమ్ ।**
**ప్రపన్నః పరయా భక్త్యా యస్య తత్ జ్ఞానమైశ్వరమ్ ॥ 12 ॥**

ఈ వ్యాసుని జ్ఞానం ఈశ్వరవిషయకం. మంగళకరుడైన మహాదేవునన్నివిధాల స్వయంగా గొప్ప భక్తితో ఆశ్రయించినాడు.

**తతఃపాశుపతాః సర్వే తే చ హృష్టతనూరుహాః ।**
**ఊచురవ్యగ్రమనసో వ్యాసం సత్యవతీసుతమ్ ॥ 13 ॥**

తర్వాత ఆ పాశుపతులు సంతోషంతో పులకితగాత్రులై సత్యవతీపుత్రుడైన వ్యాసుని గూర్చి సుమనస్కులై ఇట్లన్నారు.

**భగవన్ భవతా జ్ఞాతం విజ్ఞానం పరమేష్ఠినః ।**
**ప్రసాదాద్దేవదేవస్య యత్తన్మాహేశ్వరం పరమ్ ॥ 14 ॥**

మహాత్మా! పరమేష్ఠి జ్ఞానం దేవదేవుడు శివుని అనుగ్రహంవల్ల నీకు తెలిసినది. అది ఉత్తమమైన మహేశ్వరునికి సంబంధించినది.

**తద్వదస్మాకమవ్యగ్రం రహస్యం గుహ్యముత్తమమ్ ।**
**క్షిప్రం పశ్యేమ తం దేవం శ్రుత్వా భగవతో ముఖాత్ ॥ 15 ॥**

ఆ విధంగానే నిశ్చలం రహస్యం శ్రేష్ఠం అయిన ఆ జ్ఞానాన్ని మీరు మాకు ఉపదేశించండి. మీవల్ల విని శీఘ్రంగా ఆ దేవుని దర్శించుకుంటాము.

**విసర్జయిత్వా తాఞ్ఛిష్యాన్సుమన్తుప్రముఖాంస్తదా ।**
**ప్రోవాచ తత్పరం జ్ఞానం యోగిభ్యో యోగవిత్తమః ॥ 16 ॥**

అపుడు వ్యాసుడు సుమంతుడు మొదలైన శిష్యులను పంపించి యోగవిదుడైన అతడు ఆ మునులకు ఉత్తమ జ్ఞానాన్ని వివరించినాడు.

**తత్క్షణాదేవ విమలం సమ్భూతం జ్యోతిరుత్తమమ్ ।**
**లీనాస్తత్రైవ తే విప్రాః క్షణాదన్తరధీయత ॥ 17 ॥**

వెంటనే యోగులకు స్వచ్ఛము, శ్రేష్ఠతమమైన ఆ జ్ఞానతేజం సాక్షాత్కరించినది. వారందరు తేజస్సులో లీనమైనారు. క్షణంలో ఆ తేజం అదృశ్యమైనది.

**తతః శిష్యాన్సమాహృత్య భగవాన్ బ్రహ్మవిత్తమః ।**
**ప్రోవాచ మధ్యమేశస్య మాహాత్మ్యం పైలపూర్వకాన్ ॥ 18 ॥**

తర్వాత బ్రహ్మవిదుడు భగవానుడైన వేదవ్యాసుడు పైలుడు మున్నగు శిష్యులను పిలుచుకొని మధ్యమేశ్వరుని మాహాత్మ్యాన్ని వారికి వివరించినాడు.

**అస్మిన్ స్థానే స్వయం దేవో దేవ్యా సహ మహేశ్వరః ।**
**రమతే భగవాన్నిత్యం రుద్రైశ్చ పరివారితః ॥ 19 ॥**

ఈ ప్రదేశంలో భగవాన్ రుద్రుడు రుద్రగణంతో కలిసి పార్వతీదేవితో ఎల్లపుడు విహరిస్తుంటాడు.

**అత్ర పూర్వం హృషీకేశో విశ్వాత్మా దేవకీసుతః ।**
**ఉవాస వత్సరం కృష్ణః సదా పాశుపతైర్వృతః ॥ 20 ॥**

పూర్వకాలంలో విశ్వాత్మ దేవకీసుతుడు శ్రీ కృష్ణుడు పాశుపతగణంతోపాటు ఇక్కడ సంవత్సరకాలం నివసించినాడు.

**భస్మోద్ధూలితసర్వాఙ్గో రుద్రారాధనతత్పరః ।**
**ఆరాధయన్ హరిః శమ్భుం కృత్వా పాశుపతం వ్రతమ్ ॥ 21 ॥**

ఆ కృష్ణుడు శరీరానికి భస్మం పూసుకొని శివుని పూజించటంలో శ్రద్ధకల్గి పాశుపతవ్రతంతో శివుని పూజించినాడు.

**తస్య వై బహవః శిష్యా బ్రహ్మచర్యపరాయణాః ।**
**లబ్ధ్వా తద్వచనాత్ జ్ఞానం దృష్టవన్తో మహేశ్వరమ్ ॥ 22 ॥**

అతని శిష్యులెందరో బ్రహ్మచర్యాన్ని పాటించి కృష్ణునివల్ల జ్ఞానాన్ని పొంది మహేశ్వరుని సాక్షాత్కరించు కున్నారు.

**తస్య దేవో మహాదేవః ప్రత్యక్షం నీలలోహితః ।**
**దదౌ కృష్ణస్య భగవాన్వరదో వరముత్తమమ్ ॥ 23 ॥**

ఆ శ్రీకృష్ణునికి నీలలోహితుడు భగవాన్ మహాదేవుడు ప్రత్యక్షమై వరదుడైనందువల్ల ఉత్తమవరాన్నిచ్చినాడు.

**యేఽ ర్చయిష్యన్తి గోవిన్దం మద్భక్తా విధిపూర్వకమ్ ।**
**తేషాం తదైశ్వరం జ్ఞానముత్పత్స్యతి జగన్మయ ॥ 24 ॥**

జగద్రూపా! నా భక్తులు శాస్త్రప్రకారం గోవిందుని పూజించేవారికి ఐశ్వరమైన సత్యజ్ఞానం అనుభవంలోనికి వస్తుంది.

**త్వమీశోఽ ర్చయితవ్యశ్చ ధ్యాతవ్యో మత్పరైర్జనైః ।**
**భవిష్యసి న సన్దేహో మత్ప్రసాదాద్ద్విజాతిభిః ॥ 25 ॥**

ఓ కృష్ణా! నీవు నా భక్తులకు విప్రులకు పూజ్యుడవు. ధ్యాతవ్యుడవు అవుతావు. ఈ నా అనుగ్రహం సందేహం లేనిది.

**యే చ ద్రక్ష్యన్తి దేవేశం ధ్యాత్వా దేవం పినాకినమ్ ।**
**బ్రహ్మహత్యాదికం పాపం తేషా మాశు వినశ్యతి ॥ 26 ॥**

పినాకపాణి శంకరుని ధ్యానించి దర్శించుకున్నవారు బ్రహ్మహత్య మొదలైన మహాపాపములను కూడ పోగొట్టుకుంటారు.

**ప్రాణాంస్త్యజన్తి యే విప్రాః పాపకర్మరతా అపి ।**
**తే యాన్తి పరమం స్థానం నాత్ర కార్యా విచారణా ॥ 27 ॥**

ఈ వారాణసీక్షేత్రంలో ఎంతటి పాపవృత్తి కలవాడైనా మరణిస్తే సర్వోత్తమ పుణ్యగతినే పొందుతాడు. సందేహం లేదు.

**ధన్యాస్తథ్యన్తు తే విప్రా మందాకిన్యాం కృతోదకాః ।**
**అర్చయన్తి మహాదేవం మధ్యమేశ్వరముత్తమమ్ ॥ 28 ॥**

ఓ బ్రాహ్మణులారా! గంగానదిలో స్నానంచేసి మహాదేవుడు మధ్యమేశ్వరదేవుని పూజించినవారు నిజంగా ధన్యులు.

**స్నానం దానం తపః శ్రాద్ధం పిణ్డనిర్వపణం త్విహ ।**
**ఏకైకశః కృతం విప్రాః పునాత్యాసప్తమం కులమ్ ॥ 29 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఈ క్షేత్రంలో స్నానం దానం తపస్సు శాద్ధకర్మ పిండప్రదానం అనే కార్యాలు ఒక్కొక్కటి ఆచరించినట్లైతే అది ఏడవ కులం వరకు కలవారిని పవిత్రం చేస్తుంది.

**సన్నిహత్యాముపస్పృశ్య రాహుగ్రస్తే దివాకరే ।**
**యత్ఫలం లభతే మర్త్యః తస్మాద్దశగుణం త్విహ ॥ 30 ॥**

రాహుగ్రస్త సూర్యగ్రహణ సమయంలో సన్నిహత్య అనే తీర్థంలో స్నానం చేసినంత ఫలానికి పదింతలు ఈ స్థలంలో పొందగలరు.

**ఏవముక్త్వా మహాయోగీ మధ్యమే శాన్తికే ప్రభుః ।**
**ఉవాస సుచిరం కాలం పూజయన్వై మహేశ్వరమ్ ॥ 31 ॥**

ఈ విధంగా చెప్పి ఆ మహాయోగి వ్యాసుడు మధ్యమేశ్వరుని సాన్నిధ్యంలో మహేశ్వరుని పూజిస్తూ చాలకాలం నివసించినాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే వారాణసీమాహాత్మ్యం నామ చతుస్త్రింశోஉధ్యాయః ॥ 34 ॥**

శ్రీకూర్మపురాణంలో వారాణసీమాహాత్మ్యం అనే ముప్పై నాల్గవ అధ్యాయం ॥ 34 ॥



## **పఞ్చత్రింశోఽధ్యాయః** – ముప్పై అయిదవ అధ్యాయం

## **వారాణసీమాహాత్మ్యమ్** – వారాణసీమాహాత్మ్యం

**సూత ఉవాచ :**–సూతుడు పలికాడు

**తతః సర్వాణి గుహ్యాని తీర్థాన్యాయతనాని చ ।**
**జగామ భగవాన్వ్యాసో జైమినిప్రముఖైర్వృతః ॥ 1 ॥**

**ప్రయాగం పరమం తీర్థం ప్రయాగాదధికం శుభమ్ ।**
**విశ్వరూపం తథా తీర్థం కాలతీర్థ మనుత్తమమ్ ॥ 2 ॥**

**ఆకాశాఖ్యం మహాతీర్థం తీర్థం చైవానుషం పరమ్ ।**
**స్వర్లీనఞ్చ మహాతీర్థం గౌరీతీర్థ మనుత్తమమ్ ॥ 3 ॥**

**ప్రాజాపత్యం పరం తీర్థం స్వర్గద్వారం తథైవ చ ।**
**జమ్బుకేశ్వర మిత్యుక్తం చర్మాఖ్యం తీర్థ ముత్తమమ్ ॥ 4 ॥**

**గయాతీర్థం మహాతీర్థం తీర్థఞ్చైవ మహానదీ ।**
**నారాయణం పరం తీర్థం వాయుతీర్థ మనుత్తమమ్ ॥ 5 ॥**

**జ్ఞానతీర్థం పరం గుహ్యం వారాహం తీర్థముత్తమమ్ ।**
**యమతీర్థం మహాపుణ్యం తీర్థం సంవర్తకం పరమ్ ॥ 6 ॥**

**అగ్నితీర్థం ద్విజశ్రేష్ఠాః కాలకేశ్వర ముత్తమమ్ ।**
**నాగతీర్థం సోమతీర్థం సూర్యతీర్థం తథైవ చ ॥ 7 ॥**

**పర్వతాఖ్యం మహాపుణ్యం మణికర్ణ మనుత్తమమ్ ।**
**ఘటోత్కచం తీర్థవరం శ్రీతీర్థం చ పితామహమ్ ॥ 8 ॥**

**గఙ్గాతీర్థం తు దేవేశం తథా తత్తీర్థ ముత్తమమ్ ।**
**కాపిలఞ్చైవ సోమేశం బ్రహ్మతీర్థ మనుత్తమమ్ ॥ 9 ॥**

తర్వాత పూజ్యుడైన వ్యాసుడు జైమిని మొదలైన శిష్యులతోకూడ రహస్యాలు పుణ్యప్రదాలైన సర్వతీర్థ స్థలాలను చూడటానికి వెళ్ళినాడు. ఆ తీర్థాలను అనగా గొప్ప పుణ్యస్థలమైన ప్రయాగను, దానికంటె శుభాల్ని కలిగించే విశ్వరూప తీర్థాన్ని అదేవిధంగా సాటిలేని కాలతీర్థమనే స్థలాన్ని ఆకాశతీర్థ స్థలాన్ని శ్రేష్ఠమైన ఆనుషమనే తీర్థాన్ని స్వర్లీన మనే గొప్పతీర్థాన్ని అద్వితీయమైన గౌరీతీర్థాన్ని ప్రాజాపత్యమనే తీర్థాన్ని అట్లే స్వర్గద్వారాన్ని, జంబుకేశ్వరమనే పేరుతో వ్యవహరింపబడుచున్న చర్మాఖ్యమనే శ్రేష్ఠమైన తీర్థాన్ని, గయాతీర్థం, మహాతీర్థం, మహానది అనే తీర్థం, శ్రేష్ఠమైన నారాయణ తీర్థం, అద్వితీయమైన వాయుతీర్థం, మిక్కిలి రహస్యమైన జ్ఞానతీర్థం, ఉత్తమమైన వరాహతీర్థం, పుణ్యదాయకమైన యమతీర్థం, సంవర్తకమనే గొప్పతీర్థం, ఓ ద్విజులారా! అగ్నితీర్థం,

శ్రేష్ఠమైన కాలకేశ్వర తీర్థం, నాగతీర్థం సోమతీర్థం అదేవిధంగా సూర్యతీర్థం, పుణ్యాన్ని కలిగించే పర్వతతీర్థం, సాటిలేని మణికర్ణతీర్థం తీర్థాల్లో శ్రేష్ఠమైన ఘటోత్కచతీర్థం, పితామహక్షేత్రం శ్రీతీర్థం, దేవేశస్థలం గంగాతీర్థం, శ్రేష్ఠమైన కాపిలతీర్థం సోమేశక్షేత్రం సాటిలేని బ్రహ్మతీర్థం అను తీర్థాలను గూర్చి వ్యాసుడు వెళ్ళినాడు.

**యత్ర లిఙ్గం పూజనీయం స్నాతుం బ్రహ్మే యదా గతః ।**
**తదానీం స్థాపయామాస విష్ణుస్తల్లిఙ్గ మైశ్వరమ్ ॥**
**తతఃస్నాత్వా సమాగత్య బ్రహ్మే ప్రోవాచ తం హరిమ్ ।**
**మయా నీతమిదం లిఙ్గం కస్మాత్స్థాపిత వానసి ॥**

**తమాహి విష్ణు స్త్వత్తోపి రుద్రే భక్తి ర్దృఢాయతః ।**
**తస్మాత్ ప్రతిష్ఠితం లిఙ్గం నామ్నా తత్ర భవిష్యతి ॥**

**భూతేశ్వరం తథాతీర్థం తీర్థం ధర్మసముద్భవమ్ ।**
**గన్ధర్వతీర్థం సుశుభం వాహ్నేయం తీర్థ ముత్తమమ్ ॥ 10 ॥**

**దౌర్వాసికం హైూమతీర్థం చన్ద్రతీర్థం ద్విజోత్తమాః ।**
**చిత్రాఙ్గదేశ్వరం పుణ్యం పుణ్యం విద్యాధరేశ్వరమ్ ॥ 11 ॥**

పూజనీయమైన లింగాన్ని బ్రహ్మదేవుడు స్నానానికి వెళ్ళినపుడు విష్ణువు ఆ లింగాన్ని ప్రతిష్ఠించినాడు. స్నానంచేసి వచ్చిన బ్రహ్మ నేను తెచ్చిన లింగాన్ని నీవెందుకు ప్రతిష్ఠించితివని విష్ణువును ప్రశ్నించినాడు. నీకంటె నాకు రుద్రునియందు దృఢభక్తి ఉన్నందువల్ల నేనీలింగాన్ని ప్రతిష్ఠించినాను. ఇది నీ పేరుతోనే ప్రసిద్ధి పొందుతుంది అని విష్ణువు బదులిచ్చినాడు). భూతేశ్వర మనే తీర్థం ధర్మసముద్భవమనే తీర్థం శుభాన్ని కూర్చే గంధర్వతీర్థం శ్రేష్ఠమైన అగ్నితీర్థం, బ్రాహ్మణోత్తములారా! దుర్వాసుని హైూమతీర్థం, చంద్రతీర్థం, పుణ్యాన్ని కూర్చే చిత్రాంగదేశ్వరము, అట్టిదే విద్యాధరేశ్వరతీర్థం కూడా ఉత్తమమైనవి.

**కేదారం తీర్థముఖ్యాఖ్యం కాలఞ్జర మనుత్తమమ్ ।**
**సారస్వతం ప్రభాసఞ్చ ఖేటకర్ణం హరం శుభమ్ ॥ 12 ॥**

**లౌకికాఖ్యం మహాతీర్థం తీర్థంచైవ హిమాలయమ్ ।**
**హిరణ్యగర్భం గోప్రఖ్యం తీర్థంచైవ వృషధ్వజమ్ ॥ 13 ॥**

**ఉపశాన్తం శివంచైవ వ్యాఘ్రేశ్వర మనుత్తమమ్ ।**
**త్రిలోచనం మహాతీర్థం లోలార్క ఞ్చోత్తరాహ్వయమ్ ॥ 14 ॥**

**కపాలమోచనం తీర్థం బ్రహ్మహత్యావినాశనమ్ ।**
**శుక్రేశ్వరం మహాపుణ్యమానన్దపురముత్తమమ్ ॥ 15 ॥**

**ఏవమాదీని తీర్థాని ప్రాధాన్యాత్కథితాని తు ।**
**న శక్యా విస్తరాద్వక్తుం తీర్థసంఖ్యా ద్విజోత్తమాః ॥ 16 ॥**

తీర్థ ముఖ్యమైనది కేదార తీర్థం, కాలంజర తీర్థం శ్రేష్ఠమైనది. సారస్వతం ప్రభాసతీర్థం ఖేటకర్ణం శుభాన్ని కలిగించేది హరతీర్థం. లౌకికమనే గొప్ప తీర్థం, హిమాలయ తీర్థం, హిరణ్యగర్భం, గోప్రఖ్యం, వృషధ్వజం, అనే తీర్థాలూ, ఉపశాంతం, శివం, శ్రేష్ఠమైన వ్యాఘ్రేశ్వర తీర్థం, త్రిలోచనమనే గొప్ప తీర్థం, లోలార్కం, ఉత్తర అనే తీర్థం, బ్రహ్మహత్యాపాపాన్ని పోగొట్టె కపాలమోచన తీర్థం, మిక్కిలి పుణ్యాన్ని కలిగించే శుక్రేశ్వర తీర్థం, ఉత్తమమైన ఆనందపురమనే తీర్థం, ఈ చెప్పిన తీర్థ స్థలాలు వాటి ప్రాముఖ్యాన్ని బట్టి చెప్పబడ్డాయి. ఆ తీర్థాల సంఖ్య ఇంకా వివరంగా చెప్పటం సాధ్యపడదు. బ్రాహ్మణులారా!

**తేషు సర్వేషు తీర్థేషు స్నాత్వాఽభ్యర్చ్య సనాతనమ్ ।**
**ఉపోష్య తత్ర తత్రాసౌ పారాశర్యో మహామునిః ॥ 17 ॥**

**తర్పయిత్వా పితౄన్దేవాన్ కృత్వా పిణ్డప్రదానకమ్ ।**
**జగామ పునరేవాపి యత్ర విశ్వేశ్వరః శివః ॥ 18 ॥**

వేదవ్యాస మహాముని అన్ని తీర్థాల్లో స్నానం చేసి ఆయా స్థలాల్లోని సనాతనుడైన శివుని పూజించి ఉపవాసముండి పితృదేవతలకు తర్పణ పిండ ప్రదానాలొనర్చి విశ్వేశ్వరుడున్న ప్రధాన స్థానాన్ని చేరుకున్నాడు.

**స్నాత్వాఽభ్యర్చ్య మహాలిఙ్గం శిష్యైః సహ మహామునిః ।**
**ఉవాచ శిష్యాన్ధర్మాత్మా యథేష్టం గన్తుమర్హథ ॥ 19 ॥**

అక్కడ వ్యాసుడు శిష్యులతోకూడ స్నానంచేసి మహాలింగంగా ఉన్న శివుని పూజించి ధర్మాత్ముడైన ఆ వ్యాసుడు శిష్యులతో "ఇక మీకిష్టమైన చోటికి వెళ్ళుడని" పలికినాడు.

**తే ప్రణమ్య మహాత్మానం జగ్ముః పైలాదయో ద్విజాః ।**
**వాసఞ్చ తత్ర నియతో వారాణస్యాం చకార సః ॥ 20 ॥**

పైలుడు మొదలైన విప్రులు మహాత్ముడైన వ్యాసునికి నమస్కరించి వెళ్ళిపోయినారు. ఆ వ్యాసుడు వారణాసిలోనే తన నివాసమేర్పరచుకున్నాడు.

**శాన్తో దాన్తస్త్రిషవణం స్నాత్వాఽభ్యర్చ్య పినాకినమ్ ।**
**భైక్షాహారో విశుద్ధాత్మా బ్రహ్మచర్య పరాయణః ॥ 21 ॥**

అతడు శాంతుడూ జితేంద్రియుడూ అయి త్రికాలాల్లో స్నానమాచరించి శివుని పూజించి భిక్షాహారుడై నిర్మల మనసుతో బ్రహ్మచర్య నియమం పాటించినాడు.

**కదాచిత్తత్ర వసతా వ్యాసేనామితతేజసా ।**
**భ్రమమాణేన భిక్షా వై నైవ లబ్ధా ద్విజోత్తమాః ॥ 22 ॥**

ద్విజోత్తములారా! అక్కడ నివసిస్తున్న తేజస్వి వ్యాసుడు ఒకప్పుడు భిక్షకోసం తిరుగగా భిక్ష లభించలేదు.

**తతః క్రోధావృతతనుర్నరాణామిహ వాసినామ్ ।**
**విఘ్నం సృజామి సర్వేషాం యేన సిద్ధి ర్విహీయతే ॥ 23 ॥**

విప్రులారా! అపుడు వ్యాసుడు కోపంతో శరీరం ఊగిసలాడగా ఇక్కడ నివసించే మనుజులకు పుణ్యలోక ప్రాప్తి కలుగకుండునట్లు ఆటంకం కల్పింతునని తలపోశాడు.

**తత్క్షణా త్సా మహాదేవీ శంకరార్ధ శరీరిణీ ।**
**ప్రాదురాసీ త్స్వయం ప్రీత్యా వేషంకృత్వా తు మానుషమ్ ॥ 24 ॥**

వెంటనే శంకరార్ధ శరీరిణి అయిన పార్వతి మానవరూపాన్ని ధరించి స్వయంగా ప్రేమతో సాక్షాత్కరించినది.

**భో భో వ్యాస! మహాబుద్ధే! శప్తవ్యా న త్వయా పురీ ।**
**గృహాణ భిక్షాం మత్తస్త్వముక్త్వైవం ప్రదదౌ శివా ॥ 25 ॥**

**ఉవాచ చ మహాదేవీ క్రోధన స్త్వం యతో మునే ।**
**ఇహక్షేత్రే న వస్తవ్యం కృతఘ్నోఽసి యతః సదా ॥ 26 ॥**

ఓ ధీమంతుడవైన వ్యాసుడా! ఈ కాశీనగరాన్ని నీవు శపించ తగదు. ఇదిగో నాభిక్షను స్వీకరించుమని పలికి అతనికి భిక్షనొసగింది. తర్వాత ఆ దేవి "ఓ మునీ నీవు కోపిష్ఠివి. కృతఘ్నుడవు. అందువల్ల ఈ నగరంలో ఉండతగవు".

**ఏవముక్తః సభగవాన్ధ్యానాత్ జ్ఞాత్వా పరాం శివామ్ ।**
**ఉవాచ ప్రణతో భూత్వా స్తుత్వా చ ప్రవరైః స్తవైః ॥ 27 ॥**

ఈ విధంగా పార్వతి పలుకగా వేదవ్యాసుడు ధ్యానంవల్ల ఆమెను దేవిగా గుర్తించి నమస్కరించి ప్రశస్త స్తోత్రాలతో స్తుతించి ఇట్లన్నాడు.

**చతుర్దశ్యామథాష్టమ్యాం ప్రవేశం దేహి శాఙ్కరి ।**
**ఏవమస్త్విత్యనుజ్ఞాయ దేవీ చాన్తరధీయత ॥ 28 ॥**

ఓ దేవీ! చతుర్దశి అష్టమి రోజుల్లో కాశిలో ప్రవేశించటానికి అనుమతించుమనగా దేవి అట్లగునని అంతర్ధానమైనది.

**ఏవం స భగవాన్వ్యాసో మహాయోగీ పురాతనః ।**
**జ్ఞాత్వా క్షేత్రగుణాన్సర్వాన్ స్థితస్తస్యాథ పార్శ్వతః ॥ 29 ॥**

పూజ్యుడు పురాతనుడైన వ్యాసుడీ విధంగా కాశీక్షేత్ర గుణాలనెరిగి ఆ నగరసమీపంలో వసించినాడు.

**ఏవం వ్యాసం స్థితం జ్ఞాత్వా క్షేత్రం సేవన్తి పణ్డితాః ।**
**తస్మాత్సర్వ ప్రయత్నేన వారాణస్యాం వసేన్నరః ॥ 30 ॥**

వ్యాసుడాక్షేత్రంలో చాలకాలం ఉన్నట్టు తెలుసుకొని పండితులాక్షేత్రాన్ని సేవిస్తారు. అందువల్ల మనుష్యుడు అన్ని ప్రయత్నాలతో వారాణసిలో నివసించాలి.

**సూత ఉవాచ –** సూతుడు పలికాడు.

**యః పఠేదవిముక్తస్య మాహాత్మ్యం శృణుయాదథ ।**
**శ్రావయేద్వా ద్విజాఞ్ఛాన్తా న్సయాతి పరమాం గతిమ్ ॥ 31 ॥**

ఈ అవిముక్త క్షేత్ర మాహాత్మ్యం చదివినా విన్నా కాక శాంతులైన ద్విజులకు వినిపించినా అతడు ఉత్తమగతినందుతాడు.

**శ్రాద్ధే వా దైవికే కార్యే రాత్రావహని వా ద్విజాః ।**
**నదీనాం చైవ తీర్థేషు దేవతాయతనేషు చ ॥ 32 ॥**

**జ్ఞాత్వా సమాహిత మనాః కామక్రోధవివర్జితః ।**
**జపేదీశం నమస్కృత్య సయాతి పరమాంగతిమ్ ॥ 33 ॥**

శ్రాద్ధంలోగాని, దేవకార్యంలోకాని, రాత్రి లేక పగటియందు కాని, నదీతీరప్రదేశాల్లో కాని దేవతామందిరాల్లో కాని ఓ ద్విజులారా! జ్ఞానవంతులై మనసు నిలుకడ గలవారై కోరికలను కోపాన్ని విడిచి ఈశ్వరునికి నమస్కరించి అతనిగూర్చి జపం చేసినట్లైతే ఉత్తమగతి పొందటం తథ్యం.

**ఇతి శ్రీకూర్మపురాణే వారాణసీమాహాత్మ్యే పఞ్చత్రింశోఽధ్యాయః ॥ 35 ॥**

శ్రీకూర్మపురాణంలో వారాణసీ మాహాత్మ్య వర్ణనలో ముప్పై అయిదవ అధ్యాయం ॥ 35 ॥



## షట్త్రింశోఽధ్యాయః - ముప్పై ఆరవ అధ్యాయం

## ప్రయాగమాహాత్మ్యమ్ - ప్రయాగమాహాత్మ్యం

**ఋషయ ఊచుః :-**ఋషులిట్లు పలికారు.

**మాహాత్మ్యమవిముక్తస్య యథావత్సముదీరితమ్ ।**
**ఇదానీఞ్చ ప్రయాగస్య మాహాత్మ్యం బ్రూహి సువ్రత! ॥ 1 ॥**

ఓ మంచి నియమం పాటించేవాడా! అవిముక్త క్షేత్ర మాహాత్మ్యాన్ని యథావత్తుగా నీవు వివరించినావు. ఇప్పుడు ప్రయాగక్షేత్ర మాహాత్మ్యాన్ని తెలుపవలసినది.

**యాని తీర్థాని తత్రైవ విశ్రుతాని మహాన్తి వై ।**
**ఇదానీం కథయాస్మాకం సూత సర్వార్థవిద్భవాన్ ॥ 2 ॥**

నీకు అన్ని విషయాలు తెలియును. ఆ ప్రదేశంలో శ్రేష్ఠాలైనవి ప్రసిద్ధాలైన తీర్థాలేవి? వానిని మాకిపుడు తెలుపుము.

**సూత ఉవాచ :-** సూతుడు పలికాడు.

**శృణుధ్వమృషయః సర్వే విస్తరేణ బ్రవీమి వః ।**
**ప్రయాగస్య చ మాహాత్మ్యం యత్ర దేవః పితామహః ॥ 3 ॥**

ఓ ఋషులారా! మీరందరు వినండి. నేను ప్రయాగక్షేత్ర మాహాత్మ్యాన్ని విస్తరంగా వివరిస్తాను. అక్కడ భగవంతుడైన బ్రహ్మ నివసించి ఉంటాడు.

**మార్కణ్డేయేన కథితం కౌన్తేయాయ మహాత్మనే ।**
**యథా యుధిష్ఠిరాయైతత్తద్వక్ష్యే భవతామహమ్ ॥ 4 ॥**

మహాత్ముడు ధర్మజునకు మార్కండేయ మహాముని చెప్పినదానిని నేను మీకు తెలియజేస్తాను.

**నిహత్య కౌరవాన్సర్వాన్ భ్రాతృభిః సహ పార్థివః ।**
**శోకేన మహతావిష్టో ముమోహ స యుధిష్ఠిరః ॥ 5 ॥**

తమ దాయాదులైన కౌరవులనందరిని చంపి ధర్మరాజు తన సోదరులతో కూడ గొప్ప శోకాన్ని పొంది మోహాన్ని అనుభవించినాడు.

**అచిరేణాథ కాలేన మార్కణ్డేయో మహాతపాః ।**
**సంప్రాప్తో హస్తినపురం రాజద్వారే స తిష్ఠతి ॥ 6 ॥**

తర్వాత కొంతకాలానికి గొప్ప తపస్వి మార్కండేయ మహాముని హస్తిన పురానికి వచ్చి ద్వారంవద్ద నిలిచినాడు.

**ద్వారపాలోఽపి తం దృష్ట్వా రాజ్ఞే కథితవాన్ద్రుతమ్ ।**
**మార్కణ్డేయో ద్రష్టుమిచ్ఛం స్త్వామాస్తే ద్వార్యసౌ మునిః ॥ 7 ॥**

ఆ మునిని చూచి ద్వారపాలకుడు శీఘ్రంగా ఆ వృత్తాంతాన్ని ఓ రాజా! మార్కండేయముని మిమ్ము దర్శించాలని వచ్చి ద్వారం వద్ద వేచి ఉన్నాడు అని తెలిపినాడు.

**త్వరితో ధర్మపుత్రస్తు ద్వారమభ్యేత్య సత్వరమ్ ।**
**ద్వారమభ్యాగతస్యేహ స్వాగతం తే మహామునే! ॥ 8 ॥**

వెంటనే ధర్మరాజు ద్వారంవద్దకు వచ్చి ఓ మహామునీ! మా భవనద్వారం వద్దకు వచ్చిన మీకు స్వాగతం అని పలికినాడు.

**అద్య మే సఫలం జన్మ అద్య మే తారితం కులమ్ ।**
**అద్య మే పితరస్తుష్టాస్త్వయి తుష్టే సదా మునే! ॥ 9 ॥**

ఈనాడు నా జన్మ సార్థకమైనది. నా వంశం పవిత్రమైనది. ఓ మునీంద్రా! నీ సంతోషంతో ఇపుడు మా పితృదేవతలు తృప్తినందినారు.

**సింహాసనముపస్థాప్య పాదశౌచార్చనాదిభిః ।**
**యుధిష్ఠిరో మహాత్మేతి పూజయామాస తం మునిమ్ ॥ 10 ॥**

యుధిష్ఠిరుడు మహాత్ముడైన ఆ మునిని సింహాసనంపై కూర్చుండబెట్టి పాదప్రక్షాళనం చేసి అర్ఘ్యాదులతో పూజించినాడు.

**మార్కణ్డేయస్తు సంపృష్టః ప్రోవాచ స యుధిష్ఠిరమ్ ।**
**కిమర్థం ముహ్యసే విద్వన్! సర్వం జ్ఞాత్వా సమాగతః ॥ 11 ॥**

కుశల ప్రశ్నలడిగిన ధర్మరాజుతో మార్కండేయుడిట్లన్నాడు. విద్వాంసుడవైన ధర్మరాజా! అన్నీ తెలిసికూడ నీవెందుకు మోహాన్ని పొందుతున్నావు.

**తతో యుధిష్ఠిరో రాజా ప్రణమ్య శిరసాఽబ్రవీత్ ।**
**కథయస్వ సమాసేన యేన ముఞ్చామి కిల్బిషమ్ ॥ 12 ॥**

తర్వాత రాజు ధర్మపుత్రుడు తలవాల్చి నమస్కరించి ఇట్లన్నాడు. మునీశ్వరా! నే నే ఉపాయంతో ఈ పాపంనుండి విముక్తుడనవుతానో సంగ్రహంగా వివరించుము.

**నిహతా బహవో యుద్ధే పుమాంసోఽనపరాధినః ।**
**అస్మాభిః కౌరవైః సార్ధం ప్రసఙ్గాన్మునిసత్తమ! ॥ 13 ॥**

గడచిన యుద్ధంలో మేము కౌరవులు కూడ నిరపరాధులైన చాలమంది మనుజులను చంపినాము. ఓ మునీంద్రా! ఆ పాపనివృత్తిని గూర్చి తెలుపుము.

**యేన హింసాసముద్భూతాజ్జన్మాన్తరకృతాదపి ।**
**ముచ్యేమ పాతకాదద్య తద్భవాన్వక్తుమర్హతి ॥ 14 ॥**

హింసవల్ల కల్గినది పూర్వజన్మకృతమగు పాపం ఏ ఉపాయంతో పోగొట్టుకొంటామో చెప్పవలసినది.

**మార్కణ్డేయ ఉవాచ :-** మార్కండేయుడిట్లా చెప్పాడు.

**శృణు రాజన్ మహాభాగ! యన్మాం పృచ్ఛసి భారత ।**
**ప్రయాగగమనం శ్రేష్ఠం నరాణాం పాపనాశనమ్ ॥ 15 ॥**

ఓ మహాభాగుడవైన రాజా! నీవడిగిన దాన్ని చెపుతున్నాను. విను. ప్రయాగ క్షేత్రానికి వెళ్ళటం శ్రేష్ఠం. అది పాపనాశకము.

**తత్ర దేవో మహాదేవో రుద్రోఽవాత్సీన్నరేశ్వర! ।**
**సమాస్తే భగవాన్ బ్రహ్మ స్వయమ్భూః సహ దైవతైః ॥ 16 ॥**

ఓ రాజా! ఆ ప్రయాగలో మహాదేవుడు శివుడు పూర్వం నివసించినాడు. భగవంతుడు స్వయంభువైన బ్రహ్మ దేవతలతో సహా అచట ఉన్నాడు.

**యుధిష్ఠిర ఉవాచ :-**ధర్మరాజు పలికాడు.

**భగవఞ్ఛ్రోతుమిచ్ఛామి ప్రయాగగమనే ఫలమ్ ।**
**మృతానాం కా గతిస్తత్ర స్నాతానాం చైవ కిం ఫలమ్ ॥ 17 ॥**

మహాత్మా! ప్రయాగక్షేత్రానికి వెళ్ళినందువల్ల ఫలితమేదో వినదలచినాను. అక్కడ మరణించిన వారి గతి ఎట్టిది? స్నానం చేసే వారికి ఏ ఫలం కలుగుతుంది?

**యే వసన్తి ప్రయాగే తు బ్రూహి తేషాన్తు కిం ఫలమ్ ।**
**భవతో విదితం హ్యేతత్తన్మే బ్రూహి నమోఽస్తు తే ॥ 18 ॥**

ప్రయాగక్షేత్రంలో నివసించే వారికెటువంటి ఫలం కలుగుతుంది? నీకు నమస్కారం. నీకు తెలిసిన ఈ విషయాన్ని నాకు తెలుపవలసినది.

**మార్కణ్డేయ ఉవాచ :-** మార్కండేయుడు పలికాడు.

**కథయిష్యామి తే వత్స ప్రయాగస్నానజం ఫలమ్ ।**
**పురా మహర్షిభిః సమ్యక్కథ్యమానం మయా శ్రుతమ్ ॥ 19 ॥**

కుమారా! పూర్వకాలంలో మహర్షులు చెప్పగా నేను విన్నాను. ప్రయాగలో స్నానం చేసినందువల్ల కలిగే ఫలం నేను మీకు చెపుతాను.

**ఏతత్ప్రజాపతేః క్షేత్రం త్రిషు లోకేషు విశ్రుతమ్ ।**
**అత్ర స్నాత్వా దివం యాన్తి యే మృతాస్తేఽపునర్భవాః ॥ 20 ॥**

ఇది ప్రజాపతిక్షేత్రంగా ముల్లోకాల్లో ప్రసిద్ధి చెందినది. ఇక్కడ స్నానం చేసినవారు మరణించిన తర్వాత పునర్జన్మలేని ఉత్తమగతిని పొందగలరు.

**తత్ర బ్రహ్మాదయో దేవా రక్షాం కుర్వన్తి సఙ్గతాః ।**
**బహూన్యన్యాని తీర్థాని సర్వపాపాపహాని తు ॥ 21 ॥**

అక్కడ బ్రహ్మ మొదలైన దేవతలు రక్షణభారాన్ని వహిస్తారు. సమస్త పాపాలను పోగొట్టే తీర్థస్థలాలెన్నో ఇక్కడ ఉన్నాయి.

**కథితుం నేహ శక్నోమి బహువర్షశతైరపి ।**
**సంక్షేపేణ ప్రవక్ష్యామి ప్రయాగస్యేహ కీర్తనమ్ ॥ 22 ॥**

వాటిని వివరించటం కొన్ని వందల సంవత్సరాల్లోను నావల్ల కాదు. ప్రయాగతీర్థ ప్రశస్తినిక్కడ సంగ్రహంగా వివరిస్తాను.

**షష్టి ర్ధనుఃసహస్రాణి తాని రక్షన్తి జాహ్నవీమ్ ।**
**యమునాం రక్షతి సదా సవితా సప్తవాహనః ॥ 23 ॥**

అరువదివేల ధనుస్సులీగంగానదిని, సప్తాశ్వవాహనుడైన సూర్యుడు యమునానదిని రక్షిస్తున్నారు.

**ప్రయాగే తు విశేషేణ స్వయం వసతి వాసవః ।**
**మణ్డలం రక్షతి హరిః సర్వదేవైశ్చ సమ్మితమ్ ॥ 24 ॥**

ప్రయాగక్షేత్రంలో ఇంద్రుడు స్వయంగా నివసిస్తున్నాడు. సమస్త దేవతలు కొలువుతీరిన మండలాన్ని విష్ణువు కాపాడుతున్నాడు.

**న్యగ్రోధం రక్షతే నిత్యం శూలపాణిర్మహేశ్వరః ।**
**స్థానం రక్షన్తి వై దేవాః సర్వపాపహరం శుభమ్ ॥ 25 ॥**

శూలాన్ని ధరించిన మహేశ్వరుడక్కడి మర్రిచెట్లను కాపాడుతుంటాడు. సర్వ పాపాలను నశింపచేసే శుభకరమైన తీర్థస్థలాన్ని దేవతలు రక్షిస్తుంటారు.

**స్వకర్మణా వృతా లోకా నైవ గచ్ఛన్తి తత్పదమ్ ।**
**స్వల్పమల్పతరం పాపం యస్య చాస్తి నరాధిప ॥ 26 ॥**

**ప్రయాగం స్మరమాణస్య సర్వమాయాతి సంక్షయమ్ ।**
**దర్శనాత్తస్య తీర్థస్య నామసంకీర్తనాదపి ॥ 27 ॥**

తమ కర్మలావరించిన జనులాస్థానాన్ని పొందలేరు. ఓ రాజా! చిన్నపాపం కొంచెం మిగిలి ఉన్నా అతడు ప్రయాగక్షేత్రాన్ని మనసులో స్మరించినా ఆ తీర్థాన్ని చూచినా దాని నామాన్ని కీర్తించినా పాపలేశం పూర్తిగా పోగొట్టుకుంటాడు.

**మృత్తికాలమ్భనాద్వాఽపి నరః పాపాత్ప్రముచ్యతే ।**
**పఞ్చ కుణ్డాని రాజేన్ద్ర యేషాం మధ్యే తు జాహ్నవీ ॥ 28 ॥**

ఓ రాజా! అయిదు కుండాలమధ్య గంగానది ప్రవేశించేచోట అచటి మట్టిని లేపనం చేసుకోవటంవల్ల కూడ మనుష్యుడు పాపవిముక్తుడవుతాడు.

**ప్రయాగం విశతః పుంసః పాపం నశ్యతి తత్క్షణాత్ ।**
**యోజనానాం సహస్రేషు గఙ్గాం స్మరతి యో నరః ॥ 29 ॥**

**అపి దుష్కృతకర్మాసౌ లభతే పరమాం గతిమ్ ।**

ప్రయాగ క్షేత్రంలో ప్రవేశించిన మనిషి పాపం ఆ క్షణంలోనే నశిస్తుంది. వేలయోజనాల దూరంలో ఉన్నవాడైనా గంగానదిని స్మరించినట్లైతే అతని పాపాలన్నీ నశించి ఉత్తమ పుణ్యగతిని పొందుతాడు.

**కీర్తనాన్ముచ్యతే పాపాత్ దృష్ట్వా భద్రాణి పశ్యతి ॥ 30 ॥**

గంగను కీర్తించినందువల్ల పాపదూరుడవుతాడు. చూచినందువల్ల శుభాలనందుతాడు.

**తథోపస్పృశ్య రాజేన్ద్ర! సురలోకే మహీయతే ।**
**వ్యాధితో యది వా దీనః క్రుద్ధో వాపి భవేన్నరః ॥ 31 ॥**

ఆ గంగలో ఆచమించినవాడు దేవలోకంలో పూజనందుతాడు. ఓ రాజా! రోగి కాని, దీనుడు కాని, కోపిష్ఠి కాని పూర్వోక్తఫలాన్నే పొందుతాడు.

**పితౄణాం తారకఞ్చైవ సర్వపాపప్రణాశనమ్ ।**
**యైః ప్రయాగే కృతో వాస ఉత్తీర్ణో భవసాగరః ॥ 32 ॥**

ఆ ప్రయాగ తమ పితృదేవతలను తరింపచేస్తుంది. పాపాలను నశింపచేస్తుంది. ప్రయాగలో నివసించినవాడు సంసారసాగరాన్ని దాటిన వాడవుతాడు.

**గంగాయమునమాసాద్య త్యజేత్ప్రాణాన్ప్రయత్నతః ।**
**ఈప్సితాల్లభతే కామాన్వదన్తి మునిపుఙ్గవాః ॥ 33 ॥**

గంగాయమునల సంగమంలో ప్రయత్నపూర్వకంగా ప్రాణాలు వదలినవాడు తన కోరికలను పొందునని మునిశ్రేష్ఠులు తెలుపుతున్నారు.

**దీప్తకాఞ్చనవర్ణాభైర్విమానై ర్భానువర్తిభిః ।**
**సర్వరత్నమయైర్దివ్యైర్నానాధ్వజసమాకులైః ॥ 34 ॥**

**వరాఙ్గనా సమాకీర్ణైర్మోదతే శుభలక్షణః ।**
**గీతవాదిత్రనిర్ఘోషైః ప్రసుప్తః ప్రతిబుధ్యతే ॥ 35 ॥**

మెరిసే బంగారు కాంతి కల్గి సూర్యమండల ప్రాంతంలో సంచరించేవి, సమస్త మణులతో నిర్మింపబడినవి, అనేకరకాల పతాకలుగల విమానాలతో ఉత్తమ స్త్రీలు నిండి ఉండగా శుభలక్షణాలు కలవాడై సంతోషిస్తాడు. గీతవాద్యాల ధ్వనులతో మేల్కొంటాడు.

**యావన్న స్మరతే జన్మ తావత్స్వర్గే మహీయతే ।**
**తస్మాత్స్వర్గాత్పరిభ్రష్టః క్షీణకర్మా నరోత్తమః ॥ 36 ॥**

**హిరణ్యరత్నసమ్పూర్ణే సమృద్ధే జాయతే కులే ।**
**తదేవ స్మరతే తీర్థం స్మరణాత్తత్ర గచ్ఛతి ॥ 37 ॥**

తన పూర్వజన్మను స్మరించనంతకాలం స్వర్గంలో పూజలందుతాడు. కర్మఫలం క్షీణించగానే ఆ మనుష్యుడు స్వర్గంనుండి బంగారం మొదలైన సంపదలు గల వంశంలో జన్మిస్తాడు. మళ్ళీ ఆ పుణ్యతీర్థాన్నే స్మరించి మళ్ళీ అక్కడికే చేరుకొంటాడు.

**దేశే వా యది వాఽరణ్యే విదేశే యది వా గృహే ।**
**ప్రయాగం స్మరమాణస్తు యస్తు ప్రాణాన్పరిత్యజేత్ ॥ 38 ॥**

**బ్రహ్మలోకమవాప్నోతి వదన్తి మునిపుఙ్గవాః ।**
**సర్వకామఫలా వృక్షా మహీ యత్ర హిరణ్మయీ ॥ 39 ॥**

**ఋషయో మునయః సిద్ధా స్తత్ర లోకే స గచ్ఛతి ।**
**స్త్రీసహస్రాకులే రమ్యే మన్దాకిన్యా స్తటే శుభే ॥ 40 ॥**

**మోదతే మునిభిః సార్ధం స్వకృతేనేహ కర్మణా ।**
**సిద్ధచారణగన్ధర్వైః పూజ్యతే దేవదానవైః ॥ 41 ॥**

తన దేశంలోకాని, అడవిలోకాని, పరదేశంలోకాని, ఇంట్లోకాని ప్రయాగక్షేత్రాన్ని స్మరిస్తూ ప్రాణాలు వదిలేవాడు. బ్రహ్మలోకాన్ని చేరునని మునిశ్రేష్ఠులు చెపుతున్నారు. బంగారుభూమి, కోరికలను ఫలింపచేసే వృక్షాలు, ఋషులు మునులు సిద్ధులు ఉన్న లోకానికి వెళతాడు. వేలమంది స్త్రీజనం నిండి మనోహరమైన గంగానదీ తీరంలో సిద్ధులు ఉన్న లోకానికి వెళతాడు. మునులతో గూడి సంతోషిస్తాడు. సిద్ధులు చారణులు గంధర్వులు దేవదానవులతో అతడు పూజలందుతాడు.

**తతః స్వర్గాత్పరిభ్రష్టో జమ్బూద్వీపపతిర్భవేత్ ।**
**తతః శుభాని కర్మాణి చిన్తయానః పునః పునః ॥ 42 ॥**

**గుణవాన్వృత్త సమ్పన్నో భవతీత్యనుశుశ్రుమ ।**
**కర్మణా మనసా వాచా సత్యే ధర్మే ప్రతిష్ఠితః ॥ 43 ॥**

తర్వాత స్వర్గంనుండి జారిపడి జంబూ ద్వీపానికి రాజవుతాడు. అటుతర్వాత శుభకార్యాన్ని గూర్చి మళ్ళీ మళ్ళీ ఆలోచించేవాడై గుణము శీలం కలవాడవుతాడని పెద్దలవల్ల వింటున్నాము. మనోవాక్కాయాలతో సత్యము ధర్మమందు ప్రతిష్ఠింపబడును.

**గఙ్గా యమునయోర్మధ్యే యస్తు గ్రాసం ప్రయచ్ఛతి ।**
**సువర్ణమథ ముక్తాం వా తథైవాన్యత్పరిగ్రహమ్ ॥ 44 ॥**

**స్వకార్యే పితృకార్యే వా తీర్థే యోఽభ్యర్చయేన్నరః ।**
**నిష్ఫలం తస్య తత్తీర్థం యావత్తత్ఫలమశ్నుతే ॥ 45 ॥**

ఏ నరుడయితే గంగాయమునల మధ్య అన్నదానం, బంగారం, ముత్యం లేదా మరే వస్తువునయినా దానంగా గ్రహించడం, తన ప్రయోజనంలో కాని పితరుల కర్మసమయంలోకాని తీర్థస్థలంలో పూజలు చేస్తాడో అతడు దానఫలం అనుభవించేంతకాలం తీర్థస్థలపుణ్యం అనుభవించడు. అది నిరర్థకమే అగును.

**అతస్తీర్థే న గృహ్ణీయాత్పుణ్యేష్వాయతనేషు చ ।**
**నిమిత్తేషు చ సర్వేషు అప్రమత్తో ద్విజో భవేత్ ॥ 46 ॥**

అందువల్ల తీర్థస్థలంలో దేవాలయంలో పుణ్యస్థలంలో అన్ని నిమిత్తాల్లో దానం తీసుకోకూడదు. బ్రాహ్మణుడీ విషయంలో అప్రమత్తుడు కావలెను.

**కపిలాం పాటలాం ధేనుం యస్తు కృష్ణాం ప్రయచ్ఛతి ।**
**స్వర్ణశృఙ్గీం రౌప్యఖురాం చైలకర్ణీం పయస్వినీమ్ ॥ 47 ॥**

**తస్య యావన్తి లోమాని సన్తి గాత్రేషు సత్తమ ।**
**తావద్వర్ష సహస్రాణి రుద్రలోకే మహీయతే ॥ 48 ॥**

కపిలవర్ణముగాని, పాటలవర్ణముగాని, నలుపురంగుగాని కలిగిన, బంగారు కొమ్ములు, వెండిగిట్టలు, వెడల్పు చెవులు కల్గిన, బాగా పాలిచ్చే ఆవును దానం చేసేవాడు, ఓ శ్రేష్ఠుడా! దానికెన్ని రోమాలున్నవో అన్నివేల సంవత్సరాలు రుద్రలోకంలో గౌరవం పొందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ప్రయాగమాహాత్మ్యే షట్త్రింశోఽధ్యాయః ॥ 36 ॥**

శ్రీకూర్మపురాణంలో ప్రయాగమాహాత్మ్యం అనే ముప్పై ఆరవ అధ్యాయం ॥ 36 ॥



## సప్తత్రింశోఽధ్యాయః - ముప్పై ఏడవ అధ్యాయం

## ప్రయాగ మాహాత్మ్యమ్ - ప్రయాగ మాహాత్మ్యం

**మార్కణ్డేయ ఉవాచ** -మార్కండేయుడు పలికాడు

**కథయిష్యామి తే వత్స! తీర్థయాత్రావిధిక్రమమ్ ।**
**ఆర్షేణ తు విధానేన యథాదృష్టం యథాశ్రుతమ్ ॥ 1 ॥**

కుమారా! తీర్థయాత్ర విధానాన్ని, క్రమాన్నీ, ఋషులు చెప్పిన పద్ధతినీ, నేను చూచిన విధానాన్నీ, విన్నంతవరకు నీకు చెపుతున్నాను.

**ప్రయాగ తీర్థయాత్రార్థీ యఃప్రయాతి నరఃక్వచిత్ ।**
**బలీవర్దం సమారూఢః శృణు తస్యాపి యత్ఫలమ్ ॥ 2 ॥**

ప్రయాగయాత్ర చేయగోరిన నరుడు ఎద్దును వాహనంగా చేసుకొని ప్రయాణం చేసినవానికి కూడ ఎటువంటి ఫలం కలుగుతుందో విను.

**నరకే వసతే ఘోరే సమాః కల్పశతాయుషమ్ ।**
**తతో నివర్తితో ఘోరే గవాం క్రోధః సుదారుణః ॥ 3 ॥**

ఆ మనిషి భయంకరమైన నరకంలో వేలాదికల్పాల వరకు నివసిస్తాడు. అటుపిమ్మట భయంకరమైన ఆ ఎద్దుల కోపం దూరమవుతుంది.

**సలిలఞ్చ న గృహ్ణన్తి పితరస్తస్య దేహినః ।**
**యస్తు పుత్రాం స్తథా బాలానన్నహీనా న్ప్రముఞ్చతి ॥ 4 ॥**

తన పుత్రులను బాల్యంలోనే జీవనాధరం కల్పించకుండా వదిలివెళ్ళినవాడు వదిలే తర్పణాలను వాని పితృదేవతలు కూడ గ్రహించరు.

**యథాత్మానం తదా సర్వం దానం విప్రేషు దాపయేత్ ।**
**ఐశ్వర్యాల్లోభమోహాద్వా గచ్ఛేద్యానేన యో నరః ॥ 5 ॥**
**నిష్ఫలం తస్య తత్తీర్థం తస్మాద్యానం విసర్జయేత్ ।**
**గఙ్గాయమునయోర్మధ్యే యస్తు కన్యాం ప్రయచ్ఛతి ॥ 6 ॥**
**ఆర్షేణ తు విధానేన యథావిభవవిస్తరమ్ ।**
**న స పశ్యతి తం ఘోరం నరకం తేన కర్మణా ॥ 7 ॥**
**ఉత్తరాన్ స కురూన్గత్వా మోదతే కాలమవ్యయమ్ ।**
**వటమూలం సమాశ్రిత్య యస్తు ప్రాణాన్పరిత్యజేత్ ॥ 8 ॥**

**స్వర్గ లోకానతిక్రమ్య రుద్రలోకం సగచ్ఛతి ।**
**యత్ర బ్రహ్మాదయో దేవా దిశశ్చ సదిగీశ్వరాః ॥ 9 ॥**

**లోకపాలాశ్చ పితరః సర్వే తే లోకసంస్థితాః ।**
**సనత్కుమార ప్రముఖాస్తథా బ్రహ్మర్షయోఽ పరే ॥ 10 ॥**

స్వయంగా తనను అర్పించుకోవటంతోపాటు తన సర్వస్వాన్ని బ్రాహ్మణులకు అర్పించాలి. ఐశ్వర్యమదంతో గాని, లోభమోహాలతోకాని వాహనంతో ప్రయాణించేవాడు తన యాత్ర నిష్ఫలం చేసుకొంటాడు. అందువల్ల తీర్థయాత్రకు వాహనాన్ని ఉపయోగించరాదు. ఋషిప్రోక్త క్రమంతో తన శక్తికి తగువిధంగా గంగాయమునలమధ్య కన్యాదానం చేసినవాడు ఘోరనరకాన్ని చూడడు. అతడు ఉత్తర కురుక్షేత్రాలు చేరి చిరకాలం సంతోషంతో ఉంటాడు. ప్రయాగతీర్థంలో వటవృక్షం మొదట ప్రాణాలు వదలినవాడు స్వర్గలోకాలు దాటి శివలోకాన్ని పొందుతాడు. ఆ లోకంలో బ్రహ్మాది దేవతలు దిక్కులు దిక్పాలకులు సన్నిహితులవుతారు. ఇంద్రాది లోకపాలురు పితృదేవతలు సనత్కుమారుడు బ్రహ్మర్షులు కూడ ఆ లోకంలో నివసించి ఉంటారు.

**నాగాః సుపర్ణాః సిద్ధాశ్చ తథా నిత్యం సమాసతే ।**
**హరిశ్చ భగవానాస్తే ప్రజాపతిపురస్కృతః ॥ 11 ॥**

నాగులు, గరుడులు, సిద్ధులు కూడ అచట ఎల్లపుడు నివసిస్తారు. భగవంతుడు విష్ణువు కూడా బ్రహ్మతో కలిసి అక్కడ నెలకొని ఉంటాడు.

**గఙ్గాయమునయోర్మధ్యే పృథివ్యా జఘనం స్మృతమ్ ।**
**ప్రయాగం రాజశార్దూల! త్రిషు లోకేషు విశ్రుతమ్ ॥ 12 ॥**

గంగాయమునల మధ్యప్రదేశం భూమికి పిరుదులభాగంగా తలచబడినది. ఓ రాజశ్రేష్ఠా! ఈ ప్రయాగక్షేత్రం ముల్లోకాల్లోనూ ప్రసిద్ధమైనది.

**తత్రాభిషేకం యః కుర్యాత్సఙ్గమే శంసితవ్రతః ।**
**తుల్యం ఫలమావాప్నోతి రాజసూయాశ్వమేధయోః ॥ 13 ॥**

గంగాయమునల సంగమ ప్రదేశంలో నియమవంతుడై అభిషేకం చేసినవాడు రాజసూయ అశ్వమేధ యాగాలనాచరించిన దానితో సమానఫలాన్ని పొందుతాడు.

**న మాతృవచనాత్తాత న లోకవచనాదపి ।**
**మతిరుత్క్రమణీయా తే ప్రయాగగమనం ప్రతి ॥ 14 ॥**

నాయనా! తల్లి చెప్పినందువల్లకాని, జనుల మాటలవల్లకాని నీ ప్రయాగ తీర్థయాత్రాభిప్రాయాన్ని మార్చుకొనవద్దు.

**దశతీర్థసహస్రాణి షష్టికోట్యస్తథా పరాః ।**
**తేషాం సాన్నిధ్యమత్రైవ తీర్థానాం కురునన్దన! ॥ 15 ॥**

ఓ కురునన్దనా! పదివేల తీర్థాలు, అరువదికోట్ల పుణ్యస్థలాలు వాని అన్నింటి సాన్నిధ్యం ప్రయాగలో ఉన్నది.

**యా గతిర్యోగయుక్తస్య సన్న్యస్తస్య మనీషిణః ।**
**సా గతిస్త్యజతః ప్రాణాన్ గఙ్గాయమునసఙ్గమే ॥ 16 ॥**

యోగసాధకునికి సన్న్యాసికి ధీమంతునికి కలిగే పుణ్యగతి గంగాయమునల సంగమం వద్ద ప్రాణాలు విడిచినవానికి కూడ లభిస్తుంది.

**న తే జీవన్తి లోకేఽస్మి న్యత్ర తత్ర యుధిష్ఠిర ।**
**యే ప్రయాగం న సంప్రాప్తాస్త్రిషు లోకేషు వఞ్చితాః ॥ 17 ॥**

ఓ ధర్మరాజా! తమ జీవితకాలంలో ప్రయాగక్షేత్రాన్ని దర్శించనివారు ముల్లోకాల్లో వంచితులే. వారీ లోకంలో జీవించినవారుగా పరిగణింపబడరు.

**ఏవం దృష్ట్వా తు తత్తీర్థం ప్రయాగం పరమం పదమ్ ।**
**ముచ్యతే సర్వపాపేభ్యః శశాఙ్క ఇవ రాహుణా ॥ 18 ॥**

ప్రయాగమనే పేర మిక్కిలి శ్రేష్ఠస్థానాన్ని పుణ్యతీర్థాన్ని చూచిన మనిషి రాహువు వీడిన చంద్రునివలె అన్ని పాపాలనుండి విడుదల పొందుతాడు.

**కమ్బలాశ్వతరౌ నాగౌ యమునాదక్షిణే తటే ।**
**తత్ర స్నాత్వా చ పీత్వా చ ముచ్యతే సర్వపాతకైః ॥ 19 ॥**

యమునా నది దక్షిణతీరంలో కంబల అశ్వతరులనే నాగదేవతలున్నారు. అక్కడ స్నానం చేసి ఆ నీటిని త్రాగినవాడు సర్వపాపవిముక్తుడవుతాడు.

**తత్ర గత్వా నరః స్నానం మహాదేవస్య ధీమతః ।**
**సమస్తాంస్తారయేత్పూర్వాన్దశాతీతాన్దశాపరాన్ ॥ 20 ॥**

అక్కడికి వెళ్ళి మహాదేవుని సాన్నిధ్యంలో స్నానంచేస్తే తన వంశంలోని పదితరాల పూర్వులను పదితరాల తర్వాతివారిని తరింప చేస్తాడు.

**కృత్వాభిషేకం తు నరః సోఽశ్వమేధ ఫలం లభేత్ ।**
**స్వర్గలోక మవాప్నోతి యావదాభూతసంప్లవమ్ ॥ 21 ॥**

ఆ క్షేత్రంలో అభిషేకం జరిపినవాడు అశ్వమేధం చేసిన ఫలాన్ని పొందుతాడు. సర్వప్రాణుల ప్రళయం కలిగేవరకు స్వర్గలోకాన్ని పొందుతాడు.

**పూర్వపార్శ్వే తు గఙ్గాయాస్త్రైలోక్యే యాతి మానవః ।**
**అవటః సర్వసాముద్రః ప్రతిష్ఠానఞ్చ విశ్రుతమ్ ॥ 22 ॥**

గంగానది తూర్పుభాగంలో స్నానమాచరించినవాడు ముల్లోకాల్లో ప్రశస్తినందుతాడు. ఆ ప్రదేశంలో అవటము, ప్రతిష్ఠానము, సర్వసాముద్రమనే తీర్థాలున్నవి.

**బ్రహ్మచారీ జితక్రోధస్త్రిరాత్రం యది తిష్ఠతి ।**
**సర్వపాపవిశుద్ధాత్మా సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥ 23 ॥**

బ్రహ్మచర్యమవలంబించి కోపాన్ని జయించి ఆ ప్రదేశంలో మూడురాత్రులు నివసించినవాడు అన్ని పాపాలు తొలగిన ఆత్మ కలవాడై అశ్వమేధయాగం చేసిన ఫలాన్ని పొందుతాడు.

**ఉత్తరేణ ప్రతిష్ఠానం భాగీరథ్యాస్తు సవ్యతః ।**
**హంసప్రపతనం నామ తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్ ॥ 24 ॥**

ప్రతిష్ఠాన క్షేత్రానికి ఉత్తరంగా గంగానదికి ఎడమవైపు మూడు లోకాల్లో ప్రసిద్ధమైన హంసప్రపతనమనే తీర్థస్థానమున్నది.

**అశ్వమేధఫలం తత్ర స్మృతమాత్రే తు జాయతే ।**
**యవచ్చన్ద్రశ్చ సూర్యశ్చ తావత్స్వర్గే మహీయతే ॥ 25 ॥**

ఆ స్థలంలో స్మరణమాత్రాన్నే అశ్వమేధయాగఫలం సిద్ధిస్తుంది. సూర్యచంద్రు లున్నంతకాలం స్వర్గలోక నివాసం కూడ స్మరణంతో లభిస్తుంది.

**ఊర్వశీపులినే రమ్యే విపులే హంసపాణ్డురే ।**
**పరిత్యజతి యఃప్రాణాఞ్ఛృణు తస్యాపి యత్ఫలమ్ ॥ 26 ॥**

విశాలము మనోహరమైన హంసవంటి తెల్లని ఊర్వశి అనే ఇసుక తిన్నెపై ప్రాణాలు వదలిన వాని ఫలాన్ని చెపుతాను వినవలసినది.

**షష్టివర్షసహస్రాణి షష్టివర్షశతాని చ ।**
**ఆస్తే స పితృభిః సార్ధం స్వర్గలోకే నరాధిప ॥ 27 ॥**

ఓ రాజా! అట్టి నరుదు అరవైఆరువేల సంవత్సరాల కాలం పితృదేవతలతో కూడి స్వర్గలోకంలో నివసిస్తాడు.

**అథ సన్ధ్యావటే రమ్యే బ్రహ్మచారీ సమాహితః ।**
**నరః శుచిరుపాసీత బ్రహ్మలోకమవాప్నుయాత్ ॥ 28 ॥**

రమ్యమైన సంధ్యావటమనే ప్రదేశంలో బ్రహ్మచారిగా ఏకాగ్రత కల్గి శుచియై ధ్యానించినవాడు బ్రహ్మలోకాన్ని చేరుకుంటాడు.

**కోటితీర్థం సమాసాద్య యస్తు ప్రాణాన్పరిత్యజేత్ ।**
**కోటివర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ 29 ॥**

కోటితీర్థాన్ని చేరి ప్రాణాలు వదలినవాడు వేయికోట్ల సంవత్సరాల కాలం స్వర్గంలో పూజింపబడతాడు.

**యత్ర గఙ్గా మహాభాగా బహుతీర్థతపోవనా ।**
**సిద్ధం క్షేత్రం హి తత్ జ్ఞేయం నాత్ర కార్యా విచారణా ॥ 30 ॥**

అనేక పుణ్యతీర్థాలు తపోవనాలు కల్గిన గంగానది ప్రవహించే ప్రదేశం సిద్ధక్షేత్రం. ఇందులో విచారించటం తగదు.

**క్షితౌ తారయతే మర్త్యాన్నాగాంస్తారయతేఽ ప్యధః ।**
**దివి తారయతే దేవాంస్తేన సా త్రిపథా స్మృతా ॥ 31 ॥**

ఆ గంగ భూతలంలో మనుష్యులను, పాతాళంలో నాగులను, ఆకాశంలో దేవతలను తరింప చేస్తున్నది. అందువల్లనే అది త్రిపథగ అని పేర్కొనబడినది.

**యావదస్థీని గఙ్గాయాం తిష్ఠన్తి పురుషస్య తు ।**
**తావద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ 32 ॥**

మనిషి ఎముకలు గంగలో నిలిచి ఉన్నంతకాలం అన్ని వేల సంవత్సరాలు అతడు స్వర్గంలో సుఖిస్తాడు.

**తీర్థానాం పరమం తీర్థం నదీనాం పరమానదీ ।**
**మోక్షదా సర్వభూతానాం మహాపాతకినామపి ॥ 33 ॥**

ఆ గంగానది తీర్థాల్లో శ్రేష్ఠమైనది. నదుల్లో ఉత్తమమైనది. మహాపాపులకు కూడ మోక్షాన్నిచ్చేది.

**సర్వత్ర సులభా గఙ్గా త్రిషు స్థానేషు దుర్లభా ।**
**గఙ్గాద్వారే ప్రయాగే చ గఙ్గాసాగరసఙ్గమే ॥ 34 ॥**

గంగ అన్నిచోట్లా సులభంగా లభిస్తుంది. గంగాద్వారం, ప్రయాగ, గంగాసాగర సంగమం అనే మూడు ప్రదేశాల్లో లభించడం కష్టసాధ్యం.

**సర్వేషామేవ భూతానాం పాపోపహతచేతసామ్ ।**
**గతిమన్వేషమాణానాం నాస్తి గఙ్గాసమా గతిః ॥ 35 ॥**

పాపపీడిత మనస్కులకు, ఉత్తమలోక ప్రాప్తిని అన్వేషించేవారికి, గంగానదితో సమానమైన ప్రాప్యం మరొకటి లేదు.

**పవిత్రాణాం పవిత్రం యన్మఙ్గళానాం చ మఙ్గలమ్ ।**
**మహేశ్వరా త్పరిభ్రష్టా సర్వపాపహరా శుభా ॥ 36 ॥**

**కృతే తు నైమిషం తీర్థం త్రేతాయాం పుష్కరం వరమ్ ।**
**ద్వాపరే తు కురుక్షేత్రం కలౌ గఙ్గా విశిష్యతే ॥ 37 ॥**

పవిత్రమైన వానిలో పవిత్రం శుభకరాలలో శుభకరమైనది. మహేశ్వర శిరస్సు నుండి జారినది. పాపాలన్నింటినీ తొలగించే మంగళరూప గంగానది. కృతయుగంలో నైమిశారణ్యం, త్రేతాయుగంలో పుష్కరక్షేత్రం, ద్వాపరలో కురుక్షేత్రం, కలియుగంలో గంగానది విశిష్టాలైనవి.

**గఙ్గామేవ నిషేవన్తే ప్రయాగే తు విశేషతః ।**
**నాన్యత్కలియుగే రౌద్రే భేషజం నృప! విద్యతే ॥ 38 ॥**

**అకామో వా సకామో వా గంగాయాం యో విపద్యతే ।**
**స మృతో జాయతే స్వర్గే నరకం చ న పశ్యతి ॥ 39 ॥**

ప్రయాగలో గంగానదినే సేవిస్తారు. ఓ రాజా! కలియుగంలో దానికంటె మరొక ఔషధం లేదు. కోరికాని, కోరక గాని, గంగానదిలో ప్రాణాలు వదలినవాడు స్వర్గంలో జీవిస్తాడు. నరకాన్ని చూడడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ప్రయాగ మాహాత్మ్యే సప్తత్రింశోఽధ్యాయః ॥ 37 ॥**

శ్రీకూర్మపురాణంలో ప్రయాగ మాహాత్మ్యమనే ముప్పై ఏడవ అధ్యాయం ॥ 37 ॥



## అష్టత్రింశోஉధ్యాయః - ముప్పై ఎనిమిదవ అధ్యాయం

## ప్రయాగ మాహాత్మ్యమ్ - ప్రయాగ మాహాత్మ్యం

**మార్కణ్డేయ ఉవాచ :-**మార్కండేయుడిట్లా చెప్పాడు.

**షష్టిస్తీర్థసహస్రాణి షష్టిస్తీర్థశతాని చ ।**
**మాఘమాసే గమిష్యన్తి గఙ్గాయమునసఙ్గమే ॥ 1 ॥**

అరువది వేల తీర్థస్థలాలు, అరువది వందల పుణ్యతీర్థాలను గూర్చి జనులు గంగాయమునల సంగమతీర్థానికే మాఘమాసంలో వెళతారు.

**గవాం శతసహస్రస్య సమ్యగ్దత్తస్య యత్ఫలమ్ ।**
**ప్రయాగే మాఘమాసే తు త్ర్యహం స్నాతస్య తత్ఫలమ్ ॥ 2 ॥**

లక్షగోదానాలు విధిప్రకారం చేసిన దానికి కలిగే ఫలం మాఘమాసంలో మూడురోజులు ప్రయాగలో స్నానం చేస్తే లభిస్తుంది.

**గఙ్గాయమునయోర్మధ్యే కరీషాగ్నింశ్చ సాధయేత్ ।**
**అహీనాఙ్గో హ్యరోగశ్చ పఞ్చేన్ద్రియసమన్వితః ॥ 3 ॥**

**యావన్తి రోమకూపాని తస్య గాత్రేషు భూమిప! ।**
**తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ 4 ॥**

గంగాయమునల మధ్య కరీషాగ్నిని సంపాదించాలి. అలాచేస్తే అంగవైకల్యరోగం లేనివాడు, పంచేంద్రియాలు సరిగా పనిచేసేవాడుగా తన శరీరంలో ఉన్న రోమాల సంఖ్యలో అన్నివేల సంవత్సరాలు స్వర్గలోకంలో సుఖంగా ఉంటాడు.

**తతః స్వర్గా త్పరిభ్రష్టో జమ్బూద్వీపపతిర్భవేత్ ।**
**భుక్త్వా స విపులాన్భోగాంస్తత్తీర్థం లభతే పునః ॥ 5 ॥**

తర్వాత స్వర్గంనుండి వచ్చి జంబూద్వీపాధిపతి అవుతాడు. అనేక భోగాలనుభవించి మళ్ళీ ఆ తీర్థస్థలాన్ని చేరుకుంటాడు.

**జలప్రవేశం యః కుర్యాత్సఙ్గమే లోకవిశ్రుతే ।**
**రాహుగ్రస్తో యథా సోమో విముక్తః సర్వపాతకైః ॥ 6 ॥**

ప్రఖ్యాతమైన గంగాయమునా సంగమంలో మునిగినవాడు, రాహువునుండి చంద్రుడు విడివడినట్టు పాపాలనుండి విడుదలౌతాడు.

**సోమలోకమవాప్నోతి సోమేన సహ మోదతే ।**
**షష్టివర్షసహస్రాణి షష్టివర్షశతాని చ ॥ 7 ॥**

మరణానంతరం సోమలోకాన్ని చేరి అరవై వేల సంవత్సరాలు సోముని కలిసి సంతోషంతో కాలం గడుపుతాడు.

**స్వర్గతః శక్రలోకేఽసౌ మునిగన్ధర్వసేవితే ।**
**తతో భ్రష్టస్తు రాజేన్ద్ర సమృద్ధే జాయతే కులే ॥ 8 ॥**

ఓ రాజశ్రేష్ఠుడా! తర్వాత మునులు గంధర్వులున్న స్వర్గాన్ని చేరి కొంతకాలముండి భూలోకంలో సమృద్ధి కల వంశంలో జన్మిస్తారు.

**అధఃశిరాస్తు యో ధారామూర్ధ్వపాదః పిబేన్నరః ।**
**సప్తవర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే ॥ 9 ॥**

పాదాలు పైకి చాపి శిరస్సు నేలకువంచి గంగానది ధారను పానం చేసినవాడు ఏడు వేల సంవత్సరాలు స్వర్గలోకంలో పూజలందుతాడు.

**తస్మాద్భ్రష్టస్తు రాజేన్ద్ర అగ్నిహోత్రీ భవేన్నరః ।**
**భుక్త్వాఽథ విపులాన్భోగాంస్తత్తీర్థం భజతే పునః ॥ 10 ॥**

అక్కడినుండి భూలోకంలో నిత్యాగ్నిహోత్రి అవుతాడు. అనేక సుఖాలనుభవించి మళ్ళీ ఆ తీర్థస్థలాన్నే చేరుకుంటాడు.

**యః శరీరం వికర్తిత్వా శకునిభ్యః ప్రయచ్ఛతి ।**
**విహఙ్గై రుపభుక్తస్య శృణు తస్యాపి యత్ఫలమ్ ॥ 11 ॥**

తన శరీరాన్ని కోసుకొని పక్షులకాహారంగా ఇచ్చినవాడు ఏ ఫలాన్ని పొందుతాడో విను.

**శతం వర్షసహస్రాణాం సోమలోకే మహీయతే ।**
**తతస్తస్మాత్పరిభ్రష్టో రాజా భవతి ధార్మికః ॥ 12 ॥**

నూరువేల సంవత్సరాలు సోమలోకంలో పూజలంది అక్కడనుండి జారి ధార్మికుడైన రాజుగా జన్మిస్తాడు.

**గుణవాన్రూపసమ్పన్నో విద్వాంస్తు ప్రియవాక్యవాన్ ।**
**భోగాన్భుక్త్వా చ దత్త్వా చ తత్తీర్థం భజతే పునః ॥ 13 ॥**

అతడు గుణవంతుడు, అందగాడు, పండితుడు, ప్రియభాషియై తాను భోగాలనుభవించి ఇతరులకు దానం చేస్తాడు. తర్వాత మళ్ళీ ఆ తీర్థాన్నే చేరుకుంటాడు.

**ఉత్తరే యమునాతీరే ప్రయాగస్య చ దక్షిణే ।**
**ఋణప్రమోచనం నామ తీర్థన్తు పరమం స్మృతమ్ ॥ 14 ॥**

యమునానది కి ఉత్తరతీరంలో ప్రయాగకు దక్షిణ భాగంలో ఋణప్రమోచనం అనే శ్రేష్ఠమైన తీర్థస్థలమున్నది.

**ఏకరాత్రోషితః స్నాత్వా ఋణాత్తత్ర ప్రముచ్యతే ।**
**స్వర్గలోక మవాప్నోతి అనృణశ్చ సదా భవేత్ ॥ 15 ॥**

అక్కడ స్నానంచేసి ఒక రాత్రి నిద్రిస్తే స్వర్గలోకాన్ని పొందుతాడు. అన్ని ఋణాలు శాశ్వతంగా తీరిపోతాయి. ఎప్పుడు ఋణం లేకుండానే ఉంటాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ప్రయాగమాహాత్మ్యం నామ అష్టత్రింశోఽధ్యాయః ॥ 38 ॥**

శ్రీకూర్మపురాణంలో ప్రయాగమాహాత్మ్యమనే ముప్పై ఎనిమిదవ అధ్యాయం ॥ 38 ॥



## ఏకోనచత్వారింశోఽధ్యాయః - ముప్పై తొమ్మిదవ అధ్యాయం

## ప్రయాగమాహాత్మ్యమ్ - ప్రయాగమాహాత్మ్యం

**మార్కణ్డేయ ఉవాచ :-**మార్కండేయుడు పలికాడు

**తపనస్య సుతా దేవీ త్రిషు లోకేషు విశ్రుతా ।**
**సమాగతా మహాభాగా యమునా తత్ర నిమ్నగా ॥ 1 ॥**

సూర్యుని పుత్రిక ముల్లోకాల్లో ప్రసిద్ధురాలు, మహాత్మురాలు. యమునానది ఆ ప్రయాగలో గంగానదితో కలుస్తున్నది.

**యేనైవ నిఃసృతా గఙ్గా తేనైవ యమునాగతా ।**
**యోజనానాం సహస్రేషు కీర్తనాత్పాపనాశినీ ॥ 2 ॥**

గంగానది ప్రవహించే మార్గంలో వేలయోజనాల దూరం యమున ప్రవహిస్తున్నది. కీర్తించిన వారి పాపాలను ఆ నది నశింపచేస్తుంది.

**తత్ర స్నాత్వా చ పీత్వా చ యమునా యత్ర నిమ్నగా ।**
**సర్వపాపవినిర్ముక్తః పునాత్యాసప్తమం కులమ్ ॥ 3 ॥**

యమునా నది ప్రవహించేచోట స్నానంచేసి అందలి నీటిని త్రాగిన మనుజుడు సర్వపాపవిముక్తుడై తన వంశాన్ని ఏడుతరాలవరకు పవిత్రం చేస్తాడు.

**ప్రాణాం స్త్యజతి యస్తత్ర స యాతి పరమాం గతిమ్ ।**
**అగ్నితీర్థమితి ఖ్యాతం యమునా దక్షిణే తటే ॥ 4 ॥**

యమునకు దక్షిణతీరంలో అగ్నితీర్థమనే పుణ్యస్థలమున్నది. అక్కడ ప్రాణాలు వదలినవాడు ఉత్తమ లోకాలు పొందుతాడు.

**పశ్చిమే ధర్మరాజస్య తీర్థం త్వనరకం స్మృతమ్ ।**
**తత్ర స్నాత్వా దివం యాన్తి యే మృతా స్తేఽపునర్భవాః ॥ 5 ॥**

యమునకు పశ్చిమదిశలో నరక నివారకమైన ధర్మరాజ తీర్థం ఉన్నది. అక్కడ స్నానం చేసినచో స్వర్గాన్ని పొందుతారు. మరణించిన వారికి పునర్జన్మ రాదు.

**కృష్ణపక్షే చతుర్దశ్యాం స్నాత్వా సన్తర్ప్య వై శుచిః ।**
**ధర్మరాజం మహాపాపై ర్ముచ్యతే నాత్ర సంశయః ॥ 6 ॥**

కృష్ణ పక్ష చతుర్దశి రోజు స్నానంచేసి పరిశుద్ధుడై యమధర్మరాజుకు తర్పణాలిస్తే గొప్ప పాపాలనుండి విముక్తు డగుననుటకు సందేహం లేదు.

**దశతీర్థ సహస్రాణి దశకోట్యస్తథా పరాః ।**
**ప్రయాగ సంస్థితాని స్యురేవ మాహుర్మనీషిణః ॥ 7 ॥**

పదివేల పుణ్యతీర్థాలు పదికోట్ల ఇతర తీర్థాలు ప్రయాగక్షేత్రంలో నిలిచి ఉన్నవని విద్వాంసులు చెపుతున్నారు.

**తిస్రః కోట్యోఽర్ధ కోటిశ్చ తీర్థానాం వాయురబ్రవీత్ ।**
**దివి భూమ్యన్తరిక్షే చ తత్సర్వం జాహ్నవీ స్మృతా ॥ 8 ॥**

మూడున్నరకోట్ల తీర్థాలిక్కడ ఉన్నాయని వాయుదేవుడు చెప్పినాడు. స్వర్గంలో భూమిమీద ఆకాశంలో కూడ జాహ్నవి అయిన గంగ వ్యాపించి ఉన్నది.

**యత్ర గఙ్గా మహాభాగా స దేశస్తత్తపోవనమ్ ।**
**సిద్ధక్షేత్రం తు తత్ జ్ఞేయం గఙ్గాతీరం సమాశ్రితమ్ ॥ 9 ॥**

గంగానది ప్రవహించే ప్రదేశం తపోవనం వంటిది. గంగానది తీరాన్నాశ్రయించి ఉన్న స్థలాన్ని సిద్ధక్షేత్రంగా గుర్తించాలి.

**యత్ర దేవో మహాదేవో మాధవేన మహేశ్వరః ।**
**ఆస్తే దేవేశ్వరో నిత్యం తత్తీర్థం తత్తపోవనమ్ ॥ 10 ॥**

మహాదేవుడైన శివుడు విష్ణువుతో కలిసి నివసించిన ప్రదేశం ఆ తీర్థస్థలం. దాన్ని తపోవనంగా భావించాలి.

**ఇదం సత్యం ద్విజాతీనాం సాధూనామాత్మజస్య చ ।**
**సుహృదాఞ్చ జపేత్కర్ణే శిష్యస్యానుగతస్య చ ॥ 11 ॥**

సత్యమైన ఈ విషయాన్ని బ్రాహ్మణులకు, సత్పురుషులకు, కుమారునికి, మిత్రులకు, తననను సరించే శిష్యునికైనా చెవిలో ఉపదేశించాలి.

**ఇదం ధన్యమిదం స్వర్గ్యమిదం మేధ్యమిదం శుభమ్ ।**
**ఇదం పుణ్యమిదం రమ్యం పావనం ధర్మ్యముత్తమమ్ ॥ 12 ॥**

ఈ క్షేత్రం ధనము స్వర్గానికి సాధనము. పవిత్రమైనది. శుభావహము. పుణ్యదాయకం. మనోహరమైనది. తరింపచేసే శ్రేష్ఠమైన ధర్మసాధనోపాయము.

**మహర్షీణామిదం గుహ్యం సర్వపాపప్రమోచనమ్ ।**
**అత్రాధీత్య ద్విజోఽధ్యాయం నిర్మలత్వమవాప్నుయాత్ ॥ 13 ॥**

మహర్షుల ఈ క్షేత్ర రహస్యం అన్ని పాపాలను పోగొడుతుంది. ఇక్కడ బ్రాహ్మణుడు వేదాధ్యయనం చేసి నిర్మలుడవుతాడు.

**యశ్చేదం శృణుయాన్నిత్యం తీర్థం పుణ్యం సదా శుచిః ।**
**జాతిస్మరత్వం లభతే నాకపృష్ఠే చ మోదతే ॥ 14 ॥**

ఎల్లపుడు ఈ పుణ్యతీర్థాన్ని గూర్చి శుచియై వినేవాడు పూర్వజన్మస్మృతిని పొందుతాడు మరియు స్వర్గలోకంలో సుఖిస్తాడు.

**ప్రాప్యన్తే తాని తీర్థాని సద్భిః శిష్టానుదర్శిభిః ।**
**స్నాహి తీర్థేషు కౌరవ్య! మా చ వక్రమతిర్భవ ॥ 15 ॥**

శిష్టులనాశ్రయించి జ్ఞానాన్ని పొందిన ఉత్తములు ఆ తీర్థాలను పొందుతారు. ఓ యుధిష్ఠిరా! ఆ తీర్థాల్లో స్నానం ఆచరించు. విపరీతబుద్ధివి కావలదు.

**ఏవముక్త్వా స భగవాన్మార్కణ్డేయో మహామునిః ।**
**తీర్థాని కథయామాస పృథివ్యాం యాని కానిచిత్ ॥ 16 ॥**

పరమపూజ్యుడైన ఆ మార్కండేయ మహాముని ఈ విధంగా పలికి భూమిపైనున్న మరికొన్ని తీర్థ విశేషాలు వివరించినాడు.

**భూసముద్రాదిసంస్థానం గ్రహాణాం జ్యోతిషాం స్థితిమ్ ।**
**పృష్టః ప్రోవాచ సకలముక్త్వాఽథ ప్రయయౌ మునిః ॥ 17 ॥**

భూమి సముద్రం మొదలైనవాని ఉనికి గ్రహనక్షత్రాల స్థితి ధర్మజు డడుగగా సంపూర్ణంగా వానిని వివరించి మార్కండేయ మహాముని వెడలిపోయినాడు.

**సూత ఉవాచ :-**సూతుడు పలికాడు

**య ఇదం కల్యముత్థాయ శృణోతి పఠతేఽథవా ।**
**ముచ్యతే సర్వపాపైస్తు రుద్రలోకం స గచ్ఛతి ॥ 18 ॥**

ఈ ప్రయాగ తీర్థ మాహాత్మ్యాన్ని ఉదయమే లేచి చదివేవాడు, వినేవాడు అన్ని పాపాలు తొలగి రుద్రలోకాన్ని చేరుకుంటాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ప్రయాగమాహాత్మ్యం నామ ఏకోనచత్వారింశోఽధ్యాయః ॥ 39 ॥**

శ్రీకూర్మపురాణంలో ప్రయాగమాహాత్మ్యమనే ముప్పై తొమ్మిదవ అధ్యాయం ॥ 39 ॥



## చత్వారింశోఽధ్యాయః – నలబైయవ అధ్యాయం

## భువనవిన్యాసప్రకరణమ్ – భువనవిన్యాసప్రకరణం

**మునయ ఊచుః :**–మునులు పలికారు

**ఏవముక్తాస్తు మునయో నైమిషీయా మహామునిమ్ ।**
**పప్రచ్ఛురుత్తరం సూతం పృథివ్యాదివినిర్ణయమ్ ॥ 1 ॥**

నైమిషారణ్యంలోని మునులు ముందు చెప్పినది విని తర్వాత భూమి మొదలైన లోకవివరాలను గూర్చి సూతుని ఇట్లు ప్రశ్నించినారు.

**కథితో భవతా సర్గః మనుః స్వాయమ్భువః శుభః ।**
**ఇదానీం శ్రోతుమిచ్ఛామస్త్రిలోకస్యాస్య మణ్డలమ్ ॥ 2 ॥**

నీవు మంగళకరమైన స్వాయంభువ మను సంబద్ధ సృష్టిక్రమాన్ని వివరించినావు. ఇపుడు ఈ ముదులోకాల మండల వివరాలను వినకోరుతున్నాము.

**యావన్తః సాగరద్వీపాస్తథా వర్షాణి పర్వతాః ।**
**వనాని సరితః సూర్యో గ్రహాణాం స్థితిరేవ చ ॥ 3 ॥**

**యదాధార మిదం సర్వం యేషాం పృథ్వీ పురాన్వితమ్ ।**
**నృపాణాం తత్సమాసేన తత్తద్వక్తుమిహార్హసి ॥ 4 ॥**

సముద్రాలెన్ని? అట్లే ద్వీపాలు వర్షాలు పర్వతాలు వనాలు నదులు ఎన్నెన్ని కలవు? ఇతర గ్రహాల స్థితి ఎట్టిది? ఈ సృష్టి అంతా దేని ఆధారంగా జరుగుతున్నది? ఈ భూమి పూర్వమెవరిది? రాజుల వృత్తాంతం ఈ విషయా లన్నింటినీ నీవు చెప్పుటకు తగుదువు.

**సూత ఉవాచ :**–సూతుడు పలికాడు

**వక్ష్యే దేవాధిదేవాయ విష్ణవే ప్రభవిష్ణవే ।**
**నమస్కృత్యాప్రమేయాయ యదుక్తం తేన ధీమతా ॥ 5 ॥**

దేవదేవుడు సర్వసమర్థుడు అప్రమేయుడైన విష్ణువునకు నమస్కరించి ఆయన చెప్పిన దానినే మీకు వివరిస్తాను.

**స్వాయమ్భువస్యాస్య మునేః ప్రాగుక్తో యః ప్రియవ్రతః ।**
**పుత్ర స్తస్యాభవన్పుత్రాః ప్రజాపతిసమా దశ ॥ 6 ॥**

స్వాయంభువ మనువుకు ఇంతకుముందే చెప్పిన ప్రియవ్రతుడనే కుమారునికి ప్రజాపతిసములైన పదిమంది పుత్రులున్నారు.

**ఆగ్నీధ్రశ్చాగ్నిబాహుశ్చ వపుష్మాన్ద్యుతిమాంస్తథా ।**
**మేధా మేధాతిథిర్హవ్యః సవనః పుత్ర ఏవ చ ॥ 7 ॥**

**జ్యోతిష్మా న్దశమస్తేషాం మహాబలపరాక్రమః ।**
**ధార్మికో దాననిరతః సర్వభూతానుకమ్పకః ॥ 8 ॥**

అగ్నీధ్రుడు, అగ్నిబాహువు, వపుష్మంతుడు, ద్యుతిమంతుడు, మేధ, మేధాతిథి, హవ్యుడు, సవనుడు, పుత్రుడు, జ్యోతిష్మంతుడని ఆ పుత్రుల పేర్లు.వారిలో చివరివాడైన జ్యోతిష్మంతుడు గొప్ప పరాక్రమవంతుడు. ధర్మం దానం గుణాలతోపాటు అన్ని ప్రాణులయందు దయకలవాడు.

**మేధాగ్నిబాహుపుత్రాస్తు త్రయో యోగపరాయణాః ।**
**జాతిస్మరా మహాభాగా న రాజ్యే దధిరే మతిమ్ ॥ 9 ॥**

మేధ, అగ్నిబాహువు, పుత్రుడు అనే ముగ్గురు యోగాసక్తులు పూర్వజన్మ స్మృతి కల మహాత్ములు. వారు రాజ్యకాంక్షను వదలినారు.

**ప్రియవ్రతోఽభ్యషిఞ్చద్వై సప్తద్వీపేషు సప్త తాన్ ।**
**జమ్బూద్వీపేశ్వరం పుత్రమాగ్నీధ్రమకరోన్నృపః ॥ 10 ॥**

**ప్లక్షద్వీపేశ్వరశ్చైవ తేన మేధాతిథిః కృతః ।**
**శాల్మలీశం వపుష్మన్తం నరేన్ద్ర మభిషిక్తవాన్ ॥ 11 ॥**

ప్రియవ్రతుడు ఏడుగురు కుమారులను ఏడు ద్వీపాలకు రాజ్యాభిషిక్తులను గావించినాడు. ఆగ్నీధ్రుడనే కుమారుని జంబూద్వీపానికి, మేధాతిథిని ప్లక్షద్వీపానికి, వపుష్మంతుని శాల్మలీ ద్వీపానికి ప్రభువులను చేసినాడు.

**జ్యోతిష్మన్తం కుశద్వీపే రాజానం కృతవాన్ప్రభుః ।**
**ద్యుతిమన్తం చ రాజానం క్రౌఞ్చద్వీపే సమాదిశత్ ॥ 12 ॥**

కుశద్వీపానికి జ్యోతిష్మంతుని, క్రౌంచద్వీపానికి ద్యుతిమంతుడనే వానిని అధిపతులుగా చేసినాడు.

**శాకద్వీపేశ్వరశ్చాపి హవ్యం చక్రే ప్రియవ్రతః ।**
**పుష్కరాధిపతిఞ్చక్రే సవనం చ ప్రజాపతిః ॥ 13 ॥**

ఆ రాజు హవ్యుడనే పుత్రుని శాకద్వీపానికి, సవనుని పుష్కరద్వీపానికి అధిపతిని చేసినాడు.

**పుష్కరేశ్వరతశ్చాపి మహావీతసుతోఽభవత్ ।**
**ధాతకిశ్చైవ ద్వావేతౌ పుత్రౌ పుత్రవతాం వరౌ ॥ 14 ॥**

పుష్కర ద్వీపాధిపతి సవనునికి మహావీతుడు ధాతకి అనే ఇద్దరు కుమారులు. వారిద్దరు పుత్రవంతులలో శ్రేష్ఠులైనారు.

**మహావీతం స్మృతం వర్షం తస్య స్యాత్తు మహాత్మనః ।**
**నామ్నా వై ధాతకేశ్చాపి ధాతకీఖణ్డముచ్యతే ॥ 15 ॥**

మహావీతుని పేర మహావీతమనే వర్షం ప్రసిద్ధమైనది. ధాతకి అనే వానిపేర ధాతకీఖండం అని పిలువబడినది.

**శాకద్వీపేశ్వరస్యాపి హవ్యస్యాప్యభవన్సుతాః ।**
**జలదశ్చ కుమారశ్చ సుకుమారో మణీచరః ॥ 16 ॥**

**కుశోత్తరోఽథ మోదాకిః సప్తమః స్యాన్మహాద్రుమః ।**
**జలదం జలదస్యాథ వర్షం ప్రథమముచ్యతే ॥ 17 ॥**

శాకద్వీప ప్రభువు హవ్యునకు ఏడుగురు కుమారులు. వారు వరుసగా జలదుడు, కుమారుడు, సుకుమారుడు, మణీచకుడు, కుశోత్తరుడు, మోదాకి, మహాద్రుముడు అనువారు. జలదుని పేర జలదవర్షము వ్యవహృతమైనది.

**కుమారస్య తు కౌమారం తృతీయం సుకుమారకమ్ ।**
**మణీచకశ్చతుర్థశ్చ పఞ్చమశ్చ కుశోత్తరమ్ ॥ 18 ॥**

**మోదాకం షష్ఠమిత్యుక్తం సప్తమన్తు మహాద్రుమమ్ ।**
**క్రౌఞ్చద్వీపేశ్వరస్యాపి సుతా ద్యుతిమతోఽభవత్ ॥ 19 ॥**

కుమారుని పేర కౌమారవర్షము, సుకుమారునిపేర సుకుమారకవర్షము నాల్గవది మణీచక వర్షము, అయిదవది కుశోత్తర వర్షము, ఆరవ ఏడవ కుమారులపేర మోదాకము మహాద్రుమము అనే వర్షములు ప్రసిద్ధాలు. క్రౌంచద్వీపాధిపతి ద్యుతిమంతునకును పుత్రులున్నారు.

**కుశలః ప్రథమస్తేషాం ద్వితీయస్తు మనోహరః ।**
**ఉష్ణస్తృతీయః సమ్ప్రోక్తశ్చతుర్థః పీవరః స్మృతః ॥ 20 ॥**

**అన్ధకారో మునిశ్చైవ దున్దుభిశ్చైవ సప్త వై ।**
**తేషాం స్వనామభిర్దేశాః క్రౌఞ్చద్వీపాశ్రయాః శుభాః ॥ 21 ॥**

వారిలో మొదటివాడు కుశలుడు, రెండవవాడు మనోహరుడు, మూడవవాడు ఉష్ణుడు, నాలుగవవాడు పీవరుడు, అంధకారుడు, ముని, దుందుభి అని మొత్తం ఏడుగురు కుమారులు. వారి పేర్లననుసరించి ఆయాదేశాలు క్రౌంచద్వీపంలో శుభకరాలైనవి.

**జ్యోతిష్మతః కుశద్వీపే సప్తైవాసన్మహౌజసః ।**
**ఉద్భేదో వేణుమాంశ్చైవాశ్వరథో లమ్బనో ధృతిః ॥ 22 ॥**

**షష్ఠః ప్రభాకరశ్చాపి సప్తమః కపిలః స్మృతః ।**
**స్వనామచిహ్నతశ్చాత్ర తథా వర్షాణి సువ్రతాః ॥ 23 ॥**

**జ్ఞేయాని చ తథాఽన్యేషు ద్వీపేష్వేవం నయో మతః ।**
**శాల్మలి ద్వీపనాథస్య సుతాశ్చాసన్వపుష్మతః ॥ 24 ॥**

కుశద్వీపంలో జ్యోతిష్మంతునికి ఉద్భేదుడు, వేణుమంతుడు, అశ్వరథుడు, లంబనుడు, ధృతి, ప్రభాకరుడు, కపిలుడు అనువారు ఏడుగురు కుమారులు. ఆయా వర్షములు వారి పేరనే ఏర్పడినవి. అదేవిధంగా వేరే ద్వీపాల్లోను ఇదేవిధంగా పేర్లు కల్పితాలైనవి. శాల్మలిద్వీపాధిపతి వపుష్మంతునికి క్రింది విధంగా పుత్రులు కలిగినారు.

**శ్వేతశ్చ హరితశ్చైవ జీమూతో రోహితస్తథా ।**
**వైద్యుతో మానసశ్చైవ సప్తమః సుప్రభో మతః ॥ 25 ॥**

**ప్లక్షద్వీపేశ్వరస్యాపి సప్త మేధాతిథేః సుతాః ।**
**జ్యేష్ఠః శాన్తమయస్తేషాం శిశిరస్తు సుఖోదయః ॥ 26 ॥**

**ఆనన్దశ్చ శివశ్చైవ క్షేమకశ్చ ధ్రువస్తథా ।**
**ప్లక్షద్వీపాదికే జ్ఞేయాః శాకద్వీపాన్తికేషు చ ॥ 27 ॥**

**వర్ణానాం చ విభాగేన స్వధర్మో ముక్తయే మతః ।**
**జమ్బూద్వీపేశ్వరస్యాపి పుత్రాశ్చాసన్మహాబలాః ॥ 28 ॥**

శ్వేతుడు, హరితుడు, జీమూతుడు, రోహితుడు, వైద్యుతుడు, మానసుడు, సుప్రభుడు అనేవారు ఏడుగురు ప్రసిద్ధులు. ప్లక్షద్వీపాధిపతి మేధాతిథికి శాంతమయుడు, శిశురుడు, సుఖోదయుడు, ఆనందుడు, శివుడు, క్షేమకుడు, ధ్రువుడు అని వారిపేర్లు. ప్లక్షద్వీపాదుల్లో శాకద్వీపసమీప దేశాల్లోను ఇదేవిధంగా గ్రహించవలెను. వర్ణాల విభాగంతో తమ ధర్మం ముక్తి హేతువుగా చెప్పనైనది. జంబూద్వీపాధిపతికి కూడ గొప్ప బలవంతులైన కుమారులున్నారు.

**ఆగ్నీధ్రస్య ద్విజశ్రేష్ఠాస్తన్నామాని నిబోధత ।**
**నాభిః కింపురుషశ్చైవ తథా హరిరిలావృతః ॥ 29 ॥**

**రమ్యో హిరణ్వాంశ్చ కురుర్భద్రాశ్వః కేతుమాలకః ।**
**జమ్బుద్వీపేశ్వరో రాజా స చాగ్నీధ్రో మహామతిః ॥ 30 ॥**

**విభజ్య నవధా తేభ్యో యథాన్యాయం దదౌ పునః ।**
**నాభేస్తు దక్షిణం వర్షం హిమాహ్వం ప్రదదౌ పితా ॥ 31 ॥**

**హేమకూటం తతో వర్షం దదౌ కింపురుషాయ సః ।**
**తృతీయం నైషధం వర్షం హరయే దత్తవాన్పితా ॥ 32 ॥**

**ఇలావృతాయ ప్రదదౌ మేరుమధ్యమిలావృతమ్ ।**
**నీలాద్రేరాశ్రితం వర్షం రమ్యాయ ప్రదదౌ పితా ॥ 33 ॥**

**శ్వేతం యదుత్తరం వర్షం పిత్రా దత్తం హిరణ్వతే ।
యదుత్తరం శృఙ్గవతో వర్షం తత్కురవే దదౌ ॥ 34 ॥**

ఆ ద్వీపాధిపతి ఆగ్నీధ్రుడు. ఓ ద్విజులారా! అతని పుత్రులు నాభి, కింపురుషుడు, హరి, ఇలావృతుడు, రమ్యుడు, హిరణ్వంతుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలకుడు అనువారు. జంబూద్వీపాధిపతి ఆగ్నీధ్రమహారాజు గొప్పబుద్ధి బలసంపన్నుడు. అతడు తన ద్వీపభాగాన్ని తొమ్మిది భాగాలు చేసి కుమారులకు న్యాయంగా పంచి యిచ్చినాడు. నాభి అనువానికి హిమమనే పేరుగల దక్షిణ వర్షాన్నిఅప్పగించి నాడు. కింపురుషునకు హేమకూటవర్షాన్ని, హరికి నైషధవర్షాన్ని ఇచ్చినాడు. మేరుమధ్యభాగమైన ఇలావృత వర్షాన్ని ఇలావృతునకు, రమ్యుడనేవానికి నీలాద్రికాశ్రయమైన వర్షాన్ని అప్పగించినాడు. హిరణ్వంతునికి శ్వేతమనే ఉత్తరమందున్న వర్షాన్ని, కురువునకు శృంగపర్వతానికుత్తరంగా ఉన్న వర్షాన్ని ఇచ్చినాడు.

**మేరోః పూర్వేణ యద్వర్షం భద్రాశ్వాయ న్యవేదయత్ ।
గన్ధమాదనవర్షన్తు కేతుమాలాయ దత్తవాన్ ॥ 35 ॥**

**వర్షేష్వేతేషు తాన్పుత్రానభ్యషిఞ్చన్నరాధిపః ।
సంసారాసారతాం జ్ఞాత్వా తపస్తప్తుం వనం గతః ॥ 36 ॥**

**హిమాహ్వయన్తు యద్వర్షం నాభేరాసీన్మహాత్మనః ।
తస్యర్షభోఽభవత్పుత్రో మేరుదేవ్యాం మహాద్యుతిః ॥ 37 ॥**

**ఋషభాద్భరతో జజ్ఞే వీరః పుత్రశతాగ్రజః ।
సోఽభిషిచ్యర్షభః పుత్రం భరతం పృథివీపతిః ॥ 38 ॥**

**వానప్రస్థాశ్రమం గత్వా తపస్తేపే యథావిధి ।
తపసా కర్షితోఽత్యర్థం కృశోఽయమనిశం తతః ॥ 39 ॥**

భద్రాశ్వునకు మేరపర్వతపుటుత్తర మందున్న వర్షాన్ని, కేతుమాలునకు గంధమాదన వర్షాన్ని అప్పగించినాడు. ఆ రాజు ఈ వర్షములకు తన కుమారులను పట్టాభిషిక్తులను చేసినాడు. తర్వాత ప్రపంచం సారహీనమని తలచి తపసు చేయటానికి అడవికి వెళ్ళినాడు. హిమాహ్వాయ వర్షానికి నాభి రాజు. అతనికి మేరుదేవియందు గొప్ప కాంతిమంతుడైన ఋషభుడు జన్మించినాడు. ఆ ఋషభునికి గల నూరుగురుపుత్రుల్లో భరతుడు అగ్రజుడు వీరుడు కూడ. ఋషభుడు భరతునికి రాజ్యాభిషిక్తుని చేసి వానప్రస్థాశ్రమానికి వెళ్ళి యథాశాస్త్రం తపస్సునాచరించినాడు. తపస్సునందాసక్తుడై ఎల్లపుడు కృశించిన వాడైనాడు.

**జ్ఞానయోగరతో భూత్వా మహాపాశుపతోఽభవత్ ।
సుమతిర్భరతస్యాపి పుత్రః పరమధార్మికః ॥ 40 ॥**

**సుమతేస్తైజసస్తస్మాదిన్ద్రద్యుమ్నో మహాద్యుతిః ।
పరమేష్ఠీ సుతస్తస్మాత్ప్రతీహారస్తదన్వయః ॥ 41 ॥**

**ప్రతిహర్తేతి విఖ్యాత ఉత్పన్నస్తస్య చాత్మజః ।**
**భవస్తస్మా దథోద్గీతః ప్రస్తావిస్తత్సుతోఽభవత్ ॥ 42 ॥**

**పృథుస్తతస్తతో నక్తో నక్తస్యాపి గయః స్మృతః ।**
**నరో గయస్య తనయస్తస్య భూయో విరాడభూత్ ॥43॥**

**తస్య పుత్రో మహావీర్యో ధీమాంస్తస్మాదజాయత ।**
**ధీమతోఽపి తతశ్చాభూద్రౌవణస్తత్సుతోఽభవత్ ॥ 44 ॥**

అతడు జ్ఞానయోగంలో శ్రద్ధ కలవాడై మహాపాశుపతుడుగ మారినాడు. ఆ భరతునికి ధర్మాత్ముడైన సుమతి కుమారుడుగ జన్మించినాడు. సుమతివల్ల తైజసుడు, అతనివల్ల తేజస్వంతుడైన ఇంద్రద్యుమ్నుడు, అతనికి పరమేష్ఠి అనువాడు, అతనికి ప్రతీహారుడు పుత్రులుగా జన్మించినారు. ప్రతీహారునికి ప్రతిహర్త అని ప్రఖ్యాతుడైన పుత్రుడు పుట్టినాడు. అతనికి భవుడు, భవునికి ఉద్గీథుడు, అతనికి ప్రస్తావి అను కుమారుడు జన్మించినాడు. ప్రస్తావికి పృథుడు, అతనికి నక్తుడు, నక్తునకు గయుడు, ఆ గయునికి నరుడు, నరునికి విరాట్టు అనువారు క్రమంగా పుత్రులు జన్మించినారు. ఆ విరాట్టుకు ధీమంతుడనే గొప్ప పరాక్రమవంతుడు జన్మించినాడు. అతనికి రౌవణుడనే కుమారుడు కలిగినాడు.

**త్వష్టా త్వష్టుశ్చ విరజో రజస్తస్మాదభూత్సుతః ।**
**శతజిద్రథజిత్తస్య జజ్ఞే పుత్రశతం ద్విజాః ॥ 45 ॥**

**తేషాం ప్రధానో బలవాన్విశ్వజ్యోతిరితి స్మృతః ।**
**ఆరాధ్య దేవం బ్రహ్మాణం క్షేమకం నామ పార్థివమ్ ॥ 46 ॥**

**అసూత పుత్రం ధర్మజ్ఞం మహాబాహుమరిన్దమమ్ ।**
**ఏతే పురస్తాద్రాజానో మహాసత్త్వా మహౌజసః ॥ 47 ॥**

**ఏషాం వంశప్రసూతైస్తు భుక్తేయం పృథివీ పురా ।**

ఆ రౌవణునికి త్వష్ట కుమారుడు. అతనివల్ల విరజుడు, వానికి రజస్సు, రజస్సుకు శతజిత్తు,అతనికి రథజిత్తు, రథజిత్తుకు నూరుగురు పుత్రులు జన్మించినారు. వారిలో ముఖ్యుడు బలవంతుడైన విశ్వజ్యోతి పేర్కొనదగినవాడు. అతడు బ్రహ్మదేవు నారాధించి క్షేమకుడనే ధర్మజ్ఞుడైన కుమారుని పొందినాడు. అతడు భుజబలం కలవాడై శత్రువులను ఓడించినాడు. వీరందరు పూర్వకాలపు రాజులు ఆత్మబలం పరాక్రమం కల్గినవారు. వీరి వంశంలో జన్మించిన వారే పూర్వకాలంలో ఈ భూమిని పాలించినారు.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనవిన్యాస ప్రకరణే చత్వారింశోఽధ్యాయః ॥ 40 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనవిన్యాస ప్రకరణమనే నలబైయవ అధ్యాయం ॥ 40 ॥



## ఏక చత్వారింశోఽధ్యాయః - నలభై ఒకటవ అధ్యాయం

## జ్యోతిఃసన్నివేశ వర్ణనమ్ - జ్యోతిస్సన్నివేశ వర్ణనం

**సూత ఉవాచ** :-సూతుడు పలికాడు

**అతః పరం ప్రవక్ష్యామి సంక్షేపేణ ద్విజోత్తమాః ।**
**త్రైలోక్యస్యాస్య మానం వో న శక్యం విస్తరేణ తు ॥ 1 ॥**

ఓ ద్విజోత్తములారా! ఇక ఈ మూడులోకాల పరిమాణాన్ని సంగ్రహంగా చెబుతాను. దానిని విపులంగా చెప్పటం సాధ్యం కాదు.

**భూర్లోకోఽథ భువర్లోకః స్వర్లోకోఽథ మహస్తథా ।**
**జనస్తపశ్చ సత్యఞ్చ లోకాస్త్వణ్డోద్భవాస్తథా ॥ 2 ॥**

భూలోకం, భువర్లోకం, స్వర్లోకం, మహర్లోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకం అనే ఏడు లోకాలు బ్రహ్మాండం నుండి పుట్టినవి.

**సూర్యాచన్ద్రమసౌ యావత్కిరణైరేవ భాసతః ।**
**తావద్భూర్లోక ఆఖ్యాతః పురాణే ద్విజపుఙ్గవాః! ॥ 3 ॥**

ద్విజవర్యులారా! సూర్యచంద్రులు తమ కిరణాలతో ప్రకాశిస్తూ కనిపించేంత వరకు భూలోకమని పురాణాల్లో చెప్పనైనది.

**యావత్ప్రమాణో భూర్లోకో విస్తరాత్పరిమణ్డలాత్ ।**
**భువర్లోకోఽపి తావత్స్యాత్ మణ్డలాద్భాస్కరస్య తు ॥ 4 ॥**

భూలోకం సూర్యపరిమండలంనుండి ఎంత ప్రమాణం కల్గి విస్తరించిందో భువర్లోకం కూడా సూర్యమండలానికి అంతే ప్రమాణంతో వ్యాపించి ఉంటుంది.

**ఊర్ధ్వం యన్మణ్డలం వ్యోమ్ని ధ్రువో యావద్వ్యవస్థితః ।**
**స్వర్గలోకః సమాఖ్యాతః తత్ర వాయోస్తు నేమయః ॥ 5 ॥**

ఆకాశంలో పై భాగమందుకల మండలం ధ్రువుడు నిలిచి ఉన్నంతవరకు స్వర్గలోకమని చెప్పబడినది. అక్కడ వాయువు నేములున్నాయి.

**ఆవహః ప్రవహశ్చైవ తత్రైవానువహః పునః ।**
**సంవహో వివహశ్చైవ తదూర్ధ్వం స్యాత్పరావహః ॥ 6 ॥**

**తథా పరివహశ్చైవ వాయోర్వై సప్త నేమయః ।**
**భూమేర్యోజన లక్షే తు భానోర్వై మణ్డలం స్థితమ్ ॥ 7 ॥**

ఆవహం, ప్రవహం, అనువహం, సంవహం, వివహం, పరావహం, పరివహం అని ఆ నేముల పేర్లు. భూమికి లక్షయోజనాలదూరంలో సూర్యమండలం నిలిచి ఉన్నది.

**లక్షే దివాకరస్యాపి మణ్డలం శశినః స్మృతమ్ ।**
**నక్షత్రమణ్డలం కృత్స్నం తల్లక్షేణ ప్రకాశతే ॥ 8 ॥**

సూర్యునికి లక్షయోజనాల దూరంలో చంద్రమండలం ఉన్నది. దానికి లక్షయోజనాల దూరంలో నక్షత్రమండలం ప్రకాశిస్తున్నది.

**ద్విలక్షే హ్యన్తరే విప్రా బుధో నక్షత్రమణ్డలాత్ ।**
**తావత్ప్రమాణభాగే తు బుధస్యాప్యుశనాః స్థితః ॥ 9 ॥**

ఓ ద్విజులారా! నక్షత్రమండలానికి రెండు లక్షలయోజనాల దూరంలో బుధుడు ప్రకాశిస్తాడు. అతనికి అంతే ప్రమాణంకల దూరంలో శుక్రుడున్నాడు.

**అఙ్గారకోఽపి శుక్రస్య తత్ప్రమాణే వ్యవస్థితః ।**
**లక్షద్వయేన భౌమస్య స్థితో దేవపురోహితః ॥ 10 ॥**

అంగారకుడు కూడ శుక్రునికి అంత దూరంలోనే నిల్చి ఉన్నాడు. అంగారకునికి రెండు లక్షల యోజనాల దూరంలో గురువు ఉన్నాడు.

**సౌరిః ద్విలక్షేణ గురోః గ్రహాణామథ మణ్డలాత్ ।**
**సప్తర్షిమణ్డలం తస్మాల్లక్షమాత్రే ప్రకాశతే ॥ 11 ॥**

గురుమండలానికి రెండులక్షలయోజనాలదూరంలో శనిగ్రహమండలం ఉన్నది. ఈ గ్రహాల మండలంనుండి లక్షయోజనాల దూరంలో సప్తర్షి మండలం ప్రకాశిస్తుంది.

**ఋషీణాం మణ్డలాదూర్ధ్వం లక్షమాత్రే స్థితో ధ్రువః ।**
**తత్ర ధర్మః స భగవాన్విష్ణుర్నారాయణః స్థితః ॥ 12 ॥**

ఆ మండలానికి పై భాగంలో లక్ష యోజనాల వద్ద ధ్రువుడున్నాడు. అక్కడే ధర్మస్వరూపుడైన భగవంతుడు నారాయణుడున్నాడు.

**నవయోజనసాహస్రో విష్కమ్భః సవితుః స్మృతః ।**
**త్రిగుణస్తస్య విస్తారో మణ్డలస్య ప్రమాణతః ॥ 13 ॥**

**ద్విగుణః సూర్యవిస్తారాద్విస్తారః శశినః స్మృతః ।**
**తుల్యస్తయోస్తు స్వర్భానుర్భూత్వా తావుపసర్పతి ॥ 14 ॥**

సూర్యమండల విష్కంభం తొమ్మిది వేల యోజనాల పరిమాణం కలది. వాని వైశాల్యం మండల ప్రమాణానికి మూడురెట్లెక్కువ గలదు. సూర్యుని వ్యాప్తికంటె చంద్రుని విస్తారం రెండు రెట్లెక్కువ. రాహుగ్రహం ఆ సూర్యచంద్రుల సమాన పరిమాణం కలదై వారిని సమీపించి అడ్డగిస్తుంది.

**ఉద్ధృత్య పృథివీఛాయాం నిర్మితో మణ్డలాకృతిః ।**
**స్వర్భానోస్తు బృహత్స్థానం తృతీయం యత్తమోమయమ్ ॥ 15 ॥**

భూమినీడను పైకితెచ్చి వలయాకారంగా రాహువు నిర్మించినాడు. రాహువుస్థానం పెద్దది, మూడవది. అది తమోమయం.

**చన్ద్రస్య షోడశో భాగో భార్గవస్య విధీయతే ।**
**భార్గవాత్పాదహీనస్తు విజ్ఞేయో వై బృహస్పతిః ॥ 16 ॥**

చంద్రుని పదహారవభాగం శుక్రునకు ఇవ్వబడినది. బృహస్పతిని శుక్రునికంటె నాలుగవవంతు తక్కువవాడుగా గుర్తించాలి.

**బృహస్పతేః పాదహీనౌ భౌమసౌరావుభౌ స్మృతౌ ।**
**విస్తారా న్మణ్డలాచ్చైవ పాదహీనస్తయోర్బుధః ॥ 17 ॥**

బృహస్పతికంటె నాలుగవ భాగం తక్కువ కలవారు అంగారకుడు, శని. విస్తారాన్నిబట్టి మండల పరిమాణాన్నిబట్టి వారిద్దరికి నాలుగవవంతు తక్కువ బుధుడు.

**తారానక్షత్రరూపాణి వపుష్మన్తీహ యాని వై ।**
**బుధేన తాని తుల్యాని విస్తారాన్మణ్డలాత్తథా ॥ 18 ॥**

ఆకారం ఉన్న తారలు నక్షత్రాలు అన్నీ విస్తారము మండలాన్నిబట్టి బుధునితో సమానాలని తెలియాలి.

**తారానక్షత్రరూపాణి హీనాని తు పరస్పరమ్ ।**
**శతాని పఞ్చ చత్వారి త్రీణి ద్వే చైవ యోజనే ॥ 19 ॥**

తారల నక్షత్రాల రూపాలు ఒకదానికొకటి అయిదు నాలుగు మూడు రెండువందల యోజనాల దూరాలతో తక్కువ దూరాలు కల్గి ఉన్నవి.

**పూర్వాపరానుకృష్టాని తారకామణ్డలాని తు ।**
**యోజనాద్యర్ధమాత్రాణి తేభ్యో హ్రస్వం న విద్యతే ॥ 20 ॥**

తారకామండలాలు ముందువెనుకలవి పరస్పరం ఆకర్షించుకుంటాయి. యోజనపరిమాణంలో సగంకల్గి ఉంటాయి. అంతకంటె తగ్గవు.

**ఉపరిష్టాత్త్రయస్తేషాం గ్రహా వై దూరసర్పిణః ।**
**సౌరోఽఙ్గిరాశ్చ వక్రశ్చ జ్ఞేయో మన్దవిచారణః ॥ 21 ॥**

వానిలో మూడుగ్రహాలు పైభాగంలో దూరంగా సంచరిస్తాయి. సూర్యపుత్రుడైన శని, బృహస్పతి, అంగారకుడు అనే మూడుగ్రహాలు మందగమనం కలవి.

**తేభ్యోఽధస్తాచ్చ చత్వారః పునరన్యే మహాగ్రహాః ।**
**సూర్యః సోమో బుధశ్చైవ భార్గవశ్చైవ శీఘ్రగాః ॥ 22 ॥**

ఆ గ్రహాలకు క్రిందిభాగంలో మరో నాలుగు పెద్దగ్రహాలు సంచరిస్తాయి. సూర్యుడు, చంద్రుడు, బుధుడు, శుక్రుడు అనే నాలుగు గ్రహాలు శీఘ్రగమనం కలవి.

**దక్షిణాయనమార్గస్థో యదా చరతి రశ్మిమాన్ ।**
**తదా పూర్వగ్రహాణాం వై సూర్యోఽధస్తాత్ప్రసర్పతి ॥ 23 ॥**

సూర్యుడు దక్షిణాయనమార్గసంచారంలో పూర్వగ్రహాలకు క్రింది భాగంలో సంచరిస్తాడు.

**విస్తీర్ణం మణ్డలం కృత్వా తస్యోర్ధ్వం చరతే శశీ ।**
**నక్షత్రమణ్డలం కృత్స్నం సోమాదూర్ధ్వం ప్రసర్పతి ॥ 24 ॥**

చంద్రుడు విశాలమైన మండలాన్నేర్పరచుకొని దానికి పైభాగంలో సంచరిస్తాడు. నక్షత్రమండలాలన్నీ చంద్రునికి పైభాగంలో సంచరిస్తాయి.

**నక్షత్రేభ్యో బుధశ్చోర్ధ్వం బుధాదూర్ధ్వం తు భార్గవః ।**
**వక్రస్తు భార్గవాదూర్ధ్వం వక్రాదూర్ధ్వం బృహస్పతిః ॥ 25 ॥**

నక్షత్రాలకు పైభాగంలో బుధుడు, బుధునికి పైభాగంలో శుక్రుడు, అతనికి పైన అంగారకుడు, అంగారకుని పైభాగంలో బృహస్పతి ఉంటారు.

**తస్మాచ్ఛనైశ్చరోఽప్యూర్ధ్వం తస్మాత్సప్తర్షిమణ్డలమ్ ।**
**ఋషీణాఞ్చైవ సప్తానాం ధ్రువశ్చోర్ధ్వం వ్యవస్థితః ॥ 26 ॥**

బృహస్పతికి పైభాగంలో శని, శనికి పైన సప్తర్షిమండలం ఉంటుంది. ఆ సప్తర్షిమండలానికి పైభాగంలో ధ్రువుడు నిలిచి ఉన్నాడు.

**యోజనానాం సహస్రాణి భాస్కరస్య రథో నవ ।**
**ఈషాదణ్డస్తథా తస్య ద్విగుణో ద్విజసత్తమాః ॥ 27 ॥**

సూర్యుని రథం తొమ్మిదివేల యోజనాలు వ్యాపించి ఉంటుంది. ఓ బ్రాహ్మణోత్తములారా! దాని ఈషాదండం (నొగలు కర్ర) రెండు రెట్లు కలది.

**సార్ధకోటిస్తథా సప్త నియుతాన్యధికాని తు ।**
**యోజనానాం తు తస్యాక్షస్తత్ర చక్రం ప్రతిష్ఠితమ్ ॥ 28 ॥**

ఆ రథం ఇరుసు ఏడు నియతములెక్కువగల కోటిన్నర యోజనాల పరిమాణం కలది. దానియందు చక్రం ప్రతిష్ఠింపబడినది.

**త్రినాభిమతి పఞ్చారే షణ్ణేమిన్యక్షయాత్మకే ।**
**సంవత్సరమయం కృత్స్నం కాలచక్రం ప్రతిష్ఠితమ్ ॥ 29 ॥**

మూడు నాభులు, అయిదు ఆకులు, ఆరు అంచులు కల అక్షయచక్రంలో సంవత్సరరూపమైన కాలచక్రం పూర్తిగా నెలకొల్పబడినది.

**చత్వారింశత్సహస్రాణి ద్వితీయాక్షో వ్యవస్థితః ।**
**పఞ్చాయుతాని సార్ధాని యోజనాని ద్విజోత్తమాః ॥ 30 ॥**

రెండవ ఇరుసు నలభైవేల యోజనాల పరిమాణం కల్గినది. విప్రులారా! సార్ధములైన ఏబదివేల యోజనాలు దాని ప్రమాణం.

**అక్షప్రమాణముభయోః ప్రమాణం తద్యుగార్ధయోః ।**
**హ్రస్వోఽక్ష స్తద్యుగార్ధేన ధ్రువాధారో రథస్య తు ॥ 31 ॥**

రెండు అక్షముల ప్రమాణము ఆ రెండు అక్షముల అనగా నొగలుకు సగభాగములో ఉన్న ఇరుసుకు తక్కువగా ఉంటుంది. అది రథము యొక్క ధ్రువాధారముగా తెలియాలి.

**ద్వితీయేఽక్షే తు తచ్చక్రం సంస్థితం మానసాచలే ।**
**హయాశ్చ సప్తచ్ఛందాంసి తన్నామాని నిబోధత ॥ 32 ॥**

రెండవ ఇరుసునందు మానస పర్వతంలో ఆ చక్రం నిలిచినది. దానికి ఏడు ఛందస్సులు గుర్రాలు. వాని పేర్లు తెలియుము.

**గాయత్రీ చ బృహత్యుష్ణిక్ జగతీ పంక్తిరేవ చ ।**
**అనుష్టుప్ త్రిష్టుబప్యుక్తా ఛన్దాంసి హరయో హరేః ॥ 33 ॥**

గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, పంక్తి, అనుష్టుప్, త్రిష్టుప్ అనేవి సూర్యుని రథానికి అశ్వాలు.

**మానసోపరి మాహేన్ద్రీ ప్రాచ్యాం దిశి మహాపురీ ।**
**దక్షిణాయాం యమస్యాథ వరుణస్య తు పశ్చిమే ॥ 34 ॥**

తూర్పుదిక్కు మానసశైలంపై మాహేంద్రి అనే పెద్ద పట్టణమున్నది. యముని ముఖ్యపట్టణం దక్షిణదిక్కు, పడమటి దిక్కు వరణుని పట్టణం ఉన్నవి.

**ఉత్తరేషు చ సోమస్య తన్నామాని నిబోధత ।**
**అమరావతీ సంయమనీ సుఖా చైవ విభావరీ ॥ 35 ॥**

సోముని పట్టణం ఉత్తరం దిక్కునున్నది. ఆ పట్టణాల పేర్లు అమరావతి, సంయమని, సుఖ, విభావరి అనేవి.

**కాష్ఠాగతో దక్షిణతః క్షిప్తేషురివ సర్పతి ।**
**జ్యోతిషాం చక్రమాదాయ దేవదేవః పితామహః ॥ 36 ॥**

దేవదేవుడైన పితామహుడు దక్షిణ దిక్కున ఉండి గ్రహనక్షత్రాదుల చక్రాన్ని తీసుకొని ప్రయోగించిన బాణమువలె సంచరిస్తాడు.

**దివసస్య రవిర్మధ్యే సర్వకాలం వ్యవస్థితః ।**
**సప్తద్వీపేషు విప్రేన్ద్రా నిశార్ధస్య చ సమ్ముఖః ॥ 37 ॥**

విప్రవర్యులారా! సూర్యుడు అన్ని కాలాల్లోను పగలు సప్తద్వీపాల్లో రాత్రిమధ్య భాగానికి అభిముఖంగా ఉంటాడు.

**ఉదయాస్తమనే చైవ సర్వకాలం తు సమ్ముఖే ।**
**దిశాస్వశేషాసు తథా విప్రేన్ద్రా విదిశాసు చ ॥ 38 ॥**

**కులాలచక్రపర్యన్తం భ్రమత్యేష యథేశ్వరః ।**
**కరోత్యేష యథా రాత్రిం విముఞ్చన్మేదినీం ద్విజాః ॥ 39 ॥**

**దివాకరకరైరేతత్పూరితం భువనత్రయమ్ ।**
**త్రైలోక్యం కథితం సద్భిర్లోకానాం మునిపుఙ్గవాః ॥ 40 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఉదయాస్తమయాల్లో అన్నికాలాల్లో ఎదురుగా అన్నిదిక్కుల్లోను, విదిక్కుల్లోను, ఈ ఈశ్వరుడు అనగా సూర్యుడు పవలు కులాల చక్రము అంచునకు వలె భ్రమించునట్లు భూమిని వదిలి రాత్రిని చేయునట్లుగా ఈ భువనత్రయము సూర్యకిరణములతో వ్యాపించును. ఇదియే లోకత్రయము.

**ఆదిత్యమూలమఖిలం త్రైలోక్యం నాత్ర సంశయః ।**
**భవత్యస్మాజ్జగత్సర్వం సదేవాసురమానుషమ్ ॥ 41 ॥**

**రుద్రేన్ద్రోపేన్ద్రచన్ద్రాణాం విప్రేన్ద్రాణాం దివౌకసామ్ ।**
**ద్యుతిమాన్ద్యుతిమత్కృత్స్నమజయత్సార్వలౌకికమ్ ॥ 42 ॥**

ఈ ముల్లోకాలు కూడ ఆదిత్యమూలకమైనవే. ఇందులో సందేహం లేదు. సూర్యునివల్లనే దేవతలు అసురులు మనుష్యులతో కూడినదై లోకమంతా ఏర్పడుచున్నది. రుద్రుడు, ఉపేంద్రుడు, చంద్రుడు, బ్రాహ్మణశ్రేష్ఠులు, స్వర్గవాసులైన దేవతలు మొదలైనవారి తేజస్సును, అన్ని లోకాలకు చెందినదానిని ఈ తేజోవంతుడైన భాస్కరుడు జయించినాడు.

**సర్వాత్మా సర్వలోకేశో మహాదేవః ప్రజాపతిః ।**
**సూర్య ఏష తు లోకస్య మూలం పరమదైవతమ్ ॥ 43 ॥**

సర్వాత్మకుడు, సర్వలోకేశుడు, మహాదేవుడు, ప్రజాపతియునైన ఈ సూర్యుడు లోకానికి మూలకారణమైన దైవం. పరమదైవతము.

**ద్వాదశాన్యే తథాదిత్యా దేవాస్తే యేఽధికారిణః ।**
**నిర్వహన్తి వదన్త్యస్య తదంశా విష్ణుమూర్తయః ॥ 44 ॥**

ఇట్లే ఇతర ద్వాదశాదిత్యులు అధికారం గలవారు ఆయా కార్యాలు నిర్వహిస్తారు. ఆ సూర్యుని అంశభూతులు విష్ణుమూర్తులుగ చెప్పబడుతున్నారు.

**సర్వే నమస్యన్తి సహస్రబాహుం గంధర్వయక్షోరగకిన్నరాద్యాః ।**
**యజన్తి యజ్ఞైర్వివిధైర్మునీన్ద్రాశ్ఛన్దోమయం బ్రహ్మమయం పురాణమ్ ॥ 45 ॥**

గంధర్వులు, యక్షులు, నాగులు, కిన్నరులు మొదలైన వారందరు సహస్రభుజుడైన ఆ భగవంతునికే నమస్కరిస్తారు. మునీంద్రులు వేదమయుడు, పురాతన బ్రహ్మస్వరూపుడైన ఈ సూర్యుని అనేకవిధాలైన యజ్ఞాలతో పూజిస్తున్నారు.

**ఇతి శ్రీకూర్మపురాణే జ్యోతిషాంసన్నివేశే ఏక చత్వారింశోఽధ్యాయః ॥ 41 ॥**

శ్రీకూర్మపురాణంలో జ్యోతిస్సన్నివేశమనే నలబై ఒకటవ అధ్యాయం ॥ 41 ॥



## ద్విచత్వారింశోఽధ్యాయః - నలబై రెండవ అధ్యాయం
## భువనకోశ విన్యాస వర్ణనమ్ - భువనకోశ విన్యాస వర్ణనం

**సూత ఉవాచ :**-సూతుడు పలికాడు

**సరథోఽధిష్ఠితో దేవైరాదిత్యైర్మునిభిస్తథా ।**
**గన్ధర్వైరప్సరోభిశ్చ గ్రామణీసర్పరాక్షసైః ॥ 1 ॥**

**ధాతాఽర్యమా చ మిత్రశ్చ వరుణః శక్ర ఏవ చ ।**
**వివస్వానథ పూషా చ పర్జన్యశ్చాంశురేవ చ ॥ 2 ॥**

**భగస్త్వష్టా చ విష్ణుశ్చ ద్వాదశైతే దివాకరాః ।**
**ఆప్యాయయతి వై భానుర్వసన్తాదిషు వై క్రమాత్ ॥ 3 ॥**

దేవతలు, ఆదిత్యులు, మునులు, గంధర్వులు, అప్సరసలు, గ్రామణులు, సర్పాలు, రాక్షసులందరు ఆ రథాన్ని అధిష్ఠించి ఉంటారు. ధాత, అర్యముడు, మిత్రుడు, వరుణుడు, శక్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు అంశువు, భగుడు, త్వష్ట, విష్ణువు అని ద్వాదశాదిత్యుల పేర్లు. సూర్యుడు వసంతాది ఋతువుల్లో వరుసగా తన కిరణాలతో లోకాలను సంతోషపరుస్తాడు.

**పులస్త్యః పులహశ్చాత్రిర్వసిష్ఠశ్చాఙ్గిరా భృగుః ।**
**భరద్వాజో గౌతమశ్చ కశ్యపః క్రతురేవ చ ॥ 4 ॥**

**జమదగ్నిః కౌశికశ్చ మునయో బ్రహ్మవాదినః ।**
**స్తువన్తి దేవం వివిధైశ్ఛన్దోభిస్తే యథాక్రమమ్ ॥ 5 ॥**

పులస్త్యుడు, పులహుడు, అత్రి, వశిష్ఠుడు, అంగిరసుడు, భృగువు, భరద్వాజుడు, గౌతముడు, కశ్యపుడు, క్రతువు, జమదగ్ని, కౌశికుడు అనే బ్రహ్మవాదులైన మునులు ఆ సూర్యభగవానుని నానాచ్ఛందస్సులతో స్తోత్రం చేస్తారు.

**రథకృచ్చ రథౌజాశ్చ రథచిత్రః సుబాహుకః ।**
**రథస్వనోఽథ వరుణః సుషేణః సేనజిత్తథా ॥ 6 ॥**

**తార్క్ష్యశ్చారిష్టనేమిశ్చ కృతజిత్సత్యజిత్తథా ।**
**గ్రామణ్యో దేవదేవస్య కుర్వతేఽభీషు సంగ్రహమ్ ॥ 7 ॥**

రథకృత్తు, రథౌజుడు, సుబాహుకుడు, రథస్వనుడు, వరుణుడు, సుషేణుడు, సేనజిత్తు, తార్క్ష్యుడు, అరిష్టనేమి, కృతజిత్తు, సత్యజితుడు అనే ఈ గ్రామణులు దేవదేవుడైన సూర్యుని కిరణాలను సంగ్రహిస్తారు.

**అథ హేతిః ప్రహేతిశ్చ పౌరుషేయో వధస్తథా ।**
**సర్పో వ్యాఘ్రస్తథాఽఽపశ్చ వాతో విద్యుద్దివాకరః ॥ 8 ॥**

**బ్రహ్మోపేతశ్చ విప్రేన్ద్రా యజ్ఞోపేతస్తథైవ చ ।**
**రాక్షసప్రవరా హ్యేతే ప్రయాన్తి పురతః క్రమాత్ ॥ 9 ॥**

హేతి, ప్రహేతి, పౌరుషేయుడు, వధుడు, సర్పుడు, వ్యాఘ్రుడు, ఆపుడు, వాతుడు, విద్యుత్తు, దివాకరుడు, బ్రహ్మోపేతుడు, యజ్ఞోపేతుడు. ఓ బ్రాహ్మణులారా! వీరందరు రాక్షసప్రముఖులు. క్రమంగా సూర్యునికి ముందుభాగంలో ప్రయాణిస్తారు.

**వాసుకిః కఙ్కనీలశ్చ తక్షకః సర్పపుఙ్గవః ।**
**ఏలాపుత్రః శఙ్ఖపాలస్తథైరావతసంజ్ఞితః ॥ 10 ॥**

**ధనఞ్జయో మహాపద్మస్తథా కర్కోటకో ద్విజాః ।**
**కమ్బలోఽశ్వతరశ్చైవ వహన్త్యేనం యథాక్రమమ్ ॥ 11 ॥**

వాసుకి, కంకనీలుడు, సర్పశ్రేష్ఠుడు, తక్షకుడు, ఏలాపుత్రుడు, శంఖపాలుడు, ఐరావతుడనే పేరు గలవాడు, ధనంజయుడు, మహాపద్ముడు, కర్కోటకుడు, కంబలుడు, అశ్వతరుడు వీరందరూ ఈ సూర్యభగవానుని వహిస్తారు.

**తుమ్బురుర్నారదో హాహా హూహూ ర్విశ్వావసుస్తథా ।**
**ఉగ్రసేనోఽథ సురుచిరర్వావసుస్తథాఽపరః ॥ 12 ॥**

**చిత్రసేనస్తథోర్ణాయుర్ధృతరాష్ట్రో ద్విజోత్తమాః ।**
**సూర్యవర్చా ద్వాదశైతే గన్ధర్వా గాయనా వరాః ॥ 13 ॥**

తుంబురుడు, నారదుడు, హాహా, హూహూ, విశ్వావసువు, ఉగ్రసేనుడు, సురుచి, అర్వావసువు, అపరుడు, చిత్రసేనుడు, ఊర్ణాయువు, ధృతరాష్ట్రుడు, సూర్యవర్చసుడు అనే ఈ పండ్రెండుగురు శ్రేష్ఠులైన గంధర్వగాయకులు.

**గాయన్తి గానైర్వివిధైర్భానుం షడ్జాదిభిః క్రమాత్ ।**
**ఋతుస్థలాఽప్సరోవర్యా తథాఽన్యా పుఞ్జికస్థలా ॥ 14 ॥**

**మేనకా సహజన్యా చ ప్రమ్లోచా చ ద్విజోత్తమాః ।**
**అనుమ్లోచా చ విశ్వాచీ ఘృతాచీ చోర్వశీ తథా ॥ 15 ॥**

**అన్యా చ పూర్వచిత్తిః స్యాద్రమ్భా చైవ తిలోత్తమా ।**
**తాణ్డవైర్వివిధైరేనం వసన్తాదిషు వై క్రమాత్ ॥ 16 ॥**

**తోషయన్తి మహాదేవం భానుమాత్మానమవ్యయమ్ ।**
**ఏవం దేవా వసన్త్యర్కే ద్వౌ ద్వౌ మాసౌ క్రమేణ తు ॥ 17 ॥**

ద్విజశ్రేష్ఠులారా! వీరు షడ్జము మొదలైన స్వరాలతో వివిధగానాలతో క్రమంగా సూర్యుని గురించి గానం చేస్తుంటారు. అప్సరసల్లో శ్రేష్ఠురాలు ఋతుస్థల, పుంజికస్థల, మేనక, సహజన్య, ప్రమ్లోచ అనే అప్సరస, అనుమ్లోచ, విశ్వాచి, ఘృతాచి, ఊర్వశి, పూర్వచిత్తి, రంభ, తిలోత్తమ అనే వీరు వసంతాది ఋతువుల్లో అనేకవిధాలైన నృత్యాలతో

భగవంతుడు, ఆత్మస్వరూపుడు, అవ్యయుడు అయిన భాస్కరుని సంతోషపెడతారు. ఈ విధంగా దేవతలు సూర్యునిలో రెండేసి నెలల కాలం నివసిస్తారు.

**సూర్యమాప్యాయయన్త్యేతే తేజసా తేజసాం నిధిమ్ ।**
**గ్రథితైస్స్వైర్వచోభిస్తు స్తువన్తి మునయో రవిమ్ ॥ 18 ॥**

తేజసాంనిధి అయిన సూర్యుని వీరందరు తమ తేజస్సుతో తృప్తిపరుస్తారు. మునులు తమ ఛందోబద్ధాలైన వాక్కులతో సూర్యుని స్తోత్రం చేస్తారు.

**గన్ధర్వాప్సరసశ్చైనం నృత్యగేయై రుపాసతే ।**
**గ్రామణీయక్షభూతాని కుర్వతేఽభీషు సంగ్రహమ్ ॥ 19 ॥**

**సర్పా వహన్తి దేవేశం యాతుధానాః ప్రయాన్తి చ ।**
**వాలఖిల్యా నయన్త్యస్తం పరివార్యోదయాద్రవిమ్ ॥ 20 ॥**

గంధర్వులు, అప్సరసలు తమ నృత్యాలతో, పాటలతో సూర్యుని సేవిస్తారు. గ్రామణులు యక్షులు, భూతగణం పగ్గాలను ధరిస్తారు. సర్పాలు సూర్యుని ధరిస్తున్నాయి. రాక్షసగణాలు నడుపుతున్నాయి. వాలఖిల్యులు రవికి అస్తమయాన్ని కల్గిస్తున్నారు. వారు ఉదయసమయంనుండే సూర్యుని చుట్టుముట్టి ఉంటారు.

**ఏతే తపన్తి వర్షన్తి భాన్తి వాన్తి సృజన్తి తు ।**
**భూతానామశుభం కర్మ వ్యపోహన్తీతి కీర్తితాః ॥ 21 ॥**

పూర్వం చెప్పిన వీరందరు తపింపచేస్తారు. వర్షం కురిపిస్తారు. ప్రకాశిస్తారు. సంచరిస్తారు. ప్రాణికోటి అశుభకర్మను నశింపచేస్తారు.

**ఏతే సహైవ సూర్యేణ భ్రమన్తి దివి భానుగాః ।**
**విమానే చ స్థితా నిత్యం కామగే వాతరంహసి ॥ 22 ॥**

వీరు సూర్యునితో కలిసి అనుచరులుగా ఆకాశంలో సంచరిస్తారు. వాయుసమానవేగం స్వేచ్ఛాగమనం కల విమానంలో కూర్చొని ఎల్లపుడూ చరిస్తుంటారు.

**వర్షన్తశ్చ తపన్తశ్చ హ్లాదయన్తశ్చ వై క్రమాత్ ।**
**గోపాయన్తీహ భూతాని సర్వాణీహ యుగక్రమాత్ ॥ 23 ॥**

వర్షం కురిపిస్తూ, వేడిని వ్యాపింపచేస్తూ, ఆహ్లాదాన్ని కల్గిస్తూ క్రమంగా వీరు ఆయా యుగాల్లో ప్రాణులను రక్షిస్తుంటారు.

**ఏతేషామేవ దేవానాం యథావీర్యం యథాతపః ।**
**యథాయోగం యథాసత్త్వం స ఏష తపతి ప్రభుః ॥ 24 ॥**

పూర్వం తెల్పిన ఈ దేవజాతులవారి పరాక్రమం, తపస్సు, యోగబలం, ఆత్మబలం అనే వాని ఆధారంగా ప్రభువైన సూర్యుడు తగినవేడిని ఇస్తుంటాడు.

**అహోరాత్రవ్యవస్థానకారణం స ప్రజాపతిః ।**
**పితృదేవమనుష్యాదీన్స సదాఽఽప్యాయయద్రవిః ॥ 25 ॥**

**తత్ర దేవో మహాదేవో భాస్వాన్సాక్షాన్మహేశ్వరః ।**
**భాసతే వేదవిదుషాం నీలగ్రీవః సనాతనః ॥ 26 ॥**

**స ఏష దేవో భగవాన్ పరమేష్ఠీ ప్రజాపతిః ।**
**స్థానం తద్విదురాదిత్యే వేదజ్ఞా వేదవిగ్రహాః ॥ 27 ॥**

పగలు రాత్రి అనే కాలవ్యవస్థకు ఆ ప్రజాపతే కారణభూతుడు. ఆ సూర్యుడు పితృ-దేవ-మనుష్యాదుల నెప్పుడూ ప్రీతిని పొందిస్తాడు. అక్కడ మహాదేవుడైన సూర్యుడు సాక్షాత్తు మహేశ్వరుడు, నీలకంఠుడు సనాతనుడైన ఆ భగవంతుడు వేదవిదులకు, విద్వాంసులకు సాక్షాత్కరిస్తాడు. ఈ భగవంతుడైన సూర్యుడు పరమేష్ఠి ప్రజాపతికూడ. వేదవేత్తలు, వేదశరీరులైనవారు సూర్యునియందు పరమేష్ఠిస్థానాన్ని గుర్తిస్తారు.

**ఇతి శ్రీకూర్మపురాణే భువన విన్యాసే ద్విచత్వారింశోఽధ్యాయః ॥ 42 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనవిన్యాసమనే నలభై రెండవ అధ్యాయం ॥ 42 ॥



## త్రిచత్వారింశోఽధ్యాయః - నలబై మూడవ అధ్యాయం

## భువనకోశవర్ణనమ్ - భువనకోశవర్ణనం

**సూత ఉవాచ :**-సూతుడు పలికాడు

**ఏవమేష మహాదేవో దేవదేవః పితామహః ।**
**కరోతి నియతం కాలం కాలాత్మా హ్యైశ్వరీతనుః ॥ 1 ॥**

ఈ విధంగా దేవదేవుడు మహాదేవుడైన పితామహుడు కాలాత్మకమైన ఐశ్వరీతనువు కాలాన్ని నియమిస్తున్నాడు.

**తస్య యే రశ్మయో విప్రాః సర్వలోకప్రదీపకాః ।**
**తేషాం శ్రేష్ఠాః పునః సప్త రశ్మయో గ్రహమేధినః ॥ 2 ॥**

విప్రులారా! అతని కిరణాలన్ని లోకాలను ప్రకాశింపచేస్తాయి. ఆ కిరణాల్లో శ్రేష్ఠమైనవి ఏడు. అవి గ్రహములను నడిపించునవి.

**సుషుమ్నో హరికేశశ్చ విశ్వకర్మా తథైవ చ ।**
**విశ్వశ్రవాః పునశ్చాన్యః సంయద్వసురతః పరః ॥ 3 ॥**

**అర్వావసురితి ఖ్యాతః స్వరకః సప్త కీర్తితాః ।**
**సుషుమ్నః సూర్యరశ్మిస్తు పుష్ణాతి శిశిరద్యుతిమ్ ॥ 4 ॥**

సుషుమ్నము, హరికేశము, విశ్వకర్మ, విశ్వశ్రవస్సు, సంయద్వసువు, అర్వావసువు, స్వరకము అనే పేర్లతో ఆ ఏడు ప్రఖ్యాతాలు. సుషుమ్నం అనే సూర్యరశ్మి చంద్రుని పోషిస్తుంది.

**తిర్యగూర్ధ్వప్రచారోఽసౌ సుషుమ్నః పరిపఠ్యతే ।**
**హరికేశస్తు యః ప్రోక్తో రశ్మిర్నక్షత్రపోషకః ॥ 5 ॥**

అది అడ్డంగా నిలువుగా కూడ ప్రసరించే స్వభావం కలది. హరికేశమనే రశ్మి నక్షత్రాలకు బలాన్నిస్తుంది.

**విశ్వకర్మా తథా రశ్మిర్బుధం పుష్ణాతి సర్వదా ।**
**విశ్వశ్రవాస్తు యో రశ్మిఃశుక్రం పుష్ణాతి నిత్యదా ॥ 6 ॥**

విశ్వకర్మ అనే సూర్యరశ్మి బుధగ్రహాన్ని ఎల్లవేళలా పోషిస్తుంది. విశ్వశ్రవస్సు అనే రశ్మి ఎల్లవేళలా శుక్రగ్రహానికి ప్రకాశాన్ని కలిగిస్తుంది.

**సంయద్వసురితి ఖ్యాతో యః పుష్ణాతి స లోహితమ్ ।**
**బృహస్పతిం సుపుష్ణాతి రశ్మిరర్వావసుః ప్రభుః ॥ 7 ॥**

**శనైశ్చరం ప్రపుష్ణాతి సప్తమస్తు స్వరస్తథా ।**
**ఏవం సూర్యప్రభావేణ సర్వా నక్షత్రతారకాః ॥ 8 ॥**

**వర్ధన్తే వర్ధితా నిత్యం నిత్యమాప్యాయయన్తి చ ।**
**దివ్యానాం పార్థివానాఞ్చ నైశానాం చైవ నిత్యశః ॥ 9 ॥**

**ఆదానాన్నిత్యమాదిత్యస్తేజసాం తమసామపి ।**
**ఆదత్తే స తు నాడీనాం సహస్రేణ సమన్తతః ॥ 10 ॥**

**నాదేయం చైవ సాముద్రం కౌప్యం చైవ సహస్రదృక్ ।**
**స్థావరం జఙ్గమఞ్చైవ యచ్చ కుల్యాదికం పయః ॥ 11 ॥**

సంయద్వసువనే ప్రఖ్యాతమైన రశ్మి అంగారక గ్రహాన్ని పోషిస్తున్నది. సమర్థమైన అర్వావసు రశ్మి బృహస్పతి గ్రహాన్ని బాగా పోషిస్తుంది. ఏడవదైన స్వరమనే సూర్యరశ్మి శనైశ్చర గ్రహాన్ని పోషిస్తున్నది. ఈ విధంగా సూర్య ప్రభావంతో నక్షత్రాలన్నీ వృద్ధి పొందుతున్నాయి. వృద్ధి పొంది లోకాన్ని సంతోష పరుస్తున్నాయి. దేవతల, మానవుల, రాక్షసుల తేజస్సులను చీకట్లను స్వీకరించటం వల్ల ఆదిత్యుడని చెప్పబడినాడు. ఆ సూర్యుడు వేయినాడులతో అన్నివైపుల సముద్రాల, బావుల, గుంటల, నదుల, కాలువల స్థావరజంగమములైన వాటి నీటిని గ్రహిస్తున్నాడు.

**తస్య రశ్మిసహస్రన్తు శీతవర్షోష్ణనిస్స్రవమ్ ।**
**తాసాం చతుశ్శతా నాడ్యో వర్షన్తే చిత్రమూర్తయః ॥ 12 ॥**

ఆ సూర్యుని వేయికిరణాలు చలిని, వర్షాన్ని, వేడిని ప్రసరింపచేస్తూ వానిలో నాలుగువందల నాడులు చిత్రమైన రూపాన్నికల్గి వర్షాన్ని కురిపిస్తాయి.

**చన్ద్రగాశ్చైవ గాహాశ్చ కాఞ్చనాః శాతనాస్తథా ।**
**అమృతా నామతః సర్వా రశ్మయో వృష్టిసర్జనాః ॥ 13 ॥**

వర్షానికి కారణాలైన కిరణాలు అన్ని చంద్రగములు, గాహములు, కాంచనములు, శాతనములు, అమృతములు అనే పేర్లతో చెప్పబడినవి.

**హిమోద్ధతాశ్చ తా నాడ్యో రశ్మయో నిఃసృతాః పునః ।**
**రేష్యో మేష్యశ్చ వాస్యశ్చ హ్రాదిన్యః సర్జనాస్తథా ॥ 14 ॥**

**చన్ద్రాస్తా నామతః సర్వాః పీతాస్తాస్స్యుర్గభస్తయః ।**

మంచునుండి వెడలిన ఆ నాడులు కిరణాలుగా బయలుదేరి రేష్యము, మేష్యము, వాస్యము, మెరుపులు వర్షకారకాలు, చంద్రములు అనే పేర్లతో అవి పసుపుపచ్చ కాంతిగలవై ఉంటాయి.

**శుక్లాశ్చ కుఙ్కుమాశ్చైవ గావో విశ్వభృత స్తథా ॥ 15 ॥**

విశ్వభృత్తు కిరణాలు తెల్లనివి. కుంకుమ రంగుగాను ఉంటాయి.

**శుక్లాస్తా నామతః సర్వాస్త్రివిధా ఘర్మసర్జనాః ।**
**సమం బిభర్తి తాభిః స మనుష్యపితృదేవతాః ॥ 16 ॥**

శుక్లములనే కిరణాలు మూడువిధాలైన వేడిని ప్రసరింపజేస్తాయి. సూర్యుడు ఆ కిరణాలతో మనుజ, పితృదేవతలను సమానంగా భరిస్తాడు.

**మనుష్యానోషధేనేహ స్వధయా చ పితౄనపి ।**
**అమృతేన సురాన్సర్వాంస్త్రిభిస్తర్పయత్యసౌ ॥ 17 ॥**

ఈ సూర్యభగవానుడు మనుజులను, ఓషధులతో, పితరులను స్వధతో, దేవతల నమృతంతో వివిధ సాధనాలతో ముగ్గురిని తృప్తి పరుస్తున్నాడు.

**వసన్తే గ్రీష్మకే చైవ షడ్భిః స తపతి ప్రభుః ।**
**శరద్యపి చ వర్షాసు చతుర్భిః సంప్రవర్షతి ॥ 18 ॥**

వసంత గ్రీష్మ ఋతువుల్లో సూర్యుడు ఆరు కిరణాలలో వేడిని ప్రసరింపచేస్తాడు. శరత్కాలం వర్ష ఋతువుల్లో నాలుగు కిరణాలతో వర్షాన్ని కురిపిస్తాడు.

**హేమన్తే శిశిరే చైవ హిమముత్సృజతి త్రిభిః ।**
**వరుణో మాఘమాసే తు సూర్యః పూషా తు ఫాల్గుణే ॥ 19 ॥**

**చైత్రే మాసే స దేవేశో ధాతా వైశాఖతాపనః ।**
**జ్యేష్ఠే మాసే భవేదిన్ద్రః ఆషాఢే తపతే రవిః ॥ 20 ॥**

**వివస్వాన్ శ్రావణే మాసి ప్రౌష్ఠపద్యాం భగస్స్మృతః ।**
**పర్జన్యశ్చాశ్వినే మాసి కార్తికే మాసి భాస్కరః ॥ 21 ॥**

హేమంత శిశిర ఋతువుల్లో ప్రభువు సూర్యుడు మంచును వ్యాపింప చేస్తాడు. సూర్యుడు మాఘమాసంలో వరుణుడుగా, ఫాల్గుణంలో పూషగా, చైత్రంలో, దేవేశుడని వైశాఖంలో, ధాతగా జ్యేష్ఠంలో, ఇంద్రుడని ఆషాఢంలో, రవి అని శ్రావణంలో, వివస్వంతుడని భాద్రపదంలో, భగుడని ఆశ్వయుజంలో పర్జన్యుడని, కార్తికమాసంలో భాస్కరుడని వ్యవహరింపబడతాడు.

**మార్గశీర్షే భవేన్మిత్రః పౌషే విష్ణుః సనాతనః ।**
**పఞ్చరశ్మిసహస్రాణి వరుణస్యార్క కర్మణి ॥ 22 ॥**

మార్గశీర్షంలో మిత్రుడని పౌషమాసంలో సనాతనుడైన విష్ణురూపునిగా చెప్పబడినాడు. వరుణరూపుడైన సూర్యుడు తన పనిలో ఐదువేల కిరణాలను ఉపయోగిస్తాడు.

**షడ్భిః సహస్రైః పూషా తు దేవేశః సప్తభిస్తథా ।**
**ధాతాఽష్టభిస్సహస్రైస్తు నవభిశ్చ శతక్రతుః ॥ 23 ॥**

**వివస్వాన్దశభిః పాతి పాత్యేకాదశభిర్భగః ।**
**సప్తభిస్తపతే మిత్రస్త్వష్టా చైవాష్టభిస్తపేత్ ॥ 24 ॥**

**అర్యమా దశభిః పాతి పర్జన్యో నవభిస్తథా ।**
**షడ్భీ రశ్మిసహస్రైస్తు విష్ణుస్తపతి విశ్వధృక్ ॥ 25 ॥**

పూషరూపంలో సూర్యుడు ఆరువేల కిరణాలతో, దేవేశుడు ఏడువేల రశ్ములతో, ధాతరూపుడైన భాస్కరుడు ఎనిమిది వేలతోను, ఇంద్రరూపుడు తొమ్మిదివేలు, వివస్వంతుడు పదివేలు, భగుడు పదకొండువేలు, మిత్రుడు ఏడువేలు, త్వష్ట ఎనిమిది వేలు కిరణాలతో ప్రకాశిస్తారు. అర్యముడు పదివేలు, పర్జన్యుడు తొమ్మిదివేలు, విష్ణు పేరుగల సూర్యుడు ఆరువేల కిరణాలతో తపింపచేస్తాడు.

**వసన్తే కపిలః సూర్యో గ్రీష్మే కాఞ్చన సప్రభః ।**
**శ్వేతో వర్షాసు విజ్ఞేయః పాణ్డురః శరది ప్రభుః ॥ 26 ॥**

**హేమన్తే తామ్రవర్ణస్స్యాచ్ఛిశిరే లోహితో రవిః ।**
**ఔషధీషు కలాం ధత్తే స్వధామపి పితృష్వథ ॥ 27 ॥**

సూర్యుడు వసంత ఋతువులో కపిలవర్ణుడు, గ్రీష్మంలో స్వర్ణకాంతికల్గి వర్షఋతువులో తెలుపుగా, శరత్కాలంలో పాండువర్ణంగా ప్రకాశిస్తాడు. హేమంత ఋతువులో తామ్రవర్ణంగా, శిశిర ఋతువులో ఎరుపురంగు కల్గి ఉంటాడు. అతడు ఔషధాల్లో కళను, పితృదేవతల్లో స్వధను ధరించి ఉంటాడు.

**సూర్యోఽమరేష్వమృతన్తు త్రయం త్రిషు నియచ్ఛతి ।**
**అన్యే చాష్టౌ గ్రహా జ్ఞేయాః సూర్యేణాధిష్ఠితా ద్విజాః ॥ 28 ॥**

సూర్యుడు దేవతల్లో మూడు విధాల అమృతాన్ని మూడు భాగాల్లో నియోగిస్తాడు. ఓ విప్రులారా! సూర్యాధిష్ఠితాలైన ఎనిమిది గ్రహాలు ఈ విధంగా ఉన్నాయి.

**చన్ద్రమాః సోమపుత్రశ్చ శుక్రశ్చైవ బృహస్పతిః ।**
**భౌమో మన్దస్తథా రాహుః కేతుమానపి చాష్టమః ॥ 29 ॥**

చంద్రుడు, బుధుడు, శుక్రుడు, బృహస్పతి, అంగారకుడు, శని, రాహువు, కేతుమంతుడని ఆ గ్రహాలపేర్లు.

**సర్వే ధ్రువే నిబద్ధా వై గ్రహాస్తే వాతరశ్మిభిః ।**
**భ్రామ్యమాణా యథాయోగం భ్రమన్త్యనుదివాకరమ్ ॥ 30 ॥**

ఆ గ్రహాలన్నీ వాయుతరంగాలతో నియమింపబడి త్రిప్పబడుతూ వాని నియమానుసారం సూర్యుని అనుసరించి తిరుగుతున్నాయి.

**అలాతచక్రవద్యాన్తి వాతచక్రేరితాస్తథా ।**
**యస్మాద్వహతి తాన్వాయుః ప్రవహస్తేన స స్మృతః ॥ 31 ॥**

వాతచక్రం ప్రేరేపించగా అవి కొరివిచక్రంవలె సంచరిస్తాయి. ఆ గ్రహాలను వహించిన కారణంగా వాయువుకు ప్రవహము అనే పేరు ప్రసిద్ధమైనది.

**రథస్త్రిచక్రః సోమస్య కున్దాభాస్తస్య వాజినః ।**
**వామదక్షిణతో యుక్తా దశ తేన క్షపాకరః ॥ 32 ॥**

చంద్రుని రథం మూడు చక్రాలు కలది. అతని గుర్రాలు మల్లెపూవువంటి కాంతిగలవి. అవి పది, కుడి ఎడమ భాగాల్లో కట్టగా రథాన్ని మోస్తున్నాయి.

**వీథ్యాశ్రయాణి చరతి నక్షత్రాణి రవిర్యథా ।**
**హ్రాసవృద్ధీ తు విప్రేన్ద్రా! ధ్రువాధారాణి సర్వదా ॥ 33 ॥**

చంద్రుడు వీథుల నాశ్రయించి ఉన్న నక్షత్రాలను గూర్చి సూర్యునివలె సంచరిస్తుంటాడు. ఓ ద్విజులారా! చంద్రుని వృద్ధి క్షయాలు ఎల్లపుడు ధ్రువస్థానంపైనే ఆధారపడి ఉంటాయి.

**స సోమః శుక్లపక్షే తు భాస్కరే పరతః స్థితే ।**
**ఆపూర్యతే పరస్యాన్తే సతతం చైవ తాః ప్రభాః ॥ 34 ॥**

ఆ చంద్రుడు శుక్లపక్షంలో సూర్యుడు అవతలిభాగంలో ఉండగా కళలు నిండుతుంటాయి.

**క్షీణం పీతం సురైః సోమమాప్యాయయతి నిత్యదా ।**
**ఏకేన రశ్మినా విప్రాః సుషుమ్నాఖ్యేన భాస్కరః ॥ 35 ॥**

శుక్లపక్షం పూర్తికాగా ఆ కళల నెల్లపుడు దేవతలు త్రాగటంవల్ల క్షీణిస్తాడు. సూర్యుడెల్లపుడు సుషుమ్నరశ్మితో చంద్రుని కాంతిమంతుని చేస్తుంటాడు.

**ఏషా సూర్యస్య వీర్యేణ సోమస్యాప్యాయితా తనుః ।**
**పౌర్ణమాస్యాం స దృశ్యేత సమ్పూర్ణో దివసక్రమాత్ ॥ 36 ॥**

సూర్యతేజస్సుతో ప్రకాశవంతమైన చంద్రుని శరీరం దినక్రమంలో వృద్ధిచెంది పౌర్ణమిరోజు సంపూర్ణ స్వరూపంతో కన్పిస్తాడు.

**సమ్పూర్ణ మర్ధమాసేన తం సోమ మమృతాత్మకమ్ ।**
**పిబన్తి దేవతా విప్రా యతస్తేఽమృతభోజనాః ॥ 37 ॥**

విప్రులారా! నిండుగా ఉన్న చంద్రునిరూపం అమృతాత్మకమైనందువల్ల అమృత భోజనులైన దేవతలు దినమొక కళచొప్పున పానం చేస్తుంటారు.

**తతః పఞ్చదశే భాగే కిఞ్చిచ్ఛిష్టే కలాత్మకే ।**
**అపరాహ్ణే పితృగణా జఘన్యం పర్యుపాసతే ॥ 38 ॥**

తర్వాత పదహైదవ కళాభాగం కొంచెం మిగలగా పితృగణాలు వెనుక భాగాన్నాశ్రయిస్తున్నవి.

**పిబన్తి ద్విలవం కాలం శిష్టా తస్య కలా తు యా ।**
**సుధామృతమయీం పుణ్యాం తామిన్దోరమృతాత్మికామ్ ॥ 39 ॥**

ఆ చంద్రుని మిగిలిన కళను రెండు లవలకాలం అమృతమయం, అమృతరూపం, పుణ్యాకరం అయిన దాన్ని పానం చేస్తున్నది.

**నిఃసృతం తదమావాస్యాం గభస్తిభ్యః స్వధామృతమ్ ।**
**మాసతృప్తి మవాప్యాగ్రే పితరః సన్తి నిర్వృతాః ॥ 40 ॥**

అమావాస్యనాడు కిరణాలనుండి స్రవించే అమృతాన్ని పితృదేవతలు ఆస్వాదించి మాస తృప్తిని పొందుతారు.

**న సోమస్య వినాశః స్యాత్సుధా చైవం సుపీయతే ।**
**ఏవం సూర్యనిమిత్తోఽస్య క్షయోవృద్ధిశ్చ సత్తమాః ॥ 41 ॥**

చంద్రునకు నాశం లేదు. అమృతం ఇట్లా ఆస్వాదింపబడుతుంది. ఈ విధంగా చంద్రుని వృద్ధి క్షయాలు సూర్యునికారణంగా జరుగుతుంటాయి.

**సోమపుత్రస్య చాష్టాభిర్వాజిభిర్వాయువేగిభిః ।**
**వారిజైః స్యన్దనో యుక్తస్తేనాసౌ యాతి సర్వతః ॥ 42 ॥**

చంద్రుని పుత్రుడు బుధుని రథం వాయువేగంగల నీటినుండి పుట్టిన గుర్రాలు లాగగా బుధుడు అంతటా సంచరిస్తుంటాడు.

**శుక్రస్య భూమిజైరశ్వైః స్యన్దనో దశభిర్వృతః ।**
**అష్టాభిశ్చాపి భౌమస్య రథో హైమః సుశోభనః ॥ 43 ॥**

శుక్రుని రథానికి భూమియందు పుట్టిన పది ఆశ్వాలు పూన్చబడినవి. అంగారకుని రథం బంగారంతో నిర్మితమైనది. మిక్కిలి అందమైన ఎనిమిది గుర్రాలు కల్గినది.

**బృహస్పతే రథోఽష్టాశ్వః స్యన్దనో హేమనిర్మితః ।**
**రథో రూప్యమయోఽష్టాశ్వో మన్దస్యాఽఽయసనిర్మితః ॥ 44 ॥**

బృహస్పతి రథానికి ఎనిమిది గుఱ్ఱాలు. అది బంగారంతో చేయబడినది. శని రథం ఇనుముతో చేయబడినది. ఎనిమిది గుఱ్ఱాలు లాగునది.

**స్వర్భానోర్భాస్కరారేశ్చ తథాఽష్టాభిర్హయైర్వృతః ।**
**ఏతే మహాగ్రహాణాం వై సమాఖ్యాతా రథాశ్చ వై ॥ 45 ॥**

రాహు కేతువుల రథాలు కూడ లోహనిర్మితాలే. ఎనిమిదేసి గుఱ్ఱాలు పూన్చ తగినవి. ఇవి మహాగ్రహాల రథాల వివరాలు మీకు వివరించనైనది.

**సర్వే ధ్రువే మహాభాగే నిబద్ధా వాయురశ్మిభిః ।**
**గ్రహర్క్షతారాధిష్ణ్యాని ధ్రువే బద్ధాన్యశేషతః ॥ 46 ॥**
**భ్రమన్తి భ్రామయన్త్యేనం సర్వాణ్యనిలరశ్మిభిః**

ఇవన్నీ వాయురశ్ములతో ధ్రువస్థానంలో నియమితాలు. గ్రహ, నక్షత్ర స్థానాలన్నీ సంపూర్ణంగా ధ్రువస్థానంతో నిబంధింపబడినవి. అవి తిరుగుతూ, వాయు రశ్ములచేత నడుపబడుచుండును.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనకోశే త్రిచత్వారింశోఽధ్యాయః ॥ 43 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనకోశమనే నలబై మూడవ అధ్యాయం ॥ 43 ॥



## చతుశ్చత్వారింశోఽధ్యాయః - నలభై నాల్గవ అధ్యాయం

## భువనకోశ విన్యాసవర్ణనమ్ - భువనకోశ విన్యాసవర్ణనం

**సూత ఉవాచ :**-సూతుడు పలికాడు

**ధ్రువాదూర్ధ్వం మహర్లోకః కోటియోజనవిస్తృతః ।**
**కల్పాధికారిణస్తత్ర సంస్థితా ద్విజపుఙ్గవాః ॥ 1 ॥**

ఓ ద్విజపుంగవులారా! ధ్రువస్థానానికి పైన కోటియోజనాల విస్తారంకల మహర్లోకం ఉన్నది. ఆ లోకంలో కల్పాధికారులు నివసిస్తారు.

**జనలోకో మహర్లోకాత్తథా కోటిద్వయాత్మకః ।**
**సనకాద్యాస్తథా తత్ర సంస్థితా బ్రహ్మణః సుతాః ॥ 2 ॥**

మహర్లోకానికి పైన రెండుకోట్లయోజనాల పరిమాణంకల జనలోకమున్నది. అక్కడ బ్రహ్మకుమారులైన సనకాది మునులు నివసిస్తారు.

**జనలోకాత్తపోలోకః కోటిత్రయసమన్వితః ।**
**వైరాజా స్తత్ర వై దేవాః స్థితా దాహవివర్జితాః ॥ 3 ॥**

**ప్రాజాపత్యాత్సత్యలోకః కోటిషట్కేన సంయుతః ।**
**అపునర్మారకో నామ బ్రహ్మలోకస్తు స స్మృతః ॥ 4 ॥**

జనలోకం పైన తపోలోకం మూడుకోట్ల యోజన విస్తృతి కల్గి ఉన్నది. ఆ లోకంలో తేజోమూర్తులైన దేవతలు తాపం లేనివారున్నారు. ప్రాజాపత్యంకంటె సత్యలోకం ఆరుకోట్ల యోజనాల దూరంలో ఉన్నది. అక్కడ చేరినవారికి మరల జన్మలేని లోకమది బ్రహ్మలోకంగా ప్రసిద్ధమైనది.

**అత్ర లోకగురుర్బ్రహ్మ విశ్వాత్మా విశ్వభావనః ।**
**ఆస్తే స యోగిభిర్నిత్యం పీత్వా యోగామృతం పరమ్ ॥ 5 ॥**

ఈ లోకంలో విశ్వాత్ముడు, విశ్వభావనుడు, లోకగురువైన బ్రహ్మ యోగులతో కలిసి యోగామృతాన్ని త్రాగి నివసిస్తాడు.

**వసన్తి యతయః శాన్తా నైష్ఠికా బ్రహ్మచారిణః ।**
**యోగినస్తాపసాః సిద్ధా జాపకాః పరమేష్ఠినః ॥ 6 ॥**

శాంతస్వభావులు, నిష్ఠగల సన్న్యాసులు, బ్రహ్మచారులు, యోగులు, మునులు, సిద్ధులు, పరమేష్ఠిని జపించేవారు అక్కడ నివసిస్తారు.

**ద్వారం తద్యోగినామేకం గచ్ఛతాం పరమం పదమ్ ।**
**తత్ర గత్వా న శోచన్తి స విష్ణుః స చ శఙ్కరః ॥ 7 ॥**

ఆ స్థానం పరమపదాన్ని పొందే యోగులకు ఒకే ఒక ద్వారం. అక్కడికి వెళ్ళినవారు ఎవరును దుఃఖాన్ని పొందరు. అతడే నారాయణుడు, శంకరుడు కూడ.

**సూర్యకోటిప్రతీకాశం పురం తస్య దురాసదమ్ ।**
**న మే వర్ణయితుం శక్యం జ్వాలామాలాసమాకులమ్ ॥ 8 ॥**

ఆ దేవుని నగరం కోటి సూర్యసమతేజస్సు కలది. అది పొందటానికి దుర్లభము. జ్వాలాసమూహాలలో ఉన్న ఆ స్థానం వర్ణించటం నాకు వీలుకానిది.

**తత్ర నారాయణస్యాపి భవనం బ్రహ్మణః పురే ।**
**శేతే తత్ర హరిః శ్రీమాన్యోగీ మాయామయః పరః ॥ 9 ॥**

అక్కడ బ్రహ్మదేవుని పట్టణంలో నారాయణుని భవనమున్నది. దానిలో మాయామయుడు, యోగీశ్వరుడు, పరమపురుషుడైన మహావిష్ణువు శయనించి ఉంటాడు.

**స విష్ణులోకః కథితః పునరావృత్తి వర్జితః ।**
**యాన్తి తత్ర మహాత్మానో యే ప్రపన్నా జనార్దనమ్ ॥ 10 ॥**

అది విష్ణులోకంగా చెప్పనైనది. అక్కడికి వెళ్ళినవారికి పునర్జన్మ, మరణాదులుండవు. జనార్దనుడైన నారాయణుని ఆశ్రయించిన మహాత్ములు ఆ లోకానికి వెళతారు.

**ఊర్ధ్వం తద్బ్రహ్మ సదనాత్పురం జ్యోతిర్మయం శుభమ్ ।**
**వహ్నినా చ పరిక్షిప్తం తత్రాఽఽస్తే భగవాన్హరః ॥11॥**

ఆ బ్రహ్మలోకం పైభాగంలో తేజోమయం శుభకరమైన పురమున్నది. అగ్నితో ఆవరింపబడి ఉంటుంది. అక్కడ భగవంతుడైన శివుడు నివసిస్తుంటాడు.

**దేవ్యా సహ మహాదేవశ్చిన్త్యమానో మనీషిభిః ।**
**యోగిభిః శతసాహస్రైర్భూతై రుద్రైశ్చ సంవృతః ॥ 12 ॥**

శంకరుని బుద్ధిమంతులైన మహాత్ములు సేవిస్తుండగా వేలకొలది యోగులు, భూతగణాలు, రుద్రులు, పార్వతీదేవి కూడ శంకరునితో ఉంటారు.

**తత్ర తే యాన్తి నిరతా భక్తా వై బ్రహ్మచారిణః ।**
**మహాదేవపరాః శాన్తాస్తాపసాః సత్యవాదినః ॥ 13 ॥**

ఆ లోకానికి ఆసక్తికల భక్తులు, బ్రహ్మచారులు, మహాదేవునియందు శ్రద్ధ కలవారు, శాంతాత్ములు, సత్యవాదులైన మునులు వెళతారు.

**నిర్మమా నిరహఙ్కారాః కామక్రోధవివర్జితాః ।**
**ద్రక్ష్యన్తి బ్రాహ్మణా యుక్తా రుద్రలోకః స వై స్మృతః ॥ 14 ॥**

అహంకార, మమకార దూరులు, కామక్రోధ రహితులు, యోగ్యులైన బ్రాహ్మణులు ఆ లోకాన్ని చూడగలవారు. అది రుద్రలోకంగా చెప్పబడినది.

**ఏతే సప్త మహాలోకాః పృథివ్యాః పరికీర్తితాః ।**
**మహాతలాదయశ్చాధః పాతాలాః సన్తి వై ద్విజాః ॥ 15 ॥**

విప్రులారా! ఇవి భూమికి సంబంధించిన ఏడు మహాలోకాలు. క్రిందిభాగంలో మహాతలం మొదలైన పాతాళలోకాలున్నాయి.

**మహాతలం చ పాతాలం సర్వరత్నోపశోభితమ్ ।**
**ప్రాసాదైర్వివిధైః శుభ్రైర్దేవతాయతనైర్యుతమ్ ॥ 16 ॥**

మహాతలమనే క్రిందిలోకం సమస్తమణులతో ప్రకాశిస్తుంది. నానావిధాలైన శుభ్రసౌధాలు, దేవమందిరాలు కల్గిఉన్నది.

**అనన్తేన చ సంయుక్తం ముచుకున్దేన ధీమతా ।**
**నృపేణ బలినా చైవ పాతాలస్వర్గవాసినా ॥ 17 ॥**

**శైలం రసాతలం విప్రాః శార్కరం హి తలాతలమ్ ।**
**పీతం సుతలమిత్యుక్తం వితలం విద్రుమప్రభమ్ ॥ 18 ॥**

అక్కడ అనంతుడు, బుద్ధిమంతుడైన ముచికుందుడు, పాతాల స్వర్గవాసి బలిచక్రవర్తి ఉన్నారు. ద్విజులారా! రసాతలం శిలామయం, తలాతలం గులకరాళ్ళనేల, సుతలం పసుపుపచ్చనేల, వితలం పగడం రంగు కలవి.

**సితఙ్చ వితలం ప్రోక్తం తలఞ్చైవ సితేతరమ్ ।**
**సుపర్ణేన మునిశ్రేష్ఠాస్తథా వాసుకినా శుభమ్ ॥ 19 ॥**

**రసాతలమితి ఖ్యాతం తథాఽన్యైశ్చ నిషేవితమ్ ।**
**విరోచనహిరణ్యాక్షతారకాద్యైశ్చ సేవితమ్ ॥ 20 ॥**

వితలం తెలుపునేల, తలం నల్లరంగు నేల కలవి. ఈ లోకాలు గరుత్మంతుడు, వాసుకి, ఇతరులు నివసించేవి. రసాతలం అనుపేర ప్రసిద్ధాలు. అది విరోచనుడు, హిరణ్యాక్షుడు, తారకాదిరాక్షసులకాశ్రయము.

**తలాతలమితి ఖ్యాతం సర్వశోభాసమన్వితమ్ ।**
**వైనతేయాదిభిశ్చైవ కాలనేమిపురోగమైః ॥ 21 ॥**

తలాతలమనే పేర ప్రఖ్యాతమైనది అన్ని శోభలు కలది. ఇందులో వైనతేయుడు, కాలనేమి మొదలైనవారు నివసింతురు.

**పూర్వదేవైః సమాకీర్ణం సుతలఙ్చ తథా పరైః ।**
**వితలం యవనాద్యైశ్చ తారకాగ్నిముఖైస్తథా ॥ 22 ॥**

సుతలం పూర్వదేవులు (రాక్షసులు) ఇతరులు గలది. వితలం యవనాదులు, తారకుడు అగ్నిమొదలైనవారు కలది.

**జమ్భకాద్యైస్తథా నాగైః ప్రహ్లాదేనాసురేణ చ ।**
**వితలఞ్చైవ విఖ్యాతం కమ్బలాహీంద్రసేవితమ్ ॥ 23 ॥**

వితలం జంభకుడు మొదలైన నాగులు, అసురుడైన ప్రహ్లాదుడు, కంబలమనే పేరుగల సర్పరాజు నివసించునది ప్రసిద్ధమైనది.

**మహాజమ్భేన వీరేణ హయగ్రీవేణ ధీమతా ।**
**శఙ్కుకర్ణేన సంభిన్నం తథా నముచిపూర్వకైః ॥ 24 ॥**

వీరుడైన మహాజంభుడు, బుద్ధిశాలి హయగ్రీవుడు, శంకుకర్ణుడు, నముచి మొదలగువారు కలది.

**తథాఽన్యైర్వివిధైర్నాగైస్తలఞ్చైవ సుశోభనమ్ ।**
**తేషామధస్తాన్నరకాః కూర్మాద్యాః పరికీర్తితాః ॥ 25 ॥**

ఇతరులైన నాగజాతులు గలది. మిక్కిలి అందమైనది తలం. ఆ లోకాలకు క్రిందిభాగంలో కూర్మాదినరకాలు చెప్పబడినవి.

**పాపినస్తేషు పచ్యన్తే న తే వర్ణయితుం క్షమాః ।**
**పాతాలానామధశ్చాస్తే శేషాఖ్యా వైష్ణవీ తనుః ॥ 26 ॥**

**కాలాగ్నిరుద్రో యోగాత్మా నారసింహోఽపి మాధవః ।**
**యోఽనన్తః పఠ్యతే దేవో నాగరూపీ జనార్దనః ॥ 27 ॥**

ఆ నరకాలలో పాపాత్ములు శిక్షింపబడతారు. వారు వర్ణింపతగరు. పాతాళలోకాలకు అడుగుభాగంలో శేషుడనే విష్ణుస్వరూపుడు. ఆ శేషమూర్తి కాలాగ్నిరుద్రుడని, యోగాత్ముడని, నారసింహుడు, మాధవుడు, అనంతుడు అని నాగరూపం దాల్చిన జనార్దనుడని స్తుతింపబడుతున్నాడు.

**తదాధారమిదం సర్వం స కాలాగ్నిం సమాశ్రితః ।**
**తమావిశ్య మహాయోగీ కాలస్తద్వదనోషితః ॥ 28 ॥**

ఇదంతా ఆయనపై ఆధారపడి ఉన్నది. అతడు కాలాగ్ని నాశ్రయించి ఉన్నాడు. గొప్ప యోగి అయిన కాలుడు అతనినావేశించి ముఖమందు నివసిస్తున్నాడు.

**విషజ్వాలామయశ్చేశో జగత్సంహరతి స్వయమ్ ।**
**సహస్రమాయోఽప్రతిమః సంహర్తా శఙ్కరో భవః ॥**
**తామసీ శామ్భవీ మూర్తిః కాలో లోకప్రకాలనః ॥ 29 ॥**

విషజ్వాలలతో నిండిన ఈశ్వరరూపుడై స్వయంగా విశ్వాన్ని సంహరిస్తాడు. వేయి మాయలు గలవాడు. సాటిలేనివాడు భవుడు అగు శంకరుడు సంహరించేవాడవుతున్నాడు. తమోగుణ ప్రధానమైన శంభునికి సంబంధించిన మూర్తే లోకాలను లయింపచేసే కాలపురుషుడు.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనకోశవిన్యాసే చతుశ్చత్వారింశోఽధ్యాయః ॥ 44 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనకోశవిన్యాసమనే నలభై నాల్గవ అధ్యాయం ॥ 44 ॥

## పఞ్చచత్వారింశోఽధ్యాయః - నలబై అయిదవ అధ్యాయం

## భువనకోశే పర్వతాది సంఖ్యానమ్ - భువనకోశంలోని పర్వత సంఖ్యానం

**సూత ఉవాచ :**-సూతుడు పలికాడు

**ఏతద్బ్రహ్మాణ్డమాఖ్యాతం చతుర్దశవిధం మహత్ ।**
**అతః పరం ప్రవక్ష్యామి భూలోకస్యాస్య నిర్ణయమ్ ॥ 1 ॥**

పదునాల్గు విధాలైన ఈ గొప్ప బ్రహ్మాండాన్ని గూర్చి వివరించాను. ఇక ఈ భూలోకం వివరాన్ని తెలుపుతాను.

**జమ్బూద్వీపః ప్రధానోఽయం ప్లక్షః శాల్మలిరేవ చ ।**
**కుశః క్రౌఞ్చశ్చ శాకశ్చ పుష్కరశ్చైవ సప్తమః ॥ 2 ॥**

ఈ జంబూద్వీపం ప్రధానమైనది. ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములని ద్వీపాలు మొత్తం ఏడు కలవు.

**ఏతే సప్త మహాద్వీపాః సముద్రైః సప్తభిర్వృతాః ।**
**ద్వీపాద్ద్వీపో మహానుక్తః సాగరాచ్చాపి సాగరః ॥ 3 ॥**

ఈ ఏడు మహాద్వీపాలు ఏడు సముద్రాలతో ఆవరింపబడినవి. ఒక ద్వీపంకంటె మరో ద్వీపం, ఒక సముద్రంకంటె మరో సముద్రం గొప్పదని చెప్పబడినది.

**క్షారోదేక్షురసోదశ్చ సురోదశ్చ ఘృతోదకః ।**
**దధ్యోదః క్షీరసలిలః స్వాదూదశ్చేతి సాగరాః ॥ 4 ॥**

లవణసముద్రం, ఇక్షు, సురా, ఘృత, దధి, క్షీర శుద్ధోదక సముద్రాలని ఏడు ప్రసిద్ధాలు.

**పఞ్చాశత్కోటివిస్తీర్ణా స సముద్రా ధరా స్మృతా ।**
**ద్వీపైశ్చ సప్తభిర్యుక్తా యోజనానాం సమన్తతః ॥ 5 ॥**

**జమ్బూద్వీపః సమస్తానాం మధ్యే చైవ వ్యవస్థితః ।**
**తస్య మధ్యే మహామేరుర్విశ్రుతః కనకప్రభః ॥ 6 ॥**

యాభైకోట్ల యోజనాల విస్తీర్ణంకల్గిన సముద్రసహితమయిన భూమి పేర్కొనబడినది. ఆ యోజనాలలో ఏడు ద్వీపాలు కలవు. జంబూద్వీపం అన్నిద్వీపాలకు మధ్యభాగంలో ఉన్నది. వానిమధ్య బంగారుకాంతిగల్గిన మహామేరు పర్వతం నిలిచి ఉన్నది.

**చతురశీతిసాహస్రో యోజనైస్తస్య చోచ్ఛ్రయః ।**
**ప్రవిష్టః షోడశాధస్తాద్ద్వాత్రింశన్మూర్ధ్ని విస్తృతః ॥ 7 ॥**

దాని వైశాల్యం ఎనుబది నాల్గువేల యోజనాల పరిమాణం. క్రింది భాగం పదునారు యోజనాలు భూమి లోపలికి ప్రవేశించి ముప్పైరెండు యోజనాలు శిఖరభాగంలో విస్తరించినది.

**మూలే షోడశసాహస్రో విస్తారస్తస్య సర్వతః ।**
**భూపద్మస్యాస్య శైలో౽సౌ కర్ణికాత్వేన సంస్థితః ॥ 8 ॥**

మూలభాగంలో అన్నివైపుల పదహారువేల విస్తారంకల్గి ఉన్నది. ఈ భూమి అనే పద్మానికి ఈ పర్వతం కర్ణికవలె ఉంటున్నది.

**హిమవాన్ హేమకూటశ్చ నిషధశ్చాస్య దక్షిణే ।**
**నీలః శ్వేతశ్చ శృఙ్గీ చ ఉత్తరే వర్షపర్వతాః ॥ 9 ॥**

దీనికి దక్షిణంవైపు హిమవత్పర్వతం, హేమకూటం, నిషధమున్నవి. ఉత్తరంవైపు నీలము, శ్వేతము, శృంగి అనే పర్వతాలున్నవి.

**లక్షప్రమాణౌ ద్వౌ మధ్యే దశహీనాస్తథా౽పరే ।**
**సహస్రద్వితయోచ్ఛ్రాయాస్తావద్విస్తారిణశ్చ తే ॥ 10 ॥**

**భారతం ప్రథమం వర్షం తతః కింపురుషం స్మృతమ్ ।**
**హరివర్షం తథైవాన్యన్మేరోర్దక్షిణతో ద్విజాః ॥ 11 ॥**

లక్ష యోజనాల ప్రమాణం కలవి రెండు మధ్యభాగాలలో తక్కినవి పదియోజనాలు తక్కువ కల్గినవి.రెండు వేల యోజనాల ఎత్తు కల్గి అంతేవిస్తారం కల్గి ఈ పర్వతాలు వ్యాపించి ఉన్నవి. భారతవర్షం మొదటిది. దానితర్వాత కింపురుషవర్షం కలదు. ద్విజులారా! హరివర్షమనేది మరొకటి. ఈ మూడు మేరువుకు దక్షిణంవైపు ఉన్నవి.

**రమ్యకఞ్చోత్తరం వర్షం తస్యైవాను హిరణ్మయమ్ ।**
**ఉత్తరే కురవశ్చైవ యథైతే భారతాస్తథా ॥ 12 ॥**

ఉత్తర దిక్కు రమ్యకవర్షం, దానివెంబడి హిరణ్మయవర్షం, ఉత్తర కురుభూములున్నాయి. ఈ భారతవర్షం వలెనే ఇవి కూడ ప్రసిద్ధాలై ఉన్నవి.

**నవసాహస్రమేకైకమేతేషాం ద్విజసత్తమాః ।**
**ఇలావృతం చ తన్మధ్యే తన్మధ్యే మేరురుచ్ఛ్రితః ॥ 13 ॥**

విప్రశ్రేష్ఠులారా! వీనిలో ఒక్కొక్కటి తొమ్మిది వేల యోజనాల పరిమాణం కలది. వానిమధ్య ఇలావృత వర్షం, దానిమధ్య మేరుపర్వతం ఎత్తుగా నిలిచి ఉన్నది.

**మేరోశ్చతుర్దిశం తత్ర నవసాహస్రవిస్తరమ్ ।**
**ఇలావృతం మహాభాగాశ్చత్వారస్తత్ర పర్వతాః ॥ 14 ॥**

మేరువుకు నాల్గువైపుల తొమ్మిదివేల యోజనాల విస్తారం కల్గి ఇలావృత వర్షం వ్యాపించి ఉన్నది. అక్కడ నాలుగు పర్వతాలున్నవి.

**విష్కమ్భా రచితామేరోర్యోజనాయతముచ్ఛ్రితా ।**
**పూర్వేణ మన్దరో నామ దక్షిణే గన్ధమాదనః ॥ 15 ॥**

ఆ నాలుగు పర్వతాలు యోజనం ఎత్తు కల్గి మేరువునకు గడియలుగా చేయబడినవి. తూర్పువైపు మందర పర్వతం, దక్షిణంవైపు గంధమాదన పర్వతం ఉన్నది.

**విపులః పశ్చిమే పార్శ్వే సుపార్శ్వశ్చోత్తరే స్మృతః ।**
**కదమ్బస్తేషు జమ్బూశ్చ పిప్పలో వట ఏవ చ ॥ 16 ॥**

పడమట విపులము, ఉత్తరం దిక్కు సుపార్శ్వ పర్వతం కలవు. ఆ పర్వతాల్లో కడిమిచెట్టు, నేరేడు, రావి, మర్రిచెట్లు ఎక్కువగా ఉన్నవి.

**జమ్బూద్వీపస్య సా జమ్బూర్నామహేతుర్మహర్షయః ।**
**మహాగజ ప్రమాణాని జమ్బ్వా స్తస్యాః ఫలాని చ ॥ 17 ॥**

మహర్షులారా! ఆ జంబూవృక్షం జంబూద్వీప మనేపేరు రావటానికి కారణం ఆ వృక్షం ఫలాలు పెద్ద ఏనుగు పరిమాణం కలవి.

**పతన్తి భూభృతః పృష్ఠే శీర్యమాణాని సర్వతః ।**
**రసేన తస్యాః ప్రఖ్యాతా తత్ర జమ్బూనదీ గిరౌ ॥ 18 ॥**

దాని పండు మేరుపర్వతంపై రాలి పడగా ఆ పండ్లరసంతో ప్రసిద్ధినందిన జంబూనది పర్వతంపై ప్రవహిస్తుంటుంది.

**సరిత్ప్రవర్తతే చాపి పీయతే తత్రవాసిభిః ।**
**న స్వేదో న చ దౌర్గన్ధ్యం న జరా నేన్ద్రియక్షయః ॥ 19 ॥**

ఆ నదీజలం అక్కడి జనం త్రాగుతారు. అక్కడివారికి చెమట, చెడువాసన, ముసలితనం, ఇంద్రియక్షయం అనేవి కలుగవు.

**న తాపః స్వచ్ఛమనసాం నాసౌఖ్యం తత్ర జాయతే ।**
**తత్తీరమృద్రసం ప్రాప్య వాయునా సువిశోషితమ్ ॥ 20 ॥**

**జామ్బూనదాఖ్యం భవతి సువర్ణం సిద్ధభూషణమ్ ।**
**భద్రాశ్వః పర్వతో మేరోః కేతుమాలశ్చ పశ్చిమే ॥ 21 ॥**

**వర్షే ద్వే తు మునిశ్రేష్ఠాస్తయోర్మధ్యే ఇలావృతమ్ ।**
**వనం చైత్రరథం పూర్వం దక్షిణం గన్ధమాదనమ్ ॥ 22 ॥**

నిర్మలమైన మనసు గలవారికి అక్కడ తాపంకాని దుఃఖం కాని కలుగవు. ఆ నదీతీరంలోని మట్టి జంబూరసాన్ని పొంది గాలితో బాగా ఎండి జాంబూనదమనే పేర బంగారంగా మారుతుంది. అది సిద్ధులకు భూషణం. మేరువునకు పడమట భద్రాశ్వం కేతుమాలం అనే వర్షాలున్నాయి. ఓ మునిశ్రేష్ఠులారా! ఆ రెంటిమధ్య ఇలావృత వర్షం చైత్రరథమనే వనం తూర్పువైపు, దక్షిణం గంధమాదన పర్వతం ఉన్నాయి.

**వైభ్రాజం పశ్చిమం విద్యాదుత్తరం సవితుర్వనమ్ ।
అరుణోదం మహాభద్రమసితోదఞ్చ మానసమ్ ॥ 23 ॥**

**సరాంస్యేతాని చత్వారి దేవభోగ్యాని సర్వదా ।
సితాన్తశ్చ కుముద్వాంశ్చ కురరీ మాల్యవాంస్తథా ॥ 24 ॥**

**వైకఙ్కో మణిశైలశ్చ వృక్షవాంశ్చాచలోత్తమః ।
మహానీలో౽థ రుచకః సబిన్దుర్మన్దరస్తథా ॥ 25 ॥**

**వేణుమాంశ్చైవ మేఘశ్చ నిషధో దేవపర్వతః ।
ఇత్యేతే దేవరచితాః సిద్ధావాసాః ప్రకీర్తితాః ॥ 26 ॥**

పశ్చిమంలో వైభ్రాజం, ఉత్తరంలో సవితృవనం ఉన్నవి. అరుణోదం, మహాభద్రం, అసితోదం, మానసం అనే ఈ నాల్గు సరస్సులు ఎల్లపుడు దేవభోగ్యాలు. సితాంతం, కుముద్వంతం, కురరీ, మాల్యవంతం, వైకంకం, మణిశైలం, వృక్షవంతం అనే పర్వతరాజము, మహానీలం, రుచకం, బిందువు, మందరం అట్లే వేణుమంతం, మేఘం, నిషధం, దేవపర్వతం అనేవి దేవతలు నిర్మించినవి. సిద్ధులకు ఆవాసాలు

**అరుణోదస్య సరసః పూర్వతః కేసరాచలః ।
త్రికూటః సశిరశ్చైవ పతఙ్గో రుచకస్తథా ॥ 27 ॥**

**నిషధో వసుధారశ్చ కలిఙ్గస్త్రిశిఖః స్మృతః ।
సమూలో వసువేదిశ్చ కురురుశ్చైవ సానుమాన్ ॥ 28 ॥**

అరుణోదమనే సరస్సునకు తూర్పుదిక్కున కేసరాచలం, త్రికూటం, సశిరం, పతంగం, రుచకం, నిషధం వసుధారం, కలింగం, త్రిశిఖం, సమూలం, వసువేది, కురురువు అనే పర్వతాలున్నవి.

**తామ్రాతశ్చ విశాలశ్చ కుముదో వేణుపర్వతః ।
ఏకశృఙ్గో మహాశైలో గజశైలశ్చ పిఞ్జకః ॥ 29 ॥**

**పఞ్చశైలో౽థ కైలాసో హిమవాంశ్చాచలోత్తమః ।
ఇత్యేతే దేవచరితా ఉత్కటాః పర్వతోత్తమాః ॥ 30 ॥**

తామ్రాతం, విశాలం, కుముదం, వేణుపర్వతం, ఏకశృంగం, మహాశైలం, పింజకం, పంచశైలం, కైలాసం, పర్వతశ్రేష్ఠం హిమవంతం ఇవన్నీ దేవతల సంచారానికి యోగ్యమైన శ్రేష్ఠపర్వతరాజాలు.

**మహాభద్రస్య సరసో దక్షిణే కేసరాచలః ।
శిఖివాసాశ్చ వైదూర్యః కపిలో గన్ధమాదనః ॥ 31 ॥**

**జారుధిశ్చ సురామ్బుశ్చ సర్వగన్ధాచలోత్తమః ।
సుపార్శ్వశ్చ సుపక్షశ్చ కఙ్కః కపిల ఏవ చ ॥ 32 ॥**

**విరజో భద్రజాలశ్చ సుసకశ్చ మహాబలః ।
అఞ్జనో మధుమాంస్తద్వచ్చిత్రశృఙ్గో మహాలయః ॥ 33 ॥**

**కుముదో ముకుటశ్చైవ పాణ్డురః కృష్ణ ఏవ చ ।**
**పారిజాతో మహాశైలస్తథైవ కపిలాచలః ॥ 34 ॥**

మహాభద్రం అనే సరస్సుకు దక్షిణం దిక్కు న కేసరపర్వతం, శిఖివాసం, వైదూర్యం, కపిలం, గంధమాదనం, జారుధి, సురాంబువు, సర్వగంధపర్వతం, సుపార్శ్వం, సుపక్షం, కంకం, కపిలపర్వతం, విరజా, భద్రజాలం, సుసకం, మహాబలం, అంజనం, మధుమంతం, చిత్రశృంగం, మహాలయం, కుముదం, ముకుటం, పాండురం, కృష్ణం, పారిజాతం అనే పెద్దపర్వతం, కపిలాచలం అనేవి కలవు.

**సుషేణః పుణ్డరీకశ్చ మహామేఘస్తథైవ చ ।**
**ఏతే పర్వతరాజాశ్చ సిద్ధగంధర్వసేవితాః ॥ 35 ॥**

సుషేణము, పుండరీకం, మహామేఘం అనేవి సిద్ధులు గంధర్వులు సేవిస్తున్న పర్వతరాజాలు.

**అసితోదస్య సరసః పశ్చిమే కేసరాచలః ।**
**శంఖకూటో௨థ వృషభో హంసో నాగస్తథైవ చ ॥ 36 ॥**

**కాలాఞ్జనః శుక్రశైలో నీలః కమల ఏవ చ ।**
**పారిజాతో మహాశైలః శైలః కనక ఏవ చ ॥ 38 ॥**

**పుష్పకశ్చ సుమేఘశ్చ వారాహో విరజాస్తథా ।**
**మయూరః కపిలశ్చైవ మహాకపిల ఏవ చ ॥ 39 ॥**

**ఇత్యేతే దేవగన్ధర్వసిద్ధయక్షైశ్చ సేవితాః ।**
**సరసో మానసస్యేహ ఉత్తరే కేసరాచలః ॥ 40 ॥**

అసితోదమనే సరస్సుకు పశ్చిమంగా కేసరపర్వతం ఉన్నది. శంఖకూటం, వృషభం, హంసం, నాగం అనేవి అట్లే కాలాంజనం, శుక్రం, నీలం, పారిజాతం అనే మహాశైలం కనకశైలము, పుష్పకం, సుమేఘం, వారాహం, విరజం, మయూరం, కపిలం, మహాకపిలం అనేవి పర్వతాలు. దేవ గంధర్వసిద్ధ యక్షులు సేవిస్తున్నవి. మానస సరస్సుకు ఉత్తరంగా కేసర పర్వతం ఉన్నది.

**ఏతేషాం శైలముఖ్యానామన్తరేషు యథాక్రమమ్ ।**
**సన్తి చైవాన్తరద్రోణ్యః సరాంసి చ వనాని చ ॥ 41 ॥**

**వసంతి తత్ర మునయః సిద్ధా వై బ్రహ్మభావితాః ।**
**ప్రసన్నాః శాన్తరజసః సర్వదుఃఖవివర్జితాః ॥ 42 ॥**

ఈ పర్వతాల మధ్యనున్న భూభాగాల్లో క్రమంగా సరస్సులు, వనాలు, జలాశయాలు ఉంటాయి. ఆ ప్రదేశంలో మునులు బ్రహ్మజ్ఞానం కల్గిన సిద్ధులు నిర్మల చిత్తులు రజోగుణరహితులు దుఃఖాలన్నింటిని వదలినవారు ఉంటారు.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనకోశే పర్వతసంఖ్యానే పఞ్చచత్వారింశో௨ధ్యాయః ॥ 45 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనకోశంలో పర్వతసంఖ్యానమనే నలభై అయిదవ అధ్యాయం॥ 45 ॥

## షట్చత్వారింశోఽధ్యాయః - నలబై ఆరవ అధ్యాయం

## భువనకోశవిన్యాసవర్ణనమ్ - భువనకోశవిన్యాసవర్ణనం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు

**చతుర్దశసహస్రాణి యోజనానాం మహాపురీ ।**
**మేరోరుపరి విఖ్యాతా దేవదేవస్య వేధసః ॥ 1 ॥**

మేరుపర్వతంపై దేవదేవుడు బ్రహ్మయొక్క పదునాల్గువేల యోజనాల ప్రసిద్ధమైన మహాపురి ఉన్నది.

**తత్రాఽఽస్తే భగవాన్ బ్రహ్మా విశ్వాత్మా విశ్వభావనః ।**
**ఉపాస్యమానో యోగీన్ద్రైర్మునీన్ద్రోపేన్ద్రశంకరైః ॥ 2 ॥**

విశ్వాత్ముడు, విశ్వభావనుడు, భగవంతుడైన బ్రహ్మ, యోగీంద్రులు, మునీంద్ర, విష్ణుశంకరులతో సేవింపబడుతూ అక్కడ నివసిస్తున్నాడు.

**తత్ర దేవేశ్వరేశానం విశ్వాత్మానం ప్రజాపతిమ్ ।**
**సనత్కుమారో భగవానుపాస్తే నిత్యమేవ హి ॥ 3 ॥**

అక్కడ దేవతల ప్రభువైన విశ్వాత్ముడు, ప్రజాపతి అనే బ్రహ్మను సనత్కుమారుడు ఎల్లపుడూ సేవిస్తుంటాడు.

**స సిద్ధఋషిగన్ధర్వైః పూజ్యమానః సురైరపి ।**
**సమాస్తే యోగయుక్తాత్మా పీత్వా తత్పరమామృతమ్ ॥ 4 ॥**

ఆ ప్రజాపతిని సిద్ధులు, ఋషులు, గంధర్వులు, దేవతలు పూజిస్తుంటారు. ఆ బ్రహ్మ శ్రేష్ఠమైన అమృతాన్ని సేవించి యోగం ధరించి నివసిస్తున్నాడు.

**తత్ర దేవాధిదేవస్య శమ్భోరమితతేజసః ।**
**దీప్తమాయతనం శుభ్రం పురస్తాద్బ్రహ్మణః స్థితమ్ ॥ 5 ॥**

ఆ ప్రదేశంలో బ్రహ్మముందు భాగంలో దేవాధిదేవుడు గొప్ప తేజస్వియైన శివుని ప్రకాశవంతము, నిర్మలమైన మందిరమున్నది.

**దివ్యకాన్తిసమాయుక్తం చతుర్ద్వారం సుశోభనమ్ ।**
**మహర్షిగణసంకీర్ణం బ్రహ్మవిద్భిర్నిషేవితమ్ ॥ 6 ॥**

దివ్యమైన కాంతితో నాల్గుద్వారాలు గలిగి ఆ మందిరం మిక్కిలి మంగళకరమేగాక గొప్ప ఋషుల సమూహంతో నిండి ఉన్నది. దానిని బ్రహ్మవేత్తలు సేవిస్తుంటారు.

**దేవ్యా సహ మహాదేవః శశాఙ్కార్కాగ్నిలోచనః ।**
**రమతే తత్ర విశ్వేశః ప్రమథైః ప్రమథేశ్వరః ॥ 7 ॥**

**తత్ర వేదవిదః శాన్తా మునయో బ్రహ్మచారిణః ।**
**పూజయన్తి మహాదేవం తపసా సత్యవాదినః ॥ 8 ॥**

అక్కడ సూర్యచంద్రాగ్నులు నేత్రాలుగాకల శంకరుడు ప్రమథ గణాధిపతి ప్రమథులతో పార్వతితో కూడి రమిస్తుంటాడు. అచ్చట వేదవేత్తలు శాంతచిత్తులైన మునులు, బ్రహ్మచారులు, సత్యవాదులు తపసుతో మహాదేవు నారాధిస్తుంటారు.

**తేషాం సాక్షాన్మహాదేవో మునీనాం భావితాత్మనామ్ ।**
**గృహ్ణాతి పూజాం శిరసా పార్వత్యా పరమేశ్వరః ॥ 9 ॥**

మహానుభావులైన మునుల పూజను మహాదేవుడు పార్వతితో గూడి పరమేశ్వరుడు శిరసా గ్రహిస్తాడు.

**తత్రైవ పర్వతవరే శక్రస్య పరమా పురీ ।**
**నామ్నాఽమరావతీ పూర్వే సర్వశోభాసమన్వితా ॥ 10 ॥**

అక్కడ పర్వతశ్రేష్ఠంపై తూర్పుదిక్కున అమరావతి అనే పేరుతో సమస్తశోభలతో కూడిన ఇంద్రుని పట్టణమున్నది.

**తత్ర చాప్సరసః సర్వా గన్ధర్వాః సిద్ధచారణాః।**
**ఉపాసతే సహస్రాక్షం దేవాస్తత్ర సహస్రశః ॥ 11 ॥**

అందులో అప్సరసలు, గంధర్వులు, సిద్ధచారణులు, ఇతర దేవతలు, వేలకొలది సహస్రాక్షుడైన ఇంద్రుని సేవిస్తుంటారు.

**యే ధార్మికా వేదవిదో యాగహోమపరాయణాః ।**
**తేషాం తత్పరమం స్థానం దేవానామపి దుర్లభమ్ ॥ 12 ॥**

ధర్మపరులు, వేదవేత్తలు, యాగాలుహోమాలు చేయటంలో శ్రద్ధకలవారికందరికి అది శ్రేష్ఠమైన ఆ స్థానము. అది దేవతలకు సైతం దుర్లభమైనది.

**తస్మాద్దక్షిణదిగ్భాగే వహ్నేరమితతేజసః ।**
**తేజోవతీ నామ పురీ దివ్యాశ్చర్యసమన్వితా ॥ 13 ॥**

దానికి దక్షిణదిశలో అధిక తేజస్వంతుడైన అగ్నిదేవుని తేజోవతి అనే పట్టణమున్నది. అది ఆశ్చర్యం గొల్పే దృశ్యాలతో కూడి ఉంటుంది.

**తత్రాఽఽస్తే భగవాన్వహ్నిర్భ్రాజమానః స్వతేజసా ।**
**జపినాం హోమినాం స్థానం దానవానాం దురాసదమ్ ॥ 14 ॥**

భగవంతుడైన అగ్ని తన తేజస్సుతో ప్రకాశిస్తూ అక్కడ నివసిస్తుంటాడు. జపము చేసేవారికి హోమం జరిపేవారికి అది స్థానము. రాక్షసులకది చేరరానిది.

**దక్షిణే పర్వతవరే యమస్యాపి మహాపురీ ।**
**నామ్నా సంయమనీ దివ్యా సర్వశోభాసమన్వితా ॥ 15 ॥**

దక్షిణ దిశనున్న పర్వతంపై యమధర్మరాజనగరం సంయమని అనే పేర సమస్తశోభాసమన్వితమై ప్రకాశిస్తున్నది.

**తత్ర వైవస్వతం దేవం దేవాద్యాః పర్యుపాసతే ।**
**స్థానం తత్సత్యసన్ధానాం లోకే పుణ్యకృతాం నృణామ్ ॥ 16 ॥**

అక్కడ దేవతలు మొదలైనవారు యమధర్మరాజును సేవిస్తుంటారు. సత్యసంధులకు పుణ్యాత్ములైన మనుష్యులకు ప్రాప్యస్థాన మది.

**తస్యాస్తు పశ్చిమే భాగే నిర్‍ఋతేస్తు మహాత్మనః ।**
**రక్షోవతీ నామ పురీ రాక్షసైః సంవృతా తు యా ॥ 17 ॥**

దానికి పడమట మహాత్ముడగు నిర్‍ఋతి పట్టణం రక్షోవతి అనే పేర ఉన్నది. దానిని రాక్షసులు చుట్టి ఉంటారు.

**తత్ర తే నైర్‍ఋతం దేవం రాక్షసాః పర్యుపాసతే ।**
**గచ్ఛన్తి తాం ధర్మరతా యే తు తామసవృత్తయః ॥ 18 ॥**

అక్కడ రాక్షసులు నైర్‍ఋతప్రభు సేవ చేస్తుంటారు. తమోగుణప్రవృత్తిగల్గి ధర్మపరులుగా ఉన్నవారు ఆ పట్టణాన్ని పొందుతారు.

**పశ్చిమే పర్వతవరే వరుణస్య మహాపురీ ।**
**నామ్నా శుద్ధవతీ పుణ్యా సర్వకామర్ధి సంయుతా ॥ 19 ॥**

పడమటి పర్వతరాజంపై వరుణదేవుని శుద్ధవతి అనే పుణ్యకరమైన పట్టణమున్నది. అన్నికోరికలు సమృద్ధిగా గల నగరమది.

**తత్రాప్సరోగణైః సిద్ధైః సేవ్యమానోఽమరాధిపైః ।**
**ఆస్తే స వరుణో రాజా తత్ర గచ్ఛన్తి యేఽమ్బుదాః ॥ 20 ॥**

దానిలో అప్సరల సమూహం, సిద్ధులు, దేవతలు భగవంతుడైన వరుణుని సేవిస్తుంటారు. లోకంలో జలదానంచేసిన వారక్కడకు వెళతారు.

**తస్యా ఉత్తరదిగ్భాగే వాయోరపి మహాపురీ ।**
**నామ్నా గన్ధవతీ పుణ్యా తత్రాఽఽస్తేసౌ ప్రభఞ్జనః ॥ 21 ॥**

దానికి ఉత్తరదిక్కున వాయుదేవుని పట్టణము గంధవతి అనునది కలదు. అది పుణ్యవంతమైనది. అక్కడ వాయుదేవుడు నివసిస్తాడు.

**అప్సరోగణగన్ధర్వైః సేవ్యమానో మహాప్రభుః ।**
**ప్రాణాయామపరా విప్రాః స్థానం తద్యాన్తి శాశ్వతమ్ ॥ 22 ॥**

అతణ్ణి అప్సరసలు, గంధర్వులు సేవిస్తుంటారు. ప్రాణాయామపరాయణులైన బ్రాహ్మణులు ఆ స్థానాన్ని శాశ్వతంగా పొందుతారు.

**తస్యాః పూర్వే తు దిగ్భాగే సోమస్య పరమా పురీ ।**
**నామ్నా కాన్తిమతీ శుభ్రా తస్యాం సోమో విరాజతే ॥ 23 ॥**

దానికి తూర్పు దిక్కున చంద్రుని పట్టణము కాంతిమతి అను పేరుగలది కలదు. అది శ్రేష్ఠమైనది. స్వచ్ఛమైన ఆ నగరంలో చంద్రుడు ప్రకాశిస్తుంటాడు.

**తత్ర యే ధర్మనిరతాః స్వధర్మం పర్యుపాసతే ।**
**తేషాం తదుచితం స్థానం నానాభోగసమన్వితమ్ ॥ 24 ॥**

ధర్మమందుశ్రద్ధ గలవారై తమ ధర్మాన్ని అనుష్ఠించేవారు అనేక సుఖాలనుభవిస్తూ ఆ స్థానంలో ఉంటారు.

**తస్యాస్తు పూర్వదిగ్భాగే శఙ్కరస్య మహాపురీ ।**
**నామ్నా యశోవతీ పుణ్యా సర్వేషాం సా దురాసదా ॥ 25 ॥**

ఆ పట్టణానికి తూర్పు భాగంలో శంకరుని యశోవతి అనే గొప్ప పురమున్నది. అది పుణ్యప్రదము. అందరికి పొందశక్యం కానిది.

**తత్రేశానస్య భవనం రుద్రేణాధిష్ఠితం శుభమ్ ।**
**గణేశ్వరస్య విపులం తత్రాఽఽస్తే స గణావృతః ॥ 26 ॥**

అక్కడ రుద్రుడధిష్ఠించిన ఈశానుని భవనము శుభకరము విశాలమైనది కలదు. గణాలు పరివేష్టింపగా గణేశ్వరుడు అక్కడ ఉంటాడు.

**తత్ర భోగాదిలిప్సూనాం భక్తానాం పరమేష్ఠినః ।**
**నివాసః కల్పితః పూర్వం దేవదేవేన శూలినా ॥ 27 ॥**

సుఖాలు పొందగోరే పరమేష్ఠి భక్తులకు దేవదేవుడు శంకరుడు పూర్వం అక్కడ నివాసం ఏర్పరచినాడు.

**విష్ణుపాదాద్వినిష్క్రాంతా ప్లావయిత్వేన్దుమణ్డలమ్ ।**
**సమన్తాద్బ్రహ్మణః పుర్యాం గఙ్గా పతతి వై తతః ॥ 28 ॥**

విష్ణుపాదోద్భవి గంగానది చంద్రమండలాన్ని పావనంచేసి అన్ని వైపులనుండి బ్రహ్మపట్టణంలో పడుతున్నది.

**సా తత్ర పతితా దిక్షు చతుర్ధా హ్యభవద్ద్విజాః ।**
**సీతా చాలకనన్దా చ సుచక్షుర్భద్రనామికా ॥ 29 ॥**

**పూర్వేణ శైలాచ్చైలం తు సీతా యాత్యన్తరిక్షగా ।**
**తతశ్చ పూర్వవర్షేణ భద్రాశ్వాద్యాతి చార్ణవమ్ ॥ 30 ॥**

ఆ నది అక్కడ దిగి దిక్కులలో నాలుగు విధాల చీలిపోయినది. విప్రులారా! సీత, అలకనంద, సుచక్షువు, భద్ర అని ఆ పాయలకు పేర్లు. తూర్పువైపు పర్వతంనుండి పర్వతానికి ప్రవహించే సీత అనే పాయ అంతరిక్షంలో సాగుతుంది. తర్వాత తూర్పున భద్రాశ్వవర్షంనుండి సముద్రాన్ని చేరుతుంది.

**తథైవాలకనన్దా చ దక్షిణాదేత్య భారతమ్ ।**
**ప్రయాతి సాగరం భిత్త్వా సప్తభేదా ద్విజోత్తమాః ॥ 31 ॥**

అదే విధంగా అలకనంద దక్షిణదిశగా భారతదేశంలో నడచి ఏడు పాయలుగా చీలి సముద్రంలో కలియుచున్నది.

**సుచక్షుః పశ్చిమగిరీనతీత్య సకలాంస్తథా ।**
**పశ్చిమం కేతుమాలాఖ్యం వర్షం గత్వైతి చార్ణవమ్ ॥ 32 ॥**

సుచక్షు వనే పాయ పడమటివైపు పర్వతాలన్నింటిని దాటి పశ్చిమంలో కేతుమాల మనే వర్షాన్ని చేరి సముద్రాన్ని పొందుతున్నది.

**భద్రా తథోత్తరగిరీనుత్తరాంశ్చ తథా కురూన్ ।**
**అతీత్య చోత్తరామ్భోధిం సమభ్యేతి మహర్షయః ॥ 33 ॥**

భద్ర ఉత్తర దిశలోని పర్వతాలను ఉత్తర కురుదేశాన్ని దాటి ఉత్తరసముద్రంలో కలియుచున్నది.

**ఆనీల నిషధాయామౌ మాల్యవద్గన్ధమాదనౌ ।**
**తయోర్మధ్యం గతో మేరుః కర్ణికాకారసంస్థితః ॥ 34 ॥**

మాల్యవంతం, గంధమాదనం అనే పర్వతాలు నీల, నిషధములంత పొడవైనవి. ఆ రెంటి మధ్యభాగాన్ని పొందిన మేరుపర్వతం కర్ణికాకారంలో కన్పిస్తుంది.

**భారతాః కేతుమాలాశ్చ భద్రాశ్వాః కురవస్తథా ।**
**పత్రాణి లోకపద్మస్య మర్యాదాశైలబాహ్యతః ॥ 35 ॥**

అవధి పర్వతానికి వెలుపల భారత, కేతుమాల, భద్రాశ్వ కురువర్షాలు లోకమనే కమలానికి రేకులవంటివి.

**జఠరో దేవకూటశ్చ మర్యాదాపర్వతావుభౌ ।**
**దక్షిణోత్తరమాయాతావానీలనిషధాయతౌ ॥ 36 ॥**

జఠరము, దేవ కూటము అనే మర్యాదాపర్వతాలు రెండు నీలనిషధపర్వతములంత పొడవైనవై, దక్షిణోత్తర దిక్కులకు వ్యాపించినవి.

**గన్ధమాదనకైలాసౌ పూర్వపశ్చాయతావుభౌ ।**
**అశీతియోజనాయామావర్ణవాన్తర్వ్యవస్థితౌ ॥ 37 ॥**

గంధమాదన కైలాసపర్వతాలు రెండు తూర్పు పడమరల విస్తరించినవి. ఎనబైయోజనాల వైశాల్యం కల్గి సముద్రమధ్యంలో నిలిచినవి.

**నిషధః పారియాత్రశ్చ మర్యాదా పర్వతా విమౌ ।**
**మేరోః పశ్చిమ దిగ్భాగే యథాపూర్వం వ్యవస్థితౌ ॥ 38 ॥**

నిషధము, పారియాత్ర మనేవి మర్యాదాపర్వతాలు. ఈ రెండు మేరువునకు పడమటిభాగంలో పూర్వంవలె నిలిచి ఉన్నవి.

**త్రిశృఙ్గో జారుధిస్తద్వ దుత్తరే వర్షపర్వతౌ ।**
**తావదాయామ విస్తారా వర్ణవాన్తర్వ్యవస్థితౌ ॥ 39 ॥**

త్రిశృంగము, జారుధి అనేవి ఉత్తర దిక్కున్న వర్షపర్వతాలు. పూర్వపర్వతాలంత వైశాల్యంకలిగి సముద్రంలో నెలకొన్నవి.

**మర్యాదాపర్వతాః ప్రోక్తా అష్టావిహ మయా ద్విజాః ।**
**జఠరాద్యాః స్థితా మేరోశ్చతుర్దిక్షు మహర్షయః ॥ 40 ॥**

బ్రాహ్మణులారా! ఎనిమిది మర్యాదాపర్వతాలను గూర్చి నేను వివరించాను. మేరుపర్వతానికి నాలుగు దిక్కుల జఠరము మొదలైన పర్వతాలు పాదుకొని ఉన్నవి.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనకోశ విన్యాసవర్ణనే షట్చత్వారింశోఽధ్యాయః ॥ 46 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనకోశవిన్యాసవర్ణనంలో నలబై ఆరవ అధ్యాయము ॥ 46 ॥



## సప్త చత్వారింశోఽధ్యాయః - నలబై ఏడవ అధ్యాయం

## భువనకోశవర్ణనమ్ - భువనకోశవర్ణనం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు

**కేతుమాలే నరాః కాకాః సర్వే పనసభోజనాః ।**
**స్త్రియశ్చోత్పలపత్రాభాస్తే జీవన్తి వర్షాయుతమ్ ॥ 1 ॥**

కేతుమాలవర్షం మనుష్యులందరు నల్లనివారు, పనసభోజన ప్రియులు. అక్కడి స్త్రీలు కలువ పూవంటి కాంతి గలవారు. పదివేల సంవత్సరాలు వారు జీవిస్తారు.

**భద్రాశ్వే పురుషాః శుక్లాః స్త్రియశ్చన్ద్రాంశుసన్నిభాః ।**
**దశవర్షసహస్రాణి జీవన్తే చాన్నభోజనాః ॥ 2 ॥**

భద్రాశ్వవర్షంలో పురుషులు తెల్లనివారు. స్త్రీలు చంద్రకాంతివలె ప్రకాశిస్తారు. వారు అన్నభోజనులై పదివేలేండ్లు జీవిస్తారు.

**రమ్యకే పురుషా నార్యో రమన్తి రజతప్రభాః ।**
**దశవర్షసహస్రాణి శతాని దశ పఞ్చ చ ॥ 3 ॥**

రమ్యకవర్షంలో వెండివలె మెరిసే స్త్రీలు పురుషులు పదివేల సంవత్సరాల పదహైదు వందల సంవత్సరాలకాలం విహరిస్తుంటారు.

**జీవన్తి చైవ సత్త్వస్థా న్యగ్రోధఫలభోజనాః ।**
**హిరణ్మయే హిరణ్యాభాః సర్వే శ్రీఫలభోజనాః ॥ 4 ॥**

**ఏకాదశసహస్రాణి శతాని దశ పఞ్చ చ ।**
**జీవన్తి పురుషా నార్యో దేవలోకస్థితా ఇవ ॥ 5 ॥**

హిరణ్మయవర్షంలో బంగారంవంటి శరీరులై నరులు సత్త్వగుణపూర్ణులు. వటఫలాలను భుజిస్తుంటారు. శ్రీ ఫలాలను ఆహారంగా స్వీకరిస్తారు. వారు పదకొండువేల పదహైదు వందల సంవత్సరాల కాలం దేవలోకంలోని వారివలె పురుషులు స్త్రీలు కూడ జీవనం గడుపుతారు.

**త్రయోదశసహస్రాణి శతాని దశ పఞ్చ చ ।**
**జీవన్తి కురువర్షే తు శ్యామాఙ్గాః క్షీరభోజనాః ॥ 6 ॥**

కురువర్షంలో జనులు నల్లనివారై పాలు ఆహారంగా స్వీకరిస్తూ, పదమూడువేల పదహైదు వందల సంవత్సరాలు జీవిస్తారు.

**సర్వే మిథునజాతాశ్చ నిత్యం సుఖనిషేవితాః ।**
**చన్ద్రద్వీపే మహాదేవం యజన్తి సతతం శివమ్ ॥ 7 ॥**

**తథా కింపురుషే విప్రా మానవా హేమసన్నిభాః ।**
**దశవర్షసహస్రాణి జీవన్తి ప్లక్షభోజనాః ॥ 8 ॥**

**యజన్తి సతతం దేవం చతుఃశీర్షం చతుర్భుజమ్ ।**
**ధ్యానే మనః సమాధాయ సాదరం భక్తిసంయుతాః ॥ 9 ॥**

దంపతులందరు ఎల్లపుడు సుఖంగా జీవిస్తుంటారు. చన్ద్రద్వీపంలో వీరు ఎల్లపుడు మహాదేవుని శివుని ఆరాధిస్తారు. అట్లే కింపురుష వర్షంలో మానవులు బంగారు వర్ణం కలవారై జువ్వి ఫలాల నాహారంగా గ్రహించి పదివేల సంవత్సరాలు జీవిస్తారు. వారు నాలుగు శిరసులు నాలుగు భుజాలు గల దేవుని ధ్యానంతో మనసు నిల్పి భక్తితో గౌరవంతో పూజిస్తారు.

**తథా చ హరివర్షే తు మహారజతసన్నిభాః ।**
**దశవర్షసహస్రాణి జీవన్తీక్షురసాశినః ॥ 10 ॥**

**తత్ర నారాయణం దేవం విశ్వయోనిం సనాతనమ్ ।**
**ఉపాసతే సదా విష్ణుం మానవా విష్ణుభావితాః ॥ 11 ॥**

హరివర్షంలో మేలైన వెండివర్ణం గలవారై చెరకు రసాన్ని ఆహారంగా తీసుకుంటూ పదివేలేండ్లు జీవిస్తారు. ఆ హరివర్షంలో విశ్వకారణభూతుడు సనాతనుడైన నారాయణదేవుని విష్ణువును భావిస్తూ మానవులు సేవిస్తారు.

**తత్ర చంద్రమసం శుభ్రం శుద్ధస్ఫటికసన్నిభమ్ ।**
**విమానం వాసుదేవస్య పారిజాతవనాశ్రితమ్ ॥ 12 ॥**

**చతుర్ద్వారమనౌపమ్యం చతుస్తోరణసంయుతమ్ ।**
**ప్రాకారైర్దశభిర్యుక్తం దురాధర్షం సుదుర్గమమ్ ॥ 13 ॥**

**స్ఫాటికైర్మణ్డపైర్యుక్తం దేవరాజగృహోపమమ్ ।**
**సువర్ణస్తమ్భసాహస్రైః సర్వతః సమలంకృతమ్ ॥ 14 ॥**

**హేమసోపానసంయుక్తం నానారత్నోపశోభితమ్ ।**
**దివ్యసింహాసనోపేతం సర్వశోభాసమన్వితమ్ ॥ 15 ॥**

**సరోభిః స్వాదుపానీయైర్నదీభిశ్చోపశోభితమ్ ।**
**నారాయణపరైః శుద్ధైర్వేదాధ్యయనతత్పరైః ॥ 16 ॥**

**యోగిభిశ్చ సమాకీర్ణం ధ్యాయద్భిః పురుషం హరిమ్ ।**
**స్తువద్భిః సతతం మన్త్రైర్నమస్యద్భిశ్చ మాధవమ్ ॥ 17 ॥**

అక్కడ స్వచ్ఛమైన చంద్రునితో, నిర్మలమైన స్ఫటికంతో సమానమైన దానిని పారిజాత వనాన్నాశ్రయించియున్న వాసుదేవుని విమానాన్నీ, నాల్గు ద్వారాలుకల్గి నాల్గుతోరణాలతో కూడి పదిప్రాకారాలుకల్గి సాటిలేనిదై

తిరస్కరింపతగనిది, పొందటానికి కష్టసాధ్యమైనది, స్ఫటికమణులతో చేయబడిన మంటపాలతో కూడినది, దేవేంద్రుని గృహంతో పోల్చదగినదై అంతట స్తంభాలతో అలంకరింపబడినది, బంగారుమెట్లతో బహువిధాలైన మణులతో కూర్చిన శ్రేష్ఠమైన సింహాసనం కల్గి అన్నిశోభలతోను ఒప్పారునది నారాయణ భవనం. అక్కడ రుచిగల జలం కల కొలనులు నదులు ఉన్నవి. నారాయణుని యందాసక్తులై వేదాధ్యయనపరులై శుద్ధులైన యోగులు అక్కడ విష్ణువును ధ్యానిస్తుంటారు. మంత్రాలతో హరిని స్తోత్రం చేస్తూ నమస్కరిస్తుంటారు.

**తత్ర దేవాధిదేవస్య విష్ణోరమమితేజసః ।**
**రాజానః సర్వకాలం తు మహిమానం ప్రకుర్వతే ॥ 18 ॥**

**గాయన్తి చైవ నృత్యన్తి విలాసిన్యో మనోహరాః ।**
**స్త్రియో యౌవనశాలిన్యః సదా మణ్డనతత్పరాః ॥ 19 ॥**

అక్కడ రాజులు దేవాధిదేవుడు అమిత తేజస్వంతుడైన విష్ణువుమహిమను అన్నికాలాల్లోను ప్రశంసిస్తుంటారు. మనోహరులైన విలాసినులు యవ్వనంతో ప్రకాశిస్తుంటారు. ఎల్లపుడు అలంకారమందాసక్తలై స్త్రీలు పాటలు పాడుతూ నృత్యం చేస్తుంటారు.

**ఇలావృతే పద్మవర్ణా జమ్బూరసఫలాశినః ।**
**త్రయోదశసహస్రాణి వర్షాణాం చ స్థిరాయుషః ॥ 20 ॥**

ఇలావృత వర్షంలో నివసించేవారు పద్మంవంటి వర్ణం కలవారై జంబూఫల-రసాలు సేవిస్తూ పదమూడు వేలేండ్లు చిరాయువులై ఉంటారు.

**భారతేషు స్త్రియః పుంసో నానావర్ణాః ప్రకీర్తితాః ।**
**నానా దేవార్చనే యుక్తా నానాకర్మాణి కుర్వతే ॥ 21 ॥**

భారతవర్షంలో స్త్రీలు, పురుషులు కూడ అనేక వర్ణాల్లో ఉంటారు. అనేక దేవతలను పూజిస్తారు. కర్మలనేకాలు చేస్తుంటారు.

**పరమాయుః స్మృతం తేషాం శతం వర్షాణి సువ్రతాః ।**
**నవయోజనసాహస్రం వర్షమేతత్ప్రకీర్తితమ్ ॥ 22 ॥**

**కర్మభూమిరియం విప్రాః నరాణామధికారిణామ్ ।**

వారి పరమాయుర్దాయం నూరువత్సరాలు. ఈ భారత వర్షం తొమ్మిదివేల యోజనాల వైశాల్యం కలది. ద్విజులారా! ఇది అధికారం కల మనుష్యులకు కర్మభూమి.

**మహేన్ద్రో మలయః సహ్యః శక్తిమానృక్షపర్వతః ॥ 23 ॥**

**విన్ధ్యశ్చ పారియాత్రశ్చ సప్తాత్ర కులపర్వతాః ।**
**ఇంద్రద్వీపః కసేరుక్మాన్ తామ్రపర్ణో గభస్తిమాన్ ॥ 24 ॥**

**నాగద్వీపస్తథా సౌమ్యో గన్ధర్వస్త్వథ వారుణః ।**
**అయన్తు నవమస్తేషాం ద్వీపః సాగరసంస్థితః ॥ 25 ॥**

మహేంద్రము, మలయము, సహ్యము, శక్తిమంతము, ఋక్ష పర్వతము, వింధ్యపర్వతం, పారియాత్రం అనే ఏడు ఈ వర్షంలో ఉన్న పర్వతాలు. ఇంద్ర ద్వీపం, కసేరుక్మం, తామ్రపర్ణం, గభస్తిమంతం, నాగద్వీపం, సౌమ్యం, గంధర్వం, వారుణం అనే ద్వీపాలతో పాటు ఈ ద్వీపం సముద్రమందున్న తొమ్మిదో సంఖ్య కలది.

**యోజనానాం సహస్రం తు ద్వీపోఽయం దక్షిణోత్తరః ।**
**పూర్వే కిరాతాస్తస్యాన్తే పశ్చిమే యవనాస్తథా ॥ 26 ॥**

ఈ ద్వీపం దక్షిణోత్తరదిశలకు వేయి యోజనాల దూరం వ్యాపించి ఉన్నది. దీనికి తూర్పున చివరిభాగంలో కిరాతులు పడమటి కొసలో యవన జాతివారు నివసిస్తారు.

**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా మధ్యే శూద్రాస్తథైవ చ ।**
**ఇజ్యాయుద్ధవణిజ్యాభిర్వర్తయన్త్యత్ర మానవాః ॥ 27 ॥**

ద్వీప మధ్యభాగంలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతి జనులు నివసిస్తారు. ఇక్కడి వర్ణాలవారు క్రమంగా యజ్ఞాలు, యుద్ధాలు, వాణిజ్యం అనే వృత్తులతో జీవనం సాగిస్తారు.

**స్రవన్తే పావనా నద్యః పర్వతేభ్యో వినిఃసృతాః ।**
**శతద్రుశ్చన్ద్రభాగా చ సరయూర్యమునా తథా ॥ 28 ॥**

**ఇరావతీ వితస్తా చ విపాశా దేవికా కుహూః ।**
**గోమతీ ధూతపాపా చ బాహుదా చ దృషద్వతీ ॥ 29 ॥**

**కౌశికీ లోహినీ చేతి హిమవత్పాదనిఃసృతాః ।**

ఇక్కడ పర్వతాలనుండి ప్రవహించే పవిత్రనదులు కూడ ఉన్నాయి. శతద్రువు, చంద్రభాగ, సరయు, యమున, ఇరావతి, వితస్త, విపాశ, దేవిక, కుహూ, గోమతి, ధూతపాప, బాహుద, దృషద్వతి, కౌశికి, లోహిని అని అవి హిమవత్పర్వతపాదప్రదేశంనుండి బయలుదేరినవి.

**వేదస్మృతిర్వేదవతీ వ్రతఘ్నీ త్రిదివా తథా॥ 30 ॥**

**పర్ణాశా చన్దనా చైవ సచర్మణ్వతీ సురా ।**
**విదిశా వేత్రవత్యాపి పారియాత్రాశ్రయాః స్మృతాః ॥ 31 ॥**

వేదస్మృతి, వేదవతి, వ్రతఘ్ని, త్రిదివ, అనేది పర్ణాశ, చన్దన, చర్మణ్వతి, సుర, విదిశ, వేత్రవతి అనే నదులు పారియాత్ర పర్వతాన్నాశ్రయించినవి.

**నర్మదా సురసా శోణో దశార్ణా చ మహానదీ ।**
**మన్దాకినీ చిత్రకూటా తామసీ చ పిశాచికా ॥ 32 ॥**

**చిత్రోత్పలా విశాలా చ మఞ్జులా వాలువాహినీ ।**
**ఋక్షవత్పాదజా నద్యః సర్వపాపహరా నృణామ్ ॥ 33 ॥**

నర్మద, సురస, శోణ, దశార్ణ, మహానది, మందాకిని, చిత్రకూట, తామసి, పిశాచిక, చిత్రోత్పల, విశాల, మంజుల, వాలువాహిని అనేవి ఋక్షవత్పర్వతం నుండి బయలుదేరేవి. మనుజుల పాపాలన్నింటిని నశింపచేసే నదులు

**తాపీ పయోష్ణీ నిర్విన్ధ్యా శీఘ్రోదా చ మహానదీ।**
**విన్నా వైతరణీ చైవ బలాకా చ కుముద్వతీ ॥ 34 ॥**

**తథా చైవ మహాగౌరీ దుర్గా చాన్తఃశిలా తథా ।**
**విన్ధ్యపాదప్రసూతాస్తు నద్యః పాపహరా నృణామ్ ॥ 35 ॥**

తాపి, పయోష్ణి, నిర్వింధ్య, శీఘ్రోద అనే మహానది విన్న వైతరణి, బలాకా, కుమద్వతి, మహాగౌరి, దుర్గ, అంతశ్శిల అనే నదులు వింధ్యపర్వత పాదాలనుండి బయలుదేరేవి. నరుల పాపాలను వెంటనే నశింపచేసేవి.

**గోదావరీ భీమరథీ కృష్ణవేణీ చ వశ్యతా।**
**తుంగభద్రా సుప్రయోగా కావేరీ చ ద్విజోత్తమాః ॥ 36 ॥**

**దక్షిణాపథనద్యస్తు సహ్యపాదాద్వినిఃసృతాః ।**
**ఋతుమాలా తామ్రపర్ణీ పుణ్యవత్యుత్పలావతీ ॥ 37 ॥**

బ్రాహ్మణోత్తములారా! గోదవరి, భీమరథి, కృష్ణవేణి, వశ్యత, తుంగభద్ర, సుప్రయోగ, కావేరి అనేవి సహ్యపర్వత పాదప్రదేశంనుండి బయలుదేరిన దక్షిణాపథనదులు. ఋతుమాల, తామ్రపర్ణి, పుణ్యవతి, ఉత్పలావతి అనే నదులు.

**మలయాన్నిఃసృతా నద్యః సర్వాః శీతజలాః స్మృతాః ।**
**ఋషికుల్యా త్రిసామా చ గన్ధమాదనగామినీ ॥ 38 ॥**

మలయపర్వతం నుండి బయలుదేరినవి. ఇవన్నీ చల్లని నీరుకల ప్రసిద్ధనదులు. ఋషికుల్య త్రిసామ అనేవి గంధమాదన పర్వతాశ్రయాలు.

**క్షిప్రా పలాశినీ చైవ ఋషీకా వంశధారిణీ ।**
**శుక్తిమత్పాదసఞ్జాతాః సర్వపాపహరా నృణామ్ ॥ 39 ॥**

క్షిప్ర, పలాశిని, ఋషీక, వంశధారిణి అనే నదులు శుక్తిమత్ పర్వత పాదంలో పుట్టినవి. ఇవి మనుజుల పాపాలన్నింటిని నశింపచేసేవి.

**ఆసాం నద్యుపనద్యశ్చ శతశో ద్విజపుఙ్గవాః ।**
**సర్వపాపహరాః పుణ్యాః స్నానదానాదికర్మసు ॥ 40 ॥**

విప్రులారా! ఈ నదులకు ఉపనదులు వందలకొలది ఉన్నవి. అవన్నీ పుణ్యప్రదాలే. స్నానదానాదికర్మల వల్ల అన్ని పాపాలను తొలగించేవే.

**తాస్విమే కురుపాఞ్చాలా మధ్యదేశాదయో జనాః ।**
**పూర్వదేశాదికాశ్చైవ కామరూపనివాసినః ॥ 41 ॥**

**పుణ్డ్రాః కలింగా మగధా దాక్షిణాత్యాశ్చ కృత్స్నశః ।**
**తథా పరాన్తాః సౌరాష్ట్రశూద్రాహీనాఽస్తథాఽర్బుదాః ॥ 42 ॥**

**మాలకా మలపాశ్చైవ పారియాత్రనివాసినః ।**
**సౌవీరాః సైన్ధవా హూణా మాల్యా బాల్యా నివాసినః ॥ 43 ॥**

వానిలో కురుపాంచాల దేశాల మధ్యదేశం మొదలైన వాని తూర్పుదేశ ప్రాంతాల జనులు కామరూప దేశమందలి ప్రజలు, పుండ్రులు, కలింగులు, మగధులు సంపూర్ణ దక్షిణ ప్రాంతజనులు. అపరాంత దేశవాసులు సౌరాష్ట్ర శూద్రులు, అర్బుదులు తక్కువ జాతి ప్రజలు. మాలకులు, మలకులు పారియాత్రమందు నివసించేవారు సౌవీరులు, సింధు ప్రాంతీయులు, హూణులు, మాల్యులు, బాల్యులు అక్కడ నివసించేవారు.

**మాద్రా రామాస్తథైవాన్ధ్రాః పారసీకాస్తథైవ చ ।**
**ఆసాం పిబన్తి సలిలం వసన్తి సరితాం సదా ॥ 44 ॥**

మాద్రులు, ఆంధ్రులు అట్లే పారశీకులు పూర్వం పేర్కొన్న నదుల నీటిని త్రాగుతారు. ఆ నదీతీరాల్లో నివసిస్తారు.

**చత్వారి భారతే వర్షే యుగాని కవయోఽబ్రువన్ ।**
**కృతం త్రేతా ద్వాపరఞ్చ కలిశ్చాన్యత్ర న క్వచిత్ ॥ 45 ॥**

భారతవర్షంలో నాలుగు యుగాలని పండితులు నిర్ణయించినారు. కృత త్రేతా ద్వాపర కలియుగాలని వానికి పేర్లు. అవి వేరే ఎక్కడా లేవు.

**యాని కింపురుషాద్యాని వర్షాణ్యష్టౌ మహర్షయః ।**
**న తేషు శోకో నాయాసో నోద్వేగః క్షుద్భయం న చ ॥ 46 ॥**

**స్వస్థాః ప్రజా నిరాతఙ్కాః సర్వదుఃఖవివర్జితాః ।**
**రమన్తే వివిధై ర్భావైః సర్వాశ్చ స్థిరయౌవనాః ॥ 47 ॥**

మహర్షులారా! కింపురుషవర్షం మొదలైన ఎనిమిదింటిలో శోకం, ఆయాసం, ఆకలి, ఉద్వేగం ఉండవు. అక్కడి ప్రజలు రోగరహితులై అన్ని దుఃఖాలనుండి విడివడి మంచిస్థితి కలవారుగా ఉంటారు. స్థిరమైన యౌవనం కల్గి వివిధభావాలతో విహరిస్తుంటారు.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనకోశవర్ణనం నామ సప్తచత్వారింశోఽధ్యాయః ॥ 47 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనకోశవర్ణనమనే నలబై ఏడవ అధ్యాయం ॥ 47 ॥

## అష్టచత్వారింశోఽధ్యాయః - నలబై ఎనిమిదవ అధ్యాయం

## జంబూ ద్వీప వర్ణనమ్ - జంబూద్వీపవర్ణనం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు

**హేమకూటగిరేః శృఙ్గే మహాకూటం సుశోభనమ్ ।**
**స్ఫాటికం దేవదేవస్య విమానం పరమేష్ఠినః ॥ 1 ॥**

హేమకూట పర్వత శిఖరంపైన మిక్కిలి మంగళకరమై స్ఫటిక రచితమై గొప్పదగు దేవదేవుడైన పరమేష్ఠి విమానమున్నది.

**తత్ర దేవాధిదేవస్య భూతేశస్య త్రిశూలినః ।**
**దేవాః సర్షిగణాః సిద్ధాః పూజాం నిత్యం ప్రకుర్వతే ॥ 2 ॥**

అక్కడ ఋషి సమూహంతో దేవతలు, సిద్ధులు, దేవాధిదేవుడు, త్రిశూలధారి, భూతపతి అయిన శివుని నిత్యం పూజిస్తుంటారు.

**స దేవ్యా గిరిశః సార్ధం మహాదేవో మహేశ్వరః ।**
**భూతైః పరివృతో నిత్యం భాతి తత్ర పినాకధృక్ ॥ 3 ॥**

ఆ శంకరుడు మహాదేవుడు పినాకమును ధరించి భూతగణం పరివేష్టించగా దేవితోకూడ ఎల్లపుడు ప్రకాశిస్తుంటాడు.

**విభక్తచారుశిఖరః కైలాసో యత్ర పర్వతః ।**
**నివాసః కోటియక్షాణాం కుబేరస్య చ ధీమతః ॥ 4 ॥**

వేరు వేరుగా అందమైన శిఖరాలున్న కైలాసపర్వతం కోటి సంఖ్యగల యక్షులకు, ధీమంతుడగు కుబేరునికి కూడ నివాసముగా ఉన్నది.

**తత్రాపి దేవదేవస్య భవస్యాయతనం మహత్ ।**
**మందాకినీ తత్ర పుణ్యా రమ్యా సువిమలోదకా ॥ 5 ॥**

అక్కడ కూడ దేవదేవుడగు ఈశ్వరుని గొప్పమందిరం కలదు. అక్కడ పుణ్యవతి అందము నిర్మలములైన జలాలుగల ఆకాశగంగ ఉన్నది.

**నదీ నానావిధైః పద్మైరనేకైః సమలంకృతా ।**
**దేవదానవగంధర్వయక్షరాక్షసకిన్నరైః ॥ 6 ॥**

**ఉపస్పృష్టజలా నిత్యం సుపుణ్యా సుమనోరమా ।**
**అన్యాశ్చ నద్యః శతశః స్వర్ణపద్మైరలంకృతాః ॥ 7 ॥**

ఆ నది అనేక విధాలైన పద్మాలతో అలంకృతమైనది. దేవతలు, రాక్షసులు, గంధర్వులు, దానవులు, కిన్నరులు సేవించే జలం కలదై మిక్కిలి పుణ్యదాయకము మనోహరమై ప్రకాశిస్తుంది. అక్కడ బంగారు కమలాలతో ఇతర నదులుకూడ వందల కొలది ఉన్నవి.

**తాసాం కూలే తు దేవస్య స్థానాని పరమేష్ఠినః ।**
**దేవర్షిగణజుష్టాని తథా నారాయణస్య తు ॥ 8 ॥**

**తస్యాపి శిఖరే శుభ్రం పారిజాతవనం శుభమ్ ।**
**తత్ర శక్రస్య విపులం భవనం రత్నమణ్డితమ్ ॥ 9 ॥**

ఆ నదుల తీరప్రదేశంలో భగవంతుడు పరమేష్ఠి స్థానాలున్నాయి. దేవఋషుల సమూహం సేవించే నారాయణ దేవునికి సంబంధించిన పారిజాత వనం ఆ పర్వత శిఖరంపై ఉన్నది. అందులో మణులలంకరించిన ఇంద్రభవనమున్నది.

**స్ఫాటికస్తంభసంయుక్తం హేమగోపురశోభితమ్ ।**
**తత్రాథ దేవదేవస్య విష్ణోర్విశ్వాత్మనః ప్రభోః ॥ 10 ॥**

**పుణ్యం చ భవనం రమ్యం సర్వరత్నోపశోభితమ్ ।**
**తత్ర నారాయణః శ్రీమాన్ లక్ష్మ్యా సహ జగత్పతిః ॥ 11 ॥**

స్ఫటికమణుల స్తంభాలతో, బంగారు గోపురాలతో ప్రకాశించే ఆ భవనంలో దేవుడు విశ్వరూపుడు ప్రభువు అయిన విష్ణువు మందిరం పుణ్యము, మనోహరము, సర్వరత్న శోభితమై ఉన్నది. దానిలో లోకాలకు ప్రభువు శ్రీమంతుడైన నారాయణుడు లక్ష్మీ దేవితో నివసిస్తుంటాడు.

**ఆస్తే సర్వేశ్వరః శ్రేష్ఠః పూజ్యమానః సనాతనః ।**
**తథా చ వసుధారే తు వసూనాం రత్నమణ్డితమ్ ॥ 12 ॥**

**స్థానానాముత్తమం పుణ్యం దురాధర్షం సురద్విషామ్ ।**
**రత్నధారే గిరివరే సప్తర్షీణాం మహాత్మనామ్ ॥ 13 ॥**

**సప్తాశ్రమాణి పుణ్యాని సిద్ధావాసైర్యుతాని చ ।**
**తత్ర హైమం చతుర్ద్వారం వజ్రనీలాదిమణ్డితమ్ ॥ 14 ॥**

**సుపుణ్యం సదవస్థానం బ్రహ్మణోఽవ్యక్తజన్మనః ।**
**తత్ర దేవర్షయో విప్రాః సిద్ధా బ్రహ్మర్షయోఽపరే ॥ 15 ॥**

**ఉపాసతే దేవదేవం పితామహమజం పరమ్ ।**

అతడు సర్వేశ్వరుడు ఉత్తముడు పూజ్యుడు సనాతనుడు కూడ. అదే విధంగా వసుధార అనే ప్రదేశంలో మణులలంకరించినది వసువుల పుణ్యకరమైనది. రాక్షసులెదుర్కొనలేని ఉత్తమస్థానమున్నది. రత్నధారమనే పర్వత శ్రేష్ఠంలో మహాత్ములైన సప్తర్షుల పుణ్యకరాలు, ఏడాశ్రమాలు సిద్ధుల నివాసాలతో కూడి ఉన్నవి. అక్కడ సువర్ణ నిర్మితము నాల్గుద్వారాలు వజ్రాలు నీలమణులు మొదలైన వాటితో అలంకృతాలు, మిక్కిలి పుణ్యదాయకమై పుట్టుక తెలియని బ్రహ్మనివాస స్థానమున్నది. అక్కడ దేవర్షులు బ్రాహ్మణులు సిద్ధులు ఇతర బ్రహ్మర్షులును దేవదేవుడు పితామహుడు అజుడు అయిన బ్రహ్మను పూజిస్తుంటారు:

**సర్వైః సమ్పూజితో నిత్యం దేవ్యా సహ చతుర్ముఖః ॥ 16 ॥**

**ఆస్తే హితాయ లోకానాం శాన్తానాం పరమా గతిః ।**

ఎల్లపుడు అందరు పూజింపగా దేవితో కూడ బ్రహ్మ శాంతులైన యోగులకు పరమప్రాప్యుడై లోకాల హితం కోరి నివసిస్తుంటాడు.

**తస్యైక శృఙ్గశిఖరే మహాపద్మైరలంకృతే ॥ 17 ॥**

**స్వచ్ఛామృతజలం పుణ్యం సుగన్ధం సుమహత్సరః ।**
**జైగీషవ్యాశ్రమం పుణ్యం యోగీన్ద్రైరుపసేవితమ్ ॥ 18 ॥**

ఆ ప్రాంతపు ఒక శిఖరంపై భాగంలో శ్రేష్ఠమైన పద్మాలు కలది నిర్మలమైన అమృతపు నీరు కలది పుణ్యకరం మంచి పరిమళం కల గొప్ప కొలనున్నది. అక్కడ యోగీశ్వరులు సేవిస్తున్న జైగీషవ్యాశ్రమం పుణ్యప్రదమై ఉన్నది.

**తత్రాఽఽస్తే భగవాన్నిత్యం సర్వశిష్యైః సమావృతః ।**
**ప్రశాన్తదోషైరక్షుద్రైర్బ్రహ్మవిద్భిర్మహాత్మభిః ॥ 19 ॥**

భగవంతుడు జైగీషవ్యుడు శిష్యులతో అక్కడ ఎల్లపుడు నివసిస్తుంటాడు. ఆ శిష్యులు, దోషరహితులు, ఉత్తములు, బ్రహ్మజ్ఞానం కల మహాత్ములు.

**శంఖో మనోహరశ్చైవ కౌశికః కృష్ణ ఏవ చ ।**
**సుమనా వేదవాదశ్చ శిష్యాస్తస్య ప్రసాదతః ॥ 20 ॥**

**సర్వయోగరతాః శాన్తా భస్మోద్ధూలితవిగ్రహాః ।**
**ఉపాసతే మహాచార్యా బ్రహ్మవిద్యాపరాయణాః ॥ 21 ॥**

శంఖుడు, మనోహరుడు, కౌశికుడు, కృష్ణుడు, సుమనసుడు, వేదవాదుడు ఆ మహాత్ముని శిష్యులు. ఆయన అనుగ్రహంవల్ల సర్వయోగరతులు, శాంతులు, భస్మమలదుకున్న శరీరులు, వేదాంత విద్యానిష్ఠులు, గొప్ప ఆచార్యులు సేవిస్తుంటారు.

**తేషామనుగ్రహార్థాయ యతీనాం శాన్తచేతసామ్ ।**
**సాన్నిధ్యం కురుతే భూయో దేవ్యా సహ మహేశ్వరః ॥ 22 ॥**

వారందరిని అనుగ్రహించటానికి మహేశ్వరుడు దేవితో కూడ శాంతమనస్కులైన ఆ యోగులకు సాన్నిధ్యాన్ననుగ్రహించి వసిస్తున్నాడు.

**అనేకాన్యాశ్రమాణి స్యుస్తస్మిన్ గిరివరోత్తమే ।**
**మునీనాం యుక్తమనసాం సరాంసి సరితస్తథా ॥ 23 ॥**

ఆ పర్వత శ్రేష్ఠంలో ఆశ్రమాలనేకమున్నాయి. యోగనిష్ఠులైన మునులకు సంబంధించినవవి. సరస్సులు సెలయేర్లు కూడా ఉన్నాయి.

**తేషు యోగరతా విప్రా జాపకాః సంయతేన్ద్రియాః ।**
**బ్రహ్మణ్యాసక్తమనసో రమన్తే జ్ఞానతత్పరాః ॥ 24 ॥**

ఆ ఆశ్రమాల్లో యోగతత్పరులు, జపనిష్ఠులు, జితేంద్రియులు పరబ్రహ్మమందు మనసులగ్నం చేసినవారు. జ్ఞానతత్పరులైన బ్రాహ్మణులు సంతోషంతో కాలం గడుపుతున్నారు.

**ఆత్మన్యాత్మానమాధాయ శిఖాన్తే పర్యవస్థితమ్ ।**
**ధ్యాయన్తి దేవమీశానం యేన సర్వమిదం తతమ్ ॥ 25 ॥**

ఆత్మయందాత్మను నిలిపి శిఖాగ్ర భాగంలో నిలిచిన దేవుని ఈ విశ్వమంతా వ్యాప్తమైయున్న ఆ ఈశ్వరునే ధ్యానిస్తుంటారు.

**సుమేఘం వాసవస్థానం సహస్రాదిత్యసన్నిభమ్ ।**
**తత్రాఽఽస్తే భగవానిన్ద్రః శచ్యా సహ సురేశ్వరః ॥ 26 ॥**

వేయిమంది సూర్యులతో సమానమైన కాంతిగల సుమేఘమనే వాసవస్థానంలో భగవంతుడు ఇంద్రుడు శచీదేవితో కూడ నివసిస్తుంటాడు.

**గజశైలే తు దుర్గాయా భవనం మణితోరణమ్ ।**
**ఆస్తే భగవతీ దుర్గా తత్ర సాక్షాన్మహేశ్వరీ ॥ 27 ॥**

గజశైలంలో మణితోరణమున్న దుర్గాదేవి భవనమున్నది. అక్కడ సాక్షాత్తు మహేశ్వరి అయిన దుర్గాదేవి నివసించుచున్నది.

**ఉపాస్యమానా వివిధైః శక్తిభేదైరితస్తతః ।**
**పీత్వా యోగామృతం లబ్ధ్వా సాక్షాదమృతమైశ్వరమ్ ॥ 28 ॥**

ఆమె వివిధాలైన శక్తిభేదాలతో అన్నివైపుల సేవింపబడుతూ యోగమనే అమృతాన్ని పానంచేసి ఐశ్వరమైన అమృతాన్ని పొందియున్నది.

**సునీలస్య గిరేః శృఙ్గే నానాధాతుసముజ్జ్వలే ।**
**రాక్షసానాం పురాణి స్యుః సరాంసి శతశో ద్విజాః ॥ 29 ॥**

అనేక ధాతువులతో ప్రకాశించే సునీలపర్వత శిఖరంలో రాక్షసుల పట్టణాలు వందల సంఖ్యలో గలవు.

**తథా పురశతం విప్రాః శతశృఙ్గే మహాచలే ।**
**స్ఫాటికస్తంభసంయుక్తం యక్షాణామమితౌజసామ్ ॥ 30 ॥**

విప్రులారా! శతశృంగమనే పెద్ద పర్వతంపైన స్ఫటికమణిస్తంభాలుకల పట్టణాలు బలశాలురైన యక్షులవెన్నో కలవు.

**శ్వేతోదరగిరేః శృఙ్గే సుపర్ణస్య మహాత్మనః ।**
**ప్రాకారగోపురోపేతం మణితోరణమణ్డితమ్ ॥ 31 ॥**

**స తత్ర గరుడః శ్రీమాన్ సాక్షాద్విష్ణురివాపరః ।**
**ధ్యాత్వా తత్పరమం జ్యోతిరాత్మన్యేవమథావ్యయమ్ ॥ 32 ॥**

శ్వేతోదర పర్వతశిఖరంపై ప్రాకారాలు, గోపురాలు, మణితోరణాలు గల మహాత్ముడు గరుడుని పురమున్నది. అక్కడ శ్రీమంతుడైన గరుడుడు సాక్షాత్తు రెండవ విష్ణువువలె ఆ పరంజ్యోతిని ధ్యానించి అజుడైన పరబ్రహ్మాను ఆత్మలో ధ్యానిస్తూ నివసిస్తుంటాడు.

**అన్యచ్చ భవనం పుణ్యం శ్రీశృఙ్గే మునిపుఙ్గవాః ।**
**శ్రీదేవ్యాః సర్వరత్నాఢ్యం హైమం సమణితోరణమ్ ॥ 33 ॥**

మునిపుంగవులారా! శ్రీశృంగమందు సమస్తరత్నసంపన్నము, హిరణ్మయము, మణితోరణం కల లక్ష్మీదేవి మరో మందిరమున్నది.

**తత్ర సా పరమా శక్తిర్విష్ణోరతిమనోరమా ।**
**అనంతవిభవా లక్ష్మీర్జగత్సంమోహనోత్సుకా ॥ 34 ॥**

**అధ్యాస్తే దేవగన్ధర్వసిద్ధచారణవన్దితా ।**
**విచిన్త్యా జగతో యోనిః స్వశక్తికిరణోజ్జ్వలా ॥ 35 ॥**

అక్కడ విష్ణువునకు ప్రీతిపాత్రురాలై పరమశక్తిరూప, అనంత వైభవోపేతయగు లక్ష్మీదేవి జగత్తును సంమోహ పరచుటలో ఆసక్తిగలదై దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులచే పూజలందుతూ లోకానికి కారణభూతురాలై తనశక్తికిరణాలతో ప్రకాశిస్తున్నది.

**తత్రైవ దేవదేవస్య విష్ణోరాయతనం మహత్ ।**
**సరాంసి తత్ర చత్వారి విచిత్రకమలాశయాః ॥ 36 ॥**

అక్కడనే దేవదేవుడగు విష్ణుని మందిరం ఉన్నది. విచిత్రపద్మాశ్రయాలైన నాలుగు సరస్సులున్నవి.

**తథా సహస్రశిఖరే విద్యాధరపురాష్టకమ్ ।**
**రత్నసోపానసంయుక్తం సరోభిశ్చోపశోభితమ్ ॥ 37 ॥**

అట్లే సహస్రశిఖర పర్వతంపై విద్యాధరుల ఎనిమిది పట్టణాలున్నవి. మణిసోపానములుగల కొలనులతో ఆ పట్టణ సముదాయం ప్రకాశిస్తున్నది.

**సద్యో విమలపానీయాశ్చిత్రనీలోత్పలాకరాః ।**
**కర్ణికారవనం దివ్యం తత్రాఽఽస్తే శంకరః స్వయమ్ ॥ 38 ॥**

నిర్మలమైన జలం గల నదులు విచిత్రమైన నల్లకలువలకాశ్రయాలై ఉన్నాయి. ఒక కర్ణికారవనం కూడా ఉన్నది. అక్కడ శంకరుడు స్వయంగా నివసిస్తాడు.

**పారిజాతే మహాలక్ష్మ్యాః పర్వతే తు పురం శుభమ్ ।**
**రమ్యప్రాసాదసంయుక్తం ఘంటాచామరభూషితమ్ ॥ 39 ॥**

**నృత్యద్భిరప్సరస్సంఘైరితశ్చేతశ్చ శోభితమ్ ।**
**మృదఙ్గ ప్రణవోద్ఘుష్టం వేణువీణానినాదితమ్ ॥ 40 ॥**

**గన్ధర్వకిన్నరాకీర్ణం సంవృతం సిద్ధపుఙ్గవైః ।**
**భాస్వద్భిర్భృశమాయుక్తం మహాప్రాసాదసఙ్కులమ్ ॥ 41 ॥**

**మహాగణేశ్వరైర్జుష్టం ధార్మికాణాం సుదర్శనమ్ ।**
**తత్ర సా వసతే దేవీ నిత్యం యోగపరాయణా ॥ 42 ॥**

పారిజాతపర్వతంపై మహాలక్ష్మియొక్క మంగళకరమైన పట్టణమున్నది. అది అందమైన ప్రాసాదాలు, ఘంటలు, చామరాలతో అలంకరింపబడినది. అంతేగాక నాట్యంచేసే అప్సరససమూహాల మృదంగ, పణవ వాద్యధ్వని, వేణువు వీణానాదాలు వినిపిస్తాయి. గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు నిండిన గొప్ప ప్రాసాదాలతో అది ప్రకాశిస్తుంది. ఆ పురం మహాగణేశ్వరులతో ధర్మాత్ములకు దర్శనీయమైనది. లక్ష్మీదేవి అచ్చోట యోగపరాయణురాలై ఎల్లపుడు నివసిస్తుంది.

**మహాలక్ష్మీర్మహాదేవీ త్రిశూలవరధారిణీ ।**
**త్రినేత్రా సర్వశక్త్యౌఘసంవృతా సా చ తన్మయీ ॥ 43 ॥**

ఆ మహాలక్ష్మి మహాదేవిగా త్రిశూలాన్ని ధరించి, మూడు కన్నులు గలదై, సమస్తశక్తులతో నిండి తన్మయరూపంతో ప్రకాశిస్తుంది.

**పశ్యన్తి తత్ర మునయః సిద్ధా యే బ్రహ్మవాదినః ।**
**సుపార్శ్వస్యోత్తరే భాగే సరస్వత్యాః పురోత్తమమ్ ॥ 44 ॥**

సుపార్శ్వపర్వతానికి ఉత్తరభాగంలో సరస్వతియొక్క ఉత్తమపురం ఉన్నది. దానిని సిద్ధులు బ్రహ్మవాదులైన మునులు దర్శిస్తారు.

**సరాంసి సిద్ధజుష్టాని దేవభోగ్యాని సత్తమాః ।**
**పాణ్డురస్య గిరేః శృఙ్గే విచిత్రద్రుమసఙ్కులమ్ ॥ 45 ॥**

**గన్ధర్వాణాం పురశతం దివ్యస్త్రీభిః సమావృతమ్ ।**
**తత్ర నిత్యం మదోత్సిక్తా నరా నార్యస్తథైవ చ ॥ 46 ॥**

**క్రీడన్తి ముదితా నిత్యం విలాసైర్భోగతత్పరాః ।**

మునులారా! సిద్ధులు సేవించే దేవతానుభవయోగ్యాలైన కొలనులు అక్కడ ఉన్నవి. పాండరగిరిశిఖరంపై వైచిత్రిగల వృక్షాలున్నవి. దేవతాస్త్రీలు నిండుగా ఉన్న గంధర్వుల పట్టణాలు వంద కలవు. అక్కడ ఎప్పుడూ మదప్రేరితులైన పురుషులు, స్త్రీలు సుఖాసక్తి కల్గి సంతోషచిత్తులై విలాసంగా విహరిస్తుంటారు.

**అంజనస్య గిరేః శృఙ్గే నారీపురమనుత్తమమ్ ॥ 47 ॥**

**వసన్తి తత్రాప్సరసో రమ్భాద్యా రతిలాలసాః ।**
**చిత్రసేనాదయో యత్ర సమాయాన్త్యర్థినః సదా ॥ 48 ॥**

అంజన పర్వత శిఖరంపైన శ్రేష్ఠమైన నారీపురమున్నది. అక్కడ శృంగార క్రీడాసక్తలైన రంభాద్యప్సరసలు నివసిస్తారు. వారి సమాగమాన్ని కోరి చిత్రసేనుడు మొదలైన గంధర్వరాజులెల్లపుడు వస్తుంటారు.

**సా పురీ సర్వరత్నాఢ్యా నైకప్రస్రవణైర్యుతా ।**
**అనేకాని పురాణి స్యుః కౌముదే చాపి సత్తమాః ॥ 49 ॥**

ఆ పట్టణం సర్వరత్నసంపూర్ణమైనది. అందు అనేక జలాశయాలున్నవి. విప్రులారా! కౌముద పర్వతంలో అనేక పురాలున్నాయి.

**రుద్రాణాం శాన్తరజసామీశ్వరాసక్తచేతసామ్ ।**
**తేషు రుద్రా మహాయోగా మహేశాన్తరచారిణః ॥ 50 ॥**

**సమాసతే పురం జ్యోతిరారూఢాః స్థానమైశ్వరమ్ ।**

అవి రజోగుణం తొలగి ఈశ్వరలగ్నమైన రుద్రగణాలకు చెందినవి. ఆ పట్టణాల్లో గొప్పయోగులు మహేశ్వరునకు ఆంతరంగికులు అనుచరులైన రుద్రగణాలవారు ఐశ్వరస్థానాన్నధిరోహించి తేజోరూపమైన పురాన్నాశ్రయించి ఉంటారు.

**పింజరస్య గిరేః శృఙ్గే గణేశానాం పురత్రయమ్ ॥ 51 ॥**

**నందీశ్వరస్య కపిలా తత్రాఽఽస్తే స మహామతిః ।**
**తథా చ జారుధేః శృఙ్గే దేవదేవస్య ధీమతః ॥ 52 ॥**

**దీప్తమాయతనం పుణ్యం భాస్కరస్యామితౌజసః ।**
**తస్యైవోత్తరదిగ్భాగే చన్ద్రస్థానమనుత్తమమ్ ॥ 53 ॥**

పింజరమనే పర్వత శిఖరంపై గణేశుల మూడు పట్టణాలున్నాయి. నందీశ్వరుని కపిలధేనువు అక్కడ ఉంటుంది. ఆ నందీశ్వరుడు గొప్పబుద్ధిమంతుడు. జారుధి పర్వతశృంగంలో దేవదేవుడు, ధీమంతుడు, అమితబలం కల సూర్యుని పుణ్యకరమైన నివాసస్థానమున్నది. దానికి ఉత్తరదిక్కున సర్వ శ్రేష్ఠమైన చంద్రుని స్థానమున్నది.

**వసతే తత్ర రమ్యాత్మా భగవాన్ శాన్తదీధితిః ।**
**అన్యత్ర భవనం దివ్యం హంసశైలే మహర్షయః ॥ 54 ॥**

**సహస్రయోజనాఽఽయామం సువర్ణమణితోరణమ్ ।**
**తత్రాఽఽస్తే భగవాన్ బ్రహ్మా సిద్ధసంఘైరభిష్టుతః ॥ 55 ॥**

అక్కడ పూజ్యుడు అందమైన రూపంతో చల్లని కిరణాలుగల చంద్రుడు నివసిస్తాడు. మహర్షులారా! మరోచోట హంసశైలంలో దివ్యము వేయియోజనాల పొడవుకల్గి బంగారం మణులుకూర్చిన తోరణాలు కల భవనమున్నది. అందులో భగవానుడైన బ్రహ్మ సిద్ధులసమూహం కొనియాడగా కొలువై ఉంటాడు.

**సావిత్ర్యా సహ విశ్వాత్మా వాసుదేవాదిభిర్యుతః ।**
**తస్య దక్షిణదిగ్భాగే సిద్ధానాం పురముత్తమమ్ ॥ 56 ॥**

**సనందనాదయో యత్ర వసన్తి మునిపుఙ్గవాః ।**
**పఞ్చశైలస్య శిఖరే దానవానాం పురత్రయమ్ ॥**

**నాతిదూరేణ తస్మాచ్చ దైత్యాచార్యస్య ధీమతః । 57 ॥**

విశ్వాత్మకుడైన బ్రహ్మ, విష్ణుదేవుడు మొదలైన వారితో కూడి సావిత్రీదేవితో సహ అక్కడ నివసిస్తాడు. దానికి దక్షిణంవైపున సిద్ధుల శ్రేష్ఠమైన నగరమున్నది. పంచశైల శిఖరంపై దానవుల మూడు పట్టణాలున్నాయి. వానికి కొద్దిదూరంలో బుద్ధిమంతుడు, రాక్షసగురువు శుక్రాచార్యుని నివాసస్థానం కలదు.

**సుగన్ధశైలశిఖరే సరిద్భిరుపశోభితమ్ ॥ 58 ॥**
**కర్దమస్యాశ్రమం పుణ్యం తత్రాఽఽస్తే భగవానృషిః ।**

**తస్యైవ పూర్వదిగ్భాగే కిఞ్చిద్వై దక్షిణాశ్రితే ॥ 59 ॥**
**సనత్కుమారో భగవాంస్తత్రాఽఽస్తే బ్రహ్మవిత్తమః ।**

సుగంధపర్వతశృంగంపై నదులతో ప్రకాశించే కర్దముని పుణ్యాశ్రమమున్నది. అక్కడ భగవానుడైన కర్దమ ఋషి నివసిస్తాడు. దానికి తూర్పుదిక్కున కొంచెం దక్షిణ భాగాన్నాశ్రయించిన ప్రదేశంలో పూజ్యుడు బ్రహ్మవేత్తల్లో ఉత్తముడు సనత్కుమారుడు నివసిస్తాడు.

**సర్వేష్వేతేషు శైలేషు తథాఽన్యేషు మునీశ్వరాః ॥ 60 ॥**

**సరాంసి విమలా నద్యో దేవానామాలయాని చ ।**
**సిద్ధలింగాని పుణ్యాని మునిభిః స్థాపితాని చ ॥ 61 ॥**

ఓమునీంద్రులారా! ఈ అన్నిపర్వతాల్లోను ఇతరమైన ప్రదేశాల్లోను, కొలనులు, నిర్మలాలైన నదులు, దేవతామందిరాలు పుణ్యదాయకాలైనవి. మునులు ప్రతిష్ఠించిన సిద్ధలింగాలు ఉన్నాయి.

**తాని చాఽఽయతనాన్యాశు సంఖ్యాతుం నైవ శక్యతే ।**
**ఏష సంక్షేపతః ప్రోక్తో జమ్బూద్వీపస్య విస్తరః ।**

**న శక్యో విస్తరాద్వక్తుం మయా వర్షశతైరపి । 62 ॥**

ఈ మందిరాలను శీఘ్రంగా లెక్కింపలేము. ఇంతవరకు జంబూద్వీపవిస్తారాన్ని గూర్చి సంక్షేపంగా వివరించినాను. ఇంతకంటె విపులంగా నూరుసంవత్సరాలైనా చెప్పటానికి నాశక్తి చాలదు.

**ఇతి శ్రీకూర్మపురాణే జమ్బూద్వీపవర్ణనం నామ అష్ట చత్వారింశోఽధ్యాయః ॥ 48 ॥**

శ్రీకూర్మపురాణంలో జంబూద్వీపవర్ణనమనే నలభై ఎనిమిదవ అధ్యాయం ॥ 48 ॥

## ఏకోనపఞ్చాశోఽధ్యాయః - నలబై తొమ్మిదవ అధ్యాయం

## భువనకోశ విన్యాసవర్ణనమ్ - భువనకోశ విన్యాసవర్ణనం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు.

**జమ్బూద్వీపస్య విస్తారాద్ద్విగుణేన సమన్తతః ।**
**సంవేష్టయిత్వా క్షీరోదం ప్లక్షద్వీపో వ్యవస్థితః ॥ 1 ॥**

**ప్లక్షద్వీపే చ విప్రేన్ద్రాః సప్తాఽఽసన్కులపర్వతాః ।**
**సిద్ధాయుతాః సుపర్వాణః సిద్ధసఙ్ఘనిషేవితాః ॥ 2 ॥**

క్షీరసముద్రాన్ని చుట్టి వ్యాపించి జంబూద్వీప వైశాల్యానికి రెట్టింపు ప్లక్షద్వీపం నెలకొన్నది. విప్రేంద్రులారా! ప్లక్షద్వీపంలో ఏడు కులపర్వతాలున్నవి. సిద్ధులసమూహం సేవించగా దేవతలచట వేలకొలది ఉంటారు.

**గోమేదః ప్రథమస్తేషాం ద్వితీయశ్చన్ద్ర ఉచ్యతే ।**
**నారదో దున్దుభిశ్చైవ మణిమాన్మేఘనిఃస్వనః ॥ 3 ॥**

**వైభ్రాజః సప్తమస్తేషాం బ్రహ్మణోఽత్యన్తవల్లభః ।**
**తత్ర దేవర్షిగన్ధర్వైః సిద్ధైశ్చ భగవానజః ॥ 4 ॥**

**ఉపాస్యతే స విశ్వాత్మా సాక్షీ సర్వస్య విశ్వదృక్ ।**
**తేషు పుణ్యా జనపదా ఆధయో వ్యాధయో న చ ॥ 5 ॥**

ఆ పర్వతాలలో మొదటిది గోమేదము. రెండవది చంద్రపర్వతం. నారదం, దుందుభి, మణిమంతం, మేఘనిఃస్వనమని మరి నాలుగు పర్వతాలు. వానిలో ఏడవది వైభ్రాజ పర్వతం. అది బ్రహ్మకు మిక్కిలి ప్రియ మైనది. అక్కడ భగవానుని బ్రహ్మదేవుని దేవతలు, ఋషులు, గంధర్వులు, సిద్ధులు సేవిస్తుంటారు. ఆయన విశ్వస్వరూపుడు. సమస్తానికి సాక్షి. విశ్వదర్శనుడు. అక్కడి జనపదాలు పవిత్రాలు. ఆధివ్యాధులచట ఉండవు.

**న తత్ర పాపకర్తారః పురుషా వై కథఞ్చన ।**
**తేషాం నద్యశ్చ సప్తైవ వర్షాణాం తు సముద్రగాః ॥ 6 ॥**

**తాసు బ్రహ్మర్షయో నిత్యం పితామహముపాసతే ।**

పాపం చేసేవారచట లేరు. ఆ వర్షాలకు సముద్రాన్ని చేరుకొనే నదులు కూడ ఏడున్నవి. ఆ నదుల్లో బ్రహ్మర్షులు ఎప్పుడూ బ్రహ్మదేవుని పూజిస్తారు.

**అనుతప్తా శిఖా చైవ విపాపా త్రిదివా కృతా ॥ 7 ॥**

**అమృతా సుకృతా చైవ నామతః పరికీర్తితాః ।**
**క్షుద్రనద్యస్తు విఖ్యాతాః సరాంసి చ బహూన్యపి ॥ 8 ॥**

ఆ నదులు అనుతప్త, శిఖ, విపాప, త్రిదివ, కృత. అమృత, సుకృత అనే పేర్లు గలవి. ఇంకా ప్రసిద్ధమైన చిన్న నదులు, సరస్సులు కూడ చాల కలవు.

**న చైతేషు యుగావస్థా పురుషా వై చిరాయుషః ।**
**ఆర్యకాః కురురాశ్చైవ విదేహా భావినస్తథా ॥ 9 ॥**

**బ్రహ్మక్షత్రియవిట్ఛూద్రాస్తస్మిన్ ద్వీపే ప్రకీర్తితాః ।**
**ఇజ్యతే భగవానీశో వర్ణైస్తత్ర నివాసిభిః ॥ 10 ॥**

ఆ వర్షాల్లో యుగవ్యవస్థ లేదు. అక్కడ పురుషులు దీర్ఘకాలం జీవిస్తారు. ఆర్యకులు, కురురులు, విదేహులు, భావులు అని వారిని పిలుస్తారు. ఆ ద్వీపంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతుల వారట్లా పిలువబడతారు. అక్కడ జనులు భగవంతుడైన ఈశ్వరుని పూజిస్తారు.

**తేషాం చ సోమసామ్రాజ్యం సారూప్యం మునిపుఙ్గవాః ।**
**సర్వే ధర్మరతా నిత్యం సర్వే ముదితమానసాః ॥ 11 ॥**

మునులారా! అక్కడి వారు సోముని సారూప్యాన్ని, సామ్రాజ్యాన్ని పొందుతారు. ధర్మమందు శ్రద్ధ కలవారు, సంతోషచిత్తులు.

**పఞ్చ వర్షసహస్రాణి జీవన్తి చ నిరామయాః ।**
**ప్లక్షద్వీపప్రమాణస్తు ద్విగుణేన సమన్తతః ॥ 12 ॥**

**సంవేష్ట్యేక్షురసామ్భోధిం శాల్మలిః సంవ్యవస్థితః ।**
**సప్త వర్షాణి తత్రాపి సప్తైవ కులపర్వతాః ॥ 13 ॥**

అక్కడి జనులు రోగాలు లేక ఐదువేలేండ్లు జీవిస్తారు. ప్లక్షద్వీపానికి చుట్టు పరిమాణానికి రెండింతలపరిమాణ మున్నది. ఇక్షురససముద్రాన్ని చుట్టుకొని శాల్మలిద్వీపమున్నది. దానిలోకూడ సప్తవర్షాలు సప్తకులపర్వతాలే ఉన్నవి.

**ఋజ్వాయతాః సుపర్వాణః సప్త నద్యశ్చ సువ్రతాః ।**
**కుముదశ్చాన్నదశ్చైవ తృతీయశ్చ బలాహకః ॥ 14 ॥**

**ద్రోణః కంసస్తు మహిషః కకుద్మాన్ సప్తమస్తథా ।**
**యోనీ తోయా వితృష్ణా చ చన్ద్రా శుక్లా విమోచనీ ॥ 15 ॥**

**నివృత్తిశ్చేతి తా నద్యః స్మృతా పాపహరా నృణామ్ ।**
**న తేషు విద్యతే లోభః క్రోధో వా ద్విజసత్తమాః ॥ 16 ॥**

అక్కడ దేవతలు పొడవైనవారు, ఋజువర్తనులు. నదులు ఏడున్నవి. ఆ పర్వతాల పేర్లు వరుసగా కుముదము, అన్నదము, బలాహకము. ద్రోణము, కంసము, మహిషము, కకుద్మంత మనేవి ఏడు. యోని, తోయ, వితృష్ణ, చంద్ర, శుక్ల, విమోచని, నివృత్తి ఆ నదులపేర్లు. అవి మనుష్యుల పాపాలను పోగొడ్తాయి. బ్రాహ్మణోత్తములారా! అక్కడ జనుల్లో లోభంకాని, క్రోధం కాని ఉండవు.

**న చైవాస్తి యుగావస్థా జనా జీవన్త్యనామయాః ।**
**యజన్తి సతతం తత్ర వర్ణా వాయుం సనాతనమ్ ॥ 17 ॥**

యుగవ్యవస్థ లేదు. ప్రజలు రోగబాధలు లేక జీవిస్తారు. అచటి వర్ణాల జనులు ఎల్లపుడు సనాతనుడైన వాయుదేవుని పూజిస్తారు.

**తేషాం తత్సాధనం యుక్తం సారూప్యం చ సలోకతా ।**
**కపిలా బ్రాహ్మణాః ప్రోక్తా రాజానశ్చారుణాస్తథా ।**

**పీతా వైశ్యాః స్మృతాః కృష్ణా ద్వీపేఽస్మిన్ వృషలా ద్విజాః ॥ 18 ॥**

వారికి వాయుదేవుని సారూప్యం సలోకత్వం తగిన సాధనవల్ల లభిస్తుంది. అక్కడి బ్రాహ్మణులు కపిలులనబడతారు. క్షత్రియులు అరుణులు. వైశ్యులు పీతులు, శూద్రులు కృష్ణులు అనబడతారు.

**శాల్మలస్య తు విస్తారాద్ద్విగుణేన సమన్తతః ॥ 19 ॥**

**సంవేష్ట్య తు సురోదాబ్ధిం కుశద్వీపో వ్యవస్థితః ।**
**విద్రుమశ్చైవ హేమశ్చ ద్యుతిమాన్పుష్పవాంస్తథా ॥ 20 ॥**

**కుశేశయో హరిశ్చైవ మన్దరః సప్త పర్వతాః ।**

విప్రులారా! శాల్మలి ద్వీప విస్తారానికి రెండు రెట్లు దాని చుట్టూ సురాసముద్రం పరివేష్టించి కుశద్వీపమున్నది. అక్కడ విద్రుమం, హేమం, ద్యుతిమంతం, పుష్పవంతం, కుశేశయం, హరి, మందరం అనే ఏడు పర్వతాలున్నవి.

**ధూతపాపా శివా చైవ పవిత్రా సమ్మితా తథా ॥ 21 ॥**

**తథా విద్యుత్ప్రభా రామా మహానద్యశ్చ సప్త వై ।**
**అన్యాశ్చ శతశో విప్రా నద్యో మణిజలాః శుభాః ॥ 22 ॥**

ధూతపాప, శివ, పవిత్ర, సమ్మిత, విద్యుత్ప్రభ, రామ, మహానది అనే నదులేడున్నవి. ద్విజులారా! ఇవికాక నిర్మలజలంకల వందల నదులు కూడ శుభకరాలైనవి ఉన్నవి.

**తాస్తు బ్రహ్మాణమీశానం దేవాద్యాః పర్యుపాసతే ।**
**బ్రాహ్మణా ద్రవిణా విప్రాః క్షత్రియా శుష్మిణస్తథా ॥ 23 ॥**

**వైశ్యాః స్తోభాస్తు మన్దేహాః శూద్రాస్తత్ర ప్రకీర్తితాః**
**సర్వాఽపి జ్ఞానసంపన్నా మైత్ర్యాది గుణసంయుతాః । 24 ॥**

అక్కడ దేవతలు మొదలైన వారందరు ప్రభువైన బ్రహ్మదేవుని సేవిస్తారు. అక్కడ బ్రాహ్మణులు ద్రవిణులని, క్షత్రియులు శుష్మలని అంటారు. వైశ్యులు స్తోభులని, శూద్రులు మందేహులని పిలువబడినారు. మనుష్యులందరు జ్ఞానవంతులు, మైత్రిమొదలైన మంచిగుణాలు కలవారై ఉంటారు.

**యథోక్తకారిణః సర్వే సర్వే భూతహితే రతాః ।**
**యజన్తి యజ్ఞైః వివిధైర్బ్రహ్మాణం పరమేష్ఠినమ్ ॥ 25 ॥**

**తేషాఇ్చ బ్రహ్మసాయుజ్యం సారూప్యఞ్చ సలోకతా ।**

ప్రజలు చెప్పినట్టు నడచుకొంటారు. ప్రాణులకు మేలుచేయటంలో ఆసక్తి కలవారు. నానావిధాలైన యజ్ఞాలతో పరమేష్ఠి బ్రహ్మను పూజిస్తారు. ఆ జనులకు బ్రహ్మసాయుజ్యం, సరూపత, సలోకత్వం సిద్ధిస్తుంది.

**కుశద్వీపస్య విస్తారాద్ద్విగుణేన సమన్తతః ॥ 26 ॥**

**క్రౌఞ్చద్వీపః స్థితో విప్రా వేష్టయిత్వా ఘృతోదధిమ్ ।**
**క్రౌఞ్చో వామనకశ్చైవ తృతీయశ్చాధికారికః ॥ 27 ॥**

**దేవాబ్దశ్చ వివేదశ్చ పుణ్డరీకస్తథైవ చ ।**
**నామ్నా చ సప్తమః ప్రోక్తః పర్వతో దున్దుభిస్వనః ॥ 28 ॥**

కుశద్వీప విస్తారానికి రెండింతల పరిమాణంతో దాని చుట్టూ క్రౌంచద్వీపం నేయిసముద్రాన్ని పరివేష్టించి నెలకొన్నది. విప్రులారా! క్రౌంచము, వామనకం, ఆధికారికం అనే పేరు కల్గినవి. మరియు దేవాబ్దము, వివేదం, పుండరీకం, దుందుభిస్వనం అనే పేర్లతో ఏడు కులపర్వతాలు ఉన్నవి.

**గౌరీ కుముద్వతీ చైవ సన్ధ్యా రాత్రిర్మనోజవా ।**
**కోభిశ్చ పుణ్డరీకాక్షా నద్యః ప్రాధాన్యతః స్మృతాః ॥ 29 ॥**

గౌరి, కుముద్వతి, సంధ్య, రాత్రి, మనోజవ, కోభి, పుండరీకాక్ష అనే ఏడు నదులు ఆ ద్వీపంలో ప్రధానంగా ప్రవహిస్తున్నాయి.

**పుష్కలాః పుష్కరా ధన్యాస్తిష్యా వర్ణాః క్రమేణ వై ।**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చైవ ద్విజోత్తమాః ॥ 30 ॥**

ద్విజవర్యులారా! అక్కడి వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు క్రమంగా పుష్కలులు, పుష్కరులు, ధన్యులు, తిష్యులు అని పిలువబడతారు.

**అర్చయన్తి మహాదేవం యజ్ఞదానశమాదిభిః ।**
**వ్రతోపవాసైర్వివిధైర్హోమైశ్చ పితృతర్పణైః ॥ 31 ॥**

వారు మహాదేవుని యజ్ఞాలతో, దానం, శమం మొదలైన గుణాలుకలవారై వివిధ వ్రతాలతో, ఉపవాసాలతో, హోమాలతో, పితృతర్పణాలతో పూజిస్తారు.

**తేషాం వై రుద్రసాయుజ్యం సారూప్యఞ్చాతిదుర్లభమ్ ।**
**సలోకతా చ సామీప్యం జాయతే తత్ప్రసాదతః ॥ 32 ॥**

వారికి మిక్కిలి దుర్లభాలైన శివసాయుజ్యం, సారూప్యం, సలోకత్వం సమీపములో ఉండుట ఆ దేవుని అనుగ్రహంవల్లనే లభిస్తాయి.

**క్రౌఞ్చద్వీపస్య విస్తారాద్ద్విగుణేన సమన్తతః ।**
**శాకద్వీపః స్థితో విప్రా ఆవేష్ట్య దధిసాగరమ్ ॥ 33 ॥**

క్రౌంచ ద్వీపానికి రెండు రెట్ల విస్తారంతో దాని కన్ని వైపుల దధిసముద్రం పరివేష్టించి శాకద్వీపం కలదు.

**ఉదయో రైవతశ్చైవ శ్యామః కాష్ఠగిరిస్తథా ।**
**ఆమ్బికేయస్తథా రమ్యః కేసరీ చేతి పర్వతాః ॥ 34 ॥**

అక్కడ ఉదయం, రైవతం, శ్యామం, కాష్ఠం, ఆంబికేయం, రమ్యం, కేసరి ఆనే పర్వతాలున్నవి.

**సుకుమారీ కుమారీ చ నలినీ వేణుకా తథా ।**
**ఇక్షుకా ధేనుకా చైవ గభస్తిశ్చేతి నిమ్నగాః ॥ 35 ॥**

సుకుమారి, కుమారి, నలిని, వేణుక, ఇక్షుక, ధేనుక, గభస్తి అనే ఏడు నదులు ప్రవహిస్తుంటాయి.

**ఆసాం పిబన్తః సలిలం జీవన్తే తత్ర మానవాః ।**
**అనామయాశ్చాశోకాశ్చ రాగద్వేషవివర్జితాః ॥ 36 ॥**

అక్కడ నివసించే జనులు ఈ నదుల జలాన్ని త్రాగి జీవిస్తారు. రోగాలు దుఃఖం రాగద్వేషాలు లేక సుఖంగా ఉంటారు.

**మృగాశ్చ మగధాశ్చైవ మానసా మన్దగాస్తథా ।**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శుద్రాశ్చాత్ర క్రమేణ తు ॥ 37 ॥**

**యజన్తి సతతం దేవం సర్వలోకైకసాక్షిణమ్ ।**
**వ్రతోపవాసైర్వివిధైర్దేవదేవం దివాకరమ్ ॥ 38 ॥**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు క్రమంగా మృగ, మగధ-మానస-మందగులు అనే పేర్లతో వ్యవహరింప బడతారు. సమస్తలోకాలకు ఏకమాత్రసాక్షి సూర్యభగవానుని వివిధ వ్రతాలతో, ఉపవాసాలతో వారు పూజిస్తుంటారు.

**తేషాం వై సూర్యసాయుజ్యం సామీప్యఞ్చ సరూపతా ।**
**సలోకతా చ విప్రేన్ద్ర జాయతే తత్ప్రసాదతః ॥ 39 ॥**

ద్విజులారా! వారికి సూర్యసాయుజ్య, సామీప్య, సరూపత్వ, సలోకతలు అనేవి ఆ దేవుని అనుగ్రహంవల్లనే లభిస్తాయి.

**శాకద్వీపం సమావృత్య క్షీరోదః సాగరః స్థితః ।**
**శ్వేతద్వీపం చ తన్మధ్యే నారాయణపరాయణాః ॥ 40 ॥**

శాకద్వీపాన్ని పరివేష్టించి క్షీరసముద్రం నెలకొన్నది. దాని మధ్య శ్వేతద్వీపం కలదు. అక్కడ నారాయణునియందు శ్రద్ధకల్గిన వారుంటారు.

**తత్ర పుణ్యా జనపదా నానాశ్చర్యసమన్వితాః ।**
**శ్వేతాస్తత్ర సదా నిత్యం జాయన్తే విష్ణుతత్పరాః ॥ 41 ॥**

అక్కడ అనేకాశ్చర్యాలతో కూడిన పుణ్యకరాలైన జనపదాలున్నవి. వానిలో శ్వేతవర్ణంగల నరులు విష్ణుభక్తి తత్పరులై ఉంటారు.

**నాధయో వ్యాధయస్తత్ర జరామృత్యుభయం న చ ।**
**క్రోధలోభవినిర్ముక్తా మాయామాత్సర్యవర్జితాః ॥ 42 ॥**

**నిత్యపుష్టా నిరాతఙ్కా నిత్యానన్దాశ్చ భోగినః ।**
**నారాయణసమాః సర్వే నారాయణపరాయణాః ॥ 43 ॥**

అక్కడ రోగాలు, మానసికబాధలుండవు. జరామరణాల భయం లేదు. కోపం, లోభం, మాయ, అసూయాదులు అక్కడి వారికి ఉండవు. ఆ ద్వీపంలోని వారు ఎప్పుడూ దృఢంగా నిర్భయులై నిత్యా నందసుఖపరులై నారాయణుని యందు ఆసక్తికలవార్రై, అతని సరూపులై ఉంటారు.

**కేచిద్ధ్యానపరా నిత్యం యోగినః సంయతేన్ద్రియాః ।**
**కేచిజ్జపన్తి తప్యన్తి కేచిద్విజ్ఞానినోఽపరే ॥ 44 ॥**

కొందరు జితేంద్రియులై యోగులుగా, ధ్యానపరులుకాగా మరికొందరు జపతపాదులాచరిస్తారు. కొందరు విజ్ఞానవంతులై ఉంటారు.

**అన్యే నిర్బీజయోగేన బ్రహ్మభావేన భావితాః ।**
**ధ్యాయన్తి తత్పరం బ్రహ్మ వాసుదేవం సనాతనమ్ ॥ 45 ॥**

మరికొందరు బీజరహితమైన బ్రహ్మభావంతో తన్మయులై పరబ్రహ్మస్వరూపుడు, సనాతనుడు అయిన వాసుదేవుని ధ్యానం చేస్తుంటారు.

**ఏకాన్తినో నిరాలమ్బా మహాభాగవతాః పరే ।**
**పశ్యన్తి తత్పరే బ్రహ్మ విష్ణ్వాఖ్యం తమసః పరమ్ ॥ 46 ॥**

కొందరు ఏకాంతంగ ఉండి ఆధారరహితులై, భగవద్భక్తి పూర్ణులై తమసునకంటే పరుడైన విష్ణువు అనే పేరుగల ఆ పరబ్రహ్మస్వరూపాన్ని దర్శిస్తారు.

**సర్వే చతుర్భుజాకారాః శఙ్ఖచక్రగదాధరాః ।**
**సుపీతవాససః సర్వే శ్రీవత్సాఙ్కితవక్షసః ॥ 47 ॥**

అక్కడి వారందరు నాలుగు భుజములు శంఖ చక్ర గద ఆయుధాలను ధరించేవారు. మంచిపసుపు పచ్చని వస్త్రాన్ని ధరించి శ్రీవత్సచిహ్నంతో కూడిన వక్షఃస్థలం కలవారై ఉంటారు.

**అన్యే మహేశ్వరపరాస్త్రిపుణ్డ్రాఙ్కితమస్తకాః ।**
**సుయోగాద్భూతికరణా మహాగరుడవాహనాః ॥ 48 ॥**

**సర్వే శక్తి సమాయుక్తా నిత్యానన్దాశ్చ నిర్మలాః ।**
**వసన్తి తత్ర పురుషా విష్ణోరన్తరచారిణః ॥ 49 ॥**

మరికొందరు మహేశ్వరునియందు భక్తి కలవారై త్రిపుండ్రములను నుదుట ధరించి యోగసంబంధం వల్ల భూతిని ధరించి గరుడవాహనులై ఉంటారు. అందరును శక్తి కలిగి ఆనంద నిర్మల స్వభావులై విష్ణువునకు ఆంతరంగికులై మెలగుతారు.

**తత్ర నారాయణస్యాన్యద్దుర్గమం దురతిక్రమమ్ ।**
**నారాయణం నామ పురం ప్రాసాదైరుపశోభితమ్ ॥ 50 ॥**

**హేమప్రాకారసంయుక్తం స్ఫాటికైర్మణ్డపైర్యుతమ్ ।**
**ప్రభాసహస్రకలితం దురాధర్షం సుశోభనమ్ ॥ 51 ॥**

**హర్మ్యప్రాసాదసంయుక్తం మహాట్టాలసమాకులమ్ ।**
**హేమగోపురసాహస్రైర్నానారత్నోపశోభితైః ॥ 52 ॥**

నారాయణం అనే పేర మరోపట్టణం నారాయణునిదే అక్కడ ఉన్నది. అది దుర్గమము దురతిక్రమం నానాప్రాసాద శోభితమైనది. ఆ పట్టణం బంగారు ప్రాకారాలు స్ఫటికమంటపాలు కల్గి ప్రభాసహస్ర కలితమైనది శత్రుదుర్భేద్యం. అందమైన మేడలు, భవనాలు, పైభాగాన విశాలమైన గదులు, వేలగోపురాలు, అనేక మణులతో ప్రకాశిస్తుంటుంది.

**శుభ్రాస్తరణసంయుక్తైర్విచిత్రైః సమలంకృతమ్ ।**
**నన్దనైర్వివిధాకారైః స్రవన్తీభిశ్చ శోభితమ్ ॥ 53 ॥**

స్వచ్ఛమైన ఆసనాలు పరచబడినది. విచిత్రమైన గోపురాలంకృతము వివిధాకారాలనందన వనాలు నదులతో కొలనులతో ప్రకాశిస్తుంటుంది.

**సరోభిః సర్వతోయుక్తం వీణావేణునినాదితమ్ ।**
**పతాకాభిర్విచిత్రాభిరనేకాభిశ్చ శోభితమ్ ॥ 54 ॥**

అన్ని వైపులా సరస్సులు గలదై వీణ వేణువు వాద్యములు ప్రతిధ్వనించునదై అనేక విచిత్ర పతాకములతో శోభిస్తుంటుంది.

**వీథిభిః సర్వతోయుక్తం సోపానై రత్నభూషితైః ।**
**నదీశతసహస్రాఢ్యం దివ్యగాననినాదితమ్ ॥ 55 ॥**

మణులలంకరించిన సోపానాలు ఇండ్లు వరుసగా అంతటా ఉన్నవి. నదీశత సహస్రం దివ్యగానధ్వనితం ఆ నగరం.

**హంసకారండవాకీర్ణం చక్రవాకోపశోభితమ్ ।**
**చాతుర్ద్వారమనౌపమ్యమగమ్యం దేవవిద్విషామ్ ॥ 56 ॥**

హంసలు, కన్నెలేడి పిట్టలు, చక్రవాక పక్షులు అనేకములున్నవి. చతుర్ద్వారాలు గల్గి సాటిలేనిదై రాక్షసులు చేరరానిదా పట్టణం.

**తత్ర తత్రాప్సరః సంఘైర్నృత్యద్భిరుపశోభితమ్ ।**
**నానాగీతవిధానజ్ఞైర్దేవానామపి దుర్లభైః ॥ 57 ॥**

**నానావిలాససమ్పన్నైః కాముకైరతికోమలైః ।**
**ప్రభూతచన్ద్రవదనైర్నూపురారావసంయుతైః ॥ 58 ॥**

అందచ్చటచ్చట అప్సరసలు నృత్యం చేస్తుంటారు. అనేక గీత విధానాలు తెలిసిన దేవతలకు కూడ పొందరానిది. విలాసవంతులైన కాముకులతో నూపురధ్వనులు నిండిన సుకుమారులు అప్సరస సమూహం నృత్యం చేస్తుంటుంది.

**ఈషత్స్మితైః సుబింబోష్ఠైర్బాలముగ్ధమృగేక్షణైః ।**
**అశేషవైభవోపేతైస్తనుమధ్యవిభూషితైః ॥ 59 ॥**

**సురాజహంసచలనైః సువేషైర్మధురస్వనైః ।**
**సంలాపాలాపకుశలైర్దివ్యాభరణభూషితైః ॥ 60 ॥**

**స్తనభారవినమ్రైశ్చ మధుఘూర్ణితలోచనైః ।**
**నానావర్ణవిచిత్రాంగైర్నానాభోగరతిప్రియైః ॥ 61 ॥**

**ఉత్ఫుల్లకుసుమోద్యానైస్తద్భూతశతశోభితమ్ ।**
**అసంఖ్యేయగుణం శుద్ధమసంఖ్యైస్త్రిదశైరపి ॥ 62 ॥**

**శ్రీమత్పవిత్రం దేవస్య శ్రీపతేరమితౌజసః ।**
**తస్య మధ్యేఽతితేజస్కముద్యత్ప్రాకారతోరణమ్ ॥ 63 ॥**

**స్థానం తద్వైష్ణవం దివ్యం యోగినాం సిద్ధిదాయకమ్ ।**
**తన్మధ్యే భగవానేకః పుణ్డరీకదలద్యుతిః ॥ 64 ॥**

**శేతేఽశేషజగత్సూతిః శేషాహిశయనే హరిః ।**
**విచిన్త్యమానో యోగీన్ద్రైః సనన్దనపురోగమైః ॥ 65 ॥**

ఆ అప్సరసలు చంద్రముఖులు, చిరునవ్వులుకల్గిన బింబోష్ఠలు. ముగ్ధమృగేక్షణలు. అశేషవైభవాలు కలవారు. తనుమధ్యలు. రాజహంస నడకలు, మధుర కంఠస్వరం గలవారు. చమత్కారంగా సంభాషిస్తారు. శ్రేష్ఠమైన ఆభరణాలు ధరించినారు. స్తనభారంతో వినమ్రలు. మద్యపానంతో తిరుగుతున్న కనులు కలవాడు. నానా వర్ణ

విచిత్రావయవశోభితలు. సుఖాల్లో, రతిక్రీడల్లో ప్రీతిగలవారు. ఉత్ఫుల్ల కుసుమోద్యానాలు ఆ నారాయణపురంలో ఉన్నవి. భూతగణాలు గలదా నగరం. అసంఖ్యేయగణాలతో శుద్ధమైనది. లెక్కకు మిక్కిలి దేవతలున్నారు. ఆ లక్ష్మీపతి నారాయణ పట్టణం తేజోవంతమగు ఎత్తైన తోరణసమూహం కలది. ఆ స్థానం యోగులకు సిద్ధిదాయకం. ఆ భవనమధ్యమందు పుండరీకదళద్యుతిగల శ్రీమహావిష్ణువు ఒంటరిగా శయనించి ఉంటాడు. సర్వలోకాల కారణభూతుడైన విష్ణువు సనందనుడు మొదలైన యోగీంద్రులు ధ్యానిస్తుండగా శేషశయ్యపై నిద్రిస్తుంటాడు.

**స్వాత్మానన్దామృతం పీత్వా పురస్తాత్తమసః పరః ।**
**పీతవాసా విశాలాక్షో మాహామాయో మహాభుజః ॥ 66 ॥**

**క్షీరోదకన్యయా నిత్యం గృహీతచరణద్వయః ।**
**సా చ దేవీ జగద్వన్ద్యా పాదమూలే హరిప్రియా ॥ 67 ॥**

**సమాస్తే తన్మనా నిత్యం పీత్వా నారాయణామృతమ్ ।**
**న తత్రాధార్మికా యాన్తి న చ దేవాన్తరాలయాః ॥ 68 ॥**

**వైకుణ్ఠం నామ తత్స్థానం త్రిదశైరపి వన్దితమ్ ।**
**న మే ప్రభవతి ప్రజ్ఞా కృత్స్నశాస్త్రనిరూపణే ॥ 69 ॥**

ఆత్మానందామృతాన్ని పానంచేస్తూ తమస్సునకు పరుడై పీతాంబరధారియైన విశాలవక్షఃస్థలం కలవాడు. మహామాయి. మహాభుజుడు. క్షీరసముద్రకుమారి లక్ష్మీదేవి పాదద్వయాన్ని గ్రహించి అతని పాదమూలంలో ఎప్పుడూ ఉంటుంది. అతని యందే మనసు నిల్పి నారాయణ నామామృతాన్ని ఆస్వాదిస్తూ ఆశ్రయించి ఉంటుంది. అక్కడ అధర్మవర్తనులు లేరు. ఇతర దేవతల ఆలయాలు లేవు. వైకుంఠమనే పేరుగలదా స్థానం. దేవతలు దానికి నమస్కరిస్తారు. సకలశాస్త్రానుసారముగా నిరూపించుటకు నా ప్రజ్ఞ చాలదు.

**ఏతావచ్ఛక్యతే వక్తుం నారాయణపురం హి తత్ ।**
**స ఏవ పరమం బ్రహ్మ వాసుదేవః సనాతనః ॥ 70 ॥**

అది నారాయణ పురమని మాత్రం చెప్పగలను. ఆ నారాయణుడే పరబ్రహ్మ స్వరూపుడైన సనాతన పురుషుడు వాసుదేవుడు.

**శేతే నారాయణః శ్రీమాన్మాయయా మోహయఞ్జగత్ ।**
**నారాయణాదిదం జాతం తస్మిన్నేవ వ్యవస్థితమ్ ।**

**తమాశ్రయతి కాలాన్తే స ఏవ పరమా గతిః ॥ 71 ॥**

శ్రీమన్నారాయణుడు తన మాయతో లోకాన్ని మోహింపచేస్తూ శయనించి ఉంటాడు. ఈ విశ్వమంతా నారాయణునివల్ల ఏర్పడినదే. అతనియందే నిలిచినది. కాలాంతంలో అతడే ఈ విశ్వానికి పరమ గమ్యస్థానం.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనకోశవిన్యాసవర్ణనం నామ ఏకోనపఞ్చాశోఽధ్యాయః ॥ 49 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనకోశవిన్యాసవర్ణనమనే నలబై తొమ్మిదవ అధ్యాయం ॥ 49 ॥

## **పఞ్చాశోఽధ్యాయః – యాభైయవ అధ్యాయం**

## **భువనకోశవర్ణనమ్ – భువనకోశవర్ణనం**

**సూత ఉవాచ:**–సూతుడు పలికాడు

**శాకద్వీపస్య విస్తారాద్ద్విగుణేన వ్యవస్థితః ।**
**క్షీరార్ణవం సమాశ్రిత్య ద్వీపం పుష్కరసంజ్ఞితమ్ ॥ 1 ॥**

శాకద్వీపవైశాల్యానికి రెండింతలుగా క్షీరసాగరాన్నాశ్రయించి పుష్కర మనే ద్వీపమున్నది.

**ఏక ఏవాత్ర విప్రేన్ద్రా పర్వతో మానసోత్తరః ।**
**యోజనానాం సహస్రాణి చోర్ధ్వం పఞ్చాశదుచ్ఛ్రితః ॥ 2 ॥**

విప్రులారా! ఈ ద్వీపంలో మానసోత్తర మనే పర్వతం ఒకటే వేయి యోజనాల పొడవు, యాభైయోజనాల ఎత్తుకలది ఉన్నది.

**తావదేవ చ విస్తీర్ణః సర్వతః పారిమణ్డలః ।**
**స ఏవ ద్వీపశ్చార్ధేన మానసోత్తరసంస్థితః ॥ 3 ॥**

అదే విస్తీర్ణంతో అంతట వ్యాపించిన ఆ ద్వీపం సగభాగం మానసోత్తర పర్వతాన్నాశ్రయించి మండలాకారంగా ఒక పెద్ద భాగం రెండు విభాగాలను పొందినది.

**ఏక ఏవ మహాభాగః సన్నివేశో ద్విధా కృతః ।**
**తస్మిన్ ద్వీపే స్మృతౌ ద్వౌ తు పుణ్యౌ జనపదౌ శుభౌ ॥ 4 ॥**

**అపరౌ మానసస్యాథ పర్వతస్యానుమణ్డలౌ ।**
**మహావీతం స్మృతం వర్షం ధాతకీఖణ్డమేవ చ ॥ 5 ॥**

ఆ ద్వీపంలో రెండు పవిత్రాలైనవి మంగళప్రదాలైన జనపదాలు చెప్పబడినవి. మానసోత్తర పర్వతానికి ఆ రెండు మండలాలుగా చెప్పదగినవి. మహావీత మనే వర్షం, ధాతకీఖండం అని వాని పేర్లు.

**స్వాదూదకేనోదధినా పుష్కరః పరివారితః ।**
**తస్మిన్ ద్వీపే మహావృక్షో న్యగ్రోధోఽమరపూజితః ॥ 6 ॥**

పుష్కరద్వీపం శుద్ధోదక సముద్రంతో చుట్ట బడినది. ఆ ద్వీపంలో దేవతలు పూజించే ఒక గొప్ప న్యగ్రోధము (మఱ్ఱిచెట్టు) ఉన్నది.

**తస్మిన్నివసతి బ్రహ్మా విశ్వాత్మా విశ్వభావనః ।**
**తత్రైవ మునిశార్దూల శివనారాయణాలయః ॥ 7 ॥**

**వసత్యత్ర మహాదేవో హరోఽర్ధం హరిరవ్యయః ।**
**సమ్పూజ్యమానో బ్రహ్మాద్యైః కుమారాద్యైశ్చ యోగిభిః॥ 8 ॥**

ఆ ద్వీపంలో విశ్వాత్మ విశ్వభావనుడైన బ్రహ్మ నివసిస్తాడు. మునులారా! అక్కడనే శివ నారాయణుల ఆలయమున్నది. ఇక్కడ సగభాగంలో మహాదేవుడైన శివుడు మిగతా సగభాగంలో అవ్యయుడైన హరి బ్రహ్మాదులచేత కుమారుడు మొదలైన యోగులచేతను పూజలందుతున్నారు.

**గన్ధర్వైః కిన్నరైర్యక్షైరీశ్వరః కృష్ణపిఙ్గళః ।**
**స్వస్థాస్తత్ర ప్రజాః సర్వా బ్రాహ్మణాః శతశస్త్విషః ॥ 9 ॥**

**నిరామయా విశోకాశ్చ రాగద్వేషవివర్జితాః ।**
**సత్యానృతే న తత్రాస్తాం నోత్తమాధమమధ్యమాః ॥ 10 ॥**

**న వర్ణాశ్రమధర్మాశ్చ న నద్యో న చ పర్వతాః ।**
**పరేణ పుష్కరేణాథ సమావృత్య స్థితో మహాన్ ॥ 11 ॥**

**స్వాదూదకసముద్రస్తు సమన్తాద్ద్విజసత్తమాః ।**
**పరేణ తస్య మహతీ దృశ్యతే లోకసంస్థితిః ॥ 12 ॥**

కృష్ణపింగళ వర్ణంగల ఈశ్వరుని గంధర్వులు, కిన్నరులు, యక్షులు పూజిస్తారు. అక్కడ ప్రజలందరు స్వస్థులు. బ్రాహ్మణులధిక తేజోవంతులు. ప్రజలు నీరోగులు, విశోకులు, రాగద్వేషవివర్జితులు. సత్యం అనృత విభాగం లేదు. వాణిజ్యాదులు అక్కడలేవు. ఉత్తమమధ్యమాధమ భేదం లేదు. వర్ణాశ్రమధర్మాలు నదులు పర్వతాలు అక్కడ లేవు. పుష్కరద్వీపం అవతలి భాగంలో స్వాదూదక సముద్రం అన్నివైపుల ఆవరించి ఉన్నది. ద్విజులారా! దానికావలిభాగంలో విశాలమైన లోకం వ్యాపించినది.

**కాఞ్చనీ ద్విగుణా భూమిః సర్వత్రైకశిలోపమా ।**
**తస్యాః పరేణ శైలస్తు మర్యాదా భానుమణ్డలః ॥ 13 ॥**

**ప్రకాశశ్చాప్రకాశశ్చ లోకాలోకః స ఉచ్యతే ।**
**యోజనానాం సహస్రాణి దశ తస్యోచ్ఛ్రయః స్మృతః ॥ 14 ॥**

ఒకే శిలతో పోల్చదగిన హిరణ్మయమైన భూమి, దానికవతలభాగంలో సూర్యమండల సంచారానికి అవధియైన పర్వతముంటుంది. ఒకవైపు వెలుతురు, మరోవైపు చీకటి ఉన్నందువల్ల లోకాలోకపర్వతమని దానికి పేరు. ఎత్తు పదివేల యోజనాల పరిమాణం కలది.

**తావానేవ చ విస్తారో లోకాలోకమహాగిరేః ।**
**సమావృత్య తు తం శైలం సర్వతో వై సమస్థితమ్ ॥ 15 ॥**

**తమశ్చాణ్డకటాహేన సమన్తాత్పరివేష్టితమ్ ।**
**ఏతే సప్త మహాలోకాః పాతాలాః సంప్రకీర్తితాః ॥ 16 ॥**

**బ్రహ్మాణ్డాశేషవిస్తారః సంక్షేపేణ మయోదితః ।**
**అణ్డానామీదృశానాం తు కోట్యో జ్ఞేయాః సహస్రశః ॥ 17 ॥**

**సర్వగత్వాత్ప్రధానస్య కారణస్యావ్యయాత్మనః ।**
**అణ్డేష్వేతేషు సర్వేషు భువనాని చతుర్దశ ॥ 18 ॥**

**తత్ర తత్ర చతుర్వక్త్రా రుద్రా నారాయణాదయః ।**
**దశోత్తరమథైకైకమణ్డావరణసప్తకమ్ ॥ 19 ॥**

**సమన్తాత్సంస్థితం విప్రాస్తత్ర యాన్తి మనీషిణః ।**
**అనన్తమేవమవ్యక్తమనాదినిధనం మహత్ ॥ 20 ॥**

లోకాలోకపర్వత విస్తారం కూడ అదే పరిమాణం కలది. దాన్ని ఆవరించి అన్నివైపుల వ్యాపించిన చీకటి అండకటాహ పాత్రవలె కనిపించును. ఇవి ఏడు పాతాళమహాలోకాలు. బ్రహ్మాండ సమగ్ర విస్తారం సంగ్రహంగానే వివరించినాను. ఇట్టి అండాకార గోళాలు వేలకోట్లున్నవి అని తెలియవలెను. సర్వవ్యాపకుడు అవ్యయుడైన భగవంతుడే ప్రధానమైనాడు. ఈ అన్ని అండాల్లోను పదునాలుగు లోకాలు ముఖ్యమైనవి. అక్కడక్కడ చతుర్ముఖుడు, నారాయణుడు, రుద్రుడు ఉన్నారు. తర్వాత ఏడు అండావరణాలు ఒక్కొక్కటి పదిరెట్లు పరిమాణం కల్గినవి ఉండును. విప్రులారా! ఆ అండావరణం అంతంలేనిది, వ్యక్తంకానిది, జనన మరణంలేనిది. బుద్ధిమంతులైన సజ్జనులు అచటికి వెళతారు.

**అతీత్య వర్తతే సర్వం జగత్ ప్రకృతిరక్షరమ్ ।**
**అనన్తత్వమనన్తస్య యతః సంఖ్యా న విద్యతే ॥ 21 ॥**

**తదవ్యక్తమిదం జ్ఞేయం తద్బ్రహ్మ పరమం ధ్రువమ్ ।**
**అనన్త ఏష సర్వత్ర సర్వస్థానేషు పఠ్యతే ॥ 22 ॥**

అక్షరరూప ప్రకృతి సమస్తప్రపంచాన్నతిక్రమించి ఉండును. అనంతుని అనంతత్వం ఎట్లా సంఖ్యలేనిదోఅట్టిదే ఈ ప్రకృతి అవ్యక్తమైనది. అది శ్రేష్ఠము, నిశ్చల బ్రహ్మము ఇతడే అనంతుడని అన్నిప్రదేశాలలో కీర్తింపబడుతున్నాడు.

**తస్య పూర్వం మయాఽప్యుక్తం యత్తన్మాహాత్మ్యముత్తమమ్ ।**
**గతః స ఏష సర్వత్ర సర్వస్థానేషు పూజ్యతే ॥ 23 ॥**

**భూమౌ రసాతలే చైవ ఆకాశే పవనేఽనలే ।**
**అర్ణవేషు చ సర్వేషు దివి చైవ న సంశయః ॥ 24 ॥**

**తథా తమసి సత్త్వే వాప్యేష ఏవ మహాద్యుతిః ।**
**అనేకధా విభక్తాఙ్గః క్రీడతే పురుషోత్తమః ॥ 25 ॥**

అతని మాహాత్మ్యం ముందే వివరించినాను. ఆ మాహాత్మ్యం కల యితడు అన్నిస్థానాల్లో పూజలందు తున్నాడు. ఈ పురుషోత్తముడే భూమి, పాతాళం, ఆకాశం, వాయువు, అగ్ని, స్వర్గాలలో స్వర్గం నందు తమోగుణం సత్త్వగుణం మొదలైన అన్నిటిలోను శరీరాన్ని విభజించుకొని విహరిస్తున్నాడు.

**మహేశ్వరః పరోఽవ్యక్తాదణ్డమవ్యక్తసంభవమ్ ।**
**అణ్డాద్బ్రహ్మా సముత్పన్నస్తేన సృష్టమిదం జగత్ ॥ 26 ॥**

శ్రేష్ఠుడైన మహేశ్వరుడు అవ్యక్తాని కతీతుడు. అవ్యక్తంనుండి బ్రహ్మాండం, దానినుండి బ్రహ్మ జన్మించి ఈ జగత్తునంతటిని సృష్టించినాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే భువనకోశవర్ణనం నామ పఞ్చాశోఽధ్యాయః ॥ 50 ॥**

శ్రీకూర్మపురాణంలో భువనకోశవర్ణనమనే యాబైయవ అధ్యాయం ॥ 50 ॥



## ఏక పఞ్చాశోఽధ్యాయః – యాభై ఒకటవ అధ్యాయం

## మన్వంతరకీర్తనే విష్ణుమాహాత్మ్యమ్ – మన్వంతరకీర్తనంలో విష్ణుమాహాత్మ్యం

**ఋషయ ఊచు:**–ఋషులు అడిగారు

**అతీతానాగతానీహ యాని మన్వన్తరాణి వై ।**
**తాని త్వం కథయాస్మభ్యం వ్యాసఞ్చ ద్వాపరే యుగే ॥ 1 ॥**

గడచిన మన్వంతరాలను రాబోయే మన్వంతరాలను గూర్చి, అట్లే ద్వాపరయుగంలోని వ్యాసుని గూర్చి కూడ మాకు వివరింపుము.

**వేదశాఖాప్రణయినో దేవదేవస్య ధీమతః ।**
**ధర్మార్థానాం ప్రవక్తారో హీశానస్య కలౌ యుగే ॥ 2 ॥**

**కియన్తో దేవదేవస్య శిష్యాః కలియుగేఽపి వై ।**
**ఏతత్సర్వం సమాసేన సూత! వక్తుమిహార్హసి ॥ 3 ॥**

కలియుగంలో దేవదేవుడు ధీమంతుడైన వ్యాసభగవానునికి వేదశాఖలో అనురాగం కల్గి ధర్మార్థాలను గూర్చి ప్రవచించే శిష్యులెందరున్నారు? ఓ సూతుడా! ఈ విషయాలను సంగ్రహంగా తెలుపటానికి నీవే తగినవాడవు.

**సూత ఉవాచ:**–సూతుడు పలికాడు

**మనుః స్వాయమ్భువః పూర్వం తతః స్వారోచిషో మతః ।**
**ఉత్తమస్తామసశ్చైవ రైవతశ్చాక్షుషస్తథా ॥ 4 ॥**

మొదట స్వాయంభువమనువు. తర్వాత స్వారోచిషుడు. అనంతరం క్రమంగా ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు అను మనువులుదయించినారు.

**షడేతే మనవోఽతీతా సాంప్రతం తు రవేః సుతః ।**
**వైవస్వతోఽయం సప్తైతత్సప్తమం వర్తతే పరమ్ ॥ 5 ॥**

గతించిన మనువులీ ఆరుగురు. ప్రస్తుతం సూర్యపుత్రుడైన వైవస్వతుడు మనువుగా ఉన్నాడు. జరుగుతున్నది ఏడవ మన్వంతర కాలం.

**స్వాయమ్భువం తు కథితం కల్పాదావన్తరం మయా ।**
**అత ఊర్ధ్వం నిబోధధ్వం మనోః స్వారోచిషస్య తు ॥ 6 ॥**

కల్పాది యందున్న స్వాయమ్భువ మన్వంతరాన్ని గూర్చి ముందే వివరించినాను. దాని తర్వాత స్వారోచిష మనువు వృత్తాంతాన్ని వివరిస్తాను. తెలియండి.

**పారావతాశ్చ తుషితా దేవాః స్వారోచిషేఽన్తరే ।**
**విపశ్చిన్నామ దేవేన్ద్రో బభూవాసురమర్దనః ॥ 7 ॥**

స్వారోచిష మన్వంతరంలో దేవతలు పారావతులు తుషితులు అనే వారుండిరి. రాక్షస సంహారకుడు విపశ్చిత్ అనేవాడు దేవతల కింద్రునిగా ఉండినాడు.

**ఊర్జః స్తమ్భస్తథా ప్రాణో దాన్తోఽథ ఋషభస్తథా ।**
**తిమిరశ్చార్వరీవాంశ్చ సప్త సప్తర్షయోఽభవన్ ॥ 8 ॥**

ఊర్జుడు, స్తంభుడు, ప్రాణుడు, దాంతుడు, ఋషభుడు, తిమిరుడు, అర్వరీవంతుడనే ఏడుగురు సప్తర్షులుగా నుండినారు.

**చైత్రకిమ్పురుషాద్యాస్తు సుతాః స్వారోచిషస్య తు ।**
**ద్వితీయమేతదాఖ్యాతమన్తరం శృణు చోత్తమమ్ ॥ 9 ॥**

స్వారోచిషమనువుకు చైత్రకింపురుషాదులు పుత్రులు. రెండవమన్వంతరవృత్త మిది. ఉత్తమునిగూర్చి విను.

**తృతీయే వ్యన్తరే చైవ ఉత్తమో నామ వై మనుః ।**
**సుశాన్తిస్తత్ర దేవేన్ద్రో బభూవామిత్రకర్షణః ॥ 10 ॥**

మూడవ అంతరంలో ఉత్తముడు మనువు. శత్రువులను నిగ్రహించిన సుశాంతి అనే వాడు ఆ మన్వంతరంలో దేవేంద్రుడుగ ఉండినాడు.

**సుధామానస్తథా సత్యః శివశ్చాథ ప్రతర్దనః ।**
**వశవర్తినః పఞ్చైతే గణా ద్వాదశకాః స్మృతాః ॥ 11 ॥**
**రజోగాత్రోర్ధ్వబాహుశ్చ సవనశ్చానఘస్తథా ।**
**సుతపాః శక్ర ఇత్యేతే సప్త సప్తర్షయోఽభవన్ ॥ 12 ॥**

సుధామానము, సత్యం, శివం, ప్రతర్దన మనే అయిదు వశవర్తులైన గణాలు ద్వాదశకములని పేర్కొన బడినవి. రజస్సు, గాత్రుడు, ఊర్ధ్వబాహువు, సవనుడు, అనఘుడు, సుతపుడు, శక్రుడు అనేవారు సప్తర్షులుగా నుండిరి.

**తామసస్యాన్తరే దేవాః సురా వాహరయస్తథా ।**
**సత్యాశ్చ సుధియశ్చైవ సప్త వింశతికా గణాః ॥ 13 ॥**

తామసమన్వంతరంలో దేవతలందరు సురలు, వాహరులు, సత్యులు, సుధియులు అను ఇరువై ఏడు గణాలుగా నుండినారు.

**శిబిరిన్ద్రస్తథైవాఽఽసీచ్ఛతయజ్ఞోపలక్షణః ।**
**బభూవ శఙ్కరే భక్తో మహాదేవార్చనే రతః ॥ 14 ॥**

నూరు యజ్ఞాలుచేసిన శిబి అనేవాడు ఇంద్రుడయ్యెను. శంకరునియందు భక్తికలవాడై అతడు మహాదేవుని పూజించటంలో శ్రద్ధాళువుగా ఉండెను.

**జ్యోతిర్ధామ పృథక్కల్పశ్చైత్రోఽగ్నివసవస్తథా ।**
**పీవరస్త్వృషయో హ్యేతే సప్త తత్రాపి చాన్తరే ॥ 15 ॥**

**పఞ్చమే చాపి విప్రేన్ద్రా రైవతో నామ నామతః ।**
**మనుర్విభుశ్చ తత్రేన్ద్రో బభూవాసురమర్దనః ॥ 16 ॥**

జ్యోతిర్ధాముడు, పృథక్కు, కల్పుడు, చైత్రుడు, అగ్ని, వసువు, పీవరుడు ఆ మన్వంతరంలో సప్తర్షులు. అయిదవ మన్వంతరంలో రైవతుడు మనువు. అసురమర్దనుడు విభుడు దేవేంద్రుడైనాడు.

**అమితా భూతయస్తత్ర వైకుణ్ఠాశ్చ సురోత్తమాః ।**
**ఏతే దేవగణాస్తత్ర చతుర్దశ చతుర్దశ ॥ 17 ॥**

అక్కడ అమిత సంపదలు వైకుంఠ నాములైన దేవతా శ్రేష్ఠులుంటారు. ఈ దేవగణాలు పదునాల్గు పదునాల్గు సంఖ్యలో నివసిస్తారు.

**హిరణ్యరోమా వేదశ్రీరూర్ధ్వబాహుస్తథైవ చ ।**
**వేదబాహుః సుబాహుశ్చ సపర్జన్యో మహామునిః ॥ 18 ॥**

హిరణ్యరోముడు వేదశ్రీ ఊర్ధ్వబాహువు, వేదబాహువు, సుబాహువు, పర్జన్యుడు, మహాముని అనే సప్తర్షులు ఆ రైవత మన్వంతరంలో వ్యవహరించినారు.

**ఏతే సప్తర్షయో విప్రాస్తత్రాసన్రైవతేఽన్తరే ।**
**స్వారోచిషశ్చోత్తమశ్చ తామసో రైవతస్తథా ।**

**ప్రియవ్రతాన్వితా హ్యేతే చత్వారో మనవః స్మృతాః ॥ 19 ॥**

స్వారోచిషుడు ఉత్తముడు తామసుడు రైవతుడు ఈ నల్గురు ప్రియవ్రతుని సంబంధ మనువులుగా పేర్కొనబడిరి.

**షష్ఠే మన్వన్తరే చాపి చాక్షుషస్తు మనుర్ద్విజాః ॥ 20 ॥**

**మనోజవస్తథైవేన్ద్రో దేవాంశ్చైవ నిబోధత ।**
**ఆద్యాః ప్రభూతభవ్యాశ్చ ప్రథనాశ్చ దివౌకసః ॥ 21 ॥**

**మహానుభావా లేఖ్యాశ్చ పఞ్చ దేవగణాః స్మృతాః ।**
**విరజాశ్చ హవిష్మాంశ్చ సోమో మనుసమః స్మృతః ।**
**అవినామా సవిష్ణుశ్చ సప్తాఽఽసన్నృషయః శుభాః ॥ 22 ॥**

ఆరవ మన్వంతరంలో చాక్షుషడను వాడు మనువు. ఓ బ్రాహ్మణులారా! వినండి. ఆ కాలంలో మనోజవుడు ఇంద్రుడు. దేవతల గూర్చి వినండి. ఆద్యులు ప్రభూతభవ్యులు, ప్రథనులు, దివౌకసులు, మహానుభావులు, లేఖ్యులు,

అనే దేవగణాలు అయిదుండెను. విరజసుడు, హవిష్మంతుడు, సోముడు, మనుసముడుగా చెప్పబడినాడు. అవినాముడు విష్ణువు అనే ఏడుగురు నాటి ఋషులు.

**వివస్వతః సుతో విప్రాః శ్రాద్ధదేవో మహాద్యుతిః ॥ 23 ॥**

**మనుః సంవర్తనో విప్రాః సాంప్రతం సప్తమేఽన్తరే ।**
**ఆదిత్యా వసవో రుద్రా దేవాస్తత్ర మరుద్గణాః ॥ 24 ॥**

సూర్యుని కుమారుడు గొప్ప తేజస్వి శ్రాద్ధదేవుడైన సంవర్తనుడు ప్రస్తుతం ఏడవ మన్వంతరమనువు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, మరుద్గణములు ఆ మన్వంతరంలోని దేవతలు.

**పురన్దరస్తథైవేన్ద్రో బభూవ పరవీరహా ।**
**వశిష్ఠః కశ్యపశ్చాత్రిర్జమదగ్నిశ్చ గౌతమః ॥ 25 ॥**

**విశ్వామిత్రో భరద్వాజః సప్త సప్తర్షయోఽభవన్ ।**
**విష్ణుశక్తిరనౌపమ్యా సత్త్వోద్రిక్తా స్థితా స్థితౌ ॥ 26 ॥**

**తదంశభూతా రాజానః సర్వే చ త్రిదివౌకసః ।**
**స్వాయమ్భువేఽన్తరే పూర్వం ప్రకృత్యాం మానసః సుతః ।**

**రుచేః ప్రజాపతేర్జజ్ఞే తదంశేనాభవద్ద్విజాః ॥ 27 ॥**

శత్రుసంహారకుడు, పురందరుడు ఇంద్రుడు. వశిష్ఠుడు, కశ్యపుడు, అత్రి, జమదగ్ని, గౌతముడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు ఈ మన్వంతరంలోని సప్తర్షులు. సాటిలేని విష్ణుశక్తి సత్త్వగుణోద్రిక్తమై స్థితికార్యంలో నిమగ్నమైయున్నది. స్వర్గంలోని దేవతలు భూలోకంలోని రాజులు ఆ విష్ణ్వంశ కలవారే. పూర్వకాలంలో స్వాయంభువమన్వంతరంలో ప్రకృతియందు సంకల్పంవల్ల జన్మించిన కుమారుడు. రుచియందు ప్రజాపతివల్ల అతని అంశలో జన్మించినాడు.

**తతః పునరసౌ దేవః ప్రాప్తే స్వారోచిషేఽన్తరే ।**

**తుషితాయాం సముత్పన్నస్తుషితైః సహ దైవతైః ॥ 28 ॥**

స్వారోచిషమన్వంతరం రాగా మళ్ళీ ఈ దేవుడు తుషితయందు సంతోషితులైన దేవతలతో కూడ జన్మించినాడు.

**ఉత్తమే త్వన్తరే విష్ణుః సత్యైః సహ సురోత్తమః ।**
**సత్యాయామభవత్సత్యః సత్యరూపో జనార్దనః ॥ 29 ॥**

ఉత్తమ మన్వంతరంలో దేవతాశ్రేష్ఠుడైన విష్ణువు సత్యులతో కూడ సత్యరూపుడై సత్యయందు జన్మించినాడు.

**తామసస్యాన్తరే చైవ సంప్రాప్తే పునరేవ హి ।**
**హర్యాయాం హరిభిర్దేవైర్హరిరేవాభవద్ధరిః ॥ 30 ॥**

మళ్ళీ తామస మన్వంతరంరాగా విష్ణువు హరులనే దేవతలతో కూడ హర్య అను స్త్రీయందు హరిగా జన్మించినాడు.

**రైవతేఽప్యన్తరే చైవ సంకల్పాన్మానసో హరిః ।**
**సమ్భూతో మానసైః సార్ధం దేవైః సహ మహాద్యుతిః ॥ 31 ॥**

రైవతమన్వంతరంలో సంకల్పబలంవల్ల మానసుడైన హరి మానసులైన దేవతలతో కూడ గొప్ప తేజస్వంతునిగా జన్మించినాడు.

**చాక్షుషేఽప్యన్తరే చైవ వైకుణ్ఠః పురుషోత్తమః ।**

**వికుణ్ఠాయామసౌ జజ్ఞే వైకుణ్ఠైర్దైవతైః సహ ॥ 32 ॥**

**మన్వన్తరే చ సంప్రాప్తే తథా వైవస్వతేఽన్తరే ।**
**వామనః కశ్యపాద్విష్ణు రదిత్యాం సమ్బభూవ హ ॥ 33 ॥**

చాక్షుషమన్వంతరంలో పురుషోత్తముడైన విష్ణువు వైకుంఠులనే దేవతలతో కూడ వికుంఠయందు జన్మించినాడు. తర్వాత వైవస్వత మన్వంతరంలో కశ్యప ప్రజాపతివల్ల అదితియందు విష్ణువు వామనుడై జన్మించినాడు.

**త్రిభిః క్రమైరిమాన్లోకాఞ్జిత్వా యేన మహాత్మనా ॥ 34 ॥**

**పురన్దరాయ త్రైలోక్యం దత్తం నిహతకంటకమ్ ।**
**ఇత్యేతాస్తనవస్తస్య సప్త మన్వంతరేషు వై ॥ 35 ॥**

ఆ మహాత్ముడు మూడడుగులతో ముల్లోకాలను జయించి నిష్కంటకముగా స్వర్గాన్ని ఇంద్రునికి అందచేసినాడు. ఈ ఏడు మన్వంతరాల్లో విష్ణువు ధరించిన శరీరాలిట్లా తెలిపినాము.

**సప్త చైవాభవన్విప్రా యాభిః సఙ్కర్షితాః ప్రజాః ।**
**యస్మాద్విశ్వమిదం కృత్స్నం వామనేన మహాత్మనా ॥ 36 ॥**

**తస్మాత్సర్వైః స్మృతో నూనం దేవైః సర్వేషు దైత్యహా ।**
**ఏష సర్వం సృజత్యాదౌ పాతి హన్తి చ కేశవః ॥ 37 ॥**

ఆ అవతారాలు ఏడే. ఆ అవతారాలతో ప్రళయ కాలమందు ప్రజలను సంహరించినాడు. మహాత్ముడైన విష్ణువు ఈ విశ్వాన్ని రక్షించటంవల్ల రాక్షససంహారకుడని దేవతల్లో ప్రసిద్ధుడైనాడు. ఈ విష్ణువు మొదట సమస్తాన్ని సృష్టించి, రక్షించి చివరకు నశింప చేయును.

**భూతాన్తరాత్మా భగవాన్నారాయణ ఇతి శ్రుతిః ।**
**ఏకాంశేన జగత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥ 38 ॥**

వేదం భగవంతుడైన నారాయణుడు సర్వప్రాణులకు అంతర్యామి అని తెలిపినది. తన ఒక అంశతోనే నారాయణుడు లోకంలో వ్యాపించినాడు.

**చతుర్ధా సంస్థితో వ్యాపీ సగుణో నిర్గుణోఽపి చ ।**
**ఏకా భగవతో మూర్తిర్జ్ఞానరూపా శివాఽమలా ॥ 39 ॥**

వ్యాపకుడైన ఆ విష్ణువు సగుణుడుగ, నిర్గుణుడుగ కూడ నాలుగు విధాల నెలకొన్నాడు. భగవంతుని ఒక మూర్తి జ్ఞానరూపం, మంగళకరం, నిర్మలము.

**వాసుదేవాభిధానా సా గుణాతీతా సునిష్కలా ।**
**ద్వితీయా కాలసంజ్ఞాఽన్యా తామసీ శివసంజ్ఞితా ॥ 40 ॥**

ఆ మూర్తి వాసుదేవపదవాచ్యమైనది. గుణాతీతం భేదరహితం కూడ. కాలసంజ్ఞ కలది రెండవ మూర్తి. తమోగుణసంబంధి శివనామాంకితం.

**నిహన్త్రీ సకలస్యాన్తే వైష్ణవీ పరమా తనుః ।**
**సత్త్వోద్రిక్తా తృతీయాఽన్యా ప్రద్యుమ్నేతి చ సంజ్ఞితా ॥ 41 ॥**

అది అంతంలో సమస్తాన్ని నశింపచేసే విష్ణువు శ్రేష్ఠశరీరం. మూడవది సత్త్వగుణప్రధానమైన ప్రద్యుమ్న నామం కలది.

**జగత్సంస్థాపయేద్విశ్వం సా విష్ణోః ప్రకృతిర్ధ్రువా ।**
**చతుర్థీ వాసుదేవస్య మూర్తిర్బ్రహ్మేతి సంజ్ఞితా ॥ 42 ॥**

మరొకటి నిశ్చలమైన విష్ణువుప్రకృతిరూపం. అది ప్రపంచాన్ని రక్షణద్వారా స్థాపించు చుండును. వాసుదేవుని నాల్గవమూర్తి బ్రహ్మ అనే సంజ్ఞ కలది.

**రాజసీ సాఽనిరుద్ధస్య పురుషసృష్టికారితా ।**
**యః స్వపిత్యఖిలం హత్వా ప్రద్యుమ్నేన సహ ప్రభుః ॥ 43 ॥**

రజోగుణప్రధానమైన ఆ మూర్తి అనిరుద్ధునిది. పురుషులసృష్టికర్మ నెరవేర్చును. సమస్తాన్ని లయింపచేసి ప్రభువు ప్రద్యుమ్నునితో నిద్రిస్తాడు.

**నారాయణాఖ్యో బ్రహ్మాఽసౌ ప్రజాసర్గం కరోతి సః ।**
**యాఽసౌ నారాయణతనుః ప్రద్యుమ్నాఖ్యా శుభా స్మృతా ॥ 44 ॥**

అతడే నారాయణుడనే పేరుగల బ్రహ్మ ప్రజలను సృష్టిస్తాడు. ఈ నారాయణరూపం శుభకరమైన ప్రద్యుమ్న నామకం.

**తయా సమ్మోహయేద్విశ్వం స దేవాసురమానుషమ్ ।**
**తతః సైవ జగన్మూర్తిః ప్రకృతిః పరికీర్తితా ॥ 45 ॥**

**వాసుదేవో హ్యనన్తాత్మా కేవలో నిర్గుణో హరిః ।**
**ప్రధానం పురుషః కాలస్తత్త్వత్రయమనుత్తమమ్ ॥ 46 ॥**

నారాయణుడా మూర్తితో దేవాసురమానవులుగల ఈ విశ్వాన్ని సంమోహపరుస్తాడు. అందువల్ల ఆ రూపమే విష్ణువు ప్రకృతిరూపమని చెప్పబడినది. అనంతాత్మస్వరూపుడైన వాసుదేవుడు కేవలుడు, నిర్గుణుడు హరి. ప్రధానతత్త్వం, పురుషుడు, కాలం అనే మూడు సత్త్వ త్రయమని పేరొందినది.

**వాసుదేవాత్మకం నిత్యమేతద్విజ్ఞాయ ముచ్యతే ।**
**ఏకం చేదం చతుష్పాదం చతుర్ధా పునరచ్యుతః ॥ 47 ॥**

**బిభేద వాసుదేవోఽసౌ ప్రద్యుమ్నో భగవాన్హరిః ।**
**కృష్ణద్వైపాయనో వ్యాసో విష్ణుర్నారాయణః స్వయమ్ ॥ 48 ॥**

అది వాసుదేవస్వరూపం. నిత్యం కూడ. దీనిని తెలుసుకొని ముక్తి పొందును. ఈ తత్త్వమొకటే అయినా నాలుగు పాదాలు కలది. అచ్యుతుడైన హరి మళ్ళీ నాలుగు విధాల భిన్నరూపుడై ప్రద్యుమ్న భగవానుడు అవతారాలను దాల్చినాడు. కృష్ణద్వైపాయనుడయిన వ్యాసుడు స్వయంగా నారాయణ విష్ణుస్వరూపుడే.

**అవాతరత్స సమ్పూర్ణం స్వేచ్ఛయా భగవాన్హరిః ।**
**అనాద్యన్తం పరం బ్రహ్మ న దేవా ఋషయో విదుః ॥ 49 ॥**

భగవానుడైన హరి తన ఇచ్ఛతో సంపూర్ణావతారమునందినాడు. ఆది అంతం లేనిది. పరబ్రహ్మ తత్త్వమైన నారాయణుని దేవతలు ఋషులు కూడ తెలియ జాలరు.

**ఏకోఽయం వేద భగవాన్ వ్యాసో నారాయణః ప్రభుః ।**
**ఇత్యేతద్విష్ణుమాహాత్మ్యం కథితం మునిసత్తమాః ॥**

**ఏతత్సత్యం పునః సత్యమేవం జ్ఞాత్వా న ముహ్యతి । 50 ॥**

భగవంతుడైన నారాయణుడు వ్యాసమహర్షి ఒక్కడే దానిని తెలుసుకున్నవాడు. ఓ మునులారా! ఈ విధంగా విష్ణుమాహాత్మ్యం వివరించినాను. ఇది సత్యం. మళ్ళీమళ్ళీ ఈ సత్యాన్ని తెలిసి కొన్నవాడు మోహాన్ని పొందదు.

**ఇతి శ్రీకూర్మపురాణే మన్వన్తరకీర్తనే విష్ణుమాహాత్మ్యం నామైకపఞ్చాశోఽధ్యాయః. ॥ 51 ॥**

శ్రీకూర్మపురాణంలో మన్వంతర కీర్తనంలో విష్ణుమాహాత్మ్యం అనే యాభై ఒకటవ అధ్యాయం ॥ 51 ॥



## ద్విపఞ్చాశోऽధ్యాయః - యాభై రెండవ అధ్యాయం

## వేదశాఖాప్రణయనమ్ - వేదశాఖాప్రణయనం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు

**అస్మిన్మన్వన్తరే పూర్వం వర్తమానే మహాప్రభుః ।**
**ద్వాపరే ప్రథమే వ్యాసో మనుః స్వాయమ్భువో మతః ॥ 1 ॥**

పూర్వం ఈ మన్వంతరం కాలంలో మొదటి ద్వాపరయుగంలో మహాప్రభువైన వ్యాసుడుగా స్వాయంభువ మనువు చెప్పబడినాడు.

**బిభేద బహుధా వేదం నియోగాద్బ్రహ్మణః ప్రభోః ।**
**ద్వితీయే ద్వాపరే చైవ వేదవ్యాసః ప్రజాపతిః ॥ 2 ॥**

ప్రభువైన బ్రహ్మ ఆదేశంతో ఆయన వేదాన్ని అనేక విధాల విభజించినాడు. రెండవ ద్వాపరయుగంలో వేదవ్యాసుడుగా ప్రజాపతి ఉండినాడు.

**తృతీయే చోశనా వ్యాసశ్చతుర్థే స్యాద్బృహస్పతిః ।**
**సవితా పఞ్చమే వ్యాసః షష్ఠే మృత్యుః ప్రకీర్తితః ॥ 3 ॥**

మూడవ ద్వాపరంలో శుక్రాచార్యుడు వ్యాసుడుకాగా, నాల్గవ ద్వాపరంలో బృహస్పతి వ్యాసుడైనాడు. ఐదవ ద్వాపరంలో సవిత అనే వాడు, ఆరవ ద్వాపరంలో మృత్యువు వ్యాసునిగా ఉన్నారు.

**సప్తమే చ తథైవేన్ద్రో వసిష్ఠశ్చాష్టమే మతః ।**
**సారస్వతశ్చ నవమే త్రిధామా దశమే మతః ॥ 4 ॥**

ఏడవ ద్వాపరంలో ఇంద్రుడు, ఎనిమిదవ ద్వాపరంలో వసిష్ఠుడు, తొమ్మిది, పది ద్వాపరాల్లో వరుసగా సారస్వతుడు, త్రిధామ అనే వారు వ్యాసులుగా ఉన్నారు.

**ఏకాదశే తు ఋషభః సుతేజా ద్వాదశే స్మృతః ।**
**త్రయోదశే తథా ధర్మః సుచక్షుస్తు చతుర్దశే ॥ 5 ॥**

పదకొండవ ద్వాపరంలో ఋషభుడు, పన్నెండవ ద్వాపరంలో సుతేజుడు, పదమూడవ ద్వాపరంలో ధర్ముడు, పద్నాల్గవ దానిలో సుచక్షువు వ్యాసులుగా ఉండినారు.

**త్రయ్యారుణిః పఞ్చదశే షోడశే తు ధనఞ్జయః ।**
**కృతఞ్జయః సప్తదశే హ్యష్టాదశే ఋతఞ్జయః ॥ 6 ॥**

**తతో వ్యాసో భరద్వాజస్తస్మాదూర్ధ్వం తు గౌతమః ।**
**వాచశ్రవాశ్చైకవింశే తస్మాన్నారాయణః పరః ॥ 7 ॥**

**తృణబిన్దుస్త్రయో వింశే వాల్మీకిస్తత్పరః స్మృతః ।**
**పఞ్చవింశే తథా ప్రాప్తే యస్మిన్వై ద్వాపరే ద్విజాః ॥ 8 ॥**

**పరాశరసుతో వ్యాసః కృష్ణద్వైపాయనోఽభవత్ ।**
**స ఏవ సర్వవేదానాం పురాణానాం ప్రదర్శకః ॥ 9 ॥**

పదహైదవ ద్వాపరంలో త్రయ్యారుణి, పదహారవ ద్వాపరంలో ధనంజయుడు, పదిహేడవ ద్వాపరంలో కృతంజయుడు, పద్దెనిమిదవ ద్వాపరంలో ఋతంజయుడు వ్యాసులుగా ఉన్నారు. తర్వాత భరద్వాజుడు వ్యాసుడైనాడు. తర్వాత వరుసగా గౌతముడు, వాచశ్రవుడు, నారాయణుడు వ్యాసులుగా ఉండినారు. ఇరవై మూడవ ద్వాపరంలో తృణబిందువు, తర్వాత వాల్మీకి, ఇరువై ఐదవ ద్వాపరయుగంరాగా విప్రులారా! పరాశరుని పుత్రుడైన కృష్ణద్వైపాయనుడు వ్యాసుడై అన్ని వేదాలను, పురాణాలను లోకానికి ప్రదర్శించినాడు.

**పారాశర్యో మహాయోగీ కృష్ణద్వైపాయనో హరిః ।**
**ఆరాధ్య దేవమిశానం దృష్ట్వా స్తుత్వా త్రిలోచనమ్ ॥ 10 ॥**

**తత్ప్రసాదాదసౌ వ్యాసం వేదానామకరోత్ప్రభుః ।**
**అథ శిష్యాన్స జగ్రాహ చతురో వేదపారగాన్ ॥ 11 ॥**

పరాశరపుత్రుడు, గొప్పయోగి, కృష్ణద్వైపాయనుడు నారాయణస్వరూపుడైన వ్యాసుడు ఈశ్వరుని పూజించి స్తోత్రంచేసి ఆయన అనుగ్రహంతో వేదాలను విస్తారంగా విభజించినాడు. తర్వాత వేదాలను పూర్తిగా అధ్యయనంచేసిన నలుగురు శిష్యులను స్వీకరించినాడు.

**జైమినిఞ్చ సుమన్తుఞ్చ వైశంపాయనమేవ చ ।**
**పైలం తేషాం చతుర్థం చ పఞ్చమం మాం మహామునిః ॥ 12 ॥**

**ఋగ్వేదపాఠకం పైలం జగ్రాహ స మహామునిః ।**
**యజుర్వేదప్రవక్తారం వైశమ్పాయనమేవ చ ॥ 13 ॥**

జైమిని, సుమంతుడు, వైశంపాయనుడు, పైలుడు అనే నలుగురిని, అయిదవ వాణ్ణిగా నన్ను ఆ వ్యాసుడు శిష్యులుగా స్వీకరించినాడు. పైలుని ఋగ్వేద పాఠకునిగా, వైశంపాయనుని యజుర్వేద ప్రచారకునిగా నియమించినాడు.

**జైమినిం సామవేదస్య పాఠకం సోఽన్వపద్యత ।**
**తథైవాథర్వవేదస్య సుమన్తుమృషిసత్తమమ్ ॥ 14 ॥**

జైమినిని సామవేద పాఠకునిగా స్వీకరించి, ఋషిశ్రేష్ఠుడైన సుమంతుని అథర్వవేదపాఠకునిగ గ్రహించినాడు.

**ఇతిహాసపురాణాని ప్రవక్తుం మామయోజయత్ ।**
**ఏక ఆసీద్యజుర్వేదస్తం చతుర్ధా ప్రకల్పయత్ ॥ 15 ॥**

ఇతిహాసాలను, పురాణాలను ప్రవచనం చేయటానికి ఆ ముని నన్ను నియమించినాడు. ఒకటిగ నున్న యజుర్వేదాన్ని నాలుగు విధాలుగ ఆయన విభజించినాడు.

**చతుర్హోత్రమభూత్తస్మింస్తేన యజ్ఞమథాకరోత్ ।**
**ఆధ్వర్యవం యజుర్భిః స్యాదగ్నిహోత్రం ద్విజోత్తమాః ॥ 16 ॥**

దానిలో నాలుగు అగ్నిహోత్రాల సమూహం ఏర్పడినది. దానితో యజ్ఞాన్ని చేసినాడు. యజుర్వేద మంత్రాలతో అధ్వర్యవ మనే అగ్నిహోత్రం సంభవిస్తుంది.

**ఔద్గాత్రం సామభిశ్చక్రే బ్రహ్మత్వం చాప్యథర్వభిః ।**
**తతః సత్రే చ ఉద్ధృత్య ఋగ్వేదం కృతవాన్ ప్రభుః ॥ 17 ॥**

సామవేదమంత్రాలతో ఔద్గాత్రాన్ని కల్పించినాడు. అథర్వవేదమంత్రాలతో బ్రహ్మత్వాన్ని ఏర్పరచినాడు. తర్వాత సత్రమునందు ఉద్ధరించి ప్రభువు ఋగ్వేదాన్ని నిర్మించినాడు.

**యజూంషి తు యజుర్వేదం సామవేదం తు సామభిః।**
**ఏకవింశతిభేదేన ఋగ్వేదం కృతవాన్పురా ॥ 18 ॥**

యజుర్మంత్రాలతో యజుర్వేదాన్ని, సామమంత్రాలతో సామవేదాన్ని ఏర్పరచినాడు. పూర్వం ఋగ్వేదాన్ని ఇరవైఒక్క భేదాలతో వ్యవస్థీకరించినాడు.

**శాఖానాన్తు శతేనైవ యజుర్వేదమథాకరోత్ ।**
**సామవేదం సహస్రేణ శాఖానాం ప్రబిభేద సః ॥ 19 ॥**

వందశాఖా భేదంతో యజుర్వేదాన్ని నిర్మించినాడు. వేయిశాఖలతో సామవేదాన్ని ఆ వ్యాసుడు కల్పించినాడు.

**అథర్వాణమథో వేదం బిభేద కుశకేతనః ।**
**భేదైరష్టాదశైర్వ్యాసః పురాణం కృతవాన్ ప్రభుః ॥ 20 ॥**

కుశకేతనుడైన ఆ ముని తర్వాత అథర్వణవేదాన్ని విభజించినాడు. పద్దెనిమిది భేదాలతో పురాణాన్ని సిద్ధపరచినాడు.

**సోఽయమేకశ్చతుష్పాదో వేదః పూర్వం పురాతనః ।**
**ఓఙ్కారో బ్రహ్మణో జాతః సర్వదోషవిశోధనః ॥ 21 ॥**

మొదట ప్రాచీనమైన వేదం ఒకటిగనే నాలుగు పాదాలు కలిగి ఉండినది. అన్నిదోషాలను శుద్ధిచేసే ఓఙ్కారం బ్రహ్మవల్ల పుట్టినది.

**వేదవిద్యోఽథ భగవాన్వాసుదేవః సనాతనః ।**
**స గీయతే పరో వేదైర్యో వేదైనం స వేదవిత్ ॥ 22 ॥**

భగవంతుడు సనాతనుడైన వాసుదేవుడు వేదవేద్యుడు. ఆ పరమపురుషుడు వేదాలచే గానం చేయబడతాడు. అతణ్ణి తెలుసుకున్నవాడే వేదవిదుడు.

**ఏతత్పరతరం బ్రహ్మ జ్యోతిరానన్దముత్తమమ్ ।**
**వేదవాక్యోదితం తత్త్వం వాసుదేవః పరమ్పదమ్ ॥ 23 ॥**

ఇది మిక్కిలి పరమైన బ్రహ్మం. ఆనందరూపమైన ఉత్తమజ్యోతి. వేదవాక్యాలు చెప్పిన తత్త్వమే వాసుదేవుడు. అతడే పరమపదం.

**వేదవిద్య ఇమం వేత్తి వేదం వేదపరో మునిః ।**
**అవేద్యం పరమం వేత్తి వేదనిఃశ్వాసకృత్పరః ॥ 24 ॥**

**స వేదవేద్యో భగవాన్ వేదమూర్తిర్మహేశ్వరః ।**
**స ఏవ వేద్యో వేదశ్చ తమేవాశ్రిత్య ముచ్యతే ॥ 25 ॥**

**ఇత్యేతదక్షరం వేదమోఙ్కారం వేదమవ్యయమ్ ।**
**అవేద్యం చ విజానాతి పారాశర్యో మహామునిః ॥ 26 ॥**

ఇతనిని తెలుసుకున్నవాడు వేదం తెలిసినవాడు. ఇతరములచే తెలియదగనివాడే వేదాలు నిఃశ్వాసగా గల పరమపురుషుడు వేదాతీతుడైన పరమాత్మ. అతణ్ణి వేదజ్ఞుడే తెలుసుకుంటాడు. వేదస్వరూపుడైన పరమేశ్వరుడు వేదాలచేతనే తెలియదగినవాడా భగవంతుడు. అతడే వేద్యుడు, వేదం కూడ. అతణ్ణి ఆశ్రయించి ముక్తుడు కావలెను. పరాశరపుత్రుడైన వేదవ్యాస మహాముని ఈ విధంగా అక్షరము, అక్షరాత్మకమైన ఓంకారస్వరూపమైన వేదాన్ని, వేదాతీతుడైన పరమాత్మను కూడ తెలుసుకున్నవాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే వేదశాఖాప్రణయనం నామ ద్విపఞ్చాశోఽధ్యాయః. ॥ 52 ॥**

శ్రీకూర్మపురాణంలో వేదశాఖాప్రణయనం అనే యాబై రెండవ అధ్యాయం ॥ 52 ॥



## త్రిపఞ్చాశోఽధ్యాయః - యాభై మూడవ అధ్యాయం

## మహాదేవావతార వర్ణనమ్ - మహాదేవావతార వర్ణనం

**సూత ఉవాచ:**-సూతుడు పలికాడు

**వేదవ్యాసావతారాణి ద్వాపరే కథితాని తు ।**
**మహాదేవావతారాణి కలౌ శృణుత సువ్రతాః ॥ 1 ॥**

ద్వాపరయుగంలోని వేదవ్యాసావతారాలు చెప్పాను. సువ్రతులారా! కలియుగంలోని మహాదేవుని అవతారాలను గూర్చి వినండి.

**ఆద్యే కలియుగే శ్వేతో దేవదేవో మహాద్యుతిః ।**
**నామ్నా హితాయ విప్రాణామభూద్వైవస్వతేఽన్తరే ॥ 2 ॥**

మొదటి కలియుగంలో దేవదేవుడు గొప్పకాంతిమంతుడు. ఆ మహాదేవుడు వైవస్వతమన్వంతరంలో శ్వేతుడు అనే పేరుతో బ్రాహ్మణుల హితంకోసం అవతరించాడు.

**హిమవచ్ఛిఖరే రమ్యే సకలే పర్వతోత్తమే ।**
**తస్య శిష్యాః ప్రశిష్యాశ్చ బభూవురమితప్రభాః ॥ 3 ॥**

రమ్యమైన హిమవచ్ఛిఖరంలో సమస్తపర్వతశ్రేష్ఠమైన దానియందు అమితతేజస్వి అయిన ఆ శ్వేతుని శిష్య ప్రశిష్యులు కూడ నివసించినారు.

**శ్వేతః శ్వేతశిఖశ్చైవ శ్వేతాస్యః శ్వేతలోహితః ।**
**చత్వారస్తే మహాత్మానో బ్రాహ్మణా వేదపారగాః ॥ 4 ॥**

శ్వేతుడు, శ్వేతశిఖుడు, శ్వేతాస్యుడు, శ్వేతలోహితుడు అనే నలుగురు మహాత్ములైన బ్రాహ్మణులు మహాత్ములు, వేదపారగులు.

**సుతారో మదనశ్చైవ సుహోత్రః కఙ్కణస్తథా ।**
**లోకాక్షి స్త్వథ యోగీన్ద్రో జైగీషవ్యోఽథ సప్తమే ॥ 5 ॥**

సుతారుడు, మదనుడు, సుహోత్రుడు, కంకణుడు, లోకాక్షి, యోగీంద్రుడు, జైగీషవ్యుడు అనే ఏడుగురు క్రమంగా మొదటి ఏడుయుగాల్లో ఉన్నారు.

**అష్టమే దధివాహః స్యాన్నవమే ఋషభః ప్రభుః ।**
**భృగుస్తు దశమే ప్రోక్తస్తస్మాదుగ్రః పురః స్మృతః ॥ 6 ॥**

**ద్వాదశేఽతిసమాఖ్యాతో బాలీ వాఽథ త్రయోదశే ।**
**చతుర్దశే గౌతమస్తు వేదదర్శీ తతః పరః ॥ 7 ॥**

అష్టమయుగంలో దధివాహుడు, తొమ్మిదవ యుగంలో ఋషభుడు, దశమయుగంలో భృగువు, తర్వాత ఉగ్రుడు, అతిసమాఖ్యాతుడు, బాలి, గౌతముడు, వేదదర్శి అనే అవతారాలు క్రమంగా ఏర్పడినవి.

**గోకర్ణశ్చాభవత్తస్మాద్గుహావాసః శిఖణ్డధృక్ ।**
**యజ్ఞమాల్యట్టహాసశ్చ దారుకో లాఙ్గలీ తథా ॥ 8 ॥**

**మహాయామో మునిః శూలీ డిణ్డముణ్డీశ్వరః స్వయమ్ ।**
**సహిష్ణుః సోమశర్మా చ నకులీశ్వర ఏవ చ ॥ 9 ॥**

తర్వాత గోకర్ణుడు, గుహావాసుడు, శిఖండధారి, యజ్ఞమాలి, అట్టహాసుడు, దారుకుడు, లాంగలి, మహాయాముడు, ముని, శూలి, డిండముండీశ్వరుడు, సహిష్ణువు, సోమశర్మ, నకులీశ్వరుడు క్రమంగా మహాదేవుని కలియుగావతారాలుగా గుర్తించాలి.

**తత్ర దేవాధిదేవస్య చత్వారః సుతపోధనాః ।**
**శిష్యా బభూవుశ్చాన్యేషాం ప్రత్యేకం మునిపుఙ్గవాః ॥ 10 ॥**

వారిలో నలుగురు గొప్ప తపోధనులు. దేవాధిదేవుని శిష్యులైనారు. మునులారా! ప్రత్యేకంగా ఇతర శిష్యులు కూడ ఉన్నారు. వారిని గూర్చి వివరిస్తాను.

**ప్రసన్నమనసో దాన్తా ఐశ్వరీం భక్తిమాస్థితాః ।**
**క్రమేణ తాన్ ప్రవక్ష్యామి యోగినో యోగవిత్తమాన్ ॥ 11 ॥**

నిర్మలచిత్తులు, జితేంద్రియులు, ఈశ్వర భక్తి నాశ్రయించిన యోగులు, యోగజ్ఞుల్లో శ్రేష్ఠులను అగు వారిని గూర్చి క్రమంగా తెలుపుతాను.

**దున్దుభిః శతరూపశ్చ ఋచీకః కేతుమాంస్తథా ।**
**విశోకశ్చ వికేశశ్చ విశాఖః శాపనాశనః ॥ 12 ॥**

**సుముఖో దుర్ముఖశ్చైవ దుర్దమో దురతిక్రమః ।**
**సనకః సనాతనశ్చైవ తథైవ చ సనన్దనః ॥ 13 ॥**

**దాల్భ్యభ్యశ్చ మహాయోగీ ధర్మాత్మానో మహౌజసః ।**
**సుధామా విరజాశ్చైవ శంఖవాణ్యజ ఏవ చ ॥ 14 ॥**

**సారస్వతస్తథాఽమోఘో ధనవాహః సువాహనః ।**
**కపిలశ్చాసురిశ్చైవ వోఢుః పఞ్చశిఖో మునిః ॥ 15 ॥**

**పరాశరశ్చ గర్గశ్చ భార్గవశ్చాఙ్గిరాస్తథా ।**
**చలబన్ధుర్నిరామిత్రః కేతుశృఙ్గస్తపోధనాః ॥ 16 ॥**

దుందుభి, శతరూపుడు, ఋచీకుడు, కేతుమంతుడు, విశోకుడు, వికేశుడు, విశాఖుడు, శాపనాశనుడు, సుముఖుడు, దుర్ముఖుడు, దుర్దముడు, దురతిక్రముడు, సనకుడు, సనాతనుడు, సనందనుడు, దాలభ్యుడు అనే గొప్ప యోగి, వీరందరు మహాశక్తిగల మహాత్ములు. సుధాముడు, విరజసుడు, శంఖపాణి, అజుడు, సారస్వతుడు, అమోఘుడు, ధనవాహుడు, సువాహనుడు, కపిలుడు, ఆసురి,వోఢువు, పంచశిఖుడనే ముని, పరాశరుడు, గర్గుడు, భార్గవుడు, అంగిరసుడు, చలబంధువు, నిరామిత్రుడు, కేతుశృంగుడు అనేవాడు, మునులారా! వీరందరు శిష్య వర్గంలోని వారు.

**లమ్బోదరశ్చ లమ్బశ్చ విక్రోశో లమ్బకః శుకః ।**
**సర్వజ్ఞః సమబుద్ధిశ్చ సాధ్యాసాధ్యస్తథైవ చ ॥ 17 ॥**

**సుధామా కాశ్యపశ్చాథ వసిష్ఠో విరజాస్తథా ।**
**అత్రిరుగ్రస్తథా చైవ శ్రవణోఽథ సువైద్యకః ॥ 18 ॥**

**కుణిశ్చ కుణిబాహుశ్చ కుశరీరః కునేత్రకః ।**
**కశ్యపో హ్యుశనా చైవ చ్యవనోఽథ బృహస్పతిః ॥ 19 ॥**

**ఉచ్చాస్యో వామదేవశ్చ మహాకాలో మహానిలిః ।**
**వాజశ్రవాః సుకేశశ్చ శ్యావాశ్వః సుపథీశ్వరః ॥ 20 ॥**

**హిరణ్యనాభః కౌశిల్యోఽకాక్షుః కుథుభిథస్తథా ।**
**సుమన్తవర్చసో విద్వాన్ కబన్ధః కుషికన్ధరః ॥ 21 ॥**

లంబోదరుడు, లంబుడు, విక్రోశుడు, లంబకుడు, శుకుడు, సర్వజ్ఞుడు, సమబుద్ధి, సాధ్యాసాధ్యుడు,సుధాముడు, కాశ్యపుడు, వసిష్ఠుడు, విరజుడు, అత్రి, ఉగ్రుడు, శ్రవణుడు, సువైద్యకుడు, కుణి, కుణిబాహువు, కుశరీరుడు, కునేత్రకుడు, కశ్యపుడు, ఉశనసుడు, చ్యవనుడు, బృహస్పతి, ఉచ్చాస్యుడు, వామదేవుడు, మహాకాలుడు, మహానిలి, వాజశ్రవసుడు, సుకేశుడు, శ్యావాస్వుడు, సుపథీశ్వరుడు, హిరణ్యనాభుడు, కౌశిల్యుడు, అకాక్షువు, కుథుభిథుడు, పండితుడు అయిన సుమంతవర్చసుడు, కబంధుడు, కుషికంధరుడు.

**ప్లక్షో దర్వ్యాయణిశ్చైవ కేతుమాన్ గౌతమస్తథా ।**
**భల్లాచీ మధుపిఙ్గశ్చ శ్వేతకేతుస్తపోధనః ॥ 22 ॥**

**ఉషిధా బృహద్రక్షశ్చ దేవలః కవిరేవ చ ।**
**శాలిహోత్రాగ్నివేశ్యస్తు యువనాశ్వః శరద్వసుః ॥ 23 ॥**

**ఛగలః కుణ్డకర్ణశ్చ కున్తశ్చైవ ప్రవాహకః ।**
**ఉలూకో విద్యుతశ్చైవ శాద్రకో హ్యాశ్వలాయనః ॥ 24 ॥**

**అక్షపాదః కుమారశ్చ హ్యులూకో వసువాహనః ।**
**కుణికశ్చైవ గర్గశ్చ మిత్రకో రురురేవ చ ॥ 25 ॥**

**శిష్యా ఏతే మహాత్మానః సర్వావర్తేషు యోగినామ్ ।**
**విమలా బ్రహ్మభుయిష్ఠా జ్ఞానయోగపరాయణాః ॥ 26 ॥**

ప్లక్షుడు, దర్వాయణి, కేతుమంతుడు, గౌతముడు, భల్లాచి, మధుపింగుడు, తపోధనుడైన శ్వేతకేతువు, ఉషిధుడు, బృహద్రక్షుడు, దేవలుడు, కవి, శాలహోత్రుడు, అగ్నివేశ్యుడు, యువనాశ్వుడు, శరద్వసువు, ఛగలుడు, కుండకర్ణుడు, కుంతుడు, ప్రవాహకుడు, ఉలూకుడు, విద్యుతుడు, శాద్రకుడు, ఆశ్వలాయనుడు, అక్షపాదుడు, కుమారుడు, ఉలూకుడు, వసువాహనుడు, కుణికుడు, గర్గుడు, మిత్రకుడు, రురువు అనే వీరందరు అన్నియుగాల ఆవర్తాల్లో ఆ యోగులకు మహాత్ములైన శిష్యులు. వీరు నిర్మలురు, బ్రహ్మజ్ఞానులు. జ్ఞానయోగంలో శ్రద్ధకలవారై ఉండిరి.

**కుర్వన్తి చావతారాణి బ్రాహ్మణానాం హితాయ చ ।**
**యోగేశ్వరాణామాదేశాద్వేదసంస్థాపనాయ వై ॥ 27 ॥**

బ్రాహ్మణుల మేలుకోసం, వేదాలను స్థాపించటానికి, యోగేశ్వరుల ఆదేశంవల్ల అవతారాలను కూడా ధరిస్తారు.

**యే బ్రాహ్మణాః సంస్మరన్తి నమస్యన్తి చ సర్వదా ।**
**తర్పయన్త్యర్చయన్త్యేతాన్ బ్రహ్మవిద్యామవాప్నుయుః ॥ 28 ॥**

బ్రాహ్మణులు ఎల్లపుడు వీరిని స్మరించి, నమస్కరించి, తృప్తిపొంది, పూజించి బ్రహ్మజ్ఞానాన్ని పొందుతారు.

**ఇదం వైవస్వతం ప్రోక్తమన్తరం విస్తరేణ తు ।**
**భవిష్యతి చ సావర్ణో దక్షసావర్ణ ఏవ చ ॥ 29 ॥**

ఈ వైవస్వతమన్వంతరాన్ని గూర్చి విస్తరంగా వివరించాను. ఇకముందు సావర్ణము, దక్షసావర్ణము అనే మన్వంతరాలు జరుగనున్నాయి.

**దశమో బ్రహ్మసావర్ణో ధర్మ ఏకాదశః స్మృతః ।**
**ద్వాదశో రుద్రసావర్ణో రోచ్యనామా త్రయోదశః ॥ 30 ॥**

బ్రహ్మసావర్ణం పదవది. ధర్మసావర్ణం పదకొండవది. పన్నెండవది రుద్రసావర్ణం. రోచ్యమనే మన్వంతరం పదమూడవది అవుతుంది.

**భౌత్యశ్చతుర్దశః ప్రోక్తో భవిష్యా మనవః క్రమాత్ ।**
**అయం వః కథితో హ్యంశః పూర్వం నారాయణేరితః ॥ 31 ॥**

భౌత్యమన్వంతరం పదునాల్గవది. క్రమంగా వీరంతా కాబోయే మనువులు. పూర్వం నారాయణుడు చెప్పిన ఈ విషయమే మీకు వివరించినాను.

**భూతైర్భవ్యైర్వర్తమానైరాఖ్యానైరుపబృంహితః ।**
**యః పఠేచ్ఛృణుయాద్వాఽపి శ్రావయేద్వా ద్విజోత్తమాన్ ॥ 32 ॥**

**సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మలోకే మహీయతే ।**
**పఠేద్దేవాలయే స్నాత్వా నదీతీరేషు చైవ హి ॥ 33 ॥**

**నారాయణం నమస్కృత్య భావేన పురుషోత్తమమ్ ।**
**నమో దేవాధిదేవాయ దేవానాం పరమాత్మనే ॥ 34 ॥**

**పురుషాయ పురాణాయ విష్ణవే ప్రభవిష్ణవే ॥**

నేను తెల్పిన ఈ ఆఖ్యానం భూత,వర్తమాన,భవిష్యత్కాలాలకు సంబంధించిన కథలతో విస్తరించనైనది. దీనిని చదివేవాడు, వినేవాడు, బ్రాహ్మణులకు వినిపించేవాడు అన్నిపాపాలు తొలగి బ్రహ్మలోకంలో పూజనందుతాడు. స్నానంచేసి దేవాలయంలోనో, నదీతీరాల్లోనో దీనిని పఠించవలెను. పురుషోత్తముడు నారాయణునకు భక్తిభావంతో నమస్కరించి చదువవలెను. దేవాధిదేవుడు దేవతలకు పరమాత్మ, పురాణపురుషుడు, సర్వసమర్థుడైన విష్ణువునకు నమస్కారం.

**ఇతి శ్రీకూర్మపురాణే పూర్వార్ధే మహాదేవావతార వర్ణనం నామ త్రిపఞ్చాశోఽధ్యాయః ॥ 53 ॥**

**పూర్వార్ధం సమాప్తమ్ ॥**

శ్రీకూర్మపురాణంలో పూర్వార్ధంలో మహాదేవావతార వర్ణనం అనే యాభై మూడవ అధ్యాయం ॥ 53 ॥

పూర్వార్ధం సమాప్తం



# కూర్మ మహాపురాణమ్

## ఉత్తరార్ధమ్

### ప్రథమోఽధ్యాయః - ఒకటవ అధ్యాయం

### ఋషివ్యాససంవాదం - ఋషివ్యాససంవాదం

**ఋషయ ఊచుః :-** ఋషులు పలికారు.

**భవతా కథితః సమ్యక్ సర్గః స్వాయమ్భువః ప్రభో ।**
**బ్రహ్మాణ్డస్యాదివిస్తారో మన్వన్తరవినిశ్చయః ॥ 1 ॥**

ప్రభూ! నీవు మాకు స్వాయంభువ మన్వంతరానికి సంబంధించిన సర్గము, బ్రహ్మాండముయొక్క మొదటి వ్యాప్తి, మన్వంతరాలనిర్ణయం చక్కగా వర్ణించావు.

**తత్రేశ్వరేశ్వరో దేవో వర్ణిభిర్ధర్మతత్పరైః ।**
**జ్ఞానయోగరతైర్నిత్యమారాధ్యః కథితస్త్వయా ॥ 2 ॥**

**తత్త్వఙ్చాశేషసంసారదుఃఖనాశమనుత్తమమ్ ।**
**జ్ఞానం బ్రహ్మైకవిషయం తేన పశ్యేమ తత్పరమ్ ॥ 3 ॥**

వానిలో దేవదేవుడు ధర్మతత్పరులైన సన్న్యాసులు. జ్ఞానయోగాసక్తులు ఆరాధింపదగిన వారని చెప్పావు. సర్వప్రపంచసంసారదుఃఖనాశకమైన కేవల పరబ్రహ్మవిషయకమైన, సర్వశ్రేష్ఠమైన తత్త్వాన్ని కూడ చెప్పారు. దాని ద్వారా పరమాత్మను చూడగల్గుతాము.

**త్వం హి నారాయణస్సాక్షాత్ కృష్ణద్వైపాయనాత్ప్రభో ।**
**అవాప్తాఖిలవిజ్ఞానస్తత్త్వాం పృచ్ఛామహే పునః ॥ 4 ॥**

ప్రభూ! నీవు సాక్షాన్నారాయణ స్వరూపుడవు. కృష్ణద్వైపాయన వ్యాసుని వల్ల సమస్త విజ్ఞానాన్ని పొందినవాడవు. అందువల్ల నిన్ను మళ్ళీ ప్రశ్నిస్తున్నాము.

**శ్రుత్వా మునీనాం తద్వాక్యం కృష్ణద్వైపాయనాత్ప్రభుః ।**
**సూతః పౌరాణికః శ్రుత్వా భాషితుం హ్యుపచక్రమే ॥ 5 ॥**

ఆ మునుల వాక్యాన్ని విని వ్యాసప్రసాదంవల్ల సమర్థుడైన సూతపౌరాణికుడు చెప్ప నారంభించినాడు.

**తథాఽస్మిన్నన్తరే వ్యాసః కృష్ణద్వైపాయనః స్వయమ్ ।**
**ఆజగామ మునిశ్రేష్ఠా యత్ర సత్త్రం సమాసతే ॥ 6 ॥**

ఓ మునీశ్వరులారా! అంతలో వేదవ్యాసుడైన కృష్ణద్వైపాయనుడు సత్త్రయాగం జరిగే ప్రదేశానికి స్వయంగా విచ్చేసినాడు.

**తం దృష్ట్వా వేదవిద్వాంసం కాలమేఘసమద్యుతిమ్ ।**
**వ్యాసం కమలపత్రాక్షం ప్రణేముర్ద్విజపుఙ్గవాః ॥ 7 ॥**

నీలమేఘ సమానకాంతిగలవాడు, వేదవిజ్ఞాననిధి, కమలపత్రాక్షుడైన ఆ వ్యాసుని చూచి బ్రాహ్మణ శ్రేష్ఠులు నమస్కరించినారు.

**పపాత దణ్డవద్భూమౌ దృష్ట్వాఽసౌ లోమహర్షణః ।**
**ప్రణమ్య శిరసా భూమౌ ప్రాఞ్జలిర్వశగోఽభవత్ ॥ 8 ॥**

రోమహర్షణుడైన సూతుడు వ్యాసుని చూచి నేలపై దండవత్ప్రణామ మాచరించినాడు. నతశిరస్కుడై, చేతులు జోడించి, విధేయుడై నిలిచినాడు.

**పృష్టాస్తేఽనామయం విప్రా శౌనకాద్యా మహామునిమ్ ।**
**సమాశ్రిత్యాసనం తస్మై తద్యోగ్యం సమకల్పయన్ ॥ 9 ॥**

ఆ వ్యాసుడు శౌనకాది మహామునులను కుశలప్రశ్నలు వేసినాడు. మునులు వ్యాసుని సమీపించి అతనికి తగిన ఆసనాన్ని కల్పించినారు.

**అథైతానబ్రవీద్వాక్యం పరాశరసుతః ప్రభుః ।**
**కచ్చిన్న హానిస్తపసః స్వాధ్యాయస్య శ్రుతస్య చ ॥ 10 ॥**

తర్వాత పరాశరమహర్షి కుమారుడైన వ్యాసభగవానుడు ఆ మునులతో ఇట్లన్నాడు. మీ తపస్సుకు, వేదాధ్యయనానికి, పాండిత్యానికి ఏ హాని లేదు కదా!

**తతశ్చ సూతః స్వగురుం ప్రణమ్యాఽఽహ మహామునిమ్ ।**
**జ్ఞానం తద్బ్రహ్మవిషయం మునీనాం వక్తుమర్హసి ॥ 11 ॥**

అనంతరం సూతుడు తనగురువు వ్యాసునకు నమస్కరించి ఇలా అన్నాడు – బ్రహ్మవిషయకజ్ఞానాన్ని ఈ మునులకు చెప్పతగినవాడవు నీవే.

**ఇమే హి మునయశ్శాన్తాస్తాపసా ధర్మతత్పరాః ।**
**శుశ్రూషా జాయతే చైషాం వక్తుమర్హసి తత్త్వతః ॥ 12 ॥**

ఈ మునులు శాంతులు, తపోనిష్ఠులు, ధర్మతత్పరులు. వీరికి ఆ జ్ఞానాన్ని గూర్చి వినాలనే కోరిక కలిగినది. ఆ తత్త్వాన్ని తెల్పటానికి తగిన వాడవు నీవే.

**జ్ఞానం విముక్తిదం దివ్యం యన్మే సాక్షాత్త్వయోదితమ్ ।**
**మునీనాం వ్యాహృతం పూర్వం విష్ణునా కూర్మరూపిణా ॥ 13 ॥**

మోక్షాన్నిచ్చే దివ్యజ్ఞానాన్నిగూర్చి పూర్వం నీవు నాకు తెల్పినావు. కూర్మరూపుడైన విష్ణువు పూర్వకాలంలో మునులకు చెప్పినదది.

**శ్రుత్వా సూతస్య వచనం మునిః సత్యవతీసుతః ।**
**ప్రణమ్య శిరసా రుద్రం వచః ప్రాహ సుఖావహమ్ ॥ 14 ॥**

సూతుని మాట విని సాత్యవతేయుడైన వ్యాసుడు శివునకు శిరసా నమస్కరించి సుఖాన్ని కూర్చే మాట నీ విధంగా పలికినాడు.

**వ్యాస ఉవాచ:–** వ్యాసుడు పలికాడు

**వక్ష్యే దేవో మహాదేవః పృష్టో యోగీశ్వరైః పురా ।**
**సనత్కుమారప్రముఖైః స స్వయం సమభాషత ॥ 15 ॥**

పూర్వం భగవంతుడైన మహాదేవుని సనత్కుమారాది యోగీశ్వరులు ప్రశ్నించినారు. అప్పుడాయన స్వయంగా ఇలా చెప్పినాడు.

**సనత్కుమారః సనకస్తథైవ చ సనన్దనః ।**
**అఙ్గిరా రుద్రసహితో భృగుః పరమధర్మవిత్ ॥ 16 ॥**

**కణాదః కపిలో గర్గో వామదేవో మహామునిః ।**
**శుక్రో వసిష్ఠో భగవాన్ సర్వే సంయతమానసాః ॥ 17 ॥**

**పరస్పరం విచార్యైతే సంయమావిష్టచేతసః ।**
**తప్తవన్తస్తపో ఘోరం పుణ్యే బదరికాశ్రమే ॥ 18 ॥**

**అపశ్యంస్తే మహాయోగమృషిం ధర్మసుతం మునిమ్ ।**
**నారాయణమనాద్యన్తం నరేణ సహితం తదా ॥ 19 ॥**

సనత్కుమారుడు, సనకుడు, సనందనుడు, అంగిరుడు, రుద్రునితో కూడ భృగువు, పరమధర్మజ్ఞుడు కణాదుడు, కపిలుడు, గర్గుడు, మహాముని వామదేవుడు, శుక్రుడు, భగవానుడైన వసిష్ఠుడు, సంయతమాన సులైన వీరందరు తమలో తాము విచారించుకొని సంయమం కల మనస్సులు కలవారై పవిత్రమైన బదరికాశ్రమంలో ఘోరతపమాచరించినారు. తర్వాత వారు మహాయోగి, ఋషి అయిన ధర్మసుతుని, ఆద్యంతరహితుడైన నారాయణుని నరునితో కూడి ఉన్న మునిని దర్శించినారు.

**సంస్తూయ వివిధైః స్తోత్రైః సర్వవేదసముద్భవైః ।**
**ప్రణేముర్భక్తిసంయుక్తా యోగినో యోగవిత్తమమ్ ॥ 20 ॥**

భక్తిసంయుక్తులైన యోగులు యోగవిత్తముడైన ఆ నారాయణమునిని సర్వవేదసముద్భవాలైన వివిధస్తోత్రాలతో స్తుతించి నమస్కరించినారు.

**విజ్ఞాయ వాఞ్ఛితం తేషాం భగవానపి సర్వవిత్ ।**
**ప్రాహ గమ్భీరయా వాచా కిమర్థం తప్యతే తపః ॥ 21 ॥**

సర్వజ్ఞుడైన భగవంతుడు వారి కోరిక తెలిసి గంభీరమైన వాక్కుతో ఎందుకు తపమాచరిస్తున్నారని ప్రశ్నించినాడు.

**అబ్రువన్ హృష్టమనసో విశ్వాత్మానం సనాతనమ్ ।**
**సాక్షాన్నారాయణం దేవమాగతం సిద్ధిసూచకమ్ ॥ 22 ॥**

సంతుష్టచిత్తులైన మునులు విశ్వాత్మ, సనాతనుడు, సంకల్పసిద్ధిని సూచిస్తూ స్వయంగా వచ్చిన నారాయణ దేవుని గూర్చి ఇట్లన్నారు.

**వయం సంయమమాపన్నాః సర్వే వై బ్రహ్మవాదినః ।**
**భవన్తమేకం శరణం ప్రపన్నాః పురుషోత్తమమ్ ॥ 23 ॥**

మేమందరం బ్రహ్మవాదులం. తపోనియమాన్నవలంబించినాము. పురుషోత్తముడవైన నిన్నొకనినే ప్రపన్నులమై శరణుపొందినాము.

**త్వం వేత్సి పరమం గుహ్యం సర్వం తు భగవానృషిః ।**
**నారాయణః స్వయం సాక్షాత్పురాణోఽవ్యక్తపూరుషః ॥ 24 ॥**

నీవు స్వయంగా నారాయణరూపుడవైన ఋషివి. అవ్యక్తపురుషుడవు. పరమ రహస్యమైన బ్రహ్మతత్త్వాన్ని నీ వెరుగుదువు.

**న హ్యన్యో విద్యతే వేత్తా త్వామృతే పరమేశ్వరమ్ ।**
**స త్వమస్మాకమచలం సంశయం ఛేత్తుమర్హసి ॥ 25 ॥**

పరమేశ్వరుడవైన నీవు తప్ప మరొకడు తెలిసినవాడు లేడు. అందువల్ల మాసంశయాన్ని నీవే తొలగించతగినవాడవు.

**కిం కారణమిదం కృత్స్నం కో ను సంసరతే సదా ।**
**కశ్చిదాత్మా చ కా ముక్తిః సంసారః కింనిమిత్తకః ॥ 26 ॥**

ఈ సమస్తానికి కారణమేది? సంసారబంధంలో ఉండే వాడెవడు? ఆత్మ అనగా ఏది? ముక్తి అనగా నేమి? సంసారానికి కారణమేది?

**కః సంసార ఇతీశానః కో వా సర్వం ప్రపశ్యతి ।**
**కిం తత్పరతరం బ్రహ్మ సర్వం నో వక్తుమర్హసి ॥ 27 ॥**

సంసార మనగా ఏది? సర్వాన్ని దర్శించే ఈశానుడెవరు? సర్వోత్తమ బ్రహ్మతత్త్వమేది? ఇదంతా మాకు చెప్పతగిన వాడవు.

**ఏవముక్త్వా తు మునయః ప్రాపశ్యన్పురుషోత్తమమ్ ।**
**విహాయ తాపసం వేషం సంస్థితం స్వేన తేజసా ॥ 28 ॥**

ఈ విధంగా పలికిన మునులు మునివేషాన్ని విడిచి తనతేజస్సుతో ప్రకాశిస్తున్న ఆ పురుషోత్తముని దర్శించినారు.

**విభ్రాజమానం విమలం ప్రభామణ్డలమణ్డితమ్ ।**
**శ్రీవత్సవక్షసం దేవం తప్తజామ్బూనదప్రభమ్ ॥ 29 ॥**

ఆ హరి నిర్మలుడు, కాంతిసమూహంతో అలంకృతుడు, వక్షఃస్థలంలో శ్రీవత్సచిహ్నం కలవాడు. కాచిన బంగారం వంటి కాంతిగలవాడై ప్రకాశిస్తున్నాడు.

**శంఖచక్రగదాపాణిం శార్ఙ్గహస్తం శ్రియావృతమ్ ।**
**న దృష్టస్తతక్షణాదేవ నరస్తస్యైవ తేజసా ॥ 30 ॥**

శంఖచక్రాలు, గద ధరించి ఉన్నాడు. శార్ఙ్గమనే ధనువు చేతపట్టినాడు. లక్ష్మీసనాథుడైన నారాయణుని చూచినారు. అతని తేజస్సమూహంలో నరుడు కన్పించలేదు.

**తదన్తరే మహాదేవః శశాఙ్కాఙ్కితశేఖరః ।**
**ప్రసాదాభిముఖో రుద్రః ప్రాదురాసీన్మహేశ్వరః ॥ 31 ॥**

ఈ లోపల చంద్రకళాధరుడు, మహాదేవుడు, ప్రసాదాభిముఖుడయిన మహేశ్వరుడచట సాక్షాత్కరించినాడు.

**నిరీక్ష్య తే జగన్నాథం త్రినేత్రం చన్ద్రభూషణమ్ ।**
**తుష్టువుర్హృష్టమనసో భక్త్యా తం పరమేశ్వరమ్ ॥ 32 ॥**

లోకనాథుడు, చంద్రభూషణుడు త్రిలోచనుడైన పరమేశ్వరుని చూచి ఆ మునులు సంతుష్టచిత్తులై భక్తితో ఆతనిని స్తుతించినారు.

**జయేశ్వర! మహాదేవ! జయ భూతపతే! శివ! ।**
**జయాశేషమునీశాన! తపసాఽభిప్రపూజిత! ॥ 33 ॥**

ఓ ఈశ్వరా! మహాదేవా! భూతాధిపతీ! శివా! నీకు జయమగుగాక. సర్వమునులకీశ్వరా! తపఃపూజితుడా! నీకు జయం.

**సహస్రమూర్తే! విశ్వాత్మన్! జగద్యన్త్రప్రవర్తక! ।**
**జయానన్తజగజ్జన్మత్రాణసంహారకారక! ॥ 34 ॥**

సహస్రమూర్తివి. విశ్వాత్మవు. లోకయంత్ర ప్రవర్తకుడవు. అనంతమైన జగత్సృష్టి, స్థితి, లయాలకు కారణమైన వాడవు. నీకు జయం.

**సహస్రచరణేశాన! శమ్భో! యోగీన్ద్రవన్దిత! ।**
**జయామ్బికాపతే! దేవ! నమస్తే! పరమేశ్వర! ॥ 35 ॥**

సహస్రచరణుడవు. యోగీంద్రవందితుడవు. శంభూ!, ఉమాపతీ!, ఓ దేవా!, ఓపరమేశ్వరా! నీకు జయం, నమస్కారం.

**సంస్తుతో భగవానీశ స్త్ర్యమ్బకో భక్తవత్సలః ।**
**సమాలిఙ్గ్య హృషీకేశం ప్రాహ గమ్భీరయా గిరా ॥ 36 ॥**

ఈ విధంగా స్తుతింపగా భక్తవత్సలుడైన ఆ త్రిలోచనుడు ప్రక్కనున్న నారాయణుని ఆలింగనం చేసుకొని గంభీరమైన వాక్కుతో ఇట్లన్నాడు.

**కిమర్థం పుణ్డరీకాక్ష! మునీన్ద్రా బ్రహ్మవాదినః ।**
**ఇమం సమాగతా దేశం కిన్ను కార్యం మయాఽచ్యుత! ॥ 37 ॥**

పుండరీకాక్షా! బ్రహ్మవాదులైన ఈమునులు ఇక్కడ కెందుకు వచ్చినారు? వీరికి నేను నెరవేర్చవలసిన పనియేమి?

**ఆకర్ణ్య తస్య తద్వాక్యం దేవదేవో జనార్దనః ।**
**ప్రాహ దేవో మహాదేవం ప్రసాదాభిముఖం స్థితమ్ ॥ 38 ॥**

ఈశ్వరుని ఈ మాటలు విన్న దేవదేవుడు నారాయణుడు ప్రసాదాభిముఖుడై ఉన్న శివునితో ఇట్లన్నాడు.

**ఇమే హి మునయో దేవ తాపసాః క్షీణకల్మషాః ।**
**అభ్యాగతానాం శరణం సమ్యగ్దర్శనకాంక్షిణామ్ ॥ 39 ॥**

దేవా! ఈ మునులు క్షీణకల్మషులు. నిన్ను చూడగోరుతున్న అభ్యాగతులకు నీవు శరణం.

**యది ప్రసన్నో భగవాన్మునీనాం భావితాత్మనామ్ ।**
**సన్నిధౌ మమ తజ్జ్ఞానం దివ్యం వక్తుమిహార్హసి ॥ 40 ॥**

హృదయంలో భావన చేసిన మహర్షులకు పూజ్యుడవైన నీవు ప్రసన్నుడవు అయితే నా సన్నిధియందు దివ్యమైన ఆ జ్ఞానాన్ని చెప్పతగి ఉన్నావు.

**త్వం హి వేత్సి స్వమాత్మానం న హ్యన్యో విద్యతే శివ! ।**
**వద త్వమాత్మనాత్మానం మునీన్ద్రేభ్యః ప్రదర్శయ ॥ 41 ॥**

ఆత్మస్వరూపం నీవు బాగా ఎరుగుదువు. ఓ శివా! ఆత్మజ్ఞుడు మరొకడు లేడు. ఈ మునీంద్రులకు ఆత్మస్వరూపాన్ని వివరించి ప్రదర్శింపుము.

**ఏవముక్త్వా హృషీకేశః ప్రోవాచ మునిపుఙ్గవాన్ ।**
**ప్రదర్శయన్యోగసిద్ధిం నిరీక్ష్య వృషభధ్వజమ్ ॥ 42 ॥**

ఇట్లా పలికి శ్రీవిష్ణువు మునీంద్రులతో వృషభధ్వజుడైన శివుని చూచి యోగసిద్ధిని ప్రదర్శిస్తూ ఇట్లన్నాడు.

**సన్దర్శనాన్మహేశస్య శంకరస్యాథ శూలినః ।**
**కృతార్థం స్వయమాత్మానం జ్ఞాతుమర్హథ తత్త్వతః ॥ 43 ॥**

మహేశ్వరుడూ, శూలధారీ అయిన శంకరుని దర్శనం వలన నిజంగా మీరు కృతార్థులు అయినట్లుగా తెలిసికోతగి ఉన్నారు.

**ద్రష్టుమర్హథ దేవేశం ప్రత్యక్షం పురతః స్థితమ్ ।**
**మమైవ సన్నిధానే స యథావద్వక్తుమీశ్వరః ॥ 44 ॥**

దేవతలకీశ్వరుడైన శివుడు ప్రత్యక్షంగా ఎదుట ఉన్నాడు. దర్శించండి. నాయెదుట ఆయన ఆత్మతత్త్వాన్ని యథారూపంగా బోధింప సమర్థుడు.

**నిశమ్య విష్ణోర్వచనం ప్రణమ్య వృషభధ్వజమ్ ।**
**సనత్కుమారప్రముఖాః పృచ్ఛన్తి స్మ మహేశ్వరమ్ ॥ 45 ॥**

విష్ణువు మాట విని వృషభధ్వజుడైన శివునికి నమస్కరించి సనత్కుమారుడు మొదలైనవారు మహేశ్వరుని ఇట్లా ప్రశ్నింప బూనుకున్నారు.

**అథాస్మిన్నన్తరే దివ్యమాసనం విమలం శివమ్ ।**
**కిమప్యచిన్త్యం గగనాదీశ్వరార్థం సముద్బభౌ ॥ 46 ॥**

ఇంతలో నిర్మలము, మంగళకరము, అచింత్యమైన దివ్యాసన మొకటి శివునికొరకు ఆకాశంనుండి సాక్షాత్కరించినది.

**తత్రాఽఽససాద యోగాత్మా విష్ణునా సహ విశ్వకృత్ ।**
**తేజసా పూరయన్విశ్వం భాతి దేవో మహేశ్వరః ॥ 47 ॥**

యోగేశ్వరుడు విశ్వకృత్తయిన ఈశ్వరుడు విష్ణువుతో కూడ ఆ ఆసనంపై కూర్చున్నాడు. ఆ మహేశ్వరుడు స్వతేజంతో విశ్వాన్ని నింపుతూ ప్రకాశిస్తున్నాడు.

**తతో దేవాధిదేవేశం శంకరం బ్రహ్మవాదినః ।**
**విభ్రాజమానం విమలే తస్మిన్దదృశురాసనే ॥ 48 ॥**

తర్వాత బ్రహ్మవాదులైన మునులు శుభ్రమైన ఆ ఆసనంలో ప్రకాశిస్తున్న దేవాధిదేవుడు శంకరుని చూశారు.

**తమాసనస్థం భూతానామీశం దదృశిరే కిల ।**
**యదన్తరా సర్వమేతద్యతోఽభిన్నమిదం జగత్ ॥ 49 ॥**

సమస్తవిశ్వం అతనిలోనే ఇమిడి ఉన్నది. జగత్తు అతనికి భిన్నం కాదు. ఆ భూతేశుని ఆసనంలో కూర్చోగా వారు చూశారు గదా!

**స వాసుదేవమీశానం ఈశం దదృశిరే పరమ్ ।**
**ప్రోవాచ పృష్టో భగవాన్మునీనాం పరమేశ్వరమ్ ॥ 50 ॥**

నారాయణునితో కూడ ఉన్న పరమపురుషుని ఈశ్వరుని ఆ మునులు దర్శించుకున్నారు. మునులు ప్రశ్నింపగా ఆ పరమేశ్వరుడు వారితో ఇట్లన్నాడు.

**తచ్ఛృణుధ్వం యథాన్యాయముచ్యమానం మయాఽనఘాః ।**
**ప్రశాన్తమనసః సర్వే విశుద్ధం జ్ఞానమైశ్వరమ్ ॥ 51 ॥**

విష్ణువు వైపు చూచి శంకరుడు పుణ్యాత్ములైన మునులారా! నేను విధివిధానంతో చెబుతున్న ఆత్మయోగాన్ని వినండి. మీరు ప్రశాంతచిత్తులై నిర్మలమైన ఈశ్వర సంబంధి జ్ఞానాన్ని వినండి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే ఋషివ్యాససంవాదే ప్రథమోఽధ్యాయః ॥ 1 ॥**

శ్రీకూర్మపురాణంలోని ఉత్తరార్ధంలో ఈశ్వరగీతోపనిషత్తులోని బ్రహవిద్యయందు యోగశాస్త్రంలో ఋషివ్యాససంవాదంలో ఒకటవ అధ్యాయం ॥ 1 ॥



## ద్వితీయోఽధ్యాయః - రెండవ అధ్యాయం

## ఋషివ్యాససంవాదమ్ - ఋషివ్యాససంవాదం

**ఈశ్వర ఉవాచ:**-ఈశ్వరుడు పలికాడు

**అవాచ్యమేతద్విజ్ఞానం మమ గుహ్యం సనాతనమ్ ।**
**యన్న దేవా విజానన్తి యతన్తోఽపి ద్విజాతయః ॥ 1 ॥**

నా సనాతనమైన ఈ విజ్ఞానం మాటలతో చెప్పశక్యం కానిది. ఓ బ్రాహ్మణులారా! దానిని దేవతలు కూడ ప్రయత్నించినా తెలుసుకోజాలరు.

**ఇదం జ్ఞానం సమాశ్రిత్య బ్రహ్మీభూతా ద్విజోత్తమాః ।**
**న సంసారం ప్రపద్యన్తే పూర్వేఽపి బ్రహ్మవాదినః ॥ 2 ॥**

ఈ జ్ఞానాన్ని సంపాదించి బ్రహ్మీభూతులైన బ్రాహ్మణోత్తములు పూర్వులైన బ్రహ్మవాదులు కూడ మళ్ళీ సంసారాన్ని పొందరు.

**గుహ్యాద్గుహ్యతమం సాక్షాద్గోపనీయం ప్రయత్నతః ।**
**వక్ష్యే భక్తిమతామద్య యుష్మాకం బ్రహ్మవాదినామ్ ॥ 3 ॥**

ఇది రహస్యంకంటె మిక్కిలి రహస్యమైనది. ప్రయత్నపూర్వకంగా దాచతగినది. ఈతత్వాన్ని భక్తియుక్తులు, బ్రహ్మవాదులైన మీకు నేడు వివరిస్తాను.

**ఆత్మాఽయం కేవలః స్వచ్ఛః శుద్ధః సూక్ష్మః సనాతనః ।**
**అస్తి సర్వాన్తరః సాక్షాచ్చిన్మాత్రస్తమసః పరః ॥ 4 ॥**

ఈ ఆత్మ కేవలం శుద్ధం, నిర్మలం, సూక్ష్మం, సనాతనం కూడ. జ్ఞానమాత్రమై అంధకారాని కతీతమై సాక్షాత్తు అన్నిటి అంతర్భాగంలో వ్యాపించి ఉన్నది.

**సోఽన్తర్యామీ స పురుషః స ప్రాణస్స మహేశ్వరః ।**
**స కాలోఽత్ర తదవ్యక్తం స చ వేద ఇతి శ్రుతిః ॥ 5 ॥**

ఆ ఆత్మ అంతర్యామి, పురుషరూపి, ప్రాణం. మహేశ్వరుడు కాలరూపుడు. అవ్యక్తం వేదనామకం అని శ్రుతి చెబుతున్నది.

**అస్మాద్విజాయతే విశ్వమత్రైవ ప్రవిలీయతే ।**
**స మాయీ మాయయా బద్ధః కరోతి వివిధాస్తనూః ॥ 6 ॥**

ఈ ఆత్మనుండి ప్రపంచం పుడుతుంది. దీనిలోనే లయిస్తుంది. మాయామయుడైన ఆ పురుషుడు మాయాబద్ధుడై వివిధ శరీరాలను సృష్టిస్తాడు.

**న చాప్యయం సంసరతి న సంసారమయః ప్రభుః ।**
**నాయం పృథ్వీ న సలిలం న తేజః పవనో నభః ॥ 7 ॥**

ఇతడు సంసారంలో చిక్కువడడు. సంసారమయుడు కూడ కాడు. భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశం అను వానిలో ఏ ఒక్కటీ కాదు.

**న ప్రాణో న మనోऽవ్యక్తం న శబ్దః స్పర్శ ఏవ చ ।**
**న రూపరసగన్ధాశ్చ నాహం కర్తా న వాగపి ॥ 8 ॥**

ఈ పురుషుడు ప్రాణం కాదు. మనసు అవ్యక్తం శబ్దం స్పర్శ కూడ కాడు. రూప, రస, గంధాలూ కాదు. అట్టి నేను కర్తను వాక్కును కూడ కాను.

**న పాణిపాదౌ నోపాయుర్న చోపస్థం ద్విజోత్తమాః! ।**
**న చ కర్తా న భోక్తా వా న చ ప్రకృతిపూరుషౌ ॥ 9 ॥**

విప్రులారా! పాణిపాదాలు, గుదము, యోని కాను. కర్తను, భోక్తను నేను కాను. ప్రకృతి, పురుషుడను కూడ కాను.

**న మాయా నైవ చ ప్రాణా న చైవ పరమార్థతః ।**
**యథా ప్రకాశతమసోః సమ్బన్ధో నోపపద్యతే ॥ 10 ॥**

**తద్వదైక్యం న సమ్బన్ధః ప్రపఞ్చపరమాత్మనోః ।**
**ఛాయాతపౌ యథా లోకే పరస్పరవిలక్షణౌ ॥ 11 ॥**

**తద్వత్ప్రపంచపురుషౌ విభిన్నౌ పరమార్థతః ।**

నేను యథార్థంగా మాయను కాను. ప్రాణాలు కాను. వెలుగు చీకట్లకు సంబంధం సమన్వయం లేనట్లే ప్రపంచ పరమాత్మల సంబంధం ఐక్యం కాదు. లోకంలో ఎండ నీడ ఏ విధంగా పరస్పరం భిన్నాలో దాని మాదిరిగానే ప్రకృతిపురుషులు కూడ వాస్తవంగా భిన్నులు.

**తథాऽऽత్మా మలినః సృష్టో వికారీ స్యాత్స్వరూపతః ॥ 12 ॥**

మలినమైన ఆత్మ జీవుడుగా స్వరూపంతో వికారం కలవాడై ఉంటాడు.

**న హి తస్య భవేన్ముక్తిర్జన్మాన్తరశతైరపి ।**
**పశ్యన్తి మునయో ముక్తాః స్వాత్మానం పరమార్థతః ॥ 13 ॥**

అట్టి వానికి వందల జన్మలైనా మోక్షం లభించదు. ముక్తులైన మునులు పరమార్థమైన తమ ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతారు.

**వికారహీనం నిర్ద్వన్ద్వ మానన్దాత్మానమవ్యయమ్ ।**
**అహం కర్తా సుఖీ దుఃఖీ కృశః స్థూలేతి యా మతిః ॥ 14 ॥**

**సా చాహంకారకర్తృత్వాదాత్మన్యారోపితా జనైః ।**
**వదన్తి వేదవిద్వాంసః సాక్షిణం ప్రకృతేః పరమ్ ॥ 15 ॥**

**భోక్తారమక్షరం బుద్ధం సర్వత్ర సమవస్థితమ్ ।**
**తస్మాదజ్ఞానమూలో హి సంసారః సర్వదేహినామ్ ॥ 16 ॥**

ఆ ఆత్మ వికారం లేనిది. రెండవది లేనిది . ఆనందరూపం. అవ్యయం. నేను కర్తను. సుఖదుఃఖాలుకలవాణ్ణి. చిక్కిపోయిన వాడను. లావైన వాడను అనే బుద్ధి అహంకారజన్యం. దానిని జనులు ఆత్మయందారోపించుకొని ప్రవర్తిస్తారు. వేదపండితులు ఆత్మను ప్రకృత్యతీతమైన దాన్నిగ సాక్షిభూతమని. భోక్త జ్ఞానరూపం, అక్షరాత్మకం, సర్వవ్యాపి అని చెప్తారు. కావున ప్రాణుల సంసారబంధం అజ్ఞానమూలకమైనదే.

**అజ్ఞానాదన్యథాజ్ఞానాత్తత్త్వం ప్రకృతిసఙ్గతమ్ ।**
**నిత్యోదితం స్వయం జ్యోతిః సర్వగః పురుషః పరః ॥ 17 ॥**

**అహఙ్కారావివేకేన కర్తాఽహమితి మన్యతే ।**
**పశ్యన్తి ఋషయోఽవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్ ॥ 18 ॥**

**ప్రధానం పురుషం బుద్ధ్వా కారణం బ్రహ్మవాదినః ।**
**తేనాయం సంగతః స్వాత్మా కూటస్థోఽపి నిరంజనః ॥ 19 ॥**

**స్వాత్మానమక్షరం బ్రహ్మ నావబుధ్యేత తత్త్వతః ।**
**అనాత్మన్యాత్మవిజ్ఞానం తస్మాద్దుఃఖం తథేతరత్ ॥ 20 ॥**

**రాగద్వేషాదయో దోషాః సర్వే భ్రాన్తినిబన్ధనాః ।**
**కర్మాణ్యస్య మహాన్దోషః పుణ్యాపుణ్యమితి స్థితిః ॥ 21 ॥**

**తద్వశాదేవ సర్వేషాం సర్వదేహసముద్భవః ।**
**నిత్యం సర్వత్ర గుహ్యాత్మా కూటస్థో దోషవర్జితః ॥ 22 ॥**

అనగా అజ్ఞానంవలన, అన్యథాజ్ఞానంవలన తత్త్వము ప్రకృతితో కలసినట్లున్నది. ఎల్లప్పుడు ఉదయంలో ఉండేదీ, స్వయంప్రకాశమూ, అంతటా ఉండేటటువంటి పరపురుషుడు అహంకారంవలన యేర్పడిన అజ్ఞానం వలన తాను కర్తని అని అనుకుంటున్నాడు. బ్రహ్మవాదులు ప్రధానపురుషుణ్ణి కారణంగా తెలుసుకొని ఆత్మ కూటస్థమైనప్పటికి నిర్వికారము. ఆ పరతత్త్వంతో ఆత్మసంబంధంపొంది తనను వస్తుతః అక్షరమైన బ్రహ్మంగా తెలుసుకోలేరు. ఆత్మ కాని దానియందు ఆత్మభావాన్ని పొంది సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. రాగద్వేషాది దోషాలన్నీ భ్రాంతిమూలకాలు. పుణ్యపాపరూపాలైన కర్మలే జీవునికి పెద్దదోషం. ఆ కర్మవల్లనే జీవులకు అన్ని రకాల శరీరాలు ఏర్పడుతున్నవి. కూటస్థుడైన పరమపురుషుడు గుహ్యస్వరూపుడు. ఎల్లపుడు దోషరహితుడుగానే అంతటాఉంటాడు.

**ఏకః సంతిష్ఠతే శక్త్యా మాయయా న స్వభావతః ।**
**తస్మాదద్వైతమేవాహుర్మునయః పరమార్థతః ॥ 23 ॥**

ఆ పురుషుడు కేవలుడుగ తనశక్తితో స్వభావసిద్ధంగా నిలిచి ఉంటాడు. మాయతో కాదు. అందువల్ల మునులు అద్వైతతత్త్వాన్నే పరమార్థమని చెబుతారు.

**భేదోఽవ్యక్తస్వభావేన సా చ మాయాత్మసంశ్రయా ।**
**యథా చ ధూమసమ్పర్కాన్నాకాశో మలినో భవేత్ ॥ 24 ॥**

**అంతఃకరణజైర్భావైరాత్మా తద్వన్న లిప్యతే ।**
**యథా స్వప్రభయా భాతి కేవలః స్ఫటికోపలః ॥ 25 ॥**

**ఉపాధిహీనో విమలస్తథైవాత్మా ప్రకాశతే ।**
**జ్ఞానస్వరూపమేవాహుర్జగదేతద్విచక్షణాః ॥ 26 ॥**

అవ్యక్తస్వభావంతోనే భేదం. ఆ మాయ జీవుని ఆశ్రయించి ఉంటుంది. పొగసంపర్కంవల్ల ఆకాశం మలినం కానట్లు. అంతఃకరణజన్యాలైన కామక్రోధాది భావాలతో ఆత్మ మలినం కాదు. తనకాంతితో స్ఫటికశిల ప్రకాశించినట్టు. ఉపాధిహీనము, విమలమై కూడ అట్లే ప్రకాశిస్తుంది. వివేకం కలవారు ఈ జగత్తును జ్ఞానస్వరూపంగానే చెబుతారు.

**అర్థస్వరూపమేవాస్య పశ్యన్త్యన్యే కుదృష్టయః ।**
**కూటస్థో నిర్గుణో వ్యాపీ చైతన్యాత్మా స్వభావతః ॥ 27 ॥**

కుదృష్టులు దీని అర్థస్వరూపాన్ని మాత్రమే చూస్తారు. కూటస్థపురుషుడు సహజంగా నిర్గుణుడు, చైతన్య రూపుడు, వ్యాపకుడు.

**దృశ్యతే హ్యర్థరూపేణ పురుషైర్జ్ఞానదృష్టిభిః ।**
**యథా స లక్ష్యతే రక్తః కేవలం స్ఫాటికో జనైః ॥ 28 ॥**

**రక్తికాద్యుపధానేన తద్వత్పరమపూరుషః ।**
**తస్మాదాత్మాక్షరః శుద్ధో నిత్యః సర్వత్రగోఽవ్యయః ॥ 29 ॥**

**ఉపాసితవ్యో మన్తవ్యః శ్రోతవ్యశ్చ ముముక్షుభిః ।**
**యదా మనసి చైతన్యం భాతి సర్వత్ర సర్వదా ॥ 30 ॥**

**యోగినః శ్రద్దధానస్య తదా సంపద్యతే స్వయమ్ ।**
**యదా సర్వాణి భూతాని స్వాత్మన్యేవాభిపశ్యతి ॥ 31 ॥**

**సర్వభూతేషు చాఽఽత్మానం బ్రహ్మ సమ్పద్యతే తదా ।**
**యదా సర్వాణి భూతాని సమాధిస్థో న పశ్యతి ॥ 32 ॥**

**ఏకీభూతః పరేణాసౌ తదా భవతి కేవలమ్ ।**
**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది స్థితాః ॥ 33 ॥**
**తదాఽసావమృతీభూతః క్షేమం గచ్ఛతి పణ్డితః ।**
**యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి ।**

**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే సదా ॥ 34 ॥**

జ్ఞాన దృష్టికల పురుషులు సగం రూపంతోనే ఉపాధివశంగా స్ఫటికం జనులకు రక్తవర్ణంగా కనిపించినట్టు కనిపిస్తున్నది. అదే విధంగా పరమ పురుషుడు జ్ఞానులకు కూడ అర్ధస్వరూపంతో భాసిస్తాడు. అందువల్లనే ఆత్మ అక్షరం, శుద్ధం, నిత్యం, అవ్యయం, సర్వవ్యాపి. మోక్షకాములు పరమాత్మను సేవించాలి. అతనిని గూర్చి ఆలోచించాలి. వినాలి. మనసులో చైతన్యం వెలిగినపుడే అంతట ఎల్లపుడు శ్రవణాదులు ఆచరించాలి. శ్రద్ధాళువైన యోగికి అపుడు స్వయంగా సిద్ధి కలుగుతుంది. సమస్తభూతాలను తనయందే, సర్వభూతాల్లో తనను ఎప్పుడు దర్శిస్తాడో అప్పుడే బ్రహ్మసాయుజ్యం కలుగుతుంది. ధ్యాన సమాధియందు సర్వభూతాలను దర్శింపనపుడు పరతత్త్వంతో ఏకీభావాన్నిపొంది కేవలరూపాన్ని పొందుతాడు. అతని మనసులోని కోరికలన్నీ విడిపోయినపుడు అతడు అమృతభావాన్నిపొంది జ్ఞానియై శుభాన్ని పొందుతాడు. ఎపుడు ప్రాణులకంటే భేదభావాన్ని, ఏకస్థితిని దర్శిస్తాడో అప్పుడే అతడు విస్తృతమైన బ్రహ్మభావాన్ని పొందగలడు.

**యదా పశ్యతి చాఽత్మానం కేవలం పరమార్థతః ॥ 35 ॥**

**మాయామాత్రం తదా సర్వం జగద్భవతి నిర్వృతమ్ ।**
**యదా జన్మజరాదుఃఖవ్యాధీనామేకభేషజమ్ ॥ 36 ॥**

**కేవలం బ్రహ్మవిజ్ఞానం జాయతేఽసౌ సదాశివః ।**
**యథా నదీ నదా లోకే సాగరేణైకతాం యయుః ॥ 37 ॥**

**తద్వదాత్మాఽక్షరేణాసౌ నిష్కలేనైకతాం వ్రజేత్ ।**
**తస్మాద్విజ్ఞానమేవాస్తి న ప్రపఞ్చో న సంస్థితిః ॥ 38 ॥**

**అజ్ఞానేనాఽఽవృతం లోకే విజ్ఞానం తేన ముహ్యతి ।**
**విజ్ఞానం నిర్మలం సూక్ష్మం నిర్వికల్పం తదవ్యయమ్ ॥ 39 ॥**

**అజ్ఞానమితరత్సర్వం విజ్ఞానమితి తన్మతమ్ ।**
**ఏతద్వః కథితం సాంఖ్యం భాషితం జ్ఞానముత్తమమ్ ॥ 40 ॥**

ఆత్మస్వరూపాన్ని కేవలం పరమార్థరూపంగా తెలుసుకున్నపుడు మాయామయమైన సర్వప్రపంచం (తొలగిపోతుంది) పొందుతుంది. జనన, వార్ధక్య, వ్యాధి, దుఃఖాలకు ముఖ్యౌషధం కేవల బ్రహ్మతత్త్వదర్శనం. ఆ జ్ఞానం కలిగినపుడు తాను సదాశివుడవుతాడు. లోకంలో నదీనదాలు సముద్రంతో ఏకత్వాన్ని పొందినట్లే ఆత్మ

నిష్కలమైన అక్షర పరబ్రహ్మంలో అభేదాన్ని పొందుతుంది. అందువల్ల విజ్ఞానం ఒకటే సత్యం. ప్రపంచంకానీ స్థితికానీ లేదు. ప్రపంచంలో విజ్ఞానం అజ్ఞానంతో కప్పబడుతున్నది. అందుచే జీవుడు మోహాన్ని పొందుతున్నాడు. విజ్ఞానం సహజంగా నిర్మలం. అందుచేత సూక్ష్మం, వికల్పశూన్యం, నాశరహితం. దీనికి భిన్నమైనదంతా అజ్ఞానమే. ప్రాచీనులు చెప్పిన ఈ సాంఖ్యతత్త్వం శ్రేష్ఠమైనది. మీకు వివరించినాను.

**సర్వవేదాంతసారం హి యోగస్తత్రైకచిత్తతా ।**
**యోగాత్సంజాయతే జ్ఞానం జ్ఞానాద్యోగః ప్రవర్తతే ॥ 41 ॥**

ఆ విషయంలో ఏకాగ్రత సర్వవేదాంతసారమైన యోగం. యోగంవల్ల జ్ఞానం. జ్ఞానంవల్ల యోగం ప్రవర్తిస్తుంది.

**యోగజ్ఞానాభియుక్తస్య నావాప్యం విద్యతే క్వచిత్ ।**
**యదేవ యోగినో యాన్తి సాంఖ్యైస్తదతిగమ్యతే ॥ 42 ॥**

యోగజ్ఞానాలతో కూడ ఉన్నవానికి పొందరానిది ఏదీ ఎక్కడా ఉండదు. యోగులు పొందేదే సాంఖ్యులు పొందుతారు.

**ఏకం సాంఖ్యఞ్చ యోగఞ్చ యః పశ్యతి స తత్త్వవిత్ ।**
**అన్యే హి యోగినో విప్రా హ్యైశ్వర్యాసక్తచేతసః ॥ 43 ॥**

సాంఖ్యం, యోగం రెంటిని ఒకటిగా చూచేవాడు తత్త్వమెరిగిన వాడవుతాడు.ఇతర యోగులు ఐశ్వర్యమందాసక్తి కలవారు మాత్రమే.

**మజ్జన్తి తత్ర తత్రైవ యే చాన్యే కుణ్ఠబుద్ధయః ।**
**యత్తత్సర్వమతం దివ్యమైశ్వర్యమమలం మహత్ ॥ 44 ॥**

అల్పబుద్ధులైన ఇతరులు అచ్చటచ్చటనే మునుగుతుంటారు. అమలము, దివ్యము, గొప్పదైన ఐశ్వర్యం సర్వసమ్మతమైనది.

**జ్ఞానయోగాభియుక్తస్తు దేహాన్తే తదవాప్నుయత్ ।**
**ఏష ఆత్మాఽహమవ్యక్తో మాయావీ పరమేశ్వరః ॥ 45 ॥**

దానిని జ్ఞానయోగనిష్ఠుడు శరీరాంతకాలంలో పొందుతాడు. ఆత్మస్వరూపుడనైన ఈ నేను అవ్యక్తుడను. మాయావి అయిన పరమేశ్వరుడను.

**కీర్తితః సర్వవేదేషు సర్వాత్మా సర్వతోముఖః ।**
**సర్వరూపః సర్వరసః సర్వగన్ధోఽజరోఽమరః ॥ 46 ॥**

వేదాలన్నీ కీర్తించిన సర్వాత్మకుడు, సర్వతోముఖుడు, సర్వరూపరసగంధాలు కలవాడు. జరామరణాలు లేనివాడు నేనే.

**సర్వతః పాణిపాదోఽహమన్తర్యామీ సనాతనః ।**
**అపాణిపాదో జవగో గ్రహీతా హృది సంస్థితః ॥ 47 ॥**

అన్ని దిక్కుల హస్తపాదాలుకల నేను అంతర్యామిని, సనాతనుడను, పాణిపాదాలు లేనివాణ్ణి వేగంగా వెళ్ళేవాణ్ణి, గ్రహించేవాణ్ణి, హృదయంలో ఉండే వాణ్ణి.

**అచక్షురపి పశ్యామి తథాఽకర్ణః శృణోమ్యహమ్ ।**
**వేదాహం సర్వమేవేదం న మాం జానాతి కశ్చన ॥ 48 ॥**

నేత్రాలు లేకున్నా చూస్తున్నాను. చెవులు లేకున్నా వినేవాణ్ణి, సమస్తాన్ని నేను తెలుసు కుంటాను, నన్నెవడు తెలియలేడు.

**ప్రాహుర్మహాన్తం పురుషం మామేకం తత్త్వదర్శినః ।**
**పశ్యన్తి ఋషయో హేతుమాత్మనః సూక్ష్మదర్శినః ॥ 49 ॥**

తత్త్వాన్ని గ్రహించినవారు నన్ను ఒక్కనినే మహాపురుషుడంటారు. సూక్ష్మదర్శినులయిన ఋషులు ఆత్మకు కారణభూతునిగా నన్ను చూస్తున్నారు.

**నిర్గుణామలరూపస్య యదైశ్వర్యమనుత్తమమ్ ।**
**యన్న దేవా విజానన్తి మోహితా మమ మాయయా ॥ 50 ॥**

నిర్గుణము, అమలరూపం కల పరమపురుషుని సర్వశ్రేష్ఠమైన ఐశ్వర్యాన్ని దేవతలు కూడ నామాయతో మోహితులై తెలియలేరు.

**వక్ష్యే సమాహితా యూయం శృణుధ్వం బ్రహ్మవాదినః ।**
**నాహం ప్రశస్తః సర్వస్య మాయాతీతః స్వభావతః ।**

**ప్రేరయామి తథాఽపీదం కారణం సూరయో విదుః ॥ 51 ॥**

ఓ బ్రహ్మవాదులైన మునులారా! దానిని గూర్చి మీకు వివరిస్తాను. మీరు సావధానులై వినండి. సహజంగానే మాయాతీతుడనైన నేను ప్రశస్తుడనై, ప్రేరేపించటం లేదు. అయినా పండితులు నన్ను కారణంగా గుర్తిస్తారు.

**యతో గుహ్యతమం దేహం సర్వగం తత్త్వదర్శినః ॥ 52 ॥**

**ప్రవిష్టా మమ సాయుజ్యం లభన్తే యోగినోఽవ్యయమ్ ।**
**యే హి మాయామతిక్రాన్తా మమ యా విశ్వరూపిణీ ॥ 53 ॥**

తత్త్వవేత్తలు మిక్కిలి రహస్యమైన, సర్వగతమైన శరీరాన్ని ప్రవేశించిన ఏ యోగులు నా సాయుజ్యాన్ని పొందుతారో విశ్వరూపిణి అయిన నామాయను ఎవరు అతిక్రమిస్తారో, వారు శుద్ధము, శ్రేష్ఠమైన మోక్షపదవిని పొంది నాతో కలుస్తారు.

**లభన్తే పరమం శుద్ధం నిర్వాణం తే మయా సహ ।**
**న తేషాం పరమా వృత్తిః కల్పకోటిశతైరపి ॥ 54 ॥**

**ప్రసాదాన్మమ యోగీన్ద్రా ఏతద్వేదానుశాసనమ్ ।**
**తత్పుత్రశిష్యయోగిభ్యో దాతవ్యం బ్రహ్మవాదిభిః ।**

**మదుక్తమేతద్విజ్ఞానం సాంఖ్యం యోగసమాశ్రయమ్ ॥ 55 ॥**

మళ్లీవారికి కోటి కల్పాలవరకైనా పునరావృత్తి లేదు. యోగీశ్వరులారా! నా అనుగ్రహంవల్ల ఈ వేద మార్గోపదేశాన్ని బ్రహ్మవాదులు పుత్రులకు, శిష్యులకు, యోగులకు మాత్రమే ఉపదేశించవలెను. ఇది యోగసంబంధమైన సాంఖ్య విజ్ఞానం వివరించినాను.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వర గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే ఋషివ్యాససంవాదే ద్వితీయోఽధ్యాయః ॥ 2 ॥**

శ్రీ కూర్మపురాణం ఉత్తరార్ధంలో ఈశ్వరగీతోపనిషత్తు బ్రహ్మవిద్యయోగశాస్త్రంలో ఋషివ్యాససంవాదంలో రెండవ అధ్యాయం. ॥ 2 ॥



## **తృతీయోఽధ్యాయః** - మూడవ అధ్యాయం
## **ఋషివ్యాససంవాదమ్** - ఋషివ్యాససంవాదం

**ఈశ్వర ఉవాచ:**-ఈశ్వరుడు పలికాడు

**అవ్యక్తాదభవత్కాలః ప్రధానం పురుషః పరః ।**
**తేభ్యః సర్వమిదం జాతం తస్మాద్బ్రహ్మమయం జగత్ ॥ 1 ॥**

అవ్యక్తదశనుండి కాలం పుట్టినది. ఆ దశనుండే ప్రధానం పురుషుడు కూడ పుట్టినారు. వానినుండి ఈ సమస్తం జనించినది. అందువల్ల ప్రపంచం బ్రహ్మమయమైనది.

**సర్వతః పాణిపాదాన్తం సర్వతోఽక్షిశిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 2 ॥**

బ్రహ్మం అన్నివైపుల కాళ్ళు, చేతులు, కన్నులు, తలలు, ముఖాలు, చెవులు వ్యాపించి మొత్తాన్ని ఆవరించి ఉంటుంది.

**సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।**
**సర్వాధారీం సదాఽనన్తమవ్యక్తం ద్వైతవర్జితమ్ ॥ 3 ॥**

అన్ని ఇంద్రియాల గుణాల ఆభాసం కలది. అన్ని ఇంద్రియాలనూ విడిచినది. అన్నిటి కాధారమైనది. అంతం లేనిది. అవ్యక్తం, అద్వైతం బ్రహ్మస్వరూపం.

**సర్వోపమానరహితం ప్రమాణాతీతగోచరమ్ ।**
**నిర్వికల్పం నిరాభాసం సర్వావాసం పరామృతమ్ ॥ 4 ॥**

సమస్తోపమానాలు లేనిది. ప్రమాణాలకు అతీతంగా గోచరించేది. అవికల్పం ఆభాసరహితం. అన్నిటి కాధారమై, శ్రేష్ఠమై, అమృతరూపం కలది.

**అభిన్నం భిన్నసంస్థానం శాశ్వతం ధ్రువమవ్యయమ్ ।**
**నిర్గుణం పరమం జ్యోతిస్తజ్జ్ఞానం సూరయో విదుః ॥ 5 ॥**

అభిన్నం, భిన్నాల కూర్పుకలది. శాశ్వతం, స్థిరం, అవినాశి, గుణహీనం, పరమమైన జ్యోతి అయిన ఆ జ్ఞానాన్ని పండితులు గుర్తిస్తారు.

**స ఆత్మా సర్వభూతానాం స బాహ్యాభ్యన్తరః పరః ।**
**సోఽహం సర్వత్రగః శాన్తో జ్ఞానాత్మా పరమేశ్వరః ॥ 6 ॥**

సర్వభూతాల కతడాత్మ. బాహ్యాభ్యంతరరూపి. అటువంటి నేను అంతట నిండిన వాడను. శాంతుడను, జ్ఞానరూప, పరమేశ్వరుడను.

**మయా తతమిదం విశ్వం జగత్ స్థావరజఙ్గమమ్ ।**
**మత్స్థాని సర్వభూతాని యస్తం వేదవిదో విదుః ॥ 7 ॥**

స్థావరజంగమాత్మకమైన ఈ విశ్వాన్ని నేను వ్యాపించి ఉన్నాను. ప్రాణులన్నీ నాలో ఉన్నవి. అట్టి ఆత్మను వేదవిదులు గుర్తిస్తారు.

**ప్రధానం పురుషశ్చైవ తద్వస్తు సముదాహృతమ్ ।**
**తయోరనాదిరుద్దిష్టః కాలః సంయోగజః పరః ॥ 8 ॥**

ఆ తత్త్వం ప్రధానం, పురుషరూపమని చెప్పనైనది. ఆ రెండింటి సంయోగంవల్ల కలిగినది, అనాది అయిన కాలమని చెప్పనైనది.

**త్రయమేతదనాద్యన్తమవ్యక్తే సమవస్థితమ్ ।**
**తదాత్మకం తదన్యత్ స్యాత్తద్రూపం మామకం విదుః ॥ 9 ॥**

ప్రధానం, పురుషుడు, కాలం అనే మూడు ఆద్యంతరహిత అవ్యక్తతత్త్వంలో నిలిచినవి. దాని స్వరూపంకలది. తద్భిన్నమైనది. ఆ రూపం నాదని తెలుసుకొంటారు.

**మహదాద్యం విశేషాన్తం సంప్రసూతేఽఖిలం జగత్ ।**
**యా సా ప్రకృతిరుద్దిష్టా మోహినీ సర్వదేహినామ్ ॥ 10 ॥**

ప్రకృతి మహత్తత్త్వం మొదలుకొని విశేషంవరకు సమస్తలోకాన్ని సృష్టిస్తుంది. ఆ ప్రకృతి సర్వప్రాణులను మోహింపచేస్తుంది.

**పురుషః ప్రకృతిస్థో వై భుఙ్క్తే యః ప్రాకృతాన్గుణాన్ ।**
**అహఙ్కారవిముక్తత్వాత్ ప్రోచ్యతే పంచవింశకః ॥ 11 ॥**

ప్రకృతిలో ఉన్న జీవరూపపురుషుడు ప్రకృతి గుణాలననుభవిస్తూ అహంకార విముక్తుడయినందువల్ల 'పంచవింశకః' 25వ తత్త్వంగా చెప్పబడినాడు.

**ఆద్యో వికారః ప్రకృతేర్మహానితి చ కథ్యతే ।**
**విజ్ఞాతృశక్తివిజ్ఞానాత్ హ్యహఙ్కారస్తదుత్థితః ॥ 12 ॥**

ప్రకృతి మొదటివికారం మహత్తు. తెలుసుకొనే శక్తి ఉన్నందువల్ల దానినుండి అహంకారం కల్గినది.

**ఏక ఏవ మహానాత్మా సోఽహఙ్కారోఽభిధీయతే ।**
**స జీవః సోఽన్తరాత్మేతి గీయతే తత్త్వచిన్తకైః ॥ 13 ॥**

మహత్ రూపమైన ఆత్మ ఒక్కటే. అదే అహంకారమని చెప్పబడినది. తత్త్వవిమర్శకులు జీవుడని, అంతరాత్మ అని ఆ ఆత్మనే పేర్కొంటున్నారు.

**తేన వేదయతే సర్వం సుఖం దుఃఖం చ జన్మసు ।**
**స విజ్ఞానాత్మకస్తస్య మనః స్యాదుపకారకమ్ ॥ 14 ॥**

జన్మల్లోని సమస్తసుఖదుఃఖాలు దానివల్లనే తెలుస్తున్నాయి. ఈ ఆత్మ విజ్ఞానాత్మకం, మనసు దానికి ఉపకరిస్తుంది.

**తేనాపి తన్మయస్తస్మాత్సంసారః పురుషస్య తు ।**
**సదాఽవివేకః ప్రకృతౌ సంగాత్కాలేన సోఽభవత్ ॥ 15 ॥**

దానితో తన్మయమైన సంసారం జీవునికి ఏర్పడుతుంది. ఆ జీవుడు కాలంతో ప్రకృతిసంబంధంవల్ల వివేకశూన్యుడవుతున్నాడు.

**కాలః సృజతి భూతాని కాలః సంహరతే ప్రజాః ।**
**సర్వే కాలస్య వశగా న కాలః కస్యచిద్వశే ॥ 16 ॥**

కాలం ప్రాణులను సృజిస్తుంది. కాలం ప్రజలను సంహరిస్తుంది. అన్నీ కాలానికి వశమైనవే. కాలం దేనికీ వశం కాదు.

**సోఽన్తరా సర్వమేవేదం నియచ్ఛతి సనాతనః ।**
**ప్రోచ్యతే భగవాన్ ప్రాణః సర్వజ్ఞః పురుషోత్తమః ॥ 17 ॥**

ఆ కాలం సనాతనం. అది ఈ సర్వాన్నీ నియమించుతుంది. భగవంతుడనీ సర్వజ్ఞుడనీ పురుషోత్తముడని అది చెప్పనైనది.

**సర్వేన్ద్రియేభ్యః పరమం మన ఆహుర్మనీషిణః ।**
**మనసశ్చాప్యహఙ్కార అహఙ్కారాన్మహాన్పరః ॥ 18 ॥**

ఇంద్రియాలన్నింటిలో మనస్సు శ్రేష్ఠమైనదని పండితులు చెబుతారు. మనసుకంటె అహంకారం, దానికంటె మహత్తత్త్వం గొప్పదని కూడ వారు చెబుతున్నారు.

**మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః ।**
**పురుషాద్భగవాన్ ప్రాణస్తస్య సర్వమిదం జగత్ ॥ 19 ॥**

మహత్తుకంటె అవ్యక్తం పరమైనది. అవ్యక్తంకంటె పురుషుడధికుడు. అతనివల్ల భగవద్రూపమైన ప్రాణం (జీవుడు) కలుగుతున్నాడు. ఈ లోకమంతా ఆ జీవునిదే.

**ప్రాణాత్పరతరం వ్యోమ వ్యోమాతీతోఽగ్నిరీశ్వరః ।**
**సోఽహం బ్రహ్మాఽవ్యయః శాన్తో మాయాతీతమిదం జగత్ ॥ 20 ॥**

ప్రాణంకంటె ఆకాశం పరతరమైనది. దానికతీతమైన అగ్ని ఈశ్వరరూపుడు. అట్టి నేను అవినాశి అయిన బ్రహ్మను. శాంతుడను. ఈ జగత్తు మాయకతీతమైనది.

**నాస్తి మత్తః పరం భూతం మాఞ్చ విజ్ఞాయ ముచ్యతే ।**
**నిత్యం నాస్తీతి జగతి భూతం స్థావరజఙ్గమమ్ ॥ 21 ॥**

నాకంటె పరమైన ప్రాణిలేదు. నన్ను తెలిసికొనియే ముక్తినందును, ప్రపంచంలో స్థావరజంగమాత్మకమైన దేదీ నిత్యం కాదని గుర్తించండి.

**ఋతే మామేవమవ్యక్తం వ్యోమరూపం మహేశ్వరమ్ ।**
**సోఽహం సృజామి సకలం సంహరామి సదా జగత్ ॥ 22 ॥**

అవ్యక్తుడను, ఆకాశరూపుడను. మహేశ్వరుడనైన నన్ను విడచి నిత్యమైన దేదీ లేదు. ఆ నేను సమస్తవిశ్వాన్ని సృష్టిస్తాను. మళ్ళీ సంహరిస్తుంటాను.

**మాయీ మాయామయో దేవః కాలేన సహ సఙ్గతః ।**
**మత్సన్నిధావేష కాలః కరోతి సకలం జగత్ ।**
**నియోజయత్యనన్తాత్మా హ్యేతద్వేదానుశాసనమ్ ॥ 23 ॥**

మాయామయుడు, మాయి అయిన ఈశ్వరుడు కాలంతో కలువగా కాలం నాసన్నిధానంలో సకలలోకాన్ని సృష్టిస్తుంది. అనంతాత్మస్వరూపుడైన భగవంతుడు సమస్తాన్ని నియమిస్తుంటాడు. ఇది వేదాల్లోని అనుశాసనం.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే ఋషివ్యాససంవాదే తృతీయోఽధ్యాయః ॥ 3 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ఈశ్వరగీతోపనిషత్తునందు బ్రహ్మవిద్య అయిన యోగశాస్త్రంలో ఋషివ్యాస సంవాదమనే మూడవ అధ్యాయం ॥ 3 ॥



## చతుర్థోఽధ్యాయః -నాల్గవ అధ్యాయం
## ఋషివ్యాససంవాదః - ఋషివ్యాససంవాదం

**ఈశ్వర ఉవాచ:**-ఈశ్వరుడు పలికాడు

**వక్ష్యే సమాహితా యూయం శృణుధ్వం బ్రహ్మవాదినః ।**
**మాహాత్మ్యం దేవదేవస్య యేన సర్వం ప్రవర్తతే ॥ 1 ॥**

బ్రహ్మవాదులారా! దేవదేవునిచేత సమస్తం ప్రవర్తిస్తున్నది. అతని మాహాత్మ్యాన్ని వివరిస్తాను. సావధానులై వినండి.

**నాహం తపోభిర్వివిధైర్న దానేన న చేజ్యయా ।**
**శక్యో హి పురుషైర్జ్ఞాతుమృతే భక్తిమనుత్తమామ్ ॥ 2 ॥**

నేను వివిధ తపస్సులచేత, దానంచేత, యజ్ఞకర్మతోను తెలియ శక్యుడను కాను. శ్రేష్ఠమైన భక్తిచేత మాత్రమే తెలిసేవాణ్ణి. మరొక విధంగా కాదు.

**అహం హి సర్వభూతానామన్తస్తిష్ఠామి సర్వతః ।**
**మాం సర్వసాక్షిణం లోకో న జానాతి మునీశ్వరాః ॥ 3 ॥**

నేను సమస్తభూతాలలో అంతటా వ్యాపించి ఉంటాను. మునీశ్వరులారా! ఈలోకం సర్వసాక్షినైన నన్ను సరిగా గుర్తించదు.

**యస్యాన్తరా సర్వమిదం యో హి సర్వాన్తకః పరః ।**
**సోఽహం ధాతా విధాతా చ కాలోఽగ్నిర్విశ్వతోముఖః ॥ 4 ॥**

ఈ సమస్తం నాలో నిండి ఉండును. గొప్పలయకారకుడను. అట్టి నేను ధాతను, విధాతను, కాలాన్ని, అగ్నిని, అంతట ముఖాలు కలవాణ్ణి.

**న మాం పశ్యన్తి మునయః సర్వే పితృదివౌకసః ।**
**బ్రహ్మా చ మనవః శక్రో యే చాన్యే ప్రథితౌజసః ॥ 5 ॥**

మునులు, పితృదేవతలు, దేవతలు, బ్రహ్మ, మనువులు, ఇంద్రుడు ఇంకా ఇతరులు మహిమాన్వితులుగా ప్రసిద్ధులైన వారెవ్వరూ నన్ను చూడలేరు.

**గృణన్తి సతతం వేదా మామేకం పరమేశ్వరమ్ ।**
**యజన్తి వివిధైర్యజ్ఞైః బ్రాహ్మణాః వైదికైర్మఖైః ॥ 6 ॥**

వేదాలెల్లపుడు నన్నొక్కణ్ణే పరమేశ్వరునిగా వర్ణిస్తాయి. బ్రాహ్మణుడు వివిధ వేదవిహితయజ్ఞాలతో నన్ను పూజిస్తాడు.

**సర్వే లోకా న పశ్యన్తి బ్రహ్మా లోకపితామహః ।**
**ధ్యాయన్తి యోగినో దేవం భూతాధిపతిమీశ్వరమ్ ॥ 7 ॥**

లోకపితామహుడైన బ్రహ్మ, సమస్తలోకాలు నన్ను చూడలేరు. యోగులు భూతాధిపతి, ఈశ్వరుడు అయిన భగవంతుని నన్ను ధ్యానిస్తారు.

**అహం హి సర్వహవిషాం భోక్తా చైవ ఫలప్రదః ।**
**సర్వదేవతనుర్భూత్వా సర్వాత్మా సర్వసంప్లుతః ॥ 8 ॥**

నేనే హవిస్సుల భోక్తను. ఫలాల నిచ్చేవాణ్ణి. సర్వదేవతా శరీరుడనై, సర్వాత్మకుడనైన నేను అంతటా వ్యాపించిన వాడను.

**మాం పశ్యన్తీహ విద్వాంసో ధార్మికా వేదవాదినః ।**
**తేషాం సన్నిహితో నిత్యం యే మాం నిత్యముపాసతే ॥ 9 ॥**

వేదవాదులు, ధర్మస్వరూపులు, పండితులు నన్ను దర్శిస్తున్నారు. నన్నెల్లపుడు సేవించే వారికి అందుబాటులో ఉంటాను.

**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా ధార్మికా మాముపాసతే ।**
**తేషాం దదామి తత్స్థానమానన్దం పరమం పదమ్ ॥ 10 ॥**

ధర్మస్వభావులైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు నన్ను పూజిస్తారు. వారికి ఆనందమయమైన పరమపదాన్ని ప్రసాదిస్తాను.

**అన్యేఽపి యే స్వధర్మస్థాః శూద్రాద్యా నీచజాతయః ।**
**భక్తిమన్తః ప్రముచ్యన్తే కాలేనాపి హి సంగతాః ॥ 11 ॥**

శూద్రులు మొదలైన ఇతర జాతులవారు తమధర్మాన్నవలంబించి భక్తికలవారై సేవించేవారు కూడ కాలం కలిసి రాగా ముక్తిని పొందుతారు.

**మద్భక్తా న వినశ్యన్తి మద్భక్తా వీతకల్మషాః ।**
**ఆదావేవ ప్రతిజ్ఞాతం న మే భక్తః ప్రణశ్యతి ॥ 12 ॥**

నా భక్తులు నశించరు. పాపాలు తొలగిన వారౌతారు. నా భక్తుడు నశించడని మొదటనే ప్రతిజ్ఞ చేసినాను.

**యో వై నిన్దతి తం మూఢో దేవదేవం స నిన్దతి ।**
**యో హి పూజయతే భక్త్యా స పూజయతి మాం సదా ॥ 13 ॥**

అట్టి భక్తుని నిందించిన మూఢుడు దేవదేవుని నిందించిన వాడవుతాడు. భక్తితో నా భక్తుని ఆరాధించిన వాడు నన్ను పూజించిన వాడవుతాడు.

**పత్రం పుష్పం ఫలం తోయం మదారాధనకారణాత్ ।**
**యో మే దదాతి సతతం స మే భక్తః ప్రియో మమ ॥ 14 ॥**

పత్రం, పుష్పం, ఫలం, జలం అనే వస్తువులను నాపూజకొరకు అర్పించేవారు నాకు ప్రియమైన భక్తులు, ఇష్టులు కూడ.

**అహం హి జగతామాదౌ బ్రహ్మాణం పరమేష్ఠినమ్ ।**
**విదధౌ దత్తవాన్వేదానశేషానాత్మనిఃసృతాన్ ॥ 15 ॥**

మొట్టమొదట పరమేష్ఠి అయిన బ్రహ్మను సృష్టించినాను. నావల్ల వెల్వడిన వేదాల నతని కిచ్చినాను.

**అహమేవ హి సర్వేషాం యోగినాం గురురవ్యయః ।**
**ధార్మికాణాఞ్చ గోప్తాఽహం నిహన్తా వేదవిద్విషామ్ ॥ 16 ॥**

నేను సర్వయోగులకు అవ్యయుడనైన గురువును. ధర్మాత్ములను కాపాడే వాణ్ణి. వేదనిందకులను సంహరించే వాణ్ణి నేనే.

**అహం హి సర్వసంసారాన్మోచకో యోగినామిహ ।**
**సంసారహేతురేవాహం సర్వసంసారవర్జితః ॥ 17 ॥**

ఈ లోకంలో యోగులకు సంసారబంధవిముక్తి కల్గించేవాడను నేనే. సంసారానికి కారణభూతుడను. సంసార బంధంలేనివాణ్ణి నేనే.

**అహమేవ హి సంహర్తా సంస్రష్టా పరిపాలకః ।**
**మాయా వై మామికా శక్తిర్మాయా లోకవిమోహినీ ॥ 18 ॥**

నేనే సంహరిస్తాను, సృష్టిస్తాను, రక్షిస్తాను, మాయ అనేది నాశక్తి, మాయ లోకాలను మోహింపచేస్తుంది.

**మమైవ చ పరాశక్తిర్యా సాఽవిద్యేతి గీయతే ।**
**నాశయామి చ తాం మాయాం యోగినాం హృది సంస్థితః ॥ 19 ॥**

నా పరాశక్తియే అవిద్య అని కీర్తింపబడేది. యోగులహృదయంలో ఉండి దాన్ని నశింప చేస్తున్నాను.

**అహం హి సర్వశక్తీనాం ప్రవర్తకనివర్తకః ।**
**ఆధారభూతః సర్వాసాం నిధానమమృతస్య చ ॥ 20 ॥**

అన్ని శక్తులను ప్రవర్తింపచేసేది, నివర్తింపచేసేది నేనే. శక్తులన్నింటికి నేనే ఆధారం. అమృతానికి నిధినినేనే.

**ఏకా సర్వాన్తరా శక్తిః కరోతి వివిధం జగత్ ।**
**ఆస్థాయ బ్రహ్మణో రూపం మన్మయీ మదధిష్ఠితా ॥ 21 ॥**

అన్నిటిలో నిండి ఉన్న ఒక శక్తి సమస్తప్రపంచాన్ని నిర్మిస్తున్నది. బ్రహ్మరూపాన్ని ధరించి నాస్వరూపాన్ని పొంది ఆ శక్తి నన్నాశ్రయించి పనిచేస్తుంది.

**అన్యా చ శక్తిర్విపులా సంస్థాపయతి మే జగత్ ।**
**భూత్వా నారాయణోఽనన్తో జగన్నాథో జగన్మయః ॥ 22 ॥**

మరో విశాలమైన నా శక్తి లోకాన్ని స్థాపిస్తుంది. అనంతుడు జగన్నాథుడు జగన్మయుడైన నారాయణరూపంతో ఆ పని చేస్తుంది.

**తృతీయా మహతీ శక్తిర్నిహన్తి సకలం జగత్ ।**
**తామసీ మే సమాఖ్యాతా కాలాఖ్యా రుద్రరూపిణీ ॥ 23 ॥**

మూడవదైన నాగొప్పశక్తి సమస్తవిశ్వాన్ని లయింపచేస్తుంది. అది తమోగుణప్రధానమై కాలమనే పేరుతో రుద్రరూపంతో ఉంటుంది.

**ధ్యానేన మాం ప్రపశ్యన్తి కేచిత్ జ్ఞానేన చాపరే ।**
**అపరే భక్తియోగేన కర్మయోగేన చాపరే ॥ 24 ॥**

నన్ను కొందరు ధ్యానంతో, మరికొందరు జ్ఞానమార్గంతో దర్శిస్తారు. ఇతరులు భక్తి, కర్మయోగాలతో సాక్షాత్కరించుకుంటారు.

**సర్వేషామేవ భక్తానామిష్టః ప్రియతమో మమ ।**
**యో హి జ్ఞానేన మాం నిత్యమారాధయతి నాన్యథా ॥ 25 ॥**

అన్నివిధాల భక్తుల్లోను జ్ఞానంతో ఎల్లపుడు నన్నారాధిస్తూ ఇతర పద్ధతి నాశ్రయింపని వాడు, నాకు ప్రియమైనవాడు ఇష్టుడు అవుతున్నాడు.

**అన్యే చ హరయే భక్తా మదారాధనకారిణః ।**
**తేఽపి మాం ప్రాప్నువన్త్యేవ నావర్తన్తే చ వై పునః ॥ 26 ॥**

విష్ణుభక్తులైనవారు జ్ఞానమార్గంతో నన్నెల్లప్పుడు ఆరాధిస్తే వారు కూడ నన్ను చేరుకొని జన్మపరంపరను మళ్ళీ పొందరు.

**మయా తతమిదం కృత్స్నం ప్రధానపురుషాత్మకమ్ ।**
**మయ్యేవ సంస్థితం చిత్తం మయా సంప్రేర్యతే జగత్ ॥ 27 ॥**

ప్రధానపురుషస్వరూపం అయిన ఈ విశ్వం అంతా నాచేతనే వ్యాపించబడింది. మనస్సు నాలోనే నిలిచి ఉన్నది. ఈ లోకాన్ని నేనే ప్రేరేపిస్తున్నాను.

**నాహం ప్రేరయితా విప్రాః! పరమం యోగమాస్థితః ।**
**ప్రేరయామి జగత్కృత్స్నమేతద్యో వేద సోఽమృతః ॥ 28 ॥**

గొప్ప యోగినైన నేను ప్రేరకుడను కాను. బ్రాహ్మణులారా! సమస్తలోకానికి నేను ప్రేరణ కలిగిస్తున్నాను. దీన్ని తెలుసుకున్నవాడు అమృతస్వరూపుడవుతాడు.

**పశ్యామ్యశేషమేవేదం వర్తమానం స్వభావతః ।**
**కరోతి కాలో భగవాన్మహాయోగేశ్వరః స్వయమ్ । ॥ 29 ॥**

స్వభావంచేతనే ప్రవర్తిస్తున్న ఈ సమస్తాన్ని నేను చూస్తున్నాను. మహాయోగి, కాలరూపి భగవంతుడు స్వయంగా దీన్నంతా చేస్తున్నాడు.

**యోఽహం సంప్రోచ్యతే యోగీ మాయీ శాస్త్రేషు సూరిభిః ।**
**యోగీశ్వరోఽసౌ భగవాన్ మహాయోగేశ్వరః స్వయమ్ ॥ 30 ॥**

శాస్త్రాల్లో పండితులు మాయామయుడని యోగి అని చెబుతున్నవాడను నేనే. స్వయంగా భగవంతుడైన మహాయోగేశ్వరరూపం కలవాణ్ణి.

**మహత్త్వం సర్వసత్త్వానాం వరత్వాత్పరమేష్ఠినః ।**
**ప్రోచ్యతే భగవాన్ బ్రహ్మా మహాబ్రహ్మమయోఽమలః ॥ 31 ॥**

బ్రహ్మయొక్క గొప్పతనం సమస్తసత్త్వాలకన్న శ్రేష్ఠుడు అయినందువల్లనే. భగవంతుడైన బ్రహ్మ మహాబ్రహ్మమయుడని, అమలుడని కీర్తినందినాడు.

**యో మామేవం విజానాతి మహాయోగేశ్వరేశ్వరమ్ ।**
**సోఽవికల్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 32 ॥**

నన్నీవిధంగా మహాయోగేశ్వరేశ్వరుడని తెలుసుకున్నవాడు నిర్వికల్పయోగం పొందటంలో సందేహంలేదు.

**సోఽహం ప్రేరయితా దేవః పరమానన్దమాశ్రితః ।**
**నృత్యామి యోగీ సతతం యస్తద్వేద స యోగవిత్ ॥ 33 ॥**

అటువంటి నేను ప్రేరకుడనై పరమానందాన్నిపొంది, యోగినై నృత్యాన్ని చేస్తాను. దాన్ని తెలిసినవాడే యోగవేత్త.

**ఇతి గుహ్యతమం జ్ఞానం సర్వవేదేషు నిశ్చితమ్ ।**
**ప్రసన్నచేతసే దేయం ధార్మికాయాఽఽహితాగ్నయే ॥ 34 ॥**

మిగులరహస్యం అయినట్టీ అన్నివేదాల్లో నిర్ధారింపబడినట్టి ఈ జ్ఞానం నిర్మలమనస్కుడు, ధర్మస్వభావుడు, ఆహితాగ్ని అయిన వానికి ఉపదేశింపదగినది.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే ఋషివ్యాససంవాదే చతుర్థోఽధ్యాయః. ॥ 4 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ఈశ్వరగీత అనే ఉపనిషత్తునందలి బ్రహ్మవిద్య అగు యోగశాస్త్రంలో ఋషివ్యాససంవాదమనే నాల్గవ అధ్యాయం ॥ 4 ॥

## పఞ్చమోఽధ్యాయః - అయిదవ అధ్యాయం

## ఈశ్వరగీతా - ఈశ్వరగీత

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు పలికాడు

**ఏతావదుక్త్వా భగవాన్ యోగినాం పరమేశ్వరః ।**
**ననర్త పరమం భావమైశ్వరం సమ్ప్రదర్శయన్ ॥ 1 ॥**

పరమేశ్వరుడైన శంకర భగవానుడు యోగులకింతవరకు చెప్పి తన పరమైశ్వర్యాన్ని ప్రదర్శిస్తూ నృత్యం చేశాడు.

**తం తే దదృశురీశానం తేజసాం పరమం నిధిమ్ ।**
**నృత్యమానం మహాదేవం విష్ణునా గగనేఽమలే ॥ 2 ॥**

**యం విదుర్యోగతత్త్వజ్ఞా యోగినో యతమానసాః ।**
**తమీశం సర్వభూతానామాకాశే దదృశుః కిల ॥ 3 ॥**

తేజోనిధియైన ఈశ్వరుని నిర్మలమైన ఆకాశంలో నృత్యం చేస్తుండగా విష్ణువుతో కూడ దేవతలు, జితేంద్రియులైన యోగులు, యోగతత్త్వాన్ని బాగా తెలిసినవారు చూశారు.

**యస్య మాయామయం సర్వం యేనేదం ప్రేర్యతే జగత్ ।**
**నృత్యమానస్స్వయం విప్రైర్విశ్వేశః ఖలు దృశ్యతే ॥ 4 ॥**

సకలజగత్తు విశ్వేశ్వరుని మాయారూపంగా ఆవిర్భవించి, అతని సంకల్పంతోనే ప్రవర్తిస్తుంది. అట్టి విశ్వేశ్వరుడు నృత్యంచేస్తూ స్వయంగా బ్రాహ్మణోత్తములకు సాక్షాత్కరించినాడు.

**యత్పాదపఙ్కజం స్మృత్వా పురుషోఽజ్ఞానజం భయమ్ ।**
**జహాతి నృత్యమానం తం భూతేశం దదృశుః కిల ॥ 5 ॥**

జీవుడు శివుని పాదపద్మాలను స్మరించి అజ్ఞానంవల్ల కలిగే భయాన్ని తొలగించుకుంటాడు. అట్టి భూతేశుడు నృత్యం చేస్తుండగా వారంతా చూడగలిగినారు.

**యం వినిద్రా జితశ్వాసాః శాన్తా భక్తిసమన్వితాః ।**
**జ్యోతిర్మయం ప్రపశ్యన్తి స యోగీ దృశ్యతే కిల ॥ 6 ॥**

వినిద్రులై, ప్రాణాయామపరాయణులై, ఇంద్రియనిగ్రహాన్ని అలవరచుకొన్నవారు, భక్తికలవారు మాత్రమే జ్యోతిరూపుడైన మాహాయోగేశ్వరుని చూడగల్గుతారు. వారికే యోగేశ్వరుడు దర్శనమిస్తాడు.

**యోఽజ్ఞానాన్మోచయేత్ క్షిప్రం ప్రసన్నో భక్తవత్సలః ।**
**తమేవ మోచకం రుద్ర మాకాశే దదృశుః పరమ్ ॥ 7 ॥**

భక్తవత్సలుడు శివుడు ప్రసన్నుడైతే జీవులను త్వరలో అజ్ఞానంనుండి విడిపిస్తాడు. అట్లా అజ్ఞానాన్ని తొలగించే రుద్రుని ఆకాశంలో వారు చూశారు.

**సహస్రశిరసం దేవం సహస్రచరణాకృతిమ్ ।**
**సహస్రబాహుం జటిలం చన్ద్రార్ధకృతశేఖరమ్ ॥ 8 ॥**

ఆ రుద్రుడు వేయి శిరసులు, చేతులు కల్గినవాడు. జటాధారి. చంద్రకళను శిరసున ఆభరణంగా దాల్చినవాడు.

**వసానం చర్మ వైయ్యాఘ్రం శూలాసక్తమహాకరమ్ ।**
**దండపాణిం త్రయీనేత్రం సూర్యసోమాగ్నిలోచనమ్ ॥ 9 ॥**

వ్యాఘ్రచర్మాన్ని ధరించి, పొడవైన శూలాన్నిచేత ధరించినవాడు, దండపాణి. వేదత్రయాన్ని, సూర్య, చంద్రాగ్నులను నేత్రాలుగా దాల్చినవాడు.

**బ్రహ్మాణ్డం తేజసా స్వేన సర్వమావృత్య ధిష్ఠితమ్ ।**
**దంష్ట్రాకరాళం దుర్ధర్షం సూర్యకోటి సమప్రభమ్ ॥ 10 ॥**

బ్రహ్మాండాన్ని తన తేజస్సుతో ఆవరించినాడు. దంష్ట్రలతో భయంగొల్పే వక్త్రం గలవాడు. ఇతరులతనిని చెణకజాలరు. కోటిసూర్యసమకాంతిపుంజం కలవాడు.

**అణ్డస్థం చాణ్డబాహ్యస్థం బ్రాహ్మమభ్యన్తరం పరమ్ ।**
**సృజన్తమనలజ్వాలం దహన్తమఖిలం జగత్ ॥ 11 ॥**

అండం లోపల దానికి వెలుపల వుండేవాడు, అన్నిటా వున్న పరబ్రహ్మమూ, అగ్నిజ్వాలలను సృష్టించి అఖిలజగాన్ని దహించేవాడు. సమస్తజగత్తును సృష్టించే ఈశ్వరుని నృత్యం చేస్తుండగా చూశారు.

**నృత్యన్తం దదృశుః దేవం విశ్వకర్మాణమీశ్వరమ్ ।**
**మహాదేవం మహాయోగం దేవానామపి దైవతమ్ ।**
**పశూనాం పతిమీశానం జ్యోతిషాం జ్యోతిరవ్యయమ్ ॥ 12 ॥**

ఈ పరమేశ్వరుడు మహాదేవుడు. మహాయోగి, దేవదేవుడు. పశుపతి, సర్వజగత్ శాసకుడు. ఆనందస్వరూపుడు. జ్యోతులకు జ్యోతి, నాశం లేనివాడు.

**పినాకినం విశాలాక్షం భేషజం భవరోగిణామ్ ।**
**కాలాత్మానం కాలకాలం దేవదేవం మహేశ్వరమ్ ॥ 13 ॥**

ధనుర్ధారి. విశాలనేత్రుడు, సంసారవ్యాధిగ్రస్తులకు దివ్యౌషధం, కాలరూపి, కాలకాలుడు, దేవదేవుడు, మహేశ్వరుడు.

**ఉమాపతిం విరూపాక్షం యోగానన్దమయం పరమ్ ।**
**జ్ఞానవైరాగ్యనిలయం జ్ఞానయోగం సనాతనమ్ ॥ 14 ॥**

ఉమాపతి. విరూపాక్షుడు. పరమయోగానందరూపి. జ్ఞానవైరాగ్యనిలయుడు. జ్ఞానయోగాన్ని కల్గిన సనాతనుడు.

**శాశ్వతైశ్వర్యవిభవం ధర్మాధారం దురాసదమ్ ।**
**మహేన్ద్రోపేన్ద్రనమితం మహర్షిగణవందితమ్ ॥ 15 ॥**

ఉత్పత్తినాశంలేని ఐశ్వర్యవైభవాలు గలవాడు. ధర్మాధారుడు. అందరానివాడు. మహేంద్ర ఉపేంద్రాదులతో మహర్షిగణాలతో నమస్కారాలందేవాడు.

**ఆధారం సర్వశక్తీనాం మహాయోగేశ్వరేశ్వరమ్ ।**
**యోగినాం పరమం బ్రహ్మ యోగినం యోగివన్దితమ్ ॥ 16 ॥**

**యోగినాం హృది తిష్ఠన్తం యోగమాయాసమావృతమ్ ।**
**క్షణేన జగతో యోనిం నారాయణమనామయమ్ ।**
**ఈశ్వరేణైకతాపన్నమపశ్యన్ బ్రహ్మవాదినః ॥ 17 ॥**

సర్వశక్తులకు ఆధారం, మహాయోగేశ్వరులకు ఈశ్వరుడు, యోగులకు గొప్ప బ్రహ్మ, యోగులచే నమస్కరింపబడు యోగి, యోగిహృదయవాసి. యోగమాయ ఆవరించి ఉన్నవాడు. జగత్కారణుడు. ఆద్యంతాలులేని శ్రీమన్నారాయణుడు క్షణంలో ఈశ్వరునియందైక్యం కావటం బ్రహ్మవాదులైన ఋషులు చూడగలిగినారు.

**దృష్ట్వా తథైశ్వరం రూపం రుద్రం నారాయణాత్మకమ్ ।**
**కృతార్థం మేనిరే సన్తః స్వాత్మానం బ్రహ్మవాదినః ॥ 18 ॥**

నారాయణస్వరూపుడైన పరమేశ్వరుని రూపం చూచిన బ్రహ్మవాదులు తమను తాము కృతార్థులుగ తలచినారు.

**సనత్కుమారః సనకో భృగుశ్చ సనాతనశ్చైవ సనన్దనశ్చ ।**
**రుద్రోఽఙ్గిరా వామదేవోఽథ శుక్రో మహర్షిరత్రిః కపిలో మరీచిః ॥ 19 ॥**

**దృష్ట్వాఽథ రుద్రం జగదీశితారం తం పద్మనాభాశ్రితవామభాగమ్ ।**
**ధ్యాత్వా హృదిస్థం ప్రణిపత్య మూర్ధ్నా బద్ధ్వాంఽజలిం స్వేషు శిరస్సు భూయః ॥ 20 ॥**

**ఓంకారముచ్చార్య విలోక్య దేవమన్తశ్శరీరం నిహితం గుహాయామ్ ।**
**సమస్తువన్ బ్రహ్మమయైర్వచోభిరానన్దపూర్ణా హితమానసా వై ॥ 21 ॥**

సనత్కుమారుడు, సనకుడు, భృగువు, సనాతనుడు, సనన్దనుడు, రుద్రుడు, అంగిరసుడు, వామదేవుడు, శుక్రుడు, అత్రి, కపిల, మరీచి మహర్షులు జగచ్ఛాసకుడైన రుద్రుని వామభాగంలో నారాయణుడున్న స్వరూపాన్ని

చూచి హృదయంలో నిలుపుకొని, ధ్యానంచేసి, శిరసుతో ప్రణమిల్లి దోసిలొగ్గి ఓంకారముచ్చరించి హృదయంలో నివసించి ఉన్న ఆదిదేవుని సాక్షాత్కరించుకుని పరిపూర్ణానందమొందిన మనస్కులై వేదవాక్కులతో ఇట్లా స్తుతించసాగారు.

**మునయః ఊచుః :-**మునులు పలికారు.

**త్వామేకమీశం పురుషం పురాణం ప్రాణేశ్వరం రుద్రమనన్తయోగమ్ ।**
**నమామ సర్వే హృది సన్నివిష్టం ప్రచేతసం బ్రహ్మమయం పవిత్రమ్ ॥ 22 ॥**

నీవు మాత్రమే ఈశ్వరుడవు. పురాణపురుషుడవు. ప్రాణేశ్వరుడవు. అనంతయోగరూపివి. మునుల హృదయంలో ఉన్నవాడవు. సమస్తజగత్తుకు చైతన్యాన్నిచ్చేవాడవు. పవిత్రుడవైన బ్రహ్మరూపరుద్రుని నమస్కరిస్తున్నాము.

**త్వాం పశ్యన్తి మునయో బ్రహ్మయోనిం దాన్తాః శాన్తాః విమలం రుక్మవర్ణమ్ ।**
**ధ్యాత్వా஽஽త్మస్థమచలం స్వేశరీరే కవిం పరేభ్యః పరమం తత్పరం చ ॥ 23 ॥**

బాహ్యాంతరింద్రియాలను వశం చేసుకొని ధ్యానిస్తూ, నిశ్చలుని, పావనుని, హిరణ్యవర్ణుని, బ్రహ్మకు కారణమైనవానిని, పరాత్పరుడవు, అఖిలదర్శనుడవైన నిన్ను మునులు చూస్తుంటారు.

**త్వత్తః ప్రసూతా జగతః ప్రసూతిః సర్వాత్మభూస్త్వం పరమాణుభూతః ।**
**అణోరణీయాన్ మహతో మహీయాంస్త్వామేవ సర్వం ప్రవదన్తి సన్తః ॥ 24 ॥**

ఈ సృష్టి నీవల్ల జరిగినది. అందరి ఆత్మవు నీవే. పరమాణుడవు. సత్పురుషులు 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అని నిన్ను గూర్చి చెబుతుంటారు.

**హిరణ్యగర్భో జగదంతరాత్మా త్వత్తో஽ధిజాతః పురుషః పురాణః ।**
**సంజాయమానో భవతా విసృష్టో యథావిధానం సకలం ససర్జ ॥ 25 ॥**

హిరణ్యగర్భుడు, జగత్తుకంతరాత్మ, పురాణపురుషుడు నీవల్ల జన్మించినాడు. నీవు సృష్టించగా పుట్టిన ఆ బ్రహ్మ విధిననుసరించి సకలజగత్తును సృష్టించినాడు.

**త్వత్తో వేదాః సకలాః సమ్ప్రసూతాస్త్వయ్యేవాన్తే సంస్థితిం తే లభన్తే ।**
**పశ్యామస్త్వాం జగతో హేతుభూతం నృత్యన్తం స్వే హృదయే సంనివిష్టమ్ ॥ 26 ॥**

వేదాలన్నీ నీ వల్లనే వెల్వడినవి. ప్రళయంలో నీలోనే నిలుస్తాయి. జగత్కారణుడవు. మా హృదయాల్లో ఉన్న నిన్ను నృత్యంచేస్తున్న వాణ్ణి చూస్తున్నాము.

**త్వయైవేదం భ్రామ్యతే బ్రహ్మచక్రం మాయావీ త్వం జగతామేకనాథః ।**
**నమామస్త్వాం శరణం సమ్ప్రపన్నా యోగాత్మానం పరమాకాశమధ్యే ॥ 27 ॥**

ఈ కాలచక్రం నీవే త్రిప్పుతున్నావు. నీవు మాయావివి. సకలప్రపంచానికి అధినాయకుడవు. యోగాత్మకుడగు నిన్ను శరణు పొంది నీకు నమస్కరిస్తున్నాము.

**నృత్యన్తం తే మహిమానం స్మరామః సర్వాత్మానం బహుధా సంనివిష్టమ్ ।**
**బ్రహ్మానన్దం చానుభూయానుభూయ ॥ 28 ॥**

యోగరూపుడవై పరమాకాశమధ్యంలో నృత్యంచేస్తున్న నిన్ను చూస్తున్నాము. సర్వస్వరూపుడవై అనేక రూపాల్లో ఉన్న నిన్ను బ్రహ్మానందరూపునిగా పలుమార్లు అనుభవించి అనుభవించి నీ మహిమను స్మరిస్తున్నాము.

**ఓంకారస్తే వాచకో ముక్తిబీజం త్వమక్షరం ప్రకృతౌ గూఢరూపమ్ ।**
**తత్త్వాం సత్యం ప్రవదన్తీహ సన్తః స్వయంప్రభం భవతో యత్ప్రకాశమ్ ॥ 29 ॥**

ఓంకారం నిన్ను తెలిపే ముక్తిబీజం. ప్రకృతిలో గూఢంగా ఉన్న అవ్యయుడవు. సజ్జనులు నిన్ను సత్యమూర్తివని చెబుతున్నారు. నీ ప్రకాశం సహజంగా వెలువడినది.

**స్తువన్తి త్వాం సతతం సర్వవేదాః నమన్తి త్వామృషయః క్షీణదోషాః ।**
**శాన్తాత్మానః సత్యసన్ధా వరిష్ఠం విశన్తి త్వాం యతయో బ్రహ్మనిష్ఠాః ॥ 30 ॥**

వేదాలన్నీ నిన్నే సతతం స్తుతిస్తున్నవి. ఋషులు క్షీణదోషులై నిన్ను నమస్కరిస్తున్నారు. శాంతాత్ములు, సత్యసంధులు, బ్రహ్మనిష్ఠులు, యతులు నీలోనే చేరుతున్నారు.

**ఏకో వేదో బహుశాఖో హ్యనన్తః త్వామేవైకం బోధయత్యేకరూపమ్ ।**
**వేద్యం త్వాం శరణం యే ప్రపన్నాస్తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషామ్ ॥ 31 ॥**

అనేక శాఖాభేదాలు గల అనన్తమైన ఒకే వేదం నిన్నొక్కనినే ఒకే రూపున్నవానిగా బోధిస్తున్నది. తెలియదగిన నిన్ను శరణు పొందినవారు మాత్రమే శాశ్వతమైన శాంతిని పొందుతారు. ఇతరులు పొందరు.

**భవానీశోఽనాదిమాంస్తేజోరాశిర్బ్రహ్మా విశ్వం పరమేష్ఠీ వరిష్ఠః ।**
**స్వాత్మానందమనుభూయాధిశేతే స్వయంజ్యోతిరచలో నిత్యముక్తః ॥ 32 ॥**

నీవే ఈశ్వరుడవు. అనాదివి. తేజోరాశివి. బ్రహ్మవు. విశ్వానివి. పరమేష్ఠివి. వరిష్ఠుడవు. ఆత్మానందానుభవంతో నిద్రిస్తుంటావు. స్వయం జ్యోతివి. నిశ్చలుడవు. నిత్యముక్తుడవు.

**ఏకో రుద్రస్త్వం కరోషీహ విశ్వం త్వం పాలయస్యఖిలం విశ్వరూపః ।**
**త్వామేవాన్తే నిలయం విన్దతీదం నమామస్త్వాం శరణం సమ్ప్రపన్నాః ॥ 33 ॥**

నీవొకడవే రుద్రుడవు. విశ్వాన్ని సృష్టిస్తున్నావు. విశ్వరూపుడవై పాలిస్తున్నావు. ప్రలయంలో సమస్తం నీలోనే లీనమవుతుంది. నిన్ను శరణపొంది నమస్కరిస్తున్నాము.

**త్వామేకమాహుః కవిమేకరుద్రం ప్రాణం బృహన్తం హరిమగ్నిమీశమ్ ।**
**ఇంద్రం మృత్యుమనిలం చేకితానం ధాతారమాదిత్యమనేకరూపమ్ ॥ 34 ॥**

నిన్ను అద్వితీయుడు, కవి, రుద్రుడు, ప్రాణం, బ్రహ్మ, హరి, అగ్ని, ఈశ్వరుడు, ఇంద్రుడు, మృత్యువు, వాయువు, సర్వవ్యాపకుడు, సర్వం ధరించేవాడు, సూర్యుడు అని బహురూపునిగా చెబుతుంటారు.

**త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషోత్తమోఽసి ॥ 35 ॥**

**త్వమేవ విష్ణుశ్చతురాననస్త్వం త్వమేవ రుద్రో భగవానధీశః ।**
**త్వం విశ్వనాభిః ప్రకృతిః ప్రతిష్ఠా సర్వేశ్వరస్త్వం పరమేశ్వరోఽసి ॥ 36 ॥**

అవినాశివి, రక్షకుడవు, సనాతనుడవు, పురుషోత్తముడవు, బ్రహ్మ, విష్ణు, రుద్రుడవు నీవే. విశ్వానికి మూలం, అధీశ్వరుడవు నీవే. ప్రకృతీ, ప్రతిష్ఠ, సర్వేశ్వరుడవు, పరమేశ్వరుడవు నీవే.

**త్వామేకమాహుః పురుషం పురాణమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।**
**చిన్మాత్రమవ్యక్తమచింత్యరూపం ఖం బ్రహ్మశూన్యం ప్రకృతిం నిర్గుణం చ ॥ 37 ॥**

నీవొకడవే పురాణపురుషుడవు. ఆదిత్యవర్ణుడవు. తమస్సునకు (చీకటికి) అవతల ఉన్నవాడవు, తెలియబడనివాడవు, చిన్మాత్రుడవు, చింతించ వీలుగాని రూపం కలవాడవు. ఆకాశం, బ్రహ్మ, శూన్యమూ, ప్రకృతీ, నిర్గుణుడవు.

**యదంతరా సర్వమిదం విభాతి యదవ్యయం నిర్మలమేకరూపమ్ ।**
**కిమప్యచిన్త్యం తవ రూపమేతత్ తదన్తరా యత్ప్రతిభాతి తత్త్వమ్ ॥ 38 ॥**

ఈ జగత్తంతా నీలోనే భాసిస్తుంది. అవ్యయుడవు. నిర్మలుడవు. ఏకరూపివి. మార్పులేనివాడవు. మా బుద్ధికందని రూపివి. సకలతత్త్వం నీలోనే భాసిస్తుంది.

**యోగీశ్వరం రుద్రమనంతశక్తిం పరాయణం బహుతనుం పవిత్రమ్ ।**
**నమామ సర్వే శరణార్థినస్త్వాం ప్రసీద భూతాధిపతే! మహేశ! ॥ 39 ॥**

యోగేశ్వరుడవు, రుద్రుడవు, అనంత శక్తివి, పరమాధారానివి, బహురూపివి, పవిత్రుడవైన నిన్ను శరణుకోరి నమస్కరిస్తున్నాము. మహేశా! ప్రసన్నుడవగుము.

**త్వత్పాదపద్మస్మరణాదశేషసంసారబీజం విలయం ప్రయాతి ।**
**మనో నియమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయామో వయమేకమీశమ్ ॥ 40 ॥**

నీ పాదస్మరణవల్ల సకలసంసార బీజాలు నశిస్తాయి. మనస్సును నిగ్రహించి, శరీరాన్ని వశపరచుకొని, అద్వితీయ ఈశ్వరుడవైన నిన్ను ప్రసన్నుడిని చేసుకుంటున్నాము.

**నమో భవాయాస్తు భవోద్భవాయ కాలాయ సర్వాయ హరాయ తుభ్యమ్ ।**
**నమోఽస్తు రుద్రాయ కపర్దినే తే నమోఽగ్నయే దేవ నమః శివాయ ॥ 41 ॥**

సంసారాన్ని సృజించే కాలరూపునకు నమస్కారం. రుద్రుడు, జటాధారి, అగ్ని, శివుడవైన నీకు నమస్కారం.

**తతః స భగవాన్ దేవః కపర్దీ వృషవాహనః ।**
**సంహృత్య పరమం రూపం ప్రకృతిస్థోఽభవత్ భవః ॥ 42 ॥**

అంతట మునులస్తోత్రాన్ని విన్న జటాధరుడు, నందివాహనుడు, మహాదేవుడు తన విశ్వరూపాన్ని ఉపసంహరించి సహజరూపంతో నిలిచినాడు.

**తే భవం భూతభవ్యేశం పూర్వవత్ సమవస్థితమ్ ।**
**దృష్ట్వా నారాయణం దేవం విస్మితా వాక్యమబ్రువన్ ॥ 43 ॥**

భూతభవ్యేశుడు భవుడైన నారాయణుని ఎప్పటి మాదిరి ఉన్న వానిని చూచి మునులు ఆశ్చర్యంతో ఇట్లన్నారు.

**భగవన్! భూతభవ్యేశ! గోవృషాంకితశాసన! ।**
**దృష్ట్వా తే పరమం రూపం నిర్వృతాః స్మ సనాతన! ॥ 44 ॥**

భగవన్! భూతభవిష్యత్తులకు ఈశ్వరుడా! సనాతనా! వృషభవాహనా! నీ విశ్వరూపాన్ని చూచి పరమానందాన్ని పొందినాము.

**భవత్ప్రసాదాదమలే పరస్మిన్ పరమేశ్వరే ।**
**అస్మాకం జాయతే భక్తిస్త్వయ్యేవావ్యభిచారిణీ ॥ 45 ॥**

నీ అనుగ్రహంవల్ల పరమేశ్వరుడవైన నీ యందు మాకు అనన్యమైన భక్తి ఏర్పడినది.

**ఇదానీం శ్రోతుమిచ్ఛామో మాహాత్మ్యం తవ శంకర ।**
**భూయోఽపి తవ యన్నిత్యం యాథాత్మ్యం పరమేష్ఠినః ॥ 46 ॥**

ఇపుడు నీ మాహాత్మ్యాన్ని శాశ్వతం యథార్థమైన వైభవాన్ని వినగోరుతున్నాము.

**స తేషాం వాక్యమాకర్ణ్య యోగినాం యోగసిద్ధిదః ।**
**ప్రాహ గంభీరయా వాచా సమాలోక్య చ మాధవమ్ ॥ 47 ॥**

యోగసిద్ధిప్రదుడగు శంకరుడు ఆ యోగుల వాక్యాన్ని విని శ్రీమహావిష్ణువును చూచి గంభీరమైన వాక్కుతో ఇట్లా పలికాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే ఋషివ్యాస సంవాదే పఞ్చమోఽధ్యాయః ॥ 5 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ఈశ్వరగీత అనే ఉపనిషత్తునందలి బ్రహ్మావిద్య అగు యోగశాస్త్రంలో ఋషివ్యాససంవాదమనే అయిదవ అధ్యాయం ॥ 5 ॥



## షష్ఠోఽధ్యాయః - ఆరవ అధ్యాయం

## ఈశ్వరగీతోపనిషత్ - ఈశ్వరగీతోపనిషత్తు

**ఈశ్వర ఉవాచ :**–ఈశ్వరుడు పలికాడు

**శృణుధ్వం ఋషయః సర్వే యథావత్ పరమేష్ఠినః ।**
**వక్ష్యామీశస్య మాహాత్మ్యం యత్తద్వేదవిదో విదుః ॥1**

ఓ ఋషులారా! వేదవిదులు మాత్రమే ఎరిగిన పరమేశ్వరుని యథార్థమైన ప్రభావాన్ని చెబుతాను. వినండి.

**సర్వలోకైకనిర్మాతా సర్వలోకైకరక్షితా ।**
**సర్వలోకైకసంహర్తా సర్వాత్మాఽహం సనాతనః ॥ 2 ॥**

నేనొక్కడనే అన్నిలోకాలను సృజించేవాణ్ణి, రక్షించేవాణ్ణి, సంహరించేవాణ్ణి. నేను సర్వాత్మను, సనాతనుడను.

**సర్వేషామేవ వస్తూనామన్తర్యామీ పితా హ్యహమ్ ।**
**మధ్యే చాన్తః స్థితం సర్వం నాహం సర్వత్ర సంస్థితః ॥ 3 ॥**

నేను అన్నివస్తువులకు అంతర్యామిని. జనకుడను. నాలోనే సకలవస్తువుల ఆదిమధ్యాంతాలుంటాయి. నాకేదీ ఇతరం ఆధారం కాదు.

**భవద్భిరద్భుతం దృష్టం యత్స్వరూపం తు మామకమ్ ।**
**మమైషా హ్యుపమా విప్రా మాయయా దర్శితా మయా ॥ 4 ॥**

ఇపుడు మీరు చూచిన అద్భుతమైన నా విశ్వరూపం కేవలం నాకు ప్రతీకగా నా మాయతో చూపాను.

**సర్వేషామేవ భావానామన్తరా సమవస్థితః ।**
**ప్రేరయామి జగత్ కృత్స్నం క్రియాశక్తిరియం మమ ॥ 5 ॥**

**యయేదం చేష్టతే విశ్వం తత్స్వభావానువర్తి చ ।**
**సోఽహం కాలో జగత్ కృత్స్నం ప్రేరయామి కలాత్మకమ్ ॥ 6 ॥**

అన్ని వస్తువులకు అంతర్యామిగా ఉంటూ, నేను ప్రపంచాన్నంతటినీ ప్రేరేపిస్తాను. దేనిచేత ఈ విశ్వం చైతన్యవంతం అవుతుందో, దేని స్వభావాన్ని అనుసరిస్తుందో ఇది నా క్రియాశక్తి. కాలాత్మకుడైన నేను కళాత్మకమైన జగత్తునంటినీ ప్రేరేపిస్తున్నాను.

**ఏకాంశేన జగత్ కృత్స్నం కరోమి మునిపుఙ్గవాః! ।**
**సంహరామ్యేకరూపేణ ద్విధాఽవస్థా మమైవ తు ॥ 7 ॥**

ఈ జగత్తునంతటిని ఏకాంశతో సృష్టిస్తాను. ఒకే అంశతో సంహరిస్తాను. ఈ సృష్టి సంహారావస్థలు రెండూ నావే.

**ఆదిమధ్యాన్తనిర్ముక్తో మాయాతత్త్వప్రవర్తకః ।**
**క్షోభయామి చ సర్గాదౌ ప్రధానపురుషావుభౌ ॥ 8 ॥**

నేను ఆదిమధ్యాంతాలు లేనివాణ్ణి. మాయాతత్త్వాన్ని ప్రవర్తింపచేసే నేను సృష్టి ప్రారంభంలో ప్రకృతి పురుషులను క్షోభింప చేస్తాను.

**తాభ్యాం సంజాయతే విశ్వం సంయుక్తాభ్యాం పరస్పరమ్ ।**
**మహదాదిక్రమేణైవ మమ తేజో విజృంభతే ॥ 9 ॥**

ప్రకృతి పురుషులు పరస్పల సంయోగంవల్ల ప్రపంచం జన్మిస్తుంది. ప్రకృతినుండి మహత్తత్త్వం, దాని నుండి అహంకారం, ఈ క్రమంగా నా తేజస్సే జగద్రూపంగా విస్తరిస్తుంది.

**యో హి సర్వజగత్సాక్షీ కాలచక్రప్రవర్తకః ।**
**హిరణ్యగర్భో మార్తాణ్డః సోఽపి మద్దేహసమ్భవః ॥ 10 ॥**

సర్వజగత్తుకు సాక్షీభూతుడు కాలచక్రప్రవర్తకుడు, హిరణ్యగర్భుడైన మార్తాండుడు నా దేహం నుండి జనించినవాడే.

**తస్మై దివ్యం స్వమైశ్వర్యం జ్ఞానయోగం సనాతనమ్ ।**
**దత్తవానాత్మజాన్ వేదాన్ కల్పాదౌ చతురో ద్విజాః! ॥ 11 ॥**

విప్రులారా! కల్పాదిలో ఆ సూర్యభగవానునకు నా దివ్యమైన సనాతన జ్ఞానయోగాన్ని, నానుండి వెల్వడిన నాల్గువేదాలను కూడా ఇచ్చినాను.

**స మన్నియోగతో దేవో బ్రహ్మా మద్భావభావితః ।**
**దివ్యం తన్మామకైశ్వర్యం సర్వదా వహతి స్వయమ్ ॥ 12 ॥**

**స సర్వలోకనిర్మాతా మన్నియోగేన సర్వవిత్ ।**
**భూత్వా చతుర్ముఖః సర్గం సృజత్యేవాత్మసమ్భవః ॥ 13 ॥**

ఈవిధంగా ఆ హిరణ్యగర్భుడెపుడు నాదివ్యైశ్వర్యాన్ని ధరించి ఉంటాడు. నా భావంతో ప్రేరేపితుడై, చతుర్ముఖుడై సకలలోకాలను సృష్టిస్తాడు.

**యోఽపి నారాయణోఽనన్తో లోకానాం ప్రభవావ్యయః ।**
**మమైవ పరమా మూర్తిః కరోతి పరిపాలనమ్ ॥ 14 ॥**

ఆ లోకాలను సమయింప చేసేవాడు అనంతుడైన నారాయణుడు కూడ నా పరమమూర్తియే. సకలలోకాలను పాలిస్తుంటాడు.

**యోఽన్తకః సర్వభూతానాం రుద్రః కాలాన్తకః ప్రభుః ।**
**మదాజ్ఞయాఽసౌ సతతం సంహరిష్యతి మే తనుః ॥ 15 ॥**

సకలప్రాణహర్తయగు కాలస్వరూపి రుద్రుడు నా ఆజ్ఞతోనే లోకాలను సంహరింప చేస్తుంటాడు.

**హవ్యం వహతి దేవానాం కవ్యం కవ్యాశినామపి ।**
**పాకఞ్చ కురుతే వహ్నిః సోఽపి మచ్ఛక్తిచోదితః ॥ 16 ॥**

అగ్నిహోత్రుడు నా శక్తిచేత ప్రేరేపించబడి హవ్యాన్ని దేవతలకు, కవ్యాన్ని పితృదేవతలకు అందిస్తాడు. అన్నింటిని పక్వం చేస్తాడు.

**భుక్తమాహారజాతం చ పచతే తదహర్నిశమ్ ।**
**వైశ్వానరోఽగ్నిర్భగవానీశ్వరస్య నియోగతః ॥ 17 ॥**

రాత్రింబవళ్ళు ఆహారాన్ని వైశ్వానరుడనే పేరుతో ఈశ్వరాదేశాన్ని అనుసరించి జీర్ణం చేస్తాడు.

**యోఽపి సర్వామ్భసాం యోనిర్వరుణో దేవపుఙ్గవః ।**
**సోఽపి సంజీవయేత్ కృత్స్నమీశ్వరస్య నియోగతః ॥ 18 ॥**

సమస్తజలాలకు మూలమైన వరుణుడు ఈశ్వరుని ఆజ్ఞ వల్లనే జగత్తును జీవింప చేస్తున్నాడు.

**యోఽన్తస్తిష్ఠతి భూతానాం బహిర్దేవః ప్రభఞ్జనః ।**
**మదాజ్ఞయాఽసౌ భూతానాం శరీరాణి బిభర్తి హి ॥ 19 ॥**

వాయువు నా ఆజ్ఞతో అన్ని ప్రాణులకు లోపల వెలుపల ఉండి శరీరాలను నిలుపుతున్నాడు.

**యోఽపి సంజీవనో నౄణాం దేవానామమృతాకరః ।**
**సోమః స మన్నియోగేన చోదితః కిల వర్తతే ॥ 20 ॥**

చంద్రుడు ఆ మానవులను బ్రతికిస్తూ దేవతలకు అమృతాన్నిస్తూ, నా ఆజ్ఞతోనే ప్రవర్తిస్తున్నాడు.

**యః స్వభాసా జగత్ కృత్స్నం ప్రకాశయతి సర్వదా ।**
**సూర్యో వృష్టిం వితనుతే శాస్త్రేణైవ స్వయమ్భువః ॥ 21 ॥**

సూర్యభగవానుడు కూడా నా ఆజ్ఞతోనే అన్నివైపుల జగత్తుని ప్రకాశింపచేస్తూ వర్షాన్ని అందిస్తున్నాడు.

**యోఽప్యశేషజగచ్ఛాస్తా శక్రః సర్వామరేశ్వరః ।**
**యజ్వనాం ఫలదో దేవో వర్తతేఽసౌ మదాజ్ఞయా ॥ 22 ॥**

ముల్లోకాల నేలే సకలదేవతాధిపతి ఇంద్రుడు నా ఆజ్ఞవల్లనే యజ్ఞం చేసేవారికి ఫలాన్నిస్తున్నాడు.

**యః ప్రశాస్తా హ్యసాధూనాం వర్తతే నియమాదిహ ।**
**యమో వైవస్వతో దేవో దేవదేవనియోగతః ॥ 23 ॥**

యముడు నా ఆజ్ఞాపాలకుడై పాపులను శాసిస్తున్నాడు.

**యో౽పి సర్వధనాధ్యక్షో ధనానాం సమ్ప్రదాయకః ।**
**సో౽పీశ్వరనియోగేన కుబేరో వర్తతే సదా ॥ 24 ॥**

సర్వధనాధ్యక్షుడైన కుబేరుడు ఈశ్వరాజ్ఞవల్లనే అందరికి ధనాన్నిస్తున్నాడు.

**యః సర్వరక్షసాం నాథస్తామసానాం ఫలప్రదః ।**
**మన్నియోగాదసౌ దేవో వర్తతే నిర్‌ఋతిః సదా ॥ 25 ॥**

సర్వరాక్షసాధిపతి, తమోగుణాలకు ఫలప్రదుడు అయిన నిర్‌ఋతి కూడ నా ఆజ్ఞనే పాలిస్తున్నాడు.

**వేతాలగణభూతానాం స్వామీ భోగఫలప్రదః ।**
**ఈశానః కిల భక్తానాం సో౽పి తిష్ఠన్మమాజ్ఞయా ॥ 26 ॥**

ఈశానుడు, భూతభేతాళగణాధిపతి నా ఆజ్ఞతోనే భక్తులకు భోగఫలాన్ని ప్రదానం చేస్తున్నాడు.

**యో వామదేవో౽ఙ్గిరసః శిష్యో రుద్రగణాగ్రణీః ।**
**రక్షకో యోగినాం నిత్యం వర్తతే౽సౌ మదాజ్ఞయా ॥ 27 ॥**

అంగిరసశిష్యుడు రుద్రగణాల్లో అగ్రణి, యోగి, రక్షకుడైన వామదేవుడు నా ఆజ్ఞాపాలకుడే.

**యశ్చ సర్వజగత్పూజ్యో వర్తతే విఘ్నకారకః ।**
**వినాయకో ధర్మనేతా సో౽పి మద్వచనాత్కిల ॥ 28 ॥**

విఘ్నకారకుడు, సర్వజగత్పూజ్యుడు, వినాయకుడు కూడ నా ఆజ్ఞతో ధర్మాన్ని కాపాడుతున్నాడు.

**యో౽పి బ్రహ్మవిదాం శ్రేష్ఠో దేవసేనాపతిః ప్రభుః ।**
**స్కన్దో౽సౌ వర్తతే నిత్యం స్వయమ్భూర్విధిచోదితః ॥ 29 ॥**

**యే చ ప్రజానాం పతయో మరీచ్యాద్యా మహర్షయః ।**
**సృజన్తి వివిధం లోకం పరస్యైవ నియోగతః ॥ 30 ॥**

బ్రహ్మవేత్తల్లో శ్రేష్ఠుడు దేవసేనాని స్వయంభువు అయిన కుమారస్వామి విధిప్రేరేపింపగా తన క్రియలలో ప్రవర్తిస్తున్నాడు. ప్రజాపతులైన మరీచ్యాది మహర్షులు పరమాత్మయొక్క నియమం ప్రకారం అనేక విధంగా లోకాన్ని సృష్టిస్తున్నారు.

**యా చ శ్రీః సర్వభూతానాం దదాతి విపులాం శ్రియమ్ ।**
**పత్నీ నారాయణస్యాసౌ వర్తతే మదనుగ్రహాత్ ॥ 31 ॥**

శ్రీమన్నారాయణుని పత్ని శ్రీదేవి అన్ని ప్రాణులకు పుష్కలమైన సంపదనిస్తూ, నా అనుగ్రహంతోనే ప్రవర్తిస్తున్నది.

**వాచం దదాతి విపులాం యా చ దేవీ సరస్వతీ ।**
**సాఽపీశ్వరనియోగేన చోదితా సమ్ప్రవర్తతే ॥ 32 ॥**

సకల జీవులకు వాక్కును ప్రసాదించే సరస్వతి కూడ ఈశ్వరాజ్ఞా ప్రేరితురాలై ప్రవర్తిస్తున్నది.

**యాఽశేషపురుషాన్ ఘోరాన్నరకాత్ తారయిష్యతి ।**
**సావిత్రీ సంస్మృతా దేవీ దేవాజ్ఞానువిధాయినీ ॥ 33 ॥**

సకల జీవులను ఘోరనరకంనుండి తరింపచేసే సావిత్రీదేవి ఆ దేవుని ఆజ్ఞనే పాలిస్తున్నది.

**పార్వతీ పరమా దేవీ బ్రహ్మవిద్యాప్రదాయినీ ।**
**యాఽపి ధ్యాతా విశేషేణ సాఽపి మద్వచనానుగా ॥ 34 ॥**

పరమదేవి, బ్రహ్మవిద్యాప్రదాయిని, పార్వతీదేవి నా వచనానుసారిణియై అఖిలజనులచే ధ్యానింపబడుతున్నది.

**యోఽనన్తమహిమాఽనన్తః శేషోఽశేషామరప్రభుః ।**
**దధాతి శిరసా లోకం సోఽపి దేవనియోగతః ॥ 35 ॥**

అనేక మహిమలు కలవాడు, సకలదేవతాధిపతి, ఆదిశేషుడు సైతం ఆ దేవాజ్ఞతోనే లోకాలన్నింటిని శిరసుతో ధరిస్తున్నాడు.

**యోఽగ్నిః సర్వాత్మకో నిత్యం బడబారూపసంస్థితః ।**
**పిబత్యఖిలమమ్భోధిమీశ్వరస్య నియోగతః ॥ 36 ॥**

ప్రలయాగ్ని బడబాగ్ని రూపంలో ఉండి ఈశ్వరాజ్ఞతోనే సముద్రజలాన్నంతా త్రాగుతుంది.

**యే చతుర్దశ లోకేఽస్మిన్ మనవః ప్రథితౌజసః ।**
**పాలయన్తి ప్రజాః సర్వాస్తేఽపి తస్య నియోగతః ॥ 37 ॥**

సుప్రసిద్ధ తేజశ్శాలురైన చతుర్దశ మనువులు ఈశ్వరాజ్ఞావర్తనులై ప్రజలను పాలిస్తున్నారు.

**ఆదిత్యా వసవో రుద్రాః మరుతశ్చ తథాఽశ్వినౌ ।**
**అన్యాశ్చ దేవతాః సర్వా మచ్ఛాస్త్రేణైవ సుస్థితాః ॥ 38 ॥**

ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, సప్తమరుత్తులు, అశ్వినీ దేవతలు ఇతర దేవతలందరు నా ఆజ్ఞానువర్తులే.

**గన్ధర్వా గరుడా ఋక్షాః సిద్ధాః సాధ్యాశ్చ చారణాః ।**
**యక్షరక్షః పిశాచాశ్చ స్థితాః శాస్త్రే స్వయమ్భువః ॥ 39 ॥**

గరుడ, గంధర్వ, ఋక్ష, సిద్ధ, సాధ్యచారణ, యక్ష, రాక్షస, పిశాచాలు కూడా స్వయంభువు శాసనం పాటించేవారే.

**కలాకాష్ఠ నిమేషాశ్చ ముహూర్తా దివసాః క్షపాః ।**
**ఋతవః పక్షమాసాశ్చ స్థితాః శాస్త్రే ప్రజాపతేః ॥ 40 ॥**

కలా కాష్ఠ, ముహూర్త, నిమేష, దిన, రాత్రి, ఋతు, పక్ష, మాసాలన్నీ ప్రజాపతి శాసనంతోనే నడుస్తున్నవి.

**యుగమన్వన్తరాణ్యేవ మమ తిష్ఠన్తి శాసనే ।**
**పరాశ్చైవ పరార్ధాశ్చ కాలభేదాస్తథాఽపరే ॥ 41 ॥**

యుగాలు, మన్వంతరాలు నా ఆజ్ఞలోనే ఉన్నాయి. పర–పరార్ధాలు, ఇతర కాలభేదాలు నాశాసనంలో ఉన్నవి.

**చతుర్విధాని భూతాని స్థావరాణి చరాణి చ ।**
**నియోగాదేవ వర్తన్తే దేవస్య పరమాత్మనః ॥ 42 ॥**

నాలుగు విధాల ప్రాణులు, స్థావరజంగమాలు పరమాత్మ ఆజ్ఞను అనుసరించేవే.

**పాతాళాణి చ సర్వాణి భువనాని చ శాసనాత్ ।**
**బ్రహ్మాణ్డాని చ వర్తన్తే సర్వాణ్యేవ స్వయమ్భువః ॥ 43 ॥**

పాతాళాది సకలలోకాలు, బ్రహ్మాండాలు, స్వయంభూ శాసనంలోనివే.

**అతీతాన్యప్యసంఖ్యాని బ్రహ్మాణ్డాని మమాజ్ఞయా ।**
**ప్రవృత్తాని పదార్థౌఘైః సహితాని సమన్తతః ॥ 44 ॥**

**బ్రహ్మాణ్డాని భవిష్యన్తి సహ వస్తుభిరాత్మగైః ।**
**వహిష్యన్తి సదైవాజ్ఞాం పరస్య పరమాత్మనః ॥ 45 ॥**

అతీత బ్రహ్మాండాలు తమలోని సర్వవస్తుజాలంతో పరమాత్మ ఆజ్ఞనే శిరసా వహిస్తున్నవి.

**భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**భూతాదిరాదిప్రకృతిర్నియోగే మమ వర్తతే ॥ 46 ॥**

భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, తామసాహంకారం, ఆదిప్రకృతి మొదలైనవన్నీ నా ఆజ్ఞలో నున్నవే.

**యాఽశేషజగతాం యోనిర్మోహినీ సర్వదేహినామ్ ।**
**మాయా వివర్తతే నిత్యం సాఽపీశ్వరనియోగతః ॥ 47 ॥**

జగత్కారణం ప్రాణులను మోహింపచేసే మాయ కూడ ఈశ్వరాజ్ఞతోనే ప్రవర్తిస్తుంది.

**యో వై దేహభృతాం దేవః పురుషః పఠ్యతే పరః ।**
**ఆత్మాఽసౌ వర్తతే నిత్యమీశ్వరస్య నియోగతః ॥ 48 ॥**

శరీరాన్ని భరించినవారందరికి ప్రభువు పరమపురుషుడుగా చెప్పబడినవాడైన ఈ ఆత్మ నిత్యం ఈశ్వరాజ్ఞతోనే ప్రవర్తిస్తున్నది.

**విధూయ మోహకలిలం యయా పశ్యతి తత్ పదమ్ ।**
**సాఽపి విద్యా మహేశస్య నియోగవశవర్తినీ ॥ 49 ॥**

మోహాలను పోగొట్టి, పరమపదాన్ని చూపే విద్య కూడ పరమేశ్వరాజ్ఞావర్తినియే.

**బహునాఽత్ర కిముక్తేన మమ శక్త్యాత్మకం జగత్ ।**
**మయైవ ప్రేర్యతే కృత్స్నం మయ్యేవ ప్రలయం వ్రజేత్ ॥ 50 ॥**

ఇంకా చెప్పనేల? ఈ జగత్తంతా నా శక్తిస్వరూపమే. నేనే ప్రేరేపిస్తున్నాను. నాలోనే లీనమవుతుంది.

**అహం హి భగవానీశః స్వయంజ్యోతిః సనాతనః ।**
**పరమాత్మా పరం బ్రహ్మ మత్తో హ్యన్యో న విద్యతే ॥ 51 ॥**

నేనే భగవంతుణ్ణి. ఈశ్వరుణ్ణి. స్వయంజ్యోతిని. సనాతనుడను. పరమాత్మను. పరబ్రహ్మను. నాకంటే వేరు మరొకటి లేదు.

**ఇత్యేతత్ పరమం జ్ఞానం యుష్మాకం కథితం మయా ।**
**జ్ఞాత్వా విముచ్యతే జన్తుర్జన్మసంసారబంధనాత్ ॥ 52 ॥**

ఈవిధంగా ఈ పరమజ్ఞానాన్ని మీకు వివరించాను. దీనిని తెలుసుకున్నవాడు జన్మసంసారబంధం నుండి విముక్తుడవుతారు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతాసూపనిషత్సు షష్ఠోఽధ్యాయః ॥ 6 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరభాగంలో ఈశ్వరగీతోపనిషత్తులో ఆరవ అధ్యాయం ॥ 6 ॥



## సప్తమోఽధ్యాయః –ఏడవ అధ్యాయం

## ఈశ్వరగీతా - ఈశ్వరగీత

**ఈశ్వర ఉవాచ :**–ఈశ్వరుడు పలికాడు

**శృణుధ్వమృషయస్సర్వే ప్రభావం పరమేష్ఠినః ।**
**యం జ్ఞాత్వా పురుషో ముక్తో న సంసారే పతేత్ పునః ॥ 1 ॥**

ఓ ఋషులారా! పరమాత్మప్రభావాన్ని మీరంతా వినండి. దీన్ని తెలుసుకున్నవాడు మళ్ళీ సంసారంలో పడడు.

**పరాత్పరతరం బ్రహ్మ శాశ్వతం నిష్కళం ధ్రువమ్ ।**
**నిత్యానన్దం నిర్వికల్పం తద్ధామ పరమం మమ ॥ 2 ॥**

పరాలన్నింటిలో పరం అయినదీ, పరబ్రహ్మ, శాశ్వతం, నిష్కలం, ధ్రువం, నిత్యానందం, నిర్వికల్పం అయినదే నా ధామం.

**అహం బ్రహ్మవిదాం బ్రహ్మే స్వయమ్భూర్విశ్వతోముఖః ।**
**మాయావినామహం దేవః పురాణో హరిరవ్యయః ॥ 3 ॥**

నేను బ్రహ్మజ్ఞానుల్లో బ్రహ్మను. చతుర్ముఖస్వయంభువును. మాయావుల్లో దేవుడు, పురాణుడు, అవ్యయుడు అయిన హరిని.

**యోగినామస్మ్యహం శమ్భుః స్త్రీణాం దేవీ గిరీన్ద్రజా ।**
**ఆదిత్యానామహం విష్ణుర్వసూనామస్మి పావకః ॥ 4 ॥**

యోగుల్లో శంభుడను. స్త్రీలలో పార్వతీ దేవిని. ఆదిత్యుల్లో విష్ణువును. వసువుల్లో పావకుడను.

**రుద్రాణాం శఙ్కరశ్చాహం గరుడః పతతామహమ్ ।**
**ఐరావతో గజేన్ద్రాణాం రామః శస్త్రభృతామహమ్ ॥ 5 ॥**

రుద్రుల్లో శంకరుణ్ణి, ఎగిరే పక్షుల్లో గరుడుణ్ణి. గజేంద్రుల్లో ఐరావతాన్ని. శస్త్రధారుల్లో రాముణ్ణి నేనే.

**ఋషీణాఞ్చ వసిష్ఠోఽహం దేవానాఞ్చ శతక్రతుః ।**
**శిల్పినాం విశ్వకర్మాఽహం ప్రహ్లాదోఽస్మ్యమరద్విషామ్ ॥ 6 ॥**

ఋషుల్లో వసిష్ఠుణ్ణి. దేవతల్లో ఇంద్రుణ్ణి. శిల్పుల్లో విశ్వకర్మను. దైత్యుల్లో ప్రహ్లాదుణ్ణి.

**మునీనామప్యహం వ్యాసో గణానాఞ్చ వినాయకః ।**
**వీరాణాం వీరభద్రోఽహం సిద్ధానాం కపిలో మునిః ॥ 7 ॥**

మునుల్లో వ్యాసుణ్ణి. గణాల్లో వినాయకుణ్ణి. వీరుల్లో వీరభద్రుణ్ణి. సిద్ధుల్లో కపిలమునిని.

**పర్వతానామహం మేరుర్నక్షత్రాణాఞ్చ చన్ద్రమాః ।**
**వజ్రం ప్రహరణానాఞ్చ వ్రతానాం సత్యమస్మ్యహమ్ ॥ 8 ॥**

పర్వతాల్లో మేరువును. నక్షత్రాలల్లో చంద్రుణ్ణి. ఆయుధాల్లో వజ్రాయుధాన్ని. వ్రతాల్లో సత్యవ్రతాన్ని.

**అనన్తో భోగినాం దేవః సేనానీనాఞ్చ పావకిః ।**
**ఆశ్రమాణాఞ్చ గార్హస్థమీశ్వరాణాం మహేశ్వరః ॥ 9 ॥**

భోగుల్లో అనంతుణ్ణి. సేనాపతుల్లో కుమారస్వామిని. ఆశ్రమాల్లో గృహస్థాశ్రమాన్ని. ఈశ్వరుల్లో మహేశ్వరుడను.

**మహాకల్పశ్చ కల్పానాం యుగానాం కృతమస్మ్యహమ్ ।**
**కుబేరః సర్వయక్షాణాం గణేశానాఞ్చ వీరకః ॥ 10 ॥**

కల్పాల్లో మహాకల్పాన్ని. యుగాల్లో కృతయుగాన్ని. యక్షుల్లో కుబేరుడను. గణేశ్వరుల్లో వీరకుడను.

**ప్రజాపతీనాం దక్షోఽహం నిరృతిః సర్వరక్షసామ్ ।**
**వాయుర్బలవతామస్మి ద్వీపానాం పుష్కరోఽస్మ్యహమ్ ॥ 11 ॥**

నేను ప్రజాపతుల్లో దక్షుడను. సర్వరాక్షసుల్లో నిరృతిని. బలవంతుల్లో వాయువును. ద్వీపాల్లో పుష్కరద్వీపాన్ని,

**మృగేన్ద్రాణాఞ్చ సింహోఽహం యన్త్రాణాం ధనురేవ చ ।**
**వేదానాం సామవేదోఽహం యజుషాం శతరుద్రియమ్ ॥ 12 ॥**

మృగాల్లో సింహాన్ని. యంత్రాల్లో ధనువును. వేదాల్లో సామవేదమును. యజుర్మంత్రాలలో శతరుద్రియాన్ని.

**సావిత్రీ సర్వమంత్రాణాం గుహ్యానాం ప్రణవోఽస్మ్యహమ్ ।**
**సూక్తానాం పౌరుషం సూక్తం జ్యేష్ఠసామ చ సామసు ॥ 13 ॥**

మంత్రాల్లో సావిత్రి మంత్రమును. రహస్యాలలో ప్రణవాన్ని. సూక్తాల్లో పురుషసూక్తాన్ని. సామాల్లో జ్యేష్ఠసామమును.

**సర్వవేదార్థవిదుషాం మనుః స్వాయమ్భువోఽస్మ్యహమ్ ।**
**బ్రహ్మావర్తస్తు దేశానాం క్షేత్రాణామవిముక్తకమ్ ॥ 14 ॥**

వేదార్థవిదుల్లో స్వాయంభువ మనువును. దేశాల్లో బ్రహ్మావర్తాన్ని. క్షేత్రాల్లో అవిముక్తకమును.

**విద్యానామాత్మవిద్యాఽహం జ్ఞానానామైశ్వరం పరమ్ ।**
**భూతానామస్మ్యహం వ్యోమ సత్త్వానాం మృత్యురేవ చ ॥ 15 ॥**

విద్యల్లో ఆత్మవిద్యను, జ్ఞానాల్లో పరమేశ్వరజ్ఞానాన్ని, పంచభూతాల్లో ఆకాశాన్ని, ప్రాణుల్లో మృత్యువును.

**పాశానామస్మ్యహం మాయా కాలః కలయతామహమ్ ।**
**గతీనాం ముక్తిరేవాహం పరేషాం పరమేశ్వరః ॥ 16 ॥**

పాశాలలో మాయాపాశాన్ని, మాయను సంహరించే వారిలో కాలాన్ని, గతుల్లో ఉత్తమమైన ముక్తిని. ఉత్తముల్లో పరమేశ్వరుణ్ణి.

**యచ్చాన్యదపి లోకేఽస్మింసత్త్వం తేజో బలాధికమ్ ।**
**తత్సర్వం ప్రతిజానీధ్వం మమ తేజో విజృంభితమ్ ॥ 17 ॥**

ఈ లోకంలోని తేజశ్శాలి, బలశాలి అయిన సత్త్వమంతా నా తేజో విజృంభితమే.

**ఆత్మానః పశవః ప్రోక్తాః సర్వే సంసారవర్తినః ।**
**తేషాం పతిరహం దేవః స్మృతః పశుపతిర్బుధైః ॥ 18 ॥**
**మాయాపాశేన బధ్నామి పశూనేతాన్ స్వలీలయా ।**
**మామేవ మోచకం ప్రాహుః పశూనాం వేదవాదినః ॥ 19 ॥**

సంసారంలో ఉన్న ఆత్మలన్నీ పశువులుగా చెప్పనైనవి. వానికి పతినైనందువల్ల నేను పశుపతిని అని జ్ఞానులచే చెప్పబడినది. ఈ పశువులన్నింటిని నా లీలతో మాయాపాశంతో బంధిస్తాను. వేదవిదులు ఈ పశు బంధాన్ని విడిపించేవాణ్ణి నేననే చెబుతున్నారు.

**మాయాపాశేన బద్ధానాం మోచకోఽన్యో న విద్యతే ।**
**మామృతే పరమాత్మానం భూతాధిపతిమవ్యయమ్ ॥ 20 ॥**

మాయా పాశబద్ధులను విడిపించటానికి భూతాధిపతిని, పరమాత్మను అయిన నేను తప్ప మరొకరు లేరు.

**చతుర్వింశతి తత్త్వాని మాయా కర్మగుణా ఇతి ।**
**ఏతే పాశాః పశుపతేః క్లేశాశ్చ పశుబన్ధనాః ॥ 21 ॥**

చతుర్వింశతి తత్త్వాలు, మాయ, కర్మగుణాలు, ఇవి పశుపతికి పాశాలు. జీవులకు క్లేశాన్ని కలుగ చేస్తాయి.ఇవే పశుబంధనాలు.

**మనోబుద్ధిరహఙ్కారః ఖానిలాగ్నిజలాని భూః ।**
**ఏతాః ప్రకృతయస్త్వష్టౌ వికారాశ్చ తథాఽపరే ॥ 22 ॥**

మనసు, బుద్ధి, అహంకారం, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి ఈ అష్టప్రకృతులు మిగిలినవి వికారాలు.

**శ్రోత్రం త్వక్ చక్షుషీ జిహ్వా ఘ్రాణశ్చైవ తు పఞ్చమమ్ ।**
**పాయూపస్థం కరౌ పాదౌ వాక్ చైవ దశమీ మతా ॥ 23 ॥**

శ్రోత్రం, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణం అనే అయిదు జ్ఞానేంద్రియాలు. పాయు, ఉపస్థ, కర, పాద, వాక్ అనేవి అయిదు కర్మేంద్రియాలు.

**శబ్దః స్పర్శశ్చ రూపం చ రసో గన్ధస్తథైవ చ ।**
**త్రయోవింశతిరేతాని తత్త్వాని ప్రకృతాని తు ॥ 24 ॥**

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అయిదు విషయాలు. ఈ ఇరవైమూడు ప్రకృతివల్ల ఏర్పడిన తత్త్వాలు.

**చతుర్వింశకమవ్యక్తం ప్రధానం గుణలక్షణమ్ ।**
**అనాదిమధ్యనిధనం కారణం జగతః పరమ్ ॥ 25 ॥**

ఇరవై నాల్గోతత్త్వం అవ్యక్తం అనే ప్రధానం. ఈ అవ్యక్తం సగుణం. ఆదిమధ్యాంతాలు లేనిది. జగత్తుకు పరమకారణం.

**సత్త్వం రజస్తమశ్చేతి గుణత్రయముదాహృతమ్ ।**
**సామ్యావస్థితిమేతేషామవ్యక్తం ప్రకృతిం విదుః ॥ 26 ॥**

సత్త్వరజస్తమస్సు లనేవి మూడుగుణాలు. ఈ మూటి సామ్యావస్థ అవ్యక్తం లేదా ప్రకృతి.

**సత్త్వం జ్ఞానం తమోఽజ్ఞానం రజోమిశ్రముదాహృతమ్ ।**
**గుణానాం బుద్ధివైషమ్యాత్ వైషమ్యం కవయో విదుః ॥ 27 ॥**

సత్త్వం జ్ఞానం. తమస్సు అజ్ఞానం. రజస్సు మిశ్రం. బుద్ధి వైషమ్యంవల్ల గుణవైషమ్యం కలుగుతుందని పండితులు చెప్పారు.

**ధర్మాధర్మావితి ప్రోక్తౌ పాశౌ ద్వౌ బంధసంజ్ఞితౌ ।**
**మయ్యర్పితాని కర్మాణి నిబన్ధాయ విముక్తయే ॥ 28 ॥**

బంధంపేరుతో ధర్మాధర్మాలనే రెండు పాశాలు. నాయందర్పించిన కర్మలు బంధ విముక్తిని ప్రసాదిస్తాయి.

**అవిద్యామస్మితాం రాగం ద్వేషం చాభినివేశకమ్ ।**
**క్లేశాఖ్యానచలాన్ ప్రాహుః పాశానాత్మనిబంధనాన్ ॥ 29 ॥**

అవిద్య, అస్మిత, రాగద్వేష, అభినివేశ, క్లేశాలనేవి చాలకాలం నిలిచే పాశబంధాలు.

**ఏతేషామేవ పాశానాం మాయా కారణముచ్యతే ।**
**మూలప్రకృతిరవ్యక్తా సా శక్తిర్మయి తిష్ఠతి ॥ 30 ॥**

ఈ పాశాలకు కారణం మాయ. అవ్యక్తం మూలప్రకృతి అనే శక్తి నాయందే ఉంటుంది.

**స ఏవ మూలప్రకృతిః ప్రధానం పురుషోఽపి చ ।**
**వికారా మహదాదీని దేవదేవః సనాతనః ॥ 31 ॥**

ఈ మూలప్రకృతి, ప్రధానం, పురుషుడు, మహత్తత్త్వం, అహంకారం మొదలైన వికారాలన్నీ దేవదేవుడు సనాతనుని స్వరూపాలే.

**స ఏవ బంధః స చ బన్ధకర్తా స ఏవ పాశః పశవః స ఏవ ।**
**స వేద సర్వం న చ తస్య వేత్తా తమాహురగ్ర్యం పురుషం పురాణమ్ ॥ 32 ॥**

సనాతన పురుషుడే బంధం. అతడే బంధనం చేసేవాడు. పశువులు పాశం కూడ అతడే. అతని కన్నీ తెలుసు. అతణ్ణి తెలిసేవారెవరూ లేదు. ఇతడే ఆదిపురుషుడు, పురాణపురుషుడని చెప్పబడ్డాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతా నామ సప్తమోఽధ్యాయః ॥ 7 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో ఈశ్వరగీత అనే ఏడవ అధ్యాయం ॥ 7 ॥

## అష్టమోఽధ్యాయః - ఎనిమిదవ అధ్యాయం

## ఈశ్వరగీతా - ఈశ్వరగీత

**ఈశ్వర ఉవాచ:**-ఈశ్వరుడు పలికాడు

**అన్యద్గుహ్యతమం జ్ఞానం వక్ష్యే బ్రాహ్మణపుఙ్గవాః ।**
**యేనాసౌ తరతే జంతుర్ఘోరం సంసారసాగరమ్ ॥ 1 ॥**

బ్రాహ్మణోత్తములారా! మరొక పరమ రహస్యమైన జ్ఞానాన్ని వివరిస్తున్నాను. దీన్ని తెలుసుకున్న పురుషుడు సంసారసాగరాన్ని దాటుతాడు.

**అహం బ్రహ్మమయః శాన్తః శాశ్వతో నిర్మలోఽవ్యయః ।**
**ఏకాకీ భగవానుక్తః కేవలః పరమేశ్వరః ॥ 2 ॥**

నేను పరబ్రహ్మను, శాంతుడను, శాశ్వతుడను, నిర్మలుడను, అవ్యయుడను. కేవలం పరమేశ్వరుడొక్కడే భగవంతునిగా చెప్పబడ్డాడు.

**మమ యోని ర్మహద్బ్రహ్మ తత్ర గర్భం దధామ్యహమ్ ।**
**మూలం మాయాఽభిధానన్తు తతో జాతమిదం జగత్ ॥ 3 ॥**

నాయొక్క ప్రకృతే క్షేత్రం. దానిలో మాయ అనే గర్భాన్ని ధరిస్తాను. దాని నుండే సకలజగత్తు జన్మించినది.

**ప్రధానం పురుషో హ్యాత్మా మహాన్ భూతాదిరేవ చ ।**
**తన్మాత్రాణి తథా భూతానీన్ద్రియాణి చ జజ్ఞిరే ॥ 4 ॥**

ప్రధానము, పురుషుడు, ఆత్మ, మహత్తత్త్వం, తామసాహంకారం, పంచతన్మాత్రలు, పంచమహాభూతాలు, ఇంద్రియాలు పుట్టినవి.

**తతోఽణ్డమభవద్ధైమం సూర్యకోటిసమప్రభమ్ ।**
**తస్మిన్ జజ్ఞే మహద్బ్రహ్మ మచ్ఛక్త్యా చోపబృంహితః ॥ 5 ॥**

ఆ తర్వాత కోటి సూర్య సమకాంతిగల బంగారు అండం పుట్టినది. ఆ అండంలోనే నాశక్తితో పెరిగిన మహాబ్రహ్మ జన్మించినాడు.

**యే చాన్యే బహవో జీవా మన్మయాః సర్వ ఏవ తే ।**
**న మాం పశ్యన్తి పితరం మాయయా మమ మోహితాః ॥ 6 ॥**

ఇంకా నా రూపులే అయిన జీవులెందరో జన్మించి నామాయా మోహితులై తండ్రినైన నన్ను గుర్తించటం లేదు.

**యాశ్చ యోనిషు సర్వాసు సమ్భవన్తి హి మూర్తయః ।**
**తాసాం మాయా పరా యోనిర్మామేవ పితరం విదుః ॥ 7 ॥**

ఈ విధంగా సర్వయోనుల్లో జన్మించే ప్రాణులకు తల్లి మాయ. నేను తండ్రిని.

**యో మామేవం విజానాతి బీజినం పితరం ప్రభుమ్ ।**
**స ధీరః సర్వలోకేషు న మోహమధిగచ్ఛతి ॥ 8 ॥**

నన్ను బీజప్రదుడైన తండ్రిగా గుర్తించే ధీరులు మోహాన్ని పొందరు.

**ఈశానః సర్వవిద్యానాం భూతానాం పరమేశ్వరః ।**
**ఓఙ్కారమూర్తిర్భగవానహం బ్రహ్మా ప్రజాపతిః ॥ 9 ॥**

అన్ని విద్యలకు అధిపతిని నేనే. ప్రాణులన్నింటికి పరమేశ్వరుణ్ణి నేనే. ఓంకారాన్ని, భగవంతుడను, బ్రహ్మను, ప్రజాపతిని నేనే.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ 10 ॥**

సమస్తప్రాణులలో సమానంగా ఉండే వానినిగానూ, నశించేవానిలో నాశనం లేనివానినిగా పరమేశ్వరునిగా ఎవడు తెలుసుకుంటాడో అతడే జ్ఞాని. అన్ని ప్రాణులందు సమరూపిగా ఉంటాను. నశించే వాళ్ళలో నశించకుండా ఉండేవాడను నేనే అని గుర్తించినవాడే జ్ఞాని.

**సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాఙ్గతిమ్ ॥ 11 ॥**

ప్రాణులన్నింటిని సమంగా చూస్తూ, తనను తాను హింసించుకోకుండా ఉండేవాడే పరమపదాన్ని పొందుతాడు.

**విదిత్వా సప్త సూక్ష్మాణి షడఙ్గం చ మహేశ్వరమ్ ।**
**ప్రధానవినియోగజ్ఞః పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥ 12 ॥**

సప్తసూక్ష్మాలు, షడంగాలుగల మహేశ్వరుని తెలిసికొని ప్రధానవినియోగాలు తెలిసినవాడు మాత్రమే పరమాత్మను చేరుకుంటాడు.

**సర్వజ్ఞతా తృప్తిరనాదిబోధః స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః ।**
**అనంతశక్తిశ్చ విభోర్విదిత్వా షడాహురఙ్గాని మహేశ్వరస్య ॥ 13 ॥**

సర్వజ్ఞత్వం, తృప్తి, అనాదిజ్ఞానం, స్వాతంత్ర్యం, ఎల్లప్పుడుండే శక్తి, అనంతశక్తి అనే ఆరు పరమేశ్వరుని షడంగాలు.

**తన్మాత్రాణి మన ఆత్మా చ తాని సూక్ష్మాణ్యాహుస్సప్త తత్త్వాత్మకాని ।**
**యా సా హేతుః ప్రకృతిః సా ప్రధానం బన్ధః ప్రోక్తో వినియోగోఽపి తేన ॥ 14 ॥**

పంచతన్మాత్రలు, మనస్సు, ఆత్మ అనే ఏడు సూక్ష్మాలు. హేతువుగా ఉండే ప్రకృతిని ప్రధానమంటారు. ప్రకృతిలో ఏర్పడే బంధమే వినియోగం.

**యా సా శక్తిః ప్రకృతౌ లీనరూపా వేదేషూక్తా కారణం బ్రహ్మయోనిః ।**
**తస్యా ఏకః పరమేష్ఠీ పరస్తాన్మహేశ్వరః పురుషః సత్యరూపః ॥ 15 ॥**

యేశక్తి ప్రకృతిలో కలిసి ఉన్నదో అది వేదాలయందు కారణంగా, బ్రహ్మయోనిగా చెప్పబడింది. ఈ బ్రహ్మయోనికి పురుషుడు, అద్వితీయుడు, పరమేష్ఠి, పరాత్పరుడు, సత్యరూపి అయిన మహేశ్వరుడు.

**బ్రహ్మా యోగీ పరమాత్మా మహీయాన్ వ్యోమవ్యాపీ వేదవేద్యః పురాణః ।**
**ఏకో రుద్రో మృత్యురవ్యక్తమేకం బీజం విశ్వం దేవ ఏకః స ఏవ ॥ 16 ॥**

ఆ పురుషుడే బ్రహ్మ, యోగి, పరమాత్మ, మహాన్, సర్వవ్యాపి అయిన వేదవేద్యుడు, పురాణుడు, అద్వితీయుడు, రుద్రుడు, మృత్యువు, అవ్యక్తం, ఏకం, బీజం, విశ్వం కూడ.

**తమేవైకం ప్రాహురన్యేఽ ప్యనేకం త్వేకాత్మానం కేచిదన్యత్తథాఽ ఽ హుః ।**
**అణోరణీయాన్ మహతోఽ సౌ మహీయాన్ మహాదేవః ప్రోచ్యతే వేదవిద్భిః ॥ 17 ॥**

అతణ్ణే కొందరు ఒకడని, మరికొందరు అనేకులని, అతడే అద్వితీయ ఆత్మ అని చెబుతారు. అణువుల్లో పరమాణువు, మహత్తుల్లో మహాన్ ఆ మహాదేవుడని వేదవిదులంటారు.

**ఏవం హి యో వేద గుహాశయం పరం ప్రభుం పురాణం పురుషం విశ్వరూపమ్ ।**
**హిరణ్మయం బుద్ధిమతాం పరాం గతిం స బుద్ధిమాన్ బుద్ధిమతీత్య తిష్ఠతి ॥ 18 ॥**

ఈ విధంగా సకలజీవుల్లో అంతర్యామిగా, పరునిగా, ప్రభువుగా, పురాణ పురుషునిగా, విశ్వరూపునిగా, హిరణ్మయునిగా, బుద్ధిమంతులకు పరమగతిగా తెలుసుకున్నవాడే పరమపదాన్ని పొందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఈశ్వరగీతాసు అష్టమోఽ ధ్యాయః ॥ 8 ॥**

శ్రీకూర్మపురాణంలో ఈశ్వరగీతల్లో ఎనిమిదవ అధ్యాయం ॥ 8 ॥



## నవమోఽధ్యాయః - తొమ్మిదవ అధ్యాయం

## ఈశ్వరగీతా - ఈశ్వరగీత

**ఋషయ ఊచుః :-**ఋషులు అడిగారు

**నిష్కలో నిర్మలో నిత్యో నిష్క్రియః పరమేశ్వరః ।**
**తన్నో వద మహాదేవ విశ్వరూపః కథం భవాన్ ॥ 1 ॥**

మీరు పరమేశ్వరులు. నిష్కలులు, నిత్యులు, నిష్క్రియులు. అటువంటపుడు తాము విశ్వరూపులెట్లా అవుతారు? ఈ విషయం మాకు వివరించండి.

**ఈశ్వర ఉవాచ :-**ఈశ్వరుడు పలికాడు

**నాహం విశ్వో న విశ్వఞ్చ మామృతే విద్యతే ద్విజాః! ।**
**మాయానిమిత్తమాత్రాస్తి సా చాత్మానముపాశ్రితా ॥ 2 ॥**

ఓ ద్విజులారా! నేను విశ్వాన్ని కాను. నేను లేక విశ్వము లేదు. ఇదంతా మాయానిమిత్తంగా జరుగుతున్నది. ఆ మాయ కూడ ఆత్మనాశ్రయించి ఉంటుంది.

**అనాదినిధనా శక్తిర్మాయాఽవ్యక్తసమాశ్రయా ।**
**తన్నిమిత్తః ప్రపంచోఽయమవ్యక్తాదభవత్ఖలు ॥ 3 ॥**

ఆద్యంతరహితమైన మాయ శక్తిరూపం. అది అవ్యక్తాన్ని ఆశ్రయించి ఉంటుంది. మాయానిమిత్తంగా అవ్యక్తం నుండి ప్రపంచం పుట్టినది.

**అవ్యక్తం కారణం ప్రాహుః ఆనన్దం జ్యోతిరక్షరమ్ ।**
**అహమేవ పరం బ్రహ్మ మత్తో హ్యన్యన్న విద్యతే ॥ 4 ॥**

అవ్యక్తం కారణంగా చెప్పనైనది. నేను ఆనందస్వరూపుడను. జ్యోతిస్స్వరూపుడను. అక్షరుడను. నేనే పరబ్రహ్మను. నాకంటె భిన్నమైనది మరొకటి లేదు.

**తస్మాన్మే విశ్వరూపత్వం నిశ్చితం బ్రహ్మవాదిభిః ।**
**ఏకత్వే చ పృథక్త్వే చ ప్రోక్తమేతన్నిదర్శనమ్ ॥ 5 ॥**

అందువల్ల బ్రహ్మవాదులు నేను విశ్వరూపుడనని నిశ్చయించినారు. ఒకటి ఉండటానికి అనేక రూపుడనుటకు నిదర్శనమిదే.

**అహం తత్పరమం బ్రహ్మ పరమాత్మా సనాతనః ।**
**అకారణం ద్విజాః! ప్రోక్తో న దోషో హ్యాత్మనస్తథా ॥ 6 ॥**

ద్విజులారా! నేను ఆ పరబ్రహ్మను, పరమాత్మను, సనాతనుడను. నాకు ఏకారణం లేదు. ఎటువంటి దోషం నాకు లేదు. (అనగా ఈ జగత్తులో వైషమ్యం, క్రూరత్వం మొదలైన దోషాలకు కారణం జీవులాచరించే కర్మలేకాని, ఈశ్వరుడుకాదు. ఈశ్వరుడు సాధారణకారణం కావున దోషం లేనివాడు అని అభిప్రాయం.)

**అనన్తాశ్శక్తయోఽ వ్యక్తే మాయాద్యాః సంస్థితా ధ్రువాః ।**
**తస్మిన్ దివి స్థితం నిత్యమవ్యక్తం భాతి కేవలమ్ ॥ 7 ॥**

మాయ మొదలైనట్టి స్థిరాలైనట్టియు అనన్తమైనశక్తులు అవ్యక్తంలో ఉన్నాయి. అందువలన మాటలతో వివరించలేనట్టి అవ్యక్తము భౌతికవిశ్వానికి అతీతంగా ఉన్నది.

**యాభిస్తల్లక్ష్యతే భిన్నమభిన్నం తు స్వభావతః ।**
**ఏకయా మమ సాయుజ్యమనాదినిధనం ధ్రువమ్ ॥ 8 ॥**

ఈ అవ్యక్తమే మాయలలో అనేక రూపాలుగా భిన్నంగా కనపడుతున్నది. కాని అది స్వభావంగానే అభిన్నం. దానికి మూలమైన ఒకే పరమశక్తితో ఆద్యంతాలులేని ధ్రువమైన నా సాయుజ్యాన్ని పొందుతుంది.

**పుంసోఽ భూదన్యయా భూతిరన్యయా తత్తిరోహితమ్ ।**
**అనాదిమధ్యం తిష్ఠన్తం యుజ్యతేఽ విద్యయా కిల ॥ 9 ॥**

మరో శక్తితో ఐశ్వర్యం కలుగుతుంది. ఇంకో శక్తితో ఆ ఐశ్వర్యం లోపిస్తుంది. ఆదిమధ్యాలులేని పురుషుడు అవిద్యతో కూడి ఉంటాడు.

**తదేతత్పరమం వ్యక్తం ప్రభామణ్డలమణ్డితమ్ ।**
**తదక్షరం పరం జ్యోతిస్తద్విష్ణోః పరమం పదమ్ ॥ 10 ॥**

ఆ పరమవ్యక్తం ప్రభామండలంతో అలంకరించబడినది. అది అక్షరం. పరంజ్యోతిః స్వరూపమైనది. అది శ్రీమహావిష్ణువు పరమపదం.

**తత్ర సర్వమిదం ప్రోతమోతం చైవాఖిలం జగత్ ।**
**తదేవ చ జగత్ కృత్స్నం తద్విజ్ఞాయ విముచ్యతే ॥ 11 ॥**

అక్కడనే ఈ సమస్తజగత్తు కూర్చబడినది.అదే సకలజగత్తు. ఆ పరమపదాన్ని తెలుసుకొన్నచో ముక్తి లభిస్తుంది.

**యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ।**
**ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ బిభేతి న కుతశ్చన ॥ 12 ॥**

దాన్ని పొందలేక మనసుతో కూడ వాక్కులు మరలి వస్తాయి. అట్టి ఆనందస్వరూపుడనైన పరబ్రహ్మను తెలుసుకున్నవాడు ఎక్కడా ఎటువంటి భయాన్ని పొందడు.

**వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।**
**తద్విజ్ఞాయ పరిముచ్యేత విద్వాన్ నిత్యానన్దీ భవతి బ్రహ్మభూతః ॥ 13 ॥**

తమోగుణాతీతుడు, సూర్యసమానవర్ణుడైన మహాపురుషుని నేనెరుగుదును. ఆ పురుషుని తెలిసినచో సంసారబంధంనుండి విడివడుతాడు. బ్రహ్మమయుడై నిత్యానందస్వరూపుడవుతాడు.

**యస్మాత్పరం నాపరమస్తి కించిత్ యజ్జ్యోతిషాం జ్యోతిరేకం దివిస్థమ్ ।**
**తదేవాత్మానం మన్యమానోఽథ విద్వాన్ ఆత్మానన్దీ భవతి బ్రహ్మభూతః ॥ 14 ॥**

ఇతనికంటె వేరుగా పరాపరములు లేవు. ద్యులోకంలో ఉన్న సకలజ్యోతులకు ఇదొక్కటే ప్రకాశాన్నిచ్చేది. దానినే ఆత్మగా తలచే జ్ఞాని నిత్యానందస్వరూపుడు, బ్రహ్మమయుడవుతాడు.

**తదవ్యయం కలిలం గూఢదేహం బ్రహ్మానందమమృతం విశ్వధామ ।**
**వదంత్యేవం బ్రాహ్మణా బ్రహ్మనిష్ఠా యత్ర గత్వా న నివర్తేత భూయః ॥ 15 ॥**

బ్రహ్మనిష్ఠులైన బ్రాహ్మణులు దాన్ని అవ్యయమని, సూక్ష్మరూపమని, రహస్యస్వరూపం కలదని, బ్రహ్మా నందభూతమని, అమృతస్వరూపమని, సర్వప్రపంచానికి నివాసభూతమని అంటారు. ఇచటికి చేరినవారు మళ్ళీ ఈ సంసారానికి రారు.

**హిరణ్మయే పరమాకాశతత్త్వే యథాఽర్చిషి ప్రతిభాతీవ తేజః ।**
**తద్విజ్ఞానే పరిపశ్యన్తి ధీరా విభ్రాజమానం విమలం వ్యోమధామ ॥ 16 ॥**

హిరణ్మయమైన పరమాకాశతత్త్వంలో తేజస్సువలె భాసించే తేజాన్ని ధీరులు విజ్ఞానంలో ప్రకాశించే పరి శుద్ధమైన పరమవ్యోమాన్ని పరమధామంగా చూస్తారు.

**తతః పరం పరిపశ్యన్తి ధీరాః ఆత్మన్యాత్మానమనుభూయానుభూయ ।**
**స్వయంప్రభః పరమేష్ఠీ మహీయాన్ బ్రహ్మానన్దీ భగవానీశ ఏషః ॥ 17 ॥**

తర్వాత ధీరులు ఆత్మలో ఆత్మానుభవాన్ని అనుభవిస్తూ, పరమ తత్త్వాన్ని దర్శించు కొనగల్గుతారు. ఆత్మతత్త్వం స్వయం ప్రకాశము. పరమేష్ఠి గొప్ప బ్రహ్మానందస్వరూపం. భగవానుడు ఈశ్వరుడు ఈ రూపంలో ఉంటాడని తెలుసుకుంటారు.

**ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా ।**
**తమేవైకం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్ ॥ 18 ॥**

అన్ని ప్రాణుల్లోను అంతరాత్మ. సర్వవ్యాపి ఒకే దేవుడు దాగి ఉంటాడు. అట్టి అద్వితీయ పరమాత్మతత్త్వాన్ని సాక్షాత్కరించుకొనగలవారు ధీరులు మాత్రమే శాంతిని పొందగలరు. ఇతరులు పొందలేరు.

**సర్వాననశిరోగ్రీవః సర్వభూతగుహాశయః ।**
**సర్వవ్యాపీ చ భగవాన్ తస్మాదన్య న్న విద్యతే ॥ 19 ॥**

ఆ పురుషుడు అన్నివైపుల శిరస్సులు, ముఖాలు, కంఠాలు కలవాడు. ప్రాణులన్నింటిలో అంతర్యామిగా ఉండి, అంతటా వ్యాపించి ఉంటాడు. అతనికంటె ఇతర మేదీ లేదు.

**ఇత్యేతదైశ్వరం జ్ఞానముక్తం వో మునిపుఙ్గవాః ।**
**గోపనీయం విశేషేణ యోగినామపి దుర్లభమ్ ॥ 20 ॥**

ఓ మునిపుంగవులారా! పరమేశ్వరజ్ఞానాన్ని మీకు బోధించినాను. ఈ జ్ఞానం యోగులకు కూడా సులభంగా లభించదు. కావున జాగ్రత్తగా దాచదగినది.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతాసు నవమోఽధ్యాయః. ॥ 9 ॥**

శ్రీకూర్మపురాణం ఉతరార్ధంలోని ఈశ్వరగీతలో తొమ్మిదవ అధ్యాయం ॥ 9 ॥



## దశమోఽధ్యాయః - పదవ అధ్యాయం

## ఈశ్వరగీతా - ఈశ్వరగీత

**ఈశ్వర ఉవాచ :-**ఈశ్వరుడు పలికాడు

**అలిఙ్గమేకమవ్యక్తం లిఙ్గం బ్రహ్మేతి నిశ్చితమ్ ।**
**స్వయంజ్యోతిః పరం తత్త్వం పరం వ్యోమ్ని వ్యవస్థితమ్ ॥ 1 ॥**

ఏ చిహ్నం లేనిది, అద్వితీయమైనది, అవ్యక్తమైన లింగం బ్రహ్మమని నిశ్చయింపనైనది. ఈ బ్రహ్మం స్వయం ప్రకాశం, పరతత్త్వం, పరమాకాశంలో ఉండేది.

**అవ్యక్తం కారణం యత్తదక్షరం పరమం పదమ్ ।**
**నిర్గుణం శుద్ధవిజ్ఞానం తద్వై పశ్యన్తి సూరయః ॥ 2 ॥**

ఇదే అవ్యక్తకారణరూపమైన పరమపదం. ఇది నిర్గుణము, శుద్ధవిజ్ఞానం. దానిని పండితులు మాత్రమే చూడగల్గుతారు.

**తన్నిష్ఠాః శాన్తసఙ్కల్పా నిత్యం తద్భావభావితాః ।**
**పశ్యన్తి తత్పరం బ్రహ్మ యత్తల్లిఙ్గమితి శ్రుతిః ॥ 3 ॥**

బ్రహ్మనిష్ఠులు, శాంతసంకల్పులు ఎల్లప్పుడు దానినే ధ్యానించేవారు. ఆ పరబ్రహ్మను తల్లింగమని శ్రుతి చెప్పేదానిని వీరు తెలుసుకోగలుగుతారు.

**అన్యథా న హి మాం ద్రష్టుం శక్యం వై మునిపుఙ్గవాః! ।**
**న హి తద్విద్యతే జ్ఞానం యతస్తజ్జ్ఞాయతే పరమ్ ॥ 4 ॥**

ఓ మునిశ్రేష్ఠులారా! ఇతర ఉపాయాలతో నన్ను చూడలేరు. పరమతత్త్వాన్ని తెలిపే ఇతర జ్ఞానమేదీ లేదు.

**ఏతత్తత్పరమం జ్ఞానం కేవలం కవయో విదుః ।**
**అజ్ఞానమితరత్ సర్వం యస్మాన్మాయామయం జగత్ ॥ 5 ॥**

దీనిని విద్వాంసులు మాత్రమే తెలుసుకుంటారు. పరమజ్ఞానం తప్ప మిగిలిన దంతా అజ్ఞానమే. ఈ అజ్ఞానం వల్లనే మాయజగత్తు ఉత్పన్నమైనది.

**యద్జ్ఞానం నిర్మలం సూక్ష్మం నిర్వికల్పం యదవ్యయమ్ ।**
**మమాత్మాఽసౌ తదేవేదమితి ప్రాహుర్విపశ్చితః ॥ 6 ॥**

ఈ జ్ఞానం నిర్మలం, సూక్ష్మం, నిర్వికల్పం, అవ్యయం. ఇదే నా ఆత్మస్వరూపం అని పండితులు చెబుతున్నారు.

**యేఽప్యనేకం ప్రపశ్యన్తి తేఽపి పశ్యన్తి తత్పరమ్ ।**
**ఆశ్రితాః పరమాం నిష్ఠాం బుద్ధ్వైకం తత్త్వమవ్యయమ్ ॥ 7 ॥**

అనేక రూపాలు చూచేవారు కూడ భక్తి నాశ్రయించి అద్వితీయం, అవినాశి అయిన తత్త్వాన్ని తెలుసుకొని దానిద్వారా పరమతత్త్వాన్ని తెలుసుకుంటారు.

**యే పునః పరమం తత్త్వమేకం వాఽనేకమీశ్వరమ్ ।**
**భక్త్యా మాం సమ్ప్రపశ్యన్తి విజ్ఞేయాస్తే తదాత్మకాః ॥ 8 ॥**

ఎవరు పరమాత్మను ఏకరూపంగాకాని, అనేక రూపాలుగాకాని భక్తితో చూస్తారో వారు కూడా బ్రహ్మస్వరూపులుగానే తెలియదగినవారు.

**సాక్షాదేవ ప్రపశ్యన్తి స్వాత్మానం పరమేశ్వరమ్ ।**
**నిత్యానన్దం నిర్వికల్పం సత్యరూపమితి స్థితిః ॥ 9 ॥**

నిత్యానందస్వరూపం, నిర్వికలం, సత్యస్వరూపమైన సాక్షాత్పరబ్రహ్మను తనలోనే చూడటం యథార్థస్థితి.

**భజన్తే పరమానన్దం సర్వగం యత్తదాత్మకమ్ ।**
**స్వాత్మన్యవస్థితాః శాన్తాః పరేఽవ్యక్తే పరస్య తు ॥ 10 ॥**

శాన్తులూ, తమ ఆత్మనిష్ఠులైన వారిలో కొందరు అవ్యక్తంలో పరమాత్మకు చెందినట్టీ, సర్వవ్యాపి అయినట్టి పరమానందాన్ని అనుభవిస్తున్నారు.

**ఏషా విముక్తిః పరమా మమ సాయుజ్యముత్తమమ్ ।**
**నిర్వాణం బ్రహ్మణా చైక్యం కైవల్యం కవయో విదుః ॥ 11 ॥**

ఇదే పరమ విముక్తి. ఇదే ఉత్తమమైన నా సాయుజ్యం. దీనినే కవులు బ్రహ్మైక్యం, కైవల్యం అని తెలుసుకొంటారు.

**తస్మాదనాదిమధ్యాన్తం వస్త్వేకం పరమం శివమ్ ।**
**స ఈశ్వరో మహాదేవస్తం విజ్ఞాయ విముచ్యతే ॥ 12 ॥**

అందువల్ల ఆదిమధ్యాంతాలు లేనిది, అద్వితీయం, పరమ శుభప్రదం అయ్యే తత్త్వమే ఈశ్వరుడు. ఇతడే మహాదేవుడు. ఇతణ్ణి తెలుసుకున్నవారు విముక్తి నందుతారు.

**న తత్ర సూర్యః ప్రవిభాతీహ చన్ద్రో న నక్షత్రాణి తమసో నోత విద్యుత్ ।**
**తద్భాసేదమఖిలం భాతి నిత్యం తన్నిత్యం భాసమచలం సద్విభాతి ॥ 13 ॥**

ఆ పరంధామంలో సూర్యుడు భాసించడు, చంద్రుడు, నక్షత్రాలు భాసించవు. అగ్ని ప్రకాశించలేదు. విద్యుత్తు కూడ వెలుగదు. పరంధాముని కాంతివల్లనే ఇవన్నీ వెలుగుతున్నాయి. ఆ ధామం నిత్యం, ఆ కాంతి కూడ నిత్యంగా ప్రకాశిస్తూనే ఉంటుంది. నిశ్చలంగా ఉంటూ భాసిస్తుంటుంది.

**నిత్యోదితం సంవిదా నిర్వికల్పం**
**శుద్ధం బృహన్తం పరమం యద్విభాతి ।**
**అత్రాన్తరం బ్రహ్మవిదో౽థ నిత్యం**
**పశ్యన్తి తత్త్వమచలం యత్స ఈశః ॥ 14 ॥**

ఎపుడూ ఉదయించే ఉంటుంది. జ్ఞానస్వరూపం, నిర్వికల్పం, శుద్ధం, బృహదాకారంకల్గి పరంగా భాసిస్తుంది. ఈ ప్రకాశాన్నే బ్రహ్మజ్ఞానులు ఎల్లప్పుడు నిత్యం, అచలమైన తత్త్వంగా దర్శిస్తారు. ఆ తత్త్వమే ఈశ్వరుడు.

**నిత్యానన్దమమృతం సత్యరూపం శుద్ధం వదన్తి పురుషం సర్వవేదాః ।**
**తమోమితి ప్రణవే నేశితారం ధ్యాయన్తి వేదార్థవినిశ్చితార్థాః ॥ 15 ॥**

ఆ పరమపురుషుని వేదాలన్నీ నిత్యానందమయమని, అమృతస్వరూపమని, సత్యరూపునిగా, పరిశుద్ధునిగా చెబుతున్నవి. వేదార్థనిశ్చయంగలవారు ఆ పరమాత్మను ఓం అని ప్రణవంతో ధ్యానం చేస్తారు.

**న భూమిరాపో న మనో న వహ్నిః ప్రాణో౽నిలో గగనం నోత బుద్ధిః ।**
**న చేతనో౽న్యత్ పరమాకాశమధ్యే విభాతి దేవః శివ ఏవ కేవలః ॥ 16 ॥**

ఆ పరమాకాశమధ్యలో భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, ప్రాణం ఇవేవి ప్రకాశించవు. అక్కడ ఏ చైతన్యమూ భాసించదు. ఒకే ఒక శివుడు మాత్రమే భాసిస్తుంటాడు.

**ఇత్యేతదుక్తం పరమం రహస్యం జ్ఞానామృతం సర్వవేదేషు గూఢమ్ ।**
**జానాతి యోగీ విజనే౽థ దేశే యుఞ్జీత యోగం ప్రయతో హ్యజస్రమ్ ॥ 17 ॥**

ఈవిధంగా పరమరహస్యం వేదాలన్నింటిలో అతిగూఢంగా దాగి ఉన్న జ్ఞానామృతాన్ని వివరించినాను. ఏకాంతప్రదేశంలో యోగాభ్యాసాన్ని చేసేవాడే ఈతత్త్వాన్ని తెలుసుకోగలుగుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే దశమో౽ధ్యాయః ॥ 10 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్థంలోని ఈశ్వరగీతలో పదవ అధ్యాయం ॥ 10 ॥



## ఏకాదశోఽధ్యాయః - పదకొండవ అధ్యాయం

## ఈశ్వరగీతా - ఈశ్వరగీత

**ఈశ్వర ఉవాచ :-**ఈశ్వరుడు పలికాడు

**అతఃపరం ప్రవక్ష్యామి యోగం పరమదుర్లభమ్ ।**
**యోగాత్మానం ప్రపశ్యన్తి భానుమంతమివేశ్వరమ్ ॥ 1 ॥**

ఇక పైన అత్యంత దుర్లభమైన యోగాన్ని వివరిస్తాను. ఈ యోగంతో సూర్యుని సాక్షాత్కరించుకొన్నట్లు ఈశ్వరసాక్షాత్కారం పొందుతారు.

**యోగాగ్నిర్దహతి క్షిప్రమశేషం పాపపఞ్జరమ్ ।**
**ప్రసన్నం జాయతే జ్ఞానం సాక్షాన్నిర్వాణసిద్ధిదమ్ ॥ 2 ॥**

యోగాగ్ని తొందరగా పాపరాశినంతా భస్మం చేస్తుంది. సాక్షాత్తు మోక్షాన్ని ప్రసాదించే ప్రసన్నమైన జ్ఞానం కలుగుతుంది.

**యోగాత్సఞ్జాయతే జ్ఞానం జ్ఞానాద్యోగః ప్రవర్తతే ।**
**యోగజ్ఞానాభియుక్తస్య ప్రసీదతి మహేశ్వరః ॥ 3 ॥**

యోగంవల్ల జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం యోగాన్ని ప్రవర్తింపచేస్తుంది. యోగం, జ్ఞానం కలవారికి ఈశ్వరుడు ప్రసన్నుడవుతాడు.

**ఏకకాలం ద్వికాలం వా త్రికాలం నిత్యమేవ వా ।**
**యే యుఞ్జన్తీహ మద్యోగం తే విజ్ఞేయా మహేశ్వరాః ॥ 4 ॥**

ప్రతిరోజు ఒకసారి లేదా రెండు మూడుసార్లు లేదా అన్ని కాలాల్లోను యోగసాధనలో ఉన్నవాళ్ళు సాక్షాత్తు మహేశ్వరులనే భావించాలి.

**యోగస్తు ద్వివిధో జ్ఞేయో హ్యభావః ప్రథమో మతః ।**
**అపరస్తు మహాయోగః సర్వయోగోత్తమోత్తమః ॥ 5 ॥**

యోగం రెండు విధాలుంటుంది. మొదటిది అభావయోగం. రెండవది అన్ని యోగాల్లో ఉత్తమయోగం అనబడే మహాయోగం.

**శూన్యం సర్వనిరాభాసం స్వరూపం యత్ర చిన్త్యతే ।**
**అభావయోగస్స ప్రోక్తో యేనాత్మానం ప్రపశ్యతి ॥ 6 ॥**

నిర్వికల్పస్వరూపాన్ని ధ్యానించేది అభావయోగం. దీనివల్ల యోగాత్మను దర్శించవచ్చు.

**యత్ర పశ్యతి చాత్మానం నిత్యానన్దం నిరఞ్జనమ్ ।**
**మయైక్యం స మహాయోగో భాషితః పరమేశ్వరః ॥ 7 ॥**

ఇక నిత్యానందరూపుడు, నిరంజనుడు అయిన పరమాత్మదర్శనం చేయించేది, నాలో ఐక్యాన్ని కలిగించేది మహాయోగం అనబడుతుంది.

**యే చాన్యే యోగినాం యోగాః శ్రూయన్తే గ్రంథవిస్తరే ।**
**సర్వే తే బ్రహ్మయోగస్య కలాం నార్హన్తి షోడశీమ్ ॥ 8 ॥**

అనేక గ్రంథాల్లో యోగులాచరించే ఇతర యోగాలు చాలా చెప్పబడ్డాయి. కాని అవన్నీ బ్రహ్మయోగానికి పదహారవ అంశతో సాటి కావు.

**యత్ర సాక్షాత్ప్రపశ్యన్తి విముక్తా విశ్వమీశ్వరమ్ ।**
**సర్వేషామేవ యోగానాం స యోగః పరమో మతః ॥ 9 ॥**

విముక్తులైనవారు ఈశ్వరుని ప్రపంచంగా, ప్రపంచాన్ని ఈశ్వరునిగా చూచే యోగం యోగాలన్నింటిలో ఉత్తమోత్తమమైనది.

**సహస్రశోఽథ శతశో యే చేశ్వరబహిష్కృతాః ।**
**న తే పశ్యన్తి మామేకం యోగినో యతమానసాః ॥ 10 ॥**

ఈశ్వరుని చూపలేని వేదబాహ్యాలైన వేలయోగాలు అభ్యసింపబడతున్నాయి. కాని వాని వల్ల నా సాక్షాత్కారం లభించదు.

**ప్రాణాయామస్తథా ధ్యానం ప్రత్యాహారోఽథ ధారణా।**
**సమాధిశ్చ మునిశ్రేష్ఠా యమో నియమ ఆసనమ్ ॥ 11 ॥**

**మయ్యేకచిత్తతా యోగో వృత్త్యన్తరనిరోధతః ।**
**తత్సాధనాన్యష్టధా తు యుష్మాకం కథితాని తు ॥ 12 ॥**

ఇతరవృత్తులను నిరోధించుట ద్వారా నాయందు చిత్తమును లగ్నము చేయుటయే యోగము. అట్టి యోగమునకు ప్రాణాయామం, ధ్యానం, ప్రత్యాహారం, ధారణ, సమాధి, యమం, నియమం, ఆసనం అనే ఈ ఎనిమిది సాధనాలని నీకు చెప్పబడ్డాయి.

**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యాపరిగ్రహౌ ।**
**యమాస్సంక్షేపతః ప్రోక్తాశ్చిత్తశుద్ధిప్రదా నృణామ్ ॥ 13 ॥**

అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనేవి సంక్షేపంగా యమములంటారు. ఇవి మానవులకు చిత్తశుద్ధిని కలిగిస్తాయి.

**కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా ।**
**అక్లేశజననం ప్రోక్తం త్వహింసా పరమర్షిభిః ॥ 14 ॥**

కర్మతో, మనసుతో, మాటతో అన్ని వేళల్లో అన్ని ప్రాణులకు కష్టం కలిగించకుండటం అహింస అని పరమర్షులు చెప్పినారు.

**అహింసాయాః పరో ధర్మో నాస్త్యహింసా పరం సుఖమ్ ।**
**విధినా యా భవేద్ధింసా త్వహింసైవ ప్రకీర్తితా ॥ 15 ॥**

అహింసను మించిన ధర్మం, సుఖం లేదు. వేదవిధిలో చేసే హింస అహింసగానే పేర్కొనబడినది.

**సత్యేన సర్వమాప్నోతి సత్యే సర్వం ప్రతిష్ఠితమ్ ।**
**యథార్థకథనాచారః సత్యం ప్రోక్తః ద్విజాతిభిః ॥ 16 ॥**

సత్యంతో అన్నింటిని పొందవచ్చు. సత్యంలోనే ఈ జగమంతా నిలిచినది. ద్విజులు యథార్థాన్ని చెప్పే ఆచారమే సత్యమన్నారు.

**పరద్రవ్యాపహరణం చౌర్యాద్వాథ బలేనఽవా ।**
**స్తేయం తస్యానాచరణాదస్తేయం ధర్మసాధనమ్ ॥ 17 ॥**

దొంగతనంగా గాని, బలవంతంగా కాని పరద్రవ్యాన్ని అపహరించటం స్తేయం. దీన్ని ఆచరించకపోవటమే అస్తేయం. ఇది ధర్మానికి సాధనగా చెప్పబడింది.

**కర్మణా మనసా వాచా సర్వావస్థాసు సర్వదా ।**
**సర్వత్ర మైథునత్యాగం బ్రహ్మచర్యం ప్రచక్షతే ॥ 18 ॥**

కర్మ, మనసు, మాటలతో అన్నివేళల అన్నిచోట్ల మైథునం త్యజించటమే బ్రహ్మచర్యం.

**ద్రవ్యాణామప్యనాదానమాపద్యపి యథేచ్ఛయా ।**
**అపరిగ్రహ ఇత్యాహుస్తం ప్రయత్నేన పాలయేత్ ॥ 19 ॥**

ఆపదలోనైనా సరే ఇష్టపూర్వకంగా ఏ ద్రవ్యాన్నీ స్వీకరించకపోవటం అపరిగ్రహం అవుతుంది. దీన్ని అత్యంత ప్రయత్నంతో పాటించాలి.

**తపస్స్వాధ్యాయసన్తోషాశ్శౌచమీశ్వరపూజనమ్ ।**
**సమాసాన్నియమాః ప్రోక్తాః యోగసిద్ధిప్రదాయినః ॥ 20 ॥**

తపస్సు, స్వాధ్యాయం, సంతోషం, శౌచం, ఈశ్వరపూజ ఇవి యోగసిద్ధిని ప్రసాదించే నియమాలు.

**ఉపవాసపరాకాదికృచ్ఛ్రచాన్ద్రాయణాదిభిః ।**
**శరీరశోషణం ప్రాహుస్తాపసాస్తప ఉత్తమమ్ ॥ 21 ॥**

ఉపవాసం, పరాకం, కృచ్ఛ్రం, చాంద్రాయణం మొదలైన వ్రతాలతో శరీరాన్ని శోషింపచేయటమే ఉత్తమ తపస్సని తాపసులు చెప్పారు. పరాకమనగా పన్నెండు రోజులు భోజనం చేయకుండా ఆచరించే ప్రాయశ్చిత్తరూపవ్రత విశేషము.

**వేదాన్తశతరుద్రీయప్రణవాదిజపం బుధాః ।**
**సత్త్వశుద్ధికరం పుంసాం స్వాధ్యాయం పరిచక్షతే ॥ 22 ॥**

వేదాంతశాస్త్రం, శతరుద్రీయం, ప్రణవం మొదలైన వానిని జపించటం స్వాధ్యాయమవుతుంది. ఇది మనశ్శుద్ధి కల్గిస్తుందని పండితులు చెబుతారు.

**స్వాధ్యాయస్య త్రయో భేదాః వాచికోపాంశుమానసాః ।**
**ఉత్తరోత్తరవైశిష్ట్యం ప్రాహుర్వేదార్థవాచినః ॥ 23 ॥**

వాచికం, ఉపాంశువు, మానసం అని స్వాధ్యాయం మూడు విధాలు. వీటిలో ఉత్తరోత్తరములు ఉత్తమమని వేదార్థం తెలిసినవారు చెబుతారు.

**యశ్శబ్దబోధజననః పరేషాం శృణ్వతాం స్ఫుటమ్ ।**
**స్వాధ్యాయో వాచికః ప్రోక్త ఉపాంశోరథ లక్షణమ్ ॥ 24 ॥**

**ఓష్ఠయోః స్పన్దమాత్రేణ పరస్యాశబ్దబోధకః ।**
**ఉపాంశురేష నిర్దిష్టః సాహస్రో వాచికాజ్జపః ॥ 25 ॥**

వినేవారికి స్పష్టంగా శబ్దాలు తెలిసేట్లు పలకటం వాచిక స్వాధ్యాయం. పెదవులు మాత్రం కదలుతూ ఇతరులకు శబ్దం వినబడకుండ చెప్పటం ఉపాంశు స్వాధ్యాయ మంటారు. వాచికంకన్నా ఈ జపం వేయిరెట్లు ఉత్తమం.

**యత్పదాక్షరసంగత్యా పరిస్పందనవర్జితమ్ ।**
**చిన్తనం సర్వశబ్దానాం మానసం తం జపం విదుః ॥ 26 ॥**

పదాలు, అక్షరాలు కలిపి చేస్తున్నా పెదవుల కదలిక కూడ లేకుండా శబ్దాలన్నింటిని భావించడం మానసజపం.

**యదృచ్ఛాలాభతో నిత్యమలం పుంసో భవేదితి ।**
**యా ధీస్తామృషయో ప్రాహుః సన్తోషం సుఖలక్షణమ్ ॥ 27 ॥**

దైవసంకల్పంతో లభించేదే చాలు అనే బుద్ధి సంతోషం. ఇది పరమానందాన్ని కలిగిస్తుంది.

**బాహ్యమాభ్యన్తరం శౌచం ద్విధా ప్రోక్తం ద్విజోత్తమాః ।**
**మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం మనశ్శుద్ధిరథాంతరమ్ ॥ 28 ॥**

శౌచం బాహ్యమని, ఆభ్యంతరమని రెండు విధాలు చెప్పబడింది. మట్టి, జలంతో చేసేది బాహ్యశౌచం. మనఃపరిశుద్ధి ఆభ్యంతరశౌచం అంటారు.

**స్తుతిస్మరణపూజాభిర్వాఙ్మనఃకాయకర్మభిః ।**
**సునిశ్చలా శివే భక్తిరేతదీశ్వరపూజనమ్ ॥ 29 ॥**

స్తుతి, స్మరణం పూజ అనేవి వాఙ్మనఃకాయకర్మలు. ఈ మూటితో పరమశివునియందు నిశ్చలమైన భక్తి ఈశ్వరపూజనం అవుతుంది.

**యమాస్సనియమాః ప్రోక్తాః ప్రాణాయామం నిబోధత ।**
**ప్రాణస్స్వదేహజో వాయురాయామస్తన్నిరోధనమ్ ॥ 30 ॥**

ఈ విధంగా యమ, నియమాలు చెప్పబడ్డాయి. ఇక ప్రాణాయామం గురించి తెలుసుకోండి. తన దేహంలోని వాయువు ప్రాణం అనబడుతుంది. దాన్ని నిరోధించటం ప్రాణాయామం.

**ఉత్తమాధమమధ్యత్వాత్ త్రిధాఽయం ప్రతిపాదితః ।**
**స ఏవ ద్వివిధః ప్రోక్తః సగర్భోఽగర్భ ఏవ చ ॥ 31 ॥**

ఇది ఉత్తమ, మధ్యమ, అధమ భేదాలతో మూడు విధాలు. మళ్ళీ సగర్భం, అగర్భం అని రెండు విధాలు.

**మాత్రా ద్వాదశకో మన్దశ్చతుర్వింశతిమాత్రికః ।**
**మధ్యమః ప్రాణసంరోధష్షట్త్రింశన్మాత్రికోత్తమః ॥ 32 ॥**

ద్వాదశ మాత్రాకాలం ఆచరించేది మందమని, ఇరువది నాలుగు మాత్రల కాలం ఆచరించేది మధ్యమమని, ముప్పది ఆరుమాత్రల కాలం ఆచరించేది ఉత్తమమని చెప్పబడింది.

**ప్రస్వేదకమ్పనోత్థానజనకత్వం యథాక్రమమ్ ।**
**మన్దమధ్యమముఖ్యానామానన్దాదుత్తమోత్తమః ॥ 33 ॥**

ఆనందాన్ని కలిగించే ప్రాణాయామం ఉత్తమోత్తమం. మందమధ్యమ ముఖ్యప్రాణాయామములు వరుసగా ప్రస్వేదము, కంపనము, ఉత్థానములను కలిగిస్తాయి.

**సగర్భమాహుస్సజపమగర్భం విజపం బుధాః ।**
**ఏతద్వై యోగినాముక్తం ప్రాణాయామస్య లక్షణమ్ ॥ 34 ॥**

జపంతోపాటు చేసే ప్రాణాయామం సగర్భమని, జపంలేక చేసే ప్రాణాయామం అగర్భమని యోగులు ప్రాణాయామలక్షణాన్ని చెప్పారు.

**సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ ।**
**త్రిర్జపేదాయతప్రాణః ప్రాణాయామః స ఉచ్యతే ॥ 35 ॥**

వ్యాహృతులతో, ప్రణవంతో, శీర్షమంత్రంతో కూడిన గాయత్రిని ప్రాణాయామంతో మూడు మార్లు జపిస్తే ఉత్తమ ప్రాణాయామం.

**రేచకః పూరకశ్చైవ ప్రాణాయామోఽథ కుంభకః ।**
**ప్రోచ్యతే సర్వశాస్త్రేషు యోగిభిర్యతమానసైః ॥ 36 ॥**

మనోనిగ్రహంగల యోగులచేత రేచక, పూరక, కుంభకములని ఈ ప్రాణాయామం మూడు విధాలుగా సమస్తశాస్త్రాలలో చెప్పబడింది.

**రేచకో౽జస్రనిఃశ్వాసాత్ పూరకస్తన్నిరోధతః ।**
**సామ్యేన సంస్థితిర్యా సా కుంభకః పరిగీయతే ॥ 37 ॥**

ఎల్లప్పుడు వాయువును బయటికి వదలటం రేచకమని, నిరోధించటం పూరకం అని, వాయు సామ్యస్థితి కుంభకమని చెప్పబడింది.

**ఇంద్రియాణాం విచరతాం విషయేషు స్వభావతః ।**
**నిగ్రహః ప్రోచ్యతే సద్భిః ప్రత్యాహారస్తు సత్తమాః ॥ 38 ॥**

సుజనులారా! శబ్ద స్పర్శాది విషయాల్లో సహజంగా ప్రవర్తించే ఇంద్రియాలను నిగ్రహించటం ప్రత్యాహార మని పేరు.

**హృత్పుణ్డరీకే నాభ్యాం వా మూర్ధ్ని పర్వతమస్తకే ।**
**ఏవమాదిషు దేశేషు ధారణా చిత్తబంధనమ్ ॥ 39 ॥**

హృదయపద్మంలో, నాభిలో, శిరసులో, పర్వతశిఖరంలో మనసు నిల్పటం ధారణ.

**దేశావస్థితిమాలంబ్య బుద్ధేర్యా వృత్తిసన్తతిః ।**
**వృత్త్యన్తరైరసంస్పృష్టా తద్ధ్యానం సూరయో విదుః ॥ 40 ॥**

దేశవిశేషమునాశ్రయించి ఇతరవృత్తులతో సంబంధములేని బుద్ధియొక్క ఏకాగ్రవృత్తినే ధ్యానముగా పండితులు చెబుతున్నారు.

**ఏకాకారస్సమాధిస్స్యాత్ దేశాలంబనవర్జితః ।**
**ప్రత్యయో హ్యర్థమాత్రేణ యోగసాధనముత్తమమ్ ॥ 41 ॥**

ఏ దేశాన్ని ఆశ్రయించకుండా ఒకే ఆకారంతో చిత్తాన్ని నిలుపగల్గటం సమాధి. ఈ సమాధిలో అర్థం మాత్రం భాసిస్తుంది. ఇది ఉత్తమ యోగసాధన.

**ధారణా ద్వాదశాయామా ధ్యానం ద్వాదశధారణాః ।**
**ధ్యానం ద్వాదశకం యావత్ సమాధిరభిధీయతే ॥ 42 ॥**

ద్వాదశప్రాణాయామాలు ఒక ధారణ. ద్వాదశధారణలు ఒక ధ్యానం. ద్వాదశ ధ్యానాలు ఒక సమాధి అని చెప్పబడింది.

**ఆసనం స్వస్తికం ప్రోక్తం పద్మమర్ధాసనం తథా ।**
**సాధనానాం చ సర్వేషామేతత్సాధనముత్తమమ్ ॥ 43 ॥**

స్వస్తికమని, పద్మమని, అర్ధాసనమని ఆసనం మూడు విధాలు. ఈ ఆసనాలు అన్ని సాధనాల్లో ఉత్తమసాధనాలు.

**ఊర్వోరుపరి విప్రేన్ద్రాః కృత్వా పాదతలే ఉభే ।**
**సమాసీతాత్మనః పద్మమేతదాసనముత్తమమ్ ॥ 44 ॥**

విప్రశ్రేష్ఠులారా! రెండు పాదాలను ఊరువులపై నుంచి కూర్చోవటం పద్మాసనం. ఇది ఉత్తమాసనం.

**ఏకపాదమథైకస్మిన్ విన్యస్యోరుణి సత్తమాః ।**
**ఆసీతార్ధాసనమిదం యోగసాధనముత్తమమ్ ॥ 45 ॥**

ఒక పాదాన్ని ఒక తొడపై ఉంచి కూర్చోవటం అర్ధాసనం. ఇది కూడ ఉత్తమ సాధనమే.

**ఉభే కృత్వా పాదతలే జానూర్వోరన్తరేణ హి ।**
**సమాసీతాత్మనః ప్రోక్తమాసనం స్వస్తికం పరమ్ ॥ 46 ॥**

మోకాలు, తొడలమధ్యలో పాదాలను ఉంచి కూర్చోవటం స్వస్తికాసనమని పేరు.

**అదేశకాలే యోగస్య దర్శనం హి న విద్యతే ।**
**అగ్న్యభ్యాసే జలే వాఽపి శుష్కపర్ణచయే తథా ॥ 47 ॥**

**జంతువ్యాప్తే శ్మశానే చ జీర్ణగోష్ఠే చతుష్పథే ।**
**సశబ్దే సభయే వాఽపి చైత్యవల్మీకసఞ్చయే ॥ 48 ॥**

**అశుభే దుర్జనాక్రాన్తే మశకాదిసమన్వితే ।**
**నాచరేద్దేహబాధే వా దౌర్మనస్యాదిసంభవే ॥ 49 ॥**

అదేశంలో, అకాలంలో యోగం ఆచరింపరాదు. అగ్ని సమీపంలో, జల ప్రవాహం దగ్గర, ఎండుటాకుల మధ్య, జంతువులు సంచరించే చోట, శ్మశానంలో, పాతయింటిలో, నాలుగు దోవల కూడలిలో,ధ్వని ఎక్కువగా ఉండే చోట, భయం కలిగే చోట, అచ్చబండచెంతగల చెట్లవద్ద, పుట్టలున్న చోట, అశుభ ప్రదేశంలో, దుర్జనులున్న చోట, దోమలు మొదలైన కీటకాలు సంచరించే చోట, శరీరబాధ ఉన్నపుడు, మనసు చెడు ఆలోచనల్లో ఉన్నపుడు యోగం చేయరాదు.

**సుగుప్తే సుశుభే దేశే గుహాయాం పర్వతస్య తు ।**
**నద్యాస్తీరే పుణ్యదేశే దేవతాయతనే తథా ॥ 50 ॥**

**గృహే వా సుశుభే రమ్యే విజనే జన్తువర్జితే ।**
**యుఞ్జీత యోగీ సతతమాత్మానం మత్పరాయణః ॥ 51 ॥**

ఏకాంత ప్రదేశంలో, పర్వతగుహలో, శుభప్రదేశంలో, నదీతీరంలో, పుణ్యప్రదేశంలో, దేవాలయంలో, ఇంటిలో, శుభకరమైన సమయంలో, అందమైన చోట, జనులు లేని ప్రదేశంలో, జంతువులు సంచరించని చోట నా యందే చిత్తాన్ని నిల్పి యోగం ఆచరించాలి.

**నమస్కృత్య తు యోగీన్ద్రాన్ సశిష్యాంశ్చ వినాయకమ్ ।**
**గురుం చైవాథ మాం యోగీ యుంజీత సుసమాహితః ॥ 52 ॥**

శిష్యులతో కూడియున్న యోగీంద్రులను, వినాయకుని, గురువును, నన్ను నమస్కరించి సావధాన చిత్తుడై యోగాన్ని ప్రారంభించాలి.

**ఆసనం స్వస్తికం బద్ధ్వా పద్మమర్ధమథాపి వా ।**
**నాసికాగ్రే సమాం దృష్టిమీషదున్మీలితేక్షణః ॥ 53 ॥**

**కృత్వాఽథ నిర్భయశ్శాన్తస్త్యక్త్వా మాయామయం జగత్ ।**
**స్వాత్మన్యవస్థితం దేవం చిన్తయేత్పరమేశ్వరమ్ ॥ 54 ॥**

స్వస్తిక, పద్మ అర్ధాసనాలలో ఒకదానిని అధిష్ఠించి, అర్ధనిమీలితనేత్రుడై, నాసికాగ్రంలో దృష్టి నిల్పి, భయం లేక శాంతుడై, మాయామయమైన జగత్తును వదలి, తన ఆత్మలో అంతర్యామిగా ఉన్న పరమేశ్వరుని ధ్యానించాలి.

**శిఖాగ్రే ద్వాదశాంగుల్యే కల్పయిత్వాఽథ పఙ్కజమ్ ।**
**ధర్మకన్దసముద్భూతం జ్ఞాననాలం సుశోభనమ్ ॥ 55 ॥**

**ఐశ్వర్యాష్టదలం శ్వేతం పరం వైరాగ్యకర్ణికమ్ ।**
**చిన్తయేత్పరమం కోశం కర్ణికాయాం హిరణ్మయమ్ ॥ 56 ॥**

**సర్వశక్తిమయం సాక్షాత్ యం ప్రాహుర్దివ్యమవ్యయమ్ ।**
**ఓఙ్కారవాచ్యమవ్యక్తం రశ్మిజాలసమాకులమ్ ॥ 57 ॥**

**చిన్తయేత్తత్ర విమలం పరం జ్యోతిర్యదక్షరమ్ ।**
**తస్మిన్ జ్యోతిషి విన్యస్య స్వాత్మానం తదభేదతః ॥ 58 ॥**

**ధ్యాయీతాకాశమధ్యస్థమీశం పరమకారణమ్ ।**
**తదాఽఽత్మా సర్వగో భూత్వా న కిఞ్చిదపి చిన్తయేత్ ॥ 59 ॥**

శిఖాగ్రభాగంలో పన్నెండంగుళాల ప్రదేశంలో పద్మాన్ని భావించుకోవాలి. ఈ పద్మం ధర్మస్కంధంనుండి పుట్టినది. జ్ఞానమనే నాళం కలది. పరమసుందరమైనది. అష్టైశ్వర్యాలు దళాలుగాగలది. తెల్లనిది, వైరాగ్యమనే కర్ణిక కలది. ఆ కర్ణికలో హిరణ్మయకోశాన్ని సర్వశక్తిమయాన్ని చింతించాలి. ఈ కోశంలో దివ్యం, అవ్యయం, ఓంకారవాచ్యం, అవ్యక్తం, కాంతిపుంజసమన్వితం, అక్షరం పరిశుద్ధమైన జ్యోతిని చింతించాలి. తన ఆత్మను అభేదబుద్ధితో ఆ జ్యోతిలో ఉంచి ఆకాశమధ్యమందున్న పరమకారణమైన ఈశ్వరుని ధ్యానించాలి. అపుడు ఆత్మ సర్వవ్యాపి అవుతుంది. ఇంక దేనిని చింతించరాదు.

**ఏతద్గుహ్యతమం ధ్యానం ధ్యానాన్తరమథోచ్యతే ।**
**చిన్తయిత్వా తు పూర్వోక్తం హృదయే పద్మముత్తమమ్ ॥ 60 ॥**

**ఆత్మానమథ కర్తారం తత్రానలసమత్విషమ్ ।**
**మధ్యే వహ్నిశిఖాకారం పురుషం పఞ్చవింశకమ్ ॥ 61 ॥**

**చింతయేత్పరమాత్మానం తన్మధ్యే గగనం పరమ్ ।**
**ఓఙ్కారే బోధితం తత్త్వం శాశ్వతం శివమచ్యుతమ్ ॥ 62 ॥**

**అవ్యక్తం ప్రకృతౌ లీనం పరం జ్యోతిరనుత్తమమ్ ।**
**తదన్తః పరమం తత్త్వమాత్మాధారం నిరఞ్జనమ్ ॥ 63 ॥**

ఈ పైన చెప్పబడిన ధ్యానము పరమరహస్యమైనది. మరో ధ్యానాన్ని వివరిస్తాను. పూర్వము చెప్పబడిన ఉత్తమమైన ఆ పద్మాన్ని హృదయమందు చింతించి, అటు పిమ్మట ఆ పద్మం మధ్యలో వహ్నితో సమానమైన కాంతి కలిగిన, వహ్నిశిఖవంటి ఆకారము కలిగిన, ఇరవై అయిదవ తత్త్వమైన, పరమాత్మరూపమైన, ఆ పద్మము మధ్యలోని పరమైన శూన్యభాగమైన, ఓంకారమందు చెప్పబడిన తత్త్వరూపమైన, శాశ్వతము, మంగళప్రదము, అచ్యుతము, అవ్యక్తము, ప్రకృతిలో లీనమైన పరంజ్యోతిఃస్వరూపము అయిన ఆ హృదయపుండరీకమందు మధ్యస్థపరమతత్త్వమైన, సమస్తమునకు ఆధారమైన, అసంగమైన పురుషతత్త్వాన్ని ధ్యానించాలి.

**ధ్యాయీత తన్మయో నిత్యమేకరూపం మహేశ్వరమ్ ।**
**విశోధ్య సర్వతత్త్వాని ప్రణవేనాథ వా పునః ॥ 64 ॥**

**సంస్థాప్య మయి చాత్మానం నిర్మలే పరమే పదే ।**
**ప్లావయిత్వాఽఽత్మనో దేహం తేనైవ జ్ఞానవారిణా ॥ 65 ॥**

**మదాత్మా మన్మయో భస్మ గృహీత్వా హ్యగ్నిహోత్రజమ్ ।**
**తేనోద్ధృత్య తు సర్వాఙ్గమగ్నిరిత్యాదిమన్త్రతః ।**

**చిన్తయేదాత్మనాత్మానం పరంజ్యోతిస్స్వరూపిణమ్ ॥ 66 ॥**

ఆ జ్యోతి మధ్య ఏకరూపుడైన మహేశ్వరుని తన్మయుడై ధ్యానించాలి. లేదా అన్ని తత్త్వాలను ప్రణవంతో శుద్ధి గావించి నిర్మలము పరమపదమైన నా యందు ఆత్మను నిల్పి జ్ఞానజలంతో దేహాన్ని తడిపి నా స్వరూపుడై నా యందే మనసు నిల్పి అగ్ని హోత్రంవల్ల కలిగిన భస్మాన్ని తీసుకొని అగ్నిమీడే మొదలైన మంత్రాలతో అన్ని అవయవాలకు అలదుకొని పరంజ్యోతిఃస్వరూపుడైన ఈశ్వరుని తనలో ధ్యానించవలెను.

**ఏష పాశుపతో యోగః పశుపాశవిముక్తయే ।**
**సర్వవేదాన్తసారోఽయమత్యాశ్రమమితి శ్రుతిః ॥ 67 ॥**

జీవబంధాన్ని విడిపించే ఈ యోగాన్ని పాశుపతయోగమంటారు. ఇది సర్వవేదాంతసారం. దీనిని అత్యాశ్రమమంటారని శృతి.

**ఏతత్పరతరం గుహ్యం మత్సాయుజ్యోపపాదకమ్ ।**
**ద్విజాతీనాన్తు కథితం భక్తానాం బ్రహ్మచారిణామ్ ॥ 68 ॥**

ఇది పరమోత్కృష్టం. పరమరహస్యం. నా సాయుజ్యాన్ని కలిగించేది. భక్తులు బ్రహ్మచారులైన ద్విజులకు ఈ యోగం చెప్పనైనది.

**బ్రహ్మచర్యమహింసా చ క్షమా శౌచం తపో దమః ।**
**సన్తోషస్సత్యమాస్తిక్యం వ్రతాంగాని విశేషతః ॥ 69 ॥**

ఈ యోగాంగాలు, బ్రహ్మచర్యం, అహింస, క్షమ, శౌచం, ఇంద్రియనిగ్రహం, తపస్సు, సంతోషం, సత్యం, ఆస్తిక్యం అనేవి.

**ఏకేనాప్యథ హీనేన వ్రతమస్య తు లుప్యతే ।**
**తస్మాదాత్మగుణోపేతో మద్వ్రతం వోఢు మర్హతి ॥ 70 ॥**

వీనిలో ఒకటి లోపించినా వ్రతం లోపిస్తుంది. అందువల్ల ఆత్మగుణసమన్వితుడై ఈ వ్రతాన్ని అనుష్ఠించాలి.

**వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవోఽనేన యోగేన పూతా మద్భావమాగతాః ॥ 71 ॥**

రాగము భయం క్రోధాన్ని విడిచి మన్మయులై నన్నే ఆశ్రయించి ఈ యోగంతో పవిత్రులైన చాల మంది నా రూపాన్ని పొందినారు.

**యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ।**
**జ్ఞానయోగేన మాం తస్మాత్ యజేత పరమేశ్వరమ్ ॥ 72 ॥**

ఎవరేవిధంగా నన్నాశ్రయిస్తారో వారిని నేను కూడ అదే విధంగా పరిగ్రహిస్తాను. కాబట్టి పరమేశ్వరుడనైన నన్ను జ్ఞానయోగంతో ఉపాసించాలి.

**అథవా భక్తియోగేన వైరాగ్యేణ పరేణ తు ।**
**చేతసా బోధయుక్తేన పూజయేన్మాం సదా శుచిః ॥ 73 ॥**

భక్తియోగంతో లేదా వైరాగ్యంతోకాని సేవించవచ్చు. సర్వకాలాల్లో శుభమైన జ్ఞానం కల మనసుతో నన్ను పూజించాలి.

**సర్వకర్మాణి సంన్యస్య భిక్షాశీ నిష్పరిగ్రహః ।**
**ప్రాప్నోతి మమ సాయుజ్యం గుహ్యమేతన్మయోదితమ్ ॥ 74 ॥**

అన్ని కర్మలు వదలి, భిక్షాశనంతో పరిగ్రహాన్ని విడిచి, ఈ యోగాన్ని ఆచరించినట్లైతే నా సాయుజ్యాన్ని పొందుతారు. ఇది పరమ రహస్యమైన యోగం. నీకు వివరించినాను.

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహఙ్కారో యో మద్భక్తస్స మే ప్రియః ॥ 75 ॥**

ఏ ప్రాణిని ద్వేషించక మిత్రభావం, కరుణకల్గి అహంకార మమకారాలు లేని నా భక్తుడు నాకు ప్రియతముడు.

**సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః ॥ 76 ॥**

నిత్యసంతోషి, నిత్యయోగి, మనోనిగ్రహం కలవాడు, దృఢనిశ్చయం కలవాడు, మనస్సును, బుద్ధిని నా యందే నిల్పిన నా భక్తుడు నాకు ప్రియతముడు.

**యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।**
**హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః ॥ 77 ॥**

ఎవనివల్ల లోకం భయపడదో, ఎవడు లోకంవల్ల భయపడడో, సంతోషం, అసూయ, భయం, ఉద్వేగం లేనివాడు నాకు ప్రియతముడు.

**అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారమ్భపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥ 78 ॥**

అపేక్ష లేనివాడు, శుచి, దక్షుడు, ఉదాసీనుడు, వ్యథచెందనివాడు, ప్రయత్నాలన్నింటిని వదలిన భక్తుడు నాకు ప్రీతిపాత్రుడు.

**తుల్యనిందాస్తుతిర్మౌనీ సన్తుష్టో యేన కేనచిత్ ।**
**అనికేతః స్థిరమతిర్మద్భక్తో మాముపేష్యతి ॥ 79 ॥**

నిందాస్తుతులను సమంగా స్వీకరించేవాడు, మౌని, దొరికినదానితో సంతోషించేవాడు, ఒకేచోట స్థిర నివాసం లేనివాడు, స్థిరమైనబుద్ధిగల నా భక్తుడు నన్ను చేరుతాడు.

**సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మత్పరాయణః ।**
**మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పరమం పదమ్ ॥ 80 ॥**

నా యందే మనసుంచి, అన్ని వేళల్లో అన్నిపనులు ఆచరిస్తూ, నా అనుగ్రహంవల్ల శాశ్వతమైన పరమపదం పొందుతాడు.

**చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః ।**
**నిరాశీర్నిర్మమో భూత్వా మామేకం శరణం వ్రజేత్ ॥ 81 ॥**

అన్ని కర్మలను ఇష్టపూర్తిగా నా యందే ఉంచి, నన్నే ధ్యానిస్తూ, కోరికలు, మమకారం వదలి నన్నొక్కని మాత్రమే శరణువేడాలి.

**త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ తేన నిబధ్యతే ॥ 82 ॥**

కర్మఫలసంగం వదలి, ఎల్లప్పుడు తృప్తితో ఉండి, ఆశ్రయం లేనివాడై కర్మల నాచరించినా ఆ కర్మలతో బద్ధుడు కాడు.

**నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।**
**శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి తత్పదమ్ ॥ 83 ॥**

ఆశలు విడిచి, మనసును నియమించి, పరిగ్రహాలన్నింటిని విడిచి, కేవలం శరీరసంబంధమైన కర్మలను ఆచరించగలవాడు పరమపదాన్ని పొందగలడు.

**యదృచ్ఛాలాభతుష్టస్య ద్వంద్వాతీతస్య చైవ హి ।**
**కుర్వతో మత్ప్రసాదార్థం కర్మ సంసారనాశనమ్ ॥ 84 ॥**

**మన్మనా మన్నమస్కారో మద్యాజీ మత్పరాయణః ।**
**మాముపైష్యతి యోగీశం జ్ఞాత్వా మాం పరమేశ్వరమ్ ॥ 85 ॥**

దైవసంకల్పంవల్ల లభించిన దానితో తృప్తి చెందుతూ, శీతోష్ణాది ద్వంద్వాలను సహిస్తూ నా అనుగ్రహం కోసం సంసారనాశకమైన కర్మనాచరిస్తూ, నా యందు మనసుంచి, నాకు నమస్కరిస్తూ, నన్ను పూజిస్తూ నన్ను యోగీశ్వరునిగా, పరమేశ్వరునిగా తెలుసుకున్నవాడు నన్నే చేరుకుంటాడు.

**మద్బుద్ధయో మాం సతతం బోధయన్తః పరస్పరమ్ ।**
**కథయన్తశ్చ మాం నిత్యం మమ సాయుజ్యమాప్నుయుః ॥ 86 ॥**

నా యందే బుద్ధి నిల్పినవారు, ఎల్లపుడు ఒకరితొనొకరు నా గురించే బోధించుకొంటూ చెప్పుకుంటూ వుండేవారు నా సాయుజ్యాన్నే పొందగలరు.

**ఏవం నిత్యాభియుక్తానాం మాయికం కర్మ సాన్వగమ్ ।**
**నాశయామి తమః కృత్స్నం జ్ఞానదీపేన భాస్వతా ॥ 87 ॥**

ఇట్లు నిత్యయోగంతో ఉన్నవారికి ప్రకాశవంతమైన జ్ఞానదీపంతో అజ్ఞానాంధకారాన్ని సర్వకర్మలను నశింప చేస్తాను.

**మద్బుద్ధయో మాం సతతం పూజయన్తీహ యే జనాః ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 88 ॥**

నా యందే బుద్ధి నిల్పి, నిత్యం నన్నే పూజించే వారి యోగక్షేమాలను నేను వహిస్తాను.

**యేఽన్యే చ కామభోగార్థం యజన్తే హ్యన్యదేవతాః ।**
**తేషాం తదన్తం విజ్ఞేయం దేవతానుగతం ఫలమ్ ॥ 89 ॥**

కామ భోగాల కోసం ఇతర దేవతలను పూజించేవారు విషయ భోగరూప ఫలాన్ని మాత్రమే పొందుతారు.

**యే చాన్యదేవతాభక్తాః పూజయన్తీహ దేవతాః ।**
**మద్భావనాసమాయుక్తా ముచ్యన్తే తేఽపి భావతః ॥ 90 ॥**

అన్య దేవతా భక్తులైనవారు ఆ యా దేవతలను పూజిస్తున్నా నా భావన కలిగి ఉన్నట్టయితే వారు కూడ ముక్తి పొందుతారు.

**తస్మాదనీశ్వరానన్యాంస్త్యక్త్వా దేవానశేషతః ।**
**మామేవ సంశ్రయేదీశం స యాతి పరమం పదమ్ ॥ 91 ॥**

అందువల్ల ఈశ్వరులుకాని ఇతర దేవతలను విడచి, ఈశ్వరుడనైన నన్నే ఆశ్రయించినట్లైతే పరమపదాన్ని పొందగలడు.

**త్యక్త్వా పుత్రాదిషు స్నేహం నిశ్శోకో నిష్పరిగ్రహః ।**
**యజేచ్చామరణాల్లిఙ్గే విరక్తః పరమేశ్వరమ్ ॥ 92 ॥**

పుత్రాదుల విషయంలో స్నేహశోకాలు విడచి సర్వపరిగ్రహాలు వదలి, దేహమందు విరక్తిపొంది, మరణించే దాకా లింగాకారుడైన పరమేశ్వరుని ఆరాధించాలి.

**యేఽర్చయన్తి సదా లిఙ్గం త్యక్త్వా భోగానశేషతః ।**
**ఏకేన జన్మనా తేషాం దదామి పరమైశ్వరమ్ ॥ 93 ॥**

అన్ని భోగాలు వదలి, పరమేశ్వరు నారాధిస్తున్నవారు ఒకే జన్మలో ముక్తి పొందుతారు.

**పరానన్దాత్మకం లిఙ్గం కేవలం సన్నిరఞ్జనమ్ ।**
**జ్ఞానాత్మకం సర్వగతం యోగినాం హృది సంస్థితమ్ ॥ 94 ॥**

పరమానందస్వరూపం, లింగాకారం, కేవలం సద్రూపం, నిరంజనం, జ్ఞానస్వరూపం, సర్వవ్యాపి, ఎల్లపుడు యోగిహృదయంలో నిలిచే దాన్నిగా ధ్యానించవలెను.

**యే చాన్యే నియతా భక్తా భావయిత్వా విధానతః ।**
**యత్ర క్వచన తల్లిఙ్గం అర్చయన్తి మహేశ్వరమ్ ॥ 95 ॥**

ఇతరులు కూడా నియమంతో యథావిధి ఎక్కడో ఒక చోట లింగాన్ని భావించి మహేశ్వరుని అర్చించేవారు ముక్తిని పొందుతారు.

**జలే వా వహ్నిమధ్యే వా వ్యోమ్ని సూర్యేఽథ వాఽన్యతః ।**
**రత్నాదౌ భావయిత్వేశం అర్చయేల్లిఙ్గమైశ్వరమ్ ॥ 96 ॥**

జలంలో, అగ్ని మధ్యలో, ఆకాశంలో, సూర్యునిలో, ఇతర ప్రదేశాల్లో, రత్నాదుల్లో ఈశ్వరలింగాన్ని భావించి శివుని ఆరాధించాలి.

**సర్వం లిఙ్గమయం హ్యేతత్ సర్వం లిఙ్గే ప్రతిష్ఠితమ్ ।**
**తస్మాల్లిఙ్గేఽర్చయేదీశం యత్ర క్వచన శాశ్వతమ్॥ 97 ॥**

ఈ జగమంతా లింగమయం. లింగంలోనే సకలజగత్తు ప్రతిష్ఠించబడినది. కావున లింగంలో శాశ్వతుడైన ఈశ్వరుని ఏదేని ప్రదేశంలో అర్చించాలి.

**అగ్నౌ క్రియావతామప్సు వ్యోమ్ని సూర్యే మనీషిణామ్ ।**
**కాష్ఠాదిష్వేవ మూర్ఖాణాం హృది లిఙ్గం తు యోగినామ్ ॥ 98 ॥**

క్రియాశీలురు, శ్రౌతస్మార్త కర్మలు సావధానంగా ఆచరించేవారు, అగ్నిలో లింగాన్ని ఆరాధించాలి. యథావిధి శ్రౌతస్మార్తాలు ఆచరించి, శుద్ధాంతఃకరణుడై, బ్రహ్మనిష్ఠుడైన మనిషి ఆకాశంలోగాని, సూర్యుని యందుకాని లింగాన్ని ఆరాధించాలి. వేదశాస్త్రాల్లో శ్రద్ధ ఉన్నా, ఐహలౌకిక భోగాల్లో ఆశ కల్గి, ఆ భోగప్రాప్తికి ప్రయత్నించే మూర్ఖులు కాష్ఠాదుల్లో లింగాన్ని అర్చించాలి. యోగులు హృదయంలో అర్చించాలి.

**యద్యనుత్పన్నవిజ్ఞానో విరక్తః ప్రీతిసంయుతః ।**
**యావజ్జీవం జపేద్యుక్తః ప్రణవం బ్రహ్మణో వపుః ॥ 99 ॥**

విజ్ఞానం కలుగకున్నా, సంసారంలో విరక్తి కలిగి, నా యందు ప్రీతి గలవాడై, పరబ్రహ్మస్వరూపమైన ప్రణవాన్ని జీవితాంతం జపించాలి.

**అథవా శతరుద్రీయం జపేదామరణాద్ద్విజః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా స యాతి పరమం పదమ్ ॥ 100 ॥**

లేదా ఆమరణాంతం శతరుద్రీయాన్ని ఏకాకి అయి మనోనిగ్రహంతో జపించినట్లైతే పరమపదాన్ని పొందుతాడు.

**వసేద్వా మరణాద్విప్రో వారాణస్యాం సమాహితః ।**
**సోఽపీశ్వరప్రసాదేన యాతి తత్పరమం పదమ్ ॥ 101 ॥**

జీవితకాలమంతా నా యందే మనసు నిల్పి, వారణాసిలో నివసించినా ఈశ్వరానుగ్రహంతో పరమపదం చేరుతాడు.

**తత్రోత్క్రమణకాలే హి సర్వేషామేవ దేహినామ్ ।**
**దదాతి తత్పరం జ్ఞానం యేన ముచ్యేత బన్ధనాత్ ॥ 102 ॥**

శరీరంనుండి జీవులు బయలు వెడలే సమయంలో వారణాసిలో నివసించేవారందరికి సంసారబంధాన్ని విడిపించే జ్ఞానాన్ని ఈశ్వరుడు ప్రసాదిస్తాడు.

**వర్ణాశ్రమవిధిం కృత్స్నం కుర్వాణో మత్పరాయణః ।**
**తేనైవ జన్మనా జ్ఞానం లబ్ధ్వా యాతి శివం పదమ్ ॥ 103 ॥**

సకల వర్ణాశ్రమధర్మాలను ఆచరిస్తూ, నా యందే మనసుంచినవాడు అదే జన్మలో జ్ఞానాన్ని పొంది, శివసాయుజ్యాన్నందుతాడు.

**యేఽపి తత్ర వసన్తీహ నీచా వా పాపయోనయః ।**
**సర్వే తరన్తి సంసారమీశ్వరానుగ్రహోద్ద్విజాః ॥ 104 ॥**

వారణాసిలో నివసించేవారు నీచులైనా, పాపులైనా ఈశ్వరానుగ్రహంవల్ల సంసారాన్ని తరిస్తారు.

**కిన్తు విఘ్నా భవిష్యన్తి పాపోపహతచేతసామ్ ।**
**ధర్మం సమాశ్రయేత్తస్మాన్ముక్తయే నియతం ద్విజాః ॥ 105 ॥**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! కాని, పాపబుద్ధులకు విఘ్నాలు కలుగుతాయి. అందువల్ల ముక్తి కోరేవారు ధర్మాన్ని ఆచరించాలి.

**ఏతద్రహస్యం వేదానాం న దేయం యస్య కస్యచిత్ ।**
**ధార్మికాయైవ దాతవ్యం భక్తాయ బ్రహ్మచారిణే ॥ 106 ॥**

ఇది సర్వవేదరహస్యం. అందరికి చెప్పతగదు. ధార్మికునికి, భక్తునికి బ్రహ్మచారికి మాత్రమే చెప్పవలెను.

**వ్యాస ఉవాచ :**–వ్యాసుడు పలికాడు

**ఇత్యేతదుక్త్వా భగవాన్ ఆత్మయోగమనుత్తమమ్ ।**
**వ్యాజహార సమాసీనం నారాయణమనామయమ్ ॥ 107 ॥**

సర్వోత్తమ ఆత్మయోగాన్ని చెప్పి, ఈశ్వరుడు అచ్చట ప్రక్కనే కూర్చున్న నిరామయుడు నారాయణునితో ఇట్లన్నాడు.

**మయైతద్భాషితం జ్ఞానం హితార్థం బ్రహ్మవాదినామ్ ।**
**దాతవ్యం శాన్తచిత్తేభ్యః శిష్యేభ్యో భవతా శివమ్ ॥ 108 ॥**

బ్రహ్మవాదుల హితాన్నికోరి, నే నీ యోగాన్ని బోధించినాను. మంగళకరమైన దీనిని మీరు ప్రశాంతచిత్తులైన శిష్యులకుపదేశించాలి.

**ఉక్త్వైవమథ యోగీన్ద్రానబ్రవీద్భగవానజః ।**
**హితాయ సర్వభక్తానాం ద్విజాతీనాం ద్విజోత్తమాః ॥ 109 ॥**

**భవన్తోఽపి హి మజ్జ్ఞానం శిష్యాణాం విధిపూర్వకమ్ ।**
**ఉపదేక్ష్యన్తి భక్తానాం సర్వేషాం వచనాన్మమ ॥ 110 ॥**

ఇట్లా చెప్పి మళ్ళా యోగీంద్రులతో ఇట్లా పలికాడు – ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! బ్రాహ్మణులకు, భక్తులకు హితాన్ని కూర్చటానికి మీరందరు విధిపూర్వకంగా శిష్యులకు నా జ్ఞానాన్ని ఉపదేశించండి.

**అయం నారాయణో యోఽహమీశ్వరో నాత్ర సంశయః ।**
**నాన్తరం యే ప్రపశ్యన్తి తేషాం దేయమిదం పరమ్ ॥ 111 ॥**

ఇతడు శ్రీమన్నారాయణుడు. నేను ఈశ్వరుడను. ఇందులో సందేహం లేదు. మా ఇరువురిలో భేదం చూడనివారికే ఈ జ్ఞానాన్ని ఉపదేశించవలెను.

**మమైషా పరమా మూర్తిర్నారాయణసమాహ్వయా ।**
**సర్వభూతాత్మభూతస్థా శాన్తా చాక్షరసంజ్ఞితా ॥ 112 ॥**

నా దివ్యరూపమే నారాయణనామంతో వ్యవహరింపబడుతున్నది. అన్నిప్రాణుల్లో అంతర్యామిగా ఉండే ఈ రూపం శాంతం, అక్షరమన్న పేరు గలిగియున్నది.

**యే త్వన్యథా ప్రపశ్యన్తి లోకే భేదదృశో జనాః ।**
**న తే మాం సంప్రపశ్యన్తి జాయన్తే చ పునః పునః ॥ 113 ॥**

లోకంలో మా ఇరువురిలో భేదాన్ని చూచే జనులు ఇందుకు భిన్నంగా చూచినా వారు నన్ను చూడలేరు. మళ్ళీ మళ్ళీ పుడుతుంటారు.

**యే త్విమం విష్ణుమవ్యక్తం మాం వా దేవం మహేశ్వరమ్ ।**
**ఏకీభావేన పశ్యన్తి న తేషాం పునరుద్భవః ॥ 114 ॥**

అవ్యక్తుడైన విష్ణువును, మహేశ్వరుడైన నన్ను ఒకటిగా చూచే వారు మళ్లీ పుట్టరు.

**తస్మాదనాదినిధనం విష్ణుమాత్మానమవ్యయమ్ ।**
**మామేవ సంప్రపశ్యధ్వం పూజయధ్వం తథైవ హి ॥ 115 ॥**

అందువల్ల ఆద్యంతాలు లేనివాడు, అవ్యయుడు, ఆత్మస్వరూపుడైన శ్రీమహావిష్ణువును నన్నుగానే చూస్తూ అట్లే పూజించండి.

**యేఽన్యథా మాం ప్రపశ్యన్తి మత్వేమం దేవతాన్తరమ్ ।**
**తే యాన్తి నరకాన్ ఘోరాన్ నాహం తేషు వ్యవస్థితః ॥ 116 ॥**

విష్ణువును, నన్ను వేరు దేవతలుగా భావించేవారు ఘోరనరకాలను పొందుతారు. నేను వారిలో ఉండను.

**మూర్ఖం వా పణ్డితం వాఽపి బ్రాహ్మణం వా మదాశ్రయమ్ ।**
**మోచయామి శ్వపాకం వా న నారాయణనిన్దకమ్ ॥ 117 ॥**

నన్నాశ్రయించినవాడు మూర్ఖుడైనా, పండితుడైనా, బ్రాహ్మణుడైనా, చివరకు చండాలుడైనా ముక్తి నిస్తాను. కాని నారాయణుని నిందించు వారికి మోక్షమివ్వను.

**తస్మాదేష మహాయోగీ మద్భక్తైః పురుషోత్తమః ।**
**అర్చనీయో నమస్కార్యో మత్ప్రీతిజననాయ హి ॥ 118 ॥**

అందువల్ల మహాయోగి, పురుషోత్తముడు అయిన నారాయణుని నాకు ప్రీతి కలిగించటానికి నా భక్తులు పూజించాలి. నమస్కరించాలి.

**ఏవముక్త్వా సమాలింగ్య వాసుదేవం పినాకధృక్ ।**
**అన్తర్హితోఽభవత్తేషాం సర్వేషామేవ పశ్యతామ్ ॥ 119 ॥**

ఈ విధంగా పలికి, శంకరుడు వాసుదేవునాలింగనం చేసుకొని, వారందరు చూస్తుండగానే అంతర్ధానం చెందినాడు.

**నారాయణోఽపి భగవాన్ తాపసం వేషముత్తమమ్ ।**
**జగ్రాహ యోగినస్సర్వాంస్త్యక్త్వా వై పరమం వపుః ॥ 120 ॥**

నారాయణుడు కూడ దివ్యదేహాన్ని విడచి, తాపసవేషం స్వీకరించినాడు. యోగులతో ఇట్లన్నాడు.

**జ్ఞాతం భవద్భిరమలం ప్రసాదాత్పరమేష్ఠినః ।**
**సాక్షాదేవ మహేశస్య జ్ఞానం సంసారనాశనమ్ ॥ 121 ॥**

పరమశివుని అనుగ్రహంతో మీకు పరిశుద్ధజ్ఞానం లభించినది. ఈ మహేశ్వరజ్ఞానం సాక్షాత్తు సంసారనాశకం.

**గచ్ఛధ్వం విజ్వరాస్సర్వే విజ్ఞానం పరమేష్ఠినః ।**
**ప్రవర్తయధ్వం శిష్యేభ్యో ధార్మికేభ్యో మునీశ్వరాః! ॥ 122 ॥**

ఓ మునీశ్వరులారా! మీ సంతాపం తొలగినది. మీరు వెళ్ళిరండి. మీరందరు ధార్మికులైన శిష్యులకు పరమేశ్వరవిజ్ఞానాన్ని ప్రవర్తింప చేయండి.

**ఇదం భక్తాయ శాన్తాయ ధార్మికాయాహితాగ్నయే ।**
**విజ్ఞానమైశ్వరం దేయం బ్రాహ్మణాయ విశేషతః ॥ 123 ॥**

ఈ జ్ఞానాన్ని భక్తులకు, శాంతస్వభావులకు, ధార్మికులకు, ఆహితాగ్నికి విశేషించి బ్రాహ్మణునికి అందించండి.

**ఏవముక్త్వా స విశ్వాత్మా యోగినాం యోగవిత్తమః ।**
**నారాయణో మహాయోగీ జగామాదర్శనం స్వయమ్ ॥ 124 ॥**

యోగవిదుల్లో ఉత్తముడు, విశ్వరూపుడు, నారాయణుడు యోగులతో ఇట్లా పలికి అంతర్ధానం చెందినాడు.

**తేఽపి దేవాదిదేవేశం నమస్కృత్య మహేశ్వరమ్ ।**
**నారాయణఞ్చ భూతాదిం స్వాని స్థానాని భేజిరే ॥ 125 ॥**

ఆ యోగులు కూడ దేవాదిదేవుడగు మహేశ్వరునికి, సకలజగత్కారణుడైన నారాయణునికి నమస్కరించి తమ తమ స్థానాలకు వెళ్ళినారు.

**సనత్కుమారో భగవాన్ సంవర్తాయ మహామునిః ।**
**దత్తవానైశ్వరం జ్ఞానం సోఽపి సత్యవ్రతాయ తు ॥ 126 ॥**

ఈశ్వరజ్ఞానాన్ని భగవాన్ సనత్కుమారుడు సంవర్తునికి, సంవర్తుడు సత్యవ్రతునికి బోధించినారు.

**సనన్దనోఽపి యోగీన్ద్రః పులహాయ మహర్షయే ।**
**ప్రదదౌ గౌతమాయాఽథ పులహోఽపి ప్రజాపతిః ॥ 127 ॥**

**అఙ్గిరా వేదవిదుషే భరద్వాజాయ దత్తవాన్ ।**
**జైగీషవ్యాయ కపిలస్తథా పంచశిఖాయ చ ॥ 128 ॥**

యోగీంద్రుడైన సనందుడు పులహునికి, పులహప్రజాపతి గౌతమునికి, అంగిరప్రజాపతి వేదవిదుడగు భరద్వాజునికి బోధించినారు. కపిలుడు జైగీషవ్యునికి, పంచశిఖునికి బోధించినాడు.

**పరాశరోఽపి సనకాత్ పితా మే సర్వతత్త్వదృక్ ।**
**లేభే తత్పరమం జ్ఞానం తస్మాద్వాల్మీకిరాప్తవాన్ ॥ 129 ॥**

తత్త్వాలన్నీ తెలుసుకున్న నా తండ్రి పరాశరుడు సనకునివల్ల ఈ పరమ జ్ఞానాన్ని పొందినాడు. పరాశరుని వల్ల వాల్మీకి పొందినాడు.

**మామువాచ పురా దేవః సతీదేహభవాంగజః ।**
**వామదేవో మహాయోగీ రుద్రః కిల పినాకధృక్ ॥ 130 ॥**

శంకరుని అంశావతారమైన మహాయోగి వామదేవుడు ఈ జ్ఞానాన్ని నాకు తెలిపినాడు. ఈ వామదేవుడు సాక్షాత్తు పినాకపాణి రుద్రుడే.

**నారాయణోఽపి భగవాన్ దేవకీతనయో హరిః ।**
**అర్జునాయ స్వయం సాక్షాద్దత్తవానిదముత్తమమ్ ॥ 131 ॥**

నారాయణుడు దేవకి పుత్రునిగా పుట్టి స్వయంగా అర్జునునికి ఉత్తమమైన ఈ జ్ఞానాన్ని ఉపదేశించినాడు.

**యదహం లబ్ధవాన్ రుద్రాత్ వామదేవాదనుత్తమమ్ ।**
**విశేషాత్ గిరిశే భక్తిస్తస్మాదారభ్య మేఽభవత్ ॥ 132 ॥**

నేను రుద్రుడైన వామదేవునివల్ల ఈ జ్ఞానాన్ని పొందినప్పటినుండి శంకరుని యందు నాకు విశేషమైన భక్తి కలిగినది.

**శరణ్యం శరణం రుద్రం ప్రపన్నోఽహం విశేషతః ।**
**భూతేశం గిరిశం స్థాణుం దేవదేవం త్రిశూలినమ్ ॥ 133 ॥**

అప్పటినుండి నేను సర్వలోక శరణ్యుడు, రుద్రుడు, భూతేశుడు, గిరిశుడు, స్థాణుడు, దేవదేవుడు అగు త్రిశూలిని విశేషించి శరణు పొందినాను.

**భవన్తోఽపి హి తం దేవం శంభుం గోవృషవాహనమ్ ।**
**ప్రపద్యధ్వం సపత్నీకాః సపుత్రాః శరణం శివమ్ ॥ 134 ॥**

గోవృషవాహనుడగు శంభువుని భార్యాపుత్రులతో మీరు కూడ శరణు పొందండి.

**వర్తధ్వం తత్ప్రసాదేన కర్మయోగేన శఙ్కరమ్ ।**
**పూజయధ్వం మహాదేవం గోపతిం భూతిభూషణమ్ ॥ 135 ॥**

శివుని అనుగ్రహంతో కర్మయోగంతో మహాదేవుడు, గోపతి, భూతిభూషణుడైన శంకరుని పూజించండి.

**ఏవముక్తేఽథ మునయః శౌనకాద్యా మహేశ్వరమ్ ।**
**ప్రణేముశ్శాశ్వతం స్థాణుం వ్యాసం సత్యవతీసుతమ్ ॥ 136 ॥**

ఇట్లా పలుకగా శౌనకాది మహర్షులు శాశ్వతుడు, స్థాణుడు, సనాతనుడు, సత్యవతీసుతుడైన వ్యాసునికి నమస్కరించినారు.

**అబ్రువన్ హృష్టమనసః కృష్ణద్వైపాయనం ప్రభుమ్ ।**
**సాక్షాదేవ హృషీకేశం సర్వలోకమహేశ్వరమ్ ॥ 137 ॥**

సాక్షాత్ హృషీకేశుడు, సర్వలోక మహేశ్వరుడగు, కృష్ణద్వైపాయనునితో సంతుష్టాంతరంగులై ఆ మహర్షులు ఇట్లా పలికినారు.

**భవత్ప్రసాదాదచలా శరణ్యే గోవృషధ్వజే ।**
**ఇదానీం జాయతే భక్తిర్యా దేవైరపి దుర్లభా ॥ 138 ॥**

మీ అనుగ్రహంవల్ల సర్వలోకశరణ్యుడు, గోవృషధ్వజుడగు, శంకరుని యందు దేవతలకు కూడ లభించని భక్తి మాకిపుడు కలుగుతున్నది.

**కథయస్వ మునిశ్రేష్ఠ కర్మయోగమనుత్తమమ్ ।**
**యేనాసౌ భగవానీశః సమారాధ్యో ముముక్షుభిః ॥ 139 ॥**

ఓ మునిశ్రేష్ఠా! ఇపుడు మాకు సర్వోత్తమమైన కర్మయోగం బోధించు. ఈ కర్మయోగంతో ముముక్షువులు ఈశ్వరుని ఆరాధించగలరు.

**త్వత్సంనిధావేష సూతః శృణోతు భగవద్వచః ।**
**తద్వదఖిలలోకానాం రక్షణం ధర్మసంగ్రహమ్ ॥ 140 ॥**

నీ సన్నిధిలో ఈ సూతుడు తమ వాక్యాలను వినుగాక. అట్లే సర్వలోకములను రక్షించు ధర్మసంగ్రహాన్ని వినుగాక!

**యదుక్తం దేవదేవేన విష్ణునా కూర్మరూపిణా ।**
**పృష్టేన మునిభిః పూర్వం శక్రేణామృతమంథనే ॥ 141 ॥**

కూర్మరూపి, దేవదేవుడు, శ్రీమహావిష్ణువు అమృతమథనసమయంలో ఇంద్రుడు కోరగా చెప్పిన దాన్ని కూడ వివరించండి.

**శ్రుత్వా సత్యవతీసూనుః కర్మయోగం సనాతనమ్ ।**
**మునీనాం భాషితం కృష్ణః ప్రోవాచ సుసమాహితః ॥ 142 ॥**

సత్యవతీపుత్రుడు వ్యాసుడు మునుల మాటలు విని సమాహితచిత్తుడై సనాతనమైన కర్మయోగాన్ని చెప్పాడు.

**య ఇమం పఠతే నిత్యం సంవాదం కృత్తివాససః ।**
**సనత్కుమారప్రముఖైః సర్వపాపైః ప్రముచ్యతే ॥ 143 ॥**

సనత్కుమారుడు మొదలైన ఋషులతో శంకరుడు చెప్పిన ఈ సంవాదాన్ని విన్నవాడు పాపాలన్నింటి నుండి విముక్తుడవుతాడు.

**శ్రావయేద్వా ద్విజాన్ శుద్ధాన్ బ్రహ్మచర్యపరాయణాన్ ।**
**యో వా విచారయేదర్థం స యాతి పరమాం గతిమ్ ॥ 144 ॥**

బ్రహ్మచర్యపరాయణులైన ద్విజులకు వినిపించినవాడు, ఈ అర్థాన్ని విచారించినవాడు కూడ పరమ పదాన్ని పొందుతాడు.

**యశ్చైతచ్ఛృణుయాన్నిత్యం భక్తియుక్తో దృఢవ్రతః ।**
**సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మలోకే మహీయతే ॥ 145 ॥**

దృఢవ్రతుడై, భక్తికల్గి, ప్రతిదినం ఈ సంవాదాన్ని విన్నవాడు అన్ని పాపాలు తొలగి, బ్రహ్మలోకంలో ఆనందిస్తాడు.

**తస్మాత్సర్వప్రయత్నేన పఠితవ్యో మనీషిభిః ।**
**శ్రోతవ్యశ్చాథ మంతవ్యో విశేషాద్బ్రాహ్మణైస్సదా ॥ 146 ॥**

అందువల్ల పండితులు సర్వప్రయత్నంతో యీ శివ–ఋషి సంవాదాన్ని చదవాలి. వినాలి. మననం చేయాలి. విశేషించి బ్రాహ్మణులకిది వర్తిస్తుంది.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఈశ్వరగీతాసు ఏకాదశోఽధ్యాయః ॥11॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ఈశ్వరగీతలో పదకొండవ అధ్యాయం ॥11॥



## ద్వాదశోఽధ్యాయః - పన్నెండవ అధ్యాయం

## వ్యాసగీతాకథనమ్ - వ్యాసగీతాకథనం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు పలికాడు

**శృణుధ్వమృషయస్సర్వే వక్ష్యమాణం సనాతనమ్ ।**
**కర్మయోగం బ్రాహ్మణానామాత్యంతికఫలప్రదమ్ ॥ 1 ॥**

ఋషులారా! ఇపుడు చెప్పబోయే కర్మయోగం సనాతనమైనది. బ్రాహ్మణులకు శాశ్వతఫలాన్నిచ్చేది. వినండి.

**ఆమ్నాయసిద్ధమఖిలం బ్రహ్మణాఽనుప్రదర్శితమ్ ।**
**ఋషీణాం శృణ్వతాం పూర్వం మనురాహ ప్రజాపతిః ॥ 2 ॥**

ఈ కర్మయోగము వేదసిద్ధము మరియు బ్రహ్మచేత చెప్పబడినది. ఈ కర్మయోగాన్ని వినగోరిన ఋషులకు పూర్వము ప్రజాపతియగు మనువు చెప్పాడు.

**సర్వపాపహరం పుణ్యం ఋషిసంఘైర్నిషేవితమ్ ।**
**సమాహితధియో యూయం శృణుధ్వం గదతో మమ ॥ 3 ॥**

సర్వపాపహరము. పవిత్రమైనది, ఋషులు సేవించినది. ఈ యోగము, మీరు సావధానులై నేను చెప్పేదాన్ని వినండి.

**కృతోపనయనో వేదానధీయీత ద్విజోత్తమాః! ।**
**గర్భాష్టమేఽష్టమే వాఽబ్దే స్వసూత్రోక్తవిధానతః ॥ 4 ॥**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! బ్రాహ్మణుడు ఉపనయనం చేసుకొని, వేదాధ్యయనం చేయాలి. ఉపనయనం గర్భాష్టమంలో కాని, అష్టమవర్షంలో కాని, సూత్రోక్తవిధిగా చేసుకోవాలి.

**దణ్డీ చ మేఖలీ సూత్రీ కృష్ణాజినధరో మునిః ।**
**భిక్షాహారో గురుహితో వీక్షమాణో గురోర్ముఖమ్ ॥ 5 ॥**

దండం, మేఖలం, సూత్రం, కృష్ణాజినం, ధరించి ఆ ఉపనీతుడు మునివృత్తి ననుసరించాలి. భిక్షాన్నాన్ని గ్రహించాలి. గురుహితాన్ని కోరి నిత్యం గురుసమీపంలో ఉంటూ, గురువును చూస్తూ, అధ్యయనం సాగించాలి.

**కార్పాసముపవీతార్థం నిర్మితం బ్రహ్మణా పురా ।**
**బ్రాహ్మణానాం త్రివృత్ సూత్రం కౌశం వా వస్త్రమేవ వా ॥ 6 ॥**

బ్రహ్మ పూర్వం ఉపవీతంకోసం కార్పాసాన్ని (పత్తిని) నిర్మించాడు. బ్రాహ్మణుల కిది మూడు వరసలుంటుంది. కార్పాసం లభించనపుడు కుశలతో కాని, వస్త్రంతో కాని ఏర్పరచుకోవాలి.

**సదోపవీతీ చైవ స్యాత్ సదా బద్ధశిఖో ద్విజః ।**
**అన్యథా యత్కృతం కర్మ తద్భవత్యయథాకృతమ్ ॥ 7 ॥**

ద్విజుడెప్పుడు యజ్ఞోపవీతాన్ని ధరించే ఉండాలి. అట్లే శిఖను ధరించాలి. శిఖాయజ్ఞోపవీతాలులేక చేసిన కర్మ విధ్యుక్తప్రకారము చేసినట్టిది కాదు.

**వసేదవికృతం వాసః కార్పాసం వా కషాయకమ్ ।**
**తదేవ పరిధానీయం శుక్లమచ్ఛిద్రముత్తమమ్ ॥ 8 ॥**

అట్లే వికారంచెందని (జీర్ణం-దగ్ధంకాని), వస్త్రం ధరించాలి. అది తెల్లనిది, చిల్లులు పడనిది, ఉత్తమమైనది కావాలి.

**ఉత్తరం తు సమాఖ్యాతం వాసః కృష్ణాజినం శుభమ్ ।**
**అభావే దివ్యమజినం రౌరవం వా విధీయతే ॥ 9 ॥**

ఉత్తరీయంకొరకు కృష్ణాజినం ఉత్తమం. అది దొరకనపుడు రురుమృగచర్మంకాని, గజచర్మం కాని, వ్యాఘ్ర చర్మం కాని (మరొక శ్రేష్ఠమైన చర్మం) ధరించ వచ్చును.

**ఉద్ధృత్య దక్షిణం బాహుం సవ్యే బాహౌ సమర్పితమ్ ।**
**ఉపవీతం భవేన్నిత్యం నివీతం కంఠ సజ్జనే ॥ 10 ॥**

దక్షిణ భుజం ఎత్తి, సవ్యబాహువుపై యజ్ఞోపవీతం ఎల్లపుడు ఉంచుకోవలెను. మెడలో హారంవలె వేసికొన్నచో నివీత మంటారు.

**సవ్యబాహుం సముద్ధృత్య దక్షిణే తు ధృతం ద్విజాః ।**
**ప్రాచీనావీతమిత్యుక్తం పిత్ర్యే కర్మణి యోజయేత్ ॥ 11 ॥**

ఎడమ చేతినెత్తి కుడిచేతిపై యజ్ఞోపవీతం ఉంచుకొన్నచో ప్రాచీనావీత మంటారు. ఇది పితృకర్మలో చేయవలసినది.

**అగ్న్యగారే గవాం గోష్ఠే హోమే జప్యే తథైవ చ ।**
**స్వాధ్యాయే భోజనే నిత్యం బ్రాహ్మణానాఞ్చ సన్నిధౌ ॥ 12 ॥**

**ఉపాసనే గురూణాఞ్చ సంధ్యయోః సాధుసఙ్గమే ।**
**ఉపవీతీ భవేన్నిత్యం విధిరేష సనాతనః ॥ 13 ॥**

అగ్ని-గోశాలల్లో, హోమంలో, జపకర్మలో, స్వాధ్యాయంలో, భోజన సమయంలో, బ్రాహ్మణుల సన్నిధానంలో, గురూపాసనలో, రెండు సంధ్యల్లో, సాధుసాంగత్యంలో ఎల్లపుడు ఉపవీతిగానే ఉండాలి. ఇది సనాతనవిధి.

**మౌంజీ త్రివృత్ సమా శ్లక్ష్ణా కార్యా విప్రస్య మేఖలా ।**
**ముఞ్జాభావే కుశేనాహుర్గ్రంథినైకేన వా త్రిభిః ॥ 14 ॥**

మౌంజిని బ్రహ్మచారికి యజ్ఞోపవీతంవలె మూడు వరుసలుగా సమంగా మృదువుగా ఏర్పరచాలి. ముంజతృణం దొరకనపుడు దర్భలో ఒకటి లేదా మూడు గ్రంథులతో చేయవలెను.

**ధారయేత్ బైల్వపాలాశౌ దణ్డౌ కేశాన్తికే ద్విజః ।**
**యజ్ఞార్హవృక్షజం వాஉథ సౌమ్యమవ్రణమేవ చ ॥ 15 ॥**

అట్లే మారేడు కాని, మోదుగ కాని దండాన్ని ద్విజుడు కేశాంత పర్యంతం ధరించాలి. బిల్వ – పాలాశాలు దొరకనపుడు యజ్ఞార్హమైన వృక్షం దండాన్ని చక్కని, సుడులు ఛిద్రాలు లేని దండాన్ని ధరించాలి.

**సాయం ప్రాతర్ద్విజస్సంధ్యాముపాసీత సమాహితః ।**
**కామాల్లోభాత్ భయాన్మోహాత్ త్యక్తేన పతితో భవేత్ ॥ 16 ॥**

ద్విజుడు సావధానమనస్కుడై, ప్రాతస్సాయం సంధ్యల్లో, సంధ్యావందనం ఆచరించాలి. కామ, లోభ, భయ, మోహాలవల్ల సంధ్యావందనం విడిస్తే పతితుడవుతాడు.

**అగ్నికార్యం తతః కుర్యాత్సాయం ప్రాతః ప్రసన్నధీః ।**
**స్నాత్వా సన్తర్పయేద్దేవానృషీన్ పితృగణాంస్తథా ॥ 17 ॥**

తర్వాత ప్రాతస్సాయంకాలాల్లో ప్రసన్నచిత్తంతో అగ్నికార్యమాచరించాలి. స్నానం చేసి, దేవఋషి పితృగణాలను తృప్తిపరచాలి.

**దేవతాభ్యర్చనం కుర్యాత్ పుష్పైః పత్రేణ వాంబుభిః ।**
**అభివాదనశీలస్స్యాన్నిత్యం వృద్ధేషు ధర్మతః ॥ 18 ॥**

పుష్ప పత్ర జలాలతో దేవతలను పూజించాలి. ధర్మానుగుణంగా నిత్యం వృద్ధులకు అభివాదం చేయాలి.

**అసావహం భో నామేతి సమ్యక్ ప్రణతిపూర్వకమ్ ।**
**ఆయురారోగ్యసిద్ధ్యర్థం తంద్రాదిపరివర్జితః ॥ 19 ॥**

సోమరితనం విడచి అసౌ అహం భోః అంటూ నామోచ్చారణ పూర్వకంగ బాగా వంగి ఆయురారోగ్య సిద్ధికోసం నమస్కరించాలి.

**ఆయుష్మాన్భవ సౌమ్యేతి వాచ్యో విప్రోஉభివాదనే ।**
**అకారశ్చాస్య నామ్నోஉన్తే వాచ్యః పూర్వాక్షరః ప్లుతః ॥ 20 ॥**

ఆయుష్మాన్ భవ సౌమ్య! అని అభివాదం చేసినవానికి ద్విజుడు ప్రత్యభివాదం చేయాలి. పేరు చివర, లేదా వాక్యం చివరి అచ్చుకంటే మొదట ఉన్న అచ్చును ప్లుతంగా పలకాలి.

**న కుర్యాద్యోஉభివాదస్య ద్విజః ప్రత్యభివాదనమ్ ।**
**నాభివాద్యస్స విదుషా యథా శూద్రస్తథైవ సః ॥ 21 ॥**

నమస్కరించిన తర్వాత ప్రతినమస్కారం చేయనివానికి మళ్ళీ విద్వాంసుడు అభివాదం చేయరాదు. ప్రత్యభివాదం చేయనివాడు శూద్రసము డవుతాడు.

**వ్యత్యస్తపాణినా కార్యం ఉపసఙ్గ్రహణం గురోః ।**
**సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన తు దక్షిణః ॥ 22 ॥**

గురువుకు అభివాదం చేసేప్పుడు వ్యత్యస్త పాణియై చేయాలి. అనగా ఎడమ చేతితో ఎడమపాదాన్ని కుడిచేతితో కుడిపాదాన్ని తాకాలి.

**లౌకికం వైదికం చాపి తథాఽఽధ్యాత్మిక మేవ వా ।**
**ఆదదీత యతో జ్ఞానం తం పూర్వమభివాదయేత్ ॥ 23 ॥**

ఈ పద్ధతి లౌకిక, వైదిక, ఆధ్యాత్మికాల్లో సమానమే. ఎవరినుండి జ్ఞానాన్ని పొందుతామో వారికి ముందు నమస్కరించాలి.

**నోదకం ధారయేత్ భైక్షం పుష్పాణి సమిధస్తథా ।**
**ఏవం విధాని చాన్యాని న దైవాద్యేషు కర్మసు ॥ 24 ॥**

దేవపూజలో, భిక్షలో లభించిన జల, పుష్ప, సమిధలు ఇతర పదార్థాలను గ్రహించరాదు.

**బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రబంధుమనామయమ్ ।**
**వైశ్యం క్షేమం సమాగమ్య శూద్రమారోగ్యమేవ తు ॥ 25 ॥**

బ్రాహ్మణుడు కలిసినపుడు కుశలాన్ని, క్షత్రియుడు కనపడినపుడు అనామయం, వైశ్యుని క్షేమాన్ని, శూద్రుని ఆరోగ్యాన్ని గూర్చి ప్రశ్నించాలి.

**ఉపాధ్యాయః పితా జ్యేష్ఠో భ్రాతా చైవ మహీపతిః ।**
**మాతులశ్శ్వశురస్త్రాతా మాతామహపితామహౌ ॥ 26 ॥**

**వర్ణజ్యేష్ఠః పితృవ్యశ్చ పుంసోఽత్ర గురవః స్మృతాః ।**
**మాతా మాతామహీ గుర్వీ పితుర్మాతుశ్చ సోదరాః ।**
**శ్వశ్రూః పితామహీ జ్యేష్ఠా ధాత్రీ చ గురవః స్త్రియః ॥ 27 ॥**

**ఇత్యుక్తో గురువర్గోఽయం మాతృతః పితృతో ద్విజాః ।**
**అనువర్తనమేతేషాం మనోవాక్కాయకర్మభిః ॥ 28 ॥**

ఉపాధ్యాయుడు, తండ్రి, జ్యేష్ఠభ్రాత, రాజు, మేనమామ, కన్య నిచ్చిన మామ, రక్షకుడు, తల్లి తండ్రి, తండ్రి తండ్రి, తనకంటే ఉత్తమమైనవాడు. పెదతండ్రి, పినతండ్రి, వీరిని గురువులంటారు. తల్లి, తల్లి తల్లి, గురుపత్ని, తల్లియొక్క, తండ్రియొక్క చెల్లెళ్ళు అక్కలు, అత్తగారు, నాయనమ్మ, పెద్దక్క, పోషించిన స్త్రీ వీరు కూడ

గురువులే. ఈ విధంగా తల్లితరపు గురువులు, తండ్రితరపు గురువులు చెప్పబడ్డారు. వీరిని మనోవాక్కాయకర్మలతో అనుసరించాలి.

**గురుం దృష్ట్వా సముత్తిష్ఠేదభివాద్య కృతాంజలిః ।**
**నైతైరుపవిశేత్ సార్ధం వివదేన్నాత్మకారణాత్ ॥ 29 ॥**

గురువును చూడగానే లేచి, చేతులు జోడించి, విధిప్రకారం నమస్కరించవలెను. వీరితో కలిసి ఒకే ఆసనంపై కూర్చోకూడదు. తన కొరకుకాని, బ్రతుకుతెరువుకోసంకాని గురువుతో వాదించరాదు.

**జీవితార్థమపి ద్వేషాత్ గురుభిర్నైవ భాషణమ్ ।**
**ఉదితోఽపి గుణైరన్యైర్గురుద్వేషీ పతత్యధః ॥ 30 ॥**

జీవితార్థమైనా గురువుతో ద్వేషం కల్గి భాషింపకూడదు. ఇతర గుణాలెన్ని ఉన్నా గురుద్వేషి అధఃపతితుడవుతాడు.

**గురూణామపి సర్వేషాం పూజ్యాః పఞ్చ విశేషతః ।**
**తేషామాద్యాస్త్రయశ్రేష్ఠాస్తేషాం మాతా సుపూజితా ॥ 31 ॥**

గురువులందరిలో అయిదుగురు ముఖ్యంగా పూజ్యులు. వారిలో మొదటి ముగ్గురు శ్రేష్ఠులు. వారిలోను తల్లి ఉత్తమ గురువు.

**యో భావయతి యా సూతే యేన విద్యోపదిశ్యతే ।**
**జేష్ఠో భ్రాతా చ భర్తా చ పఞ్చైతే గురవః స్మృతాః ॥ 32 ॥**

**ఆత్మనస్సర్వయత్నేన ప్రాణత్యాగేన వా పునః ।**
**పూజనీయా విశేషేణ పంచైతే భూతిమిచ్ఛతా ॥ 33 ॥**

కన్నతండ్రి, కన్నతల్లి, విద్యనుపదేశించిన వారు, జ్యేష్ఠభ్రాత, భర్త ఈ అయిదుగురు గురువులు. వీరిని అన్ని విధాల ప్రాణాలొడ్డి అయినా అభివృద్ధి కోరేవాడు విశేషంగా పూజించాలి.

**యావత్పితా చ మాతా చ ద్వావేతౌ నిర్వికారిణౌ ।**
**తావత్సర్వం పరిత్యజ్య పుత్రస్స్యాత్తత్పరాయణః ॥ 34 ॥**

తల్లిదండ్రులు నిర్వికారులై, ఆత్మధ్యానమగ్నులై ఉన్నంత వరకు పుత్రులు అన్నీ విడిచి వారిని కనిపెట్టుకొని ఉండాలి.

**పితా మాతా చ సుప్రీతౌ స్యాతాం పుత్రగుణైర్యది ।**
**స పుత్రస్సకలం ధర్మమాప్నుయాత్తేన కర్మణా ॥ 35 ॥**

తల్లిదండ్రులు పుత్రుని గుణాలతో తృప్తిచెందినపుడు ఆ పుత్రుడు తన సత్కర్మచేత సకలధర్మాలు పొందుతాడు.

**నాస్తి మాతృసమం దైవం నాస్తి పిత్రా సమో గురుః ।**
**తయోః ప్రత్యుపకారోఽపి న కథంచన విద్యతే ॥ 36 ॥**

తల్లితో సమానమైన దైవం, తండ్రితో సమానమైన గురుడు లేడు. ఎంత కష్టపడినా వారికి ప్రత్యుపకారం చేయలేము.

**తయోర్నిత్యం ప్రియం కుర్యాత్కర్మణా మనసా గిరా ।**
**న తాభ్యామననుజ్ఞాతో ధర్మమన్యం సమాచరేత్ ॥ 37 ॥**

తల్లిదండ్రులకెపుడు త్రికరణశుద్ధిగా ప్రియాన్నే ఆచరించాలి. వారి అనుమతి లేనిదే ఇతర ధర్మాలు ఆచరించరాదు.

**వర్జయిత్వా ముక్తిఫలం నిత్యం నైమిత్తికం తథా ।**
**ధర్మసారస్సముద్దిష్టః ప్రేత్యానన్తఫలప్రదః ॥ 38 ॥**

మోక్షఫలం నిత్యనైమిత్తికవిషయాల్లో ఈ నియమం వర్తించదు. ఇదియే ధర్మసారము, ఈ ధర్మమే మరణించిన పిమ్మట అనంతఫలాలను ఇస్తుంది.

**సమ్యగారాధ్య వక్తారం విసృష్టస్తదనుజ్ఞయా ।**
**శిష్యో విద్యాఫలం భుంక్తే ప్రేత్య చాపద్యతే దివి ॥ 39 ॥**

గురువును బాగా ఆరాధించి, ఆయన ఆజ్ఞతో వెళ్ళిన శిష్యుడు ఇహంలో విద్యాఫలాన్ని, పరంలో ధర్మఫలాన్ని అనుభవిస్తాడు.

**యో భ్రాతరం పితృసమం జ్యేష్ఠం మూర్ఖోఽవమన్యతే ।**
**తేన దోషేణ స ప్రేత్య నిరయం ఘోరమృచ్ఛతి ॥ 40 ॥**

తండ్రితో సమానుడయిన అన్నగారిని ఏ మూర్ఖుడయితే అవమానిస్తాడో అట్టి మూర్ఖుడు ఆ దోషమువలన మరణించిన పిమ్మట భయంకరమైన నరకాన్ని పొందుతాడు.

**పుంసా వర్త్మనివిష్టేన పూజ్యో భర్తా తు సర్వదా ।**
**యాతి దాతరి లోకేఽస్మిన్ ఉపకారాద్ధి గౌరవమ్ ॥ 41 ॥**

సన్మార్గాన్ననుసరించేవాడు తనను భరించి పోషించినవాణ్ణి సర్వదా పూజించాలి. ఉపకారం చేసిన దాత అధికగౌరవానికి యోగ్యుడు.

**యే నరా భర్తృపిణ్డార్థం స్వాన్ ప్రాణాన్ సంత్యజన్తి హి ।**
**తేషామథాక్షయాంల్లోకాన్ ప్రోవాచ భగవాన్ మనుః ॥ 42 ॥**

తాను పొందిన బ్రతుకు తెరువునకు ప్రత్యుపకారంగా ప్రాణాలర్పించిన వారు అక్షయలోకాలు పొందుతారని పూజ్యుడగు మనువు చెప్పినాడు.

**మాతులాంశ్చ పితృవ్యాంశ్చ శ్వశురానృత్విజో గురూన్ ।**
**అసావహమితి బ్రూయుః ప్రత్యుత్థాయ యవీయసః ॥ 43 ॥**

మేనమామలు, పినతండ్రులు, మామలు, ఋత్విజులు వచ్చినపుడు ఎదురేగి అసౌ అహం అభివాదయే అంటూ చిన్న వాళ్ళు పలకరించాలి.

**అవాచ్యో దీక్షితో నామ్నా యవీయానపి యో భవేత్ ।**
**భో భవత్పూర్వకం త్వేనమభిభాషేత ధర్మవిత్ ॥ 44 ॥**

తనకన్నా వయసులో చిన్నవారైనా దీక్షలో ఉన్నపుడు పేరుతో పిలువకూడదు. ధర్మజ్ఞుడు 'అయ్యా, తమరు' అని మాట్లాడాలి.

**అభివాద్యశ్చ పూజ్యశ్చ శిరసా వంద్య ఏవ చ ।**
**బ్రాహ్మణః క్షత్రియాద్యైశ్చ శ్రీకామైస్సాదరం సదా ॥ 45 ॥**

సంపదలు కోరే క్షత్రియులు నిత్యం ఆదరంతో బ్రాహ్మణులకు పూజా నమస్కారాలు కావించాలి.

**నాభివాద్యాస్తు విప్రేణ క్షత్రియాద్యాః కథంచన ।**
**జ్ఞానకర్మగుణోపేతా యద్యప్యేతే బహుశ్రుతాః ॥ 46 ॥**

జ్ఞాన, గుణ, కర్మలుకల్గి బహుశాస్త్రాధ్యయనపరులైనా అట్టి క్షత్రియాదులకు బ్రాహ్మణుడు అభివాదం చేయరాదు.

**బ్రాహ్మణస్సర్వవర్ణానాం స్వస్తి కుర్యాదితి స్థితిః ।**
**సవర్ణేషు సవర్ణానాం కార్యమేవాభివాదనమ్ ॥ 47 ॥**

బ్రాహ్మణుడు అన్ని వర్ణాలవారికి శుభాన్ని కల్గిస్తాడన్నది వస్తు స్థితి. సవర్ణులు సవర్ణులకు నమస్కారం చేయవచ్చు.

**గురురగ్నిర్ద్విజాతీనాం వర్ణానాం బ్రాహ్మణో గురుః ।**
**పతిరేకో గురుః స్త్రీణాం సర్వత్రాభ్యాగతో గురుః ॥48॥**

ద్విజులకు అగ్ని గురువు. వర్ణాల్లో బ్రాహ్మణుడు గురువు. స్త్రీలకు పతియే గురువు. అభ్యాగతుడు అందరికి గురువవుతాడు.

**విద్యా కర్మ వయో బంధుర్విత్తం భవతి పఞ్చమమ్ ।**
**మాన్యస్థానాని పఞ్చాహుః పూర్వం పూర్వం గురూత్తరాత్ ॥ 49 ॥**

విద్య, కర్మ, వయస్సు, బంధుత్వం, ధనం ఈ అయిదు పూజ్యస్థానాలు. వీనిలో పూర్వపూర్వం శ్రేష్ఠమైనది.

**పఞ్చానాం త్రిషు వర్ణేషు భూయాంసి బలవన్తి చ ।**
**యత్ర స్యుః సోఽత్ర మానార్హః శూద్రోఽపి దశమీం గతః ॥ 50 ॥**

త్రైవర్ణికుల్లో ఈ అయిదు మిక్కిలి బలీయాలు. ఇవి ఉన్నవాడు పూజ్యుడవుతాడు. ఈ అయిదు గుణాలున్న శూద్రుడు పదేండ్ల బాలుడైనా పూజార్హుడే అవుతాడు.

**పంథా దేయో బ్రాహ్మణాయ స్త్రియై రాజ్ఞే హ్యచక్షుషే ।**
**వృద్ధాయ భారభుగ్నాయ రోగిణే దుర్బలాయ చ ॥ 51 ॥**

బ్రాహ్మణుడు, స్త్రీ, రాజు, అంధుడు, వృద్ధుడు, బరువు మోస్తున్నవాడు, రోగి, బలహీనుడు ఎదురుపడినపుడు ప్రక్కకు తొలగి దారి విడువవలెను.

**భిక్షామాహృత్య శిష్టానాం గృహేభ్యః ప్రయతోఽన్వహమ్ ।**
**నివేద్య గురవేఽశ్నీయాత్ వాగ్యతస్తదనుజ్ఞయా ॥ 52 ॥**

బ్రహ్మచారి శిష్టుల గృహాలనుండి ప్రతిదినం శ్రద్ధతో భిక్షతెచ్చి, గురువుకు నివేదించి, అతని అనుజ్ఞతో మౌనంగా భుజించాలి.

**భవత్పూర్వం చరేద్భైక్ష్యం ఉపనీతో ద్విజోత్తమః ।**
**భవన్మధ్యన్తు రాజన్యో వైశ్యస్తు భవదుత్తరమ్ ॥ 53 ॥**

ఉపనీతుడైన ద్విజుడు భవత్ శబ్దాన్ని మొదట చెప్పి భిక్షాచరణం చేయాలి. రాజులు భవచ్ఛబ్దాన్ని మధ్యలో, వైశ్యులు చివర వాడాలి.

**మాతరం వా స్వసారం వా మాతుర్వా భగినీం నిజామ్ ।**
**భిక్షేత భిక్షాం ప్రథమం యా చైవం న విమానయేత్ ॥ 54 ॥**

తల్లి, పినతల్లి, సోదరి, తననవమానించని స్త్రీ వీరివద్ద ఉపనయనంలో మొదట భిక్షనాచరించాలి.

**సజాతీయగృహే సార్వవర్ణికమేవ వా ।**
**భైక్ష్యస్య చరణం ప్రోక్తం పతితాదిషు వర్జితమ్ ॥ 55 ॥**

సజాతీయుల గృహాల్లో, తమకంటె ఉన్నతవర్గం వారి ఇండ్లలో, అందరినుండి భిక్షాటనం చేయవచ్చు. పతితులవద్ద భిక్ష నడుగరాదు.

**వేదయజ్ఞైరహీనానాం ప్రశస్తానాం స్వకర్మసు ।**
**బ్రహ్మచార్యాహరేద్భైక్షం గృహేభ్యః ప్రయతోఽన్వహమ్ ॥ 56 ॥**

వేదాలు, యజ్ఞాలు లోపించనిచోట స్వకర్మాచరణలో శ్రేష్ఠులైన వారి ఇండ్లలో ప్రతిదినం ప్రయత్నపూర్వకంగా భిక్షాటనం చేయాలి.

**గురోః కులే న భిక్షేత న జ్ఞాతికులబంధుషు ।**
**అలాభే త్వన్యగేహానాం పూర్వం పూర్వం వివర్జయేత్ ॥ 57 ॥**

**సర్వం వా విచరేద్గ్రామం పూర్వోక్తానామసమ్భవే ।**
**నియమ్య ప్రయతో వాచం దిశస్త్వనవలోకయన్ ॥ 58 ॥**

గురువుల గృహాల్లో, జ్ఞాతులు, బంధువుల ఇండ్లలో భిక్షాటన చేయరాదు. ఇతరుల ఇండ్లలో భిక్షదొరకనపుడు గురు, జ్ఞాతులను వదలి బంధువుల ఇండ్లలో ఆచరింపవచ్చును. ఇన్ని చోట్ల దొరకనపుడు వాక్కును నియంత్రించుకొని దిక్కులు చూడక గ్రామమంతా సంచరించ వచ్చును.

**సమాహృత్య తు తద్భైక్షం యావదర్థమమాయయా ।**
**భుఞ్జీత ప్రయతో నిత్యం వాగ్యతోఽనన్యమానసః ॥ 59 ॥**

**భైక్ష్యేణ వర్తయేన్నిత్యం నైకాన్నాదీ భవేత్ వ్రతీ ।**
**భైక్ష్యేణ వ్రతినో వృత్తిః ఉపవాససమా స్మృతా ॥ 60 ॥**

తనకవసరమున్నంతవరకు నిష్కపటంగా భిక్ష సంపాదించుకొని మౌనంగా సావధానంతో వినయవంతుడై భుజించాలి. ప్రతిదినం భిక్షాన్నంతో జీవించాలి. కాని ప్రతిరోజు ఒకే అన్నాన్ని ఒకరింటిలోనే భుజించకూడదు. భిక్షాన్నభోజనవృత్తి ఉపవాసంతో సమానమైనదని అనగా పవిత్రమైనదని చెప్పబడింది.

**పూజయేదశనం నిత్యం అద్యాచ్చైతదకుత్సయన్ ।**
**దృష్ట్వా హృష్యేత్ ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వశః ॥ 61 ॥**

**అనారోగ్యమనాయుష్యమస్వర్గ్యం చాతిభోజనమ్ ।**
**అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్ ॥ 62 ॥**

అన్నాన్నెల్లపుడు పూజించాలి. నిందించకూడదు. అన్నాన్ని చూచి సంతోషించాలి. ప్రసన్నుడు కావాలి. త్రికరణాలతో అభినందించాలి. అతిభోజనం అనారోగ్యం, అనాయుష్యం, అస్వర్గ కారణమవుతుంది. అతిభోజనం పుణ్యదూరం, లోకులు ద్వేషించేది. అందువల్ల అతిభోజనం విడువతగినది.

**ప్రాఙ్ముఖోఽన్నాని భుఞ్జీత సూర్యాభిముఖ ఏవ వా ।**
**నాద్యాదుదఙ్ముఖో నిత్యం విధిరేష సనాతనః ॥ 63 ॥**

**ప్రక్షాల్య పాణిపాదౌ చ భుఞ్జానో ద్విరుపస్పృశేత్ ।**
**శుచౌ దేశే సమాసీనో భుక్త్వా చ ద్విరుపస్పృశేత్ ॥ 64 ॥**

తూర్పు ముఖంగా కాని, సూర్యాభిముఖంగానైనా కూర్చొని భుజించాలి. ఉత్తరాభిముఖంగా భుజించరాదు. ఇది సనాతనవిధి. భుజించటానికి ముందు పాదాలను, హస్తాలను కడుగుకొని, రెండుమార్లు ఆచమనం చేసి, పరిశుభ్రమైన ప్రదేశంలో కూర్చుని భోజనం చేయాలి. భోజనం తర్వాత మళ్ళీ రెండు సార్లు ఆచమనం చేయాలి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే వ్యాసగీతాకథనే ద్వాదశోఽధ్యాయః ॥ 12 ॥**

శ్రీకూర్మపురాణంలోని ఉత్తరార్ధంలో వ్యాసగీతాకథనంలో పన్నెండవ అధ్యాయం ॥ 12 ॥

## త్రయోదశోఽధ్యాయః - పదమూడవ అధ్యాయం

## ఋషివ్యాససంవాదః - ఋషివ్యాససంవాదం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు పలికాడు

**భుక్త్వా పీత్వా చ సుప్త్వా చ స్నాత్వా రథ్యోపసర్పణే ।**
**ఓష్ఠావలోమకౌ స్పృష్ట్వా వాసో విపరిధాయ చ ॥ 1 ॥**

**రేతోమూత్రపురీషాణాముత్సర్గేఽయుక్తభాషణే ।**
**ష్ఠీవిత్వాఽధ్యయనారమ్భే కాసశ్వాసాగమే తథా ॥ 2 ॥**

**చత్వరం వా శ్మశానం వా సమాక్రమ్య ద్విజోత్తమః ।**
**సన్ధ్యయోరుభయోస్తద్వదాచాన్తోఽప్యాచమేత్ పునః ॥ 3 ॥**

భోజనం చేసి, నీరుత్రాగి, పడుకొని లేచి, స్నానం చేసి, దారిలో నడచి, రోమాలు లేని పెదవిని తాకి, వస్త్రాన్ని ధరించినపుడు, రేతస్సు, మూత్రం, పురీషం విడచినప్పుడు, అయుక్తంగా మాట్లాడినపుడు, ఉమ్మినప్పుడు, అధ్యయనారంభంలో దగ్గు వచ్చినపుడు, ఆయాసం కల్గినపుడు, నాలుగుదారుల కూడలినిగాని, శ్మశానాన్నిగాని, చేరినపుడు బ్రాహ్మణశ్రేష్ఠుడు ఉభయ సంధ్యల్లోను మొదట ఆచమనం చేసినా మళ్ళీ ఆచమించవలెను.

**చణ్డాలమ్లేచ్ఛసమ్భాషే స్త్రీశూద్రోచ్ఛిష్టభాషణే ।**
**ఉచ్ఛిష్టం పురుషం స్పృష్ట్వా భోజ్యం చాపి తథావిధమ్ ॥**
**ఆచామేదశ్రుపాతే వా లోహితస్య తథైవ చ ॥ 4 ॥**

**భోజనే సన్ధ్యయోః స్నాత్వా పీత్వా మూత్రపురీషయోః ।**
**ఆచాన్తోఽప్యాచమేత్ సుప్త్వా సకృత్సకృదథాన్యతః ॥ 5 ॥**

చండాలురతో, మ్లేచ్ఛులతో మాట్లాడినపుడు, స్త్రీ, శూద్రులతో, ఉచ్ఛిష్ట ముఖంగల వారితో మాట్లాడినపుడు, ఉచ్ఛిష్టుడైన పురుషుని, ఉచ్ఛిష్టమైన భోజనం స్పృశించినపుడు, కన్నీరుకాని, రక్తం కాని కారినపుడు ఆచమనం చేయాలి. భోజనసమయంలో రెండు సంధ్యల్లోను, స్నానం చేసిన తర్వాత, మూత్రపురీషాలు విడిచిన తర్వాత, నిద్ర నుండి లేచిన తర్వాత, ఆచమనం చేసి ఉన్నా మళ్ళీ ఆచమించవలెను. ఇదే విధంగా ఇతరసమయాల్లో కూడా ఆచమనం చేయాలి.

**అగ్నేర్గవామథాలంభే స్పృష్ట్వా ప్రయతమేవ వా ।**
**స్త్రీణామథాత్మనస్స్పర్శే నీవీం వా పరిధాయ చ ॥ 6 ॥**

**ఉపస్పృశేజ్జలం వాఽర్ద్రం తృణం వా భూమిమేవ వా ।**
**కేశానాం చాత్మనస్స్పర్శే వాససోఽక్షాలితస్య చ ॥ 7 ॥**

అగ్నిని, ఆవును తాకినపుడు, శ్రమపడుతున్నవాణ్ణి, స్త్రీని స్పృశించినపుడు తనను తాను అవసరం లేని చోట స్పృశించినపుడు, కటివస్త్రాన్ని ధరించినపుడు, తన కేశాలను తాకినపుడు, ఉతకని వస్త్రాలు తాకినపుడు, జలాన్ని, తృణాన్ని, భూమిని కాని స్పృశించవలెను.

**అనుష్ణాభిరఫేనాభిరదుష్టాభిశ్చ ధర్మతః ।**
**శౌచేప్సుస్సర్వదాచామేత్ ఆసీనః ప్రాగుదఙ్ముఖః ॥ 8 ॥**

ధర్మాన్ని అనుసరించేవాడు వేడి, నురుగు, దోషంలేని జలంతో తూర్పు లేదా ఉత్తరముఖంగా కూర్చుని ఆచమనం చేయాలి.

**శిరః ప్రావృత్య కణ్ఠం వా ముక్తకచ్ఛశిఖోఽపి వా ।**
**అకృత్వా పాదయోశ్శౌచం ఆచాన్తోఽప్యశుచిర్భవేత్ ॥ 9 ॥**

తల, కంఠం అడ్డంగా తిప్పినపుడు, శిఖ, కచ్ఛం వీడినపుడు పాద ప్రక్షాళనంచేయక ఆచమనం చేసినా అశుచియే అవుతుంది.

**సోపానత్కో జలస్థో వా నోష్ణీషీ వాఽఽచమేద్బుధః ।**
**న చైవ వర్షధారాభిః న తిష్ఠన్నోద్ధృతోదకైః ॥ 10 ॥**

**నైకహస్తార్పితజలైర్వినా సూత్రేణ వా పునః ।**
**న పాదుకాసనస్థో వా బహిర్జానురథాపి వా ॥ 11 ॥**

పాదరక్షలు ధరించి నీటిలో ఉండి తలపాగ ధరించి ఆచమనం చేయరాదు. వర్షధారతో కాని, నిలబడికాని, తానై బయటికి తెచ్చిన నీటితో కాని, ఒక చేత్తో పోసిన జలంతో కాని, యజ్ఞోపవీతం లేకుండా కాని, పాదుకాసనంలో కూచొని కానీ, మోకాళ్ళకు బయట చేతులుంచిగానీ ఆచమనం చేయకూడదు.

**న జల్పన్ న హసన్ ప్రేక్షన్ శయానః ప్రహ్వ ఏవ చ ।**
**నావీక్షితాభిః ఫేనాద్యైః ఉపేతాభిరథాపి వా ॥ 12 ॥**

**శూద్రాశుచికరోన్ముక్తైః న క్షారాభిస్తథైవ చ ।**
**న చైవాఙ్గులిభిశ్శబ్దం న కుర్వన్నాన్యమానసః ॥ 13 ॥**

**న వర్ణరసదుష్టాభిర్న చైవ ప్రదరోదకైః ।**
**న పాణిక్షుభితాభిర్వా న బహిష్కక్ష ఏవ వా ॥ 14 ॥**

మాట్లాడుతూ, నవ్వుతూ, ఇతరులను చూస్తూ, పడుకొని, వంగి ఆచమనం చేయకూడదు. పరిశీలింపబడని, నురుగు మొ॥లగు వాటితో కూడుకొన్నజలములతో ఆచమించరాదు. శూద్రులు, అపవిత్రమైనవారు తెచ్చినవి, ఉప్పనివి అయిన జలములతో ఆచమించరాదు. వ్రేళ్ళతో శబ్దం చేస్తూ, అన్యచిత్తంతో ఉండి, వర్ణరస దుష్టమైన జలంతో, చిన్న గుంటలోని నీటితో, చేతులతో కలచిన నీటితో, కక్షభ్రంశంతో ఆచమనం చేయకూడదు.

**హృద్గాభిః పూయతే విప్రః కంఠ్యాభిః క్షత్రియశ్శుచిః ।**
**ప్రాశితాభిస్తథా వైశ్యః స్త్రీశూద్రౌ స్పర్శతోఽన్తతః ॥ 15 ॥**

ఆచమనజలం హృదయం వరకు చేరినపుడు బ్రాహ్మణుడు, కంఠం చేరినపుడు క్షత్రియుడు, నోటిలో పడినపుడు వైశ్యుడు, ముట్టుకున్నంతలో స్త్రీ, శూద్రులు పవిత్రులవుతారు.

**అఙ్గుష్ఠమూలాన్తరతః రేఖాయాం బ్రాహ్మముచ్యతే ।**
**అన్తరాఙ్గుష్ఠదేశిన్యో పితౄణాం తీర్థముత్తమమ్ ॥ 16 ॥**

**కనిష్ఠమూలతః పశ్చాత్ ప్రాజాపత్యం ప్రచక్షతే ।**
**అఙ్గుల్యగ్రే స్మృతం దైవం తదేవార్షం ప్రకీర్తితమ్ ॥ 17 ॥**

**మూలే వా దైవమార్షం స్యాత్ ఆగ్నేయం మధ్యతః స్మృతమ్ ।**
**తదేవ సౌమికం తీర్థం ఏతత్ జ్ఞాత్వా న ముహ్యతి ॥ 18 ॥**

**బ్రాహ్మేణైవ తు తీర్థేన ద్విజో నిత్యముపస్పృశేత్ ।**
**కాయేన వాఽథ దైవేన న తు పిత్ర్యేణ వై ద్విజాః ॥19 ॥**

**త్రిః ప్రాశ్నీయాదపః పూర్వం బ్రాహ్మణః ప్రయతస్తతః ।**
**సమ్మృజ్యాఙ్గుష్ఠమూలేన ముఖం వై సముపస్పృశేత్ ॥ 20 ॥**

అంగుష్ఠమూలంలోని రేఖలో ఉన్న జలాన్ని బ్రహ్మతీర్థమంటారు. తర్జనీ అంగుష్ఠమధ్యభాగంలో ఉన్నదాన్ని పితృతీర్థమని, కనిష్ఠికా మూలంలోని తీర్థాన్ని ప్రాజాపత్యమని అంటారు. అంగుళి అగ్రభాగంలో ఉన్నది దైవతీర్థం, ఋషి తీర్థం అంటారు. అంగుష్ఠమూలంలో ఉన్నా దైవం, ఆర్షం అనవచ్చు. అంగుష్ఠమధ్యంలో ఉంటే అగ్నితీర్థం అవుతుంది. దీన్నే సౌమికతీర్థం అని కూడ అంటారు. ఈ విధానం తెలిసినవాడు పొరపడడు. ద్విజుడు బ్రహ్మతీర్థంతోనే ఆచమనం చేయాలి. లేదా ప్రాజాపత్య, దైవతీర్థాలతోను చేయవచ్చును. పితృతీర్థంతో చేయకూడదు. బ్రాహ్మణుడు మొదట సావధానంతో మూడుసార్లు ఆచమనం చేయాలి. తర్వాత అంగుష్ఠమూలంతో ముఖాన్ని స్పృశించాలి.

**అంగుష్ఠానామికాభ్యాన్తు స్పృశేన్నేత్రద్వయం తతః ।**
**తర్జన్యంగుష్ఠయోగేన స్పృశేన్నాసాపుటద్వయమ్ ॥ 21 ॥**

అంగుష్ఠ, అనామికలతో నేత్రద్వయాన్ని స్పృశించాలి. తర్జనీఅంగుష్ఠాలతో నాసికాపుటాలను స్పృశించాలి.

**కనిష్ఠాఙ్గుష్ఠయోగేన శ్రవణే సముపస్పృశేత్ ।**
**సర్వాసామథ యోగేన హృదయం తు తలేన వా ॥**

**సంస్పృశేద్వా శిరస్తద్వత్ అంగుష్ఠేనాథవా ద్వయమ్ ॥ 22 ॥**

కనిష్ఠికా, అంగుష్ఠాలతో చెవులను తాకాలి. అన్ని వ్రేళ్ళతో కాని, అరచేతితో కాని హృదయాన్ని స్పృశించాలి. అట్లే శిరస్సును కూడా. లేదా అంగుష్ఠంతో, రెండువ్రేళ్ళతో కాని స్పృశించవచ్చు.

**త్రిః ప్రాశ్నీయాద్యదమ్భస్తు సుప్రీతాస్తేన దేవతాః ।**

**బ్రహ్మా విష్ణుర్మహేశశ్చ భవన్తీత్యనుశుశ్రుమ ॥ 23 ॥**

మూడుసార్లు జలప్రాశనంతో దేవతలు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సంప్రీతులవుతారు అని విన్నాము.

**గంగా చ యమునా చైవ ప్రీయేతే పరిమార్జనాత్ ।**

**సంస్పృష్టయోర్లోచనయోః ప్రీయేతే శశిభాస్కరౌ ॥ 24 ॥**

పరిమార్జనంవల్ల గంగా, యమునలు ప్రీతి చెందుతాయి. నేత్రాలు స్పృశించినందువల్ల సూర్యచంద్రులు సంతోషిస్తారు.

**నాసత్యదస్రౌ ప్రీయేతే స్పృష్టే నాసాపుటద్వయే ।**
**కర్ణయోస్స్పృష్టయోస్తద్వత్ప్రీయేతే చానిలానలౌ ॥ 25 ॥**

**సంస్పృష్టే హృదయే చాస్య ప్రీయన్తే సర్వదేవతాః ।**
**మూర్ధ్నిసంస్పర్శనాదేకః ప్రీతస్స పురుషో భవేత్ ॥ 26 ॥**

నాసాపుటాలు స్పృశిస్తే అశ్వినీదేవతలు, కర్ణాలు స్పృశించటంతో అగ్ని, వాయువులు, హృదయాన్ని స్పృశించినందువల్ల దేవతలందరు సంప్రీతులవుతారు. శిరసును స్పృశించినందువల్ల పురుషోత్తముడు ప్రసన్నుడవుతాడు.

**నోచ్ఛిష్టం కుర్వతే ముఖ్యా విప్రుషోఽఙ్గం నయన్తి యాః ।**
**దన్తవద్దన్తలగ్నేషు జిహ్వా స్పర్శేఽశుచిర్భవేత్ ॥ 27 ॥**

ఆచమనసమయంలో శరీరంపై పడే నీటి బిందువులతో శరీరం ఎంగిలికాజాలదు. దంతాలమధ్య ఉన్న పదార్థాలు దంతాలతో సమానమే. కాని నాలుకతో తాకినపుడు మాత్రం అశుచి అవుతుంది.

**స్పృశన్తి బిన్దవః పాదౌ య ఆచామయతః పరాన్ ।**
**భూమిగైస్తే సమాజ్ఞేయా న తైరప్రయతో భవేత్ ॥ 28 ॥**

ఆచమించేప్పుడు పాదాలపై పడిన నీటి కణాలు భూమిపై పడ్డట్టే భావించాలి. వానితో అశుచికాదు.

**మధుపర్కే చ సోమే చ తామ్బూలస్య చ భక్షణే ।**
**ఫలమూలే చేక్షుదణ్డే న దోషం ప్రాహ వై మనుః ॥ 29 ॥**

మధుపర్కం గ్రహించినపుడు, సోమపానంలో, తాంబూల భక్షణంలో, ఫలమూలములందు, చెరకుగడల భక్షణంలో, దోషం లేదని మనువు చెప్పినాడు.

**ప్రచరంశ్చాన్నపానేషు ద్రవ్యహస్తో భవేన్నరః ।**
**భూమౌ నిక్షిప్య తద్ద్రవ్యం ఆచమ్యాభ్యుక్షయేత్తు తత్ ॥ 30 ॥**

అన్నపానాదివ్యవహారములో చేతియందు భోజనపదార్థమునుంచుకొని పైకిలేచినట్లయిన ఆ ద్రవ్యమును భూమిపై ఉంచి తిరిగి ఆచమించి ఆ పదార్థముపై నీళ్ళు చల్లాలి.

**తైజసం వై సమాదాయ యద్యుచ్ఛిష్టో భవేద్ద్విజః ।**
**భూమౌ నిక్షిప్య తద్ద్రవ్యమాచమ్యాభ్యుక్షయేత్తు తత్ ॥ 31 ॥**

తేజస్సంబంధమైన వస్తువును తీసుకొని వెళ్ళే బ్రాహ్మణుడు అన్నపానాదులవల్ల ఉచ్ఛిష్టుడయినపుడు ఆ వస్తువును నేలపై ఉంచి ఆచమనం చేసి ప్రోక్షించాలి.

**యద్యమత్రం సమాదాయ భవేదుచ్ఛేషణాన్వితః ।**
**అనిధాయైవ తద్ద్రవ్యమాచాన్తః శుచితామియాత్ ॥**

**వస్త్రాదిషు వికల్పస్స్యాత్ తత్సంస్పృష్ట్వాఽఽచమేదిహ ॥ 32 ॥**

ఏదైనా పాత్రను పట్టుకొన్న వ్యక్తి ఉచ్ఛిష్టుడైనా ఆ పాత్రను క్రింద పెట్టకుండానే ఆచమనమాత్రంతో శుద్ధుడవుతాడు. వస్త్రాదుల విషయంలో వాటిని క్రింద పెట్టుటలో వికల్పము, వాటినీ స్పృశించి ఆచమనం చేయాలి.

**అరణ్యేఽనుదకే రాత్రౌ చౌరవ్యాఘ్రాకులే పథి ।**

**కృత్వా మూత్రం పురీషం వా ద్రవ్యహస్తో న దుష్యతి । 33 ॥**

అరణ్యంలో జలం లేనిచోట, రాత్రిపూట, చోరవ్యాఘ్రసంకుల మార్గంలో, ద్రవ్యాన్ని చేతపట్టుకొనే మూత్రపురీషాది ఉత్సర్గంచేసినా అశుచి కాజాలడు. ద్రవ్యం కూడా అపవిత్రం కాదు.

**నిధాయ దక్షిణే కర్ణే బ్రహ్మసూత్రముదఙ్ముఖః ।**
**అహ్ని కుర్యాచ్ఛకృన్మూత్రం రాత్రౌ చేద్దక్షిణాముఖః ॥ 34 ॥**

**అన్తర్ధాయ మహీం కాష్ఠైః పత్రైర్లోష్టతృణేన వా ।**
**ప్రావృత్య చ శిరః కుర్యాత్ విణ్మూత్రస్య విసర్జనమ్ ॥ 35 ॥**

కుడి చెవిపై యజ్ఞసూత్రాన్ని చుట్టుకొని పగలు ఉత్తరాభిముఖంగా, రాత్రి దక్షిణాభిముఖంగా మూత్రపురీషోత్సర్గం చేయాలి. ఆ భూమిని కర్రలతో ఆకులు, గడ్డి, మట్టిపెళ్ళలతో కప్పి తలకు వస్త్రాన్ని చుట్టుకొని మలమూత్రాదులు విడువాలి.

**ఛాయాకూపనదీగోష్ఠచైత్యాంభఃపథిభస్మసు ।**
**అగ్నౌ చైవ శ్మశానే చ విణ్మూత్రే న సమాచరేత్ ॥ 36 ॥**

తన నీడపై, బావిలో, నదిలో, గోశాల, గ్రామదేవతాస్థానాల్లో, నీళ్ళలో, బూడిద, అగ్ని, శ్మశానాల్లో మలమూత్రాదులు వదలరాదు.

**న గోమయే న కృష్టే వా మహావృక్షే న శాద్వలే ।**
**న తిష్ఠన్ న చ నిర్వాసా న చ పర్వతమస్తకే ॥ 37 ॥**

గోమయం, దుక్కి(దున్నిన నేల) పెద్ద చెట్టు సమీపం, పచ్చిక గల చోట పర్వత శిఖరం పై నిలబడిగాని వస్త్రహీనుడై గాని మలమూత్రాలు విడువరాదు.

**న జీర్ణదేవాయతనే న వల్మీకే కదాచన ।**
**న స సత్త్వేషు గర్తేషు గచ్ఛన్వా న సమాచరేత్ ॥ 38 ॥**

జీర్ణమైన దేవాలయాల్లోనూ, పుట్టపైనా, జంతువులున్న గోతుల్లోనూ, నడుస్తునూ మలమూత్రాలు విసర్జించ రాదు.

**తుషాఙ్గార కపాలేషు రాజమార్గే తథైవ చ ।**
**న క్షేత్రే న బిలే చాపి న తీర్థే న చతుష్పథే ॥ 39 ॥**

**నోద్యానోద సమీపే వా నోషరే న పరాశుచౌ ।**
**న సోపానత్పాదుకో వా ఛత్రీ వా నాన్తరిక్షకే ॥ 40 ॥**

**న చైవాభిముఖే స్త్రీణాం గురుబ్రాహ్మణయోర్గవామ్ ।**
**న దేవదేవాలయయోరపామపి కదాచన ॥ 41 ॥**

ధాన్యం పొట్టు, మండే అగ్ని, మట్టి మూకుడు (యజ్ఞాల్లో ఉపయోగించేవి), రాజమార్గం, పొలం, బిలం, తీర్థం, నాలుగు దారులు గల కూడలి, ఉద్యాన సమీపంలోని జలాల్లోనూ చవుటి నేల, అపవిత్రప్రదేశం మొదలైనచోట పనికిరాదు. పాదరక్షలతో, ఛత్రంతో, అంతరిక్షంలో, స్త్రీలకు, గురు, బ్రాహ్మణ, గోవుల కభిముఖంగా, దేవదేవాలయ జలములకభిముఖంగా మలమూత్ర విసర్జనం సరికాదు.

**న జ్యోతీంషి నిరీక్షన్వా న సన్ధ్యాభిముఖోఽపి వా ।**
**ప్రత్యాదిత్యం ప్రత్యనలం ప్రతిసోమం తథైవ చ ॥ 42 ॥**

**ఆహృత్య మృత్తికాం కూలాత్ లేపగన్ధాపకర్షణమ్ ।**
**కుర్యాదతన్ద్రితశ్శౌచం విశుద్ధైరుద్ధృతోదకైః ॥ 43 ॥**

నక్షత్రాలు చూస్తూ, సంధ్యా సమయంలో, సూర్యచంద్రాగ్నుల కెదురుగా మలమూత్రవిసర్జనం తగదు. సోమరితనం వదలి నదినుండి లేదా చెరువునుండి మట్టిని తీసుకొని శుభ్రమైన బావినుండి తీసుకున్న నీటితో శౌచం ఆచరించాలి.

**నాహరేన్మృత్తికాం విప్రః పాంశులాన్న చ కర్దమాత్ ।**
**న మార్గాన్నోషరాద్దేశాచ్ఛౌచశిష్టాం పరస్య చ ॥ 44 ॥**

**న దేవాయతనాత్కూపాత్ గ్రామాన్న చ జలాత్తథా ।**
**ఉపస్పృశేత్తతో నిత్యం పూర్వోక్తేన విధానతః ॥ 45 ॥**

బ్రాహ్మణుడు ధూళి, బురదనుండి మట్టిని తీసుకోరాదు. త్రోవ, చౌటి నేల, ఇతరులు శౌచం చేసిన చోటు, దేవాలయం, బావి, గ్రామం, జలంనుండి మట్టిని తీసుకోరాదు. శౌచం తర్వాత ముందు చెప్పిన విధంగా ఆచమనం చేయాలి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఋషివ్యాస సంవాదే త్రయోదశోఽధ్యాయః ॥ 13 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ఋషివ్యాస సంవాదంలో పదమూడవ అధ్యాయం ॥ 13 ॥



## **చతుర్దశోఽధ్యాయః** - పద్నాల్గవ అధ్యాయం

## **శిష్య-బ్రహ్మచారిణాం ధర్మనిరూపణమ్** - శిష్య-బ్రహ్మచారుల ధర్మనిరూపణం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు పలికాడు.

**ఏవం దణ్డాదిభిర్యుక్తః శౌచాచారసమన్వితః ।**
**ఆహూతోఽధ్యయనం కుర్యాత్ వీక్షమాణో గురోర్ముఖమ్ ॥ 1 ॥**

ఈ విధంగా దండాదులు ధరించి, శౌచాచారం కల్గి, గురువు పిలుపు మేరకు గురుముఖం చూస్తూ అధ్యయనం చేయాలి.

**నిత్యముద్యతపాణిస్స్యాత్ సాధ్వాచారస్సుసంయతః ।**
**ఆస్యతామితి చోక్తః సన్నాసీతాభిముఖం గురోః ॥ 2 ॥**

సదాచారంకల్గి, ఉత్తరీయంనుండి కుడి చేతిని బయటకుంచుకుని, ఇంద్రియనిగ్రహం కలవాడై గురువు కూర్చుండమన్నపుడు అతని కభిముఖంగా కూర్చుండవలెను.

**ప్రతిశ్రవణసమ్భాషే శయానో న సమాచరేత్ ।**
**నాసీనో న చ భుఞ్జానో న తిష్ఠన్నపరాఙ్ముఖః ॥ 3 ॥**

పడుకుని, కూర్చుని, భోజనం చేస్తూ, నిలబడి, గురువువైపు వీపుంచి గురువునుండి విద్యాభ్యాసంగాని వేరే సంభాషణ కాని చేయరాదు.

**నీచం శయ్యాసనం చాస్య సర్వదా గురుసన్నిధౌ ।**
**గురోస్తు చక్షుర్విషయే న యథేష్టాసనో భవేత్ ॥ 4 ॥**

గురుసన్నిధిలో ఆసనం, శయ్య క్రిందుగా ఉండాలి. గురువు ముందు ఇష్టం వచ్చినట్టు కూర్చోకూడదు.

**నోదాహరేదస్య నామ పరోక్షమపి కేవలమ్ ।**
**న చైవాస్యానుకుర్వీత గతిభాషణచేష్టితమ్ ॥ 5 ॥**

గురువుపరోక్షంలో నైనా కేవలగురునామం చెప్పకూడదు. గురువు నడకను, మాటలు, చేష్టలను అనుకరించకూడదు.

**గురోర్యత్ర పరీవాదో నిన్దా చాపి ప్రవర్తతే ।**
**కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గన్తవ్యం వా తతోఽన్యతః ॥ 6 ॥**

గురువును, దూషించేచోట, గురువును నిందించే ప్రదేశంలో చెవులు మూసికొనాలి లేదా అక్కడ నుండి వెళ్ళిపోవాలి.

**దూరస్థో నార్చయేదేనం న క్రుద్ధో నాన్తికే స్త్రియాః ।**
**న చైవాస్యోత్తరం బ్రూయాత్ స్థితో నాసీత సన్నిధౌ ॥ 7 ॥**

తాను దూరంగా ఉండి గురువు నర్చింపకూడదు. క్రుద్ధుడై ఉన్నపుడు, స్త్రీ సమీపంలో ఉన్నప్పుడు గురువును అర్చించకూడదు. గురువు మాటకు ఎదురు పలుకరాదు. గుర్వాజ్ఞ లేక అతని సమీపంలో కూర్చొన కూడదు.

**ఉదకుమ్భం కుశాన్ పుష్పం సమిధోఽప్యాహరేత్సదా ।**
**మార్జనం లేపనం నిత్యం అఙ్గానాం వై సమాచరేత్ ॥ 8 ॥**

శిష్యుడు గురువుకొరకు జలం నిండిన పాత్రను, దర్భలను, పుష్పం, సమిధలను తీసుకొని పోవలెను. ఎల్లపుడు గురువు అవయవాలకు మార్జనం, లేపనం మొదలైనవి చేయాలి.

**నాస్య నిర్మాల్యశయనం పాదుకోపానహావపి ।**
**ఆక్రమేదాసనం చాస్య ఛాయాదీన్వా కదాచన ॥ 9 ॥**

గురువు ధరించిన పూమాలను, శయ్యను, పాదుకలను, పాదరక్షలను, ఆసనాన్ని, గురువు నీడను, ఆక్రమించరాదు.

**సాధయేద్దన్తకాష్ఠాదీన్ లబ్ధం చాస్మై నివేదయేత్ ।**
**అనాపృచ్ఛ్య న గన్తవ్యం భవేత్ ప్రియహితే రతః ॥ 10 ॥**

గురువు కోసం దంతకాష్ఠాదులు సంపాదించి పెట్టాలి. తాను సంపాదించినదానిని గురువుకు నివేదించాలి. గురువుకు ప్రియము హితం కూర్చటంలో తత్పరుడు కావాలి. గురువుకు చెప్పకుండా వెళ్ళరాదు.

**న పాదౌ సారయేదస్య సన్నిధానే కదాచన ।**
**జృంభితం హసితం చైవ కంఠప్రావరణం తథా ॥ 11 ॥**

**వర్జయేత్సన్నిధౌ నిత్యం అవస్ఫోటనమేవ చ ।**
**యథాకాలమధీయీత యావన్న విమనా గురుః ।**
**ఆసీతాధో గురోః కూర్చే ఫలకే వా సమాహితః ॥ 12 ॥**

గురువుముందు కాళ్ళు చాపి కూర్చోకూడదు. అట్లే ఆవలించకూడదు. నవ్వకూడదు, కంఠాన్ని కప్పుకోకూడదు. అలంకరించుకోరాదు. పెద్దగా చప్పట్లుకొట్టుట కూడదు. గురువు విమనస్కుడు కానపుడు మాత్రమే కాలనియమాన్ననుసరించి అధ్యయనం కొనసాగించాలి. అధ్యయనకాలంలో గురువుదగ్గర నీచాసనంలో కాని ఫలకమందుకాని సావధానంగా కూర్చోవాలి.

**ఆసనే శయనే యానే నైవ తిష్ఠేత్కదాచన ।**
**ధావన్తమనుధావేత గచ్ఛన్తమనుగచ్ఛతి ॥ 13 ॥**

గురువుయొక్క ఆసనం, శయ్య, వాహనాలపై కూర్చోరాదు. గురువు పరుగెత్తునపుడు తాను వెంట పరుగెత్తాలి. నడచినపుడు నడవాలి.

**గోఽశ్వోష్ట్రయానప్రాసాదప్రస్తరేషు కటేషు చ ।**
**ఆసీత గురుణా సార్థం శిలాఫలకనౌషు చ ॥ 14 ॥**

ఎడ్లు, గుర్రాలు, ఒంటెలు లాగే బళ్ళు, భవనం, ప్రస్తరం, చాప, శిలాఫలకం, నావ మొదలైనవానిలో గురువుతోకూడ కూర్చొనవచ్చును.

**జితేన్ద్రియస్స్యాత్సతతం వశ్యాత్మాఽక్రోధనశ్శుచిః ।**
**ప్రయుఞ్జీత సదా వాచం మధురాం హితభాషిణీమ్ ॥ 15 ॥**

జితేంద్రియుడై, కోపము నదుపులో నుంచుకొని, శుచియై, గురువు వద్ద సదా హితంగా, మధురంగా మాట్లాడాలి.

**గన్ధమాల్యం రసం కల్యాం శుక్తం ప్రాణివిహింసనమ్ ।**
**అభ్యంగం చాంజనోపానచ్ఛత్రధారణమేవ చ ॥ 16 ॥**

**కామం లోభం భయం నిద్రాం గీతవాదిత్రనర్తనమ్ ।**
**ఆతర్జనం పరీవాదం స్త్రీప్రేక్షాలంభనం తథా ॥ 17 ॥**

**పరోపఘాతం పైశున్యం ప్రయత్నేన వివర్జయేత్ ।**

గురువు సన్నిధిలో గంధం, మాల్యం, రసం, మద్యం, ఆడంబరాలను, ప్రాణిహింస, అభ్యంగనం, కాటుక పెట్టుకోవటం, పాదరక్షలు ధరించటం, కామ, లోభ, భయ, నిద్రలను, గీత వాద్యనర్తనాలను, బెదరించటం నింద, స్త్రీదర్శనం, స్పర్శనం, పరాపకారం, లోభిత్వం మొదలైనవి ప్రయత్నంతో విడిచి పెట్టవలెను.

**ఉదకుమ్భం సుమనసో గోశకృన్మృత్తికాం కుశాన్ ।**
**ఆహరేద్యావదర్థాని భైక్ష్యం చాహరహశ్చరేత్ ॥ 18 ॥**

**కృతం చ లవణం సర్వం వర్జ్యం పర్యుషితఞ్చ యత్ ।**
**అనృత్యదర్శీ సతతం భవేద్గీతాదినిస్పృహః ॥ 19 ॥**

**నాదిత్యం వై సమీక్షేత న చరేద్దంతధావనమ్ ।**
**ఏకాంతమశుచిస్త్రీభిః శూద్రాంత్యైరభిభాషణమ్ ॥ 20 ॥**

ప్రతిదినం నీటికుండను, పువ్వులను, ఆవుపేడను, మృత్తికను, దర్భలను, గురువు అవసరానికి తగినట్టు తీసుకొనిపోవలెను. భిక్షాటనం చేయవలెను. కృత్రిమలవణాన్ని, వాసనపట్టిన పదార్థాలను, విడిచిపెట్టాలి. నృత్యం చూడకూడదు. గీతాదుల్లో ఆసక్తి చూపరాదు. సూర్యునికెదురుగా నిలువరాదు. దంతధావనం చేసుకోకూడదు. ఏకాంతస్థితిలో అపవిత్రులైన స్త్రీలతో, శూద్రులతో, అంత్యజులతో మాట్లాడకూడదు.

**గురూచ్ఛిష్టం భేషజార్థం ప్రయుంజీత న కామతః ।**
**మలాపకర్షణస్నానం నాచరేద్ధి కదాచన ॥ 21 ॥**

గురూచ్ఛిష్టభోజనాన్ని లోభంతో స్వీకరించరాదు. శరీరం మురికిపోవటానికి రాగపూర్వకంగా స్నానం చేయకూడదు.

**న కుర్యా న్మానసం విప్రో గురోస్త్యాగే కదాచన ।**
**మోహాద్వా యది వా లోభాత్ త్యక్తేన పతితో భవేత్ ॥ 22 ॥**

మానసికంగాకూడా గురువును వీడరాదు. మోహంతోకాని, లోభంతోకాని గురువును పరిత్యజిస్తే పతితుడవుతాడు

**లౌకికం వైదికం చాపి తథాధ్యాత్మిక మేవ చ ।**
**ఆదదీత యతో జ్ఞానం న తం ద్రుహ్యేత్కదాచన ॥ 23 ॥**

ఎవరివలన లౌకికముగాని, వైదికముగాని, ఆధ్యాత్మికముగాని జ్ఞానము సిద్ధించినదో అట్టివారికి ఎన్నడూ ద్రోహము తలపెట్టరాదు.

**గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః ।**
**ఉత్పథం ప్రతిపన్నస్య మనుస్త్యాగం సమబ్రవీత్ ॥ 24 ॥**

గర్విష్ఠి, మహాపాపి, కార్యాకార్యవిచక్షణా శూన్యుడు, కుమార్గగామి అగు గురువును వదలవచ్చునని మనువు చెప్పినాడు.

**గురోర్గురౌ సన్నిహితే గురువద్భక్తిమాచరేత్ ।**
**న చాతిసృష్టో గురుణా స్వాన్గురూనభివాదయేత్ ॥ 25 ॥**

గురువుయొక్క గురువు విషయంలో, గురువునందు వలెనే భక్తి, వినయాలు ప్రదర్శించాలి. గురువు ఇంటిలో అతని దగ్గర అతని ఆజ్ఞ లేక తన గురువులైన తల్లిదండ్రులు మొదలైన వారికి నమస్కరించరాదు.

**విద్యాగురుష్వేతదేవ నిత్యావృత్తిస్స్వయోనిషు ।**
**ప్రతిషేధత్సు చాధర్మాద్ధితం చోపదిశత్స్వపి ॥ 26 ॥**

**శ్రేయస్సు గురువద్వృత్తిం నిత్యమేవ సమాచరేత్ ।**
**గురుపుత్రేషు దారేషు గురోశ్చైవ స్వబంధుషు ॥ 27 ॥**

విద్యాగురువు, తల్లిదండ్రులు, అధర్మనిషేధకుడు, హితోపదేశికుడు, శ్రేయఃకాముడు అనువారి విషయంలో గురువునందువలెనే నడచుకోవాలి. గురుపుత్రులందు, గురుపత్నియందు, వారి బంధువులందు, గురువునందు వలెనే వ్యవహరించాలి.

**బాలస్సమానజన్మా వా శిష్యో వా యజ్ఞకర్మణి ।**
**అధ్యాపయన్ గురుసుతో గురువన్మానమర్హతి ॥ 28 ॥**

**ఉత్సాదనం వై గాత్రాణాం స్నాపనోచ్ఛిష్టభోజనే ।**
**న కుర్యాద్గురుపుత్రస్య పాదయోశ్శౌచమేవ చ ॥ 29 ॥**

**గురువత్పరిపూజ్యాస్తు సవర్ణా గురుయోషితః ।**
**అసవర్ణాస్తు సంపూజ్యాః ప్రత్యుత్థానాభివాదనైః ॥ 30 ॥**

గురుపుత్రుడు తనకంటె చిన్నవాడు, సమవయస్కుడు, యజ్ఞకర్మలో శిష్యుడు, అయినాకూడ అధ్యాపనం చేస్తుంటే గురువువలె గౌరవార్హుడే కాని ఆ గురుపుత్రుని ఒళ్ళు పట్టడం, స్నానం చేయించడం, అతని ఉచ్ఛిష్టాన్ని తినడం, అతని పాదములను కడగడం చేయరాదు. సవర్ణురాళ్ళైన గురుపత్నులు గురువువలెనే గౌరవనీయులు. అసవర్ణురాళ్ళు అయినట్లయితే ప్రత్యుత్థాన అభివాదనాలతో మాత్రం పూజించాలి.

**అభ్యంజనం స్నాపనం చ గాత్రోత్సాదనమేవ చ ।**
**గురుపత్న్యా న కార్యాణి కేశానాఞ్చ ప్రసాధనమ్ ॥ 31 ॥**

**గురుపత్నీ తు యువతీ నాభివాద్యేహ పాదయోః ।**
**కుర్వీత వందనం భూమ్యామసావహమితి బ్రువన్ ॥ 32 ॥**

**విప్రోష్య పాదగ్రహణం అన్వహం చాభివాదనమ్ ।**
**గురుదారేషు కుర్వీత సతాం ధర్మమనుస్మరన్ ॥ 33 ॥**

**మాతృష్వసా మాతులానీ శ్వశ్రూశ్చాథ పితృష్వసా ।**
**సంపూజ్యా గురుపత్నీవ సమాస్తా గురుభార్యయా ॥ 34 ॥**

**భ్రాతుర్భార్యోపసంగ్రాహ్యా సవర్ణాహన్యహన్యపి ।**
**విప్రోష్య తూపసంగ్రాహ్యా జ్ఞాతిసంబన్ధియోషితః ॥ 35 ॥**

గురుపత్నికి అభ్యంజనస్నానం, శరీరసంవాహనం, కేశాలంకరణ చేయకూడదు. ఆమె యువతి అయినట్లైతే పాదస్పర్శతో నమస్కరించరాదు. 'అసావహం' అని భూమిపైనే నమస్కరించాలి. శిష్యుడు గ్రామాంతరం దేశాంతరం వెళ్ళి వచ్చినపుడు శిష్టాచారం ప్రకారం గురుపత్నికి పాదగ్రహణం, పాదనమస్కారం చేయాలి. పినతల్లి, మేనమామ భార్య, అత్త, మేనత్త వీరంతా గురుపత్నితో సమానులే. అట్లే పూజించాలి. సవర్ణురాలైన భాతృభార్య కూడ గౌరవార్హురాలే. ప్రతిదినం అభివాదం చేయాలి. ప్రవాసంనుండి తిరిగి వచ్చినపుడు జ్ఞాతిస్త్రీలు, సంబంధిత స్త్రీలకు కూడ అభివాదం చేయాలి.

**పితుర్భగిన్యాం మాతుశ్చ జ్యాయస్యాం చ స్వసర్యపి ।**
**మాతృవద్వృత్తిమాతిష్ఠేత్ మాతా తాభ్యో గరీయసీ ॥ 36 ॥**

**ఏవమాచారసంపన్నమాత్మవంతమదాంభికమ్ ।**
**వేదమధ్యాపయేద్ధర్మం పురాణాఙ్గాని నిత్యశః ॥ 37 ॥**

మేనత్త, పినతల్లి, పెత్తల్లి విషయంలో తల్లియందువలెనే ప్రవర్తించాలి. తల్లి వీరికంటె శ్రేష్ఠురాలు. ఈ విధమైన ఆచారంతో మనోనిగ్రహంకల్గి, దంభంలేని శిష్యునికి వేదం, ధర్మాలు, వేదాంగాలు, పురాణాలు ఎల్లప్పుడు అధ్యాపనం చేయవలెను.

**సంవత్సరోషితే శిష్యే గరుర్జ్ఞానమనిర్దిశన్ ।**
**హరతే దుష్కృతం తస్య శిష్యస్య వసతో గురుః ॥ 38 ॥**

**ఆచార్యపుత్రశ్శుశ్రూషుః జ్ఞానదో ధార్మికశ్శుచిః ।**
**శక్తోఽన్నదోఽర్థీ స్వః సాధురధ్యాప్యా దశ ధర్మతః ॥ 39 ॥**

**కృతజ్ఞశ్చ తథాఽద్రోహీ మేధావీ శుభకృన్నరః ।**
**ఆప్తః ప్రియోఽథ విధివత్ షడధ్యాప్యా ద్విజాతయః ॥**

**ఏతేషు బ్రహ్మణో దానమన్యత్ర తు యథోదితాన్ ॥40॥**

సంవత్సరకాలం గురుశుశ్రూష చేసిన శిష్యునికి గురువు జ్ఞానబోధ చేయనట్లైతే ఆ శిష్యుని దుష్కృతం గురువుకు సంక్రమిస్తుంది. ఆచార్యపుత్రుడు, సేవించేవాడు, విద్యతో మరో విద్య గ్రహించేవాడు, ధార్మికుడు, పవిత్రుడు, సమర్థుడు, అన్నాన్నొసగేవాడు, యాచించేవాడు తనకు సంబంధించినవారు, సచ్ఛీలి ఈ పదిమంది చదివింప తగినవారు. కృతజ్ఞుడు, అద్రోహి, మేధావి, శుభంకరుడు, ఆప్తుడు ప్రియం ఆచరించేవాడు ఈ ఆర్గురు ద్విజులు యథావిధి అధ్యాపనయోగ్యులు. వీరిలో బ్రాహ్మణునికి బ్రహ్మజ్ఞానం వేదజ్ఞానం కలుగ చేయాలి. ఇతరులకు విధి ప్రకారం విద్యాదానం చేయాలి.

**ఆచమ్య సంయతో నిత్యం అధీయాత ఉదఙ్ముఖః ।**
**ఉపసంగృహ్య తత్పాదౌ వీక్షమాణో గురోర్ముఖమ్ ॥**

**అధీష్వ భో ఇతి బ్రూయాత్ విరామోఽస్త్వితి నారభేత్ ॥ 41 ॥**

ఆచమించి ఉత్తరాభిముఖుడై నియతచిత్తంతో అధ్యయనం చేయించవలెను. గురుపాద ప్రణామం చేసి గురుముఖాన్నే చూస్తూ అధ్యయనం చేయాలి. గురువు చదువుమన్నపుడు అధ్యయన మారంభించాలి. ఇక చాలునన్నపుడు అధ్యయనం ఆపాలి.

**ప్రాక్కూలాన్ పర్యుపాసీనః పవిత్రైశ్చైవ పాలితః ।**
**ప్రాణాయామైస్త్రిభిః పూతః తత ఓఙ్కారమర్హతి ॥ 42 ॥**

**బ్రాహ్మణః ప్రణవం కుర్యాత్ అన్తే చ విధివద్ద్విజః ।**
**కుర్యాదధ్యయనం నిత్యం స బ్రహ్మాఞ్జలిపూర్వతః ॥ 43 ॥**

**సర్వేషామేవ భూతానాం వేదశ్చక్షుస్సనాతనమ్ ।**
**అధీయీతాప్యయం నిత్యం బ్రాహ్మణ్యాచ్చ్యవతేఽన్యథా ॥ 44 ॥**

తూర్పుకొసలు గల దర్భలపై కూర్చుని, రెండు చేతులతో దర్భలను పట్టుకొని, పవిత్రుడై, మూడుసార్లు ప్రాణాయామంచేసి, శుచియైన తర్వాత ప్రణవోచ్చారణకు యోగ్యుడు. ద్విజుడు అధ్యయన ప్రారంభంలో చివర ప్రణవము నుచ్చరించవలెను. బ్రహ్మాంజలిగా చేతులు జోడించి వేదాధ్యయనం చేయాలి. సర్వప్రాణులకు వేదం సనాతన చక్షువు. ఈ వేదాన్ని ప్రతిరోజు అధ్యయనం చేయాలి. అట్లా చేయనివాడు బ్రాహ్మణ్యభ్రష్టుడవుతాడు.

**యోఽధీయీత ఋచో నిత్యం క్షీరాహుత్యా స దేవతాః ।**
**ప్రీణాతి తర్పయంత్యేనం కామైస్తృప్తాస్సదైవ హి ॥ 45 ॥**

నిత్యం ఋగ్వేదాధ్యయనం చేస్తూ, క్షీరంతో దేవతలను తృప్తి పరచువానికి ఆ దేవతలు కోరికలొసగి తృప్తి కలిగిస్తారు.

**యజూంష్యధీతే నియతం దధ్నా ప్రీణాతి దేవతాః ।**
**సామాన్యధీతే ప్రీణాతి ఘృతాహుతిభిరన్వహమ్ ॥ 46 ॥**

యజుర్వేదాధ్యయనం చేస్తూ, పెరుగుతో దేవతలను తృప్తి పరచాలి. సామవేదాధ్యయనంతో నేయినొసగి తృప్తి పరచాలి.

**అథర్వాంగిరసో నిత్యం మధ్వా ప్రీణాతి దేవతాః ।**
**ధర్మాంగాని పురాణాని మాంసైస్సంతర్పయేత్ సురాన్ ॥ 47 ॥**

అథర్వణాధ్యయనంలో తేనెతో తృప్తి పరచాలి. ధర్మశాస్త్రం, వేదాంగాలు, పురాణం అధ్యయనం చేసేప్పుడు మాంసంతో తృప్తి పరచాలి.

**అపాం సమీపే నియతో నైత్యికం విధిమాశ్రితః ।**
**గాయత్రీమప్యధీయీత గత్వాఽరణ్యం సమాహితః ॥ 48 ॥**

**సహస్రపరమాం దేవీం శతమధ్యాం దశావరామ్ ।**
**గాయత్రీం వై జపేన్నిత్యం జపయజ్ఞః ప్రకీర్తితః ॥ 49 ॥**

**గాయత్రీం చైవ వేదాంశ్చ తులయా తోలయత్ప్రభుః ।**
**ఏకతశ్చతురో వేదాన్ గాయత్రీం చ తథైకతః ॥ 50 ॥**

అరణ్యంలో, జలానికి సమీపంలో, నిత్యకర్మవిధిననుసరించి గాయత్రీజపాన్ని చేయాలి. దీన్ని వేయిసార్లు చేయటం ఉత్తమం. నూరు మధ్యమం, పది అధమం. నిత్యమూ గాయత్రీమంత్రాన్ని జపించాలి. దానిని జపయజ్ఞమంటారు. గాయత్రీమంత్రాన్ని, నాల్గువేదాలను త్రాసులో తూచినట్లైతే గాయత్రియే ఎక్కువ బరువు తూగుతుంది.

**ఓఙ్కారమాదితః కృత్వా వ్యాహృతీస్తదనన్తరమ్ ।**
**తతోఽధీయాత సావిత్రీం ఏకాగ్రశ్శ్రద్ధయాన్వితః ॥ 51 ॥**

మొదట ఓంకారాన్ని, తర్వాత వ్యాహృతులను, ఆ తర్వాత సావిత్రీమంత్రాన్ని ఏకాగ్రతతో శ్రద్ధగా జపించాలి.

**పురాకల్పే సముత్పన్నా భూర్భువఃస్వస్సనాతనాః ।**
**మహావ్యాహృతయస్త్రిస్రః సర్వాశుభనిబర్హణాః ॥ 52 ॥**

పూర్వకాలంలో అమంగళాలన్నింటిని నశింపచేసే వ్యాహృతులు భూః భువః సువః అనేవి ఆవిర్భవించినవి.

**ప్రధానం పురుషః కాలో విష్ణుర్బ్రహ్మా మహేశ్వరః ।**
**సత్త్వం రజస్తమస్త్రిస్రః క్రమాద్వ్యాహృతయః స్మృతాః ॥ 53 ॥**

**ఓఙ్కారస్తత్పరం బ్రహ్మ సావిత్రీ స్యాత్తదక్షరమ్ ।**
**ఏష మన్త్రో మహాయోగః సారాత్సార ఉదాహృతః ॥ 54 ॥**

**యోఽధీతేఽహన్యహన్యేతాం గాయత్రీం వేదమాతరమ్ ।**
**విజ్ఞాయార్థం బ్రహ్మచారీ స యాతి పరమాం గతిమ్ ॥ 55 ॥**

ప్రకృతిపురుషకాలాలు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, సత్త్వరజస్తమస్సులు ఈ మూడేసి క్రమముగా భూః, భువః, సువః అను మూడు వ్యాహృతులుగా చెప్పబడినవి. ఓంకారం పరబ్రహ్మస్వరూపం. సావిత్రి నశించని పరతత్త్వం. ఈ మంత్రం మహాయోగం, సకలసారాలకు సారం. ప్రతిదినం వేదమాత గాయత్రిని జపించేవాడు, అర్థాన్ని గ్రహించినవాడు ఉత్తమగతిని పొందుతాడు.

**గాయత్రీ వేదజననీ గాయత్రీ లోకపావనీ ।**
**న గాయత్ర్యాః పరం జప్యం ఏతద్విజ్ఞాయ ముచ్యతే ॥ 56 ॥**

గాయత్రి వేదమాత. లోకపావని. గాయత్రికంటే జపించతగినది వేరొకటి లేదు. ఇది తెలిసినవాడు ముక్తుడవుతాడు.

**శ్రావణస్య తు మాసస్య పౌర్ణమాస్యాం ద్విజోత్తమాః ।**
**ఆషాఢ్యాం ప్రోష్ఠపద్యాం వా వేదోపాకరణం స్మృతమ్ ॥ 57 ॥**

**ఉత్సృజ్య గ్రామనగరం మాసాన్విప్రోఽర్థపఞ్చమాన్ ।**
**అధీయాత శుచౌ దేశే బ్రహ్మచారీ సమాహితః ॥ 58 ॥**

**పుష్యే తు ఛందసాం కుర్యాత్ బహిరుత్సర్జనం ద్విజః ।**
**మాఘశుక్లస్య వా ప్రాప్తే పూర్వాహ్ణే ప్రథమేఽహని ॥ 59 ॥**

**ఛందాంస్యూర్ధ్వమథోఽభ్యస్యేచ్ఛుక్లపక్షేషు వై ద్విజః ।**
**వేదాఙ్గాని పురాణాని కృష్ణపక్షే చ మానవమ్ ॥ 60 ॥**

శ్రావణపూర్ణిమ, ఆషాఢపూర్ణిమ, భాద్రపదపూర్ణిమ కాని ఉపాకర్మ ఆచరించాలి. సంస్కారపూర్వకంగా వేదగ్రహణం చేయాలి. గ్రామాన్ని, నగరాన్ని విడచి బ్రహ్మచారి అయిదున్నర మాసాలు పవిత్రదేశంలో సావధానుడై వేదాధ్యయనం చేయాలి. పుష్యమాసంలో విడువాలి. అట్లే మాఘశుక్ల ప్రతిపత్తినాడు గ్రామం వెలుపల వేదోత్సర్జన కావించాలి. అప్పటినుండి శుక్లపక్షంలో వేదాలను, కృష్ణపక్షంలో వేదాంగాలను, పురాణాలను, స్మృతులను అధ్యయనం చేయాలి.

**ఇమాన్నిత్యమనధ్యాయానధీయానో వివర్జయేత్ ।**
**అధ్యాపనం చ కుర్వాణో హ్యభ్యస్యన్నపి యత్నతః ॥ 61 ॥**

**కర్ణశ్రవేఽనిలే రాత్రౌ దివా పాంసుసమూహనే ।**
**విద్యుత్స్తనితవర్షేషు మహోల్కానాం చ సంప్లవే ॥**

**ఆకాలికమనధ్యాయమేతేష్వాహ ప్రజాపతిః ॥ 62 ॥**
**ఏతానభ్యుదితాన్ విద్యాత్ యదా ప్రాదుష్కృతాగ్నిషు ।**

**తదా విద్యాదనధ్యాయమనృతౌ చాభ్రదర్శనే ॥ 63 ॥**
**నిర్ఘాతే భూమిచలనే జ్యోతిషాం చోపసర్జనే ।**

**ఏతా నాకాలికాన్ విద్యాత్ అనధ్యాయానృతావపి । 64 ॥**
**ప్రాదుష్కృతేష్వగ్నిషు తు విద్యుత్స్తనితనిస్స్వనే ।**

**స జ్యోతిస్స్యాదనధ్యాయః శేషరాత్రౌ యథా దివా ॥ 65 ॥**

వేదాధ్యయనం చేసేవాళ్ళు, వేదాన్ని అధ్యాపనం చేసేవాళ్ళు ఈ అనధ్యాయాలను తప్పక పాటించాలి. రాత్రుల్లో చెవులకు వినిపించే ధ్వనిగల వాయువు వీచేప్పుడు, పగలు దుమ్ముతో వేడిగాలి వీచేప్పుడు, మెరుపులు ఉరుములతో వర్షించేప్పుడు, తోకచుక్కలు మొ॥నవి పడేప్పుడు అకాలిక అనధ్యయనాలుగా గుర్తించాలి. అగ్నులు ప్రజ్వలించినకాలంలో ఈ ఉపద్రవాలు కనిపించినా, అకాలమందు మేఘము కనిపించినా, ఆ కాలము అనధ్యయనమే, పిడుగుపాటు, భూకంపం, సూర్యచంద్రగ్రహణాలు కూడ అకాలిక అనధ్యయనాలే. అగ్నిజ్వాలలు కనపడినా, ఉరుములతోడి మెరుపులు కలిగినా ఆ ప్రకాశము పగటికాలమందు అనధ్యయనమయినట్లుగానే శేషరాత్రికూడా అనధ్యయనంగానే పాటించాలి.

**నిత్యానధ్యాయ ఏవ స్యాత్ గ్రామేషు నగరేషు చ ।**
**ధర్మనైపుణ్యకామానాం పూతిగన్ధే చ నిత్యశః ॥ 66 ॥**

**అంతశ్శవగతే గ్రామే వృషలస్య చ సన్నిధౌ ।**
**అనధ్యాయో రుద్యమానే సమవాయే జనస్య చ ॥ 67 ॥**

**ఉదకే మధ్యరాత్రే చ విణ్మూత్రే చ విసర్జనే ।**
**ఉచ్ఛిష్టః శ్రాద్ధభుక్చైవ మనసాఽపి న చిన్తయేత్ ॥ 68 ॥**

**ప్రతిగృహ్య ద్విజో విద్వానేకోద్దిష్టస్య కేతనమ్ ।**
**త్ర్యహం న కీర్తయేత్ బ్రహ్మ రాజ్ఞో రాహోశ్చ సూతకే ॥ 69 ॥**

**యావదేకోఽనుదిష్టస్య స్నేహో గన్ధశ్చ విద్యతే ।**
**విప్రస్య విదుషో దేహే తావద్ బ్రహ్మ న కీర్తయేత్ ॥ 70 ॥**

ధర్మం, నైపుణ్యం కోరేవారికి గ్రామంలోను, నగరంలోను, దుర్గంధమున్నచోట నిత్యమనధ్యయనమే. గ్రామంలో శవమున్నపుడు, శూద్రసన్నిధిలో, అధార్మికజనుల వద్ద, జనసమూహం దుఃఖించేప్పుడు అనధ్యాయ మవుతుంది. జలం మధ్యలో, అర్ధరాత్రి, మలమూత్ర విసర్జన వేళ, ఉచ్ఛిష్టావస్థలో, శ్రాద్ధభోజనంలో, మనసులోను అధ్యయనం చేయకూడదు. బ్రాహ్మణుడు ఏకోద్దిష్టశ్రాద్ధమందు నిమంత్రితుడయిన పక్షంలోనూ, రాజుకు ఆశౌచము వచ్చినప్పుడు మరియు రాహువుకు గ్రహణము సంభవించినప్పుడు వేదాధ్యయనము మూడు రోజులు చేయరాదు. బ్రాహ్మణుని శరీరంలో ఏకోద్దిష్టశ్రాద్ధసంబంధి నేతివాసన ఉన్నంతవరకు బ్రాహ్మణుడు వేదాలను చదువకూడదు.

**శయానః ప్రౌఢపాదశ్చ కృత్వా చైవావసక్థికామ్ ।**
**నాధీయీతామిషం జగ్ధ్వా సూతకాన్నాద్యమేవ చ ॥71॥**

**నీహారే బాణశబ్దే చ సంధ్యయోరుభయోరపి ।**
**అమావాస్యాం చతుర్దశ్యాం పౌర్ణమాస్యష్టమీషు చ ॥ 72 ॥**

**ఉపాకర్మణి చోత్సర్గే త్రిరాత్రం క్షపణం స్మృతమ్ ।**
**అష్టకాసు త్వహోరాత్రం ఋత్వన్త్యాసు చ రాత్రిషు ॥ 73 ॥**

**మార్గశీర్షే తథా పౌషే మాఘమాసే తథైవ చ ।**
**తిస్రోఽష్టకాస్సమాఖ్యాతాః కృష్ణపక్షే తు సూరిభిః ॥ 74 ॥**

**శ్లేష్మాతకస్య ఛాయాయాం శాల్మికేర్మధుకస్య చ ।**
**కదాచిదపి నాధ్యేయం కోవిదారకపిత్థయోః ॥ 75 ॥**

పడుకొని, ఆసనంపై పాదాలుంచి రెండు మోకాళ్ళను వస్త్రంతో బంధించుకొని, మాంసం భుజించి, సూతకాన్నం తిని వేదాధ్యయనం చేయకూడదు. మంచు కురిసేప్పుడు, బాణశబ్దం విన్పించినపుడు, రెండు సంధ్యల్లోను, చతుర్దశి, పౌర్ణమి, అష్టమి, అమావాస్యల్లో, ఉపాకర్మలో, ఉత్సర్గంలో మూడు రోజులు వేదాధ్యయనం కూడదు. అష్టకాల్లో అహోరాత్రులందు ఋత్వంత రాత్రాల్లో అనధ్యయనమే అవుతుంది. మార్గశిర, పుష్య, మాఘమాసాల్లో, కృష్ణపక్షంలో ఈ మూటిని పండితులు అష్టకాలని పేర్కొన్నారు.(మార్గశిర పుష్యమాఘమాసాల్లోని బహుళ సప్తమి-అష్టమి-నవమి తిథులు అష్టకాలు). బూరుగ, అవిసె, దానిమ్మ, వెలగ, కోవిదారవృక్షాల నీడల్లో వేదాధ్యయనం చేయకూడదు.

**సమానవిద్యే చ మృతే తథా సబ్రహ్మచారిణి ।**
**ఆచార్యే సంస్థితే వాఽపి త్రిరాత్రం క్షపణం స్మృతమ్ ॥ 76 ॥**

**ఛిద్రాణ్యేతాని విప్రాణాం యేఽనధ్యాయాః ప్రకీర్తితాః ।**
**హింసంతి రాక్షసాస్తేషు తస్మాదేతాన్వివర్జయేత్ ॥ 77 ॥**

తనతో కూడా చదివేవాడు సహాధ్యాయి మరణించినపుడు, ఆచార్యుడు సంస్థితుడయినా (మరణించినా) మూడు దినాలు అనధ్యయనాలు. ఇవి బ్రాహ్మణఛిద్రాలని పేర్కొననైనవి. ఈ దినాల్లో రాక్షసులు హింసిస్తారు. అందువల్ల వీటిని వదలవలెను.

**నైత్యికే నాస్త్యనధ్యాయః సన్ధ్యోపాసన ఏవ చ ।**
**ఉపాకర్మణి కర్మాన్తే హోమమన్త్రేషు చైవ హి ॥ 78 ॥**

**ఏకామృచమథైకం వా యజుస్సామాథ వా పునః ।**
**అష్టకాద్యాస్వధీయీత మారుతే చాతివాయతి ॥ 79 ॥**

**అనధ్యాయస్తు నాఙ్గేషు నేతిహాసపురాణయోః ।**
**న ధర్మశాస్త్రేష్వన్యేషు పర్వణ్యేతాని వర్జయేత్ ॥ 80 ॥**

**ఏష ధర్మస్సమాసేన కీర్తితో బ్రహ్మచారిణామ్ ।**
**బ్రహ్మణాఽభిహితః పూర్వం ఋషీణాం భావితాత్మనామ్ ॥ 81 ॥**

నిత్యకర్మవిషయంలో సంధ్యోపాసనలో, ఉపాకర్మలో, కర్మాంత్యంలో, హోమ మంత్రాల్లో అనధ్యాయం ఉండదు. అష్టకాల్లో, సుడిగాలిలో ఒక ఋక్కును ఒక యజుర్మంత్రాన్ని ఒక సామమంత్రాన్ని మాత్రమే అధ్యయనం చేయాలి. వేదాంగాలకు ఇతిహాస పురాణాలకు ధర్మశాస్త్రాలకు అనధ్యాయం ఉండదు. కాని పర్వదినాల్లో వీనిని అధ్యయనం చేయకూడదు. ఈ విధంగా పవిత్రులైన ఋషులకు బ్రహ్మ చెప్పిన బ్రహ్మచారిధర్మాలను సంగ్రహంగా వివరించాను.

**యోఽన్యత్ర కురుతే యత్నం అనధీత్య శ్రుతిం ద్విజాః ।**
**స సమ్మూఢో న సమ్భాష్యో వేదబాహ్యో ద్విజాతిభిః ॥ 82 ॥**

**న వేదపాఠ మాత్రేణ సన్తుష్టో వై భవేద్ద్విజః ।**
**పాఠమాత్రావసన్నస్తు పఙ్కే గౌరివ సీదతి ॥ 83 ॥**

**యోఽధీత్య విధివద్వేదం వేదార్థం న విచారయేత్ ।**
**స సాన్వయశ్శూద్రకల్పః పాత్రతాం న ప్రపద్యతే ॥ 84 ॥**

వేదాధ్యయనం చేయకుండా, శాస్త్రాధ్యయనానికి పూనుకున్నవాడు మూర్ఖుడు. అతడే వేదబాహ్యుడు. ద్విజుడతనితో మాట్లాడకూడదు. వేదపాఠంతో మాత్రమే సంతృప్తి చెందరాదు. పాఠమాత్రంతో విరమించినవాడు

బురదలో దిగబడిన గోవువలె కష్టపడతాడు. విధిప్రకారం వేదాధ్యయనంచేసి వేదార్థపర్యాలోచన చేయనందువల్ల అతని వంశమంతా శూద్రసమానమవుతుంది. అతడు అపాత్రుడవుతాడు.

**యది త్వాత్యన్తికం వాసం కర్తుమిచ్ఛతి వై గురౌ ।**
**యుక్తః పరిచరేదేనమాశరీరవిమోక్షణాత్ ॥ 85 ॥**

**గత్వా వనం వా విధివజ్జుహుయాజ్జాతవేదసమ్ ।**
**అధీయీత సదా నిత్యం బ్రహ్మనిష్ఠస్సమాహితః ॥ 86 ॥**

**సావిత్రీం శతరుద్రీయం వేదాంతాంశ్చ విశేషతః ।**
**అభ్యసేత్ సతతం యుక్తో భస్మస్నానపరాయణః ॥ 87 ॥**

జీవితాంతం గురువు వద్దనే ఉండదలచినట్లైతే శరీరావసానంవరకు శ్రద్ధగా గురుశుశ్రూష చేస్తూ ఉండవలెను. లేదా అరణ్యానికి వెళ్లి యథావిధి అగ్నినుపాసించాలి. స్నానంచేసి, భస్మాన్ని ధరించి, గాయత్రీమంత్రాన్ని, శతరుద్రీయాన్ని, వేదాంతశాస్త్రాలను ఎల్లప్పుడు అభ్యసిస్తుండవలెను.

**ఏతద్విధానం పరమం పురాణం వేదాగమే సమ్యగిహేరితం వః ।**
**పురా మహర్షిప్రవరాభిపృష్టః స్వాయమ్భువో యన్మనురాహ దేవః ॥ 88 ॥**

**ఏవమీశ్వరసమర్పితాన్తరో యోఽనుతిష్ఠతి విధిం విధానవిత్ ।**
**మోహజాలమపహాయ సోఽమృతో యాతి తత్పదమనామయం శివమ్ ॥ 89 ॥**

పూర్వం మహర్షులు కోరగా స్వాయంభువమనువు చెప్పిన వేదజ్ఞానప్రాప్తివిధానం మీకు వివరించాను. దీన్ని తెలుసుకొని ఈశ్వరునియందు మనసు లగ్నంకావించి విధినాచరించినవాడు సంసారమోహాన్ని తొలగించుకొని, అమృతుడై, పరమపదాన్ని పొందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే శిష్య-బ్రహ్మచారిణాం ధర్మనిరూపణమితి చతుర్దశోఽధ్యాయః ॥ 14 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలోని శిష్య-బ్రహ్మచారుల ధర్మనిరూపణమనే పద్నాల్గవ అధ్యాయం ॥ 14 ॥



## పంచదశోఽధ్యాయః - పదిహేనవ అధ్యాయం

## బ్రహ్మచారిణాం గృహస్థానాం చ ధర్మాః - బ్రహ్మచారులు మరియు గృహస్థధర్మాలు

**వ్యాస ఉవాచ :**-వ్యాసమహర్షి పలికాడు

**వేదం వేదౌ తథా వేదాన్ వేదాన్వా చతురో ద్విజాః ।**
**అధీత్య చాధిగమ్యార్థం తతస్స్నాయాద్ద్విజోత్తమః ॥ 1 ॥**

ఒకటి, రెండు, మూడు లేదా నాల్గువేదాలను బ్రాహ్మణుడధ్యయనం గావించి, అర్థాన్ని తెలుసుకొని, స్నాతకుడు కావాలి.

**గురవే తు వరం దత్వా స్నాయీత తదనుజ్ఞయా ।**
**చీర్ణవ్రతోఽథ యుక్తాత్మా సశక్తస్స్నాతుమర్హతి॥ 2 ॥**

గురుదక్షిణనొసగి ఆయన ఆజ్ఞతో సమావర్తనం చేసుకోవాలి. బ్రహ్మచర్యవ్రతం పూర్తిగా అనుష్ఠించి ఆ వ్రతఫలరూపంగా శక్తిసంపన్నుడై స్నాతకుడు కావచ్చును.

**వైష్ణవీం ధారయేద్యష్టిం అన్తర్వాసస్తథోత్తరమ్ ।**
**యజ్ఞోపవీతద్వితయం సోదకఞ్చ కమణ్డలుమ్ ॥ 3 ॥**

**ఛత్రం చోష్ణీషమమలం పాదుకే చాప్యుపానహౌ ।**
**రౌక్మే చ కుణ్డలే వేదం కృత్తకేశనఖశ్శుచిః ॥ 4 ॥**

**స్వాధ్యాయనిత్యయుక్తస్స్యాద్బహిర్మాల్యం న ధారయేత్ ।**
**అన్యత్ర కాఞ్చనాద్విప్రో న రక్తాం బిభృయాత్స్రజమ్ ॥ 5 ॥**

వైష్ణవ(ఉత్తరేణి) దండాన్ని ధరించాలి. "వైణవీం" అను పాఠాంతరము కలదు. వెదురుదండమని అర్థము కౌపీనం, ధోవతి, ఉత్తరీయం, రెండుయజ్ఞోపవీతాలు, జలపూర్ణ కమండలం, ఛత్రం, స్వచ్ఛమైన తలపాగ, పాదుకలు, లేదా పాదరక్షలు, బంగారుకుండలాలు, దర్భముష్టిని ధరించాలి. కేశనఖాలను యథాసమయంగ తీసి వేయించి, పవిత్రుడై, నిత్యస్వాధ్యాయం చేస్తుండాలి. కంఠం పైభాగంలో మాలలు ధరించకూడదు. బంగారుహారం తప్ప ఎర్రని మాలలు ధరించరాదు.

**శుక్లామ్బరధరో నిత్యం సుగంధః ప్రియదర్శనః ।**
**న జీర్ణమలవద్వాసా భవేద్వై విభవే సతి ॥ 6 ॥**

**న రక్తముల్బణం చాన్యధృతం వాసో న కుండికామ్ ।**
**నోపానహౌ స్రజం చాథ పాదుకే చ ప్రయోజయేత్ ॥ 7 ॥**

**ఉపవీతమలఙ్కారం దర్భాన్ కృష్ణాజినాని చ ।**
**నాపసవ్యం పరీదధ్యాత్ వాసో న వికృతం వసేత్ ॥ 8 ॥**

ఎల్లపుడు తెల్లని వస్త్రాన్ని ధరించి, సుగంధాన్ని ధరించి, ప్రియదర్శనుడుగా ఉండాలి. జీర్ణము మలినమైన వస్త్రాలు సంపన్నుడయినప్పుడు ధరించకూడదు. రక్తవస్త్రాలను, చూచేవారికి ఉద్వేగాన్ని కలిగించే వస్త్రాలను, ఇతరులు ధరించి వదలిన వస్త్రాలను, కమండలాన్ని, పాదరక్షలను, పుష్పహారాలను, పాదుకలను ఉపయోగించ కూడదు. ఉపవీతాన్ని, అలంకారాలను, దర్భలను, కృష్ణాజినాన్ని అపసవ్యంగా వేసుకోకూడదు. వస్త్రాన్ని వికృతంగా ధరించరాదు.

**ఆహరేద్విధివద్దారాన్ సదృశానాత్మనశ్శుభాన్ ।**
**రూపలక్షణసంయుక్తాన్ యోనిదోషవివర్జితాన్ ॥ 9 ॥**

**అమాతృగోత్రప్రభవామసమానర్షిగోత్రజామ్ ।**
**ఆహరేద్బ్రహ్మణో భార్యాం శీలశౌచసమన్వితామ్ ॥10॥**

తనకు తగిన కులరూపాలుగల సులక్షణకన్యను జాతిదోషంలేని దాన్ని వివాహమాడాలి. బ్రాహ్మణుడు మాతృగోత్రంలో పుట్టని దానిని, తమ ఋషులగోత్రంలో జన్మించని, శీల, శౌచ, సమన్విత అయిన కన్యను వివాహం చేసుకోవాలి.

**ఋతుకాలాభిగామీ స్యాత్ యావత్పుత్రోఽభిజాయతే ।**
**వర్జయేత్ప్రతిషిద్ధాని ప్రయత్నేన దినాని తు ॥ 11 ॥**

**షష్ఠ్యష్టమీం పఞ్చదశీం ద్వాదశీఞ్చ చతుర్దశీమ్ ।**
**బ్రహ్మచారీ భవేన్నిత్యం తద్వజ్జన్మత్రయాహని ॥ 12 ॥**

పుత్రుడు పుట్టేంతవరకు ఋతుకాలంలో భార్యననుగమించాలి. నిషిద్ధదినాలను వదలాలి. షష్ఠి, అష్టమి, పౌర్ణమి, అమావాస్య, ద్వాదశి, చతుర్దశి, తన జన్మదినంనుండి మూడురోజులు బ్రహ్మచర్యాన్ని పాటించాలి.

**ఆదధీతావసథ్యాగ్నిం జుహుయాజ్జాతవేదసమ్ ।**
**వ్రతాని స్నాతకో నిత్యం పావనాని చ పాలయేత్ ॥13॥**

అవసథ్యం (గార్హస్థ్య అగ్ని) ని ప్రతిదినం హోమం చేయాలి. ప్రతిరోజు పవిత్రాలైన వ్రతాలను ఆచరిస్తుండాలి.

**వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యాదతంద్రితః ।**
**అకుర్వాణః పతత్యాశు నరకానతిభీషణాన్ ॥ 14 ॥**

వేదవిహిత నిత్యకర్మలు స్వకర్మలను సోమరితనాన్ని వదలి ఆచరించాలి. పై కర్మల నాచరించనట్లైతే అతిభయంకరమైన, నరకాలు పొందుతాడు.

**అభ్యసేత్ప్రయతో వేదం మహాయజ్ఞాన్న హాపయేత్ ।**
**కుర్యాద్గృహ్యాణి కర్మాణి సన్ధ్యోపాసనమేవ చ ॥ 15 ॥**

వినయంకలిగి వేదాభ్యాసం చేయవలెను. పంచ మహాయజ్ఞాలు విడువకూడదు. సంధ్యోపాసన, గృహ్యసూత్ర విహితకర్మలు ఆచరిస్తుండాలి.

**సఖ్యం సమాధికైః కుర్యాత్ ఉపేయాదీశ్వరం సదా ।**
**దైవతాన్యపి గచ్ఛేత కుర్యాద్భార్యాభిపోషణమ్ ॥ 16 ॥**

తనతో సమానులైన వారితో తనకన్న అధికులతో స్నేహం చేయాలి. భగవంతునారాధించాలి. దేవతాపూజ భార్యాపోషణ చేయాలి.

**న ధర్మం ఖ్యాపయేద్విద్వాన్ న పాపం గూహయేదపి ।**
**కుర్వీతాత్మహితం నిత్యం సర్వభూతానుకమ్పకః ॥ 17 ॥**

తానాచరించిన ధర్మాన్ని చెప్పకూడదు. తన పాపాన్ని దాచకూడదు. ప్రతిదినం తనకు హితాన్ని కూర్చుకోవాలి. సమస్తప్రాణుల పై దయ చూపుతుండాలి.

**వయసః కర్మణోఽర్థస్య శ్రుతస్యాభిజనస్య చ ।**
**వేషవాగ్బుద్ధిసారూప్యమాచరన్ విచరేత్సదా ॥ 18 ॥**

వయస్సు, కర్మ, సంపద, శాస్త్రం, వంశాలకు తగువిధంగా వేషం, మాట, బుద్ధి అలవరచుకుని ఆచరిస్తుండాలి.

**శ్రుతిస్మృత్యుదితస్సమ్యక్ సాధుభిర్యశ్చ సేవితః ।**
**తమాచారం నిషేవేత నేహేతాన్యత్ర కర్హిచిత్ ॥ 19 ॥**

శ్రుతిస్మృతుల్లో చెప్పినది, సజ్జనులు ఆచరించినదే సదాచారం. దాన్ని తప్ప ఇతరాన్ని అనుసరించరాదు.

**యేనాస్య పితరో యాతాః యేన యాతాః పితామహాః ।**
**తేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్ న రిష్యతి ॥ 20 ॥**

తండ్రులు, తాతలు నడచిన దారిలో తాను నడవాలి. ఇదే సన్మార్గం. ఈ మార్గాన్ననుసరించినవాడు పతితుడు కాజాలడు.

**నిత్యం స్వాధ్యాయశీలస్స్యాత్ నిత్యం యజ్ఞోపవీతవాన్ ।**
**సత్యవాదీ జితక్రోధో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 21 ॥**

ప్రతినిత్యం స్వాధ్యాయపరుడు కావాలి. యజ్ఞోపవీతధారియై ఉండాలి. సత్యవాది, జితక్రోధుడు బ్రహ్మస్వరూపాన్ని పొందుతాడు.

**సన్ధ్యాస్నానపరో నిత్యం బ్రహ్మయజ్ఞపరాయణః ।**
**అనసూయా మృదుర్దాన్తో గృహస్థః ప్రేత్య వర్ధతే ॥ 22 ॥**

ప్రతిరోజు స్నానసంధ్యల నాచరిస్తూ, బ్రహ్మయజ్ఞాలు చేస్తూ అసూయలేక మృదుస్వభావంతో ఇంద్రియ నిగ్రహం కలవాడు ఇహపరాల్లో అభ్యుదయాన్ని పొందుతాడు.

**వీతరాగభయక్రోధో లోభమోహవివర్జితః ।**
**సావిత్రీజాప్యనిరతః శ్రాద్ధకృన్ముచ్యతే గృహీ ॥ 23 ॥**

**మాతాపిత్రోర్హితే యుక్తో గోబ్రాహ్మణహితే రతః ।**
**దాన్తో యజ్వా దేవభక్తో బ్రహ్మలోకే మహీయతే ॥ 24 ॥**

రాగభయక్రోధాలు విడిచినవాడు లోభమోహాలు లేనివాడు సావిత్రీజపాన్ని చేసే శ్రద్ధాళువు అయిన గృహస్థుడు, ముక్తిని పొందుతాడు. తల్లిదండ్రులు గోబ్రాహ్మణుల పట్ల హితం ఆచరించేవాడు, ఇంద్రియనిగ్రహం, యజనశీలం, దైవభక్తి కలవాడు బ్రహ్మలోకంలో నివసిస్తాడు.

**త్రివర్గసేవీ సతతం దేవతానాఞ్చ పూజనమ్ ।**
**కుర్యాదహరహర్నిత్యం నమస్యేత్ప్రయతస్సురాన్ ॥ 25 ॥**

ఎల్లపుడు ధర్మకామార్థాలు సేవిస్తూ, దేవపూజ కానిస్తూ, ప్రతినిత్యం ప్రయత్నంతో దేవతలకు నమస్కరించాలి.

**విభాగశీలస్సతతం క్షమాయుక్తో దయాలుకః ।**
**గృహస్థస్తు సమాఖ్యాతో న గృహేణ గృహీ భవేత్ ॥ 26 ॥**

తన సంపదను శాస్త్రానుసారం విభజిస్తూ ధర్మం, కీర్తి, సంపద, స్వభోగం, తనవారి కొరకు ఇలా అయిదు విధాల విభజించినవాడు. ఓర్పు, దయకల గృహస్థుడు మాత్రమే గృహస్థుడు. గృహం ఉన్నంత మాత్రంతో గృహస్థుడు కాలేడు.

**క్షమా దయా చ విజ్ఞానం సత్యం చైవ దమశ్శమః ।**
**అధ్యాత్మనిరతం జ్ఞానం ఏతద్బ్రాహ్మణలక్షణమ్ ॥ 27 ॥**

క్షమ, దయ, విజ్ఞానం, సత్యం, శమం, దమం, ఆధ్యాత్మికజ్ఞానం ఇవి బ్రాహ్మణలక్షణాలు.

**ఏతస్మాన్న ప్రమాద్యేత విశేషేణ ద్విజోత్తమః ।**
**యథాశక్తి చరన్కర్మ నిన్దితాని వివర్జయేత్ ॥ 28 ॥**

అందువల్ల బ్రాహ్మణుడు వీటిని విడువరాదు. శక్త్యనుసారం కర్మనాచరిస్తూ నింద్యకర్మలు వదలాలి.

**విధూయ మోహకలిలం లబ్ధ్వా యోగమనుత్తమమ్ ।**
**గృహస్థో ముచ్యతే బంధాత్ నాత్ర కార్యా విచారణా ॥ 29 ॥**

మోహాన్ని త్రోసి, ఉత్తమయోగాన్ని పొందిన గృహస్థుడు సంసారబంధాన్ని వదలుతాడు. ఈ విషయంలో సందేహించపని లేదు.

**విగర్వాతిక్రమాక్షేప హింసాబంధవధాత్మనామ్ ।**
**అన్యమన్యుసముత్థానాం దోషాణాం మర్షణం క్షమా ॥ 30 ॥**

ఇతరుల కోపంవల్ల కలిగిన నింద, అనాదరం, ఆక్షేపం, హింస, బంధనం, వధ మొదలైన దోషాలను సహించటమే క్షమ.

**స్వదుఃఖేష్విప కారుణ్యం పరదుఃఖేన సౌహృదాత్ ।**
**దయేతి మునయః ప్రాహుః సాక్షాద్ధర్మస్య సాధనమ్ ॥ 31 ॥**

సౌహృదంతో తమ దుఃఖంవలెనే పరుల దుఃఖంలో కరుణగల్గి ఉండటమే దయ అని మునులన్నారు. ఇది సాక్షాద్ధర్మ సాధనం.

**చతుర్దశానాం విద్యానాం ధారణం హి యథార్థతః ।**
**విజ్ఞానమితి తద్విద్యాత్ యేన ధర్మో వివర్ధతే ॥ 32 ॥**

నిజానికి చతుర్దశ విద్యలు ధరించటం విజ్ఞానం. ఈ విజ్ఞానంతో ధర్మం వృద్ధి చెందుతుంది.

**అధీత్య విధివత్ విద్యామర్థం చైవోపలభ్య తు ।**
**ధర్మకార్యాన్నివృత్తశ్చేత్ న తద్విజ్ఞానమిష్యతే ॥ 33 ॥**

యథావిధి అధ్యయనంచేసి, ధనాన్ని పొంది, ధర్మకార్యాలాచరించక పోతే అది విజ్ఞానం అనిపించుకోదు.

**సత్యేన లోకాన్ జయతి సత్యం తత్పరమం పదమ్ ।**
**యథాభూతప్రవాదస్తు సత్యమాహుర్మనీషిణః ॥ 34 ॥**

సత్యంతో అన్ని లోకాలు జయించవచ్చు. సత్యమే పరమపదం. ఉన్నదున్నట్టు చెప్పటమే సత్యమని పండితులు చెబుతారు.

**దమశ్శరీరోపరమః శమః ప్రజ్ఞాప్రసాదజః ।**
**అధ్యాత్మమక్షరం విద్యాత్ యత్ర గత్వా న శోచతి ॥ 35 ॥**

శారీరకక్రియానియంత్రణం, దమ మని, ప్రకృష్టజ్ఞానవికాసం శమమని, ఆత్మజ్ఞానం అక్షరమని గ్రహించాలి. ఈ జ్ఞానం పొందినవాడు శోకించడు.

**యయా స దేవో భగవాన్ విద్యయా వేద్యతే పరః ।**
**సాక్షాద్దేవో మహాదేవస్తద్ జ్ఞానమితి కీర్తితమ్ ॥ 36 ॥**

ఆ మహాదేవుని పొందించే విద్యయే జ్ఞానం. దానిద్వారా భగవత్తత్త్వం తెలుస్తుంది.

**తన్నిష్ఠస్తత్పరో విద్వాన్ నిత్యమక్రోధనశ్శుచిః ।**
**మహాయజ్ఞపరో విప్రో లభతే తదనుత్తమమ్ ॥ 37 ॥**

ఆ జ్ఞాననిష్ఠ కలవాడు అంటే తత్పరుడై ఉండేవాడు విద్వాంసుడవుతాడు. ఇతడు సర్వకాలాలలో కోపం లేక, శుచియై, పంచ మహాయజ్ఞాలు చేస్తూ ఆ ఉత్తమపదాన్ని చేరుకుంటాడు.

**ధర్మస్యాయతనం యత్నాత్ శరీరం పరిపాలయేత్ ।**
**న హి దేహం వినా రుద్రః పురుషైర్విద్యతే పరః ॥ 38 ॥**

ధర్మానికాధారమైన ఈ శరీరాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి. దేహం లేకపోతే పరమాత్మ కూడ తెలియబడదు.

**నిత్యం ధర్మార్థకామేషు యుజ్యేత నియతో ద్విజః ।**
**న ధర్మవర్జితం కామం అర్థం వా మనసా స్మరేత్ ॥ 39 ॥**

ద్విజుడు మనోనిగ్రహంకలిగి ధర్మార్థకామాల విషయంలో ప్రవర్తించాలి. ధర్మంలేని కామార్థాలను మనసులోనైనా స్మరింపకూడదు.

**సీదన్నపి హి ధర్మేణ న త్వధర్మం సమాచరేత్ ।**
**ధర్మో హి భగవాన్ దేవో గతిస్సర్వేషు జన్తుషు ॥ 40 ॥**

ధర్మాచరణలో కష్టాలు కలిగినా అధర్మం ఆచరించకూడదు. ధర్మమే భగవంతుడు, సర్వప్రాణులకు ధర్మమే గతి.

**భూతానాం ప్రియకారీ స్యాత్ న పరద్రోహకర్మధీః ।**
**న వేదదేవతానిన్దాం కుర్యాత్తైశ్చ న సంవసేత్ ॥ 41 ॥**

ధర్మమే ప్రాణులకు ప్రియాన్ని కలిగిస్తుంది. అందువల్ల మానవుడు ప్రాణులకు ప్రియాన్ని ఆచరించాలేకాని పరులకు ద్రోహం కలిగించే పని చేయకూడదు. వేదదేవనింద మంచిది కాదు. అట్లా చేసేవారితో కలిసి ఉండకూడదు.

**యస్త్విమం నియతం విప్రో ధర్మాధ్యాయం పఠేచ్ఛుచిః ।**
**అధ్యాపయేచ్ఛ్రావయేద్వా బ్రహ్మలోకే మహీయతే ॥ 42 ॥**

ఈ విధంగా శాస్త్రవిధిని బోధించే ఈ అధ్యాయాన్ని శ్రద్ధగా చదివినవాడు, చదివించినవాడు, వినిపించినవాడు బ్రహ్మలోకంలో నివసిస్తాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే బ్రహ్మచారిణాం గృహస్థానాం చ ధర్మాః ఇతి పఞ్చదశోఽధ్యాయః ॥ 15 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో బ్రహ్మచారుల మరియు గృహస్థధర్మాలనే పదిహేనవ అధ్యాయం ॥ 15 ॥



## **షోడశోऽధ్యాయః** - పదహారవ అధ్యాయం

## **గార్హస్థ్యధర్మ నిరూపణమ్** - గార్హస్థ్యధర్మ నిరూపణం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు

**న హింస్యాత్సర్వభూతాని నానృతం వా వదేత్క్వచిత్ ।**
**నాహితం నాప్రియం వాక్యం న స్తేనస్స్యాత్ కదాచన ॥ 1 ॥**

ప్రాణులను హింసించరాదు. ఎక్కడా ఎప్పుడు అబద్ధం చెప్పకూడదు. అహితం అప్రియమైన మాటలు పలుకరాదు. దొంగ కాకూడదు.

**తృణం వా యది వా శాకం మృదం వా జలమేవ వా ।**
**పరస్యాపహరఞ్జన్తుర్నరకం ప్రతిపద్యతే ॥ 2 ॥**

ఇతరుల వస్తువు తృణం, శాకం, మట్టి, నీరుగాని అపహరించినట్లైతే నరకాన్ని పొందుతాడు.

**న రాజ్ఞః ప్రతిగృహ్ణీయాత్ న శూద్రపతితాదపి ।**
**న చాన్యస్మాదశక్తశ్చ నిన్దితాన్ వర్జయేద్బుధః ॥ 3 ॥**

రాజు శూద్రుడు పతితుల నుండి దానం తీసుకోకూడదు. శక్తి లేకున్నా ఇతరుని యాచించరాదు. జ్ఞాని నింద్యాలను వదలిపెట్టాలి.

**నిత్యం యాచనకో న స్యాత్ పునస్తం నైవ యాచయేత్ ।**
**ప్రాణానపహరత్యేవం యాచకస్తస్య దుర్మతిః ॥ 4 ॥**

ప్రతినిత్యం ఒకే వ్యక్తిని యాచించరాదు. దుర్మతియగు ఆ యాచించేవాడు దాతప్రాణాలనే హరించిన వాడవుతాడు.

**న దేవద్రవ్యహారీ స్యాత్ విశేషేణ ద్విజోత్తమః ।**
**బ్రహ్మస్వం వా నాపహరేదాపద్యపి కదాచన ॥ 5 ॥**

దేవద్రవ్యాలను విశేషించి బ్రాహ్మణుడు హరించరాదు. ఎంతటి కష్టం వచ్చినా బ్రాహ్మణధనం అపహరించ కూడదు.

**న విషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముచ్యతే ।**
**దేవస్వం చాపి యత్నేన సదా పరిహరేత్తతః ॥ 6 ॥**

విషం నిజానికి విషం కాదు, బ్రహ్మస్వమే విషం. దేవతాద్రవ్యాన్ని ప్రయత్నంతో ఎల్లప్పుడు పరిహరించాలి.

**పుష్పే శాకోదకే కాష్ఠే తథా మూలే ఫలే తృణే ।**
**అదత్తాదానమస్తేయం మనుః ప్రాహ ప్రజాపతిః ॥ 7 ॥**

పుష్పం, శాకం, ఉదకం, కాష్ఠం, మూలం, ఫలం, తృణం ఎదుటి వాడీయకుండా తీసుకున్నా స్తేయం కాదని మనువు చెప్పినాడు.

**గ్రహీతవ్యాని పుష్పాణి దేవార్చనవిధౌ ద్విజాః ।**
**నైకస్మాదేవ నియతమననుజ్ఞాయ కేవలమ్ ॥ 8 ॥**

బ్రాహ్మణుడు దేవతార్చనకు ఇతరుల పుష్పాలు తీసుకోవచ్చును. కాని ప్రతిదినం ఒకే చోట అనుమతి లేకుండా తీసుకోరాదు.

**తృణం కాష్ఠం ఫలం పుష్పం ప్రకాశం వై హరేద్బుధః ।**
**ధర్మార్థం కేవలం విప్రా హ్యన్యథా పతితో భవేత్ ॥ 9 ॥**

విప్రులు ధర్మకార్యం కోసం తృణకాష్ఠ పుష్పఫలాలను ఇతరులవి స్వీకరించవచ్చు. అదీ అందరికి తెలిసేట్టుగానే కాని యజమానికి తెలియకుండా స్వీకరిస్తే పతితుడవుతాడు.

**తిలముద్గయవాదీనాం ముష్టిర్గ్రాహ్యా పథి స్థితైః ।**
**క్షుధార్తైర్నాన్యథా విప్రా ధర్మవిద్భిరితి స్థితిః ॥ 10 ॥**

దారిలో ఆకలిగొన్నవాడు తిలలు, ముద్గలు, యవలు ఒక పిడికెడు మాత్రం తీసుకోవచ్చు. క్షుధార్తుడు కానట్లైతే తీసుకోరాదు.

**న ధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్ ।**
**వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్ స్త్రీశూద్రదంభనమ్ ॥ 11 ॥**

**ప్రేత్యేహ చేదృశో విప్రో గర్హ్యతే బ్రహ్మవాదిభిః ।**
**ఛద్మనా చరితం యచ్చ వ్రతం రక్షాంసి గచ్ఛతి ॥ 12 ॥**

ధర్మమనే పేరుతో పాపంచేసి, వ్రతాన్ని అనుష్ఠింపరాదు. వ్రతం పేరుతో పాపాన్ని కప్పిపుచ్చి, స్త్రీ శూద్రులను మోసగించిన వానిని ఇహపరాల్లో బ్రహ్మజ్ఞులు నిందిస్తారు. కపటంతో చేసే వ్రతం రాక్షసులకు చెందుతుంది.

**అలింగీ లింగవేషేణ యో వృత్తిముపజీవతి ।**
**స లిఙ్గినాం హరేదేనస్తిర్యగ్యోనౌ చ జాయతే ॥ 13 ॥**

అధికారి కానివాడు బ్రతుకు తెరువుకోసం బ్రాహ్మణచిహ్నాలైన యజ్ఞోపవీతాదులు ధరిస్తే ఆ చిహ్నాలకు యోగ్యులైన వారి పాపాన్ని తాను మోస్తాడు. అంతేకాక పశుజాతిలో పుడతాడు.

**బైడాల వ్రతినః పాపా లోకే ధర్మవినాశకాః ।**
**సద్యః పతన్తి పాపేన కర్మణస్తస్య తత్ఫలమ్ ॥ 14 ॥**

లోకంలో పరవంచనకు ధర్మవ్రతునిగా నటించేవారు బిడాల(పిల్లి) వ్రతులు. వీరు పాపులు, ధర్మనాశకులు కూడా. వీరు వెంటనే ఆ కర్మఫలం పొందుతారు.

**పాఖణ్డినో వికర్మస్థాన్ వామాచారాంస్తథైవ చ ।**
**పాఞ్చరాత్రాన్ పాశుపతాన్ వాఙ్మాత్రేణాపి నార్చయేత్ ॥ 15 ॥**

వేదదూషకులను, అధర్మాచారులను, వామాచారపరులను, పాంచరాత్రులను, పాశుపతులను, మాట మాత్రంగానైనా గౌరవించకూడదు.

**వేదనిన్దారతాన్మర్త్యాన్ దేవనిన్దారతాంస్తథా ।**
**ద్విజనిన్దారతాంశ్చైవ మనసాఽపి న చిన్తయేత్ ॥ 16 ॥**

వేదాలను, దైవాన్ని, ద్విజులను నిందించేవారిని మనసులోను తలచుకోకూడదు.

**యాజనం యోనిసమ్బన్ధం సహవాసం చ భాషణమ్ ।**
**కుర్వాణః పతతే జన్తుః తస్మాద్యత్నేన వర్జయేత్ ॥ 17 ॥**

వారితో యజ్ఞం చేయించటం, వివాహసంబంధం కుదుర్చుకోవటం, కలిసి నివసించటం, మాట్లాడటం చేసేవారు పతితులవుతారు. అందువల్ల వీరిని వదలిపెట్టాలి.

**దేవద్రోహాద్గురుద్రోహః కోటికోటిగుణాధికః ।**
**జ్ఞానాపవాదో నాస్తిక్యం తస్మాత్కోటిగుణాధికమ్ ॥ 18 ॥**

దైవద్రోహంకంటె గురుద్రోహం, గురుద్రోహంకంటె వేదనింద, నాస్తిక్యం కోటి కోటిరెట్ల పాపాన్నిస్తుంది.

**గోభిశ్చ దైవతైర్విప్రైః కృష్యా రాజోపసేవయా ।**
**కులాన్యకులతాం యాన్తి యాని హీనాని ధర్మతః ॥ 19 ॥**

గోవులు, దేవతలు, బ్రాహ్మణులు, రైతులు, రాజసేవ చేసే వారితో జీవించేవారి కులాలు దోష పూర్ణాలవుతాయి. ధర్మశాస్త్రంలో వారిని హీనులుగా పరిగణించినారు.

**కువివాహైః క్రియాలోపైః వేదానధ్యయనేన చ ।**
**కులాన్యకులతాం యాన్తి బ్రాహ్మణాతిక్రమేణ చ ॥ 20 ॥**

దుష్టవివాహంతో, క్రియాలోపంతో, వేదాధ్యయనం చేయక పోవటంతో, బ్రాహ్మణులను అవమానించటంతో వారి కులాలు హీన కులాలవుతాయి.

**అనృతాత్పారదార్యాచ్చ తథాఽభక్ష్యస్య భక్షణాత్ ।**
**అశ్రౌతధర్మాచరణాత్ క్షిప్రం నశ్యతి వై కులమ్ ॥ 21 ॥**

అసత్యంవల్ల, పరదారగమనంవల్ల, అభక్ష్యభక్షణంవల్ల, వేదవిరుద్ధధర్మాచరణంవల్ల, వెంటనే కులం నశిస్తుంది.

**అశ్రోత్రియేషు వై దానాత్ వృషలేషు తథైవ చ ।**
**విహితాచారహీనేషు క్షిప్రం నశ్యతి వై కులమ్ ॥ 22 ॥**

శ్రోత్రియులు కానివారికి, శూద్రులకు, వేదవిహిత ఆచార హీనులకు దానంచేసినా కులం నశిస్తుంది.

**నాధార్మికైర్వృతే గ్రామే న వ్యాధిబహులే భృశమ్ ।**
**న శూద్రరాజ్యే నివసేత్ న పాషణ్డజనైర్వృతే ॥ 23 ॥**

అధార్మికులున్న గ్రామంలో, వ్యాధులు ప్రబలిన గ్రామంలో, శూద్రరాజ్యంలో, వేద బాహ్యులుండే గ్రామంలో నివసించరాదు.

**హిమవద్విన్ధ్యయోర్మధ్యే పూర్వపశ్చిమయోశ్శుభమ్ ।**
**ముక్త్వా సముద్రయోర్దేశం నాన్యత్ర నివసేద్ద్విజః ॥ 24 ॥**

హిమాలయ, వింధ్య పర్వతాలమధ్య, తూర్పు, పడమర సముద్రాంతరంలో తప్ప మరోచోట విప్రుడు నివసించరాదు.

**కృష్ణో వా యత్ర చరతి మృగో నిత్యం స్వభావతః ।**
**పుణ్యాశ్చ విస్రుతా నద్యస్తత్ర వా నివసేద్ద్విజః ॥ 25 ॥**

కృష్ణసారమృగం సహజంగా సంచరించే చోట, పుణ్యనదులు ప్రవహించే చోట ద్విజుడు నివసించవలెను.

**అర్థక్రోశాన్నదీకూలం వర్జయిత్వా ద్విజోత్తమః ।**
**నాన్యత్ర నివసేత్పుణ్యం నాన్త్యజగ్రామసన్నిధౌ ॥ 26 ॥**

నదీతీరం నుండి మైలుదూరం వదలి మరో ప్రదేశంలో బ్రాహ్మణుడు నివసించకూడదు. అంత్యజుల గ్రామ సమీపంలో నివసించకూడదు.

**న సంవసేచ్చ పతితైర్న చణ్డాలైర్న పుల్కసైః ।**
**న మూర్ఖైర్నావలిప్తైశ్చ నాన్త్యైర్నాన్త్యావసాయిభిః ॥ 27 ॥**

పతితులు, చండాలురు, పుల్కసులు, మూర్ఖులు, దురభిమానులు అంత్యులతోనూ, వారితో స్నేహం చేసేవారితో కలిసి నివసించరాదు.

**ఏకశయ్యాసనం పఙ్క్తిః భాణ్డపక్వాన్నమిశ్రణమ్ ।**
**యాజనాధ్యాపనే యోనిః తథైవ సహభోజనమ్ ॥ 28 ॥**

ఒకే ఆసనం, శయ్య, పంక్తి భోజనం కూడదు. ఒకే పాత్రలో వండిన అన్నం భుజించరాదు. వారితో యజ్ఞం చేయించరాదు. అధ్యాపనం, వివాహసంబంధ సహభోజనం కూడనిది.

**సహాధ్యాయస్తు దశమః సహయాజనమేవ చ ।**
**ఏకాదశ సముద్దిష్టాః దోషాస్సాఙ్కర్యసంజ్ఞితాః ॥ 29 ॥**

**సమీపే వా వ్యవస్థానాత్ పాపం సంక్రమతే నృణామ్ ।**
**తస్మాత్సర్వప్రయత్నేన సాఙ్కర్యం పరివర్జయేత్ ॥ 30 ॥**

కలిసి చదువులు, యజ్ఞం చేయటం ఈ పదకొండు సాంకర్య దోషాలు. ఈ దోషాలు చేసేవారి సమీపంలో ఉన్నా పాపం సంక్రమిస్తుంది. అన్ని విధాల సాంకర్యాన్ని వదలిపెట్టాలి.

**ఏకపఙ్క్త్యుపవిష్టా యే న స్పృశన్తి పరస్పరమ్ ।**
**భస్మనా కృతమర్యాదా న తేషాం సఙ్కరో భవేత్ ॥ 31 ॥**

ఒకే పంక్తిలో కూర్చున్నా ఒకరితోనొకరు తాకనట్టైతే మధ్యలో భస్మరేఖతో హద్దు ఏర్పరచినా వారికి సాంకర్య దోషం లేదు.

**అగ్నినా భస్మనా చైవ సలిలేనావసేకతః ।**
**ద్వారేణ స్తంభమార్గేణ షడ్భిః పఙ్క్తిర్విభిద్యతే ॥ 32 ॥**

అగ్ని, భస్మం, నీరు, ద్వారం, స్తంభం, మార్గం, మధ్యలో వ్యవధానమున్నా పంక్తి భేదం కిందే లెక్క.

**న కుర్యాచ్ఛుష్కవైరాణి వివాదం న చ పైశునమ్ ।**
**పరక్షేత్రే గాం ధయన్తీం న చాచక్షీత కస్యచిత్ ॥**

**న సంవదేత్ సూతకే చ న కఞ్చిన్మర్మణి స్పృశేత్ ॥ 33 ॥**

శుష్కవైరం కూడదు. అకారణంగా వాదం పెంచుకోరాదు. లోభిత్వం చూపకూడదు. ఇతరుల క్షేత్రంలో మేస్తున్న ఆవును గూర్చి ఇతరులకు చెప్పకూడదు. సూతకమున్న వారితో మాట్లాడకూడదు. ఎదుటి వాని రహస్యాన్ని బయటపెట్టి వాని మనసుకు పరితాపం కలిగించరాదు.

**న సూర్యపరివేషం వా నేన్ద్రచాపం శవాగ్నికమ్ ।**
**పరస్మై కథయేద్విద్వాన్ శశినం వా కదాచన ॥ 34 ॥**

సూర్యపరివేషాన్ని, ఇంద్రధనస్సును, చితిని, చంద్రబింబాన్ని గూర్చి ఇతరులకు చెప్పకూడదు.

**న కుర్యాద్బహుభిస్సార్ధం విరోధం బంధుభిస్తథా ।**
**ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్ ॥ 35 ॥**

చాలమందితో, బంధువులతో, విరోధం పెట్టుకోరాదు. తనకు ప్రతికూలమైన వాటిని ఇతరులకు ఆచరించకూడదు.

**తిథిం పక్షస్య న బ్రూయాత్ న నక్షత్రాణి నిర్దిశేత్ ।**
**నోదక్యామభిభాషేత నా శుచిం వా ద్విజోత్తమః ॥ 36 ॥**

బ్రాహ్మణశ్రేష్ఠుడు పక్షంలోని తిథిని చెప్పరాదు. నక్షత్రాలను చూపరాదు. రజస్వలయైన స్త్రీతో మాట్లాడరాదు. అపవిత్రునితో మాట్లాడకూడదు.

**న దేవగురువిప్రాణాం దీయమానన్తు వారయేత్ ।**
**న చాత్మానం ప్రశంసేద్వా పరనిందాఇ్చ వర్జయేత్ ॥**
**వేదనిన్దాం దేవనిన్దాం ప్రయత్నేన వివర్జయేత్ ॥ 37 ॥**

దేవగురు విప్రులకు చేసే దానాన్ని నివారించకూడదు. ఆత్మప్రశంస, పరనింద పనికిరాదు. వేదదేవనిందను ప్రయత్నపూర్వకంగా వదలాలి.

**యస్తు దేవానృషీన్ విప్రాన్ వేదాన్వా నిందతి ద్విజః ।**
**న తస్య నిష్కృతిర్దృష్టా శాస్త్రేష్విహ మునీశ్వరాః ॥ 38 ॥**

ఓ మునీశ్వరులారా! దేవ, ఋషి, బ్రాహ్మణ, వేదనిందకులకు శాస్త్రాల్లో నిష్కృతి చూపలేదు.

**నిన్దయేద్వై గురున్దేవం వేదం వా నోపబృంహణమ్ ।**
**కల్పకోటిశతం సాగ్రం రౌరవే పచ్యతే నరః ॥ 39 ॥**

గురు, దైవ, వేద, ఇతిహాస, పురాణాలను నిందించేవాడు నూరుకోట్ల కల్పాల కాలం, రౌరవనరకాన్ని అనుభవిస్తాడు.

**తూష్ణీమాసీత నిన్దాయాం న బ్రూయాత్కించిదుత్తరమ్ ।**
**కర్ణౌ పిధాయ గన్తవ్యం న చైతానవలోకయేత్ ॥ 40 ॥**

వేదాదినింద జరిగేప్పుడు మౌనం పాటించాలి. ఏ విధమైన ప్రత్యుత్తరం చెప్పరాదు. లేదా చెవులు మూసికొని వెళ్ళిపోవాలి; ఆ నిందకులను చూడకూడదు.

**వర్జయేద్వై రహస్యాని పరేషాం గూహయేద్బుధః ।**
**వివాదం స్వజనైస్సార్ధం న కుర్యాద్వై కదాచన ॥ 41 ॥**

జ్ఞాని ఇతరుల రహస్యాలను తెలుసుకోవటానికి ప్రయత్నించకూడదు. తెలిసినా దాచవలెను. తనవారితో ఎపుడును తగవుపెట్టుకోరాదు.

**న పాపం పాపినాం బ్రూయాత్ అపాపం వా ద్విజోత్తమాః ।**
**స తేన తుల్యదోషస్స్యాన్మిథ్యా ద్విర్దోషవాన్భవేత్ ॥ 42 ॥**

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! పాపులు చేసిన పాపాన్ని చెప్పకూడదు. అపాపికి పాపాన్ని అంటగట్టరాదు. ఎదుటి వారి పాపాన్ని చెప్పినవానికి వానితో సమానమైన దోషం సంక్రమిస్తుంది. లేని పాపాన్ని ఆరోపిస్తే రెండు రెట్ల దోషం కలుగుతుంది.

**యాని మిథ్యాభిశస్తానాం పతన్త్యశ్రూణి రోదనాత్ ।**
**తాని పుత్రాన్ పశూన్ ఘ్నన్తి తేషాం మిథ్యాభిశంసినామ్ ॥ 43 ॥**

అసత్య పాపారోపణ చేయటంవల్ల, ఆ వ్యక్తి రోదించినందువల్ల కనీళ్ళు నేలపై పడితే ఆరోపించిన వారి పుత్రులు, పశువులు, ధనం నశిస్తాయి.

**బ్రహ్మహత్యాసురాపానే స్తేయగుర్వఙ్గనాగమే ।**
**దృష్టం విశోధనం వృద్ధైః నాస్తి మిథ్యాభిశంసనే ॥ 44 ॥**

బ్రహ్మహత్య, సురాపానం, దొంగతనం, గురుపత్నీసంగమం మొదలైన మహాపాపాలకు ప్రాయశ్చిత్తం ఉంది కాని, మిథ్యాదోషారోపణ చేసినవానికి ప్రాయశ్చిత్తం లేదు.

**నేక్షేతోద్యంతమాదిత్యం శశినం చానిమిత్తతః ।**
**నాస్తం యాన్తం న వారిస్థం నోపసృష్టం న మధ్యగమ్ ॥**
**తిరోహితం వాససా వా నాదర్శాన్తరగామినమ్ ॥ 45 ॥**

ఏ ప్రయోజనం లేకుండా ఉదయించే సూర్యచంద్రులను, అట్లే అస్తమించే సూర్యచంద్రులను, జలంలోని ప్రతిబింబాన్ని, గ్రహణం పట్టిన వారిని, ఆకాశమధ్యనున్న వారిని, వస్త్రం కప్పిగాని, అద్దంలో ప్రతిబింబాల్ని గాని చూడకూడదు.

**న నగ్నాం స్త్రియమీక్షేత పురుషం వా కదాచన ।**
**న చ మూత్రం పురీషం వా న చ సంస్పృష్టమైథునమ్ ।**
**నాశుచిస్సూర్యసోమాదీన్ గ్రహానాలోకయేద్బుధః ॥ 46 ॥**

నగ్నంగా ఉన్న స్త్రీనికాని, పురుషునికాని చూడకూడదు. మలమూత్రములను, మైథునము నాచరించువానిని చూడరాదు. బుద్ధిమంతుడు అపవిత్రుడుగా ఉన్నప్పుడు సూర్యచంద్రాదులగు గ్రహాలను చూడకూడదు.

**పతితవ్యంగచణ్డాలానుచ్ఛిష్టాన్నావలోకయేత్ ।**
**నాభిభాషేత చ పరం ఉచ్ఛిష్టో వావగుణ్ఠితః ॥ 47 ॥**

పతితులు, అంగహీనులు, చండాలురు, ఉచ్ఛిష్టులను చూడకూడదు. ఉచ్ఛిష్టుడు ముఖాన్ని వస్త్రం కప్పుకొని కూడ ఇతరులతో మాట్లాడరాదు.

**న పశ్యేత్ప్రేతసంస్పర్శం న క్రుద్ధస్య గురోర్ముఖమ్ ।**
**న తైలోదకయోశ్ఛాయాం న పత్నీం భోజనే సతి ॥ 48 ॥**

**నాముక్తబంధనాంగాం వా నోన్మత్తం మత్తమేవ వా ।**
**నాశ్నీయాద్భార్యయా సార్ధం నైనామీక్షేత చాశ్నతీమ్ ॥ 49 ॥**

**క్షువన్తీం జృంభమాణాం వా నాసనస్థాం యథా సుఖమ్ ।**
**నోదకే చాత్మనో రూపం న కూలం శ్వభ్రమేవ వా ।**
**న లఙ్ఘయేచ్చ మూత్రంవా నాభితిష్ఠేత్కదాచన ॥ 50 ॥**

శవాన్ని తాకినవానిని, కోపంతో ఉన్న గురుముఖాన్ని, నూనెలో నీటిలో ప్రతిబింబించే నీడను, భోంచేస్తున్న భార్యను, బయలు పడిన అవయవాలుగల స్త్రీని, ఉన్మత్తుని, మత్తుని, చూడకూడదు. భార్యతోబాటుగా భోజనము చేయకూడదు, భుజిస్తున్న భార్యను చూడగూడదు. తుమ్మునపుడు, ఆవలించునపుడు, సుఖాసనంపై ఉన్నపుడు భార్యను చూడకూడదు.నీటిలో తన రూపాన్ని చూడకూడదు. నదీతీరాన్ని లోతైన గుంటను దాటకూడదు. మూత్రం పై కూర్చొనుట తగదు.

**న శూద్రాయ మతిం దద్యాత్ కృశరం పాయసం దధి ।**
**నోచ్ఛిష్టం వా మధు ఘృతం న చ కృష్ణాజినం హవిః ॥ 51 ॥**

శూద్రునికి లౌకికవిషయంలో ఉపదేశం చేయరాదు. నువ్వుల అన్నం, పాయసం, పెరుగు ఉచ్ఛిష్టం, తేనే, నేయి, కృష్ణాజినం, హవిస్సులను ఈయకూడదు.

**న చైవాస్మై వ్రతం దద్యాత్ న చ ధర్మం వదేద్బుధః ।**
**న చ క్రోధవశం గచ్ఛేత్ ద్వేషం రాగం చ వర్జయేత్ ॥ 52 ॥**

వ్రతం ఈయరాదు. ధర్మాన్ని చెప్పకూడదు. అతని విషయంలో కోపం తగదు. ద్వేషం, స్నేహం వదలాలి.

**లోభం దంభం తథా యత్నాదసూయాం జ్ఞానకుత్సనమ్ ।**
**ఈర్ష్యాం మదం తథా శోకం మోహం చ పరివర్జయేత్ ॥ 53 ॥**

లోభం, దంభం, అసూయ, జ్ఞాననింద, ఈర్ష్య, మద, శోకమోహాలు విడనాడాలి.

**న కుర్యాత్కస్యచిత్పీడాం సుతం శిష్యం చ తాడయేత్ ।**
**న హీనానుపసేవేత న చ తీక్ష్ణమతీన్క్వచిత్ ॥ 54 ॥**

ఎవరినీ పీడించరాదు. పుత్రుని, శిష్యుని కొట్టవచ్చు, హీనులను, తీక్ష్ణబుద్ధులను సేవించటం తగదు.

**నాత్మానం చావమన్యేత దైన్యం యత్నేన వర్జయేత్ ।**
**న విశిష్టానసత్కుర్యాత్ నాత్మానం వా శపేద్బుధః ॥ 55 ॥**

విజ్ఞుడు తన్నుతాను అవమానించుకోకూడదు. ప్రయత్నంతో దైన్యాన్ని విడనాడాలి. విశిష్టవ్యక్తులను అగౌరవ పరచరాదు. తనను తాను నిందించుకోరాదు.

**న నఖైర్విలిఖేద్భూమిం గాం చ సంవేశయేన్న హి ।**
**న నదీషు నదీం బ్రూయాత్ పర్వతేషు చ పర్వతాన్ ॥ 56 ॥**

భూమిపై గోళ్ళతో వ్రాయరాదు. గోవును గోళ్ళతో గీరకూడదు. ఒక నది దగ్గర మరో నదిని, ఒక పర్వతంవద్ద మరో పర్వతాన్ని గూర్చి మాట్లాడకూడదు.

**ఆవాసే భోజనే వాఽపి న త్యజేత్ సహయాయినమ్ ।**
**నావగాహేదపో నగ్నో వహ్నిం నాతివ్రజేత్పదా ॥ 57 ॥**

నివాసంలోనూ, భోజనంలోనూ, తనతో కలిసి వచ్చే వానిని విడువరాదు. నగ్నంగా నీటిలో మునగరాదు. అగ్నిని కాలితో దాటరాదు.

**శిరోఽభ్యంగావశిష్టేన తైలేనాంగం న లేపయేత్ ।**
**న సర్పశస్త్రైః క్రీడేత స్వాని ఖాని న సంస్పృశేత్ ॥ 58 ॥**

తలంటుకోగా మిగిలిన నూనెతో శరీరంపై రాసుకోకూడదు. సర్పాలతో, శస్త్రాలతో ఆడరాదు. తన అవయవాలను ఏ కారణం లేకుండా తాకకూడదు.

**రోమాణి చ రహస్యాని నాశిష్టేన సహ వ్రజేత్ ।**
**న పాణిపాదవాఙ్నేత్రచాపల్యం సముపాశ్రయేత్ ।**
**న శిశ్నోదరచాపల్యే న చ శ్రవణయోః క్వచిత్ ॥ 59 ॥**

గుప్తావయవాలను, రోమాలను స్పృశించరాదు. శిష్టులు కానివారితో కలిసి వెళ్ళకూడదు. పాణి, పాద, వాక్, నేత్రాల విషయంలో చాపల్యము పనికిరాదు. శిశ్న, ఉదర చాపల్యాన్ని, కర్ణచాపల్యాన్ని ప్రదర్శించకూడదు.

**న చాఙ్గనఖవాదం వై కుర్యాన్నాఞ్జలినా పిబేత్ ।**
**నాభిహన్యాజ్జలం పద్భ్యాం పాణినా వా కదాచన ॥ 60 ॥**

అవయవాలు నఖాలతో ధ్వనిచేయరాదు. దోసిలతో నీరు త్రాగరాదు. పాదాలతో, చేతులతో నీళ్ళను కొట్టరాదు.

**న శాతయేదిష్టకాభిః ఫలాని న ఫలేన చ ।**
**న మ్లేచ్ఛభాషాం శిక్షేత నాకర్షేచ్చ పదాసనమ్ ॥ 61 ॥**

ఇటుకలతో ఫలములను రాల్చరాదు. ఫలములతో కూడా ఫలములను రాల్చకూడదు. మ్లేచ్ఛ భాష నేర్చుకోరాదు. పాదంతో ఆసనాన్ని లాగరాదు.

**న భేదనమవస్ఫోటం ఛేదనం వా విలేఖనమ్ ।**
**కుర్యాద్విమర్దనం ధీమాన్ నాకస్మాదేవ నిష్ఫలమ్ ॥ 62 ॥**

గోళ్ళతో త్రుంచటం, కోయటం, చీల్చటం, వ్రాయటం, మర్దించటం చేయకూడదు. అకస్మాత్తుగాను, వ్యర్థముగానూ తన అవయవాలను మర్దించకూడదు.

**నోత్సంగే భక్షయేద్భక్ష్యం వృథా చేష్టాం చ నాచరేత్ ।**
**న నృత్యేదథవా గాయేత్ న వాదిత్రాణి వాదయేత్ ॥ 63 ॥**

ఒడిలో పెట్టుకొని భోంచేయరాదు. వ్యర్థమైన చేష్టలు చేయరాదు. నాట్యం, గానం, వాద్యవాదనం చేయకూడదు.

**న సంహితాభ్యాం పాణిభ్యాం కండూయేదాత్మనశ్శిరః ।**
**న లౌకికైస్తవై ర్దేవాంస్తోషయేద్బాహ్యజైరపి ॥ 64 ॥**

రెండు చేతులతో కలిపి తలను గోకికోరాదు. లౌకిక స్తోత్రాలతో దేవతాస్తుతి పనికి రాదు. బాహ్యస్తోత్రాలతో కూడా స్తుతించకూడదు.

**నాక్షైః క్రీడేన్న ధావేత నాప్సు విణ్మూత్రమాచరేత్ ।**
**నోచ్ఛిష్టస్సంవిశేన్నిత్యం న నగ్నః స్నానమాచరేత్ ॥ 65 ॥**

పాచికలాట ఆడరాదు. పరుగెత్తరాదు. నీటిలో మలమూత్ర విసర్జనం తగదు. ఉచ్ఛిష్టముఖంతో నుండకూడదు. నగ్నంగా స్నానమాచరించరాదు.

**న గచ్ఛేన్న పఠేద్వాఽపి న చైవ స్వశిరః స్పృశేత్ ।**
**న దన్తైర్నఖరోమాణి ఛిన్ద్యాత్సుప్తం న బోధయేత్ ॥ 66 ॥**

నగ్నావస్థలో నడువరాదు. చదువరాదు. తన తలను తాను తాకరాదు. దంతాలతో గోళ్ళను, రోమాలను ఛేదించరాదు. నిద్రించేవాణ్ణి లేపరాదు.

**న బాలాతపమాసేవేత్ ప్రేతధూమం వివర్జయేత్ ।**
**నైకస్సుప్యాచ్ఛూన్యగృహే స్వయం నోపానహౌ హరేత్ ॥ 67 ॥**

బాలసూర్యునియెండను సేవించరాదు. శవధూమాన్ని వదిలిపెట్టాలి. శూన్యగృహంలో ఒక్కడే నిద్రించకూడదు. తన పాదరక్షలు తానే పట్టుకొని పోరాదు.

**నాకారణాద్వా నిష్ఠీవేత్ న బాహుభ్యాం నదీం తరేత్ ।**
**న పాదక్షాలనం కుర్యాత్ పాదే నైవ కదాచన ॥ 68 ॥**

అకారణంగా ఉమ్మివేయరాదు. బాహువులతో నదిని దాట కూడదు. పాదాలతో పాదాలను కడుగరాదు.

**నాగ్నౌ ప్రతాపయేత్పాదౌ న కాంస్యే ధావయేద్బుధః ।**
**నాభిప్రసారయేద్దేవం బ్రాహ్మణాన్ గామథాపి వా ॥ 69 ॥**

పాదాలను అగ్నితో కాచుకోకూడదు. కాంస్యపాత్రలో పాదాలు కడుగరాదు. దేవతలవంక, బ్రాహ్మణుల వంక, గోవులవైపు పాదాలు చాపరాదు.

**వాయ్వగ్నిగురువిప్రాన్వా సూర్యం వా శశినం ప్రతి ।**
**అశుద్ధశ్శయనం స్నానం స్వాధ్యాయం స్నానవాహనమ్ ।**
**బహిర్నిష్క్రమణం చైవ న కుర్వీత కథంచన ॥ 70 ॥**

వాయు, అగ్ని, గురు, విప్ర, సూర్యచంద్రుల వైపు పాదాలు చాపకూడదు. అపవిత్రావస్థలో పడుకొన రాదు, ప్రయాణం చేయరాదు. స్వాధ్యాయం పనికిరాదు. స్నానం, వాహనం, బయటికి వెళ్ళటం చేయకూడదు.

**స్వప్నమధ్యయనం స్నానం ఉద్వర్తం భోజనం గతిమ్ ।**
**ఉభయోస్సంధ్యయోర్నిత్యం మధ్యాహ్నే చైవ వర్జయేత్ ॥ 71 ॥**

ఉభయసంధ్యల్లో, మధ్యాహ్నకాలంలో నిద్రించటం, అధ్యయనం, స్నానం, ఉద్వర్తనం, భోజనం, ప్రయాణం చేయకూడదు.

**న స్పృశేత్ పాణినోచ్ఛిష్టో విప్రో గో బ్రాహ్మణానలాన్ ।**
**న చాసనం పదా వాఽపి న దేవప్రతిమాం స్పృశేత్ ॥ 72 ॥**

అపవిత్రుడగు విప్రుడు గో, బ్రాహ్మణ, అగ్నులను చేత్తో స్పృశించరాదు. ఆసనాన్ని, దేవప్రతిమను పాదంతో తాకరాదు.

**నాశుద్ధోఽగ్నిం పరిచరేత్ న దేవాన్ కీర్తయేదృషీన్ ।**
**నావగాహేదగాధామ్బు ధారయేన్నానిమిత్తతః ॥ 73 ॥**

అపవిత్రుడై అగ్నిని ఉపాసించరాదు. దేవ, ఋషులను కీర్తించరాదు. లోతు తెలియని నీటిలో దిగరాదు. అకారణంగా మలమూత్రాలను నిరోధించరాదు.

**న వామహస్తేనోద్ధృత్య పిబేద్వక్త్రేణ వా జలమ్ ।**
**నోత్తరేదనుపస్పృశ్య నాప్సు రేతస్సముత్సృజేత్ ॥ 74 ॥**

ఎడమ చేత్తో నీరు తీసుకొనికాని, పాత్రద్వారాకాని, నోటితో కాని జలాన్ని త్రాగరాదు. ఆచమనం చేయకుండా సమాధానం చెప్పకూడదు. నీటిలో రేతస్సు విడువరాదు.

**అమేధ్యలిప్తమన్యద్వా లోహితం వా విషాణి వా ।**
**వ్యతిక్రమేన్న స్రవన్తీం నాప్సు మైథునమాచరేత్ ॥**

**చైత్యం వృక్షం న వై ఛిన్ద్యాత్ నాప్సు ష్ఠీవనమాచరేత్ ॥ 75 ॥**

అపవిత్ర వస్తుసంబంధమున్న వస్తువును, రక్తాన్ని, విషాన్ని కాని దాటరాదు. వేగంగా ప్రవహించే నదిని దాటరాదు. నీటిలో సంభోగించ కూడదు. అశ్వత్థవృక్షాన్ని ఖండించరాదు. జలంలో నిష్ఠీవనం పనికిరాదు.

**నాస్థిభస్మకపాలాని న కేశాన్న చ కంటకాన్ ।**
**తుషాఙ్గారకరీషం వా నాధితిష్ఠేత్కదాచన ॥ 76 ॥**

ఎముకలు, కపాలం, భస్మం, కేశాలు, కంటకాలు, తుష(వరిపొట్టు), బొగ్గులు, పిడుకలపైన కూర్చొనకూడదు.

**న చాగ్నిం లంఘయేద్ధీమాన్ నోపదధ్యాదధః క్వచిత్ ।**
**న చైనం పాదతః కుర్యాత్ ముఖేన న ధమేద్బుధః ॥ 77 ॥**

అగ్నిని దాటరాదు. తనకు క్రింద అనగా శయ్య ఆసనం మొదలైన వాని క్రింద అగ్నినుంచరాదు. పాదాల వద్ద కూడ పెట్టకూడదు. నోటితో ఊదటం కూడదు.

**న కూపమవరోహేత నావేక్షేతాశుచిః క్వచిత్ ।**
**అగ్నౌ న చ క్షిపేదగ్నిం నాద్భిః ప్రశమయేత్తథా ॥ 78 ॥**

**సుహృన్మరణమార్తిం వా న స్వయం శ్రావయేత్పరాన్ ।**
**అపణ్యం కూటపణ్యం వా విక్రయేన్న ప్రయోజయేత్ ॥ 79 ॥**

బావిలో దిగరాదు. అపవిత్రుడై బావిని చూడరాదు. అగ్నిలో అగ్నిని వేయరాదు. నీళ్ళతో అగ్నిని ఆర్పరాదు, మిత్రుని మరణమునుగాని, ఆపదనుగాని స్వయంగా ఇతరులకు చెప్పరాదు. అమ్మతగని వస్తువును, కపటంతో లభించిన వస్తువును అమ్మరాదు.

**న వహ్నిం ముఖనిఃశ్వాసైర్జ్వాలయేన్నాశుచిర్బుధః ।**
**పుణ్యస్థానోదకస్థానే సీమాన్తం నాకృషేన్న తు ॥ 80 ॥**

నోటితో అగ్నిని జ్వాల చేయరాదు. అపవిత్రునిగా ఉండి పవిత్రతీర్థాల్లోకి వెళ్ళరాదు. హద్దుగా ఉన్న ప్రదేశాన్ని దున్నరాదు.

**న భిన్ద్యాత్ పూర్వసమయం అభ్యుపేతం కదాచన ।**
**పరస్పరం పశూన్వ్యాలాన్ పక్షిణో నావబోధయేత్ ॥ 81 ॥**

మొదట చేసిన ప్రతిజ్ఞను విడువరాదు. పశువులను, పక్షులను, సర్పాలను పరస్పర యుద్ధాలకు పురికొల్పరాదు.

**పరబాధాం న కుర్వీత జలవాతాతపాదిభిః ।**
**కారయిత్వా స్వకార్యాణి కారూన్ పశ్చాన్న వఞ్చయేత్ ॥**
**సాయం ప్రాతః గృహద్వారాన్ భిక్షార్థం నావఘట్టయేత్ ॥ 82 ॥**

జల, వాత, ఆతపాలతో ఇతరులను బాధించరాదు. తమ పనులు చేయించుకొని పనివారిని వంచించరాదు. సాయం ప్రాతఃకాలాలలో భిక్షకై గృహద్వారాలను తట్టరాదు.

**బహిర్మాల్యం బహిర్గన్ధం భార్యయా సహ భోజనమ్ ।**
**విగృహ్య వాదం కుద్వారప్రవేశం చ వివర్జయేత్ ॥ 83 ॥**

ఇతరులుపయోగించిన మాల్యం, గంధం, భార్యతో పాటు భోజనం, వైరం, కల్పించుకొని కలహించటం, దొడ్డిదారి ప్రవేశం వదలతగినవి.

**న ఖాదన్బ్రాహ్మణస్తిష్ఠేన్న జల్పేద్వా హసన్బుధః ।**
**స్వమగ్నిం నైవ హస్తేన స్పృశేన్నాప్సు చిరం వసేత్ ॥ 84 ॥**

బ్రాహ్మణుడు భుజిస్తూ లేవకూడదు. నవ్వుతూ మాట్లాడరాదు. తమ అగ్నిని తమ చేతితో తాకకూడదు. నీటిలో ఎక్కువ సేపు ఉండరాదు.

**న పక్షకేణోపధమేత్ న శూర్పేణ న పాణినా ।**
**ముఖేన న ధమేదగ్నిం ముఖాదగ్నిరజాయత ॥ 85 ॥**

అగ్నిని విసనకర్రతో చేటతో విసరకూడదు. నోటితో ఊదకూడదు. కారణం అగ్నిముఖం నుండే పుట్టినది.

**పరస్త్రియం న భాషేత నాయాజ్యం యాజయేద్ద్విజః ।**
**నైకశ్చరేత్సభాం విప్రః సమవాయం చ వర్జయేత్ ॥ 86 ॥**

పరస్త్రీతో మాట్లాడరాదు. యజ్ఞార్హత లేనివానితో బ్రాహ్మణుడు యజ్ఞం చేయించకూడదు. సభలోనికి ఒంటరిగా ప్రవేశించరాదు. సమూహాన్ని వదలవలెను.

**న దేవాయతనం గచ్ఛేత్ కదాచిద్వాఽప్రదక్షిణమ్ ।**
**న వీజయేద్వా వస్త్రేణ న దేవాయతనే స్వపేత్ ॥ 87 ॥**

అప్రదక్షిణంగా దేవాలయంలో ప్రవేశించరాదు. వస్త్రంతో వీచరాదు. దేవాలయంలో నిద్రించకూడదు.

**నైకోఽధ్వానం ప్రపద్యేత నాధార్మికజనైస్సహ।**
**న వ్యాధిదూషితైర్వాఽపి న శూద్రైః పతితే న వా ॥ 88 ॥**

ఒంటరిగా ప్రయాణించరాదు. అధార్మికులతో కలిసి నడువకూడదు. వ్యాధిగ్రస్తులు, శూద్రులు, పతితులతో కలిసి నడవరాదు.

**నోపానద్వర్జితో వాఽథ జలాదిరహితస్తథా ।**
**న రాత్రౌ నారిణా సార్ధం న వినా చ కమణ్డలుమ్ ॥**
**నాగ్నిగోబ్రాహ్మణాదీనామన్తరేణ వ్రజేత్ క్వచిత్ ॥ 89 ॥**

పాదరక్షలు లేకుండా, జలం లేకుండ రాత్రుల్లో నడవరాదు. శత్రువుతో కలసి వెళ్ళకూడదు. కమండలం లేకుండా వెళ్ళరాదు, అగ్ని, గో, బ్రాహ్మణుల మధ్యనుండి వెళ్ళరాదు.

**న వత్సతన్త్రీం వితతామతిక్రామేత్క్వచిద్ద్విజః ।**
**న నిన్దేత్ యోగినస్సిద్ధాన్ వ్రతినో వా యతీంస్తథా ॥ 90 ॥**

దూడకు పాలిస్తున్న ఆవును, గోవును కట్టేసిన త్రాడును, గోపుచ్ఛాన్ని బ్రాహ్మణుడు దాటరాదు. యోగి, సిద్ధవ్రతియతులను నిందించరాదు.

**దేవతాయతనం ప్రాజ్ఞో దేవానాఞ్చైవ సత్త్రిణామ్ ।**
**నాక్రమేత్కామతశ్ఛాయాం బ్రాహ్మణానాఞ్చ గోరపి ॥ 91 ॥**

దేవాలయ, దేవతా, యజ్ఞదీక్షితుల నీడలను దాటరాదు. గో, బ్రాహ్మణుల నీడను దాటరాదు.

**స్వాన్తు నాక్రామయేచ్ఛాయాం పతితాద్యైర్న రోగిభిః ।**
**నాఙ్గారభస్మకేశాదిష్వధితిష్ఠేత్కదాచన ॥ 92 ॥**

తన నీడను పతితులు రోగులు దాటకుండా చూడాలి. అంగారభస్మ కేశాల్లో కూర్చోరాదు.

**వర్జయేన్మార్జనీరేణుం స్నానవస్త్రఘటోదకమ్ ।**
**న భక్షయేదభక్ష్యాణి నాపేయం న పిబేద్ద్విజః ॥ 93 ॥**

ఊడుస్తున్న ధూళిని, స్నానం చేసిన వస్త్రాన్ని, స్నానం చేయగా మిగిలిన జలాన్ని, విడువ వలెను. అభక్ష్యాలు భక్షించరాదు. త్రాగదగనిదాన్ని త్రాగరాదు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే గార్హస్థ్య ధర్మనిరూపణం నామ షోడశోఽధ్యాయః ॥ 16 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో గార్హస్థ్యధర్మనిరూపణమనే పదహారవ అధ్యాయం ॥ 16 ॥



## సప్తదశోఽధ్యాయః - పదిహేడవ అధ్యాయం

## భక్ష్యాభక్ష్య నిర్ణయః - భక్ష్యాభక్ష్య నిర్ణయం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు పలికాడు

**నాద్యాచ్ఛూద్రస్య విప్రోఽన్నం మోహాద్వా యది వాఽన్యతః ।**
**స శూద్రయోనిం వ్రజతి యస్తు భుఙ్క్తే హ్యనాపది ॥ 1 ॥**

మోహంవల్లకాని, ఇతర కారణాలవల్లకాని బ్రాహ్మణుడు శూద్రాన్నం భుజింపరాదు. ఆపదలేనపుడు శూద్రాన్నం భుజించినట్లైతే శూద్రునిగా జన్మిస్తాడు.

**షణ్మాసాన్ యో ద్విజో భుఙ్క్తే శూద్రస్యాన్నం విగర్హితమ్ ।**
**జీవన్నేవ భవేచ్ఛూద్రో మృతః శ్వా చాభిజాయతే ॥ 2 ॥**

ఆరునెలలు భుజిస్తే జీవించి ఉండగానే శూద్రుడవుతాడు. మరణించిన తర్వాత శునకంగా పుడ్తాడు.

**బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రస్య చ మునీశ్వరాః ।**
**యస్యాన్నేనోదరస్థేన మృతస్తద్యోనిమాప్నుయాత్ ॥ 3 ॥**

ఓ మునిశ్రేష్ఠులారా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాన్నాలలో ఎవరి అన్నం కడుపులో ఉన్నపుడు మరణిస్తాడో ఆ జాతిలో పుడతాడు.

**రాజాన్నం నర్తకాన్నఞ్చ తక్ష్ణోన్నం చర్మకారిణః ।**
**గణాన్నం గణికాన్నఞ్చ షణ్డాన్నం చైవ వర్జయేత్ ॥ 4 ॥**

రాజ, నర్తక, వడ్రంగి, చర్మకార, బ్రాహ్మణ సమూహ, వేశ్యా, నపుంసకుల అన్నాలు విడువదగినవి.

**చక్రోపజీవిరజకతస్కరధ్వజినాం తథా ।**
**గాన్ధర్వలోహకారాన్నం సూతకాన్నం చ వర్జయేత్ ॥ 5 ॥**

చక్రము ఆధారముగా కలిగి బ్రతికేవారు, రజకులు, దొంగలు, మద్యమమ్మే వాళ్ళు, గాయకులు, లోహకారులు, సూతకుల అన్నాలు విసర్జింపదగినవి.

**కులాల చిత్రకర్మాన్నం వార్ధుషేః పతితస్య చ ।**
**పౌనర్భవచ్ఛత్రికయోరభిశస్తస్య చైవ హి ॥ 6 ॥**

కుమ్మరి, చిత్రకారుడు, వడ్డీ వ్యాపారి, పతితులు, భర్త మరణించగా రెండవ వివాహం చేసుకున్న స్త్రీకి పుట్టినవాడు, మంగలి నిందితుల అన్నాలు విసర్జించాలి.

**సువర్ణకారశైలూషవ్యాధబద్ధాతురస్య చ ।**
**చికిత్సకస్య చైవాన్నం పుంశ్చల్యా దణ్డికస్య చ ॥ 7 ॥**

స్వర్ణకారులు, నటులు, వేటగాళ్ళు, బంధితుడు, వ్యాధితుడు, వైద్యుడు, పుంశ్చలి, దండించేవారి అన్నం తినరాదు.

**స్తేననాస్తికయోరన్నం దేవతానిన్దకస్య చ ।**
**సోమవిక్రయిణశ్చాన్నం శ్వపాకస్య విశేషతః ॥ 8 ॥**

**భార్యాజితస్య చైవాన్నం యస్యహేచోపపతిర్గృహే ।**
**ఉత్సృష్టస్య కదర్యస్య తదైవోచ్ఛిష్టభోజినః ॥ 9 ॥**

చోరులు, నాస్తికులు, దేవనిందకులు, మద్యం అమ్మేవారు, విశేషించి చండాలుడు, భార్యా విధేయుడు, ఉపపతి ఇంట్లోనే ఉన్న భార్యా విధేయుడు, సమాజ బహిష్కృతుడు, లోభి, ఉచ్ఛిష్టం తినే వారల అన్నాలు తినరాదు.

**అపంక్త్యాన్నం చ సఙ్ఘాన్నం శస్త్రాజీవస్య చైవ హి ।**
**క్లీబసన్న్యాసినోశ్చాన్నం మత్తోన్మత్తస్య చైవ హి ॥ 10 ॥**

**భీతస్య రుదితస్యాన్నం అవక్రుష్టం పరిక్షుతమ్ ।**
**బ్రహ్మద్విషః పాపరుచేః శ్రాద్ధాన్నం సూతకస్య చ ॥ 11 ॥**

**వృథా పాకస్య చైవాన్నం శావాన్నం శ్వశురస్య చ ।**
**అప్రజానాన్తు నారీణాం భృతకస్య తథైవ చ ॥ 12 ॥**

పంక్తిబహిష్కృతుని, అన్నం, సమూహాన్నం, శస్త్రజీవి, నపుంసకుడు, సన్యాసి, మత్త ఉన్మత్తులు, భయంలో ఉన్నవాడు, ఏడ్చేవాడు, అభిశప్తుడు, తుమ్ముతో అపవిత్రమైన అన్నం, బ్రాహ్మణులను ద్వేషించేవారు, పాపాభిరుచి గలవారు, శ్రాద్ధాన్నం, సూతకాన్నం, నిష్ప్రయోజనంగా వండిన అన్నం(భగవన్నివేదితం కానిది) శవ వాహకులు, సోమరి, వృత్తిశూన్యుడై మామగారింట, సంతానం లేని స్త్రీ, భృత్యులు, శిల్పకారులు, విశేషించి శస్త్రములనమ్మేవారి అన్నాన్ని భుజించరాదు.

**శౌణ్డాన్నం ఘాటికాన్నం చ భిషజామన్నమేవ చ ।**
**విద్ధప్రజననస్యాన్నం పరివిత్త్యన్నమేవ చ ॥ 13 ॥**

మద్యాన్ని తయారు చేసేవారు, స్తుతిగాయకులు, వైద్యులు, విద్ధలింగులు, అన్న వివాహం కాకుండానే వివాహం చేసుకున్న తమ్ముడు, వీరి అన్నం తినరాదు.

**పునర్భువో విశేషేణ తథైవ దిధిషూపతేః ।**
**అవజ్ఞాతం చావధూతం సరోషం విస్మయాన్వితమ్ ॥ 14 ॥**

విధవను వివాహం చేసుకొన్నవాడు, అన్న చనిపోగా అతని భార్యను పెళ్ళి చేసుకున్న సోదరుడు వీరి అన్నాన్ని ప్రత్యేకించి పరిత్యజించాలి. అనాదరంతో ఇచ్చినది, తిరస్కారంతో, కోపంతో, ఆశ్చర్యంతో ఇచ్చిన అన్నాన్ని తినరాదు.

**గురోరపి న భోక్తవ్యం అన్నం సంస్కారవర్జితమ్ ।**
**దుష్కృతం హి మనుష్యస్య సర్వమన్నే వ్యవస్థితమ్ ।**
**యో యస్యాన్నం సమశ్నాతి స తస్యాశ్నాతి కిల్బిషమ్ ॥ 15 ॥**

సంస్కార హీనమైన గురువు అన్నాన్ని కూడా తినరాదు. మనుజుని పాపమంతా అన్నంలోనే ఉంటుంది. ఎవరి అన్నం తింటామో వారి పాపం కూడా అనుభవించాల్సి ఉంటుంది.

**ఆర్ధికః కులమిత్రశ్చ స్వగోపాలశ్చ నాపితః ।**
**ఏతే శూద్రేషు భోజ్యాన్నాః యశ్చాత్మానం నివేదయేత్ ॥ 16 ॥**

శూద్రులైనప్పటికీ బ్రాహ్మణుని పొలం సేద్యంచేసి సంపాదించుకున్న వాని అన్నాన్ని, తాత ముత్తాతల నుండి బ్రాహ్మణుని ఇంట్లో ఉంటున్నవాని భోజనాన్ని, తమ ఆవులను కాచేవాని అన్నాన్ని, మంగలి అన్నాన్ని, తనను సంపూర్ణంగా బ్రాహ్మణులకు అర్పించుకున్నవారి అన్నాన్ని భుజింపవచ్చును.

**కుశీలవః కుమ్భకారః క్షేత్రకర్మక ఏవ చ ।**
**ఏతే శూద్రేషు భోజ్యాన్నా దత్త్వా స్వల్పం పణం బుధైః ॥ 17 ॥**

గాయకుల, కుంభకారుల, రైతుల అన్నాన్ని కొద్ది మూల్యం చెల్లించి భుజించాలి.

**పాయసం స్నేహపక్వం యత్ గోరసం చైవ సక్తవః ।**
**పిణ్యాకం చైవ తైలం చ శూద్రాద్గ్రాహ్యం ద్విజాతిభిః ॥ 18 ॥**

పాయసాన్ని, నేతి వంటకాన్ని, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మొదలైన వానిని, సత్తుపిండిని, తెలక పిండిని, నూనె ఇవి శూద్రుల నుండి గ్రహించవచ్చు.

**వృంతాకం నాలికాశాకం కుసుమ్భాశ్మాన్తకం తథా ।**
**పలాణ్డుం లశునం శుక్తం నిర్యాసం చైవ వర్జయేత్ ॥ 19 ॥**

వంకాయ, నాలికాశాకం, అవిశపూవు, అశ్మాంతకం, ఉల్లి,వెల్లుల్లి, శుక్తం, చెట్టుబెరడు తినకూడదు.

**ఛత్రాకం విడ్వరాహఞ్చ శేలుం పీయూషమేవ చ ।**
**విలయం సుముఖఞ్చైవ కవకాని చ వర్జయేత్ ॥ 20 ॥**

పుట్టగొడుగు, ఊరపంది, శ్లేష్మాతకం, జున్ను, విరిగిన పాలు, సుముఖమనే శాకం, కవకం భుజించరాదు.

**గృఞ్జనం కింశుకం చైవ కకుబాణ్డం తథైవ చ ।**
**ఉదుంబరమలాబుం చ జగ్ధ్వా పతతి వై ద్విజః ॥ 21 ॥**

గురువింద, మోదుగు, తంగేడు, మేడు, అల్లనేరేడు భుజించిన పతితుడవుతాడు.

**వృథా కృశరసంయావం పాయసాపూపమేవ చ ।**
**అనుపాకృతమాంసం చ దేవాన్నాని హవీంషి చ ॥ 22 ॥**

**యవాగూం మాతులింగం చ మత్స్యానప్యనుపాకృతాన్ ।**
**నీపం కపిత్థం ప్లక్షం చ ప్రయత్నేన వివర్జయేత్ ॥ 23 ॥**

నిష్ప్రయోజనమైన, అనగా దేవుని నైవేద్యంకాని, నువ్వులతోకాని, బియ్యంతోకాని చేసిన తినుబండారం, గోధుమపాలు బెల్లాలతో చేసిన తినుబండారం, పాయసం, ఆవుపాలు, సంస్కరించని మాంసం, దేవతల బలి అన్నం, పురోడాశాది హవ్యం, గంజి, కుడితి, సంస్కరించని మత్స్యాలు, కదంబం, వెలగజువ్వి వీనిని ప్రయత్నంతో విడువవలెను.

**పిణ్యాకం చోద్ధృతస్నేహం దేవధాన్యం తథైవ చ ।**
**రాత్రౌ చ తిలసమ్బన్ధం ప్రయత్నేన దధి త్యజేత్ ॥ 24 ॥**

నూనె తీసిన తెలగపిండి, దేవునిభూమిలో పండిన ధాన్యము, రాత్రి సమయంలో నువ్వులతో చేసిన పదార్థం, పెరుగు వీటిని త్యజించవలెను.

**నాశ్నీయాత్పయసా తక్రం న బీజాన్యుపజీవయేత్ ।**
**క్రియాదుష్టం భావదుష్టం అసత్సఙ్గం చ వర్జయేత్ ॥ 25 ॥**

పాలతో కలిపి మజ్జిగ త్రాగరాదు. విత్తనాలమ్మి జీవించరాదు. భావదుష్టం, క్రియాదుష్టం, దుస్సంగం విడువతగినవి.

**కేశకీటావపన్నఞ్చ సహృల్లేఖం చ నిత్యశః ।**
**శ్వాఘ్రాతం చ పునస్సిద్ధం చండాలావేక్షితం తథా ॥ 26 ॥**

**ఉదక్యయా చ పతితైః గవా చాఘ్రాతమేవ చ ।**
**అనర్చితం పర్యుషితం పర్యాయాన్నం చ నిత్యశః ॥ 27 ॥**

**కాకకుక్కుటసంస్పృష్టం కృమిభిశ్చైవ సంయుతమ్ ।**
**మనుష్యైరప్యవఘ్రాతం కుష్ఠినా స్పృష్టమేవ చ ॥ 28 ॥**

**న రజస్వలయా దత్తం న పుంశ్చల్యా సరోషయా ।**
**మలవద్వాససా వాఽపి పరవాసోఽథ వర్జయేత్ ॥ 29 ॥**

**వివత్సాయాశ్చ గోః క్షీరమౌష్ట్రం వా నిర్దశం తథా ।**
**ఆవికం సంధినీక్షీరం అపేయం మనురబ్రవీత్ ॥ 30 ॥**

కేశాలు, కీటకాలు గలది, సందేహాస్పదమైనదీ అయిన అన్నం, కుక్క ముట్టినది, మళ్లీ వేడిచేసినది, చండాలుడు చూచినది, రజస్వల, పతితులు చూచినది, గోవు వాసన చూచినది, అనుదారంగా పెట్టినది, పాసిపోయినది, ఒకరి అన్నం మరొకరు పెట్టినది, కాకులు, కోళ్ళు ముట్టుకొన్నది, పురుగులు కలది, మనుష్యులు వాసన చూచినది, కుష్ఠువ్యాధిగ్రస్తులు తాకినది తినకూడదు. రజస్వల, వ్యభిచారిణి, కోపించినవారు పెట్టినది,

మురికి బట్టలతో పెట్టినది, ఇతరుల వస్త్రాలు విడువ దగినవి. దూడలేని ఆవుపాలు, ఒంటెపాలు, ప్రసవించిన పదిరోజులలోపు ఆవు గొఱ్ఱెపాలు, చూడిఆవుపాలు త్రాగరాదని మనువు చెప్పినాడు.

**బలాకం హంస దాత్యూహం కలవింకం శుకం తథా ।**
**కురరం చ చకోరం చ జాలపాదం చ కోకిలమ్ ॥ 31 ॥**

**వాయసం ఖంజరీటం చ శ్యేనం గృధ్రం తథైవ చ ।**
**ఉలూకం చక్రవాకం చ భాసం పారావతానపి ॥ 32 ॥**

**కపోతం టిట్టిభం చైవ గ్రామ కుక్కుటమేవ చ ।**
**సింహం వ్యాఘ్రం చ మార్జారం శ్వానం శూకరమేవ చ ॥ 33 ॥**

**శృగాలం మర్కటం చైవ గర్దభం చ న భక్షయేత్ ।**
**న భక్షయేత్సర్వమృగాన్ పక్షిణోఽన్యాన్వనేచరాన్ ॥ 34 ॥**

కొంగ, హంస, దాత్యూహం, కలవింకం, చిలుక, కురరం, చకోరం, జాలపాదం, కోకిల, కాకి, కాటుకపిట్ట, డేగ, గద్ద, గుడ్లగూబ, చక్రవాకం, భాసం, పారావతం, పావురం, లకుముకిపిట్ట, ఊరకోడి, సింహం, పెద్దపులి,పిల్లి, కుక్క, పంది, నక్క, కోతి, గాడిద మాంసాలు తినకూడదు. అన్ని మృగాలను, పక్షులను, వనచరాలను భక్షించరాదు.

**జలేచరాన్ స్థలచరాన్ ప్రాణినశ్చేతి ధారణా ।**
**గోధా కూర్మః శశః శ్వావిత్ శల్యకశ్చేతి సత్తమాః ॥ 35 ॥**

**భక్ష్యాః పఞ్చనఖా నిత్యం మనురాహ ప్రజాపతిః ।**
**మత్స్యాన్ స శల్కాన్ భుఞ్జీయాన్మాంసం రౌరవమేవ వా ॥ 36 ॥**

**నివేద్య దేవతాభ్యస్తు బ్రాహ్మణేభ్యస్తు నాన్యథా ।**
**మయూరం తిత్తిరిం చైవ కపోతం చ కపింజలమ్ ॥ 37 ॥**

**వాధ్రీణసం బకం భక్ష్యం మీనహంసపరాజితాః ।**
**శఫరం సింహతుండఞ్చ తథా పాఠీనరోహితౌ ॥ 38 ॥**

**మత్స్యాశ్చైతే సముద్దిష్టా భక్షణాయ ద్విజోత్తమాః ।**
**ప్రోక్షితం భక్షయేదేషాం మాంసం చ ద్విజకామ్యయా ॥ 39 ॥**

జలచర, స్థలచర ప్రాణులను తినరాదు. ఉడుము, తాబేలు, కుందేలు, ముళ్ళపంది, ఏదు, ఐదైదు గోళ్లు కలవి తినవచ్చునని మనువు చెప్పినాడు. మత్స్యాలను, రురుమృగమాంసాన్ని, దేవబ్రాహ్మణులకు నివేదించియే తినవలెను. నివేదింపక తినరాదు. నెమలి, తిత్తిరిపావురం, కపింజలం, వాధ్రీణసం, బకము తినదగినవి. చేపలు, హంసలు, పరాజితములు, శఫరాలు, సింహతుండములు, పాఠీనము, రోహితము అను చేపలు ఇవి భక్షింపదగినవిగా పేర్కొనబడినవి. వీని మాంసాన్ని పరిశుద్ధిగావించి, యథావిధిగ నియమించబడియే తినవలెను.

**యథావిధినియుక్తం చ ప్రాణానామపి చాత్యయే ।**
**భక్షయేన్నైవ మాంసాని శేషభోజీ న లిప్యతే ॥ 40 ॥**

ప్రాణం పోయినా విధి తప్పరాదు. మాంసములు తినరాదు. దేవతాశేషం తిన్నా తప్పు లేదు.

**ఔషధార్థమశక్తౌ వా నియోగాద్యజ్ఞకారణాత్ ।**
**ఆమన్త్రితస్తు యః శ్రాద్ధే దైవే వా మాంసముత్సృజేత్ ॥ 41 ॥**

**యావన్తి పశురోమాణి తావతో నరకాన్వ్రజేత్ ।**
**అదేయం చాప్యపేయం చ తథా వాఽస్పృశ్యమేవ చ ॥ 42 ॥**

**ద్విజాతీనామనాలోక్యం నిత్యం మద్యమితి స్థితిః ।**
**తస్మాత్సర్వప్రకారేణ మద్యం నిత్యం వివర్జయేత్ ॥ 43 ॥**

మందుకోసమో, శక్తి లేనపుడో, ఆజ్ఞ వల్లనో, యజ్ఞకారణంగానో తినవచ్చును. శ్రాద్ధభోజనానికి, దైవకర్మకు పిలవబడినప్పుడు శ్రాద్ధంలో మాంసాన్ని విడిచిపెడితే ఆ వ్యక్తి ఆ పశువు రోమాలన్ని సంవత్సరాలు నరకంలో నివసిస్తాడు. బ్రాహ్మణులు మద్యాన్ని ఈయకూడదు, త్రాగరాదు, తాకరాదు, చూడనుకూడదు. అందువల్ల అన్ని విధాల ఎప్పుడూ మద్యాన్ని పరిత్యజించాలి.

**పీత్వా పతతి కర్మభ్యస్త్వసంభాష్యో భవేద్ద్విజః ।**
**భక్షయిత్వా హ్యభక్ష్యాణి పీత్వాఽపేయాన్యపి ద్విజః ॥ 44 ॥**

**నాధికారీ భవేత్తావత్ యావత్తన్న జహాత్యఘః ।**
**తస్మాత్పరిహరేన్నిత్యం అభక్ష్యాణి ప్రయత్నతః ॥**

**అపేయాని చ విప్రో వై తథా చేద్యాతి రౌరవమ్ ॥ 45 ॥**

మద్యపానం చేసినవాడు పతితుడవుతాడు. వానితో మాట్లాడకూడదు. తినకూడని వానిని తిన్నా, త్రాగకూడని వాటిని త్రాగినా ఆ పాపం పోయేంతవరకు ద్విజుడు సర్వకర్మలకు అయోగ్యుడవుతాడు. అందువల్ల విప్రుడు ఎల్లపుడు అభక్ష్యాలను, అపేయాలను వదలిపెట్టాలి. అట్లా వదలకపోయినట్లైతే రౌరవనరకాన్ని పొందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే భక్ష్యాభక్ష్య నిర్ణయో నామ సప్తదశోఽధ్యాయః ॥ 17 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో భక్ష్యాభక్ష్యనిర్ణయమనే పదునేడవ అధ్యాయం ॥ 17 ॥



## అష్టాదశోऽధ్యాయః-పద్దెనిమిదవ అధ్యాయం

### బ్రాహ్మణానాం నిత్యానిత్యకర్తవ్యకర్మాణి - బ్రాహ్మణుల నిత్యానిత్యకర్తవ్య కర్మలు

**ఋషయః ఊచుః:**-ఋషులు పలికారు

**అహన్యహని కర్తవ్యం బ్రాహ్మణానాం మహామునే! ।**
**తదాచక్ష్వాఖిలం కర్మ యేన ముచ్యేత బంధనాత్ ॥ 1 ॥**

ఓ మునీశ్వరా! బ్రాహ్మణులు ప్రతిదినం చేయాల్సిన కర్మలు తెలుపండి. సంసారబంధం తొలగటానికి సర్వకర్మలు వివరించండి.

**వ్యాస ఉవాచ :**-వ్యాసమహర్షి చెప్పాడు

**వక్ష్యే సమాహితా యూయం శృణుధ్వం గదతో మమ ।**
**అహన్యహని కర్తవ్యం బ్రాహ్మణానాం క్రమాద్విధిమ్ ॥ 2 ॥**

బ్రాహ్మణులు నిత్యమూ ఆచరించాల్సిన విధివిధానాన్ని చెబుతాను. సావధానులై వినండి.

**బ్రాహ్మే ముహూర్తే తూత్థాయ ధర్మమర్థం చ చిన్తయేత్ ।**
**కాయక్లేశం తదుద్భూతం ధ్యాయీత మనసేశ్వరమ్ ॥ 3 ॥**

బ్రాహ్మముహూర్తంలో లేచి, ధర్మార్థసాధనాలను సమకూర్చుకోవటానికి చేయాల్సిన శరీరశ్రమ ఎంత అని ఆలోచిస్తూనే మనసులో పరమాత్మను ధ్యానించాలి.

**ఉషఃకాలేऽథ సంప్రాప్తే కృత్వా చావశ్యకం బుధః ।**
**స్నాయాన్నదీషు శుద్ధాసు శౌచం కృత్వా యథావిధి ॥ 4 ॥**

ఉషఃకాలంవరకు ఆవశ్యకాలు ముగించుకుని, శౌచమాచరించి, శుద్ధమైన నదుల్లో విధ్యుక్తప్రకారం స్నానం చేయాలి.

**ప్రాతస్స్నానేన పూయన్తే యేऽపి పాపకృతో జనాః ।**
**తస్మాత్సర్వప్రయత్నేన ప్రాతస్స్నానం సమాచరేత్ ॥ 5 ॥**

ప్రాతస్స్నానంవల్ల పాపాత్ములు కూడ పరిశుద్ధులౌతారు. అందువల్ల సమస్తప్రయత్నాలతో ప్రాతఃస్నానం అవశ్యాచరణీయం.

**ప్రాతస్స్నానం ప్రశంసన్తి దృష్టాదృష్టకరం శుభమ్ ।**
**ఋషీణామృషితా నిత్యం ప్రాతస్స్నానాన్న సంశయః ॥ 6 ॥**

ప్రాతస్స్నానం దృష్టాదృష్ట ఫలాన్నిస్తుందని చెబుతారు. ఇది శుభప్రదం. దీనివల్లనే ఋషులకు ఋషిత్వం సిద్ధిస్తుంది. ఇందు సందేహం లేదు.

**ముఖే సుప్తస్య సతతం లాలా యాస్సంస్రవన్తి హి ।**
**తతో నైవాచరేత్కర్మ అకృత్వా స్నానమాదితః ॥ 7 ॥**

నిద్రించిన వాని ముఖంలో లాలాజలం స్రవిస్తుంటుంది. దాంతో స్నానం చేయకుండా నిత్యకర్మలాచరించరాదు. అందువల్ల మొదట స్నానం చేయాలి.

**అలక్ష్మీః కాలకర్ణీ చ దుస్స్వప్నం దుర్విచిన్తితమ్ ।**
**ప్రాతస్స్నానేన పాపాని పూయన్తే నాత్ర సంశయః ॥ 8 ॥**

ప్రాతఃకాలస్నానంవల్ల దారిద్ర్యం, కాంతిహీనత, దుస్స్వప్నాలు, దుర్విచింతన మొదలైన పాపాలు నశిస్తాయి. పరిశుద్ధి లభిస్తుంది. ఇందులో సంశయం లేదు.

**న చ స్నానం వినా పుంసాం పావనం కర్మ సుస్మృతమ్ ।**
**హోమే జప్యే విశేషేణ తస్మాత్స్నానం సమాచరేత్ ॥ 9 ॥**

స్నానంలేకుండా మనుష్యులకు హోమంలో కాని, జపంలో కాని పవిత్రకార్యయోగ్యత చేకూరదు. అందువల్ల ప్రాతఃస్నానం తప్పక చేయాలి.

**అశక్తావశిరస్కం వా స్నానమస్య విధీయతే ।**
**ఆర్ద్రేణ వాససా వాऽథ మార్జనం కాపిలం స్మృతమ్ ॥ 10 ॥**

శక్తిలేనపుడు శిరఃస్నానం కాకుండా కంఠస్నానం, అందుకు శక్తిచాలనపుడు తడిగుడ్డతో శరీరాన్ని తుడుచుకోవాలి. ఇది కపిలస్నానం.

**అసామర్థ్యే సముత్పన్నే స్నానమేవం సమాచరేత్ ।**
**బ్రాహ్మాదీని యథాశక్తి స్నానాన్యాహుర్మనీషిణః ॥ 11 ॥**

శక్తిలేనివారు కపిలస్నానమాచరించాలి. విద్వాంసులు బ్రాహ్మాదిస్నానాలు పేర్కొన్నారు.

**బ్రాహ్మమాగ్నేయముద్దిష్టం వాయవ్యం దివ్యమేవ వా ।**
**వారుణం యౌగికం తద్వత్ షోఢా స్నానం ప్రకీర్తితమ్ ॥ 12 ॥**

బ్రాహ్మం, ఆగ్నేయం, వాయవ్యం, దివ్యం, వారుణం, యౌగికం అని స్నానం ఆరు విధాలు.

**బ్రాహ్మన్తు మార్జనం మన్త్రైః కుశైస్సోదకబిందుభిః ।**
**ఆగ్నేయం భస్మనాపాదం మస్తకాద్దేహధూలనమ్ ॥ 13 ॥**

మంత్రం చదువుతూ దర్భలతో నీటి బిందువులను ప్రోక్షించటం బ్రాహ్మస్నానం. ఆపాదమస్తకం భస్మమలదుకోవటం ఆగ్నేయస్నానం.

**గవాం హి రజసా ప్రోక్తం వాయవ్యస్నానముత్తమమ్ ।**
**యత్తు సాతపవర్షేణ స్నానం తద్దివ్యముచ్యతే ॥ 14 ॥**

గోధూళి నలముకోవటం వాయవ్యస్నానం. ఎండతోకూడిన వానల్లో తడిసిపోవటం దివ్యస్నానం.

**వారుణం చావగాహస్తు మానసన్త్వాత్మవేదనమ్ ।**
**యౌగికం స్నానమాఖ్యాతం యోగో విష్ణువిచిన్తనమ్ ॥ 15 ॥**

నీటిలో మునుగుట వారుణస్నానం. ఆత్మతత్త్వాన్ని ధ్యానించటం మానసస్నానం. విష్ణుచింతనయే యోగము. అదియే యౌగికస్నానం.

**ఆత్మతీర్థమితి ఖ్యాతం సేవితం బ్రహ్మవాదిభిః ।**
**మనశ్శుచికరం పుంసాం నిత్యం తత్స్నానమాచరేత్ ॥ 16 ॥**

బ్రహ్మవాదులు ఎక్కువగా ఆచరించే ఈ స్నానాన్ని ఆత్మతీర్థం అంటారు. ఇది మానవుల మనుసును పవిత్రం గావిస్తుంది. అందువల్ల యోగస్నానం నిత్యం ఆచరించాలి.

**శక్తశ్చేద్వారుణం విద్వాన్ ప్రాజాపత్యం తథైవ చ ।**
**ప్రక్షాల్య దన్తకాష్ఠం వై భక్షయిత్వా విధానతః ॥ 17 ॥**

శక్తి ఉన్నపుడు వారుణ బ్రాహ్మస్నానాలను తప్పకుండా ఆచరించాలి. దంతకాష్ఠాన్ని బాగా కడిగి నమలాలి.

**ఆచమ్య ప్రయతో నిత్యం స్నానం ప్రాతస్సమాచరేత్ ।**
**మధ్యాఙ్గులిసమస్థౌల్యం ద్వాదశాఙ్గులిసమ్మితమ్ ॥ 18 ॥**

**సత్వచం దన్తకాష్ఠం స్యాత్ తదగ్రేణ తు ధావయేత్ ।**
**క్షీరవృక్షసముద్భూతం మాలతీసమ్భవం శుభమ్ ॥ 19**

**అపామార్గఞ్చ బిల్వం చ కరవీరం విశేషతః ।**
**వర్జయిత్వా నిన్దితాని గృహీత్వైకం యథోదితమ్ ॥ 20 ॥**

**పరిహృత్య దినం పాపం భక్షయేద్వై విధానవిత్ ।**
**నోత్పాటయేద్దన్తకాష్ఠం నాఙ్గుల్యా ధావయేత్క్వచిత్ ॥ 21 ॥**
**ప్రక్షాల్య భంక్త్వా తజ్జహ్యాచ్ఛుచౌ దేశే సమాహితః ।**

బాగా దంతధావనం చేసుకొని, ఆచమించి, ప్రాతఃకాలస్నానం ఆచరించాలి. మధ్యవేలంత లావుండి, పన్నెండు అంగుళాల పొడవున్న పైన తోలున్న దంతకాష్ఠాన్ని ఉపయోగించాలి. దాని కొసతో ముఖశుద్ధి గావించుకోవాలి. పాలుకారే చెట్లయొక్క మాలతీవృక్షములయొక్క పుల్లలు శుభప్రదం. ఉత్తరేణి, బిల్వం, కరవీర పుల్లలు మంచివి. నిందిత వృక్షాలు విడిచి విహితమైన వానిలో నొకదానిని గ్రహించాలి. పాపదినాలను విడిచి

శాస్త్రోక్తప్రకారం పుల్లల్ని నమిలి దంతధావనం చేసుకోవాలి. మొత్తం దంతకాష్ఠాన్ని పెకలించకూడదు. వ్రేళ్ళతో పండ్లను తోముకోకూడదు. ధావనం తర్వాత పండ్లపుల్లను కడిగి విరిచి పవిత్ర ప్రదేశంలో వేయాలి.

**స్నాత్వా సన్తర్పయేద్దేవాన్ ఋషీన్ పితృగణాంస్తథా ।**
**ఆచమ్య మన్త్రవన్నిత్యం పునరాచమ్య వాగ్యతః ॥ 22 ॥**

**సంమార్జ్య మన్త్రైరాత్మానం కుశైస్సోదకబిన్దుభిః ।**
**ఆపో హి ష్ఠా వ్యాహృతిభిః సావిత్ర్యా వారుణైశ్శుభైః ॥ 23 ॥**

**ఓఙ్కారవ్యాహృతియుతాం గాయత్రీం వేదమాతరమ్ ।**
**జప్త్వా జలాఞ్జలిం దద్యాత్ భాస్కరం ప్రతి తన్మనాః ॥ 24 ॥**

**ప్రాక్కూలేషు సమాసీనో దర్భేషు సుసమాహితః ।**
**ప్రాణాయామత్రయం కృత్వా ధ్యాయేత్సన్ధ్యామితి శ్రుతిః ॥ 25 ॥**

తర్వాత స్నానమాచరించి దేవ, ఋషి, పితృదేవతలకు తర్పణాలాచరించాలి. మళ్ళీ ఆచమించి, వాఙ్నియమంతో ఆపోహిష్ఠా అనే సమ్మార్జన మంత్రాలతో, దర్భలతో, గాయత్రీ వ్యాహృతులతో, శుభప్రదమైన వారుణమంత్రంతో జలాన్ని ప్రోక్షించుకోవాలి. తర్వాత ఓంకారంతో, వ్యాహృతులతో కూడిన వేదమాతయైన గాయత్రీ మంత్రాన్ని జపించి సూర్యునుద్దేశించి తన్మనస్కుడై జలాంజలి వదలవలెను. ప్రాగగ్రదర్భలపై కూర్చుని, సావధానంతో మూడు మార్లు ప్రాణాయామం చేసి, సంధ్యావందనమాచరించవలెనని శ్రుతివాక్యం.

**యా సన్ధ్యా సా జగత్సూతిర్మాయాతీతా హి నిష్కలా ।**
**ఐశ్వరీ తు పరాశక్తిస్తత్త్వత్రయసముద్భవా ॥ 26 ॥**

జగత్తును సృజించేది సంధ్యయే. మాయాతీత, నిర్వికల్ప, ఈశ్వరుని పరాశక్తియే సంధ్య. మూడు తత్త్వాల నుండి పుట్టినది.

**ధ్యాత్వాஉర్కమణ్డలగతాం సావిత్రీం వై జపన్బుధః ।**
**ప్రాఙ్ముఖస్సతతం విప్రః సంధ్యోపాసనమాచరేత్ ॥ 27 ॥**

సూర్యమండల మధ్య ప్రదేశంలో ఉన్న సావిత్రిని ధ్యానించి, జపించి, ఎల్లవేళలా తూర్పుముఖంగానే సంధ్యోపాసన చేయాలి.

**సన్ధ్యాహీనోஉశుచిర్నిత్యమనర్హస్సర్వకర్మసు ।**
**యదన్యత్కురుతే కిఞ్చిన్న తస్య ఫలమాప్నుయాత్ ॥ 28 ॥**

సంధ్యాహీనుడు అశుచి అవుతాడు. ఏ కర్మాచరణకు తగడు. సంధ్యావందన మాచరించకుండా చేసిన ఏ కర్మా ఫలించదు.

**అనన్యచేతసశ్శాన్తా బ్రాహ్మణా వేదపారగాః ।**
**ఉపాస్య విధివత్సన్ధ్యాం ప్రాప్తాః పూర్వం పరాం గతిమ్ ॥ 29 ॥**

పూర్వకాలంలో అనన్యమనస్కులై శాంతులైన వేదబ్రాహ్మణులు యథావిధి సంధ్యనుపాసించి ఉత్తమగతినందినారు.

**యోఽన్యత్ర కురుతే యత్నం ధర్మకార్యే ద్విజోత్తమః ।**
**విహాయ సన్ధ్యాప్రణతిం స యాతి నరకాయుతమ్ ॥ 30 ॥**

సంధ్యావందనం వదలి ఇతర ధర్మకార్యాలను ప్రయత్నించేవారు పలునరకాలను పొందుతారు.

**తస్మాత్సర్వప్రయత్నేన సన్ధ్యోపాసనమాచరేత్ ।**
**ఉపాసితో భవేత్తేన దేవో యోగతనుః పరః ॥ 31 ॥**

అందువల్ల అన్నివిధాల ప్రయత్నించి సంధ్యోపాసన చేయాలి. దీనితో యోగస్వరూపుడైన భగవంతుడు పూజితుడవుతాడు.

**సహస్రపరమాం నిత్యం శతమధ్యాం దశావరామ్ ।**
**సావిత్రీం వై జపేద్విద్వాన్ ప్రాఙ్ముఖః ప్రయతస్థితః ॥ 32 ॥**

తూర్పుముఖంగా ఏకాగ్రచిత్తంతో నిలిచి నిత్యం వేయి, నూరు, పదిమార్లైనా గాయత్రీమంత్రాన్ని జపించాలి. వేయి ఉత్తమం. నూరు మధ్యమం. పది అధమం.

**అథోపతిష్ఠేదాదిత్యం ఉద్యన్తం వై సమాహితః ।**
**మంత్రైస్తు వివిధైస్సౌరైః ఋగ్యజుస్సామసమ్భవైః ॥ 33 ॥**

తర్వాత సావధానంతో లేచి నిల్చొని ఉదయించేవేళ సూర్యోపస్థానం కావించాలి. ఋగ్యజుస్సామమంత్రాలు సూర్యుని స్తుతించేవి చాలగలవు.

**ఉపస్థాయ మహాయోగం దేవదేవం దివాకరమ్ ।**
**కుర్వీత ప్రణతిం భూమౌ మూర్ధ్నా తేనైవ మన్త్రతః ॥ 34 ॥**

వానితో సూర్యుని దేవదేవుడు మహాయోగరూపునారాధించి ఆ మంత్రాలతో శిరసు భూమిని తాకేవిధంగా ప్రణామం గావించాలి.

**ఓం ఖద్యోతాయ చ శాన్తాయ కారణత్రయహేతవే ।**
**నివేదయామి చాఽఽత్మానం నమస్తే విశ్వరూపిణే ॥ 35 ॥**

ఓంకారస్వరూపుడు, ఆకాశమందు ప్రకాశించేవాడు లేదా ఇంద్రియాలను ప్రవర్తింపచేసేవాడు, శాన్తస్వరూపుడు, సృష్టిస్థితిలయకారకులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు గూడా కారణభూతుడగు ప్రపంచస్వరూపునికి నన్ను నేను నివేదించుకొంటున్నాను.

**నమస్తే ఘృణినే తుభ్యం సూర్యాయ బ్రహ్మరూపిణే ।**
**త్వమేవ బ్రహ్మ పరమం ఆపో జ్యోతీ రసోఽమృతమ్ ॥ 36 ॥**

దయామయుడవగు నీకు నమస్కారము, బ్రహ్మస్వరూపుడగు సూర్యునికి నమస్కారము, నీవే పరబ్రహ్మము, జలము, జ్యోతిస్సు, రసము, అమృతము.

**భూర్భువస్స్వస్త్వమోఙ్కారః శర్వో రుద్రస్సనాతనః ।**
**పురుషస్సన్మహోఽన్తస్థం ప్రణమామి కపర్దినమ్ ॥ 37 ॥**

నీవే భూః, భువః సువః అను మూడు వ్యాహృతులు, ఓంకారము, శర్వుడవు, రుద్రుడవు, సనాతనుడవు, పరమపురుషుడవు, సర్వహృదయాంతర్గతుడైన కపర్దియగు నిన్ను నమస్కరిస్తున్నాను.

**త్వమేవ విశ్వం బహుధా జాతం యజ్జాయతే చ యత్ ।**
**నమో రుద్రాయ సూర్యాయ త్వామహం శరణం గతః ॥ 38 ॥**

అనేక రూపములుగా ఉద్భవించినదీ, ఉద్భవించేదీ అంతయు నీ రూపమే రుద్రుడవు సూర్యుడవు అగు నీకు నమస్కారము. నిన్ను నేను శరణు పొందాను.

**ప్రచేతసే నమస్తుభ్యం నమో మీఢుష్టమాయ చ ।**
**నమో నమస్తే రుద్రాయ త్వామహం శరణం గతః ॥ 39 ॥**

వరుణస్వరూపుడు, శివస్వరూపుడవగు నీకు నమస్కారము, రుద్రస్వరూపుడవగు నీకు నమస్కారము. నిన్ను నేను శరణు పొందాను.

**హిరణ్యబాహవే తుభ్యం హిరణ్యపతయే నమః ।**
**అమ్బికాపతయే తుభ్యం ఉమాధిపతయే నమః ॥ 40 ॥**

హిరణ్యబాహువు, హిరణ్యపతి, అంబికాపతి, ఉమాధిపతియగు నీకు నమస్కారం.

**నమోఽస్తు నీలగ్రీవాయ నమస్తుభ్యం పినాకినే ।**
**విలోహితాయ భర్గాయ సహస్రాక్షాయ తే నమః ॥ 41 ॥**

**తమోఽపహాయ తే నిత్యం ఆదిత్యాయ నమోఽస్తు తే ।**
**నమస్తే వజ్రహస్తాయ త్ర్యమ్బకాయ నమో నమః ॥ 42 ॥**

నీలగ్రీవుడు, పినాకి, విలోహితుడు, భర్గుడు, సహస్రాక్షుడు, తమస్సును అపహరించేవాడు ఆదిత్య, వజ్రహస్త, త్ర్యయంబకుడవైన నీకు నమస్కారం.

**ప్రపద్యే త్వాం విరూపాక్షం మహాన్తం పరమేశ్వరమ్ ।**
**హిరణ్మయే గృహే గుప్తం ఆత్మానం సర్వదేహినామ్ ॥**
**నమస్యామి పరం జ్యోతిర్బ్రహ్మాణం త్వాం పరామృతమ్ । 43 ॥**

**విశ్వం పశుపతిం భీమం నరనారీశరీరిణమ్ ।**
**నమస్సూర్యాయ రుద్రాయ భాస్వతే పరమేష్ఠినే ॥ 44 ॥**

విరూపాక్షుడవు, మహానుభావుడవు, పరమేశ్వరుడవైన నిన్ను శరణు పొందుతున్నాను. సకల శరీరుల బంగారుమయమైన హృదయగుహలో దాగి ఉన్న నిన్ను నమస్కరిస్తున్నాను. పరంజ్యోతి, పరాగతి, పరబ్రహ్మవైన నిన్ను నమస్కరిస్తున్నాను. ప్రపంచరూపుడవు, పశుపతివి, భయంకరరూపుడవు, అర్ధనారీశ్వరుడవు, పరమేష్ఠివైన రుద్రునికి నీకు నమస్కారం.

**ఉగ్రాయ సర్వతక్షాయ త్వాం ప్రపద్యే స్తవైరపి ।**
**ఏతద్వై సూర్యహృదయం జప్త్వా స్తవమనుత్తమమ్ ॥ 45 ॥**

**ప్రాతః కాలేఽథ మధ్యాహ్నే నమస్కుర్యాద్దివాకరమ్ ।**
**ఇదం శిష్యాయ పుత్రాయ ధార్మికాయ ద్విజాతయే ॥ 46 ॥**

ఉగ్రుడవై అందరు సేవించే నిన్ను అన్ని కాలాల్లో శరణు పొందుతున్నాను. పరమోత్తమమైన ఈ సూర్యహృదయస్తవాన్ని ప్రాతర్మధ్యాహ్నకాలాల్లో పఠించి సూర్యునికి నమస్కరించాలి. దీన్ని శిష్యుడు, పుత్రుడు, ధార్మికుడైన బ్రాహ్మణునికి ఇవ్వాలి.

**ప్రదేయం సూర్యహృదయం బ్రహ్మణా తు ప్రదర్శితమ్ ।**
**సర్వపాపప్రశమనం వేదసారసముద్భవమ్ ॥ 47 ॥**

**బ్రాహ్మణానాం హితం పుణ్యం ఋషిసఙ్ఘైర్నిషేవితమ్ ।**
**అథాఽఽగమ్య గృహం విప్రః సమాచమ్య యథావిధి ॥ 48 ॥**

**ప్రజ్వాల్య వహ్నిం విధివత్ జుహుయాజ్జాతవేదసమ్ ।**
**ఋత్విక్ పుత్రోఽథ పత్నీ వా శిష్యో వాఽపి సహోదరః ॥ 49 ॥**

**ప్రాప్యానుజ్ఞాం విశేషేణ హ్యధ్వర్యుర్వా యథావిధి ।**
**పవిత్రపాణిః పూతాత్మా శుక్లాంబరధరశ్శుచిః ॥ 50 ॥**

**అనన్య మనసా నిత్యం జుహుయాత్సంయతేన్ద్రియః ।**
**వినా దర్భేణ యత్కర్మ వినా సూత్రేణ వా పునః ।**
**రాక్షసం తద్భవేత్సర్వం నాముత్రేహ ఫలప్రదమ్ ॥ 51 ॥**

ఈ సూర్యహృదయం సర్వపాప ప్రశమనం. వేదసారం నుండి ఉద్భవించింది. ఋషిసంఘం దీన్ని సేవించినది. బ్రాహ్మణులకు హితాన్ని కలిగిస్తుంది. పవిత్రమైనది. ఆ తర్వాత విప్రుడు ఇంటికి వచ్చి విధివిహితంగా ఆచమనంచేసి, యథావిధి అగ్నిని జ్వలింపచేసి హోమాన్ని చేయాలి. ఈ విధంగా యజమాని అగ్నిహోత్రాన్ని చేయలేని పక్షంలో తన ప్రతినిధిగా ఋత్విక్ పుత్రుడు, పత్ని, శిష్యుడు, సోదరుడు కాని ఆజ్ఞ పొంది హోమం

చేయవచ్చును. పవిత్రాన్ని ధరించి పవిత్రుడై తెల్లని వస్త్రాన్ని ధరించి ఏకాగ్రతతో జితేంద్రియుడై అగ్నిలో హోమాన్ని చేయవలెను. దర్భలు లేకుండా యజ్ఞోపవీతం లేకుండా చేసిన కర్మ రాక్షసమవుతుంది. అది ఇహ పరలోకాల్లో ఫలప్రదం కాజాలదు.

**దైవతాని నమస్కుర్యాదుపహారాన్నివేదయేత్ ।**
**దద్యాత్పుష్పాదికం తేషాం వృద్ధాంశ్చైవాభివాదయేత్ ॥ 52 ॥**

దేవతలకు నమస్కరించాలి. ఉత్తమవస్తువుల నర్పించాలి. దేవతలకు పుష్పాదికమర్పించాలి. వృద్ధులకు నమస్కరించాలి.

**గురుం చైవాప్యుపాసీత హితఞ్చాస్య సమాచరేత్ ।**
**వేదాభ్యాసం తతః కుర్యాత్ప్రయత్నాచ్ఛక్తితో ద్విజః ॥ 53 ॥**

గురువును సేవించాలి. తన శక్తికొలదీ గురువుకు హితాన్ని సమకూర్చాలి. ద్విజుడు తన శక్తికొలది వేద్యాభ్యాసం చేయాలి.

**జపేదధ్యాపయేచ్ఛిష్యాన్ ధారయేచ్చ విచారయేత్ ।**
**అపేక్షేత చ శాస్త్రాణి ధర్మాదీని ద్విజోత్తమః ॥ 54 ॥**

జపమాచరించాలి. శిష్యులను చదివించి వాటిని ధరించాలి. పర్యాలోచించాలి. ధర్మశాస్త్రాలు ముఖ్యంగా ద్విజుడు చింతించాలి.

**వైదికాంశ్చైవ నిగమాన్ వేదాఙ్గాని విశేషతః ।**
**ఉపేయాదీశ్వరం చాథ యోగక్షేమప్రసిద్ధయే ॥ 55 ॥**

వేదాంగాలను కూడా అధ్యయనం చేయాలి. తర్వాత యోగక్షేమాలకొరకు ఈశ్వరుని శరణు వేడాలి.

**సాధయేద్వివిధానర్థాన్ కుటుంబార్థే తతో ద్విజః ।**
**తతో మధ్యాహ్నసమయే స్నానార్థం మృదమాహరేత్ ॥ 56 ॥**

**పుష్పాక్షతాన్కుశతిలాన్ గోమయం శుద్ధమేవ చ ।**
**నదీషు దేవఖాతేషు తటాకేషు సరస్సుచ ॥ 57 ॥**

**స్నానం సమాచరేన్నిత్యం గర్తప్రస్రవణేషు చ ।**
**పరకీయనిపానేషు న స్నాయాద్వై కదాచన ॥ 58 ॥**

**పఞ్చపిణ్డాన్సముద్ధృత్య స్నాయాద్వా సమ్భవే పునః ।**
**మృదైకయా శిరః క్షాల్యం ద్వాభ్యాం నాభేస్తథోపరి ॥ 59 ॥**

**అధశ్చ తిసృభిః కాయం పాదౌషడ్భిస్తథైవ చ ।**
**మృత్తికా చ సముద్దిష్టా త్వార్ద్రామలకమాత్రికా ॥ 60 ॥**

**గోమయస్య ప్రమాణం తత్తేనాఙ్గం లేపయేత్తతః ।**
**లేపయిత్వా తు తీరస్థః తల్లిఙ్గైరేవ మన్త్రతః ॥ 61 ॥**

ఆ తర్వాత బ్రాహ్మణుడు తన కుటుంబంకోసం పలువిధాలైన సంపదలను సంపాదించాలి. తర్వాత మాధ్యాహ్నిక స్నానంకోసం మృత్తికను, పుష్పాక్షత దర్భ తిలలను, శుభ్రమైన గోమయాన్ని సంపాదించాలి. నదులలో, దేవతలు నిర్మించిన కుండాల్లో, తటాకాలు, సరస్సులు, సెలయేళ్ళు, జలాశయాల్లో స్నానం చేయవలెను. ఇతరుల జలాశయాల్లో ఎప్పుడూ స్నానం చేయరాదు. అట్లా వీలుకానపుడు జలాశయం నుండి అయిదు మట్టిముద్దలను తీసి స్నానం చేయాలి. ఒకమట్టిముద్దతో శిరస్సును, రెండుమట్టిముద్దలతో నాభిపైభాగాన్ని, మూడుమట్టిముద్దలతో క్రింది భాగాన్ని, పాదాలను ఆరుమట్టిముద్దలతో శుద్ధి చేసుకొనవలెను. పచ్చి ఉసిరికాయంత మట్టిని అంతే ప్రమాణంలో గోమయాన్ని తీసుకొని దానితో శరీరాన్ని రుద్దవలెను.

**ప్రక్షాల్యాచమ్య విధివత్ తతస్స్నాయాత్సమాహితః ।**
**అభిమన్త్ర్య జలం మన్త్రైస్తల్లిఙ్గైర్వారుణైశ్శుభైః ॥ 62 ॥**

**భావపూతస్తదవ్యక్తం ధ్యాయన్వైవిష్ణుమత్యయమ్ ।**
**ఆపో నారాయణోద్భూతాః తా ఏవాస్యాయనం పునః ॥ 63 ॥**

**తస్మాన్నారాయణం దేవం స్నానకాలే స్మరేద్బుధః ।**
**ప్రోచ్య సోఙ్కారమాదిత్యం త్రిర్నిమజ్జేజ్జలాశయే ॥ 64 ॥**

**ఆచాన్తః పునరాచామేత్ మన్త్రేణానేన మన్త్రవిత్ ।**
**అన్తశ్చరసి భూతేషు గుహాయాం విశ్వతోముఖః ॥ 65 ॥**

**త్వం యజ్ఞస్త్వం వషట్కార ఆపో జ్యోతీ రసోఽమృతమ్ ॥**
**ద్రుపదాం వా త్రిరభ్యస్యేత్ వ్యాహృతిప్రణవాన్వితామ్ ॥ 66 ॥**

**సావిత్రీం వా జపేద్విద్వాన్ తథా చైవాఘమర్షణమ్ ।**
**తతస్సమ్మార్జనం కుర్యాత్ ఆపోహిష్ఠామయోభువః ॥ 67 ॥**

**ఇదమాపః ప్రవహతవ్యాహృతీభిస్తథైవ చ ।**
**తతోఽభిమన్త్ర్య తత్తీర్థం ఆపోహిష్ఠాదిమన్త్రకైః ॥ 68 ॥**

**అన్తర్జలగతో మగ్నో జపేత్త్రిరఘమర్షణమ్ ।**
**త్రిపదాం వాథ సావిత్రీం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 69 ॥**

**ఆవర్తయేద్వా ప్రణవం దేవం వా సంస్మరేద్ధరిమ్ ।**
**ద్రుపదాదివ యో మన్త్రో యజుర్వేదే ప్రతిష్ఠితః ॥**
**అన్తర్జలే త్రిరావర్త్య సర్వపాపైః ప్రముచ్యతే । 70 ॥**

వారుణమంత్రాలతో జలాన్ని అభిమంత్రించి పవిత్రభావంతో అవ్యయుడైన శ్రీమహావిష్ణువును ధ్యానిస్తూ స్నానం చేయాలి. జలములు నారాయణుని నుండి పుట్టినవి. జలములే నారాయణుని ఆధారములు. అందువల్ల స్నానకాలంలో నారాయణుని ధ్యానించాలి. ఓంకారంతో ఆదిత్యమంత్రాన్ని జపించి ముమ్మారు నీటిలో మునగాలి. ఆచమనం చేసినవారైనా మంత్రాన్ని తెలిసినవాళ్ళు మళ్ళీ ఈ మంత్రంతో ఆచమనం చేయాలి. విశ్వతోముఖుడవైన నీవు అన్ని ప్రాణుల అంతర్యామిగా హృదయంలో సంచరిస్తావు. నీవే యజ్ఞానివి. నీవే ఓంకారానివి. జలం జ్యోతి, రసం అమృతం అన్నీ నీవే అని స్తుతించాలి. విద్వాంసుడు ద్రుపదాదివ మంత్రాన్ని మూడుమార్లు వ్యాహృతులు ప్రణవంతో కూడిన గాయత్రీమంత్రాన్ని కాని, అఘమర్షణమంత్రాన్నికాని జపించాలి. తర్వాత 'ఆపోహిష్ఠామయో భువః' 'ఇదమాపః ప్రవహిత' ఇత్యాది మంత్రాలతో వ్యాహృతులతో సమ్మార్జనం చేసుకోవాలి. తర్వాత ఆ జలాన్ని ఆపోహిష్ఠాది మంత్రాలతో అభిమంత్రించి నీటిలో మునిగి, అందులో అఘమర్షణ మంత్రాన్ని మూడుసార్లు జపించాలి. త్రిపద అయిన గాయత్రిని కాని 'తద్విష్ణోః పరమం పదం' అనే మంత్రాన్ని కాని, ఓంకారాన్ని కాని, జపించాలి. లేదా శ్రీహరిని స్మరించాలి. యజుర్వేదంలోని 'ద్రుపదా దివ ముంచతు' అనే మంత్రాన్ని నీటిలో మునిగి మూడుసార్లు జపించిన వాని పాపాలన్నీ నశిస్తాయి.

**అపః పాణౌ సమాదాయ జప్త్వా వై మార్జనే కృతే ।**
**విన్యస్య మూర్ధ్ని తత్తోయం ముచ్యతే సర్వపాతకైః ॥ 71 ॥**

**యథాఽశ్వమేధః క్రతురాట్ సర్వపాపాపనోదనః ।**
**తథాఽఘమర్షణం సూక్తం సర్వపాపాపనోదనమ్ ॥ 72 ॥**

చేతిలో నీటిని గ్రహించి, జపించి, మార్జనం చేసి, ఆ జలాన్ని శిరసుపై చల్లుకొన్నట్లైతే సకలపాపాల నుండి విముక్తుడవుతాడు. అశ్వమేధయాగం సకలపాపనివారకమైనట్టే అఘమర్షణ మంత్రం కూడ సర్వపాప హరమని చెప్పబడినది.

**అథోపతిష్ఠేదాదిత్యం మూర్ధ్ని పుష్పాన్వితాఞ్జలిమ్ ।**
**ప్రక్షిప్యాలోకయేద్దేవం ఉద్వయం తమసస్పరి ॥ 73 ॥**

**ఉదుత్యం చిత్రమిత్యేతే తచ్చక్షురితి మంత్రతః ।**
**హంసః శుచిషదేతేన సావిత్ర్యా చ విశేషతః ॥ 74 ॥**

**అన్యైశ్చ వైదికైర్మన్త్రైః సౌరైః పాపప్రణాశనైః ।**
**సావిత్రీం వై జపేత్పశ్చాజ్జపయజ్ఞస్స వై స్మృతః ॥ 75 ॥**

పూలు నింపిన దోసిలి శిరమున నిల్పి సూర్యోపస్థానం కావించాలి. ఆ పువ్వులను సూర్యునిపై చల్లి ఉద్వయం తమసస్పరి, ఉదుత్యం జాతవేదసం, చిత్రం దేవానాముదగా దనీకం, తచ్చక్షుర్దేవహితం పురస్తాత్, హంసశ్శుచిషద్వసురన్తరిక్ష' అనే మంత్రాలతోకాని, గాయత్రీమంత్రంతోకాని, ఇతర వైదికమంత్రాలతో లేదా పాపనాశకాలైన సౌరమంత్రాలతో జపించి తర్వాత మళ్ళీ గాయత్రీమంత్రం జపించాలి. దీన్ని జపయజ్ఞమంటారు.

**వివిధాని పవిత్రాణి గుహ్యావిద్యాస్తథైవ చ ।**
**శతరుద్రీయమథర్వశిరస్సౌరాంశ్చ శక్తితః ॥ 76 ॥**
**ప్రాక్కూలేషు సమాసీనః కుశేషు ప్రాఙ్ముఖశ్శుచిః ।**

**తిష్ఠంశ్చేదీక్షమాణోఽర్కం జప్యం కుర్యాత్సమాహితః ।**
**స్ఫాటికేంద్రాక్షరుద్రాక్షైః పుత్రజీవసముద్భవైః ॥ 77 ॥**

**కర్తవ్యా త్వక్షమాలా స్యాదుత్తరాదుత్తమా స్మృతా ।**
**జపకాలే న భాషేత నాన్యాని ప్రేక్షయేద్బుధః ॥ 78 ॥**

**న కమ్పయేచ్ఛిరో గ్రీవాం దన్తాన్నైవ ప్రకాశయేత్ ।**
**గుహ్యకా రాక్షసాస్సిద్ధా హరన్తి ప్రసభం యతః ॥ 79 ॥**

ప్రాగగ్రాల దర్భలపై ప్రాఙ్ముఖుడై కూర్చుండి సూర్యభగవానుని చూస్తూ సావధానచిత్తంతో పలువిధాలు పవిత్రాలు అయిన మంత్రాలను, రహస్య విద్యలను, శతరుద్రీయాన్ని, అధర్వశిరో మంత్రాలు సౌరమంత్రాలను జపించాలి. నిల్చొని ఉంటే సూర్యుణ్ణి చూస్తూ జపం చేయాలి. స్ఫటికమాల, ఇంద్రాక్ష రుద్రాక్ష, పుత్రజీవ మాలల్లోనొకదానిని జపమాలగా చేసుకోవాలి. వీనిలో మొదటి దానికంటె తరువాతి మాల శ్రేష్ఠమని గ్రహించాలి. తల మెడ కదల్చరాదు. అలా అయితే దంతాలు కన్పించరాదు. గుహ్యక రాక్షస సిద్ధులు వెంటనే ఫలాన్ని హరిస్తారు.

**ఏకాన్తే తు శుభే దేశే తస్మాజ్జప్యం సమాచరేత్ ।**
**చణ్డాలాశౌచపతితాన్ దృష్ట్వాచమ్య పునర్జపేత్ ॥ 80 ॥**

**తైరేవ భాషణం కృత్వా స్నాత్వా చైవ జపేత్పునః ।**
**ఆచమ్య ప్రయతో నిత్యం జపేదశుచిదర్శనే ॥ 81 ॥**

అందువల్ల ఏకాంతంలో శుభ్రమైన ప్రదేశంలో జపం చేయాలి. ఆ సమయంలో చండాలురు, అపవిత్రులు, పతితులు కనిపించినట్లైతే ఆచమనంచేసి మళ్ళీ జపించాలి. వారితో మాట్లాడితే స్నానం చేసి జపించాలి. అపవిత్రమైనవాటిని చూస్తే పరిశుద్ధుడై ఆచమనంచేసి జపంచేయాలి.

**సౌరాన్మన్త్రాన్ శక్తితో వై పావమానీస్తు కామతః ।**
**యది స్యాత్ క్లిన్నవాసా వై వారిమధ్యగతో జపేత్ ॥ 82 ॥**

**అన్యథా తు శుచౌ భూమ్యాం దర్భేషు సుసమాహితః ।**
**ప్రదక్షిణం సమావృత్య నమస్కృత్వా తతః క్షితౌ ॥ 83 ॥**

**ఆచమ్య చ యథాశాస్త్రం శక్త్యా స్వాధ్యాయమాచరేత్ ।**
**తతస్సన్తర్పయేత్ దేవాన్ ఋషీన్పితృగణాంస్తథా ॥ 84 ॥**

తడివస్త్రాన్ని ధరించి ఉంటే నీటి మధ్యలో నుండి సౌరమంత్రాలు లేదా పవమానమంత్రాలను యథాశక్తి ఇచ్ఛాపూర్వకంగా జపించాలి. పొడివస్త్రమైతే శుభ్రమైన భూమిపై కూర్చొని దర్భాసనుడై జపించాలి. జపం ముగిసిన తర్వాత ప్రదక్షిణ చేసి, భూమిపైన నమస్కరించి, శాస్త్రం ప్రకారం ఆచమనంచేసి స్వాధ్యాయం ప్రారంభించాలి. ఆ తర్వాత దేవ, ఋషి, పితృగణాలకు తర్పణమాచరించాలి.

**ఆదావోంకారముచ్చార్య నమోఽన్తే తర్పయామి వః ।**
**దేవాన్బ్రహ్మర్షీంశ్చైవ తర్పయేదక్షతోదకైః ॥ 85 ॥**

**తిలోదకైః పితౄన్ భక్త్యా స్వసూత్రోక్తవిధానతః ।**
**అన్వారబ్ధేన సవ్యేన పాణినా దక్షిణేన తు ॥ 86 ॥**

మొదట ఓకారంతో ఆరంభించి చివర 'నమః' అని చేర్చి తర్వాత 'తర్పయామి' అని తర్పణమాచరించాలి. దేవబ్రహ్మర్షులను అక్షతోదకంతో, పితృదేవతలను తిలోదకంతో తర్పణం చేయాలి. కుడి, ఎడమచేతులను చేర్చిన దోసిలితో యజ్ఞోపవీతాన్ని సవ్యంగా ధరించి దేవతలకు, నివీతిగా ఋషులకు తర్పణం చేయాలి. ప్రాచీనావీతియై పితృదేవతలకు తర్పణం గావించాలి.

**దేవర్షీంస్తర్పయేద్ధీమాన్ ఉదకాంజలిభిః పితౄన్ ।**
**యజ్ఞోపవీతీ దేవానాం నివీతీ ఋషితర్పణే ॥ 87 ॥**

**ప్రాచీనావీతిపిత్ర్యే తు స్వేన తీర్థేన భావతః ।**
**నిష్పీడ్య స్నానవస్త్రన్తు సమాచమ్య చ వాగ్యతః ॥ 88 ॥**

**స్వైః మంత్రైరర్చయేత్ దేవాన్ పుష్పైః పత్రైరథామ్బుభిః । 89 ॥**

పితృతర్పణానికి పూర్వం దేవతాతర్పణ విషయంలో స్నానవస్త్రాన్ని బాగా పిండుకొని, ఆచమించి, వాఙ్నియమంతో తమ శాఖోక్తమంత్రాలతో పుష్ప, పత్ర, జలాలతో దేవతలకు తర్పణం చేయాలి.

**బ్రహ్మాణం శంకరం సూర్యం తథైవ మధుసూదనమ్ ।**

**అన్యాంశ్చాభిమతాన్ దేవాన్ భక్త్యా చాక్రోధనోఽత్వరః ॥ 90 ॥**
**ప్రదద్యాదథ పుష్పాణి సూక్తేన పౌరుషేణ తు ।**

**ఆపో వా దేవతాస్సర్వాస్తేన సమ్యక్సమర్పితాః ॥ 91 ॥**

బ్రహ్మశంకర సూర్య శ్రీమహావిష్ణువులను, ఇతర ఇష్టదేవతలను భక్తితో కోపంలేక తొందరపడక పూజించాలి. పురుషసూక్తంతో హరికి పుష్పాలు సమర్పించాలి. జలం సర్వదేవతా స్వరూపమైనందువల్ల దానితోనే అర్చించాలి.

**ధ్యాత్వా ప్రణవపూర్వం వై దేవతాని సమాహితః ।**
**నమస్కారేణ పుష్పాణి విన్యసేద్వై పృథక్ పృథక్ ॥ 92 ॥**

**న విష్ణ్వారాధనాత్పుణ్యం విద్యతే కర్మవైదికమ్ ।**
**తస్మాదనాదిమధ్యాన్తం నిత్యమారాధయేద్ధరిమ్ ॥ 93 ॥**

**తద్విష్ణోరితి మంత్రేణ సూక్తేన పురుషేణ తు ।**
**నైతాభ్యాం సదృశో మంత్రో వేదేషూక్త శ్చతుర్ష్వపి ॥ 94 ॥**

ఓంకారోచ్చారణపూర్వకంగా సమాహితచిత్తుడై ఇష్టదేవతలను, ధ్యానించి విడివిడిగా నమస్కారంతో పూవులు సమర్పించాలి. శ్రీ మహావిష్ణ్వారాధనకంటే పవిత్రమైన వైదికకార్యం మరోటి లేదు. అందువల్ల అనాదిమధ్య నిధనుడైన శ్రీహరిని ప్రతిరోజు ఆరాధించాలి. 'తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి' ఇత్యాది మంత్రంతో, పురుషసూక్తాలతో సమానమైన మంత్రం నాల్గు వేదాల్లోనూ లేదు.

**నివేదయేత స్వాత్మానం విష్ణావమలతేజసి ।**
**తదాత్మా తన్మనాశ్శాన్తస్తద్విష్ణోరితి మంత్రతః ॥ 95 ॥**

**అథవా దేవమీశానం భగవన్తం సనాతనమ్ ।**
**ఆరాధయేన్మహాదేవం భావపూతో మహేశ్వరమ్ ॥ 96 ॥**

**మంత్రేణ రుద్రగాయత్ర్యా ప్రణవేనాథవా పునః ।**
**ఈశానేనాథవా రుద్రైస్త్ర్యమ్బకేన సమాహితః ॥**
**పుష్పైః పత్రైరథాద్భిర్వా చన్దనాద్యైర్మహేశ్వరమ్ ॥ 97 ॥**

'తద్విష్ణోః' ఇత్యాది మంత్రంతో తదాత్ముడై, అతనియందే మనసుంచి, శాంతుడు కావాలి. లేదా సనాతనుడు, భగవంతుడు, మహాదేవుడు, మహేశ్వరుడైన ఈశ్వరుని పరిశుద్ధభావంతో ఆరాధించాలి. రుద్రగాయత్రి, ప్రణవం, ఈశానమంత్రాలతో, రుద్రమంత్రాలతో, త్ర్యంబకంతో సావధానుడై పుష్ప, పత్ర, జల, చందనాదులతో మహేశ్వరు నారాధించవలెను.

**ఉక్త్వా నమశ్శివాయేతి మన్త్రేణానేన యోజయేత్ ।**
**నమస్కుర్యాన్మహాదేవం ఋతం సత్యమితీశ్వరమ్ ॥ 98 ॥**

**నివేదయీత స్వాత్మానం యో బ్రహ్మాణమితీశ్వరమ్ ।**
**ప్రదక్షిణం ద్విజః కుర్యాత్ పఞ్చ బ్రహ్మాణి వై జపన్ ॥ 99 ॥**

**ధ్యాయీత దేవమీశానం వ్యోమమధ్యగతం శివమ్ ।**
**అథావలోకయేదర్కం హంసః శుచిషదిత్యృచా ॥ 100 ॥**

'నమశ్శివాయ' అని మంత్రంతో చేర్చాలి. 'ఋతం సత్యం' అని ఈశ్వరుని నమస్కరించాలి. 'యో బ్రహ్మాణం' అనే మంత్రంద్వారా స్వాత్మనివేదన కావించుకోవాలి. శివుని అయిదు నామాలతో జపిస్తూ, ప్రదక్షిణ చేయాలి.

ఆకాశమధ్యగతుడైన శివుని ఈశానదేవుని ధ్యానించాలి. 'హంసశ్శుచిషద్వసు' మొదలైన మంత్రాలతో సూర్యభగవానుని దర్శనం చేసుకోవాలి.

**కుర్యాత్పఞ్చ మహాయజ్ఞాన్ గృహం గత్వా సమాహితః ।**
**దేవయజ్ఞం పితృయజ్ఞం భూతయజ్ఞం తథైవ చ ॥ 101 ॥**

**మానుష్యం బ్రహ్మయజ్ఞం చ పంచయజ్ఞాన్ప్రచక్షతే ।**
**యది స్యాత్తర్పణాదర్వాక్ బ్రహ్మయజ్ఞం కృతో న హి ॥ 102 ॥**

**కృత్వా మనుష్యయజ్ఞం వై తతస్స్వాధ్యాయమాచరేత్ ।**
**అగ్నేః పశ్చిమతో దేశే భూతయజ్ఞాన్త ఏవ వా ॥ 103 ॥**

**కుశపుఞ్జే సమాసీనః కుశపాణిస్సమాహితః ।**
**శాలాగ్నౌ లౌకికే వాఽగ్నౌ జలే భూమ్యామథాపి వా ।**

**వైశ్వదేవం తతః కుర్యాద్దేవయజ్ఞస్స వై స్మృతః ॥ 104 ॥**

తర్వాత ఇంటికి వెళ్ళి స్వస్థచిత్తుడై పంచ మహాయజ్ఞాలాచరించాలి. దేవ, పితృ, భూత, మనుష్య (అతిథి), బ్రహ్మ యజ్ఞాలనేవి పంచమహాయజ్ఞాలు. తర్పణంకంటె ముందుగా బ్రహ్మయజ్ఞమాచరించనట్లైతే మనుష్యయజ్ఞం చేసిన తర్వాత బ్రహ్మయజ్ఞం చేయాలి. అగ్నికి పశ్చిమంవైపు భూతయజ్ఞం చివర దర్భలపై దర్భలు ధరించి సావధానంగా కూర్చుని, యజ్ఞాగ్నిలోకాని, లౌకికాగ్నిలోకాని, జలంలోకాని, భూమియందుకాని వైశ్వదేవాన్ని ఆచరించాలి. దీన్నే దేవయజ్ఞమంటారు.

**యది స్యాల్లౌకికే పక్వం తతోఽన్నం తత్ర హూయతే ॥ 105 ॥**

**శాలాగ్నౌ తత్ర దేవాన్నం విధి రేష సనాతనః ।**
**దేవేభ్యస్తు హుతాదన్నాచ్ఛేషాద్భూతబలిం హరేత్ ॥ 106 ॥**

**భూతయజ్ఞస్స వై జ్ఞేయో భూతిదస్సర్వదేహినామ్ ।**
**శ్వభ్యశ్చ శ్వపచేభ్యశ్చ పతితాదిభ్య ఏవ చ ॥ 107 ॥**

**దద్యాద్భూమౌ బలిం త్వన్నం పక్షిభ్యోఽథ ద్విజోత్తమః ।**
**సాయం చాన్నస్య సిద్ధస్య పత్న్యమంత్రం బలిం హరేత్ ॥ 108 ॥**

**భూతయజ్ఞస్త్వయం నిత్యం సాయం ప్రాతర్విధీయతే ।**
**ఏకన్తు భోజయేద్విప్రం పితౄనుద్దిశ్య సత్తమమ్ ॥ 109 ॥**

**నిత్యశ్రాద్ధం తదుద్దిష్టం పితృయజ్ఞో గతిప్రదః ।**
**ఉద్ధృత్య వా యథాశక్తి కిఞ్చిదన్నం సమాహితః ॥ 110 ॥**

**వేదతత్త్వార్థవిదుషే ద్విజాయైవోపపాదయేత్ ।**
**పూజయేదతిథిం నిత్యం నమస్యేదర్చయేద్ద్విజమ్ ॥ 111 ॥**

లౌకికాగ్నిలో అన్నం వండినట్లైతే దీన్లో హవనం చేయవచ్చు. శాలాగ్నిలో వండినట్లైతే వైశ్వదేవం చేయాలి. ఇది కూడా సనాతన విధే. దేవయజ్ఞం చేయగా మిగిలిన అన్నంతో భూతయజ్ఞం చేయవచ్చు. ఇది ప్రాణులన్నింటికి ఐశ్వర్యాన్నిస్తుంది. కుక్కలు, చండాలురు. పతితులు. పక్షులకు, భూమిపై అన్నం పెట్టాలి. సాయంకాలం తాను వండిన అన్నాన్ని భార్య మంత్రంలేకుండా బలి ఇవ్వాలి. ఇదే భూతయజ్ఞం. ఇది ఉదయం సాయంత్రం కూడా విధింపబడినది. ప్రతినిత్యం ఒక ఉత్తమ బ్రాహ్మణునికి భోజనం పెట్టాలి. ఇది పితృదేవతల నుద్దేశించి చేసేది. దీన్ని నిత్యశ్రాద్ధం అంటారు. ఇది ఉత్తమగతిని ప్రసాదిస్తుంది. లేదా శక్తినిబట్టి కొద్ది అన్నాన్ని తీసిపెట్టి వేదతత్త్వార్థం తెలిసిన బ్రాహ్మణునికర్పించాలి. ప్రతిరోజు అతిథిని పూజించాలి. ద్విజుని నమస్కరించి అర్చించాలి.

**మనోవాక్కర్మభిః శాంతమాగతం స్వగృహం తతః ।**
**హంతకారమథాగ్రం వా భిక్షాం వా శక్తితో ద్విజః ॥ 112 ॥**

**దద్యాదతిథయే నిత్యం బుధ్యేత పరమేశ్వరమ్ ।**
**భిక్షామాహుర్గ్రాసమాత్రమగ్రం తస్యాశ్చతుర్గుణమ్ ॥ 113 ॥**

**పుష్కలం హన్తకారస్తు తచ్చతుర్గుణముచ్యతే ।**
**గోదోహమాత్రం కాలం వై ప్రతీక్ష్యో హ్యతిథిః స్వయమ్ ॥ 114 ॥**

తన యింటికి వచ్చిన వానికి త్రికరణశుద్ధిగా హంతకారమునుగాని, అగ్రమునుగాని, భిక్షను కాని శక్త్యనుసారం అతిథికీయాలి. అతనిని పరమేశ్వరునిగా భావించాలి. పిడికిలి అన్నాన్ని భిక్ష అని, దానికి నాల్గురెట్లను అగ్రమని, దానికి నాలుగురెట్లు పుష్కలమైన అన్నాన్ని హంతకారం అంటారు. గోదోహన కాలం వరకు స్వయంగా అతిథికోసం ఎదురుచూడాలి.

**అభ్యాగతాన్ యథాశక్తి పూజయేదతిథిం యథా ।**
**భిక్షాం వై భిక్షవే దద్యాత్ విధివద్బ్రహ్మచారిణే ॥ 115 ॥**

**దద్యాదన్నం యథాశక్తి త్వర్థిభ్యో లోభవర్జితః ।**
**సర్వేషామప్యలాభే తు అన్నం గోభ్యో నివేదయేత్ ॥ 116 ॥**

**భుఞ్జీత బంధుభిస్సార్ధం వాగ్యతోఽన్నమకుత్సయన్ ।**
**అకృత్వా తు ద్విజః పఞ్చమహాయజ్ఞాన్ ద్విజోత్తమాః ॥ 117 ॥**

**భుంజీత చేత్స మూఢాత్మా తిర్యగ్యోనిం స గచ్ఛతి ।**
**వేదాభ్యాసోఽన్వహం శక్త్యా మహాయజ్ఞక్రియా క్షమా ।**

**నాశయత్యాశు పాపాని దేవానామర్చనం తథా ॥118॥**

యథాశక్తి పంచమహాయజ్ఞాలు, క్షమ, దేవతాపూజ ఇవి శీఘ్రంగా పాపాలను నశింపచేస్తాయి. అదేవిధంగా వచ్చిన ఆభ్యాగతులను కూడా అతిథిసమానంగా పూజించాలి. బ్రహ్మచారి భిక్షుకునికి యథావిధి భిక్షనీయవలెను. లోభంలేక యాచకులకు శక్తికొలది అన్నదానం చేయాలి. యాచక, భిక్షుక, అభ్యాగతులెవరు రానపుడు అన్నాన్ని గోవులకర్పించాలి. అన్నాన్ని నిందించక, మౌనంగా, బంధువులతో కలిసి భుజించాలి. ద్విజుడు పంచమహాయజ్ఞాలు చేయకుండా భుజిస్తే పశువై పుడతాడు. ప్రతిదినం యథాశక్తి వేదాభ్యాసం చేయాలి.

**యో మోహాదథవాలస్యాదకృత్వా దేవతార్చనమ్ ॥ 119 ॥**

**భుంక్తే స యాతి నరకాన్ సూకరేష్వభిజాయతే ।**
**తస్మాత్సర్వప్రయత్నేన కృత్వా కర్మాణి వై ద్విజాః ।**
**భుంజీత స్వజనైస్సార్థం స యాతి పరమాం గతిమ్ ॥120॥**

మోహంతో కాని, బద్ధకంతోకాని దేవతార్చన చేయకుండా భుజిస్తే నరకాన్ని పొందుతాడు. తర్వాత గ్రామసూకరంగా జన్మిస్తాడు. అందువల్ల అన్నివిధాల ప్రయత్నించి నిత్యకర్మలు శాస్త్రప్రకారం ఆచరించిన తర్వాత ద్విజుడు తనవారితో కలిసి భుజించినట్లైతే ఉత్తమగతినందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే బ్రాహ్మణానాం నిత్యానిత్యకర్తవ్యకర్మాణి నామ అష్టాదశోఽధ్యాయః ॥ 18 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో బ్రాహ్మణుల నిత్యానిత్యకర్తవ్యకర్మలనే పద్దెనిమిదవ అధ్యాయం ॥ 18 ॥



## ఏకోనవింశోఽధ్యాయః – పందొమ్మిదవ అధ్యాయం

## వ్యాసగీతాసు బ్రాహ్మణానాం నిత్యకర్తవ్యకర్మసు భోజనాదిప్రకారవర్ణనమ్

వ్యాసగీతలో బ్రాహ్మణుల నిత్యకర్తవ్యకర్మలలో భోజనాదుల పద్ధతి

**వ్యాస ఉవాచ :–**వ్యాసమహర్షి చెప్పాడు

**ప్రాఙ్ముఖోఽన్నాని భుంజీత సూర్యాభిముఖ ఏవ వా ।**
**ఆసీనస్త్వాసనే శుద్ధే భూమ్యాం పాదౌ నిధాయ తు ॥ 1 ॥**

**ఆయుష్యం ప్రాఙ్ముఖో భుఙ్క్తే యశస్యం దక్షిణాముఖః ।**
**శ్రియం ప్రత్యఙ్ముఖో భుఙ్క్తే ఋతం భుఙ్క్తే ఉదఙ్ముఖః ॥ 2 ॥**

తూర్పుముఖంగా లేదా సూర్యాభిముఖంగా కూర్చుని, భూమియందు పాదాలుంచి భుజించాలి. తూర్పు ముఖంగా భుజించేవానికి ఆయుష్యం, దక్షిణముఖంగా కీర్తి, పడమరముఖంగా సంపదలు, ఉత్తరముఖంగా కూర్చుని భుజించేవానికి సత్యం లభిస్తుంది.

**పఞ్చార్ద్రో భోజనం కుర్యాద్భూమౌ పాత్రం నిధాయ చ ।**
**ఉపవాసేన తత్తుల్యం మనురాహ ప్రజాపతిః ॥ 3 ॥**

అయిదవయవాలు తడిగా ఉంచుకొని భుజించాలి. రెండుకాళ్ళు రెండు చేతులు ముఖం కడుగుకొని భూమిపై పాత్రనుంచి భోజనంచేస్తే ఉపవాసంతో సమానమని ప్రజాపతి మనువు చెప్పినాడు.

**ఉపలిప్తే శుచౌ దేశే పాదౌ ప్రక్షాల్య వై కరౌ ।**
**ఆచమ్యార్ద్రాననోఽక్రోధః పఞ్చార్ద్రో భోజనం చరేత్ ॥ 4 ॥**

పాదహస్తప్రక్షాళనంచేసి, ఆచమించి, ఆర్ద్రవస్త్రాన్ని ధరించి, కోపం వీడి, బాగా అలికిన శుభ్రమైన ప్రదేశంలో భుజించాలి.

**మహావ్యాహృతిభిస్త్వన్నం పరిధాయోదకేన తు ।**
**అమృతోపస్తరమసీత్యాపోశనక్రియాం చరేత్ ॥ 5 ॥**

మహావ్యాహృతులతో జలంతో అన్నాన్ని పరిషేచనం చేయాలి. 'అమృతోపస్తరణమసి' అని పరిషేచనం కావించాలి.

**స్వాహాప్రణవసంయుక్తాం ప్రాణాయాద్యాహుతిం తతః ।**
**అపానాయ తతో యుక్త్వా వ్యానాయ తదనన్తరమ్ ॥ 6 ॥**

**ఉదానాయ తతః కుర్యాత్సమానాయేతి పఞ్చమమ్ ।**
**విజ్ఞాయ తత్త్వమేతేషాం జుహుయాదాత్మని ద్విజః ॥ 7 ॥**

తర్వాత 'ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా' అంటూ వీని తత్త్వాలను తెలుసుకొని ఆత్మలో ఆహుతులు కావించాలి.

**శేషమన్నం యథాకామం భుంజీత వ్యఞ్జనైర్యుతమ్ ।**
**ధ్యాత్వా తన్మనసా దేవానాత్మానం వై ప్రజాపతిమ్ ॥ 8 ॥**

**అమృతాపిధానమసీత్యుపరిష్టాదపః పిబేత్ ।**
**ఆచాన్తః పునరాచామేదాయం గౌరితి మన్త్రతః ॥ 9 ॥**

మిగిలిన అన్నాన్ని వ్యంజనాలతో కూడా కలుపుకొని ఇష్టమున్నంత తినాలి. తదేక మనసుతో దేవుని, ఆత్మను, ప్రజాపతిని ధ్యానించి భోజనం పూర్తయిన తర్వాత 'అమృతాపిధానమసి' అని జలాన్ని స్వీకరించాలి. ఆచమనం చేసిన తర్వాత మళ్ళీ 'ఆయంగౌః ప్రశ్నిరక్రమీత్' అనే మంత్రంతో ఆచమించాలి.

**ద్రుపదాం వా త్రిరావృత్య సర్వపాపప్రణాశినీమ్ ।**
**ప్రాణానాం గ్రంథిరసీత్యాలభేదుదరం తతః ॥ 10 ॥**

తర్వాత సర్వపాపనాశిని 'ద్రుపదా' మంత్రాన్ని ముమ్మార్లు పఠించాలి. తర్వాత 'ప్రాణానాం గ్రంథిరసి' అనే మంత్రంతో హృదయాన్ని తాకాలి.

**ఆచమ్యాంగుష్ఠమాత్రేణ పాదాంగుష్ఠేన దక్షిణే ।**
**విస్రావయేద్ధస్తజలమూర్ధ్వహస్తః సమాహితః ॥ 11 ॥**

పైన చేయి పెట్టుకొని స్వస్థచిత్తుడై ఆచమించి 'అంగుష్ఠమాత్ర' అనే మంత్రంద్వారా కుడికాలు బొటనవ్రేలుపై హస్తజలాన్ని విడువాలి.

**హృతానుమన్త్రణం కుర్యాత్ శ్రద్ధాయామితి మంత్రతః ।**
**అథాక్షరేణ స్వాత్మానం యోజయేత్ బ్రాహ్మణేతి హి ॥ 12 ॥**

'శ్రద్ధాయాం' అనే మంత్రంతో హుతానుమంత్రణం చేయాలి. తర్వాత 'బ్రాహ్మణా' అనే మంత్రంతో తన ఆత్మను అక్షరతత్త్వంతో యోజన చేయాలి.

**సర్వేషామేవ యోగానామాత్మయోగః స్మృతః పరః ।**
**యోఽనేన విధినా కుర్యాత్స కవిర్బ్రాహ్మణః స్వయమ్ ॥ 13 ॥**

అన్ని యోగాల్లో ఆత్మయోగం ఉత్తమం. ఈ విధానాన్ననుసరించి ఆత్మయోగం చేసేవాడు బ్రహ్మసాయుజ్యం పొందుతాడు.

**యజ్ఞోపవీతీ భుఞ్జీత స్రగ్గన్ధాలఙ్కృతః శుచిః ।**
**సాయం ప్రాతర్నాన్తరా వై సన్ధ్యాయాన్తు విశేషతః ॥ 14 ॥**

యజ్ఞోపవీతం ధరించే భుజించాలి. గంధమాల్యాదులు ధరించాలి. సాయం ప్రాతః మధ్యాహ్నకాలాల్లో ముఖ్యంగా సంధ్యాకాలంలో భుజించకూడదు.

**నాద్యాత్సూర్యగ్రహాత్పూర్వం ప్రతిసాయం శశిగ్రహాత్ ।**
**గ్రహకాలే న చాశ్నీయాత్ స్నాత్వాఽశ్నీయాద్విముక్తయే ॥ 15 ॥**

సూర్యచంద్రగ్రహణాలముందు, పగలు పూర్వసాయంకాలంలో భుజించరాదు. గ్రహణ సమయంలో భుజించకూడదు. గ్రహణం వదలిన తర్వాత స్నానంచేసి భుజించాలి.

**ముక్తే శశిని చాశ్నీయాద్యది న స్యాన్మహానిశా ।**
**అముక్తయో రస్తగతయోరద్యాద్దృష్ట్వా పరేఽహని ॥ 16 ॥**

చంద్రగ్రహణం వీడిన తర్వాత అర్ధరాత్రి కానట్లైతే భుజించవచ్చు. గ్రహణం విడువకముందే సూర్యచంద్రులు అస్తమిస్తే మరురోజు శుద్ధబింబాన్ని దర్శించిన తర్వాతనే భుజించాలి.

**నాశ్నీయాత్ప్రేక్షమాణానామప్రదాయ చ దుర్మతిః ।**
**యజ్ఞావశిష్టమద్యాద్వా న క్రుద్ధో నాన్యమానసః ॥ 17 ॥**

ఆకలితో చూచేవారికి పెట్టకుండా భుజించరాదు. యజ్ఞశిష్టంకాని, దాన్ని కోపంతోకాని, అన్యమనస్కంగా కాని భుజించకూడదు.

**ఆత్మార్థం భోజనం యస్య రత్యర్థం యస్య మైథునమ్ ।**
**వృత్త్యర్థం యస్య చాధీతం నిష్ఫలం తస్య జీవితమ్ ॥ 18 ॥**

తనకొరకు మాత్రమే వండిన అన్నం అనీ, సుఖంకొరకే స్త్రీసంగమం అనీ, బ్రతుకుతెరువు కోసమే చదువు అనీ అనుకొనేవాని జీవనం వ్యర్థం.

**యద్భుంక్తే వేష్టితశిరా యచ్చ భుఙ్క్తే ఉదఙ్ముఖః ।**
**సోపానత్కశ్చ యో భుంక్తే సర్వం విద్యాత్తదాసురమ్ ॥ 19 ॥**

తలపాగాతో చేసే భోజనం, ఉదఙ్ముఖంగా చేసే భోజనం, పాదరక్షలతో చేసే భోజనమంతా ఆసురభోజనంగా చెప్పబడినది.

**నార్ధరాత్రే న మధ్యాహ్నే నాజీర్ణే నార్ద్రవస్త్రధృక్ ।**
**న చ భిన్నాసనగతో న యానే సంస్థితోఽపి వా ॥ 20 ॥**

**న భిన్నభాజనే చైవ న భూమ్యాం న చ పాణిషు ।**
**నోచ్ఛిష్టో ఘృతమాదద్యాన్న మూర్ధ్నాఽన్నం స్పృశేదపి ॥ 21 ॥**

అర్ధరాత్రి, మధ్యాహ్నం, అజీర్ణంతో, తడిబట్టలతో, ఇతరులకు నిర్దేశించిన ఆసనంలో పడుకొని, నిల్చొని, పగిలినపాత్రలో, భూమియందు, చేతిలో పట్టుకొని భుజింపకూడదు. ఉచ్ఛిష్టావస్థలో నేతిని గ్రహించరాదు. తలతో అన్నాన్ని తాకకూడదు.

**న బ్రహ్మ కీర్తయే చ్చాపి న నిఃశేషం న భార్యయా ।**
**నాన్ధకారే న సన్ధ్యాయాం న చ దేవాలయాదిషు ॥ 22 ॥**

భోజనంచేస్తూ, వేదం ఉచ్చరించకూడదు. తినుబండారాలన్నీ ఇంట్లో పూర్తిగా అయిపోయేట్టు భుజింపకూడదు. భార్యతో కలిసి భోంచేయరాదు. అంధకారంలో, పైకప్పులేని ప్రదేశంలో, సంధ్యాకాలంలో, దేవాలయాదుల్లో భోజనం చేయరాదు.

**నైకవస్త్రస్తు భుంజీత న యానశయనస్థితః ।**
**న పాదుకానిర్గతోఽథ న హసన్విలపన్నపి ॥ 23 ॥**

ఒకే వస్త్రంతో, వాహనం, శయ్యలపై ఉండి భుజింపరాదు. పాదరక్షలు వదలక, నవ్వుతూ, ఏడుస్తూ భోజనం చేయకూడదు.

**భుక్త్వా వై సుఖమాస్థాయ తదన్నం పరిణామయేత్ ।**
**ఇతిహాసపురాణాభ్యాం వేదార్థానుపబృంహయేత్ ॥ 24 ॥**

ఈ విధంగా భోంచేసి, సుఖంగా కూర్చొని ఆ అన్నాన్ని జీర్ణించుకోవాలి. తర్వాత ఇతిహాసపురాణాలతో వేదార్థాలను వ్యాఖ్యానించాలి.

**తతః సన్ధ్యాముపాసీత పూర్వోక్తవిధినా శుచిః ।**
**ఆసీనశ్చ జపేద్దేవీం గాయత్రీం పశ్చిమాం ప్రతి ॥ 25 ॥**

తర్వాత విప్రుడు విధ్యుక్తంగా సంధ్యోపాసన చేయాలి. తర్వాత పశ్చిమాభిముఖంగా కూర్చుని గాయత్రీమంత్రాన్ని జపించాలి.

**న తిష్ఠతి తు యః పూర్వామాస్తే సన్ధ్యాం తు పశ్చిమామ్ ।**
**స శూద్రేణ సమో లోకే సర్వకర్మవివర్జితః ॥ 26 ॥**

ప్రాతఃసాయంసంధ్యల నాచరించనివాడు సర్వధర్మబహిష్కృతుడై శూద్ర సముడవుతాడు.

**హుత్వాఽగ్నిం విధివన్మన్త్రైర్భుక్త్వా యజ్ఞావశిష్టకమ్ ।**
**సభృత్యబాంధవజనః స్వపేచ్ఛుష్కపాదో నిశి ॥ 27 ॥**

యథావిధి అగ్నిని వ్రేల్చి, భృత్యబంధుజనపరివృతుడై యజ్ఞశేషాన్ని భుజించి, రాత్రిపూట పొడికాళ్ళతో పరుండాలి.

**నోత్తరాభిముఖః స్వప్యాత్ పశ్చిమాభిముఖో న చ ।**
**న చాకాశే న నగ్నో వా నాశుచిర్నాసనే క్వచిత్ ॥ 28 ॥**

ఉత్తరం, పశ్చిమం వైపు తలపెట్టి పడుకోకూడదు. పైకప్పు లేనిచోట, నగ్నంగా, అపరిశుభ్రమైన ఆసనంపై కాని పరుండరాదు,

**న శీర్ణాయాం తు ఖట్వాయాం శూన్యాగారే న చైవ హి ।**
**నానువంశే న పాలాశే శయనే వా కదాచన ॥ 29 ॥**

విరిగిన మంచంమీద, ఎవ్వరూ లేని ఇంట్లో ఒంటిగా పడుకోరాదు. వెదురు, మోదుగుమంచాలపై పడుకోకూడదు.

**ఇత్యేతదఖిలేనోక్తం అహన్యహని వై మయా ।**
**బ్రాహ్మణానాం కృత్యజాతమపవర్గఫలప్రదమ్ ॥ 30 ॥**

ఈ విధంగా బ్రాహ్మణులు ప్రతినిత్యం ఆచరించాల్సిన మోక్షఫలప్రదమైన విధిని వివరించినాను.

**నాస్తిక్యాదథవాऽऽలస్యాత్ బ్రాహ్మణో న కరోతి యః ।**
**స యాతి నరకాన్ ఘోరాన్ కాకయోనౌ చ జాయతే ॥ 31 ॥**

నాస్తికభావనవల్ల కాని, బద్ధకంవల్లకాని ఈ విధిని ఆచరించనివాడు ఘోరనరకాలను పొందుతాడు. మళ్ళీ కాకిగా పుడతాడు.

**నాన్యో విముక్తయే పంథా ముక్త్వాశ్రమవిధిం స్వకమ్ ।**
**తస్మాత్కర్మాణి కుర్వీత తుష్టయే పరమేష్ఠినః ॥ 32 ॥**

స్వాశ్రమవిధి తప్ప మోక్షానికి మరొక సాధనం కానరాదు. పరమాత్మ ప్రీతినందటానికి విహిత కర్మలను తప్పక ఆచరించవలెను.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే వ్యాసగీతాసు బ్రాహ్మణానాం నిత్యకర్తవ్యకర్మసు భోజనాదిప్రకారవర్ణనం నామ ఏకోనవింశోऽధ్యాయః ॥ 19 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో వ్యాసగీతలో బ్రాహ్మణుల నిత్యకర్తవ్యకర్మల్లో భోజనాదుల పద్ధతి అనే పందొమ్మిదవ అధ్యాయం ॥ 19 ॥



## వింశో௨ధ్యాయః - ఇరవైయవ అధ్యాయం

## శ్రాద్ధకల్పే - శ్రాద్ధకల్పం

**వ్యాస ఉవాచ :-**వ్యాసమహర్షి చెప్పాడు

**అథ శ్రాద్ధమమావాస్యాం ప్రాప్య కార్యం ద్విజోత్తమైః ।**
**పిణ్డాన్వాహార్యకం భక్త్యా భుక్తిముక్తిఫలప్రదమ్ ॥ 1 ॥**

అమావాస్యనాడు భుక్తిముక్తులనొసగే పిండాన్వాహార్యకమనే శ్రాద్ధాన్ని ద్విజోత్తములు ఆచరించాలి.

**పిణ్డాన్వాహార్యకం శ్రాద్ధం క్షీణే రాజని శస్యతే ।**
**అపరాహ్ణే ద్విజాతీనాం ప్రశస్తేనామిషేణ చ ॥ 2 ॥**

పిండాన్వాహార్యకశ్రాద్ధాన్ని ద్విజులు అమావాస్య అపరాహ్ణకాలంలో ప్రశస్తమైన భోజ్యపదార్థాలతో ఆచరించాలి.

**ప్రతిపత్ప్రభృతి హ్యన్యాస్తిథయః కృష్ణపక్షకే ।**
**చతుర్దశీం వర్జయిత్వా ప్రశస్తా హ్యుత్తరోత్తరమ్ ॥ 3 ॥**

ఈ శ్రాద్ధాన్ని కృష్ణప్రతిపత్తునుండి అమావాస్య వరకు చతుర్దశి మినహా అన్ని తిథులు మొదటి వాటికంటె తర్వాతవి ప్రశస్తతరాలుగ చెప్పనైనవి.

**అమావాస్యాష్టకాస్తిస్రః పౌషమాసాదిషు త్రిషు ।**
**తిస్రస్త్వాస్త్వష్టకాః పుణ్యా మాఘీ పఞ్చదశీ తథా ॥ 4 ॥**

అమావాస్య పుష్య మాఘ ఫాల్గుణ బహుళ అష్టకాలు, అదేవిధంగా బహుళ నవములు, మాఘపూర్ణిమ శ్రాద్ధానికి పుణ్యతిథులని చెప్పనైనవి.

**త్రయోదశీ మఘాయుక్తా వర్షాసు చ విశేషతః ।**
**శస్యపాకశ్రాద్ధకాలాః నిత్యాః ప్రోక్తా దినే దినే ॥ 5 ॥**

వర్ష ఋతువులో మఘానక్షత్రం కల త్రయోదశి పంట చేతికి వచ్చే సమయంలో విశేషించి శ్రాద్ధానికి యోగ్యకాలంగా గుర్తించాలి. ఇవి ప్రతిదినం చేయవలసిన నిత్యశ్రాద్ధాలని తెలుసుకోవాలి.

**నైమిత్తికన్తు కర్తవ్యం గ్రహణే చన్ద్రసూర్యయోః ।**
**బాన్ధవానాం విస్తరేణ నారకీ స్యాదతో௨న్యథా ॥ 6 ॥**

చంద్రసూర్యగ్రహణసమయంలో బంధువుల మరణసమయంలో నైమిత్తిక శ్రాద్ధాన్నాచరించాలి. అట్లా చేయనివాడు నరకాన్ని పొందుతాడు.

**కామ్యాని చైవ శ్రాద్ధాని శస్యన్తే గ్రహణాదిషు ।**
**అయనే విషువే చైవ వ్యతీపాతే త్వనన్తకమ్ ॥ 7 ॥**

గ్రహణాది పర్వదినాల్లో కామ్యశ్రాద్ధాలు కూడ చెప్పనైనవి. ఉత్తర దక్షిణాయనాల పుణ్యకాలాల్లో మేష తులా విషువసంక్రమణాల్లో వ్యతీపాతంలో చేసే శ్రాద్ధం కూడా అనంతఫలప్రదమవుతుంది.

**సఙ్క్రాంత్యామక్షయం శ్రాద్ధం తథా జన్మదినేష్వపి ।**
**నక్షత్రేషు చ సర్వేషు కార్యం కాలే విశేషతః ॥ 8 ॥**

సంక్రాంతి సమయాల్లో జన్మదినంనాడు అన్ని నక్షత్రాల్లో చేసే శ్రాద్ధం అక్షయఫల ప్రదమౌతుంది. ఈ సమయాల్లో విశేషంగా శ్రాద్ధాన్ని ఆచరించాలి.

**స్వర్గఞ్చ లభతే కృత్వా కృత్తికాసు ద్విజోత్తమః ।**
**అపత్యమథ రోహిణ్యాం సౌమ్యే తు బ్రహ్మవర్చసమ్ ॥ 9 ॥**

కృత్తికా నక్షత్రంలో శ్రాద్ధం చేసినతడు స్వర్గాన్ని పొందుతాడు. రోహిణీ నక్షత్ర మందాచరిస్తే సత్సంతానం, మృగశిరా నక్షత్రంలో ఆచరిస్తే బ్రహ్మతేజస్సు,

**రౌద్రాణాం కర్మణాం సిద్ధిమార్ద్రాయాం శౌర్యమేవ చ ।**
**పునర్వసౌ తథా భూమిం శ్రియం పుష్యే తథైవ చ ॥ 10 ॥**

ఆర్ద్రానక్షత్రంలో రౌద్ర కర్మసిద్ధి శౌర్యప్రాప్తి కలుగుతవి. పునర్వసులో భూమిలాభం, పుష్యమిలో సంపద,

**సర్వాన్కామాస్తథా సార్ప్యే పిత్ర్యే సౌభాగ్యమేవ చ ।**
**అర్యమ్ణే తు ధనం విన్ద్యేత్ ఫాల్గున్యాం పాపనాశనమ్ ॥ 11 ॥**

ఆశ్లేషలో సర్వకామప్రాప్తి, మఘానక్షత్రంలో సౌభాగ్యాన్ని, పుబ్బ నక్షత్రంలో ధనం,

**జ్ఞాతిశ్రైష్ఠ్యం తథా హస్తే చిత్రాయాం చ బహూన్సుతాన్ ।**
**వాణిజ్యసిద్ధిం స్వాతౌ తు విశాఖాసు సువర్ణకమ్ ॥ 12 ॥**

ఫాల్గునిలో పాపనాశనం, హస్తానక్షత్రంలో తన బంధువుల్లో శ్రేష్ఠత్వాన్ని, చిత్రానక్షత్రంలో బహు పుత్రలాభం, స్వాతిలో వాణిజ్యసిద్ధి, విశాఖలో సువర్ణలాభం,

**మైత్రే బహూని మిత్రాణి రాజ్యం శాక్రే తథైవ చ ।**
**మూలే కృషిం లభేద్జ్ఞానం సిద్ధిమాప్యే సముద్రతః ॥ 13 ॥**

అనూరాధ నక్షత్రంలో మిత్రులను, జ్యేష్ఠానక్షత్రంలో రాజ్యాన్ని, మూలానక్షత్రంలో కృషిని, పూర్వాషాఢ సముద్ర యాత్రాలాభం కల్గుతాయి.

**సర్వాన్కామాన్ వైశ్వదేవే శ్రైష్ఠ్యన్తు శ్రవణే పునః ।**
**ధనిష్ఠాయాం తథా కామానప్పుపే చ పరం బలమ్ ॥ 14 ॥**

ఉత్తరాషాఢ సర్వకామ్యసిద్ధి, శ్రవణా నక్షత్రశ్రాద్ధం శ్రేష్ఠతను కల్గిస్తాయి. ధనిష్ఠలోకామనలు లభిస్తాయి. శతభిషం పరమబలాన్ని,

**అజైకపాదే కుప్యం స్యాదాహిర్బుధ్నే గృహం శుభమ్ ।**
**రేవత్యాం బహవో గావో హ్యశ్విన్యాం స్తురగాంస్తథా ॥ 15 ॥**
**యామ్యే తు జీవితం తు స్యాత్ యచ్ఛ్రాద్ధం సంప్రయచ్ఛతి ।**

పూర్వాభాద్ర స్వర్ణలాభాన్ని, ఉత్తరాభాద్ర గృహలాభం, రేవతిశ్రాద్ధం గోబాహుళ్యాన్ని, అశ్విని అశ్వాలను, భరణిలో శ్రాద్ధం జరిపినట్లైతే దీర్ఘాయువును కల్గిస్తాయి.

**ఆదిత్యవారేఽన్వారోగ్యం చాన్ద్రే సౌభాగ్యమేవ చ ।**
**కుజే సర్వత్ర విజయం సర్వాన్కామాన్ బుధస్య చ ॥ 16 ॥**

ఆదివారం శ్రాద్ధాన్ని ఆచరిస్తే ఆరోగ్యం, సోమవారం సౌభాగ్యం, మంగళవారం అంతట విజయాన్ని, బుధవారం సర్వాభీష్టసిద్ధి,

**విద్యామభీష్టన్తు గురౌ ధనం వై భార్గవే పునః ।**
**శనైశ్చరే లభేదాయుః ప్రతిపత్సు సుతాన్శుభాన్ ॥ 17 ॥**

గురువారం అభీష్ట విద్యాలాభం, శుక్రవారం ధనం, అట్లే శనివారం శ్రాద్ధమాచరిస్తే ఆయువు లభిస్తాయి. తిథుల్లోను ఫలాలిట్లా ఉన్నాయి. పాడ్యములలో శుభంకరులైన పుత్రులు,

**కన్యకాం వై ద్వితీయాయాం తృతీయాయాన్తు విన్దతి ।**
**పశూన్ క్షుద్రాంశ్చతుర్థ్యాం వై పఞ్చమ్యాం శోభనాన్ సుతాన్ ॥ 18 ॥**

విదియ కన్యను, తదియ పశువులను, చతుర్థి క్షుద్ర పశువులను, పంచమి సత్పుత్రులను,

**షష్ఠ్యాం ద్యుతిం కృషిఞ్చాపి సప్తమ్యాఞ్చ ధనం నరః ।**
**అష్టమ్యామపి వాణిజ్యం లభతే శ్రాద్ధదః సదా ॥ 19 ॥**

**స్యాన్నవమ్యామేకఖురం దశమ్యాం ద్విఖురం బహు ।**
**ఏకాదశ్యాం తథా రూప్యం బ్రహ్మవర్చస్వినః సుతాన్ ॥ 20 ॥**

షష్ఠి కాంతిని, సప్తమి వ్యవసాయాన్ని, అష్టమి వ్యాపారాన్ని, నవమి ఒక గిట్టగల పశువులను, దశమి రెండు గిట్టలు గల పశువులు, ఏకాదశి వెండిని బ్రహ్మ తేజస్సున్న పుత్రులను కల్గిస్తాయి.

**ద్వాదశ్యాం జాతరూపఞ్చ రజతం కుప్యమేవ చ ।**
**జ్ఞాతి శ్రైష్ఠ్యం త్రయోదశ్యాం చతుర్దశ్యాన్తు కుప్రజాః ॥ 21 ॥**
**పఞ్చదశ్యాం సర్వకామాన్ ప్రాప్నోతి శ్రాద్ధదః సదా ।**

ద్వాదశిలో బంగారం వెండి ఇత్తడి లోహాలను, త్రయోదశిలో తన వారిలో ఉత్తమత్వాన్ని, చతుర్దశినాడు దుష్టసంతానాన్ని, పౌర్ణమినాడు శ్రాద్ధం ఆచరించిన సర్వాభీష్టసిద్ధిని పొందుతారు.

**తస్మాత్ శ్రాద్ధం న కర్తవ్యం చతుర్దశ్యాం ద్విజాతిభిః ।**
**శస్త్రేణ తు హతానాన్తు శ్రాద్ధం తత్ర ప్రకల్పయేత్ ॥ 22 ॥**

అందువల్ల ద్విజులెప్పుడు చతుర్దశినాడు శ్రాద్ధం జరుపరాదు. శస్త్రంతో మరణించినవారి శ్రాద్ధం చతుర్దశినాడు చేయవచ్చు.

**ద్రవ్యబ్రాహ్మణసమ్పత్తౌ న కాలనియమః కృతః ।**
**తస్మాద్భోగాపవర్గార్థం శ్రాద్ధం కుర్యుః ద్విజాతయః ॥ 23 ॥**

బ్రాహ్మణులు ద్రవ్యం సమకూడినట్లైతే కాలనియమం అవసరం లేదు. కావున ద్విజులు భోగమోక్షాలకోసం శ్రాద్ధాన్ని జరపాలి.

**కార్యారమ్భేషు సర్వేషు కుర్యాదభ్యుదయే పునః ।**
**పుత్రజన్మాదిషు శ్రాద్ధం పార్వణం పర్వసు స్మృతమ్ ॥ 24 ॥**

పుత్రజన్మాది సమస్త శుభకార్యాల్లో మొదట అభ్యుదయ శ్రాద్ధం ఆచరించాలి. పర్వదినాల్లో చేసే శ్రాద్ధం పార్వణం అంటారు.

**అహన్యహని నిత్యం స్యాత్కామ్యం నైమిత్తికం పునః ।**
**ఏకోద్దిష్టాదివిజ్ఞేయం ద్విధా శ్రాద్ధన్తు పార్వణమ్ ॥ 25 ॥**

ప్రతినిత్యం జరిపే శ్రాద్ధం నిత్యమని కామ్యమని చెప్పబడినది. ఏకోద్దిష్టాది శ్రాద్ధాలను నైమిత్తికాలంటారు. ఇలా పార్వణశ్రాద్ధం రెండువిధాలు.

**ఏతత్పఞ్చవిధం శ్రాద్ధం మనునా పరికీర్తితమ్ ।**
**యాత్రాయాం షష్ఠమాఖ్యాతం తత్ప్రయత్నేన పాలయేత్ ॥ 26 ॥**

వృద్ధిశ్రాద్ధం, పార్వణశ్రాద్ధం అనే అయిదు విధాల శ్రాద్ధాన్ని మనువు చెప్పినాడు. యాత్రల్లో ఆచరించే శ్రాద్ధం ఆరవది. దానిని ప్రయత్నించి తప్పక ఆచరించాలి.

**శుద్ధయే సప్తమం శ్రాద్ధం బ్రహ్మణా పరిభాషితమ్ ।**
**దైవికం చాష్టమం శ్రాద్ధం యత్కృత్వా ముచ్యతే భయాత్ ॥ 27 ॥**

శుద్ధికోసం ఏడవశ్రాద్ధాన్ని బ్రహ్మ చెప్పినాడు. దైవికశ్రాద్ధం అనే ఎనిమిదవ శ్రాద్ధాన్ని ఆచరిస్తే సకల భయాలు తొలగిపోతాయి.

**సన్ధ్యాం రాత్రౌ న కర్తవ్యం రాహోరన్యత్ర దర్శనాత్ ।**
**దేశానాన్తు విశేషేణ భవేత్పుణ్యమనన్తకమ్ ॥ 28 ॥**

సంధ్యాసమయంలో శ్రాద్ధం జరుపకూడదు. సూర్యచంద్రగ్రహణసమయాల్లో రాత్రి కూడ శ్రాద్ధం జరుపవచ్చు. ఆయా విశేషదేశాల్లో జరిపిన శ్రాద్ధాలు అనంత ఫలాలనిస్తాయి.

**గఙ్గాయామక్షయం శ్రాద్ధం ప్రయాగేఽమరకణ్టకే ।**
**గాయన్తి పితరో గాథాం నర్తయన్తి మనీషిణః ॥ 29 ॥**

గంగాతీరం ప్రయాగ అమరకంటకాల్లో జరిపే శ్రాద్ధం అక్షయ ఫలాన్నిస్తుంది. ఈ విధంగా పితృదేవతలు గానం చేస్తారు. బుద్ధిమంతులు నృత్యం చేస్తారు.

**ఏష్టవ్యా బహవః పుత్రాః శీలవన్తో గుణాన్వితాః ।**
**తేషాన్తు సమవేతానాం యద్యేకోఽపి గయాం వ్రజేత్ ॥ 30 ॥**

శీలం గుణం కల్గిన అనేకులను పుత్రులను పొందాలి. వీరిలో ఒకడైనా గయకు వెళతాడు.

**గయాం ప్రాప్యానుషంగేణ యది శ్రాద్ధం సమాచరేత్ ।**
**తారితాః పితరస్తేన స యాతి పరమాం గతిమ్ ॥ 31 ॥**

గయకు వెళ్ళి శ్రాద్ధం జరిపినట్లైతే పితరులు తరిస్తారు. ఉత్తమగతులు పొందుతారు.

**వారాహపర్వతే చైవ గయాయాం వై విశేషతః ।**
**వారాణస్యాం విశేషేణ యత్ర దేవః స్వయం హరః ॥ 32 ॥**

**గఙ్గాద్వారే ప్రభాసే తు బిల్వకే నీలపర్వతే ।**
**కురుక్షేత్రే చ కుబ్జాగ్రే భృగుతుఙ్గే మహాలయే ॥ 33 ॥**

**కేదారే ఫల్గుతీర్థే చ నైమిషారణ్య ఏవ చ ।**
**సరస్వత్యాం విశేషేణ పుష్కరే తు విశేషతః ॥ 34 ॥**

**నర్మదాయాం కుశావర్తే శ్రీశైలే భద్రకర్ణకే ।**
**వేత్రవత్యాం విశాఖాయాం గోదావర్యాం విశేషతః ॥ 35 ॥**

వరాహ పర్వతంలో, గయలో, గంగాతీరంలో, శంకరుడు వసించే వారాణసిలో, హరిద్వారం ప్రభాసతీర్థం, బిల్వతీర్థం, నీలపర్వతం, కురుక్షేత్రం, కుబ్జాతీర్థం, భృగుతుంగం, మహాలయం, కేదారం, ఫల్గుతీర్థం నైమిషారణ్యం సరస్వతీనది విశేషించి పుష్కరంలో నర్మద, కుశావర్తం, శ్రీశైలం, భద్రకర్ణి, వేత్రవతి, విపాశా విశేషంగా గోదావరి,

**ఏవమాదిషు చాన్యేషు తీర్థేషు పులినేషు చ ।**
**నదీనాఞ్చైవ తీరేషు తుష్యన్తి పితరః సదా ॥ 36 ॥**

ఇంకా ఇతరతీర్థాల్లో నదీతీరాల్లో శ్రాద్ధం జరిపినట్లైతే పితృదేవతలెప్పుడూ సంతోషంతో ఉంటారు.

**వ్రీహిభిశ్చ యవైర్మాషైరద్భిర్మూలఫలేన వా ।**
**శ్యామాకైశ్చ యవైః కాశైర్నీవారైశ్చ ప్రియఙ్గుభిః ॥ 37 ॥**

**గోధూమైశ్చ తిలైర్ముద్గైర్మాసం ప్రీణయతే పితౄన్ ।**
**ఆమ్రాన్ పానే రసానిక్షూన్ మృద్వీకాంశ్చ సదాడిమాన్ ॥**
**విదాశ్వాంశ్చ కురన్దాంశ్చ శ్రాద్ధకాలే ప్రదాపయేత్ । 38 ॥**

వ్రీహి, యవలు, మినుములు, జలాలు, కందమూల ఫలాలు, శ్యామాకాలు, శాకాలు, నీవారం, ప్రియంగువు, గోధుమలు, నువ్వులు, పెసలు వీనితో చేసే శ్రాద్ధంలో పితృదేవతలు ఒక మాసం తృప్తులౌతారు. మామిడి, కర్బూజ, చెరుకు, ద్రాక్ష, దానిమ్మ, మంచిగుమ్మడి కాయలతో శ్రాద్ధకాలంలో దానమీయాలి.

**లాజాన్మధుయుతాన్దద్యాత్ సక్తూన్ శర్కరయా సహ ।**
**దద్యాచ్ఛ్రాద్ధే ప్రయత్నేన శృంగాటకకశేరుకాన్ ॥ 39 ॥**

తేనె కలిపిన పేలాలను, శర్కర కలిపిన సత్తుపిండిని, శృంగాటకాలను, కశేరుకాలను, శ్రాద్ధంలో దానం చేయాలి.

**ద్వౌ మాసౌ మత్స్యమాంసేన త్రీన్మాసాన్ హరిణేన తు ।**
**ఔరభ్రేణాథ చతురః శాకునేనేహ పఞ్చ తు ॥ 40 ॥**

**షణ్మాసాంశ్ఛాగమాంసేన పార్షతే నేహ సప్త వై ।**
**అష్టావేణస్య మాంసేన రౌరవేణ నవైవ తు ॥**
**దశమాసాంస్తు తృప్యన్తి వరాహ మహిషామిషైః । 41 ॥**

మత్స్యమాంసంతో రెండు నెలలు, జింకమాంసంతో మూడునెలలు, దుప్పిమాంసంతో నాలుగు మాసాలు, పక్షిమాంసంతో అయిదు నెలలు, మేకమాంసం ఆరు నెలలు, లేడిమాంసం ఏడు నెలలు, ఐణ మాంసంతో ఎనిమిది నెలలు, దుప్పిమాంసంతో తొమ్మిదినెలలు, వరాహ, మహిష మాంసాలతో పదినెలలు పితృదేవతలు తృప్తి చెందుతారు.

**శశకూర్మయోర్మాంసేన మాసానేకాదశైవ తు ।**
**సంవత్సరస్తు గవ్యేన పయసా పాయసేన తు ॥ 42 ॥**

కుందేలు, తాబేలు మాంసాలతో పదకొండు నెలలు, ఆవుపాలు, పాయసాలతో పన్నెండు నెలలు తృప్తిపడతారు.

**వార్ధ్రీణసస్యమాంసేన తృప్తి ర్ద్వాదశ వార్షికీ ।**
**కాలశాకం మహాశల్కః ఖడ్గలోహామిషం మధు ॥ 43 ॥**

ఖడ్గమాంసంతో సంవత్సరం తృప్తి కలుగుతుంది. కాలశాకం, మహాశల్కం, ఖడ్గమృగ మాంసం, తేనె

**ఆనన్త్యాయైవ కల్పన్తే మున్యన్నాని చ సర్వశః ।**
**క్రీత్వా లబ్ధ్వా స్వయం వాఽథ మృతానాదృత్య వై ద్విజః ।**

**దద్యాచ్ఛ్రాద్ధే ప్రయత్నేన తదస్యాక్షయముచ్యతే ॥ 44 ॥**

మున్యన్నాలు అనంతఫలాన్ని ప్రసాదిస్తాయి. కొని లేదా స్వయంగా పొందికాని చనిపోయినవానిని తెచ్చి శ్రాద్ధంలో ప్రయత్న పూర్వకంగా ఇచ్చినట్లైతే అక్షయ ఫలాన్ని పొందుతాడు.

**పిప్పృతం రుచకశ్చైవ తథా చైవమసూరకమ్ ॥ 45 ॥**

**కుసుమ్భపిణ్డమూలం వై తన్దులీయకమేవ చ ।**
**రాజమాషాంస్తథా క్షీరం మాహిషాజం వివర్జయేత్**
**ఆఢక్యః కోవిదారాశ్చ పాలక్యా మరిచాస్తథా ॥ 46 ॥**

**వర్జయే త్సప్త యత్నేన శ్రాద్ధకాలే ద్విజోత్తమాః ।**

పిప్పలి క్రముకం, ముసురం, బూడిద గుమ్మడి, సొరకాయ, వంకాయ, గరిక, కుసుంభ పిండమూలం సురసం (బీర), ఉల్లి బొబ్బట్లు, గేదెపాలు శ్రాద్ధంలో ఉపయోగించకూడదు. చుక్కకూర, గోంగూర, పాలకూర, మిరియాలు ఈ ఏడింటిని శ్రాద్ధంలో విధిగా వదిలిపెట్టాలి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే శ్రాద్ధకల్పో నామ వింశోఽధ్యాయః ॥ 20 ॥**

ఇది కూర్మపురాణం ఉత్తరార్ధంలో శ్రాద్ధకల్పమనే ఇరవైయవ అధ్యాయం ॥ 20 ॥



## ఏకవింశోఽధ్యాయః - ఇరవై ఒకటవ అధ్యాయం

## శ్రాద్ధకల్పః - శ్రాద్ధకల్పం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు

**స్నాత్వా యథోక్తం సన్తర్ప్య పితౄంశ్చన్ద్రక్షయే ద్విజః ।**
**పిణ్డాన్వాహార్యకం శ్రాద్ధం కుర్యాత్సౌమ్యమనాః శుచిః ॥ 1 ॥**

**పూర్వమేవ సమీక్షేత బ్రాహ్మణం వేదపారగమ్ ।**
**తీర్థం తద్ధవ్యకవ్యానాం ప్రదానానాం చ స స్మృతః ॥ 2 ॥**

విప్రుడు అమావాస్యనాడు స్నానం చేసి, శుచియై యథాశాస్త్రం పితృదేవతలకు సంతర్పణం గావించి శాంతచిత్తుడై పిండప్రదానముతో ఆహార్యకశ్రాద్ధాన్ని ఆచరించాలి. సంతర్పణాదుల కంటె మొదటె వేదపారగుడైన బ్రాహ్మణుని వెదకి సిద్ధపరచుకోవాలి. వేదపారగుడైన బ్రాహ్మణుడే హవ్యకవ్యప్రదానానికి తగినవాడు.

**యే సోమపా విరజసో ధర్మజ్ఞాః శాన్తచేతసః ।**
**వ్రతినో నియమస్థాశ్చ ఋతుకాలాభిగామినః ॥ 3 ॥**

సోమపాయులు, రజోగుణం లేనివారు, ధర్మం తెలిసినవారు, శాంతమనస్కులు, వ్రతపరాయణులు, నియమ పాలకులు, ఋతుకాలంలో భార్యాసంగమాన్ని చేసేవారు,

**పఞ్చాగ్నిరప్యధీయానో యజుర్వేదవిదేవ చ ।**
**బహ్వృచశ్చ త్రిసౌపర్ణస్త్రి మధుర్వా చ యోఽభవత్ ॥ 4 ॥**

పంచాగ్ని ఉపాసకుడు, వేదాధ్యయనశీలుడు, యజుర్వేద వేత్త, జ్యేష్ఠసామవేదం విశేషంగా తెలిసినవాడు, త్రిసుపర్ణ అధ్యయనం చేయువాడు, త్రిమధు ఉపాసన చేయువాడు.

**త్రిణాచికేతచ్ఛన్దోగో జ్యేష్ఠసామగ ఏవ చ ।**
**అథర్వశిరసోఽధ్యేతా రుద్రాధ్యాయీ విశేషతః ॥ 5 ॥**

త్రిణాచికేతమును అనుష్ఠించువాడు, జ్యేష్ఠసామగుడు, అథర్వవేద జ్ఞాత, రుద్రాధ్యాయి వీరందరు పంక్తి పావనులు.

**అగ్నిహోత్రపరో విద్వాన్ న్యాయవిచ్చ షడఙ్గవిత్ ।**
**మన్త్రబ్రాహ్మణవిచ్చైవ యశ్చ స్యాద్ధర్మపాఠకః ॥ 6 ॥**

అగ్నిహోత్ర మాచరించేవాడు, విద్వాంసుడు, న్యాయవేత్త, అరు వేదాంగాలు తెలిసినవాడు, మంత్ర బ్రాహ్మణాలు తెలిసినవాడు, ధర్మశాస్త్రజ్ఞుడు,

**ఋషివ్రతీ ఋషీకశ్చ శాన్తచేతా జితేంద్రియః ।**
**బ్రహ్మదేయానుసన్తానో గర్భశుద్ధః సహస్రదః ॥ 7 ॥**

ఋషి వ్రతి, ఋషివంశజాతుడు, శాంతచిత్తుడు, జితేంద్రియుడు, వివాహం ద్వారా ధర్మపత్నియందు సంతానాన్ని పొందినవాడు, గర్భాదానాది సంస్కారశుద్ధుడు, వేలకొలది శిష్యులకు విద్యాప్రదానం చేసినవాడు,

**చాన్ద్రాయణవ్రతచరః సత్యవాదీ పురాణవిత్ ।**
**గురుదేవాగ్నిపూజాసు ప్రసక్తో జ్ఞానతత్పరః ॥ 8 ॥**

చాంద్రాయణాది వ్రతాల నాచరించేవాడు, సత్యవాది, పురాణవేత్త, గురుదేవ అగ్నిపూజలు చేసేవాడు, జ్ఞానతత్పరుడు,

**విముక్తః సర్వతో ధీరో బ్రహ్మభూతో ద్విజోత్తమః ।**
**మహాదేవార్చనరతో వైష్ణవః పఙ్క్తిపావనః ॥ 9 ॥**

రాగద్వేషరహితుడు, ధీరుడు, బ్రహ్మస్వరూపుడు, ద్విజోత్తముడు, మహాదేవార్చనాసక్తుడు, విష్ణుభక్తుడు వీరు పంక్తిపావనులు.

**అహింసానిరతో నిత్యమప్రతిగ్రహకస్తథా ।**
**సత్రీ చ దాననిరతో విజ్ఞేయః పఙ్క్తిపావనః ॥ 10 ॥**

అహింసానిరతుడు, పరిగ్రహం లేనివాడు, సత్ర మాచరించేవాడు, దానాసక్తుడు కూడ పంక్తిపావనులే.

**యువానః శ్రోత్రియాః స్వస్థా మహాయజ్ఞపరాయణాః ।**
**సావిత్రీజాపనిరతా బ్రాహ్మణాః పంక్తిపావనాః ॥ 11 ॥**

యువకులు, శ్రోత్రియులు, ఆరోగ్యవంతులు, మహాయజ్ఞపరాయణులు, గాయత్రీ జపనిరతులు అయిన బ్రాహ్మణులు పంక్తిపావనులవుతారు.

**కులానాం శ్రుతవంతశ్చ శీలవన్తస్తపస్వినః ।**
**అగ్నిచిత్ స్నాతకో విప్రో విజ్ఞేయః పంక్తిపావనః ॥ 12 ॥**

సత్కులంలో పుట్టినవారు, శాస్త్రజ్ఞులు, సచ్ఛీలురు, తపఃపరాయణులు, నిత్యాగ్నిహోత్రులు, స్నాతకులైన విప్రులు పంక్తి పావనులు,

**మాతాపిత్రోర్హితే యుక్తః ప్రాతఃస్నాయీ తథా ద్విజాః ।**
**ఆధ్యాత్మవిన్మునిర్దాన్తో విజ్ఞేయః పంక్తిపావనః ॥ 13 ॥**

తల్లిదండ్రుల హితాన్ని చింతించేవాడు, పొద్దున్నే స్నానం చేసేవాడు, ఆధ్యాత్మికజ్ఞానం కలవాడు, ముని, ఇంద్రియనిగ్రహం కలవాడు పంక్తిపావనులని తెలుసుకోవాలి.

**జ్ఞాననిష్ఠో మహాయోగీ వేదాన్తార్థవిచిన్తకః ।**
**శ్రద్ధాళుః శ్రాద్ధనిరతో బ్రాహ్మణః పంక్తిపావనః ॥ 14 ॥**

జ్ఞాననిష్ఠుడు, మహాయోగి, వేదాంతార్థచింతకుడు, శ్రద్ధాళువు, శ్రాద్ధనిరతుడు అయిన బ్రాహ్మణుడు పంక్తి పావనుడు.

**వేదవిద్యారతః స్నాతో బ్రహ్మచర్యపరః సదా ।**
**అథర్వణీ ముముక్షుశ్చ బ్రాహ్మణః పంక్తిపావనః ॥ 15 ॥**

వేదవిద్యారతుడు, స్నానశీలి, బ్రహ్మచర్యపరాయణుడు, అథర్వవేదాధ్యయనశీలి, మోక్షాసక్తుడు అయిన బ్రాహ్మణుడు పంక్తిపావనుడు.

**అసమానప్రవరకో హ్యసగోత్రస్తథైవ చ ।**
**సమ్బన్ధశూన్యో విజ్ఞేయో బ్రాహ్మణః పంక్తిపావనః ॥ 16 ॥**

అసమానప్రవరుడు, సమానగోత్రుడు కానివాడు, సంబంధం లేనివాడు అగు బ్రాహ్మణుడు పంక్తిపావనుడు

**భోజయేద్యోగినం శాన్తం తత్త్వజ్ఞానరతం యతః ।**
**అభావే నైష్ఠికం దాన్తముపకుర్వాణకం తథా ॥ 17 ॥**

**తదలాభే గృహస్థం తు ముముక్షుం సంగవర్జితమ్ ।**
**సర్వాలాభే సాధకం వా గృహస్థమపి భోజయేత్ ॥ 18 ॥**

తత్త్వజ్ఞాననిరతుడు, యతచిత్తుడు, యోగి వీరందరు పంక్తిపావనులు. శ్రాద్ధము నందుపయోగపడువారు. యతి దొరకనపుడు జితేంద్రియుడు, నిష్ఠాశీలి, గృహస్థాశ్రమం స్వీకరించినవానిని, అతడు కూడా లభించనపుడు, సంగరహితుడై మోక్షేచ్ఛగల గృహస్థుని, అతను కూడా దొరకనపుడు బ్రాహ్మణ గృహస్థుని శ్రాద్ధమందు భోక్తగా ఉపయోగించవచ్చును.

**ప్రకృతేర్గుణతత్త్వజ్ఞో యస్యాశ్నాతి యతిర్హ్విః ।**
**ఫలం వేదాన్తవిత్తస్య సహస్రాదతిరిచ్యతే ॥ 19 ॥**

ప్రకృతి గుణతత్త్వాలను బాగా తెలిసి, జితేంద్రియుడైన యతి భుజించినట్లైతే వేదజ్ఞుని భుజింప చేసిన దానికంటే వేయిరెట్లు ఫలం లభిస్తుంది.

**తస్మాద్యత్నేన యోగీన్ద్రమీశ్వరజ్ఞానతత్పరమ్ ।**
**భోజయేద్ధవ్యకవ్యేషు అలాభాదితరాన్ ద్విజాన్ ॥ 20 ॥**

అందువల్ల అన్ని ప్రయత్నాలతో ఈశ్వర జ్ఞాన తత్పరుడైన యోగీంద్రుని హవ్యకవ్యాలలో భుజింప చేయాలి. అట్టివాడు లభించనపుడు ఇతర ద్విజులను భుజింప చేయాలి.

**ఏష వై ప్రథమః కల్పః ప్రదానే హవ్యకవ్యయోః ।**
**అనుకల్పస్త్వయం జ్ఞేయః సదా సద్భిరనుష్ఠితః ॥ 21 ॥**

హవ్యకవ్యప్రదానంలో ఇది ప్రథమకల్పం. ఈ కల్పం సజ్జనులనుష్ఠించిన, సర్వానుమతమైన కల్పంగా గుర్తించాలి.

**మాతామహం మాతులఞ్చ స్వస్రీయం శ్వశురం గురుమ్ ।**
**దౌహిత్రం విట్పతిం బంధుమృత్విగ్యాజ్యౌ చ భోజయేత్ ॥ 22 ॥**

తల్లితండ్రి, మేనమామ, మేనల్లుడు, మామ, గురువు, దౌహిత్రుడు (కూతురి కుమారుడు), అల్లుడు, బంధువు, ఋత్విజుడు, యజమాని అయినవారిని భుజింపచేయాలి.

**న శ్రాద్ధే భోజయేన్మిత్రం ధనైః కార్యోఽస్య సఙ్గ్రహః ।**
**పైశాచీ దక్షిణా సా హి నేహాముత్ర ఫలప్రదా ॥ 23 ॥**

శ్రాద్ధంలో మిత్రుణ్ణి భుజింప చేయకూడదు. ఒకవేళ మిత్రుడు వచ్చినట్లయితే ధన దాన ప్రదానంద్వారా అతడిని ఆదరించాలి. శ్రాద్ధంలో మిత్రుని భుజింపచేసి దక్షిణ ఇచ్చినట్టైతే అది పైశాచీ దక్షిణ అయి ఇహపరాల్లో ఫలమీయదు.

**కామం శ్రాద్ధేఽర్చయేన్మిత్రం నాభిరూపమపి త్వరిమ్ ।**
**ద్విషతా హి హవిర్భుక్తం భవతి ప్రేత్య నిష్ఫలమ్ ॥ 24 ॥**

ఎవ్వరు లభించనపుడు మిత్రుణ్ణైనా భుజింప చేయవచ్చు. కాని యోగ్యుడైనా శత్రువును మాత్రం భుజింప చేయరాదు. శత్రువు భుజించిన హవిస్సు పరలోకంలో నిష్ఫలమవుతుంది.

**బ్రాహ్మణో హ్యనధీయానస్తృణాగ్నిరివ శామ్యతి ।**
**తస్మై హవ్యం న దాతవ్యం న హి భస్మని హూయతే ॥ 25 ॥**

వేదాధ్యయనం చేయని బ్రాహ్మణుడు గడ్డిలోపడ్డ అగ్నిమాదిరి త్వరగా చల్లారిపోవును. అటువంటివానికి హవ్యకవ్యాలు ఇవ్వరాదు. బూడిదలో హెూమం చేయం కదా!

**యథోషరే బీజముప్త్వా న వప్తా లభతే ఫలమ్ ।**
**తథాఽనృచే హవిర్దత్వా న దానాల్లభతే ఫలమ్ ॥ 26 ॥**

చౌటభూమిలో విత్తనం వేసినవాడు ఫలాన్ని పొందనట్టే అధ్యయనం చేయనివానికి భోజనం పెట్టినవాడు ఫలాన్ని పొందలేడు.

**యావతో గ్రసతే పిణ్డాన్ హవ్యకవ్యేష్వమంత్రవిత్ ।**
**తావతో గ్రసతే ప్రేత్య దీప్తాన్ స్థూలాంస్త్వయోగుడాన్ ॥ 27 ॥**

మంత్రజ్ఞుడు కానివాడు పితృకార్యంలో భుజించిన పిండాలెన్నో, పరలోకంలో అన్ని శూలతప్త అయఃపిండాలను (ఉక్కుతో చేసిన బెల్లపుపిండాలను) భుజింపవలసి వస్తుంది.

**అపి విద్యాకులైర్యుక్తా హీనవృత్తా నరాధమాః ।**
**యత్రైతే భుంజతే హవ్యం తద్భవేదాసురం ద్విజాః ॥ 28 ॥**

విద్యావంతుల వంశంవారైనా నీచప్రవర్తన కల నరాధములైన ద్విజులను భుజింపచేసినట్లైతే అది ఆసురశ్రాద్ధమవుతుంది.

**యస్య వేదశ్చ వేదీ చ విచ్ఛిద్యేతే త్రిపూరుషమ్ ।**
**స వై దుర్బ్రాహ్మణో నార్హః శ్రాద్ధాదిషు కదాచన ॥ 29 ॥**

మూడుతరాలు వేదయజ్ఞాలు విచ్ఛిన్నమైనవాడు దుర్బ్రాహ్మణుడు, వాడు శ్రాద్ధాదులకయోగ్యుడు.

**శూద్రప్రేష్యో భృతో రాజ్ఞో వృషలానాం చ యాజకః ।**
**వధబంధోపజీవీ చ షడేతే బ్రహ్మబంధవః ॥ 30 ॥**

శూద్రసేవకుడు, రాజవేతనం తీసుకొనేవాడు, శూద్రునితో యజ్ఞం చేయించువాడు, తలారివృత్తితో జీవించేవాడు, ఈ ఆరుగురు బ్రహ్మబంధువులు.

**దత్త్వానుయోగో ద్రవ్యార్థం పతితాన్మనురబ్రవీత్ ।**
**వేదవిక్రయిణో హ్యేతే శ్రాద్ధాదిషు విగర్హితాః ॥ 31 ॥**

(అనగా బ్రాహ్మణులలో నిందితులు) జీవికకోసం భార్యతో వ్యభిచారం చేయించేవాడు, పతితుడని మనువు చెప్పాడు. వీరు, వేదాన్ని అమ్ముకొనేవారు, శ్రాద్ధానికి అర్హులు కారు.

**సుతవిక్రయిణో యే తు పరపూర్వా సముద్భవాః ।**
**అసామాన్యాన్యజన్తే యే పతితాస్తే ప్రకీర్తితాః ॥ 32 ॥**

పుత్రులను అమ్ముకునే వారు, ముందుభర్తను విడిచి ఇతర పురుషుని వివాహం చేసుకునేవారికి పుట్టినవారు, సమాన వర్ణులు కానివారితో యజ్ఞాన్ని చేయించేవారు పతితులు.

**అసంస్కృతాధ్యాపకా యే భృత్యర్థేఽధ్యాపయన్తి చ ।**
**అధీయతే తథా వేదాన్ పతితాస్తే ప్రకీర్తితాః ॥ 33 ॥**

సంస్కారం లేనివారిని చదివించేవారు, వేతనం తీసుకొని వేదాలను చదివించేవారు, వేతనం గ్రహించి వేదాలను చదివేవారు కూడా పతితులే అవుతారు.

**వృద్ధశ్రావకనిర్గ్రన్థాః పఞ్చరాత్రవిదో జనాః ।**
**కాపాలికాః పాశుపతాః పాషణ్డా యే చ తద్విధాః ॥ 34 ॥**

జైనులు, పాంచరాత్రులు, కాపాలికులు, పాశుపతులు, పాషండులు, వీరిని అనుసరించేవారు.

**యస్యాశ్నన్తి హవీంష్యేతే దురాత్మానస్తు తామసాః ।**
**న తస్య తద్భవేచ్ఛ్రాద్ధం ప్రేత్య చేహ ఫలప్రదమ్ ॥ 35 ॥**

దురాత్ములు, తామసులు ఎవరి హవ్యకవ్యాలను భుజిస్తారో అట్టివారు చేసిన శ్రాద్ధం, ఇహపరాల్లో ఫలప్రదం కాదు.

**అనాశ్రమీ ద్విజో యః స్యాదాశ్రమీ వా నిరర్థకః ।**
**మిథ్యాశ్రమీ చ తే విప్రా విజ్ఞేయాః పంక్తిదూషకాః ॥ 36 ॥**

ఏ ఆశ్రమమూ లేనివాడు, ఆశ్రమము స్వీకరించి కూడా నిష్ప్రయోజకుడు, దాంభికమైన ఆశ్రమం గలవారు – ఈ విప్రులు పంక్తిదూషకులు.

**దుశ్చర్మా కునఖీ కుష్ఠీ శ్విత్రీ చ శ్యావదన్తకః ।**
**విద్ధజననశ్చైవ స్తేనః క్లీబోఽథ నాస్తికః ॥ 37 ॥**

చర్మరోగి, చెడుగోళ్ళు కలవాడు, కుష్ఠురోగి, శ్వేత కుష్ఠురోగం ఉన్నవాడు, సహజంగా నల్లని దంతాలు కలవాడు, విద్ధలింగి, తస్కరుడు, నపుంసకుడు, నాస్తికుడు.

**మద్యపో వృషలీసక్తో వీరహా దిధిషూపతిః ।**
**అగారదాహీ కుణ్డాశీ సోమవిక్రయిణో ద్విజాః ॥ 38 ॥**

మద్యపానం చేసేవాడు, శూద్ర స్త్రీసక్తుడు, అగ్నిహోత్రం నశించినవాడు, విధవను పెళ్ళాడినవాడు గృహదాహకుడు, జారపుత్రుని అన్నం తినేవాడు, సోమలత నమ్మేవాడు వీరంతా శ్రాద్ధార్హులు కారు.

**పరివేత్తా చ హింస్రశ్చ పరివిత్తిర్నిరాకృతిః ।**
**పౌనర్భవః కుసీదశ్చ తథా నక్షత్రదర్శకః ॥ 39 ॥**

అన్న వివాహం కాకముందే వివాహమాడినవాడు, హింసించేవాడు, తమ్ముడు వివాహం చేసుకున్నా తాను పెళ్ళి చేసుకోనివాడు, పంచయజ్ఞాలాచరించనివాడు, రెండో వివాహం చేసుకొన్న స్త్రీకి కలిగిన పుత్రుడు, వడ్డీవ్యాపారంతో జీవించేవాడు, జ్యోతిషంతో జీవించేవాడు వీరంతా అనర్హులే.

**గీతవాదిత్రశీలశ్చ వ్యాధితః కాణ ఏవ చ ।**
**హీనాఙ్గశ్చాతిరిక్తాఙ్గో హ్యవకీర్ణీ తథైవ చ ॥ 40 ॥**

గీతవాదిత్రనిరతులు, రోగి, ఒంటి కన్నువాడు, వికలాంగుడు, అధికాంగుడు, స్త్రీసంపర్కం కారణంగా బ్రహ్మచర్యాన్ని నష్టపరచుకున్నవాడు.

**కన్యాదూషీ కుణ్డగోళా అభిశస్తోఽథ దేవలః ।**
**మిత్రధృక్ పిశునశ్చైవ నిత్యం భార్యానువర్తినః ॥ 41 ॥**

కన్యను చెరిచేవాడు, జారునివల్ల పుట్టినవాడు, పతి మరణానంతరం పరపురుషునివల్ల పుట్టినవాడు, అపనిందలు పొందినవాడు, మందిరాలవల్ల జీవించేవాడు, మిత్రద్రోహి, లోభి, భార్యావిధేయుడు శ్రాద్ధానికి పనికిరారు.

**మాతాపిత్రోర్గురోస్త్యాగీ దారత్యాగీ తథైవ చ ।**
**గోత్రస్పృక్ భ్రష్టశౌచశ్చ కాణ్డస్పృష్టస్తథైవ చ ।**
**అనపత్యః కూటసాక్షీ యాచకో రఙ్గజీవకః ॥ 42 ॥**

తల్లి, తండ్రిని, గురువు, భార్యను విడిచేవాడు, తన వాళ్ళలో భేదాన్ని సృష్టించేవాడు, శౌచం లేనివాడు, శస్త్రజీవి, సంతానం లేనివాడు, కూటసాక్ష్యం చెప్పేవాడు, యాచకుడు, చిత్రకారుడు నాట్యకారుడు.

**సముద్రయాయీ కృతహా తథా సమయభేదకః ।**
**వేదనిందారతశ్చైవ దేవనిన్దాపరస్తథా ॥ 43 ॥**

**ద్విజనిన్దారతశ్చైవ వర్జ్యాః శ్రాద్ధాది కర్మణి ।**
**కృతఘ్నః పిశునః క్రూరో నాస్తికో వేదనిన్దకః ॥ 44 ॥**

**మిత్రధృక్ కుహకశ్చైవ విశేషాత్పఙ్క్తిదూషకాః ।**
**సర్వే పునరభోజ్యాన్నా న దానార్హాః సర్వకర్మసు ॥ 45 ॥**

సముద్ర ప్రయాణం చేసేవాడు, కృతఘ్నుడు, ప్రతిజ్ఞాభంగం చేసేవాడు, వేద దేవ బ్రాహ్మణ నిందారతుడు. శ్రాద్ధ కర్మల్లో అనర్హులు. కృతఘ్నుడు, కొండెములు చెప్పువాడు, క్రూరుడు, నాస్తికుడు, మిత్రద్రోహి, కుటిలుడు, వీరంతా శ్రాద్ధాదికర్మల కనర్హులు. అన్ని కర్మల్లో దానానికి పాత్రులు కారు.

**బ్రహ్మహా చాభిశస్తశ్చ వర్జనీయాః ప్రయత్నతః ।**
**శూద్రాన్నరసపుష్టాఙ్గః సన్ధ్యోపాసనవర్జితః ॥ 46 ॥**

బ్రాహ్మణఘాతకుడు, ప్రయత్నపూర్వకంగా విడువతగినవారు. శూద్రాన్నంతో పోషణ పొందేవాడు, సంధ్యోపాసన చేయనివాడు.

**మహాయజ్ఞనిహీనశ్చ బ్రాహ్మణః పఙ్క్తిదూషకః ।**
**అధీతనాశనశ్చైవ స్నానదానవివర్జితః ।**
**తామసో రాజసశ్చైవ బ్రాహ్మణః పఙ్క్తిదూషితః ॥ 47 ॥**

పంచమహా యజ్ఞాలు చేయనివాడు – వీరు పంక్తి దూషకుడు. చదివినదాన్ని నశింపజేసేవారు, (అపాత్రులకు విద్యాదానం చేసేవారు) స్నాన దాన శూన్యులు, తామసులు, రాజసులు అయిన బ్రాహ్మణులు పంక్తిదూషకులు.

**బహునాత్రఽకిముక్తేన విహితాన్ యే న కుర్వతే ।**
**నిన్దితానాచరన్త్యేతే వర్జ్యాః శ్రాద్ధే ప్రయత్నతః ॥ 48 ॥**

ఈ విషయంలో ఎక్కువ చెప్పవలసినదేమిలేదు. శాస్త్ర విహిత కర్మలనాచరించక నిందితాలను ఆచరించేవారిని శ్రాద్ధకర్మల్లో ప్రయత్నపూర్వకంగానే వదలాలి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే శ్రాద్ధకల్పే ఏకోనవింశోఽధ్యాయః ॥ 21 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో శ్రాద్ధకల్పమనే ఇరవై ఒకటవ అధ్యాయం ॥ 21 ॥



## శ్రాద్ధకల్పః - శ్రాద్ధకల్పం

**వ్యాస ఉవాచ :**-వ్యాసమహర్షి చెప్పాడు

**గోమయేనోదకైర్భూమిం శోధయిత్వా సమాహితః ।**
**సన్నిమంత్ర్య ద్విజాన్ సర్వాన్ సాధుభిః సన్నిమన్త్రయేత్ ॥ 1 ॥**

సావధానంగా గోమయంతో, నీటితో భూమిని బాగా అలికి ద్విజులవద్దకు వెళ్ళి తాము నిమంత్రణం చేసి, సజ్జనుల ద్వారా గూడా నిమంత్రణ చేయాలి.

**శ్వో భవిష్యతి మే శ్రాద్ధం పూర్వేద్యురభిమంత్ర్య చ ।**
**అసమ్భవే పరేద్యుర్వా యథోక్తైర్లక్షణైర్యుతాన్ ॥ 2 ॥**

శ్రాద్ధానికి ముందురోజు బ్రాహ్మణులను పూజించి రేపు మా ఇంట్లో శ్రాద్ధం జరుగుతుంది. తాము దయతో రావాలని నిమంత్రించాలి. ఒక దినం ముందు అవకాశం లేకపోతే శ్రాద్ధం రోజునే వెళ్ళి ముందు చెప్పిన లక్షణాలున్నవారిని పిలవాలి.

**తస్య తే పితరః శ్రుత్వా శ్రాద్ధకాలముపస్థితమ్ ।**
**అన్యోఽన్యం మనసా ధ్యాత్వా సమ్పతన్తి మనోజవాః ॥ 3 ॥**

వారి పితృదేవతలు ఈ నిమంత్రణాన్ని విని శ్రాద్ధకాలం వచ్చిందని పరస్పరం చెప్పుకొని మనోవేగంతో శ్రాద్ధకర్త ఇంటికి చేరుతారు.

**తైర్బ్రాహ్మణైః సహాశ్నన్తి పితరో హ్యన్తరిక్షగాః ।**
**వాయుభూతాస్తు తిష్ఠన్తి భుక్త్వా యాన్తి పరాం గతిమ్ ॥ 4 ॥**

అంతరిక్షంలో సంచరించే పితరులు వాయురూపంలో ఉండి ఆ బ్రాహ్మణులతో కలిసి భుజిస్తారు. భోజనంచేసి ఉత్తమలోకాన్ని పొందుతారు.

**ఆమన్త్రితాశ్చ తే విప్రాః శ్రాద్ధకాల ఉపస్థితే ।**
**వసేయుర్నియతాః సర్వే బ్రహ్మచర్యపరాయణాః ॥ 5 ॥**

నిమంత్రణ పొందిన బ్రాహ్మణులు శ్రాద్ధకాలంలో నియమపరులు, బ్రహ్మచర్యపరాయణులై ఉండాలి.

**అక్రోధనోఽత్వరోఽమత్తః సత్యవాదీ సమాహితః ।**
**భారం మైథునమధ్వానం శ్రాద్ధకృద్వర్జయేద్ధ్రువమ్ ॥ 6 ॥**

శ్రాద్ధం ఆచరించేవాడు క్రోధం, తొందరపాటు, ఏమరపాటు లేనివాడై ఉండాలి. సత్యవాది, సావధాని కావాలి. బరువు మోయటం, మైథునం, యాత్ర తప్పక వదలుకోవాలి.

**ఆమన్త్రితో బ్రాహ్మణో వై యోఽన్యస్మై కురుతే క్షణమ్ ।**
**స యాతి నరకం ఘోరం సూకరత్వం ప్రయాతి చ ॥ 7 ॥**

శ్రాద్ధంకోసం పిలువబడినవాడు ఇతరుల నిమంత్రణాన్ని స్వీకరించినట్లైతే ఘోరనరకాన్ని పొంది మళ్ళీ సూకరంగా పుడతాడు.

**ఆమన్త్రయిత్వా యో మోహాదన్యఞ్చాఽమన్త్రయేద్ద్విజః ।**
**స తస్మాదధికః పాపీ విష్ఠాకీటోఽభిజాయతే ॥ 8 ॥**

ఒక బ్రాహ్మణుని నిమంత్రించి అతణ్ణి కాదని మరొకణ్ణి పిలిచినవాడు, రెండింతల పాపాన్ని పొంది మలకీటకంగా పుడతాడు.

**శ్రాద్ధే నిమన్త్రితో విప్రో మైథునం యోఽధిగచ్ఛతి ।**
**బ్రహ్మహత్యామవాప్నోతి తిర్యగ్యోనౌ విధీయతే ॥ 9 ॥**

శ్రాద్ధానికి నిమంత్రణ పొందినవాడు మైథున మాచరిస్తే బ్రహ్మహత్యా పాపాన్ని పొందుతాడు. పశుజాతితో పుడతాడు.

**నిమన్త్రితస్తు యో విప్రో హ్యధ్వానం యాతి దుర్మతిః ।**
**భవన్తి పితరస్తస్య తన్మాసం పాపభోజనాః ॥ 10 ॥**

శ్రాద్ధ నిమంత్రితుడు ప్రయాణం చేస్తే అతని పితరులు ఆ నెల పాపభోజనులౌతారు.

**నిమన్త్రితస్తు యః శ్రాద్ధే కుర్యాద్వై కలహం ద్విజః ।**
**భవన్తి పితరస్తస్య తన్మాసం మలభోజనాః ॥ 11 ॥**

శ్రాద్ధంలో పిలువబడిన బ్రాహ్మణుడు కలహిస్తే అతని పితరులు మాసమంతా మలభోజనులవుతారు.

**తస్మా న్నిమన్త్రితః శ్రాద్ధే నియతాత్మా భవేద్ద్విజః ।**
**అక్రోధనః శౌచపరః కర్తా చైవ జితేన్ద్రియః ॥ 12 ॥**

అందువల్ల అతడు మనోనిగ్రహం కలిగి ఉండాలి. కోపం లేక శౌచపరుడు కావాలి. కర్త కూడ జితేంద్రియుడు కావాలి.

**శ్వోభూతే దక్షిణాం గత్వా దిశం దర్భాన్విచక్షణః ।**
**సమూలానాహరేద్వారి దక్షిణాగ్రాన్ సునిర్మలాన్ ॥ 13 ॥**

శ్రాద్ధ దినానికి ముందురోజు కర్త స్వస్థచిత్తుడై దక్షిణంవైపు వెళ్ళి దక్షిణదిశకు వంగి ఉన్న పరమ పవిత్రములైన దర్భలను వేళ్ళతోకూడ తీసుకురావాలి. అట్లే జలాన్ని తీసుకొని రావాలి.

**దక్షిణాప్రవణం స్నిగ్ధం విభక్తం శుభలక్షణమ్ ।**
**శుచిం దేశం వివిక్తం చ గోమయేనోపలేపయేత్ ॥ 14 ॥**

దక్షిణంవైపు పల్లంగా ఉండి నునుపై ఇతర సంబంధం లేని శుభలక్షణం కల పవిత్రమైన, జన సమ్మర్దం లేని స్థలాన్ని ఆవుపేడతో అలకాలి.

**నదీతీరేషు తీర్థేషు స్వభూమౌ చైవ సానుషు ।**
**వివిక్తేషు చ తుష్యన్తి దత్తేన పితరః సదా ॥ 15 ॥**

నదీతీరాల్లో, తీర్థాల్లో తన భూమియందు ఏకాంత ప్రదేశంలో చేసే శ్రాద్ధంతో పితరులెపుడు సంతోషిస్తారు.

**పారక్యే భూమిభాగే తు పితౄణాం నైవ నిర్వపేత్ ।**
**స్వామిభిస్తద్విహన్యేత మోహాద్యత్ క్రియతే నరైః ॥ 16 ॥**

ఇతరుల భూమిలో పితృశ్రాద్ధం చేయకూడదు. అజ్ఞానంతో అట్లా చేస్తే శ్రాద్ధఫలం ఆ భూమి యజమానికి దక్కుతుంది.

**అటవ్యః పర్వతాః పుణ్యాస్తీర్థాన్యాయతనాని చ ।**
**సర్వాణ్యస్వామికాన్యాహుర్న హ్యేతేషు పరిగ్రహః ॥ 17 ॥**

అరణ్యాలు, పర్వతాలు, పుణ్యతీర్థాలు, దేవాలయాలు ఇవన్నీ అస్వామికాలు. వీటియందు శ్రాద్ధం చేయవచ్చును.

**తిలాన్ ప్రవికిరేత్తత్ర సర్వతో బంధయేదజమ్ ।**
**అసురోపహతం శ్రాద్ధం తిలైః శుధ్యత్యజేన తు ॥ 18 ॥**

ఆ భూమి యందంతటా నువ్వులు చల్లాలి. మేకను కట్టాలి. రాక్షసాక్రాంతమైన భూమి నువ్వులతో మేకతో శుద్ధిని పొందుతుంది.

**తతోఽన్నం బహుసంస్కారం నైకవ్యంజనమధ్యగమ్ ।**
**చోష్యం పేయం సంస్కృతం చ యథాశక్తి ప్రకల్పయేత్ ॥ 19 ॥**

బాగా సంస్కరింపబడిన అన్నాన్ని, అనేక వ్యంజనాలను, చోష్య, పేయ, పిండివంటలతో కూడినదిగా యథాశక్తి కల్పించాలి.

**తతో నివృత్తే మధ్యాహ్నే లుప్తరోమనఖాన్ద్విజాన్ ।**
**అనుగమ్య యథామార్గం ప్రయచ్ఛేద్దన్తధావనమ్ ॥ 20 ॥**

క్షౌరం చేసుకున్నవారు, నఖరోమాలు వెలుపలికి రాని బ్రాహ్మణులను మధ్యాహ్నకాలం తర్వాత సమీపించి మార్గమధ్యంలో దంతధావనానికీయాలి.

**ఆసధ్వమితి సంజల్పన్నాసేరంస్తే పృథక్ పృథక్ ।**
**తైలమభ్యంజనం స్నానం స్నానీయఞ్చ పృథగ్విధమ్ ॥ 21 ॥**

'కూర్చొండి' అని పలికి వారిని విడివిడిగా కూర్చోబెట్టాలి. అలాగే వారికి వేరువేరుగా నూనె, అభ్యంజనం, స్నానం, స్నానీయాన్ని (చూర్ణాన్ని) సిద్ధం చేయాలి.

**పాత్రైరౌదుంబరైర్దద్యాద్వైశ్వదేవత్యపూర్వకమ్ ।**
**తతః స్నానాన్నివృత్తేభ్యః ప్రత్యుత్థాయ కృతాఞ్జలిః ॥ 22 ॥**

**పాద్యమాచమనీయఞ్చ సంప్రయచ్ఛేద్యథాక్రమమ్ ।**
**యే చాత్ర విశ్వేదేవానాం ద్విజాః పూర్వం నియన్త్రితాః ॥ 23 ॥**

**ప్రాఙ్ముఖాన్యాసనాన్యేషాం త్రిదర్భోపహతాని చ ।**
**దక్షిణాభిముఖాక్తాని పితౄణామాసనాని చ ॥ 24 ॥**

**దక్షిణాగ్రేషు దర్భేషు ప్రోక్షితాని తిలోదకైః ।**
**తేషూపవేశయేదేతానాసనం సంస్పృశన్నపి ॥ 25 ॥**

వైశ్వదేవ మంత్రాలుచ్చరిస్తూ మేడిచెక్కతో చేసే పాత్రలతో అభ్యంజనంకోసం తైలాన్ని స్నానానికి జలాన్ని ఇవ్వాలి. స్నానంచేసి వచ్చిన వారిని ప్రత్యుత్థానం గావించి చేతులు జోడించుకొని యథాక్రమం పాద్యాన్ని ఆచమనీయాన్ని ఇవ్వాలి. విశ్వేదేవతలుగా నిమంత్రించిన బ్రాహ్మణులను మూడుదర్భలతో తూర్పుముఖాసనాలలో కూర్చోబెట్టాలి. పితృదేవతలకు దక్షిణ ముఖాసనాలను ఒకే దర్భకల తిలోదకంతో ప్రోక్షించాలి. ఆసనాన్ని స్పృశించి వాటిపై ఆ బ్రాహ్మణులను కూర్చోబెట్టాలి.

**ఆసధ్వమితి సంజల్పన్ ఆసేరంస్తే పృథక్ పృథక్ ॥**

**ద్వౌ దేవౌ ప్రాఙ్ముఖౌ పిత్రే త్రయశ్చోదఙ్ముఖాస్తథా ।**
**ఏకైకం తత్ర దేవన్తు పితృమాతామహేష్వపి ॥ 26 ॥**

కూర్చోండి అంటూ విడివిడిగా ఏర్పాటుగా చేయవలెను. విశ్వేదేవస్థానంలో ఇద్దరు విప్రులు ప్రాఙ్ముఖంగా, పితృస్థానంలో ముగ్గురు ఉదఙ్ముఖంగా కూర్చోవాలి. దేవస్థానంలో ఒకరిని, పితృస్థానంలో ఒకరిని నిమంత్రించాలి.

**సత్క్రియాం దేశకాలౌ చ శౌచం బ్రాహ్మణసంపదమ్ ।**
**పంచైతాన్విస్తరో హంతి తస్మాన్నేహేత విస్తరమ్ ॥ 27 ॥**

సత్కారము, దేశకాలములు, శౌచము, బ్రాహ్మణసంపద అను అయిదింటిని శ్రాద్ధవిస్తారము వ్యర్థము చేయును. కావున విస్తారమును సంకల్పించరాదు.

**అపి వా భోజయేదేకం బ్రాహ్మణం వేదపారగమ్ ।**
**శ్రుతశీలాదిసంపన్నమలక్షణవివర్జితమ్ ॥ 28 ॥**

లేనిచో శ్రాద్ధంలో శ్రుతము, శీలము మొదలైనవి గల, అవలక్షణాలులేని వేదపారగుడైన, బ్రాహ్మణుని ఒకణ్ణి భుజింపచేసినా చాలు.

**ఉద్ధృత్య పాత్రే చాన్నం తత్సర్వస్మాత్ ప్రకృతాత్తతః ।**
**దేవతాయతనే వాఽసౌ నివేద్యాన్యత్ప్రవర్తయేత్ ॥ 29 ॥**

సిద్ధం చేసిన భోజనపదార్థాలనుండి తగినంత ఒక పాత్రలో గ్రహించి దేవాలయంలో భగవంతునికి నివేదించిన తర్వాత ఇతర కార్యాన్ని ప్రవర్తింప చేయాలి.

**ప్రాశ్యేదన్నం తదగ్నౌ తు దద్యాద్వై బ్రహ్మచారిణే ।**
**తస్మాదేకమపి శ్రేష్ఠం విద్వాంసం భోజయేద్ద్విజమ్ ॥ 30 ॥**

శ్రాద్ధాన్నాన్ని అగ్నిలోకాని, బ్రహ్మచారికి కాని నివేదించాలి. అందువల్ల విద్వాంసుడు శ్రేష్ఠుడైన ఒక ద్విజుడినైనా భుజింప చేయాలి.

**భిక్షుకో బ్రహ్మచారీ వా భోజనార్థముపస్థితః ।**
**ఉపవిష్టస్తు యః శ్రాద్ధే కామం తమపి భోజయేత్ ॥ 31 ॥**

శ్రాద్ధంలో భుజించటానికి బ్రాహ్మణులు కూర్చున్నపుడు భిక్షుకుడు కాని బ్రహ్మచారి కాని వస్తే వారితోపాటు అతణ్ణి కూడా భుజింపచేయాలి.

**అతిథిర్యస్య నాశ్నాతి న తచ్ఛ్రాద్ధం ప్రశస్యతే ।**
**తస్మాత్ప్రయత్నాచ్ఛ్రాద్ధేషు పూజ్యా హ్యతిథయో ద్విజైః ॥ 32 ॥**

అతిథి భుజించని శ్రాద్ధం శ్రేష్ఠం కాదు. కాబట్టి శ్రాద్ధాల్లో ద్విజులు విశేష ప్రయత్నంతో అతిథులను పూజించాలి.

**ఆతిథ్యరహితే శ్రాద్ధే భుంజతే యే ద్విజాతయః ।**
**కాకయోనిం వ్రజన్త్యేతే దాతా చైవ న సంశయః ॥ 33 ॥**

ఆతిథ్యం లేని శ్రాద్ధం భుజించిన ద్విజులు భుజింపచేసిన కర్త కూడా నిస్సంశయంగా కాకులుగా పుడతారు.

**హీనాంగః పతితః కుష్ఠీ వ్రణయుక్తస్తు నాస్తికః ।**
**కుక్కుటః శూకరశ్వానౌ వర్జ్యాః శ్రాద్ధేషు దూరతః ॥ 34 ॥**

అంగవైకల్యం కలవాడు, పతితుడు, కుష్ఠురోగి, గాయమైనవాడు, నాస్తికుడు, కోళ్ళు, వరాహాలు, శునకాలు, శ్రాద్ధానికి దూరంగా ఉండేట్టు చూడాలి.

**బీభత్సమశుచిం నగ్నం మత్తం ధూర్తం రజస్వలామ్ ।**
**నీలకాషాయవసనపాషణ్డాంశ్చ వివర్జయేత్ ॥ 35 ॥**

భయంకరంగా ఉండేవాణ్ణి, అపవిత్రుని, నగ్నంగా ఉన్నవాణ్ణి మత్తుని, ధూర్తుని, రజస్వలైన స్త్రీని, నీలకాషాయ వస్త్రాలు ధరించిన వాళ్ళను, పాషండులను శ్రాద్ధంలో దూరంగా విడువాలి.

**యత్తత్ర క్రియతే కర్మ పైతృకం బ్రాహ్మణాన్ ప్రతి ।**
**తత్సర్వమేవ కర్తవ్యం వైశ్వదైవత్యపూర్వకమ్ ॥ 36 ॥**

పితృకర్మలో బ్రాహ్మణుల విషయంలో చేయవలసిందంతా వైశ్వదేవపూర్వకంగానే ఆచరించాలి.

**యథోపవిష్టాన్ సర్వాంస్తానలంకుర్యాద్విభూషణైః ।**
**స్రగ్దామభిః శిరోవేష్టైః ధూపవాసోఽనులేపనైః ॥ 37 ॥**

యథావిధి కూర్చొన్న బ్రాహ్మణులందర్నీ పుష్పహారాలు, శిరోవేష్టనాలతో వస్త్రధూపవిభూషణాదులతో అలంకరించాలి.

**తతస్త్వావాహయేద్దేవాన్ బ్రాహ్మణానామనుజ్ఞయా ।**
**ఉదఙ్ముఖో యథాన్యాయం విశ్వేదేవా స ఇత్యృచా ॥ 38 ॥**

తర్వాత బ్రాహ్మణాజ్ఞతో ఉత్తరాభిముఖంగా కూర్చుని విశ్వేదేవాస అనే మంత్రంతో విశ్వేదేవతలను ఆవాహన చేయాలి.

**ద్వే పవిత్రే గృహీత్వాస్య భాజనే క్షాళితే పునః ।**
**శన్నో దేవీత్యపః క్షిప్త్వా యవోఽసీతి యవాంస్తథా ॥ 39 ॥**

**యా దివ్యా ఇతి మన్త్రేణ హస్తే త్వర్ఘ్యం వినిక్షిపేత్ ॥**
**ప్రదద్యాద్ గంధమాల్యాని ధూపాదీని చ శక్తితః ॥ 40 ॥**

బాగా కడిగిన పాత్రలో రెండు పవిత్రాలను తీసుకొని 'శం నో దేవీ' అనే మంత్రంతో జలాన్ని ప్రోక్షించి 'యవోసి' అనే మంత్రంతో యవలు చల్లి 'యా దివ్యా' అనే మంత్రంతో హస్తమందు అర్ఘ్యాన్ని విడువాలి. తర్వాత శక్త్యనుసారం గంధమాల్య ధూపాదులు సమర్పించాలి.

**అపసవ్యం తతః కృత్వా పితౄణాం దక్షిణాముఖః ।**
**ఆవాహనం తతః కుర్యాదుశన్తస్త్వే త్యృచా బుధః ॥ 41 ॥**

తర్వాత అపసవ్యంగా దక్షిణాభిముఖుడై పితృదేవతలకు 'ఉశంత్వా' అనే మంత్రంతో ఆవాహన చేయాలి.

**ఆవాహ్య తదనుజ్ఞాతో జపేదాయాన్తునస్తతః ।**
**శన్నో దేవ్యోదకం పాత్రే తిలోఽసీతి తిలాంస్తథా ॥ 42 ॥**

**క్షిప్త్వా చార్ఘ్యం యథాపూర్వం దత్త్వా హస్తేషు వా పునః ।**
**సంప్రవాంశ్చ తతః సర్వాన్ పాత్రే కుర్యాత్సమాహితః ॥ 43 ॥**

వారి అనుమతితో 'ఆయాంతు నః' అనే మంత్రాన్ని జపించాలి. 'శంనో దేవీ' అనే మంత్రంతో పాత్రలో ఉదకాన్ని 'తిలోఽసి' అనే మంత్రంతో తిలలను చల్లి యథాపూర్వం హస్తాల్లో అర్ఘ్యాన్నిచ్చి మిగిలిన జలాన్ని సావధానంగా పాత్రలో ఉంచాలి.

**పితృభ్యః స్థానమేతచ్చ న్యుబ్జపాత్రం నిధాపయేత్ ।**
**అగ్నౌ కరిష్యన్నాదాయ పృచ్ఛేదన్నం ఘృతప్లుతమ్ ॥ 44 ॥**

**కురుష్వేత్యభ్యనుజ్ఞాతో జుహుయాదుపవీతవిత్ ।**
**యజ్ఞోపవీతినా హోమః కర్తవ్యః కుశపాణినా ॥ 45 ॥**

'పితృభ్యః' స్థానం అనే మంత్రంతో పాత్రను బోర్లించాలి. 'అగ్నౌ కరిష్యే' అని అడిగి 'కురుష్వ' అని వారి ఆజ్ఞపొంది ఘృత ప్లుతాన్నాన్ని దర్భపాణి ఉపవీతి అయి హోమం చేయాలి.

**ప్రాచీనావీతినా పిత్ర్యం వైశ్వదేవన్తు హోమవిత్ ।**
**దక్షిణం పాతయేజ్జానుం దేవాన్ పరిచరన్సదా । 46 ॥**
**పితౄణాం పరిచర్యాసు పాతయేదితరం తథా ॥**

వైశ్వదేవ మనే హోమం సవ్యంగా, పితృకర్మను అపసవ్యంగా ఆచరించాలి. విశ్వేదేవతలను కుడిమోకాలు వంచి పూజించాలి. అలాగే పితృదేవతలను ఎడమమోకాలు వంచి పూజించాలి.

**సోమాయ వై పితృమతే స్వధా నమ ఇతి బ్రువన్ ।**
**అగ్నయే కవ్యహవ్యాయ స్వధేతి జుహుయాత్తతః ॥ 47 ॥**

తర్వాత 'సోమాయ తే పితృమతే స్వధా నమః' అని, 'అగ్నయే కవ్యహవ్యాయ స్వథా' అని హోమం చేయాలి.

**అగ్న్యభావే తు విప్రస్య పాణావేవోపపాదయేత్ ।**
**మహాదేవాన్తికే వాఽథ గోష్ఠే వా సుసమాహితః ॥ 48 ॥**

అగ్ని లేనట్లైతే బ్రాహ్మణుని చేతిలో జలాన్ని వదలాలి. లేదా మహాదేవుని సన్నిధిలో లేదా గోశాలలో వదలాలి.

**తతస్తైరభ్యనుజ్ఞాతో గత్వా వై దక్షిణాం దిశమ్ ।**
**గోమయేనోపలిప్యాథ స్థానం కుర్యాత్ససైకతమ్ ॥ 49 ॥**

తర్వాత వారి ఆజ్ఞ పొంది దక్షిణదిశకు వెళ్ళి భూమిని గోమయంతో అలికి ఇసుకతో వేదికను చేయాలి.

**మణ్డలం చతురస్రం వా దక్షిణాప్రవణం శుభమ్ ।**
**త్రిరుల్లిఖేత్తస్య మధ్యం దర్భేణైకేన చైవ హి ॥ 50 ॥**

**తతః సంస్తీర్య తత్స్థానే దర్భాన్వై దక్షిణాగ్రగాన్ ।**
**త్రీన్పిణ్డాన్నిర్వపేత్ తత్ర హవిఃశేషాత్సమాహితః ॥ 51 ॥**

దక్షిణం వైపు పల్లంగా చతురస్ర మండలంగా కాని వేదికను నిర్మించి దాని మధ్యలో ఒక దర్భతో మూడుమార్లు ఉల్లేఖించి దానిపై దక్షిణాగ్రాలుగా దర్భలను పరచాలి. అక్కడ హవిఃశేషంతో మూడు పిండాలను పెట్టాలి.

**ఉప్య పిణ్డాంస్తు తద్ధస్తం నిమృజ్యాల్లేపభోజనాన్ ।**
**తేషు దర్భేష్వథాచమ్య త్రిరాచమ్య శనైరసూన్ ॥ 52 ॥**

**తదన్నం తు నమస్కుర్యాత్పితౄనేవ చ మన్త్రవిత్ ।**
**ఉదకం నినయేచ్ఛేషం శనైః పిణ్డాన్తికే పునః ॥ 53 ॥**

పిండప్రదానం తర్వాత లేపభాగాధికారులైన పితరులకు పిండాధారకుశమూలంతో పిండశేష సంస్పృష్ట హస్తాన్ని ప్రోక్షించి మంత్రవేత్త ఆచమించి మూడుమార్లు ప్రాణాయామం చేసి ఆ అన్నానికి పితరులకు నమస్కారం చేయాలి. ఆ పిండాలవద్ద ఉదకాన్ని నెమ్మదిగా విడవాలి.

**అవజిఘ్రేచ్చ తాన్ పిణ్డాన్ యథా న్యుప్తా సమాహితః ।**
**అథ పిణ్డాచ్చ శిష్టాన్నం విధివద్భోజయేద్ద్విజాన్ ॥ 54 ॥**

అలా ఉంచిన పిండాలను సావధానంతో ఆఘ్రాణించాలి. పిండదానం తర్వాత మిగిలిన అన్నాన్ని విధివిధానంగా బ్రాహ్మణులను భుజింప చేయాలి.

**మాషాపూపాంశ్చ వివిధాన్ శ్రాద్ధకల్పాంస్తు శోభనాన్ ।**
**తతోఽన్నముత్సృజేద్భుక్తేష్వగ్రతో వికిరన్భువి । 55 ॥**
**పృష్ట్వా తదన్నమిత్యేవ తృప్తానాచామయేత్తతః ॥**

మినుపగారెలను శ్రాద్ధానికి కల్పించిన వానిని భుజింప చేయాలి. వారు భుజింపగా వారికి ఎదుట అన్నాన్ని చల్లాలి. వారిని తృప్తి చెందినారా అని ప్రశ్నించి వారికి ఆచమనం ఇవ్వాలి.

**ఆచాన్తాననుజానీయాదభితో రమ్యతామితి ।**
**స్వధాస్త్వితి చ తే బ్రూయుర్బ్రాహ్మణా తదనన్తరమ్ ॥ 56 ॥**

ఆచమనం చేసిన తరువాత వారిననుగమించి విశ్రాంతిని పొందమని ప్రార్థించాలి. ఆ బ్రాహ్మణులు స్వధాస్తు అని పలుకుతారు.

**తతో భుక్తవతాం తేషామన్నశేషం నివేదయేత్ ।**
**యథా బ్రూయుస్తథా కుర్యాదనుజ్ఞాతస్తు తైర్ద్విజైః ॥ 57 ॥**

తర్వాత వారు భోజనంచేయగా మిగిలిన అన్నాన్ని వారికి నివేదించాలి. వారు చెప్పినట్టు చేయాలి.

**పిత్రే స్వధితమిత్యేవ వాచ్యం గోష్ఠీషు సుశ్రుతమ్ ।**
**సంపన్నమిత్యభ్యుదయే దేవే సేవితమిత్యపి ॥ 58 ॥**

పితరులకు స్వధిత మని, గోశాలలో సుశ్రుత మని, శుభకార్యంలో సంపన్నమని, దేవవిషయంలో సేవితం అని చెప్పాలి.

**విసృజ్య బ్రాహ్మణాన్ తాన్వై పితృపూర్వస్తు వాగ్యతః ।**
**దక్షిణాం దిశమాకాంక్షన్ యాచేతేమాన్వరాన్ పితౄన్ ॥ 59 ॥**

**దాతారో నోఽభివర్ధన్తాం వేదాః సన్తతిరేవ చ ।**
**శ్రద్ధా చ నో మా విగమద్బహు దేయం చ నోఽస్త్వితి ॥ 60 ॥**

ఆ బ్రాహ్మణులను పంపించి పితృదేవతాస్థానీయులైన బ్రాహ్మణులను దక్షిణాభిముఖుడై దాతలు వృద్ధి పొందుదురుగాక! వేదాలు, సంతతి పెంపొందుగాక! శ్రద్ధను మరువకుందుముగాక! మాకు అధిక దానాదులకోసం ధనం కలుగుగాక! అని యాచించాలి.

**పిణ్డాస్తు గోఽజవిప్రేభ్యో దద్యాదగ్నౌ జలేఽపి వా ।**
**మధ్యమన్తు తతః పిణ్డమద్యాత్పత్నీ సుతార్థినీ ॥ 61 ॥**

పిండాలను గోవులు, మేకలు, బ్రాహ్మణులకు ఇవ్వాలి. లేదా, అగ్నిలోనో, జలంలోనో కలపాలి. మధ్యమపిండాన్ని పుత్రులను కోరుకునే కర్త పత్ని తినాలి.

**ప్రక్షాళ్య హస్తావాచమ్య జ్ఞాతిం శేషేణ తోషయేత్ ।**
**సూపశాక ఫలానిక్షూన్ పయో దధి ఘృతం మధు ॥ 62 ॥**

**అన్నం చైవ యథాకామం వివిధం భోజ్యపేయకమ్ ।**
**యద్యదిష్టం ద్విజేంద్రాణాం తత్సర్వం వినివేదయేత్ ॥ 63 ॥**

చేతులు కడుక్కొని ఆచమించి మిగిలిన దానితో జ్ఞాతిని సంతోషపరచాలి. సూప శాక ఫల ఇక్షు పాలు పెరుగు నెయ్యి తేనె కోరినంత అన్నం, వివిధాలైన భోజ్య పేయ పదార్థాలను, బ్రాహ్మణులు ఇష్టపడిన వాటినంతా వారికి ఇవ్వాలి.

**ధాన్యాంస్తిలాంశ్చ వివిధాన్ శర్కరా వివిధాస్తథా ।**
**ఉష్ణమన్నం ద్విజాతిభ్యో దాతవ్యం శ్రేయ ఇచ్ఛతా ।**
**అన్యత్ర ఫలమూలేభ్యో పానకేభ్య స్తథైవ చ ॥64॥**

ధాన్యం, తిలలు, వివిధాలైన శర్కర మొదలైన వానితోపాటు ఫలమూలపానకం మొదలైనవి కాక వేడి అన్నాన్నే శ్రేయస్సు కోరేవాడు బ్రాహ్మణుల కివ్వాలి.

**న భూమౌ పాతయేజ్జానుం న కుప్యేన్నానృతం వదేత్ ॥ 65 ॥**

మోకాలిని నేలపై ఉంచరాదు. కోపించకూడదు. అసత్యమాడరాదు.

**న పాదేన స్పృశేదన్నం న చైవమవధూనయేత్ ।**
**క్రోధేనైవ చ యద్భుక్తం యద్భుక్తం త్వయథావిధి ॥**
**యాతుధానా విలుమ్పన్తి జల్పతా చోపపాదితమ్ । 66 ॥**

అన్నాన్ని పాదంతో స్పృశించకూడదు. పాదంతో రాయకూడదు. కోపంతో భుజించినది, విధినతిక్రమించి భుజించినది, మాట్లాడుతూ భుజించినది రాక్షసులు అపహరిస్తారు.

**స్విన్నగాత్రో న తిష్ఠేత సన్నిధౌ చ ద్విజోత్తమాః ॥**

**న చ పశ్యేత కాకాదీన్ పక్షిణః ప్రతిలోమగాన్ ।**
**తద్రూపాః పితరస్తత్ర సమాయాన్తి బుభుక్షవః ॥ 67 ॥**

చెమట వంటితో, బ్రాహ్మణుల చెంత నిలువకూడదు. అక్కడికి వచ్చిన గద్ద కాకి మొదలైన పక్షులను వెళ్ళగొట్టరాదు. పితృదేవతలు కవ్యాన్ని భుజించటానికి ఆ రూపంలో వస్తారు.

**న దద్యా త్తత్ర హస్తేన ప్రత్యక్షం లవణం యథా ।**
**న చాయసేన పాత్రేణ న చైవాశ్రద్ధయా పునః ॥ 68 ॥**

శ్రాద్ధంలో ప్రత్యేకంగా లవణాన్ని చేతితో వేయకూడదు. ఇనుప పాత్రతోకాని, అశ్రద్ధగా కాని వడ్డించకూడదు.

**కాఞ్చనేన తు పాత్రేణ రజతోదుమ్బరేణ వా ।**
**దత్తమక్షయతాం యాతి ఖడ్గేన చ విశేషతః ॥ 69 ॥**

**పాత్రే తు మృణ్మయే యో వై శ్రాద్ధే వై భోజయేద్ద్విజాన్ ।**
**స యాతి నరకం ఘోరం భోక్తా చైవ పురోధసః ॥ 70 ॥**

**న పఙ్క్త్యాం విషమం దద్యాన్న యాచేత న దాపయేత్ ।**
**యాచితా దాపితా దాతా నరకాన్యాతి భీషణాన్ ॥ 71 ॥**

బంగారుపాత్రతోగాని, వెండిపాత్రతోగాని, మేడిచెక్కతో చేసిన పాత్రతోగాని, ఖడ్గమృగచర్మపాత్రతోగాని వడ్డిస్తే అక్షయఫలం లభిస్తుంది. పురోహితుడు కూడ మట్టిపాత్రలో భోజనం పెట్టినవాడు, భుజించినవాడు, ఘోరనరకాన్ని పొందుతాడు.

**భుంజీరన్నగ్రతః శ్రేష్ఠం న బ్రూయుః ప్రాకృతాన్గుణాన్ ।**

**తావద్ధి పితరోఽశ్నన్తి యావన్నోక్తా హవిర్గుణాః ।**
**నాగ్రాసనోపవిష్టస్తు భుంజీత ప్రథమం ద్విజః ॥ 72 ॥**

భోజనపదార్థాల రుచి, ఆ రుచులను వర్ణిస్తూ భోజనం చేయకూడదు. పంక్తిలో భేదభావంతో వడ్డించకూడదు. అడుగకూడదు. ఇప్పించకూడదు, అట్లా వడ్డించినవాడు అడిగినవాడు, ఇప్పించినవాడు కూడ నరకాన్ని చేరుతారు. ముందుగా శ్రేష్ఠమైనదానినే మౌనంగా భుజించాలి. ప్రాకృత గుణాలు చెప్పకూడదు. భోక్తభోజన పదార్థాల గుణాలను చెప్పనంతవరకే పితరులు భుజిస్తారు.

**బహూనాం పశ్యతాం సోఽన్యః పంక్త్యా హరతి కిల్బిషమ్ ।**
**న కిఞ్చి ద్వర్జయేచ్ఛ్రాద్ధే నియుక్తస్తు ద్విజోత్తమః ॥ 73 ॥**

పంక్తిలో మొదట అగ్రాసనంలో కూర్చున్నవాడు మొదట భుజించరాదు. చాలమంది చూస్తుండగా ఒక్కడు భుజిస్తే చూస్తున్నవారి పాపాలను తాను పొందుతాడు. నిమంత్రితుడైన ద్విజుడు శ్రాద్ధంలో ఏదీ వదలకూడదు.

**న మాషస్య నిషేధేన న చాన్యస్యాన్న మీక్షయేత్ ।**
**యో నాశ్నాతి ద్విజో మాషాన్ నియుక్తః పితృకర్మణి ॥**

**స ప్రేత్య పశుతాం యాతి సంభవానేకవింశతిమ్ । 74 ॥**

మినుములను నిషేధించరాదు. ఇతరుల అన్నాన్ని చూడకూడదు. పితృకర్మలో నిమంత్రిత బ్రాహ్మణుడు వడ్డించిన మినుపగారెలను భుజించకపోతే పరలోకంలో ఇరువదొక జన్మలు పశురూపాన్ని పొందుతాడు.

**స్వాధ్యాయాన్ శ్రావయేదేషాం ధర్మశాస్త్రాణి చైవ హి ॥**

**ఇతిహాస పురాణాని శ్రాద్ధ కల్పాంశ్చ శోభనాన్ । 75 ॥**

భుజించేవారికి వేదాలు మంగళకరమైన ధర్మశాస్త్రాలు, ఇతిహాస పురాణాలు, శ్రాద్ధకల్పాలు విన్పించవలెను.

**తతోఽన్న ముత్సృజే ద్భోక్తా సాగ్రతో వికిరన్భువి ॥**
**పృష్ట్వా స్వధిత మిత్యేవం తృప్తానాచామయేత్తతః ॥ 76 ॥**

వారు భుజించిన తర్వాత తృప్తి చెందినారా అని అడిగి వారి తృప్తిని విన్న తర్వాత వారి భోజనపాత్రలో వడ్డించగా మిగిలిన అన్నాన్ని వెదచల్లాలి. తర్వాత వారిని ఆచమింపచేయాలి.

**ఏష వో విహితః సమ్యక్ శ్రాద్ధకల్పః సమాసతః ।**
**అనేన వర్ధయేన్నిత్యం బ్రాహ్మణో ఽవ్యసనాన్వితః ॥ 77 ॥**

**ఆమశ్రాద్ధం యదా కుర్యా ద్విధిజ్ఞః శ్రద్ధయాన్వితః ।**
**తేనాగ్నౌ కరణం కుర్యాత్పిండాంస్తేనైవ నిర్వపేత్ ॥ 78 ॥**

ఈ విధంగా మీకు సనాతనమైన శ్రాద్ధకల్పం క్లుప్తంగా వివరించనైనది. ఈ విధమైన శ్రాద్ధాచరణంతో వ్యసన రహితుడైన బ్రాహ్మణుడు తాను వృద్ధినొంది వంశాన్ని వృద్ధిపొందించవలెను. శ్రాద్ధాన్నాచరించాలి. ఈ తమ అన్నాన్నే అగ్నిలో హోమం చేయాలి. తమ అన్నంతో పిండప్రదానం కూడా చేయాలి.

**యోఽనేన విధినా శ్రాద్ధం కుర్యాద్వై శాన్తమానసః ।**
**వ్యపేత కల్మషో నిత్యం యతీనాం వర్తయేత్పదమ్ ॥ 79 ॥**

మనోనిగ్రహంతో ఈ విధంగా శ్రాద్ధమాచరించినవాడు పాపాలు తొలగి యతుల స్థానాన్ని పొందుతాడు.

**తస్మాత్సర్వప్రయత్నేన శ్రాద్ధం కుర్యాద్ద్విజోత్తమః ।**
**ఆరాధితో భవేదీశ స్తేన సమ్యక్ సనాతనః ॥ 80 ॥**

అందువల్ల ద్విజోత్తముడు సర్వప్రయత్నాలతో శ్రాద్ధాన్ని ఆచరించాలి. దీనితో సనాతనుడైన పరమాత్మ ఆరాధితుడవుతాడు.

**అపి మూలైః ఫలైర్వాపి ప్రకుర్యాన్నిర్ధనో ద్విజః ।**
**తిలోదకై స్తర్పయిత్వా పితౄన్ స్నాత్వా సమాహితః ॥ 81 ॥**

పేద బ్రాహ్మణుడు స్నానముచేసి సావధానచిత్తుడై కందమూలాలు ఫలాలతోకూడ శ్రాద్ధాన్ని చేయవచ్చు. అదికూడ లేనపుడు తిలోదకాలతో తర్పణం చేయాలి.

**న జీవత్పితృకో దద్యా ద్ధోమాన్తం వా విధీయతే ।**
**యేషాం వాపి పితా దద్యాత్తేషాం చైకే ప్రచక్షతే ॥ 82 ॥**

తండ్రి బ్రతికి ఉండగా శ్రాద్ధం చేయకూడదు. తప్పనిసరిగా చేయాల్సి వస్తే హోమాంతం వరకే చేయాలి. కొందరు తండ్రి పిండదానం చేసిన వారికే చేయాలన్నారు.

**పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః ।**
**యో యస్య మ్రియతే తస్మై దేయం నాన్యస్య తేన తు ॥ 83 ॥**

తండ్రి, తాత,ముత్తాత వీరిలో ఎవరు మరణిస్తే వారికి మాత్రమే చేయాలి. ఇతరులకు చేయకూడదు.

**భోజయేద్వాపి జీవన్తం యథాకామన్తు భక్తితః ।**
**న జీవన్తమతిక్రమ్య దదాతి ప్రయతః శుచిః ॥ 84 ॥**

అతని కోరిక మేరకు జీవించిన పురుషుని భుజింపచేయాలి. జీవించినవానిని అతిక్రమించి శుచియై పిండప్రదానం చేయకూడదు.

**ద్వ్యాముష్యాయణికో దద్యా ద్బీజక్షేత్రికయోః సమమ్ ।**
**అధికారీ భవేత్సోఽథ నియోగోత్పాదితో యది ॥ 85 ॥**

ద్వ్యాముష్యాయణకుడు బీజ క్షేత్ర పితరులను సమంగా పిండదానం చేయవలె. (కన్యనిస్తానని వాగ్దానం చేసిన తర్వాత ఆ వరుడు మరణిస్తే ఆ కన్య అతని ఆస్తికి కర్మకాండకు అధికారి. దేవాలయంలో సగోత్రుని వివాహం చేసుకొని కన్న కొడుకు వేరొకరికి దత్తపుత్రుడు ద్వ్యాముష్యాయణుడు). ఇతడు కన్నతండ్రికి మొదట చనిపోయిన వాగ్దాన భర్తకు ఇద్దరికి పిండప్రదానం కావించాలి. ఇట్లా చేసినవాడు సంపద సగభాగానికి అర్హుడు. తల్లిదండ్రుల నుండి కొని పుత్రునిగా స్వీకరిస్తే అతడు తన జన్మకారకుడైన తండ్రికి పిండప్రదానం చేయాలి.

**అనియుక్తా త్సుతోయశ్చ శుక్రతో జాయతే త్విహ ।**
**ప్రదద్యా ద్బీజినే పిణ్డం క్షేత్రిణే తు తతోఽన్యథా ॥ 86 ॥**

**ద్వౌ పిణ్డౌ నిర్వపేత్తాభ్యాం క్షేత్రిణే బీజినే తథా ।**
**కీర్తయే దథ చైవాస్మిన్ బీజినం క్షేత్రిణం తతః ॥ 87 ॥**

క్షేత్ర పితకు అనగా తన తల్లిని మొదటి భార్యగా స్వీకరించిన వానికి పిండదానం చేయకూడదు. నియోగ పద్ధతిలో కలిగిన పుత్రుడు క్షేత్రికి బీజికి కూడ పిండప్రదానం చేయాలి. ఒకే శ్రాద్ధంలో విడివిడిగా ఇద్దరి పేర్లను కీర్తించాలి.

**మృతాహని తు కర్తవ్యమేకోద్దిష్టం విధానతః ।**
**ఆశౌచే స్వే పరిక్షీణే కామ్యం వై కామతః పునః ॥ 88 ॥**

మరణించిన దినం యథావిధిగ ఏకోద్దిష్టం జరుపాలి. ఆశౌచం తొలగిన తర్వాత కామ్యశ్రాద్ధాన్ని ఆచరించాలి.

**పూర్వాహ్ని చైవ కర్తవ్యం శ్రాద్ధమభ్యుదయార్థినా ।**
**దేవవత్సర్వమేవ స్యాన్నైవ కార్యాస్తిలైః క్రియాః ॥ 89 ॥**

అభ్యుదయం కోరువాడు శ్రాద్ధాన్ని (నాంది) పూర్వాహ్ణంలోనే ఆచరించాలి. అంతా దేవకార్యం వలెనే ఆచరించాలి. నువ్వులతో చేయాల్సిన దాన్ని యవలతో చేయాలి.

**దర్భాశ్చ ఋజవః కార్యా యుగ్మాన్వై భోజయేద్ద్విజాన్ ।**
**నాన్దీముఖాస్తు పితరః ప్రీయన్తామితి వాచయేత్ ॥ 90 ॥**

మంచి దర్భలు కావాలి. ఇద్దరు ద్విజులను భుజింపచేయాలి. 'నాందీముఖాః పితరః ప్రీయంతాం' అని ఉచ్చరించాలి.

**మాతృశ్రాద్ధన్తు పూర్వం స్యాత్పితౄణాం తదనన్తరమ్ ।**
**తతో మాతామహానాన్తు వృద్ధౌ శ్రాద్ధత్రయం స్మృతమ్ ॥ 91 ॥**

మొదట మాతృశ్రాద్ధాన్ని తర్వాత పితృశ్రాద్ధాన్ని ఆచరించాలి. ఆ తర్వాత మాతామహులకు శ్రాద్ధం చేయాలి. ఇది అభ్యుదయశ్రాద్ధవిధి. దీనిని శ్రాద్ధత్రయమంటారు.

**దైవపూర్వం ప్రపద్యాద్వై న కుర్యాదప్రదక్షిణమ్ ।**
**ప్రాఙ్ముఖో నిర్వపే ద్విద్వానుపవీతీ సమాహితః ॥ 92 ॥**

ఇది దేవపూర్వకంగా చేయాలి. అప్రదక్షిణం చేయరాదు. ఉపవీతిగానే ప్రాఙ్ముఖుడై పిండప్రదానం చేయాలి.

**పూర్వన్తు మాతరః పూజ్యా భక్త్యా వై సగణేశ్వరాః ।**
**స్థణ్డిలేషు విచిత్రేషు ప్రతిమాసు ద్విజాతిషు ॥**

**పుష్పై ర్ధూపైశ్చ నైవేద్యై ర్భూషణై రపి పూజయేత్ । 93 ॥**

**పూజయిత్వా మాతృగణం కుర్యా చ్ఛ్రాద్ధత్రయం ద్విజః ॥ 94 ॥**

మొదట గణేశ్వరులతో కూడిన షోడశ మాతృకలను పూజించాలి. విచిత్రాలైన స్థండిలాల్లో, ప్రతిమలందు లేదా బ్రాహ్మణులందు ధూప దీప గంధ భూషణ నైవేద్యాదులతో మాతృగణాన్ని పూజించి శ్రాద్ధత్రయంగా ఆచరించవలెను.

**అకృత్వా మాతృయాగన్తు యః శ్రాద్ధన్తు నివేశయేత్ ।**
**తస్య క్రోధ సమావిష్టా హింసాం గచ్ఛన్తి మాతరః ॥ 95 ॥**

మాతృయాగం చేయక శ్రాద్ధం ఆచరిస్తే కోపించిన మాతృదేవతలు అతణ్ణి హింసించాలనుకుంటారు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే శ్రాద్ధకల్పే నామ ద్వావింశోఽధ్యాయః ॥ 22 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో శ్రాద్ధకల్పమనే ఇరవై రెండవ అధ్యాయం ॥ 22 ॥

## త్రయోవింశోఽధ్యాయః - ఇరవై మూడవ అధ్యాయం

## ఆశౌచకల్పం - ఆశౌచకల్పం

**వ్యాస ఉవాచ :-**వ్యాసమహర్షి చెప్పాడు

**దశాహం ప్రాహు రాశౌచం సపిండేషు విధీయతే ।**
**మృతేషు వాఽపి జాతేషు బ్రాహ్మణానాం ద్విజోత్తమాః! ॥ 1 ॥**

ద్విజోత్తములారా! సపిండుల విషయంలో జననమరణాల్లో ఆశౌచం పది దినాలని పండితులు చెప్తారు.

**నిత్యాని చైవ కర్మాణి కామ్యాని చ విశేషతః ।**
**న కుర్యా ద్విహితం కిఞ్చిత్ స్వాధ్యాయం మనసాపి చ ॥ 2 ॥**

ఈ ఆశౌచంలో నిత్యకర్మలు చేయరాదు. విశేషంగా కామ్యకర్మలు చేయకూడదు. విహితకర్మలు చేయరాదు. స్వాధ్యాయాన్ని మనసులో కూడ తలచుకోరాదు.

**శుచీనక్రోధనాన్ భూమ్యాన్ శాలాగ్నౌ భావయే ద్విజాన్ ।**
**శుష్కాన్నేన ఫలైర్వాపి వైతానాన్ జుహుయాత్తథా ॥ 3 ॥**

అగ్నికార్యానికై పవిత్రులు క్రోధంలేని బ్రాహ్మణులను నియమించాలి. శుష్కాన్నంతో లేదా ఫలాలతో వైతానాగ్నిలో హవనం కావించాలి.

**న స్పృశేయు రిమానన్యే న చ తేభ్యః సమాహరేత్ ।**
**చతుర్థే పఞ్చమే చాహ్ని సంస్పర్శః కథితో బుధైః ॥ 4 ॥**

ఆశౌచం కలవారిని ఇతరులు స్పృశించకూడదు. వారి నుండి ఏ వస్తువును గ్రహించరాదు. నాలుగు లేదా ఐదవదినం స్పర్శ చెప్పనైనది.

**సూతకే తు సపిణ్డానాం సంస్పర్శో నైవ దుష్యతి ।**
**సూతకం సూతికాఞ్చైవ వర్జయిత్వా నృణాం పునః ॥ 5 ॥**

సూతకంలో సపిండులను తాకటం దోషం కాదు. కాని పుట్టిన శిశువును, కన్నతల్లిని మాత్రం పది రోజులవరకు తాకరాదు.

**అధీయాన స్తథా వేదాన్ వేద విచ్చ పితా భవేత్ ।**
**సంస్పృశ్యాః సర్వ ఏవైతే స్నానాన్మాతా దశాహతః ॥ 6 ॥**

జాతాశౌచంలో వేదాధ్యయనం యజ్ఞం చేసే వేదజ్ఞుడైన తండ్రి స్నానం చేసిన వెంటనే స్పృశించదగిన వాడవుతాడు. తల్లిని మాత్రం పదిరోజుల తర్వాతనే స్పృశించాలి.

**దశాహం నిర్గుణే ప్రోక్త మాశౌచం వాతి నిర్గుణే ।**
**ఏకద్విత్రిగుణైర్యుక్తశ్చతుర్ద్వ్యేక దినైశ్శుచిః ॥ 7 ॥**

వేదాధ్యయనం అగ్నిహోత్రాది కర్మలు లేని నిర్గుణునికి జాతాశౌచం పదిరోజులు చెప్పనైనది. స్మార్తాగ్ని కలవారు ఏకగుణునికి నాలుగు దినాలు ఆశౌచం స్మార్తాగ్ని వేదాధ్యయనం కల ద్విగుణినికి మూడుదినాలు. వీటితోపాటు త్రేతాగ్నికల త్రిగుణునికి ఒకే దినం జాతా శౌచం.

**దశాహ్నే దపరం సమ్యగధీయీత జుహోతి చ ।**
**చతుర్థే తస్య సంస్పర్శం మనుః ప్రాహ ప్రజాపతిః ॥ 8 ॥**

పది దినాల తర్వాత బాగా అధ్యయనం హోమం చేయాలి. ఒకే గుణం కల ద్విజుని నాలుగు దినాల తర్వాత స్పృశించ వచ్చునని మనుప్రజాపతి చెప్పినాడు.

**క్రియాహీనస్య మూర్ఖస్య మహారోగిణ ఏవ చ ।**
**యథేష్టాచరణస్యేహ మరణాన్తమశౌచకమ్ ॥ 9 ॥**

శ్రౌతస్మార్త కర్మల నాచరించనివానికి, మహారోగికి, మూర్ఖునికి, స్వేచ్ఛాచారం గలవానికి ఆశౌచం మరణాంతముంటుంది. అట్టివాడు జీవితాంతం అస్పృశ్యుడని భావం.

**త్రిరాత్రం దశరాత్రం వా బ్రాహ్మణానా మశౌచకమ్ ।**
**ప్రాక్సంవత్సరాత్ త్రిరాత్రం దశరాత్రం తతః పరమ్ ॥ 10 ॥**

కేశసంస్కారం జరిగి ఉపనయనానికి ముందు మరణిస్తే మూడురోజులు, ఉపనయనం తర్వాత మరణిస్తే దశరాత్రాశౌచం ఉంటుంది.

**ఊన ద్వివార్షికే ప్రేతే మాతాపిత్రో స్తదిష్యతే ।**

**త్రిరాత్రేణ శుచిస్త్వన్యో యది హ్యంతతనిర్గుణః ।**
**జాతదన్తే త్రిరాత్రం స్యాద్యస్యాతాస్తనిర్గుణౌ ॥ 11 ॥**

రెండేళ్ళ వయసులోపు మరణిస్తే తల్లిదండ్రులకు మూడురోజుల ఆశౌచముంటుంది. వేదాధ్యయనాగ్ని హోత్రాదులు లేనివాడు మరణిస్తే మూడుదినాలు ఆశౌచముంటుంది. దంతాలు రాకముందు మరణిస్తే తల్లి దండ్రులకు ఒక దినం ఆశౌచం. తల్లిదండ్రులు నిర్గుణులైతే దంతాలు కలిగిన తర్వాత మరణిస్తే మూడురోజుల ఆశౌచం.

**ఆదన్తజననాత్సద్య ఆచూడాదేక రాత్రకమ్ ।**
**త్రిరాత్రమౌపనయనాత్సపిండానామశౌచకమ్ ॥ 12 ॥**

**జాతమాత్రస్య బాలస్య యది స్యాన్మరణం పితుః ।**
**మాతుశ్చ సూతకం తత్ స్యాత్ పితా స్యాత్ స్పృశ్య ఏవ చ ॥ 13 ॥**

దంతాలు వచ్చింది మొదలు చౌలంలోపు మరణిస్తే సపిండులకు ఏకరాత్రం, ఉపనయనం వరకు మూడురాత్రులు,పుట్టిన వెంటనే మరణిస్తే తల్లిదండ్రులకు ఆశౌచమున్నా తండ్రిని తాకవచ్చు. తల్లి అస్పృశ్యురాలే.

**సదాశౌచం సపిండానాం కర్తవ్యం సోదరస్య తు ।**
**ఊర్ధ్వం దశాహాదేకాహం సోదరో యది నిర్గుణః ॥ 14 ॥**

సపిండులకు సోదరులకు పదిదినాలలోపు మరణిస్తే స్నానమాత్రంతో శుద్ధి. పది దినాల తర్వాత మరణిస్తే నిర్గుణుడైనట్లైతే ఒక రాత్రి ఆశౌచం.

**తతోర్ధ్వం దన్తజననాత్ సపిణ్డానా మశౌచకమ్ ।**
**ఏకరాత్రం నిర్గుణానాం చౌడాదూర్ధ్వం త్రిరాత్రకమ్ ॥ 15 ॥**

దంతాలు వచ్చిన తరువాత మరణిస్తే సపిండులకు ఆశౌచము లేదు. నిర్గుణులకు ఒకరాత్రి ఆశౌచము. చౌలము తరువాత మూడురాత్రులు ఆశౌచముంటుంది.

**అదన్తజాతమరణం సమ్భవేద్యది సత్తమాః ।**
**ఏకరాత్రం సపిణ్డానాం యది తేఽత్యన్తనిర్గుణాః ॥ 16 ॥**

**వ్రతాదేశాత్సపిణ్డానాం గర్భస్రావాత్స్వపాతతః ।**
**అర్వాక్ షణ్మాసతః స్త్రీణాం యదిస్యాద్గర్భసంస్రవః ।**

**తదామాస సమైస్తాసాం ఆశౌచం దివసైః స్మృతమ్ ।**
**తత ఊర్ధ్వం తు పతనే స్త్రీణాం ద్వాదశరాత్రికమ్ ।**
**సద్యః శౌచం సపిణ్డానాం గర్భస్రావాచ్చ ధాతుతః ।**

దంతాలు మొలచిన తర్వాత మరణిస్తే నిర్గుణులకు సపిండులకు ఒక రాత్రి, చౌలం తర్వాత మూడు రాత్రులు, దంతాలు రాకముందు మరణిస్తే నిర్గుణులకు సపిండులకు ఒక రాత్రి ఆశౌచం. ఉపనయనం కాకముందు మరణిస్తే గుణులైన సపిండులకు స్నానమాత్ర శుద్ధి. ఉపనయనం తర్వాతైతే వైషమ్యముంటుంది. ఆరునెలలలోపు గర్భస్రావం జరిగితే స్త్రీలకు ఎన్ని నెలల గర్భమో అన్నిదినాలు ఆశౌచముంటుంది. ఆరునెలల తర్వాత గర్భపాతం జరిగితే పన్నెండు దినాలు ఆశౌచం సపిండులకు స్నానంతో శుద్ధి.

**గర్భచ్యుతా దహోరాత్రం సపిండేఽత్యన్త నిర్గుణే ॥**

**యథేష్టాచరణే జ్ఞాతా త్రిరాత్ర మితి నిశ్చయః ॥ 17 ॥**

గర్భచ్యుతికి అహోరాత్రం చెప్పనైనది. సపిండుడు అత్యంత నిర్గుణుడు యథేష్టాచారం గల జ్ఞాతి విషయంలో మూడురాత్రులు నిశ్చయించనైనది.

**యది స్యా త్సూతకే సూతిర్మరణే వా మృతిర్భవేత్ ॥ 18 ॥**

**శేషేణైవ భవేచ్ఛుద్ధిరహః శేషే త్రిరాత్రకమ్ ।**
**మరణోత్పత్తియోగేన మరణేన సమాప్యతే ॥ 19 ॥**

ఒకవేళ జాతాశౌచంలో జాతాశౌచం మరణంలో మరణం తెలిసినట్లైతే మిగిలిన రోజులతో శుద్ధి. ఒక పగలు మిగిలి ఉంటే మూడురాత్రులు అశౌచముంటుంది. మరణం జాతం కలిసినట్లైతే మరణా శౌచంతో పూర్తవుతుంది.

**ఆద్యం వృద్ధిమదాశౌచం తదా పూర్వేణ శుధ్యతి ।**
**దేశాన్తరగతం శ్రుత్వా సూతకం శావమేవ చ ॥ 20 ॥**

మొదటి ఆశౌచం వృద్ధిలో ఉంటే దాంతోనే శుద్ధి. దేశాంతర విషయంలో జాతాశౌచం మృతాశౌచం తెలిస్తే మిగిలిన రోజులు అశౌచం ఉంటుంది.

**తావదప్రయతో మర్త్యో యావచ్ఛేషం సమాప్యతే ।**
**అతీతే సూతకం ప్రోక్తం సపిండానాం త్రిరాత్రకమ్ ॥**
**ఆప్రదానాత్త్రిరాత్రం స్యాద్దశరాత్రం తతః పరమ్ ॥ 21 ॥**

సూతకం రోజులు గడచిన తర్వాత తెలిస్తే సపిండులకు మూడురాత్రులు అశౌచముంటుంది. వివాహం కాని కన్య మరణిస్తే మూడురాత్రుల అశౌచం. వివాహం తర్వాత భర్తకులంవారికి భర్తకు పదిరోజులు అశౌచం.

**మాతామహానాం మరణే త్రిరాత్రం స్యాదశౌచకమ్ ।**
**ఏకోదకానాఇ్చ తథా సూతకే చైతదేవ హి ॥ 22 ॥**

మాతామహుల మరణంలో మూడురాత్రులు అశౌచం. ఏకోదకుల మరణంలోను సూతకంలోనూ ఈ విధమైన అశౌచమే ఉంటుంది.

**పక్షిణీ యోనిసమ్బంధే బాన్ధవేషు తథైవ చ ।**
**ఏకరాత్రం సముద్దిష్టం గురౌ సబ్రహ్మచారిణి ॥ 23 ॥**

యోనిసంబంధం కల మేనత్త, మేనమామ, మేనల్లుడు పినతల్లి మొదలైన బంధువుల విషయంలో పక్షిణి అనగా ఒకటిన్నర దినముల అశౌచం. గురువు సహాధ్యాయి మరణిస్తే ఒకరోజు అశౌచం.

**ప్రేతే రాజని సజ్యోతి ర్యస్య స్యాద్విషయే స్థితః ।**
**గృహే మృతాసు సర్వాసు కన్యాసు చ త్ర్యహం పితుః ॥ 24 ॥**

తానున్న దేశపు రాజు మరణిస్తే ఒకపూట అశౌచం (నక్షత్రదర్శనం వరకు). వివాహమైన పుత్రిక తన యింట్లో మరణిస్తే తండ్రి మూడురోజుల ఆశౌచం ఉండాలి.

**పరపూర్వాసు భార్యాసు పుత్రేషు కృతకేషు చ ।**
**త్రిరాత్రం స్యాత్తథా చార్యా । స్వభార్యా స్వన్యగాసు చ ॥ 25 ॥**

ఇతరుల భార్యగా ఉండి ప్రస్తుతం తన భార్యగా మరణించినా ఆమె కొడుకు, పెంచుకున్న పుత్రుడు మరణించినా మూడుదినాల ఆశౌచం ఉంటుంది.

**ఆచార్యపుత్రే పత్న్యాఞ్చ అహోరాత్రముదాహృతమ్ ।**
**ఏకాహం స్యాదుపాధ్యాయే స్వగ్రామే శ్రోత్రియేఽపి చ ॥ 26 ॥**

ఆచార్యుని పత్ని పుత్రుడు మరణిస్తే ఒక దినం, ఉపాధ్యాయుడు కాని స్వగ్రామంలోని శ్రోత్రియుడు మరణిస్తే ఒకరోజు,

**త్రిరాత్రమసపిణ్డేషు స్వగృహే సంస్థితేషు చ ।**
**ఏకాహం చాస్వవర్ణ్యే స్యాదేకరాత్రం తదిష్యతే ॥**

**త్రిరాత్రం శ్వశ్రూమరణాత్ శ్వశురే చైతదేవ హి ।**
**సద్యః శౌచం సముద్దిష్టం స్వగోత్రే సంస్థితే సతి ॥ 27 ॥**

తన ఇంట్లో ఉన్న అసపిండుల విషయంలో త్రిరాత్రం, స్వవర్ణ్యుడు కానివాడు మరణించినా ఒక పగలు లేదా రాత్రి అశౌచం. పిల్లనిచ్చిన అత్తమామలకు త్రిరాత్రాశౌచ ముండాలి. సగోత్రుని మరణానికి స్నానం మాత్రం శుద్ధి.

**శుద్ధ్యే ద్విప్రో దశాహేన ద్వాదశాహేన భూమిపః ।**
**వైశ్యః పఞ్చదశాహేన శూద్రో మాసేన శుధ్యతి ॥ 28 ॥**

బ్రాహ్మణునికి పదిరోజులు, క్షత్రియునికి పన్నెండురోజులు, వైశ్యులకు పదునైదు రోజులు, శూద్రునికి ఒక నెల ఆశౌచం చెప్పనైనది.

**క్షత్ర విట్శూద్రదాయాదా యే స్యుర్విప్రస్య బాంధవాః ॥ 29 ॥**
**తేషామశౌచే విప్రస్య దశాహాచ్ఛుద్ధి రుచ్యతే ॥ 30 ॥**

ఇదేవిధంగా క్షత్రియ, వైశ్య, శూద్రులు, బ్రాహ్మణుని బంధువులైన వారు (దాయాదులు) మరణిస్తే బ్రాహ్మణునికి పదిరోజులు అశౌచం కలుగుతుంది.

**రాజన్యవైశ్యావప్యేవం హీన వర్ణాసు యోనిషు ।**
**తమేవ శౌచం కుర్యాతాం విశుద్ధ్యర్థమసంశయమ్ ॥ 31 ॥**

క్షత్రియ, వైశ్యులకు హీనవర్ణములందు పుట్టినవారు మరణించినచో ఆయా వర్ణాలకు విధించిన అశౌచంతో శుద్ధి కలుగుతుంది. విశుద్ధికోసం ఈ శౌచాన్ని సంశయం లేకుండా పాటించాలి.

**సర్వే తూత్తర వర్ణానామశౌచం కుర్యురాదృతాః ।**
**తద్వర్ణవిధిదృష్టేన స్వం తు శౌచం స్వయోనిషు ॥ 32 ॥**

అందరు ఉత్తరవర్ణానికి విధించిన అశౌచాన్ని పాటిస్తారు. కాని తమ జాతి స్త్రీయందు కలిగిన వారి విషయంలో మాత్రం స్వవర్ణాశౌచాన్నే పాటించాలి.

**షడ్రాత్రం తు త్రిరాత్రం స్యా దేకరాత్రం క్రమేణ తు ।**
**వైశ్యక్షత్రియ విప్రాణాం శూద్రేష్వాశౌచమేవ హి ॥ 33 ॥**

శూద్ర సపిండ మృత్యువులో జన్మలోను వైశ్య క్షత్రియ బ్రాహ్మణులకు వరుసగా ఆరు, మూడు, ఒక రాత్రి అశౌచముంటుంది.

**అర్ధమాసోऽథ షడ్రాత్రం త్రిరాత్రం ద్విజపుఙ్గవాః ।**
**శూద్రక్షత్రియ విప్రాణాం వైశ్యస్యాశౌచ మేవ చ ॥ 34 ॥**

వైశ్య సపిండ జనన మరణాల్లో శూద్ర క్షత్రియ బ్రాహ్మణులకు క్రమంగ పదునైదు, ఆరు, మూడు దినాల అశౌచం చెప్పనైనది.

**షడ్రాత్రం వై దశాహఞ్చ విప్రాణాం వైశ్యశూద్రయోః ।**
**అశౌచం క్షత్రియే ప్రోక్తం క్రమేణ ద్విజపుఙ్గవాః ॥ 35 ॥**

క్షత్రియ సపిండుని మృతిలో శూద్రవైశ్య బ్రాహ్మణులకు ఆరు, పదిరోజులు అశౌచం ఉంటుంది.

**శూద్రవిట్ క్షత్రియాణాన్తు బ్రాహ్మణస్య తథైవ చ ।**
**దశరాత్రేణ శుద్ధి స్యాదిత్యాహ కమలాపతిః ॥ 36 ॥**

బ్రాహ్మణ సపిండుని జన్మమరణాల్లో శూద్ర వైశ్య క్షత్రియులకు దశరాత్రాశౌచం తర్వాత శుద్ధి అని విష్ణువు తెలిపినాడు.

**అసపిణ్డం ద్విజం ప్రేతం విప్రో నిర్హృత్య బంధువత్ ।**
**అశిత్వా చ సహోషిత్వా దశరాత్రేణ శుధ్యతి ॥ 37 ॥**

సపిండుడు కాని విప్రుని మృతిలో అతనికి బంధువువలె ప్రేతకార్యాన్ని నిర్వర్తించి భోజనం నివాసం చేసిన వాళ్ళు దశరాత్రాశౌచం కల్గి ఉండాలి.

**యద్యన్నమత్తి తేషాన్తు త్రిరాత్రేణ తతః శుచిః ।**
**అన్నదం స్త్వన్నమహ్నా తు న చ తస్మిన్గృహే వసేత్ ॥ 38 ॥**

భోజనం మాత్రం చేసినవారికి త్రిరాత్రాశౌచం. కేవలం నివసించిన వారికి ఒక దినమశౌచం ఉంటుంది. అన్నము తినకుండా నివసించకుండా ఉన్నవారు ఆ ఇంటిలో ఉండరాదు.

**సోదకేऽథ తదేవ స్యా న్మాతురాప్తేషు బంధుషు ।**
**దశాహేన శవస్పర్శీ సపిణ్డశ్చైవ శుధ్యతి ॥ 39 ॥**

సమానోదకులు తల్లివైపు బంధువులు మరణించినపుడు శవవాహకులుగా ఉన్నవారికి సపిండులకు కూడ దశాహాశౌచం తర్వాతనే శుద్ధి కలుగుతుంది.

**యది నిర్హరతి ప్రేతం లోభాదాక్రాన్త మానసః ।**
**దశాహేన ద్విజః శుధ్యే ద్ద్వాదశాహేన భూమిపః ॥ 40 ॥**

**అర్ధమాసేన వైశ్యస్తు శూద్రో మాసేన వై శుచిః ।**
**షడ్రాత్రేణాథవా సర్వే త్రిరాత్రేణాథవా పునః ॥**

**అనాథం చైవ నిర్హృత్య బ్రాహ్మణం ధనవర్జితమ్ ।**
**స్నాత్వా సంప్రాశ్య చ ఘృతం శుద్ధ్యన్తి బ్రాహ్మణాదయః ॥ 41 ॥**

ఆస్తిపట్ల లోభంతో అంత్య సంస్కారమాచరించిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు వరుసగా పది, పన్నెండు, పదునైదు నెలరోజుల అశౌచం ఉంటుంది. లేదా వారికందరకు షడ్రాత్రం కాని త్రిరాత్రం కాని శుద్ధి చెప్పనైనది. అనాథ నిర్ధనుడైన బ్రాహ్మణుని దహనసంస్కారం చేసిన బ్రాహ్మణులు మొదలైనవారు స్నానం చేసి నెయ్యి తిని శుద్ధులౌతారు.

**అపరశ్చేత్ పరం వర్ణ మపరం చాపరే యది ।**
**అశౌచే సంస్పృశేత్ స్నేహాత్తదా శౌచేన శుద్ధ్యతి ॥ 42 ॥**

తక్కువ జాతి వారు అధిక జాతి వానిని, అధిక జాతి వారు తక్కువ జాతి వారిని స్నేహంతో శవాన్ని తాకితే ఆ జాతి నియమానుసారం స్నానంతో శౌచం కలుగుతుంది.

**ప్రేతీభూతం ద్విజం విప్రో హ్యనుగచ్ఛేత కామగః ।**
**స్నాత్వా సచైలం స్పృష్ట్వాగ్నిం ఘృతం ప్రాశ్య విశుద్ధ్యతి ॥ 43 ॥**

మరణించిన విప్రుని ఇష్టంతో శవయాత్రలో పాల్గొన్నట్టైతే సచేల స్నానంచేసి అగ్నిని స్పృశించి ఘృతాన్ని ప్రాశనం చేస్తే శుద్ధి కలుగుతుంది.

**ఏకాహా క్షత్రియే శుద్ధిర్వైశ్యే స్యాచ్చ ద్వ్యహేన తు ।**
**శూద్రే దినత్రయం ప్రోక్తం ప్రాణాయామశతం పునః ॥ 44 ॥**

బ్రాహ్మణ శవయాత్రలో శవం వెంట నడిచిన క్షత్రియునికి ఒక దినం, వైశ్యునికి రెండుదినాలు, శూద్రునికి మూడు దినాల ఆశౌచం చెప్పనైనది. ఆశౌచం తీరిన తర్వాత నూరు ప్రాణాయామాలు చేయాలి.

**అనస్థి సఞ్చితే శూద్రే రౌతి చేద్బ్రాహ్మణః స్వకైః ।**
**త్రిరాత్రం స్యాత్తథాఽశౌచమేకాహం త్వన్యథా స్మృతమ్ ॥ 45 ॥**

శూద్రుని మృతిలో అస్థి సంచయనం కాకముందు అతని బంధువులతోపాటు బ్రాహ్మణుడు రోదిస్తే అతనికి మూడు రోజుల అశౌచం ఉంటుంది.

**అస్థిసఞ్చయనాదర్వాగేకాహః క్షత్రవైశ్యయోః ।**
**అన్యథా చైవ సజ్యోతి ర్బ్రాహ్మణే స్నానమేవ తు ॥ 46 ॥**

అస్థి సంచయనం తర్వాతైతే ఒకరోజు, అస్థి సంచయనానికి ముందే క్షత్రియ వైశ్యులు విలపిస్తే ఒకరోజు తర్వాతైతే ఒకపూట ఆశౌచం.

**అనస్థిసఞ్చితే విప్రో బ్రాహ్మణో రౌతి చేత్తదా ।**
**స్నానేనైవ భవేచ్ఛుద్ధిః సచైలే నాత్ర సంశయః ॥ 47 ॥**

అస్థి సంచయనం కాకముందు బ్రాహ్మణుడు విలపిస్తే సచేల స్నానంతో శుద్ధి కల్గుతుంది.

**యస్తైః సహాశనం కుర్యాచ్ఛయనాదీని చైవ హి ।**
**బాంధవో వాఽపరో వాఽపి స దశాహేన శుద్ధ్యతి ॥ 48 ॥**

అశౌచమున్న వారితో కలిసి భోజనం, శయనాదులాచరిస్తే బంధువులుకాని ఇతరులు కాని పదిరోజుల తర్వాతే శుద్ధి.

**యస్తేషాం సమమశ్నాతి సకృదేవాపి కామతః ।**
**సదాఽశౌచే నివృత్తేఽసౌ స్నానం కృత్వా విశుద్ధ్యతి ॥ 49 ॥**

అశౌచాన్నం ఒకసారి తిన్నవారి ఆశౌచ దినసంఖ్య పూర్తయిన తర్వాత స్నానంతో శుద్ధి.

**యావత్తదన్న మశ్నాతి దుర్భిక్షాభిహతో నరః ।**
**తావన్త్యహాన్యశౌచం స్యాత్ప్రాయశ్చిత్తం తతః చరేత్ ॥ 50 ॥**

దుర్భిక్షాది బాధల్లో అశౌచుల ఇంట్లో ఎన్ని దినాలు భోజనంచేస్తే అన్ని దినాలు అశౌచముంటుంది. తర్వాత ప్రాయశ్చిత్తంతో శుద్ధి పొందుతాడు.

**దాహాద్యశౌచం కర్తవ్యం ద్విజానామగ్నిహోత్రిణామ్ ।**
**సపిణ్డానాఞ్చ మరణే మరణాదితరేషు చ ॥ 51 ॥**

అగ్నిహోత్రి అయిన ద్విజునికి దాహకాలం నుండి అశౌచం ఆరంభమవుతుంది. ఇతరులకు, సపిండులకైతే మరణకాలం నుండి అశౌచం పాటించాలి.

**సపిణ్డతా చ పురుషే సప్తమే వినివర్తతే ।**
**సమానోదకభావస్తు జన్మనామ్నోరవేదనే ॥ 52 ॥**

సపిండత్వం ఏడవతరంతో తొలగుతుంది. తన వంశం మూలపురుషుని పుట్టుక మరియు పేరు తెలియకపోతే సమానోదకత్వం తొలగుతుంది.

**పితా పితామహశ్చైవ తథైవ ప్రపితామహః ।**
**లేపభాజస్త్రయో జ్ఞేయాః సాపిండ్యం సప్తపౌరుషమ్ ॥ 53 ॥**

తండ్రి, తాత, ముత్తాత ఈ ముగ్గురు లేపభాగం (పిండిగ్రహణ యోగ్యులు) కలవారు అవుతారు. ఏడవతరం వరకు సపిండత ఉంటుంది.

**అప్రత్తానాం తథా స్త్రీణాం సాపిండ్యం సప్తపౌరుషమ్ ।**
**తాసాన్తు భర్తృసాపిణ్డ్యం ప్రాహ దేవః పితామహః ॥ 54 ॥**

వివాహం కాని స్త్రీకి తండ్రినుండి ఏడుతరాల వరకు సాపిండ్యం, వివాహమైతే భర్తనుండి ఏడుతరాల వరకు సాపిండ్యమని బ్రహ్మ చెప్పాడు.

**యే చైకజాతా బహవో భిన్నయోనయ ఏవ చ ।**
**భిన్నవర్ణాస్తు సాపిణ్డ్యం భవేత్తేషాం త్రిపూరుషమ్ ॥ 55 ॥**

ఒక పురుషుని ద్వారా భిన్నజాతుల స్త్రీలయందు కలిగిన భిన్నవర్ణాల సంతానానికి మూడుతరాలు సాపిండ్యం ఉంటుంది.

**కారవః శిల్పినో వైద్యా దాసీదాసాస్తథైవ చ ।**
**దాతారో నియమాచ్చైవ బ్రహ్మవిద్బ్రహ్మచారిణౌ ।**

**సత్త్రిణో వ్రతినస్తావత్సద్యః శౌచముదాహృతమ్ ॥56॥**

వడ్రంగి, శిల్పి, వైద్యులు, దాసదాసీజనం, దాత వ్రతపరాయణులు, నియమపాలకుడు, బ్రహ్మజ్ఞాని, బ్రహ్మచారి, యజ్ఞకర్త వ్రతి వీరిలో ఎవరి మృతిలోనైనా స్నానమాత్రంతో శుద్ధులవుతారు.

**రాజా చైవాభిషిక్తస్తు అన్నసత్రిణ ఏవ చ ॥ 57 ॥**

అభిషిక్తుడైన రాజు, అన్నదానంతో ప్రాణాలు కాపాడేవాడు కూడ స్నానమాత్రశుద్ధులు.

**యజ్ఞే వివాహకాలే చ దైవయోగే తథైవ చ ।**
**సద్యః శౌచం సమాఖ్యాతం దుర్భిక్షే చాప్యుపప్లవే ॥ 58 ॥**

యజ్ఞంలో, వివాహసమయంలో, దేవపూజలో, దుర్భిక్ష ఉపప్లవాల్లో కూడ స్నానమాత్రంతో శుద్ధి చెప్పనైనది.

**డిమ్బాహవహృతానాఞ్చ సర్పాది మరణేఽపి చ ।**
**అగ్నిమరుత్ప్రపతనే వీరాధ్వన్యప్యనాశకే ॥ 59**

**గోబ్రాహ్మణార్థే సంన్యస్తే సద్యః శౌచం విధీయతే ॥ 60 ॥**

క్షత్రియులకు, బ్రాహ్మణులకు, యుద్ధంలో పరస్పర కలహంతో మరణించినవారికి, విద్యుద్ఘాతం సర్పవేధతో, మరణించినా స్నానమాత్ర శుద్ధి. మరుత్ అగ్ని పతనాలవల్ల మరణించినా దుర్గమమార్గంలో అకాలమృత్యువాత పడినా గోవుకోసం, బ్రాహ్మణునికోసం మరణించినా సన్న్యాసి మరణించినా స్నానమాత్రశుద్ధి విధించనైనది.

**నైష్ఠికానాం వనస్థానాం యతీనాం బ్రహ్మచారిణామ్ ।**
**నాశౌచం కీర్త్యతే సద్భిః పతితే చ తథా మృతే ॥ 61 ॥**

నైష్ఠికులు, వానప్రస్థులు, యతులు, బ్రహ్మచారులకు ఆశౌచం చెప్పలేదు. పతితుడు మరణించినా అశౌచం లేదు.

**పతితానాం న దాహః స్యా న్నాన్త్యేష్టి ర్నాస్థిసఞ్చయః ।**
**నాశ్రుపాతో న పిణ్డో వా కార్యం శ్రాద్ధాదికం క్వచిత్ ॥ 62 ॥**

అట్లే పతితులకు దహనం, అంత్యేష్టి, అస్థిసంచయం, అశ్రుపాతం, పిండం, శ్రాద్ధాదికాలు లేవు.

**వ్యాపాదయేత్తథాత్మానం స్వయం యోఽగ్ని విషాదిభిః ।**
**విహితం తస్య నాశౌచం నాగ్ని ర్నాప్యుదకాదికమ్ ॥ 63 ॥**

అగ్ని విషాదులతో ఆత్మహత్య చేసుకున్నవానికి ఆశౌచం, అగ్ని, ఉదకాదులు చెప్పబడలేదు.

**అథ కిఞ్చిత్ప్రమాదేన మ్రియతేఽగ్ని విషాదిభిః ।**
**తస్యాశౌచం విధాతవ్యం కార్యఞ్చైవోదకాదికమ్ ॥ 64 ॥**

ప్రమాదవశంగా అగ్ని మొదలైన వాటివల్ల మరణించినవారికి దహనం తర్పణాదులు ఆశౌచం ఉంటుంది.

**జాతే కుమారే తదహః కామం కుర్యాత్ప్రతిగ్రహమ్ ।**
**హిరణ్యధాన్యగోవాసస్తిలాంశ్చ గుడసర్పిషీ ॥ 65 ॥**

**ఫలాని పుష్పం శాకం చ లవణం కాష్ఠమేవ చ ।**
**తక్రం దధి ఘృతం తైలమౌషధం క్షీరమేవ చ ।**
**అశౌచినో గృహాద్గ్రాహ్యం శుష్కాన్నం చైవ నిత్యశః ॥ 66 ॥**

కుమారుడు పుట్టిన దినమే సువర్ణ ధాన్య గో వస్త్ర తిల అన్నగుడ ఘృతాదులు దానం స్వీకరించాలి. అశౌచుల ఇంటినుండి అత్యవసర పరిస్థితిలో ఫల పుష్ప శాక లవణ కాష్ఠ జలాదులు, పెరుగు నూనె మందు పాలు శుష్కాన్నాన్ని ఎప్పుడైనా గ్రహించవచ్చును.

**ఆహితాగ్నిర్యథా న్యాయం దగ్ధవ్యస్త్రిభిరగ్నిభిః ॥**

**అనాహితాగ్నిర్గృహ్యేణ లౌకికేనేతరో జనః ॥ 67 ॥**

ఆహితాగ్నికి త్రేతాగ్నులతో దహనసంస్కారం చేయాలి. అనాహితాగ్నికి గృహ్యాగ్నితో, ఇతరులకు లౌకికాగ్నితో దహన సంస్కారం చేయాలి.

**దేహాభావాత్పలాశైస్తు కృత్వా ప్రతికృతిం పునః ।**
**దాహః కార్యో యథా న్యాయం సపిణ్డైః శ్రద్ధయాఽన్వితైః ॥ 68 ॥**

ఒకవేళ శవం లభించనట్లైతే మోదుగు పుల్లలతో ప్రతికృతిని చేసి శ్రద్ధగా దాహాదులను సపిండులు ఆచరించవచ్చును.

**సకృత్ ప్రసించేదుదకం నామగోత్రేణ వాగ్యతః ।**
**దశాహం బాంధవాః శ్రాద్ధం సర్వే చైవ సుసంయతాః ॥ 69 ॥**

నామగోత్రాలు చెప్పి ఉదకం విడువవచ్చును. బంధువులు అందరు దశాహం శ్రాద్ధం ఆచరించాలి.

**పిణ్డం ప్రతిదినం దద్యుః సాయం ప్రాతర్యథావిధి ।**
**ప్రేతాయ చ గృహద్వారి చతుర్థే భోజయేద్ద్విజాన్ ॥ 70 ॥**

ప్రతి దినం ఉదయ సాయంత్రం పిండప్రదానం చేయాలి. ప్రేతంకోసం గృహద్వారంలో పిండాన్ని విడవాలి. నాలుగవరోజు బ్రాహ్మణులకు భోజనం జరిపించాలి.

**ద్వితీయేఽహని కర్తవ్యం క్షురకర్మ సబాంధవైః ।**
**చతుర్థే బాంధవైః సర్వై రస్థ్నాం సఞ్చయనం భవేత్ ॥ 71 ॥**

రెండవరోజు బంధువులతో సహా అందరు క్షురకర్మ చేయించుకోవాలి. నాలుగవరోజు బంధువులతో కలిసి అస్థిసంచయనం గావించాలి.

**పూర్వం తు భోజయేద్విప్రాన్ యుగ్మాన్ సుశ్రద్ధయా శుచీన్ ।**
**పఞ్చమే నవమే చైవ తథైవైకాదశేఽహని ॥ 72 ॥**

దానికి ముందు శ్రద్ధతో పవిత్రులైన బ్రాహ్మణులను ఇద్దరిని భుజింప చేయాలి. అయిదు తొమ్మిది పదునొకండవ దినం కూడ సరిసంఖ్యతో బ్రాహ్మణులను భుజింపచేయాలి. దీనిని నవశ్రాద్ధ మంటారు.

**యుగ్మాంశ్చ భోజయే ద్విప్రాన్నవశ్రాద్ధన్తు తద్విజాః ।**
**ఏకాదశేఽహి కుర్వీత ప్రేతముద్దిశ్య భావతః ॥ 73 ॥**

**ద్వాదశే వాహ్ని కర్తవ్యం నవమేఽపృథవాఽహని ।**
**ఏకం పవిత్రమేకోఽర్ఘః పిణ్డపాత్రం తథైవ చ ॥ 74 ॥**

ప్రేతకొరకు పదకొండవ లేదా పన్నెండవ లేదా ఏదో ఒక పవిత్రదినం శ్రద్ధతో శ్రాద్ధాన్నాచరించాలి. ఈ శ్రాద్ధంలో ఒక పవిత్రం ఒక అర్ఘ్యం ఒక పిండపాత్ర ఉంటుంది.

**ఏవం మృతాహ్ని కర్తవ్యం ప్రతిమాసన్తు వత్సరమ్ ।**
**సపిండీకరణం ప్రోక్తం పూర్ణే సంవత్సరే పునః ॥ 75 ॥**

ఈ విధంగా చనిపోయిన దినం ఒక సంవత్సరం వరకు ప్రతి మాసం శ్రాద్ధాన్ని ఆచరించాలి. సంవత్సరం పూర్తయిన తర్వాత సపిండీకరణశ్రాద్ధం చేయాలి.

**కుర్యాచ్చత్వారి పాత్రాణి ప్రేతాదీనాం ద్విజోత్తమాః ।**
**ప్రేతార్థే పితృపాత్రేషు పాత్రమాసేచయేత్తతః ॥ 76 ॥**

పితృ పితామహ ప్రపితామహ వృద్ధ పితామహులకు నాలుగు పాత్రలు ఏర్పరచాలి. పితృపాత్రయందు ప్రేతపాత్ర అర్ఘ్యం ఉంచాలి.

**యే సమానా ఇతి ద్వాభ్యాం పిణ్డానప్యేవమేవ హి ।**
**సపిణ్డీకరణశ్రాద్ధం దేవపూర్వం విధీయతే ॥ 77 ॥**

'యే సమానాః' అనే రెండు మంత్రాలతో పితామహాదుల పిండాల్లో ప్రేతపిండాన్ని కలపాలి. సపిండీకరణ శ్రాద్ధం దేవపూర్వంగా దేవశ్రాద్ధం తర్వాత సపిండీకరణశ్రాద్ధం చేయాలి.

**పితౄనావాహయేత్తత్ర పునఃప్రేతం వినిర్దిశేత్ ।**
**యే సపిణ్డీకృతాః ప్రేతా న తేషాం స్యుః ప్రతిక్రియాః ॥ 78 ॥**

సపిండీకరణశ్రాద్ధం మొదట పితరుల నావాహన గావించి తర్వాత ప్రేతను ఆవాహన చేయాలి. సపిండీకరణం జరిగిన ప్రేతలకు మళ్ళీ విడిగా శ్రాద్ధప్రక్రియ ఉండదు.

**యస్తు కుర్యా త్పృథక్ పిణ్డం పితృహా సోఽభిజాయతే ।**
**మృతే పితరి వై పుత్రః పిణ్డానబ్దం సమావసేత్ ॥ 79 ॥**

**దద్యాచ్చాన్నం సోదకుమ్భం ప్రత్యహం ప్రేతధర్మతః ॥ 80 ॥**

అట్లుకాక విడిగా ప్రేతకు శ్రాద్ధం చేసినవాడు పితృఘాతకుడు అవుతాడు. తండ్రి చనిపోయినపుడు పుత్రుడు ఒక సంవత్సరం పిండప్రదానం చేయాలి. ప్రతిదినం ప్రేతధర్మానుసారం ఉదకుంభాన్ని అన్నదానాన్ని చేయాలి.

**పార్వణేన విధానేన సాంవత్సరిక మిష్యతే ।**
**ప్రతిసంవత్సరం కుర్యా ద్విధిరేష సనాతనః ॥ 81 ॥**

పార్వణ విధానంతో సాంవత్సరికం అననైనది. ప్రతి సంవత్సరం ఈ సనాతన విధిని ఆచరించాలి.

**మాతాపిత్రోః సుతైః కార్యం పిండదానాదికం చ యత్ ।**
**పత్నీ కుర్యాత్సుతాభావే పత్న్యభావే తు సోదరః ॥ 82 ॥**

పిండదానం మొదలైన కార్యాలు తల్లిదండ్రులకు సుతులు చేయాలి. సుతులు లేని పక్షంలో భార్య, ఆమెకూడా లేనపుడే సోదరుడు ఆచరించాలి.

**అనేనైవ విధానేన జీవః శ్రాద్ధం సమాచరేత్ ।**
**కృత్వా దానాదికం సర్వం శ్రద్ధాయుక్తః సమాహితః ॥ 83 ॥**

తనవారెవరు లేనపుడు, శ్రాద్ధం చేయరు అనే భావం ఉన్నపుడు తాను బ్రతికి ఉండగానే సర్వదానాదులను శ్రాద్ధవిధిని పైన చెప్పిన రీతిలో శ్రద్ధగా ఆచరించుకోవాలి. ఇది జీవశ్రాద్ధం.

**ఏష వః కథితః సమ్యగ్గృహస్థానాం క్రియావిధిః ।**
**స్త్రీణాం భర్తృషు శుశ్రూషా ధర్మో నాన్య ఇహోచ్యతే ॥ 84 ॥**

మీకు గృహస్థుల క్రియావిధానం వివరించినాను. స్త్రీలకు భర్త శుశ్రూషకంటే ఇతరవిధి చెప్పలేదు.

**స్వధర్మతత్పరా నిత్యం ఈశ్వరార్పితమానసాః ।**
**ప్రాప్నువన్తి పరం స్థానం యదుక్తం వేదవాదిభిః ॥ 85 ॥**

భగవంతునియందు మనసు లగ్నంచేసి స్వధర్మాల నాచరించేవారు వేదవిదులు చెప్పిన పరమపదాన్ని పొందుతారు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ఆశౌచకల్పం నామ త్రయోవింశోఽధ్యాయః ॥ 23 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ఆశౌచకల్పం అనే ఇరవై మూడవ అధ్యాయం ॥ 23 ॥

## చతుర్వింశోఽధ్యాయః - ఇరవై నాల్గవ అధ్యాయం

## ద్విజానాం అగ్నిహోత్రాది కృత్యమ్ - బ్రాహ్మణుల అగ్నిహోత్రాది కృత్యం

**వ్యాస ఉవాచ :-**వ్యాసమహర్షి చెప్పాడు

**అగ్నిహోత్రన్తు జుహుయా త్సాయం ప్రాతర్యథావిధి ।**
**దర్శే చైవ హి తస్యాన్తే నవసస్యే తథైవ చ ॥ 1 ॥**

బ్రాహ్మణు లెల్లకాలం ప్రతిదినం ప్రాతః సాయంకాలాలలో అగ్నిహోత్రమాచరించాలి. పక్షాంతంలో అమావాస్య పౌర్ణముల్లో దర్శేష్టి పౌర్ణమాసేష్టులు చేయాలి. పైరు కోతలపుడు నవసస్యేష్టిని చేయాలి.

**ఇష్ట్వా చైవ యథాన్యాయమృత్వన్తే చ ద్విజోఽధ్వరైః ।**
**పశునా త్వయనస్యాన్తే సమాన్తే సోఽగ్నికై ర్మఖైః ॥ 2 ॥**

ఋతువు చివర్లో చేయవలసిన యజ్ఞాన్ని చేయాలి. అయనం చివరలో పశువుతో, సంవత్సరం చివర్లో సౌమికయాగం ఆచరించాలి.

**నానిష్ట్వా నవసస్యేష్ట్యా పశునా వాగ్నిమాన్ ద్విజః ।**
**న చాన్నమద్యన్మాంసం వా దీర్ఘమాయుర్జిజీవిషుః ॥ 3 ॥**

దీర్ఘాయుష్యంతో జీవించాలనుకున్నవారు నవసస్యేష్టిని కాని పశుఇష్టినికాని చేయని అగ్నిహోత్రి కొత్త అన్నాన్ని కాని మాంసాన్ని కాని భుజించరాదు.

**నవేనాన్నేన చానిష్ట్వా పశుహవ్యేన చాగ్నయః ।**
**ప్రాణానేవాత్తు మిచ్ఛన్తి నవాన్నామిషగర్ధినః ॥ 4 ॥**

నవాన్నంతో నవపశుహవ్యంతో యజ్ఞం చేయక నవాన్నాన్ని మాంసాన్ని భుజించేవారు తమ ప్రాణాలను తామే తినదలచినారని తెలుసుకోవాలి.

**సావిత్రాన్ శాన్తిహోమాంశ్చ కుర్యా త్పర్వసు నిత్యశః ।**
**పితౄంశ్చైవాష్టకాః సర్వే నిత్యమన్వష్టకాసు చ ॥ 5 ॥**

పర్వాల్లో సావిత్రములను శాంతిహోమాన్ని ఆచరించాలి. అష్టకాల్లో అన్వష్టకాల్లోను పితరులను పూజించి అర్చించాలి.

**ఏష ధర్మః పరో నిత్య మపధర్మోఽన్య ఉచ్యతే ॥ 6 ॥**

ఈ విధంగా ఆచరించటం పరమధర్మం ఆచరించకపోవటం అపధర్మం.

**త్రయాణామిహ వర్ణానాం గృహస్థాశ్రమవాసినామ్ ।**

**నాస్తిక్యా దథవాఽలస్యాద్యోఽగ్నీన్నాధాతు మిచ్ఛతి ।**
**యజేత వా న యజ్ఞేన స యాతి నరకాన్బహూన్ ॥ 7 ॥**

గృహస్థాశ్రమంలో ఉండే త్రైవర్ణికులు నాస్తిక్యబుద్ధితోకాని, అలసత్వంతోకాని అగ్న్యాధానం చేయక యజ్ఞం చేయకుంటే అనేక నరకాల పాలౌతారు.

**తస్మాత్సర్వప్రయత్నేన బ్రాహ్మణో హి విశేషతః ।**
**ఆధాయాగ్నిం విశుద్ధాత్మా యజేత పరమేశ్వరమ్ ॥ 8 ॥**

అందువల్ల విశేషంగా బ్రాహ్మణులు అగ్న్యాధానం చేసి పరమాత్మనారాధించాలి.

**అగ్నిహోత్రా త్పరో ధర్మో ద్విజానాం నేహ విద్యతే ।**
**తస్మాదారాధయే న్నిత్యమగ్నిహోత్రేణ శాశ్వతమ్ ॥ 9 ॥**

ద్విజులకు అగ్నిహోత్రాన్ని మించిన ధర్మం లేదు. కావున నిత్యం పరమాత్మను అగ్నిహోత్రంతో ఆరాధించాలి.

**యస్త్వాధాయాగ్నిమాంశ్చ స్యాన్న యష్టుం దేవమిచ్ఛతి ।**
**న సమ్మూఢో న సమ్భాష్యః కిం పునర్నాస్తికో జనః ॥ 10 ॥**

అగ్న్యాధానం చేసి కూడ అలసత్వంతో దేవునారాధించనివారు పరమమూఢుడు. వారితో మాట్లాడరాదు. ఇక నాస్తికులను గూర్చి చెప్పేదేముంటుంది.

**యస్య త్రైవార్షికం భక్తం పర్యాప్తం భృత్యవృత్తయే ।**
**అధికం వా భవేద్యస్య స సోమం పాతు మర్హతి ॥ 11 ॥**

కుటుంబాన్ని, సేవకులను మూడుసంవత్సరాలు, అంతకంటే ఎక్కువకాలం పోషించగల వస్తుసామగ్రి ఉన్నవాడు సోమయాగం చేయతగినవాడు.

**ఏష వై సర్వయజ్ఞానాం సోమః ప్రథమ ఇష్యతే ।**
**సోమేనారాధయేద్దేవం సోమలోకమహేశ్వరమ్ ॥ 12 ॥**

అన్ని యజ్ఞాల్లో సోమయాగం అత్యంత శ్రేష్ఠమైనది. సోమలోకంలో ఉన్న మహేశ్వరుని సోమయజ్ఞంతో ఆరాధించాలి.

**న సోమయాగాదధికో మహేశారాధనాత్తతః ।**
**న సమో విద్యతే తస్మా త్సోమేనాభ్యర్చయేత్పరమ్ ॥ 13 ॥**

మహేశ్వరునారాధించటంలో సోమయాగాన్నిమించినది సమానమైనది లేదు. కావున సోమంతో పరమాత్మను ఆరాధించాలి.

**పితామహేన విప్రాణాం ఆదాయ విహితః పశుః ।**
**ధర్మో విముక్తయే సాక్షాచ్ర్ఛౌతః స్మార్తో భవేత్పునః ॥ 14 ॥**

బ్రహ్మ బ్రాహ్మణులకు పశుయాగాన్ని విధించాడు. మోక్షంకోసం ఆచరించే ధర్మం శ్రౌతము, స్మార్తము అని రెండు విధాలు.

**శ్రౌతస్త్రేతాగ్ని సమ్బన్ధాత్ స్మార్తః పూర్వం మయోదితః ।**
**శ్రేయస్కర తమః శ్రౌత స్తస్మాచ్ఛ్రౌతం సమాచరేత్ ॥ 15 ॥**

త్రేతాగ్ని సంబంధంతో శ్రౌతధర్మముంటుంది. స్మార్తధర్మం ఇదివరకే చెప్పనైనది. రెంటిలో శ్రౌతధర్మం శ్రేయాన్నిచ్చేది. అందువల్ల శ్రౌతాన్ని ఆచరించాలి.

**ఉభావపి హితౌ ధర్మౌ వేద వేద వినిఃసృతౌ ।**
**శిష్టాచార స్తృతీయః స్యాచ్ఛ్రుతిస్మృత్యోరభావతః ॥ 16 ॥**

రెండు ధర్మాలు వేదంనుండి వచ్చినవని తెలుసుకోవాలి. శ్రౌతస్మార్తాలు తెలియనపుడు మూడవధర్మం శిష్టాచారం.

**ధర్మేణాధిగతో యైస్తు వేదః సపరిబృంహిణః ।**
**తే శిష్టా బ్రాహ్మణాః ప్రోక్తాః నిత్యమాత్మగుణాన్వితాః ॥ 17 ॥**

సాంగముగా వేదమును ధర్మబద్ధముగా అధ్యయనం చేసినవారు, ఆత్మగుణాలు గల బ్రాహ్మణులు శిష్టులనబడతారు.

**తేషా మభిమతో యః స్యా చ్చేతసా నిత్యమేవ హి ।**
**స ధర్మః కథితః సద్భి ర్నాన్యేషామితి ధారణా ॥ 18 ॥**

వారు చెప్పినది వారికి సమ్మతమైనదే ధర్మం. శిష్టులుకానివారి కభిమతమైనది. ధర్మం కాదు. ఇదే నిశ్చయం.

**పురాణం ధర్మశాస్త్రాణి వేదానా ముపబృంహణమ్ ।**
**ఏకస్మాద్బ్రహ్మవిజ్ఞానం ధర్మజ్ఞానం తథైకతః ॥ 19 ॥**

పురాణములు, ధర్మశాస్త్రాలు వేదములకు వ్యాఖ్యానములు. పురాణముల వలన బ్రహ్మవిజ్ఞానము, ధర్మశాస్త్రములవలన ధర్మజ్ఞానము కలుగును.

**ధర్మం జిజ్ఞాసమానానాం తత్ప్రమాణతరం స్మృతమ్ ।**
**ధర్మశాస్త్రం పురాణాని బ్రహ్మజ్ఞానేతరాశ్రయమ్ ॥ 20 ॥**

ధర్మమును తెలియగోరినవారికి పురాణములు గొప్ప ప్రమాణములని చెప్పబడినది. బ్రహ్మజ్ఞానముకంటె ఇతరముల నాశ్రయించినవారికి ధర్మశాస్త్రాలు, పురాణాలు ప్రమాణము.

**నాన్యతో జాయతే ధర్మో బ్రాహ్మీ విద్యా చ వైదికీ ।**
**తస్మాద్ధర్మం పురాణఞ్చ శ్రద్ధాతవ్యం మనీషిభిః ॥ 21 ॥**

వేదం కంటే ఇతరాల్లో ధర్మ బ్రహ్మ విద్య జ్ఞానం కలుగదు. అందువల్ల విప్రులు పురాణ ధర్మశాస్త్రాల్లో శ్రద్ధ కల్గి ఉండాలి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ద్విజానాం అగ్నిహోత్రాదికృత్యం నామ చతుర్వింశోఽధ్యాయః ॥24॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో బ్రాహ్మణుల అగ్నిహోత్రాది కృత్యం అనే ఇరవైనాల్గవ అధ్యాయం ॥24॥

## పఞ్చవింశోఽధ్యాయః - ఇరవై అయిదవ అధ్యాయం

## ద్విజాతీనాం వృత్తిః - ద్విజాతులవృత్తి

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు

**ఏషవోఽభిహితః కృత్స్నో గృహస్థాశ్రమవాసినః ।**
**ద్విజాతేః పరమో ధర్మో వర్తనాని నిబోధత ॥ 1 ॥**

గృహస్థాశ్రమవాసి ద్విజుని పరమధర్మాలు వివరించాను. వారి వృత్తులను వివరిస్తాను వినండి.

**ద్వివిధస్తు గృహీ జ్ఞేయః సాధక శ్చాప్యసాధకః ।**
**అధ్యాపనం యాజనఞ్చ పూర్వస్యాహుః ప్రతిగ్రహమ్ ॥ 2 ॥**

గృహస్థాశ్రమవాసి సాధకుడు అసాధకుడని రెండు రకాలు. వానిలో సాధకుడు అధ్యాపనం, యజ్ఞం చేయించటం, దానం గ్రహించటం జీవితవృత్తిగా కలవాడు.

**కుసీద కృషి వాణిజ్యం ప్రకుర్వన్తః స్వయం కృతమ్ ।**
**కృషే రభావే వాణిజ్యం తదభావే కుసీదకమ్ ॥ 3 ॥**

తాను చేయకుండా ఇతరుల ద్వారా కృషి వాణిజ్యాలు చేయించవచ్చును. కృషి లేనపుడు వాణిజ్యం, వాణిజ్యం లేనపుడు కుసీదంతో (వడ్డీతో) జీవించవచ్చు.

**ఆపత్కల్ప స్త్వయం జ్ఞేయః పూర్వోక్తే ముఖ్య ఇష్యతే ।**
**స్వయం వా కర్షణం కుర్యా ద్వాణిజ్యం వా కుసీదకమ్ ॥ 4 ॥**

ఇవి ఆపత్కాలానికి చెప్పినవి మాత్రమే. ముఖ్యమైనవి అధ్యాపనయజనాదులే. ఆపత్కాలంలో తాను స్వయంగా కృషి, వాణిజ్యం, కుసీదం కూడ చేయవచ్చు.

**కష్టా పాపీయసీ వృత్తిః కుసీదం తద్వివర్జయేత్ ।**
**క్షాత్రవృత్తిం పరాం ప్రాహు ర్న స్వయం కర్షణం ద్విజైః ॥ 5 ॥**

కాని కుసీదవృత్తి అతికష్టమైనది. పాపవృత్తి అయినందువల్ల పరిత్యజించతగినదే. బ్రాహ్మణునికి కృషికంటె క్షత్రియవృత్తి ఉత్తమంగా చెప్పనైనది.

**తస్మాత్ క్షాత్రేణ వర్తేత వర్తతేఽవాపది ద్విజః ।**
**తేన చా వాప్య జీవంస్తు వైశ్యవృత్తిం కృషిం వ్రజేత్ ॥ 6 ॥**

బ్రాహ్మణులు స్వయంగా వ్యవసాయం చేయకూడదు. అందువల్ల ఆపదలో క్షాత్రవృత్తితో జీవించాలి. శస్త్రవృత్తిలో కూడ జీవించలేనపుడు కృషిరూపమైన వైశ్యవృత్తి స్వీకరించాలి.

**న కథఞ్చన కుర్వీత బ్రాహ్మణః కర్మ కర్షణమ్ ।**
**లబ్ధలాభః పితౄన్దేవాన్ బ్రాహ్మణాంశ్చాపి పూజయేత్ ॥ 7 ॥**

అయినా ఏ స్థితిలోనూ భూమిని దున్నకూడదు. ఇతర వృత్తిలో లాభాన్ని పొందినపుడు పితరులను దేవ బ్రాహ్మణులను పూజించాలి.

**తే తృప్తా స్తస్య తం దోషం శమయన్తి న సంశయః ।**
**దేవేభ్యశ్చ పితృభ్యశ్చ దద్యా ద్భాగన్తు వింశకమ్ ॥ 8 ॥**

**త్రింశద్భాగం బ్రాహ్మణానాం కృషిం కుర్వన్నదుష్యతి ।**
**వాణిజ్యే ద్విగుణం దద్యాత్ కుసీదే త్రిగుణం పునః ॥ 9 ॥**

దానితో తృప్తి పొందినవారు అతని దోషాన్ని తొలగిస్తారు. దేవ పితరులకు ఇరువదవ భాగాన్ని బ్రాహ్మణులకు 30వ భాగాన్ని ఇచ్చినట్లైతే కృషి దోషం నశిస్తుంది. వాణిజ్యం చేసేవారు వ్యవసాయ శాతం కంటె రెండింతలు, వడ్డీవ్యాపారం చేసేవారు మూడింతలు దానం చేస్తే ఆ దోషాలంటవు.

**శిలోంఛం వాఽ ప్యాదదీత గృహస్థః సాధకః పునః ।**
**విద్యాశిల్పాదయస్త్వన్యే బహవో వృత్తిహేతవః ॥ 10 ॥**

సాధకుడైన గృహస్థుడు శిలోంఛం కాని, ఇతర విద్యాశిల్పాలను కాని వృత్తికోసం స్వీకరించవచ్చు.

**అసాధకస్తు యః ప్రోక్తో గృహస్థాశ్రమసంస్థితః ।**
**శిలోంఛే తస్య కథితే ద్వే వృత్తీ పరమర్షిభిః ॥ 11 ॥**

పశుపక్షులకు కూడ అధికారంలేని ఒక్కొక్క ధాన్యకణాన్ని ప్రతిదినం చేతివ్రేళ్ళతో ఏరుకొని ఒకచోట చేర్చి వాటితో జీవించటం ఉంఛవృత్తి అంటారు. ధాన్యసమూహం గుత్తులను కూడ ఒకచోట చేర్చి జీవిస్తే శిలవృత్తిఅంటారు. వీనిలో మొదటిదే ఉత్తమం. గృహస్థాశ్రమంలో ఉన్న అసాధకునికి శిల ఉంఛ అనే రెండు వృత్తులను పరమర్షులు చెప్పారు.

**అమృతేనాథవా జీవే న్మృతేనాఽ ప్యథవా యది ।**
**అయాచితం స్యా దమృతం మృతం భైక్షన్తు యాచితమ్ ॥ 12 ॥**

అమృతంతో కాని మృతంతోకాని జీవించాలి. అయాచితాన్ని అమృతమని, యాచనను మృతమని అంటారు.

**కుశూలధాన్యకో వా స్యాత్కుంభీధాన్యక ఏవ చ ।**
**త్ర్యహ్నికో వాఽ పి చ భవేదశ్వస్తనిక ఏవ చ ॥ 13 ॥**

బ్రాహ్మణుడు కుశూలంలో ధాన్యం దాచుకొన్నవాడుగాని, మూడు రోజులకు సరిపడేదాన్ని దాచుకున్నవాడుగా కాని, రేపటికి కూడా లేనివానిగా కాని ఉండవచ్చు.

**చతుర్ణామపి చైతేషాం ద్విజానాం గృహమేధినామ్ ।**
**శ్రేయాన్పరః పరో జ్ఞేయో ధర్మతో లోకజిత్తమః ॥ 14 ॥**

ఈ నాలుగింటిలో మొదటి దానికన్నా ఉత్తరోత్తరం శ్రేష్ఠమని చెప్పనైనది. ఇదే లోకములను జయించునది.

**షట్కర్మకో భవేత్తేషాం త్రిభిరన్యః ప్రవర్తతే ।**
**ద్వాభ్యామేకశ్చతుర్థస్తు బ్రహ్మసత్రేణ జీవతి ॥ 15 ॥**

తనవద్ద సేవకులెక్కువగా ఉన్నవాడు షట్కర్మలతో అనగా ఋత-అయాచిత-భైక్ష-కృషి-వాణిజ్య-కుసీద అనేవాటితో జీవించవచ్చు. కొందరు మూడు సాధనలతో మరికొందరు రెండు సాధనలతో జీవించవచ్చు.

**వర్తయంస్తు శిలోంఛాభ్యామగ్నిహోత్ర పరాయణః ।**
**ఇష్టీః పార్వాయణాన్తాయాః కేవలా నిర్వపేత్సదా ॥ 16 ॥**

శిలావృత్తి లేదా ఉంఛవృత్తి ద్వారా జీవించేవారు అగ్నిహోత్రపరాయణులై ఉండవచ్చు. మరియు పర్వ, అయన, అంతములలో యజ్ఞాలను నిర్వహించవచ్చు. శిలోంఛలతో జీవిస్తూ అగ్నిహోత్రపరాయణుడై దర్శపూర్ణమాసీయ ఇష్టులను జరుపుతుండాలి.

**న లోకవృత్తం వర్తేత వార్తాన్తే వృత్తిహేతవే ।**
**అజిహ్మామశకాం శుద్ధాం జీవేద్బ్రాహ్మణజీవికామ్ ॥ 17 ॥**

**యాచిత్వా చార్థవద్భ్యోన్నం పితౄన్దేవాంస్తు తోషయేత్ ।**
**యాచయేద్వా శుచీన్దాంతాన్ తేన తృప్యేత్ స్వయం తతః ॥ 18 ॥**

బ్రాహ్మణుడు జీవికకోసం లోకవృత్తిని పరిహాసాలతో స్వీకరించరాదు. కపటం దంభం లేని పరిశుద్ధ జీవనాన్ని నడుపాలి. సత్పురుషులను అన్నం యాచించైనా దేవతలను పితృదేవులను సంతోషింప చేయాలి. పవిత్రుడు జితేంద్రియుని యాచించవచ్చు. దానితో తాను తృప్తుడు కావాలి.

**యస్తు ద్రవ్యార్జనం కృత్వా గృహస్థస్తోషయేన్న తు ।**
**దేవా న్పితౄంస్తు విధినా శునాం యోనిం వ్రజత్యథ ॥ 19 ॥**

ద్రవ్యార్జన చేసిన గృహస్థుడు దేవతలను పితృదేవులను యథావిధిగా సంతోషపెట్టనిచో శునకమై జన్మిస్తాడు.

**ధర్మశ్చార్థశ్చ కామశ్చ శ్రేయో మోక్షశ్చతుష్టయమ్ ।**
**ధర్మావిరుద్ధః కామః స్యాద్బ్రాహ్మణానాన్తు నేతరః ॥ 20 ॥**

ధర్మార్థ కామమోక్షాలనే పురుషార్థాలు నాలుగు. బ్రాహ్మణులకు ధర్మానికి విరుద్ధం కాని కామమే ఉండాలి. ఇతరం ఉండకూడదు.

**యోఽర్థో ధర్మాయ నాత్మార్థం సోఽర్థో నార్థస్తథేతరః ।**
**తస్మాదర్థం సమాసాద్య దద్యాద్వై జుహుయాద్ద్విజః ॥ 21 ॥**

ధర్మంకోసం ఉపయోగపడే అర్థమే అర్థం. తనకుపయోగించుకొనేది అర్థం కాదు. అనర్థమవుతుంది. అందువల్ల అర్థాన్ని సంపాదించి దానం యజ్ఞం మొదలైనవి చేయాలి. వానిద్వారా హవనం చేయాలి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ద్విజాతీనాం వృత్తిర్నామ పఞ్చవింశోఽధ్యాయః ॥25॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ద్విజాతులవృత్తి అనే ఇరవై అయిదవ అధ్యాయం ॥25॥

## షడ్వింశోఽధ్యాయః - ఇరవై ఆరవ అధ్యాయం

## దానధర్మనిరూపణమ్ - దానధర్మనిరూపణం

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు

**అథాతః సంప్రవక్ష్యామి దానధర్మమనుత్తమమ్ ।**
**బ్రహ్మణాఽభిహితం పూర్వమృషీణాం బ్రహ్మవాదినామ్ ॥ 1 ॥**

పూర్వం చతుర్ముఖబ్రహ్మ బ్రహ్మవాదులైన ఋషులకు బోధించిన సర్వోత్తమదానధర్మాన్ని వివరిస్తాను.

**అర్థానాముచితే పాత్రే శ్రద్ధయా ప్రతిపాదనమ్ ।**
**దానమిత్యభినిర్దిష్టం భుక్తిముక్తిఫలప్రదమ్ ॥ 2 ॥**

తాను సంపాదించిన ధనాన్ని యోగ్యులైన వారికి శ్రద్ధతో సమర్పించటం దానమననైనది. ఇది భోగమోక్షాలను ప్రసాదిస్తుంది.

**యద్దదాతి విశిష్టేభ్యః శిష్టేభ్యః శ్రద్ధయా యుతః ।**
**తద్విచిత్రమహం మన్యే శేషం కస్యాపి రక్షతి ॥ 3 ॥**

అత్యంతశ్రద్ధతో విశిష్టవ్యక్తులకు దానం చేసిందే విత్తం. అలా కానిది, ఇతరులది తాను కాపాడుతున్నదనే భావించాలి.

**నిత్యం నైమిత్తికం కామ్యం త్రివిధం దానముచ్యతే ।**
**చతుర్థం విమలం ప్రోక్తం సర్వదానోత్తమోత్తమమ్ ॥ 4 ॥**

నిత్యం, నైమిత్తికం, కామ్యం అని దానం మూడు విధాలు. నాల్గవది సర్వదానోత్తమం విమలం అనేది.

**అహన్యహని యత్కిఞ్చిద్దీయతేఽనుపకారిణే ।**
**అనుద్దిశ్య ఫలం తస్మాత్ బ్రాహ్మణాయ తు నిత్యకమ్ ॥ 5 ॥**

తనకు ఏ ఉపకారాన్ని చేయని ద్విజునికి ఏ ఫలాపేక్ష లేక నిత్యమూ ఇచ్చే దానం నిత్యం.

**యత్తు పాపోపశాన్త్యర్థం దీయతే విదుషాం కరే ।**
**నైమిత్తికం తదుద్దిష్టం దానం సద్భిరనుష్ఠితమ్ ॥ 6 ॥**

తాను చేసిన పాపం నశించటానికి విద్వాంసుల కర్పించే దానం నైమిత్తకం. దీనిని సజ్జనులాచరిస్తారు.

**అపత్యవిజయైశ్వర్యస్వర్గార్థం యత్ప్రదీయతే ।**
**దానం తత్కామ్యమాఖ్యాతమృషిభిర్ధర్మచిన్తకైః ॥ 7 ॥**

సంతానం, సంపద, విజయం, స్వర్గాది ఫలాలనుద్దేశించి చేసే దానం కామ్యమని ధర్మచింతకులైన ఋషులు తెల్పినారు.

**యదీశ్వరప్రీణనార్థం బ్రహ్మవిత్సు ప్రదీయతే ।**
**చేతసా ధర్మయుక్తేన దానం తత్ విమలం శివమ్ ॥ 8 ॥**

పరమేశ్వర ప్రీత్యర్థం బ్రహ్మజ్ఞులకు ధార్మికమైన మనసుతో అర్పించేది విమలమైన దానం. ఇది శుభప్రదం.

**దానధర్మం నిషేవేత పాత్రమాసాద్య శక్తితః ।**
**ఉత్పత్స్యతే హి తత్పాత్రం యత్తారయతి సర్వతః ॥ 9 ॥**

సత్పాత్ర లభించినపుడు యథాశక్తి దానం చేయాలి. అన్నివిధాలుగా తరింపజేసే అటువంటి సత్పాత్ర ఎల్లపుడు లభించదు. లభిస్తే ఆ పాత్ర అన్ని పాపాలనుండి ఉద్ధరిస్తుంది.

**కుటుంబభక్తవసనాద్దేయం యదతిరిచ్యతే ।**
**అన్యథా దీయతే యద్ధి న తద్దానం ఫలప్రదమ్ ॥ 10 ॥**

కుటుంబపోషణకు కావలసిన దానికంటే అధికంగా ఉన్నదాన్నే దానం చేయాలి. మరోవిధంగా చేస్తే అది ఫలాన్నీయదు.

**శ్రోత్రియాయ కులీనాయ వినీతాయ తపస్వినే ।**
**వ్రతస్థాయ దరిద్రాయ యద్దేయం భక్తిపూర్వకమ్ ॥ 11 ॥**

శ్రోత్రియుడు, గురుకులంలో బాగా చదివినవాడు. సత్కుల సంజాతుడు. తపస్సంపన్నుడు. సదాచారపరుడైన దరిద్రునికి భక్తితో దానం చేయాలి.

**యస్తు దద్యాన్మహీం భక్త్యా బ్రాహ్మణాయాऽऽహితాగ్నయే ।**
**స యాతి పరమం స్థానం యత్ర గత్వా న శోచతి ॥ 12 ॥**

ఆహితాగ్ని అయిన బ్రాహ్మణునికి భూదానం చేసినవాడు పునరావృత్తి లేని మోక్షాన్ని పొందుతాడు.

**ఇక్షుభిః సన్తతాం భూమిం యవగోధూమశాలినీమ్ ।**
**దదాతి వేదవిదుషే యః స భూయో న జాయతే ॥ 13 ॥**

చెరకు, యవగోధుమ పంటతోనున్న భూమిని వేదజ్ఞుడైన వానికిచ్చినవాడు మళ్ళీ జన్మలేనివాడగును.

**గోచర్మమాత్రమపి వా యో భూమిం సంప్రయచ్ఛతి ।**
**బ్రాహ్మణాయ దరిద్రాయ సర్వపాపైః ప్రముచ్యతే ॥ 14 ॥**

దరిద్రుడైన బ్రాహ్మణునికి గోచర్మ మాత్రం భూమిని దానం చేస్తే సర్వపాప విముక్తినొందును.

**భూమిదానాత్పరం దానం విద్యతే నేహ కిఞ్చన ।**
**అన్నదానం తేన తుల్యం విద్యాదానం తతోऽధికమ్ ॥ 15 ॥**

భూదానాన్ని మించిన దానం మరొకటి లేదు. అన్నదానం దానికి సమమగును. విద్యాదానం అంతకంటే గొప్పది.

**యో బ్రాహ్మణాయ శుచయే ధర్మశీలాయ శీలినే ।**
**దదాతి విద్యాం విధినా బ్రహ్మలోకే మహీయతే ॥ 16 ॥**

శాంతుడు, శుచి, ధర్మశీలి అయిన బ్రాహ్మణునకు విద్యాదానం చేసినవాడు బ్రహ్మలోకాన్ని పొందుతాడు.

**దద్యాదహరహస్త్వన్నం శ్రద్ధయా బ్రహ్మచారిణే ।**
**సర్వపాపవినిర్ముక్తో బ్రాహ్మణం స్థానమాప్నుయాత్ ॥ 17 ॥**

బ్రహ్మచారికి శ్రద్ధగా నిత్యాన్నదానం చేసినవాడు పాపాలన్నీ తొలగి బ్రహ్మలోకాన్ని చేరుతాడు.

**గృహస్థాయాన్నదానేన ఫలం ప్రాప్నోతి మానవః ।**
**ఆగమే వాస్య దాతవ్యం దత్త్వాऽऽప్నోతి పరాంగతిమ్ ॥ 18 ॥**

గృహస్థుడైన బ్రాహ్మణునికి చేసిన అన్నదానం మహాఫలాన్నిస్తుంది. కాని గృహస్థునికి అపక్వాన్నే దానం చేయాలి. అట్లా ఇస్తే ఉత్తమగతి సిద్ధిస్తుంది.

**వైశాఖ్యాం పౌర్ణమాస్యాన్తు బ్రాహ్మణాన్సప్త పఞ్చ వా ।**
**ఉపోష్య విధినా శాన్తాన్ శుచీన్ ప్రయతమానసః ॥ 19 ॥**

**పూజయిత్వా తిలైః కృష్ణైర్మధునా చ విశేషతః ।**
**గన్ధాదిభిః సమభ్యర్చ్య వాచయేద్వా స్వయం వదేత్ ॥ 20 ॥**

**ప్రీయతాం ధర్మరాజేతి యద్వా మనసి వర్తతే ।**
**యావజ్జీవం కృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి ॥ 21 ॥**

వైశాఖ శుద్ధ పౌర్ణమినాడు ఉపవసించి శాంతుడు శుచి ఏకాగ్రమనస్కుడై నల్లనువ్వులు, తేనె, గంధాదులతో అయిదుగురు లేదా ఏడుగురిని పూజించి యథావిధి భుజింపచేసి ధర్మరాజు ప్రీతిపొందుగాక! అని చెప్పాలి లేదా చెప్పించాలి. కాక తన మనసులో చెప్పుకోవాలి. ఇట్లా చేసినందువల్ల జీవితకాలంలో చేసిన పాపం వెంటనే నశిస్తుంది.

**కృష్ణాజినే తిలాన్ దత్త్వా హిరణ్యం మధుసర్పిషీ ।**
**దదాతి యస్తు విప్రాయ సర్వం తరతి దుష్కృతమ్ । 22 ॥**

కృష్ణాజినం, తిలలు, హిరణ్యం, తేనె, నెయ్యి, బ్రాహ్మణునకు దానం చేస్తే సకలపాపాలు తొలగుతాయి.

**కృతాన్నముదకుమ్భఞ్చ వైశాఖ్యాం చ విశేషతః ।**
**నిర్దిశ్య ధర్మరాజాయ విప్రేభ్యో ముచ్యతే భయాత్ । 23 ॥**

వైశాఖపూర్ణిమరోజు పక్వాన్నాన్ని, జలకుంభాన్ని ధర్మరాజునుద్దేశించి దానం చేస్తే అన్ని భయాలు తొలగిపోతాయి.

**సువర్ణతిలయుక్తైస్తు బ్రాహ్మణాన్సప్త పఞ్చ వా ।**
**తర్పయేదుదపాత్రాణి బ్రహ్మహత్యాం వ్యపోహతి ॥ 24 ॥**

బంగారం నువ్వులతోకూడ జలకుంభాన్ని అయిదుగురు లేదా ఏడుగురికి ఇస్తే బ్రహ్మహత్యాది పాపాలు కూడా తొలగుతాయి.

**శుక్లాంబరధరః కృష్ణైస్తిలైర్హుత్వా హుతాశనమ్ ।**
**ప్రదద్యాత్ బ్రాహ్మణేభ్యస్తు విప్రేభ్యః సుసమాహితః ॥ 25 ॥**

**జన్మప్రభృతి యత్పాపం సర్వం తరతి వై ద్విజః ।**
**అమావాస్యామనుప్రాప్య బ్రాహ్మణాయ తపస్వినే ॥ 26 ॥**

**యత్కిఞ్చిద్దేవదేవేశం దద్యాదుద్దిశ్య శఙ్కరమ్ ।**
**ప్రీయతామీశ్వరః సోమో మహాదేవస్సనాతనః ॥**
**సప్త జన్మకృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి ॥ 27 ॥**

మాఘశుద్ధ ద్వాదశి ఉపవాసం ఉండి తెల్లని వస్త్రాలు ధరించి నల్లనువ్వులతో అగ్నిలో హెూమం గావించి బ్రాహ్మణులకు తిలదానం చేస్తే జన్మప్రభృతి చేసిన పాపాలన్నీ నశిస్తాయి. అమావాస్యనాడు తపస్వి అయిన బ్రాహ్మణునకు శంకరునుద్దేశించి ఏ కొంచం దానం చేసి సనాతనుడు మహాదేవుడు సోముడు ప్రసన్నుడగుగాక అని పలికినచో ఏడుజన్మల పాపాలు నశిస్తాయి.

**యస్తు కృష్ణచతుర్దశ్యాం స్నాత్వా దేవం పినాకినమ్ ।**
**ఆరాధయేద్ద్విజముఖే న తస్యాస్తి పునర్భవః ॥ 28 ॥**

కృష్ణ చతుర్దశినాడు స్నానంచేసి బ్రాహ్మణముఖంగా శంకరుని ఆరాధించినవాడు మళ్ళీ జన్మించడు.

**కృష్ణాష్టమ్యాం విశేషేణ ధార్మికాయ ద్విజాతయే ।**
**స్నాత్వాఽభ్యర్చ్య యథాన్యాయం పాదప్రక్షాళనాదిభిః ॥ 29 ॥**

**ప్రీయతాం మే మహాదేవో దద్యాద్ద్రవ్యం స్వకీయకమ్ ।**
**సర్వపాపవినిర్ముక్తః ప్రాప్నోతి పరమాం గతిమ్ ॥ 30 ॥**

కృష్ణాష్టమినాడు విశేషంగా స్నానంచేసి ధార్మికుడైన బ్రాహ్మణునకు పాదప్రక్షాళనాదులతో యథావిధి పూజించి మహాదేవుడు ప్రీతి చెందుగాక అని తన ద్రవ్యాన్ని దానం చేస్తే సర్వపాపాలు తొలగి ఉత్తమగతిని పొందుతాడు.

**ద్విజైః కృష్ణచతుర్దశ్యాం కృష్ణాష్టమ్యాం విశేషతః ।**
**అమావాస్యాన్తు వై భక్తైః పూజనీయస్త్రిలోచనః ॥ 31 ॥**

బ్రాహ్మణులు విశేషించి కృష్ణ చతుర్దశి, అష్టమి, అమావాస్యల్లో శంకరుని పూజించాలి.

**ఏకాదశ్యాం నిరాహారో ద్వాదశ్యాం పురుషోత్తమమ్ ।**
**అర్చయేద్బ్రాహ్మణముఖే స గచ్ఛేత్పరమం పదమ్ ॥ 32 ॥**

ఏకాదశి ఉపవాసం ఉండి ద్వాదశినాడు బ్రాహ్మణముఖంగా పురుషోత్తమునారాధించినట్లైతే పరమపదాన్ని పొందగలడు.

**ఏషా తిథిర్వైష్ణవీ స్యాద్ద్వాదశీ శుక్లపక్షకే ।**
**తస్యామారాధయేద్దేవం ప్రయత్నేన జనార్దనమ్ ॥ 33 ॥**

శుక్లపక్ష ద్వాదశి శ్రీ విష్ణుతిథి. ఆ రోజు వీలుచేసుకొని జనార్దనుని ఆరాధించాలి.

**యత్కించిద్దేవమీశానముద్దిశ్య బ్రాహ్మణే శుచౌ ।**
**దీయతే విష్ణవే వాఽపి తదనంతఫలప్రదమ్ ॥ 34 ॥**

ఈశ్వరుని విష్ణువు నుద్దేశించి శుచియగు విప్రునికి దానం చేస్తే అనంతఫలం లభిస్తుంది.

**యో హి యాం దేవతామిచ్ఛేత్సమారాధయితుర్నరః ।**
**బ్రాహ్మణాన్ పూజయేద్విద్వాన్ స తస్యాస్తోషహేతుకః ॥ 35 ॥**

తానే దేవతనారాధించతలచినా ఆ దేవతా ఉద్దేశ్యంగా బ్రాహ్మణుని పూజించినట్లైతే ఆ దేవత ప్రీతి చెందును.

**ద్విజానాం వపురాస్థాయ నిత్యం తిష్ఠన్తి దేవతాః ।**
**పూజ్యంతే బ్రాహ్మణాలాభే ప్రతిమాదిష్వపి క్వచిత్ ॥ 36 ॥**

దేవతలందరు బ్రాహ్మణుని దేహంలో ఎప్పుడూ ఉంటారు. బ్రాహ్మణులు లభించనపుడు ఒక్కొక్కమారు ప్రతిమాదులలో పూజింపబడతారు.

**తస్మాత్సర్వప్రయత్నేన తత్ఫలానామభీప్సుభిః ।**
**ద్విజేషు దేవతా నిత్యం పూజనీయా విశేషతః ॥ 37 ॥**

అందువల్ల ఆ యా ఫలాకాంక్ష కలవారు బ్రాహ్మణుల్లో ఆ దేవతలను పూజించాలి.

**విభూతికామః సతతం పూజయేద్వై పురన్దరమ్ ।**
**బ్రహ్మవర్చసకామస్తు బ్రహ్మాణం బ్రహ్మకాముకః ॥ 38 ॥**

**ఆరోగ్యకామోఽథ రవిం ధేనుకామో హుతాశనమ్ ।**
**కర్మణాం సిద్ధికామస్తు పూజయేద్వై వినాయకమ్ ॥ 39 ॥**

ఐశ్వర్యాన్ని కోరేవారు ఇంద్రుని, బ్రహ్మతేజస్సు పొందాలనేవారు బ్రహ్మను, ఆరోగ్యాన్ని కోరుకున్నవారు రవిని, ధేనువును కోరువారు అగ్నిదేవుని, కర్మసిద్ధిని కోరువారు వినాయకుని పూజించాలి.

**భోగకామస్తు శశినం బలకామః సమీరణమ్ ।**
**ముముక్షుః సర్వసంసారాత్ప్రయత్నేనార్చయేద్ధరిమ్ ॥ 40 ॥**

భోగాలు కోరేవాడు చంద్రుని, బలాన్ని కోరుకున్నవాడు వాయువును, సంసారంనుండి మోక్షాన్ని కోరేవాడు విశేషభక్తితో విష్ణువును పూజించాలి.

**యస్తు యోగం తథా మోక్షమిచ్ఛేత్ వా జ్ఞానమైశ్వరమ్ ।**
**సోఽర్చయేద్వై విరూపాక్షం ప్రయత్నేన మహేశ్వరమ్ ॥ 41 ॥**

**యో వాఞ్ఛతి మహాయోగాత్ జ్ఞానాని చ మహేశ్వరమ్ ।**
**తే పూజయన్తి భూతేశం కేశవఞ్చాపి భోగినః ॥ 42 ॥**

యోగాన్నీ, జ్ఞానాన్ని బ్రహ్మజ్ఞానాన్ని కోరేవాడు విరూపాక్షుని, మహాయోగ జ్ఞానాలను కోరేవారు ఈశ్వరుని కేశవుని పూజిస్తారు.

**వారిదస్తృప్తిమాప్నోతి సుఖమక్షయ్యమన్నదః ।**
**తిలప్రదః ప్రజామిష్టాం దీపదశ్చక్షురుత్తమమ్ ॥ 43 ॥**

జలదానం తృప్తిని, అన్నదానం అక్షయసుఖాన్ని, తిలదానం ఇష్టసంతానాన్ని, దీపదానం ఉత్తమ నేత్రాలను ఇస్తాయి.

**భూమిదః సర్వమాప్నోతి దీర్ఘమాయుర్హిరణ్యదః ।**
**గృహదోఽగ్ర్యాణి వేశ్మాని రూప్యదో రూపముత్తమమ్ ॥ 44 ॥**

**వాసోదశ్చంద్రసాలోక్యమశ్విసాలోక్యమశ్వదః ।**
**అనడుద్దః శ్రియం పుష్టాం గోదః బ్రధ్నస్య విష్టపమ్ ॥ 45 ॥**

భూమిదానం సకలాభీష్టాలను, సువర్ణదానం దీర్ఘాయుష్యాన్ని, గృహదానం ఉత్తమ భవనాలను, రజతదానం సౌందర్యాన్ని, వస్త్రదానం చంద్రసాలోక్యాన్ని, అశ్వదానం అశ్వినీదేవతల లోకాన్ని, వృషభదానం పుష్టికల సంపదను, గోదానం బ్రహ్మ లోకప్రాప్తిని కలుగచేస్తాయి.

**యానశయ్యాప్రదో భార్యామైశ్వర్యమభయప్రదః ।**
**ధాన్యదః శాశ్వతం సౌఖ్యం బ్రహ్మదో బ్రహ్మసాత్మ్యతామ్ ॥ 46 ॥**

వాహనం శయ్యాదానం చేసినవాడు అందమైన భార్యను, అభయమొసగినవాడు ఐశ్వర్యాన్ని, ధాన్యదానం చేసినవాడు శాశ్వతసౌఖ్యాన్ని, వేదదానం చేసినవాడు బ్రహ్మతాదాత్మ్యాన్ని పొందుతాడు.

**ధాన్యాన్యపి యథాశక్తి విప్రేషు ప్రతిపాదయేత్ ।**
**వేదవిత్సు విశిష్టేషు ప్రేత్య స్వర్గం సమశ్నుతే ॥ 47 ॥**

తమ శక్త్యనుసారం ధాన్యాలను ఉత్తమవేదజ్ఞులకిచ్చినట్లైతే స్వర్గలోకప్రాప్తి కలుగుతుంది.

**గవాం వా సంప్రదానేన సర్వపాపైః ప్రముచ్యతే ।**
**ఇన్ధనానాం ప్రదానేన దీప్తాగ్నిర్జాయతే నరః ॥ 48 ॥**

గోవులకు తృణదానం వల్ల సర్వపాప వినిర్ముక్తి, సమిధలదానం జీర్ణశక్తిని పెంపొందిస్తుంది,

**ఫలమూలాని శాకాని భోజ్యాని వివిధాని చ ।**
**ప్రదద్యాద్బ్రాహ్మణేభ్యస్తు ముదాయుక్తః స్వయమ్భవేత్ ॥ 49 ॥**

బ్రాహ్మణులకు ఫలమూల శాకాది భోజ్యపదార్థాల దానం నిత్యసంతోషాన్ని కలిగిస్తుంది.

**ఔషధం స్నేహమాహారం రోగిణే రోగశాన్తయే ।**
**దదానో రోగరహిత స్సుఖీ దీర్ఘాయురేవ చ ॥ 50 ॥**

రోగికి ఔషధం, ఆహార తైలాదులనిచ్చినవాడు రోగరహితుడు, సుఖ, దీర్ఘాయుష్యాలు కలవాడవుతాడు.

**అసిపత్రవనం మార్గం క్షురధారాసమన్వితమ్ ।**
**తీవ్రతాపఞ్చ తరతి ఛత్రోపానత్ప్రదో నరః ॥ 51 ॥**

ఛత్రదానం, పాదరక్షాదానం, క్షురధారాయుక్తమైన అసిపత్రవనమనే తీవ్రతాపాన్ని కలిగించే నరకాన్ని దాటిస్తుంది.

**యద్యదిష్టతమం లోకే యచ్చాపి దయితం గృహే ।**
**తత్తద్గుణవతే దేయం తదేవాక్షయమిచ్ఛతా ॥ 52 ॥**

తనకు తన యింటివారికి ఇష్టమైనదాన్ని గుణవంతుడైన బ్రాహ్మణునికిచ్చిన అక్షయఫలం లభిస్తుంది.

**అయనే విషువే చైవ గ్రహణే చన్ద్రసూర్యయోః ।**
**సఙ్క్రాన్త్యాదిషు కాలేషు దత్తం భవతి చాక్షయమ్ ॥ 53 ॥**

ఉత్తరదక్షిణాయన పుణ్యకాలాల్లో, మేష తులా సంక్రమణాల్లో, చంద్రసూర్యగ్రహణాల్లో, ఇతర సంక్రమణాల్లోని దానం అక్షయ ఫలప్రదమవుతుంది.

**ప్రయాగాదిషు తీర్థేషు పుణ్యేష్వాయతనేషు చ ।**
**దత్త్వా చాక్షయమాప్నోతి నదీషు చ వనేషు చ ॥ 54 ॥**

ప్రయాగాది పుణ్యతీర్థాల్లో, పుణ్యక్షేత్రాల్లో పుణ్యనదీవనాల్లో దానం చేసినవానికి అక్షయఫలం లభిస్తుంది.

**తస్మాద్విప్రాయ దాతవ్యం శ్రోత్రియాయ ద్విజాతిభిః ।**
**స్వర్గాయుర్భూతికామేన తథా పాపోపశాన్తయే ॥ 55 ॥**

దానధర్మాన్ని మించిన మరో ధర్మం మానవులకు లేదు. అందువల్ల విశేషంగా శ్రోత్రియుడైన ద్విజునికి దానం చేయాలి.

**ముముక్షుణా చ దాతవ్యం బ్రాహ్మణేభ్యస్తథాఽన్వహమ్ । 56 ॥**

స్వర్గాన్ని, ఆయుష్యాన్ని, ఐశ్వర్యాన్ని, పాపవినాశనాన్ని మోక్షాన్ని కోరేవారు ప్రతిదినం బ్రాహ్మణులకు దానం చేయాలి.

**దీయమానన్తు యో మోహాద్గోవిప్రాగ్నిసురేషు చ ।**
**నివారయతి పాపాత్మా తిర్యగ్యోనిం వ్రజేత్తు సః ॥ 57 ॥**

గో విప్ర అగ్నిదేవతలకు అర్పించేదాన్ని మోహంతో వారించినవాడు పశుపక్ష్యాది యోనులలో పుడతాడు.

**యస్తు ద్రవ్యార్జనం కృత్వా నార్చయేద్బ్రాహ్మణాన్సురాన్ ।**
**సర్వస్వమపహృత్యైనం రాష్ట్రాద్విప్రతివాసయేత్ ॥ 58 ॥**

ద్రవ్యాన్ని సంపాదించి దేవ బ్రాహ్మణ అర్చన చేయనివాని ధనం మొత్తాన్ని రాజు గ్రహించి అతణ్ణి రాజ్యబహిష్కృతుని గావించాలి.

**యస్తు దుర్భిక్షవేళాయామన్నాద్యం న ప్రయచ్ఛతి ।**
**మ్రియమాణేషు సత్త్వేషు బ్రాహ్మణః స తు గర్హితః ॥ 59 ॥**

కరువుకాటకాల్లో చనిపోతున్నవారికి అన్నాదులనందించని బ్రాహ్మణుడు పరమనింద్యుడు.

**తస్మాన్న ప్రతిగృహ్ణీయాన్న వై దేయఞ్చ తస్య హి ।**
**అంకయిత్వా స్వకాత్ రాష్ట్రాత్ తం రాజా విప్రవాసయేత్ ॥ 60 ॥**

అతనికివ్వటం, అతనినుండి గ్రహించటం చేయకూడదు. అతనికేదైనా గుర్తుపెట్టి రాజు తన రాజ్యంనుండి వెళ్ళగొట్టాలి.

**యస్తు సద్భ్యో దదాతీహ న ద్రవ్యం ధర్మసాధనమ్ ।**
**స పూర్వాభ్యధికః పాపీ నరకే పచ్యతే నరః ॥ 61 ॥**

ధర్మసాధనమైన ధనాన్ని సజ్జనులకివ్వనివాడు ముందు చెప్పిన వానికంటె పాపి. నరకంలో దుఃఖాలనుభవిస్తాడు.

**స్వాధ్యాయవన్తో యే విప్రా విద్యావన్తో జితేన్ద్రియాః ।**
**సత్యసంయమసంయుక్తాస్తేభ్యో దద్యాద్ద్విజోత్తమాః ॥ 62 ॥**

స్వాధ్యాయపరులు, విద్యావంతులు, జితేంద్రియులు, సత్యనియమం కల బ్రాహ్మణులకు దానం చేయాలి.

**సుభుక్తమపి విద్వాంసం ధార్మికం భోజయేద్ద్విజమ్ ।**
**న తు మూర్ఖమవృత్తస్థం దశరాత్రముపోషితమ్ ॥ 63 ॥**

ధార్మికుడైన విద్వాంసుడు బాగా భుజించినవాడైనా మళ్ళీ భుజింపచేయాలి. కాని పది దినాలుపవాస మున్నవాడైనా మంచి నడవడిలేని మూర్ఖుని భుజింప చేయరాదు.

**సన్నికృష్టమతిక్రమ్య శ్రోత్రియం యః ప్రయచ్ఛతి ।**
**స తేన కర్మణా పాపీ దహత్యాసప్తమం కులమ్ ॥ 64 ॥**

సమీపంలోని శ్రోత్రియుణ్ణి విడిచి ఇతరులకు దానం చేస్తే దాంతో ఆ పాపి ఏడుతరాల వరకు దహింప బడతాడు.

**యది స్యాదధికో విప్రః శీలవిద్యాదిభిః స్వయమ్ ।**
**తస్మై యత్నేన దాతవ్యమతిక్రమ్యాపి సన్నిధిమ్ ॥ 65 ॥**

దూరంలో ఉన్నవాడు శీలం, విద్యలో అధికుడైతే దగ్గర ఉన్నవాణ్ణి అతిక్రమించి గూడా దానం చేయవచ్చు.

**యోఽర్చితం ప్రతిగృహ్ణాతి దదాత్యర్చితమేవ వా ।**
**తావుభౌ గచ్ఛతః స్వర్గం నరకస్తు విపర్యయే ॥ 66 ॥**

ఇచ్చినదాన్ని ప్రతిగ్రహించినవాడు, పూజించి ఇచ్చినవాడు కూడ స్వర్గాన్ని పొందుతారు. అట్లా చేయనివారు నరకాన్నే చేరుతారు.

**న వార్యపి ప్రయచ్ఛేత నాస్తికే హైతుకేఽపి చ ।**
**పాషణ్డేషు చ సర్వేషు నావేదవిది ధర్మవిత్ ॥ 67 ॥**

నాస్తికుడు, తర్కించేవాడు, పాషండుడు, వేదజ్ఞానహీనునికి నీరుకూడ ధార్మికుడు ఇయ్యకూడదు.

**అపూపఞ్చ హిరణ్యఞ్చ గామశ్వం పృథివీం తిలాన్ ।**
**అవిద్వాన్ ప్రతిగృహ్ణానో భస్మీ భవతి కాష్ఠవత్ ॥ 68 ॥**

అపూపం, హిరణ్యం, గోవు, అశ్వం, భూమి, తిలలు విద్యాహీనుడు గ్రహిస్తే వెంటనే కఱ్ఱవలె భస్మమవుతాడు.

**ద్విజాతిభ్యో ధనం లిప్సేత్ ప్రశస్తేభ్యో ద్విజోత్తమః ।**
**అపి వా జాతిమాత్రేభ్యో న తు శూద్రాత్కథంచన ॥ 69 ॥**

బ్రాహ్మణుడు ఉత్తములైన ద్విజులనుండే ధనాన్ని పొందకోరాలి లేదా స్వజాతి వారివల్ల గ్రహించవచ్చు. కాని శూద్రులనుండి గ్రహించరాదు.

**వృత్తిసఙ్కోచమన్విచ్ఛేత్ నేహేత ధనవిస్తరమ్ ।**
**ధనలోభే ప్రసక్తస్తు బ్రాహ్మణ్యాదేవ హీయతే ॥ 70 ॥**

బ్రాహ్మణుడు వృత్తిని తగ్గించుకోవలెను. ధన విస్తారాన్ని కోరకూడదు. ధనమందు లోభాన్ని పెంచుకొన్నవాడు బ్రాహ్మణ్యాన్నే కోల్పోతాడు.

**వేదానధీత్య సకలాన్ యజ్ఞాంశ్చావాప్య సర్వశః ।**
**న తాం గతిమవాప్నోతి సఙ్కోచాద్యామవాప్నుయాత్ ॥ 71 ॥**

సకల వేదాధ్యయనం, సమస్త యజ్ఞాలు వృత్తిసంకోచంవల్ల లభించే ఉత్తమఫలాన్ని ఇవ్వవు.

**ప్రతిగ్రహరుచిర్న స్యాద్యాత్రార్థం తు ధనం హరేత్ ।**
**స్థిత్యర్థాదధికం గృహ్ణన్ బ్రాహ్మణో యాత్యధోగతిమ్ ॥ 72 ॥**

దానం గ్రహించటంలో ఆసక్తి కూడదు. జీవనయాత్రకు, యాత్రకోసం ధనాన్ని గ్రహించాలి. కావలసిన దానికన్నా అధికం గ్రహించినవాడు అధోగతిని పొందుతాడు.

**యస్తు స్యాద్యాచకో నిత్యం న స స్వర్గస్య భాజనమ్ ।**
**ఉద్వేజయతి భూతాని యథా చౌరస్తథైవ సః ॥ 73 ॥**

ఎల్లపుడు యాచించేవాడు స్వర్గాన్ని పొందలేడు. అతడు కూడ దొంగలవలె జనులకు ఉద్వేగం కల్గిస్తాడు.

**గురూన్ భృత్యాశ్చోజ్జిహీర్షన్ అర్చిష్యన్దేవతాతిథీన్ ।**
**సర్వతః ప్రతిగృహ్ణీయాన్న తు తృప్యేత్స్వయం తతః ॥ 74 ॥**

గురువులను భృత్యులను ఉద్ధరించకోరేవారు, అతిథులను, దేవతలను, పూజించకోరేవారు అందరినుండి దానం తీసుకోవచ్చును. కాని దాన్ని తన భోగంకోసం ఉపయోగించరాదు.

**ఏవం గృహస్థో యుక్తాత్మా దేవతాతిథిపూజకః ।**
**వర్తమానః సంయతాత్మా యాతి తత్పరమం పదమ్ ॥ 75 ॥**

ఈ విధంగా మనోనిగ్రహం కల గృహస్థుడు దేవ అతిథి పూజనాచరిస్తున్నచో పరమపదాన్ని పొందుతాడు.

**పుత్రే నిధాయ వా సర్వం గత్వాఽరణ్యం తు తత్త్వవిత్ ।**
**ఏకాకీ విచరేన్నిత్యం ఉదాసీనః సమాహితః ॥ 76 ॥**

లేదా ఉన్నదంతా పుత్రుని కప్పగించి తత్త్వం తెలిసినవాడు అరణ్యానికి వెళ్ళి ఒంటరిగా ఉదాసీనుడై సంచరించాలి.

**ఏష వః కథితో ధర్మో గృహస్థానాం ద్విజోత్తమాః ।**
**జ్ఞాత్వా తు తిష్ఠేన్నియతం తథాఽనుష్ఠాపయేద్ద్విజాన్ ॥ 77 ॥**

ద్విజోత్తములారా! ఈ విధంగా గృహస్థధర్మాలు మీకు వివరించినాను. వీనిని తెలిసి నియమంతో అనుష్ఠించాలి. నిత్యం అనుష్ఠింపచేయాలి.

**ఇతి దేవమనాదిమేకమీశం గృహధర్మేణ సమర్చయేదజస్రమ్ ।**
**తమతీత్య స సర్వభూతయోనిం ప్రకృతిం వై స పరం న యాతి జన్మ ॥ 78 ॥**

అనాది అయిన పరమాత్మను గృహస్థధర్మంతో సదా ఆచరించినవాడు ప్రకృతి నతిక్రమించి పరమపదాన్ని పొందగలడు. పునర్జన్మ అతనికి లేదు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే దానధర్మనిరూపణం నామ షడ్వింశోఽధ్యాయః ॥ 26 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో దానధర్మనిరూపణమనే ఇరవై ఆరవఅధ్యాయం ॥ 26 ॥

## సప్తవింశోఽధ్యాయః - ఇరవై ఏడవ అధ్యాయం
## వానప్రస్థాశ్రమధర్మాః - వానప్రస్థాశ్రమధర్మాలు

**వ్యాస ఉవాచ :**-వ్యాసుదు చెప్పాడు

**ఏవం గృహాశ్రమే స్థిత్వా ద్వితీయం భాగమాయుషః ।**
**వానప్రస్థాశ్రమం గచ్ఛేత్ సదారః సాగ్నిరేవ వా ॥ 1 ॥**

ఆయుష్యం రెండోభాగం వరకు (60 సం॥లు) గృహస్థాశ్రమంలో ఉండి తర్వాత భార్యతో, అగ్నితోకూడ వానప్రస్థాశ్రమానికి వెళ్ళాలి.

**నిక్షిప్య భార్యాం పుత్రేషు గచ్ఛేద్వనమథాపి వా ।**
**దృష్ట్వాఽపత్యస్యాపత్యం జర్జరీకృతవిగ్రహః ॥ 2 ॥**

**శుక్లపక్షస్య పూర్వాహ్ణే ప్రశస్తే చోత్తరాయణే ।**
**గత్వాఽరణ్యం నియమవాంస్తపః కుర్యాత్సమాహితః ॥ 3 ॥**

లేక భార్యను పుత్రులకప్పగించి ఒంటిగానైనా అరణ్యానికి వెళ్ళాలి. పుత్రుని పుత్రుని (మనుమని) చూచి జీర్ణమైన శరీరంతో ఉత్తరాయణం శుక్లపక్షంలో పూర్వాహ్ణంలోనే అరణ్యానికి వెళ్ళి నియమంగా తపసు చేయాలి.

**ఫలమూలాని పూతాని నిత్యమాహారమాహరేత్ ।**
**యతాహారో భవేత్తేన పూజయేత్పితృదేవతాః ॥ 4 ॥**

ప్రతినిత్యం పరిశుద్ధమైన ఫలమూలాలు స్వీకరించాలి. నియతాహారి కావాలి. ఆ ఆహారంతోనే పితరులను దేవతలను పూజించాలి.

**పూజయిత్వాఽతిథీన్నిత్యం స్నాత్వా చాభ్యర్చయేత్సురాన్।**
**గృహాదాదాయ చాశ్నీయాదష్టౌ గ్రాసాన్ సమాహితః ॥ 5 ॥**

నిత్యం స్నానమాచరించి అతిథిని పూజించి దేవతల నారాధించాలి. ఇంటినుండి ఎనిమిది ముద్దల ఆహారాన్ని తెచ్చుకొని భుజించాలి.

**జటాం వై బిభృయాన్నిత్యం నఖరోమాణి నోత్సృజేత్ ।**
**స్వాధ్యాయం సర్వదా కుర్యాన్నియచ్ఛేద్వాచమన్యతః ॥ 6 ॥**

ఎల్లప్పుడూ జడలు ధరించాలి. నఖాలు రోమాలు తొలగించకూడదు. ఎల్లపుడు స్వాధ్యాయపరుడు కావాలి. ఇతర విషయాలను విడచి మాటనదుపు చేయాలి.

**అగ్నిహోత్రఞ్చ జుహుయాత్పఞ్చ యజ్ఞాన్ సమాచరేత్ ।**
**మున్యన్నైర్వివిధైర్వన్యైః శాఖమూలఫలేన చ ॥ 7 ॥**

అగ్నిహోత్రాన్ని, పంచయజ్ఞాలను ఆచరిస్తూ శాకమూలాది మునుల అన్నాన్ని స్వీకరించాలి.

**చీరవాసా భవేన్నిత్యం స్నాతి త్రిషవణం శుచిః ।**
**సర్వభూతానుకమ్పీ స్యాత్ ప్రతిగ్రహవివర్జితః ॥ 8 ॥**

ఎల్లప్పుడూ నార వస్త్రధారణం చేయాలి. ప్రతిదినం ముప్పూటలా స్నానం చేయాలి. ప్రాణులన్నింటిపై దయ చూపాలి. దేనినీ ఎవరినుండి తీసుకోరాదు.

**స దర్శపౌర్ణమాసేన యజేత నియతం ద్విజః ।**
**ఋక్షేష్ట్యాగ్రయణే చైవ చాతుర్మాస్యాని చాహరేత్ ॥ 9 ॥**

దర్శపూర్ణమాసాల్లో నియంతగా యజ్ఞం చేయాలి. నక్షత్రేష్టి, ఆగ్రయణం, చాతుర్మాస్యయాగాలు చేయాలి.

**ఉత్తరాయణఞ్చ క్రమశో దక్షస్యాయనమేవ చ ।**
**వాసన్తైః శారదైర్మేధ్యైర్మున్యన్నైః స్వయమాహృతైః ॥10 ॥**

**పురోదాశాంశ్చరుం చైవ ద్వివిధం నిర్వపేత్ పృథక్ ।**
**దేవతాభ్యశ్చ తద్ధుత్వా వన్యం మేధ్యతరం హవిః ॥11 ॥**

**శేషం సముపభుంజీత లవణం చ స్వయంకృతమ్ ।**
**వర్జయేన్మధుమాంసాని భౌమాని కవచాని చ ॥ 12 ॥**

ఉత్తర దక్షిణాయన యాగాలు ఆచరించాలి. వసంత శరత్కాలాల్లో తాను తెచ్చిన పవిత్ర మున్యన్నాలతో పురోడాశాన్ని, చరువును విడివిడిగా సిద్ధం చేసి యథావిధి హోమాలు తర్పణాలు చేయాలి. అట్లా దేవతలకు ఆహుతులివ్వగా మిగిలిన పవిత్రమైన దానిని తాను భుజించాలి. తాను చేసిన ఉప్పును వాడాలి. మధుమాంసాలు వదలివేయాలి. భూమినుండి పుట్టే పుట్ట గొడుగులవంటివి తినరాదు.

**భూస్తృణం శిగ్రుకం చైవ శ్లేష్మాతక ఫలాని చ ।**
**న ఫాలకృష్టమశ్నీయాదుత్సృష్టమపి కేనచిత్ ॥ 13 ॥**

భూమిలో పుట్టిన భూతృణం, శిగ్రుకం, శ్లేష్మాతకం ఫలాన్ని విడిచిపెట్టాలి. నాగలితో దున్ని పండించినదాన్ని తినకూడదు. ఇతరులు వదలినది భుజింపరాదు.

**న గ్రామజాతాన్యార్తోఽపి పుష్పాణి చ ఫలాని చ ।**
**శ్రావణేనైవ విధినా వహ్నిం పరిచరేత్సదా ॥ 14 ॥**

ఆకలి గలిగినప్పుడు గ్రామంలో పుట్టే ఫలపుష్పాలను గ్రహించరాదు. శ్రావణవిధితో అగ్నికి సదా పరిచర్య కావించాలి.

**న ద్రుహ్యేత్సర్వభూతాని నిర్ద్వన్ద్వో నిర్భయో భవేత్ ।**
**న నక్తం చైవమశ్నీయాత్ రాత్రౌ ధ్యానపరో భవేత్ ॥ 15 ॥**

ఏ ప్రాణికి ద్రోహం చేయరాదు. శీతోష్ణాది ద్వంద్వాలను సహించాలి. నిర్భయుడు కావాలి. రాత్రిభోజనం చేయరాదు. రాత్రియందు ధ్యానిస్తుండాలి.

**బ్రహ్మచారీ జితక్రోధస్తత్త్వజ్ఞానవిచిన్తకః ।**
**జితేన్ద్రియో భవేన్నిత్యం న పత్నీమపి సంశ్రయేత్ ॥ 16 ॥**

ఇంద్రియాలను క్రోధాన్ని జయించి తత్త్వజ్ఞానాన్ని గూర్చి చింతిస్తూ జితేంద్రియుడై బ్రహ్మచారిగా ఉండాలి. భార్యను కూడ చేరరాదు.

**యస్తు పత్న్యా వనం గత్వా మైథునం కామతశ్చరేత్ ।**
**తద్వ్రతం తస్య లుప్యేత ప్రాయశ్చిత్తీయతే ద్విజః ॥17॥**

భార్యతో వనానికేగిన వ్రతస్థుడు కామంతో భార్యను కలిసినట్లైతే అతని వానప్రస్థవ్రతం లోపిస్తుంది. ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

**తత్ర యో జాయతే గర్భో న సంస్పృశ్యో భవేద్ద్విజః ।**
**స వేదే చాధికారోఽస్య తద్వంశేఽప్యేవమేవ హి ॥ 18 ॥**

అట్లా పుట్టిన సంతానం ద్విజులకు తాకరానిది. అతడు వేదాధికారి కాజాలడు. ఆ వంశంకూడా అర్హత కోల్పోతుంది.

**అధఃశయీత నియతం సావిత్రీజపతత్పరః ।**
**శరణ్యః సర్వభూతానాం సంవిభాగరతస్సదా ॥ 19 ॥**

ఎల్లపుడు గాయత్రి జపం చేయాలి. భూమిపై పడుకోవాలి. ప్రాణుల కన్నింటికి ఆశ్రయమీయాలి. దానశీలి కావాలి.

**పరివాదం మృషావాదం నిద్రాలస్యం వివర్జయేత్ ।**
**ఏకాగ్నిరనికేతః స్యాత్ ప్రోక్షితాం భూమిమాశ్రయేత్ ॥ 20 ॥**

పరనింద, అసత్యం, నిద్ర, సోమరితనం విడువాలి. ఏకాగ్ని, గృహశూన్యుడు కావాలి. ప్రోక్షణ చేసిన భూమినాశ్రయించాలి.

**మృగైస్సహ చరేద్వా యస్తైః సహైవ చ సంవిశేత్ ।**
**శిలాయాం వా శర్కరాయాం శయీత సుసమాహితః ॥ 21 ॥**

మృగాలతో కలిసి సంచరించాలి. వాటితో నివసించాలి. శిలపైకాని ఇసుకలోకాని ఏకాగ్రతకలిగి పడుకోవాలి.

**సద్యః ప్రక్షాళకో వా స్యాన్మాససంచయకోఽపి వా ।**
**షణ్మాసనిచయో వా స్యాత్ సమా నిచయ ఏవ చ ॥ 22 ॥**

ఎక్కువకాలం నిల్వ ఉండని ఫలమూలాలను లేదా నెలరోజులు ఆరునెలలు సంవత్సరం వరకుండే ఫల మూలాలను కూర్చుకోవచ్చు.

**త్యజేదాశ్వయుజే మాసి సంపన్నం పూర్వచిన్తితమ్ ।**
**జీర్ణాని చైవ వాసాంసి శాకమూలఫలాని చ ॥ 23 ॥**

ఆశ్వీజమాసంలో జీర్ణవస్త్రాలను, కూర్చిపెట్టుకున్న శాకమూలఫలాలను విడిచిపెట్టాలి.

**దన్తోలూఖలికో వా స్యాత్కాపోతీం వృత్తిమాశ్రయేత్ ।**
**అశ్మకుట్టో భవేద్వాఽపి కాలపక్వభుగేవ చ ॥ 24 ॥**

దంతాలనే రోళ్ళు రోకళ్ళుగా చేసుకోవాలి. విడిగా దంచుట విసరుట చేయకూడదు. పావురాల వలె దొరికిన ధాన్యాన్ని మాత్రమే భుజించాలి. అశ్మకుట్టుడు అనగా రాతిపై రాతితో దంచి తినాలి. కాలానుగుణంగా పండిన పండ్లనే తినాలి.

**నక్తం చాన్నం సమశ్నీయాద్దివా చాహృత్య శక్తితః ।**
**చతుర్థకాలికో వా స్యాత్ స్యాద్వా చాష్టమకాలికః ॥25॥**

పగలు సంపాదించిన అన్నాదులు రాత్రి భుజించాలి. నాలుగు లేదా ఎనిమిదవ ఝామున భుజించాలి.

**చాన్ద్రాయణవిధానైర్వా శుక్లే కృష్ణే చ వర్తయేత్ ।**
**పక్షే పక్షే సమశ్నీయాత్ యవాగూన్ క్వథితాన్ సకృత్ ॥ 26 ॥**

శుక్ల కృష్ణ పక్షాల్లో చాంద్రాయణాది వ్రతాల నాచరించేవాడు కావాలి. పదిహేను రోజులకొకసారి వండివార్చిన గంజిని త్రాగాలి.

**పుష్పమూలఫలైర్వాఽపి కేవలైర్వర్తయేత్సదా ।**
**స్వాభావికైః స్వయం శీర్ణైర్వైఖానసమతే స్థితః ॥ 27 ॥**

ఎల్లపుడు సహజంగా తామే రాలిపడిన ఫలపుష్పమూలాలతో మాత్రమే గడపాలి. వైఖానసవ్రతాన్ని స్వీకరించాలి.

**భూమౌ వా పరివర్తేత తిష్ఠేద్వా ప్రపదైర్దినమ్ ।**
**స్థానాసనాభ్యాం విహరేన్న క్వచిద్ధైర్యముత్సృజేత్ ॥ 28 ॥**

భూమిమీద నిలవాలి. తన కాళ్ళపై తాను నిల్చోవాలి. కూర్చోవాలి. ధైర్యం వదలరాదు.

**గ్రీష్మే పఞ్చతపాస్తద్వద్వర్షాస్వభ్రావకాశకః ।**
**ఆర్ద్రవాసాస్తు హేమన్తే క్రమశో వర్ధయంస్తపః ॥ 29 ॥**

వేసవిలో పంచాగ్ని మధ్యలో ఉండాలి. వర్షాకాలం ఆకాశం క్రిందనే ఉండాలి. హేమంతంలో తడిబట్టలతో తపస్సును పెంచాలి. క్రమంగా తపస్సును పెంచాలి.

**ఉపస్పృశ్య త్రిషవణం పితృదేవాంశ్చ తర్పయేత్ ।**
**ఏకపాదేన తిష్ఠేత మరీచీన్వా పిబేత్తదా ॥ 30 ॥**

మూడు వేళల్లోను స్నాన ఆచమనాలు గావించి పితరులను దేవతలను తృప్తిపరచాలి. ఒంటికాలుతో నిలువవలెను. సూర్యకిరణాలనే పానం చేయాలి.

**పఞ్చాగ్ని ర్ధూమపో వా స్యాదుష్మపః సోమపోఽథ వా ।**
**పయః పిబేచ్ఛుక్లపక్షే కృష్ణపక్షే చ గోమయమ్ ॥ 31 ॥**

పంచాగ్నులను సేవించాలి. యజ్ఞధూమాన్ని పానం చేయాలి. అగ్నివేడిని సోమాన్ని పానం చేయాలి. శుక్లపక్షంలో పాలు కృష్ణపక్షంలో గోమయాన్ని సేవించాలి.

**శీర్ణ పర్ణాశనో వా స్యాత్కృచ్ఛ్రైర్వా వర్తయేత్సదా ।**
**యోగాభ్యాసరతశ్చైవ రుద్రాధ్యాయీ భవేత్సదా ॥ 32 ॥**

తామై రాలిపడిన ఆకులతో భుజించాలి లేదా కృచ్ఛ్రవ్రత పరాయణుడు కావాలి. ఎల్లప్పుడూ యోగాభ్యాసరతుడు రుద్రాధ్యాయి కావాలి.

**అథర్వశిరసోఽధ్యేతా వేదాన్తాభ్యాసతత్పరః ।**
**యమాన్ సేవేత సతతం నియమాంశ్చాప్యతన్ద్రితః ॥ 33 ॥**

అథర్వ శిరమును చదివేవాడు వేదాంతాభ్యాసపరుడు కావాలి. ఎల్లపుడు బద్ధకములేనివాడై యమనియమాలు పాటించాలి.

**కృష్ణాజినః సోత్తరీయః శుక్లయజ్ఞోపవీతనాన్ ।**
**అథ చాగ్నీన్ సమారోప్య స్వాత్మని ధ్యానతత్పరః ॥ 34 ॥**

**అనగ్ని రనికేతః స్యాన్మునిర్మోక్షపరో భవేత్ ।**
**తాపసేష్వేవ విప్రేషు యాత్రికం భైక్ష్యమాహరేత్ ॥ 35 ॥**

కృష్ణాజినధారి ఉత్తరీయం కలవాడు, తెల్లని యజ్ఞోపవీతి కావాలి. అగ్నిని తనలో ఆరోపించుకొని ధ్యానతత్పరుడై, గృహాగ్నిని, గృహాన్ని వదలి మునియై మోక్షానికి ప్రయత్నం చేసేవాడు కావలెను. తపస్వుల వద్ద బ్రాహ్మణులవద్ద మాత్రమే భిక్ష యాచించవలెను.

**గృహమేధిషు చాన్యేషు ద్విజేషు వనవాసిషు ।**
**గ్రామాదాహృత్య చాశ్నీయాదష్టౌ గ్రాసాన్వనే వసన్ ॥ 36 ॥**

ఇతర గృహస్థులను వనవాసులైన ద్విజులను కూడ యాచించవచ్చు. గ్రామంనుండి ఎనిమిది ముద్దలు తెచ్చుకొని అడవిలో భుజించాలి.

**ప్రతిగృహ్య పుటేనైవ పాణినా శకలేన వా ।**
**వివిధాశ్చోపనిషద ఆత్మసంసిద్ధయే జపేత్ ॥ 37 ॥**

ఆకు, చేయి, పగిలిన మట్టిపాత్ర భాగంతోకాని తీసుకొని భుజించాలి. ఆత్మసిద్ధికై వివిధ ఉపనిషత్తులను జపించాలి.

**విద్యావిశేషాన్ సావిత్రీం రుద్రాధ్యాయం తథైవ చ ।**
**మహాప్రాస్థానికం వాఽసౌ కుర్యాదనశనన్తు వా ॥ 38 ॥**
**అగ్నిప్రవేశమన్యద్వా బ్రహ్మార్పణవిధౌ స్థితః ।**

ఇతర విశేష విద్యలను, గాయత్రిని, రుద్రాధ్యాయాన్ని ఆవృత్తి చేస్తుండాలి. బ్రహ్మార్పణ విధిననుసరించి మహాప్రస్థానానికై నిరాహారియై లేదా అగ్నిప్రవేశాన్ని కాని చేయాలి.

**యే హి సమ్యగిమమాశ్రమం శివం సంశ్రయన్త్యశివపుంజనాశనమ్ ।**
**తే విశన్తి పదమైశ్వరం పరం యాన్తి యత్ర గతమస్య సంస్థితేః ॥ 39 ॥**

శుభప్రదం అశుభనాశకం అయిన ఈ వానప్రస్థాశ్రమాన్ని బాగా ఆశ్రయించినవారు ఆ స్థితికి గమ్యమూ, పరమేశ్వరస్థానమైన పరమపదాన్ని పొందుతారు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే వానప్రస్థాశ్రమధర్మే సప్తవింశోఽధ్యాయః ॥ 27 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో వానప్రస్థాశ్రమధర్మాలనే ఇరవై ఏడవ అధ్యాయం ॥ 27 ॥



## **అష్టావింశోఽధ్యాయః** - ఇరవై ఎనిమిదవ అధ్యాయం

## **యతిధర్మాః** - యతిధర్మాలు

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు.

**ఏవం వనాశ్రమే స్థిత్వా తృతీయం భాగమాయుషః ।**
**చతుర్థమాయుషో భాగం సంన్యాసేన నయేత్ క్రమాత్ ॥ 1 ॥**

ఈ విధంగా జీవితంలో మూడవభాగాన్ని వానప్రస్థాశ్రమంలో గడిపి, నాలుగో ఆయుర్భాగాన్ని సన్న్యాసంతో గడపాలి.

**అగ్నీనాత్మని సంస్థాప్య ద్విజః ప్రవాజితో భవేత్ ।**
**యోగాభ్యాసరతః శాన్తో బ్రహ్మవిద్యాపరాయణః ॥ 2 ॥**

అగ్నులను తనలో ఆరోపించుకుని సన్న్యసించాలి. యోగాభ్యాసరతుడు శాంతుడు బ్రహ్మవిద్యాపరాయణుడు కావాలి.

**యదా మనసి సఞ్జాతం వైతృష్ణ్యం సర్వవస్తుషు ।**
**తదా సంన్యాసమిచ్ఛన్తి పతితః స్యాద్విపర్యయే ॥ 3 ॥**

మానసికంగా అన్ని వస్తువుల్లో విరక్తికలిగినపుడు సంన్యాసాన్ని కోరుకోవాలి. విరక్తి కలుగకుండా సన్న్యసిస్తే పతితుడవుతాడు.

**ప్రాజాపత్యాన్నిరూప్యేష్టిమాగ్నేయీమథవా పునః ।**
**దాన్తః పక్వకషాయోఽసౌ బ్రహ్మాశ్రమముపాశ్రయేత్ ॥ 4 ॥**

ప్రాజాపత్యాన్ని కాని ఆగ్నేయీ యాగాన్ని కాని ఆచరించి ఇంద్రియనిగ్రహంతో దోషాలు తొలగినపుడు పరిపూర్ణ వైరాగ్యం కలిగితేనే సంన్యాసాన్ని స్వీకరించాలి.

**జ్ఞానసంన్యాసినః కేచిద్వేదసంన్యాసినః పరే ।**
**కర్మసంన్యాసినస్త్వన్యే వివిధాః పరికీర్తితాః ॥ 5 ॥**

జ్ఞానసన్న్యాసులు, వేదసన్న్యాసులు, కర్మసన్న్యాసులు అని సన్న్యాసులు అనేక విధాలుగా ఉంటారు.

**యః సర్వసఙ్గనిర్ముక్తో నిర్ద్వంద్వశ్చైవ నిర్భయః ।**
**ప్రోచ్యతే జ్ఞానసంన్యాసీ స్వాత్మన్యేవ వ్యవస్థితః ॥ 6 ॥**

సర్వసంగవిరక్తుడై శీతోష్ణాదులు సహిస్తూ భయంలేక ఆత్మావలోకనం కలవాడు బ్రహ్మనిష్ఠుడైన సంన్యాసి జ్ఞానసంన్యాసి.

**వేదమేవాభ్యసేన్నిత్యం నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః ।**
**ప్రోచ్యతే వేదసంన్యాసీ ముముక్షుర్విజితేన్ద్రియః ॥ 7 ॥**

శోతోష్ణాది ద్వంద్వాలు లేక దానం స్వీకరించక ఇంద్రియనిగ్రహం కలిగి మోక్షాసక్తితో ఎల్లపుడు వేదాభ్యాసం చేసేవాడు వేదసన్న్యాసి.

**యస్త్వగ్నీనాత్మసాత్కృత్వా బ్రహ్మార్పణపరో ద్విజః ।**
**స జ్ఞేయః కర్మసంన్యాసీ మహాయజ్ఞ పరాయణః ॥ 8 ॥**

అగ్నులను తనలో ఆరోపించుకొని తాను చేసే పనులన్నింటిని బ్రహ్మార్పణం గావిస్తూ మహాయజ్ఞాల నాచరించేవాడు కర్మసన్న్యాసి.

**త్రయాణామపి చైతేషాం జ్ఞానీ త్వభ్యధికో మతః ।**
**న తస్య విద్యతే కార్యం న లిఙ్గం వా విపశ్చితః ॥ 9 ॥**

ఈ మూడు విధాలైన సన్న్యాసుల్లో జ్ఞానసంన్యాసి సర్వశ్రేష్ఠుడు. ఇట్టి జ్ఞానానికి చేయవలసినదేదీ ఉండదు. చిహ్నముండదు.

**నిర్మమో నిర్భయః శాన్తో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః ।**
**జీర్ణకౌపీనవాసాః స్యాన్నగ్నో వా ధ్యానతత్పరః ॥ 10 ॥**

మమకారభయాలు లేక శాంతుడు, శీతోష్ణాది ద్వంద్వాతీతుడు, పత్రభోజి అయి జీర్ణకౌపీనాన్ని ధరించికాని నగ్నంగా కాని నిరంతరం ధ్యానపరుడై ఉండాలి.

**బ్రహ్మచారీ మితగ్రాసీ గ్రామాత్త్వన్నం సమాహరేత్ ।**
**అధ్యాత్మమతిరాసీత నిరపేక్షో నిరామిషః ॥ 11 ॥**

అట్టివాడు బ్రహ్మచారి, మితభోజనుడు కావాలి. గ్రామంనుండి అన్నాన్ని భిక్షగా తెచ్చుకోవాలి. ఆధ్యాత్మమందాసక్తి కలవాడు, ఇతరాపేక్షలేనివాడు, మాంసాహారం విడచినవాడు కావాలి.

**ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ ।**
**నాభినందేత మరణం నాభినందేత జీవితమ్ ॥ 12 ॥**

ఇతరుల సహాయం కోరక తన పనులను తానే చేసుకుంటూ ఆత్మతృప్తికోసం లోకంలో సంచరించాలి. జీవనమరణాలను అభినందించకూడదు.

**కాలమేవ ప్రతీక్షేత నిదేశం భృతకో యథా ।**
**నాధ్యేతవ్యం న వక్తవ్యం శ్రోతవ్యం న కదాచన ॥ 13 ॥**

భృత్యుడు ఆదేశం కోసం ప్రతీక్షించునట్లు కాలం కోసం ప్రతీక్షించాలి. అధ్యయన వాచన శ్రవణాలన్నింటిని విడిచి వేయాలి.

**ఏవం జ్ఞాత్వా పరో యోగీ బ్రహ్మభూయాయ కల్పతే ।**
**ఏకవాసోఽథవా విద్వాన్ కౌపీనాచ్ఛాదనస్తథా ॥ 14 ॥**

ఇలా తెలిసిన యోగి బ్రహ్మస్వరూపాన్ని పొందుతాడు. ఒంటివస్త్రంతో కాని, కౌపీనంతో కాని ఉండాలి.

**ముండీ శిఖీ వాஉథ భవేత్త్రిదణ్డీ నిష్పరిగ్రహః ।**
**కాషాయవాసాః సతతం ధ్యానయోగపరాయణః ॥ 15 ॥**

ముండిత శిరస్కుడు లేదా శిఖి లేదా త్రిదండియై దానం తీసుకొనకుండా ఉండాలి. కాషాయవస్త్రాలు ధరించి ఎల్లపుడు ధ్యానయోగపరాయణుడు కావాలి.

**గ్రామాన్తే వృక్షమూలే వా వసేద్దేవాలయేஉపి వా ।**
**సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ॥ 16 ॥**

ఊరిచివర, చెట్టు మొదట, లేదా దేవాలయంలో నివసించాలి. శత్రుమిత్రులను మానావమానాలను సమానంగా చూడాలి.

**భైక్ష్యేణ వర్తయేన్నిత్యం నైకాన్నాదీ భవేత్క్వచిత్ ।**
**యస్తు మోహేన వాஉన్యస్మాదేకాన్నాదీ భవేద్యతిః ॥ 17 ॥**

**న తస్య నిష్కృతిః కశ్చిద్ధర్మశాస్త్రేషు కథ్యతే ।**
**రాగద్వేషవిముక్తాత్మా సమలోష్టాశ్మకాఞ్చనః ॥ 18 ॥**

భిక్షతోనే జీవితం గడపాలి. ఒకరి అన్నాన్నే ఎల్లపుడు భుజించకూడదు. మోహం లేదా సోమరితనంతో ఒకరి అన్నాన్నే తిన్న యతికి ఏ శాస్త్రంలోను నిష్కృతి చెప్పలేదు. రాగాద్వేషాలు లేక మట్టిని బంగారాన్ని ఒకేవిధంగా భావించేవాడై ప్రాణిహింస గావించక మౌనాన్ని పాటిస్తూ దేనిలోను స్పృహ లేకుండా ఉండాలి.

**దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్ ।**
**శాస్త్రపూతాం వదేద్వాణీం మనఃపూతం సమాచరేత్ ॥ 19 ॥**

నేలను చూచి అడుగువేయాలి. వడపోసిన నీటినే త్రాగాలి. శాస్త్ర సిద్ధమైనదానినే చెప్పాలి. పవిత్రమైన మనస్సుతో కార్యాలను ఆచరించాలి.

**నైకత్ర నివసేద్దేశే వర్షాభ్యోஉన్యత్ర భిక్షుకః ।**
**స్నానశౌచరతో నిత్యం కమణ్డలుకరః శుచిః ॥ 20 ॥**

వర్షాకాలంలో తప్ప ఇతర కాలాల్లో ఒకేచోట ఉండకూడదు. నిత్యం స్నానశౌచాదులాచరిస్తూ శుచియై కమండలం ధరించాలి.

**బ్రహ్మచర్యరతోనిత్యం వనవాసరతో భవేత్ ।**
**మోక్షశాస్త్రేషు నిరతో బ్రహ్మచారీ జితేంద్రియః ॥ 21 ॥**

ఎప్పుడూ బ్రహ్మచర్యంతో ఉండాలి. వనవాసం చేయాలి మోక్షశాస్త్రాల్లో ఆసక్తి ఉండాలి. బ్రహ్మచారియై జితేంద్రియత్వం కలిగి ఉండాలి.

**దమ్భాహఙ్కారనిర్ముక్తో నిన్దాపైశున్యవర్జితః ।**
**ఆత్మజ్ఞానగుణోపేతో యతిర్మోక్షమవాప్నుయాత్ ॥ 22 ॥**

దంబాహంకారాలు లేక నింద, పిసినారితనాలను (కొండెము చెప్పుటను) వదలి ఆత్మజ్ఞానం మొదలైన ఆత్మగుణాలు కల యతి మోక్షాన్ని పొందుతాడు.

**అభ్యసేత్సతతం వేద ప్రణవాఖ్యం సనాతనమ్ ।**
**స్నాత్వాஉஉచమ్య విధానేన శుచిర్దేవాలయాదిషు ॥ 23 ॥**

సనాతనము, ప్రణవముఖ్యమైన వేదాన్ని నిరంతరం అభ్యసించాలి. దీన్ని స్నానంచేసి ఆచమించి పవిత్రుడై దేవాలయాదులలో ఆచరించాలి.

**యజ్ఞోపవీతీ శాన్తాత్మా కుశపాణిః సమాహితః ।**
**ధౌతకాషాయవసనో భస్మచ్ఛన్నతనూరుహః ॥ 24 ॥**

ఎల్లపుడు యజ్ఞోపవీతియై, శాంతాత్మగా, కుశపాణి సావధానియై ధౌతకాషాయవస్త్రం ధరించాలి. భస్మాన్ని అలదుకొని అధియజ్ఞాన్ని చేస్తూ అధిదైవాన్ని చూడాలి.

**అధియజ్ఞం బ్రహ్మ జపేదాధిదైవికమేవ చ ।**
**ఆధ్యాత్మికఞ్చ సతతం వేదాన్తాభిహితఞ్చ యత్ ॥ 25 ॥**

వేదాంతాల్లో చెప్పిన ఆధ్యాత్మికాన్ని కూడ అనగా ప్రణవజపాన్ని ఆచరించాలి.

**పుత్రేషు చాథ నివసన్ బ్రహ్మచారీ యతిర్మునిః ।**
**వేదమేవాభ్యసన్నిత్యం స యాతి పరమాం గతిమ్ ॥ 26 ॥**

**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం తపః పరమ్ ।**
**క్షమా దయా చ సన్తోషో వ్రతాన్యస్య విశేషతః ॥ 27 ॥**

మననశీలి బ్రహ్మచారి అయిన యతి పుత్రులవద్ద ఉంటూ నిత్యం వేదాన్ని అభ్యసించాలి. దానివలన అతడు పరమగతిని పొందుతాడు. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, ఉత్తమతపస్సు, క్షమ, దయ, సంతోషం సన్న్యాసికి విశేషవ్రతాలు.

**వేదాన్తజ్ఞాననిష్ఠో వా పఞ్చ యజ్ఞాన్ సమాహితః ।**
**జ్ఞానధ్యానసమాయుక్తో భిక్షార్థేనైవ తేన హి ॥ 28 ॥**

**హోమమన్త్రాన్ జపేన్నిత్యం కాలే కాలే సమాహితః ।**
**స్వాధ్యాయం చాన్వహం కుర్యాత్సావిత్రీం సన్ధ్యయోర్జపేత్ ॥ 29 ॥**

అతడు వేదాంత జ్ఞాననిష్ఠుడు కావాలి. సావధానుడై పంచయజ్ఞాల నాచరించాలి. భిక్షగా లభించిన దానితో జీవిస్తూ జ్ఞానధ్యానాలు కల్గి వుండాలి. ప్రతిరోజు ముమ్మార్లు స్నానం చేస్తూ భిక్షాన్నంతో యాగాలు

చేయాలి. ఆ యా కాలానుగుణమైన హోమమంత్రాలు జపించాలి. ప్రతిదినం వేదాధ్యయనం రెండు సంధ్యల్లో గాయత్రీ జపం చేయాలి.

**తతో ధ్యాయీత తం దేవమేకాన్తే పరమేశ్వరమ్ ।**
**ఏకాన్తే వర్జయేన్నిత్యం కామం క్రోధం పరిగ్రహమ్ ॥ 30 ॥**

ఏకాంతంలో పరమేశ్వరుని ధ్యానించాలి. కామ, క్రోధప్రతిగ్రహాలు పూర్తిగా విడిచిపెట్టాలి. (యతి కామక్రోధ పరిగ్రహాలను ఒక్కడిగా ఉన్నపుడు చేయరాదు.)

**ఏకవాసా ద్వివాసా వా శిఖీ యజ్ఞోపవీతవాన్ ।**
**కమణ్డలుకరో విద్వాన్ త్రిదణ్డీ యాతి తత్పరమ్ ॥ 31**

ఒకటి లేదా రెండు వస్త్రాలు ధరించినవాడై శిఖా యజ్ఞోపవీతాలు కల్గి, చేత కమండలం ధరించిన విద్వాంసుడైన త్రిదండి పరమపదాన్ని పొందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే వ్యాసగీతాసు యతిధర్మే అష్టావింశోஉధ్యాయః ॥28॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో వ్యాసగీతల్లో యతిధర్మాలనే ఇరవై ఎనిమిదవ అధ్యాయం ॥28॥



## ఏకోనత్రింశో౽ధ్యాయః - ఇరవై తొమ్మిదవ అధ్యాయం

## యతిధర్మాః - యతిధర్మాలు

**వ్యాస ఉవాచ :-**వ్యాసుడు చెప్పాడు

**ఏవం స్వాశ్రమనిష్ఠానాం యతీనాం నియతాత్మనామ్ ।**
**భైక్ష్యేణ వర్తనం ప్రోక్తం ఫలమూలైరథాపి వా ॥ 1 ॥**

ఈ విధంగా సన్న్యాసాశ్రమంలో ఉండేవారికి భిక్షాటనంతో కాని, ఫలమూలాదులతోకాని జీవనం విధించనైనది.

**ఏకకాలం చరేద్భైక్ష్యం న ప్రసజ్యేత విస్తరే ।**
**భైక్ష్యప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతే ॥ 2 ॥**

భిక్షాటన ఒకేసారి చేయాలి. భిక్షయందే ఆసక్తి చూపరాదు. విస్తారం కూడ పనికి రాదు. భిక్షయందాసక్తి ఏర్పడితే విషయాసక్తి కూడా ఏర్పడుతుంది.

**సప్తాగారాంశ్చరేద్భైక్ష్యమలాభే తు పునశ్చరేత్ ।**
**ప్రక్షాల్య పాత్రే భుఞ్జీత అద్భిః ప్రక్షాలయేత్పునః ॥ 3 ॥**

భిక్షకొరకు ఏడిండ్లకే వెళ్ళాలి. ఆ ఇండ్లలో దొరకనపుడు మళ్ళీ వెళ్ళాలి. పాత్రను నీటితో కడిగి భుజించాలి. భుజించిన తరువాత మళ్ళీ పాత్రను కడగాలి.

**అథవా౽న్యదుపాదాయ పాత్రే భుఞ్జీత నిత్యశః ।**
**భుక్త్వా తత్సంమృజేత్పాత్రం యాత్రామాత్రమలోలుపః ॥ 4 ॥**

లేదా ప్రతిదినం మరో పాత్రతో భిక్షాటన చేసి తినాలి. బ్రతికేందుకు అవసరమైనంత మాత్రం తింటూ ఆ పాత్రను కడగాలి. లోభాన్ని వదలాలి.

**విధూమే సన్నముసలే వ్యంగారే భుక్తవజ్జనే ।**
**వృత్తే శరావసమ్పాతే భిక్షాం నిత్యం యతిశ్చరేత్ ॥ 5 ॥**

గృహస్థుల ఇండ్లలో పొగ రాకుండా ఉన్నపుడు, రోకలి చప్పుడు ఆగిన తర్వాత, వంటనిప్పును చల్లార్చిన తరువాత, ఇంటి వాళ్ళు భుజించిన తర్వాత, విస్తళ్ళు బయటపడిన తర్వాత యతి భిక్షకు వెళ్ళాలి.

**గోదోహమాత్రం తిష్ఠేత కాలం భిక్షురధోముఖః ।**
**భిక్షేత్యుక్త్వా సకృత్తూష్ణీమశ్నీయాద్వాగ్యతః శుచిః ॥ 6 ॥**

ఇంటిముందు ఆవు పాలు పితుకునంతసేపు మాత్రమే క్రిందకు చూస్తూ నిలిచి భిక్ష అని మాత్రం పలికి నిలవాలి. పవిత్రుడై మౌనంగా ఒక్కసారి భుజించాలి.

**ప్రక్షాల్య పాణీ పాదౌ చ సమాచమ్య యథావిధి ।**
**ఆదిత్యే దర్శయిత్వాఽన్నం భుంజీత ప్రాఙ్ముఖః శుచిః ॥ 7 ॥**

కాళ్లు చేతులు కడుగుకొని యథావిధిగా ఆచమించి అన్నాన్ని సూర్యునికి చూపి తూర్పుముఖంగా కూర్చుని భుజించాలి.

**హుత్వా ప్రాణాహుతీః పంచ గ్రాసానష్టౌ సమాహితః ।**
**ఆచమ్య దేవం బ్రహ్మాణం ధ్యాయీత పరమేశ్వరమ్ ॥ 8 ॥**

**అలాబుం దారుపాత్రం చ మృణ్మయం వైష్ణవం తతః ।**
**చత్వార్యేతాని పాత్రాణి మనురాహ ప్రజాపతిః ॥ 9 ॥**

పంచప్రాణాహుతులు చేసి ఎనిమిది ముద్దలను మాత్రం శ్రద్ధగా తినాలి. ఆచమనం చేసి పరమేశ్వరుని ధ్యానించాలి. సొరకాయ, కర్ర, మట్టి, వెదురు పాత్రలే యతికి పనికి వచ్చేవి అని మనుప్రజాపతి చెప్పాడు.

**ప్రాగ్రాత్రేఽపరరాత్రే చ మధ్యరాత్రే తథైవ చ ।**
**సన్ధ్యాస్వగ్నివిశేషేణ చిన్తయేన్నిత్యమీశ్వరమ్ ॥ 10 ॥**

సాయంత్రం, ప్రాతఃకాలం, మధ్యరాత్రుల్లో విశేషించి, సంధ్యలలో నిత్యం అగ్నిద్వారా పరమాత్మధ్యానం చేయాలి.

**కృత్వా హృత్పద్మనిలయే విశ్వాఖ్యం విశ్వసమ్భవమ్ ।**
**ఆత్మానం సర్వభూతానాం పరస్తాత్తమసః స్థితమ్ ॥ 11 ॥**

**సర్వస్యాధారభూతన్తమానన్దం జ్యోతిరవ్యయమ్ ।**
**ప్రధానపురుషాతీతమాకాశకుహరం శివమ్ ॥ 12 ॥**

**తదన్తః సర్వభావానామీశ్వరం బ్రహ్మరూపిణమ్ ।**
**ధ్యాయేదనాదిమధ్యాన్తమానందాదిగుణాలయమ్ ॥ 13 ॥**

తమస్సుకవతల ఉన్నవాణ్ణి, సకల భూతాంతర్యామిని, సర్వజగత్కారణభూతుని, సకల ప్రపంచ స్వరూపుని, పరమాత్మను, సర్వజగత్తు కాధారభూతుని, సకలాధారాలకు ఆనందానిచ్చేవానిని, అవ్యయ జ్యోతిరూపుని, ప్రకృతి జీవులకతీతుని, అగ్నిరూపుని, మంగళకరుని, అన్నిభావాల్లో ఉండేవాణ్ణి, అందర్నీ శాసించే బ్రహ్మస్వరూపిని, ఆద్యంతరహితుని, అద్వితీయుని, ఆనందాదిగుణనిలయుని హృత్పద్మంలో నిలిపి ధ్యానించాలి.

**మహాన్తం పురుషం బ్రహ్మ బ్రహ్మాణం సత్యమవ్యయమ్ ।**
**తరుణాదిత్యసఙ్కాశం మహేశం విశ్వరూపిణమ్ ॥ 14 ॥**

**ఓఙ్కారేణాథ చాత్మానం సంస్థాప్య పరమాత్మని ।**
**ఆకాశే దేవమీశానం ధ్యాయీతాకాశమధ్యగమ్ ॥ 15 ॥**

**కారణం సర్వభావానామానన్దైకసమాశ్రయమ్ ।**
**పురాణం పురుషం శుభ్రం ధ్యాయన్ముచ్యేత బంధనాత్ ॥ 16 ॥**

గొప్పవాడు, సర్వోత్కృష్టుడు, బ్రహ్మరూపుడు, పరమపురుషుడు, నాశరహితుడు, కృష్ణారుణ వర్ణాకారుడు, మహేశుడు, విశ్వరూపి అయిన పరమాత్మను ఓంకారోపాసన మనస్సును పరమాత్మలో నిలిపి ఆకాశమధ్యంలో ఉన్న ఈశ్వరుని క్రీడాలోలుని ధ్యానించాలి. సర్వభావాలకు కారణభూతుడు, ఆనందానికాధారభూతుడు, పురాణపురుషుడైన శంభుని ధ్యానించి సంసారబంధంనుండి విడివడుతాడు.

**యద్వా గుహాయాం ప్రకృతం జగత్సంమోహనాలయే ।**
**విచిన్త్య పరమం వ్యోమ సర్వభూతైకకారణమ్ ॥ 17 ॥**

**జీవనం సర్వభూతానాం యత్ర లోకః ప్రలీయతే ।**
**ఆనన్దం బ్రహ్మణః సూక్ష్మం యత్పశ్యన్తి ముముక్షవః ॥ 18 ॥**

**తన్మధ్యే నిహితం బ్రహ్మ కేవలం జ్ఞానలక్షణమ్ ।**
**అనన్తం సత్యమీశానం విచిన్త్యాసీత సంయతః ॥ 19 ॥**

లేదా జగత్తును మోహింపజేయుటకు ఆధారమైన ప్రకృతిలో సర్వభూతాలకు ఒకే కారణభూతుడైన పరమాకాశరూపుని చింతించాలి. సకల లోకాలకు ప్రాణభూతుని లోకాలన్నింటిని తనలో లయం చేసుకొనేవాణ్ణి, ఆనందరూపుని, బ్రహ్మసూక్ష్మరూపుని, ముముక్షువులు మాత్రమే దర్శించ వీలైనవాణ్ణి, హృదయమధ్యంలో ఉన్నవాణ్ణి కేవల జ్ఞానస్వరూపుణ్ణి, అంతరహిత సత్యరూపుని సకల జగదీశుని చింతిస్తూ నియమంతో ఉండాలి.

**గుహ్యాద్గుహ్యతమం జ్ఞానం యతీనామేతదీరితమ్ ।**
**యోఽనుతిష్ఠేన్మహేశేన సోఽశ్నుతే యోగమైశ్వరమ్ ॥ 20 ॥**

సర్వరహస్యాలకు రహస్యమైనదానిగా ఈ యతులకు చెందిన జ్ఞానం చెప్పనైనది. మహేశ్వరుడు చెప్పిన ఈ నియమాన్ని అనుష్ఠించేవాడు ఈశ్వరయోగాన్ని అనుభవిస్తాడు.

**తస్మాద్ధ్యానరతో నిత్యమాత్మవిద్యాపరాయణః ।**
**జ్ఞానం సమాశ్రయేద్బ్రహ్మ యేన ముచ్యేత బన్ధనాత్ ॥ 21 ॥**

అందువల్ల నిత్యం ఆత్మవిద్యాపరాయణుడై, ధ్యాననిరతుడై, జ్ఞానస్వరూపుడైన బ్రహ్మను ఉపాసించాలి. దానితో సంసారబంధం తొలగుతుంది.

**గత్వా పృథక్ స్వమాత్మానం సర్వస్మాదేవ కేవలమ్ ।**
**ఆనన్దమజరం జ్ఞానం ధ్యాయీత చ పునః పరమ్ ॥ 22 ॥**

అన్నిటికంటె విభిన్నుడైన తనను భిన్నునిగా తలచి ఆనందస్వరూపి, అజరుడు, పరుడైన జ్ఞానరూపుని ధ్యానించాలి.

**యస్మాద్భవన్తి భూతాని యద్భూత్వా నేహ జాయతే ।**
**స తస్మాదీశ్వరో దేవః పరస్మాద్యోఽధితిష్ఠతి ॥ 23 ॥**

సర్వప్రపంచాన్ని సృష్టించేవాణ్ణి, తన దరికి చేరినవాణ్ణి మళ్ళీ సంసారానికి పంపనివాణ్ణి ధ్యానించాలి. అందరికి ఈశ్వరుడు దేవుడు పరాత్పరుడు.

**యదన్తరే తద్గమనం శాశ్వతం శివముచ్యతే ।**
**యదాహుస్తత్పరో యః స్యాత్స దేవస్తు మహేశ్వరః ॥ 24 ॥**

ఉన్నత స్థానాన్నధిష్టించిన వాడు శాశ్వతమైన శివం అవ్యయమైన గగనాన్ని తనలో నిలుపుకున్నవాడు ఈ జగత్తునంతా నియమించేవాడు. అతనే మహేశ్వరుడు.

**వ్రతాని యాని భిక్షూణాం తథైవోపవ్రతాని చ ।**
**ఏకైకాతిక్రమే తేషాం ప్రాయశ్చిత్తం విధీయతే ॥ 25 ॥**

యతులకు విధింపనైన వ్రతాలు, ఉపవ్రతాల్లోను అతిక్రమించిన ప్రతిదానికి ప్రాయశ్చిత్తం ఉన్నది.

**ఉపేత్య తు స్త్రియం కామాత్ కృచ్ఛ్రసంయతమానసః ।**
**ప్రాణాయామసమాయుక్తః కుర్యాత్సాంతపనం శుచిః ॥ 26 ॥**

యతి కోరికతో స్త్రీ సంభోగం కావిస్తే సావధానుడై ప్రాణాయామం ఆచరించి శుద్ధుడై సాంతపన వ్రతాన్నాచరించాలి.

**తతశ్చరేత నియమాత్ కృచ్ఛ్రం సంయతమానసః ।**
**పునరాశ్రమమాగమ్య చరేద్భిక్షురతంద్రితః ॥ 27 ॥**

ఆ తర్వాత ఆశ్రమానికి వచ్చి నియమంగా కృచ్ఛ్రాన్ని ఆచరించాలి. తన సంన్యాసవ్రతాన్ని ఏ పొరపాటు లేకుండా ఆచరించాలి.

**న నర్మయుక్తమనృతం హినస్తీతి మనీషిణః ।**
**తథాఽపి చ న కర్తవ్యం ప్రసంగో హ్యేష దారుణః ॥ 28 ॥**

పరిహాసపూర్వకమైన అబద్ధంతో పాపం రాదని విద్వాంసులు చెప్తారు. అయినా అసత్యం విషయంలో ఆసక్తి చూపరాదు. అసత్యభాషణం పరమదారుణం.

**ఏకరాత్రోపవాసశ్చ ప్రాణాయామశతం తథా ।**
**కర్తవ్యం యతినా ధర్మం లిప్సునా పరమవ్యయమ్ ॥ 29 ॥**

యతి అసత్యాన్ని పలికితే ఒక రాత్రి ఉపవాసం ఉండి నూరు ప్రాణాయామాలు చేయాలి. ధర్మమును కోరు యతి అవ్యయము, శ్రేష్ఠమైన ధర్మాన్ని ఆచరించాలి.

**గతేనాపి న కార్యంతే న కార్యం స్తేయమన్యతః ।**
**స్తేయాదభ్యధికః కశ్చిన్నాస్త్యధర్మ ఇతి స్మృతిః ॥ 30 ॥**

ఎంతటి ఆపదలో ఉన్నా వేరే ప్రయోజనాన్నాశించి దొంగతనం చేయకూడదు. దొంగతనాన్ని మించిన అధర్మం లేదని స్మృతివాక్యం.

**హింసా చైషా పరా దిష్టా యా చాత్మజ్ఞాననాశికా ।**
**యదేతద్ద్రవిణం నామ ప్రాణా హ్యేతే బహిశ్చరాః ॥ 31 ॥**

ఆత్మజ్ఞానాన్ని నశింపచేసేది గొప్పహింస. ధనమంటే బహిశ్చరాలైన ప్రాణాలు.

**స తస్య హరతి ప్రాణాన్యో యస్య హరతే ధనమ్ ।**
**ఏవం కృత్వా సుదుష్టాత్మా భిన్నవృత్తో వ్రతాహతః ॥ 32 ॥**

ఎవని ధనాన్నపహరించినా అతని ప్రాణాలు హరించినట్టే. దుస్స్వభావుడైన యతి దొంగతనం చేసి ఆచారాలు, వ్రతం నుండి భ్రష్టుడై వ్రతభంగాన్ని పొందుతాడు.

**భూయో నిర్వేదమాపన్నశ్చరేచ్చాన్ద్రాయణవ్రతమ్ ।**
**విధినా శాస్త్రదృష్టేన సంవత్సరమితి శ్రుతిః ॥**

**భూయో నిర్వేదమాపన్నశ్చరేద్భిక్షురతన్ద్రితః ॥ 33 ॥**

అతడు మరల పశ్చాత్తాపం పొందితే శాస్త్రానుసారం సంవత్సరకాలం శాస్త్రం ప్రకారం చాంద్రాయణ వ్రతాన్ని ఆచరించాలి. తర్వాత మళ్ళీ తన వ్రతాన్ని సావధానియై కొనసాగించాలి.

**అకస్మాదేవ హింసాం తు యది భిక్షుః సమాచరేత్ ।**
**కుర్యాత్ కృచ్ఛ్రాతికృచ్ఛ్రన్తు చాన్ద్రాయణమథాపి వా ॥ 34 ॥**

ఒకవేళ సంన్యాసి హింస జరిపితే కృచ్ఛ్రవ్రతం అతికృచ్ఛ్రవ్రతం లేదా చాంద్రాయణవ్రతం ఆచరించాలి.

**స్కన్నమిన్ద్రియదౌర్బల్యాత్ స్త్రియం దృష్ట్వా యతిర్యది ।**
**తేన ధారయితవ్యా వై ప్రాణాయామాస్తు షోడశ ॥ 35 ॥**

దుర్బలమనస్కుడైన యతి రూపవతి స్త్రీని చూచి రేతస్స్రవం జరిగితే పదహారు ప్రాణాయామాలు చేయాలి.

**దివా స్కన్నే త్రిరాత్రం స్యాత్ ప్రాణాయామశతం తథా ॥ 36 ॥**

పగలు రేతః స్రవం జరిగితే ఆ యతి మూడు రాత్రులు ప్రతిదినము నూరు ప్రాణాయామాలు చేయాలి.

**ఏకాన్తే మధుమాంసే చ నవశ్రాద్ధే తథైవ చ ।**
**ప్రత్యక్షలవణం ప్రోక్తం ప్రాజాపత్యం విశోధనమ్ ॥ 37 ॥**

ఏకాంతంలో మధుమాంసాలు గ్రోలినా నవశ్రాద్ధ భోజనంలో (మొదటి ఆబ్దికంలో) ప్రత్యక్ష లవణాన్ని తిన్నా, ప్రాజాపత్యవ్రతాన్ని ఆచరించాలి.

**ధ్యాననిష్ఠస్య సతతం నశ్యతే సర్వపాతకమ్ ।**
**తస్మాన్మహేశ్వరం జ్ఞాత్వా తద్ధ్యానపరమో భవేత్ ॥ 38 ॥**

ఎల్లపుడు ధ్యానంలో ఉండేవానికి పాపాలన్నీ నశిస్తాయి. అందువల్ల పరమాత్మను తెలుసుకొని ఆ దేవుని ధ్యానంలో ఉండాలి.

**యద్బ్రహ్మ పరమం జ్యోతిః ప్రతిష్ఠాక్షరమవ్యయమ్ ।**
**యోఽన్తరా పరమం బ్రహ్మ స విజ్ఞేయో మహేశ్వరః ॥ 39 ॥**

పరబ్రహ్మ, పరంజ్యోతి, ప్రతిష్ఠ, అక్షరం, అద్వయం, అంతరాత్మ అతడే మహేశ్వరుడని తెలుసుకోవాలి.

**ఏష దేవో మహాదేవః కేవలః పరమః శివః ।**
**తదేవాక్షరమద్వైతం తదాదిత్యాన్తరం పరమ్ ॥ 40 ॥**

ఇతడే దేవుడు, మహాదేవుడు, కేవలుడు, పరమశివుడు, అక్షరరూపుడు, అద్వైతము, సూర్యునిలో ఉండే పరమాత్మ.

**యస్మాన్మహీయతే దేవః స్వధామ్ని జ్ఞానసంజితే ।**
**ఆత్మయోగాహ్వయే తత్త్వే మహాదేవస్తతః స్మృతః ॥ 41 ॥**

జ్ఞానమనే పేరు గల్గి స్వప్రకాశంతో విరాజిల్లేవాడు. తన మహాప్రకాశంలో, ఆత్మయోగంలో విరాజిల్లుతుంటాడు. అందువల్ల మహాదేవుడైనాడు.

**నాన్యం దేవం మహాదేవాద్వ్యతిరిక్తం ప్రపశ్యతి ।**
**తమేవాత్మానమాత్మేతి యః స యాతి పరం పదమ్ ॥ 42 ॥**

మహాదేవునికంటే భిన్నుడైన మరో దేవుని గూర్చి తెలియనివాడు, మహాదేవునే తన ఆత్మగా తెలిసినవాడు పరమపదం పొందుతాడు.

**మన్యన్తే యే స్వమాత్మానం విభిన్నం పరమేశ్వరాత్ ।**
**న తే పశ్యన్తి తం దేవం వృథా తేషాం పరిశ్రమః ॥ 43 ॥**

తన ఆత్మను పరమేశ్వరునికంటే భిన్నంగా భావించేవాడు మహాదేవుని చూడలేడు. వాని శ్రమంతా వ్యర్థమే.

**ఏకం బ్రహ్మ పరం బ్రహ్మ జ్ఞేయం తత్త్వమవ్యయమ్ ।**
**స దేవస్తు మహాదేవో నైతద్విజ్ఞాయ బాధ్యతే ॥ 44 ॥**

పరబ్రహ్మ ఒకటే. అతడే అవ్యయతత్త్వం. ఆ తత్త్వమే మహాదేవుడు. ఇవి తెలిసినవానికి సంసారబంధం ఉండదు.

**తస్మాద్యత్నేన నియతం యతిః సంయతమానసః ।**
**జ్ఞానయోగరతః శాన్తో మహాదేవపరాయణః ॥ 45 ॥**

కావున యతి నిత్యం ఈ విషయాన్ని గుర్తించటానికి ప్రయత్నించాలి. మనస్సుతో జ్ఞానయోగాన్ని అనుష్ఠించాలి. మహాదేవ పరాయణుడవాలి.

**ఏష వః కథితో విప్రా యతీనామాశ్రమశ్శుభః ।**
**పితామహేన విభునా మునీనాం పూర్వమీరితమ్ ॥ 46 ॥**

ఓ బ్రాహ్మణులారా! ఈ విధంగా మీకు శుభకరమైన యత్యాశ్రమ ధర్మాలు వివరించినాను. పూర్వం ఈ ధర్మాలను బ్రహ్మ మునులకు తెలిపినాడు.

**నాఽపుత్రశిష్య యోగిభ్యో దద్యాదిదమనుత్తమమ్ ।**
**జ్ఞానం స్వాయంభువం ప్రోక్తం యతిధర్మాశ్రయం శివమ్ ॥ 47 ॥**

స్వయంభువు చెప్పిన యతిధర్మాశ్రయమైన ఈ జ్ఞానాన్ని శిష్యుడు, పుత్రుడు, యోగి కానివారికి చెప్పకూడదు.

**ఇతి యతినియమానా మేత దుక్తం విధానం**
**పశుపతిపరితోషే యద్భవేదేకహేతుః ।**
**న భవతి పునరేషాముద్భవో వా వినాశః**
**ప్రణిహితమనసా యే నిత్యమేవాఽఽచరన్తి ॥ 48॥**

ఈ యతిధర్మవిధానం మహాదేవుని సంతోషానికి ముఖ్యహేతువు. శ్రద్ధగా నియమంతో నిత్యము ఈ వ్రతాలనాచరించేవారికి చావు పుట్టుకలుండవు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే యతిధర్మే ఏకోనత్రింశోఽధ్యాయః ॥ 29 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో యతిధర్మాలనే ఇరవై తొమ్మిదవ అధ్యాయం ॥ 29 ॥



## త్రింశోఽధ్యాయః - ముప్పైయవ అధ్యాయం

## ప్రాయశ్చిత్తవిధిః - ప్రాయశ్చిత్తవిధి

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు

**అతః పరం ప్రవక్ష్యామి ప్రాయశ్చిత్తవిధిం శుభమ్ ।**
**హితాయ సర్వప్రాణినాం దోషాణామపనుత్తయే ॥ 1 ॥**

అన్ని ప్రాణులకు హితాన్ని కలిగించటానికి, సకల దోషాలను తొలగించటానికి శుభకరమైన ప్రాయశ్చిత్త విధిని ఇపుడు తెలుపుతాను.

**అకృత్వా విహితం కర్మ కృత్వా నిన్దితమేవ చ ।**
**దోషమాప్నోతి పురుషః ప్రాయశ్చిత్తం విశోధనమ్ ॥ 2 ॥**

విధించిన కర్మలనాచరించకున్నా నిషిద్ధ కర్మలనాచరించినా దోషాన్ని పొందుతాడు. ప్రాయశ్చిత్తం వల్లనే ఆ దోషాలు తొలగుతాయి.

**ప్రాయశ్చిత్తమకృత్వా తు న తిష్ఠేద్బ్రాహ్మణః క్వచిత్ ।**
**యద్బ్రూయుర్బ్రాహ్మణాః శాన్తా విద్వాంసస్తత్సమాచరేత్ ॥ 3 ॥**

బ్రాహ్మణుడు దోషాలనాచరిస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఆచరించకుండా ఉండరాదు. శాంతులు, విద్వాంసులు అయిన బ్రాహ్మణులు చెప్పిన దాన్ని ఆచరించాలి.

**వేదార్థవిత్తమః శాన్తో ధర్మకామోఽగ్నిమాన్ ద్విజః ।**
**స ఏవ స్యాత్పరో ధర్మోఽయమేకోఽపి వ్యవస్యతి ॥ 4 ॥**

వేదార్థజ్ఞానం కలవాడు, శాంతుడు, ధర్మకాముడు, ఆహితాగ్ని, ద్విజుడు ఒకడు నిర్ధారించినా అది పరమధర్మమే అవుతుంది.

**అనాహితాగ్నయో విప్రాస్త్రయోవేదార్థపారగాః ।**
**యద్బ్రూయుర్ధర్మకామాస్తే తజ్జ్ఞేయం ధర్మసాధనమ్ ॥ 5 ॥**

వేదార్థపారగులు  అయిననూ ఆహితాగ్నులు కాని, ముగ్గురు విప్రులు ధర్మకాములై చెప్పినదే ధర్మం.

**అనేక ధర్మశాస్త్రజ్ఞా ఊహాపోహవిశారదాః ।**
**వేదాధ్యయనసంపన్నాః సప్తైతే పరికీర్తితాః ॥ 6 ॥**

అనేక ధర్మశాస్త్రాలను తెలిసినవారు, ఊహాపోహ విశారదులు, వేదాధ్యయనసంపన్నులు ఏడుగురు చెప్పినది ధర్మమే  అవుతుంది.

**మీమాంసాజ్ఞానతత్త్వజ్ఞా వేదాన్తకుశలా ద్విజాః ।**
**ఏకవింశతివిఖ్యాతాః ప్రాయశ్చిత్తం వదన్తి వై ॥ 7 ॥**

మీమాంస, తత్త్వం తెలిసినవారు, వేదాంతపారగులు, ద్విజులు ఇరువదొక్కమంది ప్రాయశ్చిత్తాన్ని చెప్పగలవారు.

**బ్రహ్మహా మద్యపః స్తేనో గురుతల్పగ ఏవ చ ।**
**మహాపాతకినస్త్వేతే యశ్చైతైః సహ సంవిశేత్ ॥ 8 ॥**

బ్రహ్మహత్య చేసినవాడు, మద్యపానం ఆచరించినవాడు, దొంగతనం చేసినవాడు, గురుభార్యను పొందినవాడు మహాపాపులు. వీరితో కలిసి ఉండేవారు కూడా మహాపాతకులే.

**సంవత్సరన్తు పతితైః సంసర్గం కురుతే తు యః ।**
**యానశయ్యాసనైర్నిత్యం జానన్వై పతితో భవేత్ ॥ 9 ॥**

మహాపాతకులని తెలిసికూడ సంవత్సరకాలం వారితో కలిసి యానశయ్యాసనాదుల్లో ఉన్నా పతితుడవుతాడు.

**యాజనం యోనిసమ్బన్ధం తథైవాధ్యాపనం ద్విజః ।**
**సద్యః కృత్వా పతత్యేవ సహ భోజనమేవ చ ॥ 10 ॥**

మహాపాతకి అని తెలిసి కూడా యజ్ఞాలు చేయించటం, యోనిసంబంధాన్ని అనగా వివాహం జరుపుకోవటం, వేదాధ్యయనం చేయించటం, భోజనాదులు ఆచరిస్తే వెంటనే పతితుడవుతాడు.

**అవిజ్ఞాయాథ యో మోహాత్కుర్యాదధ్యాపనం ద్విజః ।**
**సంవత్సరేణ పతతి సహాధ్యయనమేవ చ ॥ 11 ॥**

అజ్ఞానం మోహంవల్ల ఇటువంటి పాపులతో సంవత్సరకాలం అధ్యయన అధ్యాపనాలు జరిపితే పతితుడవుతాడు.

**బ్రహ్మహా ద్వాదశాబ్దాని కుటిం కృత్వా వనే వసేత్ ।**
**భైక్ష్యమాత్మవిశుధ్యర్థే కృత్వా శవశిరోధ్వజమ్ ॥ 12 ॥**

బ్రహ్మహత్య చేసినవాడు అడవిలో కుటీరాన్ని నిర్మించుకొని పన్నెండు సంవత్సరాలుండాలి. శవశిరస్సు ఆకారాన్ని ధ్వజంగా పెట్టుకొని ఆత్మశుద్ధికోసం భిక్షాటనం చేయాలి.

**బ్రాహ్మణావసథాన్ సర్వాన్ దేవాగారాణి వర్జయేత్ ।**
**వినిన్దన్ స్వయమాత్మానం బ్రాహ్మణం తం చ సంస్మరన్ ॥**

**అసంకల్పితయోగ్యాని సప్తాగారాణి సంవిశేత్ ॥ 13 ॥**

భిక్షలో బ్రాహ్మణగృహాలు, దేవమందిరాలు విడువాలి. తాను చంపిన బ్రాహ్మణులను తలచుకొంటూ తన్ను తాను నిందించుకుంటూ మొదట నిశ్చయించుకోకుండా ఏడిండ్లలో భిక్షాటనం చేయాలి.

**విధూమే శనకైర్నిత్యం వ్యంగారే భుక్తవజ్జనే ॥**
**ఏకకాలం చరేద్భైక్ష్యం దోషం విఖ్యాపయన్నృణామ్ ॥ 14 ॥**

ఆ ఇండ్లలో పొగ ఆగిన తరువాత, నిప్పు చల్లార్చిన తర్వాత, ఇంటిలోనివారు భుజించిన తర్వాత తాను చేసిన బ్రహ్మహత్యను ప్రజలకు తెలుపుతూ దినానికొకసారే భిక్షాటనం చేయాలి.

**వన్యమూలఫలైర్వాఽపి వర్తయేద్వై సమాశ్రితః ।**
**కపాలపాణిః ఖట్వాఙ్గీ బ్రహ్మచర్య పరాయణః ॥**
**పూర్ణే తు ద్వాదశే వర్షే బ్రహ్మహత్యాం వ్యపోహతి ॥ 15 ॥**

ధైర్యంతో వన్యాలైన ఫలమూలాలతోనైనా జీవించాలి. కపాలాన్ని మంచంకోడును చేతపట్టుకొని బ్రహ్మచర్య పరాయణుడై పన్నెండు సంవత్సరాలు చరిస్తే బ్రహ్మహత్యాపాపం తొలగుతుంది.

**అకామతః కృతే పాపే ప్రాయశ్చిత్తమిదం శుభమ్ ।**
**కామతో మరణాచ్ఛుద్ధిః జ్ఞేయా నాన్యేన కేనచిత్ ॥ 16 ॥**

ఇది కూడా తెలియక చేసిన పాపానికి మాత్రమే. తెలిసి చేస్తే మరణమే ప్రాయశ్చిత్తము అని తెలుసుకోవాలి.

**కుర్యాదనశనం వాఽథ భృగోః పతనమేవ వా ।**
**జ్వలన్తం వా విశేదగ్నిం జలం వా ప్రవిశేత్స్వయమ్ ॥ 17 ॥**

తెలిసి బ్రహ్మహత్య చేసినవాడు ఆమరణ నిరాహారి కావాలి. పర్వతంపై నుండి పడి అయినా మరణించాలి. మండే అగ్నిలో లేదా నీటిలో పడాలి.

**బ్రాహ్మణార్థే గవార్థే వా సమ్యక్ ప్రాణాన్ పరిత్యజేత్ ।**
**బ్రహ్మహత్యాఽపనోదార్థమన్తరా వా మృతస్య తు ॥ 18 ॥**

బ్రాహ్మణుని రక్షణకోసం గోరక్షణకోసం ప్రాణాలు వదలాలి. బ్రహ్మహత్యను పోగొట్టుకోవడానికి ఆ మరణించిన కుటుంబంలోని వ్యక్తులను రక్షించుకోవడానికి కూడ తన ప్రాణాలు విడవాలి.

**దీర్ఘామయావినం విప్రం కృత్వానామయమేవ వా ।**
**దత్త్వా చాన్నం సువిదుషే బ్రహ్మహత్యా వ్యపోహతి ॥ 19 ॥**

లేదా దీర్ఘరోగి అయిన బ్రాహ్మణుని రోగాన్ని శాంతింపచేసినా విద్వాంసుడైన బ్రాహ్మణునికి అన్నం పెట్టినా బ్రహ్మహత్యాపాపం తొలగుతుంది.

**అశ్వమేధావభృథకే స్నాత్వా వై శుధ్యతే ద్విజః ।**
**సర్వస్వం వా వేదవిదే బ్రాహ్మణాయ ప్రదాయ చ ॥ 20 ॥**

అశ్వమేధయాగంలో అవభృథస్నానం చేసి కాని, వేదములను తెలిసిన బ్రాహ్మణునకు సర్వస్వము సమర్పించి కాని ద్విజుడు బ్రహ్మహత్యాపాపం నుండి శుద్ధిని పొందుతాడు.

**సరస్వత్యాస్త్వరుణయా సఙ్గమే లోకవిశ్రుతే ।**
**శుధ్యేత్త్రిషవణస్నానాత్త్రిరాత్రోపోషితో ద్విజః ॥ 21 ॥**

లోక ప్రసిద్ధమైన సరస్వతి, అరుణ అను రెండు నదుల సంగమములోకాని, సముద్రంలోకాని మూడు పూటల స్నానంచేసి మూడు దినములు ఉపవాసమున్నచో బ్రహ్మహత్యాపాపంనుండి శుద్ధిని పొందుతాడు.

**గత్వా రామేశ్వరం పుణ్యం స్నాత్వా చైవ మహోదధౌ ।**
**బ్రహ్మచర్యాదిభిర్యుక్తో దృష్ట్వా రుద్రం విమోచయేత్ ॥ 22 ॥**

బ్రహ్మచర్యాదులు గలిగి రామేశ్వర క్షేత్రానికి వెళ్ళి సముద్ర స్నానమాచరించి బ్రహ్మచర్యంతో రుద్రుణ్ణి దర్శిస్తే బ్రహ్మహత్యాపాపం తొలగిపోతుంది.

**కపాలమోచనం నామ తీర్థం దేవస్య శూలినః ।**
**స్నాత్వాఽభ్యర్చ్య పితౄన్ దేవాన్ బ్రహ్మహత్యాం వ్యపోహతి ॥ 23 ॥**

కపాలమోచనం అనే శైవక్షేత్రానికి వెళ్ళి స్నానంచేసి పితృదేవతలను పూజించి బ్రహ్మహత్యా పాతకాన్ని తొలగించుకోవచ్చు.

**యత్ర దేవాధిదేవేన భైరవేణాతితేజసా ।**
**కపాలం స్థాపితం పూర్వం బ్రహ్మణః పరమేష్ఠినః ॥ 24 ॥**

పూర్వం ఈ క్షేత్రంలో అమితతేజస్వి, దేవాధిదేవుడు అయిన భైరవుడు బ్రహ్మకపాలాన్ని ప్రతిష్ఠించినాడు.

**సమభ్యర్చ్య మహాదేవం తత్ర భైరవరూపిణమ్ ।**
**తర్పయిత్వా పితౄన్ స్నాత్వా ముచ్యతే బ్రహ్మహత్యయా ॥ 25 ॥**

ఇక్కడ భైరవరూపంగా ఉన్న శివుని బాగా పూజించి, స్నానంచేసి పితృతర్పణంచేస్తే బ్రహ్మహత్యనుండి విముక్తుడవుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ప్రాయశ్చిత్తవిధిర్నామ త్రింశోఽధ్యాయః ॥ 30 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ప్రాయశ్చిత్తవిధి అనే ముప్పైయవ అధ్యాయం ॥ 30 ॥



## ఏకత్రింశోఽధ్యాయః –ముప్పై ఒకటవ అధ్యాయం

## బ్రహ్మకపాలస్థాపనమ్ – బ్రహ్మకపాలస్థాపనం

**ఋషయ ఊచు :**–ఋషులు అడిగారు

**కథం దేవేన రుద్రేణ శివేనామితతేజసా ।**
**కపాలం బ్రహ్మణః పూర్వం స్థాపితం దేహజం భువి ॥ 1 ॥**

పూర్వం అమిత తేజోవంతుడైన రుద్రుడు బ్రహ్మశరీరసంబంధమైన కపాలాన్ని భూమిపై ఎట్లా స్థాపించినాడు?

**సూత ఉవాచ:**–సూతుడు చెప్పాడు

**శృణుధ్వం ఋషయః పుణ్యాం కథాం పాపప్రణాశినీమ్ ।**
**మాహాత్మ్యం దేవదేవస్య మహాదేవస్య ధీమతః ॥ 2 ॥**

ఋషులారా! పాపమును నశింపజేసే ఈ పుణ్యకథను, జ్ఞానస్వరూపుడైన, దేవదేవుడైన మహాదేవుని మాహాత్మ్యాన్ని వినండి.

**పురా పితామహం దేవం మేరుశృఙ్గే మహర్షయః ।**
**ప్రోచుః ప్రణమ్య లోకాదిం కిమేకం తత్త్వమవ్యయమ్ ॥ 3 ॥**

పూర్వకాలంలో ఋషులందరు మేరుపర్వత శిఖరానికి వెళ్ళి బ్రహ్మకు నమస్కరించి సకల జగత్కారణము అవ్యయ తత్త్వమేది అని అడిగినారు.

**స మాయయా మహేశస్య మోహితో లోకసమ్భవః ।**
**అవిజ్ఞాయ పరం భావం స్వాత్మానం ప్రాహ ధర్షిణమ్ ॥ 4 ॥**

**అహం ధాతా జగద్యోనిః స్వయమ్భూరేక ఈశ్వరః ।**
**అనాదిమత్పరం బ్రహ్మ మామభ్యర్చ్య విముచ్యతే ॥ 5 ॥**

**అహం హి సర్వదేవానాం ప్రవర్తకనివర్తకః ।**
**న విద్యతే చాభ్యధికో మత్తో లోకేషు కశ్చన ॥ 6 ॥**

అంతట సకలజగత్తును సృష్టించే బ్రహ్మ మహాదేవుని మాయచే మోహితుడై ఋషుల అభిప్రాయాన్ని తెలుసుకోలేక అభిమానంతో నేనే ఈ జగత్తును ధరించేవాడను జగత్కారణుడను. స్వయంభువు. అద్వితీయుడనైన ఈశ్వరుడను. ఆదిలేని పరతత్త్వాన్ని నేనే. నన్ను పూజించి ముక్తులౌతారు. నేనే సకల దేవతలను ప్రవర్తింపచేస్తూ నివర్తింపచేస్తున్నాను. లోకాల్లో నాకంటే అధికుడు మరొకడు లేదు అన్నాడు.

**తస్యైవం మన్యమానస్య జజ్ఞే నారాయణాంశజః ।**
**ప్రోవాచ ప్రహసన్వాక్యం రోషితోఽయం త్రిలోచనః ॥ 7 ॥**

బ్రహ్మ ఈ విధంగా భావించునపుడు నారాయణాంశతో ఉత్పన్నుడైన భగవానుడగు ముక్కంటి కోపంతో కనులు ఎర్రపడగా నవ్వుతూ ఇట్లన్నాడు.

**కిం కారణమిదం బ్రహ్మన్వర్తతే తవ సాప్రతమ్ ।**
**అజ్ఞానయోగయుక్తస్య న త్వేతదుచితం తవ ॥ 8 ॥**

ఓ బ్రహ్మా! నీ వెందుకిట్లా పలుకుతున్నావు? అజ్ఞానం యోగముతోనున్న నీకిది తగదు.

**అహం కర్తాఽఽదిలోకానాం జజ్ఞే నారాయణాత్ప్రభోః ।**
**న మామృతేఽస్య జగతో జీవనం సర్వథా క్వచిత్ ॥ 9 ॥**

నేనే ఈ లోకాలకు కర్తను నేనే, నారాయణ ప్రభువునుండి పుట్టాను. నేను లేకుండా ఈ జగత్తుకు ఉనికే లేదు.

**అహమేవ పరంజ్యోతిరహమేవ పరా గతిః ।**
**మత్ప్రేరితేన భవతా సృష్టం భువనమణ్డలమ్ ॥ 10 ॥**

నేనే పరంజ్యోతిని, పరాగతిని, నాప్రేరణతోనే నీవీ లోకాలను సృష్టించినావు.

**ఏవం వివదతోర్మోహాత్పరస్పరజయైషిణోః ।**
**ఆజగ్ముర్యత్ర తౌ దేవౌ వేదాశ్చత్వార ఏవ హి ॥ 11 ॥**

ఈ విధంగా నారాయణుడు, బ్రహ్మ వివాదపడుతుండగా నాలుగు వేదాలు అక్కడికి వచ్చినవి.

**అన్వీక్ష్య దేవం బ్రహ్మాణం యజ్ఞాత్మానం చ సంస్థితమ్ ।**
**ప్రోచుః సంవిగ్నహృదయా యాథాత్మ్యం పరమేష్ఠినః ॥ 12 ॥**

ఆ వేదాలు బ్రహ్మదేవుని యజ్ఞరూపుడైన విష్ణువును చూచి కలత చెందినవై బ్రహ్మతో తత్త్వయాథార్థ్యాన్ని ఇట్లా చెప్పసాగినవి.

**ఋగ్వేద ఉవాచ :**–ఋగ్వేదం పలికింది

**యస్యాన్తస్థాని భూతాని యస్మాత్సర్వం ప్రవర్తతే ।**
**యదాహుస్తత్పరం తత్త్వం స దేవః స్యాన్మహేశ్వరః ॥ 13 ॥**

సకల ప్రాణులను తనలో నిలుపుకున్నవాడు, సకల జగత్తును ప్రవర్తింపచేసేవాడు, పరతత్త్వంగా ప్రసిద్ధినొందిన వాడు మహేశ్వరుడని తెలుసుకోండి.

**యజుర్వేద ఉవాచ:**–యజుర్వేదం పలికింది.

**యో యజ్ఞైరఖిలైరీశో యోగేన చ సమర్చ్యతే ।**
**యమాహురీశ్వరం దేవం స దేవః స్యాత్పినాకధృక్ ॥ 14 ॥**

సకలయజ్ఞాలతో, యోగాలతో అర్చితుడై ఈశ్వరునిగా పిలుపునందినవాడు పినాకపాణి మాత్రమే.

**సామవేద ఉవాచ:**-సామవేదం పలికింది.

**యేనేదం భ్రామ్యతే విశ్వం యదాకాశాన్తరం శివమ్ ।**
**యోగిభిర్వేద్యతే తత్త్వం మహాదేవః స శఙ్కరః ॥ 15 ॥**

సకలజగత్తును ప్రవర్తింపచేసేవాడు, పరమాకాశరూపుడు, యోగులు గుర్తించిన పరతత్త్వం మహాదేవుడైన శంకరుడే.

**అథర్వవేద ఉవాచ:**-అథర్వవేదం పలికింది.

**యం ప్రపశ్యన్తి దేవేశం యజన్తే యతయః పరమ్ ।**
**మహేశం పురుషం రుద్రం స దేవో భగవాన్ భవః ॥ 16 ॥**

అందరి చేత సాక్షాత్కరించబడువాడు యతులు యజ్ఞము చేయునది మహేశుడు, పురుషుడు రుద్రుడైన ఆ భగవానుడు భవుడే,

**ఏవం స భగవాన్ బ్రహ్మా వేదానామీరితం శుభమ్ ।**
**శ్రుత్వా విహస్య విశ్వాత్మా తతశ్చాఽఽహ విమోహితః ॥ 17 ॥**

**కథం తత్పరమం బ్రహ్మ సర్వసంగవివర్జితమ్ ।**
**రమతే భార్యయా సార్ధం ప్రమథైశ్చాతిగర్వితైః ॥ 18 ॥**

ఈ విధంగా వేదాలమాటలు విని విశ్వస్వరూపుడైన బ్రహ్మ మోహింపబడి నవ్వుతూ పలికాడు. అతడు పరమబ్రహ్మైతే, సర్వసంగవర్జితుడైతే, అతిగర్వితులైన ప్రమథులతో కలిసి ఎట్లా ఉంటాడు? భార్యతో కలిసి ఎట్లా రమిస్తుంటాడు?

**ఇతీరితేఽథ భగవాన్ ప్రణవాత్మా సనాతనః ।**
**అమూర్తో మూర్తిమాన్ భూత్వా వచః ప్రాహ పితామహమ్ ॥ 19 ॥**

ఈ విధంగా చెప్పగానే పూజ్యుడు, సనాతనుడైన ప్రణవస్వరూపుడు, ఆకారంలేకుండా ఉన్నవాడు, మూర్తిమంతుడై పితామహుణ్ణి గూర్చి ఇట్లన్నాడు.

**ప్రణవ ఉవాచ:**-ప్రణవం పలికింది

**న హ్యేష భగవానీశః స్వాత్మనో వ్యతిరిక్తయా ।**
**కదాచిద్రమతే రుద్రస్తాదృశో హి మహేశ్వరః ॥ 20 ॥**

ఆ శంకరుడు తనకంటే భిన్నమైన పత్నితో ఎపుడూ రమించటం లేదు. మహేశ్వరుడంటే అటువంటివాడు.

**అయం స భగవానీశః స్వయంజ్యోతిః సనాతనః ।**
**స్వానందభూతా కథితా దేవీ ఆగన్తుకా శివా ॥ 21 ॥**

ఈ శంకరుడు సనాతనుడు, స్వయంప్రకాశస్వరూపుడు, పార్వతి అంటే ఆత్మయే, అతని ఆనందమే ఆ రూపం దాల్చి వచ్చింది.

**ఇత్యేవముక్తేఽపి తదా యజ్ఞమూర్తేరజస్య వా ।**
**నాజ్ఞానమగమన్నాశమీశ్వరస్యైవ మాయయా ॥ 22 ॥**

ఈ విధంగా ప్రణవం చెప్పినా ఈశ్వరమాయవల్ల యజ్ఞమూర్తి అయిన బ్రహ్మకు అజ్ఞానం తొలగలేదు.

**తదన్తరే మహాజ్యోతిర్విరిఞ్చో విశ్వభావనః ।**
**ప్రాదర్శదద్భుతం దివ్యం పూరయన్గగనాన్తరమ్ ॥ 23 ॥**

అంతలో విశ్వస్రష్ట విరించుడు ఆకాశమధ్యంలో నిల్చున్న దివ్యరూపం అద్భుతమైన జ్యోతిని చూశాడు. ఆ జ్యోతిమధ్యలో పరిశుభ్రమైనది తేజస్సుతో ప్రకాశించే ఆకాశమధ్యంలో నిండియున్న ఒక దివ్యమండలం ఆవిర్భవించింది.

**తన్మధ్యసంస్థితం జ్యోతిర్మణ్డలం తేజసోజ్జ్వలమ్ ।**
**వ్యోమమధ్యగతం దివ్యం ప్రాదురాసీద్ద్విజోత్తమాః ॥ 24 ॥**

ఆ దివ్యమండలం మధ్యలోనున్నదగు జ్యోతిర్మండలము తేజస్సుతో ఉజ్జ్వలమైనది. ఆకాశమధ్యగతముగా దివ్యమైనది ప్రాదుర్భవించినది.

**స దృష్ట్వా వదనం దివ్యమూర్ధ్ని లోకపితామహః ।**
**తైజసం మణ్డలం ఘోరమలోకయదనిన్దితమ్ ॥ 25 ॥**

లోకపితామహుడు ఆ దివ్య జ్యోతిర్మండలములో ముఖాన్ని చూచుకొని ఘోరమైన తైజసమండలమును నిందించదగనిదానిని చూచాడు.

**ప్రజజ్వాలాతికోపేన బ్రహ్మణః పఞ్చమం శిరః ।**
**క్షణాదపశ్యత్స మహాన్ పురుషో నీలలోహితః ॥ 26 ॥**

**త్రిశూలపిఙ్గలో దేవో నాగయజ్ఞోపవీతవాన్ ।**
**తం ప్రాహ భగవాన్ బ్రహ్మా శఙ్కరం నీలలోహితమ్ ॥ 27 ॥**

ఇంతలో బ్రహ్మ ఐదవ శిరసు కోపంతోనే కాలిపోయింది. అంతలో ఒక క్షణకాలంలో నీలలోహితుడు మహాపురుషుడు, త్రిశూలి, పింగళవర్ణుడు, నాగయజ్ఞోపవీతధారి, మహేశ్వరగణాల్లో ఒక దేవుడు ఆవిర్భవించినాడు. అతనిని చూచి బ్రహ్మ ఇట్లన్నాడు.

**జ్ఞానాయ పూర్వం భవతో లలాటాదద్య శఙ్కరమ్ ।**
**ప్రాదుర్భూతం మహేశానం మామతః శరణం వ్రజ ॥ 28 ॥**

ఓ శంకరా! పూర్వం నీవు జ్ఞానము కొరకు నా లలాటం నుండి పుట్టినావని తెలుసు, అందువల్ల నన్ను శరణు వేడు,

**శ్రుత్వా సగర్వవచనం పద్మయోనేరథేశ్వరః ।**
**ప్రాహిణోత్పురుషం కాలం భైరవం లోకదాహకమ్ ॥ 29 ॥**

ఆ బ్రహ్మ గర్వంతో పలికిన మాటలు విన్న శంకరుడు లోకదాహకుడైన కాలభైరవుని పంపినాడు.

**స కృత్వా సుమహద్యుద్ధం బ్రహ్మణా కాలభైరవః ।**
**ప్రచకర్తాస్య వదనం విరించస్యాథ పఞ్చమమ్ ॥ 30 ॥**

ఆ కాలభైరవుడు బ్రహ్మతో ఘోరయుద్ధంచేసి బ్రహ్మ పంచమశిరసును ఖండించినాడు.

**నికృత్తవదనో దేవో బ్రహ్మా దేవేన శమ్భునా ।**
**మమార చేశో యోగేన జీవితం ప్రాప విశ్వధృక్ ॥ 31 ॥**

ఈ విధంగా కాలభైరవుడు ఖండించిన శిరస్సుగల బ్రహ్మ మరణించి ఈశ్వరానుగ్రహంవల్ల మళ్ళీ జీవించినాడు.

**అథాన్వపశ్యదీశానం మణ్డలాన్తరసంస్థితమ్ ।**
**సమాసీనం మహాదేవ్యా మహాదేవం సనాతనమ్ ॥ 32 ॥**

తరువాత ఆ దివ్యమండలమధ్యంలో మహాదేవితో కలిసికూర్చున్న సనాతనమహాదేవుని చూశాడు.

**భుజఙ్గరాజవలయం చన్ద్రావయవభూషణమ్ ।**
**కోటిసూర్యప్రతీకాశం జటాజూటవిరాజితమ్ ॥ 33 ॥**

ఆ మహాదేవుడు నాగరాజ కంకణుడు, చంద్రరేఖాలంకారుడు, కోటిసూర్య సమకాంతికలవాడు జటా జూట శోభితుడు.

**శార్దూలచర్మవసనం దివ్యమాలాసమన్వితమ్ ।**
**త్రిశూలపాణిం దుష్ప్రేక్ష్యం యోగినం భూతిభూషణమ్ ॥ 34 ॥**

శార్దూల చర్మం ధరించినాడు. దివ్యమాల ధరించి చేత త్రిశూలంతో చూడ శక్యం కానివాడు. పరమయోగి, విభూతి భూషణుడు,

**యమన్తరా యోగనిష్ఠాః ప్రపశ్యన్తి హృదీశ్వరమ్ ।**
**తమాదిమేకం బ్రహ్మాణం మహాదేవం దదర్శ హ ॥ 35 ॥**

యోగనిష్ఠులు సర్వదా తమహృదయంలో సేవించే ఈశ్వరుని ఆదిదేవుని బ్రహ్మ దర్శించినాడు.

**యస్య సా పరమా దేవీ శక్తిరాకాశసంజ్ఞితా ।**
**సోऽనన్తైశ్వర్యయోగాత్మా మహేశో దృశ్యతే కిల ॥ 36 ॥**

అతని శక్తియే ఆకాశంలో ఉన్న పరమదేవి. ఆ మహేశ్వరుడనంతైశ్వర్యయోగాలతో ఉన్నవాడు. ఆ మహేశ్వరుడు కనపడుతున్నాడు.

**యస్యాశేషజగద్బీజం విలయం యాతి మోహనమ్ ।**
**సకృత్ప్రణామమాత్రేణ స రుద్రః ఖలు దృశ్యతే ॥ 37 ॥**

ఇతనినొకసారి నమస్కరిస్తే సకల సంసార బీజమైన మోహం సమూలంగా నశిస్తుంది. అటువంటి రుద్రుడు సాక్షాత్కరించినాడు.

**యేऽథ నాచారనిరతాస్తద్భక్తాశ్చైవ కేవలమ్ ।**
**విమోచయతి లోకాత్మా నాయకో దృశ్యతే కిల ॥ 38 ॥**

ఆ రుద్రుడు ఆచారనిరతులు కాకున్నా తన భక్తులను విడిపిస్తాడు.

**యస్య బ్రహ్మాదయో దేవా ఋషయో బ్రహ్మవాదినః ।**
**అర్చయన్తి సదా లిఙ్గం స శివః ఖలు దృశ్యతే ॥ 39 ॥**

ఆ మహేశ్వరలింగాన్ని బ్రహ్మాదిదేవతలు బ్రహ్మవాదులైన ఋషులు ఆరాధిస్తారు. ఆ శివుడు కనపడుతున్నాడు.

**యస్యాశేషజగత్సూతిర్విజ్ఞానతనురీశ్వరః ॥ 40 ॥**

సకల జగత్తునకు కారణమైన విజ్ఞాన దేహము ఆ శివునిదే. ఆ శివుడు కనిపించినాడు.

**విద్యా సహాయో భగవాన్యస్యాసౌ మణ్డలాన్తరమ్ ।**
**హిరణ్యగర్భపుత్రోऽసౌ ఈశ్వరో దృశ్యతే పురః ॥ 41 ॥**

బ్రహ్మను తనమండలంలోనే నివసింపచేసుకొన్న శంకరుడు హిరణ్యగర్భపుత్రుడు కనిపించినాడు.

**పుష్పం వా యది వా పత్రం యత్పాదయుగళే జలమ్ ।**
**దత్వా తరతి సంసారం రుద్రోऽసౌ దృశ్యతే కిల ॥ 42 ॥**

పత్రపుష్పఫలాల్లో ఏది తనపాదాలపై ఉంచినా సంసారాన్ని తరింపచేసే రుద్రుడు ప్రత్యక్షమైనాడు.

**తత్సన్నిధానే సకలం నియచ్ఛతి సనాతనః ।**
**కాలం కిల నియోగాత్మా కాలః కాలో హి దృశ్యతే ॥ 43 ॥**

తన సన్నిధిలో సకలానికి అనుగుణంగా నియమించే కాలానికి కాలరూపుడు శంకరుడు కనపడినాడు.

**జీవనం సర్వలోకానాం త్రిలోకస్యైవ భూషణమ్ ।**
**సోమః స దృశ్యతే దేవః సోమో యస్య విభూషణమ్ ॥ 44 ॥**

సకలలోకానికి జీవనం, ముల్లోకాలకు అలంకారమైన చంద్రచూడుడు ఉమాసమేతుడై దర్శన మిచ్చినాడు.

**దేవ్యా సహ సదా సాక్షాద్యస్య యోగస్వభావతః ।**
**గీయతే పరమా ముక్తిర్మహాదేవః స దృశ్యతే ॥ 45 ॥**

ఎల్లపుడు పార్వతితో సహజంగా కలిసి ఉండేవాడు, సాక్షాత్తుగా యోగస్వభావముతో ఇతని పరమముక్తి గానము చేయబడినది. ఆ మహాదేవుడు కనిపించినాడు.

**యోగినో యోగతత్త్వజ్ఞా వియోగాభిముఖోఽనిశమ్ ।**
**యోగం ధ్యాయన్తి దేవ్యాఽసౌ స యోగీ దృశ్యతే కిల ॥ 46 ॥**

యోగతత్త్వజ్ఞులైన యోగులు ఎపుడు దేవితో కలిసి ఉన్నా వైరాగ్యభూషణునిగా ఉన్న యోగరూపుని ధ్యానిస్తూ ఉంటారు. అటువంటి యోగి దర్శన మిచ్చినాడు.

**సోఽనువీక్ష్య మహాదేవం మహాదేవ్యా సనాతనమ్ ।**
**వరాసనే సమాసీనమవాప పరమాం స్మృతిమ్ ॥ 47 ॥**

ఆ విధంగా మహాదేవితో కలిసి ఆసనంపై కూర్చున్న మహాదేవుని చూచి బ్రహ్మ పరమస్మృతిని పొందాడు.

**లబ్ధ్వా మాహేశ్వరీం దివ్యాం సంస్మృతిం భగవానజః ।**
**తోషయామాస వరదం సోమం సోమార్ధభూషణమ్ ॥ 48 ॥**

దివ్యమైన మహేశ్వర సంస్మృతిని పొందిన బ్రహ్మ భగవానుడు, సోమార్ధ భూషణుడైన ఉమతోకలిసి ఉన్న వరదుని శంకరుని సంతోషింపచేశాడు.

**బ్రహ్మో ఉవాచ:**–బ్రహ్మ పలికాడు.

**నమో దేవాయ మహతే మహాదేవ్యై నమో నమః ।**
**నమశ్శివాయ శాన్తాయ శివాయై సతతం నమః ॥ 49 ॥**

మహాదేవునికి నమస్కారం, మహాదేవికి నమస్కారం. శాంతమూర్తి శివునికి నమస్కారం, పార్వతికి ఎల్లప్పుడూ నమస్కారం.

**ఓం నమో బ్రహ్మణే తుభ్యం విద్యాయై తే నమో నమః ।**
**మహేశాయ నమస్తుభ్యం మూలప్రకృతయే నమః ॥ 50 ॥**

బ్రహ్మస్వరూపుడవైన నీకు, సరస్వతీ రూపిణికి నమస్కారం. మహేశునకు మూల ప్రకృతికి నమస్కారం.

**నమో విజ్ఞానదేహాయ చిన్తాయై తే నమో నమః ।**
**నమోఽస్తు కాలకాలాయ ఈశ్వరాయ నమో నమః ॥ 51 ॥**

విజ్ఞాన దేహునకు, చింతారూపునకు నమస్కారం. కాలకాలుడైన ఈశ్వరునికి నమస్కారం.

**నమో నమోఽస్తు రుద్రాయ రుద్రాణ్యై తే నమో నమః ।**
**నమో నమస్తే కాలాయ మాయాయై తే నమో నమః ॥ 52 ॥**

రుద్రునికి, రుద్రాణికి నమస్కారం. కాలస్వరూపునకు, మాయారూపిణికి నమస్కారం.

**నియన్త్రే సర్వకార్యాణాం క్షోభికాయై నమో నమః ।**
**నమోఽస్తు తే ప్రకృతయే నమో నారాయణాయ చ ॥ 53 ॥**

సర్వకార్యనియామకునికి, క్షోభింపచేసేదానికి నమస్కారం. నారాయణునకు, ప్రకృతికి నమస్కారం.

**యోగదాయ నమస్తుభ్యం యోగినాం గురవే నమః ।**
**నమః సంసారవాసాయ సంసారోత్పత్తయే నమః ॥ 54 ॥**

యోగాన్నిచ్చేవానికి, యోగి అయిన గురువుకు నమస్కారం. సంసారవాసునకు, సంసారమును ఉత్పత్తి చేసినవానికి నమస్కారం.

**నిత్యానన్దాయ విభవే నమోస్త్వానన్దమూర్తయే ।**
**నమః కార్యవిహీనాయ విశ్వప్రకృతయే నమః ॥ 55 ॥**

నిత్యానందునికి, ఆనందమూర్తికి నమస్కారం. కార్యవిహీనునికి, విశ్వప్రకృతికి నమస్కారం.

**ఓఙ్కారమూర్తయే తుభ్యం తదన్తః సంస్థితాయ చ ।**
**నమస్తే వ్యోమసంస్థాయ వ్యోమశక్త్యై నమో నమః ॥ 56 ॥**

ఓంకారస్వరూపునికి, అందులోనున్న వానికి నమస్కారం. వ్యోమస్థితునకు, వ్యోమశక్తికి నమస్కారం.

**ఇతి సోమాష్టకేనేశం ప్రణిపత్య పితామహః ।**
**పపాత దణ్డవద్భూమౌ గృణన్వై శతరుద్రియమ్ ॥ 57 ॥**

ఈ విధంగా సోమాష్టకంతో ఈశ్వరుని స్తోత్రంచేసి శతరుద్రీయం పఠిస్తూ, నేలపై దండప్రణామం చేశాడు.

**అథ దేవో మహాదేవః ప్రణతార్తిహరో హరః ।**
**ప్రోవాచోత్థాప్య హస్తాభ్యాం ప్రీతోఽస్మి తవ సామ్ప్రతమ్ ॥ 58 ॥**

అపుడు ప్రణతార్తిహరుడైన మహాదేవుడు బ్రహ్మను చేతులతో లేపి ఇపుడు నీకు ప్రసన్నుడనైనాను అని పలికినాడు.

**దత్త్వాఽస్మై పరమం యోగమైశ్వర్యమతులం మహత్ ।**
**ప్రోవాచాగ్రస్థితం రుద్రం నీలలోహితమీశ్వరమ్ ॥ 59 ॥**

అతనికి పరమయోగాన్ని, అతులమైన ఐశ్వర్యాన్ని ఇచ్చి ఎదుట నిల్చిన రుద్రుడు నీలలోహితుడు ఈశ్వరుణ్ణి గూర్చి ఇట్లన్నాడు.

**ఏష బ్రహ్మాఽస్య జగతః సమ్పూజ్యః ప్రథమః స్థితః ।**
**ఆత్మనా రక్షణీయస్తే గుణజ్యేష్ఠః పితా తవ ॥ 60 ॥**

ఈ బ్రహ్మ లోకానికి ప్రథమ పూజనీయుడు. నీ తండ్రి గుణజ్యేష్ఠుడు. ఆత్మతో నీకు రక్షింపతగినవాడు.

**అయం పురాణః పురుషో న హన్తవ్యస్త్వయాఽనఘ ।**
**స యోగైశ్వర్యమాహాత్మ్యాన్మామేవ శరణం గతః ॥ 61 ॥**

ఇతడు పురాణపురుషుడు, నీవు చంపకూడదు. ఇతడు యోగైశ్వర్యంతో నన్ను శరణు పొందినాడు.

**అయం చ యజ్ఞో గర్వోఽసౌ సగర్వో భవతాఽనఘ ।**
**శాసితవ్యో విరిఞ్చస్య ధారణీయం శిరస్త్వయా ॥ 62 ॥**

గర్వంతో ఉన్న ఈ యజ్ఞరూపుని నీవు శాసించాలి. నీవు బ్రహ్మశిరసును ధరించాలి.

**బ్రహ్మహత్యాఽపనోదార్థం వ్రతం లోకే ప్రదర్శయన్ ।**
**చరస్వ సతతం భిక్షాం సంస్థాపయ సురద్విజాన్ ॥ 63 ॥**

లోకంలో బ్రహ్మహత్య తొలగించుకోవటానికి ఆచరించాల్సిన వ్రతాన్ని చూపుతూ భిక్షాటనంచేయి. సురద్విజులను కాపాడు.

**ఇత్యేతదుక్త్వా వచనం భగవాన్ పరమేశ్వరః ।**
**స్థానం స్వాభావికం దివ్యం యయౌ తత్పరమం పదమ్ ॥ 64 ॥**

అని పలికి పరమేశ్వరుడు తన పరమపదానికి వెళ్ళినాడు.

**తతః స భగవానీశః కపర్దీ నీలలోహితః ।**
**గ్రాహయామాస వదనం బ్రహ్మణః కాలభైరవమ్ ॥ 65 ॥**

ఆ తర్వాత నీలలోహితుడైన రుద్రుడు కాలభైరవునితో బ్రహ్మశిరసును గ్రహింపచేశాడు.

**చర త్వం పాపనాశార్థం వ్రతం లోకే హితావహమ్ ।**
**కపాలహస్తో భగవాన్ భిక్షాం గృహ్ణాతు సర్వతః ॥ 66 ॥**

పాపనాశనం పొందుటకు నీవు హితం కలిగించే వ్రతాన్ని లోకంలో ఆచరించు. కపాలహస్తంతో అంతట భిక్షను స్వీకరించు.

**ఉక్త్వైవం ప్రాహిణోత్కన్యాం బ్రహ్మహత్యేతి విశ్రుతామ్ ।**
**దంష్ట్రాకరాళవదనాం జ్వాలామాలావిభూషణామ్ ॥ 67 ॥**

అని పలికి తర్వాత జ్వాలామాలావిభూషిత, దంష్ట్రాకరాల వదన, అయిన బ్రహ్మహత్య అనే కన్యను పంపాడు.

**యావద్వారాణసీం దివ్యాం పురీమేష గమిష్యతి ।**
**తావద్విభీషణాకారా హ్యనుగచ్ఛ త్రిశూలినమ్ ॥ 68 ॥**

ఇతడు వారాణసీపురం చేరేవరకు ఈ భయంకరాకారంతో ఈ త్రిశూలిని అనుసరించుమని పలికినాడు.

**ఏవమాభాష్య కాలాగ్నిం ప్రాహ లోకమహేశ్వరమ్ ।**
**అటస్వ లోకానఖిలాన్ భైక్షార్థీ మన్నియోగతః ॥ 69 ॥**

ఇలా చెప్పి కాలాగ్ని అయిన లోకమహేశ్వరునితో నాఆజ్ఞ ప్రకారం భిక్షకోరుతూ అన్నిలోకాలు సంచరించు.

**యదా ద్రక్ష్యసి దేవేశం నారాయణమనామయమ్ ।**
**తదాఽసౌ వక్ష్యతి స్పష్టముపాయం పాపశోధనమ్ ॥ 70 ॥**

అనామయుడైన నారాయణుని దర్శించినపుడు పాపం తొలగే ఉపాయాన్ని అతడు తెలుపుతాడు.

**స దేవదేవతావాక్యమాకర్ణ్య భగవాన్ హరః ।**
**కపాలపాణిర్విశ్వాత్మా చచార భువనత్రయమ్ ॥ 71 ॥**

ఇట్లు దేవదేవుని వాక్యాన్ని విన్న భగవానుడైన హరుడు బ్రహ్మకపాలాన్ని ధరించి విశ్వరూపుడై ముల్లోకాలు సంచరించినాడు.

**ఆస్థాయ వికృతం వేషం దీప్యమానం స్వతేజసా ।**
**శ్రీమత్పవిత్రం రుచిరం లోచనత్రయసంయుతమ్ ॥ 72 ॥**

**సహస్రసూర్యప్రతిమం సిద్ధైః ప్రమథపుఙ్గవైః ।**
**భాతి కాలాగ్నినయనో మహాదేవః సమావృతః ॥ 73 ॥**

వికృతవేషాన్ని ధరించి తన తేజస్సుతో ప్రకాశిస్తూ, మూడు కన్నులు గలిగి కోటిసూర్యసమకాంతి గల్గి, గర్వితులైన ప్రమథులతోకలిసి కాలాగ్నినయనుడైన మహాదేవుడు ప్రకాశిస్తున్నాడు.

**పీత్వా తదమృతం దివ్యమానన్దం పరమేష్ఠినః ।**
**లీలావిలాసబహులో లోకానాగచ్ఛదీశ్వరః ॥ 74 ॥**

పరబ్రహ్మానందరసామృతాన్ని పానంచేసి లీలావిలాసం కలవాడై ఈశ్వరుడు లోకుల వద్దకు వచ్చినాడు.

**తన్దృష్ట్వా కాలవదనం శఙ్కరం కాలభైరవమ్ ।**
**రూపలావణ్యసంపన్నం నారీకులమగాదను ॥ 75 ॥**

కాలవదనుడు, శంకరుడు, కాలభైరవుడయిన ఆ రూపలావణ్య సంపన్నుని చూచి యువతీ సమూహం వెంట వచ్చినది.

**గాయన్తి గీతైర్వివిధైర్నృత్యన్తి పురతః ప్రభోః ।**
**సస్మితం ప్రేక్ష్య వదనం చక్రుః భ్రూభఙ్గమేవ చ ॥ 76 ॥**

వారు గానం చేసినారు. స్వామి ముందు నాట్యమాడినారు. కాలభైరవుని దరహాసముఖాన్ని చూచి కనుబొమలతో హావభావాలు చూపసాగారు.

**స దేవదానవాదీనాం దేశానభ్యేత్య శూలధృక్ ।**
**జగామ విష్ణోర్భువనం యత్రాఽఽస్తే పురుషోత్తమః ॥ 77 ॥**

ఈ విధంగా తిరిగిన కాలభైరవుడు దేవదానవాదుల ప్రదేశాలు చుట్టి మధుసూదనుడు నివసించే భవనానికి బయలుదేరినాడు.

**సమ్ప్రాప్య దివ్యభవనం శఙ్కరో లోకశంకరః ।**
**సహైవ భూతప్రవరైః ప్రవేష్టుముపచక్రమే ॥ 78 ॥**

లోకశుభంకరుడైన శంకరుడు ఆ దివ్యభవనాన్ని చూచి ప్రమథగణాలతో పాటు భవనంలో ప్రవేశించుటకు ముందుకు సాగాడు.

**అవిజ్ఞాయ పరం భావం దివ్యం తత్పారమేశ్వరమ్ ।**
**న్యవారయత్త్రిశూలాఙ్కం ద్వారపాలో మహాబలః ॥ 79 ॥**

అతని దివ్యప్రభావం తెలియక మహాబలుడైన ద్వారపాలకుడు అతణ్ణి ప్రవేశించరాదని వారించినాడు.

**శఙ్ఖచక్రగదాపాణిః పీతవాసా మహాభుజః ।**
**విష్వక్సేన ఇతి ఖ్యాతో విష్ణోరంశసముద్భవః ॥ 80 ॥**

ఆతడే శంఖచక్రగదాపాణి, పీతాంబరధారి, మహాపరాక్రమశాలి, విష్ణ్వంశసంభూతుడైన విష్వక్సేనుడు.

**అథ తం శఙ్కరగణం యుయుధే విష్ణుసమ్భవః ।**
**భీషణో భైరవాదేశాత్కాలవేగ ఇతి స్మృతః ॥ 81 ॥**

విష్ణువు వలన పుట్టిన ఆ విష్వక్సేనుడు భైరవాదేశముతో యుద్ధమునకు తలపడిన కాలవేగమను పేరుగల శంకరగణముతో యుద్ధం చేశాడు.

**విజిత్య తం కాలవేగం క్రోధసంరక్తలోచనః ।**
**దుద్రువాభిముఖం రుద్రం చిక్షేప స సుదర్శనమ్ ॥ 82 ॥**

విష్వక్సేనుడు కాలవేగు నోడించి, క్రోధసంరక్తలోచనుడై రుద్రుని కభిముఖంగా నడచి భయంకరమైన సుదర్శన చక్రాన్ని ప్రయోగించినాడు.

**అథ దేవో మహాదేవస్త్రిపురారిస్త్రిశూలభృత్ ।**
**తమాపతన్తం సావజ్ఞమాలోకయదమిత్రజిత్ ॥ 83 ॥**

త్రిపురారి, త్రిశూలధారి, మహాదేవుడైన కాలభైరవుడు తనవైపే వస్తున్న సుదర్శనచక్రాన్ని నిరాదరంతో చూచినాడు.

**తదన్తరే మహద్భూతం యుగాన్తదహనోపమమ్ ।**
**శూలేనోరసి నిర్భిద్య పాతయామాస తం భువి ॥ 84 ॥**

యుగాంతాగ్నివంటి విష్వక్సేనుని వక్షఃస్థలంలో శూలంతో పొడిచి పడవేసినాడు.

**స శూలాభిహతోఽత్యర్థం త్యక్త్వా స్వం పరమం బలమ్ ।**
**తత్యాజ జీవితం దృష్ట్వా మృత్యుం వ్యాధి హతా ఇవ ॥ 85 ॥**

ఇట్లా శూలహతుడైన విష్వక్సేనుడు తన పరమ బలాన్ని పోగొట్టుకొని మృత్యువును చూచిన వ్యాధిగ్రస్తునివలె ప్రాణాలు విడచినాడు.

**నిహత్య విష్ణుపురుషం సార్ధం ప్రమథపుఙ్గవైః ।**
**వివేశ చాన్తరగృహం సమాదాయ కళేవరమ్ ॥ 86 ॥**

కాలభైరవుడిట్లా విష్వక్సేనుని చంపి అతని మృతదేహాన్ని తీసుకొని ప్రమథగణాలతో కూడ అభ్యంతర భవనంలో ప్రవేశించినాడు.

**వీక్ష్య తం జగతో హేతుమీశ్వరం భగవాన్హరిః ।**
**శిరం లలాటాత్సమ్భిద్య రక్తధారామపాతయత్ ॥ 87 ॥**

అట్లా వచ్చిన జగద్ధేతువు శంకరుని చూచి శ్రీవిష్ణువులలాటంనుండి శిరమును ఛేదించుకుని రక్తధార కురిపించి ఇట్లన్నాడు.

**గృహాణ భిక్షాం భగవన్ మదీయామమితద్యుతే ।**
**న విద్యతేఽన్యా హ్యుచితా తవ త్రిపురమర్దన ॥ 88 ॥**

అప్రమేయ తేజశ్శాలివైన భగవన్ నా యీ భిక్ష స్వీకరించు. త్రిపురమర్దనా! ఇక్కడ నీకు ఉచితమైన మరొక భిక్ష ఏదీలేదు.

**న సమ్పూర్ణం కపాలం తద్బ్రహ్మణః పరమేష్ఠినః ।**
**దివ్యవర్షసహస్రన్తు సా చ ధారా ప్రవాహితా ॥ 89 ॥**

శ్రీ విష్ణువులలాటంనుండి రక్తధార దివ్యవర్షసహస్రం ప్రవహించినది. అయినా బ్రహ్మకపాలం నిండలేదు.

**అథాబ్రవీత్కాలరుద్రం హరిర్నారాయణప్రభుః ।**
**సంస్తూయ వివిధైర్భావైర్బహుమానపురస్సరమ్ ॥ 90 ॥**

తర్వాత నారాయణుడు సగౌరవంగా వైదికమంత్రాలతో కాలరుద్రుని స్తుతించి ఇట్లన్నాడు.

**కిమర్థమేతద్వదనం బ్రహ్మణో భవతా ధృతమ్ ।**
**ప్రోవాచ వృత్తమఖిలం దేవదేవో మహేశ్వరః ॥ 91 ॥**

మీరీ బ్రహ్మకపాలాన్ని ఎందుకు ధరించినారు అని. దానికి కాలభైరవుడు జరిగిన వృత్తాంతాన్నంతా వివరించినాడు.

**సమాహూయ హృషీకేశో బ్రహ్మహత్యామథాచ్యుతః ।**
**ప్రార్థయామాస భగవాన్ విముఞ్చేతి త్రిశూలినమ్ ॥ 92 ॥**

హృషీకేశుడు బ్రహ్మహత్యను పిలిచి కాలభైరవుని విడువుమని కోరెను.

**న తత్యాజాథ సా పార్శ్వం వ్యాహృతాఽపి మురారిణా ।**
**చిరం ధ్యాత్వా జగద్యోనిం శఙ్కరం ప్రాహ సర్వవిత్ ॥ 93 ॥**

అయినా ఆ బ్రహ్మహత్య శంకరుని వీడలేదు. జగత్కారణుడు, సర్వజ్ఞుడు అయిన శ్రీ మహావిష్ణువు చాలసేపు ధ్యానించి శంకరునితో ఇట్లన్నాడు-

**వ్రజస్వ దివ్యాం భగవన్పురీం వారాణసీం శుభామ్ ।**
**యత్రాఖిలజగద్దోషాన్ క్షిప్రం నాశయతీశ్వరః ॥ 94 ॥**

భగవన్! కాలభైరవ! సకలదోషాలను శంకరుడు త్వరగా నశింపచేసే వారాణసీపురానికి వెళ్ళు.

**తతః సర్వాణి భూతాని తీర్థాన్యాయతనాని చ ।**
**జగామ లీలయా దేవో లోకానాం హితకామ్యయా ॥ 95 ॥**

తర్వాత కాలభైరవుడు రహస్యాలు పరమపవిత్రాలైన పుణ్యతీర్థాలను క్షేత్రాలను లోకాల హితం కోరి సంచరించినాడు.

**సంస్తూయమానః ప్రమథైర్మహాయోగైరితస్తతః ।**
**నృత్యమానో మహాయోగీ హస్తన్యస్తకలేవరః ॥ 96 ॥**

చేతిలో కపాలాన్ని ధరించి నాట్యం చేస్తూ మహాయోగులైన ప్రమథులు స్తుతించగా తిరుగాడినాడు.

**తమభ్యధావద్భగవాన్హరిర్నారాయణః ప్రభుః ।**
**సమాస్థాయ పరం రూపం నృత్యదర్శనలాలసః ॥ 97 ॥**

కాలభైరవుని నృత్యాన్ని చూడగోరి శ్రీహరి మరోరూపాన్ని ధరించి అతని వెంట నడచినాడు.

**నిరీక్షమాణో గోవిన్దం వృషేన్ద్రాఙ్కితశాసనః ।**
**సస్మయోఽనన్తయోగాత్మా నృత్యతి స్మ పునః పునః ॥ 98 ॥**

యోగరూపుడైన వృషధ్వజుడగు కాలభైరవుడు గోవిందుని చూచి ప్రసన్నుడై చిరునవ్వుతో మాటి మాటికి నృత్యం చేసినాడు.

**అనుచానుచరో రుద్రం స హరిర్ధర్మవాహనః ।**
**భేజే మహాదేవపురీం వారాణసీతి విశ్రుతామ్ ॥ 99 ॥**

తర్వాత శ్రీహరితో అనుచరులైన ప్రమథులతో కూడి వృషభవాహనుడైన కాలభైరవుడు వారణాసి అనే మహాదేవుని పురాన్ని చేరుకున్నాడు.

**ప్రవిష్టమాత్రే విశ్వేశే బ్రహ్మహత్యా కపర్దిని ।**
**హా హేత్యుక్త్వా సనాదం వై పాతాళం ప్రాపదుఃఖితా ॥ 100 ॥**

ఈ విధంగా కాలభైరవుడు వారణాసిలో ప్రవేశించినంతలోనే హాహా అని పెద్దగా అరుస్తూ దుఃఖితురాలై బ్రహ్మహత్య పాతాళంలో ప్రవేశించింది.

**ప్రవిశ్య పరమం స్థానం కపాలం బ్రహ్మణో హరః ।**
**గణానామగ్రతో దేవః స్థాపయామాస శఙ్కరః ॥ 101 ॥**

తర్వాత కాలభైరవుడు ఉత్తమస్థానంలో చేరి ప్రమథగణాలు చూస్తుండగా వారి ముందు బ్రహ్మకపాలాన్ని ప్రతిష్ఠించినాడు.

**స్థాపయిత్వా మహాదేవో దదౌ తచ్చ కళేవరమ్ ।**
**ఉక్త్వా సజీవమస్త్వితి విష్ణవేఽసౌ ఘృణానిధిః ॥ 102 ॥**

ఈ విధంగా బ్రహ్మకపాలాన్ని ప్రతిష్ఠించి విష్వక్సేనుని మృతదేహాన్ని జీవించుగాక! అని పలికి శ్రీమహావిష్ణువునకిచ్చినాడు.

**యే స్మరన్తి మమాజస్రం కపాలం వేషముత్తమమ్ ।**
**తేషాం వినశ్యతి క్షిప్రం ఇహాముత్ర చ పాతకమ్ ॥ 103 ॥**

నాకపాలధారి రూపాన్ని స్మరించిన వారికి ఇహపరాలల్లో పాపాలన్నీ నశిస్తాయి.

**ఆగమ్య తీర్థప్రవరే స్నానం కృత్వా విధానతః ।**
**తర్పయిత్వా పితౄన్దేవాన్ ముచ్యతే బ్రహ్మహత్యయా ॥ 104 ॥**

ఈ కపాలతీర్థానికి వచ్చి, యథావిధిస్నానంచేసి, దేవపితృదేవులను తృప్తిపరచినవారు బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టుకొంటారు.

**అశాశ్వతం జగద్జ్ఞాత్వా వ్రజధ్వం పరమాం పురీమ్ ।**
**దేహాన్తే తత్పరం జ్ఞానం దదాతి పరమం పదమ్ ॥ 105 ॥**

ఈ జగత్తు అశాశ్వతమని తెలుసుకొని ఈ క్షేత్రంలో నివసించినవారు పరమజ్ఞానాన్ని పొంది, దేహావసానంలో పరమపదాన్ని నావల్ల పొందుతారు.

**ఇతీదముక్త్వా భగవాన్ సమాలిజ్గ్య జనార్దనమ్ ।**
**సహైవ ప్రమథేశానైః క్షణాదన్తరధీయత ॥ 106 ॥**

ఇలా పలికి కాలభైరవుడు జనార్దనుని కౌగిలించుకుని, ప్రమథగణంతో తత్క్షణమే అంతర్ధానమైనాడు.

**స లబ్ధ్వా భగవాన్ కృష్ణో విష్వక్సేనం త్రిశూలినః ।**
**స్వం దేశమగమత్తూష్ణీం గృహీత్వా పరమం బుధః ॥ 107 ॥**

ఇలా శ్రీహరి కాలభైరవునినుంచి విష్వక్సేనుని పొంది, తన పరమరూపాన్ని ధరించి తన లోకానికి చేరుకున్నాడు.

**ఏతద్వః కథితం పుణ్యం మహాపాతకనాశనమ్ ।**
**కపాలమోచనం తీర్థం స్థాణోః ప్రియకరం శుభమ్ ॥ 108 ॥**

ఇది శంకరునికి ప్రీతికరము. సకల పాపనాశకము. పరమపావనమైన కపాలమోచనతీర్థాన్ని గూర్చి మీకు వివరించినాను.

**య ఇమం పఠతేఽధ్యాయం బ్రాహ్మణానాం సమీపతః ।**
**మానసైర్వాచికైః పాపైః కాయికైశ్చ విముచ్యతే ॥ 109 ॥**

ఈ అధ్యాయాన్ని బ్రాహ్మణుల సమీపంలో చదివినవారికి కాయిక, వాచిక, మానసిక పాపాలన్నీ తొలగి పోతాయి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే కపాలమోచనమాహాత్మ్యం నామ ఏకత్రింశోఽధ్యాయః ॥ 31 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో కపాలమోచన మాహాత్మ్యమనే ముప్పది ఒకటవ అధ్యాయం ॥ 31 ॥



## ద్వాత్రింశోఽధ్యాయః - ముప్పై రెండవ అధ్యాయం

## ప్రాయశ్చిత్తప్రకరణమ్ - ప్రాయశ్చిత్తప్రకరణం

**వ్యాస ఉవాచ :-**వ్యాసమహర్షి చెప్పాడు

**సురాపస్తు సురాం తప్తామగ్నివర్ణాం పిబేత్తదా ।**
**నిర్దగ్ధకాయః స తయా ముచ్యతే చ ద్విజోత్తమః ॥ 1 ॥**

మద్యపానం చేసిన బ్రాహ్మణుడు ఆ మద్యాన్ని అగ్నితో కాచి అగ్నివర్ణం పొందేట్టు చేసి త్రాగాలి. ఆ సురతో శరీరం కాలినట్లైతే సురాపానపాపం శమిస్తుంది.

**గోమూత్రమగ్నివర్ణం వా గోశకృద్రసమేవ వా ।**
**పయోఘృతం జలం వాఽథ ముచ్యతే పాతకాత్తతః ॥ 2 ॥**

గోమూత్రాన్నికాని గోమయరసాన్నికాని అగ్నివర్ణం కావించి త్రాగాలి. లేదా పాలు నెయ్యి నీరు బాగా కాచి త్రాగాలి. దాంతో ఆ పాపం తొలగుతుంది.

**జలార్ద్రవాసాః ప్రయతో ధ్యాత్వా నారాయణం హరిమ్ ।**
**బ్రహ్మహత్యావ్రతం చాథ చరేత్పాపప్రశాన్తయే ॥ 3 ॥**

తడి బట్టలతో నియమంగా శ్రీమన్నారాయణుని ధ్యానించి బ్రహ్మహత్యావ్రతాన్ని ఆచరిస్తే సురాపానం వల్ల కల్గిన పాపం తొలగుతుంది.

**సువర్ణస్తేయకృద్విప్రో రాజానమభిగమ్య తు ।**
**స్వకర్మ ఖ్యాపయన్ బ్రూయాన్మా భవాననుశాస్త్వితి ॥ 4 ॥**

బంగారాన్ని దొంగిలించిన బ్రాహ్మణుడు రాజువద్దకు వెళ్ళి తాను చేసిన దాన్ని తెల్పి నన్ను శిక్షించండి అని అడుగాలి.

**గృహీత్వా ముసలం రాజా సకృద్ధన్యాత్తు తం స్వయమ్ ।**
**వధే తు శుధ్యతే స్తేనో బ్రాహ్మణస్తపసాఽథవా ॥ 5 ॥**

రాజు రోకలితీసుకొని ఒకసారి కొట్టాలి. ఆదెబ్బతో అతడు మరణిస్తే ఆ పాపం పోతుంది లేదా తపస్సు చేసినా ఆ పాపం పోతుంది.

**స్కన్ధేనాఽఽదాయ ముసలం లగుడం వాఽపి ఖాదిరమ్ ।**
**శక్తిం చాఽఽదాయ తీక్ష్ణాగ్రామాయసం దణ్డమేవ వా ॥ 6 ॥**

**రాజా తేన చ గన్తవ్యో ముక్తకేశేన ధావతా ।**
**ఆచక్షాణేన తత్పాపమేతత్కర్మాస్మి శాధి మామ్ ॥ 7 ॥**

రోకలిని కాని, చంద్ర కర్రను, రెండువైపుల అంచుకల ఖడ్గాన్ని కాని, ఇనుపదండాన్ని కాని ధరించి జుట్టు విరబోసుకొని రాజువద్దకు వెళ్ళాలి. నే నీ తప్పు చేసినాను, నన్ను దండించండి అని చెప్పాలి.

**శాసనాద్వా విమోక్షాద్వా స్తేనః స్తేయాద్విముచ్యతే ।**
**అశాసిత్వా తు తం రాజా స్తేనస్యాऽऽప్నోతి కిల్బిషమ్ ॥ 8 ॥**

రాజు దండం వల్ల లేదా శరీరత్యాగంవల్ల ఆ పాపం తొలగిపోతుంది. ఒక వేళ రాజు శాసించక పోతే ఆ పాపం రాజు పొందుతాడు.

**తపసాऽపనోత్తుమిచ్ఛంస్తు సువర్ణస్తేయజం మలమ్ ।**
**చీరవాసా ద్విజోऽరణ్యే చరేద్ బ్రహ్మహణో వనమ్ ॥ 9 ॥**

స్వర్ణస్తేయ పాపాన్ని తపసుతో తొలగింప దలచు కుంటే నారవస్త్రాలు ధరించి అరణ్యానికి వెళ్ళి బ్రహ్మహత్యా వ్రతమాచరించాలి.

**స్నాత్వాऽశ్వమేధావభృథే పూతః స్యాదథవా ద్విజః ।**
**ప్రదద్యాద్వాऽథ విప్రేభ్యః స్వాత్మతుల్యం హిరణ్యకమ్ ॥ 10 ॥**

అశ్వమేధావభృథంలో స్నానం చేసినా బ్రాహ్మణుడు పరిశుద్ధుడవుతాడు. లేదా తనంత బరువు బంగారాన్ని బ్రాహ్మణులకు దానం చేయాలి.

**చరేద్వా వత్సరం కృచ్ఛ్రం బ్రహ్మచర్యపరాయణః ।**
**బ్రాహ్మణః స్వర్ణహారీ తు తత్పాపస్యాపనుత్తయే ॥ 11 ॥**

లేదా బ్రహ్మచర్యంతో సంవత్సరకాలం కృచ్ఛ్రవ్రతాన్ని ఆచరించాలి. స్వర్ణాన్ని దొంగిలించిన బ్రాహ్మణుడు ఆ పాపం తొలగటానికి పైవిధంగా నడచుకోవాలి.

**గురోర్భార్యాం సమారుహ్య బ్రాహ్మణః కామమోహితః ।**
**అవగూహేత్ స్త్రియం తప్తాం దీప్తాం కార్ష్ణాయసీం కృతామ్ ॥ 12 ॥**

కామమోహితుడైన బ్రాహ్మణుడు గురు భార్యా సంగమం చేస్తే నల్లని ఉక్కు స్త్రీ విగ్రహాన్ని బాగా కాల్చి ఆలింగనం చేసుకోవాలి.

**స్వయం వా శిశ్నవృషణావుత్కృత్యాధాయ చాఞ్జలౌ ।**
**అభిగచ్ఛేద్దక్షిణాశామానిపాతాదజిహ్మగః ॥ 13 ॥**

లేదా శిశ్నవృషణాలను కోసి దోసిట పట్టుకుని ప్రాణాలు పోయేదాకా దక్షిణదిక్కు నడవాలి.

**గుర్వఙ్గనాగమః శుద్ధ్యై చరేద్బ్రహ్మహణో వ్రతమ్ ।**
**శాఖాం వా కణ్టకోపేతాం పరిష్వజ్యాథ వత్సరమ్ ॥ 14 ॥**

**అధః శయీత నియతో ముచ్యతే గురుతల్పగః ।**
**కృచ్ఛ్రం వాఽబ్దం చరేద్విప్రశ్చీరవాసాః సమాహితః ॥ 15 ॥**

గురు భార్యాగమనం చేసే శుద్ధికొరకు బ్రహ్మహత్యా వ్రతాన్ని ఆచరించి శుద్ధినందుతాడు. లేదా ముళ్ళున్న చెట్టు కొమ్మను ఒక సంవత్సరం ఆలింగనం చేసుకొని భూమిపై పరుండాలి. నారవస్త్రాలు ధరించి నియతమనస్కుడై సంవత్సరకాలం కృచ్ఛ్రవ్రతాన్ని ఆచరించాలి.

**అశ్వమేధావభృథకే స్నాత్వా వా శుద్ధ్యతే ద్విజః ।**
**కాలేఽష్టమే వా భుఞ్జానో బ్రహ్మచారీ సదా వ్రతీ ॥ 16 ॥**

**స్థానాశనాభ్యాం విహరంస్త్రిరహ్నోఽభ్యుపయత్నతః ।**
**అధఃశాయీ త్రిభిర్వర్షైస్తద్వ్యపోహతి పాతకమ్ ॥ 17 ॥**

అశ్వమేధావభృథం స్నానం చేసినా పరిశుద్ధుడవుతాడు. లేదా బ్రహ్మచర్యవ్రతాన్నాచరిస్తూ ప్రతినాలుగు దినాలకు ఒక సాయంకాలం భుజిస్తూ మూడు రోజులు ఒకే ప్రదేశంలో కూర్చుని ఒకే ఆసనంపై ఉండి జలంమాత్రం త్రాగుతూ మూడుసంవత్సరాలు నేలపై పడుకొన్నా పరిశుద్ధుడవుతాడు.

**చాన్ద్రాయణాని వా కుర్యాత్పఞ్చ చత్వారి వా పునః ।**
**పతితైః సంప్రయుక్తాత్మా అథ వక్ష్యామి నిష్కృతిమ్ ॥ 18 ॥**

లేదా నాలుగు అయిదు చాంద్రాయణవ్రతాలు ఆచరించాలి. ఇక పతితుల సహవాసికి ప్రాయశ్చిత్తం చెపుతాను.

**పతితేన తు సంసర్గం యో యేన కురుతే ద్విజః ।**
**స తత్పాపాపనోదార్థం తస్యైవ వ్రతమాచరేత్ ॥ 19 ॥**

పతితునితో సంబంధం ఉన్న బ్రాహ్మణుడు (ద్విజుడు) ఆ పతితులాచరించే వ్రతాన్నే ఆచరించాలి.

**తప్తకృచ్ఛ్రం చరేద్వాఽథ సంవత్సరమతన్ద్రితః ।**
**షాణ్మాసికే తు సంసర్గే ప్రాయశ్చిత్తార్ధమాచరేత్ ॥ 20 ॥**

లేదా ఒకసంవత్సరం తప్తకృచ్ఛ్ర వ్రతమాచరించాలి. ఆరునెలలు కలిసుంటే పైప్రాయశ్చిత్తాన్ని సగం ఆచరించాలి.

**ఏభి(ర్వతైర్వ్యపోహన్తి మహాపాతకినో ఫలమ్ ।**
**పుణ్యతీర్థాభిగమనాత్ పృథివ్యాం వాఽథ నిష్కృతిః ॥ 21 ॥**

ఈ వ్రతాలతో మహాపాతకులు కూడా పాప విముక్తులౌతారు. లేదా తీర్థయాత్రలు కావించినా పరిశుద్ధు లవుతారు.

**బ్రహ్మహత్యాం సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమమ్ ।**
**కృత్వా తైశ్చాపి సంసర్గం బ్రాహ్మణః కామచారతః ॥ 22 ॥**

**కుర్యాదనశనం విప్రః పునస్తీర్థే సమాహితః ।**
**జ్వలన్తం వా విశేదగ్నిం ధ్యాత్వా దేవం కపర్దినమ్ ॥ 23 ॥**

**న హ్యన్యా నిష్కృతిర్దృష్టా మునిభిర్ధర్మవాదిభిః ।**
**తస్మాత్ పుణ్యేషు తీర్థేషు దహేద్వాఽపి స్వదేహకమ్ ॥ 24 ॥**

బ్రహ్మహత్య, సురాపానం, స్తేయం, గుర్వంగనాగమనం మొదలైన పాపాలు ఆచరించినవారితో కలిసి ఉన్నవాడు కూడ పుణ్యతీర్థాల్లో నియమబద్ధుడై ఉపవాసం ఉండాలి. కపర్దిని ధ్యానిస్తూ అగ్నిలో ప్రవేశించాలి. ఇంతకన్నా వేరునిష్కృతి ధర్మవాదులైన ఋషులు తెలుపలేదు. అందువల్ల పుణ్యతీర్థాల్లో స్వదేహాన్ని దహింపచేసుకోవాలి.

**గత్వా దుహితరం విప్రః స్వసారం వా స్నుషామపి ।**
**ప్రవిశేజ్జ్వలనం దీప్తం మతిపూర్వమితి స్థితిః ॥ 25 ॥**

బుద్ధిపూర్వకంగా కన్నకూతురుని, చెల్లెలిని, కోడలిని సంగమిస్తే విప్రుడు బుద్ధిపూర్వకంగా అగ్నిప్రవేశం చేయాలి.

**మాతృష్వసాం మాతులానీం తథైవ చ పితృష్వసామ్ ।**
**భాగినేయీం సమారుహ్య కుర్యాత్ కృచ్ఛ్రాతికృచ్ఛ్రకౌ ॥ 26 ॥**

పినతల్లిని, మేనమామ భార్యని, మేనత్తని, మేనకోడలితోనూ రమిస్తే కృచ్ఛ్ర, అతికృచ్ఛ్రవ్రతాల నాచరించాలి.

**చాన్ద్రాయణఞ్చ కుర్వీత తస్య పాపస్య శాన్తయే ।**
**ధ్యాయన్దేవం జగద్యోనిమనాదినిధనం పరమ్ ॥ 27 ॥**

లేదా చాంద్రాయణవ్రతం ఆచరించాలి. ఆ పాపశాన్తి కొరకు వ్రతాచరణసమయంలో జగత్కారణుడు అనాదినిధనుడైన పరమాత్మను ధ్యానించాలి.

**భ్రాతృభార్యాం సమారుహ్య కుర్యాత్ తత్పాపశాన్తయే ।**
**చాన్ద్రాయణాని చత్వారి పఞ్చ వా సుసమాహితః ॥ 28 ॥**

సోదరుని భార్యతో రమిస్తే నాలుగు లేదా ఐదు చాంద్రాయణవ్రతాలు చేయాలి.

**పైతృష్వస్రేయీాం గత్వా తు స్వస్రేయాం మాతురేవ చ ।**
**మాతులస్య సుతాం వాఽపి గత్వా చాన్ద్రాయణం చరేత్ ॥ 29 ॥**

మేనత్తకూతురుతోకాని, తల్లి సోదరి కూతురుతోకాని సంభోగిస్తే అదేవిధంగా మేనమామ కూతురుతో సంభోగించినా చాంద్రాయణవవ్రతం ఆచరించాల్సిందే.

**సఖి భార్యాం సమారుహ్య గత్వా శ్యాలీం తథైవ చ ।**
**అహెూరాత్రోషితో భూత్వా తప్తకృచ్ఛ్రం సమాచరేత్ ॥ 30 ॥**

మిత్రుని భార్యను కాని, భార్య చెల్లెల్ని కాని భోగిస్తే ఒకదినం ఉపవాసముండి తప్తకృచ్ఛ్రవ్రతం ఆచరించాలి.

**ఉదక్యాగమనే విప్రస్త్రిరాత్రేణ విశుధ్యతి ।**
**చాండాలీగమనే చైవ తప్త కృచ్ఛ్రత్రయం విదుః ॥**
**సహసాతపనే నాస్య నాన్యథా నిష్కృతిః స్మృతా ॥ 31 ॥**

రజస్వల స్త్రీతో రమించినా మూడురాత్రులు ఉపవాసం చేస్తే పవిత్రుడు అవుతాడు. చండాలస్త్రీతో సంపర్కం చేస్తే మూడు కృచ్ఛ్రాలని చెయ్యాలి. లేదా సాంతపనవ్రతం చెయ్యాలి. ఇంతకన్న వేరొక విధంగా విముక్తి జరుగదు.

**మాతృగోత్రాం సమారుహ్య సమానప్రవరాం తథా ॥ 32 ॥**
**చాన్ద్రాయణేన శుధ్యేత ప్రయతాత్మా సమాహితః ।**
**బ్రాహ్మణీం దూషయిత్వా తు చరేచ్చాంద్రాయణవ్రతమ్ ॥ 33 ॥**

మాతృగోత్రస్త్రీని, సమానప్రవరగల స్త్రీనికాని పొందితే సావధానమనసుతో ఇన్ద్రియనిగ్రహం కలవాడై చాంద్రాయణవవ్రతం ఆచరిస్తే శుద్ధుడవుతాడు.

**కన్యకాం దూషయిత్వా తు చరేచ్చాంద్రాయణ వ్రతమ్ ।**
**అమానుషీషు పురుష ఉదక్యాయామయోనిషు ॥**
**రేతః సిక్త్వా జలే చైవ కృచ్ఛ్రం సాంతపనం చరేత్ ॥ 34 ॥**

బ్రాహ్మణుడు అగమ్య అయిన బ్రాహ్మణస్త్రీని పొందితే ఒక కృచ్ఛ్రవ్రతం ఆచరించాలి. కన్యను చెరిస్తే చాంద్రాయణవ్రతం, మానవేతరస్త్రీలతో, రజస్వలాస్త్రీలతో, యోనిభిన్నంలో, జలంలో, రేతస్సేచనం జరిపితే కృచ్ఛ్రసాంతపన మాచరించాలి.

**బంధకీగమనే విప్రః త్రిరాత్రేణ విశుధ్యతి ।**
**గవి మైథునమాసేవ్య చరేచ్చాంద్రాయణవ్రతమ్ ॥ 35 ॥**

**అజావీ మైథునం కృత్వా ప్రాజాపత్యం చరేద్ద్విజః ।**
**పతితాఽఇ్చ స్త్రియం గత్వా త్రిభిః కృచ్ఛ్రైర్విశుధ్యతి ॥ 36 ॥**

**పుల్కసీగమనే చైవ కృచ్ఛ్రం చాన్ద్రాయణం చరేత్ ।**
**నటీం శైలూషకీం చైవ రజకీం వేణుజీవినీమ్ ॥ 37 ॥**

**గత్వా చాన్ద్రాయణం కుర్యాత్ తథా చర్మోపజీవినీమ్ ।**

వేశ్యా సంగమానికి మూడు రాత్రులు తర్వాత శుద్ధి. గోవునందు మైథునానికి చాంద్రాయణవ్రతం, గొఱ్ఱె మేక మొదలైన జంతువులతో సంగమిస్తే ప్రాజాపత్యం, పుల్కసీ సంభోగానికి కృచ్ఛ్రచాంద్రాయణం, నటి, నర్తకి, రజకి, (చాకలి) వెదురుచర్మంతో జీవించే స్త్రీలసంగమానికి చాంద్రాయణవ్రతం ఆచరించాలి.

**బ్రహ్మచారీ స్త్రియం గచ్ఛేత్ కథంచిత్కామమోహితః ॥**
**సప్తాగారం చరేత్ భైక్షం వసిత్వా గర్దభాజినమ్ ॥ 38 ॥**

బ్రహ్మచారి స్త్రీతో రమిస్తే గాడిద చర్మాన్ని దాల్చి ఏడిండ్లలో భిక్షాటన చేయాలి.

**ఉపస్పృశేత్ త్రిషవణం స్వపాపం పరికీర్తయన్ ।**
**సంవత్సరేణ చైకేన తస్మాత్పాపాత్ ప్రముచ్యతే ॥ 39 ॥**

**బ్రహ్మహత్యా వ్రతం వాఽపి షణ్మాసానాచరే ద్యమీ ।**
**ముచ్యతే హ్యవకీర్ణీ తు బ్రాహ్మణానుమతే స్థితః ॥ 40 ॥**

తాను చేసిన పాపాన్ని తెలుపుతూ మూడు పూటల స్నానం చేయాలి. ఒకసంవత్సరానికి శుద్ధుడవుతాడు. బ్రహ్మచర్యవ్రతానికి భంగం కలిగించినవాడు బ్రాహ్మణులయొక్క అనుమతిని పొంది ఆరునెలలపాటు బ్రహ్మహత్యా వ్రతాన్ని ఆచరించితే ఆ పాపం నుండి విముక్తుడు అవుతాడు. ఆరుమాసాలు బ్రహ్మహత్యావ్రతం ఆచరించాలి.

**సప్తరాత్రమకృత్వా తు భైక్ష్యచర్యాగ్నిపూజనమ్ ।**
**రేతసశ్చ సముత్సర్గే ప్రాయశ్చిత్తం సమాచరేత్ ॥ 41 ॥**

**ఓఙ్కారపూర్వికాభిస్తు మహావ్యాహృతిభి స్సదా ।**
**సంవత్సరన్తు భుఞ్జానో నక్తం భిక్షాశనః శుచిః ॥ 42 ॥**

సామర్థ్యమున్నా ఏడుదినాలు భిక్షాచరణం అగ్నిపూజ చేయని బ్రహ్మచారి, బుద్ధిపూర్వకంగా రేతస్సేచనం. గావించినవాడు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. నదీ తీరాల్లో పుణ్యతీర్థాల్లో ఒక సంవత్సరం శాంతచిత్తుడై పవిత్రుడై ప్రణవ వ్యాహృతులతో గాయత్రిని జపిస్తూ భిక్షాన్నాన్ని రాత్రిమాత్రమే భుజిస్తూ పరిశుద్ధుడు కావాలి.

**సావిత్రీం చ జపేచ్చైవ నిత్యం క్రోధవివర్జితః ।**
**నదీతీరేషు తీర్థేషు తస్మాత్ పాపాద్విముచ్యతే ॥ 43 ॥**

**హత్వా తు క్షత్రియం విప్రః కుర్యాత్ బ్రహ్మహణో వ్రతమ్ ।**
**అకామతో వై షణ్మాసాన్ దద్యాత్పఞ్చశతం గవామ్ ॥ 44 ॥**

**అబ్దం చరేత నియతో వనవాసీ సమాహితః ।**
**ప్రాజాపత్యం సాంతపనం తప్తకృచ్ఛ్రం తు వా స్వయమ్ ॥ 45 ॥**

క్షత్రియుని చంపిన బ్రాహ్మణుడు బ్రహ్మహత్యా వ్రతం చేయాలి. చంపాలని సంకల్పం లేకుండా చంపితే ఐదునూర్ల గోవులను దానమీయాలి. అడవిలో ఉంటూ నియమంతో స్థిరచిత్తుడై ఒకసంవత్సరం ప్రాజాపత్యం కాని, తప్తకృచ్ఛ్రంకాని, సాంతపనవ్రతంకాని చేయాలి.

**ప్రమాప్యాకామతో వైశ్యం కుర్యాత్ సంవత్సరద్వయమ్ ।**
**గోసహస్రం సపాదఞ్చ దద్యాత్ బ్రహ్మహణో వ్రతమ్ ॥ 46 ॥**

**కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ వా కుర్యా చ్చాన్ద్రాయణ మథాపి వా ।**
**సంవత్సరం వ్రతం కుర్యా చ్ఛూద్రం హత్వా ప్రమాదతః ॥ 47 ॥**

అనుకోకుండా వైశ్యుని చంపితే రెండుసంవత్సరాలు బ్రహ్మహత్యా వ్రతమాచరించాలి. వేయి రెండునూర్ల ఏబది గోవులను దానమీయాలి. కృచ్ఛ్రాతికృచ్ఛ్ర వ్రతాలనుకాని, చాంద్రాయణ వ్రతంకాని ఆచరించాలి. పొరపాటువల్ల శూద్రుని చంపితే ఒక ఏడు బ్రహ్మహత్యా వ్రతం చేయాలి.

**అష్టౌ వర్షాణి షట్ త్రీణి కుర్యాత్ బ్రహ్మహణో వ్రతమ్ ।**
**హత్వా తు క్షత్రియం వైశ్యం శూద్రం చైవ యథాక్రమమ్ ॥ 48 ॥**

**రాజన్యాం వర్ష షట్కన్తు వైశ్యాం సంవత్సరత్రయమ్ ।**
**వత్సరేణ విశుద్ధ్యేత శూద్రాం హత్వా ద్విజోత్తమః ॥ 49 ॥**

బుద్ధిపూర్వకంగా క్షత్రియుని చంపితే ఎనిమిదేండ్లు, వైశ్యుని చంపితే ఆరేండ్లు, శూద్రుని చంపితే మూడేండ్లు బ్రహ్మహత్యా వ్రతం ఆచరించాలి. ఇదే నియమం బ్రాహ్మణక్షత్రియవైశ్య స్త్రీలను చంపినా వర్తిస్తుంది. శూద్ర స్త్రీని చంపితే ఒక సంవత్సరం వ్రతంతో శుద్ధుడవుతాడు.

**అన్త్యజానాం వధే చైవ కుర్యాచ్చాన్ద్రాయణం వ్రతమ్ ।**
**పరాకేణాథవా శుద్ధిరిత్యాహ భగవానజః ॥**
**మణ్డూకం నకులఞ్కాకం బిడాలం ఖరమూషకౌ॥ 50 ॥**

**శ్వానం హత్వా ద్విజః కుర్యాత్ షోడశాంశం వ్రతం తతః ।**
**పయః పిబేత్ త్రిరాత్రన్తు శ్వానం హత్వా సుయన్త్రితః ॥ 51 ॥**

**మార్జారం వాఽథ నకులం యోజనం వాఽధ్వనో వ్రజేత్ ।**
**కృచ్ఛ్రం ద్వాదశరాత్రన్తు కుర్యాదశ్వవధే ద్విజః ॥ 52 ॥**

అంత్యజులను చంపితే చాంద్రాయణవ్రతం లేదా పరాకవ్రతంతో శుద్ధి అని బ్రహ్మ తెలిపినాడు. కప్పను ముంగిసను, కాకిని, సర్పం, ఎలుక కుక్కలను చంపితే బ్రాహ్మణుడు పైవ్రతాల్లో పదునారోవంతు ఆచరించాలి. కుక్కను చంపితే సావధానంగా రాత్రి పాలు మాత్రం త్రాగుతూ మూడు దినాలుండాలి. పిల్లిని ముంగిసను చంపితే ఎనిమిదిమైళ్ళు ఆహారంలేకుండా నడవాలి. అశ్వాన్ని వధిస్తే పండ్రెండు రాత్రులు కృచ్ఛ్రవ్రతం ఆచరించాలి.

**అభ్రీం కార్ష్ణాయసీం దద్యాత్ సర్పం హత్వా ద్విజోత్తమః ।**
**పలాలభారం షణ్ఢం చ సైసకం చైకమాషకమ్ ॥ 53 ॥**

బ్రాహ్మణుడు సర్పాన్ని వధిస్తే నల్లని ఉక్కుతో చేసిన వాడి మొనగల దండాన్ని దానం చేయాలి. షణ్డుని చంపితే పలాలం బరువు గలదిగాని ఒకమాషప్రమాణంగాని గల సీసాన్ని దానం చెయ్యాలి.

**ఘృతకుమ్భం వరాహఞ్చ తిలద్రోణం చ తిత్తిరమ్ ।**
**శుకం ద్విహాయనం వత్సం క్రౌంచం హత్వా త్రిహాయనమ్ ॥ 54 ॥**

**హత్వా హంసం బలాకాఞ్చ బకం బర్హిణమేవ చ ।**
**వానరం శ్యేనభాసౌ చ స్పర్శయేత్ బ్రాహ్మణాయ గామ్ ॥ 55 ॥**

వరాహాన్ని వధిస్తే ఘృతకుంభాన్ని, తిత్తిరి పక్షిని చంపితే ఒక పుట్టి నువ్వులను, శుకాన్ని చంపితే రెండు సంవత్సరాల ఆవుదూడను, కొంగను చంపితే మూడు సంవత్సరాల ఆవుదూడను, హంసనుకాని బలాక పక్షిని కాని (కొంగ), నెమలిని కాని వానరాన్ని డేగను భాసాన్ని వధిస్తే బ్రాహ్మణునకు గోదానమీయాలి. మాంసాహారులైన ఆరణ్యకమృగాలను వధిస్తే పాలిచ్చే ఆవును దానమీయాలి.

**క్రవ్యాదాంస్తు మృగాన్ హత్వా ధేనుం దద్యాత్పయస్వినీమ్ ।**
**అక్రవ్యాదాన్ వత్సతరీముష్ట్రం హత్వా తు కృష్ణలమ్ ॥ 56 ॥**

మాంసాహారులుకాని మృగాలను వధిస్తే ఆవుదూడను దానమీయాలి. ఒంటెను చంపితే ఒక తులం బంగారాన్ని దానమీయాలి.

**కిఞ్చిదేవ తం విప్రాయ దద్యాదస్థిమతాం వధే ।**
**అనస్థ్నాం చైవ హింసాయాం ప్రాణాయామేన శుధ్యతి ॥ 57 ॥**

ఎముకలున్న వాటిని చంపితే బ్రాహ్మణునికి ఎంతో కొంత దానం చేయాలి. ఎముకలు లేని వాటిని చంపితే ప్రాణాయామంతో శుద్ధి.

**ఫలదానాన్తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్శతమ్ ।**
**గుల్మవల్లీలతానాన్తు పుష్పితానాం చ వీరుధామ్ ॥ 58 ॥**

**అన్యేషాం చైవ వృక్షాణాం సరసానాం చ సర్వశః ।**
**ఫలపుష్పోద్భవానాఞ్చ ఘృతప్రాశో విశోధనమ్ ॥ 59 ॥**

పండ్లనిచ్చే చెట్టుని నరికితే, పొదలని, అల్లుకునే తీగలని, సామాన్య తీగలనీ నరికినపుడు కూడా పాపశాన్తికి నూరు ఋక్‌మంత్రాలను జపం చెయ్యాలి. రసవన్తమైన ఇతర వృక్షాలని నరికితే నెయ్యిని ప్రాశనం చెయ్యాలి.

**హస్తినాఞ్చ వధే దృష్టం తప్తకృచ్ఛ్రం విశోధనమ్ ।**
**మతిపూర్వం వధే చాస్యాః ప్రాయశ్చిత్తం న విద్యతే ॥ 60 ॥**

ఏనుగును చంపితే తప్తకృచ్ఛ్రము ఆచరించాలి. పొరపాటున గోహత్యచేస్తే చాంద్రాయణవ్రతంకాని, పరాకవ్రతాన్ని కాని ఆచరించాలి. బుద్ధిపూర్వకంగా వధిస్తే ప్రాయశ్చిత్తమే లేదు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే ప్రాయశ్చిత్తప్రకరణే ద్వాత్రింశోఽధ్యాయః ॥ 32 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో ప్రాయశ్చిత్తప్రకరణమనే ముప్పది రెండో అధ్యాయం ॥ 32 ॥



## **త్రయస్త్రింశోఽధ్యాయః** - ముప్పై మూడవ అధ్యాయం

## **మానవధర్మాః** - మానవధర్మాలు

**వ్యాస ఉవాచ :**-వ్యాసుడు చెప్పాడు.

**మనుష్యాణాన్తు హరణం కృత్వా స్త్రీణాం గృహస్య చ ।**
**వాపీకూపజలానాఞ్చ శుద్ధ్యేచ్చాన్ద్రాయణేన తు ॥ 1 ॥**

మనుష్యులను, స్త్రీలను, ఇండ్లను అపహరణం చేసినా, దిగుడుబావులయొక్క, బావులయొక్క నీటిని కాజేసినా చాంద్రాయణవ్రతంతో శుద్ధి కలుగుతుంది.

**ద్రవ్యాణా మల్పసారాణాం స్తేయం కృత్వాఽన్యవేశ్మతః ।**
**చరేత్ సాంతపనం కృచ్ఛం తన్నిర్యాత్యాత్మశుద్ధయే ॥ 2 ॥**

**ధాన్యాన్నధనచౌర్యన్తు కృత్వా కామాద్ద్విజోత్తమః ।**
**స్వజాతీయగృహాదేవ కృచ్ఛ్రార్ధేన విశుధ్యతే ॥ 3 ॥**

అల్పసారాలైన వస్తువులు ఇతరుల ఇండ్లనుండి అపహరిస్తే సాంతపనవ్రతంతో శుద్ధి. బ్రాహ్మణుడు బుద్ధిపూర్వకంగా సజాతీయుల ఇండ్లనుండి ధాన్య,అన్న,రత్నధనాదులు అపహరిస్తే అర్ధకృచ్ఛ్రవ్రతంతో శుద్ధి.

**భక్ష్యభోజ్యాపహరణే యానశయ్యాసనస్య చ ।**
**పుష్పమూలఫలానాఞ్చ పఞ్చగవ్యం విశోధనమ్ ॥ 4 ॥**

భక్ష్య భోజ్యాలను వాహన, శయ్యాసనాలని పుష్ప, ఫలమూలాలని అపహరిస్తే పంచగవ్యాలతో శుద్ధి.

**తృణకాష్ఠద్రుమాణాఞ్చ శుష్కాన్నస్య గుడస్య చ ।**
**చైలచర్మాఽఽమిషాణాం చ త్రిరాత్రం స్యాదభోజనమ్ ॥ 5 ॥**

గడ్డి, కాష్ఠాలు, వృక్షాలు, శుష్కాన్న గుడ వస్త్ర చర్మ మాంసాలనపహరిస్తే మూడురాత్రులు ఉపవసించాలి.

**మణిముక్తాప్రవాళానాం తామ్రస్య రజతస్య చ ।**
**అయఃకాంస్యోపలానాఞ్చ ద్వాదశాహం కణాశనమ్ ॥ 6 ॥**

మణులు, ముత్యాలు, పగడం, రాగి, వెండి, ఉక్కు ఇనుము, పాషాణాలు అపహరిస్తే పండ్రెండు దినాలు నూకలతో చేసిన అన్నం తినాలి.

**కార్పాసకీటజోర్ణానాం ద్విశఫైకశఫస్య చ ।**
**పక్షిగన్ధౌషధీనాఞ్చ రజ్జ్వాశ్చైవ త్ర్యహం పయః ॥ 7 ॥**

పత్తి, ఊలు, పట్టు, రెండు గిట్టలు, ఒకగిట్ట పశువులను, పక్షులను, గంధ, ఔషధాలను, త్రాడును అపహరిస్తే మూడు దినాలు పాలతో గడపాలి.

**నరమాంసాశనం కృత్వా చాన్ద్రాయణ మథాచరేత్ ।**
**కాకఞ్చైవ తథా శ్వానం జగ్ధ్వా హస్తినమేవ చ ॥ 8 ॥**

**వరాహం కుక్కుటఞ్చాథ తప్తకృచ్ఛ్రేణ శుధ్యతి ।**
**క్రవ్యాదానాఞ్చ మాంసాని పురీషం మూత్రమేవ చ ॥ 9 ॥**

**గోగోమాయుకపీనాఞ్చ తదేవ వ్రతమాచరేత్ ।**

నరమాంసాశనంచేస్తే చాంద్రాయణవ్రతం ఆచరించాలి. కాకి, శునకం, ఏనుగు, వరాహం, కుక్కుట మాంసాలు భుజిస్తే తప్తకృచ్ఛ్రవ్రతంతో శుద్ధి కలుగుతుంది. మాంసాన్ని తినే మృగాలను, మలమూత్రాలను, నక్కలు కోతులను భుజిస్తే తప్తకృచ్ఛ్రవ్రతం ఆచరించాలి.

**ఉపోష్య ద్వాశాహన్తు కూష్మాణ్డైర్జుహుయాత్ ఘృతమ్ ॥**
**నకులోలూకమార్జరాన్ జగ్ధ్వా సాన్తపనం చరేత్ ।**
**శ్వాపదోష్ట్రఖరాన్ జగ్ధ్వా తప్తకృచ్ఛ్రేణ శుధ్యతి ॥ 10 ॥**

పంద్రెండు దినాలు ఉపవాసంచేసి కూష్మాండ మంత్రాలతో ఘృతంతో హెూమం చేయాలి. ముంగిస గుడ్లగూబపిల్లలను తింటే సాంతపన మాచరించాలి. తోడేలు, ఒంటె, గాడిదలను తింటే తప్తకృచ్ఛ్రంతో శుద్ధి పొందుతాడు. వ్రతంతోపాటు ముందు చెప్పిన విధిననుసరించి సంస్కారం కూడా చేసుకోవాలి.

**బకఞ్చైవ బలాకఞ్చ హంసం కారణ్డవం తథా ।**
**చక్రవాకం ప్లవం జగ్ధ్వా ద్వాదశాహమభోజనమ్ ॥ 11 ॥**

బకం, బలాక, హంస, కారండవం, చక్రవాకం, ప్లవాలు అనే పక్షులను భుజిస్తే పన్నెండు రోజులుపవసించాలి.

**కపోతం టిట్టిభం చైవ శుకం సారసమేవ చ ।**
**ఉల్లూకం జాలపాదఞ్చ జగ్ధ్వాఽ ప్యేతద్ వ్రతంచరేత్ ॥ 12 ॥**

పావురం, టిట్టిభపక్షి, చిలుక, బెగ్గురు, గుడ్లగూబ కలహంసాదులను భుజించినా పైవ్రతంతోనే శుద్ధి.

**శింశుమారం తథా చాషం మత్స్యమాంసం తథైవ చ ।**
**జగ్ధ్వా చైవ కటాహోరమేతదేవ చరేద్వ్రతమ్ ॥ 13 ॥**

మొసలి, పిట్ట, మత్స్య మాంసాలు, కటాహోరం తిన్నా ఇదే వ్రతం.

**కోకిలఞ్చైవ మత్స్యాంశ్చ మణ్డూకం భుజగం తథా ।**
**గోమూత్రయావకాహారో మాసేనైకేన శుధ్యతి ॥ 14 ॥**

కోకిల, మత్స్య, మండూక, భుజగాలను తిన్నా గోమూత్రంలో నాన్చిన యవలను ఆహారంగా ఒక నెల భుజించాలి. దానితో శుద్ధి కలుగుతుంది.

**జలేచరాంశ్చ జలజాన్ ప్రత్తుదాన్ నఖవిష్కిరాన్ ।**
**రక్తపాదాంస్తథా జగ్ధ్వా సప్తాహం చైతదాచరేత్ ॥ 15 ॥**

జలచరాలు, జలభవాలు, ముక్కుతో చూచి తినేవి, నఖాలతో చూచి తినేవి, రక్తపాద జంతువులను భుజిస్తే ఏడుదినాలు గోమూత్రయవభోజనంతోనే శుద్ధి.

**శునో మాంసం శుష్కమాంసమాత్మార్థం చ తథా కృతమ్ ।**
**భుక్త్వా మాసం చరేదేతత్ తత్పాపస్యాపనుత్తయే ॥ 16 ॥**

శునకమాంసాన్ని శుష్కమాంసాన్ని బుద్ధిపూర్వకంగ తన కోసం వండుకొని తింటే ఆ పాపపరిహారానికి ఒక నెల గోమూత్రయవకవ్రతం ఆచరించాలి.

**వార్తాకం భూస్తృణం శిగ్రుం ఖుఖుణ్డం కరకం తథా ।**
**ప్రాజాపత్యం చరేజ్జగ్ధ్వా శంఖం కుమ్భీకమేవ చ ॥ 17 ॥**

**పలాణ్డుం లశునం చైవ భుక్త్వా చాంద్రాయణం చరేత్ ।**
**నాలికాం తండులీయఞ్చ ప్రాజాపత్యేన శుధ్యతి ॥ 18 ॥**

వంకాయ, గెనుసుగడ్డ, ముల్లంగి, ఉల్లి తింటే ప్రాజాపత్యవ్రతమాచరించాలి. శంఖ కుంభీనకాలను ఉల్లి వెల్లుల్లి భుజిస్తే చాంద్రాయణవ్రతం చేయాలి. ములగ, తండులీయాలు తింటే ప్రాజాపత్య మాచరించాలి.

**ఆశ్మాన్తకం తథా పోతం తప్తకృచ్ఛ్రేణ శుధ్యతి ।**
**ప్రాజాపత్యేన శుద్ధిస్స్యాత్ కుక్కుభాణ్డస్య భక్షణే ॥ 19 ॥**

అశ్మాంతక పోతకాలకు తప్తకృచ్ఛ్రవ్రతం. కుక్కుభాండానికి ప్రాజాపత్యం ఆచరించాలి.

**అలాబుం కింశుకం చైవ భుక్త్వా చైతద్వ్రతం చరేత్ ।**
**ఉదుమ్బరఞ్చ కామేన తప్తకృచ్ఛ్రేణ శుధ్యతి ॥ 20 ॥**

సోర, మోదుగ భక్షణంలో ప్రాజాపత్యం ఆచరించాలి. మేడి పండు భక్షిస్తే తప్తకృచ్ఛ్రవ్రతాన్ని ఆచరించాలి.

**వృథా కృసరసంయావం పాయసాపూపసఙ్కులమ్ ।**
**భుక్త్వా చైవం విధంత్వన్నం త్రిరాత్రేణ విశుధ్యతి ॥ 21 ॥**

నువ్వుల అన్నం, రాగి, గంజిని, పాయసాన్ని,అప్పాలని ఏప్రయోజనం లేకుండా భుజిస్తే మూడు రాత్రులు వ్రతాన్నాచరించాలి.

**పీత్వా క్షీరాణ్యపేయాని బ్రహ్మచారీ సమాహితః ।**
**గోమూత్ర యవకాహారో మాసేనైకేన శుధ్యతి ॥ 22 ॥**

బ్రహ్మచారి ఆవు పాలు తప్ప మిగిలిన త్రాగకూడని పాలు త్రాగితే ఒక నెల గోమూత్రంలో నాన్చిన యవ భక్షణంతో శుద్ధుడవుతాడు.

**అనిర్దశాహం గోక్షీరం మాహిషం చాజమేవ చ ।**
**సన్ధిన్యాశ్చ వివత్సాయాః పిబన్ క్షీరమిదం చరేత్ ॥ 23 ॥**

ప్రసవించిన తర్వాత పది దినాలలోపు గోక్షీరం, గేదెపాలు, మేకపాలు, గర్భంతో ఉన్నవాటి పాలు, దూడలేని దాని పాలు తాగితే ఈ వ్రతాన్ని చేయాలి.

**ఏతేషాఞ్చ వికారాణి పీత్వా మోహేన మానవః ।**
**గోమూత్రయావకాహారః సప్తరాత్రేణ శుధ్యతి ॥ 24 ॥**

వీటి పాలవల్ల తయారైన పెరుగు, వెన్న, నెయ్యి, జున్ను మొదలైన వాటిని ఆహారంగా తీసుకొంటే ఏడుదినాలు గోమూత్రంలో నానిన యవల రసాన్ని ఆహారంగా తీసుకోవాలి.

**భుక్త్వా చైవ నవశ్రాద్ధే మృతకే సూతకే తథా ।**
**చాన్ద్రాయణేన శుద్ధ్యేత బ్రాహ్మణస్తు సమాహితః ॥ 25 ॥**

ఊనాబ్దకంలో కాని చనిపోయిన పదవరోజులో జాతా శౌచ మృతా శౌచాలలో కాని భుజించిన బ్రాహ్మణుడు చాంద్రాయణవ్రతంతో శుద్ధుడవుతాడు.

**యస్యాగ్నౌహూయతే నిత్యం న యస్యాగ్రం న దీయతే ।**
**చాన్ద్రాయణం చరేత్సమ్యక్ తస్యాన్నప్రాశనే ద్విజః ॥ 26 ॥**

అగ్నిహవనం చేయనివానియొక్క, అతిథికి పెట్టనివానియొక్క, గోగ్రాస మీయని వానియొక్క భోజనం చేస్తే చాంద్రాయణవ్రతం చెయ్యాలి.

**అభోజ్యానాన్తు సర్వేషాం భుక్త్వా చాన్నముపస్కృతమ్ ।**
**అన్తావసాయినాఞ్చైవ తప్తకృచ్ఛ్రేణ శుధ్యతి ॥ 27 ॥**

భోజనం చెయ్యతగనివి భుజించినా, అంత్యజుల భోజనం చేసినా తప్త కృచ్ఛ్రవ్రతం ఆచరించాలి.

**చాణ్డాలాన్నం ద్విజో భుక్త్వా సమ్యక్ చాన్ద్రాయణం చరేత్ ।**
**బుద్ధిపూర్వన్తు కృచ్ఛ్రాబ్దం పునః సంస్కారమేవ చ ॥ 28 ॥**

చండాల భోజనంచేస్తే చాంద్రాయణవ్రతం. బుద్ధి పూర్వకంగా చేస్తే కృచ్ఛ్రాబ్దం ఆచరించి మరల సంస్కారం పొందాలి.

**విణ్మూత్రప్రాశనం కృత్వా రేతసశ్చైతదాచరేత్ ।**
**అనాదిష్టేషు చైకాహం సర్వత్ర తు యథార్థతః ॥ 29 ॥**

**అసురామద్యపానేన కుర్యాత్ చాన్ద్రాయణవ్రతమ్ ।**
**అభోజ్యాన్నంతు కృత్వా చ ప్రాజాపత్యేన శుధ్యతి ॥ 30 ॥**

మలమూత్రాలను త్రాగినా, శుక్రధాతువును త్రాగినా శాస్త్రం చెప్పనివాటిని తిన్నాకూడా అన్నింటియందు వాస్తవంగా ఒకరోజు కృచ్ఛ్రవ్రతం చెయ్యాలి. సురకంటె భిన్నమైన మద్యాన్ని పానం చేస్తే చాంద్రాయణవ్రతం. తినకూడని అన్నం తింటే ప్రాజాపత్యం. మరెన్నో చెప్పని పాపాలశుద్ధికి ఏకాహోపవాసం చేయవలసినదే.

**విద్వరాహఖరోష్ట్రాణాం గోమాయోః కపికాకయోః ।**
**ప్రాశ్య మూత్రపురీషాణి ద్విజశ్చాన్ద్రాయణం చరేత్ ॥ 31 ॥**

గ్రామ సూకరం, గాడిద, ఒంటె, నక్క, వానర కాక మలమూత్ర పురీషాలు తింటే ద్విజుడు చాంద్రాయణం ఆచరించాలి.

**అజ్ఞానాత్ ప్రాశ్య విణ్మూత్రం సురాసంస్పృష్టమేవ చ ।**
**పునః సంస్కారమర్హన్తి త్రయో వర్ణా ద్విజాతయః ॥ 32 ॥**

తెలియక మలమూత్రాలు తిన్నా, సురాస్పర్శ గావించినా ద్విజులు ముగ్గురూ సంస్కారం చేసికోవాలి.

**క్రవ్యాదాం పక్షిణాఞ్చైవ ప్రాశ్య మూత్రపురీషకమ్ ।**
**మహాసాంతపనం మోహాత్ తదా కుర్యాద్ద్విజోత్తమః ॥ 33 ॥**

బ్రాహ్మణుడు మాంసాశనులైన పక్షుల మూత్ర పురీషాలు భుజించినా మహాసాంతపనవ్రతం చేయాలి.

**భాసమణ్డూకకురరే విష్కిరే కృచ్ఛ్రమాచరేత్ ।**
**ప్రాజాపత్యేన శుధ్యేత బ్రాహ్మణోచ్ఛిష్టభోజనే ॥ 34 ॥**

గద్ద, కప్ప, కురర మలమూత్రాల భక్షణంలో కృచ్ఛ్రం ఆచరించాలి. బ్రాహ్మణుడు బ్రాహ్మణుని ఉచ్ఛిష్ట భోజనం చేస్తే ప్రాజాపత్యం చెయ్యాలి.

**క్షత్రియే తప్తకృచ్ఛ్రం స్యాద్వైశ్యే చైవాతికృచ్ఛ్రకమ్ ।**
**శూద్రోచ్ఛిష్టం ద్విజో భుక్త్వా కుర్యాచ్చాన్ద్రాయణవ్రతమ్ ॥ 35 ॥**

ఉచ్ఛిష్ట భోజనం చేస్తే క్షత్రియునికి తప్తకృచ్ఛ్రవ్రతం. వైశ్యునికి అతికృచ్ఛ్రవ్రతం చేయాలి. ద్విజుడు శూద్రోచ్ఛిష్టం భుజిస్తే చాంద్రాయణవ్రతం చేయాలి.

**సురాభణ్డోదరే వారి పీత్వా చాన్ద్రాయణం చరేత్ ।**
**శునోచ్ఛిష్టం ద్విజో భుక్త్వా త్రిరాత్రేణ విశుధ్యతి ।**
**గోమూత్రయావకాహారః పీతశేషం చ రాగవాన్ ॥ 36 ॥**

సురాభాండంలోని నీరు త్రాగినా చాంద్రాయణవ్రతమే. కుక్క ఎంగిలి తిన్న ద్విజుడు మూడు రాత్రులుపవసించాలి. తెలిసి చేస్తే మూడు దానాలు గోమూత్ర యవకాహారి కావాలి.

**అపో మూత్ర పురీషాద్యై ర్దూషితాః ప్రాశయేద్యదా ।**
**తదా సాంతపనం ప్రోక్తం వ్రతం పాపవిశోధనమ్ ॥ 37 ॥**

మూత్ర పురీషాదులతో దుష్టమైన జలాన్ని త్రాగితే పాపవిముక్తికి సాంతపనవ్రతం,

**చాణ్డాలకూపభాణ్డేషు యది జ్ఞానాద్పిబేజ్జలమ్ ।**
**చరేత్ సాంతపనం కృచ్ఛ్రం బ్రాహ్మణః పాపశోధనమ్ ॥ 38 ॥**

చండాల కూప భాండాలలోని నీరు తెలిసి పానం చేస్తే పాపశోధకమైన సాంతపనం చేయాలి.

**చాణ్డాలేన తు సంస్పృష్టం పీత్వా వారి ద్విజోత్తమః ।**
**త్రిరాత్రేణ విశుధ్యేత పఞ్చగవ్యేన చైవ హి ॥ 39 ॥**

చాండాలస్పర్శగల జలం త్రాగినా మూడురాత్రు లుపవసించి పంచగవ్యప్రాశనం చేయాలి.

**మహాపాతకిసంస్పర్శే భుంక్తేఽస్నాత్వా ద్విజో యది ।**
**బుద్ధిపూర్వన్తు మూఢాత్మా తప్తకృచ్ఛ్రం సమాచరేత్ ॥ 40 ॥**

మహాపాతకులు తాకినా బుద్ధి పూర్వకంగా స్నానం చేయకుండానే భుజిస్తే తప్తకృచ్ఛ్రవ్రతం చేయాలి.

**స్నానార్హో యది భుఞ్జీత అహోరాత్రేణ శుధ్యతి ।**
**బుద్ధిపూర్వన్తు కృచ్ఛ్రేణ భగవానాహ పద్మజః ॥ 41 ॥**

స్నానానంతరం భుజింప దగినవారు స్నానం చేయకుండా భుజిస్తే ఒక దినం ఉపవాసంతో శుద్ధి. బుద్ధి పూర్వకంగా చేస్తే కృచ్ఛ్రవ్రతమని బ్రహ్మ చెప్పినాడు.

**శుష్కపర్యుషితాదీని గవాదిప్రతిదూషితమ్ ।**
**భుక్త్వోపవాసం కుర్వీత కృచ్ఛ్రపాదమథాపి వా ॥ 42 ॥**

**సంవత్సరాన్తే కృచ్ఛ్రం తు చరేద్విప్రః పునః పునః ।**
**అజ్ఞాతభుక్తశుద్ధ్యర్థం జ్ఞాతస్య తు విశేషతః ॥ 43 ॥**

బ్రాహ్మణుడు ఎండినట్టిదీ నిలువఉండి పాసిపోయినట్టిదీ అయిన ఆవు మొదలైన వాటి ఎంగిలిని తెలియక తింటే ఉపవాసం చెయ్యాలి. కృచ్ఛ్రవ్రతంలో నాల్గవవంతు చెయ్యాలి. తెలియక సంవత్సరం తింటె చివరికి కృచ్ఛ్రవ్రతం చెయ్యాలి. తెలిసితింటే ఇంకా ఎక్కువ కృచ్ఛ్రవ్రతం చెయ్యాలి.

**వ్రాత్యానాం యజనం కృత్వా పరేషామన్త్యకర్మ చ ।**
**అభిచారమహీనఞ్చ త్రిభిః కృచ్ఛ్రైర్విశుధ్యతి ॥ 44 ॥**

సంస్కారహీనులతో యజ్ఞం చేయించటం, లోభంతో ఇతరులకు అంత్యకర్మనాచరిస్తే అభిచారాన్ని చేసినా మూడు కృచ్ఛ్రాలని చేస్తే పరిశుద్ధుడు అవుతాడు.

**బ్రాహ్మణాదిహతానాఞ్చ కృత్వా దాహాదికాః క్రియాః ।**
**గోమూత్రయావకాహారః ప్రాజాపత్యేన శుధ్యతి ॥ 45 ॥**

బ్రాహ్మణుడు మొదలైనవారిచేత చంపబడినవారికి దహనసంస్కారాదులని చేస్తే గోమూత్రంలో నానిన యవల రసాన్ని త్రాగుతూ ప్రాజాపత్యవ్రతాన్ని చెయ్యాలి.

**తైలాభ్యక్తోఽథ వా కుర్యాద్యదిమూత్రం పురీషకే ।**
**అహోరాత్రేణ శుధ్యేత శ్మశ్రుకర్మ చ మైథునమ్ ॥46॥**

**ఏకాహేన వివాహాగ్నిం పరిహార్య ద్విజోత్తమః ।**
**త్రిరాత్రేణ విశుధ్యేత త్రిరాత్రాత్షడహం పునః ॥ 47 ॥**

నూనె ఒంటికి పట్టించుకొని మూత్ర పురీషోత్సర్జనం చేసినా, క్షవరం మైథునం ఆచరించినా, ఒకదినం ఉపవసించాలి. మూడుదినాలు హోమంచేయకుంటే ఆరుదినాలు ఉపవసించాలి.

**దశాహం ద్వాదశాహం వా పరిహార్య ప్రమాదతః ।**
**కృచ్ఛ్రం చాన్ద్రాయణం కుర్యాత్తత్పాపస్యాపనుత్తయే ॥ 48 ॥**

పదిదినాలుకానీ, పన్నెండుదినాలుకానీ హవనం చేయనట్టైతే పాపపరిహారార్థం కృచ్ఛ్రచాంద్రాయణవ్రతం చేయాలి.

**పతితాద్ద్రవ్యమాదాయ తదుత్సర్గేణ శుధ్యతి ।**
**చరేత్సాంతపనం కృచ్ఛ్రమిత్యాహ భగవాన్ప్రభుః ॥ 49 ॥**

పతితుని ద్రవ్యం తీసుకొన్నట్టైతే ఆ ద్రవ్యాన్ని వదలటంతో శుద్ధి. అట్లే సాంతపనమూ కృచ్ఛ్రమూ ఆచరించాలని భగవానుడు చెప్పాడు.

**అనాశకనివృత్తాస్తు ప్రవ్రజ్యావసితాస్తథా ।**
**చరేయుస్త్రీణి కృచ్ఛ్రాణి త్రీణి చాన్ద్రాయణాని చ ॥ 50 ॥**

ప్రాయోపవేశంనుండి సన్న్యాసంనుండి భ్రష్టులైనవారు మూడుకృచ్ఛ్రాలు, మూడుచాంద్రాయణాలు చేయాలి.

**పునశ్చ జాతకర్మాదిసంస్కారైః సంస్కృతా ద్విజాః ।**
**శుధ్యేయు స్తద్వ్రతం సమ్యక్ చరేయుర్ధర్మవర్ధనాః ॥ 51 ॥**

మరల జాత కర్మాది సంస్కారాలతో సంస్కృతులైన ద్విజులు ధర్మవృద్ధికోసం వారివ్రతాన్ని చక్కగా ఆచరించాలి.

**అనుపాసిత సన్ధ్యస్తు తదహర్యాపకో వసేత్ ।**
**అనశ్నన్ సంయతాత్మా చ రాత్రౌ చేద్రాత్రిమేవ హి ॥ 52 ॥**

సంధ్యావందనం చేయని రోజు భోజనం చేయకూడదు. రాత్రి సంధ్య చేయనట్టైతే రాత్రి భోంచేయకూడదు.

**అకృత్వా సమిదాధానం శుచిః స్నాత్వా సమాహితః ।**
**గాయత్ర్యష్టసహస్రస్య జప్యం కుర్యాద్విశుద్ధయే ॥ 53 ॥**

నిత్యాగ్నిహోత్రం చేయని రోజు స్నానం చేసి శుచియై ఎనిమిదివేల గాయత్రి జపం చేయాలి.

**ఉపాసీత న చేత్సన్ధ్యాం గృహస్థోఽపి ప్రమాదతః ।**
**స్నాత్వా విశుధ్యతే సద్యః పరిశ్రాన్తస్తు సంయమాత్ ॥ 54 ॥**

గృహస్థుడు పొరపాటున సంధ్యావందనం చేయకుంటే స్నానం చేసి ఉపవసించినచో శుద్ధి పొందును.

**వేదోదితాని నిత్యాని కర్మాణి చ విలోప్య తు ।**
**స్నాతకవ్రతలోపన్తు కృత్వా చోపవసేద్దినమ్ ॥ 55 ॥**

వేదోదిత నిత్యకర్మలను లోపింపచేసినా స్నాతక వ్రతలోపంచేసినా ఒక దినం ఉపవాసముండాలి.

**సంవత్సరం చరేత్ కృచ్ఛ్ర మగ్న్యుత్సాదీ ద్విజోత్తమః ।**
**చాన్ద్రాయణం చరేత్ వ్రాత్యో గోప్రదానేన శుధ్యతి ॥ 56 ॥**

అగ్నిని విసర్జించిన ద్విజుడు ఒక సంవత్సరం కృచ్ఛ్రవ్రతం ఆచరించాలి. సంస్కారభ్రష్టుడు గోదానం చేస్తే చాంద్రాయణంతో శుద్ధుడవుతాడు.

**నాస్తిక్యం యది కుర్వీత ప్రాజాపత్యం చరేద్ద్విజః ।**
**దేవద్రోహం గురుద్రోహం తప్తకృచ్ఛ్రేణ శుధ్యతి ॥ 57 ॥**

నాస్తికుడైన బ్రాహ్మణుడు ప్రాజాపత్య మాచరించాలి. దేవ గురు ద్రోహాలు తప్తకృచ్ఛ్రంతో తొలగుతాయి.

**ఉష్ట్రయానం సమారుహ్య ఖరయానం చ కామతః ।**
**త్రిరాత్రేణ విశుద్ధ్యేత్తు నగ్నో వా ప్రవిశేజ్జలమ్ ॥ 58 ॥**

బుద్ధిపూర్వకంగా ఒంటెగాడిదలపై సంచరించినా, నగ్నంగా జలంలో ప్రవేశించినా మూడు దినాలుపవసించాలి.

**షష్ఠాన్నకాలతా మాసం సంహితా జప ఏవ చ ।**
**హోమాశ్చ శాకలా నిత్యమపాంక్తానాం విశోధనమ్ ॥ 59 ॥**

పంక్తిబాహ్యులైనవారు నెలరోజులు ప్రతిమూడు దినాలకొకసారి సాయంకాలం మాత్రం భుజించి వేదసంహితాజపం చేస్తూ శాకలహోమం (బోధాయనస్మృతి4ప్రశ్న3) చేసి శుద్ధి పొందుతాడు.

**నీలం రక్తం వసిత్వా చ బ్రాహ్మణో వస్త్రమేవ చ ।**
**అహోరాత్రోషితః స్నాతః పఞ్చగవ్యేన శుధ్యతి ॥ 60 ॥**

బ్రాహ్మణులు నల్లని లేదా ఎర్రనివస్త్రాలు ధరిస్తే ఇరవైదినాలుపవసించి స్నానంచేసి పంచగవ్యం తీసుకొన్నచో శుద్ధి.

**వేదధర్మపురాణానాం చణ్డాలస్య తు భాషణే ।**
**చాన్ద్రాయణేన శుద్ధి స్స్యాన్నహ్యన్యా తస్య నిష్కృతిః ॥ 61 ॥**

చండాలునికి వేదధర్మ పురాణాలు పదేశించినవానికి చాంద్రాయణంతో శుద్ధి అతనికి ఇంకొక ప్రాయశ్చిత్తం లేదు.

**ఉద్బన్ధనాదినిహతం సంస్పృశ్య బ్రాహ్మణః క్వచిత్ ।**
**చాన్ద్రాయణేన శుద్ధిః స్యాత్ప్రాజాపత్యేన వా పునః ॥ 62 ॥**

ఉరిమొదలైన వాటితో చనిపోయినవాణ్ణి బ్రాహ్మణుడు తాకితే చాంద్రాయణం లేదా ప్రాజాపత్యంతో శుద్ధి.

**ఉచ్ఛిష్టో యద్యనాచాన్త శ్చాణ్డాలాదీన్ స్పృశేద్ద్విజః ।**
**ప్రమాదాద్వై జపేత్స్నాత్వా గాయత్ర్యష్టసహస్రకమ్ ॥ 63 ॥**

ఉచ్ఛిష్టుడు ఆచమనం చేయక చండాలాదులను తాకితే స్నానం చేసి ఎనిమిది వేల గాయత్రీజపం చేయాలి.

**ద్రుపదానాం శతం వాఽపి బ్రహ్మచారీ సమాహితః ।**
**త్రిరాత్రోపోషితః సమ్యక్పఞ్చగవ్యేన శుద్ధ్యతి ॥ 64 ॥**

బ్రహ్మచారి ఉచ్ఛిష్టుడు అయితే శ్రద్ధగలవాడై అవధానంతో మూడు దినాలుపవాసం ఉండి ద్రుపదా మంత్రాన్ని నూరు మార్లు జపించి పంచగవ్యప్రాశనంచేసి శుద్ధుడు కావాలి.

**చణ్డాలపతితాదీంస్తు కామాద్యః సంస్పృశేద్ద్విజః ।**
**ఉచ్ఛిష్టః తత్ర కుర్వీత ప్రాజాపత్యం విశుద్ధయే ॥ 65 ॥**

బుద్ధి పూర్వకంగా ఉచ్ఛిష్ట ముఖంతో చండాలపతితాదుల్ని తాకితే శుద్ధికోసం ప్రాజాపత్యవ్రతం ఆచరించాలి.

**చాణ్డాలసూతకశవాంస్తథా నారీం రజస్వలామ్ ।**
**స్పృష్ట్వా స్నాయాద్విశుధ్యర్థం తత్స్పృష్టం పతితం తథా ॥ 66 ॥**

చండాలుణ్ణి ఆశౌచమున్నవాణ్ణి, శవాన్ని, రజస్వలస్త్రీని, వీరు తాకినవాణ్ణి, పతితుని కాని స్పృశిస్తే శుద్ధికోసం స్నానం చేయాలి.

**చణ్డాలసూతకశవైః సంస్పృష్టం సంస్పృశేద్యది ।**
**ప్రమాదాత్తత ఆచమ్య జపం కుర్యాంత్సమాహితః ॥ 67 ॥**

పొరపాటున చండాల సూతకశవాలను తాకినవారిని తాకితే స్నానం చేసి ఆచమనం గాయత్రీజపం చేయాలి.

**తత్స్పృష్టస్పర్శినం స్పృష్ట్వా బుద్ధిపూర్వం ద్విజోత్తమః ।**
**ఆచమేత్తద్విశుద్ధ్యర్థం ప్రాహ దేవః పితామహః ॥ 68 ॥**

చండాల ఆశౌచశవాదులను తాకిన వారిని బుద్ధిపూర్వకంగా తాకితే స్నానం చేసి ఆచమనం చేయాలని బ్రహ్మ తెల్పినాడు.

**భుఞ్జానస్య తు విప్రస్య కదాచిత్సంస్రవేద్గుదమ్ ।**
**కృత్వా శౌచం తతః స్నాయాదుపోష్య జుహుయాద్ఘృతమ్ ॥ 69 ॥**

భోజనం చేసేప్పుడు మలస్రావం జరిగితే శౌచం పూర్తి చేసుకొని స్నానం ఉపవాసం ఆచరించి ఘృతంతో హోమం చేయాలి.

**చాణ్డాలాన్త్యశవం స్పృష్ట్వా కృచ్ఛ్రం కుర్యాద్విశుద్ధయే ।**
**స్పృష్ట్వాభ్యక్త స్త్వసంస్పృశ్యమహోరాత్రేణ శుధ్యతి ॥ 70 ॥**

చండాల అంత్యజుల శవాన్ని తాకితే శుద్ధికోసం కృచ్ఛ్రవ్రతం, అభ్యంగనం చేసినవాడు స్పృశించ తగనివాణ్ణి తాకితే ఒక దినం ఉపవాసంతో శుద్ధి కలుగుతుంది.

**సురాం స్పృష్ట్వా ద్విజః కుర్యాత్ప్రాణాయామత్రయం శుచిః ।**
**పలాణ్డుం లశునఞ్చైవ ఘృతం ప్రాశ్య తతః శుచిః ॥ 71 ॥**

సురను తాకితే ద్విజుడు మూడు ప్రాణాయామాలు చేయాలి. పెద్దఉల్లిని వెల్లుల్లిని తాకితే నేయి త్రాగాలి.

**బ్రాహ్మణస్తు శునా దష్టః త్ర్యహం సాయం పయః పిబేత్ ।**
**నాభేరూర్ధ్వం తు దష్టస్య తదేవ ద్విగుణం భవేత్ ॥ 72 ॥**

బ్రాహ్మణుణ్ణి కుక్క కరిస్తే మూడు రోజులు సాయంకాలం పాలుమాత్రమే త్రాగాలి. నాభికి పై భాగంలో కరిస్తే ఆరుదినాలు సాయంకాలం పాలుత్రాగాలి.

**స్యా దేతత్త్రిగుణం బాహ్వోర్మూర్ధ్ని చ స్యాచ్చతుర్గుణమ్ ।**
**స్నాత్వా జపేద్వా సావిత్రీం శ్వభిర్దష్టో ద్విజోత్తమః ॥ 73 ॥**

భుజాలను కరిస్తే తొమ్మిది దినాలు, శిరస్సులో కరిస్తే పన్నెండురోజులు పాలుత్రాగాలి. కుక్క కరిచిన ద్విజుడు స్నానంచేసి గాయత్రీ జపం చేయాలి.

**అనిర్వర్త్య మహాయజ్ఞాన్ యో భుఙ్క్తే తు ద్విజోత్తమః ।**
**అనాతురః సతి ధనే కృచ్ఛ్రార్ధేన స శుధ్యతి ॥ 74 ॥**

ధనం ఉండి ఏ రోగం లేక పంచమహాయజ్ఞాలు చేయకుండా భుజిస్తే అర్ధకృచ్ఛ్రవ్రతం చేయాలి.

**ఆహితాగ్నిరుపస్థానం న కుర్యాద్యస్తు పర్వణి ।**
**ఋతౌ న గచ్ఛేద్భార్యాం వా సోఽపి కృచ్ఛ్రార్ధమాచరేత్ ॥ 75 ॥**

ఆహితాగ్ని అయినవాడు పర్వకాలంలో అగ్న్యుపస్థానం చేయకున్నా ఋతుకాలంలో భార్యా సంగమం చేయకున్నా అర్ధకృచ్ఛ్రం ఆచరించాలి.

**వినాఽద్భి రప్సు వా వాఽర్తః శారీరం సంనివేశ్య చ ।**
**సచేలో జలమాప్లుత్య గామాలభ్య విశుధ్యతి ॥ 76 ॥**

మలమూత్ర వేగం వల్ల నీరు లేకుండా లేదా నీటిలో కాని విసర్జిస్తే ధరించిన వస్త్రంతోనే స్నానంచేసి గోవును తాకాలి.

**బుద్ధిపూర్వం త్వభ్యుదితో జపేదన్తర్జలే ద్విజః ।**
**గాయత్ర్యష్టసహస్రన్తు త్ర్యహం చోపవసేద్వ్రతీ ॥ 77 ॥**

బుద్ధి పూర్వకంగా సూర్యోదయం వరకు నిద్రించి ద్విజుడు ఆసమయంలో అనుష్ఠానం చేయనివాడు సూర్యోదయకాలంలో నీటిలో ప్రవేశించి ఎనిమిదివేల గాయత్రీజపం చేసి మూడు రోజులు ఉపవసించాలి.

**అనుగమ్యేచ్ఛయా శూద్రం ప్రేతీభూతం ద్విజోత్తమః ।**
**గాయత్ర్యష్టసహస్రఞ్చ జప్యం కుర్యాన్నదీషు చ ॥ 78 ॥**

బుద్ధిపూర్వకంగా శూద్రశవం వెంబడి వెళ్ళిన ద్విజుడు స్నానం చేసి నదీతీరంలో ఎనిమిదివేల గాయత్రీజపం చేయాలి.

**కృత్వా తు శపథం విప్రో విప్రస్య వధసంయుతమ్ ।**
**మృషైవ యావకాన్నేన కుర్యా చ్చాన్ద్రాయణం వ్రతమ్ ॥ 79 ॥**

బ్రాహ్మణుని చంపినవానిని తాను చంపుతానని ఇంకొక బ్రాహ్మణుడు ప్రతిజ్ఞచేసి ప్రతిజ్ఞ చెల్లించలేకపోతే యావకాన్నంతో చాంద్రాయణం ఆచరించాలి.

**పఙ్క్త్యాం విషమదానన్తు కృత్వా కృచ్ఛ్రేణ శుద్ధ్యతి ।**
**ఛాయాం శ్వపాకస్యారుహ్య స్నాత్వా సమ్ప్రాశయేద్ఘృతమ్ ॥ 80 ॥**

పంక్తిలో కూర్చున్న బ్రాహ్మణులకు పక్షపాత బుద్ధితో వడ్డించినవాడు కృచ్ఛ్రవ్రతం చేయాలి. చండాలుని నీడ సోకితే స్నానంచేసి నేయి తినాలి.

**ఈక్షేతాదిత్యమశుచిః దృష్ట్వాఽగ్నిం చన్ద్రమేవ వా ।**
**మానుషఞ్చాస్థి సంస్పృశ్య స్నానం కృత్వా విశుధ్యతి ॥ 81 ॥**

అశుచిగా ఉండి అగ్నిచంద్రులను చూస్తే శుద్ధికోసం సూర్యుని దర్శించాలి. మానవ ఎముకలు తాకితే స్నానంతో శుద్ధి.

**కృత్వా తు మిథ్యాధ్యయనం చరేద్భైక్ష్యం తు వత్సరమ్ ।**
**కృతఘ్నో బ్రాహ్మణగృహే పఞ్చ సంవత్సరం వ్రతీ ॥ 82 ॥**

డాంబికంగా అధ్యయనం చేస్తే ఒక యేడు భిక్షాటన చేయాలి. కృతఘ్నుడు అయినవాడు బ్రాహ్మణ గృహంలో బ్రహ్మచర్యంతో అయిదేండ్లు ఉండాలి.

**హుఙ్కారం బ్రాహ్మణస్యోక్త్వా త్వంకారఞ్చ గరీయసః ।**
**స్నాత్వాఽనశ్న న్నహః శేషం ప్రణిపత్య ప్రసాదయేత్ ॥ 83 ॥**

బ్రాహ్మణ గురువుల విషయంలో హుంకారాన్ని, నీవు అని ఏకవచనాన్ని ప్రయోగించి అనాదరంతో వ్యవహరిస్తే స్నానం చేసి ఒక దినముపవసించి వారికి ప్రణామంచేసి ప్రసన్నులను చేసుకోవాలి.

**తాడయిత్వా తృణేనాపి కణ్ఠం బద్ధ్వాఽపి వాససా ।**
**వివాదేవాపి నిర్జిత్య ప్రణిపత్య ప్రసాదయేత్ ॥ 84 ॥**

బ్రాహ్మణుని గడ్డిపోచతో కొట్టినా, వస్త్రంతో కంఠాన్ని చుట్టి పీడించినా, వివాదంలో గెలిచినా ప్రణామ పూర్వకంగా వారిని ప్రసన్నులను చేసుకోవాలి.

**అవగూహ్య చరేత్ కృచ్ఛ్రమతికృచ్ఛ్రం విపాతనే ।**
**కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ కుర్వీత విప్రస్యోత్పాద్య శోణితమ్ ॥ 85 ॥**

బ్రాహ్మణుని ఢీకొంటే కృచ్ఛ్రవ్రతం పడవేస్తే అతికృచ్ఛ్రవ్రతం ఆచరించాలి. బ్రాహ్మణునికి రక్తం చిందేట్టు చేస్తే కృచ్ఛ్రాతికృచ్ఛ్రాలు చేయాలి.

**గురోరాక్రోశ మనృతం కృత్వా కుర్యాద్విశోధనమ్ ।**
**ఏకరాత్రం త్రిరాత్రం వా తత్పాపస్యాపనుత్తయే ॥ 86 ॥**

గురువు నధిక్షేపించినా అసత్యమాడినాడని చెప్పినా ఆ పాప శాంతికి ఒక దినం లేదా మూడుదినాలు ఉపవాసం చేయాలి.

**దేవర్షీణామభిముఖం ష్ఠీవనాక్రోశనే కృతే ।**
**ఉల్ముకేన దహేజ్జిహ్వాం దాతవ్యం చ హిరణ్యకమ్ ॥ 87 ॥**

దేవతలు ఋషులవైపు ఉమ్మివేసినా వారినధిక్షేపించినా కొరివితో నాలుకను కాల్చుకోవాలి. బంగారాన్ని దానం చేయాలి.

**దేవోద్యానే తు యః కుర్యాన్మూత్రోచ్చారం సకృద్ద్విజః ।**
**ఛిన్ద్యాచ్ఛిశ్నం విశుధ్యర్థం చరేచ్చాన్ద్రాయణన్తు వా ॥ 88 ॥**
**(దేవతాయతనే మూత్రం కృత్వా మోహాద్ద్విజోత్తమః ।**
**శిశ్నస్యోత్కర్తనం కృత్వా చాన్ద్రాయణమథాచరేత్ ॥ 89 ॥)**

దేవోద్యానంలో ఒక్కసారి మూత్రం చేసినా శిశ్నాన్ని ఛేదించుకోవాలి లేదా చాంద్రాయణ వ్రతం ఆచరించాలి.

**దేవతానామృషీణాఞ్చ దేవానాఞ్చైవ కుత్సనమ్ ।**
**కృత్వా సమ్యక్ ప్రకుర్వీత ప్రాజాపత్యం ద్విజోత్తమః ॥ 90 ॥**

దేవ ఋషి దైవతుల్యులను నిందించిన ద్విజుడు ప్రాజాపత్యం చేయాలి.

**తైస్తు సంభాషణం కృత్వా స్నాత్వా దేవాన్ సమర్చయేత్ ।**
**దృష్ట్వా వీక్షేత భాస్వన్తం స్మృత్వా విశ్వేశ్వరం స్మరేత్ ॥ 91 ॥**

అట్లా నిందించిన వారితో సంభాషించినా స్నానం చేసి దేవతార్చన గావించాలి. అట్టి వారిని చూస్తే సూర్యదర్శనం చేయాలి. వారిని స్మరిస్తే వెంటనే విశ్వేశ్వరస్మరణ గావించాలి.

**యః సర్వభూతాధిపతిం విశ్వేశానం వినిన్దతి ।**
**న తస్య నిష్కృతిశ్శక్యా కర్తుం వర్షశతైరపి ॥ 92 ॥**

సర్వభూతాధిపతి విశ్వేశ్వరుని నిందించేవానికి నూరేండ్లైనా నిష్కృతి చేయడం సాధ్యం కాదు.

**చాన్ద్రాయణం చరేత్పూర్వం కృచ్ఛ్రం చైవాతికృచ్ఛ్రకమ్ ।**
**ప్రపన్నః శరణం దేవం తస్మాత్పాపా ద్విముచ్యతే ॥ 93 ॥**

మొదట పశ్చాత్తాపంతో చాంద్రాయణవ్రతం ఆచరించాలి. తర్వాత కృచ్ఛ్రాతికృచ్ఛ్రాలతోపాటు ఆదిదేవుని శరణువేడాలి. అపుడు ఆ పాపం నుండి విముక్తి కల్గుతుంది.

**సర్వస్వదానం విధివత్ సర్వపాపవిశోధనమ్ ।**
**చాన్ద్రాయణఞ్చ విధినా కృచ్ఛ్రం చైవాతికృచ్ఛ్రకమ్ ॥ 94 ॥**

లేదా సర్వస్వదానంచేయాలి. యథావిధి సర్వపాపాలను తొలగించే చాంద్రాయణకృచ్ఛ్రాతికృచ్ఛ్రాలు చేయాలి.

**పుణ్యక్షేత్రాభిగమనం సర్వపాపవినాశనమ్ ।**
**దేవతాభ్యర్చనం నృణా మశేషాఘవినాశనమ్ ॥ 95 ॥**

పుణ్యక్షేత్రాలు పర్యటిస్తే సర్వపాపనివృత్తి జరుగుతుంది. దేవతార్చన సకల పాపనాశకం.

**అమావస్యాం తిథిం ప్రాప్య యః సమారాధయే చ్ఛివమ్ ।**
**బ్రాహ్మణాన్ భోజయిత్వా తు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 96 ॥**

అమావాస్యనాడు శివునారాధించి బ్రాహ్మణులను భుజింప చేస్తే అన్ని పాపాలు నశిస్తాయి.

**కృష్ణాష్టమ్యాం మహాదేవం తథా కృష్ణచతుర్దశీమ్ ।**
**సంపూజ్య బ్రాహ్మణముఖే సర్వపాపైః ప్రముచ్యతే ॥ 97 ॥**

బహుళఅష్టమి చతుర్దశులలో బ్రాహ్మణముఖంగా శివునారాధిస్తే సర్వపాపనివృత్తి అవుతుంది.

**త్రయోదశ్యాం తథా రాత్రౌ సోపహారం త్రిలోచనమ్ ।**
**దృష్ట్వేశం ప్రథమే యామే ముచ్యతే సర్వపాతకైః ॥ 98 ॥**

కృష్ణ త్రయోదశి రాత్రి ప్రథమయామంలో ఉపహారపూర్వకంగా త్రిలోచనుని దర్శిస్తే పాపాలన్నీ పోతాయి.

**ఉపోషిత శ్చతుర్దశ్యాం కృష్ణపక్షే సమాహితః ।**
**యమాయ ధర్మరాజాయ మృత్యవే చాన్తకాయ చ ॥ 99 ॥**
**వైవస్వతాయ కాలాయ సర్వభూక్షయాయ చ ।**

**ప్రత్యేకం తిలసంయుక్తాన్ దద్యాత్ సప్తోదకాఞ్జలీన్ ।**
**స్నాత్వా నద్యాన్తు పూర్వాహ్నే ముచ్యతే సర్వపాతకైః ॥ 100 ॥**

కృష్ణ చతుర్దశి మొదటి జాము స్నానంచేసి ఉపవాసముండి యమధర్మరాజు, మృత్యువు, అంతకుడు, వైవస్వతులు, కాలుడు, సర్వభూతనాశకులకు ఒక్కొక్కరికి నువ్వులతో ఏడుమార్లు ఉదకాంజలి వదలాలి. పూర్వాహ్ణంలో నదిలో స్నానం చేస్తే సకలపాపాలు పోతాయి.

**బ్రహ్మచర్యమధఃశయ్యా ముపవాసం ద్విజార్చనమ్ ।**
**వ్రతేష్వేతేషు కుర్వీత శాన్తః సంయతమానసః ॥ 101 ॥**

ప్రాయశ్చిత్తంకోసం చేసే వ్రతాల్లో బ్రహ్మచర్యం, అధశ్శయ్య, ఉపవాసం, ద్విజార్చనలు ప్రధానం. వ్రతాలలో వాటిని ప్రశాంతమనస్కుడై ఆచరించాలి.

**అమావాస్యాం యాం బ్రహ్మాణం సముద్దిశ్య పితామహమ్ ।**
**బ్రాహ్మణాంస్త్రీన్ సమభ్యర్చ్య ముచ్యతే సర్వపాతకైః ॥ 102 ॥**

అమావాస్యనాడు పితామహుడైన బ్రహ్మనుద్దేశించి ముగ్గురు బ్రాహ్మణులను పూజిస్తే పాపాలన్నీ తొలగుతాయి.

**షష్ఠ్యా ముపోషితో దేవం శుక్లపక్షే సమాహితః ।**
**సప్తమ్యా మర్చయే ద్భానుం ముచ్యతే సర్వపాతకైః ॥ 103 ॥**

శుక్ల షష్ఠినాడు సావధానుడై ఉపవసించి సప్తమినాడు సూర్యుని ఆరాధిస్తే సకలపాపపరిహారమవుతుంది.

**భరణ్యాఞ్చ చతుర్థ్యాఞ్చ శనైశ్చరదినే యమమ్ ।**
**పూజయే త్సప్తజన్మోత్థై ర్ముచ్యతే పాతకై ర్నరః ॥ 104 ॥**

భరణీ నక్షత్రం చతుర్థి శనివారంనాడు యముని పూజిస్తే ఏడు జన్మల పాపాలు పోతాయి.

**ఏకాదశ్యాం నిరాహారః సమభ్యర్చ్య జనార్దనమ్ ।**
**ద్వాదశ్యాం శుక్లపక్షస్య మహాపాపైః ప్రముచ్యతే ॥ 105 ॥**

ఏకాదశినాడు నిరాహారియై ద్వాదశిలో జనార్దనుని పూజిస్తే మహాపాపాలు కూడా పోతాయి.

**తపో జపస్తీర్థసేవా దేవబ్రాహ్మణపూజనమ్ ।**
**గ్రహణాదిషు కాలేషు మహాపాతకశోధనమ్ ॥ 106 ॥**

గ్రహణాది పర్వదినాల్లో తపం, జపం, తీర్థసేవ, దేవ, బ్రాహ్మణపూజ మహాపాతకాలను నశింపచేస్తాయి.

**యస్సర్వపాపయుక్తోఽపి పుణ్యతీర్థేషు మానవః ।**
**నియమేన త్యజేత్ప్రాణాన్ స ముచ్యేత హి పాతకైః ॥ 107 ॥**

అన్ని పాపాలు చేసి ఉన్నా పుణ్యతీర్థాల్లో నియమంగా ప్రాణత్యాగం చేస్తే పాపాలన్నీ పోతాయి.

**బ్రహ్మఘ్నం వా కృతఘ్నం వా మహాపాతకదూషితమ్ ।**
**భర్తార ముద్ధరే న్నారీ ప్రవిష్టా సహ పావకమ్ ॥ 108 ॥**

భర్తతో కలిసి అగ్నిలో సహప్రవేశం చేసిన స్త్రీ తన భర్త బ్రహ్మఘ్నుడు, కృతఘ్నుడు, మహాపాతకదూషితుడైనా అతణ్ణి ఉద్ధరిస్తుంది.

**ఏతదేవ పరం స్త్రీణాం ప్రాయశ్చిత్తం విదుర్బుధాః ।**
**సర్వపాప సముద్భూతౌ నాత్ర కార్యా విచారణా ॥ 109 ॥**
**పతివ్రతా తు యా నారీ భర్తుః శుశ్రూషణోత్సుకా ।**
**న తస్యా విద్యతే పాప మిహలోకే పరత్ర చ ॥ 110 ॥**

స్త్రీలకు అన్ని పాపాలకు ప్రాయశ్చిత్తం పాతివ్రత్యమే. ఇందులో సందేహం లేదు. భర్త శుశ్రూష చేసే పతివ్రతకు ఇహపరాల్లో ఏ పాపమూ ఉండదు.

**పతివ్రతా ధర్మరతా రుద్రాణ్యేవ న సంశయః ।**
**నాస్యాః పరాభవం కర్తుం శక్నోతీహ జనః క్వచిత్ ॥ 111 ॥**

ధర్మపరాయణ అయిన పతివ్రత సాక్షాత్పార్వతీ మాతయే. ఇందులో సందేహం లేదు. ఇట్టి పతివ్రత కెప్పుడూ పరాభవం చెయ్యటానికెవ్వడూ సమర్థుడు గాడు.

**యథా రామస్య సుభగా సీతా త్రైలోక్యవిశ్రుతా ।**
**పత్నీ దాశరథే ర్దేవీ విజిగ్యే రాక్షసేశ్వరమ్ ॥ 112 ॥**

రాముని భార్య సీత త్రైలోక్య విఖ్యాత పతివ్రత రావణాసురుణ్ణి గెలిచినది.

**రామస్య భార్యాం విమలాం రావణో రాక్షసేశ్వరః ।**
**సీతాం విశాలనయనాం చకమే కాలచోదితః ॥ 113 ॥**

పరిశుద్ధురాలు, రామపత్ని, విశాలనయన అయిన సీతను రాక్షసరాజు రావణుడు కాలంచేత ప్రేరేపించబడినవాడై కామించినాడు.

**గృహీత్వా మాయయా వేషం చరన్తీం విజనే వనే ।**
**సమాహర్తుం మతిం చక్రే తాపసః కిల కామినీమ్ ॥ 114 ॥**

విజనారణ్యంలో సంచరించే సుందరిని సీతను మాయాయతి వేషాన్ని ధరించి అతడు అపహరింప దలచినాడు.

**విజ్ఞాయ సా చ తద్భావం స్మృత్వా దాశరథిం పతిమ్ ।**
**జగామ శరణం వహ్ని మావసథ్యం శుచిస్మితా ॥ 115 ॥**

రావణుని అభిప్రాయాన్ని గ్రహించిన సీత భర్త శ్రీరాముని స్మరించి గార్హపత్యాగ్నిని శరణు వేడింది.

**ఉపతస్థే మహాయోగం సర్వదోష వినాశనమ్ ।**
**కృతాఞ్జలీ రామపత్నీ సాక్షాత్పతి మివాచ్యుతమ్ ॥ 116 ॥**

రామపత్ని సీత సర్వదోషనాశకుడు, మహాయోగ పరుడైన భర్తనువలె అగ్నిని చేతులు జోడించి శరణు వేడినది.

**నమస్యామి మహాయోగం కృతాన్తం గహనం పరమ్ ।**
**దాహకం సర్వభూతానా మీశానం కాలరూపిణమ్ ॥ 117 ॥**

పరమగహనుడు, మహాయోగ స్వరూపుడు, కృతాంతుడు, సర్వభూతదాహకుడు, కాలరూపుడు, ఈశ్వరుడైన అగ్నికి నమస్కరిస్తున్నాను.

**నమస్యే పావకం దేవం సాక్షిణం విశ్వతోముఖమ్ ।**
**ఆత్మానం దీప్తవపుషం సర్వభూతహృది స్థితమ్ ॥ 118 ॥**

విశ్వతోముఖుడు, సకలసాక్షి , ప్రకాశవంతమైన శరీరంగలవాడూ, సమస్తప్రాణులహృదయాలలో ఉన్నవాడైనట్టి ఆత్మరూపుడైన అగ్నిని నమస్కరిస్తున్నాను.

**ప్రపద్యే శరణం వహ్నిం బ్రహ్మణ్యం బ్రహ్మరూపిణమ్ ।**
**భూతేశం కృత్తివసనం శరణ్యం పరమమ్పదమ్ ॥ 119 ॥**

బ్రాహ్మణుడు, బ్రహ్మస్వరూపుడూ, ప్రాణులందరకీ ప్రభువు, చర్మాన్ని వస్త్రంగా ధరించినవాడూ, పరమస్థానం అయినవాడూ అయిన అగ్నిని శరణు పొందుతున్నాను.

**తం ప్రపద్యే జగన్మూర్తిం ప్రభవం సర్వతేజసామ్ ।**
**మహాయోగేశ్వరం వహ్ని మాదిత్యం పరమేష్ఠినమ్ ॥ 120 ॥**

ప్రపంచస్వరూపుడూ, సమస్తతేజస్సుల పుట్టుకకీ కారణం అయినవాడూ, గొప్పయోగీశ్వరుడూ, ఆదిత్యుడూ, పరమేష్ఠీ అయిన ఆ అగ్నిని శరణు కోరుతున్నాను.

**ప్రపద్యే శరణం రుద్రం మహాగ్రాసం త్రిశూలినమ్ ।**
**కాలాగ్నిం యోగినా మీశం భోగమోక్షఫలప్రదమ్ ॥ 121 ॥**

సర్వభక్షకుడు, త్రిశూలీ, భోగమోక్షఫలప్రదుడూ, యోగీశ్వరుడూ, రుద్రుడూ, కాలాగ్నిరూపుడూ అయిన అగ్నిని శరణు వేడుతున్నాను.

**ప్రపద్యే త్వాం విరూపాక్షం భూర్భువ స్స్వః స్వరూపిణమ్ । 122 ॥**

**హిరణ్మయే గృహే గుప్తం మహాన్త మమితౌజసమ్ ।**
**వైశ్వానరం ప్రపద్యేఽ హం సర్వభూతేష్వవస్థితమ్ ॥ 123 ॥**

వ్యాహృతి త్రయస్వరూపుడు, విరూపాక్షుడు, హిరణ్మయగృహంలో దాగి ఉన్న వాడవగు నిన్ను శరణు కోరుతున్నాను. అన్ని ప్రాణుల్లో ఉండే వైశ్వానరుని శరణు వేడుతున్నాను.

**హవ్యకవ్యవహం దేవం ప్రపద్యే వహ్నిమీశ్వరమ్ ।**
**ప్రపద్యే తత్పరం తత్త్వం వరేణ్యం సవితుః స్వయమ్ ॥ 124 ॥**

హవ్యకవ్యాలు వహించే ఈశ్వరుని వహ్నిని శరణు పొందుతున్నాను. సవితృ దేవతయొక్క వరణీయం అయిన (శ్రేష్ఠం అన) పరమతత్త్వమూ అయిన అగ్నిని శరణుకోరుచున్నాను.

**భర్గ మగ్నిపరం జ్యోతీ రక్ష మాం హవ్యవాహన! ।**
**ఇతి వహ్న్యష్టకం జప్త్వా రామపత్నీ యశస్వినీ ॥ 125 ॥**

**ధ్యాయన్తీ మనసా తస్థౌ రామమున్మీలితేక్షణా ।**

కామకాలాదులను అణచినట్టి అగ్నియే ప్రధానంగా గలవాడూ, జ్యోతిరూపుడూ అయిన హవ్యవాహనా! నన్ను రక్షించు అని రాముని పత్ని అగ్న్యష్టకాన్ని జపించి రాముణ్ణి మనస్సులో ధ్యానిస్తూ కన్నులు తెరచి చూచింది.

**అథావసథ్యాత్ భగవాన్ హవ్యవాహో మహేశ్వరః ॥ 126 ॥**

**ఆవిరాసీత్ సుదీప్తాత్మా తేజసా ప్రహసన్నివ ।**
**సృష్ట్వా మాయామయీం సీతాం స రావణవధేప్సయా ॥ 127 ॥**

**సీతామాదాయ ధర్మిష్ఠాం పావకోఽన్తరధీయత ।**
**తాం దృష్ట్వా తాదృశీం సీతాం రావణో రాక్షసేశ్వరః ॥ 128 ॥**

**సమాదాయ యయౌ లంకాం సాగరాన్తరసంస్థితామ్ ।**
**సమాదాయాభవత్సీతాం శఙ్కాకులితమానసః ॥ 129 ॥**

**సా ప్రత్యయాయ భూతానాం సీతా మాయామయీ పునః ।**
**వివేశ పావకం దీప్తం దదాహ జ్వలనోఽపి తామ్ ॥ 130 ॥**

**దగ్ధ్వా మాయామయీం సీతాం భగవానుగ్ర దీధితిః ।**
**రామాయాదర్శయత్సీతాం పావకోఽభూత్సురప్రియః ॥131॥**

**ప్రగృహ్య భర్తుశ్చరణౌ కరాభ్యాం సా సుమధ్యమా ।**
**చకార ప్రణతిం భూమౌ రామాయ జనకాత్మజా ॥ 132॥**

**దృష్ట్వా హృష్టమనా రామో విస్మయాకులలోచనః ।**
**ననామ వహ్నిం శిరసా తోషయామాస రాఘవః ॥133॥**

**ఉవాచ వహ్నిం ర్భగవాన్ కిమేషా వరవర్ణినీ ।**
**దగ్ధా భగవతా పూర్వం దృష్టా మత్పార్శ్వ మాగతా ॥ 134॥**
**తమాహ దేవో లోకానాం దాహకో హవ్యవాహనః ।**
**యథావృత్తం దాశరథిం భూతానామేవ సన్నిధౌ ॥ 135॥**

ఈ విధంగా యశస్విని రామపత్ని వహ్న్యష్టకాన్ని జపించి మనసులో రాముని ధ్యానిస్తూ నిలిచినది. అంతలో గార్హపత్యాగ్నినుండి మహేశ్వరుడు హవ్యవాహనుడు తేజస్సుతో ప్రవహిస్తున్నట్లు జ్యోతి స్స్వరూపునిగా ఆవిర్భవించినాడు. అచట అగ్నిదేవుడు రావణవధను కోరి మాయాసీతను సృజించి ధర్మిష్ఠ అయిన సీతను గొని అంతర్ధానమయినాడు. ఆ మాయాసీతను చూచి రాక్షసాధిపతి రావణుడు ఆమెను తీసుకొని సాగరమధ్యలో ఉన్న లంకకు తీసుకొని పోయినాడు. తరువాత లక్ష్మణునితో కూడ ఉన్న రాముడు రావణుని చూచిన సీతను గొన సందేహించినాడు. జగాలకు నమ్మకం కల్గించటానికి మాయాసీత అగ్నిలో ప్రవేశించింది. అగ్నికూడ మాయా సీతను దహించింది. తర్వాత నిజమైన సీతను రామునికి చూపినాడు. దాంతో అగ్ని దేవతలకు ప్రీతిపాత్రుడైనాడు. అపుడు సీత తన చేతులతో భర్తపాదాలు తాకి రామునికి ప్రణమిల్లినది. సీతను చూచిన రాముడు ఆశ్చర్యంతో చూస్తూ సంతోషచిత్తుడై అగ్నిదేవునికి శిరసా నమస్కరించి అగ్నిని సంతోషింపచేసినాడు. తర్వాత రాముడు అగ్ని భగవానునితో ఇంతకుముందు ఇపుడు నా ప్రక్కనున్న ఈ సీతను నీలో లీనం కాగా చూచినాను అన్నాడు. అగ్ని వారందరిముందే జరిగినదంతా వివరించినాడు.

**ఇయం సా మిథిలేశేన పార్వతీం రుద్రవల్లభామ్ ।**
**ఆరాధ్య లబ్ధా తపసా దేవ్యాశ్చాత్యన్తవల్లభా ॥ 136॥**

మిథిలాపతి జనకుడు పార్వతి నారాధించి ఆమె కత్యంత ప్రీతిపాత్రురాలైన సీతను తనకు కూతురుగా పొందినాడు.

**భర్తుః శుశ్రూషణోపేతా సుశీలేయం పతివ్రతా ।**
**భవానీ పార్శ్వమానీతా మయా రావణకామితా ॥ 137॥**

రావణాసురుడు ఈమెను కోరినపుడు సుశీల, పతివ్రత, భర్తృశుశ్రూషణ పరాయణురాలైన ఈమెను పార్వతి సన్నిధికి చేర్చినాను.

**యా నీతా రాక్షసేశేన సీతా భగవతా హృతా ।**
**మయా మాయామయీ సృష్టా రావణస్య వధాయ సా ॥ 138 ॥**

**తదర్థం భవతా దుష్టో రావణో రాక్షసేశ్వరః ।**
**మయోపసంహృతా చైవ హృతో లోకవినాశనః ॥ 139 ॥**

**గృహాణ విమలామేనాం జానకీం వచనాన్మమ ।**
**పశ్య నారాయణం దేవం స్వాత్మానం ప్రభవావ్యయమ్ ॥ 140 ॥**

**ఇత్యుక్త్వా భగవాంశ్చణ్డో విశ్వార్చిర్విశ్వతోముఖః ।**
**మానితో రాఘవేణాగ్నిర్భూతైశ్చాన్తరధీయత ॥ 141 ॥**

**ఏతత్ పతివ్రతానాం వై మాహాత్మ్యం కథితం మయా ।**
**స్త్రీణాం సర్వాఘశమనం ప్రాయశ్చిత్తమిదం స్మృతమ్ ॥ 142 ॥**

**అశేషపాపయుక్తస్తు పురుషోఽపి సుసంయుతః ।**
**స్వదేహం పుణ్యతీర్థేషు త్యక్త్వా ముచ్యేత కిల్బిషాత్ ॥ 143 ॥**

**పృథివ్యాం సర్వతీర్థేషు స్నాత్వా పుణ్యేషు వా ద్విజః ।**
**ముచ్యతే పాతకైః సర్వైః సమస్తైరపి పూరుషః ॥ 144 ॥**

రావణుని వధకోరిన నేను మాయాసీతను సృష్టించి అక్కడకు చేర్చినాను. ఆమెనే రావణుడు తీసుకొని పోయినాడు. ఆమెనే నీవు రావణుని చంపి పొందినావు. ఇపుడు నేనా మాయాసీత నుపసంహరించినాను. నామాటతో పరిశుద్ధురాలైన ఈమెను గ్రహించు. తాము నారాయణదేవునిగా గుర్తించండి. అగ్నిదేవుడిట్లా పలికి రాముని తను అచటి సకల భూతముల పూజనంది అక్కడే అంతర్ధానమైనాడు. ఈ విధంగా మీకు పతివ్రతల మాహాత్మ్యం వివరించినాను. స్త్రీలకు సర్వపాపాలను నశింపచేసే ప్రాయశ్చిత్తం పాతివ్రత్యం మాత్రమే. సకలపాపాలు చేసిన పురుషుడు మనోనిగ్రహంతో పుణ్యతీర్థాల్లో దేహాన్ని విడిస్తే పాప విముక్తుడవుతాడు. భూమియందలి తీర్థాలన్నింటిలో స్నానం చేసినవాడు సకలపాప విముక్తుడవుతాడు.

**వ్యాస ఉవాచ:-**వాసమహర్షి చెప్పాడు

**ఇత్యేష మానవో ధర్మో యుష్మాకం కథితో మయా ।**
**మహేశారాధనార్థాయ జ్ఞానయోగశ్చ శాశ్వతమ్ ॥ 145 ॥**

ఈ విధంగా మీకు సర్వమానవధర్మాలు వివరించినాను. మహేశుని ఆరాధించే జ్ఞానయోగం కూడా తెలిపినాను.

**యోఽనేన విధినా యుక్తం జ్ఞానయోగం సమాచరేత్ ।**
**స పశ్యతి మహాదేవం నాన్యః నా కల్పశతైరపి ॥ 146 ॥**

ఈ విధిననుసరించి జ్ఞానయోగాన్నాచరించేవాడు మహేశుని సాక్షాత్కారాన్ని పొందుతాడు. ఇతరులు నూరుకల్పాల కైనా పొందలేరు.

**స్థాపయేద్యః పరం ధర్మం జ్ఞానం తత్పారమేశ్వరమ్ ।**
**న తస్మాదధికో లోకే యో యోగీ పరమో మతః ॥ 147 ॥**

ఈ భూమండలంలో ఈ పరమధర్మమగు పరమేశ్వరజ్ఞానాన్ని స్థాపించే వాని కంటె ఉత్తముడు మరొకడుండడు. అతడే పరమయోగి అవుతాడు.

**యః సంస్థాపయితుం శక్తో న కుర్యాన్మోహితో జనః ।**
**స యోగయుక్తోఽపి మునిర్నాత్యర్థం భగవత్ప్రియః ॥ 148 ॥**

ఈ ధర్మజ్ఞానాలు స్థాపించ శక్తుడైకూడ మోహంతో స్థాపించకుంటే అతడు యోగయుక్తుడైనా భగవత్ ప్రియుడు కాలేడు.

**తస్మా త్సదైవ దాతవ్యం బ్రాహ్మణేషు విశేషతః ।**
**ధర్మయుక్తేషు శాన్తేషు శ్రద్ధయా చాన్వితేషు వై ॥ 149 ॥**

ధర్మం, శాంతం, శ్రద్ధ కలవారికి ముఖ్యంగా బ్రాహ్మణులకు ఈ ధర్మజ్ఞానయోగాన్ని ఉపదేశించాలి.

**యః పఠేద్భవతాం నిత్యం సంవాదం మమ చైవ హి ।**
**సర్వపాపవినిర్ముక్తో గచ్ఛేత పరమాం గతిమ్ ॥ 150 ॥**

మనమధ్య జరిగిన ఈ సంవాదాన్ని విన్నవాడు కూడా సర్వపాపవిముక్తుడవుతాడు. పరమపదాన్ని పొందుతాడు.

**శ్రాద్ధే వా దైవికే కార్యే బ్రాహ్మణానాఞ్చ సన్నిధౌ ।**
**పఠేత నిత్యం సుమనాః శ్రోతవ్యఞ్చ ద్విజాతిభిః ॥ 151 ॥**

శ్రాద్ధంలో, దైవకార్యంలో కాని బ్రాహ్మణసన్నిధానంలో నిగ్రహంతో చదవాలి. ద్విజులు వినాలి.

**యోఽర్థం విచార్య యుక్తాత్మా శ్రావయేద్బ్రాహ్మణాన్ శుచీన్ ।**
**స దోషకఞ్చుకం త్యక్త్వా యాతి దేవం మహేశ్వరమ్ ॥ 152 ॥**

మనోనిగ్రహంతో అర్థాన్ని బాగా విచారించి పవిత్రులైన బ్రాహ్మణులకు వినిపిస్తే సకలదోషాలు తొలగి మహేశ్వరుని సన్నిధానం చేరుకుంటాడు.

**ఏతావదుక్త్వా భగవాన్ వ్యాసః సత్యవతీసుతః ।**
**సమాశ్వాస్య మునీన్ సూతం జగామ చ యథాగతమ్ ॥ 153 ॥**

సత్యవతీసుతుడగు వ్యాస భగవానుడు ఈ విధంగా తెలిపి సూతమహర్షిని ఇతరమునులను ఓదార్చి తనదారిన తాను వెళ్ళినాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే మానవధర్మే త్రయస్త్రింశోఽధ్యాయః ॥ 33 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలోని మానవధర్మాలనే ముప్పై మూడవ అధ్యాయం॥ 33 ॥

## చతుస్త్రింశోఽధ్యాయః - ముప్పై నాలుగవ అధ్యాయం

## తీర్థప్రకరణమ్ - తీర్థప్రకరణం

**ఋషయః ఊచు :-**ఋషులు పలికారు

**తీర్థాని యాని లోకేఽస్మిన్ విశ్రుతాని మహాన్తి చ ।**
**తాని త్వం కథయాస్మాకం రోమహర్షణసామ్ప్రతమ్ ॥ 1 ॥**

రోమహర్షణా! నీవు ఈ లోకంలో ప్రఖ్యాతినొందిన విశేషమైన వివిధతీర్థాలేవో మాకు వాటిని గూర్చి వివరించు.

**రోమహర్షణ ఉవాచ :-**రోమహర్షణుడు చెప్పాడు

**శృణుధ్వం కథయిష్యేఽహం తీర్థాని వివిధాని చ ।**
**కథితాని పురాణేషు మునిభిర్బ్రహ్మవాదిభిః ॥ 2 ॥**

మునిశ్రేష్ఠులారా! పురాణాల్లో బ్రహ్మవిదులైన మునులు చెప్పిన వివిధ తీర్థాలను గూర్చి చెపుతాను వినండి.

**యత్ర స్నానం జపో హోమః శ్రాద్ధదానాదికం కృతమ్ ।**
**ఏకైకశో మునిశ్రేష్ఠాః పునాత్యాసప్తమం కులమ్ ॥ 3 ॥**

ఈ తీర్థాల్లో ఒకసారైనా జపం, హోమం, శ్రాద్ధం, దానాదుల్లో ఏ ఒకటి ఆచరించినా ఆచరించిన వాని వంశంలో ఏడుతరాలు పవిత్రమవుతాయి.

**పఞ్చయోజన విస్తీర్ణం బ్రహ్మణః పరమేష్ఠినః ।**
**ప్రయాగం ప్రథితం తీర్థం తస్య మాహాత్మ్యమీరితమ్ ॥ 4 ॥**

పరమేష్ఠి అయిన చతుర్ముఖబ్రహ్మకు సంబంధించిన ప్రయాగతీర్థం ప్రసిద్ధి చెందింది. ఐదుయోజనాల విస్తీర్ణం కల ఈ తీర్థం మాహాత్మ్యం ఇంతకు ముందే తెలిపినాను.

**అన్యచ్చ తీర్థ ప్రవరం కురూణాం దేవవన్దితమ్ ।**
**ఋషీణామాశ్రమై ర్జుష్టం సర్వపాపవిశోధనమ్ ॥ 5 ॥**

మరో తీర్థం దేవతలు కూడా నమస్కరించేది కురుక్షేత్రం. అది ఋష్యాశ్రమాలతో నిండి ఉంటుంది. సర్వపాపాలు క్షాళన చేయగలది.

**తత్ర స్నాత్వా విశుద్ధాత్మా దమ్భమాత్సర్యవర్జితః ।**
**దదాతి యత్కిఞ్చిదపి పునాత్యుభయతః కులమ్ ॥ 6 ॥**

అందులో స్నానం చేసి దంభం మాత్సర్యం వదలి శుద్ధమైన అంతఃకరణంతో ఏ మాత్రం దానం చేసినా ఉభయకులాలను పవిత్రం చేస్తుంది.(తన తరపు భార్యతరపు వంశాలను)

**గయాతీర్థం పరం గుహ్యం పితౄణాం చాతివల్లభమ్ ।**
**కృత్వా పిండప్రదానన్తు న భూయో జాయతే నరః ॥ 7 ॥**

గయాతీర్థం మిక్కిలి రహస్యం అయినది. అది పితృదేవతల కత్యంత ప్రియమైనది. అక్కడ పిండప్రదానం చేసే నరునికి పునర్జన్మ రాదు.

**సకృద్గయాభిగమనం కృత్వా పిణ్డం దదాతి యః ।**
**తారితాః పితరస్తేన యాస్యన్తి పరమాం గతిమ్ ॥ 8 ॥**

ఒకసారైనా గయకుపోయి అచట పిండప్రదానం చేస్తే అతని పితృదేవతలు నరకాది లోకాలు తరించి పరమపదం చేరుకుంటారు.

**తత్ర లోకహితార్థాయ రుద్రేణ పరమాత్మనా ।**
**శిలాతలే పదం న్యస్తం తత్ర పితౄన్ ప్రసాదయేత్ ॥ 9 ॥**

అక్కడనే లోకహితాన్ని కోరి రుద్రుడు తన పాదముద్రలు శిలాతలంలో ఉంచాడు. ఆ స్థానంలో పితృదేవతలను ప్రసన్నం చేసుకోవాలి.

**గయాభిగమనం కర్తుం యః శక్తో నాభిగచ్ఛతి ।**
**శోచన్తి పితరస్తం వై వృథా తస్య పరిశ్రమః ॥ 10 ॥**

వెళ్ళగల శక్తి ఉన్నా గయకు వెళ్ళనివాని పితృదేవతలు అతనిగూర్చి దుఃఖిస్తారు. అతని ఇతర ధర్మకార్యాలన్నీ వ్యర్థాలవుతాయి.

**గాయన్తి పితరో గాథాః కీర్తయన్తి మహర్షయః ।**
**గయాం యాస్యతి యః కశ్చిత్ సోఽస్మాన్ సన్తారయిష్యతి ॥ 11 ॥**

ఏ ఒక్కడు గయకు వెళ్ళటం జరిగినా అతడు మమ్ము తరింప చేస్తాడంటూ పితృదేవతలు అతనిగాథను గానం చేస్తారు. మహర్షులతణ్ణి కీర్తిస్తారు.

**యది స్యాత్ పాతకోపేతః స్వధర్మరతివర్జితః ।**
**గయాం యాస్యతి వంశ్యో యః సోఽస్మాన్ సంతారయిష్యతి ॥ 12 ॥**

మావంశంలో పరమపాపాత్ముడైనా, స్వధర్మాలు వదలినవాడైనా ఒకసారి గయాయాత్రచేస్తే మమ్మల్ని తరింపచేస్తాడు.

**ఏష్టవ్యా బహవః పుత్రాః శీలవన్తో గుణాన్వితాః ।**
**తేషాన్తు సమవేతానాం యద్యేకోఽపి గయాం వ్రజేత్ ॥ 13 ॥**

శీలవంతులు, గుణవంతులు, పుత్రులు చాలా మంది పుడుదురు కాక అని కోరుకోవాలి. ఎందులకనగా వారిలో ఒక్కడైనా గయకు వెళతాడు అని.

**తస్మాత్సర్వ ప్రయత్నేన బ్రాహ్మణస్తు విశేషతః ।**
**ప్రదద్యాద్విధివ త్పిణ్డాన్ గయాం గత్వా సమాహితః ॥ 14 ॥**

అందువల్ల ప్రతి ఒక్కడు ముఖ్యంగా బ్రాహ్మణుడు గయా తీర్థం చేరి ఏకాగ్రతతో విధ్యుక్తంగా పింద ప్రదానం చేయాలి.

**ధన్యాస్తు ఖలు తే మర్త్యా గయాయాం పిణ్డదాయినః ।**
**కులాన్యుభయతః సప్త సముద్ధృత్యాప్నుయాత్ పరమ్ ॥ 15 ॥**

గయాక్షేత్రంలో పిండప్రదానంచేసే మానవులు ఎంతో ధన్యులు. వారివల్ల వారి తల్లిదండ్రుల వంశాలు రెండూ ఏడు తరాలు తరించటమేకాక వారు కూడ సద్గతి నందుతారు.

**అన్యచ్చ తీర్థప్రవరం సిద్ధావాసముదాహృతమ్ ।**
**ప్రభాసమితి విఖ్యాతం యత్రాఽఽస్తే భగవాన్ భవః ॥ 16 ॥**

ప్రభాసమనే పేర విఖ్యాతమైనది మరో ఉత్తమ తీర్థం. అది సిద్ధ పురుషుల ఆవాస స్థలం. అక్కడ భగవంతుడు శంకరుడున్నాడు.

**తత్ర స్నానం తపః శ్రాద్ధం బ్రాహ్మణానాఞ్చ పూజనమ్ ।**
**కృత్వా లోకమవాప్నోతి బ్రాహ్మణోఽక్షయముత్తమమ్ ॥ 17 ॥**

అక్కడ స్నానం, తపం, శ్రాద్ధం, బ్రాహ్మణారాధన చేసినందువల్ల బ్రాహ్మణుడు శాశ్వతం అయిన ఉత్తమ బ్రహ్మలోకం పొందుతాడు.

**తీర్థం త్రైయమ్బకం నామ సర్వదేవనమస్కృతమ్ ।**
**పూజయిత్వా తత్ర రుద్రం జ్యోతిష్టోమఫలం లభేత్ ॥ 18 ॥**

త్రైయంబకమనే తీర్థం సర్వదేవతల పూజనందినది. అక్కడ రుద్రుని పూజించి జ్యోతిష్టోమఫలం పొందుతాడు.

**సువర్ణాక్షం మహాదేవం సమభ్యర్చ్య కపర్దినమ్ ।**
**బ్రాహ్మణాన్ పూజయిత్వా తు గాణాపత్యం లభేత్ ధ్రువమ్ ॥ 19 ॥**

సువర్ణాక్షం అనే మహాదేవుని కపర్ది అయిన శివుని అర్చించి బ్రాహ్మణులను పూజిస్తే గాణాపత్యం లభిస్తుంది. ఇది నిశ్చయం.

**సోమేశ్వరం తీర్థవరం రుద్రస్య పరమేష్ఠినః ।**
**సర్వవ్యాధిహరం పుణ్యం రుద్రసాలోక్యకారణమ్ ॥ 20 ॥**

భక్తానుగ్రహకారకుడైన రుద్రుని యొక్క సోమేశ్వరమనే ఉత్తమతీర్థం సకలవ్యాధులను పోగొడుతుంది. పుణ్యప్రదం. ఇది రుద్రసాలోక్యాన్ని కలిగించటానికి ఉత్తమసాధనం.

**తీర్థానాం పరమం తీర్థం విజయం నామ శోభనమ్ ।**
**తత్ర లిఙ్గం మహేశస్య విజయం నామ విశ్రుతమ్ ॥ 21 ॥**

విజయ మనే పేరుగల తీర్థం అన్ని తీర్థాల్లో ఉత్తమమైంది. శుభకరం. అచ్చట శివలింగం విజయ మనే పేరుతో ప్రసిద్ధమైంది.

**షణ్మాసాన్ నియతాహారో బ్రహ్మచారీ సమాహితః ।**
**ఉషిత్వా తత్ర విప్రేన్ద్రా యాస్యన్తి పరమం పదమ్ ॥ 22 ॥**

అక్కడ ఆరుమాసాలవరకు నియతాహారులై బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ ఏకాగ్రతతో గడిపే ఉత్తమవిప్రులు పరమపదాన్ని తప్పక పొందుతాడు.

**అన్యచ్చ తీర్థప్రవరం పూర్వదేశే సుశోభనమ్ ।**
**ఏకామ్రం దేవదేవస్య గాణపత్యఫలప్రదమ్ ॥ 23 ॥**

తూర్పుదేశంలో మిక్కిలి రమణీయమైన ఉత్తమతీర్థం ఏకామ్రతీర్థం. దేవదేవుడు శివుడున్న ఈ తీర్థం గాణాపత్యఫలప్రదం.

**దత్త్వాఽత్ర శివభక్తానాం కిఞ్చిచ్ఛశ్వన్మహీం శుభామ్ ।**
**సార్వభౌమో భవేద్రాజా ముముక్షుర్మోక్షమాప్నుయాత్ ॥ 24 ॥**

అచట శివభక్తులకు ఏకొంచం స్థిరమైన భూదానం చేసినవాడు సార్వభౌమాధికారం పొందుతాడు. మోక్షార్థి మోక్షాన్ని పొందుతాడు.

**మహానదీజలం పుణ్యం సర్వపాపవినాశనమ్ ।**
**గ్రహణే సముపస్పృశ్య ముచ్యతే సర్వపాతకైః ॥ 25 ॥**

పవిత్రం సర్వపాప వినాశకం అయిన అక్కడి మహానదీ జలంలో గ్రహణ సమయమందు స్నాన జపాదులు నిర్వర్తించినవాడు సర్వపాపాలనుండి వెంటనే విముక్తుడవుతాడు.

**అన్యా చ విరజా నామ నదీ త్రైలోక్యవిశ్రుతా ।**
**తస్యాం స్నాత్వా నరో విప్రా బ్రహ్మలోకే మహీయతే ॥ 26 ॥**

ముల్లోకాల్లో ప్రసిద్ధి పొందిన విరజ అనే మరో నది ఉన్నది. ఈ నదిలో స్నానమాడిన విప్రుడు బ్రహ్మలోకంలో సన్మానమందుతాడు.

**తీర్థం నారాయణస్యాన్యన్నామ్నా తు పురుషోత్తమమ్ ।**
**తత్ర నారాయణః శ్రీమానాస్తే పరమపూరుషః ॥ 27 ॥**

శ్రీమన్నారాయణుని తీర్థం పురుషోత్తమం అనేది మరొకటి ఉన్నది. అక్కడ పరమపురుషుడు నారాయణుడున్నాడు.

**పూజయిత్వా పరం విష్ణుం స్నాత్వా తత్ర ద్విజోత్తమః ।**
**బ్రాహ్మణాన్పూజయిత్వా తు విష్ణులోకమవాప్నుయాత్ ॥ 28 ॥**

ఆ తీర్థంలో స్నానం చేసిన ద్విజుడు శ్రీహరిని పూజించి బ్రాహ్మణులను ఆరాధిస్తే విష్ణులోకాన్ని పొందుతాడు.

**తీర్థానాం పరమం తీర్థం గోకర్ణం నామ విశ్రుతమ్ ।**
**సర్వపాపహరం శమ్భోర్నివాసః పరమేష్ఠినః ॥ 29 ॥**

అన్ని తీర్థాల్లో పరమతీర్థం సుప్రసిద్ధమైన గోకర్ణతీర్థం. ఇది సర్వపాపహరం. పరమేష్ఠి అయిన శంకరుని వాసస్థానం.

**దృష్ట్వా లిఙ్గన్తు దేవస్య గోకర్ణేశ్వరముత్తమమ్ ।**
**ఈప్సితాంల్లభతే కామాన్ రుద్రస్య దయితో భవేత్ ॥ 30 ॥**

గోకర్ణక్షేత్రాన్ని అక్కడి పరమోత్తమమైన శంకరుని లింగాన్ని దర్శించి సకలాభీష్టములు పొందవచ్చు. రుద్రునికి ప్రీతిపాత్రుడవుతాడు.

**ఉత్తరఞ్చాపి గోకర్ణం లిఙ్గం దేవస్య శూలినః ।**
**మహాదేవస్యార్చయిత్వా శివసాయుజ్యమాప్నుయాత్ ॥ 31 ॥**

ఉత్తరగోకర్ణంలో కూడ త్రిశూలి శంకరుని లింగం ఉన్నది. ఆ లింగాన్ని అర్చించినవారు శివసాయుజ్యాన్ని పొందుతారు.

**తత్ర దేవో మహాదేవః స్థాణురిత్యభివిశ్రుతః ।**
**తం దృష్ట్వా సర్వపాపేభ్యో ముచ్యతే తత్క్షణాన్నరః ॥ 32 ॥**

ఉత్తరగోవర్ణంలో మహాదేవుడు స్థాణువనే పేర ప్రసిద్ధుడు. ఆయనను దర్శించినవా రాక్షణంలోనే అన్ని పాపాలనుండి విముక్తులౌతారు.

**అన్యత్కుబ్జామ్ర మతులం స్థానం విష్ణోర్మహాత్మనః ।**
**సమ్పూజ్య పురుషం విష్ణుం శ్వేతద్వీపే మహీయతే ॥ 33 ॥**

మహానుభావుడైన శ్రీవిష్ణువు వసించే దివ్యక్షేత్రం కుబ్జామ్ర మనేది. అచట మహావిష్ణువును పూజించిన వారు శ్వేతద్వీపాన్ని పొందుతారు.

**యత్ర నారాయణో దేవో రుద్రేణ త్రిపురారిణా ।**
**కృత్వా యజ్ఞస్య మథనం దక్షస్య తు విసర్జితః ॥ 34 ॥**

ఇచట త్రిపురారి రుద్రుడు దక్షయజ్ఞాన్ని ధ్వంసంచేసి, అతణ్ణి వధించి ఆ దోషపరిహారానికై శ్రీమన్నారాయణ ప్రతిష్ఠ చేసినాడు.

**సమన్తాద్యోజనం క్షేత్రం సిద్ధర్షిగణసేవితమ్ ।**
**పుణ్యమాయతనం విష్ణోః తత్రాస్తే పురుషోత్తమః ॥ 35 ॥**

ఈ క్షేత్రాన్ని యోజన పర్యంతం సిద్ధ ఋషిగణాలు సేవిస్తుంటాయి. ఇచట శ్రీవిష్ణువునకు పరమపావనమైన ఆలయం ఉన్నది. అక్కడ పురుషోత్తముడున్నాడు.

**అన్యత్కోకాముఖం విష్ణోః తీర్థమద్భుతకర్మణః ।**
**మృతోఽత్ర పాతకైర్ముక్తో విష్ణుసారూప్యమాప్నుయాత్ ॥ 36 ॥**

కోకాముఖమనే మరో విష్ణుక్షేత్రం ఉన్నది. ఇచట మరణించినవాడు పాపవిముక్తి పొంది విష్ణుసారూప్యాన్ని పొందుతాడు.

**శాలిగ్రామం మహాతీర్థం విష్ణోః ప్రీతివివర్ధనమ్ ।**
**ప్రాణాంస్తత్ర నరస్త్యక్త్వా హృషీకేశం ప్రపశ్యతి ॥ 37 ॥**

శ్రీ మహావిష్ణు పవిత్ర క్షేత్రం సాలగ్రామమనేది మరొకటి. ఈ క్షేత్రం విష్ణువునకు ప్రీతిని పెంచుతుంది. అక్కడ నరుడు ప్రాణాలు వదలి హృషీకేశుని దర్శిస్తాడు.

**అశ్వతీర్థమితి ఖ్యాతం సిద్ధావాసం సుపావనమ్ ।**
**ఆస్తే హయశిరా నిత్యం తత్ర నారాయణస్స్వయమ్ ॥ 38 ॥**

ప్రసిద్ధమైన అశ్వతీర్థ మనేది మరొక సిద్ధవాసమైన విష్ణుక్షేత్రం ఉన్నది. ఇక్కడ విష్ణువు హయశిరుడు అనే పేర ప్రసిద్ధుడు.

**తీర్థం త్రైలోక్యవిఖ్యాతం బ్రహ్మణః పరమేష్ఠినః ।**
**పుష్కరం సర్వపాపఘ్నం మృతానాం బ్రహ్మలోకదమ్ ॥ 39 ॥**

ముల్లోకాల్లో ప్రసిద్ధమైనది పరమేష్ఠి అయిన బ్రహ్మ తీర్థం. ఇది సర్వపాపహరమగు పుష్కరతీర్థం. ఇచట మరణించినవారికి బ్రహ్మలోకం లభిస్తుంది.

**మనసా సంస్మరేత్ యస్తు పుష్కరం వై ద్విజోత్తమః ।**
**పూయతే పాతకైస్సర్వైః శక్రేణ సహ మోదతే ॥ 40 ॥**

ఈ పుష్కరతీర్థాన్ని చిత్తంలో స్మరించిన ద్విజునికి సకలపాప విముక్తి కల్గి ఇంద్రుని స్వర్గవాసం లభిస్తుంది.

**తత్ర దేవాః సగన్ధర్వాః సయక్షోరగరాక్షసాః ।**
**ఉపాసతే సిద్ధసంఘాః బ్రహ్మాణం పద్మసమ్భవమ్ ॥ 41 ॥**

ఈ తీర్థంలో గన్ధర్వులు, యక్ష ఉరగ రాక్షసులు, దేవతలు, సిద్ధుల సంఘాలు బ్రహ్మను సేవిస్తుంటాయి.

**తత్ర స్నాత్వా భవేచ్ఛుద్ధో బ్రహ్మాణం పరమేష్ఠినమ్ ।**
**పూజయిత్వా ద్విజవరాన్ బ్రహ్మాణం సంప్రపశ్యతి ॥ 42 ॥**

ఇచట స్నానం చేసి శుద్ధుడై బ్రహ్మను బ్రాహ్మణులను పూజిస్తే బ్రహ్మసాక్షాత్కారం పొందుతాడు.

**తత్రాభిగమ్య దేవేశం పురుహూతమనిన్దితమ్ ।**
**సురూపో జాయతే మర్త్యః సర్వాన్కామానవాప్నుయత్ ॥ 43 ॥**

తర్వాత బ్రహ్మకు నమస్కరించి ఇంద్రలోకానికి వెళ్ళి ఇంద్రుని దర్శించి ఇంద్రుని వంటి సౌందర్యం పొంది సకలాభీష్టాలు నెరవేర్చుకుంటాడు.

**సప్తసారస్వతం తీర్థం బ్రహ్మాద్యైస్సేవితం పరమ్ ।**
**పూజయిత్వా తత్ర రుద్రమశ్వమేధఫలం లభేత్ ॥ 44 ॥**

బ్రహ్మాది దేవతలు సేవించిన సప్తసారస్వత మనే ఉత్తమ తీర్థమొకటున్నది. ఆ తీర్థంలో శంకరుని పూజించి అశ్వమేధఫలం పొందవచ్చును.

**యత్ర మఙ్కణకో రుద్రం ప్రపన్నః పరమేశ్వరమ్ ।**
**ఆరాధయామాస హరం పఞ్చాక్షరపరాయణః ॥ 45 ॥**

ఈ క్షేత్రంలో మంకణకుడు అనే శివభక్తుడు శివుని శరణుచేరి పంచాక్షరి జపిస్తూ హరుని ఆరాధించేవాడు.

**నమశ్శివాయేతి మునిః జపన్పఞ్చాక్షరం పరమ్ ।**
**ఆరాధయామాస శివం తపసా గోవృషధ్వజమ్ ॥ 46 ॥**

నమశ్శివాయ అనే పంచాక్షరి జపిస్తూ తపస్సుతో అతడు శివుని ఆరాధించాడు.

**ప్రజజ్వాలాథ తపసా మునిర్మఙ్కణకస్తథా ।**
**ననర్త హర్షవేగేన జ్ఞాత్వా రుద్రం సమాగతమ్ ॥ 47 ॥**

మఙ్కణకముని తపస్సుతో ప్రకాశించాడు. పరమేశ్వరుడు వచ్చాడని తెలిసికొని గాఢం అయిన సంతోషంతో నృత్యం చేశాడు.

**తం ప్రాహ భగవాన్ రుద్రః కిమర్థం నర్తితం త్వయా ।**
**దృష్ట్వాఽపి దేవమీశానం నృత్యతి స్మ పునః పునః ॥ 48 ॥**

రుద్రుడు వచ్చినాడని తెలిసి ఆనందంతో నర్తించినాడు. ఆ మునిని రుద్రుడు నీవెందుకు నర్తించినావని అడిగినాడు. శంకరుని చూచి అతని మాట వినికూడ మళ్ళీమళ్ళీ అతడు నృత్యం చేస్తుండినాడు.

**సోఽన్వీక్ష్య భగవానీశః సగర్వం గర్వశాన్తయే ।**
**స్వకం దేహం విదార్యాస్మై భస్మరాశిమదర్శయత్ ॥ 49 ॥**

ఈశ్వరుడైన శంకరుడు గర్వించిన మంకణమునిని చూచి అతనిగర్వం అణచటానికి తన శరీరాన్ని చీల్చి భస్మరాశిని చూపించాడు.

**పశ్యేమం మచ్ఛరీరోత్థం భస్మరాశిం ద్విజోత్తమ ।**
**మాహాత్మ్యమేతత్తపసస్త్వాదృశో ఽన్యో ఽపి విద్యతే ॥ 50 ॥**

ఓ బ్రాహ్మణోత్తమా! నా శరీరంలో యేర్పడిన ఈ భస్మరాశిని చూడు. ఇది తపస్సుయొక్క మహిమ నీవంటివాడింకొకడు ఉన్నాడు.

**యత్సగర్వం హి భవతా నర్తితం మునిపుఙ్గవ ।**
**న యుక్తం తాపసస్యైతత్త్వత్తోఽ ప్యభ్యధికో హ్యయమ్ ॥ 51 ॥**

మునిశ్రేష్ఠా! నీవు తపోగర్వంతో ఇట్లా నృత్యం చేయటం తగినది కాదు. నేను తపస్సులో, నృత్యంలో కూడా నీకంటే అధికుణ్ణి.

**ఇత్యాభాష్య మునిశ్రేష్ఠం స రుద్రః కిల విశ్వదృక్ ।**
**ఆస్థాయ పరమం భావం ననర్త జగతో హరః ॥ 52 ॥**

ఇట్లా మునితో పలికి విశ్వద్రష్ట శంకరుడు పరమభావంలో నిల్చి జగత్సంహారకుడైన రుద్రుడు నృత్యం చేసినాడు.

**సహస్రశీర్షా భూత్వాఽసౌ సహస్రాక్షః సహస్రపాత్ ।**
**దంష్ట్రాకరాళవదనో జ్వాలామాలీ భయఙ్కరః ॥ 53 ॥**

అచట రుద్రుడు, సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు, దంష్ట్రాకరాళవదనుడు, జ్వాలామాలి అయి భయంకరునిగా మారినాడు.

**సూర్యాయుతసమప్రఖ్యాం ప్రసన్నవదనాం శివామ్ ।**
**సస్మితం ప్రేక్ష్య విశ్వేశం తిష్ఠన్తీమమితద్యుతిమ్ ॥ 54 ॥**

మంకణముని విరాడ్రూపుని ప్రక్కన సుందరమైన విలాసిని, విశాలలోచన, పదివేల సూర్యుల సమాన కాంతిగలది, ప్రసన్నవదన, సుందరి అయిన పార్వతిని చూచినాడు. ఆమె శంకరుని చూస్తూ చిరునవ్వుతో నిలిచినది. అద్భుత తేజోవతి.

**దృష్ట్వా సన్త్రస్తహృదయో వేపమానో మునీశ్వరః ।**
**ననామ శిరసా రుద్రం రుద్రాధ్యాయం జపన్ వశీ ॥ 55 ॥**

అట్లా శివుని విరాడ్రూపాన్ని, పార్వతిని చూచి భీతచిత్తుడై వణకుతూ మునీశ్వరుడు మనసునియంత్రణలో ఉంచుకొని రుద్రాధ్యాయాన్ని జపిస్తూ శిరసు వంచి రుద్రునికి నమస్కరించినాడు.

**ప్రసన్నో భగవానీశస్త్ర్యంబకో భక్తవత్సలః ।**
**పూర్వవేషం స జగ్రాహ దేవీ చాన్తర్హితాఽభవత్ ॥ 56 ॥**

తర్వాత భక్తవత్సలుడు, త్ర్యంబకుడైన ఈశ్వరుడు అతనికి ప్రసన్నుడై పూర్వరూపాన్ని దాల్చినాడు. పార్వతీదేవి అంతర్ధానము చెందినది.

**ఆలిఙ్గ్య భక్తం ప్రణతం దేవదేవః స్వయం శివః ।**
**న భేతవ్యం త్వయా వత్స! ప్రాహ కిన్తే దదామ్యహమ్ ॥ 57 ॥**

దేవదేవుడైన శివుడు భక్తుడైన మంకణమునిని స్వయంగా ఆలింగనం చేసుకొని భయపడవలదు. నీకేమి కావలెనో తెల్పుమనెను.

**ప్రణమ్య మూర్ధ్నా గిరిశం హరం త్రిపురసూదనమ్ ।**
**విజ్ఞాపయామాస తదా హృష్టః ప్రష్టుమనా మునిః ॥ 58 ॥**

ఆ ముని త్రిపురసూదనుడైన గిరీశునికి నమస్కరించి సంతోషచిత్తుడై అడగదలచినవానివలె ఇట్లా విన్నవించినాడు.

**నమోఽస్తు తే మహాదేవ మహేశ్వర నమోఽస్తు తే ।**
**కిమేతద్భగవన్ రూపం సుఘోరం విశ్వతోముఖమ్ ॥ 59 ॥**

**కా చ తే భగవన్ పార్శ్వే రాజమానా వ్యవస్థితా ।**
**అన్తర్హితేవ సహసా సర్వమిచ్ఛామి వేదితుమ్ ॥ 60 ॥**

**ఇత్యుక్తే వ్యాజహారేమం తథా మంకణకం హరః ।**
**మహేశః స్వాత్మనో యోగం దేవీఞ్చ త్రిపురాన్తకః ॥ 61 ॥**

మహాదేవా! నీకు నమస్కారం. మహేశ్వరా! నమస్కారం. సకలజగాన్ని వ్యాపించిన భయంకరమైన నీ ఘోరరూపమేమిటి? తమ ప్రక్క ప్రకాశిస్తూ నిలుచున్నామె ఎవరు? ఎందుకంతర్ధాన మైనది. తెలియ గోరుతున్నాను. అనగా మంకణకునితో మహేశ్వరుడు హరుడు ఇట్లా పలుకుతూ ఆత్మయోగాన్ని దేవిని గూర్చి తెలిపినాడు.

**అహం సహస్రనయనః సర్వాత్మా సర్వతోముఖః ।**
**దాహకః సర్వపాపానాం కాలః కాలకరో హరః ॥ 62 ॥**

నేను సహస్ర నేత్రుడను. సర్వరూపుడను. సర్వతోముఖుడను. సర్వపాపదాహకుడను. కాలుడను, కాలాన్ని సృష్టించేవాణ్ణి.

**మయైవ ప్రేర్యతే కృత్స్నం చేతనాచేతనాత్మకమ్ ।**
**సోఽన్తర్యామీ స పురుషో హ్యయం వై పురుషోత్తమః ॥ 63 ॥**

సకల చేతనా చేతనాత్మకమైన ఈ జగత్తు నావల్లనే ప్రేరేపితమవుతున్నది. వారిలో అంతర్యామిని నేనే. నేను పురుషుడను. పురుషోత్తముడను నేనే.

**తస్య సా పరమా మాయా ప్రకృతిస్త్రిగుణాత్మికా ।**
**ప్రోచ్యతే మునిభిః శక్తిర్జగద్యోనిః సనాతనీ ॥ 64 ॥**

ఈ నా పరమమాయ త్రిగుణాత్మకమైన ప్రకృతి. ఈ మాయనే ఋషులు శక్తి, జగద్యోని, సనాతని అని చెబుతున్నారు.

**స ఏష మాయయా విశ్వం వ్యామోహయతి విశ్వవిత్ ।**
**నారాయణః పరోఽవ్యక్తో మాయారూప ఇతి శ్రుతిః ॥ 65 ॥**

నేనే ఆ మాయతో ఈ జగత్తునంతా మోహింప చేస్తున్నాను. శ్రుతి నన్నే నారాయణుడు, పరుడు, అవ్యక్తుడు, మాయారూపుడు అని చెబుతుంది.

**ఏవమేతజ్జగత్సర్వం సర్వదా స్థాపయామ్యహమ్ ।**
**యోజయామి ప్రకృత్యాఽహం పురుషం పఞ్చ వింశకమ్ ॥ 66 ॥**

ఈ జగత్తు నెల్లవేళలా ఈ విధంగా నేనే నిలుపుతుంటాను. ఈ ప్రకృతిలో ఇరవై అయిదవ తత్త్వమనే పురుషుని కలిపేవాడను నేనే.

**తథా వై సఙ్గతో దేవః కూటస్థః సర్వగోఽమలః ।**
**సృజత్యశేష మేవేదం స్వమూర్తేః ప్రకృతేరజః ॥ 67 ॥**

దేవుడు కూటస్థుడు, సర్వవ్యాపి, పరిశుద్ధుడు ప్రకృతితో కలిసి సకలజగాన్ని సృష్టిస్తాడు.

**స దేవో భగవాన్ బ్రహ్మ విశ్వరూపః పితామహః ।**
**తవైతత్కథితం సమ్యక్ స్రష్టృత్వం పరమాత్మనః ॥ 68 ॥**

ఈ పురుషుడే బ్రహ్మ విశ్వరూపుడు పితామహుడు. ఇట్లా నేనే నీకు పరమాత్మ స్రష్టృత్వాన్ని బాగా తెలిపినాను.

**ఏకోఽహం భగవాన్ కాలో హ్యనాదిశ్చాన్తకృత్ విభుః ।**
**సమాస్థాయ పరం భావం ప్రోక్తో రుద్రో మనీషిభిః ॥ 69 ॥**

నేను ఒకడనే. నేనే కాలుడను ఆదిరహితుణ్ణి. సకలజగాన్ని అంతం చేసేవాణ్ణి. పరమ భావాన్ని స్వీకరించిన నన్ను పండితులు రుద్రుడంటారు.

**మమ వై సా పరాశక్తిర్దేవీ విద్యేతి విశ్రుతా ।**
**దృష్టా హి భవతా నూనం విద్యాదేహస్త్వహం తతః ॥ 70 ॥**

నా మరోశక్తే విద్య. నీకు నా విద్యాస్వరూపాన్ని నాస్వరూపాన్ని చూపినాను కదా.

**ఏవమేతాని తత్త్వాని ప్రధానపురుషేశ్వరాః ।**
**విష్ణుర్బ్రహ్మా చ భగవాన్ రుద్రః కాల ఇతి శ్రుతిః ॥ 71 ॥**

ఈ విధంగా తత్త్వాలు మూడు. ప్రధానం, పురుషుడు, ఈశ్వరుడు అని. శ్రుతి వీటినే విష్ణువు బ్రహ్మకాలరూపుడైన రుద్రుడు అని తెలిపినది.

**త్రయమేతదనాద్యన్తం బ్రహ్మణ్యేవ వ్యవస్థితమ్ ।**
**తదాత్మకం తదవ్యక్తం తదక్షరమితి శ్రుతిః ॥ 72 ॥**

ఆద్యంతాలులేని ఈ మూడు బ్రహ్మయందుండేవే. శ్రుతి ఈ ముగ్గురిని తదాత్మకమని, అవ్యక్తమని, అక్షరమని చెప్పినది.

**ఆత్మానన్దపరం తత్త్వం చిన్మాత్రం పరమం పదమ్ ।**
**ఆకాశం నిష్కలం బ్రహ్మ తస్మాదన్యన్న విద్యతే ॥ 73 ॥**

ఆత్మానందరూపం, పరమతత్త్వం, చిన్మాత్రం, పరమ పదరూపం, ఆకాశం, నిష్కలబ్రహ్మం అననైనది. ఈశ్వరునికంటే భిన్నమైన పరమతత్త్వం మరొకటిలేదు.

**ఏవం విజ్ఞాయ భవతా భక్తియోగాశ్రయేణ తు ।**
**సంపూజ్య వన్దనీయోఽహం తతస్తం పశ్య శాశ్వతమ్ ॥ 74 ॥**

ఇట్లా నా స్వరూపాన్ని తెలుసుకొని నీవు భక్తియోగాన్నాశ్రయించి నన్ను పూజించు. నమస్కరించు. అపుడు పరమపురుషదర్శన మవుతుంది.

**ఏతావదుక్త్వా భగవాన్ జగామాదర్శనం హరః ।**
**తత్రైవ భక్తియోగేన రుద్రమారాధయన్మునిః ॥ 75 ॥**

భగవంతు డింత మాత్రం చెప్పి అంతర్ధానమైనాడు. మంకణముని ఆ క్షేత్రంలోనే భక్తియోగంతో రుద్రుని ఆరాధించినాడు.

**ఏతత్పవిత్రమతులం తీర్థం బ్రహ్మర్షిసేవితమ్ ।**
**సంసేవ్య బ్రాహ్మణో విద్వాన్ ముచ్యతే సర్వపాతకైః ॥ 76 ॥**

అందువల్ల ఈ క్షేత్రం పవిత్రమైంది. సాటి లేనిది. బ్రహ్మర్షులు సేవించినది. కావున పండితుడైన బ్రాహ్మణుడు ఈ తీర్థాన్ని సేవించి పాపాలన్నింటినుండి ముక్తుడౌతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే తీర్థప్రకరణే చతుస్త్రింశోఽధ్యాయః ॥ 34 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో తీర్థప్రకరణమనే ముప్పైనాల్గవ అధ్యాయం ॥ 34 ॥



## పంచత్రింశోఽధ్యాయః - ముప్పై అయిదవ అధ్యాయం

## తీర్థప్రకరణమ్ - తీర్థప్రకరణం

**సూత ఉవాచ:**-సూతుడు చెప్పాడు.

**అన్యత్పవిత్రం విపులం తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్ ।**
**రుద్రకోటిరితి ఖ్యాతం రుద్రస్య పరమేష్ఠినః ॥ 1 ॥**

పరమేష్ఠి రుద్రుని క్షేత్రం మరొకటి రుద్రకోటి అనేది. పవిత్రము విస్తారము ముల్లోకాల్లో ప్రసిద్ధమైంది.

**పురా పుణ్యతమే కాలే దేవదర్శనతత్పరాః ।**
**కోటిబ్రహ్మర్షయో దాన్తాస్తం దేశమగమన్పరమ్ ॥ 2 ॥**

పూర్వం శ్రేష్ఠమైన పుణ్యకాలంలో దేవదేవుడు శంకరుని దర్శించకోరి కోటిమంది బ్రహ్మర్షులు పరమనిష్ఠగలవారై ఆ ప్రదేశానికి వచ్చినారు.

**అహం ద్రక్ష్యామి గిరిశం పూర్వమేవ పినాకినమ్ ।**
**అన్యోన్యం భక్తియుక్తానాం వ్యాఘాతో జాయతే కిల ॥ 3 ॥**

పినాకి గిరిశుని నేను ముందు చూస్తాను నేను ముందు అంటూ వారిలో వివాదం తలెత్తింది.

**తేషాం భక్తిం తదా దృష్ట్వా గిరిశో యోగినాం గురుః ।**
**కోటిరూపోఽభవత్ రుద్రో రుద్రకోటిస్తతస్స్మృతః ॥ 4 ॥**

వారి ఉత్తమ భక్తినెరిగిన యోగి గురువు రుద్రుడు కోటి రూపాలను దాల్చినాడు. అందువల్ల ఆ క్షేత్రానికి రుద్రకోటి అనే పేరు వచ్చింది.

**తే స్మ సర్వే మహాదేవం హరం గిరిగుహాశయమ్ ।**
**పశ్యన్తః పార్వతీనాథం హృష్టపుష్టధియోఽభవన్ ॥ 5 ॥**

మహాదేవుడు గిరిశుడు పార్వతీపతి అయిన శివుని చూచి వారందరు ఆనందించినారు.

**అనాద్యన్తం మహాదేవం పూర్వమేవాహమీశ్వరమ్ ।**
**దృష్టవానితి భక్త్యా తే రుద్రన్యస్తధియోఽభవన్ ॥ 6 ॥**

ఆద్యంతాలు లేని మహాదేవుని నేనే ముందు చూచినానని భక్తితో వారు రుద్రునందే మనసు నిలిపినారు.

**అథాన్తరిక్షే విమలం పశ్యన్తి స్మ మహత్తరమ్ ।**
**జ్యోతిస్తత్రైవ తే సర్వేఽభిలషన్తః పరం పదమ్ ॥ 7 ॥**

అంతలో పరమపదాన్ని కోరుతున్న ఋషులందరు ఆకాశంలో విశుద్ధమైన జ్యోతిని దర్శించినారు.

**ఏతత్ప్రదేశాధ్యుషితం తీర్థం పుణ్యతమం శుభమ్ ।**
**దృష్ట్వా రుద్రం సమభ్యర్చ్య రుద్రసామీప్యమాప్నుయాత్ ॥ 8 ॥**

ఈ క్షేత్రం ఈశ్వరుడు నివసించినది. శుభప్రదం, పరమ పవిత్రం. ఇచట రుద్రుని దర్శించుకొని పూజించి రుద్రసామీప్యాన్ని పొందవచ్చును.

**అన్యచ్చ తీర్థప్రవరం నామ్నా మధువనం స్మృతమ్ ।**
**తత్ర గత్వా నియమవానిన్ద్రస్యార్ధాసనం లభేత్ ॥ 9 ॥**

మధువనమనే పేర మరో ఉత్తమతీర్థం ఉన్నది. ఆతీర్థాన్ని సేవించినవాడు ఇంద్రుని అర్ధాసనాన్ని పొందుతాడు.

**అథాన్యత్పుష్పనగరీ దేశః పుణ్యతమః శుభః ।**
**తత్ర గత్వా పితౄనభ్యర్చ్య కులానాం తారయేచ్ఛతమ్ ॥ 10 ॥**

పుష్పనగరి అనే మరొక పుణ్యక్షేత్రం ఉన్నది. ఆతీర్థాన్ని దర్శించి పితృదేవతలను తృప్తిపరచి నూరు తరాల వారిని తరింపచేయవచ్చు.

**కాలఞ్జరం మహాతీర్థం లోకే రుద్రో మహేశ్వరః ।**
**కాలం జరితవాన్ దేవో యత్ర భక్తప్రియో హరః ॥ 11 ॥**

కాలంజరమనే మరో క్షేత్రం లోకప్రసిద్ధినందినది. ఇచట మహేశ్వరుడు, రుద్రుడు, భక్త ప్రియుడు కాలుని జీర్ణించుకున్నాడు.

**శ్వేతో నామ శివే భక్తో రాజర్షిప్రవరః పురా ।**
**తదాశీస్తన్నమస్కారః పూజయామాస శూలినమ్ ॥ 12 ॥**

పూర్వం శ్వేతుడనే రాజర్షి శివభక్తుడు శంకరునే ధ్యానిస్తూ నమస్కరిస్తూ శూలిని పూజిస్తుండేవాడు.

**సంస్థాప్య విధినా లిఙ్గం భక్తియోగపురస్సరః ।**
**జజాప రుద్రమనిశం తత్ర సన్యస్తమానసః ॥ 13 ॥**

యథావిధి లింగాన్ని స్థాపించి భక్తియోగంతో శివునియందే మనసునిల్పి అన్నికాలాల్లోను రుద్రుని జపించేవాడు.

**స తం కాలోఽథ దీప్తాత్మా శూలమాదాయ భీషణమ్ ।**
**నేతుమభ్యాగతో దేశం స రాజా యత్ర తిష్ఠతి ॥ 14 ॥**

అంతలో అక్కడకు తేజోరూపుడైన కాలుడు భయంగొల్పే శూలాన్ని ధరించి శ్వేతరాజును తీసికొని పోవచ్చినాడు.

**వీక్ష్య రాజా భయావిష్టః శూలహస్తం సమాగతమ్ ।**
**కాలం కాలకరం ఘోరం భీషణం చణ్డదీధితిమ్ ॥ 15 ॥**

**ఉభాభ్యామథ హస్తాభ్యాం స్పృష్ట్వాఽసౌ లిఙ్గమైశ్వరమ్ ।**
**ననామ శిరసా రుద్రం జజాప శతరుద్రియమ్ ॥ 16 ॥**

కాలకరుడు, క్రూరుడు, భయంకరుడు, తీక్ష్ణతేజస్కుడు, శూలహస్తుడై వచ్చిన కాలుని చూచి భయపడి రాజు రెండు చేతులతో శివలింగాన్ని పట్టుకొని శతరుద్రియం జపిస్తూ తలవంచి రుద్రునికి నమస్కరించినాడు.

**జపన్తమాహ రాజానం నమన్తమసకృద్భవమ్ ।**
**ఏహ్యేహీతి పురః స్థిత్వా కృతాన్తః ప్రహసన్నివ ॥ 17 ॥**

అట్లు జపిస్తూ భవునికి నమస్కరిస్తున్న ఆ రాజును కృతాంతుడు ముందు నిల్చి నవ్వుతున్నట్టు రా రమ్మి అని పలికినాడు.

**తమువాచ భయావిష్టో రాజా రుద్రపరాయణః ।**
**ఏకమీశార్చనరతం విహాయాన్యం నిషూదయ ॥ 18 ॥**

భయావిష్టుడైన రుద్రభక్తుడు ఆ రాజు భయంతో శంకరుని పూజించే వ్యక్తిని వదలి ఇతరులను వధించుమని పలికినాడు.

**ఇత్యుక్తవన్తం భగవానబ్రవీద్భీతమానసమ్ ।**
**రుద్రార్చనరతో వాఽన్యో మద్వశే కో న తిష్ఠతి ॥ 19 ॥**

ఇట్లాచెప్పిన భయవడే రాజును చూచి కాలుడు ఇట్లన్నాడు. రుద్రార్చనపరుడైనా, ఇతరుడైనా నావశంలో ఉండని వాడెవడు

**ఏవముక్త్వా స రాజానం కాలో లోకప్రకాలనః ।**
**బబన్ధ పాశైః రాజాఽపి జజాప శతరుద్రియమ్ ॥ 20 ॥**

అని పలికి లోకసంహారకుడైన కాలుడు ఆ రాజును పాశాలతో బంధించినాడు. రాజు కూడా శతరుద్రియాన్ని పఠిస్తూనే ఉండినాడు.

**అథాన్తరిక్షే విమలం దీప్యమానం తేజోరాశిం భూతభర్తుః పురాణమ్ ।**
**జ్వాలామాలా సంవృతం వ్యాప్య విశ్వం ప్రాదుర్భూతం సంస్థితం సందదర్శ ॥ 21 ॥**

ఇంతలో శ్వేతరాజు ఆకాశంలో ప్రాదుర్భవించి నిర్మలమై నిలిచిన తేజోరాశిని చూచినాడు. అది సకల జీవేశ్వరుడు మహాదేవుడగు రుద్రుని పరిశుద్ధము, ప్రకాశవంతం, సనాతనం, జ్వాలామాలా సంవృతము అయి సకలజగత్తును వ్యాపించి ఉన్నది.

**తన్మధ్యేఽసౌ పురుషం రుక్మవర్ణం తేజోరూపం పశ్యతి స్మాతిహృష్టః ॥**
**దేవ్యా దేవం చన్ద్రలేఖోజ్జ్వలాఙ్గం మేనే చాస్మన్నాథ ఆగచ్ఛతీతి ॥ 22 ॥**

ఆ తేజోరాశిమధ్య సువర్ణవర్ణుడు, చంద్రలేఖా విరాజితుడు, దేవితో కూడ ఉన్న పురుషుని చూచినాడు. నా ప్రభువు వస్తున్నాడని కూడ అనుకొన్నాడు.

**ఆగచ్ఛన్తం నాతిదూరేఽథ దృష్ట్వా కాలో రుద్రం దేవదేవ్యా మహేశమ్ ॥**
**వ్యపేతభీరఖిలేశైకనాథం రాజర్షిన్తం నేతుమభ్యాజగామ ॥ 23 ॥**

అలా వస్తున్న దేవితో కూడి ఉన్న అఖిల జగన్నాథుని దగ్గరలో చూచి గూడా కాలుడు భయపడక రాజును కొనిపోవటానికే వచ్చినాడు.

**ఆలోక్యాసౌ భగవానుగ్రకర్మా దేవో రుద్రో భూతభర్తా పురాణః ।**
**ఏకం భక్తం మత్పరం మాం నమన్తం దేహీతీమం కాలమూచే మమేతి ॥ 24 ॥**

భయంకర కర్మల నాచరించేవాడు, భూతపతి, సనాతనుడు అయిన రుద్రదేవుడు కాలుని చూచి నన్ను స్మరిస్తున్న నా భక్తునొక్కనిని నాకిమ్మని పలికినాడు.

**శ్రుత్వా వాక్యం గోపతేరుగ్రభావః కాలాత్మాఽసౌ మన్యమానః స్వభావమ్ ।**
**బద్ధ్వా భక్తం పునరేవాథ పాశైః క్రుద్ధో రుద్రమభిదుద్రావ వేగాత్ ॥ 25 ॥**

గోపతి అయిన రుద్రుని మాటలు విని ఉగ్రస్వభావస్వరూపుడైన కాలుడు తనస్వభావానికి తగినట్టు గర్విస్తూ శివభక్తుని పాశాలతో బంధించి కోపంతో రుద్రుని వైపే వేగంగా వస్తున్నాడు.

**ప్రేక్ష్యాయాన్తీం శైలపుత్రీమథేశః సోఽన్వీక్ష్యాన్తే విశ్వమాయా విధిజ్ఞః ॥**
**సావజ్ఞం వై వామపాదేన మృత్యుం భీతస్యైనం పశ్యతో వ్యాజఘాన ॥ 26 ॥**

విశ్వమాయావిధి తెలిసిన శంకరుడు పార్వతిని చూచి తనవైపే వస్తున్న కాలుని చూచి నిరాదరంగా వామపాదంతో తన్ని శ్వేతుడు చూస్తుండగా చంపినాడు.

**మమార సోఽతిభీషణో మహేశపాదఘాతితః ।**
**రరాజ దేవతాపతిః సహోమయా పినాకధృక్॥ 27 ॥**

ఇలా మహేశుని పాదం తాకిన కాలుడు మరణించినాడు. పార్వతీయుక్తుడైన పినాకపాణి శ్వేతుని రక్షించటంతో ప్రసన్నుడయినాడు.

**నిరీక్ష్య దేవమీశ్వరం ప్రహృష్టమానసో హరమ్ ।**
**ననామ సామ్బమవ్యయం స రాజపుఙ్గవస్తదా ॥ 28 ॥**

అవ్యయుడు అంబతో కూడి ఉన్న శంకరుని చూచి శ్వేత రాజర్షి ప్రసన్నమైన మనసుతో నమస్కరించినాడు.

**నమో భవాయ హేతవే హరాయ విశ్వశమ్భవే ।**
**నమశ్శివాయ ధీమతే నమోఽపవర్గ దాయినే ॥ 29 ॥**

జగద్ధేతువు, భవుడు, జగత్స్రష్ట హరునకు నమస్కారం. జ్ఞానస్వరూపుడు, ధీమంతుడగు అపవర్గదాయికి నమస్కారం.

**నమో నమో నమోఽస్తు తే మహావిభూతయే నమః ।**
**విభాగహీనరూపిణే నమో నరాధిపాయ తే ॥ 30 ॥**

**నమోఽస్తు తే గణేశ్వర ప్రపన్నదుఃఖనాశన ।**
**అనాదినిత్యభూతయే వరాహశృఙ్గధారిణే ॥ 31 ॥**

మహావిభూతివైన నీకు ముమ్మార్లు నమస్కరిస్తున్నాను. అఖండరూపుడు, నరాధిపుడు, గణాధిపుడు, ప్రపన్నజనదుఃఖనాశకునకు నమస్కారం. అనాది నిత్య విభూతికి వరాహశృంగధారికి నమస్కారం.

**నమో వృషధ్వజాయ తే కపాలమాలినే నమః ।**
**నమో మహానటాయ తే నమో వృషధ్వజాయ తే ॥ 32 ॥**

వృషధ్వజుడు కపాలమాలాధరునకు నమస్కారం. మహానటుడైన వృషధ్వజునకు నమస్కారం.

**అథానుగృహ్య శంకరః ప్రణామతత్పరం నృపమ్ ।**
**స్వగాణపత్యమవ్యయం సరూపతామథో దదౌ ॥ 33 ॥**

ఈ విధంగా నమస్కరిస్తున్న శ్వేతరాజర్షిననుగ్రహించిన శంకరుడు తన గాణపత్యపదాన్ని, సారూప్యాన్ని అతనికి ప్రసాదించినాడు.

**సహోమయా సపార్షదః సరాజపుఙ్గవో హరః ।**
**మునీశసిద్ధవన్దితః క్షణాదదృశ్యతామగాత్ ॥ 34 ॥**

పార్వతి, పార్షదులు రాజశ్రేష్ఠునితో కూడ హరుడు, మునీంద్రులు, సిద్ధులు నమస్కరిస్తుండగా క్షణంలో అదృశ్యమైనాడు.

**కాలే మహేశాభిహతే లోకనాథః పితామహః ।**
**అయాచత వరం రుద్రం సజీవోఽయం భవత్వితి ॥ 35 ॥**

ఈ విధంగా కాలుని చంపిన రుద్రుని చూచి లోకనాథుడైన పితామహుడు ఇతనిని జీవించనిమ్మని రుద్రుణ్ణి వరం కోరినాడు.

**నాస్తి కశ్చిదపీశాన దోషలేశో వృషధ్వజ! ।**
**కృతాన్తస్యైవ భవతా తత్కార్యే వినియోజితః ॥ 36 ॥**

**స దేవదేవవచనాద్దేవదేవేశ్వరో హరః ।**
**తథాఽస్త్విత్యాహ విశ్వాత్మా సోఽపి తాదృగ్విధోఽభవత్ ॥ 37 ॥**

వృషధ్వజా! ఇందులో కాలుని దోషంలేదు. అతనిని జీవులప్రాణాలు కొనిపోయే పనిలో నియమించింది మీరే కదా! ఇలా పలికిన బ్రహ్మమాటలు విన్న శంకరుడు అట్లే కానిమ్ము అన్నాడు. అలా కాలుడు బ్రతికినాడు.

**ఇత్యేతత్పరమం తీర్థం కాలఞ్జరమితి శ్రుతమ్ ।**
**గత్వాఽభ్యర్చ్య మహాదేవం గాణపత్యం స విన్దతి ॥ 38 ॥**

ఇది కాలంజరతీర్థం ప్రభావము. ఈ తీర్థానికి వెళ్ళి మహాదేవుని పూజించిన వాడు గాణపత్యాన్ని పొందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే తీర్థప్రకరణే పఞ్చ త్రింశోఽధ్యాయః ॥ 35 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో తీర్థప్రకరణమనే ముప్పై అయిదవ అధ్యాయం ॥ 35 ॥



## షట్త్రింశోఽధ్యాయః - ముప్పై ఆరవ అధ్యాయం

## తీర్థవర్ణనమ్ - తీర్థవర్ణనం

**సూత ఉవాచ:**-సూతమహర్షి చెప్పాడు

**ఇదమన్యత్పరం స్థానం గుహ్యాద్గుహ్యతమం మహత్ ।**
**మహాదేవస్య దేవస్య మహాలయమితి శ్రుతమ్ ॥ 1 ॥**

ఇది మరొక తీర్థం మహాలయం అని ప్రసిద్ధమైంది. పరమ రహస్యాల్లోకెల్లా రహస్యమైన స్థానం.

**తత్ర దేవాధిదేవేన రుద్రేణ త్రిపురారిణా ।**
**శిలాతలే పదం న్యస్తం నాస్తికానాం నిదర్శనమ్ ॥ 2 ॥**

ఇక్కడ దేవాధిదేవుడు, రుద్రుడు నాస్తికులకు నిదర్శనం చూపటానికి ఒక శిలాతలంపైన పాదముంచినాడు.

**తత్ర పాశుపతాశ్శాన్తా భస్మోద్ధూళితవిగ్రహాః ।**
**ఉపాసతే మహాదేవం వేదాధ్యయనతత్పరాః ॥ 3 ॥**

ఈ క్షేత్రంలో పాశుపతులు, శమదమాది గుణసంపన్నులై దేహమంతా భస్మమలదుకొని వేదాధ్యయనపరులై మహాదేవు నుపాసిస్తారు.

**స్నాత్వా తత్ర పదం శార్వం దృష్ట్వా భక్తిపురస్సరమ్ ।**
**నమస్కృత్వాఽథ శిరసా రుద్రసామీప్యమాప్నుయాత్ ॥ 4 ॥**

ఇక్కడ స్నానమాడి శివపాదాన్ని భక్తితో దర్శించి, శిరసువంచి నమస్కరించినవారు రుద్రసామీప్యాన్ని చేరుకుంటారు.

**అన్యచ్చ దేవదేవస్య స్థానం శంభోర్మహాత్మనః ।**
**కేదారమితి విఖ్యాతం సిద్ధానామాలయం శుభమ్ ॥ 5 ॥**

కేదారమనే మరోప్రసిద్ధమైన స్థానం మహాత్ముడైన శంకరునిది సిద్ధుల ఆలయమున్నది.

**తత్ర స్నాత్వా మహాదేవమభ్యర్చ్య వృషకేతనమ్ ।**
**పీత్వా చైవోదకం శుద్ధం గాణపత్యమవాప్నుయాత్ ॥ 6 ॥**

ఇచట స్నానంచేసి, వృషభధ్వజుని పూజించి, శుద్ధమైన జలాన్ని పానంచేసి గాణపత్యస్థానాన్ని పొందుతారు.

**శ్రాద్ధం దానాదికం కృత్వా హ్యక్షయ్యం లభతే ఫలమ్ ।**
**ద్విజాతిప్రవరైర్జుష్టం యోగిభిర్యతమానసైః ॥ 7 ॥**

శ్రాద్ధం, దానం మొదలైన పవిత్రకర్మలాచరించి అక్షయఫలాన్ని పొందుతారు. ఈ క్షేత్రాన్ని ద్విజులు నియతమనస్కులైన యతులు ఎల్లపుడూ సేవిస్తుంటారు.

**తీర్థం ప్లక్షావతరణం సర్వపాపవినాశనమ్ ।**
**తత్రాభ్యర్చ్య శ్రీనివాసం విష్ణులోకే మహీయతే ॥ 8 ॥**

మరొక పుణ్యతీర్థం ప్లక్షావతరణం అనేది. ఇది సర్వపాప వినాశకం. ఇక్కడ శ్రీనువాసుని పూజిస్తే విష్ణులోకం చేరుకుంటారు.

**అన్యం మగధరాజస్య తీర్థం స్వర్గగతిప్రదమ్ ।**
**అక్షయ్యం విన్దతి స్వర్గం తత్ర గత్వా ద్విజోత్తమః ॥ 9 ॥**

మగధరాజ తీర్థం అనేది మరొకటి. ఇది స్వర్గఫలాన్ని ప్రసాదిస్తుంది. ఇక్కడికి వెళ్ళినవాడు అక్షయమైన స్వర్గాన్ని పొందుతాడు.

**తీర్థం కనఖలం పుణ్యం మహాపాతకనాశనమ్ ।**
**యత్ర దేవేన రుద్రేణ యజ్ఞో దక్షస్య నాశితః ॥ 10 ॥**

కనఖలం అనేది మరొక పరమపావనమైన మహాపాతకనాశనమైన తీర్థం ఇక్కడే రుద్రుడు దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసినాడు.

**తత్ర గఙ్గాముపస్పృశ్య శుచిర్భావసమన్వితః ।**
**ముచ్యతే సర్వపాపైస్తు బ్రహ్మలోకం లభేన్మృతః ॥ 11 ॥**

ఇక్కడి గంగలో స్నానంచేసి పవిత్రుడై భక్తికల్గినవాడు సర్వపాపాలు తొలగిపోయి మరణించి బ్రహ్మలోకాన్ని పొందుతాడు.

**మహాతీర్థమితి ఖ్యాతం పుణ్యం నారాయణప్రియమ్ ।**
**తత్రాభ్యర్చ్య హృషీకేశం శ్వేతద్వీపం స గచ్ఛతి ॥ 12 ॥**

నారాయణునికి ప్రియమైన మహాతీర్థం మరొకటున్నది. పరమపావనమైనది. ఇక్కడ శ్రీహరిని పూజిస్తే శ్వేత ద్వీపాన్ని చేరుకుంటారు.

**అన్యచ్చ తీర్థప్రవరం నామ్నా శ్రీపర్వతం శుభమ్ ।**
**తత్ర ప్రాణాన్ పరిత్యజ్య రుద్రస్య దయితో భవేత్ ॥ 13 ॥**

శ్రీపర్వతమనే మరో తీర్థ శ్రేష్ఠమున్నది. ఇక్కడ ప్రాణాలు వదలినవాడు రుద్రునికి ప్రీతి పాత్రుడవుతాడు.

**తత్ర సన్నిహితో రుద్రో దేవ్యా సహ మహేశ్వరః ।**
**స్నానపిణ్డాదికం తత్ర కృతమక్షయ్యముత్తమమ్ ॥ 14 ॥**

ఇక్కడ మహేశ్వరుడు దేవితో కూడ నివసించినాడు. ఇక్కడ ఆచరించే స్నానపిండప్రదానాది పుణ్యకర్మలు అక్షయ ఫలాన్ని ప్రసాదిస్తాయి.

**గోదావరీ నదీ పుణ్యా సర్వపాపవినాశినీ ।**
**తత్ర స్నాత్వా పిత్యాన్దేవాంస్తర్పయిత్వా యథావిధి ॥ 15 ॥**

**సర్వపాపవిశుద్ధాత్మా గోసహస్రఫలం లభేత్ ।**

గోదావరీ నది పుణ్యప్రదం, సర్వపాపవినాశకం. అక్కడ స్నానమాచరించి యథావిధి పితృదేవతాతర్పణాలు చేస్తే మానవుడు సర్వపాప వినిర్ముక్తుడై పవిత్రాత్మకల్గి గోసహస్రదాన ఫలాన్ని పొందుతాడు.

**పవిత్రసలిలా పుణ్యా కావేరీ విపులా నదీ ॥ 16 ॥**

**తస్యాం స్నాత్వోదకం కృత్వా ముచ్యతే సర్వపాతకైః ।**
**త్రిరాత్రోపోషితేనాథ ఏకరాత్రోషితేన వా ॥ 17 ॥**

కావేరీనది పుణ్యావహమేకాక నిండుగా పవిత్రజలం కలది. అక్కడ స్నానమాడి మూడులేక ఒక రాత్రైనా ఉపవాసముండి తర్పణాదులాచరిస్తే మానవుడు సర్వపాపముక్తుడవుతాడు.

**యస్య వాఙ్మనసీ శుద్ధే హస్తపాదౌ చ సంస్థితౌ ।**
**అలోలుపో బ్రహ్మచారీ తీర్థానాం ఫలమాప్నుయాత్ ॥ 18 ॥**

వాక్కు మనస్సులు శుద్ధిగా ఉన్నవాడు, హస్తపాదములు చక్కగా ఉన్నవాడు, లోభములేనివాడు. బ్రహ్మచర్యాన్ని విధిగా ఆచరించేవాడు తీర్థసేవాఫలాన్ని పొందుతాడు.

**స్వామితీర్థం మహాతీర్థం త్రిషు లోకేషు విశ్రుతమ్ ।**
**తత్ర సన్నిహితో నిత్యం స్కన్దోఽమరనమస్కృతః ॥ 19 ॥**

స్వామి తీర్థం అనేది ముల్లోకాల్లో ప్రసిద్ధమైంది. దేవతలనమస్కారాన్నందే కుమారస్వామి ఆ తీర్థాన్ని వదలక నివసిస్తాడు.

**స్నాత్వా కుమారధారాయాం కృత్వా దేవాదితర్పణమ్ ।**
**ఆరాధ్య షణ్ముఖం దేవం స్కన్దేన సహ మోదతే ॥ 20 ॥**

అచటి కుమారధారలో స్నానంచేసి, దేవతారాధన, పితృతర్పణాదులు ఆచరించి, షణ్ముఖుని ఆరాధిస్తే స్కందునితో కూడ అతనిలోకంలో ఆనందాన్ని పొందుతాడు.

**నదీ త్రైలోక్య విఖ్యాతా తామ్రపర్ణీతి నామతః ।**
**తత్ర స్నాత్వా పితౄన్భక్త్యా తర్పయిత్వా యథావిధి ।**
**పాపకర్తౄనపి పితౄంస్తారయేన్నాత్ర సంశయః ॥ 21 ॥**

మూడు లోకాల్లో ప్రఖ్యాతినందిన తామ్రపర్ణి అనే మరోనది ఉన్నది. అక్కడ స్నానం చేసి విధిప్రకారం పితృదేవతర్పణాలు ఆచరిస్తే ఎంతటి పాపాత్ముడైనా తనపితృదేవతలను తరింపచేస్తాడు. ఇందులో సందేహంలేదు,

**చన్ద్రతీర్థమితి ఖ్యాతం కావేర్యాః ప్రభవేఽక్షయమ్ ।**
**తీర్థం తత్ర భవేద్వస్తుం మృతానాం స్వర్గతిర్ధ్రువా ॥ 22 ॥**

కావేరి జన్మస్థానం నుండే బయలుదేరిన చంద్రతీర్థం అక్షయఫలాలనిస్తుంది. అక్కడ నివసించి దేహాన్ని విడచినవారు స్వర్గాన్ని పొందుతారు.

**విన్ధ్యపాదే ప్రపశ్యన్తి దేవదేవం సదాశివమ్ ।**
**భక్తా యే తే న పశ్యన్తి యమస్య సదనం ద్విజాః ॥ 23 ॥**

వింధ్యపర్వతపాదంలో వెలసిన దేవదేవుడు శివుని దర్శించిన భక్తులైన ద్విజులు యమలోకాన్ని దర్శించరు.

**దేవికాయాం వృషో నామ తీర్థం సిద్ధనిషేవితమ్ ।**
**తత్ర స్నాత్వోదకం దత్వా యోగసిద్ధిఞ్చ విన్దతి ॥ 24 ॥**

దేవికాప్రాంతంలో వృష అనే పేర ఒక తీర్థమున్నది. అది సిద్ధ పురుషుల నివాసస్థానం. అచట స్నానమాడి, దానాలుచేసిన వారు యోగసిద్ధి నందుతారు.

**దశాశ్వమేధికం తీర్థం సర్వపాపవినాశనమ్ ।**
**దశానామశ్వమేధానాం తత్రాఽఽప్నోతి ఫలం నరః ॥ 25 ॥**

దశాశ్వమేధికమనే తీర్థం సకల పాపవిదారకం. అచట స్నానం చేసినా, దర్శించినా, అర్చనఅర్పణదానాదులాచరించినా పది అశ్వమేధ ఫలాలను పొందుతాడు.

**పుణ్డరీకం మహాతీర్థం బ్రాహ్మణైరుపసేవితమ్ ।**
**తత్రాభిగమ్య యుక్తాత్మా పౌణ్డరీకఫలం లభేత్ ॥ 26 ॥**

పుండరీకం అనే మహాతీర్థం బ్రాహ్మణులచే సేవించబడినది. నియతాత్ముడై ఆ తీర్థాన్ని చేరినవాడు పౌండరీకయజ్ఞఫలాన్ని పొందుతాడు.

**తీర్థేభ్యః పరమం తీర్థం బ్రహ్మతీర్థమితి శ్రుతమ్ ।**
**బ్రహ్మాణమర్చయిత్వా తు బ్రహ్మలోకే మహీయతే ॥ 27 ॥**

బ్రహ్మతీర్థం తీర్థాల్లోకెల్లా ఉత్తమమైనది. అక్కడికి వెళ్ళి బ్రహ్మనర్చిస్తే అతడు బ్రహ్మలోకంలో శాశ్వతంగా ఉంటాడు.

**సరస్వత్యా వినశనం ప్లక్షప్రస్రవణం శుభమ్ ।**
**వ్యాసతీర్థం పరం తీర్థం మైనాకఞ్చ నగోత్తమమ్ ॥ 28 ॥**
**యమునాప్రభవఞ్చైవ సర్వపాపవిశోధనమ్**

సరస్వతీ వినశనము (సరస్వతి-యమునల సంగమస్థానం) శుభకరమైన ప్లక్ష ప్రస్రవణం పరమపావనమైన వ్యాసతీర్థం, అత్యుత్తమమైన మైనాకపర్వతం, యమునాజన్మస్థలతీర్థం ఇవన్నీ సర్వ జనపాపహరాలై పవిత్రులనుచేసేవి.

**పితౄణాం దుహితా దేవీ గన్ధకాలీతి విశ్రుతా ।**
**తస్యాం స్నాత్వా దివం యాతి మృతో జాతిస్మరో భవేత్ ॥ 29 ॥**

పితృదేవతల మానస పుత్రిక గంధకాళీదేవి. అదేపేరుతో ప్రసిద్ధమైన తీర్థంలో స్నానం చేసినవాడు మరణించిన తర్వాత పూర్వజన్మ స్మృతి కల్గినవాడై దివ్యలోకానికి చేరుకుంటాడు.

**కుబేరతుఙ్గం పాపఘ్నం సిద్ధచారణసేవితమ్ ।**
**ప్రాణాంస్తత్ర పరిత్యజ్య కుబేరానుచరో భవేత్ ॥ 30 ॥**

సిద్ధులు చారణులు సేవించే కుబేరతుంగ తీర్థం సర్వపాపాలు నశింపచేస్తుంది. అక్కడ స్నానం చేసిన వాడు నివాసం ఏర్పరచుకున్నవాడు శరీరాన్ని వదలిన తర్వాత కుబేరుని అనుచరుడవుతాడు.

**ఉమాతుఙ్గమితి ఖ్యాతం యత్ర సా రుద్రవల్లభా ।**
**తత్రాభ్యర్చ్య మహాదేవీం గోసహస్రఫలం లభేత్ ॥ 31 ॥**

రుద్రుని ప్రియవల్లభస్థానమైన ఉమాతుంగ మనే తీర్థంలో మహాదేవి నర్చించినవాడు గోసహస్రదానఫలం పొందుతాడు.

**భృగుతుఙ్గే తపస్తప్తం శ్రాద్ధం దానం తథాకృతమ్ ।**
**కులాన్యుభయతః సప్త పునాతీతి శ్రుతిర్మమ ॥ 32 ॥**

భృగుతుంగ మనే పుణ్య తీర్థంలో తపస్సుచేసినా శ్రాద్ధదానాదులాచరించినా తన తల్లిదండ్రుల రెండు వంశాలలోని ఏడుతరాల వారిని పవిత్రం చేస్తాడని పెద్దలు చెప్పగా విన్నాను.

**కాశ్యపస్య మహాతీర్థం కాలసర్పిరితి శ్రుతమ్ ।**
**తత్ర శ్రాద్ధాని దేయాని నిత్యం పాపక్షయేచ్ఛయా ॥ 33 ॥**

కశ్యప ప్రజాపతి తీర్థాన్ని కాలసర్పి అనగా విన్నాను. తన పాపాలు పోవాలనుకునేవాడు అక్కడ శ్రాద్ధాది క్రియలు నిత్యం ఆచరించాలి.

**దశార్ణాయాం తథా దానం శ్రాద్ధం హోమస్తథా జపః ।**
**అక్షయశ్చావ్యయశ్చైవ కృతం భవతి సర్వదా ॥ 34 ॥**

దశార్ణ తీర్థంలో దానం, శ్రాద్ధం, హోమం, జపం కాని చేసిన వాని ఫలం ఎల్లపుడు అక్షయమై శాశ్వతం అవుతుంది.

**తీర్థం ద్విజాతిభిర్జుష్టం నామ్నా వై కురుజాఙ్గలమ్ ।**
**దత్వా తు దానం విధివత్ బ్రహ్మలోకే మహీయతే ॥ 35 ॥**

కురుజాంగల మనే తీర్థం ద్విజాతి శ్రేష్ఠులకు ఆటపట్టయినది. అచట విధ్యుక్తంగా దానం చేసినవాడు బ్రహ్మలోకంలో శాశ్వతంగా ఉంటాడు.

**వైతరణ్యాం మహాతీర్థే స్వర్ణవేద్యాం తథైవ చ ।**
**ధర్మపృష్ఠే చ సరసి బ్రహ్మణః పరమే శుభే ॥ 36 ॥**

**భరతస్యాశ్రమే పుణ్యే పుణ్యే శ్రాద్ధవటే శుభే ।**
**మహాహ్రదే చ కౌశిక్యాం దత్తం భవతి చాక్షయమ్ ॥ 37 ॥**

వైతరణి మహాతీర్థం, స్వర్ణవేది, ధర్మపృష్ఠం ఉత్తమం శుభకరమైన బ్రహ్మసరస్సు, పుణ్యమైన భరతాశ్రమం పుణ్యస్థానం శుభాన్ని కలిగించే శ్రాద్ధవటం, మహాహ్రదం, కౌశికి వీనిలో స్నాన మాచరించి దానాదులు చేసేవాడు అక్షయమైన ఫలాన్ని పొందుతాడు.

**ముఞ్జపృష్ఠే పదం న్యస్తం మహాదేవేన ధీమతా ।**
**హితాయ సర్వభూతానాం నాస్తికానాం నిదర్శనమ్ ॥ 38 ॥**

ప్రాణికోటి హితాన్ని కోరి నాస్తికులకు నిదర్శనం చూపటానికి పరమజ్ఞానస్వరూపుడైన మహాదేవుడు శంకరుడు ముంజ పృష్ఠ తీర్థంలో తనపాద చిహ్నాలుంచినాడు.

**అల్పేనాపి తు కాలేన నరో ధర్మపరాయణః ।**
**పాప్మానముత్సృజత్యాశు జీర్ణాం త్వచమివోరగః ॥ 39 ॥**

ఈ స్థానంలో ధర్మ పరాయణుడైన నరుడు అల్పకాలంలోనే పాము కుబుసాన్ని వదలినంత సులభంగా తనపాపాలను పోగొట్టుకుంటాడు.

**నామ్నా కనకనన్దేతి తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్ ।**
**ఉదీచ్యాం ముఞ్జపృష్ఠస్య బ్రహ్మర్షిగణసేవితమ్ ॥ 40 ॥**

**తత్ర స్నాత్వా దివం యాన్తి సశరీరా ద్విజాతయః ।**
**దత్తఞ్చాపి సదా శ్రాద్ధమక్షయం సముదాహృతమ్ ॥ 41 ॥**
**ఋణైః స్త్రిభిః నరస్స్నాత్వా ముచ్యతే క్షీణకల్మషః ।**

కనకనందమనే తీర్థం ముల్లోకాల్లో ప్రసిద్ధి చెందినది. ఇది ముంజపృష్ఠ తీర్థానికి ఉత్తరతీరంలో ఉన్నది. బ్రహ్మర్షి గణాలకావాస స్థలం. ఇక్కడ ద్విజులు స్నానం చేసి సశరీరంగా దివ్యలోకాలకు వెళతారు. ఇచట దానం శ్రాద్ధం చేసినా ఫలం అక్షయమవుతుందని వినికిడి. ఇక్కడ స్నానం చేసి తనపాపాలన్నీ పోగా మానవుడు దేవఋషి పితృ ఋణాలనుండి ముక్తుడౌతాడు.

**మానసే సరసి స్నాత్వా శక్రస్యార్ధాసనం లభేత్ ।**
**ఉత్తరం మానసం గత్వా సిద్ధిం ప్రాప్నోత్యనుత్తమామ్ ॥ 42 ॥**

మానస సరోవరంలో స్నానంచేసిన వాడు ఇంద్రుని అర్ధాసనాన్ని అలంకరిస్తాడు. ఉత్తరమానస తీర్థానికి వెళ్ళి సాటిలేని సిద్ధిని పొందుతాడు.

**తస్మాన్నివర్తయేచ్ఛ్రాద్ధం యథాశక్తి యథాబలమ్ ।**
**కామాన్ స లభతే దివ్యాన్ మోక్షోపాయఇ్చ విన్దతి ॥ 43 ॥**

యథాశక్తి యథోచితంగా శ్రాద్ధాదికర్మలు నిర్వర్తించాలి. అట్లా చేసిన వానికి దివ్యభోగాలతో పాటు మోక్షోపాయ సాధనం లభిస్తుంది.

**పర్వతో హిమవాన్నామ నానాధాతువిభూషితః ।**
**యోజనానాం సహస్రాణి సోఽశీతిస్త్వాయతో గిరిః ॥ 44 ॥**

నానాధాతువులుగల హిమవత్పర్వతం ఒకవేయి ఎనుబది యోజనాల విస్తారం కలది.

**సిద్ధచారణసఙ్కీర్ణో దేవర్షిగణసేవితః ।**
**తత్ర పుష్కరిణీ రమ్యా సుషుమ్నా నామ నామతః ॥ 45 ॥**

అక్కడ సిద్ధ చారణ దేవర్షిగణాలు విస్తారంగా సంచరిస్తారు అక్కడే సుషుమ్న అనే పేర పుష్కరిణి ఉన్నది.

**తత్ర గత్వా ద్విజో విద్వాన్ బ్రహ్మహత్యాం విముఇ్చతి ।**
**శ్రాద్ధం భవతి చాక్షయ్యం తత్ర దత్తం మహోదయమ్ ॥ 46 ॥**

ఆ ప్రదేశాన్ని దర్శించి విద్వాంసుడైన ద్విజుడు బ్రహ్మహత్యాపాపం వంటి వానిని కూడా తొలగించుకుంటాడు. అక్కడ చేసిన శ్రాద్ధం అక్షయమవుతుంది చేసిన దానం అనంతాభ్యుదయాన్ని ప్రసాదిస్తుంది.

**తారయేచ్చ పితౄన్ సమ్యక్ దశపూర్వాన్ దశాపరాన్ ।**
**సర్వత్ర హిమవాన్ పుణ్యో గఙ్గా పుణ్యా సమన్తతః ॥ 47 ॥**
**సద్యః సముద్రగాః పుణ్యాః సముద్రశ్చ విశేషతః ॥**

దాని వల్ల తనకు పూర్వం పదితరాలు తర్వాత పదితరాలు తరిస్తాయి. హిమాలయ పర్వతం, గంగానది అన్ని ప్రదేశాల్లో పావనాలు. సముద్రం వైపు ప్రవహించే నదులు, నదులను స్వీకరించే సముద్రం రెండుకూడ విశేష పుణ్యప్రదాలు.

**బదర్యాశ్రమమాసాద్య ముచ్యతే కలికల్మషాత్ ।**
**తత్ర నారాయణో దేవో నరేణాఽఽస్తే సనాతనః ॥ 48 ॥**

బదరీక్షేత్రంలో సనాతనుడగు నారాయణుడు నరునితో కూడ ఉండి పవిత్రం చేస్తున్నాడు. అచటికి వెళ్ళిన వ్యక్తి కలికల్మషం నుండి వెంటనే విడుదలౌతాడు.

**అక్షయ్యం తత్ర దానం స్యాత్ జాప్యం వాఽపి తథావిధమ్ ।**
**మహాదేవప్రియం తీర్థం పావనం తద్విశేషతః ॥ 49 ॥**
**తారయేచ్చ పితౄన్ సర్వాన్ దత్వా శ్రాద్ధం సమాహితః ॥**

ఆ తీర్థంలోని దానం, అనుష్ఠించిన జపం అక్షయ ఫలాన్నిస్తుంది. ఆ తీర్థం మహాదేవుడైన శంకరునికి ప్రీతి పాత్రమైంది. అందువల్ల విశేషంగా పుణ్యప్రదం. అక్కడ విధ్యుక్తంగా శ్రాద్ధం చేసినవాడు పితృదేవతల నందరిని తరింపచేస్తాడు.

**దేవదారువనం పుణ్యం సిద్ధగన్ధర్వసేవితమ్ ।**
**మహాదేవేన దేవేన తత్ర దత్తం మహద్వరమ్ ॥ 50 ॥**

సిద్ధులు గంధర్వులు సేవించే దేవదారువనం అక్కడనే ఉన్నది. భక్తవత్సలుడైన మహాదేవుడు వరమిచ్చిన క్షేత్రమిది.

**మోహయిత్వా మునీన్ సర్వాన్ పునస్తైః సంప్రపూజితః ।**
**ప్రసన్నో భగవానీశః మునీన్ద్రాన్ ప్రాహ భావితాన్ ॥ 51 ॥**

**ఇహాశ్రమవరే రమ్యే నివసిష్యథ సర్వదా ।**
**మద్భావనాసమాయుక్తాస్తతః సిద్ధిమవాప్స్యథ ॥ 52 ॥**

పూర్వం మునులందరను మోహింపచేసి, తర్వాత వారివల్ల ఆరాధనపొంది ప్రసన్నుడై శంకరుడు నిర్మలమైన మనసుగల మునులతో ఇట్లన్నాడు. మీరు రమ్యమైన ఈ ఆశ్రమంలోనే నివసించండి. ఎల్లపుడు నా భావనకలవారై ఇష్టకామ్యార్థసిద్ధిని పొందండి.

**యేఽత్ర మామర్చయన్తీహ లోకే ధర్మపరా జనాః ।**
**తేషాం దదామి పరమం గాణపత్యం హి శాశ్వతమ్ ॥ 53 ॥**

ధర్మకర్మానుష్ఠానపరులైన మానవులు నన్నిచట ఆరాధించేవారు పరమం శాశ్వతమైన గాణపత్యాన్ని నావల్ల పొందుతారు.

**అత్ర నిత్యం వసిష్యామి సహ నారాయణేన చ ।**
**ప్రాణానిహ నరస్త్యక్త్వా న భూయో జన్మ విన్దతి ॥ 54 ॥**

నారాయణునితో సహ నేనిచట నిత్యం నివసిస్తాను. ఇక్కడ ప్రాణాలు వదలినవాడు పునర్జన్మనందడు.

**సంస్మరన్తి చ యే తీర్థం దేశాన్తరగతా జనాః ।**
**తేషాఞ్చ సర్వపాపాని నాశయామి ద్విజోత్తమాః ॥ 55 ॥**

బ్రాహ్మణ శ్రేష్ఠులారా! దేశాంతరగతులైన వారైనా ఈ తీర్థాన్ని స్మరించిన వారికికూడ సర్వపాపాలు పోగొడుతాను.

**శ్రాద్ధం దానం తపో హోమః పిణ్డనిర్వపణం తథా ।**
**ధ్యానం జపశ్చ నియమః సర్వమత్రాక్షయం కృతమ్ ॥ 56 ॥**

ఈ తీర్థంలో అనుష్ఠించిన శ్రాద్ధ దాన తపోహోమ పిండ ప్రదాన ధ్యాన జప నియమాదులన్నీ అక్షయ ఫల ప్రదాలౌతాయి.

**తస్మాత్సర్వ ప్రయత్నేన ద్రష్టవ్యం హి ద్విజాతిభిః ।**
**దేవదారువనం పుణ్యం మహాదేవనిషేవితమ్ ॥ 57 ॥**

అందువల్ల మహాదేవుడు సేవించిన ఈ దేవదారు వనాన్ని ద్విజులు అన్ని ప్రయత్నాలు చేసి తప్పక దర్శించాలి. ఇది పుణ్య ప్రదం.

**యత్రేశ్వరో మహాదేవో విష్ణుర్వా పురుషోత్తమః ।**
**తత్ర సన్నిహితా గఙ్గా తీర్థాన్యాయతనాని చ ॥ 58 ॥**

మహాదేవుడు, పురుషోత్తముడైన భగవన్నారాయణుడు నివసించేచోట గంగ మొదలైన వివిధ తీర్థాలు ఆయతనాలు ఉంటాయి. అందువల్ల తప్పక దర్శించాలి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే తీర్థవర్ణనం నామ షట్త్రింశోఽధ్యాయః ॥ 36 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో తీర్థవర్ణనం అనే ముప్పై ఆరవ అధ్యాయం ॥ 36 ॥



# సప్తత్రింశోఽధ్యాయః - ముప్పై ఏడవ అధ్యాయం

## దేవదారువనప్రవేశః - దేవదారువనప్రవేశం

**ఋషయ ఊచు:**-ఋషులు పలికారు

**కథం దారువనం ప్రాప్తో భగవాన్ గోవృషధ్వజః ।**
**మోహయామాస విప్రేన్ద్రాన్ సూత! త్వం వక్తుమర్హసి ॥ 1 ॥**

సూతుడా! వృషభధ్వజుడు దేవదేవుడైన శంకరుడు దారుకావనానికెట్లు వచ్చాడు? విప్రశ్రేష్ఠులనెట్లు మోహింప చేసినాడు? అంతా మాకు వివరించండి.

**సూత ఉవాచ:**-సూతుడు చెప్పాడు

**పురా దారువనే రమ్యే దేవసిద్ధనిషేవితే ।**
**సపుత్రదారా మునయస్తపశ్చేరుః సహస్రశః ॥ 2 ॥**

పూర్వకాలంలో దేవసిద్ధసంఘాలు సంచరించే ఈ రమ్యమైన దేవదారువనంలో వేలాది మహర్షులు భార్యా పుత్రులతో నివసించి తపస్సు చేస్తుండినారు.

**ప్రవృత్తం వివిధం కర్మ ప్రకుర్వాణా యథావిధి ।**
**యజన్తి వివిధైర్యజ్ఞైః తపన్తి చ మహర్షయః ॥ 3 ॥**

వారు వివిధ వైదిక కర్మల్లో నిరతులై యథావిధి నిర్వర్తించేవారు. ఆ మహర్షులు ఎన్నో యజ్ఞాలు చేసినారు. తమ తపస్సు కొనసాగించినారు.

**తేషాం ప్రవృత్తివిన్యస్త చేతసామథ శూలధృక్ ।**
**ఖ్యాపయన్స మహాదోషం యయౌ దారువనం హరః ॥ 4 ॥**

శూలపాణి శంకరుడు అక్కడి మునులు ప్రవృత్తిమార్గనిరతులై (తమకర్మలవల్ల సాధించుకొనే లౌకిక ఫలాల యందాసక్తిగలవారు) ఉండుట తెలుసుకొని వారిదోషాన్ని వివరించటానికన్నట్టు దారుకావనాన్ని చేరుకున్నాడు.

**కృత్వా విశ్వగురుం విష్ణుం పార్శ్వే దేవో మహేశ్వరః ।**
**యయౌ నివృత్తివిజ్ఞానస్థాపనార్థం చ శంకరః ॥ 5 ॥**

విశ్వగురువును విష్ణువును ప్రక్కన నిడుకొని మహేశ్వరుడు నివృత్తి విజ్ఞానస్థాపనకై వెళ్ళాడు.

**ఆస్థాయ విపులం వేషం ఊనవింశతివత్సరః ।**
**లీలాలసో మహాబాహుః పీనాంగశ్చారులోచనః ॥ 6 ॥**

మహాబాహువు, పీనోరస్కుడు, రమ్యమైన నేత్రాలు, ఇరువదేండ్ల వయసుగల యువకుని అందమైన రూపాన్ని ధరించి అచటికి వెళ్ళినాడు.

**చామీకరవపుః శ్రీమాన్ పూర్ణచన్ద్రనిభాననః ।**
**మత్తమాతంగగమనో దిగ్వాసా జగదీశ్వరః ॥ 7 ॥**

**కుశేశయమయీం మాలాం సర్వరత్నైరలఙ్కృతామ్ ।**
**దధానో భగవానీశః సమాగచ్ఛతి సస్మితః ॥ 8 ॥**

ఆ శంకరుడు బంగారువన్నె శరీరం, పూర్ణచంద్రుని పోలిన ముఖం, మత్తమాతంగగమనం, దిగంబరత్వం, సర్వరత్నాలంకృత పద్మమాల, చిరునవ్వులతో అందమైన రూపాన్ని ధరించి ఉన్నాడు.

**యోఽనన్తః పురుషో యోనిర్లోకానామవ్యయో హరిః ।**
**స్త్రీవేషం విష్ణురాస్థాయ సోఽనుగచ్ఛతి శూలినమ్ ॥ 9 ॥**

అనంతుడు, పురుషోత్తముడు, లోకములకు కారణభూతుడు, నాశములేనివాడు అయిన శ్రీహరి స్త్రీవేషాన్ని ధరించి శంకరుని వెంటనడిచాడు.

**సంపూర్ణచన్ద్రవదనం పీనోన్నతపయోధరమ్।**
**శుచిస్మితం సుప్రసన్నం రణన్నూపురకద్వయమ్ ॥ 10 ॥**

**సుపీతవసనం దివ్యం శ్యామలం చారులోచనమ్ ।**
**ఉదారహంసచలనం విలాసి సుమనోహరమ్ ॥ 11 ॥**

అతడు పూర్ణచంద్రుని పోలిన ముఖం, ఉన్నత పయోధరాలు, చిరునవ్వు, ప్రసన్నముఖం కలవాడు. పాదాల అందెలు ధ్వనించగా దివ్యమైన పచ్చని వస్త్రంతో, శ్యామవర్ణం, విశాలనేత్రాలు, హంసగమనం, విలాసాలుగల ఆ హరిరూపం మనస్సులను హరిస్తున్నది.

**ఏవం స భగవానీశో దేవదారువనే హరః ।**
**చచార హరిణా భిక్షాం మాయయా మోహయన్ జగత్ ॥ 12 ॥**

ఆ విధంగా తన మాయతో జగత్తును మోహింపచేస్తూ హరితోపాటు హరుడు భిక్షకోసం దారువనమంతా సంచరించినాడు.

**దృష్ట్వా చరన్తం విశ్వేశం తత్ర తత్ర పినాకినమ్ ।**
**మాయయా మోహితాః నార్యో దేవదేవం సమన్వయుః ॥ 13 ॥**

అక్కడక్కడ సంచరించే దేవదేవుడు విశ్వేశ్వరుడు పినాకపాణిని దర్శించి అతని మాయవల్ల మోహపరవశు లైన స్త్రీలు అతనిని అనుసరింపసాగినారు.

**విస్రస్తవస్త్రాభరణాస్త్యక్త్వా లజ్జాం పతివ్రతాః ।**
**సహైవ తేన కామార్తా విలాసిన్యశ్చరన్తి హి ॥ 14 ॥**

వస్త్రాభరణాలు జారిపోతుండగా స్త్రీ సహజమైన సిగ్గును వదలి పతివ్రతలై ఉన్న వారుకూడ ఇపుడు కామాతురలై విలాసాలను కనబరుస్తూ శంకరుని వెంబడించినారు.

**ఋషీణాం పుత్రకా యే స్యుర్యువానో జితమానసాః ।**
**అగచ్ఛన్ తే హృషీకేశం సర్వే కామప్రపీడితాః ॥ 15 ॥**

అప్పటిదాకా తపోనుష్ఠానంలో మనోనిగ్రహాన్ని సాధించిన యువకులైన మునిపుత్రులు కామపీడితులై స్త్రీవేషంలో ఉన్న హృషీకేశుని అనుసరించినారు.

**గాయన్తి నృత్యన్తి విలాసవాహ్యా నారీగణా మాయినమేకమీశమ్ ।**
**దృష్ట్వా సపత్నీకమతీవకాన్తం ఇచ్ఛన్త్యథాఽఽలిఙ్గనమాచరన్తి ॥ 16 ॥**

పత్నీసమేతుడైన ఈశ్వరుని, అత్యంత సుందర శరీరుని మునిపత్నులు చూచి విలాసాలతో గానం చేసినారు. నర్తించినారు. అతని పొందుకోరినారు. ఆలింగనం చేసుకున్నారు.

**పదే నిపేతుః స్మితమాచరన్తి గాయన్తి గీతాని మునీశపుత్రాః ।**
**ఆలోక్య పద్మాపతిమాదిదేవం భ్రూభఙ్గమన్యే విచరన్తి తేన ॥ 17 ॥**

ఇక అటు ఆదిదేవుడైన పద్మాపతి స్త్రీరూపంలో ఉన్న విష్ణువును చూచి మునికుమారులు ఆయన పాదాలపై పడినారు. చిరునవ్వులొలికించినారు. గీతా లాలపించినారు. భ్రూభంగవిలాసాలతో వెంటబడినారు.

**ఆసామథైషామపి వాసుదేవో మాయీ మురారిర్మనసి ప్రవిష్టః ।**
**కరోతి భోగాన్ మనసి ప్రవృత్తిం మాయానుభూయన్త ఇతీవ సమ్యక్ ॥ 18 ॥**

మాయా నియామకుడైన మురారి స్త్రీపురుషుల మనసుల్లో తిష్ఠవేసి కామభోగ ప్రవృత్తిని పుట్టించినాడు. అందరు పూర్తిగా మాయానుభవంలో మునిగినారు.

**విభాతి విశ్వామరభూతభర్తా సమాధవః స్త్రీగణమధ్యవిష్టః ॥**
**అశేషశక్త్యాసనసన్నివిష్టో యథైకశక్త్యా సహ దేవదేవః ॥ 19 ॥**

**కరోతి నృత్యం పరమప్రభావం తదా విరూఢః పునరేవ భూయః ।**
**యయౌ సమారుహ్య హరిః స్వభావం తదీయ వృత్తామృతమాదిదేవః ॥ 20 ॥**

సర్వప్రాణికోటికి, అమరులకు, సృష్టికర్త, పోషకుడు అయిన ఆ మాధవుడు మునికాంతలమధ్య అనంతశక్తులు చుట్టి ఉన్న ఆసనంలో దేవదేవుడు శంకరునితో కూడి ఉన్న పార్వతివలె ప్రకాశించినాడు. చూచేవారంతా మాయాప్రభావంలో ముంచెత్తేట్టు శంకరుడు మాటిమాటికి నృత్యం చేస్తుండినాడు. ఈశ్వరుని మనసు నెరిగి ఆదిదేవుడు హరికూడ శంకరుని కనుగుణంగా అనుసరించినాడు.

**దృష్ట్వా నారీకులం రుద్రం పుత్రానపి చ కేశవమ్ ।**
**మోహయన్తం మునిశ్రేష్ఠాః కోపం సందధిరే భృశమ్ ॥ 21 ॥**

తమ స్త్రీలు శంకరుని, పుత్రులు కేశవుని అనుసరించేట్టు మోహ పరవశులు కాగా చూచి మునిశ్రేష్ఠులు మిక్కిలి కోపాన్ని పొందినారు.

**అతీవపరుషం వాక్యం ప్రోచుర్దేవం కపర్దినమ్ ।**
**శేపుశ్చ శాపైర్వివిధైర్మాయయా తస్య మోహితాః ॥ 22 ॥**

కపర్ది అయిన రుద్రుని పరుషమైన మాటలన్నారు. ఆతని మాయాప్రభావితులై వివిధంగా శాపనార్థాలు పలికినారు.

**తపాంసి తేషాం సర్వేషాం ప్రత్యాహన్యన్త శఙ్కరే ।**
**యథాఽఽదిత్యప్రకాశేన తారకా నభసి స్థితాః ॥ 23 ॥**

సూర్యప్రకాశంవల్ల ఆకాశంలో నక్షత్రాలు వన్నెతరిగి నిలిచినట్లు శంకరుని వల్ల వారి తపశ్శక్తి అంతా హరించుకొనిపోయినది.

**తే భగ్నతపసో విప్రాః సమేత్య వృషభధ్వజమ్ ।**
**కో భవానితి దేవేశం పృచ్ఛన్తి స్మ విమోహితాః ॥ 24 ॥**

అట్లు తపఃఫలం భగ్నం అయిన విప్రులు ఒక్కచోట చేరి దేవేశుడు వృషభధ్వజుడగు శంకరుని నీవెవరవు అని మోహంవల్ల అడిగారు.

**సోఽబ్రవీద్భగవానీశః తపశ్చర్తుమిహాగతః ।**
**ఇదానీం భార్యయా దేశే భవద్భిరిహ సువ్రతాః! ॥ 25 ॥**

శంకరుడు సువ్రతులారా! ఈ ప్రదేశంలో మీవలెనే భార్యతో కూడ ఉండి తపమాచరించ వచ్చినానని బదులు పలికినాడు.

**తస్య తే వాక్యమాకర్ణ్య భృగ్వాద్యా మునిపుఙ్గవాః ।**
**ఊచుర్గృహీత్వా వసనం త్యక్త్వా భార్యాం తపశ్చర ॥ 26 ॥**

అపుడాతని మాట విని భృగువు మొదలైన మునులు వస్త్రము ధరించు, భార్యను విడువు. అపుడు తపస్సు చేయుమనిరి.

**అథోవాచ విహస్యేశః పినాకీ నీలలోహితః ।**
**సంప్రేక్ష్య జగతో యోనిం పార్శ్వస్థఞ్చ జనార్దనమ్ ॥ 27 ॥**

అపుడు పినాకపాణి నీలలోహితుడైన విశ్వేశ్వరుడు జగత్తునకాది బీజమైన జనార్దనుని చూస్తూ వారితో ఇలా పలికినాడు.

**కథం భవద్భిరుదితం స్వభార్యాపోషణోత్సుకైః ।**
**త్యక్తవ్యా మమ భార్యేతి ధర్మజ్ఞైః శాన్తమానసైః ॥ 28 ॥**

ధర్మజ్ఞులు, శాంతచిత్తులగు మీరు భార్యాపుత్రుల పోషణలో ఆసక్తులై ఉండి నన్ను భార్యను వదలిపెట్టుమని ఎట్లు పలుకుతారు?

**ఋషయః ఊచుః**-ఋషులు చెప్పారు

**వ్యభిచారగతా నార్యః సన్త్యాజ్యాః పతినేరితాః ।**
**అస్మాభిరేషా సుభగా తాదృశీ త్యాగమర్హతి ॥ 29 ॥**

మావంటివారి నిర్దేశం ప్రకారం వ్యభిచారరతలైన స్త్రీలను భర్తలు వదలిపెట్టాలి. అట్లే నీభార్య కూడా అటువంటిదే. అందువల్ల ఆమెను నీవు వదలిపెట్టు.

**మహాదేవ ఉవాచః**-శివుడు పలికాడు

**న కదాచిదియం విప్రా మనసాఽప్యన్యమిచ్ఛతి ।**
**నాహమేనామపి తథా విముఞ్చామి కదాచన ॥ 30 ॥**

విప్రులారా! ఈమె ఏనాడూ అన్యులనెవ్వరిని మనసులోకూడా కోరలేదు. నేనుకూడా ఏనాడూ, ఏస్థితిలోను ఆమెను వదలను.

**ఋషయః ఊచుః** :-ఋషులు అన్నారు

**దృష్ట్వా వ్యభిచరన్తీహ హ్యస్మాభిః పురుషాధమ ।**
**ఉక్తం హ్యసత్యం భవతా గమ్యతాం క్షిప్రమేవ హి ॥ 31 ॥**

పురుషాధమా! ఈమె వ్యభిచరించటం మాకంట బడింది. నీవసత్యం పలికినావు. వెంటనే ఇక్కడనుండి వెళ్ళిపో!

**ఏవముక్తో మహాదేవః సత్యమేవ మయేరితమ్ ।**
**భవతాం ప్రతిభాత్యేషేత్యుక్త్వాఽసౌ విచచారహ ॥ 32 ॥**

మునులమాటలు విన్న మహాదేవుడు నేను నిజం పలికినాను. ఈమె మీకట్లు కన్పించవచ్చు అని చెప్పి అక్కడక్కడ సంచరించ సాగినాడు.

**సోఽగచ్ఛద్ధరిణా సార్ధం మునీన్ద్రస్య మహాత్మనః ।**
**వసిష్ఠాశ్రమపదం పుణ్యం భిక్షార్థీ పరమేశ్వరః ॥ 33 ॥**

తర్వాత పరమేశ్వరుడు రమేశ్వరుని వెంటపెట్టుకొని భిక్షకై వశిష్ఠుని పుణ్యాశ్రమానికి వెళ్ళినాడు.

**దృష్ట్వా సమాగతం దేవం భిక్షమాణమరున్ధతీ ।**
**వసిష్ఠస్య ప్రియా భార్యా ప్రత్యుద్గమ్య ననామ తమ్ ॥ 34 ॥**

భిక్షకొరకు తనయింటి వాకిలికి వచ్చిన శంకరుని చూచి వశిష్ఠుని ప్రియపత్ని అరుంధతి ఎదురేగి నమస్కరించినది.

**ప్రక్షాల్య పాదౌ విమలం దత్వా చాసనముత్తమమ్ ।**
**సంప్రేక్ష్య శిథిలం గాత్రమభిఘాతహతం ద్విజైః ॥ 35 ॥**

**సన్ధయామాస భైషజ్యైర్విషణ్ణవదనా సతీ ।**
**చకార మహతీం పూజాం ప్రార్థయామాస భార్యయా ॥ 36 ॥**

పాదాలు కడిగి ఉత్తమం నిర్మలమైన ఆసనాన్నిచ్చి ఇతరమునుల దెబ్బలవల్ల గాయపడి శిథిలమైన ఆతని శరీరాన్ని చూచి బాధపడి సతి అరుంధతి ఔషధాలతో చికిత్స చేసినది. తర్వాత అతని భార్యతో గూడిన అతణ్ణి పూజించి ఇట్లా ప్రశ్నించింది.

**కో భవాన్ కుత ఆయాతః కిమాచారో భవానితి ।**
**ఉవాచ తాం మహాదేవః సిద్ధానాం ప్రవరో హ్యహమ్ ॥ 37 ॥**

మీరెవరు? ఎందుకిట్లా వచ్చినారు? మీ ఆచారవ్యవహారాలేమిటి? ఆమెకు మహాదేవుడిట్లా బదులు పలికినాడు. నేను సిద్ధులందరిలో శ్రేష్ఠుణ్ణి.

**యదేతన్మణ్డలం శుద్ధం భాతి బ్రహ్మమయం సదా ।**
**ఏషైవ దేవతా మహ్యం ధారయామి సదైవ తత్ ॥ 38 ॥**

నిర్మలంగా ప్రకాశించే ఈ బ్రహ్మమయ మండలమే నాస్థానం దాన్ని నాలోనే నిలిపి ఉంచుతాను.

**ఇత్యుక్త్వా ప్రయయౌ శ్రీమాననుగృహ్య పతివ్రతామ్ ।**
**తాడయాఞ్చక్రిరే దణ్డైర్లోష్టిభిర్ముష్టిభిర్ద్విజాః ॥ 39 ॥**

ఇట్లా పలికి మహాదేవుడు పతివ్రత అరుంధతి ననుగ్రహించి బయలు దేరినాడు. తర్వాత వికృతలక్షణాలు కల్గి నగ్నంగా తిరుగుతున్న శివుని చూచి ద్విజులు దండాలు, మట్టి పెళ్ళలు, పిడిగుద్దులతో కొట్టినారు.

**దృష్ట్వా చరన్తం గిరిశం నగ్నం వికృతలక్షణమ్ ।**
**ప్రోచురేతద్భవాంల్లిఙ్గముత్పాటయ సుదుర్మతే ॥ 40 ॥**

నగ్ననిగా వికారలక్షణాలు కలిగి సంచరించుచున్న శంకరుని చూచి సుదుర్మతీ! నీవు నీ లింగాన్ని పెరికివేయి అని పలికారు.

**తానబ్రవీన్మహాయోగీ కరిష్యామీతి శఙ్కరః ।**
**యుష్మాకం మామకే లిఙ్గే యది ద్వేషోఽభిజాయతే ॥ 41 ॥**

మహాయోగి, శంకరుడు నాలింగమందు మీకు ద్వేషం కలిగితే అట్లాగే చేస్తాను అని చెప్పాడు.

**ఇత్యుక్త్వోత్పాటయామాస భగవాన్ భగనేత్రహా ।**
**నాపశ్యన్త క్షణేనేశం కేశవం లిఙ్గమేవ చ ॥ 42 ॥**

అని చెప్పి భగనేత్రహరుడూ, భగవానుడైన శంకరుడు తన లింగాన్ని తానే పెరికి వేసినాడు. ఆ క్షణంలో ఋషులు, బ్రాహ్మణశ్రేష్ఠులు శంకరుని, కేశవుని, లింగాన్ని కూడ చూడలేదు.

**తదోత్పాతా బభూవుర్హి లోకానాం భయశంసినః ।**
**న రాజతే సహస్రాంశుః చచాల పృథివీ పునః ॥ 43 ॥**

అప్పుడు లోకోపద్రవకారకాలైన ఉత్పాతాలు పొడసూపినవి. సూర్యుడు ప్రకాశించలేదు. భూమి కంపించినది.

**నిష్ప్రభాశ్చ గ్రహాస్సర్వే చుక్షుభే చ మహోదధిః ।**
**అపశ్యచ్చానసూయాత్రేః స్వప్నం భార్యా పతివ్రతా ॥ 44 ॥**

గ్రహాలు కాంతిని కోల్పోయినవి సముద్రం క్షోభనందినది. అత్రిపత్ని అనసూయాదేవి స్వప్నాన్ని చూచినది.

**కథయామాస విప్రాణాం భయాదాకులితేక్షణా ।**
**తేజసా భాసయన్ కృత్స్నం నారాయణసహాయవాన్ ।**
**భిక్షమాణః శివో నూనం దృష్టోఽస్మాకం గృహేష్వితి ॥ 45 ॥**

వెంటనే మేల్కొని భయంతో కలతచెందిన చూపుగలదై బ్రాహ్మణులతో ఇట్లా చెప్పినది. సకలజగత్తును తనతేజస్సుతో వెలిగింపచేసే నారాయణుని సహాయంతో శివుడు భిక్షాటనంచేయగా మాఇండ్లలో కనిపించినాడు.

**తస్యా వచనమాకర్ణ్య శఙ్కమానా మహర్షయః ॥ 46 ॥**

అనసూయ మాటలు విన్న మహర్షులందరు శంకించి జగత్సృష్టి కర్త అయిన బ్రహ్మ వద్దకు వెళ్ళినారు.

**సర్వే జగ్ముర్మహాయోగం బ్రహ్మాణం విశ్వసమ్భవమ్ ।**
**ఉపాస్యమానమమలైః యోగిభిః బ్రహ్మవిత్తమైః ॥ 47 ॥**

**చతుర్వేదైర్మూర్తిమద్భిః సావిత్ర్యా సహితం ప్రభుః ।**
**ఆసీనమాసనే రమ్యే నానాశ్చర్యసమన్వితే ॥ 48 ॥**

**ప్రభాసహస్రకలితే జ్ఞానైశ్వర్యాదిసంయుతే ।**
**విభ్రాజమానం వపుషా సస్మితం శుభ్రలోచనమ్ ॥ 49 ॥**

**చతుర్ముఖం మహాబాహుం ఛందోమయమజం ప్రభుమ్ ।**
**విలోక్య వేదపురుషం ప్రసన్నవదనం శుభమ్ ॥ 50 ॥**

**శిరోభిర్ధరణీం గత్వా తోషయామాసురీశ్వరమ్ ।**
**తాన్ ప్రసన్నమనా దేవశ్చతుర్మూర్తిః చతుర్ముఖః ॥ 51 ॥**

అక్కడ బ్రహ్మజ్ఞానులు, పరిశుద్ధులైన యోగులు బ్రహ్మను ఉపాసిస్తున్నారు. రూపుగొన్న నాల్గు వేదాలు సావిత్రితో కలిసి ఉన్నవానిని, పలు అద్భుతాలైన వేలకాంతులతో జ్ఞానైశ్వర్యాలతో కూడియున్న ఆసనంపై ఆసీనుడైన వాణ్ణి, తన దివ్యకాంతితో భాసిల్లే వాణ్ణి, దీప్తి మంతమైన కనులు మోము చిరునవ్వు కలవాణ్ణి, మహాబాహువు వేదమయుడు అజుడు ప్రసన్నవదనుడు శుభరూపుడైన చతుర్ముఖుని చూచి భూమిపై తల వంచి ప్రణామాలాచరించి స్తుతించినారు.

**వ్యాజహార మునిశ్రేష్ఠాః కిమాగమన కారణమ్ ।**
**తస్య తే వృత్తమఖిలం బ్రహ్మణః పరమాత్మనః ।**
**జ్ఞాపయాఞ్చక్రిరే సర్వే కృత్వా శిరసి చాఞ్జలిమ్ ॥ 52 ॥**

ఆ ఋషులను చూచి బ్రహ్మ ప్రసన్నుడై, ముని శ్రేష్ఠులారా! మీరాకకు కారణమేమి? అని అడిగినాడు. ఋషులు చేతులు జోడించి బ్రహ్మకు జరిగిన వృత్తాంతమంతా తెల్పినారు.

**ఋషయ ఊచుః :**–ఋషులు పలికారు

**కశ్చిద్దారువనం పుణ్యం పురుషోఽతీవశోభనః ।**
**భార్యయా చారుసర్వాఙ్గ్యా ప్రవిష్టో నగ్న ఏవ హి ॥ 53 ॥**

పవిత్రమైన దారువనంలో అతిసుందరుడైన పురుషుడొకడు నగ్నంగా లోకోత్తర సౌందర్యవతి అయిన భార్యతో కూడ ప్రవేశించినాడు.

**మోహయామాస వపుషా నారీణాం కులమీశ్వరః ।**
**కన్యకానాం ప్రియా చాస్య దూషయామాస పుత్రకాన్ ॥ 54 ॥**

అతడు తన అందమైన దేహంతో స్త్రీలను మోహింప చేసినాడు. మా పుత్రులను అతని ప్రియురాలు మోహింప చేసింది.

**అస్మాభిర్వివిధాః శాపాః ప్రదత్తాశ్చ పరాహతాః ।**
**తాడితోఽస్మాభిరత్యర్థం లిఙ్గస్తు వినిపాతితమ్ ॥ 55 ॥**

మేము పలురకాల శపించినాము అవన్నీ విఫలమైనవి మేమాతణ్ణి బాగా కొట్టి అతని లింగాన్ని పడగొట్టినాము.

**అన్తర్హితశ్చ భగవాన్ సభార్యో లిఙ్గమేవ చ ।**
**ఉత్పాతాశ్చాభవన్ ఘోరాః సర్వభూతభయఙ్కరాః ॥ 56 ॥**

అంతలో భార్యతో కూడ అతడు అంతర్హితుడైనాడు. వెంటనే సర్వప్రాణి భయంకరాలైన మహోత్పాతాలు సంభవించాయి.

**క ఏష పురుషో దేవ భీతాః స్మః పురుషోత్తమ! ।**
**భవన్తమేవ శరణం ప్రపన్నా వయమచ్యుత ॥ 57 ॥**

ఓ పురుషోత్తమా! ఈ పురుషుడెవరు. మేము భయపడినాము అచ్యుతా! నిన్నే శరణు పొందినాము.

**త్వం హి వేత్సి జగత్యస్మిన్ యత్కిఞ్చిదపి చేష్టితమ్ ।**
**అనుగ్రహేణ విశ్వేశ తదస్మాననుపాలయ ॥ 58 ॥**

ఈ ప్రపంచంలోని ప్రతికదలిక నీకు తెలుసు. అందువల్ల మమ్మనుగ్రహించి కాపాడవలసినది.

**విజ్ఞాపితో మునిగణైర్విశ్వాత్మా కమలోద్భవః ।**
**ధ్యాత్వా దేవం త్రిశూలాఙ్కం కృతాఞ్జలిరభాషత ॥ 59 ॥**

ఇట్లా మునిగణం పలుకగా జగద్రూపుడైన పద్మోద్భవుడు త్రిశూలధారి శంకరుని ధ్యానించి చేతులు జోడించి ఇలా పలికినాడు.

**బ్రహ్మోవాచ:**–బ్రహ్మ చెప్పాడు

**హా కష్టం భవతామద్య జాతం సర్వార్థనాశనమ్ ।**
**ధిగ్బలం ధిక్ తపశ్చర్యాం మిథ్యైవ భవతామిహ ॥ 60 ॥**

ఈ రోజు మీ సర్వస్వం నశించినది. గొప్ప కష్టం సంభవించింది. మీ బలం ఐశ్వర్యం వ్యర్థమైంది. మీ తపస్సు వ్యర్థం.

**సంప్రాప్య పుణ్యసంస్కారాన్నిధీనాం పరమం నిధిమ్ ।**
**ఉపేక్షితం వృథాచారైః భవద్భిః ఇహ మోహితైః ॥ 61 ॥**

మోహాన్ని పొందిన మీరు పుణ్యసంస్కారాలను, నిధులకు నిధి అయిన ఉత్తమనిధిని పొందికూడా వృథాచారాలతో ఉపేక్షించినారు.

**కాంక్షన్తే యోగినో నిత్యం యతన్తో యతయో నిధిమ్ ।**
**యమేవ తం సమాసాద్య హా భవద్భిరుపేక్షితమ్ ॥ 62 ॥**

యోగులు, యతులు తమ ప్రయత్నంతో ప్రతినిత్యం కోరుకొనే నిధిని పొంది కూడ మీరు ఉపేక్షించినారు.

**యజన్తి వివిధైర్యజ్ఞైః యత్ప్రాప్త్యై వేదవాదినః ।**
**మహానిధిం సమాసాద్య హా భవద్భిరుపేక్షితమ్ ॥ 63 ॥**

వేదవాదులు అనేకయజ్ఞాలతో పూజించే మహానిధిని పొంది మీరు ఉపేక్షించినారు.

**యం సమాసాద్య దేవానామైశ్వర్యమఖిలం జగత్ ।**
**తమాసాద్యాక్షయనిధిం హా భవద్భిరుపేక్షితమ్ ॥ 64 ॥**

ఆ శంకరుని ఆరాధించిన సకలదేవతలు ఐశ్వర్య సాకల్యాన్ని పొందినారో, ఆ అక్షయనిధిని పొంది మీరుపేక్షించినారు.

**యత్సమాపత్తిజనితం విశ్వేశత్వమిదం మమ ।**
**తదేవోపేక్షితం దృష్ట్వా నిధానం భాగ్యవర్జితైః ॥ 65 ॥**

నాకు విశ్వేశ్వరత్వాన్ని ప్రసాదించిన మహానిధిని చూచికూడ భాగ్యహీనులై మీరుపేక్షించినారు.

**యస్మిన్సమాహితం దివ్యమైశ్వరం యత్తదవ్యయమ్ ।**
**తమాసాద్య నిధిం బ్రహ్మ హా భవద్భిర్వృథా కృతమ్ ॥ 66 ॥**

సమస్తదివ్యైశ్వర్యాన్ని తనలో నిక్షిప్తం చేసుకొన్న పరబ్రహ్మకు సంబంధించిన ఉత్తమనిధిని పొంది వ్యర్థపరచుకున్నారు.

**ఏష దేవో మహాదేవో విజ్ఞేయస్తు మహేశ్వరః ।**
**న తస్య పరమం కిఞ్చిత్పదం సమధిగమ్యతే ॥ 67 ॥**

మీకు కనపడిన ఆ పురుషుడు మహేశ్వరుడైన మహాదేవుడు. ఇతని పరమపదాన్ని ఎవరూ పొందలేరు.

**దేవతానామృషీణాఞ్చ పితౄణాఞ్చాపి శాశ్వతః ।**
**సహస్రయుగపర్యన్తం ప్రళయే సర్వదేహినామ్ ॥ 68 ॥**

**సంహరత్యేష భగవాన్కాలో భూత్వా మహేశ్వరః ।**
**ఏష ఏవ ప్రజాస్సర్వాః సృజత్యేకః స్వతేజసా ॥ 69 ॥**

దేవతలు, ఋషులు పితృదేవతలను కాలస్వరూపుడైన మహాదేవుడు వేయియుగాల వరకుండే వారిని కూడ ప్రళయకాలంలో సంహరిస్తాడు. ఇతడొకడే అద్వితీయమైన తన తేజస్సుతో సర్వప్రాణి సృష్టిచేస్తాడు.

**ఏష చక్రీ చ వజ్రీ చ శ్రీవత్సకృతలక్షణః ।**
**యోగీ కృతయుగే దేవస్త్రేతాయాం యజ్ఞ ఉచ్యతే ॥ 70 ॥**

ఇతడే చక్రం వజ్రం ధరించిన విష్ణువు, శ్రీవత్స లాంఛితుడు. ఇతడే కృతయుగంలో యోగి, త్రేతాయుగంలో యజ్ఞపురుషుడు.

**ద్వాపరే భగవాన్కాలో ధర్మకేతుః కలౌ యుగే ।**
**రుద్రస్య మూర్తయస్తిస్రో యాభిర్విశ్వమిదం తతమ్ ।**
**తమో హ్యగ్నీ రజో బ్రహ్మా సత్త్వం విష్ణురితి ప్రభుః ॥ 71 ॥**

ద్వాపరంలో కాలపురుషుడు, కలియుగంలో ధర్మకేతువుగా వ్యవహరిస్తాడు. రుద్రుని మూడు రూపాలే ఈ జగత్తునంతా వ్యాపించి ఉన్నవి. తమోగుణంతో అగ్ని, రజోగుణంతో బ్రహ్మ, సత్త్వగుణంతో విష్ణువుగా వ్యవహరించ బడుతున్నాడు.

**మూర్తిరన్యా స్మృతా చాస్య దిగ్వాసా వై శివా ధ్రువా ।**
**యత్ర తిష్ఠతి తద్బ్రహ్మ యోగేన తు సమన్వితమ్ ॥ 72 ॥**

ఇతని మరోమూర్తి దిగంబరత్వం. దీన్నే శివుడంటారు. ఇదే ధ్రువం, శాశ్వతం. ఈమూర్తిలోనే యోగి ప్రరబ్రహ్మ నివసిస్తాడు.

**యా చాస్య పార్శ్వగా భార్యా భవద్భిరభివీక్షితా ।**
**స హి నారాయణో దేవః పరమాత్మా సనాతనః ॥ 73 ॥**

ఆ పురుషుని ప్రక్కన అతని భార్యగా మీరు చూచిన స్త్రీమూర్తి సనాతనుడు, పరమాత్మ అయిన నారాయణుడు.

**తస్మాత్సర్వమిదం జాతం తత్రైవ చ లయం వ్రజేత్ ।**
**స ఏవ మోహయేత్కృత్స్నం స ఏవ పరమా గతిః ॥ 74 ॥**

ఈ జగత్తంతా అతనినుండే పుడుతున్నది. అతనిలోనే లయమవుతుంది. సర్వజగత్తును అతడే మోహింప చేస్తున్నాడు. జగత్తుకంతా అతడే పరమగతి.

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।**
**ఏకశృఙ్గో మహానాత్మా పురాణోఽష్టాక్షరో హరిః ॥ 75 ॥**

అతడే వేయితలలు, వేయి కన్నులు, వేయి పాదాలు కలవాడు. ఇతడు ఏకశృంగధారి, వరాహమూర్తి, పురాణపురుషుడు. అక్షరాలైన అష్టరూపాలుగల (అష్టాక్షరి) హరి.

**చతుర్వేదశ్చతుర్మూర్తిస్త్రిమూర్తిస్త్రిగుణః పరః ।**
**ఏకమూర్తిరమేయాత్మా నారాయణ ఇతి శ్రుతిః ॥ 76 ॥**

చతుర్వేదస్వరూపుడు. చతుర్మూర్తి, త్రిమూర్తి, త్రిగుణాత్మకుడు, ఏకమూర్తి, కొలతకందని స్వరూపం కలవాడు. నారాయణునిగా ప్రసిద్ధుడు.

**ఋతస్య (రేతోఽస్య)గర్భో భగవానాపో మాయాతనుః ప్రభుః ।**
**స్తూయతే వివిధైర్మంత్రైః బ్రాహ్మణైర్ధర్మకాంక్షిభిః ॥ 77 ॥**

మాయతో పలురూపాలు ధరిస్తాడు. జలాన్ని తనకాధారంగా స్వీకరిస్తాడు (నార+అయన) ధర్మమోక్షాలు కోరేవారు వివిధ బ్రాహ్మణమంత్రాలతో ఇతణ్ణే స్తుతిస్తారు.

**సంహృత్య సకలం విశ్వం కల్పాన్తే పురుషోత్తమః ।**
**శేతే యోగామృతం పీత్వా తద్విష్ణోః పరమం పదమ్ ॥ 78 ॥**

ప్రళయకాలంలో ఈ పురుషోత్తముడే సకలప్రపంచాన్ని ఉపసంహరించి యోగామృతాన్ని పానంచేసి నివసించే ఉత్తమస్థానమే మహావిష్ణువు పరమపదము.

**న జాయతే న మ్రియతే వర్ధతే న చ విశ్వసృక్ ।**
**మూలప్రకృతిరవ్యక్తా గీయతే వైదికైరజః ॥ 79 ॥**

ఇతడు పుట్టడు, పెరుగడు, మరణించడు. సర్వజగత్ సృష్టికర్త ఇతడే. ఇతణ్ణే వేదజ్ఞులు అవ్యక్తమూల ప్రకృతి అని గానం చేస్తారు.

**తతో నిశాయాం వృత్తాయాం సిసృక్షురఖిలం జగత్ ।**
**అజస్య నాభౌ తద్బీజం క్షిప్యత్యేష మహేశ్వరః ॥ 80 ॥**

ప్రళయకాలం పూర్తికాగానే జగత్సృష్టిచేయకోరి విరాట్పురుషుని నాభిలో ఈ మహేశ్వరుడే బీజాన్ని నిక్షేపిస్తాడు.

**తం మాం విత్త మహాత్మానం బ్రహ్మాణం విశ్వతోముఖమ్ ।**
**మహాన్తం పురుషం విశ్వమపాం గర్భమనుత్తమమ్ ॥ 81 ॥**

ఆ హిరణ్యగర్భుడు మీ ముందున్న నేనే. నన్నే చతుర్ముఖుడు, బ్రహ్మ, మహాపురుషుడు, స్థూలజలాధిష్ఠాతగా తెలుసుకోండి.

**న తం విత్థ స్వజనకం మోహితాస్తస్య మాయయా ।**
**దేవదేవం మహాదేవం భూతానామీశ్వరం హరమ్ ॥ 82 ॥**

ఆ మహేశ్వరమాయతో మోహాన్ని పొందినవారు నాతండ్రిని గుర్తించలేరు. నా ఉత్పత్తికి మూలం సకలభూతాలకు ఈశ్వరుడు హరుడైన మహాదేవుడే.

**ఏష దేవో మహాదేవో హ్యనాదిర్భగవాన్హరః ।**
**విష్ణునాసహ సంయుక్తః కరోతి వికరోతి చ ॥ 83 ॥**

అనాది అయిన ఈ మహాదేవుడే విష్ణువుతో కలిసి జగాన్ని సృష్టిస్తాడు. లయింపచేస్తాడు.

**న తస్య విద్యతే కార్యం న తస్మాద్విద్యతే పరమ్ ।**
**స వేదాన్ప్ర దదౌ పూర్వం యోగమాయాతనుర్మమ ॥ 84 ॥**

సృష్టిసంహారాలతో అతనికేమీ అవసరం లేదు. అతనికంటె పరమం శ్రేష్ఠమైంది మరొకటి లేదు. యోగమాయాస్వరూపుడైన అతడే నాకు పూర్వకాలంలో వేదాల నిచ్చినాడు.

**స మాయీ మాయయా సర్వం కరోతి వికరోతి చ ।**
**తమేవ ముక్తయే జ్ఞాత్వా వ్రజేత శరణం భవమ్ ॥ 85 ॥**

అతడే మాయాజగత్, సృష్టిలయాలు జరుపుతాడు. ఆ మహాదేవుణ్ణి తెలుసుకొని ముక్తికోసం అతణ్ణే శరణు వేడాలి.

**ఇతీరితా భగవతా మరీచిప్రముఖా విభుమ్ ।**
**ప్రణమ్య దేవం బ్రహ్మాణం పృచ్ఛన్తి స్మ సుదుఃఖితాః ॥ 86 ॥**

ఈ విధంగా చతుర్ముఖబ్రహ్మ చెప్పగా మరీచి మొదలైన మహర్షులు దేవదేవుడైన బ్రహ్మకు నమస్కరించి మిక్కిలి దుఃఖితులై ఇట్లా అడిగినారు.

**మునయః ఊచుః :**-మునులు అడిగారు

**కథం పశ్యేమ తం దేవం పునరేవ పినాకినమ్ ।**
**బ్రూహి విశ్వామరేశాన త్రాతా త్వం శరణైషిణామ్ ॥ 87 ॥**

ఉభయలోకాల ప్రభువైన ఓ బ్రహ్మదేవా! శరణార్థులమైన మాకు రక్షకుడవు నీవే. ఆ దేవదేవుడు పినాకపాణిని మరొక్కసారి ఎట్లా దర్శించగలమో తెలుపవలసినది.

**బ్రహ్మో ఉవాచ:**-బ్రహ్మ చెప్పాడు

**యద్దృష్టం భవతా తస్య లిఙ్గం హి పతితం భువి ।**
**తల్లిఙ్గానుకృతీశస్య కృత్వా లిఙ్గమనుత్తమమ్ ॥ 88 ॥**

**పూజయధ్వం సపత్నీకాస్సాదరం పుత్రసంయుతాః ।**
**వైదికైరేవ నియమైర్వివిధైః బ్రహ్మచారిణః ॥ 89 ॥**

ఓ మునులారా! నేలపై పడిన పరమేశ్వరలింగాన్ని మీరు చూచినారు కదా! అదే లింగాకృతిని నిర్మించి గౌరవంతో బ్రహ్మచర్యాన్నవలంబించి, వైదిక నియమాలు పాటిస్తూ, భార్యాపుత్రులతో కలిసి పూజించండి.

**సంస్థాప్య శాఙ్కరైర్మన్త్రైః ఋగ్యజుస్సామసమ్భవైః ।**
**తతః పరం సమాస్థాయ గృణన్తః శతరుద్రియమ్ ॥ 90 ॥**

**సమాహితాః పూజయధ్వం సపుత్రా స్సహ బన్ధుభిః ।**
**సర్వే ప్రాఞ్జలయో భూత్వా శూలపాణిం ప్రపద్యథ ॥ 91 ॥**

శివలింగాన్ని స్థాపించి ఋక్‌యజుస్సామవేదాల్లోని రుద్రమంత్రాలతో తపస్సుచేస్తూ శతరుద్రీయాన్ని ఎల్లపుడు పఠిస్తూ, పుత్రులు, బంధువులతో ఏకాగ్రచిత్తులై చేతులు జోడించి పినాకపాణి శంకరుని శరణు పొందండి.

**తతో ద్రక్ష్యథ దేవేశం దుర్దర్శమకృతాత్మభిః ।**
**యం దృష్ట్వా సర్వమజ్ఞానమధర్మశ్చ ప్రణశ్యతి ॥ 92 ॥**

నియతాత్ములు, భక్తులు కానివారికి స్వామిదర్శనం జరుగదు. మీరు శంకరుని దర్శించి అజ్ఞానం, అధార్మికబుద్ధిని పోగొట్టుకుంటారు.

**తతః ప్రణమ్య వరదం బ్రహ్మాణమమితౌజసమ్ ।**
**జగ్ముస్సంహృష్టమనసో దేవదారు వనం పునః ॥ 93 ॥**

ఋషులు తేజశ్శాలి, వరదుడైన బ్రహ్మకు నమస్కరించి స్వస్థచిత్తులై మళ్లీ దేవదారువనానికి వెళ్లినారు.

**ఆరాధయితుమారబ్ధా బ్రహ్మణా కథితం యథా ।**
**అజానన్తః పరం దేవం వీతరాగాః విమత్సరాః ॥ 94 ॥**

వారు శంకరునితత్త్వం, రూపం తెలియనివారైనా రాగమాత్సర్యాలు విడిచి, బ్రహ్మతెల్పిన విధంగా ఆరాధించ సాగారు.

**స్థణ్డిలేషు విచిత్రేషు పర్వతానాం గుహాసు చ ।**
**నదీనాఞ్చ వివిక్తేషు పులినేషు శుభేషు చ ॥ 95 ॥**

సమతలాల్లో వేదికలపై గుహల్లో, నదీతీరాల్లో, సైకత ప్రదేశాల్లో, శివుని ఆరాధింప దొడగినారు.

**శైవాలభోజనాః కేచిత్ కేచిదన్తర్జలేశయాః ।**
**కేచిదభ్రావకాశాస్తు పాదాఙ్గుష్ఠాగ్రనిష్ఠితాః ॥ 96 ॥**

**దన్తోలూఖినస్త్వన్యే హ్యశ్మకుట్టాస్తథాఽపరే ।**
**శాకపర్ణాశినః కేచిత్ సంప్రక్షాళా మరీచిపాః ॥ 97 ॥**

**వృక్షమూలనికేతాశ్చ శిలాశయ్యాస్తథాఽపరే ।**
**కాలం నయన్తి తపసా పూజయన్తో మహేశ్వరమ్ ॥ 98 ॥**

కొందరు నాచును భుజిస్తూ, కొందరు నీటిలో పడుకొని, కొందరు ఆకాశం క్రింద బయలుప్రదేశంలో, కొందరు కాలిబొటన వ్రేలిపై నిల్చి, కొందరు దంతాలతో ధాన్యం గింజల్ని వలుచుకొంటూ, కొందరు రాళ్ళపై ధాన్యాన్ని దంచుకొని, కొందరు అందిన ఆకులలములతో, మరికొందరు స్నానంచేసి సూర్యకిరణాహారంతో, కొందరు వృక్షాల మూలాల్లో, కొందరు పరుపు బండలపై నిద్రిస్తూ మహేశ్వరుని పూజిస్తూ కాలం గడిపినారు.

**తతస్తేషాం ప్రసాదార్థం ప్రపన్నార్తిహరో హరః ।**
**చకార భగవాన్బుద్ధిం ప్రబోధాయ వృషధ్వజః ॥ 99 ॥**

అంతలో ప్రపన్నుల ఆర్తి తొలగించే హరుడు వృషభధ్వజుడు అయిన శంకరుడు వారిననుగ్రహింపదలచి ప్రబోధించటానికి నిశ్చయించినాడు.

**దేవః కృతయుగే హ్యస్మిన్ శృఙ్గే హిమవతః శుభే ।**
**దేవదారువనం ప్రాప్తః ప్రసన్నః పరమేశ్వరః ॥ 100 ॥**

కృతయుగంలో ఈ హిమవచ్ఛిఖరంలోని శుభకరప్రదేశంలో ప్రసన్నుడైన పరమేశ్వరుడు దేవదారువనాన్ని చేరుకొన్నాడు.

**భస్మపాణ్డురదిగ్ధాఙ్గో నగ్నో వికృతలక్షణః ।**
**ఉల్ముకవ్యగ్రహస్తశ్చ రక్తపిఙ్గలలోచనః ॥ 101 ॥**

అతడు భస్మాన్నలదుకొన్న తెల్లని శరీరంతో నగ్నంగా ఉండి వికృతలక్షణాలుకల్గి చేతిలో మండే కొరివిధరించి, ఎరుపు, పసుపు కలిసిన రంగుగల కన్నులతో ఉన్నాడు.

**క్వచిచ్చ హసతే రౌద్రం క్వచిత్ గాయతి విస్మితః ।**
**క్వచిన్నృత్యతి శృఙ్గారీ క్వచిత్ రౌతి ముహుర్ముహుః ॥ 102 ॥**

ఒక చోట భయంకరంగా నవ్వుతాడు. మరోచోట ఆశ్చర్యంతో గానంచేస్తాడు. ఒక చోట శృంగారాన్ని సూచిస్తూ నృత్యం చేస్తాడు. మరోచోట ఏడుస్తాడు.

**ఆశ్రమేऽభ్యాగతో భిక్షాం యాచతే చ పునః పునః ।**
**మాయాం కృత్వాऽऽత్మనో రూపం దేవస్తద్వనమాగతః ॥ 103 ॥**

ఆశ్రమానికి వచ్చి మాటి మాటికి భిక్షాటనం చేస్తుండినాడు. ఈ విధంగా మాయారూపునిగా తనను కనబరుస్తూ మహాదేవుడా వనానికి వచ్చినాడు.

**కృత్వా గిరిసుతాం గౌరీం పార్శ్వే దేవః పినాకధృక్ ।**
**సా పూర్వవచ్చ దేవేశీ దేవదారువనం గతా ॥ 104 ॥**

గిరిసుతను పార్వతిని పినాకపాణి ప్రక్కగా ఉంచు కొన్నాడు. ఆమె కూడ పూర్వంవలె దారుకావనం చేరుకున్నది.

**దృష్ట్వా సమాగతం దేవం దేవ్యాసహ కపర్దినమ్ ।**
**ప్రణేముః శిరసా భూమౌ తోషయామాసురీశ్వరమ్ ॥ 105 ॥**

ఇట్లా పార్వతితోకూడా మహాదేవుడు రావటం చూచిన మునులు శిరసు వంచి, భూమిపై సాగిలపడి ఈశ్వరుని సంతోషింపజేశారు.

**వైదికైర్వివిధైర్మన్త్రైః సూక్తైః మాహేశ్వరైశ్శుభైః ।**
**అథర్వశిరసా చాన్యే రుద్రాద్యైర్బ్రహ్మభిర్ముహుః ॥ 106 ॥**

వివిధవైదికమంత్రాలతో, మహేశ్వరసూక్తంతో కొందరు అథర్వమంత్రాలతో, శతరుద్రియాలతో అతనిని స్తుతించినారు.

**నమో దేవాదిదేవాయ మహాదేవాయ తే నమః ।**
**త్ర్యమ్బకాయ నమస్తుభ్యం త్రిశూలవరధారిణే ॥ 107 ॥**

దేవాధిదేవునకు మహాదేవునకు నమస్కారం, త్రినేత్రునకు ఉత్తమ శూలధారికి నమస్కారం,

**నమో దిగ్వాససే తుభ్యం వికృతాయ పినాకినే ।**
**సర్వప్రణతదేవాయ స్వయమప్రణతాత్మనే ॥ 108 ॥**

దిగంబరునకు, వికృతునికి, పినాకపాణికి నమస్కారం, సకలదేవతలచే నమస్కరించబడిన వానికి, తానెవ్వరికి నమస్కరించనివానికి –

**అన్తకాన్తకృతే తుభ్యం సర్వసంహరణాయ చ ।**
**నమోఽస్తు నృత్యశీలాయ నమో భైరవరూపిణే ॥ 109 ॥**

అంతకాంతకునకు సర్వసంహారకునకు నమస్కారం, నృత్యశీలికి భైరవరూపికి నమస్కారం.

**నరనారీశరీరాయ యోగినాం గురవే నమః ।**
**నమో దాన్తాయ శాన్తాయ తాపసాయ హరాయ చ ॥ 110 ॥**

అర్ధనారీశ్వరునకు, యోగిగురువునకు నమస్కారం, దాంతునకు, శాంతునకు, తాపసునకు, హరునకు నమస్కారం,

**విభీషణాయ రుద్రాయ నమస్తే కృత్తివాససే ।**
**నమస్తే లేలిహానాయ శితికణ్ఠాయ తే నమః ॥ 111 ॥**

సర్వ భయంకరునకు, రుద్రునకు, కృత్తివాసునకు నమస్కారం, జగత్తును మింగినవానికి శితికంఠునకు నమస్కారం.

**అఘోరరూపాయ నమో వామదేవాయ వై నమః ।**
**నమః కనకమాలాయ దేవ్యాః ప్రియకరాయ చ ॥ 112 ॥**

అఘోరరూపునకు, వామదేవునికి నమస్కారం, కనకమాలికి, దేవీప్రియకరునికి నమస్కారం,

**గఙ్గాసలిలధారాయ శమ్భవే పరమేష్ఠినే ।**
**నమో యోగాధిపతయే బ్రహ్మాధిపతయే నమః ॥ 113 ॥**

గంగాసలిలధారునికి, శంభునికి, పరమేష్ఠికి నమస్కారం, యోగాధిపతికి, బ్రహ్మాధిపతికి నమస్కారం.

**ప్రాణాయ చ నమస్తుభ్యం నమో భస్మాఙ్గరాగిణే ।**
**నమస్తే ఘనవాహాయ దంష్ట్రినే వహ్నిరేతసే ॥ 114 ॥**

ప్రాణభూతునికి, భస్మాంగరాగునికి నమస్కారం, మేఘవాహునికి, దంష్ట్రికి, వహ్నిరేతునికి నమస్కారం.

**బ్రహ్మణశ్చ శిరోహర్త్రే నమస్తే కాలరూపిణే ।**
**అగతిం తే న జానీమో గతిం నైవ చ నైవ చ ॥ 115 ॥**

బ్రహ్మశిరోహారునికి, కాలరూపికి నమస్కారం, స్వామీ! నీ రాకపోకలు మాకు తెలియవు.

**విశ్వేశ్వర మహాదేవ యోఽసి సోఽసి నమోఽస్తు తే ।**
**నమః ప్రమథనాథాయ దాత్రే చ శుభసమ్పదామ్ ॥ 116 ॥**

విశ్వేశా! మహాదేవా! నీ స్వస్వరూపానికి నమస్కారం, ప్రమథనాథునికి శుభసంపత్ప్రదునికి నమస్కారం,

**కపాలపాణయే తుభ్యం నమో మీఢుష్టమాయ తే ।**
**నమః కనకలిఙ్గాయ వారిలిఙ్గాయ తే నమః ॥ 117 ॥**

కపాలపాణికి వరములను వర్షించువానికి నమస్కారం, కనకలింగానికి వారిలింగానికి నమస్కారం,

**నమోవహ్న్యర్కలిఙ్గాయ జ్ఞానలిఙ్గాయ తే నమః ।**
**నమో భుజఙ్గహారాయ కర్ణికారప్రియాయ చ ॥ 118 ॥**

వహ్ని, అర్కలింగునికి, జ్ఞాన లింగునికి నమస్కారం, భుజంగహారునికి కర్ణికార ప్రియునికి నమస్కారం.

**కిరీటినే కుణ్డలినే కాలకాలాయ తే నమః ।**
**వామదేవ మహేశాన దేవదేవ త్రిలోచన ॥**
**క్షమ్యతాం యత్కృతం మోహాత్త్వమేవ శరణం హి నః । 119 ॥**

కిరీటికి, కుండలికి, కాలకాలునికి నమస్కారం, వామదేవా! మహేశానా! దేవదేవా! త్రిలోచనా. మోహంవల్ల మేమాచరించిన దాన్ని క్షమించండి. మీరే మాకు రక్షకులు.

**చరితాని విచిత్రాణి గుహ్యాని గహనాని చ ।**
**బ్రహ్మాదీనాఞ్చ సర్వేషాం దుర్విజ్ఞేయోఽసి శఙ్కర ॥ 120 ॥**

నీ చరిత్ర విచిత్రమైంది. రహస్యం బోధపడనిది. బ్రహ్మాది సకలదేవతలు నిన్ను తెలియలేరు.

**అజ్ఞానాద్యది వా జ్ఞానాద్యత్కిఞ్చిత్కురుతే నరః ।**
**తత్సర్వం భగవానేవ కురుతే యోగమాయయా ॥ 121 ॥**

మానవుడు అజ్ఞానంతోకాని, జ్ఞానంతోకాని చేసేదంతా యోగమాయతో నీవు చేయించేదే.

**ఏవం స్తుత్వా మహాదేవం ప్రహృష్టేనాన్తరాత్మనా ।**
**ఊచుః ప్రణమ్య గిరిశం పశ్యామస్త్వాం యథా పురా ॥ 122 ॥**

ఈ విధంగా సంతోషించినవారై మహాదేవుని స్తుతించి నమస్కరించి మీయథార్థరూపాన్ని దర్శించ గోరుతున్నాము అని పలికినారు.

**తేషాం సంస్తవమాకర్ణ్య సోమః సోమవిభూషణః ।**
**స్వమేవ పరమం రూపం దర్శయామాస శఙ్కరః ॥ 123 ॥**

ఇలా వారు చేసిన స్తోత్రాన్ని విన్న చంద్రభూషణుడు ఉమాసహితుడైన శంకరుడు తన పరమస్వరూపాన్ని ప్రదర్శించినాడు.

**తం తే దృష్ట్వా చ గిరిశం దేవ్యా సహ పినాకినమ్ ।**
**యథాపూర్వం స్థితా విప్రాః ప్రణేముర్హృష్టమానసాః ॥ 124 ॥**

పార్వతితో కలిసి ఉన్న శంకరుని దర్శించి యథాపూర్వం నిలిచి, సంతోష చిత్తంతో నమస్కరించినారు.

**తతస్తే మునయస్సర్వే సంస్తూయ చ మహేశ్వరమ్ ।**
**భృగ్వఙ్గిరో వసిష్ఠస్తు విశ్వామిత్రస్తథైవ చ ॥ 125 ॥**

**మరీచిః కశ్యపశ్చాపి సంవర్తశ్చ మహాతపాః ।**
**ప్రణమ్య దేవదేవేశమిదం వచనమబ్రువన్ ॥ 126 ॥**

తర్వాత మునులు మహేశ్వరుని స్తుతించి భృగు, అంగిరుడు, వసిష్ఠ, విశ్వామిత్ర, గౌతమ, అత్రి, సుకేశ, పులస్త్య పులహక్రతు, మరీచి, కశ్యపులు, మహాతపస్వి సంవర్తుడు, దేవదేవునకు నమస్కరించి ఇలా పలికినారు.

**కథం త్వాం దేవదేవేశ కర్మయోగేన వా ప్రభో ।**
**జ్ఞానేన వాఽథ యోగేన పూజయామః సదైవ హి ॥ 127 ॥**

దేవదేవేశా! నిన్ను కర్మజ్ఞానయోగాల్లో ఏ ఉపాయంతో పూజించాలి.

**కేన వా దేవమార్గేణ సంపూజ్యో భగవానిహ ।**
**కిఞ్చ సేవ్యమసేవ్యం వా సర్వమేతత్ బ్రవీహి నః ॥ 128 ॥**

నిన్ను పూజించే ఉత్తమ మార్గమేది? ఈ లోకంలో సేవించతగినది త్యజింప దగినదేది. ఈ విషయాన్ని వివరించుడు.

**శ్రీశివ ఉవాచ:–** శ్రీశివుడు చెప్పాడు.

**ఏతద్వః సంప్రక్ష్యామి గూఢం గహనముత్తమమ్ ।**
**బ్రహ్మణే కథితం పూర్వమాదావేవ మహర్షయః ॥ 129 ॥**

మహర్షులారా! అతిరహస్యం, దుర్బోధమైన ఈ విషయాన్ని మీకు చెబుతున్నాను. దీన్నే మొదట బ్రహ్మకు తెల్పినాను.

**సాంఖ్యయోగో ద్విధా జ్ఞేయః పురుషాణాం హి సాధనమ్ ।**
**యోగేన సహితం సాంఖ్యం పురుషాణాం విముక్తిదమ్ ॥ 130 ॥**

పురుషులకు సాధనమైన సాంఖ్యయోగం రెండు విధాలుంటుంది. కర్మతో గూడిన జ్ఞానయోగం ముక్తి ప్రదం.

**న కేవలేన యోగేన దృశ్యతే పురుషః పరః ।**
**జ్ఞానన్తు కేవలం సమ్యగపవర్గఫలప్రదమ్ ॥ 131 ॥**

కేవలయోగంతో పరమపురుష సాక్షాత్కారం కాదు. జ్ఞాన యోగం మాత్రం అపవర్గాన్నిస్తుంది.

**భవన్తః కేవలం యోగం సమాశ్రిత్య విముక్తయే ।**
**విహాయ సాంఖ్యం విమలమకుర్వన్త పరిశ్రమమ్ ॥ 132 ॥**

మీరు కేవల కర్మయోగాన్నాశ్రయించి జ్ఞానాన్ని వదలి ముక్తికోసం శ్రమపడుతున్నారు.

**ఏతస్మాత్కారణాత్ విప్రా నృణాం కేవలధర్మిణామ్ ।**
**ఆగతోఽహమిమం దేశం జ్ఞాపయన్మోహసంభవమ్ ॥ 133 ॥**

అందువల్ల కేవల కర్మయోగాశ్రములకు మోహంవల్ల కలిగే అనర్థాన్ని తెలుపటానికే ఇక్కడకు వచ్చినాను.

**తస్మాద్భవద్భిర్విమలం జ్ఞానం కైవల్యసాధనమ్ ।**
**జ్ఞాతవ్యం ప్రయత్నేన శ్రోతవ్యం దృశ్యమేవ చ ॥ 134 ॥**

మీరు కైవల్య సాధనమైన శుద్ధజ్ఞానంకోసం ప్రయత్నించాలి, తెలుసుకోవాలి, వినాలి, దర్శించాలి.

**ఏకః సర్వత్రగో హ్యాత్మా కేవలశ్చిత్తమాత్రకః ।**
**ఆనన్దో నిర్మలో నిత్యం స్యాదేతత్ సాంఖ్యదర్శనమ్ ॥ 135 ॥**

ఆత్మ ఒకటే సర్వవ్యాపి, విశుద్ధం, జ్ఞాన ఆనంద స్వరూపం, నిత్యం. ఇది జ్ఞాననిష్ఠుల సిద్ధాంతం.

**ఏతదేవ పరం జ్ఞానం తేన మోక్షోఽత్ర గీయతే ।**
**ఏతత్కైవల్యమమలం బ్రహ్మభావశ్చ వర్ణితః ॥ 136 ॥**

ఇదే పరమ జ్ఞానం. దానితో పరిశుద్ధమైన మోక్షం కల్గుతుంది. దీన్నే కైవల్యమని బ్రహ్మభావమని అంటారు.

**ఆశ్రిత్య చైతత్పరమం తన్నిష్ఠాస్తత్పరాయణాః ।**
**పశ్యన్తి మాం మహాత్మానో యతయో విశ్వమీశ్వరమ్ ॥ 137 ॥**

ఈ జ్ఞానాన్నాశ్రయించి దీనిలోనే బుద్ధి నిలిపి, ఈ స్వరూపాన్నే ధ్యానిస్తూ సర్వజగత్స్వరూపునిగా యతులు నన్ను దర్శిస్తారు.

**ఏతత్తత్పరమం జ్ఞానం కేవలం సన్నిరఞ్జనమ్ ।**
**అహం హి వేద్యో భగవాన్మమ మూర్తిరియం శివా ॥ 138 ॥**

ఇదే పరమజ్ఞానం, నిరంజనం. నేనే తెలిసికోదగిన వాణ్ణి, శుభప్రదమైన మూర్తి నాదే.

**బహూని సాధనానీహ సిద్ధయే కథితాని తు ।**
**తేషామభ్యధికం జ్ఞానం మామకం ద్విజపుఙ్గవాః! ॥139 ॥**

సిద్ధికి సాధనాలు చాలచెప్పినా వాటిలో నా జ్ఞానమే ఉత్తమం.

**జ్ఞానయోగరతాః శాన్తా మామేవ శరణం గతాః ।**
**యే హి మాం భస్మనిరతా ధ్యాయన్తి సతతం హృది ॥ 140 ॥**

జ్ఞానయోగరతులు, శాంతులు నన్నే శరణు పొందుతారు. ఎప్పుడు హృదయంలో నన్నే ధ్యానిస్తుంటారు.

**మద్భక్తిపరమా నిత్యం యతయః క్షీణకల్మషాః ।**
**నాశయామ్యచిరాత్తేషాం ఘోరం సంసారసాగరమ్ ॥ 141 ॥**

నా భక్తిలోనే మనసునిల్పి నిగ్రహంతో సకలపాపాలు తొలగించుకుంటారు. వారి భీకరసంసారసాగరాన్ని నేనే తొలగిస్తాను.

**ప్రశాన్తః సంయతమనా భస్మోద్ధూళితవిగ్రహః ।**
**బ్రహ్మచర్యరతో నగ్నో వ్రతం పాశుపతం చరేత్ ॥ 142 ॥**

ప్రశాంతమైన మనసు కలవాడు, నియమించిన మనసుకలవాడు, భస్మధూళిత శరీరియై నిగ్రహంకల్గి బ్రహ్మచర్య మవలంబించి దిగంబరంగా పాశుపత వ్రతాన్నాచరించాలి.

**నిర్మితం హి మయా పూర్వం వ్రతం పాశుపతం పరమ్ ।**
**గుహ్యాద్గుహ్యతమం సూక్ష్మం వేదసారం విముక్తయే ॥ 143 ॥**

ఈ పాశుపత వ్రతం పరమరహస్యం, సూక్ష్మం, వేదసారం. దీన్ని ముక్తికోసం పూర్వం నేనే ఏర్పరచినాను.

**యద్వా కౌపీనవసనః స్యాద్వైకవసనో మునిః ।**
**వేదాభ్యాసరతో విద్వాన్ ధ్యాయేత్పశుపతిం శివమ్ ॥ 144 ॥**

లేదా కౌపీనధారియై ఏక వస్త్రాన్ని ధరించాలి. వేదాభ్యాసరతుడై నా తత్త్వాన్ని తెలిసి పశుపతి శివుని ధ్యానించాలి.

**ఏష పాశుపతో యోగః సేవనీయో ముముక్షుభిః ।**
**భస్మచ్ఛన్నైర్హి సతతం నిష్కామైరితి విశ్రుతిః ॥ 145 ॥**

**వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవోఽనేన యోగేన పూతా మద్భావమాగతాః ॥ 146 ॥**

మోక్షార్థులు పాశుపతయోగం సేవించాలి. వీరు భస్మాన్ని శరీరానికలదుకోని, కామరహితులై, రాగ, భయక్రోధాలు వదలి నాయందే మనసు నిల్పి నన్నే ఆశ్రయించాలి. ఈ యోగంతో చాలమంది పరిశుద్ధులై నా సారూప్యాన్ని పొందినారు.

**అన్యాని చైవ శాస్త్రాణి లోకేఽస్మిన్మోహనాని తు ।**
**వేదవాదవిరుద్ధాని మయైవ కథితాని తు ॥ 147 ॥**

ఇతర శాస్త్రాలు లోకంలో జీవులను మోహింపచేసేవి. వేదవాదవిరుద్ధాలైనవి చాల కలవు. మోహింప చేయటానికి వాటిని నేనే చెప్పినాను.

**వామం పాశుపతం సోమం నాకులం చైవ భైరవమ్ ।**
**అసేవ్యమేతత్కథితం వేదబాహ్యం తథేతరత్ ॥ 148 ॥**

వామం, పాశుపతం, సోమం, నాకులం, భైరవం వంటివి చాల కలవు. ఇవి సేవించరానివి వేదబాహ్యములుగా చెప్పబడినవి.

**వేదమూర్తిరహం విప్రా నాఽన్యశాస్త్రార్థవేదిభిః ।**
**జ్ఞాయతే మత్స్వరూపస్తు ముక్త్వా వేదం సనాతనమ్ ॥ 149 ॥**

నేను వేదమూర్తిని. ఇతరశాస్త్రాలు తెలుసుకొని సనాతన వేదాన్ని విడిచినవారు నన్ను తెలుసుకోలేరు.

**స్థాపయధ్వ మిమం మార్గం పూజయన్తో మహేశ్వరమ్ ।**
**అచిరాదైశ్వరం జ్ఞానముత్పత్స్యతి న సంశయః ॥ 150 ॥**

అందువల్ల నేను చెప్పిన ఈ మార్గాన్ని ప్రతిష్ఠించండి. మహేశ్వరుని పూజించండి. త్వరలోనే పరమేశ్వరజ్ఞానం కలుగుతుంది.

**మయి భక్తిశ్చ విపులా భవతామస్తు సత్తమాః! ।**
**ధ్యాత మాత్రో హి సాన్నిధ్యం దాస్యామి మునిసత్తమాః! ॥ 151 ॥**

మునిశ్రేష్ఠులారా! నాయందు విస్తారమైన భక్తి కూడా కలుగుగాక! మీరు ధ్యానించిన వెంటనే నేను సాక్షాత్కరిస్తాను.

**ఇత్యుక్త్వా భగవాన్సోమ స్తత్రైవాన్తర ధీయత ।**
**తేఽపి దారువనే తస్మిన్ పూజయన్తిస్మ శఙ్కరమ్ ॥ 152 ॥**

అని పలికి ఉమాసహితుడై శంకరుడక్కడే అంతర్ధానమైనాడు. ఆ ఋషులు కూడా ఆదారువనంలో శంకరుని పూజిస్తున్నారు.

**బ్రహ్మచర్యరతాః శాన్తాః జ్ఞానయోగపరాయణాః ।**
**సమేత్య తే మహాత్మానో మునయో బ్రహ్మవాదినః ॥ 153 ॥**

**వితేనిరే బహూ న్వాదా నధ్యాత్మజ్ఞాన సంశ్రయాన్ ।**
**కిమస్య జగతో మూల మాత్మాచాస్మాక మేవ హి ॥ 154 ॥**

ఆ ఋషులు బ్రహ్మచర్యవ్రతులై, శాంతులై, జ్ఞానయోగ పరాయణులు, బ్రహ్మవాదులై అందరు కలిసి అధ్యాత్మ జ్ఞాన సంబంధ సిద్ధాంతాలు వ్యాప్తి చేసినారు ఈ ప్రపంచానికి మూలమేమి? మన ఆత్మయే,

**కోఽపిస్యా త్సర్వ భావానాం హేతురీశ్వర ఏవ చ ।**
**ఇత్యేవం మన్యమానానాం ధ్యానమార్గావ లమ్బినామ్ ॥**
**ఆవిరాసీ న్మహాదేవీ దేవీ గిరివరాత్మజా । 155 ॥**

అన్ని పదార్థాలకు కారణం ఎవరు ఈశ్వరుడే అని భావించే ధ్యానమార్గానుసారులైన ఋషులకు గిరిజ మహాదేవి సాక్షాత్కరించినది.

**కోటిసూర్య ప్రతీకాశా జ్వాలామాలా సమావృతా ।**
**స్వభాభిర్విమలాభిస్తు పూరయన్తీ నభస్థలమ్ ॥ 156 ॥**

ఆ పార్వతి కోటిసూర్యసమ కాంతిగల్గి జ్వాలామాలావృతయై తేజోరాశి వలె ఉన్నది. తన శుద్ధకాంతులతో ఆకాశాన్ని నింపుతున్నది.

**తామన్వపశ్యన్గిరిజామమేయాం జ్వాలా సహస్రాన్తరసంనివిష్టామ్ ।**
**ప్రణేమురేకామఖిలేశపత్నీం జానన్తి తే తత్పరమస్య బీజమ్ ॥ 157 ॥**

ప్రమాణాలకందనిది, వేల తేజోరాశులమధ్య ఉండతగినదగు గిరిజను ఆ మునులు చూచి ఆ అఖిలేశ పత్నికి నమస్కరించినారు. ఆమే మహేశ్వరుని మూలశక్తి అని వారికి తెలియును.

**అస్మాకమేషా పరమేశపత్నీ గతిస్తథాత్మా గగనాభిధానా ।**
**పశ్యన్త్యథాఽఽత్మానమిదఞ్చ కృత్స్నం తస్యామథైతే మునయశ్చ విప్రాః ॥ 158 ॥**

ఈమె ఆకాశనామంతో ప్రసిద్ధి పడసినది. మనకు ఆత్మ. ఈమే గతి. జ్ఞానులు ఈమెలోనే ప్రపంచాన్ని ఆత్మను దర్శిస్తుంటారు.

**నిరీక్షితాస్తే పరమేశపత్న్యా తదన్తరే దేవమశేషహేతుమ్ ।**
**పశ్యన్తి శమ్భుం కవిమీశితారం రుద్రం బృహన్తం పురుషం పురాణమ్ ॥ 159 ॥**

దేవి తేజః పుంజం మధ్య జగత్కారణుడైన మహాదేవుని కూడ వారు చూడగలరు. అతడే శంభుడు, కవి, ఈశ్వరుడు, రుద్రుడు, బ్రహ్మ, పురాణపురుషుడు.

**ఆలోక్య దేవీమథ వేదమీశం ప్రణేమురానన్దమవాపురగ్ర్యమ్ ।**
**జ్ఞానం తదీశం భగవత్ప్రసాదాత్ ఆవిర్బభౌ జన్మవినాశహేతుః ॥ 160 ॥**

ఈ విధంగా దేవినీ, దేవుణ్ణి చూచిన ఆ మునులు వారికి నమస్కరించి పరమానంద మందినారు. దానితో ఈశ్వరానుగ్రహంవల్ల జన్మనాశకారణమైన పరమేశ్వరజ్ఞానం లభించింది.

**ఇయం హి సా జగతో యోనిరేకా సర్వాత్మికా సర్వనియామికా చ ।**
**మహేశ్వరీశక్తిరనాది సిద్ధా వ్యోమాభిధానా దివి రాజతీవ ॥ 161 ॥**

ఈ దేవియే జగత్తుకు ఒకే ఒక మూలాధారం, సర్వస్వరూప, సర్వనియామకురాలు. ఈమెయే ఈ మహేశ్వర శక్తియే అనాదిసిద్ధం. ఈమె పరమాకాశ నామంతో అంతరిక్షంలో ప్రకాశిస్తుంటుంది.

**అస్యా మహాన్ పరమేష్ఠీ పరస్తాత్ మహేశ్వరః శివ ఏకోఽథ రుద్రః ।**
**చకార విశ్వం పరశక్తి నిష్ఠా మాయామథారుహ్య స దేవదేవః ॥ 162 ॥**

ఈమెలో ఉన్న మహాదేవుడు పరాత్పరుడు, పరమేష్ఠి, రుద్రుడు, శివుడు, మహేశ్వర నామాలతో ఈ మాయాశక్తిని ఆశ్రయించి సకల జగత్తును సృష్టిస్తాడు.

**ఏకో దేవః సర్వ భూతేషు గూఢః మాయీ రుద్రః సకలో నిష్కలశ్చ ।**
**స ఏవ దేవీ న చ తద్విభిన్నం ఏతజ్జ్ఞాత్వా హ్యమృతత్వం వ్రజన్తి ॥ 163 ॥**

ఇత దద్వితీయుడు. సర్వప్రాణుల్లో అంతర్యామిగా ఉన్న మాయి. సవికల్పుడు, నిర్వికల్పుడు. తనే దేవికూడ. దేవి, మహాదేవుడు భిన్నంగా ఉండలేరు. ఇది తెలిసినవాడే మోక్షాన్ని పొందుతాడు.

**అన్తర్హితోఽభూత్ భగవానథేశో దేవ్యా భర్గః సహ దేవాదిదేవః ।**
**ఆరాధయన్తి స్మ తమేవ దేవం వనౌకసస్తే పునరేవ రుద్రమ్ ॥ 164 ॥**

మునుల్లో ఈ జ్ఞానం కలుగగానే దేవితో కూడా మహాదేవుడంతర్ధానం చెందినాడు. వనవాసులైన ఆ ఋషులు ఎల్లపుడు ఆ రుద్రునే ఆరాధిస్తుండినారు.

**ఏతద్వః కథితం సర్వం దేవదేవవిచేష్టితమ్ ।**
**దేవదారువనే పూర్వం పురాణే యన్మయా శ్రుతమ్ ॥ 165 ॥**

ఈ విధంగా పూర్వకాలంలో దేవదారువనంలో దేవదేవులనుష్ఠించిన వృత్తాంతాన్ని నేను విన్న విషయమంతా మీకు తెలిపినాను.

**యః పఠేత్ శృణుయాన్నిత్యం ముచ్యతే సర్వపాతకైః ।**
**శ్రావయేద్వా ద్విజాన్శాన్తాన్స యాతి పరమాఙ్గతిమ్ ॥ 166 ॥**

శ్రద్ధగా దీన్ని విన్నవారు, చదివినవారు సర్వపాప విముక్తులౌతారు. శాంతులైన ద్విజులకు వినిపించిన వారు పరమపదాన్ని పొందుతారు.

**ఇతి శ్రీ కూర్మపురాణే ఉత్తరార్ధే దేవదారువనప్రవేశో నామ సప్తత్రింశోఽధ్యాయః ॥ 37 ॥**

శ్రీ కూర్మపురాణం ఉత్తరార్ధంలో దేవదారువనప్రవేశమనే ముప్పది ఏడవ అధ్యాయం ॥ 37 ॥



## అష్టత్రింశోఽధ్యాయః - ముప్పై ఎనిమిదవ అధ్యాయం

## నర్మదా మాహాత్మ్యమ్ - నర్మదా మాహాత్మ్యం

**సూత ఉవాచ:**-సూతుడు చెప్పాడు

**ఏషా పుణ్యతమా దేవీ దేవగన్ధర్వసేవితా ।**
**నర్మదా లోకవిఖ్యాతా తీర్థానాముత్తమానదీ ॥ 1 ॥**

ఈ నర్మదా దేవి పరమపవిత్రురాలు, దేవతల గంధర్వుల సేవలంది ప్రసిద్ధి పొందినది. నదీరూపంగా పరిణమించి ఉత్తమతీర్థంగా పేరందినది.

**తస్యాః శృణుధ్వం మాహాత్మ్యం మార్కండేయేన భాషితమ్ ।**
**యుధిష్ఠిరాయ తు శుభం సర్వపాపప్రణాశనమ్ ॥ 2 ॥**

మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పిన మాహాత్మ్యమిది వినండి. ఇది శుభకరం సర్వపాపప్రణాశనం.

**ధర్మరాజ ఉవాచ:**-ధర్మరాజడిగాడు

**శ్రుతాస్తు వివిధాధర్మా స్త్వత్ప్రసాదాత్ మహామునే! ।**
**మాహాత్మ్యఞ్చ ప్రయాగస్య తీర్థాని వివిధాని చ ॥ 3 ॥**

ఓ మహామునీ! పలువిధాలైన ధర్మాలు, ప్రయాగ మాహాత్మ్యం, అనేక తీర్థాల మాహాత్మ్యం కూడ మీరు చెప్పగా విన్నాను.

**నర్మదా సర్వతీర్థానాం ముఖ్యా హి భవతేరితా ।**
**తస్యాస్త్విదానీం మాహాత్మ్యం వక్తుమర్హసి సత్తమ ॥ 4 ॥**

సత్తమా! అన్ని తీర్థాల్లో ముఖ్యమైనది నర్మద అని మీరన్నారు. ప్రస్తుతం ఆ మాహాత్మ్యాన్ని తెలుప వలెనని కోరుతున్నాను.

**మార్కణ్డేయ ఉవాచ:**-మార్కండేయుడు చెప్పాడు

**నర్మదా సరితాం శ్రేష్ఠా రుద్రదేహాద్వినిస్సృతా ।**
**తారయేత్సర్వభూతాని స్థావరాణి చరాణి చ ॥ 5 ॥**

అన్ని నదుల్లో నర్మదానది శ్రేష్ఠమైనది. ఈ నది రుద్రదేహంనుండి వెడలినది. జంగమస్థావరా లన్నింటిని తరింపచేస్తుంది.

**నర్మదాయాస్తు మాహాత్మ్యం పురాణే యన్మయా శ్రుతమ్ ।**
**ఇదానీం త్వాం ప్రవక్ష్యామి శృణుష్వైకమనాః శుభమ్ ॥ 6 ॥**

పూర్వకాలంలో నేను విన్న నర్మదా మాహాత్మ్యం ఇప్పుడు నీకు వివరిస్తాను. శుభావహమైన దీన్ని సావధానంగా విను.

**పుణ్యా కనఖలే గఙ్గా కురుక్షేత్రే సరస్వతీ ।**
**గ్రామే వా యది వాऽరణ్యే పుణ్యా సర్వత్ర నర్మదా ॥ 7 ॥**

కనఖలక్షేత్రంలో గంగ, కురుక్షేత్రంలో సరస్వతి పావనాలని చెప్పారు. కాని నర్మదానది గ్రామంలో, అరణ్యంలో అంతటా పవిత్రమైనదే.

**త్రిభిస్సారస్వతం తోయం సప్తాహేన తు యామునమ్ ।**
**సద్యః పునాతి గఙ్గేయం దర్శనాదేవ నార్మదమ్ ॥ 8 ॥**

సరస్వతీ నది మూడు రోజులలోనూ, యమున ఏడు రోజులలోనూ గంగానదిని స్పృశించిన వెంటనే పవిత్రం చేస్తాయి. కాని నర్మదానది దర్శన మాత్రంతోనే పవిత్రం చేస్తుంది.

**కళిఙ్గదేశపశ్చార్ధే పర్వతేऽమరకణ్టకే ।**
**పుణ్యా చ త్రిషు లోకేషు రమణీయా మనోరమా ॥ 9 ॥**

కళింగదేశం పశ్చిమభాగంలో అమరకంటకమనే పర్వతంనుండి ఇది వెలువడినది. ముల్లోకాల్లో రమణీయమూ మనోహరమూ అయినది.

**స దేవాసురగన్ధర్వా ఋషయశ్చ తపోధనాః ।**
**తపస్తప్త్వా తు రాజేన్ద్ర! సిద్ధిం తు పరమాం గతాః ॥ 10 ॥**

ఓ రాజేంద్రా! దేవతలు, అసురులు, గన్ధర్వులు, తపోధనులైన ఋషులూ ఇక్కడే తపస్సు చేసి పరమమైన సిద్ధిని పొందినారు.

**తత్ర స్నాత్వా నరో రాజన్ నియమస్థో జితేన్ద్రియః ।**
**ఉపోష్య రజనీమేకాం కులానాం తారయేచ్ఛతమ్ ॥ 11 ॥**

ఎవడైనా అక్కడ స్నానం చేసి ఆత్మసంయమనంతో జితేంద్రియుడై ఒక రాత్రి ఉపవాసం చేస్తే నూరుతరాల అతని వంశం తరిస్తుంది.

**యోజనానాం శతం సాగ్రం శ్రూయతే సరిదుత్తమా।**
**విస్తారేణ తు రాజేంద్ర! యోజనద్వయమాయతా ॥ 12 ॥**

రాజేంద్రా! ఈ ఉత్తమనది నూరు యోజనాల పొడవు, రెండుయోజనాల వెడల్పు విస్తరించిందని విన్నాము.

**షష్టితీర్థసహస్రాణి షష్టికోట్యస్తథైవ చ ।**
**పర్వతస్య సమన్తాత్తు తిష్ఠన్త్యమరకంటకే ॥13॥**

ఆ అమరకంటక పర్వతసమూహంలో అరవైకోట్ల అరవైవేల తీర్థాలు అంతటా వ్యాపించి ఉన్నాయి.

**బ్రహ్మచారీ శుచిర్భూత్వా జితక్రోధో జితేన్ద్రియః ।**
**సర్వహింసానివృత్తస్తు సర్వభూతహితే రతః ॥ 14 ॥**

**ఏవం సర్వసమాచారో యస్తు ప్రాణాన్ సముత్సృజేత్ ।**
**తస్య పుణ్యం ఫలం రాజన్ శృణుష్వావహితో నృప! ॥ 15 ॥**

రాజా! బ్రహ్మచర్యం పాటిస్తూ శుచియై క్రోధాన్ని జయించి జితేంద్రియుడై అన్నివిధాలైన హింసను వదలి సర్వప్రాణుల హితాన్ని కోరుతూ ఇచట ప్రాణాలు వదిలే వానికి లభించే పుణ్యాన్ని గూర్చి సావధానంగా విను.

**శతవర్షసహస్రాణి స్వర్గే మోదతి పాణ్డవ! ।**
**అప్సరోగణసంకీర్ణో దివ్యస్త్రీపరివారితః ॥ 16 ॥**

ఓ రాజా! అతడు దేవతా స్త్రీలు చుట్టూ, ఉండగా అప్సరలతో నిండిన స్వర్గంలో నూరువేల సంవత్సరాలు ఆనందిస్తాడు.

**దివ్యగన్ధానులిప్తశ్చ దివ్యపుష్పోపశోభితః ।**
**క్రీడతే దేవలోకే తు దైవతైః సహ మోదతే ॥ 17 ॥**

దివ్యచందనం ఒంటికలదుకొని దివ్యమైన పూలమాలలలంకరించుకొని దేవలోకంలో క్రీడిస్తూ దేవతలతో కూడ ఆనందిస్తాడు.

**తతః స్వర్గాత్ పరిభ్రష్టో రాజా భవతి ధార్మికః ।**

పుణ్యానుభవం పూర్తికాగానే స్వర్గంనుండి భూమికి దిగి ధార్మికుడైన రాజుగా జన్మిస్తాడు.

**గృహన్తు లభతేఽసౌ వై నానారత్నసమన్వితమ్ ॥ 18 ॥**

**స్తమ్భైర్మణిమయై ర్దివ్యైర్వజ్రవైదూర్యభూషితమ్ ।**
**ఆలేఖ్యవాహనైశ్శుభ్రైర్దాసీదాససమన్వితమ్ ॥ 19 ॥**

**రాజరాజేశ్వరః శ్రీమాన్ సర్వస్త్రీజనవల్లభః ।**
**జీవేత్ వర్షశతం సాగ్రం తత్ర భోగసమన్వితః ॥ 20 ॥**

అతడు నానా రత్నసమన్వితమై దివ్యమణిమయమై వజ్రవైదూర్య అలంకృత స్తంభాలుకల్గి చిత్రలేఖనాలు కల వాహనాలతో దాసదాసీ జనంగల గృహం పొంది, స్త్రీమనోవల్లభుడై రాజరాజై నూరేండ్లు మించి సకలభోగాల నుభవిస్తాడు.

**అగ్నిప్రవేశేఽథ జలే అథవాఽనశనే కృతే ।**
**అనివర్తికా గతిస్తస్య పవనస్యామ్బరే యథా ॥ 21 ॥**

ఈ తీర్థంలో అగ్నిప్రవేశం, జలప్రవేశం, అనశనవ్రతం మొదలైన వ్రతాలాచరించినచో ఆకాశంలో వాయువులో మళ్ళీ జన్మలేని ఉత్తమపదం లభిస్తుంది.

**పశ్చిమే పర్వతతటే సర్వపాపవినాశనః ।**
**హ్రదో జలేశ్వరో నామ త్రిషు లోకేషు విశ్రుతః ॥ 22 ॥**

అమరకంటక పర్వత పశ్చిమతటంలో జలేశ్వర మనే హ్రదం సర్వపాప వినాశకమై ముల్లోక ప్రసిద్ధి నందియున్నది.

**తత్ర పిణ్డప్రదానేన సన్ధ్యోపాసనకర్మణా ।**
**దశవర్షాణి పితరస్తారితాఃస్యుర్న సంశయః ॥ 23 ॥**

ఈ తీర్థంలో సంధ్యావందన మాచరించుటచేతా పిండప్రదానం చేయడంవల్లా పితృదేవతలు పది సంవత్సరాలు తృప్తి పడతారు. సందేహం లేదు.

**దక్షిణే నర్మదాకూలే కపిలాఖ్యా మహానదీ ।**
**సరళార్జునసంఛన్నా నాతిదూరే వ్యవస్థితా ॥ 24 ॥**

నర్మదా దక్షిణ తటంలో కపిల అనే మహానది ఉన్నది. దీనికి రెండువైపులా సరళ అర్జున వృక్షాలు వ్యాపించి ఉన్నవి.

**సా తు పుణ్యా మహాభాగా త్రిషు లోకేషు విశ్రుతా ।**
**తత్రకోటిశతం సాగ్రం తీర్థానాన్తు యుధిష్ఠిర ॥ 25 ॥**

ఈ నది పరమపావనమైనది. త్రిలోకాలలో ప్రసిద్ధమైనది. ఈ తీర్థంలో కోటి తీర్థాల కంటే ఎక్కువ తీర్థాలు కలిసి ఉన్నవి.

**తస్మిన్ తీర్థే తు యే వృక్షాః పతితాః కాలపర్యయాత్ ।**
**నర్మదాతోయసంస్పృష్టాస్తే యాన్తి పరమాం గతిమ్ ॥ 26 ॥**

కాలవశంగా ఈ తీర్థంలో పడిపోయిన వృక్షాలు కూడా నర్మదా జలస్పర్శతో ఉత్తమ గతిని పొందుతాయి.

**ద్వితీయా తు మహాభాగా విశల్యకరణీ శుభా ।**
**తత్ర తీర్థే నరః స్నాత్వా విశల్యో భవతి క్షణాత్ ॥ 27 ॥**

మహాభాగా అనేది మరోమహానది. దీనికే విశల్యకరణి అనిపేరు. ఈ తీర్థంలో స్నానం చేసినవారి బాధలు తొలగిపోతాయి.

**కపిలా చ విశల్యా చ శ్రూయేతే సరిదుత్తమే ।**
**ఈశ్వరేణ పురా ప్రోక్తా లోకానాం హితకామ్యయా ॥ 28 ॥**

కపిల, విశల్య అనే ఉత్తమనదులు రెండు పురాణకాలంలో ఈశ్వరుడు లోకహితార్థం ఏర్పరచాడు.

**అనశనన్తు యః కుర్యా త్తస్మింతీర్థే నరాధిప ।**
**సర్వపాపవిశుద్ధాత్మా రుద్రలోకం స గచ్ఛతి ॥ 29 ॥**

ఈ తీర్థంలో ఉపవాసం చేసినవాడు అన్ని పాపాలు తొలగి శుద్ధుడై రుద్రలోకాన్ని పొందుతాడు.

**తత్ర స్నాత్వా నరో రాజన్నశ్వమేధఫలం లభేత్ ।**
**యే వసన్త్యుత్తరే కూలే రుద్రలోకే వసన్తి తే ॥ 30 ॥**

రాజా! ఇందులో స్నానం చేసినవాడు అశ్వమేధఫలాన్ని పొందుతాడు. ఈ నది ఉత్తర తీరంలో ఉన్నవారు రుద్రలోక వాసాన్ని పొందగలరు.

**సరస్వత్యాఞ్చ గఙ్గాయాం నర్మదాయాం యుధిష్ఠిర! ।**
**సమం స్నానం చ దానఞ్చ యథా మే శఙ్కరోఽబ్రవీత్ ॥ 31 ॥**

సరస్వతి, గంగ, నర్మదా నదుల్లో చేసిన స్నానం దానం సమానమైన ఫలితాలు ఇస్తాయని నాకు శంకరుడు చెప్పినాడు.

**పరిత్యజతి యః ప్రాణాన్ పర్వతేఽమరకణ్టకే ।**
**వర్షకోటిశతం సాగ్రం రుద్రలోకే మహీయతే ॥ 32 ॥**

అమర కంటక పర్వతంలో మరణించినవాడు రుద్రలోకంలో నూరు కోట్ల సంవత్సరాలు మించి నివసిస్తాడు.

**నర్మదాయాఞ్జలం పుణ్యం ఫేనోర్మిసమలఙ్కృతమ్ ।**
**పవిత్రశిరసావన్ద్య సర్వపాపైః ప్రముచ్యతే ॥ 33 ॥**

నురుగులు తరగలతో నిండినది, పరమ పావనమైనది, పుణ్యకరమైన నర్మదానదీ జలానికి నమస్కరించినవాడు సర్వపాపవిముక్తుడవుతాడు.

**నర్మదా సర్వతః పుణ్యా బ్రహ్మహత్యాపహారిణీ ।**
**అహోరాత్రోపవాసేన ముచ్యతే బ్రహ్మహత్యయా ॥ 34 ॥**

నర్మద అన్ని విధాల పవిత్రమైంది. బ్రహ్మహత్యా పాపాన్ని సైతం నశింప చేయగలది. ఇక్కడ ఒకరోజు ఉపవాసం ఉన్నవారు బ్రహ్మహత్యా పాపం తొలగించుకుంటారు.

**జాలేశ్వరం తీర్థవరం సర్వపాపవినాశనమ్ ।**
**తత్ర గత్వా నియమవాన్ సర్వకామాంల్లభేన్నరః ॥ 35 ॥**

అదే విధంగా జాలేశ్వరమనే మరో తీర్థమున్నది. ఇది కూడ సకల పాపవినాశకమే. ఇక్కడ మనోనిగ్రహంతో నివసించేవారు సర్వాభీష్టాలను పొందుతారు.

**చన్ద్రసూర్యోపరాగేతు గత్వా హ్యమరకణ్టకమ్ ।**
**అశ్వమేధా ద్దశగుణం పుణ్యమాప్నోతి మానవః ॥ 36 ॥**

సూర్య చంద్రగ్రహణ సమయాల్లో అమరకంటక పర్వతానికి వెళ్ళినవాడు అశ్వమేధయాగం కన్నా పదిరెట్లు ఎక్కువ ఫలాన్ని పొందుతాడు.

**ఏష పుణ్యో గిరివరో దేవగన్ధర్వసేవితః ।**
**నానాద్రుమలతాకీర్ణో నానాపుష్పోపశోభితః ॥ 37 ॥**

ఈ అమరకంటక పర్వతం పుణ్యప్రదం. దేవ గంధర్వులు సేవించినది. అనేక లతావృక్షాలు కలది. పలు విధాలైన పువ్వులతో శోభితమైనది.

**తత్ర సన్నిహితో రాజన్! దేవ్యాసహ మహేశ్వరః ।**
**బ్రహ్మా విష్ణు స్తథా చేన్ద్రో విద్యాధరగణైస్సహ ॥ 38 ॥**

రాజా! ఈ క్షేత్రంలో పరమేశ్వరుడు పార్వతితో బ్రహ్మ విష్ణు ఇంద్ర విద్యాధర గణాలతో నిత్యనివాస మేర్పరచుకొన్నాడు.

**ప్రదక్షిణన్తు యః కుర్యాత్పర్వతం హ్యమరకణ్టకమ్ ।**
**పౌండరీకస్య యజ్ఞస్య ఫలం ప్రాప్నోతి మానవః ॥ 39 ॥**

అమరకంటక పర్వతానికి ప్రదక్షిణ చేసినవాడు పౌండరీక క్రతుఫలాన్ని పొందుతాడు.

**కావేరీ నామ విపులా నదీ కల్మషనాశినీ ।**
**తత్ర స్నాత్వా మహాదేవమర్చయేత్ వృషభధ్వజమ్ ॥**
**సఙ్గమే నర్మదాయాస్తు రుద్రలోకే మహీయతే । 40 ॥**

ఇదే విధంగా పాపాల్ని పోగొట్టే పెద్దకావేరీనది ఉంది. ఇక్కడ స్నానం చేసి వృషభధ్వజుడైన మహాదేవునిని పూజించాలి. నర్మదా సంగమంలో శంకరుని ఆరాధించినవాడు రుద్రలోకంలో పూజింపబడతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే నర్మదామాహాత్మ్యే అష్టత్రింశోఽధ్యాయః ॥ 38 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో నర్మదామాహాత్మ్యమనే ముప్పది ఎనిమిదవ అధ్యాయం ॥ 38 ॥



## ఏకోనచత్వారింశోఽధ్యాయః - ముప్పై తొమ్మిదవ అధ్యాయం

## నర్మదా మాహాత్మ్యమ్ - నర్మదా మాహాత్మ్యం

**మార్కణ్డేయ ఉవాచ:**-మార్కండేయుడు చెప్పాడు

**నర్మదా సరితాం శ్రేష్ఠా సర్వపాపవినాశినీ ।**
**మునిభిః కథితా పూర్వమీశ్వరేణ స్వయమ్భువా ॥ 1 ॥**

అన్నినదుల్లో శ్రేష్ఠమైనది, నర్మదానది. అన్ని పాపాలు హరిస్తుంది అని పూర్వం స్వయంగా అవతరించిన శివునిచేతా మునులచేతా చెప్పబడింది.

**మునిభిః సంస్తుతా హ్యేషా నర్మదా ప్రవరానదీ ।**
**రుద్రగాత్రాద్వినిష్క్రాంతా లోకానాం హితకామ్యయా ॥ 2 ॥**

సర్వోత్తమ అయిన నర్మదా నదిని ఋషులు స్తుతించినారు. లోకహితంకోసం రుద్రదేహంనుండి వెలువడినది ఇది.

**సర్వపాపహరా నిత్యం సర్వదేవనమస్కృతా ।**
**సంస్తుతా దేవగన్ధర్వైరప్సరోభిస్తథైవ చ ॥ 3 ॥**

సర్వపాపాలను హరించునది, ఎల్లపుడు దేవతల నమస్కారాలందుకొంటుంది. దేవగంధర్వాప్సరల స్తుతి పాత్రమైనది.

**ఉత్తరే చైవ తత్కూలే తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్ ।**
**నామ్నా భద్రేశ్వరం పుణ్యం సర్వపాపహరం శుభమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్! దైవతైస్సహ మోదతే ॥ 4 ।**

రాజా! ఈ నర్మదానదికి ఉత్తరతీరంలో భద్రేశ్వరమనే తీర్థం ముల్లోకాల్లో ప్రసిద్ధమై ఉన్నది. అది పరమ పావనం. సర్వపాపహరం. శుభకరం. ఈ తీర్థంలో స్నానం చేసినవారు స్వర్గంలో దేవతలతో కలిసి విహరిస్తారు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర తీర్థమామ్రాతకేశ్వరమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ గోసహస్రఫలం లభేత్ ॥ 5 ॥**

ఈ తీర్థంనుండి ఆమ్రాతకేశ్వరం అనే తీర్థానికి వెళ్ళాలి. ఇచట స్నానం చేసిన వాడు వెయ్యి ఆవులు దానం చేసిన ఫలాన్ని పొందుతాడు.

**తతోఽఙ్గారేశ్వరం గచ్ఛేన్నియతో నియతాశనః ।**
**సర్వపాపవిశుద్ధాత్మా రుద్రలోకే మహీయతే ॥ 6 ॥**

అక్కడనుండి అంగారేశ్వరమనే తీర్థానికి వెళ్ళాలి. ఈ తీర్థంలో మనోనిగ్రహంతో నియతాహారుడైన వానికి అన్ని పాపాలు తొలగి రుద్రలోకం లభిస్తుంది.

**తతో గచ్ఛేత రాజేంద్ర! కేదారం నామ పుణ్యదమ్ ।**
**తత్ర స్నాత్వోదకం కృత్వా సర్వాన్కామానవాప్నుయాత్ ।**
**పిప్పలేశం తతో గచ్ఛేత్సర్వపాపవినాశనమ్ ॥ 7 ॥**

రాజేంద్రా! ఇటనుండి కేదార తీర్థానికి వెళ్ళాలి. ఇచట స్నానం, తర్పణం చేసినవాని కోరికలన్నీ సిద్ధిస్తాయి. అటనుండి సర్వపాపహరం పిప్పలేశం చేరాలి.

**తత్ర స్నాత్వా మహారాజ రుద్రలోకే మహీయతే ।**
**తతో గచ్ఛేత రాజేన్ద్ర! విమలేశ్వరముత్తమమ్ ।**
**తత్ర ప్రాణాన్ పరిత్యజ్య రుద్రలోక మవాప్నుయాత్ ॥ 8 ॥**

ఇచట స్నానం రుద్రలోకానందాన్ని కలిగిస్తుంది. రాజేంద్రా! అచటనుండి విమలేశ్వరానికి వెళ్ళాలి. విమలేశ్వరంలో దేహం విడిచినవాడు రుద్రలోకాన్ని పొందుతాడు.

**తతః పుష్కరిణీం గచ్ఛేత్ స్నానం తత్ర సమాచరేత్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర ఇన్ద్రస్యార్ధాసనం లభేత్ ॥ 9 ॥**

అక్కడనుండి పుష్కరిణికి వెళ్ళి స్నానం చేయాలి. అక్కడ స్నానం చేసినంతలోనే ఇంద్రుని అర్ధాసనాన్ని పొందుతాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర శూలభేదమితి శ్రుతమ్ ।**
**తత్ర స్నాత్వార్చయేద్దేవం గోసహస్రఫలం లభేత్ ॥ 10 ॥**

అక్కడనుండి ప్రసిద్ధమైన శూలభేదమనే తీర్థానికి వెళ్ళాలి. అచట స్నానంచేసి దేవునారాధించిన వానికి గోసహస్రదాన ఫలం లభిస్తుంది.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర బలితీర్థమనుత్తమమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ సింహాసనపతిర్భవేత్ ॥ 11 ॥**

అక్కడనుండి సర్వోత్తమమైన బలితీర్థానికి వెళ్ళాలి. అక్కడ స్నానం చేసిన వాడు సింహాసనాధిపతి అవుతాడు.

**శక్రతీర్థం తతో గచ్ఛేత్కూలే చైవ తు దక్షిణే ।**
**ఉపోష్య రజనీమేకాం స్నానం కృత్వా యథావిధి ॥ 12 ॥**

**ఆరాధయేన్మహాయోగం దేవం నారాయణం హరిమ్ ।**
**గోసహస్రఫలం ప్రాప్య విష్ణులోకం స గచ్ఛతి ॥ 13 ॥**

అక్కడనుండి నర్మదకు దక్షిణతీరంలో ఉన్న శక్రతీర్థానికి వెళ్ళాలి. అక్కడ స్నానమాడి ఒక రాత్రి ఉపవాసంచేసి మహాయోగీశ్వరుడైన నారాయణుని అర్చించినవాడు సహస్రగోదానఫలం పొంది విష్ణులోకాన్ని చేరుతాడు.

**ఋషితీర్థం తతో గత్వా సర్వపాపహరం నృణామ్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర శివలోకే మహీయతే ॥ 14 ॥**

అక్కడనుండి సర్వపాప హరమైన ఋషి తీర్థానికి వెళ్ళి స్నాన మాచరించిన వెంటనే శివలోకం లభిస్తుంది.

**నారదస్య తు తత్రైవ తీర్థం పరమశోభనమ్ ।**
**స్నాతమాత్రో నరస్తస్య గోసహస్రఫలం లభేత్ ॥ 15 ॥**

ఇక్కడే పరమశోభనందిన నారద తీర్థమున్నది. ఈ తీర్థంలో స్నానం చేసినవాడు గోసహస్రదాన ఫలం పొందుతాడు.

**యత్ర తప్తం తపః పూర్వం నారదేన సురర్షిణా ।**
**ప్రీతః తస్య దదౌ యోగం దేవదేవో మహేశ్వరః ॥ 16 ॥**

పూర్వం దేవర్షి నారదుడు ఇచట తపమాచరించినాడు. ప్రసన్నుడైన హరుడు నారదునికి యోగాన్ని ప్రసాదించినాడు.

**బ్రహ్మణా నిర్మితం లిఙ్గం బ్రహ్మేశ్వరమితి శ్రుతమ్ ।**
**యత్ర స్నాత్వా నరో రాజన్ బ్రహ్మలోకే మహీయతే ॥ 17 ॥**

అక్కడనుండి బ్రహ్మ శివలింగాన్ని స్థాపించిన బ్రహేశ్వర తీర్థం చేరుకొని స్నానం చేసినవాడు బ్రహ్మలోకాన్ని పొందుతాడు.

**ఋణతీర్థం తతో గచ్ఛేత్సఋణాన్ముచ్యతే ధ్రువమ్ ।**
**మహేశ్వరం తతో గచ్ఛేత్పర్యాప్తం జన్మనః ఫలమ్ ॥ 18 ॥**

ఆ తర్వాత ఋణతీర్థానికి వెళ్ళాలి. ఈ తీర్థాన్ని దర్శించిన వానికి ఋణ విమోచనం కలుగుతుంది. అక్కడనుండి మహేశ్వర తీర్థానికి వెళ్ళిన వారి జన్మధన్యమవుతుంది.

**భీమేశ్వరం తతోగచ్ఛేత్సర్వవ్యాధి వినాశనమ్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర సర్వదుఃఖైః ప్రముచ్యతే ॥ 19 ॥**

అక్కడనుండి సర్వవ్యాధినివారకమైన భీమేశ్వర తీర్థానికి వెళ్ళి అందులో స్నానం చేస్తే సర్వదుఃఖాలు తొలగిపోతాయి.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర పింగళేశ్వర ముత్తమమ్ ।**
**అహోరాత్రోపవాసేన త్రిరాత్రఫలమాప్నుయాత్ ॥ 20 ॥**

రాజశ్రేష్ఠా! అక్కడనుండి ఉత్తమమగు పింగళేశ్వరానికి వెళ్ళాలి. అక్కడ ఒకదినం ఉపవాసం ఉన్నందువల్ల మూడు దినాలుపవాసమున్న ఫలం లభిస్తుంది.

**తస్మిన్ తీర్థేతు రాజేన్ద్ర కపిలాం యః ప్రయచ్ఛతి ।**
**యావన్తి తస్యా రోమాణి తత్ప్రసూతికులేషు చ ॥ 21 ॥**

**తావద్వర్ష సహస్రాణి రుద్రలోకే మహీయతే ।**
**యస్తు ప్రాణపరిత్యాగం కుర్యాత్తత్ర నరాధిప! ॥ 22 ॥**

**అక్షయ్యం మోదతే కాలం యావచ్చన్ద్రదివాకరౌ ।**
**నర్మదాతటమాశ్రిత్య తిష్ఠన్తే యే తు మానవాః ॥ 23 ॥**

**తే మృతాస్స్వర్గమాయాన్తి సన్తస్సుకృతినో యథా ।**
**తతో దీప్తేశ్వరం గచ్ఛే ద్వ్యాసతీర్థం తపోవనమ్ ॥ 24 ॥**

**నివర్తితా పురా తత్ర వ్యాసభీతా మహానదీ ।**
**హుఙ్కారితా తు వ్యాసేన దక్షిణేన తతో గతా ॥ 25 ॥**

**ప్రదక్షిణన్తు యః కుర్యాత్తస్మిన్ తీర్థే యుధిష్ఠిర! ।**
**ప్రీతస్తస్య భవేద్వ్యాసో వాఞ్ఛితం లభతే ఫలమ్ ॥ 26 ॥**

ఈ తీర్థంలో కపిలగోదానం చేస్తే ఆ గోవుకు గోవుసంతానికి ఉన్న రోమాల సంఖ్య ఎంతో అన్ని వేల సంవత్సరాలు రుద్రలోకంలో నివసిస్తాడు. అక్కడ శరీరం వదలిన వారు సూర్యచంద్రులున్నంతకాలం తరగని ఆనందాన్ని పొందుతారు. నర్మదా తీరంలో నివసించే వారు సుకృతులవలె దేహాన్ని విడువగానే స్వర్గాన్ని చేరుకుంటారు. తర్వాత వ్యాసతీర్థమని పేరు పొందిన దీప్తేశ్వరం అనే తపోవనానికి వెళ్లాలి. అక్కడ వ్యాస భగవానునికి భయపడిన నర్మద అతని కోపాన్ని చూచి దక్షిణ దిశగా ప్రయాణం మార్చుకున్నది. ధర్మజా! ఆ తీర్థ ప్రదక్షిణ చేసేవానికి వ్యాసుడు ప్రసన్నుడై కోరికలను ప్రసాదిస్తాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర! ఇక్షునద్యాస్తు సఙ్గమమ్ ।**
**త్రైలోక్యవిశ్రుతం పుణ్యం తత్రసన్నిహితః శివః ॥ 27 ॥**

అక్కడ నుండి ఇక్షునదీ సంగమాన్ని చేరుకోవాలి. ఇది త్రిలోక విశ్రుతం. పరమపావనం. అక్కడ శివుడు ఎల్లకాలం సన్నిహితుడు.

**తత్ర స్నాత్వా నరో రాజన్ గాణపత్యమవాప్నుయాత్ ।**
**స్కన్దతీర్థం తతో గచ్ఛేత్సర్వపాపప్రణాశనమ్ ॥ 28 ॥**

ఆ తీర్థంలో స్నానమాడిన వాడు శివుని ఒక గణానికి ప్రభువు అవుతాడు. ఆ తర్వాత సర్వపాప నాశకమైన స్కంద తీర్థానికి వెళ్ళాలి.

**ఆజన్మనః కృతం పాపం స్నాతస్తత్ర వ్యపోహతి ।**
**తత్ర దేవాస్సగన్ధర్వా భవాత్మజమనుత్తమమ్ ।**
**ఉపాసతే మహాత్మానం స్కన్దం శక్తిధరం ప్రభుమ్ ॥ 29 ॥**

అక్కడ స్నానం చేసినవాడు జన్మించిన నాటినుండి చేసిన పాపాల నన్నింటిని పోగొట్టుకుంటాడు. ఆ తీర్థంలో గంధర్వులు దేవతలు శంకరుని పుత్రుడు శక్తిధరుడు మహానుభావుడైన కుమారస్వామిని సేవిస్తారు.

**తతో గచ్ఛేదాఙ్గిరసం స్నానం తత్ర సమాచరేత్ ॥**
**గోసహస్రఫలం ప్రాప్య రుద్రలోకం స గచ్ఛతి । 30 ॥**

అటనుండి ఆంగిరస తీర్థం వెళ్లాలి. ఆ తీర్థంలో స్నానం చేసిన వారు సహస్ర గోదాన ఫలం పొందుతారు. రుద్రలోకం చేరుకొంటారు.

**అఙ్గిరా యత్ర దేవేశం బ్రహ్మపుత్రో వృషధ్వజమ్ ।**
**తపసారాధ్య విశ్వేశం లబ్ధవాన్ యోగముత్తమమ్ ॥ 31 ॥**

ఆ తీర్థంలో బ్రహ్మపుత్రుడు అంగిరసుడు వృషభధ్వజుడైన శంకరుని తపస్సుతో ఆరాధించి ఉత్తమ యోగాన్ని పొందినాడు.

**కుశతీర్థం తతో గచ్ఛేత్సర్వపాపప్రణాశనమ్ ।**
**స్నానం యత్ర ప్రకుర్వీత అశ్వమేధఫలం లభేత్ ॥ 32 ॥**
**కోటితీర్థం తతో గచ్ఛేత్సర్వపాపప్రణాశనమ్।**
**తత్ర స్నాత్వా నరో రాజ్యం లభతే నాత్ర సంశయః ॥ 33 ॥**

అక్కడనుండి సర్వపాప ప్రణాశకమైన కుశతీర్థానికి వెళ్ళాలి. అక్కడి స్నానం అశ్వమేధ ఫలాన్నిస్తుంది. అక్కడనుండి అఖిల పాపహరమైన కోటి తీర్థానికి వెళ్ళి స్నానం చేస్తే రాజ్యాన్ని పొందుతాడు.

**చన్ద్రభాగాం తతో గచ్ఛేత్స్నానం తత్ర సమాచరేత్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర సోమలోకే మహీయతే ॥ 34 ॥**

కోటి తీర్థం నుండి చంద్రభాగా తీర్థానికి వెళ్ళి స్నానం చేయాలి. అట్లా స్నానం చేసినతడు చంద్రలోకాన్ని చేరుతాడు.

**నర్మదాదక్షిణే కూలే సఙ్గమేశ్వరముత్తమమ్ ।**
**తత్రస్నాత్వా నరో రాజన్ సర్వయజ్ఞఫలం లభేత్ ॥ 35 ॥**

నర్మదానదికి దక్షిణ తీరంలో సర్వోత్తమమైన సంగమేశ్వర తీర్థమున్నది. అక్కడి స్నానం సర్వయజ్ఞ ఫలాన్నిస్తుంది.

**నర్మదీయోత్తరే కూలే తీర్థం పరమశోభనమ్ ।**
**ఆదిత్యాయతనం రమ్యమీశ్వరేణ తు భూషితమ్ ॥ 36 ॥**

**తత్ర స్నాత్వా తు రాజేన్ద్ర దత్వాదానం తు శక్తితః ।**
**తస్య తీర్థప్రభావేణ లభతే చాక్షయం ఫలమ్ ॥ 37 ॥**

నర్మదకు ఉత్తర తీరంలో పరమ శోభనమైన ఆదిత్యాయతనం అనే తీర్థమున్నది. అక్కడ శివుడు స్వయంగా వెలసినాడు. ఆ తీర్థంలో స్నానమాడి యథాశక్తి దానం చేసినవాడు ఆ తీర్థ ప్రభావం వల్ల అక్షయ ఫలం పొందుతాడు.

**దరిద్రా వ్యాధితా యే తు యే చ దుష్కృతకారిణః ।**
**ముచ్యన్తే సర్వపాపేభ్యః సూర్యలోకం ప్రయాన్తి చ ॥ 38 ॥**

దరిద్రులు వ్యాధి గ్రస్తులు, పాప మాచరించే వారైనా అక్కడ స్నాన మాత్రంతో సకలపాపాలు తొలగి సూర్యలోకాన్ని పొందుతారు.

**మార్గేశ్వరం తతో గచ్ఛేత్స్నానం తత్ర సమాచరేత్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర స్వర్గలోకమవాప్నుయాత్ ॥ 39 ॥**

అక్కడనుండి మార్గేశ్వర తీర్థానికి వెళ్ళి స్నానంచేస్తే స్వర్గలోకాన్ని పొందుతాడు.

**తతః పశ్చిమతో గచ్ఛేన్మరుదాలయముత్తమమ్ ।**
**తత్ర స్నాత్వా తు రాజేన్ద్ర శుచిర్భూత్వా ప్రయత్నతః ॥ 40 ॥**

**కాఞ్చనన్తు ద్విజే దద్యా ద్యథా విభవవిస్తరమ్ ।**
**పుష్కరేణ విమానేన వాయులోకం స గచ్ఛతి ॥ 41 ॥**

ఆ తీర్థానికి పశ్చిమంలో సర్వోత్తమమైన మరుదాలయతీర్థమున్నది. అక్కడ స్నానం చేసి (పవిత్రుడై) తన సంపద కనుగుణంగా ద్విజునకు సువర్ణ దానంచేస్తే పుష్పకవిమానంలో వాయులోకానికి వెళతాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర అహల్యాతీర్థముత్తమమ్ ।**
**స్నానమాత్రాదప్సరోభిర్మోదతే కాలమక్షయమ్ ॥ 42 ॥**

అక్కడనుండి శ్రేష్ఠమైన అహల్యా తీర్థానికి వెళ్ళి స్నానం చేసినంతలోనే శాశ్వతంగా అప్సరలతో ఆనందిస్తాడు.

**చైత్రమాసే తు సమ్ప్రాప్తే శుక్లపక్షే త్రయోదశీ ।**
**కామదేవదినే తస్మిన్నహల్యాం యస్తు పూజయేత్ ॥43 ॥**

**యత్ర తత్ర నరోత్పన్నే వసంస్తత్ర ప్రియో భవేత్ ।**
**స్త్రీవల్లభో భవేచ్ఛ్రీమాన్కామదేవ ఇవాపరః ॥ 44 ॥**

చైత్రశుద్ధ త్రయోదశినాడు కామదేవదినం. ఈ తీర్థంలో స్నానం చేసి అహల్యను పూజించిన వాడు ఏ దేశంలో పుట్టినా అక్కడ అందరికీ ఇష్టుడౌతాడు. సుందరుడై రెండవ మన్మథునివలె యువతులకు వల్లభుడౌతాడు.

**అయోధ్యాన్తు సమాసాద్య తీర్థం శక్రస్య విశ్రుతమ్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర గోసహస్రఫలం లభేత్ ॥ 45 ॥**

అక్కడనుండి ఇంద్రుని తీర్థమైన అయోధ్యచేరి స్నానం చేయటంతోనే గోసహస్రదాన ఫలం పొందుతాడు.

**సోమతీర్థం తతో గచ్ఛేత్స్నానం తత్ర సమాచరేత్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర సర్వపాపైః ప్రముచ్యతే ॥ 46 ॥**

**సోమగ్రహే తు రాజేన్ద్ర! పాపక్షయకరం భవేత్ ।**
**త్రైలోక్యవిశ్రుతం రాజన్! సోమతీర్థం మహాఫలమ్ ॥ 47 ॥**

తర్వాత సోమతీర్థం వెళ్ళి స్నానం చేయాలి. అక్కడి స్నానం సర్వపాపహరం. మూడులోకాల్లోనూ ప్రసిద్ధమైనది అయిన సోమతీర్థం గొప్పఫలాన్నిస్తుంది. చంద్రగ్రహణంనాడు దాన్నిసేవిస్తే అన్ని పాపాలూ హరిస్తాయి.

**యస్తు చాన్ద్రాయణం కుర్యాత్తత్ర తీర్థే సమాహితః ।**
**సర్వపాపవిశుద్ధాత్మా సోమలోకం స గచ్ఛతి ॥ 48 ॥**

సోమ తీర్థంలో సావధానంగా చాంద్రాయణ వ్రతమాచరిస్తే సర్వపాప వినిర్ముక్తుడై చంద్రలోకాన్ని చేరుతాడు.

**అగ్నిప్రవేశం యః కుర్యా త్సోమతీర్థే నరాధిప! ।**
**జలే చానశనం వాపి నాఽసౌ మర్త్యోఽభిజాయతే ॥ 49 ॥**

ఆ తీర్థంలో అగ్నిప్రవేశం, జలప్రవేశం లేదా ఉపవాసం ఆచరించినా పునర్జన్మ ఉండదు.

**స్తమ్భతీర్థం తతో గచ్ఛేత్స్నానం తత్ర సమాచరేత్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర సోమలోకే మహీయతే ॥ 50 ॥**

ఆ తర్వాత స్తంభ తీర్థానికి వెళ్ళి స్నానం ఆచరించాలి. వెంటనే చంద్రలోకాన్ని చేరుకుంటాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర విష్ణుతీర్థమనుత్తమమ్ ।**
**యోధనీపురమాఖ్యాతం విష్ణోః స్థానమనుత్తమమ్ ॥ 51 ॥**

**అసురా యోధితాస్తత్ర వాసుదేవేన కోటిశః ।**
**తత్ర తీర్థం సముత్పన్నం విష్ణుశ్రీకో భవేదిహ ॥ 52 ॥**

**అహోరాత్రోపవాసేన బ్రహ్మహత్యాం వ్యపోహతి ।**
**నర్మదా దక్షిణేకూలే తీర్థం పరమశోభనమ్ ॥ 53 ॥**

**కామతీర్థమితి ఖ్యాతం యత్ర కామోఽర్చయద్భవమ్ ।**
**తస్మింస్తీర్థే నరః స్నాత్వా ఉపవాసపరాయణః ॥**
**కుసుమాయుధరూపేణ రుద్రలోకే మహీయతే । 54 ॥**

అక్కడనుండి యోధనీ అనే పురం వెళ్ళాలి. అది సర్వోత్తమమైన విష్ణు తీర్థం. అక్కడ పూర్వం విష్ణువు కోట్లమంది రాక్షసులతో యుద్ధం చేసినాడు. ఎక్కువకాలం విష్ణునివాసమైనందు వల్ల అది పవిత్రమైనతీర్థమైంది. అక్కడ ఒక రోజు ఉపవాసమున్నా బ్రహ్మహత్యాపాతకం తొలగటమేకాక విష్ణుసంపదా పొందుతారు. నర్మద దక్షిణ తీరంలో కామ తీర్థం అందమైనది. పూర్వం మన్మథుడు అక్కడ స్నానంచేసి ఉపవసించి శివుని ఆరాధించాడు. ఆ తీర్థంలో ఉపవాసం ఆచరించినవాడు మన్మథ రూపంతో రుద్రలోకంలో ఆనందిస్తాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర బ్రహ్మతీర్థ మనుత్తమమ్ ।**
**ఉమాహకమితి ఖ్యాతం తత్ర సంతర్పయేత్పితౄన్ ॥ 55 ॥**

రాజేంద్రా! అక్కడ నుండి సర్వోత్తమమైన బ్రహ్మతీర్థం వెళ్ళాలి. ఇది ఉమాహక మనుపేర ప్రసిద్ధమైంది. అక్కడ స్నానం చేసి పితరులకు తర్పణం చేయాలి.

**పౌర్ణమాస్యామమావాస్యాం శ్రాద్ధం కుర్యాద్యథావిధి ।**
**గజరూపా శిలా తత్ర తోయమధ్యే వ్యవస్థితా ॥ 56 ॥**

పూర్ణిమ, అమావాస్యలలో యథావిధి శ్రాద్ధమాచరించాలి. అక్కడ జలం మధ్యలో గజరూపంతో ఒక శిల ఉన్నది.

**తస్మింస్తు దాపయేత్పిణ్డాన్ వైశాఖ్యాం తు విశేషతః ।**
**స్నాత్వా సమాహితమనా దమ్భమాత్సర్యవర్జితః ॥ 57 ॥**

**తుష్యన్తి పితర స్తస్య యావత్తిష్ఠతి మేదినీ ।**
**సిద్ధేశ్వరం తతో గచ్ఛేద్యత్ర స్నానం సమాచరేత్ ॥ 58 ॥**

వైశాఖ పూర్ణిమనాడు విశేషంగా ఈ శిలపై పిండప్రదానం చేయాలి. ఇక్కడ స్నానంచేసి స్వస్థచిత్తుడై దంభం మాత్సర్యం వదలి శ్రాద్ధమాచరించినవానికి భూమి ఉన్నంత వరకు పితరులు తృప్తి పడతారు. అక్కడనుండి సిద్ధేశ్వర తీర్థానికి వెళ్ళి స్నాన మాచరించాలి.

**స్నాత మాత్రో నరస్తత్ర గాణపత్యపదం లభేత్ ।**
**తతో గచ్ఛేత రాజేన్ద్ర! లిఙ్గో యత్ర జనార్దనః ॥ 59 ॥**

**తత్ర స్నాత్వా తు రాజేన్ద్ర విష్ణులోకే మహీయతే ।**
**యత్ర నారాయణో దేవో మునీనాం భావితాత్మనామ్ ॥ 60 ॥**

**స్వాత్మానం దర్శయామాస లిఙ్గం తత్పరమం పదమ్ ।**
**అఙ్కోలన్తు తతో గచ్ఛేత్సర్వపాపవినాశనమ్ ॥ 61 ॥**

అక్కడస్నానించిన వెంటనే శివగాణపత్యం లభిస్తుంది. రాజేంద్రా! తర్వాత జనార్దనుడు లింగ రూపంలో ఉన్న క్షేత్రానికి వెళ్లాలి. అక్కడ స్నానం చేస్తే విష్ణులోకంలో పూజింపబడతాడు. అక్కడ విష్ణువు తనను ఉపాసించే మునులకు పరమస్థానమైన లింగరూపంగా దర్శనమిచ్చాడు. పిదప సమస్తపాపాల్నీ పోగొట్టే అంకోలమనే తీర్థానికి వెళ్లాలి.

**స్నానం దానం చ తత్రైవ బ్రాహ్మణానాం చ భోజనమ్ ।**
**అంకోల మూలే దద్యాచ్చ పిణ్డాంశ్చైవ యథావిధి ॥ 62 ॥**

అక్కడే స్నానమూ, దానమూ, బ్రాహ్మణులకు భోజనమూ, ఊడుగు చెట్టు మొదటలో యథాశాస్త్రంగా పిండప్రదానమూ చెయ్యాలి.

**తారితాః పితరస్తేన తృప్యన్త్యాచన్ద్రతారకమ్ ।**
**తతో గచ్ఛేత రాజేన్ద్ర తాపసేశ్వరముత్తమమ్ ॥ 63 ॥**

అలా పిండప్రదానం చెయ్యడం వల్ల వాని పితృదేవతలు చంద్రుడు, నక్షత్రాలున్నంతవరకు సంతృప్తిని పొందుతూ ఉంటారు. అక్కడనుండి గొప్పదైన తాపసేశ్వర క్షేత్రానికి వెళ్ళాలి.

**తత్ర స్నాత్వా తు రాజేన్ద్ర! ప్రాప్నుయాత్ తపసః ఫలమ్ ॥**
**శుక్ల తీర్థం తతోగచ్ఛేత్ సర్వ పాపవినాశనమ్ ।**
**నాస్తి తేన సమం తీర్థం నర్మదాయాం యుధిష్ఠిర! ॥ 64 ॥**

**దర్శనాత్స్పర్శనాత్తస్యస్నానదానతపోజపాత్ ।**
**హోమాచ్చైవోపవాసాచ్చ శుక్ల తీర్థే మహత్ఫలమ్ ॥ 65 ॥**

ఆ తాపసతీర్థంలో స్నానం చేస్తే తపస్సు చేసినంత పుణ్యాన్ని పొందుతారు. అక్కడనుండి సర్వపాపహరమైన శుక్లతీర్థానికి వెళ్ళాలి. ధర్మరాజా! దీంతో సమానమైన తీర్థం నర్మదా తీరంలో మరొకటి లేదు. ఈ తీర్థాన్ని దర్శించినా తాకినా స్నానం చేసినా దాన తపోహోమ ఉపవాసాల్లో దేన్నాచరించినా మహాఫలాన్ని పొందుతారు.

**యోజనం తత్స్మృతం క్షేత్రం దేవగన్ధర్వసేవితమ్ ।**
**శుక్లతీర్థ మితి ఖ్యాతం సర్వపాపవినాశనమ్ ॥ 66 ॥**

ఈ తీర్థం విస్తీర్ణం ఒక యోజనముంటుంది. దేవగంధర్వులు దీన్ని సేవిస్తారు. ఈ శుక్లతీర్థం సమస్తపాపాల్నీ పోగొడుతుంది.

**పాదపాగ్రేణ దృష్టేన బ్రహ్మహత్యాం వ్యపోహతి ।**
**దేవ్యా సహ సదా భర్గః తత్ర తిష్ఠతి శఙ్కరః ॥ 67 ॥**

ఈ తీర్థంలో ఏ వృక్షం చివరి భాగాన్ని దర్శించినా బ్రహ్మహత్యా పాతకం పోతుంది. ఈ తీర్థంలో శివుడు ఎల్లప్పుడు పార్వతితో కూడ నివసిస్తాడు.

**కృష్ణపక్షే చతుర్దశ్యాం వైశాఖేమాసి సువ్రత! ।**
**కైలాసాచ్చాభినిష్క్రమ్య తత్ర సన్నిహితో హరః ॥ 68 ॥**

సువ్రతా! వైశాఖ బహుళ చతుర్దశినాడు శంకరుడు కైలాసంనుండి వచ్చి ఇచట నివసిస్తాడు.

**దేవదానవగన్ధర్వాః సిద్ధవిద్యాధరాస్తథా ।**
**గణాశ్చాప్సరసాం నాగాస్తత్ర తిష్ఠన్తి పుఙ్గవ! ॥ 69 ॥**

పురుషశ్రేష్ఠా! ఈ తీర్థంలో దేవ దానవ గంధర్వ సిద్ధ విద్యాధర అప్సరో నాగ గణాలందరూ నివసించి ఉంటారు.

**రజకేన యథా వస్త్రం శుక్లం భవతి వారిణా ।**
**ఆజన్మని కృతం పాపం శుక్ల తీర్థే వ్యపోహతి ॥ 70 ॥**

చాకలి వస్త్రాన్ని ఉతికి శుభ్రపరచినట్లే పుట్టినప్పటి నుండి చేసిన పాపాలన్నింటిని శుక్ల తీర్థం పోగొడుతుంది.

**స్నానం దానం తపః శ్రాద్ధమనన్తం తత్ర దృశ్యతే ।**
**శుక్లతీర్థాత్పరం తీర్థం న భూతం న భవిష్యతి ॥ 71 ॥**

ఈ తీర్థంలో చేసిన స్నాన దాన తపఃశ్రాద్ధాలు అనంతఫలాలనిస్తాయి. శుక్ల తీర్థాన్ని మించిన తీర్థం ఇంత వరకు లేదు. ఇకముందు రాదు.

**పూర్వే వయసి కర్మాణి కృత్వా పాపాని మానవః ।**
**అహోరాత్రోపవాసేన శుక్ల తీర్థే వ్యపోహతి ॥ 72 ॥**

మానవుడు యౌవనంలో చేసిన పాపాలన్నీ ఈ తీర్థంలో ఒక దినం ఉపవాసంచేసి తొలగించుకోవచ్చు.

**కార్తికస్యతు మాసస్య కృష్ణపక్షే చతుర్దశీ ।**
**ఘృతేన స్నాపయే ద్దేవముపోష్య పరమేశ్వరమ్ ॥ 73 ॥**

**ఏక వింశత్కులోపేతో నచ్యవేదైశ్వరా త్పదాత్ ।**
**తపసా బ్రహ్మచర్యేణ యజ్ఞదానేన వా పునః ॥ 74 ॥**

**న తాం గతిమవాప్నోతి శుక్ల తీర్థేతు యాం లభేత్ ।**
**శుక్ల తీర్థం మహాతీర్థమృషిసిద్ధనిషేమితమ్ ॥ 75 ॥**

కార్తిక కృష్ణ చతుర్దశి నాడు స్నానం చేసి ఉపవాసముండి శివుణ్ణి ఘృతంతో అభిషేకిస్తే ఇరువదొక్క తరాలదాకా శివలోకంలో ఉండవచ్చును. శుక్ల తీర్థంలో పొందే ఫలాన్ని తపస్సు బ్రహ్మచర్యం యజ్ఞ దానాలతో కూడ పొందలేరు. శుక్ల తీర్థం గొప్పతీర్థం. ఇది ఋషులు, సిద్ధులూ సేవించినతీర్థం.

**తత్ర స్నాత్వా నరో రాజన్ పునర్జన్మ న విన్దతి ।**
**అయనే వా చతుర్దశ్యాం సఙ్క్రాన్తౌ విషువే తథా ॥ 76 ॥**

**స్నాత్వా తు సోపవాసస్సన్ విజితాత్మా సమాహితః ।**
**దానం దద్యాద్యథాశక్తి ప్రీయేతాం హరిశఙ్కరౌ ॥ 77 ॥**

అక్కడ స్నానం చేసిన వారికి పునర్జన్మలేదు. దక్షిణ ఉత్తర అయన పుణ్యకాలాల్లో చతుర్దశి, సంక్రమణ, విషువత్ కాలాల్లో (మేషం తులసంక్రాంతులు) ఈ తీర్థంలో స్నానం చేసి మనోనిగ్రహం కల్గి సావధానంతో ఉపవసించి, యథాశక్తి దానం చేస్తే హరిహరులు ప్రీతి చెందుతారు.

**ఏతత్తీర్థప్రభావేణ సర్వం భవతి చాక్షయమ్ ।**
**అనాథం దుర్గతం విప్రం నాథవన్తమథాపివా ॥ 78 ॥**

**ఉద్వాహయతి యః తీర్థే తస్య పుణ్యఫలం శృణు ।**
**యావత్తద్రోమసఙ్ఖ్యా తు తత్ప్రసూతికులేషు చ ॥ 79 ॥**

**తావద్వర్షసహస్రాణి రుద్రలోకే మహీయతే ।**
**తతో గచ్ఛేత రాజేన్ద్ర! యమతీర్థమనుత్తమమ్ ॥ 80 ॥**

ఈ తీర్థ ప్రభావంతో అంతా అక్షయమవుతుంది. అనాథ దరిద్రుడైన బ్రాహ్మణునికి గాని ఆధారం ఉన్న బ్రాహ్మణునికి గాని ఈ తీర్థంలో వివాహం జరిపిస్తే వచ్చేఫలం ఏమిటంటే? అతనికి అతని సంతానానికి ఉన్నరోమ సంఖ్యననుసరించి అన్ని వేల సంవత్సరాలు రుద్రలోకంలో ఆనందిస్తాడు. అక్కడనుండి ఉత్తమమగు యమతీర్థానికి వెళ్ళాలి.

**కృష్ణపక్షే చతుర్దశ్యాం మాఘమాసే యుధిష్ఠిర! ।**
**స్నానం కృత్వా నక్తభోజీ న పశ్యేద్యోనిసఙ్కటమ్ ॥ 81 ॥**

**తతో గచ్ఛేత రాజేన్ద్ర ఏరణ్డీతీర్థముత్తమమ్ ।**
**సంగమే తు నరః స్నాయాదుపవాసపరాయణః ॥ 82 ॥**

**బ్రాహ్మణం భోజయేదేకం కోటిర్భవతిభోజితాః ।**
**ఏరణ్డీసఙ్గమే స్నాత్వా భక్తిభావాత్తు రఞ్జితః ॥ 83 ॥**

**మృత్తికాం శిరసి స్థాప్య అవగాహ్య చ తజ్జలమ్ ।**
**నర్మదోదకసమ్మిశ్రం ముచ్యతే సర్వకిల్బిషైః ॥ 84 ॥**

రాజా! మాఘకృష్ణచతుర్దశి, నాడు స్నానం చేసి పగలు ఉపవాసం ఉండి రాత్రి భుజించిన వానికి పునర్జన్మ ఉండదు. ఇక్కడినుండి ధర్మరాజా! ఏరండీ తీర్థానికి వెళ్ళాలి. ఇక్కడి సంగమంలో స్నానం చేసి ఉపవసించి ఒక బ్రాహ్మణుని భుజింపచేస్తే కోటిమంది బ్రాహ్మణ భోజనఫలం లభిస్తుంది. భక్తిభావంతో మృత్తికను శిరసుపై ధరించి ఈ తీర్థంలో మునిగితే నర్మదా తీర్థం స్నానంతో సమాన ఫలం లభిస్తుంది. సమస్త పాపాలనుండి ముక్తుడవుతాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర! తీర్థం కార్ణాటికేశ్వరమ్ ।**
**గఙ్గావతరతే తత్ర దినే పుణ్యేన సంశయః ॥ 85 ॥**

మహారాజా! అక్కడనుండి కార్ణాటికేశ్వర తీర్థానికి వెళ్ళాలి. పర్వదినంలో ఆ తీర్థంలో గంగ అవతరిస్తుంది. సందేహం లేదు.

**తత్ర స్నాత్వా చ పీత్వా చ దత్త్వా చైవ యథావిధి ।**
**సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మలోకే మహీయతే ॥ 86 ॥**

ఇక్కడ స్నానం చేసి నీళ్ళు త్రాగి యథావిధి దానం చేసినవాడు సర్వపాప వినిర్ముక్తుడై బ్రహ్మలోక వాసం చేస్తాడు.

**నన్దితీర్థం తతో గచ్ఛేత్స్నానం తత్ర సమాచరేత్ ।**
**ప్రీయతే తత్ర నన్దీశః సోమలోకే మహీయతే ॥ 87 ॥**

అక్కడనుండి నంది తీర్థానికి వెళ్ళి స్నానం చేసినవానికి నందీశ్వరుడు ప్రసన్నుడౌతాడు. సోమలోకాన్ని అతడు పొందుతాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర తీర్థం త్వనరకం శుభమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ నరకం నైవ పశ్యతి ॥ 88 ॥**

అక్కడనుండి రాజా! అనరక మనే తీర్థానికి వెళ్ళి స్నానం చేసిన వాడు నరకాన్నిచూడడు.

**తస్మింస్తీర్థే తు రాజేన్ద్ర స్వాన్యస్థీని వినిక్షిపేత్ ।**
**రూపవాన్జాయతే లోకే ధనభోగ సమన్వితః ॥ 89 ॥**

రాజా! ఆ తీర్థంలోని తమ ఎముకలు నిమజ్జనం చేసినవాడు రూపవంతుడు, ధనవంతుడు, భోగి అవుతాడు.

**తతో గచ్ఛేత్తు రాజేన్ద్ర కపిలాతీర్థముత్తమమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ గోసహస్రఫలం లభేత్ ॥ 90 ॥**

అక్కడనుండి కపిలతీర్థానికి పోయి స్నానంచేస్తే సహస్రగోదాన ఫలం పొందుతాడు.

**జ్యేష్ఠమాసే తు సంప్రాప్తే చతుర్దశ్యాం విశేషతః ।**
**తత్రోపోష్య నరో భక్త్యా దద్యాద్దీపం ఘృతేన తు ॥ 91 ॥**

**ఘృతేన స్నాపయేద్రుద్రం సఘృతం శ్రీఫలం దహేత్ ।**
**ఘణ్టాభరణ సంయుక్తాం కపిలాం వై ప్రదాపయేత్ ॥ 92 ॥**

**సర్వాభరణసంయుక్తః సర్వదేవనమస్కృతః ।**
**శివతుల్యబలో భూత్వా శివవత్క్రీడతే చిరమ్ ॥ 93 ॥**

ఈ తీర్థంలో జ్యేష్ఠమాసం చతుర్దశి రోజు స్నానంచేసి ఉపవసించి భక్తితో ఘృత దీపం దానంచేసి ఘృతంతో రుద్రాభిషేకం చేయించాలి. ఘృతంతో కలిపి మారేడు ఫలంతో హోమం చేసి గంటకట్టిన కంఠాభరణాలతో ఉన్న కపిలధేనువును దానం చేస్తే సర్వాభరణాలతో సర్వదేవ నమస్కృతుడై శివునివంటి బలం కలవాడై శివలోకంలో శివునితో సమంగా క్రీడిస్తాడు.

**అంగారకదినే ప్రాప్తే చతుర్థ్యాం తు విశేషతః ।**
**స్నాపయిత్వా శివం దద్యాద్బ్రాహ్మణేభ్యస్తు భోజనమ్ ॥ 94 ॥**

**సర్వభోగసమాయుక్తో విమానైః సర్వకామికైః ।**
**గత్వా శక్రస్య భవనం శక్రేణ సహ మోదతే ॥ 95 ॥**

మంగళవారం విశేషంగా చతుర్థి కలిసిన రోజు  శివుని అభిషేకించి బ్రాహ్మణ సంతర్పణం చేస్తే సర్వ భోగాలు పొంది సమస్తకోరికలనిచ్చే విమానంలో ఇంద్రభవనానికి వెళ్ళి ఇంద్రునితో కలిసి విహరిస్తాడు.

**తతస్స్వర్గాత్పరిభ్రష్టో ధనవాన్భోగవాన్భవేత్ ।**
**అంగారకనవమ్యాన్తు అమావాస్యాం తథైవ చ ॥ 96 ॥**

**స్నాపయేత్తత్ర యత్నేన రూపవాన్సుభగో భవేత్ ।**
**తతో గచ్ఛేత్తు రాజేన్ద్ర గణేశ్వరమనుత్తమమ్ ॥ 97 ॥**

తర్వాత స్వర్గభ్రష్టుడై భూలోకంలో ధనవంతునిగా, భోగవంతునిగా జన్మిస్తాడు. అట్లే నవమితోకూడిన మంగళవారమూ, అమావాస్యల్లో రుద్రాభిషేకం చేయిస్తే రూపవంతుడు సౌభాగ్యవంతుడూ అవుతాడు. రాజేంద్రా! అక్కడనుండి గణేశ్వర తీర్థానికి వెళ్ళాలి.

**శ్రావణేమాసి సమ్ప్రాప్తే కృష్ణపక్షే చతుర్దశీ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర రుద్రలోకే మహీయతే ॥ 98 ॥**

ఆ తీర్థంలో శ్రావణ కృష్ణ చతుర్దశినాడు స్నానం చేసినట్లైతే రుద్రలోకంలో నివసిస్తాడు.

**పితౄణాం తర్పణం కృత్వా ముచ్యతేఽసావృణత్రయాత్ ।**
**గఙ్గేశ్వరసమీపే తు గఙ్గావదనముత్తమమ్ ॥ 99 ॥**

పితృదేవతలకు తర్పణం చేస్తే ఋణత్రయ విముక్తుడవుతాడు. గణేశ్వర తీర్థ  సమీపంలో గంగావదనం అనే మరో తీర్థమున్నది.

**అకామో వా సకామో వా తత్ర స్నాత్వా తు మానవః ।**
**ఆజన్మజనితైః పాపైర్ముచ్యతే నాత్ర సంశయః ॥ 100 ॥**

కోరికలున్నవారైనా లేనివారైనా ఆ తీర్థంలో స్నానం చేస్తే పుట్టిన నాటినుండి సంక్రమించిన పాపాలనుండి విముక్తుడవుతాడు. సందేహం లేదు.

**తస్య వై పశ్చిమే దేశే సమీపేనాతిదూరతః ।**
**దశాశ్వమేధికం తీర్థం త్రిషు లోకేషు విశ్రుతమ్ ॥ 101 ॥**

ఆ తీర్థానికి పశ్చిమభాగంలో దగ్గరలోనే ముల్లోకాలలో విశ్రుతమైన దశాశ్వమేధిక తీర్థమున్నది.

**ఉపోష్య రజనీమేకాం మాసి భాద్రపదే శుభే ।**
**అమావాస్యాం నరః స్నాత్వా పూజయేద్వృషభ ధ్వజమ్ ॥ 102 ॥**

అక్కడ ఒక రాత్రి ఉపవాసం చేసి భాద్రపద అమావాస్యనాడు స్నానంచేసి శంకరుని పూజించాలి.

**కాఞ్చనేన విమానేన కిఙ్కిణీజాలమాలినా ।**
**గత్వా రుద్రపురం రమ్యం రుద్రేణ సహ మోదతే ॥ 103 ॥**

దానివల్ల గంటలతో అలంకృతమైన బంగారు విమానంలో అందమైన రుద్రపురానికి వెళ్ళి రుద్రునితో కలిసి ఆనందిస్తాడు.

**సర్వత్ర సర్వ దివసే స్నానం తత్ర సమాచరేత్ ।**
**పితౄణాం తర్పణం కుర్యాదశ్వమేధఫలం లభేత్ ॥ 104 ॥**

దశాశ్వమేధ తీర్థంలో అన్నిచోట్ల అన్నిదినాల్లో స్నానం పితృతర్పణం చేసినవాడు అశ్వమేధ ఫలాన్ని పొందుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే నర్మదామాహాత్మ్యే ఏకోనచత్వారింశోఽధ్యాయః ॥ 39 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో నర్మదామాహాత్మ్యమనే ముప్పై తొమ్మిదవ అధ్యాయం ॥ 39 ॥



## చత్వారింశోఽధ్యాయః - నలబైయవ అధ్యాయం

## నర్మదామాహాత్మ్యమ్ - నర్మదామాహాత్మ్యం

**మార్కణ్డేయ ఉవాచ:**-మార్కండేయుడు చెప్పాడు

**తతో గచ్ఛేత రాజేన్ద్ర భృగుతీర్థమనుత్తమమ్ ।**
**తత్ర దేవో భృగుః పూర్వం రుద్రమారాధయత్పురా ॥ 1 ॥**

రాజేంద్రా! అక్కడనుండి ఉత్తమమైన భృగుతీర్థానికి వెళ్ళాలి. అక్కడనే పూర్వం పూజ్య భృగువు రుద్రునారాధించాడు.

**దర్శనాత్తస్య దేవస్య సద్యః పాపాత్ప్రముచ్యతే ।**
**ఏతత్క్షేత్రం సువిపులం సర్వపాపప్రణాశనమ్ ॥ 2 ॥**

అక్కడి దేవుని దర్శనంవల్ల వెంటనే పాపంనుండి విముక్తుడౌతాడు. ఈ క్షేత్రం సర్వపాపాల్నీ పోగొట్టే విశాలమైన క్షేత్రం.

**తత్ర స్నాత్వా దివం యాన్తి యే మృతాస్తేఽపునర్భవాః ।**
**ఉపానహౌస్తథా యుగ్మం దేయమన్నం సకాఞ్చనమ్ ॥ 3 ॥**

అచట స్నానంచేసిన వారు స్వర్గానికి వెళ్తారు. అక్కడ మరణించిన వారు మళ్ళీ పుట్టరు. అక్కడ పాదరక్షల జతా, బంగారమూ, ఆహారమూ దానం చేయాలి.

**భోజనఞ్చ యథాశక్తి తదస్యాక్షయముచ్యతే ।**
**క్షరన్తి సర్వదానాని యజ్ఞదానతపః క్రియాః ॥ 4 ॥**

**అక్షయ్యం తత్తపస్తప్తం భృగుతీర్థే యుధిష్ఠిర! ।**
**తస్యైవ తపసోగ్రేణ తుష్టేన త్రిపురారిణా ॥ 5 ॥**

**సాన్నిధ్యం తత్ర కథితం భృగుతీర్థే యుధిష్ఠిర ।**
**తతో గచ్ఛేత్తు రాజేన్ద్ర! గౌతమేశ్వరముత్తమమ్ ॥ 6 ॥**

అక్కడ శక్తికొలది భోజనం పెడితే భుజింపచేసిన అక్షయఫలం లభిస్తుంది. ఎక్కడ చేసినదానఫలాలూ, యజ్ఞమూ, తపస్సులూ క్షీణిస్తాయికాని భృగుతీర్థంలో ఆచరించిన యజ్ఞ, దాన, తపస్సులు అక్షయఫలాన్నిస్తాయి. ధర్మరాజా! భృగుమహర్షి ఆచరించిన ఉగ్రతపస్సుకు సంతోషించిన శంకరుడు అక్కడ ఎల్లపుడు ఉంటానని వరమిచ్చినాడు. అక్కడనుండి గౌతమేశ్వరతీర్థానికి వెళ్ళాలి.

**యత్రాఽఽరాధ్య త్రిశూలాఙ్కం గౌతమః సిద్ధిమాప్తవాన్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్! ఉపవాసపరాయణః ॥ 7 ॥**

**కాఞ్చనేన విమానేన బ్రహ్మలోకే మహీయతే ।**
**వృషోత్సర్గం తతో గచ్ఛేచ్ఛాశ్వతం పదమాప్నుయాత్ ॥ 8 ॥**

గౌతము డచట శంకరునారాధించి సిద్ధి నందినాడు. ఆ తీర్థంలో స్నానమాడి ఉపవసించినవాడు బంగారు విమానంలో బ్రహ్మలోకం చేరుకుంటాడు. అక్కడనుండి వృషోత్సర్గ తీర్థానికి వెళ్ళిన శాశ్వత ఫలాన్ని పొందుతారు.

**న జానన్తి నరా మూఢాః విష్ణోర్మాయావిమోహితాః ।**
**ధౌతపాపం తతో గచ్ఛేద్ధౌతం యత్ర వృషేణ తు ॥ 9 ॥**

ఆ క్షేత్రాన్ని దర్శించనివాళ్ళు విష్ణుమాయకు లోనై, మూఢులై, పరతత్త్వాన్ని తెలియలేరు. అక్కడనుండి ధౌతపాప తీర్థానికి వెళ్ళాలి. ఆ తీర్థంలో ధర్ముడు తనకల్మషాన్ని పోగొట్టుకున్నాడు.

**నర్మదాయాం స్థితం రాజన్ సర్వపాతకనాశనమ్ ।**
**తత్ర తీర్థే నరః స్నాత్వా బ్రహ్మహత్యాం వ్యపోహతి ॥ 10 ॥**

రాజా! అది నర్మదానదీ ప్రాంతంలో ఉన్నది. అది సకలపాపవినాశకం. అక్కడ స్నానం చేసినవాడు బ్రహ్మహత్యాపాతకాన్ని తొలగించుకొంటాడు.

**తత్ర తీర్థే తు రాజేన్ద్ర ప్రాణత్యాగం కరోతి యః ।**
**చతుర్భుజస్త్రినేత్రశ్చ హరతుల్యబలో భవేత్ ॥ 11 ॥**

రాజా! ఆ తీర్థంలో ప్రాణత్యాగం చేసినవాడు నాల్గుభుజాలు, మూడు నేత్రాలుకల్గి శంకరునితో సమాన బలం కలవాడవుతాడు.

**వసేత్కల్పాయుతం సాగ్రం శివతుల్యపరాక్రమః ।**
**కాలేన మహతా జాతః పృథివ్యామేకరాడ్భవేత్ ॥ 12 ॥**

అట్టివాడు శివునితో సమానమైన బలంకలవాడై పదివేల సంవత్సరాలకు మించి పైలోకంలో నివసిస్తాడు. పిమ్మట చాలాకాలానికి భూమిపై పుట్టి చక్రవర్తి అవుతాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర హంసతీర్థమనుత్తమమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ బ్రహ్మలోకే మహీయతే ॥ 13 ॥**

రాజా! అక్కడినుండి హంసతీర్థానికి వెళ్ళాలి. అక్కడ స్నానం చేసినవాడు బ్రహ్మలోకంలో నివసిస్తాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర సిద్ధో యత్ర జనార్దనః ।**
**వరాహతీర్థమాఖ్యాతం విష్ణులోకగతిప్రదమ్ ॥ 14 ॥**

రాజా! అక్కడనుండి జనార్దనుడు సిద్ధిపొందిన వరాహతీర్థం వెళ్ళాలి. అది విష్ణులోకాన్ని ప్రసాదిస్తుంది.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర చన్ద్రతీర్థమనుత్తమమ్ ।**
**పౌర్ణమాస్యాం విశేషేణ స్నానం తత్ర సమాచరేత్ ॥ 15 ॥**

రాజా! అక్కడనుండి చంద్రతీర్థానికి వెళ్ళి విశేషించి పౌర్ణమినాడు స్నానంచేయాలి.

**స్నాతమాత్రో నరస్తత్ర చన్ద్రలోకే మహీయతే ।**
**తతో గచ్ఛేత రాజేన్ద్ర కన్యాతీర్థమనుత్తమమ్ ॥ 16 ॥**

అక్కడ స్నానమాత్రంతో చంద్రలోకనివాసం సిద్ధిస్తుంది. అక్కడినుండి మహోత్తమమైన కన్యాతీర్థానికి పోవాలి.

**శుక్లపక్షే తృతీయాయాం స్నానం తత్ర సమాచరేత్ ।**
**స్నాతమాత్రో నరస్తత్ర పృథివ్యామేకరాడ్భవేత్ ॥ 17 ॥**

శుక్లతృతీయయందు స్నానం ఈ తీర్థంలో చేసినవాడు చక్రవర్తి అవుతాడు.

**దేవతీర్థం తతో గచ్ఛేత్సర్వదేవనమస్కృతమ్ ।**
**తత్ర స్నాత్వా చ రాజేన్ద్ర దైవతైస్సహ మోదతే ॥ 18 ॥**

రాజా! సకలదేవతల నమస్కారాన్నందే దేవతీర్థానికి అక్కడినుండి పోవాలి. అక్కడ స్నానంచేసిన వాడు దేవతలతో కూడి ఆనందిస్తాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర శిఖితీర్థమనుత్తమమ్ ।**
**యత్తత్ర దీయతే దానం సర్వం కోటిగుణం భవేత్ ॥ 19 ॥**

రాజేంద్రా! అక్కడనుండి పరమోత్తమమైన శిఖితీర్థానికి వెళ్ళాలి. అక్కడ చేసిన దానం కోటిగుణం కలదౌతుంది.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర తీర్థం పైతామహం శుభమ్ ।**
**యత్తత్ర క్రియతే శ్రాద్ధం సర్వం తదక్షయం భవేత్ ॥ 20 ॥**

అక్కడనుండి మంగళకరమైన పితామహతీర్థానికి వెళ్ళాలి. అక్కడ చేసే శ్రాద్ధం అక్షయ ఫలాన్నిస్తుంది.

**సావిత్రీతీర్థమాసాద్య యస్తు ప్రాణాన్ పరిత్యజేత్ ।**
**విధూయ సర్వపాపాని బ్రహ్మలోకే మహీయతే ॥ 21 ॥**

అక్కడనుండి సావిత్రీతీర్థాన్ని చేరాలి. ఆ తీర్థంలో ప్రాణం వదలినవాడు అన్ని పాపాలు తొలగి బ్రహ్మలోకాన్ని పొందుతాడు.

**మనోహరస్తు తత్రైవ తీర్థం పరమశోభనమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ దైవతైస్సహ మోదతే ॥ 22 ॥**

రాజా! అక్కడే మిక్కిలి సుందరమైన మనోహరమనే తీర్థం మరొకటున్నది. అందులో స్నానం చేసినవాడు దేవతలతో కలిసి విహరిస్తాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర మానసం తీర్థముత్తమమ్ ।**
**స్నాత్వా తత్ర నరో రాజన్ రుద్రలోకే మహీయతే ॥ 23 ॥**

రాజశ్రేష్ఠా! అక్కడనుండి మానసతీర్థం చేరాలి. ఆ శ్రేష్ఠమైన తీర్థంలో స్నానం చేసిన వాడు రుద్రలోకాన్ని పొందుతాడు.

**స్వర్గబిన్దుం తతో గచ్ఛేత్తీర్థం దేవనమస్కృతమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ దుర్గతిం నైవ గచ్ఛతి ॥ 24 ॥**

రాజా! అక్కడనుండి దేవతల నమస్కారమందే స్వర్గబిందుతీర్థానికి వెళ్ళి స్నానం చేస్తే దుర్గతిని పొందడు.

**అప్సరేశం తతో గచ్ఛేత్స్నానం తత్ర సమాచరేత్ ।**
**క్రీడతే నాకలోకస్థో హ్యప్సరోభిస్స మోదతే ॥ 25 ॥**

అక్కడనుండి అప్సరేశతీర్థానికి చేరి స్నానమాచరిస్తే స్వర్గంలో అప్సరసలతో క్రీడిస్తూ ఆనందిస్తాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర భారభూతిమనుత్తమమ్ ।**
**ఉపోషితోఽర్చయే ద్దేవం రుద్రలోకే మహీయతే ॥ 26**

రాజేంద్రా! అక్కడనుండి దివ్యమైన భారభూతితీర్థాన్ని చేరాలి. అక్కడ ఉపవాసంచేసి, శివుని అర్చిస్తే రుద్రలోకంలో నివసిస్తాడు.

**అస్మింస్తీర్థే మృతో రాజన్ గాణపత్యమవాప్నుయాత్ ।**
**కార్తికే మాసి దేవేశమర్చయేత్పార్వతీపతిమ్ ॥ 27 ॥**

ఈ తీర్థంలో మృతి చెందినవాడు ఒక గణానికి అధిపతి అవుతాడు. ఈ తీర్థంలో కార్తికమాసంలో పార్వతీ పతిని ఆరాధించాలి.

**అశ్వమేధాద్దశగుణం ప్రవదన్తి మనీషిణః ।**
**వృషభం యః ప్రయచ్ఛేత యత్ర కున్దేన్దుసప్రభమ్ ॥ 28 ॥**

**వృషయుక్తేన యానేన రుద్రలోకం స గచ్ఛతి ।**
**ఏతత్తీర్థం సమాసాద్య యస్తు ప్రాణాన్పరిత్యజేత్ ॥ 29 ॥**

**సర్వపాపవిశుద్ధాత్మా రుద్రలోకం స గచ్ఛతి ।**
**జలప్రవేశం యః కుర్యాత్తస్మింస్తీర్థే నరాధిప ॥ 30 ॥**

**హంసయుక్తేన యానేన స్వర్గలోకం సగచ్ఛతి ।**
**ఏరణ్డ్యా నర్మదాయాస్తు సఙ్గమం లోకవిశ్రుతమ్ ॥ 31 ॥**

**తత్ర తీర్థం మహాపుణ్యం సర్వపాపప్రణాశనమ్ ।**
**ఉపవాసపరో భూత్వా నిత్యం వ్రతపరాయణః ॥ 32 ॥**

**తత్ర స్నాత్వా తు రాజేన్ద్ర ముచ్యతే బ్రహ్మహత్యయా ।**
**తతో గచ్ఛేత రాజేన్ద్ర నర్మదోదధిసఙ్గమమ్ ॥**
**జమదగ్నిరితి ఖ్యాతః సిద్ధో యత్ర జనార్దనః । 33 ॥**

**తత్ర స్నాత్వా నరో రాజన్ నర్మదోదధిసంగమే ।**
**త్రిగుణం చాశ్వమేధస్య ఫలం ప్రాప్నోతి మానవః ॥ 34 ॥**

అలా శివారాధనచేస్తే అశ్వమేధానికి పదింతలు ఫలాన్ని పొందుతాడని పండితులు చెబుతున్నారు. ఈ తీర్థంలో మల్లెవంటి, చంద్రునివంటి తెల్లనైన వృషభాన్ని దానం చేస్తే వృషభ వాహనంలో రుద్రలోకానికి చేరుతాడు. ఇక్కడ ప్రాణాలు వదలిన వాడు సకలపాప వినిర్ముక్తుడై రుద్రలోకాన్ని పొందుతాడు. ఈ తీర్థంలో జలప్రవేశం చేసినవాడు హంస వాహనంతో స్వర్గలోకాన్ని చేరుకుంటాడు. ఇక్కడ జగత్ప్రసిద్ధినందిన ఏరండీ నర్మదాసంగమం ఉన్నది. పరమ పావనమైనది. అన్నిపాపాలూ పోగొట్టే తీర్థమది. అచట స్నానంచేసి, ఉపవసించి, వ్రత పరాయణుడైతే బ్రహ్మహత్యా పాతకాన్ని కూడా పోగొట్టుకుంటాడు. రాజా! అక్కడనుండి నర్మదాసముద్రసంగమానికి వెళ్ళాలి. ఆ తీర్థంలో జనార్దనుడు జమదగ్ని నామంతో ప్రసిద్ధుడు. ఆ నర్మదాసముద్రసంగమంలో స్నానం చేసినవాడు అశ్వమేధ యాగఫలానికి మూడింతల ఫలాన్ని పొందుతాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర! పింగలేశ్వరముత్తమమ్ ।**
**తత్ర స్నాత్వా నరో రాజన్ బ్రహ్మలోకే మహీయతే ॥ 35 ॥**

ఓరాజా! ఆ తర్వాత ఉత్తమమైన పింగళేశ్వరానికి వెళ్ళాలి. అక్కడ స్నానం చేసిన నరుడు బ్రహ్మలోకంలో గౌరవం పొందుతాడు.

**తత్రోపవాసం యః కృత్వా పశ్యేత విమలేశ్వరమ్ ।**
**సప్తజన్మకృతం పాపం హిత్వా యాతి శివాలయమ్ ॥ 36 ॥**

అక్కడ ఉపవాసముండి విమలేశ్వరుణ్ణి దర్శించినట్లైతే ఏడు జన్మల్లో చేసిన పాపం తొలగి శివసాన్నిధ్యం చేరుతాడు.

**తతో గచ్ఛేత రాజేన్ద్ర! ఆలికా తీర్థముత్తమమ్ ।**
**ఉపోష్య రజనీమేకాం నియతో నియతాశనః ।**
**అస్య తీర్థస్య మాహాత్మ్యాన్ముచ్యతే బ్రహ్మహత్యయా ॥37॥**

ఓ రాజేంద్రా! విమలేశ్వరతీర్థంనుండి గొప్పదైన ఆలికాతీర్థం వెళ్లాలి. అక్కడ ఇంద్రియనిగ్రహంతో ఆహారనియమంకలిగి ఒక రాత్రి ఉపవాసం ఉన్నవాడు ఆ తీర్థమహిమవల్ల బ్రహ్మహత్యా పాపంనుండి విముక్తుడౌతాడు.

**ఏతాని తవ సంక్షేపాత్ప్రాధాన్యాత్కథితాని తు ।**
**న శక్యా విస్తరాద్వక్తుం సంఖ్యా తీర్థేషు పాణ్డవ ॥ 38 ॥**

ధర్మరాజా! ఈ విధంగా నీకు ప్రధానమైన తీర్థాలను గురించి సంక్షేపంగా వివరించాను. విస్తరంగా చెప్పటంకాని, తీర్థసంఖ్య చెప్పటానికిగాని సాధ్యం కాదు.

**ఏషా పవిత్రా విమలా నదీ త్రైలోక్యవిశ్రుతా ।**
**నర్మదా సరితాం శ్రేష్ఠా మహాదేవస్య వల్లభా ॥ 39 ॥**

ఈ నర్మదానది పవిత్రమూ, పరిశుద్ధమూ, త్రిలోక ప్రసిద్ధమూ ఐనది. అన్నినదుల్లో శ్రేష్ఠమై మహాదేవునికి ప్రియమైనది.

**మనసా సంస్మరేద్యస్తు నర్మదాం వై యుధిష్ఠిర ।**
**చాన్ద్రాయణశతం సాగ్రం లభతే నాత్ర సంశయః ॥ 40 ॥**

ధర్మరాజా! నర్మదను మనసులో స్మరించిన వాడు నూరుచాంద్రాయణ వ్రతాలఫలం పొందుతాడు. సందేహం లేదు.

**అశ్రద్దధానాః పురుషాః నాస్తిక్యం ఘోరమాశ్రితాః ।**
**పతన్తి నరకే ఘోరే ఇత్యాహ పరమేశ్వరః ॥ 41 ॥**

శ్రద్ధలేక నాస్తికులైన క్రూరులు ఘోర నరకంలో పడతారని మహాదేవుడు తెలిపినాడు.

**నర్మదాం సేవతే నిత్యం స్వయం దేవో మహేశ్వరః ।**
**తేన పుణ్యా నదీ జ్ఞేయా బ్రహ్మహత్యాపహారిణీ ॥ 42 ॥**

ఈ నర్మదానదిని మహాదేవు డెల్లపుడు సేవిస్తాడు. కావున నర్మదానది పుణ్యప్రదమైనది. బ్రహ్మహత్యా దోషాన్నీ పోగొడుతుంది.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే నర్మదామాహాత్మ్యే చత్వారింశోఽధ్యాయః ॥ 40 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో నర్మదామాహాత్మ్యమనే నలభైయవ అధ్యాయం ॥ 40 ॥



## ఏక చత్వారింశోఽధ్యాయః - నలభై ఒకటవ అధ్యాయం

## జప్యేశ్వరమాహాత్మ్యమ్ - జప్యేశ్వరమాహాత్మ్యం

**సూత ఉవాచ:**-సూతుడిలా చెప్పాడు

**ఇదం త్రైలోక్యవిఖ్యాతం తీర్థం నైమిశముత్తమమ్ ।**
**మహాదేవప్రియకరం మహాపాతకనాశనమ్ ॥ 1 ॥**

నైమిశారణ్య మనే తీర్థం ముల్లోక ప్రఖ్యాతమైంది. మహాపాతక నాశకం, మహాదేవునికి ప్రీతికరమైనది.

**మహాదేవం దిదృక్షూణామృషీణాం పరమేష్ఠినామ్ ।**
**బ్రహ్మణా నిర్మితం స్థానం తపస్తప్తుం ద్విజోత్తమాః! ॥ 2 ॥**

బ్రాహ్మణశ్రేష్ఠులారా! పరమ నిష్ఠగల మహర్షులు మహాదేవుని దర్శింపదలచి తపం చేయటానికి బ్రహ్మ ఏర్పరచిన స్థానమది.

**మరీచయోఽత్ర యో విప్రాః వసిష్ఠాః క్రతవస్తథా ।**
**భృగవోఽఙ్గిరసః పూర్వా బ్రహ్మాణం కమలోద్భవమ్ ॥ 3 ॥**

**సమేత్య సర్వవరదం చతుర్మూర్తిం చతుర్ముఖమ్ ।**
**పృచ్ఛన్తి ప్రణిపత్యైనం విశ్వకర్మాణమచ్యుతమ్ ॥ 4 ॥**

మరీచి, అత్రి, వసిష్ఠ, క్రతు, అంగిరో వంశాల మహర్షులు బ్రహ్మ వద్దకు వచ్చి చతుర్ముఖుడూ, చతుర్మూర్తీ, విశ్వకర్మ, అచ్యుతుడూ, సర్వవరప్రదుడూ అయిన బ్రహ్మకు నమస్కరించి ఇలా అడిగినారు.

**షట్కులీయా ఊచుః**-షట్కులీయు లన్నారు

**భగవన్దేవమీశానం భర్గమేకం కపర్దినమ్ ।**
**కేనోపాయేన పశ్యామో బ్రూహి దేవ నమస్కృతమ్ ॥ 5 ॥**

మహాత్మా! కపర్దీ, అద్వితీయుడూ, భర్గుడూ, దేవతలందరిచేత నమస్కరింపబడేవాడు అయిన మహాదేవుని దర్శించటానికి ఉపాయమేది? చెప్పండి!

**బ్రహ్మోవాచ:**- బ్రహ్మ ఇట్లా చెప్పాడు

**సత్త్రం సహస్రమాసధ్వం వాఙ్మనోదోషవర్జితాః ।**
**దేశఇ్చ వః ప్రవక్ష్యామి యస్మిన్దేశే చరిష్యథ ॥ 6 ॥**

వాక్ మనో దోషాలు లేనివారై వేయిసంవత్సరాల సత్త్రాన్ని ఆచరించండి. మీరు సత్త్రం (యజ్ఞం) చేయాల్సిన ప్రదేశాన్ని సూచిస్తాను.

**ఉక్త్వా మనోమయం చక్రం స సృష్ట్వా తానువాచ హ ।**
**క్షిప్తమేతన్మయా చక్రమనువ్రజత మాచిరమ్ ॥ 7 ॥**

అని చెప్పి బ్రహ్మ మనస్సుతో ఒక చక్రాన్ని సృష్టించి వారికిట్లన్నాడు. ఈ చక్రాన్ని నేను వదలుతాను. మీరు వెంటనే దాన్ని అనుగమించండి.

**యత్రాస్య నేమిః శీర్యేత స దేశః పురుషర్షభాః! ।**
**తతో ముమోచ తచ్చక్రం తేచ తత్సమనువ్రజన్ ॥ 8 ॥**

పురుష శ్రేష్ఠులారా! ఎక్కడ ఈ చక్రనేమి శీర్ణమవుతుందో ఆ ప్రదేశమే సత్త్రమాచరించటానికి తగిన దేశం అని పలికి బ్రహ్మ చక్రాన్ని వదిలినాడు. ఋషులు దాన్ని అనుసరించిపోయారు.

**తస్య వై వ్రజతః క్షిప్రం యత్ర నేమిర్వ్యశీర్యత ।**
**నైమిశం తత్స్మృతం నామ్నా పుణ్యం సర్వత్ర పూజితమ్ ॥ 9 ॥**

ఆ చక్రనేమి శీర్ణమైన ప్రదేశాన్ని నైమిశమని వ్యవహరించినారు. అది మిక్కిలి పవిత్రమైనది. అంతటా పూజించదగినది.

**సిద్ధచారణసఙ్కీర్ణం యక్షగన్ధర్వసేవితమ్ ।**
**స్థానం భగవతశ్శమ్భోరేతన్నైమిశముత్తమమ్ ॥ 10 ॥**

పరమాత్మ ఐన శివునికి స్థానమైనదీ, సిద్ధచారణులతో నిండి ఉన్నదీ, యక్షగంధర్వులచేత సేవింపబడేదీ అయిన ఈ నైమిశము శ్రేష్ఠమైనది.

**అత్ర దేవాస్సగన్ధర్వాస్సయక్షోరగరాక్షసాః ।**
**తపస్తప్త్వా పురా దేవం లేభిరే ప్రవరాన్వరాన్ ॥ 11 ॥**

ఇక్కడ దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, పన్నగులు తపమాచరించి శంకరునినుండి గొప్ప వరాలు పొందినారు.

**ఇమం దేశం సమాశ్రిత్య షట్కులీయాః సమాహితాః ।**
**సత్త్రేణారాధ్య దేవేశం దృష్టవన్తో మహేశ్వరమ్ ॥ 12 ॥**

మరీచిమున్నగు షట్కులీయ ఋషులీదేశాన్ని చేరి సావధానంగా వెయ్యేండ్ల పరిమితమైన సత్త్రమాచరించి మహాదేవుని సాక్షాత్కరించుకున్నారు.

**అత్ర దానం తపస్తప్తం స్థానం జప్యాదికఞ్చ యత్ ।**
**ఏకైకం పావయేత్పాపం సప్తజన్మకృతం ద్విజాః ॥ 13 ॥**

అందువల్ల విప్రులారా! ఈ క్షేత్రంలో చేసిన తపస్సు, దానం, యజ్ఞం, జపం మొదలైనవన్నీ ఒక్కొకటి ఏడుజన్మల పాపాలను నశింపచేస్తుంది.

**అత్ర పూర్వం స భగవానృషీణాం సత్త్రమాసతామ్ ।**
**ప్రోవాచ వాయుర్బ్రహ్మాణ్డం పురాణం బ్రహ్మభాషితమ్ ॥ 14 ॥**

ఈ నైమిశంలో సత్త్రాన్నాచరిస్తున్న మునులకు వాయుదేవుడు బ్రహ్మగారు చెప్పిన బ్రహ్మాండపురాణాన్ని చెప్పాడు.

**అత్ర దేవో మహేశానో రుద్రాణ్యా కిల విశ్వకృత్ ।**
**రమతేఽద్యాపి భగవాన్ ప్రమథైః పరివారితః ॥ 15 ॥**

ఇక్కడ మహాదేవుడు పార్వతితో, ప్రమథగణాలతో గూడినవాడై ఇప్పటికీ ఆనందిస్తున్నాడు.

**అత్ర ప్రాణాన్పరిత్యజ్య నియమేన ద్విజాతయః ।**
**బ్రహ్మలోకం గమిష్యన్తి యత్ర గత్వా న జాయతే ॥16॥**

ఈ క్షేత్రంలో నియమంతో ప్రాణత్యాగం చేసిన బ్రాహ్మణాదులు మళ్ళీ తిరిగిరాని బ్రహ్మలోకాన్ని చేరుకుంటారు.

**అన్యచ్చ తీర్థప్రవరం జాప్యేశ్వరమితి శ్రుతమ్ ।**
**జజాప రుద్రమనిశం యత్ర నన్దీ మహాగణః ॥ 17 ॥**

ఇక్కడనే జాప్యేశ్వరమనే మరో శ్రేష్ఠమైన తీర్థమున్నది. ఇచట మహాగణం గల నంది ఈశ్వరుని గూర్చి రాత్రింబవళ్లూ తపమాచరించాడు.

**ప్రీతస్తస్య మహాదేవో దేవ్యా సహ పినాకధృక్ ।**
**దదావాత్మసమానత్వం మృత్యువఞ్చనమేవ చ ॥ 18 ॥**

అతనికి దేవీసహితుడై ప్రసన్నుడైన శివుడు తనతో సమానత్వం, మృత్యుంజయత్వమనే వరాలొసగినాడు.

**అభూదృషిః స ధర్మాత్మా శిలాదో నామ ధర్మవిత్ ।**
**ఆరాధయన్మహాదేవం పుత్రార్థం వృషభధ్వజమ్ ॥ 19 ॥**

ఇచటనే శిలాదుడనే ధర్మాత్ముడైన మహాఋషి పుత్రుని కోసం శంకరుని గూర్చి తపమాచరించినాడు.

**తస్య వర్షసహస్రాన్తే తప్యమానస్య విశ్వకృత్ ।**
**శర్వః సోమో గణవృతో వరదోఽస్మీత్యభాషత ॥ 20 ॥**

వేయి సంవత్సరాలు గడువగా శంకరుడు తనగణాలతో సాక్షాత్కరించి శిలాదుణ్ణి వరం కోరుకోమన్నాడు.

**స వవ్రే వరమీశానం వరేణ్యం గిరిజాపతిమ్ ।**
**అయోనిజం మృత్యుహీనం పుత్రకం చ త్వయా సమమ్ ॥ 21 ॥**

అపుడు శిలాదుడు అయోనిజుడూ, మృత్యుహీనుడు, నీతో సమానుడూ అయిన పుత్రుణ్ణి ఇమ్మని శివుని వరం కోరినాడు.

**తథాఽస్త్విత్యాహ భగవాన్ దేవ్యా సహ మహేశ్వరః ।**
**పశ్యతస్తస్య విప్రర్షేరన్తర్ధానం గతో హరః ॥ 22 ॥**

దేవితో కూడ శంకరుడట్లే అగు గాక! అని పలికి అతడు చూస్తుండగా అంతర్ధానమైనాడు.

**తతో యియక్షుః స్వాం భూమిం శిలాదో ధర్మవిత్తమః ।**
**చకర్ష లాఙ్గలేనోర్వీం భిత్వాఽదృశ్యత శోభనః ।**
**సంవర్తకానలప్రఖ్యః కుమారః ప్రహసన్నివ ॥ 23 ॥**

తర్వాత ధర్మవేత్తలలో శ్రేష్ఠుడైన శిలాదుడు యజ్ఞంచేయదలచి తన భూమి దున్నుతుండగా భూమిని చీల్చుకుని అతిసుందరుడు, ప్రళయకాలాగ్నివలె మహాతేజస్వి అయిన కుమారుడు నవ్వుతూ కనిపించినాడు.

**రూపలావణ్యసమ్పన్నస్తేజసా భాసయన్దిశః ॥ 24 ॥**

**కుమారతుల్యోఽప్రతిమో మేఘగమ్భీరయా గిరా ।**
**శిలాదం తాత తాతేతి ప్రాహ నన్దీ పునః పునః ॥ 25 ॥**

రూపలావణ్య సంపన్నుడూ తేజస్సుతో దిక్కులను ప్రకాశింపచేస్తూ కుమారస్వామివంటివాడూ, సాటిలేనివాడునై, మేఘగంభీరధ్వనితో నాన్నా! నాన్నా! అని శిలాదుణ్ణి మళ్లీ మళ్లీ పిలిచినాడు. ఆ కుమారుడు నందిగా ప్రసిద్ధుడైనాడు.

**తం దృష్ట్వా నన్దనం జాతం శిలాదః పరిషస్వజే ।**
**మునిభ్యో దర్శయామాస యే తదాశ్రమవాసినః ॥ 26 ॥**

**జాతకర్మాదికాః సర్వాః క్రియాస్తస్య చకార హ ।**
**ఉపనీయ యథాశాస్త్రం వేదమధ్యాపయత్సుతమ్ ॥ 27 ॥**

ఆ కుమారుని చూచిన శిలాదుడు సంతోషంతో ఆలింగనం చేసుకొని ఆశ్రమంలోని ఋషులకు సంతోషంతో చూపినాడు. అతనికి జాతకర్మాదికాలు యథాశాస్త్రం చేశాడు. శాస్త్రయుక్తంగా ఉపనయనంచేసి వేదాధ్యయనం చేయించినాడు.

**అధీతవేదో భగవాన్నన్దీ మతిమనుత్తమామ్ ।**
**చక్రే మహేశ్వరం ద్రష్టుం జేష్యే మృత్యుమితి ప్రభుమ్ ॥ 28 ॥**

వేదాధ్యయనం పూర్తిచేసిన నంది పరమేశ్వరుని సాక్షాత్కరించుకుని, మృత్యువును జయిస్తాను అని ఉత్తమ సంకల్పాన్ని చేసుకున్నాడు.

**స గత్వా సరితం పుణ్యాం ఏకాగ్రః శ్రద్ధయాఽన్వితః ।**
**జజాప రుద్రమనిశం మహేశాసక్తమానసః ॥ 30 ॥**

ఆ నంది ఒక పుణ్యనదీ ప్రాంతానికి వెళ్ళి ఏకాగ్రచిత్తుడై శ్రద్ధతో మహేశుని మనసులో నిల్పుకొని రుద్రుని గూర్చి రాత్రింబవళ్లు తపమాచరించినాడు.

**తస్య కోట్యాన్తు పూర్ణాయాం శఙ్కరో భక్తవత్సలః ।**
**ఆగత్య సామ్బః సగణో వరదోఽస్మీత్యువాచ హ ॥ 31 ॥**

కోటిసార్లు మంత్రం జపించగానే భక్తవత్సలుడు శంకరుడు పార్వతితో, గణాలతో కూడి వచ్చి వరమిస్తానని పలికినాడు.

**స వవ్రే పునరేవాహం జపేయం కోటిమీశ్వరమ్ ।**
**తావదాయుర్మహాదేవ దేహీతి వరమీశ్వరమ్! ॥ 32 ॥**

మహాదేవా! మరొక కోటిసార్లు జపంచేయకోరుతున్నాను. నాకు దానికి సరిపడే ఆయుష్యమిమ్మని శివుణ్ణి ప్రార్థించినాడు.

**ఏవమస్త్వితి సమ్ప్రోచ్య దేవోఽప్యన్తరధీయత ।**
**జజాప కోటిం భగవాన్ భూయస్తద్గతమానసః ॥ 33 ॥**

శంకరుడట్లే అని పలికి అంతర్ధానమైనాడు. మళ్ళీ శంకరునియందే మనసునిల్పి నంది కోటిజపం పూర్తిచేసినాడు.

**ద్వితీయాయాఞ్చ కోట్యాం వై సమ్పూర్ణాయాం వృషధ్వజః ।**
**ఆగత్య వరదోఽస్మీతి ప్రాహ భూతగణైర్వృతః ॥ 34 ॥**

రెండవసారికూడా కోటిజపం పూర్తి చేసినవెంటనే శంకరుడు భూతగణంతో కూడ ప్రత్యక్షమై వరమడుగుమని పలికినాడు.

**తృతీయాం జప్తుమిచ్ఛామి కోటిం భూయోఽపి శఙ్కర ।**
**తథాఽస్త్విత్యాహ విశ్వాత్మా దేవోఽప్యన్తరధీయత ॥ 35 ॥**

మూడవసారి కోటిజపం చేయదలచినాను అని అనగా అట్లే కానిమ్మని శంకరుడంతర్ధానమైనాడు.

**కోటిత్రయేఽథ సమ్పూర్ణే దేవః ప్రీతమనా భృశమ్ ।**
**ఆగత్య వరదోఽస్మీతి ప్రాహ భూతగణైర్వృతః ॥ 36 ॥**

మూడవకోటి జపంకూడా పూర్తయ్యాక ఎంతో సంతోషించిన శివుడు భూతగణాలతో ప్రత్యక్షమై “వరం కోరుకోమని” నందితో పలికాడు.

**జపేయం కోటిమన్యాం వై భూయోఽపి తవ తేజసా ।**
**ఇత్యుక్తే భగవానాహ న జప్తవ్యం త్వయా పునః ॥ 37 ॥**

నీ తేజస్సుతో మరో కోటి జపం చేయకోరుతున్నాననగా నందిని శంకరుడు ఇక జపం చేయవద్దని పలికినాడు.

**అమరో జరయా త్యక్తో మమ పార్శ్వగతః సదా ।**
**మహాగణపతిర్దేవ్యాః పుత్రో భవ మహేశ్వరః ॥ 38 ॥**

నేటినుండి నీవు జరామరణ వర్జితుడవైనావు. ఎల్లప్పుడు నా ప్రక్కనే ఉంటావు. నీవు మహాగణపతివై పార్వతికి కుమారుడవు కమ్ము.

**యోగీశ్వరో యోగనేతా గణానామీశ్వరేశ్వరః ।**
**సర్వలోకాధిపః శ్రీమాన్సర్వజ్ఞో మద్బలాన్వితః ॥ 39 ॥**

నీవు యోగిశ్రేష్ఠుడవు. యోగశాస్త్రాన్ని నడిపించేవాడవు. అన్నిగణాలనాయకులకూ నాయకుడవు. అన్నిలోకాలకీ ప్రభుడవు. నావంటిబలంతో శ్రీమంతుడవై సర్వజ్ఞుడవయ్యావు.

**జ్ఞానం తన్మామకం దివ్యం హస్తామలకవత్తవ ।**
**ఆభూతసంప్లవస్థాయీ తతో యాస్యసి మత్పదమ్ ॥ 40 ॥**

నాకు సంబంధించిన దివ్యమైన జ్ఞానాన్ని కరతలామలకంగా పొంది, ప్రళయకాలంవరకూ జీవించి తర్వాత నా లోకానికి చేరుకొంటావు.

**ఏతదుక్త్వా మహాదేవో గణానాహూయ శఙ్కరః ।**
**అభిషేకేణ యుక్తేన నన్దీశ్వరమయోజయత్ ॥41 ॥**

ఇలా పలికి శంకరుడు తనగణాలను పిలిచి నందీశ్వరుని గణాధిపతిగా అభిషేకించినాడు.

**ఉద్వాహయామాస చ తం స్వయమేవ పినాకధృక్ ।**
**మరుతాఞ్చ శుభాం కన్యాం సుయశేతి చ విశ్రుతామ్ ॥ 42 ॥**

తాను స్వయంగా దగ్గరుండి మంగళప్రదురాలైన మరుత్తుల పుత్రికగా ప్రసిద్ధికెక్కిన "సుయశ" అనే కన్యతో శివుడు నందికి స్వయంగా వివాహం జరిపించినాడు.

**ఏతజ్జప్యేశ్వరం స్థానం దేవదేవస్య శూలినః ।**
**యత్ర తత్ర మృతో మర్త్యో రుద్రలోకే మహీయతే ॥ 43 ॥**

ఈ ప్రదేశం జప్యేశ్వరం అనే స్థానం దేవదేవుడైన శంకరునిది. ఈ తీర్థంలో మరణించినవాడు రుద్రలోకాన్ని చేరుతాడు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే జప్యేశ్వరమాహాత్మ్యే ఏకచత్వారింశోऽధ్యాయః ॥ 41 ॥**

శ్రీకూర్మపురాణం ఉత్తరార్ధంలో జప్యేశ్వరమాహాత్మ్యమనే నలబై ఒకటవ అధ్యాయం ॥ 41 ॥

## ద్విచత్వారింశోஉధ్యాయః - నలభై రెండవ అధ్యాయం

## తీర్థమాహాత్మ్యమ్ - తీర్థమాహాత్మ్యం

**సూత ఉవాచ:**-సూతమహర్షి చెప్పాడు

**అన్యచ్చ తీర్థప్రవరం జపేశ్వరసమీపతః ।**
**నామ్నా పఞ్చనదం పుణ్యం సర్వపాపప్రణాశనమ్ ॥ 1 ॥**

జప్యేశ్వరానికి దగ్గరగా పరమపావనమై, సమస్తపాపనాశకమైనదై 'పంచనదం' అనే పేరుతో మరొక తీర్థరాజం ఉన్నది.

**త్రిరాత్రోపోషితస్తత్ర పూజయిత్వా మహేశ్వరమ్ ।**
**సర్వపాపవిశుద్ధాత్మా రుద్రలోకే మహీయతే ॥ 2 ॥**

అక్కడ స్నానం చేసి, మూడు రోజులుపవసించి, మహేశ్వరుని పూజించిన వాడు సర్వపాపాలు తొలగి రుద్రలోకంలో నివసిస్తాడు.

**అన్యచ్చ తీర్థం ప్రవరం శఙ్కరస్యామితౌజసః ।**
**మహాభైరవమిత్యుక్తం మహాపాతకనాశనమ్ ॥ 3 ॥**

గొప్పతేజస్వియైన శంకరుని మరొక మహాభైరవమనే తీర్థరాజం ఉంది. మహాపాతకాలను కూడా అది నశింపచేస్తుంది.

**తీర్థానాఞ్చ పరం తీర్థం వితస్తా పరమా నదీ ।**
**సర్వపాపహరా పుణ్యా స్వయమేవ గిరీన్ద్రజా ॥ 4 ॥**

తీర్థాల్లోకెల్లా శ్రేష్ఠమైనదీ. అన్నిపాపాలూ పోగొట్టేదీ, సాక్షాత్తు పార్వతీస్వరూపమైనదయిన 'వితస్త' అనే శ్రేష్ఠమైన నది ఉంది.

**తీర్థం పఞ్చతపం నామ శమ్భోరమితతేజసః ।**
**యత్ర దేవాదిదేవేన చక్రార్థం పూజితో భవః ॥ 5 ॥**

మరొక తీర్థం పంచతపం. అమిత తేజస్వి అయిన శంకర క్షేత్రమిది. ఇచట మహావిష్ణువు చక్రంకోసం శంకరుని పూజించినాడు.

**పిణ్డదానాదికం తత్ర ప్రేత్యానన్తఫలప్రదమ్ ।**
**మృతస్తత్రాపి నియమాత్ బ్రహ్మలోకే మహీయతే ॥ 6 ॥**

ఇక్కడ చేసిన పిండప్రదానం పరలోకంలో అనంత ఫలప్రద మవుతుంది. ఇక్కడ మృతిచెందినవాడు తప్పకుండా బ్రహ్మలోకంలో ప్రకాశిస్తాడు.

**కాయావరోహణం నామ మహాదేవాలయం శుభమ్ ।**
**యత్ర మాహేశ్వరా ధర్మా మునిభిస్సంప్రవర్తితాః ॥ 7 ॥**

కాయావరోహణ మనేది మరోశుభకరమైన తీర్థం. ఇది మహాదేవాలయం. ఇక్కడ మునులు మాహేశ్వర ధర్మాన్ని ప్రవర్తింపచేశారు.

**శ్రాద్ధం దానం తపో హోమ ఉపవాసస్తథాఽక్షయః ।**
**పరిత్యజతి యః ప్రాణాన్ రుద్రలోకం స గచ్ఛతి ॥ 8 ॥**

ఈ తీర్థంలో చేసిన శ్రాద్ధం, దానం, తపస్సు, హోమం, ఉపవాసం, అక్షయ ఫలమిస్తుంది. ఇక్కడ ప్రాణాలు వదలిన వాడు రుద్రలోకానికి చేరుకొంటాడు.

**అన్యచ్చ తీర్థప్రవరం కన్యాతీర్థమితి శ్రుతమ్ ।**
**తత్ర గత్వా త్యజేత్ప్రాణాంల్లోకాన్ ప్రాప్నోతి శాశ్వతాన్ ॥ 9 ॥**

కన్యాతీర్థమని ప్రసిద్ధిగాంచిన మరోతీర్థం ఇచట ఉన్నది. అక్కడ ప్రాణాలు వదిలేవాడు శాశ్వతలోకాలు పొందుతాడు.

**జామదగ్న్యస్య తు శుభం రామస్యాక్లిష్టకర్మణః ।**
**తత్ర స్నాత్వా తీర్థవరే గోసహస్రఫలం లభేత్ ॥ 10 ॥**

అలాగే అద్భుత కర్మలనాచరించిన పరశురాముని శుభప్రదతీర్థం కూడా కలదు. అక్కడ స్నానం చేసిన వాడు గోసహస్రదానఫలాన్ని పొందుతాడు.

**మహాకాలమితి ఖ్యాతం తీర్థం త్రైలోక్యవిశ్రుతమ్ ।**
**గత్వా ప్రాణాన్పరిత్యజ్య గాణపత్యమవాప్నుయాత్ ॥ 11 ॥**

మహాకాలమనే తీర్థం త్రిలోక ప్రసిద్ధం. ఇక్కడ ప్రాణం వదలిన వాడు గాణపత్యాన్ని పొందుతాడు.

**గుహ్యాద్గుహ్యతమం తీర్థం నకులీశ్వరముత్తమమ్ ।**
**తత్ర సన్నిహితః శ్రీమాన్ భగవాన్నకులీశ్వరః ॥ 12 ॥**

అతిరహస్యమైన ఉత్తమమైన తీర్థం నకులీశ్వరం. ఇచట పరమాత్మ నకులీశ్వరుడు ఎల్లపుడు నివసించి ఉంటాడు.

**హిమవచ్ఛిఖరే రమ్యే గఙ్గాద్వారే సుశోభనే ।**
**దేవ్యా సహ మహాదేవో నిత్యం శిష్యైశ్చ సంవృతః ॥ 13 ॥**

అందమైన హిమవచ్ఛిఖరంలో, శోభనమైన గంగాద్వారంలో మహాదేవుడు దేవితో, శిష్యులతో కలిసి నివసించి ఉంటాడు.

**తత్ర స్నాత్వా మహాదేవం పూజయిత్వా వృషధ్వజమ్ ।**
**సర్వపాపైర్విముచ్యేత మృతస్తద్ జ్ఞానమాప్నుయాత్ ॥ 14 ॥**

ఇక్కడ స్నానంచేసి, వృషభధ్వజుడైన మహాదేవుని పూజిస్తే సర్వపాప ముక్తుడవుతాడు. మరణించిన తర్వాత బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు.

**అన్యచ్చ దేవదేవస్య స్థానం పుణ్యతమం శుభమ్ ।**
**భీమేశ్వరమితి ఖ్యాతం గత్వా ముఞ్చతి పాతకమ్ ॥ 15 ॥**

దేవదేవుని పరమపావనమైన స్థానం భీమేశ్వరమని సుప్రసిద్ధం. ఇచటికి వెళ్తే చాలు పాపాలు పోతాయి.

**తథాఽన్యచ్చణ్డవేగాయాః సమ్భేదః పాపనాశనః ।**
**తత్ర స్నాత్వా చ పీత్వా చ ముచ్యతే బ్రహ్మహత్యయా ॥ 16 ॥**

మరో తీర్థం చండవేగానదియొక్క ఉద్గమస్థానం. అది సర్వపాపనాశనం. అచట స్నానంచేసి జలాన్ని త్రాగితే బ్రహ్మహత్యా పాతకం కూడా తొలగి పోతుంది.

**సర్వేషామపి చైతేషాం తీర్థానాం పరమా పురీ ।**
**నామ్నా వారాణసీ దివ్యా కోటికోట్యయుతాఽధికా ॥ 17 ॥**

పవిత్రమైన ఇట్లా చెప్పుకొన్న తీర్థాలన్నిటికన్నా వారాణసీ అనే పరమ పట్టణమున్నది. అది ఇతర క్షేత్రాలకంటే పదివేలకోట్ల రెట్లు ఎక్కువ పవిత్రమైనది.

**తస్యాః పురస్తాన్మాహాత్మ్యం భాషితం వో మయాస్త్విహ ।**
**నాన్యత్ర లభ్యతే ముక్తిర్యోగినాఽప్యేకజన్మనా ॥ 18 ॥**

ఆ వారాణసీ మాహాత్మ్యాన్ని ముందే చెప్పినాను. ఒకే జన్మలో యోగికికూడా మరోచోట ముక్తి దొరకదు కానీ, కాశీక్షేత్రంలో ముక్తి వస్తుంది.

**ఏతే ప్రాధాన్యతః ప్రోక్తా దేశాః పాపహరా నృణామ్ ।**
**గత్వా సంక్షాలయేత్పాపం జన్మాన్తరశతైః కృతమ్ ॥19॥**

**యః స్వధర్మాన్ పరిత్యజ్య తీర్థసేవాం కరోతి హి ।**
**న తస్య ఫలతే తీర్థమిహలోకే పరత్ర చ ॥20॥**

ఇలా పాపహరాలైన ముఖ్యమైన ప్రదేశాలను గురించి మాత్రం తెలిపాను. ఈ తీర్థాలకు వెళ్ళి వందల జన్మల పాపాలు పోగొట్టుకోవచ్చు.స్వధర్మాలు వదలి, తీర్థాలు సేవించేవానికి ఇహ పరాల్లో ఫలం లభింపదు.

**ప్రాయశ్చిత్తీ చ విధురస్తథా పాపాచరో గృహీ ।**
**ప్రకుర్యాత్తీర్థసంసేవాం యే చాన్యే తాదృశా జనాః ॥ 21 ॥**

**సహాగ్నిర్వా సపత్నీకో గచ్ఛేత్తీర్థాని యత్నతః ।**
**సర్వపాపవినిర్ముక్తో యథోక్తాం గతిమాప్నుయాత్ ॥ 22 ॥**

ప్రాయశ్చిత్తాలు చేయవలసిన వాడు, పాపాలు ఆచరించిన వాడూ, భార్యలేనివాడు, పాపాత్ముడైన గృహస్థులూ మున్నగువారు తీర్థయాత్రలు చేయాలి. ఉపాసించే అగ్నితోకానీ, భార్యతోకానీ కష్టపడి అయినా తీర్థయాత్రలు చెయ్యాలి. సర్వపాపముక్తుడై యథోక్తలోకాలు పొందుతాడు.

**ఋణాని త్రీణ్యపాకృత్య కుర్యాద్వా తీర్థసేవనమ్ ।**
**విధాయ వృత్తిం పుత్రాణాం భార్యాం తేషు నిధాయ చ ॥ 23 ॥**

**ప్రాయశ్చిత్తప్రసజ్గేన తీర్థమాహాత్మ్యమీరితమ్ ।**
**యః పఠేత్ శ్రుణుయాద్వాఽపి ముచ్యతే సర్వపాతకైః ॥ 24 ॥**

దేవ, ఋషి, పితృఋణాలను తీర్చుకొని, తీర్థయాత్రలు చేయాలి. పుత్రులకు జీవనవృత్తిని ఏర్పాటుచేసి, భార్యను పుత్రులకప్పగించి, తీర్థయాత్ర చేయాలి. ప్రాయశ్చిత్త ప్రసంగంలో తీర్థమాహాత్మ్యం వివరించటం జరిగినది. ఈ మాహాత్మ్యాన్ని చెప్పినా, విన్నా సర్వపాపాలు నశిస్తాయి.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే తీర్థమాహాత్మ్యే ద్విచత్వారింశోఽధ్యాయః ॥ 42 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో తీర్థమాహాత్మ్యమనే నలభై రెండవ అధ్యాయం ॥ 42 ॥



## త్రిచత్వారింశోఽధ్యాయః - నలబై మూడవ అధ్యాయం

## కూర్మరూపధారణవర్ణనమ్ - కూర్మరూపధారణవర్ణనం

**సూత ఉవాచ:**-సూతుడు చెప్పాడు

**ఏతదాకర్ణ్య విజ్ఞానం నారాయణముఖేరితమ్ ।**
**కూర్మరూపధరం దేవం పప్రచ్ఛుర్మునయః ప్రభుమ్ ॥ 1 ॥**

ఇట్లా నారాయణుడు చెప్పిన ఈ విజ్ఞానాన్ని విని మునులు కూర్మరూపధరుడైన నారాయణుని ప్రశ్నించారు.

**మునయ ఊచు:**-మునులు అడిగారు.

**కథితా భవతా ధర్మా మోక్షజ్ఞానం సవిస్తరమ్ ।**
**లోకానాం సర్గవిస్తారం వంశమన్వన్తరాణి చ ॥ 2 ॥**

తాము అనేకధర్మాలు వివరించినారు. మోక్షజ్ఞానాన్ని తెలిపినారు. లోకాల విస్తారాన్ని వంశాలూ మన్వంతరాల వివరాలు చెప్పినారు.

**ప్రతిసర్గమిదానీం నో వక్తుమర్హసి మాధవ! ।**
**భూతానాం భూతభవ్యేశ! యథా పూర్వం త్వయోదితమ్ ॥ 3 ॥**

భూతభవిష్యత్ప్రభూ! ఓ మాధవా! నీవు పూర్వం చెప్పినట్లుగా ప్రాణులయొక్క ప్రళయాన్ని మాకు వివరించి చెప్పు.

**సూత ఉవాచ:**-సూతుడు చెప్పాడు

**శ్రుత్వా తేషాం తదా వాక్యం భగవాన్ కూర్మరూపధృక్ ।**
**వ్యాజహార మహాయోగీ భూతానాం ప్రతిసంచరమ్ ॥ 4 ॥**

కూర్మరూపి అయిన శ్రీమహావిష్ణువు మునుల మాటలు విని ప్రాణుల ప్రళయాన్ని ఇట్లా వివరించినాడు.

**కూర్మ ఉవాచ:**-కూర్ముడు చెప్పాడు.

**నిత్యో నైమిత్తికశ్చైవ ప్రాకృతాత్యంతికస్తథా ।**
**చతుర్ధాఽయం పురాణేఽస్మిన్ప్రోచ్యతే ప్రతిసంచరః ॥ 5 ॥**

ఈ పురాణంలో ప్రళయం నిత్యం, నైమిత్తికం, ప్రాకృతం, ఆత్యంతికం అని నాల్గు విధాలుగా చెప్పబడింది.

**యోఽయం సందృశ్యతే నిత్యం లోకే భూతక్షయస్త్విహ ।**
**నిత్యః సంకీర్త్యతే నామ్నా మునిభిః ప్రతిసఞ్చరః ॥ 6 ॥**

ప్రతినిత్యం జరుగుతున్న ప్రాణుల క్షయం నిత్యప్రళయంగా మునులచేత చెప్పబడింది.

**బ్రాహ్మో నైమిత్తికో నామ కల్పాన్తే యో భవిష్యతి ॥**
**త్రైలోక్యస్యాస్య కథితః ప్రతిసర్గో మనీషిభిః ॥ 7 ॥**

బ్రహ్మకల్పాంతంలో జరిగే ప్రళయం త్రిలోకప్రళయం. అది నైమిత్తిక ప్రళయంగా పండితులచేత చెప్పబడింది.

**మహదాద్యం విశేషాన్తం యదా సంయాతి సంక్షయమ్ ।**
**ప్రాకృతః ప్రతిసర్గోఽయం ప్రోచ్యతే కాలచిన్తకైః ॥ 8 ॥**

మహత్తత్త్వంనుండి విశేషంవరకు జరిగే ప్రళయం ప్రాకృత ప్రళయంగా కాలవేత్తలచేత చెప్పబడింది.

**జ్ఞానాదాత్యన్తికః ప్రోక్తో యోగినః పరమాత్మని ।**
**ప్రలయః ప్రతిసర్గోఽయం కాలచిన్తాపరైర్ద్విజైః ॥ 9 ॥**

యోగులు జ్ఞానంవల్ల పరమాత్మలో లయం గావడాన్ని ఆత్యంతిక ప్రళయమని కాలచింతన కల ద్విజులు చెప్పారు.

**ఆత్యన్తికశ్చ కథితః ప్రలయోఽత్ర ససాధనః ।**
**నైమిత్తికమిదానీం వః కథయిష్యే సమాసతః ॥ 10 ॥**

సాధనంతో కూడిన (జ్ఞానము) ఆత్యంతిక ప్రళయం ఇక్కడ చెప్పబడింది. ఇప్పుడు సంగ్రహంగా నైమిత్తిక ప్రళయాన్ని చెబుతాను.

**చతుర్యుగసహస్రాన్తే సంప్రాప్తే ప్రతిసంచరే ।**
**స్వాత్మసంస్థాః ప్రజాః కర్తుం ప్రతిపేదే ప్రజాపతిః ॥ 11 ॥**

నాలుగు వేలయుగాలు గడిచిన తర్వాత ప్రళయకాలం ప్రాప్తించగా బ్రహ్మ ప్రజలను తనలో కలుపుకోవటానికి సంకల్పిస్తాడు.

**తతో భవత్యనావృష్టిస్తీవ్రా సా శతవార్షికీ ।**
**భూతక్షయకరీ ఘోరా సర్వభూతక్షయఙ్కరీ ॥ 12 ॥**

అపుడు నూరేండ్లు తీవ్రమైన అనావృష్టి ఏర్పడుతుంది. ఇది సర్వప్రాణులను నశింపచేస్తుంది. భయంకరమైనది.

**తతో యాన్యల్పసారాణి సత్త్వాని పృథివీతలే ।**
**తాని చాగ్రే ప్రలీయన్తే భూమిత్వముపయాన్తి చ ॥ 13 ॥**

ఆ సమయంలో భూమియందున్న అల్పసారాలైన ప్రాణులు మొదట లయాన్నందుతాయి. అవి భూమిలో లీనమవుతాయి.

**సప్తరశ్మిరథోభూత్వా సముత్తిష్ఠన్దివాకరః ।**
**అసహ్యరశ్మిర్భవతి పిబన్నమ్భో గభస్తిభిః ॥ 14 ॥**

తర్వాత సూర్యుడు ఏడుకిరణాలనే గుర్రాలుకల రథారూఢుడై ఉదయించి, తన కిరణాలతో నీటిని గ్రహించి, సహించరాని తేజస్సు కలవాడవుతాడు.

**తస్య తే రశ్మయః సప్త పిబన్త్యంబు మహార్ణవే ।**
**తేనాऽऽహారేణ తా దీప్తాః సూర్యాస్సప్త భవన్త్యుత ॥ 15 ॥**

అతని ఏడు కిరణాలు సముద్రజలాన్ని పానం చేస్తాయి. ఆ ఆహారంతో విజృంభించిన ఆ ఏడు కిరణాలు ఏడుగురు సూర్యులుగ మారుతాయి.

**తతస్తే రశ్మయస్సప్త సూర్యాభూత్వా చతుర్దిశమ్ ।**
**చతుర్లోకమిదం సర్వం దహన్తి శిఖినస్తథా ॥ 16 ॥**

పిమ్మట ఆ ఏడుగురు సూర్యులు నాలుగు దిక్కుల్లో నాలుగు లోకాలను అగ్నివలె దహిస్తారు.

**వ్యాప్నువన్తశ్చ తే విప్రాస్తూర్ధ్వం చాధశ్చ రశ్మిభిః ।**
**దీప్యన్తే భాస్కరాః సప్త యుగాన్తాగ్నిప్రతాపినః ॥ 17 ॥**

బ్రాహ్మణులారా! ఆ ఏడుగురు సూర్యులు తమ కిరణాలద్వారా పైకి, క్రిందికి వ్యాపించి యుగాంతాగ్ని ప్రతాపాన్ని పొంది ప్రజ్వరిల్లుతారు.

**తే సూర్యా వారిణా దీప్తా బహుసాహస్రరశ్మయః ।**
**ఖం సమావృత్య తిష్ఠన్తి నిర్దహన్తో వసున్ధరామ్ ॥ 18 ॥**

నీటితో ఉద్దీపితులైన ఆ సూర్యులు వేలకిరణాలు కలవారై, ఆకాశాన్ని ఆవరించి, భూమిని దహించివేస్తుంటారు.

**తతస్తేషాం ప్రతాపేన దహ్యమానా వసున్ధరా ।**
**సాద్రినద్యర్ణవద్వీపా నిస్నేహా సమపద్యత ॥ 19 ॥**

ఆ సూర్యతేజంతో పరితప్తమైన పర్వతాలతో, నదులతో, సముద్రాలతో, ద్వీపాలతో కూడిన భూమి పొడిగా (తడిలేనిదిగా) మారిపోతుంది.

**దీప్తాభిస్సన్తతాభిశ్చ రశ్మిభిర్వై సమన్తతః ।**
**అధశ్చోర్ధ్వం చ లగ్నాభిస్తిర్యక్చైవ సమావృతమ్ ॥ 20 ॥**

బాగా మండుతూ, అంతటా వ్యాపిస్తూ ఉన్న మంటలతో పైభాగం, క్రింది భాగం, అడ్డంగా కూడా నిండిపోతుంది.

**సూర్యాగ్నినా ప్రమృష్టానాం సంసృష్టానాం పరస్పరమ్ ।**
**ఏకత్వముపయాతానామేకజ్వాలం భవత్యుత ॥ 21 ॥**

ఇట్లా సూర్యాగ్ని కాల్చగా జ్వాలలన్నీ ఒకే రూపాన్ని పొంది, ఒకే జ్వాలారూపాన్ని పొందుతుంది.

**సర్వలోకప్రణాశశ్చ సోఽగ్నిర్భూత్వా సుకుణ్డలీ ।**
**చతుర్లోకమిదం సర్వం నిర్దహత్యాత్మతేజసా ॥ 22 ॥**

లోకాలన్నింటిని నశింపచేసే ఆ సూర్యరూపాగ్ని మండలాకారంగా మారి, తన తేజంతో నాలుగు లోకాలను దహింపచేస్తుంది.

**తతః ప్రలీనే సర్వస్మిన్ జఙ్గమే స్థావరే తథా ।**
**నిర్వృక్షా నిస్తృణా భూమిః కూర్మపృష్ఠా ప్రకాశతే ॥ 23 ॥**

సర్వస్థావరజంగమాత్మకమైన భూతజాలం లయంకాగా చెట్లు, గడ్డీ ఏదీలేక భూమి తాబేటి వీపువలె భాసిస్తుంది.

**అమ్బరీషమివాఽఽభాతి సర్వమాపూరితం జగత్ ।**
**సర్వమేవ తదాఽర్చిర్భిః పూర్ణం జాజ్వల్యతే పునః ॥ 24 ॥**

సకలజగత్తు బాణలి పైభాగంవలె భాసిస్తుంది. మిక్కిలి తీవ్రంగా సూర్యకిరణాలతో మండుతుంది.

**పాతాళేయాని సత్త్వాని మహోదధిగతాని చ ।**
**తతస్తాని ప్రలీయన్తే భూమిత్వముపయాన్తి చ ॥ 25 ॥**

పాతాళంలో, సముద్రంలో ఉన్న ప్రాణులన్నీ లయమై, భూరూపాన్ని చెందుతాయి.

**ద్వీపాంశ్చ పర్వతాంశ్చైవ వర్షాణ్యథ మహోదధీన్ ।**
**తాన్సర్వాన్భస్మసాత్కృత్వా సప్తాత్మా పావకః ప్రభుః ॥ 26 ॥**

**సముద్రేభ్యో నదీభ్యశ్చ పాతాలేభ్యశ్చ సర్వశః ।**
**పిబన్నపః సమిద్ధోఽగ్నిః పృథివీమాశ్రితో జ్వలన్ ॥ 27 ॥**

సప్తస్వరూపుడైన సూర్యుడు ద్వీపాలను, పర్వతాలను, వర్షాలను, సముద్రాలను భస్మం గావించి, నదీ, సముద్ర, పాతాళాలలోని జలాన్ని త్రాగి, భూమి నాశ్రయించి మండింపచేస్తాడు.

**తతః సంవర్తకః శైలానతిక్రమ్య మహాంస్తథా ।**
**లోకాన్దహతి దీప్తాత్మా రుద్రతేజో విజృంభితః ॥ 28 ॥**

అంతలో సంవర్తకాగ్ని పర్వతాలనాక్రమించి రుద్రతేజో విజృంభితమై అన్ని లోకాలను దహిస్తుంది.

**స దగ్ధ్వా పృథివీం దేవో రసాతలమశోషయత్ ।**
**అధస్తాత్ పృథివీం దగ్ధ్వా దివమూర్ధ్వం దహిష్యతి ॥ 29 ॥**

ఆ అగ్ని భూమిని దహించి, రసాతలాన్ని ఎండింపచేస్తుంది. భూమి క్రిందిభాగాన్ని దహించి, ద్యులోకాన్ని జ్వలింప చేస్తుంది.

**యోజనానాం శతానీహ సహస్రాణ్యయుతాని చ ।**
**ఉత్తిష్ఠన్తి శిఖాస్తస్య వహ్నేః సంవర్తకస్య తు ॥ 30 ॥**

ఆ సంవర్తకాగ్నిశిఖలు అనేక వందల వేల యోజనాలు వ్యాపించి, జ్వలిస్తూ ఉంటాయి.

**గన్ధర్వాంశ్చ పిశాచాంశ్చ సయక్షోరగరాక్షసాన్ ।**
**తదా దహత్యసౌ దీప్తః కాలరుద్రప్రచోదితః ॥ 31 ॥**

కాలరుద్రప్రేరితుడైన ఆ అగ్ని గంధర్వ, పిశాచ, యక్ష, రాక్షస, ఉరగులను దహించి వేస్తాడు.

**భూలోకఞ్చ భువర్లోకం స్వర్లోకఞ్చ తథా మహః ।**
**దహేదశేషం కాలాగ్నిః కాలో విశ్వయుతః స్వయమ్ ॥ 32 ॥**

స్వయంగా విశ్వమే శరీరంగా కలిగిన కాలరూపమైన అగ్ని భూలోకాన్నీ, అంతరిక్షాన్నీ, స్వర్గాన్నీ, మహర్లోకాన్నీ నిశ్శేషంగా దహింపచేస్తుంది.

**వ్యాప్తేష్వేతేషు లోకేషు తిర్యగూర్ధ్వమథాగ్నినా ।**
**తత్తేజః సమనుప్రాప్య కృత్స్నం జగదిదం శనైః ॥ 33 ॥**

**అయోగుడనిభం సర్వం తదా చైకం ప్రకాశతే ।**
**తతో గజకులోన్నాదాస్తడిద్భిః సమలంకృతాః ॥ 34 ॥**

**ఉత్తిష్ఠన్తి తథావ్యోమ్ని ఘోరాః సంవర్తకా ఘనాః ।**
**కేచిన్నీలోత్పలశ్యామాః కేచిత్కుముదసన్నిభాః ॥ 35 ॥**

ఈ అగ్ని లోకాల్లో పైన, క్రింద, అడ్డంగా వ్యాపించి, తర్వాత సకలజగత్తును వ్యాపించి మండుతున్న ఉక్కుగుండువలె భాసిస్తుంది. తర్వాత ఏనుగుల సమూహపు ఘీంకారంవలె గర్జిస్తూ, మెరపులతో, ఘోరమైన సంవర్తకమేఘాలు ఆకాశంలో బయలుదేరతాయి. అవి కొన్ని నల్లకలువలవర్ణం, కొన్ని కుముదములవర్ణం కలవిగా ఉంటాయి.

**ధూమ్రవర్ణాస్తథా కేచిత్ కేచిత్పీతాః పయోధరాః ।**
**కేచిద్రాసభవర్ణాస్తు లాక్షారసనిభాస్తథా ॥ 36 ॥**

మరికొన్ని ధూమ్రవర్ణం కలవి. ఇంకొన్ని పసుపువర్ణాలు కలవి.కొన్ని గాడిదవర్ణాలు కలవి. కొన్ని లాక్షారసాన్ని పోలినవి.

**శంఖకున్దనిభాశ్చాన్యే జాత్యంజన నిభాః పరే ।**
**మనః శిలాభాస్త్వన్యే చ కపోతసదృశాః పరే ।**
**ఇంద్రగోపనిభాః కేచిత్ హరితాలనిభాస్తథా ॥ 37 ॥**

**ఇంద్రచాపనిభాః కేచిదుత్తిష్ఠన్తి ఘనాః దివి ।**
**కేచిత్పర్వతసఙ్కాశాః కేచిద్గజకులోపమాః ॥ 38 ॥**

కొన్ని శంఖ కుందములవలె తెల్లనివి. మరికొన్ని జాజిపూల కాంతికలవి. కొన్ని కాటుక రంగుకలవి. కొన్ని మనశ్శిలాసన్నిభాలు. మరికొన్ని పావురం రంగుకలవి. కొన్ని ఇంద్రగోపపురుగులకాంతివంటివి. కొన్ని హరితాల

సన్నిభాలు. కొన్ని ఇంద్ర ధనుస్సు వన్నె కల్గినవై, కొన్ని పర్వతాకారాలూ, కొన్ని ఏనుగులగుంపువంటి ఆకారాలతో ఆకాశంలో మేఘాలు విజృంభిస్తాయి.

**కూటాఙ్గార నిభాశ్చాన్యే కేచిన్మీనకులోద్వహాః ।**
**బహురూపా ఘోరరూపా ఘోరస్వరనినాదినః ॥ 39 ॥**

కొన్ని కూటాంగారాల్ని పోలినవి, కొన్ని మత్స్యాకారం గలవి. పలురూపాలు, భయంకరాలు, భీషణంగా గర్జించే మేఘాలూ ఆకాశమంతా వ్యాపిస్తాయి.

**తదా జలధరాస్సర్వే పూరయన్తి నభః స్థలమ్ ।**
**తతస్తే జలదా ఘోరరావిణో భాస్కరాత్మజాః ॥ 40 ॥**

సూర్యునివల్ల పుట్టిన మేఘాలు భయంకరంగా గర్జిస్తూ, ఆకాశాన్ని ఆవరిస్తాయి.

**సప్తధా సంవృతాత్మానస్తమగ్నిం శమయన్త్యుత ।**
**తతస్తే జలదాః వర్షం ముఞ్చన్తీహ మహౌఘవత్ ॥ 41 ॥**

ఆ మేఘాలు ఏడు రూపాలుగా విజృంభించిన ఆ ప్రళయాగ్నిని అలా మహావర్షధారలతో ఆర్పి శమింప జేస్తాయి.

**సుఘోరమశివం సర్వం నాశయన్తి చ పావకమ్ ।**
**ప్రవృష్టే చ తదాఽఽత్యర్థమమ్భసా పూర్యతే జగత్ ॥**
**అద్భిః తేజోఽభిభూతత్వాత్ తదాఽగ్నిః ప్రవిశత్యపః ॥ 42 ॥**

అలా మహాభయంకరం అమంగలమైన ఆ అగ్నిని సంపూర్ణంగా చల్లారుస్తాయి. అతిగా వర్షించిన నీటితో జగమంతానిండి పోతుంది. జల మాక్రమించినందు వల్ల అగ్ని ఆ నీటిలో ప్రవేశిస్తుంది.

**నష్టే చాగ్నౌ వర్షశతైః పయోదాః క్షయసమ్భవాః ॥ 43 ॥**

**ప్లావయన్తోఽథ భువనం మహాజలపరిస్రవైః ।**
**ధారాభిః పూరయన్తీదం చోద్యమానాః స్వయమ్భువా ॥ 44 ॥**

**అత్యన్తసలిలౌఘైశ్చ వేలా ఇవ మహోదధేః ।**
**సాద్రిద్వీపా తథా పృథ్వీ జలైః సఞ్ఛాద్యతే శనైః ॥ 45 ॥**

అగ్ని చల్లారగా వందసంవత్సరాలు మేఘాలు ధారాపాతంగా వర్షంతో లోకాన్ని ముంచేస్తాయి. బ్రహ్మ ప్రేరణతో ఆ మేఘాలు నీటితో సకలలోకాలను చెలియలికట్టలను ముంచేట్టు నింపివేస్తాయి. ఈ విధంగా పర్వతాలు ద్వీపాలతో కూడా భూమి నెమ్మదిగా నీటితో కప్పివేయబడుతుంది.

**ఆదిత్యరశ్మిభిః పీతం జలమభ్రేషు తిష్ఠతి ।**
**పునః పతతి తద్భూమౌ పూర్యన్తే తేన చార్ణవాః ॥ 46 ॥**

సూర్యకిరణాలు త్రాగిన జలం మేఘాలలో నిలుస్తుంది. మళ్లీ ఆ జలం భూమిపై కురుస్తుంది. దానితో సముద్రాలు నిండుతాయి.

**తతః సముద్రాః స్వాం వేలామతిక్రాన్తాస్తు కృత్స్నశః ।**
**పర్వతాశ్చ విలీయన్తే మహీ చాప్సు నిమజ్జతి ॥ 47 ॥**

ఆ సముద్రాలు చెలియలి కట్టలు దాటి పర్వతాలను ముంచెత్తగా భూమి అందులో మునిగి పోతుంది.

**తస్మిన్నేకార్ణవే ఘోరే నష్టే స్థావరజఙ్గమే ।**
**యోగనిద్రాం సమాస్థాయ శేతే దేవః ప్రజాపతిః ॥ 48 ॥**

ఇలా జగత్తంతా నశించగా అంతా ఒకే సముద్రంకాగా, పరమాత్మ ఐన ప్రజాపతి యోగనిద్రని ఆశ్రయించి నిద్రిస్తాడు.

**చతుర్యుగసహస్రాన్తం కల్పమాహుర్మహర్షయః ।**
**వారాహో వర్తతే కల్పో యస్య విస్తార ఈరితః ॥ 49 ॥**

నాలుగు యుగాలు వేయిమార్లు తిరిగితే ఒక కల్పమని ఋషులు చెబుతారు. ఇప్పుడు చెప్పిందంతా వరాహకల్పానికి సంబంధించింది.

**అసంఖ్యాతాస్తథా కల్పా బ్రహ్మవిష్ణుశివాత్మికాః ।**
**కథితా హి పురాణేషు మునిభిః కాలచిన్తకైః ॥ 50 ॥**

బ్రహ్మ, విష్ణు,శివాత్మకాలైన కల్పాలు అసంఖ్యాకాలు అని కాలచింతకులైన మునులు పురాణాల్లో చెప్పారు.

**సాత్త్వికేష్వథ కల్పేషు మాహాత్మ్యమధికం హరేః ।**
**తామసేషు హరస్యోక్తం రాజసేషు ప్రజాపతేః ॥ 51 ॥**

సాత్త్వికకల్పాల్లో విష్ణుమహత్త్వమూ, తామసకల్పాల్లో రుద్రవైభవమూ, రాజసకల్పాల్లో బ్రహ్మవైభవమూ అధికంగా ఉంటుంది.

**యోఽయం ప్రవర్తతే కల్పో వారాహః సాత్త్వికో మతః ।**
**అన్యే చ సాత్త్వికాః కల్పా మమ తేషు పరిగ్రహః ॥ 52 ॥**

ఇపుడు సాత్త్విక కల్పమైన వరాహకల్పం నడుస్తున్నది. ఇతరసాత్త్వికకల్పాల్లో నా ప్రభావం ఉంటుంది.

**ధ్యానం తపస్తథా జ్ఞానం లబ్ధ్వా తేష్వేవ యోగినః ।**
**ఆరాధ్య గిరిశం మాఞ్చ యాన్తి తత్పరమం పదమ్ ॥ 53 ॥**

ఆయా కల్పాల్లో యోగులు ధ్యానం, తపస్సు, జ్ఞానాలు పొంది నన్నూ, శంకరునీ ఆరాధించి పరమపదాన్ని చేరుతారు.

**సోఽహం సత్త్వం సమాస్థాయ మాయీ మాయామయీం స్వయమ్ ।**
**ఏకార్ణవే జగత్యస్మిన్ యోగనిద్రాం వ్రజామి తు ॥ 54 ॥**

అట్టి నేను సత్త్వాన్ని ఆశ్రయించి మాయినై స్వయంగా మాయామయమైన యోగనిద్ర నాశ్రయించి ఏకార్ణవంగా ఉన్న ఈ జగత్తులో యోగనిద్రలో ఉంటాను.

**మాం పశ్యన్తి మహాత్మానః సుప్తికాలే మహర్షయః ।**
**జనలోకే వర్తమానాస్తపసా యోగచక్షుషా ॥ 55 ॥**

జనలోకంలో ఉన్న మహానుభావులు తపస్సుతో యోగదృష్టితో యోగనిద్రలో ఉన్న నన్ను చూస్తారు.

**అహం పురాణపురుషో భూర్భువః ప్రభవో విభుః ।**
**సహస్రచరణః శ్రీమాన్ సహస్రాంశుః సహస్రదృక్ ॥ 56 ॥**

నేను పురాణపురుషుణ్ణి, భూర్భువః ప్రభృతిలోకాలకు కారణాన్ని. సహస్రచరణుణ్ణి. శ్రీమంతుణ్ణి. సహస్రకిరణాలు కలవాణ్ణి. సహస్ర నేత్రాలున్నవాణ్ణి.

**మన్త్రోఽగ్నిర్బ్రాహ్మణాః గావః కుశాశ్చ సమిధో హ్యహమ్ ।**
**ప్రోక్షణీ చ స్రువశ్చైవ సోమో ఘృతమథాస్మ్యహమ్ ॥ 57 ॥**

మంత్రమూ, అగ్నీ, బ్రాహ్మణులూ, గోవులూ, కుశలూ, సమిధలూ, ప్రోక్షణి, స్రువమూ, సోమరసమూ, నేయి ఇవన్నీ నారూపాలే.

**సంవర్తకో మహానాత్మా పవిత్రం పరమం యశః ।**
**వేదో వేద్యం ప్రభుర్గోప్తా గోపతిర్బ్రహ్మణో ముఖమ్ ॥ 58 ॥**
**అనన్తస్తారకో యోగీ గతిర్గతిమతాం వరః ।**
**హంసః ప్రాణోఽథ కపిలో విశ్వమూర్తిః సనాతనః ॥ 59 ॥**
**క్షేత్రజ్ఞః ప్రకృతిః కాలో జగద్బీజమథామృతమ్ ।**
**మాతా పితా మహాదేవో మత్తో హ్యన్యన్న విద్యతే ॥ 60 ॥**

నేనే సంవర్తకాన్ని. మహత్తత్త్వాన్ని, ఆత్మను, పవిత్రం, పరమకీర్తిని నేనే. వేదం, వేద్యం, ప్రభువుని, రక్షకుణ్ణి, గోపతిని, (ఇంద్రియాధిపతి) బ్రహ్మముఖాన్నీ, అనంతుడనూ, తారకాన్ని, యోగిని, జ్ఞానంకలవారి జ్ఞానాన్ని నేనే. హంస, ప్రాణం, కపిలుడు, విశ్వమూర్తి, సనాతనుడు, క్షేత్రజ్ఞుడు, ప్రకృతి, కాలం, జగద్బీజం, అమృతం నేనే. తల్లి, తండ్రి, మహాదేవుడు నేనే. నాకంటె భిన్నం ప్రపంచంలో లేదు.

**ఆదిత్యవర్ణో భువనస్య గోప్తా నారాయణః పురుషో యోగమూర్తిః ।**
**మాం పశ్యన్తి యతయో యోగనిష్ఠా జ్ఞాత్వాత్మానమమృతత్వం వ్రజన్తి ॥ 61 ॥**

నేను ఆదిత్యవర్ణుణ్ణి. ప్రపంచ రక్షకుణ్ణి. నారాయణుణ్ణి. పరమపురుషుణ్ణి. యోగమూర్తిని. యతులు, యోగనిష్ఠులు నన్ను చూడగలుతారు. నన్ను తెలుసుకున్న వారు మోక్షాన్ని పొందుతారు.

**ఇతి శ్రీకూర్మపురాణే ఉత్తరార్ధే కూర్మరూపధారణే త్రిచత్వారింశోఽధ్యాయః ॥ 43 ॥**

శ్రీకూర్మపురాణంలో ఉత్తరార్ధంలో కూర్మరూపధారణమనే నలబై మూడవ అధ్యాయం ॥ 43 ॥

## చతుశ్చత్వారింశోఽధ్యాయః - నలబై నాల్గవ అధ్యాయం

## వ్యాసకథన స్థిత్యుద్భవ ప్రలయవ్యాఖ్యానమ్ - వ్యాసకథన స్థిత్యుద్భవ ప్రలయవ్యాఖ్యానం

**కూర్మ ఉవాచ:**-కూర్మస్వామి పలికాడు

**అతః పరం ప్రవక్ష్యామి ప్రతిసర్గమనుత్తమమ్ ।**
**ప్రాకృతం హి సమాసేన శృణుధ్వం గదతో మమ ॥ 1 ॥**

ఇపుడు ప్రాకృతప్రలయాన్ని గూర్చి చెబుతాను, వినండి.

**గతే పరార్ధద్వితయే కాలో లోకప్రకాలనః ।**
**కాలాగ్నిర్భస్మసాత్కర్తుం కరోతి నిఖిలం మతిమ్ ॥ 2 ॥**

ద్వితీయపరార్ధం గడచిపోగా, లోకాలను నశింపచేసే కాలం కాలాగ్నిరూపంగా సకలజగత్తును భస్మంచేయటానికి సంకల్పిస్తుంది.

**స్వాత్మనాత్మానమావేశ్య భూత్వా దేవో మహేశ్వరః ।**
**దహేదశేషం బ్రహ్మాణ్డం సదేవాసురమానుషమ్ ॥ 3 ॥**

మహేశ్వరుడు తనలో జీవాత్మను చేర్చుకొని దేవాసురమనుష్యరూపమైన సకలబ్రహ్మాండాన్ని దహించివేస్తాడు.

**తమావిశ్య మహాదేవో భగవాన్నీలలోహితః ।**
**కరోతి లోకసంహారం భీషణం రూపమాశ్రితః ॥ 4 ॥**

మహాదేవుడు, భగవంతుడగు నీలలోహితుడు అతనిని ఆవేశించి భయంకరరూపాన్ని దాల్చి లోకసంహారం చేస్తాడు.

**ప్రవిశ్య మణ్డలం సౌరం కృత్వాఽసౌ బహుధా పునః ।**
**నిర్దహత్యఖిలం లోకం సప్తసప్తిస్వరూపధృక్ ॥ 5 ॥**

సూర్యమండలంలో ప్రవేశించి తనను తాను పలురూపాలను, ఏడు కిరణాలున్న సూర్యరూపాన్ని తాల్చి అఖిలలోకాన్ని దహింపచేస్తాడు.

**స దగ్ధ్వా సకలం సత్త్వమస్త్రం బ్రహ్మశిరో మహత్ ।**
**దేవతానాం శరీరేషు క్షిపత్యఖిలదాహకమ్ ॥ 6 ॥**

ఈ విధంగా పదార్థాలనన్నింటిని దహించి సర్వదాహకమైన బ్రహ్మశిరో నామకాస్త్రాన్ని దేవతాశరీరాల్లో వదలుతాడు.

**దగ్ధేష్వశేషదేవేషు దేవీ గిరివరాత్మజా ।**
**ఏకా సా సాక్షిణీ శమ్భోస్తిష్ఠతే వైదికీ శ్రుతిః ॥ 7 ॥**

అలా సకలదేవతలు దహనంకాగా పార్వతీదేవి ఒక్కతే లోకసాక్షిగా నిలుస్తుందని శ్రుతివాక్యం.

**శిరః కపాలైర్దేవానాం కృతస్రగ్వరభూషణః ।**
**ఆదిత్యచన్ద్రాదిగణైః పూరయన్వ్యోమమణ్డలమ్ ॥ 8 ॥**

**సహస్రనయనో దేవః సహస్రాకృతిరీశ్వరః ।**
**సహస్రహస్తచరణః సహస్రార్చిర్మహాభుజః ॥ 9 ॥**

**దంష్ట్రాకరాళవదనః ప్రదీప్తానలలోచనః ।**
**త్రిశూలీ కృత్తివసనో యోగమైశ్వరమాస్థితః ॥ 10 ॥**

**పీత్వా తత్పరమానన్దం ప్రభూతమమృతం స్వయమ్ ।**
**కరోతి తాణ్డవం దేవీమాలోక్య పరమేశ్వరః ॥ 11 ॥**

దేవతల కపాలాలతో మాలాలంకారం ధరించి, సూర్యచంద్రాదిగణాలతో, ఆకాశమండలాన్ని నింపుతూ సహస్ర నయనుడై సహస్రాకృతి పొంది సహస్రచరణాలు తాల్చి సహస్ర జ్వాలలు కలవాడై మహాభుజుడై దంష్ట్రాకరాల వదనుడై, బాగామండే అగ్నినేత్రుడై త్రిశూలం ధరించి, కృత్తివసనుడైన ఈశ్వరయోగంలో ఉండి పరమానందరూపమైన మొత్తం అమృతాన్ని తానే త్రాగి, దేవిని చూస్తూ తాండవం చేస్తాడు.

**పీత్వా నృత్తామృతం దేవీ భర్తుః పరమమఙ్గళా ।**
**యోగమాస్థాయ దేవస్య దేహమాయాతి శూలినః ॥ 12 ॥**

పరమమంగళయగు పార్వతి భర్తనాట్యామృతాన్ననుభవించి యోగాన్నాశ్రయించి మహాదేవుని శరీరంలో ప్రవేశిస్తుంది.

**సంత్యక్త్వా తాణ్డవరసం స్వేచ్ఛయైవ పినాకధృక్ ।**
**జ్యోతిః స్వభాగం భగవాన్దగ్ధ్వా బ్రహ్మాణ్డ మణ్డలమ్ ॥ 13 ॥**

అంతట పినాకపాణి తాండవాన్ని చాలించి, స్వేచ్ఛగా జ్యోతిఃస్వరూపుడై, బ్రహ్మాండమండలాన్ని దహిస్తాడు.

**సంస్థితేష్వథ దేవేషు బ్రహ్మవిష్ణుపినాకిషు ।**
**గుణైరశేషైః పృథివీ విలయం యాతి వారిషు ॥ 14 ॥**

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు శివునిలో చేరిన తర్వాత సంపూర్ణగుణాలతో భూమి జలంలో మునిగి పోతుంది.

**స వారి తత్త్వం సగుణం గ్రసతే హవ్యవాహనః ।**
**తేజస్తు గుణసంయుక్తం వాయౌ సంయాతి సంక్షయమ్ ॥ 15 ॥**

సంపూర్ణగుణాలతో కూడిన జలతత్త్వం అగ్నిలో లీనమవుతుంది. తేజస్సు సకలగుణాలతో వాయువులో కలుస్తుంది.

**ఆకాశే సగుణో వాయుః ప్రలయం యాతి విశ్వభృక్ ।**
**భూతాదౌ చ తథాకాశం లీయతే గుణసంయుతమ్ ॥ 16 ॥**

సగుణమైన వాయువు ఆకాశంలో లీనమవుతుంది. గుణాలతో కూడిన ఆకాశం తామసాహంకారంలో లీనమవుతుంది.

**ఇన్ద్రియాణి చ సర్వాని తైజసే యాన్తి సంక్షయమ్ ।**
**వైకారికే దేవగణాః ప్రలయం యాన్తి సత్తమాః! ॥ 17 ॥**

అన్ని ఇంద్రియాలు రాజసాహంకారంలో కలిసిపోతాయి. దేవగణాలు సాత్త్వికాహంకారమైన వైకారికంలో లీనమవుతాయి.

**వైకారికస్తైజసశ్చ భూతాదిశ్చేతి సత్తమాః ।**
**త్రివిధోఽయమహంకారో మహతి ప్రలయం వ్రజేత్ ॥ 18 ॥**

సాధుపుంగవులారా! ఈ విధంగా సాత్త్విక, రాజస, తామసాహంకారాలు మూడూ మహత్తత్త్వంలో లీనమవుతాయి.

**మహాన్తమేభిస్సహితం బ్రహ్మాణమతితేజసమ్ ।**
**అవ్యక్తం జగతో యోనిః సంహరేదేకమవ్యయమ్ ॥ 19 ॥**

పృథివినుండి అహంకారంవరకున్న సకలతత్త్వాలకు మూలమైన మహత్తత్త్వం అమితతేజస్వి అయిన బ్రహ్మరూపం అయిన దానిని ప్రకృతితత్త్వం ఉపసంహరిస్తుంది.

**ఏవం సంహృత్య భూతాని తత్త్వాని చ మహేశ్వరః ।**
**వియోజయతి చాన్యోన్యం ప్రధానం పురుషం పరమ్ ॥ 20 ॥**

ఈ రకంగా భూతాలను, తత్త్వాలను మహేశ్వరుడు ఉపసంహరించి ప్రధానపురుషులను వేరుచేస్తాడు.

**ప్రధానపుంసోరజయోరేష సంహార ఈరితః ।**
**మహేశ్వరేచ్ఛా జనితో న స్వయం విద్యతే లయః ॥ 21 ॥**

ఇదియే ప్రకృతిపురుషుల సంహారం. ఇదికూడ మహేశ్వరుని ఇచ్ఛతోనే జరుగుతుంది. తనంత తాను జరగదు.

**గుణసామ్యం తదవ్యక్తం ప్రకృతిః పరిగీయతే ।**
**ప్రధానం జగతో యోనిర్మాయా సత్త్వమచేతనమ్ ॥ 22 ॥**

గుణసామ్యావస్థయే ప్రకృతి, అవ్యక్తం అనబడుతుంది. జగత్తుకు మూలకారణం ప్రధానమే. ఇది అచేతనం మాయారూపంగా ఉంటుంది.

**కూటస్థచిన్మయో హ్యాత్మా కేవలః పఞ్చవింశకః ।**
**గీయతే మునిభిః సాక్షీ మహానేకః పితామహః ॥ 23 ॥**

కూటస్థుడు, చిన్మయుడైన ఆత్మ ఇరువదైదవ తత్త్వరూపం. ఈ ఆత్మనే సాక్షి, మహాన్, పితామహుడు అని మునిగణం అంటారు.

**ఏవం సంహారకరణీ శక్తిర్మాహేశ్వరీ ధ్రువా ।**
**ప్రధానాద్యం విశేషాన్తం దహేత్ రుద్ర ఇతి శ్రుతిః ॥ 24 ॥**

ఇట్లా మహేశ్వరుని శాశ్వతశక్తి సంహారాన్ని గావిస్తుంది. ప్రధానంనుండి విశేషంవరకు రుద్రునిచే దహింప బడుతుందని శ్రుతి చెబుతున్నది.

**యోగినామథ సర్వేషాం జ్ఞానవిన్యస్తచేతసామ్ ।**
**ఆత్యన్తికఞ్చైవ లయం విదధాతీహ శఙ్కరః ॥ 25 ॥**

జ్ఞానులైన యోగులకు ఆత్యంతికప్రళయాన్ని కూడ శంకరుడే చేస్తాడు.

**ఇత్యేష భగవాన్రుద్రః సంహారం కురుతే వశీ ।**
**స్థాపికా మోహినీ శక్తిర్నారాయణ ఇతి శ్రుతిః ॥ 26 ॥**

సకలజగత్తును తన వశంలో ఉంచుకున్న రుద్రుడు ఇట్లా జగత్సంహారాన్ని కావిస్తాడు. శ్రుతిననుసరించి సకలజగత్తును స్థాపించే శివునియొక్క మోహిని అనే శక్తినే నారాయణు డంటారు.

**హిరణ్యగర్భో భగవాన్ జగత్సదసదాత్మకమ్ ।**
**సృజేదశేషం ప్రకృతేస్తన్మయః పఞ్చవింశకః ॥ 27 ॥**

ఇరువదైదవ తత్త్వమైన పురుషుని స్వరూపం హిరణ్యగర్భుడు సదసదాత్మకమైన సకలజగత్తును సృష్టిస్తాడు.

**సర్వజ్ఞాస్సర్వగాశ్శాన్తాః స్వాత్మన్యేవ వ్యవస్థితాః ।**
**శక్తయో బ్రహ్మవిష్ణ్వీశా భుక్తిముక్తిఫలప్రదాః ॥ 28 ॥**

మహేశ్వరునిలో ఉన్న మూడు శక్తులు సర్వజ్ఞులు, సర్వవ్యాపులు, శాంతులు బ్రహ్మ, విష్ణు, ఈశ్వర నామంతో ఉండేవి భుక్తిని, ముక్తిని ప్రసాదిస్తాయి.

**సర్వేశ్వరాః సర్వవన్ద్యాః శాశ్వతానన్తభోగినః ।**
**ఏకమేవాక్షరం తత్త్వం పుంప్రధానేశ్వరాత్మకమ్ ॥ 29 ॥**

ఈ శక్తులే సర్వేశ్వరరూపాలు అందరి నమస్కారాలందుకొంటాయి. అవి శాశ్వతాలు అనంతభోగాలు కలవి. అద్వితీయమైన అక్షరతత్త్వమే పురుషప్రధాన ఈశ్వరరూపంగా ఉంటుంది.

**అన్యాశ్చ శక్తయో దివ్యాః సన్తి తత్ర సహస్రశః ।**
**ఇజ్యన్తే వివిధైర్యజ్ఞైః శక్రాదిత్యాదయోఽమరాః ॥ 30 ॥**

ఈ అవ్యక్తమైన అక్షరతత్త్వంలో ఇతరశక్తులు వేలాది ఉన్నాయి. పలువిధాలైన యజ్ఞాలతో ఈ ఇంద్రాదిత్యాది శక్తులు ఆరాధింపబడుతున్నవి.

**ఏకైకస్య సహస్రాణి దేహానాం వై శతాని చ ।**
**కథ్యన్తే చైవ మాహాత్మ్యాచ్ఛక్తిరేకైవ నిర్గుణా ॥ 31 ॥**

ఇంద్ర ఆదిత్యాదులుగా ఉన్న ఒక్కొక్క శక్తికి నూర్లు, వేలాది దేహాలుంటాయని చెబుతున్నా ఈ అన్నిటికి మూలమైన శక్తి నిర్గుణమైనది ఒకటే.

**తాం తాం శక్తిం సమాధాయ స్వయం దేవో మహేశ్వరః ।**
**కరోతి దేహాన్ వివిధాన్ గ్రసతే చైవ లీలయా ॥ 32 ॥**

మహాదేవుడు స్వయంగా ఆయా శక్తులను స్వీకరించి పలుదేహాలను సృష్టిస్తాడు. అట్లే విలాసంగా సంహరిస్తాడు కూడా.

**ఇజ్యతే సర్వయజ్ఞేషు బ్రాహ్మణైర్వేదవాదిభిః ।**
**సర్వకామప్రదో రుద్రః ఇత్యేషా వైదికీ శ్రుతిః ॥ 33 ॥**

వేదవాదులైన బ్రాహ్మణులచే అన్నియజ్ఞాలతో సర్వకామప్రదుడైన ఈ రుద్రుడే ఆరాధింపబడుతున్నాడని వైదికశ్రుతి.

**సర్వాసామేవ శక్తీనాం బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ।**
**ప్రాధాన్యేన స్మృతా దేవాః శక్తయః పరమాత్మనః ॥ 34 ॥**

మహేశ్వరశక్తులన్నింటిలో ప్రధానమైన శక్తులు బ్రహ్మవిష్ణుశివాత్మకాలు. అవి పరమాత్మశక్తులు.

**ఆద్యః పరస్తాద్భగవాన్పరమాత్మా సనాతనః ।**
**గీయతే సర్వశక్త్యాత్మా శూలపాణిర్మహేశ్వరః ॥ 35 ॥**

శూలపాణి అయిన మహేశ్వరుడే ఆద్యుడు, జ్ఞాన, శక్త్యాది గుణవిశిష్టుడు, అందరికంటే పరుడు పరమాత్మ, సనాతనుడు, సర్వశక్త్యాత్మకుడుగా కీర్తింపబడుతున్నాడు.

**ఏనమేకే వదన్త్యగ్నిం నారాయణమథాపరే ।**
**ఇన్ద్రమేకేఽపరే విశ్వాన్ బ్రహ్మాణమపరే జగుః ॥ 36 ॥**

ఇతణ్ణే కొందరు అగ్ని అని, మరి కొందరు నారాయణుడనీ, ఇంద్రుడనీ, విశ్వేదేవులు, బ్రహ్మ అనీ అంటారు.

**బ్రహ్మవిష్ణ్వగ్నివరుణాః సర్వే దేవాస్తథర్షయః ।**
**ఏకస్యైవాథ రుద్రస్య భేదాస్తే పరికీర్తితాః ॥ 37 ॥**

బ్రహ్మ, విష్ణు, అగ్ని, వరుణులు, ఇతరదేవతలు, ఋషులు, వీరంతా ఒకేరుద్రుని భేదాలుగా (అంశలుగా) కీర్తింపబడుతున్నారు.

**యం యం భేదం సమాశ్రిత్య యజన్తి పరమేశ్వరమ్ ।**
**తత్తద్రూపం సమాస్థాయ ప్రదదాతి ఫలం శివః ॥ 38 ॥**

మహేశ్వరుని ఏ రూపాన్నాశ్రయించి పూజిస్తే శివుడు వారివారికి ఆయా రూపాల్లోనే ఫలాన్నిస్తాడు.

**తస్మాదేకతరం భేదం సమాశ్రిత్యాపి శాశ్వతమ్ ।**
**ఆరాధయన్మహాదేవం యాతి తత్పరమమ్పదమ్ ॥ 39 ॥**

అందువల్ల ఇన్ని భేదాల్లో ఏ ఒక అంశను ఆశ్రయించి పూజించినా ఆ పరమ పదాన్ని పొందవచ్చును.

**కిన్తు దేవం మహాదేవం సర్వశక్తిం సనాతనమ్ ।**
**ఆరాధయేద్వై గిరిశం సగుణం వాఽథ నిర్గుణమ్ ॥ 40 ॥**

అయినా మహేశ్వరుడు, సర్వశక్తిధరుడు, సనాతనుడైన శివుని సగుణిగా, లేదా నిర్గుణిగా ఆరాధించ వలెను.

**మయా ప్రోక్తో హి భవతాం యోగః ప్రాగేవ నిర్గుణః ।**
**ఆరురుక్షుస్తు సగుణం పూజయేత్పరమేశ్వరమ్ ॥ 41 ॥**

నిర్గుణయోగాన్ని ముందే వివరించినాను. సగుణోపాసన చేయబూనినవాడు కూడ పరమేశ్వరు నారాధించాలి.

**పినాకినం త్రినయనం జటిలం కృత్తివాససమ్ ।**
**పద్మాసనస్థం రుక్మాభం చిన్తయేద్వైదికీ శ్రుతిః ॥ 42 ॥**

పినాకి, ముక్కంటి, జడధారి, చర్మాంబరుడు, స్వర్ణకాంతిగలవాడు, పద్మాసనాసీనునిగా ఉన్న శివుని ధ్యానించాలని వైదికశ్రుతి చెప్పినది.

**ఏష యోగః సముద్దిష్టః సబీజో మునిసత్తమాః ।**
**తస్మాత్సర్వాన్పరిత్యజ్య దేవాన్ బ్రహ్మపురోగమాన్ ।**

**ఆరాధయేద్విరూపాక్షమాదిమధ్యాన్తసంస్థితమ్ ॥ 43 ॥**

ఇది సబీజ (సగుణ) యోగంగా చెప్పనైనది. అందువల్ల బ్రహ్మాదిదేవతలను వదలి, ఆదిమధ్యాంతాల్లో నిలిచి ఉండే విరూపాక్షుని ఆరాధించాలి.

**భక్తియోగసమాయుక్తః స్వధర్మనిరతః శుచిః ।**
**తాదృశం రూపమాస్థాయ సమయాత్యన్తికం శివమ్ ॥ 44 ॥**

స్వధర్మనిరతుడై భక్తియోగం ఆశ్రయించి, శివుని రూపాన్ని ధరించి, శివుని సన్నిధికి చేరుతాడు.

**ఏష యోగః సముద్దిష్టః స తేజోఽత్యన్తభావనే ।**
**యథావిధి ప్రకుర్వాణః ప్రాప్నుయాదైశ్వరమ్పదమ్ ॥ 45 ॥**

ఇది సగుణోపాసనాయోగంగా చెప్పనైనది. ఈ యోగాన్ని యథావిధి ఆచరించిన వ్యక్తి ఈశ్వరుని పదాన్ని చేరుతాడు.

**అత్రాప్యశక్తోఽథ హరం విష్ణుం బ్రహ్మాణమర్చయేత్ । 46 ॥**

ఈ ఈశ్వరతత్త్వాన్ని గూడ ఆరాధించలేనివారు హరుని, విష్ణువును, బ్రహ్మను అర్చించాలి.

**అథ చేదసమర్థస్స్యాత్తత్రాపి మునిపుఙ్గవాః ।**
**తతో వాయ్వగ్నిశక్రాదీన్పూజయేద్భక్తిసంయుతః ॥ 47 ॥**

మునిపుంగవులారా! వీరిని కూడా ఆరాధించలేని వారు వాయువు, అగ్ని, ఇంద్రాదులను భక్తితో ఆరాధించాలి.

**యే చాన్యే భావనే శుద్ధే ప్రాగుక్తే భవతామిహ ।**
**అథాపి కథితో యోగో నిర్బీజశ్చ సబీజకః ॥ 48 ॥**

ముందే మీకు సగుణ, నిర్గుణోపాసనలు వివరించబడ్డాయి. అవి పరిశుద్ధాలు, వాటిని నిర్బీజ, సబీజ ఉపాసనలని అంటారు.

**జ్ఞానం తదుక్తం నిర్బీజం పూర్వం హి భవతాం మయా ।**
**విష్ణుం రుద్రం విరిఞ్చిఞ్చ స బీజం భావయేద్బుధః ॥ 49 ॥**

నిర్బీజయోగం ఇదివరకే మీకు చెప్పినాను. విష్ణు, రుద్ర, బ్రహ్మలపట్ల సబీజోపాసనమే చేయాలి.

**అథవాఽగ్న్యాదికాం దేవాంస్తత్పరః సంయతేన్ద్రియః ।**
**పూజయేత్పురుషం విష్ణుం చతుర్మూర్తిధరం హరిమ్ ॥ 50 ॥**

లేదా అగ్న్యాదిదేవతలను తత్పరుడై ఇంద్రియనిగ్రహంకల్గి, చతుర్మూర్తిధరుడైన విష్ణువును పూజించాలి.

**అనాది నిధనం దేవం వాసుదేవం సనాతనమ్ ।**
**నారాయణం జగద్యోనిమాకాశం పరమమ్పదమ్ ॥ 51 ॥**

ఇతడు ఆద్యంతాలు లేనివాడు, అంతటా వ్యాపించి ఉన్నవాడు, సనాతనుడు, నారాయణుడు, జగత్కారణుడు, పరమాకాశం, పరమ పదము.

**తల్లిఙ్గధారీ నియతం తద్భక్త స్తదుపాశ్రయః ।**
**ఏష ఏవ విధిర్బ్రాహ్మో భావనే చాన్తికే మనః ॥ 52 ॥**

విష్ణుచిహ్నాలు ధరించి, విష్ణుభక్తుడై విష్ణువును తప్ప ఇతరుల నాశ్రయించనివాడై పూజించాలి. బ్రహ్మనారాధించటంలో కూడా ఇదేవిధి ననుసరించాలి.

**ఇత్యేతత్కథితం జ్ఞానం భావనాసంశ్రయమ్పరమ్ ।**
**ఇన్ద్రద్యుమ్నాయ మునయే కథితం యన్మయా పురా ॥ 53 ॥**

ఇట్లు మీకు భావనాశ్రయమైన జ్ఞానాన్ని వివరించినాను. నేను పూర్వం దీన్నే ఇంద్రద్యుమ్నుడనే మునికి తెలిపి ఉన్నాను.

**అవ్యక్తాత్మకమేవేదం చేతనాచేతనం జగత్ ।**
**తదీశ్వరః పరం బ్రహ్మ తస్మాద్బ్రహ్మమయం జగత్ ॥ 54 ॥**

చేతనాచేతనాత్మకమైన ఈ సకలజగత్తు అవ్యక్తం, అక్షరమైన పరమాత్మస్వరూపమే. ఆ ఈశ్వరుడే పరబ్రహ్మ అందువల్ల ఈ జగత్తంతా బ్రహ్మమయం అని చెప్పనైనది.

**సూత ఉవాచ:-**సూతుడు చెప్పాడు

**ఏతావదుక్త్వా భగవాన్విరరామ జనార్దనః ।**
**తుష్టువుర్మునయో విష్ణుం శక్రేణ సహ మాధవమ్ ॥ 55 ॥**

ఇంత మాత్రం చెప్పి భగవాన్ జనార్దనుడు విరమించినాడు. వెంటనే ఇంద్రునితోపాటు ఋషులు శ్రీమన్నారాయణుని స్తోత్రం చేశారు.

**మునయ ఊచు:-**మునులు పలికినారు

**నమస్తే కూర్మరూపాయ విష్ణవే పరమాత్మనే ।**
**నారాయణాయ విశ్వాయ వాసుదేవాయ తే నమః ॥ 56 ॥**

కూర్మరూపుడవైన నీకు నమస్కారం. పరమాత్మ విష్ణువునకు నమస్కారం. నారాయణుడు, విశ్వుడు, వాసుదేవునికి నమస్కారం.

**నమో నమస్తే కృష్ణాయ గోవిన్దాయ నమో నమః ।**
**మాధవాయ నమస్తుభ్యం నమో యజ్ఞేశ్వరాయ చ ॥ 57 ॥**

కృష్ణునికి గోవిందునికి నమస్కారం. మాధవునికి, యజ్ఞేశ్వరునికి నమస్కారం.

**సహస్రశిరసే తుభ్యం సహస్రాక్షాయ తే నమః ।**
**నమః సహస్రహస్తాయ సహస్రచరణాయ చ ॥ 58 ॥**

సహస్రశీర్షునికి, సహస్రాక్షునికి, సహస్రహస్తునికి, సహస్రపాదునికి నీకు నమస్కారం.

**ఓం నమో జ్ఞానరూపాయ పరమాత్మస్వరూపిణే ।**
**ఆనన్దాయ నమస్తుభ్యం మాయాతీతాయ తే నమః ॥ 59 ॥**

జ్ఞానరూపుడు, పరమాత్మ స్వరూపుడు, ఆనన్దరూపుడు మాయాతీతుడవగు నీకు నమస్కారం.

**నమో గూఢశరీరాయ నిర్గుణాయ నమోఽస్తు తే ।**
**పురుషాయ పురాణాయ సత్తామాత్రస్వరూపిణే ॥ 60 ॥**

గూఢశరీరుడు నిర్గుణునికి నమస్కారం. పురాణపురుషుడు సత్తామాత్ర స్వరూపునకు నమస్కారం.

**నమః సాంఖ్యాయ యోగాయ కేవలాయ నమోఽస్తు తే ।**
**ధర్మజ్ఞానాధిగమ్యాయ నిష్కలాయ నమో నమః ॥ 61 ॥**

సాంఖ్యం, యోగం, కేవల రూపివైన నీకు నమస్కారం. ధర్మజ్ఞానాలచే పొందదగిన నిష్కలునికి నమస్కారం.

**నమోఽస్తు వ్యోమతత్త్వాయ మహాయోగేశ్వరాయ చ ।**
**పరావరాణాం ప్రభవే వేదవేద్యాయ తే నమః ॥ 62 ॥**

వ్యోమతత్త్వం, మహాయోగీశ్వరునికి నమస్కారం. పరావరులకు ప్రభువైన వేదవేద్యునికి నీకు నమస్కారం.

**నమో బుద్ధాయ శుద్ధాయ నమో యుక్తాయ హేతవే ।**
**నమో నమో నమస్తుభ్యం మాయినే వేధసే నమః ॥ 63 ॥**

బుద్ధుడు, శుద్ధుడు, యుక్తుడు, హేతువైన వానికి నమస్కారం. మాయివి బ్రహ్మస్వరూపుడవైన నీకు నమస్కారం.

**నమోఽస్తు తే వరాహాయ నారసింహాయ తే నమః ।**
**వామనాయ నమస్తుభ్యం హృషీకేశాయ తే నమః ॥ 64 ॥**

వరాహునకు, నరసింహునకు నమస్కారం. వామనునకు, హృషీకేశునకు నమస్కారం.

**నమోఽస్తు కాలరుద్రాయ కాలరూపాయ తే నమః ।**
**స్వర్గాపవర్గదాత్రే చ నమోఽప్రతిహతాత్మనే ॥ 65 ॥**

కాలరుద్ర, కాలరూపికి నమస్కారం. స్వర్గాపవర్గాలిచ్చే దేవాధిపతికి, కొట్టబడని స్వరూపము కలవానికి నమస్కారం.

**నమో యోగాధిగమ్యాయ యోగినే యోగదాయినే ।**
**దేవానాం పతయే తుభ్యం దేవార్తిశమనాయతే ॥ 66 ॥**

నమస్కారం యోగముచే పొంద దగినవానికి, యోగికి యోగదాయికి నమస్కారం, దేవతల పతికి దేవతల ఆర్తిని తొలగించువానికి నమస్కారం.

**భగవంస్త్వత్ప్రసాదేన సర్వసంసారనాశనమ్ ।**
**అస్మాభిర్విదితం జ్ఞానం యత్‌జ్ఞాత్వాఽమృతమశ్నుతే ॥ 67 ॥**

జ్ఞానశక్త్యాది షాడ్గుణ్యరూపా! నీ అనుగ్రహంతో సర్వసంసారనాశకమై మోక్షాన్ని పొందించే జ్ఞానాన్ని పొందినాము.

**శ్రుతాస్తు వివిధా ధర్మా వంశా మన్వన్తరాణి చ ।**
**సర్గశ్చ ప్రతిసర్గశ్చ బ్రహ్మాణ్డస్యాస్య విస్తరః ॥ 68 ॥**

అనేక ధర్మాలు, వంశ, మన్వంతర, సర్గ, ప్రతిసర్గలతోపాటు ఈ బ్రహ్మాండ విస్తారాన్ని విన్నాము.

**త్వం హి సర్వజగత్సాక్షీ విశ్వో నారాయణః పరః ।**
**త్రాతుమర్హస్యనన్తాత్మంస్త్వమేవ శరణం గతిః ॥ 69 ॥**

నీవే సర్వ జగత్సాక్షివి. నీవే ప్రపంచం, నారాయణుడు, పరుడు, అనంతస్వరూపివైన నీవే మాకు శరణం అందువల్ల మమ్ము కాపాడుము.

**సూత ఉవాచ:**-సూతమహర్షి చెప్పాడు

**ఏతద్వః కథితం విప్రా యోగమోక్షప్రదాయకమ్ ।**
**కౌర్మం పురాణమఖిలం యజ్జగాద గదాధరః ॥ 70 ॥**

ఓ విప్రులారా! సాక్షాత్తు గదాధరుడు చెప్పినది, యోగక్షేమాలు ప్రసాదించే కూర్మపురాణాన్ని నేను మీకు చెప్పినాను.

**అస్మిన్ పురాణే లక్ష్మ్యాస్తు సమ్భవః కథితః పురా ।**
**మోహాయాశేషభూతానాం వాసుదేవేన యోజనమ్ ॥ 71 ॥**

ఈ పురాణంలో మొదట లక్ష్మీదేవి ఆవిర్భావం, సకలజగత్తులను మోహింప చేయటానికి లక్ష్మిని వాసుదేవునితో కూర్చటం వివరించినాను.

**ప్రజాపతీనాం సర్గస్తు వర్ణధర్మాశ్చ వృత్తయః ।**
**ధర్మార్థకామమోక్షాణాం యథావల్లక్షణం శుభమ్ ॥ 72 ॥**

ప్రజాపతులసృష్టి, వర్ణధర్మాలు, వృత్తులు, శుభప్రదాలైన ధర్మార్థకామమోక్షాలలక్షణాలు ఉన్నదున్నట్లు చెప్పినాను.

**పితామహస్య విష్ణోశ్చ మహేశస్య చ ధీమతః ।**
**ఏకత్వఞ్చ పృథక్త్వం చ విశేషశ్చోపవర్ణితః ॥ 73 ॥**

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఏకత్వము, భిన్నత్వము, విశేషములను కూడా చెప్పినాను.

**భక్తానాం లక్షణం ప్రోక్తం సదాచారశ్చ శోభనః ।**
**వర్ణాశ్రమాణాం కథితం యథావదిహ లక్షణమ్ ॥ 74 ॥**

భక్తుల లక్షణములను, శోభనమైన సదాచారలక్షణాలు కూడ చెప్పినాను. శాస్త్రానుసారం వర్ణాశ్రమలక్షణం చెప్పాను.

**ఆదిసర్గస్తతః పశ్చాదణ్డావరణసప్తకమ్ ।**
**హిరణ్యగర్భసర్గశ్చ కీర్తితో మునిపుఙ్గవాః ॥ 75 ॥**

అదేవిధంగా ఆదిసర్గం, సప్తావరణాలతోడి బ్రహ్మాండం తెలుపనైనది. మునులారా! హిరణ్యగర్భసృష్టి చెప్పాను.

**కాలసంఖ్యాప్రకథనం మాహాత్మ్యం చేశ్వరస్య చ ।**
**బ్రహ్మణః శయనఞ్చాప్సు నామ నిర్వచనం తథా ॥ 76 ॥**

కాలగణనావిధి, ఈశ్వరమాహాత్మ్యం, బ్రహ్మ జలంలో పరుండటం, భగవానుని నామాలకు నిరుక్తం కూడా చెప్పనైనది.

**వరాహవపుషా భూయో భూమేరుద్ధరణం పునః ।**
**ముఖ్యాదిసర్గకథనం మునిసర్గస్తథాఽపరః ॥ 77 ॥**

మళ్ళీ వరాహరూపంలో భూమిని ఉద్ధరించటం. ముఖ్యాదిసృష్టి, మునిసృష్టిని చెప్పాను.

**వ్యాఖ్యాతో రుద్రసర్గాశ్చ ఋషిసర్గాశ్చ తాపసాః ।**
**ధర్మస్య చ ప్రజాసర్గాస్తామసాత్పూర్వమేవ తు ॥ 78 ॥**

రుద్ర, ఋషి, తాపససర్గాలు, ప్రజాసర్గాలు బాగా వివరించబడ్డాయి.

**బ్రహ్మవిష్ణువివాదః స్యాదన్తర్దేహప్రవేశనమ్ ।**
**పద్మోద్భవశ్చ దేవస్య మోహస్తస్య చ ధీమతః ॥ 79 ॥**

బ్రహ్మ, విష్ణువివాదం, ఒకరు మరొకరి దేహంలో ప్రవేశించటం, బ్రహ్మ పద్మంలో జన్మించటం, జ్ఞాని అయిన బ్రహ్మకు మోహం.

**దర్శనం చ మహేశస్య మాహాత్మ్యం విష్ణునేరితమ్ ।**
**దివ్యదృష్టిప్రదానఞ్చ బ్రహ్మణః పరమేష్ఠినః ॥ 80 ॥**

మహేశ్వర దర్శనం విష్ణువు చెప్పిన మహేశ్వర మహాత్మ్యం మహేశ్వరుడు బ్రహ్మకు దివ్యదృష్టి నివ్వటం.

**సంస్తవో దేవదేవస్య బ్రహ్మణా పరమేష్ఠినా ।**
**ప్రసాదో గిరిశస్యాథ వరదానం తథైవ చ ॥ 81 ॥**

పరమేష్ఠి బ్రహ్మ మహేశ్వరుని స్తుతించటం, శివుడు ప్రసన్నుడై బ్రహ్మకు వరాన్నివ్వటం.

**సంవాదో విష్ణునా సార్ధం శఙ్కరస్య మహాత్మనః ।**
**వరదానం తథా పూర్వమన్తర్ధానం పినాకినః ॥ 82 ॥**

మహాత్ముడైన శంకరునికి విష్ణువుతో సంవాదం, తర్వాత వరప్రదానం, శివుని అంతర్ధానం వర్ణించబడినది.

**వధశ్చ కథితో విప్రా మధుకైటభయోః పురా ।**
**అవతారోఽథ దేవస్య బ్రహ్మణో నాభిపఙ్కజాత్ ॥ 83 ॥**

శ్రీమహావిష్ణువువల్ల మధుకైటభవధ, విష్ణునాభికమలంనుండి బ్రహ్మావిర్భావం చెప్పబడ్డాయి.

**ఏకీభావశ్చ దేవస్య విష్ణునా కథితస్తతః ।**
**విమోహో బ్రహ్మణశ్చాథ సంజ్ఞాలాభో హరేస్తతః ॥ 84 ॥**

విష్ణువులో బ్రహ్మైక్యం, బ్రహ్మ మళ్లీ విష్ణువువల్ల తెలివి పొందుటం వర్ణించబడింది.

**తపశ్చరణమాఖ్యాతం దేవదేవస్య ధీమతః ।**
**ప్రాదుర్భావో మహేశస్య లలాటాత్కథితస్తతః ॥ 85 ॥**

బ్రహ్మతపశ్చరణ, బ్రహ్మలలాటంనుండి మహేశ్వరావిర్భావం వివరింపబడ్డాయి.

**రుద్రాణాం కథితా సృష్టిర్బ్రహ్మణః ప్రతిషేధనమ్ ।**
**భూతిశ్చ దేవదేవస్య వరదానోపదేశకౌ ॥ 86 ॥**

రుద్రులసృష్టి, బ్రహ్మ ఆ సృష్టిని నిషేధించటం, దేవాధిదేవుడు శంకరుని ఐశ్వర్యవర్ణనం, బ్రహ్మకు వరాన్ని ఉపదేశాన్నివ్వటం.

**అన్తర్ధానఞ్చ రుద్రస్య తపశ్చర్యాఽణ్డజస్య చ ।**
**దర్శనం దేవదేవస్య నరనారీశరీరతా ॥ 87 ॥**

రుద్రుని అంతర్ధానం, బ్రహ్మ తపశ్చర్య, దేవాధిదేవుడైన శంకరుని దర్శనం, అర్ధనారీ రూపం పొందటం.

**దేవ్యా విభాగకథనం దేవదేవాత్పినాకినః ।**
**దేవ్యాస్తు పశ్చాత్కథితం దక్షపుత్రీత్వమేవ చ ॥ 88 ॥**

శంకరుని నుండి పార్వతి వేరగుట, పార్వతి పూర్వం దక్షపుత్రిగా ఉన్న ఇతివృత్తం.

**హిమవద్దుహితృత్వం చ దేవ్యా మాహాత్మ్యమేవ చ ।**
**దర్శనం దివ్యరూపస్య వైశ్వరూపస్య దర్శనమ్ ॥ 89 ॥**

తర్వాత హిమవత్పుత్రిక కావటం, దేవీమాహాత్మ్యం, దివ్యరూపదర్శనం, విశ్వరూప దర్శనం చెప్పడమైనది.

**నామ్నాం సహస్రం కథితం పిత్రా హిమవతా స్వయమ్ ।**
**ఉపదేశో మహాదేవ్యా వరదానం తథైవ చ ॥ 90 ॥**

తండ్రి హిమవంతుడు స్వయంగా దేవీ సహస్రనామాలు తెల్పటం, మహాదేవిచేసిన ఉపదేశం, వరప్రసాదం కూడా వివరించబడ్డాయి.

**భృగ్వాదీనాం ప్రజాసర్గో రాజ్ఞాం వంశస్య విస్తరః ।**
**ప్రాచేతసత్వం దక్షస్య దక్షయజ్ఞవిమర్దనమ్ ॥ 91 ॥**

భృగ్వాది ఋషుల ప్రజాసృష్టి, రాజవంశ వర్ణనం, వంశవిస్తృతి, దక్షప్రజాపతి ప్రచేతస పుత్రుడవటం, దక్షయజ్ఞధ్వంసం.

**దధీచస్య చ దక్షస్య వివాదః కథితస్తథా ।**
**తతశ్చ శాపః కథితో మునీనాం మునిపుఙ్గవాః ॥ 92 ॥**

ఓ మునిపుంగవులారా! దక్ష, దధీచివివాదం, మునుల శాపం వర్ణించబడ్డాయి.

**రుద్రాగతిః ప్రసాదశ్చ అన్తర్ధానం పినాకినః ।**
**పితామహస్యోపదేశః కీర్త్యతే రక్షణాయ తు ॥ 93 ॥**

తర్వాత రుద్రాగమనం, అనుగ్రహం, శంకరుని అంతర్ధానం, దక్షరక్షణార్థం పితామహోపదేశం.

**దక్షస్య చ ప్రజాసర్గః కశ్యపస్య మహాత్మనః ।**
**హిరణ్యకశిపోర్నాశః హిరణ్యాక్షవధస్తథా ॥ 94 ॥**

దక్షప్రజాసృష్టి, కశ్యపప్రజాసృష్టి వర్ణించబడ్డాయి. హిరణ్యకశిపువధ, హిరణ్యాక్షవధ.

**తతశ్చ శాపః కథితో దేవదారువనౌకసామ్ ।**
**నిగ్రహశ్చాన్ధకస్యాపి గాణపత్యమనుత్తమమ్ ॥ 95 ॥**

దేవదారు వనవాసుల శాపం, అంధకనిగ్రహం, మహోత్తమమైన అంధక గాణపత్యం.

**ప్రహ్లాదనిగ్రహశ్చాథ బలేః సంయమనం తతః ।**
**బాణస్య నిగ్రహశ్చాథ ప్రసాదస్తస్య శూలినః ॥ 96 ॥**

ప్రహ్లాద నిగ్రహం, బలి బంధనం, బాణనిగ్రహం, మళ్ళీ శంకరానుగ్రహం.

**ఋషీణాం వంశవిస్తారో రాజ్ఞాం వంశాః ప్రకీర్తితాః ।**
**వసుదేవాత్ తతో విష్ణోరుత్పత్తిః స్వేచ్ఛయా హరేః ॥ 97 ॥**

ఋషివంశ విస్తారం, రాజవంశ విస్తృతి, శ్రీహరి తన ఇచ్ఛతో వసుదేవపుత్రునిగా అవతరించటం వర్ణించడమైనది.

**దర్శనఞ్చోపమన్యోర్వై తపశ్చరణమేవ చ ।**
**వరలాభో మహాదేవం దృష్ట్వా సాంబం త్రిలోచనమ్ ॥ 98 ॥**

ఉపమన్యు దర్శనం, తపమునాచరించటం, తర్వాత దేవీసహితుడైన శంకరునిదర్శనం, వరలాభం.

**కైలాసగమనఞ్చాథ నివాసస్తత్ర శార్ఙ్గిణః ।**
**తతశ్చ కథ్యతే భీతిర్ద్వారవత్యా నివాసినామ్ ॥ 99 ॥**

శ్రీహరి కైలాసానికి రావటం, అచట నివాసం, ద్వారకలోని వారి భయం.

**రక్షణం గరుడేనాథ జిత్వా శత్రూన్మహాబలాన్ ।**
**నారదాగమనం చైవ యాత్రా చైవ గరుత్మతః ॥ 100 ॥**

గరుడుడు మహాబలులైన శత్రువుల జయించి ద్వారకా వాసుల రక్షించడం, నారదాగమనం, గరుత్మంతుని యాత్ర.

**తతశ్చ కృష్ణాగమనం మునీనామాగతిస్తతః ।**
**నైత్యకం వాసుదేవస్య శివలిఙ్గార్చనం యథా ॥ 101 ॥**

తర్వాత కృష్ణాగమనం, మునుల రాక, వాసుదేవుని నిత్యాచరణలో శివలింగార్చన వర్ణనం.

**మార్కణ్డేయస్య చ మునేః ప్రశ్నః ప్రోక్తః తతః పరమ్ ।**
**లిఙ్గార్చననిమిత్తఞ్చ లిఙ్గస్యాపి సలిఙ్గినః ॥ 102 ॥**

మార్కండేయుడు లింగార్చన విషయంలో శ్రీకృష్ణుని ప్రశ్నించటం, శ్రీకృష్ణవివరణ, శివలింగ స్వరూప నిరూపణం వివరించబడ్డాయి.

**యాథాత్మ్యకథనఞ్చాథ లిఙ్గావిర్భావ ఏవ చ ।**
**బ్రహ్మవిష్ణ్వో స్తథా మధ్యే కీర్తితో మునిపుఙ్గవాః ॥ 103 ॥**

ఓ మునిపుంగవులారా! బ్రహ్మ, విష్ణువులమధ్య జ్యోతిర్లిఙ్గావిర్భావం, జ్యోతిర్లింగ నిజస్వరూప కథనం.

**మోహస్తయోస్తు కథితో గమనఞ్చోర్ధ్వతోఽ పృథ ।**
**సంస్తవో దేవదేవస్య ప్రసాదః పరమేష్ఠినః ॥ 104 ॥**

బ్రహ్మ, విష్ణువుల మోహం, లింగ పరిమాణం తెలుసుకోవటానికి బ్రహ్మవిష్ణువులు ఊర్ధ్వ అధోభాగాలకు వెళ్ళటం, శివుని స్తుతించటం, శివుడు వారిని అనుగ్రహించటం వివరింపబడింది.

**అన్తర్ధానఞ్చ లిఙ్గస్య సామ్బోత్పత్తిస్తతః పరమ్ ।**
**కీర్తితా చానిరుద్ధస్య సముత్పత్తిర్ద్విజోత్తమాః ॥ 105 ॥**

బ్రాహ్మణశ్రేష్ఠులారా! శివలింగాంతర్ధానం, సాంబ, అనిరుద్ధుల ఉత్పత్తులు చెప్పబడినవి.

**కృష్ణస్య గమనే బుద్ధిః ఋషీణామాగతి స్తథా ।**
**అనుశాసితఇ్చ కృష్ణేన వరదానం మహాత్మనః ॥ 106 ॥**

కృష్ణుడు తనలోకానికి వెళ్ల నిశ్చయించుకోవటం, ఋషుల ఆగమనం, భగవాన్ కృష్ణుడు ఋషులకు ఉపదేశ, వరాలు అనుగ్రహించటం.

**గమనఞ్చైవ కృష్ణస్య పార్థస్యాపి చ దర్శనమ్ ।**
**కృష్ణద్వైపాయనస్యోక్తా యుగధర్మాస్సనాతనాః ॥ 107 ॥**

కృష్ణుడు తనధామం వెళ్ళటం, అర్జునుడు కృష్ణద్వై పాయనుని దర్శించటం, కృష్ణద్వైపాయనుడు సనాతనయుగ ధర్మా లుపదేశించటం.

**అనుగ్రహోఽథ పార్థస్య వారణాసీగతిస్తతః ।**
**పారాశర్యస్య చ మునేర్వ్యాసస్యాద్భుతకర్మణః ॥ 108 ॥**

అర్జునుని అనుగ్రహించటం, అద్భుత కర్ముడు, పరాశరపుత్రుడైన వ్యాసుడు వారాణసీ నగరానికి వెళ్ళటం వివరించబడ్డాయి.

**వారాణస్యాశ్చ మాహాత్మ్యం తీర్థానాం చైవ వర్ణనమ్ ।**
**తీర్థయాత్రా చ వ్యాసస్య దేవ్యాశ్చైవాథ వర్ణనమ్ ॥**
**తీర్థయాత్రా చ వ్యాసస్య దేవ్యాశ్చైవ చ దర్శనమ్ ।**
**ఉద్వాసనఞ్చ కథితం వరదానం తథైవ చ ॥ 109 ॥**

వారాణసీమాహాత్మ్యం తీర్థాలప్రభావం, వ్యాసమహర్షి తీర్థయాత్రా వర్ణన, దేవీదర్శనం, దేవి వ్యాసుని కాశినుండి పంపటం, మళ్ళీ అనుగ్రహించటం తెలుపబడ్డాయి.

**ప్రయాగస్య చ మాహాత్మ్యం క్షేత్రాణామథ కీర్తనమ్ ।**
**ఫలఞ్చ విపులం విప్రా మార్కణ్డేయస్య నిర్గమః ॥ 110 ॥**

ప్రయాగమాహాత్మ్యం, ఇతర క్షేత్రాల ప్రభావం, తీర్థయాత్రా ఫలం, మార్కండేయ నిర్గమనం.

**భువనానాం స్వరూపఞ్చ జ్యోతిషాఞ్చ నివేశనమ్ ।**
**కీర్త్యన్తే చైవ వర్షాణి నదీనాఞ్చైవ నిర్ణయః ॥ 111 ॥**

సకలలోకాల స్వరూపం, గ్రహాలు నక్షత్రాలస్థితి, వర్షాలు, నదుల నిర్ణయం.

**పర్వతానాఞ్చ కథనం స్థానాని చ దివౌకసామ్ ।**
**ద్వీపానాం ప్రవిభాగశ్చ శ్వేతద్వీపోపవర్ణనమ్ ॥ 112 ॥**

పర్వతాలు, దేవతల స్థానాల వర్ణన, ద్వీపాల విభాగం, శ్వేతద్వీపవర్ణనం చేయబడినవి.

**శయనం కేశవస్యాథ మాహాత్మ్యఞ్చ మహాత్మనః ।**
**మన్వన్తరాణాం కథనం విష్ణోర్మాహాత్మ్యమేవ చ ॥ 113 ॥**

శ్రీనారాయణుని యోగనిద్ర, శ్రీహరిమాహాత్మ్యం, మన్వంతరకథనం, శ్రీవిష్ణుమహిమ.

**వేదశాఖాప్రణయనం వ్యాసానాం కథనం తతః ।**
**అవేదస్య చ వేదానాం కథనం మునిపుఙ్గవాః ॥ 114 ॥**

ఓ మునిపుంగవులారా! వేదశాఖారచన, వ్యాస నామ పరిగణనం, వేద బాహ్యసిద్ధాంతాలను చెప్పటం.

**యోగేశ్వరాణాఞ్చ కథా శిష్యాణాఞ్చాథ కీర్తనమ్ ।**
**గీతాశ్చ వివిధా గుహ్యా ఈశ్వరస్యాథ కీర్తితాః ॥ 115 ॥**

యోగేశ్వరుల కథనం, శిష్యులకీర్తనం, ఈశ్వరరహస్య గీతాలు చెప్పడమయింది.

**వర్ణాశ్రమాణామాచారః ప్రాయశ్చిత్తవిధిస్తతః ।**
**కపాలిత్వఞ్చ రుద్రస్య భిక్షాచరణమేవ చ ॥ 116 ॥**

వర్ణాశ్రమాచారవిధి, ప్రాయశ్చిత్త విధి, రుద్రుని కపాలిత్వం, భిక్షా చరణం.

**పతివ్రతాయాశ్చాఽఽఖ్యానం తీర్థానాఞ్చ వినిర్ణయః ।**
**తథా మఙ్కణకస్యాథ నిగ్రహః కీర్త్యతే ద్విజాః ॥ 117 ॥**

ఓ ద్విజులారా! పతివ్రతా కథ, తీర్థ నిర్ణయం, మంఖణకనిగ్రహం.

**వధశ్చ కథితో విప్రాః కాలస్య చ సమాసతః ।**
**దేవదారువనే శమ్భోః ప్రవేశో మాధవస్య చ ॥ 118 ॥**

కాలుని వధ, దేవదారు వనంలో శివమాధవుల ప్రవేశం చెప్పబడినవి.

**దర్శనం షట్కులీయానాం దేవదేవస్య ధీమతః ।**
**వరదానఞ్చ దేవస్య నన్దినే తు ప్రకీర్తితమ్ ॥ 119 ॥**

షట్కులీయులు దేవదేవుడగు శంభుని దర్శించటం, నందికి చేసిన వరదానం చెప్పడమైనది.

**నైమిత్తికస్తు కథితః ప్రతిసర్గస్తతః పరమ్ ।**
**ప్రాకృతః ప్రలయశ్చాథ సబీజో యోగ ఏవ చ ॥ 120 ॥**

నైమిత్తిక ప్రళయం, ప్రాకృత ప్రళయం, సబీజ, నిర్బీజయోగాలు చెప్పబడ్డాయి.

**ఏవం జ్ఞాత్వా పురాణస్య సంక్షేపం కీర్తయేత యః ।**
**సర్వపాప వినిర్ముక్తో బ్రహ్మలోకే మహీయతే ॥ 121 ॥**

ఈ విధంగా కూర్మపురాణం సంక్షేపంగా తెలిసికొని, వివరించిన వాడు సర్వపాప విముక్తుడై బ్రహ్మలోకం చేరుతాడు.

**ఏవముక్త్వా శ్రియం దేవీమాదాయ పురుషోత్తమః ।**
**సంత్యజ్య కూర్మసంస్థానం స్వస్థానఞ్చ జగామ హ ॥ 122 ॥**

ఇలా పురాణాన్ని తెలిపిన శ్రీహరి కూర్మరూపాన్ని వదలి, లక్ష్మితో కూడ స్వస్థానం చేరుకున్నాడు.

**దేవాశ్చ సర్వే మునయః స్వాని స్థానాని భేజిరే ।**
**ప్రణమ్య పురుషం విష్ణుం గృహీత్వా హ్యమృతం ద్విజాః ॥ 123 ॥**

ఓ ద్విజులారా! సకలదేవతలు, మునులు, తమస్థానాలను చేరుకున్నారు. అమృతాన్ని పొంది, శ్రీ మహావిష్ణువుకు నమస్కరించి వెళ్ళినారు.

**ఏతత్పురాణం పరమం భాషితం కూర్మరూపిణా ।**
**సాక్షాద్దేవాదిదేవేన విష్ణునా విశ్వయోగినా ॥ 124 ॥**

సకలజగత్కారణుడు, దేవాదిదేవుడు, శ్రీమహావిష్ణువు కూర్మరూపాన్ని ధరించి ఈ పురాణాన్ని వినిపించినాడు.

**యః పఠేత్ సతతం మర్త్యో నియమేన సమాహితః ।**
**సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మలోకే మహీయతే ॥ 125 ॥**

నియమంతో, సావధానంగా ఈ పురాణాన్ని పఠించినవాడు సర్వపాపవినిర్ముక్తుడై బ్రహ్మలోకంలో నివసిస్తాడు.

**లిఖిత్వా చైవ యో దద్యాద్వైశాఖే మాసి సువ్రతః ।**
**విప్రాయ వేదవిదుషే తస్య పుణ్యం నిబోధత ॥ 126 ॥**

వైశాఖమాసంలో వ్రతాన్ని స్వీకరించిన విప్రుడు ఈ పురాణాన్ని వ్రాసి వేదవిదుడైన బ్రాహ్మణునికి దానం చేస్తే కలిగే ఫలాన్ని తెలుసుకొమ్ము.

**సర్వపాపవినిర్ముక్తః సర్వైశ్వర్యసమన్వితః ।**
**భుక్త్వా చ విపులాన్ స్వర్గే భోగాన్దివ్యాన్సుశోభనాన్ ॥ 127 ॥**

సర్వపాపాలు తొలగి, సర్వైశ్వర్యాలు కల్గి, స్వర్గంలో దివ్యాలు, శోభనాలైన విపుల భోగాలను అనుభవిస్తాడు.

**తతస్స్వర్గాత్ పరిభ్రష్టో విప్రాణాం జాయతే కులే ।**
**పూర్వసంస్కారమహాత్మ్యాద్బ్రహ్మవిద్యామవాప్నుయాత్ ॥ 128 ॥**

స్వర్గంనుండి భ్రష్టుడై విప్రకులంలో జన్మిస్తాడు. పూర్వసంస్కార ప్రభావంవల్ల బ్రహ్మవిద్యను పొందుతాడు.

**పఠిత్వాఽధ్యాయమేవైకం సర్వపాపైః ప్రముచ్యతే ।**
**యోఽర్థం విచారయేత్సమ్యక్ స ప్రాప్నోతి పరం పదమ్ ॥ 129 ॥**

ఈ పురాణంలో ఒక అధ్యాయాన్ని చదివినా సమస్తపాపాలు తొలగుతాయి. బాగా అర్థం పరిశీలించిన వాడు పరమపదాన్ని పొందుతాడు.

**అధ్యేతవ్యమిదం నిత్యం విప్రైః పర్వణి పర్వణి ।**
**శ్రోతవ్యఞ్చ ద్విజశ్రేష్ఠా మహాపాతకనాశనమ్ ॥ 130 ॥**

బ్రాహ్మణశ్రేష్ఠులారా! ఎల్లపుడు ఈ పురాణాన్ని బ్రాహ్మణులు ప్రతిపర్వదినం పఠించాలి. మహాపాపాన్ని నశింపచేసే ఈ పురాణాన్ని తప్పక వినాలి.

**ఏకతస్తు పురాణాని సేతిహాసాని కృత్స్నశః ।**
**ఏకత్ర చేదం పరమమేతదేవాతిరిచ్యతే ॥ 131 ॥**

సర్వపురాణేతిహాసాలొక యెత్తు. ఇదొక్కటి ఒకయెత్తు. అన్నిటికంటె ఈ పురాణమే అతిశయిస్తుంది.

**ధర్మనైపుణ్యకామానాం జ్ఞాననైపుణ్యకామినామ్ ।**
**ఇదం పురాణం ముక్త్వైకం నాస్త్యన్యత్సాధనం పరమ్ ॥ 132 ॥**

ధర్మాలలో, జ్ఞానంలో, నిష్ణాతత్వం కోరేవారికి ఈ పురాణానికి మరొకటి సాటిలేదు.

**యథావదత్ర భగవాన్దేవో నారాయణో హరిః ।**
**కథ్యతే హి యథా విష్ణుర్న తథాఽన్యేషు సువ్రతాః ॥ 133 ॥**

సువ్రతలారా! ఈ పురాణంలో శ్రీనారాయణుడు, భగవానుడు, శ్రీహరి, విష్ణుదేవుడు వర్ణితుడైనట్లు ఇతర పురాణాల్లో చెప్పలేదు.

**బ్రాహ్మీ పౌరాణికీ చేయం సంహితా పాపనాశనీ ।**
**అత్ర తత్పరమం బ్రహ్మ కీర్త్యతే హి యథార్థతః ॥ 134 ॥**

ఇది పౌరాణికీ బ్రాహ్మీసంహిత. సర్వపాపప్రణాశిని. ఈ పురాణంలో నిజానికి ఆ పరబ్రహ్మ చెప్పబడింది.

**తీర్థానాం పరమం తీర్థం తపసాఞ్చ పరం తపః ।**
**జ్ఞానానాం పరమం జ్ఞానం వ్రతానాం పరమం వ్రతమ్ ॥ 135 ॥**

ఈ పురాణం తీర్థాలన్నింటిలో ఉత్తమతీర్థం. తపస్సుల్లో ఉత్తమతపస్సు, జ్ఞానాల్లో పరమజ్ఞానం, వ్రతాల్లో ఉత్తమవ్రతం.

**నాఽధ్యేతవ్యమిదం శాస్త్రం వృషలస్య చ సన్నిధౌ ।**
**యోఽధీతే స హి మోహాత్మా స యాతి నరకాన్బహూన్ ॥ 136 ॥**

ఈ పురాణాన్ని శూద్ర సమీపంలో చదువ కూడదు. అట్లా చదివిన మోహితుడు అనేక నరకాలనుభవిస్తాడు.

**శ్రాద్ధే వా దైవికే కార్యే శ్రవణీయం ద్విజాతిభిః ।**
**యజ్ఞాన్తే తు విశేషేణ సర్వదోషవిశోధనమ్ ॥ 137 ॥**

శ్రాద్ధంలో, దైవకార్యంలోకాని ద్విజులు వినాలి. యజ్ఞసమాప్తిలో ఈ పురాణాన్ని చదివితే సర్వదోషాలు తొలగుతాయి.

**ముముక్షూణామిదం శాస్త్రమధ్యేతవ్యం విశేషతః ।**
**శ్రోతవ్యఞ్చాథ మన్తవ్యం వేదార్థపరిబృంహణమ్ ॥ 138 ॥**

మోక్షం కోరేవారు విశేషించి ఈ పురాణాన్ని తప్పక చదవాలి. వేదార్థాన్ని విస్తరింపచేసే ఈ పురాణాన్ని వినాలి, మననంచేయాలి.

**జ్ఞాత్వా యథావద్విప్రేన్ద్రా శ్రావయేద్భక్తిసంయుతాన్ ।**
**సర్వపాపవినిర్ముక్తో బ్రహ్మసాయుజ్యమాప్నుయాత్ ॥ 139 ॥**

బాగా తెలుసుకొని, భక్తికల బ్రాహ్మణులకు వినిపిస్తే, సర్వపాపాలు తొలగి, బ్రహ్మసాయుజ్యాన్ని పొందుతాడు.

**యోఽశ్రద్దధానే పురుషే దద్యాచ్చాధార్మికే తథా ।**
**స ప్రేత్య గత్వా నిరయాన్ శునాం యోనిం వ్రజత్యధః ॥ 140 ॥**

శ్రద్ధారహితునికి, అధార్మికునికి ఈ పురాణాన్ని వినిపిస్తే మరణానంతరం అనేక నరకాలపాలై మళ్ళీ శునకంగా జన్మిస్తాడు.

**నమస్కృత్య హరిం విష్ణుం జగద్యోనిం సనాతనమ్ ।**
**అధ్యేతవ్యమిదం శాస్త్రం కృష్ణద్వైపాయనం తథా ॥ 141 ॥**

జగత్కారణభూతుడు, సనాతనుడు అయిన శ్రీమహావిష్ణువుకు నమస్కరించి, అదే విధంగా కృష్ణద్వైపాయనునికి కూడ నమస్కరించి ఈ పురాణశాస్త్రాధ్యయనం చేయాలి.

**ఇత్యాజ్ఞా దేవదేవస్య విష్ణోరమితతేజసః ।**
**పారాశర్యస్య విప్రర్షేః వ్యాసస్య చ మహాత్మనః ॥ 142 ॥**

ఇది అమితతేజస్వి, దేవదేవుడు, శ్రీమహావిష్ణువు ఆజ్ఞ. బ్రహ్మర్షి, మహాత్ముడు, పారాశర్యుడైన వేదవ్యాస భగవానుని ఆజ్ఞ కూడ.

**శ్రుత్వా నారాయణాద్దివ్యాం నారదో భగవానృషిః ।**
**గౌతమాయ దదౌ పూర్వం తస్మాచ్చైవ పరాశరః ॥ 143 ॥**

శ్రీకూర్మ మహాపురాణాన్ని శ్రీమన్నారాయణునివల్ల భగవాన్ నారదుడు విని గౌతమమహర్షికి చెప్పినాడు. గౌతమమహర్షి పరాశరమహర్షికి బోధించినాడు.

**పరాశరోఽపి భగవాన్ గఙ్గాద్వారే మునీశ్వరాః ।**
**మునిభ్యః కథయామాస ధర్మకామార్థమోక్షదమ్ ॥ 144 ॥**

ఓ మునీశ్వరులారా! భగవానుడగు పరాశరుడు గంగాద్వారంలో ధర్మార్థకామమోక్షప్రదమైన ఈ పురాణాన్ని మునులకు బోధించినాడు.

**బ్రహ్మణా కథితం పూర్వం సనకాయ చ ధీమతే ।**
**సనత్కుమారాయ తథా సర్వపాపప్రణాశనమ్ ॥ 145 ॥**

అదే విధంగా పూర్వం బ్రహ్మ సనక – సనత్కుమారులకు, సర్వపాపప్రణాశనమైన ఈ పురాణాన్ని బోధించినాడు.

**సనకాద్భగవాన్సాక్షాద్దేవలో యోగవిత్తమః ।**
**అవాప్తవాన్పఞ్చశిఖో దేవలాదిదముత్తమమ్ ॥ 146 ॥**

సనకమహర్షి యోగవిత్తముడు దేవలునికి, దేవలుడు పంచశిఖునికి ఈ ఉత్తమపురాణం బోధించినారు.

**సనత్కుమారాద్భగవాన్మునిః సత్యవతీసుతః ।**
**లేభే పురాణం పరమం వ్యాసః సర్వార్థసఞ్చయమ్ ॥ 147 ॥**

సనత్కుమారునివల్ల సత్యవతీసుతుడు వ్యాస భగవానుడు సర్వార్థసంచయం, పరమమైన ఈ పురాణాన్ని పొందినాడు.

**తస్మాద్వ్యాసాదహం శ్రుత్వా భవతాం పాపనాశనమ్ ।**
**ఊచివాన్వై భవద్భిశ్చ దాతవ్యం ధార్మికే జనే ॥ 148 ॥**

ఆ వ్యాస భగవానునివల్ల విన్న నేను పాపనాశకమైన ఈ పురాణాన్ని మీకు వినిపించినాను. దీనిని మీరు కూడ ధార్మికునికి అందించాలి.

**తస్మై వ్యాసాయ గురవే సర్వజ్ఞాయ మహర్షయే ।**
**పారాశర్యాయ శాన్తాయ నమో నారాయణాత్మనే ॥ 149 ॥**

సర్వజ్ఞుడు, మహర్షి, గురువు, పరాశరపుత్రుడు, శాంతుడు, నారాయణస్వరూపుడైన వ్యాస భగవానునికి నమస్కారం.

**యస్మాత్సంజాయతే కృత్స్నం యత్ర చైవ ప్రలీయతే ।**
**నమస్తస్మై సురేశాయ విష్ణవే కూర్మరూపిణే ॥ 150 ॥**

ఈ సకలజగత్తును సృష్టించి, మళ్ళీ తనలోనే లీనం చేసుకొనే దేవాధినాథుడు కూర్మరూపి అయిన శ్రీమహావిష్ణువునకు నమస్కారం.

**ఇతి శ్రీకూర్మపురాణే షట్సాహస్ర్యాం సంహితాయాం ఉత్తరార్ధే వ్యాసకథన స్థిత్యుద్భవ ప్రలయవ్యాఖ్యానం నామ చతుశ్చత్వారింశోఽధ్యాయః ॥ 44 ॥**

**॥ సమాప్తోఽయం గ్రంథః ॥**

శ్రీకూర్మ పురాణం షట్సాహస్రి సంహితలోని ఉత్తరార్ధంలో వ్యాసకథన స్థిత్యుద్భవ ప్రలయవ్యాఖ్యానమనే నలభై నాల్గవ అధ్యాయం ॥ 44 ॥

॥ సమాప్తం ॥